# మహాభారతము

## ఆదిపర్వము

(వేదవ్యాస కృతికి యథామూలాంధ్రగద్యానువాదము)

(VERBATUM TRANSLATION)

అనువాదకులు :

కీ॥ శే॥ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

సంపాదకురాలు :

శ్రీమతి డా॥ కె. కమల

రీడర్, సంస్కృత విభాగము

ఉస్మానియా విశ్వవిద్యాలయము

హైదరాబాదు.

మొదటి ముద్రణ : ఆగష్టు 1990

కవరు డిజైను : శ్రీ శీలా వీర్రాజుగారు

ACC NO - 24418

294.5923
CAK

వెల : రూ॥ 100/-

పబ్లిషర్ :

**శ్రీమతి కప్పగంతుల అన్నపూర్ణమ్మ**

**(అనువాదకుని సతీమణి)**

16, Tuljaguda, Moazzam Jahi Market,
Hyderabad - 500 001
Phone No. 557212

ముద్రణ :

**పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,**
హైదర్‌గూడ, హైదరాబాదు - 500 029.



అనువాదకులు

కీ॥ శే॥ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి



శ్రీమతి కప్పగంతుల అన్నపూర్ణమ్మ

(శాస్త్రిగారి సతీమణి)

# మనవి మాటలు

పుట్టతేనె, కలకండ, నేతి గారెలు లోకులకెంత ప్రీతి పాత్రములో, మహా భారత కథయును అంతే ప్రీతిపాత్రము. ఈ కథ ఇప్పుడు విశ్వవ్యాప్తమై ఫ్రెంచి భాషలోనికి గూడ అనువదింపబడి భారతీయ సంస్కృతికి వెల్లగొడుగును పట్టినది. మహాభారత కథయే భారతదేశ సంస్కృతికి మారుపేరనుట అతి శయోక్తి కానేరదు. మనకున్న సంస్కృతి అంతయును వ్యాస ప్రోక్తమే గదా. ఆంధ్రదేశములో ఆదికవి నన్నయభట్టారకుని నుండి నేటివరకు భారత కథను గద్య పద్యములలో ఎందరో వ్రాయుచున్నారు. ఇది అనంతముగా కొనసాగు సాహిత్య వ్యవసాయము. వ్యాస భారతమునకు ప్రామాణికమైన తొలి అను వాదము కవిత్రయము వారిదే. అంతకుముందు ఏ భారతీయ భాషలలోనూ ఈ గ్రంథమునకు ప్రామాణికానువాదము జరుగలేదు. అందుకే తెలుగు వారికి ఈ గ్రంథము మీద ఇంత మక్కువ. ఇందలి ఒక్కొక్క ఉపాఖ్యానము ఒక్కొక్క స్వతంత్ర కావ్యము గదా!

**ఇట్టి భారత కథను వ్యాసప్రోక్తమగు మూల కథకు యథా మూలాంధ్ర గద్యానువాదమును, మా నాయనగారు, కీర్తిశేషులు, బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు దాదాపు రెండు దశాబ్దముల కాలముపాటు క్రీ.శ. 1960 నుండి క్రీ. శ. 1980 సంవత్సరము వరకు చేసిరి.** ఇది మూలములో ఉన్నదున్నట్లు లలితమధుర శైలిలో కథారూపమున చేసిన అనువాదము. ఇది పండిత పామరుల కందుబాటులో నుండునని ఆశించుచు అందలి ఆది సభా పర్వములను మా తొలి ప్రయత్నముగా పాఠకులకు అంద జేయుచున్నాము. మా నాయనగారు జగమెరిగిన విద్వాంసులు. ఈ సందర్భమున వారి జీవిత చరిత్రను సంగ్రహముగా ఇచ్చట పొందుపరచుచున్నాము.

**శ్రీ. కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారి జీవితము :**

మా నాయనగారైన, శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు మహబూబు నగరము జిల్లాలోని వనపర్తి గ్రామమున జన్మించిరి. వీరి తల్లిదండ్రులు

పద్మావతీ శ్రీనివాసులు. అందుకే విక్రమాంకదేవ చరిత కావ్యమునందు వీరు తమ యిలవేల్పులయిన పద్మావతీ శ్రీనివాసులకు తత్సనామధేయ పితరులకును వందనము చేయుదునని తెలిపిరి.

శాస్త్రిగారు తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర సంస్కృత కళాశాలలో సంస్కృతము నభ్యసించి "సాహిత్య శిరోమణి" పరీక్ష యందు తీర్ణులై, పిదప మద్రాసులోని మైలాపూరు సంస్కృత కళాశాలలో అద్వైత వేదాంతమును, కొంతకాలము అన్నామలై విశ్వవిద్యాలయములో వ్యాకరణమును అభ్యసించిరి. శ్రీ పులిసి కృష్ణమాచార్యులుగారు, శ్రీ లక్ష్మీ నరసింహశాస్త్రిగారు, శ్రీ సుబ్బారావు గారు, శ్రీ కరింగళం కృష్ణశాస్త్రిగారు, శ్రీ వేంకటేశ్వర దీక్షితులుగారు, వీరికి విద్యాగురువులు.

వీరి తండ్రి వీరిమూడవ ఏటనే గతించిన పిదప తల్లియగు పద్మావతమ్మ గారే తల్లియు, తండ్రియునై వీరిని సంరక్షించి విద్యాబుద్ధులు నేర్పిన ప్రత్యక్ష దైవము. శాస్త్రిగారికిగల మాతృభక్తియే ఆయనకు శ్రీరామరక్షయని వారి బంధు మిత్రులందరును అనుకునెడివారు. అట్లే అగ్రజులగు శ్రీ రామనాథము, శ్రీ కృష్ణ మూర్తిగారలను వీరు భక్తి భావముతో చూచిరి.

మహాత్మా గాంధీగారి అనుయాయులు ధర్మవీర వామన్ నాయక్ గారు అప్పటిలో హైదరాబాదు నగరములో ప్రముఖ స్వాతంత్ర్య యోధులుగా, దాతలుగా పేరు పొందిన వనపర్తి వాస్తవ్యులు. వీరు శాస్త్రిగారి అభ్యుదయము నకు అడుగడుగున తోడ్పడి పుత్రనిర్విశేషముగ వీరిని ఆదరించిరి.

గురు ముఖముగ సంస్కృతమును మాత్రమే అభ్యసించి, ఆ తరువాత శాస్త్రిగారు ఉర్దూ, ఇంగ్లీషు, తెలుగు, తమిళము, హిందీ, కన్నడము, మరాఠీ భాషలలోనూ వైదుష్యమును స్వయంకృషితో సంపాదించి, అష్టభాషా కోవిదులైరి. వీరితో మాటలాడిన ప్రతి ఒక్కరును వీరి బహుభాషా భాషణ శైలికి నుడికారముల నప్రయోగింపుటలో ప్రావీణ్యమునకును, ముగ్ధులైనవారే.

ఆంధ్ర సంస్కృత హిందీ భాషలలో అనర్గళముగా చమత్కారోక్తులతో ఉపన్యాసములు చేయు వక్తృత్వ పటిమ, మేఘ గంభీర ధ్వని, నిశ్చల వ్యక్తిత్వము శ్రీ శాస్త్రిగారికి పెట్టని ఆభరణము.

వీరు హైదరాబాదులోని వివేకవర్ధనీ పాఠశాలలో తెలుగు టీచరుగా మొట్ట మొదట చేరి, ఆ తరువాత వనపర్తిలోని ప్రభుత్వ పాఠశాలలో సుమారు పది సంవత్సరములు తెలుగు టీచరుగా వృత్తి నిర్వహణమును చేసిరి. అప్పటిలోని మహబూబునగరము మండలములోని ప్రముఖులందరును వీరి శిష్యులే. అంతేగాక గ్రామములోని యువకుల నందరను ప్రోగుచేసి, సాయంకాలమువేళలో వారికి పాఠములు చెప్పి వారిచేత విద్యాప్రవీణ, భాషాప్రవీణ పరీక్షలు వ్రాయించి, వారిని పండితులనుగా మలచిన శిల్పి శ్రీ లక్ష్మణ శాస్త్రిగారు. వారు వనపర్తిలో నివసించిన ఈ కాలము బహుమూల్యమైనది.

ప్రాతః స్మరణీయులు, కవి పండిత మూర్ధన్యులునగు శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు సంస్కృత మహాకవి బిల్హణ విరచితమయిన "విక్రమాంక దేవ చరిత్రము" అను చారిత్రక మహాకావ్యమును శాస్త్రి గారి కిచ్చి దానిని తెనుగు ప్రబంధముగా ననువదించమని ఆజ్ఞ నిచ్చిరి. ఆ కావ్యమునకు సంస్కృతములో నెట్టి వ్యాఖ్యానమును లేదు. తెలుగు గద్యములోనికి తిరుపతి వెంకటకవులు చేసిన అనువాద మొక్కటియే ఆధారము. ఆజ్ఞ శిరోధార్య మయ్యెను. మానవల్లివారు వనపర్తి సంస్థానములో సుమారు ఇరువది సంవత్స రములు నివసించినవారు. ఆ యాజ్ఞమేరకు శ్రీ శాస్త్రిగారు తనకు మిత్రుడు, హితుడునయిన శ్రీ మాదిరాజు విశ్వనాథరావుతో కలసి "విక్రమాంకదేవ చరిత మును" అనువదించిరి. శ్రీ విశ్వనాథ రావుగారు ఫార్సీ, అరబ్బీ, ఉర్దూ, తెలుగు, సంస్కృత భాషలలో సహజ పాండిత్యమును పెంపొందించుకొన్న న్యాయ వాదులు. ఈ అనువాదకార్యము క్రీ. శ. 1938-41 సంవత్సరములలో జరిగెను. ఈ శతాబ్దమునందు వెలువడిన ఉత్తమ కావ్యములలో "విక్రమాంకదేవ చరి త్రము" ఒకటియనుట నిర్వివాదాంశము. ఈ కవిమిత్రులిరువురును కలిసి బిల్హణీయమేయగు "కర్ణ సుందరీ" నాటకము నొకదానిని తెనిగించిరి. దీనిని ఆమూలము చదివి ఆమోదముద్ర వేసినవారు శ్రీ మానవల్లివారు. వారే అప్పుడు తిరుపతిలో సభచేసి, శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి సమక్షములోనే ఈ జంట కవులకు "ఆంధ్ర బిల్హణ" బిరుదము నిచ్చిరి. అప్పటి వనపర్తి పండిత సదస్సులో పండితులు వివిధ శాస్త్రములనుగూర్చి చేసిన చర్చలను క్రోడీకరించి, "శాస్త్రీయ విజ్ఞానము" అను ఒక గ్రంథమునుగూడ శ్రీ శాస్త్రిగారు తెలుగులో తమ సంపాదకత్వమున ఇదే కాలములో వెలువరించిరి.

క్రీ. శ. 1945 సంవత్సరములో మాదిరాజువారు దివంగతులగుట, ఆ తరువాత మా నాయనగారు వనపర్తిని వదలి హైదరాబాదునకు తరలుటయు జరిగెను.

హైదరాబాదులో తొలుత సిటీ కాలేజీ హైస్కూలులో తెలుగు పండితునిగ కొంత కాలముండి, ఆ తరువాత క్రీ. శ. 1948 సం॥న ప్రభుత్వ సమాచార పౌర సంబంధ శాఖలో అసిస్టెంటు డైరెక్టరుగ శ్రీ శాస్త్రిగారు చేరిరి. ఈ శాఖవారి బహుభాషా పాండిత్య ప్రసూనమును వికసింపజేసి పరిమళము వ్యాపింప జేయుటకు తోడ్పడెను. వారు తెలుగు, ఉర్దూ, హిందీ, మరాఠీ, కన్నడ భాషలలోనికి ఇంగ్లీషు నుండి అనువాదములను చేయుచుండిరి. నాయకులు జిల్లాలలో పర్యటించు నప్పుడు వారుచేయు ఇంగ్లీషు, ఉర్దూ,హిందీ ఉపన్యాసములను వీరు అధికార రీత్యా, తెనుగులోనికి అనువదించి, ఆ సందేశమును ప్రజల కందజేయువారు. ఇదే కాలములో గౌలీగూడాలోని బాలసరస్వతీ గ్రంథాలయము, సుల్తాను బజారులోని శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయము, ఆంధ్ర సారస్వత పరిషత్తు మున్నగు అనేక సాహిత్య సంస్థలలో చేరి వీరు ప్రముఖ పాత్రను వహించిరి. సారస్వత పరిషత్తు తరపున వీరు తెలుగు విద్యావ్యాప్తికొరకు ఊరూర తెలుగు పరీక్షలను నిర్వహించుచు చేసిన సేవలు అప్పటిలో నగరములో, తెలుగు వికాసమునకు ఒక మంచి వాతావరణము నేర్పరచుటకుపకరించినది.

విక్రమాంకదేవ చరితమును రచించి, పండితాభిప్రాయములను సేకరించుటకు వీరు ఆంధ్రదేశమున పర్యటించి, శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారిని, శ్రీ కాశీ కృష్ణాచార్యులను, డా॥ విశ్వనాథ సత్యనారాయణగారిని, శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి గారిని, శ్రీ గుండేరావు హర్కారే గారిని, శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారిని, శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు మొదలగు ఎందరో గొప్ప కవులను పండితులను కలిసికొని వారితో గ్రంథ గ్రంథులను విడదీసి, వివరించి, విశేషములగు మన్ననలను అందుకొనిరి.

వారాణసీ వాస్తవ్యులు, సుప్రసిద్ధ సంస్కృత కవులు, సంస్కృత భాషా ప్రచారమునకై తన జీవితమును ధారపోయుచున్నవారునగు శ్రీ వాసుదేవ ద్వివేది గారితో శాస్త్రిగారికి క్రీ. శ. 1958 సం॥న పరిచయమేర్పడి, మైత్రిగా మారి,

ఆ జీవనము పెరిగిన కల్పలతగా అల్లుకొన్నది. ద్వివేదిగారు కాశీనగరములో స్థాపించిన "సార్వభౌమ సంస్కృత ప్రతిష్ఠానము" శాస్త్రిగారికి రెండవ కార్య క్షేత్రమయ్యెను. వాసుదేవ ద్వివేదిగారు శాస్త్రిగారిని వర్ణించుచు వ్రాసిన ఒక శ్లోకము వారి మైత్రీబంధమునకు తార్కాణముగా నిలిచి, శాస్త్రిగారి వ్యక్తిత్వ మును చిత్రించినది. ఆ శ్లోకమిది:

"మూర్తిర్మత్త గజేంద్ర గర్వదళనీ వాణీ వినోదప్రియా
వ్యాఖ్యాలేఖ కవిత్వ కౌశల కలా పారంగతా శేముషీ-
శ్శక్తిః సంస్కృత భాషణేఽప్యనుపమా విద్వజ్జనేష్వాదరః,
శ్రీమల్లక్ష్మణశాస్త్రిణాం గుణగణాః కేషాం న తోషావహాః."

"మూర్తి, మదించిన గజేంద్రుని దర్పమును అణచివేయగలిగినది, పరి హాసప్రసంగములేని వాక్యము వారు పలుకువారు గారు, వ్యాఖ్యానములు వ్యాస ములు కవిత్వమునందును వారి శేముషీవైభవము పారంగతము, సంస్కృత సంభాషణమునందు వారిశక్తి అనుపమము బహుశః ఆంధ్రదేశములోనే సమకా లికులలో వారి సంస్కృత వక్తృత్వపటిమ అద్వితీయము. వారి యిల్లు విద్వాంసుల నిలయము. విద్వజ్జనుల ఎడల వారు చూపిన ఆదరము అట్టిది. అట్టి లక్ష్మణశాస్త్రి గారి గుణగణములు ఎవరికి సంతోషమును కలిగించవు?" శ్రీ ద్వివేదిగారితో కలిసి ఆంధ్రదేశములో సంస్కృత ప్రచారము చేయుచు పర్యటించుటయేగాక, వారు వ్రాసిన "భారతీయ - సదాచార్ - వ్యవహార్" అను సంస్కృత మాతృక యొక్క హిందీ అనువాదమునకు శ్రీ శాస్త్రిగారు ఆంధ్రానువాదమును వెలయించిరి.

మా నాయనగారు రమణమహర్షి, అరవింద యోగి, కంచికామకోటి శంకర మఠ పరమాచార్యులయిన శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి, శ్రీ కరపాత్ర స్వామి, ఇటీవల బ్రహ్మైక్యమును చెందిన శృంగేరి పీఠాధిపతులు శ్రీ అభినవ విద్యాతీర్థ స్వామి మున్నగు ఆధ్యాత్మిక గురువుల సన్నిధానములో తమ వ్యక్తిత్వమును సంస్కరించుకొనిరి.

వీరి ఇదివరలోనే చెప్పినట్లు సుహృద్ వైభవ సంపన్నులు. వీరి మిత్ర బృందము చాలా పెద్దది. అందు ప్రముఖులు ప్రసిద్ధపాత్రికేయులు, బహు

ముఖ్యప్రజ్ఞాశాలులు, బహుశ్రుతులునగు శ్రీ తిరుమల రామచంద్రగారు, వేంకటేశ్వర సంస్కృత కళాశాల ప్రిన్సిపాలుగా పదవీ విరమణచేసి గతించిన షడ్దర్శనకోవిదులు శ్రీ టి.కె.వి.ఎన్. సుదర్శనాచార్యులు, బెజవాడ వద్ద గన్నవరములో శ్రీ భువనేశ్వరీ పీఠాధిపతులై తురీయాశ్రమమును స్వీకరించిన శ్రీ చిదానంద భారతీస్వామి (వీరు పూర్వాశ్రమములో దమ్మాల పాటి శేషగిరిశర్మగారు), శ్రీ చిదంబరస్వామి, శ్రీ రామేశన్ (ఆంధ్రప్రభుత్వములో ఆర్థికశాఖ సెక్రెటరీగా నుండి, పిదప గతించినవారు) ఇంకను దేశమందెల్లెడల తామరతంపరగా విస్తరించినవారు గలరు. శ్రీ తిరుమల రామచంద్రగారు, మా నాయనగారి అవసానకాలములో వారి చెంతనున్నవారు. శాస్త్రిగారు "రామచంద్రా" అని, ఆయనను పిలిచి 10-1-1981 నాడు తమ డెబ్బదవ ఏట అసువులను కోల్పోయిరి. రామచంద్రగారు ఈ మహాభారతానువాదమునకు విపులమగు పరిచయమును వ్రాయుచున్నారు. అనివార్యకారణములవలన దానిని సభాపర్వ గ్రంథారంభమునందు మాత్రమే జతచేసి ముద్రింపనున్నాము.

మా నాయనగారి రచనలలో మాకు తెలిసిన వానిని ఇచ్చట పొందుపరచుచున్నాము.

1. విక్రమాంకదేవ చరితము - బిల్హణకృతికి ప్రబంధశైలిలో ఆంధ్రానువాదము. దీనికి వేదము వెంకటరాయశాస్త్రిగారు (జూనియర్), బిల్హణునికి, విక్రమాంకునకు సంబంధించిన పెక్కు చారిత్రకాంశములను, ప్రామాణికముగా వివరించుచు ఎన్నియో చిక్కులను విడదీసి, ఉపోద్ఘాతమును వ్రాసిరి. అట్లే ప్రసిద్ధకవులు ప్రవరసేనకృతి "సేతుబంధా"నువాదకులునగు అవధానము చంద్రశేఖరశర్మగారు ఇందలి సాహిత్యప్రాశస్త్యమును వివరించు పరిచయమును వ్రాసిరి. (ఇది మా నాయనగారి కృతులలో ప్రశస్తమయినది.)

2. కర్ణసుందరీ నాటకము - ఇదియును బిల్హణీయమే. పై రెండింటిని కప్పగంతులవారు, మాదిరాజువారును కలిసి జంటకవులుగా అనువదించిరి.

3. శాస్త్రీయవిజ్ఞాన సంపాదకత్వము.

4. శ్రీ చిన్మయానందస్వామి గురువులగు శ్రీ తపోవనస్వామివారు హిమాలయములో తపస్సు చేసిన తరువాత "బదరీశతకము"ను సంస్కృతమున రచించిరి. దానికి శ్రీ శాస్త్రిగారు ఆంధ్రానువాదము చేసిరి.

5. మహాభారత యథాతథ ఆంధ్రానువాదము - ఇది విరాటపర్వ పర్యంతము సమాచార పౌరసంబంధశాఖవారు ప్రచురించు "ఆంధ్రప్రదేశ్" పత్రికలో 1960 నుండి ధారావాహికముగా అచ్చయినది. అప్పుడు మా నాయనగారు రచ్చుట అసిస్టెంటు డైరెక్టర్‌గాను - పత్రిక సంపాదకునిగను, ఈ అనువాద కార్యము నారంభించిరి. ఆ తరువాత విద్యాశాఖలో డిప్యూటీ డైరెక్టరుగా నుండి అనువాద కార్యమును కొనసాగించిరి. ఆ కాలమందు ఆ పత్రిక విశేష జనాదరణము నొందుటకి అనువాద ప్రచురణమే కారణమని ప్రజాభిప్రాయము.

6. 'ఆంధ్ర సంస్కృత నిఘంటువు' - దీనిని శ్రీ శాస్త్రిగారు, శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు కలిసి సంపాదకత్వమును వహించగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రచురించిరి.

7. "సూర్యోపరాగ దర్పణము" క్రీ. శ. 1868 నాడు భారతదేశములో సంపూర్ణ సూర్యగ్రహణము వచ్చినది. ఇది వనపర్తిలో చాలా బాగా కనిపించునని బ్రిటీషు ఆఫీసర్లు అనేకులు అక్కడకు చేరుకొనినారట. ఈ గ్రహణ దృశ్యమును వర్ణించుచు వనపర్తి వాస్తవ్యులు శ్రీ కృష్ణ బ్రహ్మతంత్ర పరకాల యతీంద్రులు, "సూర్యోపరాగ దర్పణము" అను సంస్కృత కావ్యమును రచించిరి. మా నాయనగారు దీనిని తెలుగులోనికి అనువదించి, సంపాదకత్వమును వహించి, రాష్ట్ర పురాతత్త్వశాఖ వారి తరపున ప్రచురించిరి.

8. కీ.శే. రామేశన్ గారు రాష్ట్ర పురాతత్త్వశాఖ డైరెక్టరుగా నున్నప్పుడు, బౌద్ధమతమునకు సంబంధించిన తామ్రపత్రములలోని ఎన్నో చిక్కుముడులను విడదీసిరి. రామేశన్‌గారు "Glimpes of Buddhism" ను ఆంగ్లములో వ్రాయగా దానిని వీరు "బౌద్ధ దర్శనము"గా తెనిగించిరి.

9. విద్యార్థుల కొఱకు ఎన్నో పాఠ్య పుస్తకములను తెలుగులోను సంస్కృతములోను రచించిరి.

వీరి మరికొన్ని రచనలు బహుశః కాలగర్భమున కలిసిపోయి యుండును. ఎంతటివారికైనను ఇది అనివార్యమే కదా!

హైదరాబాదులో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీలో లిపి సంస్కరణ సదస్సులో సురభారతీ సమితిలో ప్రముఖ సభ్యునిగా వీరుచేసిన సేవ సువిదితము. సురభారతీసమితి హైదరాబాదులో 1968న శ్రీ. ఎ. వి. సుబ్రహ్మణ్యం గారి

కార్య దర్శకత్వములో స్థాపితమయినప్పుడు దాని తొలి అధ్యక్షులుగా వీరు ఎన్నిక అయినారు.

ఇవిగాక వీరు ఆంధ్ర, సంస్కృత, హిందీ భాషలలో విజ్ఞానకోశము వంటి ప్రామాణిక గ్రంథములలో అసంఖ్యాకములయిన వ్యాసములు వ్రాసిరి. ప్రాచ్య విద్యా పరిషత్తులలో (Oriental Conferences) సాహిత్య పర ములు, తత్త్వమునకు సంబంధించినవి ఎన్నో ప్రసంగములను చేసిరి. రేడి యోలో వివిధ భాషలలో ప్రసంగములు, ఆశువుగా చెప్పినసంస్కృత శ్లోకములు ఎన్నియో వీరి ప్రతిభాపాటవములకు నిదర్శనములు. వీరి ప్రూఫుదిద్దు విధానమే విశిష్టమయినదని, ఆ తరువాత దీపము పెట్టి వెదకి నప్పటికిని ఒక్క తప్పు కనిపించదని ప్రింటింగ్ ప్రెస్సు వారందురు.

వీరికి ఆంధ్రబిల్హణ, సుధీంద్రమౌళి, మహామహోపాధ్యాయ (అఖిల భారత విద్వత్ పరిషత్తు, వారాణసి వారు ఇచ్చినది) వంటి బిరుదములు, దోషజ్ఞుడను గుర్తింపును లభించినవి. క్రీ.శ. 1975 సం॥న జరిగిన అంతర్జాతీయ తెలుగు సభ వారు వీరికి షీల్డు నిచ్చి గౌరవించిరి. వారాణసిలో నున్న సంపూర్ణానంద సంస్కృత విశ్వవిద్యాలయములో వీరు తొలుత సెనెటు సభ్యునిగను, ఆ తరు వాత అయిదు సంవత్సరముల పాటు (మరణాంతము) సమ్మానిత ప్రాధ్యాపకుని గను (Emeritus professor) తమ వైదుష్యమునకు గుర్తింపు నొందిరి. అఖిల భారత జాతీయ ఆకాశవాణి కార్య నిర్దేశకుల సదస్సులో సభ్యులుగానుండి వీరు రేడియోలో సంస్కృత వార్తా ప్రసారముల నారంభించుటకు తోడ్పడిరి.

తొలుత ఆరుదవ దశాబ్దములో సంస్కృతమునకు స్పెషలు ఆఫీసరుగను, ఆ తరువాత విద్యాశాఖ డిప్యూటీ డైరెక్టరుగను వీరు అరబ్బీ, ఫార్సీ, సంస్కృ తములంగ విశిష్టములయిన ప్రాచ్య విద్యలకు ఎనలేని సేవచేసిరి. ఆయా భాష లలో వీరికిగల ప్రవేశము కడప, కర్నూలులలోనూ ఉత్తరప్రదేశ్‌లోని దేవ్‌బన్‌లో ఉన్న అరబ్బీ విద్యాపీఠములకు వీరు సన్నిహితులగునట్లు చేసెను. నగరములో నల్లకుంటలో తొలిసారిగా నారంభింపబడిన ప్రాచ్యకళాశాలలో ఉచితముగా పాఠ ములుచెప్పి (1959-60) ఆ విద్యాసంస్థలను నిలిపిన వారిలో వీ రనన్యులు. 1966 సం॥న యూనివర్సిటీ గ్రాంట్సు కమీషనువారు కళాశాలలోని లెక్చరర్ల వేతనములను పెంచగా, వారితో బాటు ప్రాచ్య కళాశాలలోని అధ్యాపకుల కదే

వేతనప్రణాళిక నమలు పరచవలెనని, గవర్నమెంటును ఒప్పించి ఉత్తర్వులను జారీచేయించుటయేగాక, ప్రాచీనకాలములో తక్కువ మార్కులతో (III Class) ప్రాచ్యపరీక్షలను పాసు అయి అధ్యాపకులుగా చేరిన విద్వాంసులకు గూడా వారి వైదుష్యమును సుదీర్ఘమైన సర్వీసును గౌరవించి ఈ వేతనములను ఇప్పించునట్లు చేసిరి. అందుకే వారు "మీ నాయనగారిపేరు చెప్పి, దీపము వెలిగించుకొందు" మని అన్నప్పుడు మాకు కలుగు అనుభూతి మధురమైనది.

క్రీ. శ. 1956-57 సం॥లో కోఠీ మహిళాకళాశాలలోని దర్బారుహాలులో శ్రీ కృష్ణదేవరాయల "భువనవిజయ" సభను నగరములోని కవి పండితుల వినోదార్థము ప్రదర్శించిరి. అందు మా నాయనగారు శ్రీకృష్ణదేవరాయల భూమి కను నిర్వహించి "ఆముక్తమాల్యద"లోని పద్యములను శ్రావ్యముగా వినిపించిరి. ఆ తరువాత శ్రీ దివాకర్ల వెంకటావధానిగారి అధ్వర్యములో ఈ "భువన విజయము", భువన విజయమును చేయుచు సుదూర ప్రాంతములకు పోయిన సంగతి అందరకును తెలిసినదే. ఇందు. వీరు ధూర్జటి, భట్టుమూర్తిగారల పాత్రలను నిర్వహించుచు ప్రత్యుత్పన్నమతితో, సమయానుసారము చమత్కరించుచు క్రొత్తరంగును కలిగించేవారు.

ఒకసారి అలహాబాదులో సంస్కృత కవిసమ్మేళనము ఏర్పాటయినది. అధ్యక్షులు శ్రీ ఉమేశ మిశ్ర పండితులు. "నీలే సువర్ణాయతే" అను సమస్య ఒసగబడినది. దానిని మా నాయనగారు "విద్వాన్ శ్రీ మదుమేశ ఏష కవచే నీలే సువర్ణాయతే" అని పూరించిరి - (విద్వాంసులగు ఈ ఉమేశ మిశ్రులు నల్లని షేర్వానీలో, బంగారు మేని ఛాయతో మెరిసిపోవుచున్నారని భావము.) ఈ శ్లోకమును విని, ఉమేశ మిశ్రగారు పరవశించి, మా నాయనగారితో ఆజీవనము మైత్రిని నెరపుకున్నారు. జాతకములో Jupiter, నాలుకమీద చంద్రుడు ప్రముఖులై ఉండుటవలన వారి మాటకు స్నేహితులలో తిరుగు ఉండేదిగాదు. ఎన్ని పనులలో వ్యగ్రులైయున్నను, సంస్కృతమును బోధించుటలో మాత్రము ఎన్నడును అలసట చూపించేవారు గాదు. వారి రచనలన్నింటికన్న ఉన్నతమైనది వారి వ్యక్తిత్వము. తాంబూల నిర్మాణము, సేవనములలో, బ్రిడ్జి ఆటలో, ఈతగొట్టుటలో, వీరిది అందె వేసిన చేయి.

వారి సతీమణి, హితురాలు, సహధర్మచారిణియగు మా అమ్మగారు శ్రీమతి అన్నపూర్ణమ్మగారు యథార్థముగా అన్నపూర్ణయే. రామకోటి జపము,

భాగవత పారాయణము మున్నగు అనుష్ఠానములచే గ్రంథ పఠనముచే కాల యాపనము చేయు మా అమ్మగారు, మా నాయనగారి మరణానంతరము, ఈ మహాభారత ముద్రణము కొఱకు అహోరాత్రములు తపించి, నిరీక్షించినారు. వారి కార్యనిష్ఫలోన్ముఖమగుట మా భాగ్యము.

ఈ గ్రంథ ముద్రణ కొఱకు ఇతరత్ర మేము చేసిన ప్రయత్నములు ఫలించలేదు. ఈ యాథామూలానువాదమును మరియు మా నాయనగారి సరళ రచనాశైలిలో ప్రజలకందజేయ నుద్దేశించి మేము ఈ గ్రంథముద్రణ నారంభించినాము. దీనికి ముఖ్యముగా తోడ్పడిన సంస్థ డెల్టా పేపర్ మిల్స్ లిమిటెడ్. ఈ సంస్థ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ శ్రీ అక్కినేని బలరామకృష్ణయ్యగారు, మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ నరసింహ రాజుగారును దయతో ఈ సంస్థ నుండి ఈ పుస్తకమునకు కావలిసిన కాగితమును ఉచితముగా మా కిప్పించినారు. పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్‌వారు త్వరితగతిలో ఈ పుస్తకమును అచ్చువేసి ఇచ్చినారు. శ్రీ శీలా వీర్రాజుగారు కవరు పేజీ చిత్రించినారు. ముఖ్యముగా వీరందరకును, ఇంకా ఈ పుస్తక ప్రచురణకు పరోక్షముగా సహాయపడినవారందరికీ మా కృతజ్ఞతలు.

ఈ "ఆదిపర్వ" గ్రంథమును దీనితోపాటు సభాపర్వమును [illegible] ఆంధ్ర ప్రజానీకమునకు అందించుచున్నాము. మీరు ప్రోత్సహించినచో, ఆ ధనముతో మేము మిగిలిన గ్రంథ భాగమును క్రమముగా అచ్చువేయించగలమని, అట్టి సుదినమునకై నిరీక్షించెదమని, ఆ శక్తిని త్రికాలజ్ఞుడు, చిరంజీవియయిన వ్యాసభగవానుడు, పితృలోకములో పుణ్యగతులను పొందిన మా నాయనగారు కలిగించవలెనని ప్రార్థించుచు, సెలవు తీసికొనుచున్నాము. "సరస్వతీ శ్రుతీ మహతాం మహీయతామ్"

ఇట్లు

శ్రీ డా॥ తప్పగంతుల ప్రభాకర శాస్త్రి

శ్రీ తప్పగంతుల వెంకట కృష్ణమూర్తి

శ్రీమతి డా॥ కె. కమల

(శ్రీ శాస్త్రిగారి సంతానము)

శ్రీ గణేశాయ నమః

శ్రీ పద్మావతీ వేంకటేశ్వరాభ్యాం నమః

# వేదవ్యాసకృత మహాభారతము

## యథామూలాంధ్ర గద్యానువాదము

# ఆదిపర్వము

## అనుక్రమణికాపర్వము

కం॥ మునునాయిల వేల్పులఁ ద
త్సనామపితరులను "కుశిక" సద్గోత్రజుడన్।
మనమునఁ గవి "లక్ష్మణుడన్"
ప్రణతించెద "శ్రీనివాస పద్మావతులన్"॥

కం॥ పృథు సంస్కృత భారతమును
యథా తథముగాగ నాంధ్రమందు వచనమున్।
బృథుశక్తి ననువదించితి
యథామతిని తజ్ఞులెల్ల రభిలక్షింపన్॥

కం॥ శ్రీపతి వేంకటగిరిపతి
శ్రీపాదాంబుజ యుగంబు సేవించుచునే।
నీ పర్వద్వయ మాద్యము
పాపవిముక్తికై భక్తి బ్రారంభింతున్॥

శ్లో॥ నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్॥

బదరికాశ్రమ వాసులు ప్రసిద్ధమునులునైన శ్రీ నరనారాయణులకు, [అంతర్యామి నారాయణ స్వరూపుడయిన శ్రీ కృష్ణ భగవానుడు ఆయన శాశ్వత మిత్రుడు నరస్వరూపుడయిన అర్జునుడు] ఆ ఇరువురి లీలలను ప్రకటించు సరస్వతీదేవికి మహాభారత వక్తయయిన వేదవ్యాస మహర్షికిన్ని నమస్కారము చేసి జయము అను పేరుగల మహాభారత గ్రంథమును పఠించవలెను.

జయమనగా అసుర సంపత్తిని నశింప జేసి అంతఃకరణము పయిన దైవసంపద యొక్క విజయమును సాధించునది అని అర్థము. 'జయము' అను పేరు "జయోనామేతిహాసోఽయం" అను కథనముచేత మహాభారతమునకు, పదునెనిమిది పురాణములకు, వాల్మీకి రామాయణమునకు, ఋషిప్రోక్తగ్రంథము లన్నింటికిని చెప్పవచ్చును. ఈ శ్లోకము నందు నరనారాయణుల స్మరణము చేయబడినది. మహాభారతమందంతటను ఈ ఇరువురిని గూర్చిన ప్రసంగమే వర్ణింపబడినది. ఈ పుణ్యపురుషులకు నమస్కారము చేసి గ్రంథారంభము చేయబడుట చేత గ్రంథాదియందు మంగళము చేయబడినది. దానితో పాటే గ్రంథమంతట కృష్ణార్జునుల ప్రసంగమున్నది గనుక గ్రంథాది యందు వస్తునిర్దేశ రూపమయిన మంగళము గూడ చేయబడినట్లయినది.

ఓంకార స్వరూపులయిన భగవద్వాసుదేవునకు, బ్రహ్మదేవునకు, ప్రజాపతులకు, శ్రీకృష్ణ ద్వైపాయన మహామునికి, సర్వవిఘ్న వినాశకుడయిన శ్రీ గణేశునకు నమస్కారము.

పూర్వము [1] నైమిషారణ్యమునందు కులపతియైన శౌనక మహాముని నిరంతరము సత్త్రియాగము చేసెను. భగవంతుడు నిమిష మాత్రములో ఈ అరణ్యము నందు రాక్షససేనను సంహారించెను. గనుక ఈ వనమునకు నైమిషారణ్యమను పేరు వచ్చినది. విద్వాంసుడైన ఏ బ్రాహ్మణుడు ఒక్కడే జ్ఞానము

నైమిషమనెడు పేరునకు వరాహపురాణమందిట్లు వివరణముఁ గలదు-

1. "ఏవం కృత్వా తతోదేవో మునింగౌర ముఖం తదా।
ఉవాచ నిమిషేణేదం నిహతం దానవం బలమ్॥
అరణ్యేఽస్మిన్ స్తతస్త్వేత న్నైమిషారణ్య సంజ్ఞితమ్"

పొందగోరు పదివేల మంది వ్యక్తులకు అన్నదానము చేసి వారిని పోషించునో అట్టి బ్రాహ్మణునకు 'కులపతి' అని పేరు ఏ కార్యము అనేక వ్యక్తుల సహకారముచేత చేయబడునో ఏ కార్యము నందు అనేకులకు జ్ఞాన సత్ప్రవర్తనాదులు ఉపదేశింపబడి అన్న వస్త్రాదులు ఇవ్వబడునో ఏ కార్యము అనేకులకు తృప్తి కలుగించుచు ఉపయోగింపబడునదిగా ఉండునో అట్టి యజ్ఞకార్యమునకు 'సత్త్రమని' పేరు

ఆ సత్త్రయాగము నందు బ్రహ్మచర్యాది నియమములను పాలించు బ్రాహ్మణులు కూర్చుని యుండిరి.

'సూతపుత్రుడైన ఉగ్రశ్రవుడు' అను మహాముని మిక్కిలి కుతూహలముతో ఆ బ్రహ్మర్షుల వద్దకు వినయపూర్వకముగ వచ్చెను. ఉగ్రశ్రవుడు పురాణముల యందు విద్వాంసుడు. కథలు చెప్పుట యందు నేర్పరి.

అపుడు నైమిషారణ్యము నందు మహర్షులు ఉగ్రశ్రవుని నుండి చిత్ర విచిత్రములయిన కథలు వినుటకు అతని వద్ద కూర్చొనిరి.

ఉగ్రశ్రవుడు చేతులు జోడించి ఆ మునులకు నమస్కరించి కుశల ప్రశ్నము చేసెను. వారు అతనికి స్వాగత సత్కారములు చేసిరి.

తరువాత అందరు తమ తమ ఆసనములయందు కూర్చొనిరి. ఉగ్రశ్రవుడు మార్గాయాసము తీర్చికొని సుఖముగ కూర్చొని యుండెను.

ఒక మహాముని ఉగ్రశ్రవుని నిట్లు ప్రశ్నించెను—

'సూత కుమారా ! నీవెక్కడ నుండి వచ్చుచున్నావు ? ఇంతవరకు నీవెక్కడ ఆనందముతో నుంటివి ?

ఆ ప్రశ్నమునకు ఉగ్రశ్రవుడు ఇట్లు ఉత్తరము చెప్పెను :- "మహర్షులారా! పరీక్షిత్తు కుమారుడైన జనమేజయ మహారాజు చేసిన సర్పయాగమునందు కృష్ణద్వైపాయన మహాముని నిర్మించిన పరమ పుణ్యము, చిత్రవిచిత్రార్థములు కలదియూనైన మహాభారత కథను వైశంపాయన ముని జనమేజయునకు చెప్పుచుండెను. ఆ కథను విని నేను వచ్చుచున్నాను.

నేను అనేక పుణ్యతీర్థముల యాత్ర చేయుచూ పుణ్యకరములైన శమంతక పంచక క్షేత్రమునూ, కురుక్షేత్రమునూ సేవించితిని. అక్కడనే కౌరవ పాండవులకు మహాయుద్ధము జరిగియుండెను.

ఆ కురుక్షేత్రమునుండియే నేను మీ దర్శనము చేయుటకు వచ్చితిని. మీరందరు దీర్ఘాయుస్సు గల బ్రహ్మ స్వరూపులు, మాన్యులు.

మహా మునులారా! సూర్యాగ్నుల వలె తేజస్సు గల మీరు భాగ్యవశమున ఈ మహా సత్రము నందు పాల్గొనియున్నారు. మీ దర్శనము చేత నేను ధన్యుడ నైతిని. ఇప్పుడు మీరు స్నాన - సంధ్యా - జప - హోమాదులు ముగించుకొని విశ్రాంతితో కూర్చొనియున్నారు.

ఇప్పుడు మీకు నేను ధర్మార్థముల రహస్యము గలిగి అంతఃకరణమును పరిశుద్ధము చేయగల వివిధ పురాణముల కథలను వినిపించుదునా ? లేక మహానుభావులైన ఋషుల యొక్క, చక్రవర్తుల యొక్క పవిత్ర చరిత్రములను వినిపించుదునా ? ఆజ్ఞ యిండు"

ఆ మాటకు ఆ మహర్షులు ఇట్లనిరి——

"సూతపుత్రా! ఏ ప్రాచీన ఇతిహాస రూపమైన పురాణమును శ్రీకృష్ణ ద్వైపాయన మహాముని వర్ణించియుండెనో, దేనిని దేవతలు, ఋషులు తమ తమ లోకములందు విని మిక్కిలి ప్రశంసించిరో, ఏది ఆఖ్యానము లన్నింటిలో శ్రేష్ఠమో, దేనియొక్క ప్రతి అక్షరమూ, ప్రతి పదము, ప్రతి వాక్యము, ప్రతి పర్వము విచిత్రశబ్ద విన్యాసముతో రమణీయార్థముతో పరిపూర్ణములై యున్నవో, దేనియందు జీవాత్మ, పరమాత్మలయొక్క స్వరూప నిర్ణయము చేయబడి అది అనుభవపూర్వకముగా తెలిసికొనుటకుగాను అనేక యుక్తులు కలవో, ఏవి సమస్త వేదముల తాత్పర్యమునకు అనుకూలమైన అర్థముచేత అలంకరింపబడి యున్నదో అట్టి మహాభారతేతిహాసమును మేము వినగోరు చున్నాము."

ఆ మహామునుల ప్రశ్నమునకు సూతపుత్రుడైన ఉగ్రశ్రవుడు ఇట్లు ఉత్తరము చెప్పదొడగెను:-

"మహామునులారా! సమస్త జగత్తుయొక్క సృష్టి స్థితిలయములకు కారణభూతుడు జగదంతర్యామియునైన పరబ్రహ్మకు నమస్కారము చేసి వేదవ్యాస మహాముని అంతఃకరణమునుండి వెలువడిన మహాభారతకథను చెప్పెద వినుడు:-

ప్రపంచమునందు ఈ యితిహాసమును అనేక కవులు వర్ణించిరి, వర్ణించు చున్నారు, వర్ణించగలరు.

ఈ మహాభారతము "జ్ఞానస్వరూప"మని మూడు లోకములందున్నూ దీనికి ప్రతిష్ఠ గలదు. ప్రజలందరు దీనిని చదివి ఇతరులకు చెప్పుచుందురు.

దీనియందు వైదిక, లౌకిక సంస్కృతులు నిండియున్నవి. ఇది అనేక పద్యవృత్తములతో కూడియున్నది గనుక విద్వాంసులకు మిక్కిలి ప్రీతికరము.

**సంగ్రహభారత కథారంభము :**

పూర్వము హిమాలయ పర్వత మూలమునందు గుహలోపల ధర్మాత్ముడైన వ్యాసమహాముని స్నానాదులచేత పరిశుద్ధుడై దర్భాసనమునందు కూర్చొని తపస్సు చేయుచుండెను. అప్పుడతడు తన జ్ఞానదృష్టిచేత మహాభారతకథను మొదటినుండి చివరిదాకా ప్రత్యక్షముగా చూచి ఆ గ్రంథరచనము చేసెను.

**బ్రహ్మాండోత్పత్తి:**

సృష్టి యారంభమునందు వస్తువులు గానీ, వాటి నామరూపములు గానీ తెలియకుండెను. ప్రపంచమునందు ప్రకాశమే లేకుండెను. అంతట అంధకారము వ్యాపించెను. అప్పుడు ఒక పెద్ద "అండము" పుట్టెను. అది సమస్త ప్రపంచోత్పత్తికి బీజముగా నుండెను.

కల్పాది యందు ఆ యండము నాలుగు విధములైన ప్రాణుల ఉత్పత్తికి కారణ మాయెను. ఆ యండము నందే సత్య స్వరూపుడు, జ్యోతిర్మయుడు, సనాతనుడు నైన పరబ్రహ్మ అంతర్యామిగా ప్రవేశించి యుండెనని వేదములలో వర్ణింపబడినది.[1]

1. "తత్ సృష్ట్వా తదేవానుప్రావిశత్" - తైత్తిరీ యోపనిషత్ - బ్రహ్మదేవుడు అండమును పిండమును సృజించి తానే అందులో ప్రవేశించెను అని పై వాక్యమునకు అర్థము.

ఆ బ్రహ్మ అద్భుతము, అచింత్యమూ నైనది. అది అంతట సమానముగా వ్యాపించి యుండెను ప్రపంచ మంతయు బ్రహ్మ స్వరూపమే.

ఆ అండము నుండియే తొలుత బ్రహ్మ, రుద్ర, మను, ప్రజాపతి, పరమేష్ఠి, ప్రచేతసుల పుత్రులు, దక్షుడు అతని ఏడుగురు పుత్రులైన క్రోధ, తమస్, దమ - విక్రీత - అంగిరస్ - కర్దమ - అశ్వ అనువారు జన్మించిరి. తరువాత ఇరువది యొక్క ప్రజాపతులు (మరీచ్యాదులైన సప్తర్షులు పదునాలుగురు మనువులు వెరసి ఇరువది యొక్క మంది) జన్మించిరి.

తరువాత మత్స్య - కూర్మ - వరాహాది అవతార రూపములలో శ్రీమహావిష్ణువు ప్రకటితు డయ్యెను.

ఆదిత్య, వసు, విశ్వేదేవాదులు కూడా క్రమముగా అవతరించిరి. యక్ష, సాధ్య పిశాచాదులు, బ్రహ్మర్షులు, రాజర్షులు, జలము, ఆకాశము, పృథివి, వాయువు, దిక్కులు, సంవత్సరములు, ఋతువులు, మాసములు, పక్షములు, వారములు, అహోరాత్రాదులు మొదలైన స్థావర జంగమాత్మకమైన సమస్త ప్రపంచము ఆ యండము నుండి జన్మించెను.

ఆయా ఋతువులలో పుష్పఫలములు పుట్టి నశించి మరల పుట్టుచుండునట్లే ప్రపంచము ప్రళయకాలమందు నశించి కల్పారంభమునందు మరల పుట్టుచుండును.

ఈ కాలచక్రము అనాదిగా అనంతముగా ప్రవాహ రూపములో శాశ్వతముగా తిరుగుచుండును. దీనియందే ప్రాణుల ఉత్పత్తి వినాశములు జరుగుచుండును.

దేవతల సృష్టి ముప్పది మూడు వేల ముప్పది మూడు నూర్ల ముప్పది మూడు సంఖ్యలోనుండును.

---

"ఋషయః సప్త పూర్వే యే మనవశ్చ చతుర్దశ
ఏతే ప్రజానాం పతయః ఏభిః కల్పః సమాప్యతే" - "బ్రహ్మాండ పురాణము" - సప్తఋషులు, పదునాలుగురు మనువులు వీరందరునూ ప్రజాపతులు. వీరిచే కల్పము సమాప్తమగును.

'భాను' మొదలైన ద్వాదశాదిత్యులలో కడపటివాడు రవి. అతనికి మహ్యః (మహి అనగా భూమి. దానియందు గర్భస్థాపనముచేయు పూజ్యుడు) అను పేరు ప్రసిద్ధమయ్యెను. అతనికి పుత్రపౌత్రాది సంతతి అనేకులు లక్షల సంఖ్యలో కలిగిరి.

సూర్యుని మునిమనుమలు "దశజ్యోతి, శతజ్యోతి, సహస్రజ్యోతి" అను ముగ్గురుండిరి. సహస్రజ్యోతి నుండియే కురు, యదు, భరత, యయాతి, ఇక్ష్వాకు వంశములు, ఇతర రాజర్షి వంశములు పుట్టెను. ఇతని నుండియే ప్రాణుల సృష్టిపరంపర అనేక వంశములు పుట్టి ప్రపంచమందు విస్తరించెను.

సూర్యుని మునిమనుమల నుండియే ధర్మార్థకామాదులు, ఆయుర్వేదాది విద్యలు, సమస్త లౌకిక శాస్త్రములు, ఉత్పన్నములయ్యెను. ఈ యన్నింటిని వేదవ్యాస మహాముని పరిపూర్ణముగా అనుభవపూర్వకముగాను తెలిసికొని యుండెను.

మహాభారత గ్రంథమందు అనేక వేద రహస్యములు, ఇతిహాసాదులు వర్ణింపబడినవి. ఈ మహాభారత జ్ఞానమును ప్రపంచ విద్వాంసులు అనేక విధములుగ వివరించిరి.

వేదవ్యాసుడు తన తపశ్శక్తి చేత బ్రహ్మచర్య శక్తిచేత వేదమును విభజించి వేదార్థమును మహాభారతేతిహాస రూపములో నిర్మించి దీనిని శిష్యులకు, ప్రజలకు ఏ విధముగ బోధించవలెనా అని విచారించు చుండగా బ్రహ్మదేవుడు వేద వ్యాసుని కడకు వచ్చెను.

అప్పుడు వ్యాసు డా దేవునకు నమస్కరించి మిక్కిలి ఆనందము నొంది బ్రహ్మదేవు నిట్లడిగెను :-

"భగవాన్ ! నేను ప్రపంచ పూజ్యమైన ఒక మహాకావ్యమును రచించితిని. ఈ గ్రంథమునందు వేదరహస్యములను శాస్త్రముల సారమును వ్రాసినాను. వేదాంగములను గూర్చి, ఉపనిషత్తులను గూర్చి కూడా గ్రంథము నందు విస్తరించి వ్రాసినాను. ఇందులో వృద్ధాప్యము, మృత్యువు, రోగము, భయము, పదార్థముల యొక్క సత్యాసత్య స్వరూపములు కూడ వర్ణించినాను.

అనేక ధర్మములు, ఈ చాతుర్వర్ణ్యము, బ్రహ్మచర్యాదులైన నాలుగు ఆశ్రమములను గూర్చి కూడా వివరించినాను. నాలుగు వర్ణముల వారి కర్తవ్యము ను, విధానమును, పురాణముల తత్త్వమును కూడ తెలిపినాను.

వేయేల, ప్రపంచ మందలి సమస్త విషయములను గూర్చి, నాలుగు యుగములు, నాలుగు వేదములను గూర్చి, ఆధ్యాత్మిక తత్త్వమును గూర్చి ఈ మహా భారత గ్రంథము నందు విస్తారముగా వర్ణించినాము.

కాని, ప్రపంచము నందు ఈ గ్రంథమును వ్రాయగల శక్తి గల వ్యక్తి ఏవరు కూడ లభించుట లేదు."

ఆ మాటకు బ్రహ్మదేవుడు వ్యాసునితో నిట్లనెను :-

"మహాముని ! నీవు ప్రపంచము, జీవుడు, పరమేశ్వరుడు ఈ మూడు తత్త్వములను తెలిసికొన్న వాడవు గాబట్టి మునీశ్వరు లందరిలోను శ్రేష్ఠుడవు. నీవు రచియించిన ఈ మహాభారత గ్రంథము కావ్యరూపములో ప్రసిద్ధమై యెల్లకాలము మని యుండును.

ఇంతకు మించిన గ్రంథమును వ్రాయగల వారెవ్వరున్ను ప్రపంచ మందు ఉండరు.

ఇట్టి గ్రంథమును నీవు చెప్పుచుండగా వ్రాయగలవాడు మహాగణపతి యొక్కడే యున్నాడు. అతనిని నీవు స్మరించుము "

ఇట్లు చెప్పి బ్రహ్మదేవుడు వెడలిపోయెను.

తరువాత వ్యాసుడు గణపతిని స్మరించిన వెంటనే అతడు వచ్చెను. వ్యాసుడు మిక్కిలి ఆదరముతో గణపతికి స్వాగత సత్కారములు చేసి అతనితో నిట్లనెను :-

**గణపతి మహాభారతము వ్రాయుట :**

"గణనాయకా ! నీవు నిర్మించిన మహాభారత గ్రంథమును నేను చెప్పుచుండగా నీవు వ్రాయవలెను. ఆ గ్రంథ మంతయు నేను మనస్సునందే నిర్మించు కొని యున్నాను."

ఆ మాటకు గణేశ్వరుడు ఇట్లనెను :-

"వ్యాస మహాముని! నేను వ్రాయునప్పుడు ఒక క్షణకాలము కూడ నా లేఖని (కలము) ఆగకుండ నేను 'ఊఁ' అనకుండ నీవు చెప్పవలెను. ఆ నియమము పైననే నేను వ్రాసెదను"

ఆ మాట విని వ్యాసమహాముని గణపతితో నిట్లనెను :-

"గణనాయకా ! నీ నియమమునకు నేను అంగీకరించెదను. కాని నేను చెప్పబోవు ప్రతి అక్షరము నీవు అర్థము చేసికొని వ్రాయవలెను."

ఆ నియమమును గణేశుడు అంగీకరించి వ్యాస మహామునికి లేఖకుడుగా నుండెను.

అపుడు వ్యాసుడు మహాభారతమునందు "గ్రంథ గ్రంథి (గ్రంథము నందు సులభముగా అర్థము గాని శ్లోకము) మధ్య మధ్యన చెప్పుచు వచ్చెను. ఆ శ్లోకార్థము పైకి ఒక విధముగను దాని యంతరార్థము మరియొక విధముగను ఉండెను.

మహాభారత గ్రంథము నందు ఇటువంటి గ్రంథ గ్రంథులు ఎనిమిది వేల యెనిమిదినూర్లు గలవు. వాటి అర్థము వ్యాసుడు శుకుడు (వ్యాసపుత్రుడు) మాత్రమే ఎఱుగుదురు. సంజయునకు తెలియునా లేదా అనునది సందేహమే.

అటువంటి గంభీరార్థ శ్లోకముల భావమును గణపతి విచారించుటకు ఒక క్షణకాలము ఆగినపుడు అంతలోనే వ్యాసుడు అనేక శ్లోకముల రచన మనస్సు లోనే చేసికొని యుంచుకొనుచుండెను.

ఇట్టి మహాభారతము అజ్ఞానాంధులకు జ్ఞానాంజనము వంటిది. ఇది అజ్ఞానమను అంధత్వమును పోగొట్టునది మాత్రమే కాక సూర్యునివలె అంధకారమంతయూ పోగొట్టి పరిపూర్ణ జ్ఞాన ప్రకాశము నిచ్చును. కనుక ఇది అజ్ఞానాంధత్వమును పోగొట్టుటకు ఒక అద్భుతమైన అంజనము (కాటుక).

ఈ మహాభారతము వేదార్థమనెడు వెన్నెలను ప్రకాశింపజేయు పరిపూర్ణ చంద్రుని వంటిది. ఇది వెలుగుచున్న దీపము వంటిది. ఈ దీపము మోహాంధకారమును పోగొట్టి అంతరంగమను ఇంటి లోపల జ్ఞానపు వెలుగును వ్యాపింపజేయును.

ఈ మహాభారత మహా వృక్షమునకు ఈ సంగ్రహాధ్యాయము బీజము. పౌలోమ-ఆస్తీక పర్వములు మూలము. కౌరవోత్పత్తి పర్వము ఈ వృక్ష స్కంధము (చెట్టుబోదె). సభా - అరణ్య పర్వములు పక్షుల నివాసమునకు కోటరము. (తొఱ్ఱ-తొట్టి) అరణీ పర్వము ఈ వృక్షమునకు గ్రంథి (ముడి). విరాటోద్యోగ పర్వములు ఈ వృక్షముయొక్క సారము (చేవ). భీష్మ పర్వము పెద్ద కొమ్మలు. ద్రోణ పర్వము దీని ఆకులు. కర్ణ పర్వము దీని తెల్లనిపూవులు. శల్య పర్వము సుగంధము. స్త్రీ పర్వము, ఐషీక పర్వము ఈ మహావృక్షము యొక్క నీడ. శాంతి పర్వము ఈ భారత మహావృక్షమునకు మహా ఫలము. అశ్వమేధ పర్వము ఆ ఫలముయొక్క అమృతమయమైన రసము. ఆశ్రమవాస పర్వము అట్టి భారత మహావృక్షము నాశ్రయించి కూర్చొనుటకు స్థానము. మౌసల పర్వము వేద స్వరూపములైన అత్యున్నత శాఖల యొక్క అగ్ర భాగము.

ఇట్టి మహా భారత మహా వృక్షమును సదాచారము, విద్య పరిపూర్ణముగ కలిగిన ద్విజాతులు (పక్షులు, బ్రాహ్మణులు) సేవించెదరు.

ప్రపంచము నందు ఉన్న కవిశ్రేష్ఠు లందరు రచించు కావ్యములకు ఈ మహాభారతము ఆశ్రయభూతమైన మూలముగ నుండ గలదు. మేఘము సమస్త ప్రాణులకు జీవనమును (నీరు-జీవితము) ఇచ్చునట్లే ఈ మహాభారత వృక్షము కూడ అక్షయ జీవనము నిచ్చును.

ఈ విధముగ చెప్పి సూతపుత్రుడైన ఉగ్రశ్రవుడు శౌనకాది మహా మునులతో మరల నిట్లనెను.

**మహాభారత ప్రశంస:**

"మహర్షులారా ! ఈ మహాభారత వృక్షము యొక్క రుచికరములు, పవిత్రములు, సరసములు, నశించనివియునైన పుష్పఫలములే ధర్మము, మోక్షము. ధర్మమోక్ష రూపమైన ఆ పుష్పఫలములను దేవతలుగూడ మహాభారత వృక్షము నుండి వేరు చేయజాలరు. ఇప్పుడు నేను ఆ మహాభారతమును గూర్చియే మీకు వర్ణించి చెప్పెదను.

**వైశంపాయనుడు భారతకథ సంగ్రహముగా చెప్పుట :**

పూర్వకాలమునందు ధర్మాత్ముడైన శ్రీ వేదవ్యాసమహాముని తన తల్లి సత్యవతి, తన సోదరుడు గంగాపుత్రుడునైన భీష్మపితామహుని ఆజ్ఞచేత విచిత్ర వీర్యుని క్షేత్రముల గర్భముల నుండి అగ్నిసమాన తేజస్సు గల 'ధృతరాష్ట్ర, పాండు, విదుర' అను పేర్లు గల ముగ్గురు కురువంశ పుత్రులను కనెను.

ఆ ముగ్గురిని కనిన తరువాత వ్యాసమహాముని తన ఆశ్రమమునకు తిరిగి పోయెను. ఆ ముగ్గురు వృద్ధులై చనిపోయిన పిదప వ్యాసుడు మానవ లోకమునందు మహాభారతకథా ప్రవచనము చేసెను.

జనమేజయుడు, వేలకొలది బ్రాహ్మణులు వ్యాసుని ప్రశ్నింపగా అయన తనవద్ద కూర్చొని యున్న 'వైశంపాయనుడు' అను శిష్యునితో "వీరందరికి మహాభారతమును తెలుపుము" అని ఆజ్ఞాపించెను.

అప్పుడు వైశంపాయనుడు యజ్ఞము చేయుచు యజ్ఞఋత్విక్కులతో కూర్చొని యుండెను.

అందుచేత యజ్ఞకర్మము నందు మధ్య మధ్యన అవకాశము లభించినపుడు ఋత్విక్కులు, యజమానుడు మాటిమాటికి అడుగగా వారికి మహాభారత కథను వినిపించు చుండెను.

అనేకుల చరిత్రలు, కథలు, శ్రీ కృష్ణుని మాహాత్మ్యము, పాండవుల ధర్మము, ధార్తరాష్ట్రుల అధర్మము మొదలైన అనేకానేక వృత్తాంతములతో నిండిని లక్షశ్లోకములు గల మహాభారతమును వ్యాసుడు నిర్మించెను. ఈ ఉత్తమ గ్రంథ విషయములను మానవులందరు అవశ్యముగా తెలిసికొనవలెనని కరుణా దృష్టితో వ్యాసుడు దీనిని ప్రపంచము నందు ప్రపంచించెను.

తరువాత వ్యాసుడు భారతము నందలి కథాభాగములను విడిచిపెట్టి యిరువది నాలుగు వేల శ్లోకములతో 'భారత సంహితను' రచియించెను. దానిని విద్వాంసులు భారతము అని అనెదరు.

పిదప, వ్యాసమహర్షి మహాభారత గ్రంథమునందు వర్ణింపబడిన సర్వ వృత్తాంతయుల యొక్క అనుక్రమణికను సంగ్రహముగ నూటయేబది శ్లోకములలో రచించెను. అది సంగ్రహాధ్యాయ మనబడును.

వ్యాస మహాముని అందఱి కంటె తొలుత తన పుత్రుడైన శుక మహర్షికి ఈ మహాభారతమును చెప్పెను. ఆ తరువాత అర్హులైన యితర శిష్యులకు గూడ ఈ గ్రంథమును ఉపదేశించెను.

తరువాత వ్యాస భగవానుడు అరువది లక్షల శ్లోకములతో మఱియొక మహాభారత సంహితను ఉద్గ్రంథముగ రచియించెను.

ఆ అరువది లక్షల శ్లోకములలో ముప్పది లక్షలు దేవలోకము నందు, పదునైదు లక్షలు పితృలోకము నందు, పదునాలుగు లక్షలు గంధర్వ లోకము నందు పఠింపబడుచున్నవి.

మనుష్య లోకము నందు ఒక లక్ష శ్లోకముల మహాభారతము నిలిచి యున్నది.

దేవలోకము నందు దేవర్షి నారదుడు, పితృలోకము నందు అసితుడైన దేవలుడు, మహాభారతమును వినిపించిరి. శుకదేవుడు గంధర్వ - యక్ష - రాక్షసులకు దీనిని వినిపించెను.

ఈ మనుష్య లోకము నందు వ్యాస శిష్యుడు, సమస్త దేవతా శిరోమణి, ధర్మాత్ముడు నైన వైశంపాయన మహాముని ఈ మహాభారతమును ప్రవచించెను.

మునీశ్వరులారా! మనుష్య లోకము నందున్న ఒక లక్ష శ్లోకములు గల మహాభారతమును చెప్పెదను వినుడు :

దుర్యోధనుడు క్రోధరూపమైన పెద్ద వృక్షముతో సమానుడు కర్ణుడు ఆ చెట్టు బోదె. శకుని శాఖలు. దుశ్శాసనుడు ఫలపుష్పములు. అజ్ఞానుడైన ధృతరాష్ట్ర రాజు ఈ వృక్షపు వేరు.[1]

---

1. ఈ భావము మహాభారత తాత్పర్యమును సూచించునదిగ నున్నది. ఇచట దుర్యోధనుడు క్రోధస్వరూపుడు అనుటచేత క్రోధ శబ్దము ద్వేషాసూయాది దుర్గుణములను సూచించుచున్నది. కర్ణ, శకుని, దుశ్శాసనాదులు ఆ క్రోధముతో ఐక్యము పొందిన క్రోధ స్వరూపులు గానే భావించవలెను.

మహా మునులారా! ఇప్పుడు క్రోధ వృక్షమును గూర్చి వింటిరి. ఇక ధర్మవృక్షమును గూర్చి వినుడు.—

యుధిష్ఠిరుడు ధర్మస్వరూపుడైన మహావృక్షము. అర్జునుడు స్కంధము (బోదె). భీమసేనుడు ఆ వృక్షశాఖలు. నకుల సహదేవులు ఆ వృక్షము యొక్క ఫల పుష్పములు. శ్రీకృష్ణ భగవానుడు వేదములు, బ్రాహ్మణులే ఆ ధర్మ వృక్షము యొక్క మూలములు (వేళ్ళు)గ నున్నవి.*

దీని కంతటికి మూలము ధృతరాష్ట్ర మహారాజు. అజ్ఞానుడైన ఈ రాజు మనస్సును తన వశము నందు నుంచుకొనజాలక పోయెను. ఇతడు పుత్రప్రేమ చేత అంధుడై పుత్రుని దుష్టచర్యలకు పూర్తిగ అవకాశము నిచ్చెను. దాని చేత ధృతరాష్ట్రుని అజ్ఞానము ధృఢమయ్యెను.

ఒకవేళ ధృతరాష్ట్రుడు దుర్యోధనుని తన వశమునందు నుంచుకొని యుండిన యెడల గానీ అథవా, దుర్యోధనుని బాల్యము నందే విదురుడు మొదలైన పెద్దల మాటలు అంగీకరించి విడిచిపెట్టి యుండిన యెడల గానీ, విషము పెట్టుట, లక్కయిల్లు కాల్చుట, ద్రౌపది మానభంగము మొదలైన దుష్కార్యములు జరిగి యుండెడివి కావు. వాటి వలన కురు కులమునకు నాశము గూడ కలిగి యుండెడిది గాదు.

ఈ సందర్భమునందు ముఖ్యముగ గమనించవలసిన విషయ మేమనగా, క్రోధ రూపమైన దుర్యోధన వృక్షమునకు ధృతరాష్ట్ర రూపమైన అజ్ఞానమే మూలము. క్రోధలోభాదులు స్కంధము (బోదె). హింసా శౌర్యాదులు శాఖలుగ నున్నవి. బంధన నరకాదులు ఆ క్రోధ వృక్షము యొక్క ఫల పుష్పములు.

పురుషార్థములు కాంక్షించు పురుషుడు సంసారమునకు మూలమైన అజ్ఞానమును ఛేదించుట ద్వారా క్రోధ వృక్షమును పూర్తిగ నశింపజేయ వలెను అను భావము ఈ సందర్భము నందు సూచింపబడినది.

* యుధిష్ఠిరుడు "ధర్మము" అను మాటకు అభిప్రాయ మేమనగా అతడు శమ - దమ - సత్యాహింసాది రూపమైన ధర్మము యొక్క మూర్తీభ వించిన స్వరూపమని భావము.

ఈ సందర్భము నందు భగవతి అయిన వేదమాత యిట్లు చెప్పెను:-

"గార్గీ! అవినాశియైన పరమాత్మను తెలిసికొనకుండ ఈ ప్రపంచము నందు యెవడు వేల కొలది సంవత్సరములు యజ్ఞములు, దానములు, తపస్సులు చేయునో అతని సత్కర్మల ఫలము నశించునదియే.

జ్ఞానమునకు మూలము బ్రహ్మము - అనగా వేదము. వేదము చేతనే పరాపర ధర్మమైన యజ్ఞయాగాది జ్ఞానము కలుగును.

ధర్మము యొక్క మూలము కేవలము శబ్దప్రమాణమే యని నిశ్చితమైన సిద్ధాంతము.

వేదము యొక్క మూలమే బ్రాహ్మణులు. ఎందుకనగా బ్రాహ్మణులే వేద సంప్రదాయమును ప్రపంచము నందు ప్రవర్తింపజేసిరి.

ఈ విధముగా ఉపదేశకులు బ్రాహ్మణులు, జ్ఞానమునకు ప్రమాణములుగ వేదములు, జిజ్ఞాసువులను అనుగ్రహించువాడుగ పరమాత్ముడు ఈ త్రివిధ స్వరూపములే ధర్మమునకు మూలములు.

వేదములను, బ్రాహ్మణులను భక్తితో ఆరాధించువాడే ఈ ధర్మజ్ఞానమును పొందుటకు అధికారి. అట్టి వేద బ్రాహ్మణారాధకుడైన అధికారి పురుషుడు భగవదారాధన బలముచేత యోగాది రూపమైన ధర్మమయ వృక్షమును సంపాదించవలెనని పైమాట చేత సిద్ధమైనది.

ఆ ధర్మ వృక్షమునకు సత్యాహింసాదులు అడుగు భాగము. ధ్యాన-ధారణాదులు శాఖలు. తత్త్వ-సాక్షాత్కారాదులే ఆ ధర్మవృక్షము యొక్క ఫలములు.

---

భీమార్జునాదులు ధర్మవృక్షము యొక్క స్కంధ శాఖాదులుగ చెప్పుటకు అభిప్రాయమేమనగా, వారందరు ధర్మ స్వరూపమైన యుధిష్ఠిర వృక్షము యొక్క అభిన్నములైన అంగము లనియే భావము.

శుద్ధసత్త్వమయుడు జ్ఞానస్వరూపుడునైన శ్రీకృష్ణుడను పరమాత్మయే ఆ ధర్మవృక్షమునకు మూలము అని చెప్పుట చేత ఆ దృఢజ్ఞానము చేతనే ధర్మము యొక్క మూలము దృఢతర మగునని భావము.

ఇట్టి ధర్మవృక్షమును ఆశ్రయించుట తోడనే ధర్మార్థ కామ మోక్ష రూపములైన పురుషార్థములు సిద్ధించగలవు. దానిని ఆశ్రయించని వారికి అవి సిద్ధించవు.

ఓ మునీశ్వరులారా! పాండురాజు బలపరాక్రమముల చేత అనేక దేశములను జయించి వేటయందు ఆసక్తి కలవాడై ఆ వ్యసనముచేత మునులతో అడవియందే నివసించు చుండెను.

ఒకనాడతడు మృగరూపము ధరించిన మహర్షిని అతడు స్త్రీ సంగమము చేయుచుండగా చంపెను. మరణించుచున్న ఆ ముని "రాజా! నీవు కూడ స్త్రీ సంగమము చేసినచో మరణించెదవు." అని పాండురాజును శపించెను.

తరువాత పాండురాజు కుంతీ మాద్రులకు దేవతానుగ్రహము చేత జన్మించిన పుత్రులకు జాతకర్మాది సంస్కారములు చేసి వారికి విద్యాబుద్ధులు కూడ అడవియందే ఉపదేశింపచేసెను. యమ-వాయు-ఇంద్ర- అశ్వినీ దేవతల అనుగ్రహముచేత యుధిష్ఠిర - భీమ - అర్జున - నకుల సహదేవులు జన్మించిరి.

తరువాత పాండురాజు కామాంధుడై మాద్రీ సంయోగముచేసి ఋషి శాపము కారణముగ మరణించెను. అతనితోనే మాద్రి సహగమనము చేసెను.

పిదప ఆ వనమందలి మునీశ్వరులు కుంతీదేవిని, పాండవులను హస్తినా పురమందు ధృతరాష్ట్రునకు అప్పగించిరి.

అప్పుడు అందరు సంతోషించిరి. కాని, కొందరు 'వీరు పాండుపుత్రులు కా'రని, మరికొందరు 'పాండుపుత్రులే' యని, కొందరు 'పాండురాజు చనిపోయి చాలనాళ్ళు గడచెను. కనుక వీరు అతని పుత్రులెట్లయ్యెదరు?'అని వివిధ సందేహములను వెలిబుచ్చిరి.

అయిననూ అందరు పాండవులకు స్వాగతము పలికి వారిని ఆదరించిరి. అప్పుడు 'వీరు పాండుపుత్రులే' అని ఆకాశవాణి వినిపించెను.

పాండవులు నగర ప్రవేశము చేసినపుడు ప్రజలు సుగంధి పుష్ప వర్షము కురిపించిరి. శంఖ దుందుభుల మంగళ వాద్యములు వాయించిరి. పెద్దగా నినాదములు చేయుచు పాండవులను అభినందించిరి.

పాండవులు ధృతరాష్ట్రుని రక్షణమునందుండి సమస్త వేదశాస్త్రములు చదివిరి.

ప్రజలు పాండవుల సత్ప్రవర్తనమును ప్రశంసించుచు, వారియెడల సంతుష్టులై యుండిరి. పాండవులలో యుధిష్ఠిరునకు శౌచము - ఆచారము, భీమసేనునకు ధైర్యము, అర్జునునకు పరాక్రమము, నకుల - సహదేవులకు గురుశుశ్రూష, ఓర్పు ఉండెను. పాండవుల కందరికి శౌర్యముండెను[1]

---

1. శాస్త్రోక్తమైన ఆచారములను విడువకుండుట, సదాచారులైన సత్పురుషుల సంగము కలిగియుండుట, దృఢముగ సదాచారములను అనుష్ఠించుట, ఈ మూడింటికి 'శౌచము' అని పేరు.

తనకిచ్ఛకు అనుకూలములు, ప్రతికూలములునైన వస్తువులు ప్రాప్తించి నపుడు మనస్సునందు సంతోష దుఃఖములు అను వికారములు కలుగకుండుటకు 'ధృతి' అని పేరు.

అందరికంటె మించిన సామర్థ్యము కలిగియుండుటకు 'విక్రమము' అని పేరు.

సత్ప్రవర్తనము ననుసరించుటయే శుశ్రూష అనబడును. (సదాచార పరాయణులైన గురువులను అనుసరించుట గురుశుశ్రూష యనబడును) ఎవరైన తనయెడల అపరాధము చేసినప్పటికిని ఆ యపరాధియెడల తన మనస్సు నందు క్రోధాది వికారములు కలుగకుండుట 'క్షమాశీలత' అనబడును.

జితేంద్రియత్వము లేక అనుద్ధతుడుగా నుండుట 'వినయము' అనబడును.

బలవంతుడైన శత్రువును కూడ జయించు నిశ్చయముతో నుండుట శౌర్య మనబడును. వీని సంగ్రహ శ్లోకము లిట్లు గలవు.

''ఆచారా పరిహార శ్చ సంసర్గశ్చాప్యనిందితైః,
ఆచారే చ వ్యవస్థానం శౌచమిత్యభిధీయతే॥

ఇష్టానిష్టార్థ సంపత్తౌ చిత్తస్యా వికృతి ర్ధృతిః,
సర్వాతిశయ సామర్థ్యం విక్రమం పరిచక్ష్యతే॥

వృత్తానువృత్తిః శుశ్రూషా క్షాంతి రాగస్య(స్వ)విక్రియా
జితేంద్రియత్వం వినయోఽథవాఽనుద్ధత శీలతా,
శౌర్య మధ్యవసాయః స్యాత్ బలినోఽపి పరాభవే॥

తరువాత కొంత కాలమునకు రాజసమూహము నందు అర్జునుడు అతి దుష్కర పరాక్రమము చూపి స్వయంవరము నందు ద్రౌపదిని గెలుచుకొనెను.

అప్పటి నుండియే అతడీ లోకమునందలి ధనుర్ధరులందరికి పూజనీయుడు, ఆదరణీయుడు నాయెను. యుద్ధభూమియందు ప్రచండ సూర్యునివలె ప్రకాశించు అర్జునుని వైపు ఎవ్వరు కూడ కన్నెత్తి చూడజాలకుండిరి.

అర్జునుడు విడివిడిగాను, సమష్టిగాను వచ్చిన రాజులందఱిని జయించి యుధిష్ఠిర మహారాజు తలపెట్టిన రాజసూయ యాగమును జయప్రదము చేసెను.

శ్రీకృష్ణుని నీతిచేత భీమార్జునుల సామర్థ్యము చేత; బలదర్పము చేత గర్వించుచున్న జరాసంధ శిశుపాలురను చంపించి యుధిష్ఠిరుడు రాజసూయ యాగము చేసెను. ఆ యజ్ఞము సర్వసద్గుణముల చేత కూడినది.* దానియందు విశేషముగ అన్నదానము, దక్షిణలు ఇవ్వబడినవి.

యజ్ఞ సమయము నందు వివిధ దేశాధీశుల నుండి మణి సువర్ణాదులైన అసంఖ్యాక వస్తువులు కానుకలుగా వచ్చెను. అవి యన్నియు దుర్యోధనుని అధీనములో నుంచబడు చుండెను. అవి చూచినప్పటినుండి దుర్యోధనుని మనస్సు నందు ఈర్ష్యాసూయలు, కోపము, దుఃఖము కలిగెను.

ఆ సమయము నందు మయుడు అను రాక్షసుడు పాండవులకు అద్భుత మైన సభాభవనము నిర్మించి కానుకగా ఇచ్చెను. అది విమానము వలె శోభిల్లు చుండెను. దానిని చూచి దుర్యోధనుని సంతాపము అధిక మాయెను.

ఆ భవనము నందు జలమున్నచోట స్థలముగను, స్థలమున్నచోట జలము గను భ్రమ కలుగుచుండుట చేత దుర్యోధనుడు వట్టినేల యని జలప్రదేశము

* 'ఆచార్యుడు, బ్రహ్మ, ఋత్విక్కులు, సదస్యులు; యజమానుడు, యజమాన పత్ని, ధనసంపత్తి, శ్రద్ధ, ఉత్సాహము, విధి విధానముల పాలనము, మంచిబుద్ధి' యీ మొదలైనవి యజ్ఞము యొక్క గుణ సామ గ్రిలో జేరినవి.

నందు కాలుపెట్టి జారి క్రింద పడెను. అది జూచి శ్రీకృష్ణుని యెదుట భీమ సేనుడు దుర్యోధనుని అనాగరకునిగ నిరూపించి పరిహసించెను.

దుర్యోధనుడు తన యింటిలో అనేక సుఖములు, వైభవములు, ఉన్నప్పటికివి దినదినము కృశించు చుండెను. శరీరము పాలిపోయెను. ఆ విషయము సేవకులు ధృతరాష్ట్రునకు తెలిపిరి.

ధృతరాష్ట్రునకు దుర్యోధనుని యందు ఎక్కువ ప్రేమ యుండెను గాబట్టి పాండవులతో జూద మాడుటకు అతనికి అనుమతి నిచ్చెను. శ్రీకృష్ణునకు ఈ విషయము తెలిపి ధృతరాష్ట్రుని ఎక్కువగా కోపించెను.

ధృతరాష్ట్రునకు జూదము వలన యుద్ధము కలుగవచ్చునని, జూదము విషయములో సంతోషము కలుగలేదు. అయినను అతడు మౌనముతో ఉండి కౌరవ పాండవ వివాదములను ఆమోదించి కౌరవులు చేయుచున్న అన్యాయములను, జూదమును చూచుచు గూడ ఉపేక్షించెను.

కౌరవ - పాండవ యుద్ధము నందు పాండవులకు విజయము కలుగుట ధృతరాష్ట్రునకు అప్రియముగ ఉండెను. అయినను, దుర్యోధనాదుల ఒత్తిడి చేత అతడు ఊరకుండవలసిన వాడయ్యెను.

అప్పుడు ధృతరాష్ట్రుడు సంజయునితో నిట్లనెను :

"సంజయా ! నా మాట లన్నియు వినిన తరువాత నీవు ఈ యుద్ధ వినాశమునకు నా యందు దోషము ఆరోపించవు. నీవు బుద్ధిమంతుడవు, పండితుడవు, సజ్జనులకు ఆదరణీయుడవు. ఈ యుద్ధమునకు నా సమ్మతి ఏ మాత్రము లేదు- దీని వలన మా కులమునకు నాశము కలిగెను. అందుచేత జూదము చేత నాకు సంతోషము కలుగ లేదు.

సంజయా ! నాకు కౌరవ పాండవులలో భేదభావము లేదు. కాని ఏమి చేసెదను ? నా కొడుకులు కోపము చేత నా యందే దోషారోపణము చేసి నా మాట వినకుండిరి.

సంజయా ! నేను అంధుడను కాబట్టి దీనత్వము వలన, పుత్రులందు ప్రేమ వలనను వారు చేయు అన్యాయములన్నిటిని సహించుచున్నాను. దుర్యో

ధనుడు మోహముచేత దుఃఖించు చున్నప్పుడు నేను కూడ వానితోపాటే దుఃఖించుచుంటిని.

సంజయా! రాజసూయ యాగకాలమందు 'యుధిష్ఠిరుని సర్వోన్నతమైన వృద్ధి, సంపత్తి, మయసభా భవనము, దాని యందు భీమసేనుడు చేసిన పరిహాసము' యీ యన్ని కారణములచేత దుర్యోధనునకు మిక్కిలి కోపము కలిగెను.

సంజయా! యుద్ధము నందు పాండవులను జయించు శక్తి దుర్యోధనునకు లేకుండెను. కాబట్టి అతనికి యుద్ధము నందు ఉత్సాహము లేకుండెను.

కాని సంజయా! దుర్యోధనుడు పాండవుల సంపదను హరించుటకుగాను శకునితో పాటు కపట ద్యూతము ఆడుటకు నిశ్చయించెను. అట్లు నిశ్చయించిన తరువాత జూదమునకు పూర్వము, తరువాత జరిగిన సంఘటనములను విచారించుచు నేను అప్పుడప్పుడు నా పుత్రుల విజయమునకు విపరీతమైన అనుభవములను పొందుచుంటిని. అవి చెప్పెదను వినుము.

సంజయా! నేను చెప్పబోవు మాటలను విని నేను ఎంత అంధుడనో తెలిసికొనగలవు.

సంజయా! ద్రౌపదీ స్వయంవరమందు, సుభద్రాకల్యాణమునందు, అర్జునుడు స్వర్గలోకమునకు పోయినప్పుడు అతడు ఖాండవ వనమును దహింపజేసినపుడు, పాండవులు లక్క యింటి నుండి తప్పించుకొని నప్పుడు, భీముడు జరాసంధుని వధించినపుడు, పాండవులు రాజసూయయాగము కొరకు రాజులందరిని జయించి నపుడు, ద్రౌపదికి అవమానము జరిగినపుడు ఆమెకు ఎడతెగక వస్త్రములు భగవదనుగ్రహము చేత ఉత్పన్నము లైనపుడు, ధర్మరాజు జూదములో ఓడిపోయినపుడు, అతని తమ్ములు ధర్మమార్గములో అతనిని అనుసరించినపుడు, వారందరు వనవాసమునకు పోవు సమయమున దుఃఖించినపుడును, సంజయా! నా విజయాశ నశించినది.

సంజయా! వేల కొలది వనవాసులు, బ్రాహ్మణులు, ఋషులు పాండవుల కడ భోజనము చేయుచున్నప్పుడు, పరమేశ్వరుని సంతుష్టిపరచి, అర్జునునితో పాశుపతాస్త్రము సంపాదించినపుడు, మహర్షులు పాండవులతో కలిసిమెలిసి

మైత్రితో నున్నప్పుడు, అర్జునుడు స్వర్గమునకుపోయి యింద్రునివలన దివ్యమైన అస్త్రశస్త్రములు సంపాదించినపుడు, అర్జునుని ఊర్వశి కోరినపుడు, అతని బ్రహ్మచర్య నిష్ఠను వినినపుడు, దేవతలకు కూడ దుర్జయులైన కాలకేయ, పౌలోమాది రాక్షసులను అర్జునుడు సంహరించినపుడు, పాండవులు లోమశ మహర్షితోపాటు తీర్థయాత్రలు చేసినపుడు, మనుష్యులకు దుర్గమమైన అలకా పట్టణమునకుపోయి పాండవులు కుబేరునితో కలిసినపుడు నేను నా విజయాశను విడిచిపెట్టితిని.

సంజయా! ఘోషయాత్రలో నా పుత్రులను గంధర్వుల నుండి అర్జునుడు విడిపించినపుడు, యక్షుడు చేసిన గూఢ ప్రశ్నలకు యుధిష్ఠిరుడు సముచిత సమాధానములు చెప్పినప్పుడు, విరాటనగరమునందు అజ్ఞాతవాసము చేయుచున్న పాండవులను నా పుత్రుడు ఎంత ప్రయత్నించినను కనుగొనజాలనపుడు, కీచక వధ వినినపుడు, ఏకరథమాత్ర సహాయుడై అర్జునుడు ఉత్తరగోగ్రహణమునందు మహారథికులైన భీష్మాదులను ఓడించి పారద్రోలినపుడు నాకు విజయాశ లేకుండెను.

సంజయా! ఉత్తరాభిమన్యుల వివాహము జరిగినపుడు, యుధిష్ఠిరుడు సంపదలను, మిత్రులను, సహాయకులను పోగొట్టుకొనినప్పటికిని, ఏడు అక్షౌహిణుల సేనను సంపాదించుకొనినపుడు, శ్రీకృష్ణుడు పాండవుల కార్య సాధనకై దీక్షబూనినాడని వినినపుడు, కృష్ణార్జునులు నరనారాయణులే యని నారదునివలన నేను వినినపుడు, కృష్ణుని రాయబారము విఫలమైనపుడు, శ్రీకృష్ణుని కర్ణ దుర్యోధనులు చెరబట్టదలచుచుండగా ఆ భగవంతుడు తన విశ్వ రూపమును చూపినప్పుడు, నేను నా విజయాశను విడిచియుంటిని.

సంజయా! రాయబారము విఫలమైన తరువాత కృష్ణుడు కుంతిని ఊరడించుచు చెప్పిన మాటలు వినినపుడు, శ్రీకృష్ణుడు పాండవులకు మంత్రి యని భీష్మద్రోణులు అతనిని ఆదరించినపుడు, కర్ణుడు భీష్మునితో విరోధించి యుద్ధమును విడిచిపోయినపుడు, అర్జునుడు మోహగ్రస్తుడు అయినపుడు శ్రీకృష్ణ భగవానుడు గీతోపదేశముచేసి తన విశ్వరూపము అతనికి చూపినపుడు, భీష్ముడు యుద్ధమునందు ప్రతి-దినము పదివేల సైనికులను సంహరించుచునప్పటికిని

పాండవులలో ప్రసిద్ధుడైన ఒక్క యోధుని కూడ సంహరించనపుడున్నూ నేను విజయాశను విడిచిపెట్టితిని.

సంజయా! భీష్ముడు పాండవులకు తన మరణోపాయమును తెలిపినపుడు అర్జునుడు శిఖండిచేత భీష్ముని పడగొట్టించినపుడు, అర్జునుని బాణముల చేత భీష్ముడు గాయపడి బాణశయ్యపైన పరుండి అర్జునుని కోరగా అర్జునుడు భూమిలో నుండి బాణము చేత జలము తీసి భీష్మునకు ఇచ్చినపుడు, పాండవులకు శుభ శకునములు, మాకు దుశ్శకునములు కలిగినపుడు, మహారథికుడు, పరాక్రమశాలియు నైన ద్రోణాచార్యుడు గొప్పగా యుద్ధము చేసియు పాండవులలో ఒక్కరినికూడ వధించనపుడు నేను విజయాశ మానుకొంటిని.

సంజయా! మహాయోధులైన సంశప్తకులను అర్జునుడు ఒక్కడే సంహరించినాడని తెలిసినపుడు, అభిమన్యుడొక్కడే పద్మవ్యూహమును భేదించినపుడు, అర్జునుని ఎదుటకూడా నిలువజాలని మహారథికులు ఏకమై అభిమన్యు కుమారుని వధించినపుడు, అర్జునుడు దృఢ ప్రతిజ్ఞ చేసి సాయంకాలము లోపుగా సైంధవుని వధించినపుడు సాత్యకి ఏకాకిగనే ద్రోణాచార్యుల సేనను చెదరగొట్టినపుడు, భీమసేనుడు చేజిక్కినప్పటికిని కర్ణుడు అతనిని చంపక విడిచినప్పుడును నాకు విజయాశ నశించినది.

సంజయా! అర్జున వధార్థమై కర్ణుడు ఇంద్రుని నుండి సంపాదించిన అమోఘమైన శక్తియాయుధమును శ్రీకృష్ణుడు వ్యర్థము చేసి దానిచేత ఘటోత్కచుని చంపునట్లు చేసినపుడు, పుత్ర శోకము చేత బాధపడుచున్న ద్రోణాచార్యుని దృష్టద్యుమ్నుడు అధర్మముగ చంపినప్పుడు, అశ్వత్థామ వంటి మహావీరునితో నకులుడొక్కడే యుద్ధము చేసినప్పుడు, ద్రోణాచార్య మరణానంతరము అశ్వత్థామ ప్రయోగించిన నారాయణాస్త్రము పాండవులను చంపజాలనపుడున్నూ నేను విజయాశను విడిచితిని.

సంజయా! భీమసేనుడు యుద్ధభూమి యందు దుశ్శాసనుని రక్తపానము చేయుచుండినను అక్కడివారెవ్వరుకూడ భీమసేనుని వారించనపుడు మహావీర శిరోమణియైన కర్ణుని అర్జునుడు వధించినపుడు, యుధిష్ఠిరుడు అశ్వత్థామ, దుశ్శాసన, కృతవర్మలను జయించినపుడు, యుధిష్ఠిరుడు మహా పరాక్రమశాలి

యైన శల్యుని చంపినపుడు, శకునిని సహదేవుడు చంపినపుడు, దుర్యోధనుడు సర్వస్వము పోగొట్టుకొని జలస్తంభన విద్య చేత జలములో దాగియుండగా కృష్ణుడు-పాండవులు అతనిని దుర్భాషలాడినపుడు నేను మా విజయమునందాశ వీడితిని.

సంజయా! భీమ దుర్యోధనులు గదా యుద్ధము చేయుచుండగా భీముడు గదాయుద్ధ నియమములు ఉల్లంఘించి అధర్మముగా దుర్యోధనుని తొడ విరిచి చంపినపుడు, దుష్టులైన అశ్వత్థామాదులు నిద్రించుచున్న పాంచాల పుత్రులను, ద్రౌపదీ పుత్రులను చంపి వంశమునకు కళంకమును తెచ్చినపుడు అశ్వత్థామ ఐషీకాస్త్రము చేత కురువంశాంకురమైన ఉత్తరాగర్భస్థ శిశువును చంపదలచినపుడు నేను మా విజయాశ విడిచితిని.

సంజయా! అశ్వత్థామ ప్రయోగించిన 'బ్రహ్మ శిరస్సు' అను అస్త్రమును అర్జునుడు అణచి అశ్వత్థామ శిరస్సు నందలి మణిని లాగికొనినపుడున్నూ నాకు జయాశ లేకపోయెను. అశ్వత్థామ మహాస్త్ర ప్రయోగము చేసి ఉత్తరా గర్భమును పడగొట్టుటకు ప్రయత్నించుచున్నప్పుడు వ్యాస భగవానుడు శ్రీ కృష్ణ భగవానుడున్నూ పరస్పరము విచారించి అశ్వత్థామను శపించినపుడే మా విజయాశ ఎల్లప్పటికిన్నీ ముగిసెను. ఇప్పుడు గాంధారి యవస్థ శోచనీయముగా నున్నది. ఎందుకనగా ఆమె యొక్క పుత్ర, పౌత్ర, భ్రాతృ బంధువులలో నెవడు కూడ లేడు. పాండవులు దుష్కర కార్యము చేసిరి. వారు మరల తమ రాజ్యమును అకంటకముగా పొందిరి.

సంజయా! అయ్యో! మా పక్షము నందు కృపాచార్యులు, అశ్వత్థామ, కృతవర్మ ముగ్గురు మాత్రము, పాండవుల పక్షమునందు శ్రీకృష్ణుడు - సాత్యకి- పంచపాండవులు ఈ యేడుగురు మాత్రము చావక మిగిలినారని నేను వినినాను. ఇవి యెంత దుఃఖకరమైన వార్త. మహాయుద్ధమునందు పదునెనిమిది అక్షౌహిణుల సేన నశించెను.

సంజయా! ఇది యంతయు వినిన నా యెదుట గాఢాంధకారము వ్యాపించి యున్నది. నా మనస్సులో మోహము ఆవేశించినది. నాకు చైతన్యము నశించి పోయినది. నా మనస్సు కలవరపడుచున్నది.''

"మహా మునులారా! ఇట్లు చెప్పి ధృతరాష్ట్రుడు మిక్కిలి దుఃఖించి మూర్ఛిల్లి మరల సంజయునితో నిట్లనెను."

"సంజయా! యుద్ధము యొక్క ఈ పరిణామము తెలిసిన తరువాత నేను వెంటనే నా ప్రాణములు విడువ దలచితిని. ఇప్పుడు జీవించి యుండినందువలన నాకు ఎలాంటి ఫలము కనుబడుటలేదు.

మహామునులారా! ధృతరాష్ట్రుడు దైన్యముతో ఏడ్చుచు ఇట్లు సంజయునితో చెప్పి సర్పమువలె దీర్ఘాతిదీర్ఘముగా బుసలు కొట్టుచు మూర్ఛ పోవుచుండెను.

అప్పుడు పుణ్యాత్ముడైన సంజయుడు ధృతరాష్ట్రునితో సారగర్భితముగ నిట్లనెను :-

"మహారాజా! దేవర్షి నారదుడు, మహర్షి వ్యాసుడు చెప్పిన వీర నృపతుల చరిత్రను నీవు వింటివి. మహారాజ వంశోత్పన్నులు, దివ్యశస్త్రాస్త్రకోవిదులు, ఇంద్ర సమాన పరాక్రమవంతులు నైన రాజుల చరిత్రను వింటివి.

వారందఱు ధర్మ యుద్ధము చేసి విజయము సంపాదించిన వారు. గొప్ప గొప్ప దక్షిణలు ఇచ్చి యజ్ఞములు చేసిన వారు. ప్రపంచము నందు గొప్ప కీర్తి సంపాదించిన వారు. వారందఱు గూడ కాలగర్భములో కలిసిపోయిరి.

వారిలో శైబ్యుడు, సృంజయుడు, సుహోత్రుడు, రంతి దేవుడు, కాక్షీవంతుడు, ఔశిజుడు, బాహ్లీకుడు, దమనుడు, చైద్యుడు, శర్యాతి, నలుడు, విశ్వామిత్రుడు, అంబరీషుడు, మరుత్తుడు, మనువు, ఇక్ష్వాకుడు, గయుడు, భరతుడు, శ్రీరాముడు, శతబిందుడు, భగీరథుడు, కృతవీర్యుడు, జనమేజయుడు, యయాతి-ఈ రాజుల యజ్ఞములను దేవతలు స్వయముగా చేయించిరి. ఈ రాజులందఱు తమ రాజ్యములందలి భూమిని యజ్ఞపు గనులుగ చేసిరి. సమస్త భూమి యందు యూప స్తంభములు నాటిరి.

ఈ యిరువది నలుగురు రాజుల వర్ణనమును పూర్వకాలము నందు నారదుడు పుత్రశోకము చేత తపించుచున్న శైబ్యుని దుఃఖము పోగొట్టుటకు చేసెను.

మహారాజా! పూర్వ యుగము నందు ఇప్పుడు చెప్పబడిన రాజులు గాక యితరులు కూడా చాల మంది యుండిరి.

వారు పూరు, కురు, యదు మొదలైన వారు. వీరు గాక ఇంకను వేల కొలది రాజులు ఇంకను అనేకులు ఉండిరి. వారందఱు మహారథికులు, మహాత్ములు, వీరులు, సకల సద్గుణ సంపన్నులు బుద్ధిమంతులుగ నుండిరి. ఇంత గొప్ప వైభవమును అనుభవించినవారైనను వారందరు ఆ రాజవైభవములను, సంపదలను నీ పుత్రుల వలెనే విడిచిపెట్టి చనిపోయిరి.

వారందఱి యొక్క అద్భుత దివ్య కర్మలు, శౌర్య త్యాగ మహిమలు, ఆస్తికత్వ సత్వ పావనత్వములు, దయా సరళత్వాది సద్గుణముల వర్ణనము ఎందరో మహా విద్వాంసులు చేసిరి. వారి చరిత్రలు గ్రంథస్థములు గూడ చేయబడెను. అట్టి మహా పురుషులందఱు గూడ చనిపోయిరి.

రాజా! నీ పుత్రులు దుర్యోధనాదులైతేనో, దురాత్ములు, క్రోధము, లోభము కలవారు, అతి దుష్ప్రవర్తన గల వారుగ నుండిరి. అట్టి దుష్టుల మరణము గూర్చి నీవు దుఃఖించకూడదు.

ధృతరాష్ట్ర మహారాజా! నీవు శాస్త్రముల శ్రవణము చేసితివి. నీ బుద్ధి యందు శాస్త్ర తత్త్వములను ధృఢముగ నిలిపికొని యున్నావు. బుద్ధిమంతులు, జ్ఞానవంతులు నిన్ను ఆదరించుచున్నారు. శాస్త్రమును అనుసరించి లోకయాత్ర నడుపు వారెప్పుడు కూడ శోక మోహములకు వశులు కారు.

మహారాజా! నీవు పాండవుల యెడల నిర్దయుడవుగా, నీ పుత్రుల పట్ల పక్షపాతివి గాను వ్యవహరించితివి. కాబట్టి ఇప్పుడు నీవు నీ పుత్రుల జీవితము విషయములో వ్యాకుల పడకూడదు.

రాజా! కావలసిన దేదో అయినది. దాని కొఱకు దుఃఖింపకుము. భవితవ్యమును తన బుద్ధితో తుడిచివేయగల సమర్థుడు ప్రపంచము నందు ఎవడున్నాడు? తన కర్మల ఫలమును తప్పక అనుభవించ వలయును. అది దైవ విధానము. దైవము నెవ్వరు గూడ ఉల్లంఘించ జాలరు.

జనన-మరణ, సుఖదుఃఖము లన్నింటికి కాలమే మూల కారణము. కాలమే ప్రాణుల జనన మరణములను చేయుచుండును. ఇట్లు జనుల మరణము చేయు కాలమును మహాకాల స్వరూపుడైన పరమాత్ముడు నశింప జేయును.

సమస్త లోకము లందు ఈ కాలమే శుభాశుభ వస్తువులను పుట్టించుచు, చంపుచు మరల పుట్టించు చుండును. ఇట్లు కాల చక్రము నడచుచుండును.

సుషుప్తి (గాఢ నిద్ర) అవస్థలో అన్ని ఇంద్రియములు, మనోవృత్తి లీనమై యున్నప్పుడు కూడ కాలము మేల్కొని యుండును. కాలగతిని ఎవడు కూడ దాట జాలడు. కాలము సమస్త ప్రాణుల యందు సమానముగ ఏలాటి అడ్డు లేక తన కార్యక్రమమును సాగించుచుండును.

సృష్టి యందు భూత, భవిష్యద్వర్తమాన కాలము నందలి పదార్థము లన్నియు కాలము చేతనే నిర్మింపబడినవని తెలిసికొని మహారాజా! నీవు వివేక మును విడువ కూడదు.

మహా మునులారా! సంజయుడు ఈ విషయము లన్నింటిని చెప్పి పుత్రశోకము చేత వ్యాకులుడైన ధృతరాష్ట్ర మహారాజును సమాధాన పఱచెను.

ఈ ఇతిహాసమునే ఆధారము చేసికొని శ్రీకృష్ణ ద్వైపాయన మహాముని, దుఃఖితులైన ప్రాణుల శోకమును నశింపజేయుటకై పరమ పవిత్రము, ఉపని షద్రూపము నైన ఈ మహాభారతేతిహాసమును నిరూపించి చెప్పెను.

ప్రపంచము నందలి విద్వాంసులు, కవి పుంగవులు, పౌరాణికులు సర్వదా ఈ మహాభారతమునే వర్ణించి చెప్పుచుందురు.

**మహాభారత మహిమ**

"ధృతరాష్ట్ర మహారాజా! మహాభారతము చదువుటచేత మనస్సు పరి శుద్ధమగును. ఎవడైనను శ్రద్ధతో ఈ గ్రంథము నందు ఒక్క శ్లోకముగాని, శ్లోక పాదము గాని చదివినచో అతని పాపమంతయు నశించిపోవును.

"ఈ మహాభారత గ్రంథము నందు పుణ్యకర్మలు చేయు దేవతలు, దేవర్షులు, బ్రహ్మర్షులు, యక్షులు, మహారాజులున్ను వర్ణింపబడినారు.

"ఈ గ్రంథమునందు ముఖ్యముగ ప్రతిపాదింపబడిన విషయము సనా తన బ్రహ్మ స్వరూపుడైన శ్రీకృష్ణ భగవానుడు. అతడే సత్య-పవిత్ర-పుణ్య స్వరూపుడు. శాశ్వత బ్రహ్మ. అవినాశియైన సనాతన జ్యోతి. విద్వాంసులు ఆ ఆ పరబ్రహ్మ దివ్యలీలా విశేషములనే కీర్తించు చుందురు.

ఈ పరబ్రహ్మ నుండియే అసద్రూపము, సద్రూపము, సదసదుభయ రూపమునైన ఈ సమస్త జగత్తు ఉత్పన్నమగును. ఈ బ్రహ్మము నుండియే ప్రజలు, ప్రజల కర్తవ్య కర్మలు, వారి జనన మరణములు, పునర్జన్మములు, ఇవి యన్నియు కలుగును.

'ఈ మహాభారతమునందు జీవాత్మ స్వరూపము, సత్వము - రజస్సు - తమస్సు - అను త్రిగుణముల నుండి పుట్టిన పృథివి. జలము, వాయువు, అగ్ని, ఆకాశము అను పంచమహాభూతములు. ప్రకృతి, అవ్యక్తాదులు, వీనికి మూల కారణమైన పరబ్రహ్మ స్వరూపము గూడ విశేషముగ నిరూపింపబడినది.

"మహారాజా! ధ్యానయోగశక్తి సంపన్నులు, జీవన్ముక్తులునైన యతీశ్వరులు, దర్పణమునందు ప్రతిబింబమువలె, తమ హృదయమునందున్న పరమాత్మ స్వరూపమును అనుభవపూర్వకముగ దర్శించెదరు.

"శ్రద్ధతో, ఏకాగ్రమనస్సుతోన ప్రతిదినము ఈ యధ్యాయమును పఠించు ధర్మాత్ములైన పురుషులు పాపము నుండి, తాపమునుండియు విముక్తులయ్యెదరు."

"మహాభారతము యొక్క యీ అనుక్రమణికాధ్యాయమును మొదటి నుండి చివరదాక ప్రతిదినము శ్రవణముచేయు ఆస్తిక పురుషులు సంకటకాలమునందు గూడ దుఃఖమును పొందరు."

"ఈ యధ్యాయము యొక్క కొంత భాగమైనను ప్రాతస్సాయంకాలములందుగాని, రాత్రియందు గాని పఠించు పురుషుని పాపములన్నియు వెంటనే నశించిపోవును.''

"ఈ అనుక్రమణికాధ్యాయము మహాభారతముయొక్క మూల శరీరము. ఇది సత్యామృతముల స్వరూపము. పెరుగులో వెన్న, మనుష్యులలో బ్రాహ్మణుడు, వేదములలో ఉపనిషత్తులు, ఓషధులలో అమృతము, జలాశయములలో సముద్రము, చతుష్పాద జంతువులలో గోవు శ్రేష్ఠమైనట్లే ఇతిహాసము లన్నింటిలోను మహాభారతము శ్రేష్ఠము.''

"శ్రాద్ధ కాలము నందు బ్రాహ్మణులు భోజనము చేసిన తరువాత, ఈ అనుక్రమణికాధ్యాయములో నాల్గవ భాగము గాని, ఒక శ్లోకము గాని, శ్లోక పాదముగాని బ్రాహ్మణులకు వినిపించిన యెడల పితృదేవతలకు అన్నపానములు అక్షయముగ లభించును."

"ఇతిహాస పురాణముల సహాయముతోనే వేదముల యర్థమును విస్తరింప జేసి, ఆ అర్థమును సమర్థించవలెను. ఇతిహాస పురాణములు తెలియని వాని వలన వేదములు భయపడుచుండును. ఎందుకనగా ఆ రెండు తెలియని వాడు వేదార్థమును చెడగొట్టును.

"వేదవ్యాసుడు చెప్పిన పంచమ వేద మనెడి యీ మహాభారతమును ఇతరులకు వినిపించిన వారికి మనోవాంఛితము పూర్తిగ సిద్ధించును."

"మహాభారత శ్రవణముచేత భ్రూణ హత్య(గర్భమును నశింపజేయుట) మొదలైన పాపములు గూడ నశించును."

"ప్రతి పర్వాంతము నందు ఈ యధ్యాయము పఠించిన, వానికి సంపూర్ణ మహాభారతము యొక్క ఫలము లభించును. మహాభారత శ్రవణము ప్రతి దినము చేసిన వానికి దీర్ఘాయువు, కీర్తి, స్వర్గప్రాప్తియు కలుగును."

"పూర్వకాలము నందు దేవత లందఱు ఒకచోట జేరి తుల (త్రాసు) లో నొక పళ్ళెమునందు నాలుగు వేదములను, రెండవ దాని యందు మహాభారత మును ఉంచిరి. అప్పుడు భారతము యొక్క బరువు ఎక్కువాయెను. అప్పటి నుండియే ఈ గ్రంథమునకు 'మహా భారతము' అను పేరు వచ్చెను.

సత్యము అనెడు తుల యందు తూచుట చేత ఈ గ్రంథము మహత్త్వము నందు, గౌరవము నందు, గాంభీర్యము నందున్ను వేదముల కంటె అధికమైన దని నిరూపింపబడెను అందు చేతనే,

"మహత్త్వాత్ భారవత్త్వాచ్చ మహాభారత ముచ్యతే" అని లోకము లందు ప్రసిద్ధముగ చెప్పబడుచున్నది.

"తపస్సు, శాస్త్రపఠనము, వర్ణాశ్రమముల ననుసరించి చేయబడు వేదోక్త విధులు, పరిశ్రమచేసి సంపాదించిన ధనము" ఇవి యన్నియు

నిర్మలములు. కాని, అవియే విపరీతభావముతో చేసినపుడు పాపమయము లగును. అనగా—

"ఇతరులకు కీడు తలపెట్టి చేయు తపస్సు, శాస్త్రపఠనము, వేదోక్త విధులు, ధనసంపాదనము పాపయుక్తములు"* అని భావము.

అనుక్రమణికా పర్వము సమాప్తము.

# పర్వసంగ్రహ పర్వము

**సమంత పంచక వర్ణనము :**

తరువాత మహామునులు ఉగ్రశ్రవుని ఇట్లు ప్రశ్నించిరి :-

''మహామునీ! నీవు ప్రారంభమునందు 'సమంతపంచకము'నుగూర్చి చెప్పి యుంటివి. కురుక్షేత్రమునందు అది యున్నదని, అక్కడ మహాభారత యుద్ధము జరిగినదనియు చెప్పితివి. ఇప్పుడు ఆ ప్రదేశమునుగూర్చి చెప్పుము."

ఆ మునులు చేసిన ప్రశ్నమునకు ఉగ్రశ్రవుడు ఇట్లు సమాధానము చెప్ప దొడగెను :-

''మహామునులారా! ఇప్పుడు నేను శ్రేయస్కరములైన కథలను చెప్పు చున్నాను. అవి మఙ్గళకరములు, ఆ కథలు మీరు సావధానముగా వినుడు. ఈ సందర్భమునందే 'సమంతపంచక' క్షేత్రవర్ణనముగూడ చెప్పెద వినుడు:

''త్రేతా - ద్వాపరయుగసంధికాలమందు, శస్త్రధారులలో శ్రేష్ఠుడైన పరశురాముడు క్షత్రియులపై క్రోధముచేత అనేక పర్యాయములు భూప్రదక్షిణము చేసి క్షత్రియులను సంహరించి, ఆ క్షత్రియుల రక్తముచేత సమంతము అను క్షేత్రమునందు ఐదు సరస్సులను నిర్మించెను.

''పరశురాముడు క్షత్రియులయంచలి క్రోధావేశముచేత ఆ రక్త జలముతో నిండిన సరస్సులందు రక్తాంజలిచేత తన పితృదేవతలకు తర్పణము చేసెనని మేము వినినాము".

---

* దీని భావ మేమనగా, ఈ మహాభారత గ్రంథమును భావశుద్ధితో పఠించవలెను. దీనిని మనస్సును పరిశుద్ధముగా నుంచుకొని చదువవలెను.

"తరువాత, ఋచీకుడు మొదలైన పరశురాముని పితృదేవతలు ఆతని కడకు వచ్చి యిట్లనిరి :-

"నాయనా! పరశురామా! నీకు గల పితృభక్తిచేత, పరాక్రమముచేతను మేము మిక్కిలి ప్రసన్నులమైతిమి. నీకు శుభమగుగాక. వరము కోరుకొనుము. ఇచ్చెదము".

పితృదేవతల మాటలువిని పరశురాముడు ఇట్లు వరము కోరెను :-

"తండ్రులారా! మీకు నాయందు అనుగ్రహమున్నయెడల, క్రోధముచేత క్షత్రియవంశములను నశింపజేసిన నాదుష్కర్మలవలన గలిగిన పాపమునుండి నన్ను విముక్తిని జేయుడు. నేను నిర్మించిన యీ యైదు సరోవరములు ప్రపంచమునందు ప్రసిద్ధ పుణ్యక్షేత్రములగునట్లు అనుగ్రహింపుడు."

"పితృదేవతలు "అట్లే యగుగాక!" అని వరము ఇచ్చిరి. దానితోపాటు వారు పరశురామునితో, "నాయనా! ఇప్పుడు నీవు చంపగా మిగిలిన క్షత్రియులను క్షమించుము" అని చెప్పి అతనిని క్షత్రియ సంహారమునుండి నివారించిరి. తరువాత, పరశురాముడు శాంతుడయ్యెను."

'మహామునులారా! క్షత్రియరక్తముచేత నిండిన ఆయైదు సరోవరములకే "సమంతపంచక" మని పేరు. ఆపేరే ఆ పరిసర క్షేత్రమునకుగూడ వచ్చినది. ఆ క్షేత్రమంతయు మిక్కిలి పుణ్యప్రదమైనది."

"తపోధనులారా! లోకమునందు ఏ ప్రదేశమునందు ఏ చిహ్నముండునో, ఆ చిహ్నముచేత ఏ ప్రదేశము గుర్తింపబడునో, ఆచోటికి ఆ చిహ్నముపేరే పెట్టవలెనని విద్వాంసులు చెప్పెదరు."

"మునీశ్వరులారా! కలి-ద్వాపరయుగ సంధికాలమునందు సమంత పంచక క్షేత్రమునందే కౌరవ-పాండవుల సేనలకు పరస్పరము మహాభయంకర యుద్ధము జరిగెను. ఆ ప్రదేశమున కంతటికిని 'కురుక్షేత్ర' మని పేరు వచ్చెను.

"ఆధర్మ క్షేత్రమునందలి నేలయందుమిట్ట-పల్లములు, కంటక వృక్షములు, పాషాణములు, గులకరాలు ఈ మొదలైనవి లేనందుచేత అది భూదోషవర్జిత

మైన భూమి యని అక్కడ యుద్ధముచేయుటకు పదునెనిమిది అక్షౌహిణుల సేనలు ఒకటిగ చేరియుండెను. ఆ సేనలు అక్కడనే జరిగిన మహాభారత యుద్ధము నందు నశించెను.

"మునీశ్వరులారా!" ఈ కారణముచేతనే ఆ చోటికి సమంతపంచక[1] మని పేరు వచ్చెను.

"సమంతపంచక క్షేత్రము రమణీయము, పుణ్యప్రదము నైనది. అది మూడు లోకములందును ప్రసిద్ధమైనదని కూడ నేను చెప్పినాను.

**అక్షౌహిణీ సంఖ్య :**

తరువాత మహర్షులు ఉగ్రశ్రవుని ఇట్లు ప్రశ్నించిరి:-

"మహాత్మా! ఇప్పుడే "అక్షౌహిణీ" అను శబ్దము నీవు చెప్పితివి, అక్షౌహిణిని గూర్చిన సమస్త విషయములు మేము తెలిసికొన గోరుచున్నాము.

"అక్షౌహిణీ సేనలో ఎందరు కాల్బలమువారు? ఎన్ని అశ్వములు? ఎన్ని రథములు? ఎన్ని గజములున్ను ఉండును? దీని సమాచారమంతయు నీకు తెలియును గాబట్టి మాకు వర్ణించి చెప్పుము?"

మునీశ్వరుల ప్రశ్నమునకు ఉగ్రశ్రవుడు అక్షౌహిణిని గూర్చి ఈ విధముగా చెప్ప దొడగెను:-

1. "సమంతము" అను క్షేత్రమునందు ఐదు గుండములు, లేక సరోవరములు ఉండుటచేత ఆ క్షేత్రమునకు, వాని సమీప ప్రదేశమునకుగూడ "సమంత పంచక" మని పేరు వచ్చెను. ఆచోటికి "సమంతము" అను పేరు వచ్చుటకు కారణమేమనగా, "సమేతానాం అంతః యస్మిన్ సః సమంతః" అనగా, 'అక్కడకు వచ్చిన సేనకు అంతము (నాశము) కలిగెను.' అనువ్యుత్పత్తిచేత ఆపేరు వచ్చినది. 'పితరుల ప్రార్థనచేత పరశురాముని కోపము ఉపశమించెను. గనుక, 'శమంత' నామము ఏర్పడెనని నన్నయ భట్టారకుడు వ్యుత్పత్తి చెప్పెను.కనుక,తెలుగువారు 'శమంత' మనియే యనెదరు.

"మహామునులారా! ఒక రథము, ఒక గజము, ఐదుగురుపదాతి సైనికులు, మూడు గుఱ్ఱములు, ఈ యన్నింటికిని కలిపి "పత్తి" యని పేరు.

"ఈ పత్తులు మూడు కలిసినచో, దానికి ''సేనాముఖము'' అని పేరు మూడు సేనాముఖములు కలిసినది ఒక "గుల్మము" అనబడును.

''మూడు గుల్మములు కలిసినచో అది ఒక ''గణము'' అనబడును. మూడు గణములకు ఒక ''వాహిని'' అని పేరు. మూడు వాహినులు కలిసిన సేనకు ''పృతన'' అని పేరు.

"మూడు పృతనలు" కలిసిన సేనకు ''చమూ'' అని పేరు. మూడు చమువులు కలిసిన సేనకు "అనీకినీ" అని పేరు. పది అనీకినులు కలిసి ఒక ''అక్షౌహిణి" యగును. ఈ విధముగ అక్షౌహిణీసంఖ్య పెద్దలు చెప్పెదరు.

''బ్రాహ్మణోత్తములారా! గణితశాస్త్రజ్ఞులు ఒక అక్షౌహిణీ సేనయందు ఇరువదియొక్క వేల యెనిమిదినూర్ల డెబ్బది (21,870) రథములు ఉండును. అంత సంఖ్యలోనే గజములు ఉండును.

''ఒక అక్షౌహిణియందు పదాతి సైనికులు ఒకలక్షా తొమ్మిదివేల మూడు నూర్లయేబది (109350) మంది యుందురు.

''ఒక యక్షౌహిణీ సేనయందు అరువదియైదువేల ఆరునూర్లపది గుఱ్ఱములు (65610) ఉండును.

"తపోధను లారా! గణితశాస్త్ర విద్వాంసులు దీనినే 'అక్షౌహిణీ' అని యందురు. దీనిని గూర్చి నేను మీకు వివరించి చెప్పితిని.

ఈ లెక్క మేరకే కౌరవ పాండవుల యొక్క రెండు సేనలు పదునెనిమిది అక్షౌహిణుల సంఖ్యలో నున్నవి.

"సమంత పంచక క్షేత్రము నందు కౌరవ - పాండవుల సహాయార్థమై, ఈ పదునెనిమిది అక్షౌహిణుల సైన్యములు ఏకత్ర చేరి, భారత మహాయుద్ధము నందు సమంత పంచక క్షేత్రమునందే పోరాడి నశించెను."

భారతయుద్ధము పదునెనిమిది దినములు మహాఘోరముగ జరిగెను. ఆ దినములలో పదిదినములవరకు భీష్మపితామహు డొక్కడే సేనాపతిగ నుండి యుద్ధము చేసెను.

భీష్ముడు పడిపోయిన తరువాత ద్రోణాచార్యుడు సేనాపతిగ నుండి ఐదు దినములు కౌరవసేనను రక్షించెను.

ద్రోణాచార్యుని మరణానంతరము కర్ణుడు రెండు దినములు యుద్ధము చేసి మరణించెను.

మిగిలిన ఒక దినములో శల్యుడు అర్ధదినము మాత్రము సేనాపతిగ నుండి పోరాడి మరణించెను.

మిగిలిన అర్ధదినము భీమ - దుర్యోధనులకు గదాయుద్ధము జరిగెను.

పదునెనిమిదవ దినము గడచిన తరువాత ఆ రాత్రియందు కృతవర్మ-కృపాచార్యులు నిర్భయముగ నిద్రించుచుండగా అశ్వత్థామ, యుధిష్ఠిరుని సైనికులను చంపెను.

శౌనకమునీ! ఈ సత్రయాగమునందు నేను నీకు వినిపించుచున్న యీ మహాభారతమునే, పూర్వము జనమేజయుడు చేసిన సర్పయాగమునందు వేదవ్యాసశిష్యుడైన వైశంపాయన మహాముని జనమేజయునకు వర్ణించి చెప్పెను.

వైశంపాయనుడు గొప్పగొప్పరాజుల యశోగానము, పరాక్రమ ప్రశంస విపులముగ వర్ణించుట కొఱకు మహాభారతమునందు మొట్టమొదట "పౌష్య-పౌలోమ-ఆస్తీక" పర్వములను వర్ణించి చెప్పెను.

మోక్షము కోరువారు వైరాగ్యమును ఆశ్రయించినట్లే బుద్ధిమంతులైన మనుష్యులు అలౌకికార్థశోభితము, విచిత్ర పదగుంఫితము, అద్భుతాఖ్యాన సహితము నైన యీ మహాభారతము వినగోరెదరు.

ఎట్లు తెలిసికొనదగిన పదార్థములలో 'ఆత్మ' సర్వశ్రేష్ఠమో, ప్రియ పదార్థములలో తన జీవితము ఎట్లు సర్వశ్రేష్ఠమో ఆ విధముగనే సమస్త వేద శాస్త్రములలో పరబ్రహ్మ ప్రాప్తిరూప మైన మోక్ష - రూపప్రయోజనమును పరిపూర్ణముగ సంపాదింపజేయునట్టి యీ మహాభారతేతిహాసశాస్త్రము సర్వశ్రేష్ఠ మైనది.

మహామునులారా! ఎట్లు భోజనము చేయక శరీర నిర్వాహము సంభవము కాదో, అట్లే, యీ మహాభారతేతిహాసముతో సంబంధము లేక, ప్రపంచమునందు ఏ కథగూడ లేదు.

కులీనుడు, మంచిమనస్సు కలవాడు నైన తన ప్రభువును తన యభివృద్ధి కోరు సేవకుడు, సేవించినట్లే, ప్రపంచమునందలి యుత్తమ కవులందఱు ఈ మహాభారతమును ఆశ్రయించియే తమతమ కావ్యములను రచియించెదరు.

ఎట్లు అన్నివిధము లైన లౌకిక - వైదిక జ్ఞానములను ప్రకటించుటకు వాక్కు, అచ్చులతో హల్లులతోను గూడిన పదములును ఆవశ్యకములో, ఆ విధముగనే ఇహపరలోక సంబంధమైనది, పరమార్థ సంబంధమైనదియునగు నుత్తమమైన విద్య యీ మహాభారతేతిహాసము సందునిండియున్నది.

"ఈ మహాభారతేతిహాసము సమస్త జ్ఞానమునకు భండారము (బొక్కసము). ఈ గ్రంథమునందు సూక్ష్మాతిసూక్ష్మ పదార్థములను అనుభవింపజేయుననేక యుక్తులు ఉన్నవి.

"ఈ గ్రంథమునందలి యొక్కొక్క పదము, ఒక్కొక్క పర్వము గూడ మిక్కిలి ఆశ్చర్య జనకముగ నున్నది. ఈ గ్రంథమునందు వేదముల ధర్మస్వరూపమైన యర్థము గూడ నున్నది."

**మహాభారత పర్వ సంగ్రహము :**

ఇప్పుడు పర్వసంగ్రహమును చెప్పెద వినుడు :

"మొదట, పర్వానుక్రమణికను, పర్వసంగ్రహమును గూర్చి చెప్పబడెను, ఇక పౌష్యపర్వమునందు, ఉత్తంకుని మాహాత్మ్యము, పౌలోమపర్వమునందు భృగువంశ విస్తారము, ఆస్తీక పర్వమునందు సమస్త సర్పముల యొక్క, గరుడుని యొక్కయు ఉత్పత్తి, క్షీరసాగర మథనము 'ఉచ్చైః శ్రవము' అను అశ్వముయొక్క జన్మమున్ను వర్ణింపబడినవి. ఈ ఆస్తీక పర్వమునందే పరీక్షిత్తుపుత్రు డైన జనమేజయుని సర్పయాగమందు భరతవంశ రాజుల కథ చెప్పబడినది.

"సంభవపర్వమందు రాజులవేరు - వేరు జన్మ వృత్తాంతములు, శూరుల యొక్క, వ్యాసమహాముని యొక్కయు జన్మకథలు, దేవతల యొక్క అంశావతార కథలున్ను చెప్పబడినవి. ఇందులోనే, దైత్య-దానవ-యక్ష-నాగ-సర్ప-

గంధర్వ-పక్షులయొక్క, ఇతర వివిధ ప్రాణులయొక్కయు ఉత్పత్తి వర్ణింప బడినది.

"కణ్వాశ్రమమునందు శకుంతలా-దుష్యంతులకు పుట్టిన భరతుని కథ గూడ ఇందులోనే ఉన్నది. ఆ భరతుని పేరనే ప్రపంచమునందు భరతవంశము ప్రసిద్ధమైనది.

"తరువాత, గంగా - శాంతనులకు వసువులయుత్పత్తి, ఆ వసువులు మరల స్వర్గమునకు పోవుట, వసువులందరి యంశములతో భీష్ముడు జన్మించుట అతడు రాజ్యసుఖములు విడిచి జీవితాంతము బ్రహ్మచర్యములో నుండుటకు ప్రతిజ్ఞ చేయుట, ప్రతిజ్ఞాపాలనము, చిత్రాంగదుని మృత్యువు, అతని తమ్ముడైన విచిత్రవీర్యునకు రాజ్య మిచ్చుట, అణీమాండవ్యుని శాపముచేత యమధర్మరాజు విదురుడుగా పుట్టుట. వ్యాసానుగ్రహము చేత ధృతరాష్ట్రి - పాండుల జన్మము, పాండవుల జన్మ కథయు ఇందులోనే వర్ణింప బడినవి.

"ఋషులారా! లాక్షాగృహదాహపర్వమందు పాండవులు వారణావతమునకు వెడలిన సందర్భమునందు దుర్యోధనుడు గుప్తముగా చేసినకుట్రలు. అతడు పాండవుల కడకు కూటనీతిపరుడైన పురోచనుని పంపిన విషయమున్ను వర్ణింప బడినవి. మార్గములో యుధిష్ఠిరునకు విదురుడు మ్లేచ్ఛభాషలో చేసిన హితోపదేశము గూడ వర్ణింపబడినది. విదురుని యుపదేశము ప్రకారము సొరంగము త్రవ్వబడుట ఆ లక్క యింటిలో నిద్రించుచున్న భిల్ల స్త్రీ, ఆమె యైదుగురు పుత్రులు, పురోచనుడున్ను కాలి చచ్చుటయు చెప్పబడినవి.

"మునీశ్వరులారా! హిడింబ పర్వమునందు అడవిమార్గము గుండా పోవు చున్న పాండవులకు హిడింబ కనపడుట, తరువాత భీముడు హిడింబుని వధించుట, ఘటోత్కచుని జన్మ కథయు వర్ణింప బడినవి.

"పిదప వ్యాసుడు పాండవులతో కలియుట, ఆయన యాజ్ఞచేత పాండవులు ఏకచక్ర పురమునందు బ్రాహ్మణ గృహము నందు గుప్తముగా నివసించు చున్నప్పుడు భీముడు బకాసురుని వధించి నగరవాసులను ఆశ్చర్య పరచుటయు వర్ణింపబడినవి. తరువాత, ద్రౌపదీ - ధృష్టద్యుమ్నుల జననవర్ణనము కలదు.

పాండవులు బ్రాహ్మణులద్వారా, ద్రౌపదీ స్వయంవరము జరుగు సంగతి తెలిసి కొని, వ్యాసుని యాజ్ఞచేత ద్రౌపదిని బడయుటకు కుతూహలముచేత స్వయం వరము చూచుటకు పాంచాలదేశమునకు పోవుటయు ఈ పర్వమునందే వర్ణింప బడినది.

"మునులారా! చైత్రరథపర్వమునందు గంగాతీరమునందు అర్జునుడు, అంగారపర్ణుడు అను గంధర్వుని జయించి అతనితో మైత్రి చేసి, అతని వలన తపతీ-వసిష్ఠ-ఔర్వుల కథలు వినుట, అక్కడినుండి అర్జునుడు సోదరులతో పాంచాలదేశము వైపు పోవుటయు వర్ణింపబడినవి.

"తరువాత, అర్జునుడు స్వయంవర రంగమందు మత్స్యయంత్రమును ఛేదించి ద్రౌపదిని బడయుట, అతడు, భీమసేనుడున్ను యుద్ధమునందు ఎదిరించిన రాజులను, శల్య-కర్ణులను జయించుటయు చెప్పబడినవి. శ్రీకృష్ణ-బలరాములు భీమార్జునుల అతిమానుష పరాక్రమము చూచి వీరే పాండవులని నిశ్చయించి వారిని కలియుటకు కుమ్మరివాని యింటికి పోయిరి.

"తరువాత, ద్రుపదరాజు 'ఐదుగురు పాండవులకు ఒక పత్ని యెట్లగును?' అని విచారించెను. ఈ వైవాహిక పర్వమునందే ఐదుగురు ఇంద్రుల యొక్క యద్భుత కథ, ద్రౌపదియొక్క దేవవిహితము, మనుష్య పరంపరకు విపరీతము నైన వివాహము వర్ణింపబడెను.

"తరువాత, ధృతరాష్ట్రునిచేత పాండవులకడకు పంపబడిన విదురుడు వారితో కలిసినప్పుడు అతనికి శ్రీకృష్ణ దర్శనమయ్యెను. పిదప ధృతరాష్ట్రుడు పాండవులకు అర్ధరాజ్య మిచ్చి వారిని ఇంద్రప్రస్థనగరము నందు నివసింప జేయుట, అప్పుడు నారదునియాజ్ఞచేత పంచపాండవులు ద్రౌపదితో కలియుటకు సమయ (నియమ) నిర్ధారణము మొదలైన విషయములు చెప్పబడినవి. ఈ సందర్భమునందే సుందోపసుందులకథ చెప్పబడెను.

"మునులారా! ఇట్లుండగా నొకనాడు యుధిష్ఠిరుడు ద్రౌపదితో నున్నప్పుడు, అర్జునుడు బ్రాహ్మణ సహాయార్థమై నియమభంగము చేసి, యుధిష్ఠిరుని యింటిలో ప్రవేశించి ఆయుధములు తీసికొని బ్రాహ్మణ వస్తువులను తెచ్చి

యిచ్చెను. అట్లు నియమభంగము చేసినందుకు అర్జునుడు వనమునకు పోయెను. ఈ వనవాస సమయమునందే యతడు ఉలూపిని చేపట్టెను.

"తరువాత, అర్జునుడు తీర్థయాత్రలు చేయుచున్నప్పుడు చిత్రాంగదను పెండ్లియాడి యామె గర్భమునుండి బభ్రువాహనుని కని, ఆ సమీపమునందే యున్న యైదుగురు అప్సర స్త్రీలకు శాపవిముక్తి కలిగించెను. వారు బ్రాహ్మణ శాపము చేత మొసళ్లై మడుగులో పడియుండిరి.

"తరువాత, అర్జునుడు ప్రభాస తీర్థమునందు శ్రీకృష్ణునితో కలిసెను. పిదప, ద్వారకానగరములో సుభద్రార్జునులకు పరస్పర ప్రేమ కలుగుట, కృష్ణుని సమ్మతితో అర్జునుడు సుభద్రను అపహరించుకొని పోవుట, కృష్ణుడు కానుకలతో పాండవులకడకు పోయి సుభద్రార్జునుల వివాహము జరిపించుట, తరువాత, వారికి అభిమన్యుడు జన్మించుటయు చెప్పబడినవి. తరువాత ద్రౌపదికి ఐదుగురు పుత్రులు పుట్టుటకూడ వర్ణింపబడెను.

"మునీశ్వరులారా! తరువాత శ్రీకృష్ణార్జునులు యమునా తీరము నందు విహరించుటకు పోయినప్పుడు వారికి చక్రము, గాండీవ ధనుస్సు లభించుట, ఖాండవవనదహనము మయరాక్షసుని విముక్తి, అగ్ని నుండి సర్పము బ్రతికి పోవుటయు వర్ణింపబడెను. తరువాత, మందపాల మహర్షికి 'శార్ఙ్గి' అను పక్షిణి గర్భమునుండి పుత్రులు పుట్టుట ఈ మొదలైన కథలు విస్తారముగా ఆదిపర్వము నందు చెప్పబడినవి.

"ఆదిపర్వమునందు వ్యాసమహాముని ఇన్నూట యిరువదియేడు (227) అధ్యాయములు, వానిలో ఎనిమిది వేల యెనిమిది నూర్ల యెనుబది నాలుగు (8884) శ్లోకములు రచియించెను.

రెండవది సభాపర్వము. ఈ పర్వమునందు పాండవులు మయసభ నిర్మించుట, కింకరులు అను రాక్షసులను చూచుట; నారదుడు లోకపాలుర సభలను వర్ణించుట, రాజసూయ యజ్ఞారంభము, జరాసంధవధ, గిరివ్రజ నగర మందలి చెరలో నుంచబడిన రాజులను శ్రీకృష్ణుడు విడిపించుట, పాండవుల

దిగ్విజయము, రాజసూయయాగమందు రాజులు కానుకలతో వచ్చుట, శిశుపాల వధ, వర్ణింప బడినవి.

తరువాత ఈ పర్వములోనే, దుర్యోధనుడు పాండవుల వైభవము చూచి ఓర్వ లేక దుఃఖించుట, మయసభా భవనమందు భీమసేనుడు దుర్యోధనుని పరిహసించుటచేత అతనికి క్రోధాగ్ని రగిలి పాండవులను ఓడించుటకు జూదము ఆడగా, దానిలో శకునిచేత ధర్మపుత్రుడు ఓడిపోవుటయు వర్ణింప బడినవి.

సముద్రములో మునిగి యున్న నౌకను పైకి తీసినట్లుగా, ద్యూత సముద్రమందు మునిగి దుఃఖించు చున్న కోడలగు ద్రౌపదిని ధృతరాష్ట్రుడు ఉద్ధరించుట, ఈ సంగతి తెలిసిన దుర్యోధనుడు తండ్రితో పట్టుపట్టి మరల జూదము కొరకు పాండవులను పిలిపించి వారిని ఓడించి, వనమునకు పంపుట, మొదలైన విషయములు వ్యాసమహాముని సభాపర్వమునందు డెబ్బది యెనిమిది (78) అధ్యాయములలో రెండువేల ఐదు నూర్ల పదకొండు (2511) శ్లోకముల చేత వర్ణించి చెప్పెను.

తరువాత అరణ్యపర్వమునందు పాండవులు అరణ్యవాసమునకు పోవు చున్నప్పుడు, పురవాసులు ధర్మరాజును అనుసరించి పోవుట, యుధిష్ఠిరుడు తనతో వచ్చిన బ్రాహ్మణులను పోషించుటకు అన్నము, ఔషధులు పొందుటకై సూర్య భగవానుని ఆరాధించుట, ధౌమ్యమహాముని యుపదేశము చేత వారికి సూర్యునికృప గలిగి అక్షయమైన అన్నపాత్ర దొరకుటయు వర్ణింపబడెను.

అక్కడ విదురుడు ధృతరాష్ట్రునకు హితోపదేశము చేయు చుండెను. కాని ధృతరాష్ట్రుడు విదురుని పరిత్యజించెను. విదురుడు పాండవులకడకు పోవగా అతనిని మరల ధృతరాష్ట్రుడు పిలిపించుకొనుట, దుర్మతి యైన దుర్యోధనుడు, కర్ణుని ప్రోత్సాహము చేత వనమునందున్న పాండవులను చంప దలచుట, దుర్యోధనుని యీదుష్ట భావము తెలిసి వ్యాసుడు వచ్చి అతనిని నిషేధించుటయు వర్ణింప బడినవి. ఈ సందర్భమునందే సురభికథగూడ కలదు.

'అరణ్య' పర్వము నందే కిర్మీరరాక్షసుని భీమసేనుడు వధించుట, పాండవులకడకు వృష్ణి-పాంచాలవంశీయులు వచ్చిమాట్లాడుటయు వర్ణింప బడినవి.

మునులారా! శకుని జూదమునందు కపటముచేత పాండవులను ఓడించె నని తెలిసి శ్రీకృష్ణుడు మిక్కిలి క్రుద్ధుడు కాగా, అర్జునుడు అంజలిబద్ధుడై కృష్ణుని శాంతపరచుట, శ్రీకృష్ణునికడ దుఃఖించుచున్న ద్రౌపదిని కృష్ణుడు ఊరడించుట వర్ణింప బడినవి.

ఈ పర్వమునందే వ్యాసుడు, 'సౌభ' వధకథ చెప్పెను. కృష్ణుడు సుభద్రాభిమన్యులను ద్వారకకు, దృష్టద్యుమ్నుడు ద్రౌపదీ పుత్రులను తనతో తోడ్కొని పోయిరి. పిదప పాండవులు ద్వైతవనమునకు పోయిరి. తరువాత ద్రౌపదీ-యుధిష్ఠిరుల సంవాదము, యుధిష్ఠిర - భీమసేనుల సంవాదమున్ను వర్ణింప బడినవి.

తరువాత వ్యాసుడు వచ్చి యుధిష్ఠిరునకు 'ప్రతిస్మృతి'అను మంత్రమును ఉపదేశించెను. అక్కడనుండి పాండవులు కామ్యక వనమునకు పోవుట, అర్జునుడు దివ్యాస్త్ర ప్రాప్తికై పోయి కిరాతవేషధారియైన పరమేశ్వరునితో యుద్ధము చేయుట, లోకపాలుర దర్శనము, (పాశుపత) దివ్యాస్త్ర ప్రాప్తియు వర్ణింప బడెను.

"తరువాత, అర్జునుడు అస్త్రములు సంపాదించుటకొరకు ఇంద్రలోకమునకు పోవుట, ఆ సంగతి విని ధృతరాష్ట్రుడు మిక్కిలి చింతించుటయు చెప్ప బడెను. తరువాత ధర్మరాజునకు 'బృహదశ్వ' మహాముని దర్శనము, ఆ మునికి తన దుఃఖకథ వినిపించుటయు వర్ణింపబడెను.

"ఈ సందర్భమునందే నలోపాఖ్యానము చెప్పబడినది. దానిలో ధర్మనిష్ఠ ముఖ్యాదర్శము. అది చదివినప్పుడు, వినినప్పుడున్న హృదయములో కరుణ రసము పొంగి పొరలును. దమయంతి ధైర్యము, నలుని చరిత్రము, చదువ దగినవి.

"ఆ బృహదశ్వ మహామునియే పాండవులకు అక్షహృదయ (జూదపు రహస్యము) విద్య ఉపదేశించెను. అక్కడకే 'లోమశ' మహర్షి స్వర్గము నుండి వచ్చి, అర్జునుడు స్వర్గమునందు అస్త్రవిద్య అభ్యసించుచున్న సంగతి పాండవులకు చెప్పెను.

"ఈ పర్వమునందే అర్జునుని సందేశానుసారము పాండవులు తీర్థయాత్ర చేయుట, ఏ యే తీర్థము ఎంత పుణ్యప్రదము అని యిందు వర్ణింపబడినది. తరువాత నారదుడు పులస్త్య తీర్థయాత్రకొరకు ప్రోత్సహింపగా పాండవు లా యాత్ర చేయుట, అక్కడనే ఇంద్రుడు కర్ణుని వంచించి కుండలములను తీసి కొనుట, గయుని యజ్ఞ వైభవమున్ను చెప్పబడినవి. తరువాత అగస్త్య చరిత్రము, అందులో వాతాపిభక్షణ కథ, అగస్త్యుడు సంతతికొరకు లోపాముద్రతో సమాగమము చేయుటయు వర్ణింపబడినవి.

తరువాత, బ్రహ్మచారియైన ఋష్యశృంగుని చరిత్రము, పరశురాముని చరిత్రము, దీనిలోనే కార్తవీర్యార్జునుని యొక్క, హైహయవంశ రాజులయొక్క వధయు వర్ణింపబడినది. ఇందులోనే ప్రభాస తీర్థమునందు పాండవ - యాదవుల సమాగమము గూడ చెప్పబడినది.

మునీశ్వరులార ! తరువాత సుకన్యోపాఖ్యానము కలదు. దీనిలో భృగు నందనుడైన చ్యవనుడు శర్యాతిరాజు చేసిన యజ్ఞమునందు అశ్వినీ కుమారులను సోమపానమునకు అధికారులను చేసెను. అప్పుడు అశ్వినీకుమారులు చ్యవన మహామునిని వృద్ధాప్యము నుండి యువకుని చేసిరి. మాంధాతృరాజుకథ, జంతూ పాఖ్యానములో సోమకరాజు అనేక పుత్రులను కనుటకు ఒక పుత్రుని బలి ఇచ్చి యజ్ఞము చేయుట, దానికి ఫలముగా అతడు నూరుగురు పుత్రులను కనుటయు ఈ పర్వములో కలవు.

మునులారా! తరువాత, శ్యేన (డేగ) - కపోత (పావురము) ముల యుపాఖ్యానములో ఇంద్రుడు, అగ్నియు శిబిచక్రవర్తిధర్మమును పరీక్షించుటకు వచ్చుట, అష్టావక్ర చరిత్రలో 'బంది' యనువానితో జనకమహారాజు యజ్ఞము నందు అష్టావక్రునకు జరిగిన శాస్త్రార్థము వర్ణింప బడుటయు గలవు. ఆ బంది వరుణుని పుత్రుడు. అతడు న్యాయశాస్త్ర పండితులలో నగ్రగణ్యుడుగా నుండెను. ఆతనిని అష్టావక్ర మహాముని శాస్త్రవాదములో జయించి సముద్రమునందు వేయబడిన తన తండ్రిని ఉద్ధరించెను. దాని తరువాత యవక్రీత - రైభ్యులయు పాఖ్యానము ఉన్నది.

మునీశ్వరులారా ! తరువాత, పాండవుల గంధమాదనయాత్ర, వారు నారాయణాశ్రమమునందు నివసించుటయు వర్ణింపబడినవి. సౌగంధిక కమలము

తెచ్చుటకు భీముని ద్రౌపది గంధమాదన పర్వతమునకు పంపెను. భీముడు పోవునప్పుడు మార్గములో కదళీవనమందు హనుమంతుని దర్శించెను. ఇక్కడనే సౌగంధిక కమలముకొరకు సరస్సులో ప్రవేశించి భీముడు సరస్సును మథించెను. ఇక్కడ భీమసేనునకు రాక్షసులతో, మణిమంతుడు మొదలైన యక్షులతోను మహాయుద్ధము జరిగెను.

“మునులారా! తరువాత, భీమసేనుడు జటాసురుని వధించెను. అక్కడి నుండి పాండవులు వృషపర్వునియొక్క, ఆర్ష్టిషేణునియొక్కయు ఆశ్రమములకు పోయి నివసించిరి. అక్కడినుండి భీమసేనుడు ద్రౌపది ప్రోత్సాహముతో కైలాసమునకు పోయి మణిమంతుడు మొదలైన యక్షులతో యుద్ధము చేసెను, అక్కడ పాండవులకు కుబేరునితో సమాగమము, అర్జునుడు స్వర్గమునుండివచ్చి సోదరులతో కలిసికొనుటయు జరిగెను నివాతకవచ కాలకేయాదిరాక్షసులతో యుద్ధముచేసి వారిని వధించుట యుధిష్ఠిరునకు తెలిపెను. అర్జునుడు యుధిష్ఠిరునకు తన శస్త్రాస్త్రముల ప్రదర్శనము చేయుచుండగా, నారదుడు వచ్చి అర్జునుని ఆపెను.

మునీశ్వరులారా! పాండవులు గంధమాదనమునుండి దిగుచుండగా నొక దుర్గమవనమునందు పర్వతమువంటి అజగర సర్పము భీమసేనుని పట్టుకొనెను. అప్పుడు ధర్మరాజు అజగరవేషధారి యైన నహుషుని ప్రశ్నములకు ఉత్తరములు చెప్పి భీముని విడిపించెను. అక్కడినుండి పాండవులు కామ్యకవనమునకు పోయి, అక్కడ నివసించుచున్నప్పుడు శ్రీకృష్ణుడు వచ్చి వారిని చూచెను. అక్కడ పాండవులతో మార్కండేయమహాముని కలిసి వారికి వేనపుత్రుడైన పృథుచక్రవర్తి కథ, ఇంకను అనేకకథలు చెప్పెను.

“మునులారా! ఈ సందర్భములోనే తార్క్ష్యమహామునికి సరస్వతికిన్ని జరిగిన సంవాదము, మత్స్యోపాఖ్యానము అనేక పురాణ కథలు, ఇంద్రద్యుమ్న-ధుంధుమారోపాఖ్యానములు, పతివ్రతకు, అంగిరసునకున్ను సంబంధించినకథ, ద్రౌపదీ-సత్యభామల సంవాదమున్ను ఉన్నవి.

“మునీశ్వరులారా! తరువాత, పాండవులు ద్వైతవనమునకు పోయిరి. అక్కడ కౌరవులు ఘోషయాత్రచేసిరి. అప్పుడు గంధర్వులు దుర్యోధనుని

చెరబట్టికొనిపోవుచుండగా అర్జునుడు వారితో యుద్ధముచేసి దుర్యోధనుని విడిపించుకొని తెచ్చెను. తరువాత యుధిష్ఠిరునకు స్వప్నమునందు జింక కనుపించెను. పాండవులు మరల కామ్యకవనమునకు పోయిరి. ఈ సందర్భము లోనే వ్రీహిద్రౌణికోపాఖ్యానము విస్తారముగా చెప్పబడినది. దీనిలోనిదుర్వాసుని యుపాఖ్యానము సైంధవుడు ద్రౌపదిని అపహరించుకొనిపోవుట, భీముడు సైంధవుని వెన్నంటి పోయి పట్టుకొని తెచ్చి అతనికి శిరోముండనముచేసి పంచశిఖలు పెట్టుటయు వర్ణింపబడెను.

"మునులారా! అరణ్యపర్వమునందే రామాయణకథ విస్తారముగ చెప్పబడినది. ఇందులోనే సావిత్రియుపాఖ్యానము, ఇంద్రుడు కర్ణుని వంచించి కుండలములు తీసికొనుట, ఇంద్రుడు కర్ణునకు, ఒక వీరుని మాత్రము చంప గల శక్తియాయుధము నిచ్చుట, ఆరణేయోపాఖ్యానము, దానిలో యముడు తన కొడుకైన యుధిష్ఠిరునకు విద్య నేర్పుట యమునినుండి పాండవులు వరములు పడసి పశ్చిమదిక్కునకు ప్రయాణము చేయుటయు వర్ణింపబడినవి.

"మునులారా! మూడవదైన ఈయరణ్య పర్వములోని కథలు సంగ్రహముగా చెప్పబడెను. ఈ పర్వములో ఇన్నూట అరువది తొమ్మిది (269) అధ్యాయములు, పదకొండువేల ఆరునూర్ల అరువది నాలుగు (11,664) శ్లోకములు కలవు. ఇక విరాటపర్వసంగ్రహము వినుడు.

మునీశ్వరులులారా! పాండవులు విరాటనగరమునకు పోయి శ్మశానముకడ నున్న శమీ (జమ్మి) వృక్షముపై తమ శస్త్రాస్త్రములు పెట్టి మారువేషములతో నగర ప్రవేశము చేసి నివసించిరి. దుష్టకీచకుడు కామమోహితుడై ద్రౌపదిని వెన్నంటి భీమునిచేత చంప బడెను.

మునులారా! దుర్యోధనుడు అజ్ఞాతవాసములో నున్న పాండవులను కనుగొనుటకు అనేక గూఢచారులను అన్ని వైపులకు పంపెను. కాని, వారి యునికి అతనికి తెలియ లేదు. త్రిగర్తులు విరాటుని గోవులను అపహరింపగా, వారితో విరాటునకు జరిగిన యుద్ధములో వారు విరాటుని బంధింపగా, భీముడు విడిపించెను. తరువాత పాండవులు గోవులను విడిపించుకొని తెచ్చిరి. ఇది దక్షిణ గోగ్రహణ కథా సంగ్రహము.

మునీశ్వరులారా! తరువాత కౌరవులు విరాటనగరమునకు ఉత్తర దిక్కునందున్న గోవులను పట్టుకొనగా అర్జునుడు పరాక్రమించి, కౌరవులను జయించి గోధనమును విడిపించుకొని తెచ్చెను. ఇది ఉత్తర గోగ్రహణకథ.

మునులారా! విరాటరాజు పాండవులను గుర్తించి, ఆదరించి తన కూతురు ఉత్తరను అభిమన్యున కిచ్చి పెండ్లిచేసెను. నాలుగవదైన విరాటపర్వమునందు అరువదియేడు (67) అధ్యాయములు రెండువేలయేబది (2050) శ్లోకములు నున్నవి. ఇక ఉద్యోగపర్వ సంగ్రహము వినుడు.

మునీశ్వరులారా! పాండవులు ఉపప్లావ్య నగరంలో నున్నపుడు అర్జున-దుర్యోధనులు శ్రీకృష్ణునికడకు యుద్ధసహాయము కోరుటకు పోవగా, శ్రీకృష్ణుడు, 'మీరిరువురు నాకు సమానులే! నేను యుద్ధము చేయక మీలో నొకనికి మంత్రిగా నుండెదను. రెండవ వానికి ఒక అక్షౌహిణీసేనను ఇచ్చెదను. మీకు ఏది కావలెనో కోరుకొనుడు' అని యనగా మూర్ఖుడైన దుర్యోధనుడు స్వార్థ బుద్ధితో సేనను కోరుకొనెను. 'కృష్ణుడు యుద్ధము చేయకున్నను నాకు మంత్రిగా నుండుగాక!' అని అర్జునుడు శ్రీకృష్ణుని కోరుకొనెను.

మునులారా! మద్రదేశాధిపతియైన శల్యుడు పాండవులవైపు యుద్ధము చేయుటకు పోవు చుండగా మార్గమధ్యములో దుర్యోధను డతనికి కానుక లిచ్చి, పూజలు చేసి, 'నాకు సహాయము చేయుము' అని వర మడుగగా శల్యుడు 'అట్లే!' యని ప్రతిజ్ఞ చేసెను. తరువాత నతడు పాండవులకడకు పోయి ఆ విషయము వారికి తెలిపెను. ఈ సందర్భమునందే శల్యుడు ఇంద్రుని విజయ కథ చెప్పెను.

మునీశ్వరులారా! తరువాత పాండవులు తమ పురోహితుని కౌరవుల యొద్దకు పంపగా ధృతరాష్ట్రుడు ఇంద్రవిజయ విషయము విని పురోహితుని రాకను మెచ్చుకొనెను. తరువాత ధృతరాష్ట్రుడు శాంతికొరకు సంజయుని రాయబారిగా పాండవులకడకు పంపెను.

మునులారా! శ్రీకృష్ణుడు పాండవులకు మంత్రిగా నున్నసంగతి ధృతరాష్ట్రుడు విని చింతతో నిద్ర రాక బాధపడెను. అప్పుడు విదురు డతనికి అనేక

నీతులు బోధించెను. (అదియే 'విదురనీతి' యని ప్రసిద్ధముగా నున్నది.)తరువాత సనత్సుజాతుడు ధృతరాష్ట్రునకు అధ్యాత్మవిద్య బోధించెను. సంజయుడు మరునాటి ప్రాతఃకాలము నందు సభలో కృష్ణార్జునుల యేకాత్మత్త్వము, మైత్రియు తెలిపెను.

మునులారా ! అప్పుడు శ్రీకృష్ణుడు సంధి చేయుటకు కౌరవుల యొద్దకు రాయబారిగా పోయెను. అతడు ఇరుపక్షముల హితము కోరుచున్నను, అతని మాట దుర్యోధనుడు తిరస్కరించెను. ఈ సందర్భమునందే 'దంభోద్భవ' కథ మాతలి తనకన్యకు వరుని వెతకుట, గాలవచరిత్ర, 'విదులోపాఖ్యానము' - చెప్పబడెను. కర్ణ - దుర్యోధనులు శ్రీకృష్ణుని బంధింప దలచిన సంగతి తెలిసి శ్రీకృష్ణుడు విశ్వరూపము చూపుట వర్ణింప బడెను.

మునీంద్రులారా ! శ్రీకృష్ణుడు కర్ణుని పాండవ పక్షమునకు రమ్మని కోరినను, అతడు అహంకారముతో నిరాకరించుట.శ్రీకృష్ణుడు ఉపప్లవ్య నగరమునకు తిరిగి వచ్చి, జరిగిన సంగతి పాండవులకు చెప్పుట, అది విని పాండవులు యుద్ధసన్నద్ధు లగుటయు వర్ణింప బడెను.

మునులారా ! చతురంగ సేనాగణనము, దుర్యోధనుడు ఉలూకుని దూతగా పాండవుల యొద్దకు పంపుట, అతిరథ - మహారథుల స్వరూప నిర్ణయము, అంబోపాఖ్యానమున్ను, ఉద్యోగ- పర్వమునందు వర్ణింప పడినవి. ఇందులో శ్రీకృష్ణుని సంధి సందేశము, ఉలూకుని విగ్రహసందేశము ముఖ్యములు. ఉద్యోగపర్వములో నూటయెనుబదియారు (186) అధ్యాయములు, ఆరువేల ఆరునూర్ల తొంబది యెనిమిది (6698) శ్లోకములు కలవు.

మునులారా! ఇక ఆరవ దైన భీష్మపర్వ కథా సంగ్రహము వినుడు ఈ పర్వములో సంజయుడు జంబూద్వీపరచనను గూర్చి చెప్పెను. పది దినములు జరిగిన ఘోరయుద్ధము ఇందు వర్ణింప బడినది. ఈ యుద్ధములో యుధిష్ఠిరుని సేన మిక్కిలి బాధపడెను. యుద్ధారంభములోనే శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు భగవద్గీత బోధించెను. ఇందులోనే అర్జునుడు శిథిలు డగుట చూచి శ్రీకృష్ణుడు చేర్లకోల (కొరడా) తీసికొని భీష్ముని సంహరించుటకు రథమునుండి క్రిమికి ఉరుకుటయు వర్ణింప బడినది అప్పుడే కృష్ణుడు వ్యంగ్య వచనము

లనెడు చబుకుతో అర్జునుని మర్మములను గాయపరచెను. అప్పుడర్జునుడు శిఖండిని ముందిడుకొని భీష్ముని బాణములతో కొట్టి పడగొట్టగా, భీష్ముడు బాణశయ్యపై శయనించెను. ఈ కథలన్నియు ఈ పర్వమునందు విస్తారముగ చెప్ప బడెను. ఈ పర్వములో నూట పదియేడు (117) అధ్యాయములు; ఐదువేల ఎనిమిదినూర్ల ఎనుబది నాలుగు (5884) శ్లోకములు కలవు.

ఇక ఏడవ దైన ద్రోణపర్వ సంగ్రహము వినుడు.

మునీశ్వరులారా! ఇందులో ద్రోణాచార్యుడు సైన్యాధిపత్యమునందు అభిషిక్తుడగును. ఆచార్య ద్రోణుడు యుధిష్ఠిరుని బంధించి తెచ్చెద నని దుర్యోధనునకు ప్రతిజ్ఞ చేసెను. సంశప్తకులు అర్జునుని దూరముగ యుద్ధమునకు తీసికొని పోయిరి. ఐరావత వంశీయమైన 'సుప్రతీ'క మను గజముతో భగదత్తుడు అర్జునునితో పోరాడి మరణించెను. యువకశూరు డైన అభిమన్యుని పలువురు చుట్టుముట్టి వధించిరి. దానిచేత అతిక్రుద్ధు డైన - అర్జునుడు ఆనాడు ఏడు అక్షౌహిణీసేనలను సంహరించి, సైంధవవధ చేసెను. భీమ సాత్యకులు అర్జునుని వెదకుటకు సేనలో ప్రవేశించిరి. అర్జునుడు, సంశప్తకులలో త్రావగా మిగిలిన తొమ్మిదికోట్ల సైనికులను సంహరించెను. ధృతరాష్ట్ర పుత్రులు, మ్లేచ్ఛ-నారాయణ సైనికులు, అలంబుష-శ్రుతాయుస్-జలసంధ-భూరిశ్రవస్-విరాట-ద్రుపద-ఘటోత్కచాదివీరులున్ను ఈ యుద్ధములో సంహరింప బడిరి. తండ్రి-ద్రోణచార్యుడు చంప బడుటచేత కుపితు డైన అశ్వత్థామ నారాయణాస్త్రమును ప్రయోగించెను. ఆగ్నేయాస్త్రము, రుద్రమహిమయు వర్ణింపబడినవి. ఈ యేడవ ద్రోణపర్వమునందు ముఖ్యులైన రాజవీరులు చంప బడిరి. దీనిలో వ్యాసుడు ఓ నూట డెబ్బది (170) అధ్యాయములలో ఎనిమిదివేల తొమ్మిదినూర్ల తొమ్మిది (8909) శ్లోకములు రచించెను.

మునులారా! ఎనిమిదవ దైనకర్ణపర్వసంగ్రహము వినుడు.

ఇందులోనే శల్యుడు కర్ణునకు సారథ్యము చేయుట, పురాణప్రసిద్ధ మైన త్రిపురసంహారకథ, యుద్ధమునకు పోవునప్పుడు కర్ణ-శల్యులకు జరిగిన సంభాషణము, హంస కాకీయోపాఖ్యానము, అశ్వత్థామ పాండ్యుని వధించుట, దండసేనవధ, దండువధ, కర్ణయుధిష్ఠిరుల ద్వైరథయుద్ధమునందు కర్ణుడు

యుధిష్ఠిరుని ప్రాణసంకటావస్థకు తెచ్చుట, అర్జున-యుధిష్ఠిరుల పరస్పర క్రోధ భాషణము, కృష్ణుడు అర్జునుని శాంతపరచుట, భీముడు తన ప్రతిజ్ఞప్రకారము దుశ్శాసనునియెద చీల్చి రక్తము త్రాగుట, అర్జునుడు ద్వంద్వయుద్ధములో కర్ణుని పడగొట్టుటయు **కర్ణపర్వములో** వర్ణింప బడినవి. ఇందులో అరువది తొమ్మిది (69) అధ్యాయములలో వ్యాసుడు నాలుగువే తొమ్మిదినూర్ల అరువది నాలుగు (4964) శ్లోకములు రచియించెను.

మునులారా! యిక శల్యపర్వసంగ్రహము వినుడు.

కౌరవసేనావీరు లందరు మరణించిన తరువాత శల్యుడు కౌరవసేనాపతి యాయెను. ఇందులో కుమారస్వామియుపాఖ్యానము, అభిషేకకర్మ, రథికుల విభాగపూర్వక యుద్ధము, కురుకులమునందలి ప్రముఖవీరుల వినాశము, యుధిష్ఠిరుడు శల్యుని వధించుట, సహదేవుడు శకునిని సంహరించుట, కౌరవసేన అత్యధికసంఖ్యలో చచ్చుట, కొద్దిసేన మిగులగా, దుర్యోధనుడు సరస్సులో ప్రవేశించి జలస్తంభన విద్యచేత అక్కడ విశ్రాంతి తీసికొనుట, అక్కడ అత డున్నట్లు వ్యాధులు భీమునకు చెప్పుట, యుధిష్ఠిరుని ఆక్షేపవచనములచేత దుర్యోధనుడు అమర్షముతో సరస్సునుండి బయలువెడలి భీమునితో గదా యుద్ధముచేయుట, ఆ సమయమునం దక్కడకు బలరాముడు వచ్చుట, సరస్వతీనది తీరమునందలి తీర్థముల మాహాత్మ్య వర్ణనము, భీమదుర్యోధనుల భయంకర గదా యుద్ధము, భీముడు (యుద్ధనియమభంగముచేసి) మొండిపట్టుతో దుర్యోధనుని తొడలను గదతో విరుగగొట్టుట, ఈ మొదలగు విషయములు గల తొమ్మిదవ పర్వము సమాప్తమాయెను. దీనిలో వ్యాసుడు ఏబదితొమ్మిదవ(59) అధ్యాయములలో మూడువేల రెండునూర్ల యిరువది (3220) శ్లోకములు రచియించెను.

మునులారా! యిక సౌప్తిక పర్వసంగ్రహము చెప్పెద వినుడు.

పాండవులు వెడలిపోయిన తరువాత దుర్యోధనుడు తొడలు విరిగి రక్తసిక్తుడై పడి యుండగా, అక్కడికి సాయంకాలమునందు కృప - కృతవర్మ - అశ్వత్థామలు వచ్చి యుద్ధరంగమందు పడి యున్న దుర్యోధనుని దుర్దశ చూచి) అశ్వత్థామ మిక్కిలి క్రుద్ధుడై, 'నేను ధృష్టద్యుమ్నాది సమస్త పాంచాలురను,

మంత్రి సహిత సమస్తపాండవులనున్ను వధించక నా కవచము వీడను' అని ప్రతిజ్ఞ చేసెను.

ఆ ముగ్గురు మహారథికులు ఈ విషయము దుర్యోధనునకు చెప్పి, సూర్యాస్తమయ మగు చుండగా, ఒక పెద్ద వనమునకు పోయి అక్కడ ఒక వట వృక్షము క్రింద విశ్రాంతి తీసికొను చుండిరి. అక్కడకు ఆ రాత్రి ఒక గుడ్లగూబ వచ్చి అనేక కాకులను చంపెను అది చూచి క్రుద్ధుడైన అశ్వత్థామకు తన తండ్రిని అన్యాయముగా చంపిన సంఘటనము జ్ఞప్తికి వచ్చి, నిద్రించు చున్న పాంచాలురను చంపవలె నని నిశ్చయించుకొనెను.

తరువాత అశ్వత్థామ పాండవశిబిర ద్వారమునకు పోయి అక్కడ ఒక భయంకరరాక్షసు డుండుట చూచెను. ఆ రాక్షసుడు భూమినుండి ఆకాశము వరకు వ్యాపించి యుండెను. అతడు అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రములను నష్టపరచు చుండగా, అశ్వత్థామ భగవంతుడైన రుద్రుని ఆరాధించి ఆ దేవుని ప్రసన్నుని చేసికొని ఆయన యనుగ్రహము చేత అక్కడ నిర్భయముగా నిద్రించు చున్న ధృష్టద్యుమ్నాది పాంచాలురను, వారి పరిజనులను కృతవర్మ-కృపాచార్యుల సహాయముతో సంహరించెను.

మునీశ్వరులారా! అప్పుడు శ్రీకృష్ణ భగవానుని ఆశ్రయించిన పంచ పాండవులు, సాత్యకి మాత్రమే చావక మిగిలిరి. అప్పుడు ధృష్టద్యుమ్నుని సారథి పాండవుల కడకు పోయి 'నిద్రించు చున్న పాంచాలురను అశ్వత్థామ వధించెను'. అని చెప్పగా ద్రౌపది పుత్రశోక పీడితురాలై, తనతండ్రి - సోదరుల హత్యచేత వ్యథచెంది ఆమె 'అశ్వత్థామకు ప్రతిక్రియ చేయవలసిన' దని పతులను ఉత్తేజ పరచుచు మరణాంతము నిరశన వ్రతము సంకల్పించి అన్న పానీయములు విడిచి యుండగా, భీమసేనుడు ఆమెకు ప్రియము చేయ గోరి, గదాధారి యై క్రోధముతో అశ్వత్థామను వెన్నంటి పరుగెత్తగా, భయముచేత, దైవప్రేరణ చేతను అశ్వత్థామ పాండవవంశ వినాశము కొరకు దివ్యాస్త్రమును ప్రయోగించెను.

మునులారా! అప్పుడు శ్రీకృష్ణభగవానుడు అశ్వత్థామను శాంతపరచుచు 'అట్లు చేయకుము, పాండవులు నశింపగూడదు' అని చెప్పెను. వెంటనే అర్జునుడు

దివ్యాస్త్రముతో అశ్వత్థామాస్త్రమును నష్టపరచెను. అప్పుడు అశ్వత్థామయొక్క ద్రోహచింత చూచి శ్రీకృష్ణ - వ్యాసులు అశ్వత్థామను, అశ్వత్థామ ఆ ఇరువురకున్ను పరస్పరము శాపములు ఇచ్చుకొనిరి.

మునులారా! అప్పుడు పాండవులు అశ్వత్థామమణిని లాగుకొని ద్రౌపదికి ఇచ్చిరి. ఈ వృత్తాంతము లన్నియు గల పదవదైన సౌప్తిక పర్వమునందు వ్యాసుడు పదునెనిమిది (18) అధ్యాయములలో ఎనిమిది నూర్ల డెబ్బది (870) శ్లోకములు రచియించెను. వ్యాసుడు ఈ సౌప్తిక పర్వమునందే ఐషీకపర్వకథలు గూడ చేర్చెను.

మునులారా! ఇక కరుణరసపూరిత మైన స్త్రీ పర్వ సంగ్రహము వినుడు.

ధృతరాష్ట్రుడు పుత్రశోకసంతప్తుడై భీమునియందు ద్రోహము తల పెట్టి తనకడకు శ్రీకృష్ణుడు తెచ్చిన లోహప్రతిమ భీమసేనుడే యని తలచి తన భుజములతో అదిమి చూర్ణము చేసెను. అప్పుడు పుత్రశోకపీడితు డైన ధృత రాష్ట్రునకు విదురుడు మోక్షసాక్షాత్కారోపయోగము లైన యుక్తులను చెప్పి సంసారము దుఃఖరూప మని ప్రతిపాదించుచు అతనిని సంపూర్ణముగా శాంత పరచెను.

ఈ పర్వమునందే శోకవ్యాకులముతో నున్న ధృతరాష్ట్రుని యంతఃపుర స్త్రీలు యుద్ధమునకు పోవుట వర్ణింపబడినది. అక్కడనే వీరపత్నులయొక్క దయనీయమైన విలాపము, గాంధారీ-ధృతరాష్ట్రులు క్రోధముచేత మూర్ఛితు లగుటయు వర్ణింపబడినది.

అప్పుడు క్షత్రియస్త్రీలు యుద్ధములో చచ్చి పడి యున్న తమ పితృ-పతి-పుత్ర సోదరులను చూచి దుఃఖించిరి. అప్పుడు పుత్ర-పౌత్రులవధచేత పీడితురాలైన గాంధారికడకు శ్రీకృష్ణభగవానుడు వచ్చి ఆమెను శాంతపరచిన ప్రసంగము గూడ ఈపర్వములో కలదు.

యుధిష్ఠిరుడు మరణించిన రాజులకు శాస్త్రోక్తముగ దహనసంస్కారములు, జలతర్పణములు చేయుచున్నప్పుడు కుంతీదేవి తనకు రహస్యముగ కర్ణుడు పుట్టిన సంగతి తెలిసిన వృత్తాంతము గూడ వర్ణింప బడెను. వ్యాసభగవానుడు శోక వ్యాకులకర మైనయీ పదకొండవ స్త్రీ పర్వము రచించి అందరను విద్వాంసు

లను చేసెను. ఈ పర్వము నందువ్యాసుడు ఇరువదిఏడు (27) అధ్యాయములలో ఏడునూర్ల డెబ్బదియైదు (775) శ్లోకములు రచియించెను.

మునీశ్వరులారా ! శాంతి పర్వ సంగ్రహము చెప్పెద వినుడు.

ఇందలి వృత్తాంతములు బుద్ధిని, వివేకమును పెంచును. యుధిష్ఠిరునకు పితృ - గురు - భ్రాతృ - పుత్ర - బంధు - మాతుల - శ్వశురాదులను యుద్ధ మునందు చంపించుటచేత మిక్కిలి దుఃఖము, వైరాగ్యము కలిగెను. ఈ పర్వ ములో శరతల్పముపై నున్న భీష్ముని ధర్మోపదేశములు వర్ణింప బడినవి. జ్ఞానేచ్ఛ గల రాజులు అధర్మములు తెలిసికొనవలెను.

ఇందులో కాల - కారణములకు, దేశ - కాలములకున్ను, అనుగుణముగ వ్యవహరింప దగిన ఆపద్ధర్మములు నిరూపింప బడినవి. వానిని బాగుగా తెలిసి కొనిన వారు సర్వజ్ఞు లగుదురు. ఇందులో విస్తారముగా మోక్ష ధర్మములుకూడ ప్రతిపాదింప బడినవి. పన్నెండవ దైన యీ శాంతి పర్వతమునందు వ్యాసభగ వానుడు మున్నూట ముప్పది తొమ్మిది (339) అధ్యాయములలో పదునాల్గువేల ఏడునూర్ల ముప్పది రెండు (14732) శ్లోకములు రచియించెను.

మునీశ్వరులారా! ఇక అనుశాసన పర్వ సంగ్రహము వినుడు. ఇందులో యుధిష్ఠిరుడు భీష్మునినుండి ధర్మసిద్ధాంతములు విని శాంతిల్లెను. ఇందులో ధర్మార్థ హితకరములైన ఆచార వ్యవహారముల నిరూపణముతోపాటు వివిధ దాన ఫలములుగూడ చెప్పబడినవి. దానమునకు పాత్రుడు, దానవిధి, ఆచారము- దాని విధానము, సత్యభాషణము యొక్క యుత్కృష్టత, గో-బ్రాహ్మణుల మహిమ, ధర్మ రహస్యములు, దేశ (తీర్థ)- కాల (పర్వ)ముల మహిమయు ఈ పర్వము నందు వర్ణింపబడినవి. దీనిలోనే భీష్ముని స్వర్గప్రాప్తిగూడ చెప్ప బడినది. ధర్మ నిర్ణయము చేయు పదుమూడవదైన యీ అనుశాసన పర్వము నందు నూట నలువది యారు (146) అధ్యాయములలో వ్యాసుడు ఎనిమిది వేల శ్లోకములు (8000) రచియించెను.

మునీశ్వరులారా! ఇక ఆశ్వమేధిక పర్వ సంగ్రహము వినుడు.

ఇందులో సంవర్త-మరుత్తుల యుపాఖ్యానము కలదు. యుధిష్ఠిరునకు సువర్ణ ధనాగార ప్రాప్తి, పరీక్షిత్తు జన్మయున్ను వర్ణింపబడినవి. పూర్వము

అశ్వత్థామ యొక్క అస్త్రాగ్ని చేత దగ్ధుడైన పరీక్షిత్తు శ్రీకృష్ణానుగ్రహము చేత మరల జీవించుట, సమస్త రాష్ట్రములలో తిరుగుటకొరకు విడువబడిన అశ్వమేధాశ్వము వెంట అర్జునుడు పోవుట, అతడు ఆయా దేశముల రాజకుమారులతో యుద్ధము చేయుటయు వర్ణింపబడినవి. పుత్రికా ధర్మానుసారముగ పుట్టిన చిత్రాంగద కుమారుడైన బభ్రువాహనుడు యుద్ధము నందు అర్జునుని ప్రాణ సంకటావస్థకు తెచ్చిన కథ గూడ ఈ పర్వమునందు వర్ణితమైనది. అశ్వమేధయాగమునందు నకులోపాఖ్యానము చెప్పబడినది. పదునాలుగవదైన యీ అశ్వమేధిక పర్వమునందు వ్యాసభగవానుడు నూటమూడు (103) అధ్యాయములలో మూడు వేల మున్నూట ఇరువది (3320) శ్లోకములు రచియించెను.

మునీశ్వరులారా! ఇక ఆశ్రమవాసిక పర్వ-సంగ్రహము వినుడు.

దీనిలో గాంధారీ - ధృతరాష్ట్ర - విదురులు రాజ్యము విడిచి వానప్రస్థాశ్రమమునకు పోవుట, వారితోపాటే కుంతీదేవి గూడ గురుజనసేవానురక్తయై తన పుత్రుల రాజ్యము విడిచిపోవుటయు వర్ణింపబడినవి.

ఇందులోనే వ్యాసానుగ్రహముచేత గాంధారీ - ధృతరాష్ట్రులు యుద్ధములో చచ్చి పరలోకమునకు పోయిన పుత్ర - పౌత్రులు, అనేక రాజులు తమకడకు వచ్చుట చూచి దుఃఖము విడిచి ఉత్తమసిద్ధిని పొందుట, విదురుడుగూడ ఉత్తమ గతికి పోవుట, మంత్రులతోపాటు గవల్గణపుత్రుడైన సంజయుడు గూడ ఉత్తమ లోకమునకు పోవుట, నారదుడు ధర్మరాజునకు కనపడి యాదవు సంహారమును గూర్చి చెప్పుట మొదలైన విషయములు పదునేనవదైన ఆశ్రమవాసికపర్వము నందు చెప్పబడినవి. దీనిలో వ్యాసుడు నలువది రెండు (42) అధ్యాయములు ఒక వేయి ఐదు నూట ఆరు (1506) శ్లోకములు రచియించెను.

మునీశ్వరులారా! ఇక మౌసల పర్వసంగ్రహము వినుడు.

ఇందులో యాదవవీరులు ఉప్పుసముద్రపు తీరమునందు పరస్పరము యుద్ధము చేసి, అస్త్ర-శస్త్రములను స్పృశించిన మాత్రముచేత మరణించిరి. బ్రాహ్మణశాపము చేత పూర్వమే వారు నలగగొట్టబడి యుండిరి. వారందరు

మద్యశాలకు పోయి నిండుగా త్రాగి మైకములో తెలివి తప్పి దైవప్రేరణచేత పరస్పరము కలహించి పరకా (జమ్మిగడ్డి) యనెడి వజ్రములచేత ఒండొరులు కొట్టుకొని మరణించిరి.

అక్కడ సర్వసమర్థులైన శ్రీకృష్ణ - బలరాములుగూడ సర్వసంహారకారి యైన కాలమును ఉల్లంఘించ జాలక పోయిరి. (మహర్షులవాక్కు సత్యము చేయుటకు కాలముయొక్క ఆదేశమును ఆ యిరువురు స్వేచ్ఛగా అంగీకరించిరి.)

ఆపర్వమునందే అర్జునుడు ద్వారకాపురికి వచ్చి, దుఃఖించుచుండగా వృష్ణివంశీయులు చూచి వ్యాకులపడిరి. అర్జునుడు తనమామ యైన వసుదేవునకు దహనసంస్కారాదులు చేసి, 'ఆపాన' స్థానము (మద్యశాల) నకు పోయి యాదవులు చచ్చి పడియుండుట చూచి, శ్రీకృష్ణ - బలరామ శరీరములకు, ఇతర వృష్ణి వంశీయ ప్రధానుల శరీరములకున్ను దాహసంస్కారాదులు చేసెను.

తరువాత అర్జునుడు స్త్రీ-బాల-వృద్ధులతో ద్వారకనుండి ప్రయాణము చేసెను. కాని, దుఃఖకరమైన ఆ విపత్తిలో గాండీవధనుస్సు - ముందెప్పుడున్ను లేని పరాజయము చూచెను. అతడు అప్రసన్నుడై, తనదివ్యాస్త్రముల నన్నింటిని మఱచెను యాదవ స్త్రీలు చూచుచుండగనే అస్త్రములు పోవుట, తన ప్రభావము సన్నగిల్లుటయు చూచి అర్జునుడు మిక్కిలి దుఃఖము, వైరాగ్యమున్ను పొందెను.

తరువాత అతడు వ్యాసోపదేశముచేత యుధిష్ఠిరునితో కలిసి, సన్యాసము నందు ఇష్టము చూపెను. ఇట్లు పదియారవదైన మౌసలపర్వము నందు వ్యాసుడు ఎనిమిది (8) అధ్యాయములలో మున్నూట ఇరువది (320) శ్లోకములు రచియించెను.

మునీశ్వరులారా! ఇక మహాప్రస్థానికపర్వ సంగ్రహము వినుడు.

ఇందులో పాండవులు రాజ్యము విడిచి ద్రౌపదితో *మహాప్రస్థాన మార్గమునందు పోయిరి. ఈ ప్రయాణములో పాండవులు ఎఱ్ఱ సముద్రము చేరి

* ఇల్లు విడిచి నిరాహారుడై స్వేచ్ఛగా మృత్యువును వరించుటకు వెడలుట. వేరు వేరు దిక్కులందు తిరుగుచు చివరకు ఉత్తర దిక్కునందున్న హిమాలయమువైపు పోవుట 'మహాప్రస్థాన' మనబడును. పాండవు లట్లే చేసిరి.

అక్కడ అగ్నిదేవుని చూచి ఆ దేవుని ప్రేరణచేత అర్జునుడు ఆ మహాత్మునకు సాదరముగ దివ్యగాండీవము సమర్పించెను.

ఆ పర్వమునందే యుధిష్ఠిరుడు మార్గములో తన తమ్ములు, ద్రౌపది యన్నప్పటికిన్ని వారిపరిస్థితి తెలిసికొనుటకుగూడ అతడు వెనుకకు తిరిగిచూడక వారిని విడిచి ముందుకు సాగి పోయెను. పదియేడవ దైన మహాప్రస్థానిక పర్వమునందు వ్యాసుడు మూడు (3) అధ్యాయములలో నూటఇరువదిమూడు (123) శ్లోకములు రచియించెను.

మునీశ్వరులారా! ఇక స్వర్గారోహణపర్వమును గూర్చి వినుడు.

ఇందులో అలౌకికములునైన వృత్తాంతములు చెప్ప బడినవి. యుధిష్ఠిరుని తోడ్కొని పోవుటకు స్వర్గమునుండి దివ్యరథము వచ్చెను. కాని, పరమ జ్ఞాన సంపన్నుడైన ధర్మరాజు తనతోగూడ వచ్చిన కుక్కయందు దయచేత దానిని విడిచి తా నొక్కడే రథ మెక్కుటకు అంగీకరించలేదు.

యుధిష్ఠిరుని యచంచలమైన యీధర్మము చూచి ఆ శునకము తనమాయా రూపమును విడిచి సాక్షాత్తు ధర్మనిరూపములో నుండగా, అతనితో పాటు యుధిష్ఠిరుడు స్వర్గమునకు పోయెను. అక్కడ దేవదూత ఒక నెపముతో యుధిష్ఠిరునకు విపులము లైన నరకయాతనలను చూపించెను. అక్కడనే, అతనికి తన తమ్ముల దుఃఖధ్వని, మొరలున్ను వినిపించెను. వారందరు నరకమునందు యముని యాజ్ఞచేత యాతనలు అనుభవించుచుండిరి.

తరువాత యమధర్మరాజు, దేవేంద్రుడున్ను, యుధిష్ఠిరుని తమ్ములకు వాస్తవముగ లభించిన సద్గతిని యుధిష్ఠిరునకు చూపిరి. తరువాత యుధిష్ఠిరుడు ఆకాశగంగలో స్నానము చేసి, మనుష్య శరీరము విడిచి స్వర్గమునందు తన ధర్మముచేత సంపాదించిన యుత్తమస్థానము పొంది, ఇంద్రాది దేవతలతోపాటు ఉండి వారిచేత సమ్మానితు డై, ఆనందపూర్వకముగ నుండెను.

ఇట్లు వ్యాసుడు పదునెనిమిదవ దైన స్వర్గారోహణపర్వమునందు ఐదు (5) అధ్యాయములలో రెన్నూటతొమ్మిది (209) శ్లోకములు రచించెను. ఇట్లు, మహాభారతమునందలి అష్టాదశ పర్వముల సంగ్రహకథ చెప్పబడెను.

ఈ మహాభారతమునకు పరిశిష్టము (అనుబంధము)గ వ్యాసుడు పన్నెండు వేల (12000) శ్లోకములతో భవిష్యద్వర్ణనపరమైన హరివంశము రచియించెను.

మునులారా! తరువాత హరివంశపర్వము కలదు. దీనికి పరిశిష్ట (అనుబంధ) పర్వమనికూడ పేరు. ఇందులో విష్ణుపర్వము, శ్రీకృష్ణుని బాలక్రీడ, కంసవధయు వర్ణింపబడినవి. హరివంశము నందు భవిష్యపర్వముగూడ చెప్పబడినది. ఈ విధముగ వ్యాసభగవానుడు ఈ పర్వములను రచించెను. దానినే ఉగ్రశ్రవుడు నైమిశారణ్యమునందు ఈ పర్వములను పదునెనిమిది పర్వములలో ఇమిడించి ఋషులకు చెప్పెను.

ఇట్లు, ఇక్కడ సంగ్రహముగ మహాభారతపర్వములను గూర్చి చెప్పబడెను.

మునులారా! లక్షశ్లోకములు, పదునెనిమిది పర్వముల మహాభారతములో, పరిశిష్టమైన హరివంశమునందు పన్నెండువేల (12000) శ్లోకములున్నను, వ్యాసుడు రచియించెను.

పదునెనిమిది అక్షౌహిణీ సేనలు యుద్ధేచ్ఛచేత ఒకచోట చేరి పదునెనిమిది దినములు మహాభయంకరయుద్ధము చేసెను.

ఏ బ్రాహ్మణులు షడంగములతో ఉపనిషత్తులతోను నాలుగు వేదములు చదివినను ఈ మహాభారతేతిహాసము నెరుగరో, వారు, పరిపూర్ణపండితులు కారు. దీనిలో ధర్మ-అర్థ-కామ-మోక్షశాస్త్రము లన్నియు కలవని వ్యాసుడు చెప్పెను. భారతోపాఖ్యానము వినిన తరువాత ఇతరము లేవియు వినుటకు బుద్ధి పుట్టదు. కోకిలల యవ్యక్త మధురధ్వని వినిన తరువాత కాకుల కఠోరధ్వని వినుటకు ఎవరికి ఇష్ట ముండును? 'ఆధ్యాత్మిక-అధిదైవిక-అధిభౌతికము' లనెడు త్రివిధసృష్టులు పంచభూతముల నుండి కలిగినట్లే ఈ భారతేతిహాసమునుండి కవులకు కావ్యరచనాబుద్ధి కలుగును.

మునులారా! ఈ భారతేతిహాసమునందు ఆకాశమునందు నాలుగు విధము లైన ([1]జరాయుజ-[2]స్వేదజ-[3]అండజ-[4]ఉద్భిజ్జములు) ప్రాణులు ఉన్నట్లే, పదు నెనిమిది పురాణములు కలవు. విచిత్ర మానసిక క్రియలే అన్ని యింద్రియముల చేష్టలకు ఆధారభూతములైనట్లు సమస్త లౌకిక - వైదికకర్మల ఫలములను సాధించుటకు ఈ భారతాఖ్యానము ఆధారముగ నున్నది.

బ్రహ్మచర్య - వానప్రస్థ - సన్న్యాసాశ్రమములు మూడు గృహస్థాశ్రమ మునకంటె మించినవి కానట్లే ప్రపంచకవు లందరు మహాభారత కావ్యముకంటె మించిన కావ్యరచన చేయ జాలరు.

మహర్షులారా! (మహాభారత పాఠకులారా!) పరలోకమునకు పోయిన జీవునకు ధర్మము మాత్రమే బంధువు-సహాయకము నగును. కనుక మీరందరు ప్రపంచ వస్తువులందు ఆసక్తి విడిచి ఉన్నతికి చేరుదురుగాక! మీ మనస్సు సర్వదా ధర్మమునందే లగ్నమై యుండునుగాక! బుద్ధిమంతులైన మనుష్యులు గూడ ప్రపంచమునందు ధనమును, స్త్రీలను సేవించెదరు. కాని, వారు అవియే శ్రేష్ఠము లని వానిపై విశ్వాసము ఉంచరు. అవి స్థిరము లని భావించరు.

ఋషీశ్వరులారా! అసమానము, పుణ్యప్రదము, పవిత్రము, పాపహరము, శ్రేయస్కరము, వ్యాసముఖనిర్గతము నైన యీ మహాభారతమును వినినవారికి పుష్కర తీర్థమునందు స్నానము చేయవలసిన యావశ్యకత ఏమి యుండును? బ్రాహ్మణుడు సాయంకాలము మహాభారతము పఠించి పగలు ఇంద్రియముల

1. గర్భకోశమునుండి పుట్టు మనుష్య - పశు - మృగాదులు జరాయుజములు అనబడును. 'జరాయు' అనగా 'మావి.' ఈ జంతువులు మావినుండియే పుట్టును.
2. చెమటనుండి పుట్టుపేలు, నల్లులు, దోమలు, మొదలైనవి స్వేదజము లన బడును.
3. పక్షులు, సర్పములు మొదలైన జంతువులు అండజములు (గ్రుడ్లనుండి పుట్టునవి.)
4. భూమిని ఛేదించి పైకి మొలచు వృక్షలతాదులు-ఉద్భిజ్జము లనబడును.

ద్వారా చేయు పాపములనుండి, విముక్తుడగును. ఇట్లే, అతడు ప్రాతఃకాలము నందు మహాభారత పఠనము చేసి, రాత్రియందు మనోవాక్కాయ కర్మలచేత చేసిన పాపములనుండికూడ, విముక్తు డగును.

మునీశ్వరులారా! కొమ్ములకు బంగారపుతొడవులు తొడిగి, వేదవిదులైన బ్రాహ్మణులకు ప్రతిదినము నూరుగోవులను దానము చేసినవాడు, కేవలము మహాభారత కథ మాత్రము వినినవాడు- ఈ ఇరువురికీ సమానమైన ఫలము కలుగును.

మునీశ్వరులారా! ఇక్కడ పర్వసంగ్రహాధ్యాయము ద్వారా ఉత్తమ మహాభారతాఖ్యానము తెలిసికొనవలెను. ఈ యధ్యాయము మొదట వినుటచేత మనుష్యులకు మహాభారతము వంటి మహాసముద్రమునందు ప్రవేశించుట, ఓడ సహాయముతో అనంతజలరాశి యైన సముద్రమునందు ప్రవేశించుటవలె సహజముగా సులభ మగును.

**పర్వసంగ్రహ పర్వము సమాప్తము.**

## పౌష్య పర్వము

**జనమేజయునకు సరమశాపము - అతడు సోమశ్రవుని పురోహితునిగా వరించుట - ఆరుణి - ఉపమన్యు - వేద - ఉత్తంకుల గురుభక్తి - ఉత్తంకుడు సర్పయాగముకొరకు జనమేజయుని ప్రోత్సహించుట :-**

మహామునులారా : పరీక్షిత్తు పుత్రుడు జనమేజయుడు తన సోదరులతో కురుక్షేత్రమందు దీర్ఘకాలముదాక చేయబడు యజ్ఞము అనుష్ఠించు చుండెను. అతనికి 'శ్రుతసేనుడు, ఉగ్రసేనుడు, భీమసేనుడు' అను ముగ్గురు సోదరులు ఉండిరి. ఆ ముగ్గురున్ను యజ్ఞమునందు కూర్చొని యుండిరి.

ఇంతలోనే దేవలోక శునకి (ఆడుకుక్క) "సరమ" యొక్క పుత్రుడైన సారమేయుడు అనుశునకము యాగశాలలో వచ్చెను. జనమేజయుని సోదరులు ఆకుక్కను కొట్టగా అది ఏడ్చుచు ఆ యజ్ఞశాలనుండి తనతల్లియొద్దకు పోయెను. ఏడ్చుచున్న కొడుకును చూచి తల్లి "పుత్రా !, ఎందుకు ఏడ్చుచున్నావు ? నిన్ను

ఎవరు కొట్టిరి ?" అని యడిగెను. దానికి ఆ కుక్క "అమ్మా ! నన్ను జనమే జయుని సోదరులు కొట్టిరి" అని బదులు చెప్పెను. ఆ మాటకు తల్లి కొడుకుతో "పుత్రా ! నీవు తప్పక కపటముగా ఏమైన అపరాధము చేసి యుందువు. అందు వలన వారు నిన్ను కొట్టిరి" అని యనెను. అప్పు డతడు తల్లితో "అమ్మా ! నేను ఏ యపరాధముగూడచేయ లేదు. వారి యజ్ఞహవిస్సునుగూడ చూడ లేదు. దానిని నాక లేదు." అని చెప్పెను.

మునులారా! ఆ మాట విని సరమ దుఃఖముతో ఆ సత్రయాగశాలకు పోయెను. అక్కడ జనమేజయుడు సోదరులతో కలసి యజ్ఞానుష్ఠానము చేయు చుండెను. అపుడు సరమ కోపముతో జనమేజయునితో "రాజా! ఈ నాపుత్రుడు మీకు ఏలాటి యపరాధము చేయలేదు. మీ హవిస్సును చూడ లేదు, నాక లేదు. ఇట్లుండగా మీరు ఇతనిని ఎందుకు కొట్టితిరి" అని అడిగెను. కాని, జనమేజ యాది సోదరులు సరమకు ఉత్తరము చెప్పలేదు. అపుడు సరమ జనమేజయునితో "నిరపరాధియైన నా పుత్రుని నీవు కొట్టితివి కనుక నీకు అకస్మాత్తుగా ఊహింప రాని భయము కలుగ గలదు" అని శాప మిచ్చెను.

మునీశ్వరులారా ! అపుడు జనమేజయుడు శాప భయముచేత దుఃఖించి, ఆ యాగపరిసమాప్తి యైన తరువాత హస్తినాపురమునకు వచ్చి తనకు యోగ్యుడైన యొక పురోహితుని వెదుక జొచ్చెను. తన శాపరూప మైన ''కృత్య''ను (బలము, ఆయువు, ప్రాణము నశింపచేయునది) పురోహితుడు శాంతింప జేయును అని అతనికొరకు వెతకెను.

మునులారా! ఇట్లుండగా ఒకనాకు జనమేజయుడు వేటకొరకు అడవికి పోయెను. అక్కడ తనరాజ్య పరిధిలో నున్న ఒక ఆశ్రమమును చూచెను. ఆ యాశ్రమమందు ''శ్రుతశ్రవుడు'' అను పేరుగల ఒక మహర్షి యుండెను.

"ఋషీశ్వరులారా! అప్పుడు జనమేజయుడు శ్రుతశ్రవుని కడకు పోయి అతని పుత్రుడైనసోమశ్రవుని తన పురోహిత పదవికొరకు వరించుచు ఆ మహా మునికి నమస్కారము చేసి "భగవన్! నీపుత్రుడు సోమశ్రవుడు నాకు పురో హితుడుగా నుండుగాక!"యని అనెను. ఆ మాట విని శ్రుతశ్రవుడు ఆ రాజుతో "జనమేజయా! ఈ నా పుత్రుడు సోమశ్రవుడు సర్పిణి గర్భమునుండి నాకు

పుట్టెను. ఇతడు గొప్ప తపస్వి. వేదాధ్యయనము చేసినవాడు. నా తపోబలము చేత ఇతనిని రక్షించి, పోషించితిని. ఒకప్పుడు ఒక సర్పస్త్రీ నా వీర్యము త్రాగి యుండెను. కనుక దాని గర్భమునుండి ఇతడు పుట్టెను. ఇతడు సమస్త పాప కృత్యలను (శాపము వలన కలిగిన ఉపద్రవములు) నివారించుటకు సమర్థుడు. భగవంతు డైన శంకరుని కృత్యను మాత్రము ఇతడు నివారింప జాలడు.

"కాని, మహారాజా! ఇతనికి గుప్త మైన యొక నియమము కలదు. అది యే మ౦గా ఎవ డైన బ్రాహ్మణుడు అతనికడకు వచ్చి ఇతనిని ఏ దైన వస్తువు యాచి చిన యెడల ఇతడు ఆ బ్రాహ్మణుని యభీష్టవస్తువు తప్పక యిచ్చును. నీవు ఔదార్యముతో ఇతని యీ నియమమును ఓర్చుకొని ఇతని ఇచ్ఛాపూర్తికి ఉత్సాహము చూపునెడల ఇతనిని తోడ్కొని పొమ్ము."

"మునీశ్వరులారా! శ్రుతశ్రవుడు ఇట్లు చెప్పగా జనమేజయుడు "భగవన్! నీవు చెప్పినట్లు, యతని యిష్టప్రకారమే అగుగాక!" అని చెప్పి జనమేజయుడు పురోహితు డైన సోమశ్రవుని తోడుకొని వచ్చి తన సోదరులతో "ఈ మహామునిని మనకు ఉపాధ్యాయునిగ (పురోహితుడు) ఏర్పరుచుకొనినాను. ఇతడు ఏమనినను, ఏమాత్రము మీరు యోచించక ఇతనికోరిక నెరవేర్చవలెను." అని చెప్పగా వారు దానికి అంగీకరించి, సోమశ్రవుని యాజ్ఞలను పాలింప జొచ్చిరి.

"మునులారా! జనమేజయుడు సోదరులకు ఇట్లు ఆజ్ఞ యిచ్చి తాను తక్షశిలను జయించుటకు పోయి దానిని జయించుకొని తన యధికారములో తెచ్చుకొనెను."

"ఋషీశ్వరులారా! 'గురువుయొక్క ఆజ్ఞ ఏవిధముగ పాలించవలెను;' అను విషయమును ఇప్పుడు చెప్పబోవుకథ తెలుపుచున్నది. వినుడు:

ఆ సమయమందే **ఆయోద** ధౌమ్యుడు అను పేరు గల ఒక సుప్రసిద్ధ మహర్షి యుండెను. అతనికి 'ఉప మన్యువు, పాంచాలదేశీయుడైన అరుణి, వేదుడు' అనుముగ్గురుశిష్యులు ఉండిరి.

ఒకనాడు ఉపాధ్యాయుడు ఆరుణిని తన వరిచేనికి పంపుచు "వత్సా! మనచేని మడికట్ట తెగినది. దానికి కట్ట వేసి రమ్ము" అని చెప్పెను. ఉపాధ్యాయుని యాజ్ఞాను సారము ఆరుణి పొలమునకు పోయి ఆ వరిమడికి కట్ట వేయు దొడగెను; కాని అత డాకట్ట వేయజాలక పోయెను. అతడు ఎంతపరిశ్రమ చేసినను, వీలుకానప్పుడు అతనికి ఒకయుపాయము తోచి, మనస్సులోనే, "ఇట్లే చేసెదను" అని నిశ్చయించుకొని ఆ తెగినకేదారఖండమునకు అడ్డ కట్టగా తానే పండుకొనెను. అప్పుడు ఆమడినుండి నీరు పారుట ఆగిపోయెను. కొంతసేపయిన తరువాత, ఉపాధ్యాయుడు శిష్యులతో "ఆరుణి రాలేదు. ఎక్కడకు పోయెను?" అని యడగగా, ఆ శిష్యులు గురువుతో "భగవన్! మీరేకదా వరిమడికి కట్టవేయుమని యతనిని పంపితిరి" అని అనగా, ఉపాధ్యాయుడు శిష్యులతో పొలమునకు పోయి, ఆరుణిని "వత్సా! ఎక్కడ నున్నావు? రమ్ము" అని బిగ్గరగా పిలిచెను. ఉపాధ్యాయుని మాట విని, వెంటనే వరిమడినుండి లేచి, గురువుకడకు పోయి, "భగవన్! ఎంత ప్రయత్నించినను కట్ట వేయుటకు వీలు కానందుచేత జలమును ఆపుటకుగాను, నేనే యిక్కడ అడ్డుకట్టగా పండుకొనినాను. ఇప్పుడు మీ పిలుపు వినగానే, కట్ట చీల్చుకొని వచ్చితిని. ఆజ్ఞాపింపుము నే నేమి చేయుదును?" అని ఆరుణి యనెను.

"మునులారా! ఆరుణి యిట్లు చెప్పగా విని ఉపాధ్యాయుడు "వత్సా! నీవు కేదారఖండమును చీల్చి లేచితివి గనుక ఈ 'ఉద్దలన' (చీల్చుట) కార్యమువలన నీవు 'ఉద్దాలక' "నామముతో ప్రసిద్ధుడవయ్యెదవు." అని చెప్పి ఆరుణిని అనుగ్రహించి, "నాయనా! నీవు నా యాజ్ఞను పాలించితివి గనుక నీకు సమస్త శ్రేయస్సులు కలిగి వేద శాస్త్రము లన్నియు, నీ బుద్ధియందు స్వయముగా ప్రకాశించుగాక!" అని ఆశీర్వదింపగా ఆరుణి కృతకృత్యుడై అతని యిష్టము వచ్చిన చోటికి పోయెను.

"మునులారా! ఆ ఆయోదధౌమ్యునకే 'ఉపమన్యు' నామకుడు మరి యొకశిష్యు డుండెను. అతనితో ఉపాధ్యాయుడు 'వత్సా! నీవు గోవులరక్షణము చేయుము" అని ఆదేశించెను. ఉపాధ్యాయుని యాజ్ఞచేత ఉపమన్యుడు గోవులను పగలంతయు కాచి సాయంకాలము ఇంటికి వచ్చు చుండెను. ఒకనాడు ఉపమన్యుడు మిక్కిలి బలిసి యుండుట చూచి ఉపాధ్యాయుడు అతనితో "వత్సా! నీవు ఎట్లు

జీవనము గడపు చున్నావు? ఏమి తిని యింతగా బలిసి పరిపుష్టుడవై యున్నావు?" అని యడుగగా, ఉపమన్యుడు "గురుదేవా! నేను భిక్షాన్నము చేత జీవికా నిర్వాహణము చేయు చున్నాను" అని యనగా ఉపాధ్యాయుడు "నాకు ఈయకుండ నీవు భిక్షాన్నము తిన గూడదు" అని ఉపమన్యునకు కట్టడి చేయగా, నతడు 'సరియే' అని చెప్పి ఆయన యాజ్ఞను స్వీకరించి, భిక్షాన్నము ఇచ్చి గురువునకు సమర్పించు చుండెను.

"మునులారా! ఉపమన్యుడు తనభిక్ష యంతయు తెచ్చి గురువున కిచ్చి, పూర్వమువలెనే గోరక్షణము చేయు చుండెను. అప్పుడు గూడ అత డట్లే బలిసి యుండుట చూచి, ఉపాధ్యాయుడు "ఉపమన్యూ! నీ భిక్షమంతయూ నేనే తీసుకొను చున్నాను. ఇప్పుడు నీవు ఏమీ తిని బ్రతుకుచున్నావు?" అని యడుగగా నతడు 'భగవన్! మొదటిభిక్ష తెచ్చి మీకు ఇచ్చి నాకొరకు రెండవభిక్ష తెచ్చి తిను చున్నాను అని యనగా, గురువు అతనితో "నాయనా! నీవు చేయునది న్యాయ్యమైన వృత్తి కాదు. నీ విట్లు చేసి ఇతర భిక్షా జీవుల యొక్క జీవికకు బాధ కలిగించు చున్నావు. కనుక నీవు లోభి వై రెండవసారి భిక్ష తెచ్చుకొన గూడదు" అని యనెను. ఆ మాటను ఉపమన్యుడు అంగీకరించి, పూర్వము వలెనే, గోవులను కాచుచుండెను.

"ఋషీశ్వరులారా ! ఇట్లుండగా మరియొకనాడు పూర్వమువలెనే, ఉపమన్యుడు పరిపుష్టితో నుండుట చూచి, అతనిని "వత్సా? నీ భిక్ష నేను తీసికొంటిని. నీవు రెండవసారిగూడ, భిక్ష తెచ్చుకొన కున్నావు. అయినను నీవు బలిసి యున్నావు ఇప్పుడు ఏమి తిని, త్రాగి బ్రతుకు చున్నావు?" అని గురువు అడుగగా, నతడు "భగవన్ నేను ఆవులపాలు త్రాగి బ్రతుకు చున్నాను" అని చెప్పెను. ఆమాట విని ఉపాధ్యాయుడు అతనితో "నిన్ను ఆవులను కాచుటకు పంపితిని కాని, వానిపాలు త్రాగుమని నేను చెప్పలేదు. అందుచేత నీవు ఆవు పాలను త్రాగుట ఉచితము కాదు," అనిచెప్పగా ఉపమన్యుడు 'అట్లే' యని పాలు త్రాగక గోరక్షణము చేయు చుండగా, నొకనాడు గురువు అతడు పూర్వమువలెనే బలిసి యుండుట చూచి, అతనితో "నాయనా! భిక్షాన్నము తినక, గోదుగ్ధము త్రాగ కున్నను నీవు బలిసి యున్నావు. ఇప్పుడు ఏమి తిని బ్రతుకు చున్నావు?" అని అడుగగా, అతడు ఉపాధ్యాయునితో, "గురుదేవా!

దూడలు పాలు త్రాగునపుడు వానినోటినుండి వెడలిననురుగు త్రాగు చున్నాను" అని చెప్పగా ఉపాధ్యాయుడు ఉపమన్యునితో "నాయనా! ఈ దూడలు మంచి గుణము గలవి కనుక నీపై దయచేత చాలనురుగును గ్రక్కుచు నుండును. నీవు నురుగు త్రాగి దూడలన్నిటి జీవికకు బాధ కలిగించు చున్నావు కనుక నేటినుండి ఆ ఫేనముగూడ త్రాగకుము." అని యనగా ఉపమన్యుడు 'అట్లే యగుగాక' యని ఉపాధ్యాయునియాజ్ఞ నెరవేర్చుచు, గోవులనుగాచు చుండెను.

"తపస్యులారా! ఈవిధముగ గురువు అతని యాహారములను నిషేధించిన తరువాత ఉపమన్యుడు ఏమియు తినక ఆకలితో బాధపడుచు నొకనాడు వనమునందు అతడు జిల్లేడు ఆకులను తినెను. అవి మిక్కిలి క్షారములుగా తీక్ష్ణములుగా, చేదుగాను నుండుటచేత జీర్ణించునపుడు కడుపులో అగ్నిజ్వాల రేపును కనుక అవి తినినందుచేత, ఉపమన్యునినేత్రములు పోయెను. అంధుడైన యతడు త్రోవలు, దిక్కులు తెలియక ఇటు నటు తిరుగుచు అడవిలో ఒక కూపమునందు పడెను. తరువాత సాయంకాలము అతడు గురువు కడకు రాకుండుటచేత ఉపాధ్యాయుడు "ఉపమన్యుడు ఎందుకు రాలేదు" అని శిష్యులను అడుగగా వారు, "అతడు గోవులను కాచుటకు వనమునకు పోయి యుండెను" అని చెప్పిరి.

"మునులారా! అప్పుడు ఉపాధ్యాయుడు నేను ఉపమన్యుని జీవికకు అన్ని మార్గములు బంధించితిని. కనుక నతనికి నాపై కోపము వచ్చి యింత సేపటివరకు రాలేదు. కాబట్టి మనము పోయి అతనిని వెదుకవలెను'' అని చెప్పి శిష్యులతో బాటు వనమునకు పోయి "పుత్రా! ఉపమన్యూ! ఎక్కడ నున్నావు? రమ్ము" అని బిగ్గరగా అరచెను. ఉపమన్యుడు ఉపాధ్యాయునిమాట విని పెద్దధ్వనితో "గురుదేవా! నేను నూతిలో పడి యున్నాను'' అని ఉత్తరము చెప్పగా "వత్సా! నీవు కూపమునందు ఎట్లు పడితివి?'' అని యడుగగా "గురుదేవా! నేను అర్కపత్రభక్షణము చేసి అంధుడ నైతిని గనుక నూతిలో బడితిని'' అని చెప్పెను.

"మునీశ్వరులారా! ఉపమన్యునిమాట విని ఉపాధ్యాయుడు అతనితో వత్సా! అశ్వినీకుమారు లిద్దరు దేవలోకవైద్యులు. వారిని నీవు స్తుతించుము. వారు ప్రసన్నులై నీ యంధత్వము పోగొట్టెదరు'' అని చెప్పగా ఉపమన్యుడు అశ్వినీ కుమారులను ఋగ్వేదమంత్రములచేత ఇట్లు స్తుతించుటకు అరంభించెను.

"అశ్వినీకుమారులారా! మీరు ఇద్దరు సృష్టికి పూర్వము ఉన్నారు. మీరే అందరికంటె పూర్వజులు, చిత్రభానువులు. నా వాక్కుతోను, తపస్సుతోను, మీరు అనంతులు కాబట్టి, స్తుతించు చున్నాను. మీరు దివ్యస్వరూపులు. సుందరములైన రెక్కలు గల రెండు పక్షులవలె, మీరిరువురు ఎల్లప్పుడు కలిసి యుందురు. మీరు రజోగుణము, అభిమానమును లేనివారు సమస్త ప్రపంచమునందు ఆరోగ్యమును విస్తరింపజేయు చుందురు.

బంగారు రెక్కలు గల రెండుపక్షులవలె మీ ఇరువురు సోదరులు మిక్కిలి సుందరముగ నున్నారు. పారలౌకిక మైన ఉన్నతికొరకు కావలసినసాధనము లన్నియు మీకు కలవు. 'నాసత్య-దస్ర' అను ఈ రెండుపేర్లు మీకు ఉన్నవి. మీ నాసిక మిక్కిలి సుందర మైనది. మీకు ఎక్కడికి పోయినను విజయము నిశ్చిత మై యుండును. మీరే సూర్యభగవానునిసుపుత్రులు కనుక, స్వయముగా మీరు సూర్యరూపములో ఉండి పగలు, రాత్రి యనెడు తెల్లనల్లదారములతో సంవత్సర మనెడువస్త్రమును నేయుచు, దానిద్వారా వేగముగా దేవయానము, పితృయానము అను సుందరమార్గములను పొందెదరు.

"అశ్వినీకుమారులారా! పరమాత్మయొక్క కాలశక్తి జీవ మనెడు పక్షిని తనకు గ్రాసముగా (కబళము) చేసికొనెను. జీవన్ముక్త మహాపురుషులైన మీరిరువురు అశ్వినీ కుమారులు జ్ఞానమును ప్రసాదించి, మోక్షరూప మైన సౌభాగ్యము పొందుటకు జీవునకు కాలబంధనమునుండి విముక్తి కలిగించితిరి. మాయలో చిక్కుకొని మిక్కిలి అజ్ఞానులుగా నున్నజీవులు రాగద్వేషాలను ప్రాపంచిక విషయములచేత చుట్టబడి, తమ యింద్రియములకు తల వంచి వాని వశములో నున్నంతవరకు ఆ జీవులు శరీరబంధనములో తమకు తాము సంబంధించుకొన్నట్లే భావించెదరు.

"అశ్వినీ కుమారులారా! పగలు, రాత్రి ఈరెండును రెండు విధములైన మనోవాంఛితములను ఇచ్చుమూడువందలఅరువదిరెండు గోవులు. అవి యన్నియు ఒక సంవత్సరమనెడుదూడను కని, దానిని సంతుష్టిపరచు చుండును. ఆ దూడ, అన్నిటిని సృష్టించి సంహరించు చుండును. జ్ఞానము గోరుపురుషులు ఆ దూడను నిమిత్తముగా చేసికొని ఆగోవులనుండి వేరువేరు ఫలములనిచ్చు శాస్త్రవిహిత

కర్మలను పిదుగు చుండెదరు. ఆ కర్మల కన్నింటికి తత్త్వజ్ఞానేచ్ఛ యనెడు ఒకే ఒక ఫలము పిదుక దగినదిగా నుండును. ఆ రెండు గోవులను మీరిరువురు అశ్వినీ కుమారులే పిదుకు చుండెదరు.

"అశ్వినీకుమారులారా! ఈ కాలచక్రమునకు సంవత్సరమే, నాభి (బండి చక్రపు నడిమితూము) గా నుండును. దానిపైన రాత్రి, పగలు కలిసి ఏడునూర్ల యిరువదిఅరములు (ఆకులు) అమర్చ బడి యున్నవి. అవి యన్నియు పన్నెండు నెలలరూపము లైన 'ప్రధి' (ఆకులు) బిగింపబడు చక్రముచుట్టు (ఇనుపపట్టా-నేమి) లో బిగింప బడి యుండును. అవినాశి, మాయామయము నైనయీకాల చక్రము నేమి (ఇనుపపట్టా) లేకుండనే అనియతమైన గమనముతో తిరుగుచు ఇహలోక - పరలోకములలోని ప్రజలకు వినాశము కలిగించు చుండును.

"అశ్వినీకుమారులారా! మేష-వృషభాదిద్వాదశరాసులు, ఆకాలచక్రము నకు ఆకులుగా నుండును. ఆరు ఋతువులే దానికి ఆరునాభులు. సంవత్సరమే ఇరుసు. ఆకాలచక్ర మొక్కటే, అన్నిదిక్కుల తిరుగు చున్నది. కర్మఫలమును ధరించుటకు అదియే ఆధారము. దానియందే సమస్తకాలాభిమాని యైనదేవత నిలిచి యుండును. మీరిరువురు ఆకాలచక్రమునుండి నాకు విముక్తి కలిగింపుడు. ఎందుకనగా, నేను ఆకాలచక్రములో జనన - మరణాది దుఃఖముచేత మిక్కిలి కష్టపడు చున్నాను

అశ్వినీకుమారులారా! మీరిరువురు మిక్కిలి సత్ప్రవర్తన గలవారు. చంద్ర - అమృత - జలములకు గలతేజస్సును మీయశస్సు యొక్క తేజస్సు తిరస్కరించు చున్నది. ఇప్పుడు మీరు మేరుపపర్వతము విడిచి, భూమిపైన ఆనందముతో సంచరించు చున్నారు. లోకములో ఆనందము, బలము వర్షించుట కొరకే మీరిరువురు సోదరులు పగటిపూట ప్రయాణము చేయు చుండెదరు.

అశ్వినీకుమారులారా! మీరిరువురే ప్రపంచసృష్టియొక్క యారంభకాల ములో తూర్పు మొదలైన పదిదిక్కులను ప్రకటీకరించి, వానిని అందరికిని తెలిపెదరు. ఆదిక్కులకు శిరస్సుగా నున్న అంతరిక్షలోకమునందు రథములో సంచరించుచు అందరికి సమానముగా వెలుగు నిచ్చుచున్న సూర్యభగవానుని ఆకాశాది పంచభూతములనున్ను ప్రపంచమునకు మీరే తెలిపెదరు.ఆయా దిక్కు

లలో సూర్యుడు పోవు చుండుట చూచి, ఋషులు గూడ అతనిని అనుసరించు చుందురు. దేవ - మనుష్యులుగూడ తమ తమ యధికారము ననుసరించి స్వర్గ లోకమునో, మర్త్యలోకమునో చేరు చుందురు.

"అశ్వినీకుమారులారా! మీరు అనేక వర్ణములు గల వస్తువుల యొక్క మిశ్రణముచేత, అన్ని విధములైన ఔషధులయొక్క ఉత్పత్తి చేసెదరు. అవి సమస్త ప్రపంచమును పోషించు చున్నవి. ప్రకాశమానములైన ఆ యోషధులు సర్వదా, మీయిరువురిని అనుసరించుచు, మీతో కలిసి సంచరించు చుండును. దేవ - మనుష్యాది ప్రాణులు తమ తమ యధికారము ప్రకారము స్వర్గ - మర్త్య లోకములలో ఉండి ఆ యోషధులను సేవించు చుందురు.

"అశ్వినీకుమారులారా! 'నాసత్య' అను ఒకే పేరుతో మీరిరువురు ప్రఖ్యాతులై యున్నారు నేడు మీయిరువురను, మీరు ధరించిన కమల పుష్ప మాలికలనున్ను పూజించెదను. మీరు, అమరులేకాక, సత్యరక్షణము, సత్య విస్తారముగూడ ప్రపంచములో చేయు చుండెదరు. మీ సహాయోగము లేకుండ దేవతలుగూడ ఆ సనాతన సత్యమును పొంద జాలరు.

అశ్వినీకుమారులారా ! యువకులైన తలిదండ్రులు సంతానోత్పత్తి కొరకు తొలుత ముఖము ద్వారా అన్నము అనెడు గర్భమును ధరించెదరు. తరువాత ఆయన్నము పురుషులలో వీర్యముగా స్త్రీలలో రజస్సుగాను పరిణతమై జడశరీరముగా నగును. తరువాత ఆ గర్భస్థ జీవుడు జన్మించగనే తల్లిపాలు త్రాగుటకు ఆరంభించును. ఈ విధముగా సంసార బంధనములో చిక్కుకొనిన జీవులకు మీరిరువురు తత్త్వజ్ఞానము ఉపదేశించి విముక్తి కలిగించెదరు. మహాత్ములారా! నా జీవిత నిర్వహణమునకుగాను, నానేత్రేంద్రియమునకుగూడ రోగమునుండి విముక్తిని ప్రసాదింపుడు.

అశ్వినీకుమారులారా! నేను మీ గుణముల నన్నింటిని వివరించి మిమ్ము స్తుతింప జాలను. ఇప్పుడు నేను అంధుడనైనాను. త్రోవగూడ కనుగొన జాల కున్నాను. మోహము కలుగుచున్నది. కనుకనే దుర్గమమైన యీ కూపము నందు పడిపోయినాను. మీరిరువురు శరణాగతవత్సలులైన దేవతలు గనుక మిమ్ము శరణు వేడితిని."

"మునులారా! ఈ విధముగ ఉపమన్యుడు గురువుయొక్క ఆజ్ఞచేత అశ్వినీ దేవతలను స్తుతించెను."

"మునీశ్వరులారా! అప్పుడు అశ్వినీదేవతలు ప్రసన్నులై ఉపమన్యు కడకు వచ్చి అతనితో నిట్లనిరి :-

"ఉపమన్యూ! మేము నీ యెడల మిక్కిలి ప్రసన్నుల మైతిమి. ఈ అపూపము (భక్ష్యము) నీవు తినుము" అని యనగా ఉపమన్యుడు వారితో, 'మహాత్ములారా! సరియే మంచిది!' ఐనను, నేను ఈ యపూపమును నా గురు దేవునకు నివేదించకుండ ఉపయోగించజాలను' అని యనెను.

అప్పుడు అశ్వినీదేవతలు ఉపమన్యునితో 'వత్సా! పూర్వము నీ యుపాధ్యాయుడుగూడ ఈ విధముగ మాస్తోత్రము చేసి యుండెను. అప్పుడు ఆయనకు మేము ఇచ్చిన అపూపమును ఆయన తన గురువునకు నివేదించకయే ఉపయోగించెను. నీ యుపాధ్యాయుడు చేసినట్లే నీవుగూడ చేయుము' అని యనగా, ఉపమన్యుడు ఆ దేవతలతో 'మహాత్ములారా! దీనికొరకు అశ్వినీకుమారు లిద్దరిని నేను మిక్కిలి వినయపూర్వకముగ ప్రార్థించు చున్నాను. ఈ యపూపము గురుదేవునకు నివేదించకుండ నేను తిన జాలను' అని చెప్పెను.

అప్పుడు అశ్వినీకుమారులు అతనితో 'వత్సా! నీ యీ గురుభక్తికి మిక్కిలి ప్రసన్నుల మైతిమి. నీ యుపాధ్యాయుని యొక్క దంతములు ఉక్కు వలె నల్లగా నున్నవి. నీ దంతములు సువర్ణమయములు కాగలవు. నీ కన్నులు గూడ అంధత్వము పోయి చూడగలవు. నీకు సర్వశ్రేయస్సులు కలుగును' అని చెప్పిరి.

అశ్వినీకుమారు లిట్లు చెప్పిన తరువాత ఉపమన్యునకు కన్నులు లభించగా ఉపాధ్యాయునికడకు వచ్చి ఆయనకు ప్రణామము చేసి జరిగినసంగతి యంతయు ఆయనకు తెలిపెను. ఉపాధ్యాయుడు అది విని మిక్కిలి ప్రసన్నుడై అతనితో 'వత్సా! అశ్వినీకుమారులు చెప్పినట్లే నీకు శ్రేయస్సులు కలుగును. నీబుద్ధిలో సమస్త ధర్మశాస్త్రములు స్వయముగా స్ఫురించ గలవు!' అని ఉపాధ్యాయు

దైన 'ఆయోద ధౌమ్యుడు*' చెప్పెను. ఈ విధముగా ఉపమాన్యుడు పరీక్షింపబడెను.

మునీశ్వరులారా! తరువాత ఆ ఆయోదధౌమ్యునకు మూడవ శిష్యుడైన వేదునికి గురువు 'వత్సా! వేదా! నీవు కొంతకాలము వరకు ఇక్కడ నా యింటిలో నివసింపుము. సర్వదా శుశ్రూషచేయుటలో నిమగ్నుడ వై యుండవలెను. దీనిచేత నీకు మేలు కలుగును' అని ఆజ్ఞ యిచ్చెను. అప్పుడు 'అట్లే యగు గాక!' యని వేదుడు గురుగృహమునందు నివసింప జొచ్చెను. అతడు చాలకాలము గురుసేవ చేసెను. గురువు అతనిని ఎద్దువలె సర్వదా పెద్దబరువు మోయుట కొరకు నియమించు చుండెను. వేదుడు శీతోష్ణములు, ఆకలిదప్పులు మొదలైన కష్టములను సహించుచు అన్ని పరిస్థితులలోను గురువునకు అనుకూలుడుగానే, యుండెను. ఇట్లు చాలకాలము గడచిన తరువాత గురువు వేదుని యెడల పూర్తిగా సంతుష్టు డయ్యెను. గురు ప్రసాదముచేత వేదుడు సర్వశ్రేయస్సులను సర్వజ్ఞత్వమునున్ను పొందెను. ఈవిధముగ వేదుని పరీక్షా వృత్తాంతము చెప్పబడెను.

మునీశ్వరులారా! ఉపాధ్యాయుని యుత్తర్వు ప్రకారము వేదుడు సమావర్తనము తరువాత స్నాతకుడై గురు గృహమునుండి తన యింటికి వచ్చి గృహస్థాశ్రమమునందు ప్రవేశించెను.

అతడు తనయింటిలో నున్నప్పుడు అతనికడకు ముగ్గురు శిష్యులు వచ్చిరి. కాని వారికి ఆచార్యవేదుడు 'మీరు పని చేయుడు, అథవా, గురుసేవ చేయుడు. ఈమొదలైన యాదేశము లేవిగూడ తన శిష్యులకు ఇవ్వ కుండెను. ఎందు కనగా గురుగృహమునందు ఉన్నప్పుడు శిష్యుడు సహించవలసిన కష్టములు వేదునకు బాగుగా తెలిసి యుండెను. కాబట్టి, అతని మనస్సు శిష్యులను కష్టదాయకములైన పనుల కొరకు నియమించుటకు ఎప్పుగూడ ఇచ్చయించ కుండెను.

* 'అయోద' శబ్దమునకు అయస్సు (ఇనుము) వంటి నల్లనిదంతములు గలవాడు అని యర్థము. ఆ శబ్దమే స్వార్థతద్ధితాంత మై 'ఆయోద' అయ్యెను. కనుక ధౌమ్యుని దంతములు నల్లనివని అశ్వినీదేవతలు ఉపమన్యునకు చెప్పి యుండిరి.

**ఉత్తంకోపాఖ్యానము :**

మునీశ్వరులారా! ఇట్లుండగా, నొకసారి, బ్రహ్మవేత్త యైన ఆచార్య వేదుని కడకు జనమేజయుడు, పౌష్యుడు అను పేర్లు గల యిద్దరు క్షత్రియులు వచ్చి వేదుని తమకు ఉపాధ్యాయునిగా వరించుకొనిరి.

తరువాత నొకనాడు ఉపాధ్యాయవేదుడు తన యజమానుని పనికై బయటకు పోవుటకు పూనుకొని, ఉత్తంకుడు * అను పేరు గల శిష్యుని అగ్నిహోత్రాది కర్మలందు నియుక్తిని జేసి అతనితో 'వత్సా! ఉత్తంకా! నా యింటిలో నేను లేనప్పుడు ఏ వస్తువైన లోపింపగా దానిని నీవు పరిపూర్ణము చేయవలెనని కోరుచున్నాను అని ఆజ్ఞాపించి వేదుడు ఇల్లు విడిచి బయటకుపోయెను.

మునులారా! తరువాత ఉత్తంకుడు గుర్వాజ్ఞను పాలించుచు సేవాతత్పరుడై ఉపాధ్యాయుని యింటి యందే యుండినప్పుడు అతనిని ఉపాధ్యాయుని యింటి యందున్న స్త్రీ లందరు పిలిచి అతనితోని ట్లనిరి :-

"ఆర్యా! నీగురుపత్ని రజస్వలయై యున్నది. ఉపాధ్యాయుడు పర దేశము పోయినాడు. ఆమె ఋతుకాలము నిష్ఫలము కా కుండునట్లు నీవు చేయవలెను. దీనికొరకు గురుపత్ని చాలా చింతిల్లు చున్నది" అని యనిరి. ఆ మాట విని ఉత్తంకుడు వారితో "నేను స్త్రీలమాటపై, అయోగ్యమైన యీ నింద్యకర్మ చేయ జాలను. ఉపాధ్యాయుడు, 'నీవు చేయుటకు అయోగ్యమైన పనిగూడ చేయుము' అని నాకు ఆజ్ఞ యీయ లేదు" అని యనెను.

కొంతకాల మైన తరువాత ఉపాధ్యాయ వేదుడు పరదేశము నుంచి తిరిగి యింటికి వచ్చినప్పుడు అతనికి ఉత్తంకుని వృత్తాంత మంతయు తెలిసి మిక్కిలి ప్రసన్నుడై, ఉత్తంకునితో, 'వత్సా! నీకు ప్రియకార్య మేది నేను చేయుదును; నీవు ధర్మానుసారముగ నాసేవ చేసితివి. మన పరస్పరప్రేమ మిక్కిలి పెరి

* తెలుగు భారతములో 'ఉత్తంకుడు' అను పేరునకు బదులుగా 'ఉదంకుడు' అని వాడ బడినది.

గెను. ఇక నీవు ఇంటికి పొమ్మని ఆజ్ఞ ఇచ్చుచున్నాను. నీకోరికలన్నియు నెరవేర గలవు' అని చెప్పెను.

గురువుమాట విని శిష్యుడైన ఉత్తంకుడు ఇట్లనెను:

"భగవన్! నేను నీకు ప్రియమైన కార్యమేది చేయుదును? ఎవడు, అధర్మపూర్వకముగ విద్యోపదేశము చేయునో, అథవా ఎవడు అధర్మపూర్వకముగ ప్రశ్నము గాని లేక అధ్యయనము గానిచేయునో, ఆ యిరువురిలో నొకడు (గురువు-లేక శిష్యుడు) మృత్యువును విద్వేషమును పొందగలడు" అని పెద్దలు చెప్పెదరు; కనుక, నీయాజ్ఞయైన యెడలను నేను నీకు అభీష్టమైన గురుదక్షిణ సమర్పింప దలచు చున్నాను" ఇట్లు మాటిమాటికి ఉత్తంకుడు ప్రార్థించెను. అది విని ఉపాధ్యాయుడు అతనితో నిట్లనెను :-

"వత్సా! నీవు మాటిమాటికి గురుదక్షిణ యిచ్చెద నని అనుచున్నావు. ఇంటిలోపలకు పొమ్ము. గురుపత్ని నడుగుము. ఆమె కోరిన వస్తువు తెచ్చి యిమ్ము. "అప్పుడు ఉత్తంకుడు గురుపత్నికడకు పోయి "దేవీ! నేను ఇంటికి పోవుటకు గురువుగారు ఆజ్ఞ యిచ్చినారు. కనుక నీవు కోరినవస్తువు గురుదక్షిణగా, సమర్పించి ఋణవిముక్తుడనై పోవ గోరుచున్నాను; కనుక నేను గురుదక్షిణగా ఏవస్తువు తెచ్చియవ్వవలెనో, ఆజ్ఞ యిమ్ము అని అనెను. అప్పు డతనితో అతని గురుపత్ని యిట్లు అనెను.

"నాయనా! నీవు పౌష్య మహారాజుకడకు పోయి, ఆయన పత్ని ధరించిన రెండు కుండలములను అడిగి త్వరగా తెచ్చి యిమ్ము. నేటికి నాలుగవదినమున పుణ్యకవ్రతము నేను చేయునప్పుడు నా చెవులకు ఆ కుండలములు ధరించి శోభిల్లుచు బ్రాహ్మణులకు భోజనము వడ్డించ దలచినాను. కనుక నీవు నాయీ మనోరథమును నెరవేర్పుము. నీకు శుభ మగు గాక! నీ విట్లు చేయకున్నచో నీ కెట్లు శుభము కలుగును? కనుక ఈ గడువులోపలనే తెమ్ము."

"గురుపత్ని యిట్లు చెప్పగా ఉత్తంకుడు అక్కడినుండి వెడలి పౌష్య మహారాజు పట్టణమునకు పోవునపుడు దారిలో ఒకపెద్ద యెద్దును, దానిపైన కూర్చున్న యొక మహాకాయుని చూచెను. అప్పుడు ఆ పురుషుడు ఉత్తంకునితో

"నీవు ఈ యెద్దు గోమయము తినుము." అని యనినప్పటికిని ఉత్తంకునకు గోమయము తినుటకు ఇచ్ఛ కలుగ లేదు. అప్పు డా పురుషుడు మరల ఉత్తంకునితో "తినుము విచారింపకుము నీగురువు గూడ పూర్వము ఇది తినియుండెను." అని యనగా ఉత్తంకుడు అట్లే చేసెద నని ఆ వృషభ గోమయమును తిని గోమూత్రము గూడ త్రాగెను. వెంటనే అతడు ఆచమనము చేసి వెడలిపోయెను.

తరువాత నతడు పౌష్య మహారాజు నగరమునకు పోయెను ఆసనముపై కూర్చుని యున్న ఆ రాజుదగ్గరకు పోయి, అతనిని ఆశీర్వదించి ప్రసన్నుని చేయుచు "రాజా! నేను యాచకుడనై నీకడకు వచ్చినాను." అని యనగా, రాజు ఆతనికి ప్రణామము చేసి "భగవన్! నేను నీసేవకుడను, పౌష్యుడను వాడను. ఏమి ఆజ్ఞ?" అని యనగా ఉత్తంకుడు "రాజా! నేను గురుదక్షిణార్థము రెండు కుండలములకొరకు నీ దగ్గరకు వచ్చినాను. నీభార్య వానిని ధరించినది. ఆకుండలములను నాకు ఇమ్ము. ఇది నీవు చేయవలసిన యోగ్యకార్యము" అని యనగా పౌష్య మహారాజు ఉత్తంకునితో "నీవు నా యంతఃపురమునకుపోయి నా భార్య నడిగి కుండలములు తీసికొనుము". అని యనగా నుత్తంకుడు అంతఃపురమునకు పోయెను. కాని, అక్కడ అతనికి రాజపత్ని కనపడలేదు".

అప్పుడు ఉత్తంకుడు మరల పౌష్యునికడకు పోయి 'రాజా! నీవు నన్ను సంతోషపరచుటకుగాను అసత్యము చెప్పి, కపటము చేసితివి. ఇది నీవంటి వానికి మంచిది కాదు. నీ యంతఃపురమునందు నీ భార్యలేదు. ఆమె నాకు కనపడ లేదు! అని యనగా పౌష్యమహారాజు ఒక క్షణకాలము యోచించి, మహామునీ! నీ ముఖము ఉచ్ఛిష్టమై యున్నది. నీవు అపవిత్రుడవు. ఏయపవిత్రకార్యము చేసితివో, జ్ఞప్తికి తెచ్చుకొనుము. ఎందుకనగా, నాభార్య ప్రతివ్రత కాబట్టి ఆమెను ఉచ్ఛిష్టులు, అపవిత్రులు చూడ జాలరు. నీవు ఉచ్ఛిష్టుడ వగుటచేత అపవిత్రుడవై యుందువు కనుక నీకు ఆమె కనపడలేదు. అని చెప్పగా, ఉత్తంకుడు జ్ఞప్తికి తెచ్చుకొని రాజుతో నిట్లనెను.

"ఔను! నాకు నిక్కముగా అశుద్ధి కలిగినది. ఇక్కడికి వచ్చునప్పుడు నేను నిలుచుకొని, నడచుచును ఆచమనము చేసితిని''. ఆ మాటను పౌష్యు

డతనితో 'ఇదియే నీవు చేసిన నియమోల్లంఘనము. నిలుచొని, నడచుచును చేసిన ఆచమనము చేయని దానితోనే సమానమగును' అని యనగా, ఉత్తంకుడు రాజుతో 'ఔను! సరియే!' అని చెప్పి, కాళ్ళు, చేతులు, ముఖము శుభ్రముగా కడిగికొని ఆసనమునందు పూర్వాభిముఖుడై కూర్చొని హృదయమువరకు చేరదగి, ధ్వని, నురుగు లేని శీతలజలముచేత మూడు పర్యాయములు ఆచమనము చేసి, రెండుసార్లు బొటనవ్రేలి మొదటి భాగము నుండి ముఖమును తుడుచుకొని నేత్రములు, నాసిక మొదలైన యింద్రియ రంధ్రములను జలసహితములైన వ్రేళ్ళతో స్పృశించి అంతఃపురమునకు పోయెను.

అట్లు పరిశుద్ధుడై పోయిన ఉత్తంకునకు రాజపత్ని కనపడెను. ఆమె ఉత్తంకుని చూడగనే నిలుచొని ప్రణామము చేసి, 'భగవన్'! నీకు స్వాగతము! ఆజ్ఞయిమ్ము, ఏమి సేవ చేయుదును!'' అని యనగా ఉత్తంకుడు ఆరాణితో నిట్లనెను :

దేవీ! నేను నా గురువుకొఱకు నీ రెండు కుండలములు యాచించు చున్నాను. ఇమ్ము!" ఇట్లు అడిగిన ఉత్తంకునకు గల గురుభక్తికి ఆ రాణి మిక్కిలి ప్రసన్నురాలై, 'ఇతడు సత్పాత్రుడైన బ్రాహ్మణుడు కనుక ఇతడు నిరాశతో తిరిగి పోగూడదు!' అని తలచి ఉత్తంకునకు తన రెండుకుండలములు స్వయముగా చెవుల నుండి తీసి యిచ్చి, అతనితో-

'బ్రహ్మన్! నాగారాజైన తక్షకుడు ఈ కుండలములను పొందుటకు మహాప్రయత్నము చేయు చున్నాడు. కనుక నీవు మిక్కిలి జాగరూకుడవై వీనిని తీసికొని పోవలెను' అని చెప్పెను.

రాజపత్ని యిట్లు చెప్పగా ఉత్తంకుడు ఆమెతో 'దేవీ! నీవు నిశ్చింతగా నుండుము. నాగరాజు తక్షకుడు నన్ను ఆక్రమించుటకు సాహసము చేయజాలడు! అని చెప్పి ఆమె యాజ్ఞగైకొని ఉత్తంకుడు పౌష్యమహారాజు కడకు పోయి అతనితో 'రాజా! నేను మిక్కిలి సంతుష్టుడనైతిని. నీ యాజ్ఞ తీసికొని పోవ .ోవు చున్నాను' అని యనగా రాజు అతనితో నిట్లనెను.

"భగవాన్! అనేక దినము లైనను నొకసత్పాత్రు డైన బ్రాహ్మణు డెవడు లభించును? నీవు గుణవంతుడ వైన అతిథిగా విచ్చేసితివి. కనుక నేను శ్రాద్ధము చేయ గోరుచున్నాను. కనుక క్షణము (సమయము) తీసికొనుము. (శ్రాద్ధములో బ్రాహ్మణుని నియమించుటకు 'క్షణము' అథవా సమయము' అని యనెదరు)."

ఇట్లు, పౌష్యు డడుగగా ఉత్తంకు డతనితో "నేను (క్షణము) సమయ మిచ్చితిని. కాని త్వరగా నీ శ్రాద్ధకార్యము ముగింపుము. మీ యింటిలో ఇప్పుడు పరిశుద్ధము, సుసంస్కృతము నైన భోజనము సిద్ధముగా నున్నచో తెప్పింపుము" అని యనగా, రాజు వెంటనే అప్పుడు సిద్ధముగా నున్న భోజనమే ఉత్తంకునకు పెట్టెను. భోజన పదార్థములు తన యెదుటకు వచ్చినప్పుడు ఉత్తంకుడు ఆ పదార్థములలో వెంట్రుక పడి యుండుట, ఆ యన్నము చల్లబడి యుండుటయు చూచి, "ఇది అపవిత్రాన్నము!" అని నిశ్చయించుకొని ఉత్తంకుడు పౌష్యునితో 'రాజా! నీవు నాకు అపవిత్రమైన యన్నము పెట్టితివి కనుక అంధుడవయ్యెదవు గాక!' అని శపించెను.

ఇట్లు ఉత్తంకుడు శపింపగా, పౌష్యమహారాజు అతనికి ప్రతిశాపము ఇవ్వ దలచి 'మహర్షీ! పరిశుద్ధమైన యన్నమునుగూడ దూషితాన్న మని యంటివి. కనుక నీవుగూడ సంతానహీనుడ వగుదువుగాక! యని శపించెను.

అప్పుడు ఉత్తంకుడు 'మహారాజా! నాకు నీవు అపవిత్రాన్నముపెట్టి, తిరిగి నా శాపమునకు ప్రతిశాపముగూడ ఇచ్చు చున్నావు. ఇది నీకు ఉచితము కాదు. కనుక మొదట నీవు అన్నమును ప్రత్యక్షముగా చూడుము!' అని యనగా పౌష్యుడు ఆయన్నము అపవిత్రముగా నుండుట చూచి దానికి కారణము తెలిసి కొనగా ఆ యన్నమును వెంట్రుకలు విరియబోసికొనినస్త్రీ వండెను గనుక దానిలో కేశము పడి యుండెను. చాలకాలమునకు పూర్వము వండబడినది గనుక ఆ యన్నము చల్లబడి యుండెను. కాబట్టి అది అపవిత్రాన్న మని నిశ్చయించు కొని పౌష్యమహారాజు ఉత్తంకమహామునిని ప్రసన్నుని చేయుచు, నతనితో నిట్లనెను:

"భగవాన్! కేశయుక్తము, శీతలము నైన ఈ యన్నము అజ్ఞానమువలన నీకు పెట్ట బడెను. కనుక ఈ యపరాధమునకు నన్ను క్షమింపు మని వేడు చున్నాను. నేను అంధుడు కాకుండునట్లు నీవు దయతో శాపము ఉపసంహరించు కొనుము!

ఇట్లు, రాజు ప్రార్థింపగా, ఉత్తంకు డతనితో, 'రాజా! నామాట అసత్యము కాదు. నీవు మొదట అంధుడ వై పిదప కొన్ని దినములలోనే అంధత్వదోషము నుండి విముక్తుడ వయ్యెదవు. ఇప్పుడు నీవు ఇచ్చినశాపము నాకు తగులకుండు నట్లుగా ప్రయత్నింపుము!' అని యనగా పౌష్యమహారాజు ఉత్తంకునితో నిట్లనెను.

మహాత్మా! నేను నీ కిచ్చిన శాపము ఉపసంహరించుకొనుటకు అసమర్థు డను. ఇంతవరకుగూడ నా కోపము శాంతింప కున్నది. బ్రాహ్మణుని హృదయము వెన్నవలె మృదువుగా, త్వరగా కరగునదిగా నుండును. అతని వాక్కు మాత్రమే తీక్ష్ణ మైన అంచుగల చురకత్తివలె ప్రభావశాలియై యుండును; కాని, ఈ రెండును క్షత్రియునకు విపరీతములై యుండును. క్షత్రియునివాక్కు నవనీతసమానముగ కోమలమై యుండును. కాని, అతని హృదయము తీక్ష్ణధార గల చురకత్తివలె తీక్ష్ణముగా నుండును. కనుక ఇట్టి పరిస్థితిలో నేను కఠోర హృదయము గలవాడ నగుటచేత నా శాపమును త్రిప్పుకొన జాలను. కనుక నీవు వెడలిపొమ్ము!"

ఇట్లు రాజు చెప్పగా ఉత్తంకుడు ఆ రాజుతో నిట్లనెను:-

"రాజా! నీవు నాకు పెట్టినయన్నము చూచి యది అపవిత్ర మని తెలిసి కొని, వినయపూర్వకముగా క్షమింపు మని నన్ను కోరితివి. కాని, తొలుత నీవు 'శుద్ధమైన అన్నము దూషిత మని నే ననుచున్నా నని నన్ను సంతానహీనుడవు కమ్మని శపించితివి. తరువాత నీవు చూచి ఆ యన్నము దోషదుష్ట మని ప్రమాణీక రించు కొంటివి. కనుక నీ శాపమునకు కారణము అసత్య మగుటచేత అది నాకు అంటదు" అని యనెను.

"రాజా! ఇక నిప్పుడు నేను నా కార్యసాధనము చేసెదను" అని చెప్పి ఉత్తంకుడు రెండుకుండలములు తీసికొని పోవు చుండగా, మార్గములో తన వెనుక

వచ్చు చున్న ఒక నగ్నక్షపణకుని* చూచెను. అతడు మాటిమాటికి కనపడుచు, దాగుచు, దృశ్యాదృశ్యుడుగ తన వెంటవచ్చు చుండెను. కొంతదూరము పోయిన తరువాత ఉత్తంకుడు ఆకుండలములను ఒక జలాశయ తీరభూమియందు పెట్టి, జలములో శౌచ-స్నాన-ఆచమన-సంధ్యా-తర్పణాదికార్యములు చేయు చుండెను. ఇంతలోనే ఆ సన్యాసి మిక్కిలి త్వరగా అక్కడకు వచ్చి కుండలములు తీసికొని పోయెను.

ఉత్తంకుడు స్నాన-తర్పణాదులు ముగించుకొని పవిత్రుడై దేవతాగురుజనములకు నమస్కరించి జలాశయమునుండి బయటకు వచ్చి కుండలములు తీసికొని పోవుచున్న క్షపణకుని వెన్నంటి పరుగెత్తి పోయెను.

వాస్తవముగ ఆ క్షపణకుడే నాగరాజైన తక్షకుడు. ఉత్తంకుడు పరుగెత్తి పోవు చుండుటచేత త్వరగా పోయి ఆ క్షపణకుని పట్టుకొనిన వెంటనే అతడు క్షపణకరూపము విడిచి తక్షకరూపముతో త్వరగా ఒక బిలములో దూరి నాగలోకమందలి తనయింటికి పోయెను.

తరువాత ! తనకు పౌష్యమహారాజపత్ని చెప్పినమాట జ్ఞప్తికి వచ్చి ఉత్తంకుడు నాగలోకమువరకు క్షపణకుని వెన్నంటి పోయెను. మొదట ఉత్తంకుడు తనదండకాష్ఠముతో ఆ బిలమును త్రవ్వ దొడగెను. కాని, అతనికి చేతకాక పోయెను. అట్లు క్లేశపడుచున్న ఉత్తంకునకు సహాయము చేయుటకుగాను ఇంద్రుడు తన వజ్రాయుధముతో "పొమ్ము: ఈ బ్రాహ్మణునికి సహాయము చేయుము!" అని చెప్పగా వజ్రాయుధము పోయి ఉత్తంకుని దండకాష్ఠములో ప్రవేశించి ఆ బిలమును చీల్చెను. దానిచేత పాతాళలోకమునకు పోవుటకు మార్గము ఏర్పడెను.

అప్పుడు ఉత్తంకుడు ఆ బిలములో దూరి ఆ మార్గముగుండా పోయి అపారమైన నాగలోకమును దర్శించెను. ఆ లోకమందు వివిధ మందిరములు,

* సాధారణముగ 'క్షపణక' శబ్దమునకు' సన్యాసి'యని యర్థము. జైన, బౌద్ధమతముల సన్యాసులలో నగ్నముగా తిరుగువారు "నగ్నక్షపణకులు" అని అనబడుదురు. ఇటీవలికాలములో బౌద్ధులకే ఈపేరు గలదు.

భవనములు, మండపములు, నూర్లకొలది ద్వారములు, చిన్న పెద్ద క్రీడా రంగములు, అంతట వ్యాపించి శోభిల్లు చుండెను. అక్కడికి పోయి ఉత్తంకుడు నాగులను ఇట్లు స్తుతించెను.

"ఐరావతుడు రాజుగా గలిగి, యుద్ధభూమియందు విశేషముగ శోభిల్లుచు, వాయు - విద్యత్తులచేత ప్రేరితమై, జలమును వర్షించు మేఘములవలె ధారావాహికముగా బాణవృష్టిచేయు సర్పములకు జయమగు గాక! గంగానది యుత్తరతీరమందు అనేక నాగులయిండ్లు కలవు. అక్కడ నున్న పెద్ద పెద్ద సర్పములనుగూడ నేను స్తుతించుచున్నాను!

ఒక్క ఐరావత నాగరాజుదప్ప, సూర్యభగవానుని ప్రచండ కిరణ సైన్యమునందు సంచరింప గోరువాడు మరియొక డెవడున్నాడు? ఐరావతుని సోదరు డైన ధృతరాష్ట్రుడు సూర్యునితోపాటు ప్రకాశించుచు పోవునప్పుడు ఇరువదియెనిమిదివేల ఎనిమిది సర్పములు సూర్యుని యశ్వములకు పగ్గము లగును. ఐరావత నాగరాజుతో కలిసి పోవువారు, అతనికి దూరముగ మార్గము నందు పోవువారు నైన యతని జ్యేష్ఠభ్రాతలకు నేను నమస్కారము చేయు చున్నాను. కురుక్షేత్రమునందు, ఖాండవవనమందును సర్వదా నివసించుచున్న తక్షక నాగరాజును కుండలముల కొరకు స్తుతించుచున్నాను.

తక్షకుడు - అశ్వసేనుడు అను నిరువురు నాగులు ఎల్లప్పటికిన్ని కలిసి తిరుగు చుందురు. ఈ యిరువురు కురుక్షేత్రమందలి 'ఇక్షుమతీ' నదీ తీరమందు నివసించు చుండిరి. పాతాళలోకమందు నాగరాజ పదవిని సంపాదించుట కొరకు సూర్యభగవానుని ఉపాసించుచు కురుక్షేత్రమందు ఉన్న 'శ్రుతసేన' నామముతో ప్రసిద్ధు డైన తక్షకుని తమ్మునకు నేను సర్వదా నమస్కారము చేసెదను.

ఇట్లు, ఉత్తంకుడు నాగులస్తోత్రము చేసి నప్పటికిని అతడు కుండలములు పొందజాలనప్పుడు మిక్కిలి చింతిల్లెను. అప్పుడు ఉత్తంకునకు అక్కడ ఇద్దరు స్త్రీలు కనపడిరి. వారు సుందరమైన మగ్గము నందు దారములతో వస్త్రము నేయు చుండిరి. ఆ దారములు కొన్ని నల్లగా కొన్ని తెల్లగా నుండెను అక్కడ ఎనిమిది ఆకులుగల యొక చక్రమును అతడు చూచెను దానిని అరుగురు బాలకులు త్రిప్పు చుండిరి అక్కడనే ఒక ఉత్తమపురుషుడు కనపడెను.

అతనితో పాటే ఒక అందమైన గుఱ్ఱముగూడ నుండెను. అవి యన్నియు చూచి ఉత్తంకుడు ఇట్లు వైదికస్తుతి చేసెను:

"నాశరహితమై నిరంతరము తిరుగుచున్న ఈ కాలచక్రమందు మూడు నూర్ల అరువది ఆకులు, ఇరువది-నాలుగు పర్వములు నున్నవి. ఈ చక్రమును ఆరుగురు బాలకులు త్రిప్పుచున్నారు. సమస్త ప్రపంచ స్వరూపము గల యిద్దరు యువతులు నిరంతరము తెల్లని - నల్లని దారములను ఇటు నటు చలింప జేయుచు వాసనా జలరూపమైన వస్త్రమును నేయు చున్నారు. ఆ యిరువురే సమస్త భూతములను, భువనములను సర్వదా నడుపు చున్నారు. వజ్రాయుధ ధారియై, త్రిలోక రక్షణము చేయుచు, వృత్రాసుర - నముచి దానవులను సంహరించి, నల్లరంగు గల రెండు వస్త్రములను ధరించి, లోకమునందు సత్యా-సత్యముల వివేకము చేయుచు, జలము నుండి పుట్టిన ప్రాచీనాగ్నిరూప మైన అశ్వమును (ఉచ్చైఃశ్రవము) వాహనముగా చేసికొని, త్రిలోక శాసకుడై జగదీశ్వరుడైన దేవేంద్రునకు నమస్కారము చేసెదను."

ఈ విధముగ స్తోత్రము చేయుచున్న ఉత్తంకునితో ఆ పురుషుడు, "బ్రహ్మన్! నీ స్తోత్రముచేత నేను మిక్కిలి సంతోషించితిని. నీకు ప్రియమేమి కావలయునో చెప్పుము' అని యనగా ఉత్తంకుడు అతనితో, 'మహాత్మా! నాకు ఈ నాగులందరు అధీనులు కావలెను' అని యనగా, ఆ పురుషుడు మరల ఉత్తంకునితో 'ఈ గుఱ్ఱపు గుదస్థానమందు ఊదుము' అని యనగా ఉత్తంకుడు దాని గుదములో ఊదగా ఆ యశ్వశరీరములోని యన్ని రంధ్రములనుండి ధూమసహితములైన అగ్నిజ్వాలలు వెడలజొచ్చెను.

అప్పుడు సమస్తనాగలోకము పొగచే నిండి యుండుట చూచి తక్షకుడు అగ్నిజ్వాలల భయముచేత దుఃఖితుడై రెండు కుండలములు తీసికొని త్వరగా వచ్చి ఉత్తంకునితో 'బ్రహ్మన్! నీవు ఈ రెండు కుండలములు గైకొనుము' అని యనగా కుండలములు తీసికొని ఉత్తంకుడు 'అయ్యో! నేడే గురుపత్నియొక్క పుణ్యకవ్రత దినము. నేను ఆమెను చేరుటకు చాల దూరము పోవలసి యున్నది. ఇట్టిపరిస్థితిలో నేను ఏవిధముగ ఆమెకు ఈకుండలములను సమర్పించ గలను!' అని చింతించు చుండగా, ఆ పురుషుడు ఉత్తంకునితో నీవు ఈ గుఱ్ఱ మెక్కుము.

ఇది నిన్ను క్షణకాలములో నీయుపాధ్యాయుని ఇల్లు చేర్చ గలదు. అని యనగా, ఉత్తంకుడు ఆ పురుషునిమాట యంగీకరించి ఆ గుఱ్ఱ మెక్కి త్వరగా పోయి ఉపాధ్యాయుని యిల్లు చేరెను.

ఆనాడు గురుపత్ని స్నానము చేసి తల దువ్వుకొనుచు 'ఉత్తంకుడు ఇంతవరకు రాలేదు!' అని యోచించి ఆమె అతనిని శపించుటకు ఆలోచించు చుండెను. ఇంతలోనే, ఉత్తంకుడు వచ్చి ఆమెకు నమస్కారము చేసి రెండు కుండలములు సమర్పింపగా ఆమె ఉత్తంకునితో నిట్లనెను:

"ఉత్తంకా నీవు సకాలములో సరియైన చోటికి వచ్చి చేరితివి. నీకు స్వాగతము. ఏ యపరాధము లేని నీకు శాపము ఈయక మంచిపని చేసితిని. నీకు శుభమగు గాక! సిద్ధిని పొందెదవు గాక!" ఇట్లు ఉత్తంకుడు గురుపత్ని యాశీర్వాదము పొంది ఉపాధ్యాయునకు నమస్కరింపగా గురువతనితో 'వత్సా! నీవు తిరిగి వచ్చుటకు ఇంత విలంబము ఎందు కయ్యెను?' అని యనగా ఉత్తంకుడు ఉపాధ్యాయునితో నిట్లనెను:-

"భగవన్! నాగరాజైన తక్షకుడు ఈ కార్యమునకు విఘ్నము చేసెను. కనుక నేను ఆ లోకమునకు పోయితిని. అక్కడనే మగ్గముపై దారములతో వస్త్రము నేయుచున్న యిద్దరు స్త్రీలను నేను చూచితిని. ఆ దారములు కొన్ని నల్లవిగా కొన్ని తెల్లవిగా నుండెను. అవి యన్ని ఏమి? అక్కడనే నేను పన్నెండు ఆకులు గల ఒక చక్రము చూచితిని దానిని ఆరుగురు కుమారులు త్రిప్పు చుండిరి. అది కూడ ఏమి? అక్కడ ఒక పురుషుని గూడ చూచితిని అత డెవడు? ఒక చాల పెద్ద అశ్వమును చూచితిని. అది ఏమి?

మహాత్మా! ఇక్కడినుండి నేను పోవుచున్నప్పుడు మార్గములో ఒక ఎద్దును చూచితిని. దానిపైన ఒక పురుషుడు ఎక్కి యుండెను. ఆ పురుషుడు నాతో "ఉత్తంకా! ఈ వృషభగోమయము తినుము. నీ యుపాధ్యాయుడుగూడ పూర్వము ఇది తిని యుండెను" అని యనగా, ఆ పురుషుని మాట ప్రకారము నేను ఆ యెద్దు పేడ తింటిని, ఆయెద్దు, ఆ పురుషుడు ఎవరు? అది యంతయు నేమి?" అని యనెను.

ఆ మాట విని ఉపాధ్యాయుడు ఇట్లనెను :-

"వత్సా! ఆ యిద్దరు స్త్రీలు 'ధాత, విధాత' అనువారు. ఆ తెల్లని నల్లని దారములు, రాత్రి, పగలు. పన్నెండు ఆకుల చక్రము త్రిప్పునట్టి యారుగురు కుమారులు ఆరు ఋతువులు. పన్నెండు ఆకులు పన్నెండు నెలలు సంవత్సరమే ఆ చక్రము. నీకు నాగలోకములో కనపడిన పురుషుడు పర్జన్యుడు (ఇంద్రుడు). అతడు ఎక్కిన యశ్వము అగ్నిదేవుడు. ఇక్కడినుండి నీవు పోవునప్పుడు త్రోవలో నీవు చూచిన వృషభమునాగరాజైన ఐరావతుడు. ఆవృషభము నెక్కినవాడు ఇంద్రుడు. నీవు తినినగోమయము అమృతము. నీవుఅమృతపానము చేసినందు చేతనే నాగలోకమునకు పోయినను మరణించలేదు.

నాయనా! ఇంద్రుడు నాకు మిత్రుడు. నీయందలికృపచేతనే అతడునిన్ను అనుగ్రహించెను. ఇంద్రుని యనుగ్రహమువలననే నీవు రెండుకుండలములను తీసికొని తిరిగి వచ్చితివి. కనుక పుత్రా! ఇక నీవు పొమ్ము. నేను అజ్ఞ యిచ్చుచున్నాను. నీకు శ్రేయస్సులు కలుగుగాక,"

ఉత్తంకుడు ఉపాధ్యాయునియాజ్ఞ పొంది తక్షకునిపై కోపముతో అతనికి ప్రతిక్రియ చేయ దలచి హస్తినాపురమునకు పోయెను. అతడు హస్తినాపురమునందు జనమేజయ మహారాజుతో కలిసెను.

జనమేజయుడు పూర్వము తక్షశిలకు పోయి యుండెను. అక్కడ అతడు సంపూర్ణవిజయము పొంది యుండెను. మహావిజయము సాధించివచ్చి మంత్రిమండలితో సభాభవనమందు కూర్చొనియున్న జనమేజయుని చూచి ఉత్తంకుడు ప్రప్రథమము ధర్మము ప్రకారము "రాజా! నీకు జయ మగుగాక!" అని ఆశీర్వదించెను. తరువాత సముచితసమయమందు యుక్తములైన మాటలతో ఆరాజుతో నిట్లు చెప్పెను:-

"రాజా! నీతండ్రిని హింసించిన దురాత్ముడైన తక్షకునకు ప్రతిక్రియ చేయుము. దైవము అనుకూలపరిచిన యీ సమయము, ఈ కార్యము చేయుటకు తగిన దని తలచెదను. నీ తండ్రియగు పరీక్షిత్తును భక్తితో సన్మానించుటకు వెంటనే పొమ్ము. నిరపరాధియైన నీ తండ్రి తక్షకదష్టుడై పిడుగు పడిన చెట్టువలె

కూలిపోయెను. బల-దర్పములచేత పెచ్చుపెరిగిన అపన్నగాధముడు, నీతండ్రిని కరచి అకార్యము చేసెను. ఆయన రాజర్షివంశరక్షకుడు. దేవసముడు. ఆయన కాశ్యపుని కడకుపోవు చుండగా, ఆ పాపాత్ముడు మరలించి కుట్రచేసెను కనుక, ఆ పాపిష్ఠుని మండుచున్న అగ్నిలో సర్పయాగమునందు త్వరగా హోమము చేయుము. అప్పుడే నీతండ్రిని గౌరవించినవాడ వగుదువు. దానితోపాటు నాకు గూడ ప్రియము చేసెదవు. గురువుయొక్క కార్యమునకై నేను పోవుచుండగా దురాత్ముడైన తక్షకుడు నాకు విఘ్నము కలిగించెను."

"శౌనకా! ఇట్లు ఉత్తంకుడు చెప్పగనే జనమేజయునకు తక్షకునిపై మిక్కిలి కోపము వచ్చెను. అతడు మండుచున్న అగ్నిలో హవిస్సు వేసినట్లు, ప్రజ్వలించెను. అప్పుడు, ఆ రాజు దుఃఖించుచు తనతండ్రి స్వర్గమునకు పోవు నుపాయమమును గూర్చి మంత్రులను, ఉత్తంకుని సమక్షములోనే అడిగెను."

**పౌష్యపర్వము సమాప్తము**

# పౌలోమ పర్వము

**కథా ప్రవేశము :**

"మహాపౌరాణికు డైన సూత పుత్రుడు ఉగ్రశ్రవుడు నైమిశారణ్యము నందు కులపతియైన శౌనకుడు చేసిన ద్వాదశ వార్షిక సత్రయాగమునకు వచ్చిన ఋషులను కృతాంజలియై, 'మీ రేమి విన గోరుచున్నారు? నే నేమి చెప్పుదును?' అని యడుగగా, ఋషులు, 'భగవన్! ఇప్పుడు కులపతియైన శౌనకుడు యజ్ఞశాలలో నున్నాడు. ఆయనకు దేవాసురమనుష్య, పశుపక్ష్యాది కథ లన్నియు తెలియును ఆయన సమర్థుడు. తపోనియమ వ్రత నిష్ఠుడు. వేద శాస్త్ర పురాణజ్ఞుడు. సత్యవాది శాంతుడు. మా కందరకు మాన్యుడు కనుక, ఆయన కొరకు వేచియుందము. ఆయన యజ్ఞశాల నుండి వచ్చి అడిగిన కథ నీవు చెప్పుము' అని అనిరి. ఆ మాటకు ఉగ్రశ్రవుడు అంగీకరించెను.

తరువాత శౌనకుడు తన హోమకార్యము లన్నియు ముగించుకొని దేవ పితృపూజలు చేసి ఆ మునుల సభకు వచ్చి సూతపుత్రునితో, 'మహాత్మా! నీ తండ్రి సమస్త పురాణేతిహాసముల నెరిగినవాడు, అది నీకుగూడ తెలిసియుండును.

కనుక, తొలుత భృగువంశ కథ చెప్పుము. ఈ ఋషు లందరు నీనోట కథ వినుటకు కుతూహలముతో నున్నారు' అనెను. ఆమాటకు సూతపుత్రు డైన ఉగ్రశ్రవుడు, భృగువంశ కథ చెప్పుటకు ఆరంభించెను.

## కథా ప్రవేశము సమాప్తము

### భృగు మహర్షి యొక్క ఆశ్రమమునందు పులోమదానవుల- అగ్నిదేవుల సంభాషణము :-

ఉగ్రశ్రవునితో శౌనకుడు ఇట్లనెను :-

''మహాత్మా! పూర్వము నీ తండ్రి యైన సూతుడు అఖిల పురాణములను అధ్యయనము చేసెను. నీవు గూడ అది యంతయు నెరుగుదువు.పురాణములందు దివ్యకథలు బుద్ధిమంతుల యొక్క పూర్వవంశ చరితములు మీ తండ్రి చెప్పగా విన్నాను. వానిలో భృగువంశమును గూర్చి, తొలుత విన గోరుచున్నాను. మేము శ్రద్ధగా వినెదము ఆ కథ చెప్పుము." అమాటకు ఉగ్రశ్రవు డి ట్లనెను.

''శౌనకా! పూర్వము బ్రాహ్మణశ్రేష్ఠులు, అధ్యయనము చేసినది, వైశంపాయనాదులు చెప్పినది, నా తండ్రి వలన బాగుగా నేర్చుకొనినదియు నైనభృగు వంశ చరిత్ర చెప్పెద వినుము.

''శౌనకా ! ఇంద్రాది దేవతలచేత పూజింపబడినది భృగువంశము. పూర్వము వరుణ దేవుని యజ్ఞమునందు బ్రహ్మదేవునిచేత అగ్నినుండి భృగు మహర్షి పుట్టింప బడెను. భృగువు ప్రియ పుత్రుడు 'చ్యవనుడు' అనుపేరు గలిగి యుండెను. భార్గవుడైన చ్యవనునకు ధార్మికుడైన 'ప్రమతి' అనువాడు జన్మించెను. ప్రమతికి ఘృతాచి యందు 'రురుడు' అను పుత్రుడు జన్మించెను. రురునకు వేదశాస్త్రపారంగతుడైన 'శునకుడు' ప్రమద్వర యందు పుట్టెను. ధర్మాత్ముడైన ఆ శునకుడు, నీకు పూర్వపితామహుడు (ముత్తాత). అతడు, మహాతపస్వి, యశస్వి, సత్యవాది, శాస్త్రజ్ఞుడు, ధార్మికుడు, బ్రహ్మనిదుడు, నియతవ్రతుడు, నియతాహారము గలవాడుగా నుండెను''.

ఆమాట విని శౌనకుడు సూతపుత్రుని "భార్గవుడైన చ్యవనునకు చ్యవనత్వము ఎట్లు వచ్చెను? అతడు ఆ పేరుతో ఏల ప్రఖ్యాతు డయ్యెను?" అని యడిగెను. ఆ మాటకు సూత్రపుత్రు డిట్లు బదులు చెప్పెను.

**చ్యవనమహర్షి జననము - అతని తేజస్సుచేత, పులోమ రాక్షసుడు చచ్చుట - భృగుమహర్షి అగ్నికి శాప మిచ్చుట;**

"శౌనకా! భృగుమహామునికి పులోమ అనుపేరు గల ప్రియ భార్యయందు భృగువీర్యమువలన గర్భము నిలిచెను. కొంత కాలమునకు భృగుమహర్షి స్నానార్థము పోయెను. అప్పుడు పులోము డనునొక రాక్షసుడు భృగుమహర్షి యాశ్రమములో ప్రవేశించెను. అప్పుడు భృగు భార్యను చూచి హృదయ బాధతో పీడితుడైన ఆ రాక్షసుడు మూర్ఛిల్లెను. భృగుపత్ని పులోమ అభ్యాగతుడైన ఆ రాక్షసునకు వన్యఫలమూలాదులచేత ఆతిథ్య మిచ్చెను. హృదయ బాధచే పీడితుడైన ఆ రాక్షసుడు ఆమెను చూచి, సంతోషించి 'నా కార్యము నెరవేరెను' అని చెప్పి ఆమెను అపహరింప దలచెను.

శౌనకా! పులోమను పూర్వము పులోముడు వరించి యుండెను.* తరువాత, ఆమెతండ్రి ఆమెను భృగుమహర్షికి ఇచ్చి, శాస్త్రోక్తముగ వివాహము చేసెను. పులోమ తండ్రి చేసిన కపటకృత్యము శల్యమువలె పులోముని హృదయమును బాధించు చుండెను; కనుక, ఈ యవకాశమును పురస్కరించుకొని పులోముడు ఒంటరిగా నున్నపులోమను అపహరింప దలచెను.

---

* పులోమ బాల్యావస్థలో నున్నప్పుడు, ఆమె యేడ్పును ఆపుటకుగాను ఆమె తండ్రి ఆ బాలికను భయపెట్టుటకు 'అరే! రాక్షసా! నీవు ఈమెను పట్టుకొని పొమ్ము' అని యనెను అంతకు పూర్వమునుండియే ఆ యింటిలో పులోము డను రాక్షసుడు దాగియుండెను. అప్పు డారాక్షసు డాబాలిక మాట విని ఆమెను తన మనస్సులో 'ఈమె నాపత్ని' యనివరించుకొనెను. ఇంత మాత్రమే పూర్వము జరిగిన విషయము. దీని యభిప్రాయ మేమనగా, 'ఆట పాటలలో గాని, నవ్వులాటలలోగాని, పిల్లలను బెదరించుటకు గాని, ఎప్పుడు గూడ పిల్లలతో ఇటువంటి మాటలు చెప్ప గూడదు. రాక్షసుల పేర్లు గూడ పిల్లలకు పెట్ట గూడదు' అని.

తరువాత హోమశాలలో జ్వలించుచున్న యగ్నిని ఆ రాక్షసు డిట్లు ప్రశ్నించెను:-

"అగ్నిదేవా! ఈమె ఎవరిభార్య? సత్యముగా చెప్పుము. నీవు దేవతలకు ముఖమై యున్నావు. కనుక, అగ్నిదేవా! చెప్పుము. ఈమెను నేను భార్యగా వరించి యుంటిని. తరువాత, ఈమెతండ్రి అది అసత్యము చేయ దలచి ఈమెను భృగువున కిచ్చెను. ఈమె భృగుభార్య యగునా? సత్యముచెప్పుము. ఈమెనపహరించ దలచినాను. ఆనాటి నాకోపము నా హృదయమును నేటికిగూడ దహించుచున్నది. పూర్వము నేను భార్యగా కోరిన ఈమెను భృగువు పొందెను".

"శౌనకా! పులోమరాక్షసుడు పలుమార్లు అగ్నిని ఇట్లు అడిగెను:-

"అగ్నిదేవా! నీవు సర్వభూతములలో సంచరించు చుండెదవు. పాప పుణ్యములకు నీవు సాక్షిభూతుడవు. కనుక, సత్యము చెప్పుము. నేను పూర్వము వరించిన భార్య ఈ పులోమ. నన్ను కా దని ఈమెతండ్రి ఈమెను భృగున కిచ్చెను. ఇది సత్య మని నీవు చెప్పినయెడల ఇక్కడినుండి ఈమెను తీసికొని పోయెదను. కనుక, సత్యము చెప్పుము."

ఆ మాటకు అగ్ని మిక్కిలి దుఃఖించి ఇటు అసత్యమునకు అట్లు భృగు శాపమునకున్ను భయపడి పులోమునితో నిట్లనెను:-

"పులోమా! ఈమె నీవు వరించిన పులోమయే. కాని, ఈమెను నీవు శాస్త్రోక్తముగ పెండ్లి చేసికొన లేదు. తండ్రి యీమెను భృగుమహర్షికి, 'మంచి వరుడు లభించె' నని యిచ్చెను. ఆ మహర్షి యీమెను విధిపూర్వకముగా, నన్ను సాక్షిగా పెట్టుకొని పెండ్లి చేసికొనెను. నేను అసత్యము చెప్పను. లోకములో అసత్యమును ఎవరుగూడ ప్రశంసించరు.

**పులోముని వినాశము :**

"శౌనకా! అగ్నిదేవునిమాట విని పులోమ రాక్షసుడు పులోమను వరాహ రూపముతో అతివేగముగ అపహరించుకొని పోయెను. అప్పుడు పులోమ గర్భస్థ శిశువు జారి పడెను. కాబట్టి, ఆ శిశువునకు 'చ్యవనుడు' (జారి పడినవాడు) అను

షేర్పు వచ్చెను. సూర్యతేజస్సు గల చ్యవనుని చూచినవెంటనే పులోమ రాక్షసుడు భయపడి, ఆమెను విడిచి క్రిందపడి భస్మీభూతు డయ్యెను.

"శౌనకా! తరువాత పులోమ దుఃఖించుచు ఆ శిశువుతో భృగుమహాముని కడకు పోవు చుండగా, మార్గములో బ్రహ్మదేవుడు, తనకోడ లగు భృగపత్నిని చూచి ఓదార్చెను. ఆమె కన్నీటివలన ఒక మహానది ఉద్భవించెను. ఆ నది భృగ్వాశ్రమము వైపు ప్రవహించుచు ఆమెకు మార్గదర్శనము చేయు చుండెను. కనుక, ఆ నదికి, 'వధూసరా' (వధువు ననుసరించుచు పారునది) అను పేరు వచ్చెను. ఆ నది అట్లే చ్యవనాశ్రమమువరకు ప్రవహించుచు పోయెను. శౌనకా! అతడే భృగుపుత్రుడైన చ్యవను డని యెరుగుము.

**భృగుడు అగ్నికి శాప మిచ్చుట :**

"శౌనకా! అట్లు వచ్చిన భార్యాపుత్రులను చూచి భృగుడు జరిగిన సమాచారము భార్యవలన విని మిక్కిలి కోపముతో నిట్లనెను:

"భామినీ! నీవు నాభార్య వని ఆ రాక్షసునకు ఎవడు తెలిపెను? పులోమునకు 'నీవు నా భార్యవు' అని తెలియదు గదా! నిన్ను తెలిపిన వానిని శపించెదను. నా శాపమునకు భయపడనివా డెవడు? నీ కీ యపకారము ఎవడు చేసెను?"

ఆ మాటకు పులోమ భృగునితో నిట్లనెను :

"భగవన్! అగ్ని ఆ పులోమ రాక్షసునకు నన్నుగూర్చి తెలిపిన వెంటనే పులోముడు ఆక్రోశించు చున్న ఆడు లకుముకి పిట్టను వలె ఏడ్చుచున్న నన్ను హరించుకొని పోయెను. అట్లు కొనిపో బడుచున్న నన్ను ఈ సీకుమారుడు తన తేజస్సుచేత విడిపించెను. వెంటనే ఈ రాక్షసుడు భస్మీభూతు డయ్యెను."

"శౌనకా! యిట్లు పులోమ చెప్పగా విని భృగుమహర్షి అతికోపముతో అగ్నిని 'సర్వభక్షకుడవు కమ్ము!' అని శపించెను. అప్పుడు అగ్ని అతిక్రుద్ధుడై ఇట్లనెను.

**భృగుశాపకుపితుడై అగ్ని అదృశ్యుడగుట - బ్రహ్మదేవుడతని శాపము తగ్గించి యగ్నిని సంతోషపరచుట :**

"బ్రహ్మన్! సాహసముతో నన్ను ఇట్లెందుకు శపించితివి? నేను ధర్మనిష్ఠుడనై సత్యము చెప్పితిని. ఇందులో నా తప్పు ఏమున్నది? నన్నడిగినప్పుడు సత్యము చెప్పుట తప్పగునా? సాక్షిని సాక్ష్యమడిగినప్పుడు, తెలిసినప్పటికిన్ని అసత్యము చెప్పిన సాక్షి, తన వంశములోని యేడు తరముల పూర్వులను, ఏడు తరములతర్వాతి వారిని, నశింప జేయును. వాస్తవము తెలిసియు చెప్పనివాడు గూడ ఆ పాపమునే తప్పక అనుభవించ గలడు. మహర్షి! నేను గూడ నిన్ను శపించుటకు సమర్థుడనే కాని, నాకు బ్రాహ్మణులు పూజ్యులు గనుక నిన్ను శపించను.

మహర్షి! నీ కొక విషయము చెప్పెదను. అది నీకు తెలిసినను వినుము. నేను యోగబలము చేత ప్రాణుల శరీరములలో, అగ్నిహోత్రములలో సమస్త యాగక్రియలలోను నుండెదను. వేదోక్త విధానముచేత యజ్ఞాదులందు నాలో వేల్చబడు హవిస్సుచేతనే దేవతలు, పితరులున్ను తృప్తి నొందెదరు. ఆ యిరువురు జలస్వరూపులు. అమవాస్యా-పౌర్ణమాసులలో దేవతలు, పితరులున్ను పూజింప బడుదురు. నా యందు హుతమైన వస్తుసామాగ్రిని దేవతలు, పితరులున్ను భుజించెదరు. ఆ యిరువురకున్ను నేను ముఖము (నోరు) గా నుండెదను. అమావాస్యనాడు పితరుల కొరకు, పౌర్ణమాసినాడు దేవతల కొరకున్ను వేల్చబడు హోమద్రవ్యములు నా ముఖములోనే పడగా వారు వానిని భుజించెదరు. దేవ - పితృదేవులకు ముఖమైన* నేను సర్వభక్షకుడను ఎట్లయ్యెదను ?"

"శౌనకా! యిట్లు చెప్పి అగ్నిదేవుడు తనను ఉపసంహరించుకొనెను. దానితో బ్రాహ్మణుల యగ్నిహోత్ర కర్మలందు, యజ్ఞాది క్రియ లందున్ను

---

* 'అగ్నిముఖా వై దేవాః' అను వేదవాక్యము దీనికి ప్రమాణము.

ఓంకార - వషట్కారములు, స్వాహా - స్వధాకారములు* అగ్నియు లేకుండుట చేత ప్రజలందరు దుఃఖించిరి.

శౌనకా! అప్పుడు ఋషులు దుఃఖితులై దేవతలతో నిట్లనిరి :-

"అనఘులారా! అగ్నినాశమువలన కలిగిన క్రియా నాశముచేత మూడు లోకములు సంభ్రాంతి చెంది యున్నవి. దీనికి ప్రతిక్రియ త్వరగా చేయుడు. ఒకక్షణముగూడ జాగు చేయకుడు".

శౌనకా! అగ్నిమాటలు విని వెంటనే దేవతలు ఋషులుకలిసి బ్రహ్మ దేవుని కడకు పోయి అగ్ని శాపమును, సర్వక్రియానాశనమునున్ను గూర్చి తెలిపి, "దేవా! భృగుమహర్షి, కారణాంతరముచేత అగ్నిని 'సర్వభక్షకుడవు' కమ్మని శపించెను. దేవతలకు ముఖమై, యజ్ఞభాగమును తొలుత భుజించి సర్వలోకములందున్న 'హుతభుక్' (హోమద్రవ్యము భుజించువాడు) అని ప్రసిద్ధుడైన అగ్ని యెట్లు సర్వభక్షకత్వమును పొంద గలడు"

శౌనకా! వారిమాటలు విని బ్రహ్మదేవుడు అగ్నిని పిలిచి, అతనితో మృదువుగా నిట్లనెను :-

అగ్నిదేవా! నీవు సర్వలోకములకు కర్తవు, రక్షకుడవు అంతకరుడవు. సర్వక్రియలను లోకములో ప్రవర్తింప జేయువాడవు. కనుక, ఆ క్రియలన్నియు నశింప కుండునట్లు చేయుము. హుతాశనా! నీవు లోకేశ్వరుడవై కూడ ఇట్లేల మూఢుడ వైతివి. నీవు సర్వదా పవిత్రుడవు. సర్వభూతములకు నీవే గతి! కనుక, నీవు సర్వభక్షకత్వము పొందవు.

---

* యజ్ఞములలో మంత్ర దేవతకు తొలుత ఓంకారము - చివరవషట్కారమున్ను, 'హోత' అను ఋత్విక్కు 'ఓమ్ ఇంద్రాయ వషట్' అని ఉచ్చరించగనే అధ్వర్యుడు అను ఋత్విక్కు హవిస్సును అగ్నిలో వేల్చును. దేవతలకు హోమము 'ఇంద్రాయ స్వాహా' అని స్వాహాతో, పితరులకు హోమము 'పితృభ్యః స్వధా' అని స్వధాతోను చేయుదురు. అగ్ని లేనప్పుడు ఇవి ఏవియు లేకపోవు నని తాత్పర్యము.

"నీ అపానము (యాగపు ఇటుకల గుండము)లో నున్న నీ జ్వాలలు అన్నింటిని భక్షించును. నీ క్రవ్యాద (శ్మశానాగ్ని) శరీరము అన్నిటిని భక్షించును. సూర్యకిరణములచేత స్పృశించిన వస్తువులు పరిశుద్ధము లైనట్లు, నీ జ్వాలలచేత తపించిన వన్నియు పరిశుద్ధము లగును. అగ్నీ! నీవు పరమతేజః స్వరూపుడవు. ఆ తేజస్సు నీ ప్రభావముచేత నీ నుండియే బయటకు వెడలును; కనుక, నీ తేజస్సు చేతనే. ఆ ముని శాపమును సత్యము చేయుము* నీ ముఖము నందు వేల్చబడిన దేవతల భాగమును, నీ భాగమును కూడ గ్రహింపుము.

"శౌనకా! బ్రహ్మదేవుని యుపదేశము విని అగ్నిదేవుడు, అట్లే కానిమ్ము" అని ఆయనతో చెప్పి ఆ దేవుని యాజ్ఞ నెరవేర్చుటకు వెడలిపోయెను. దేవతలు, ఋషులును సంతోషించి తమ తమ స్థానములకు పోయి పూర్వమువలెనే తమ కార్యములు నెరవేర్చుకొనుచుండిరి. దేవాదిభూత సంఘములన్నియు సంతసించెను. అగ్నిదేవుడు గూడ విగతదోషుడై పరమప్రీతి చెందెను. ఈ విధముగా పూర్వము అగ్నిభగవానుడు భృగుమహర్షి శాపమును పొందెను.

అగ్ని శాపమునకు సంబంధించిన యీ ప్రాచీనేతిహాసమును, పులోమ రాక్షసుని వినాశమును, చ్యవనోత్పత్తిన్ని గూర్చిన యీ కథ యిట్లు జరిగెనని చెప్పి ఉగ్రశ్రవుడు తరువాతి కథ యిట్లు చెప్ప దొడగెను.

**ప్రమద్వర జననము - ఆమె రురువునకు వాగ్దానము చేయుట వివాహమునకు పూర్వమే సర్పదష్టయైన ప్రమద్వర మరణము:-**

"బ్రహ్మన్! భృగు పుత్రుడైన చ్యవనుడు, తన పత్ని సుకన్య గర్భము నందు ప్రమతి అను పుత్రుని కనెను. ప్రమతి మహా తేజశ్శాలియై యుండెను. అతడు ఘృతాచి యను నప్సరః స్త్రీనుండి 'రురు' అను పేరుగల కొడుకును కనెను. ఆ రురువు ప్రమద్వర గర్భమునుండి 'శునకుడు' అను పుత్రుని

---

* అన్నిటిని అగ్ని పరిశుద్ధము చేయును గనుక, అగ్ని తాకిన వస్తువు పవిత్రమై అతనికి భక్షణయోగ్య మగును. కనుక, అగ్నికి సర్వభక్షత్వము దోషము కాదు. ఆ శాపము వరముగా నతడు చేసికొనగల డని భావము.

కనెను. శౌనకా! నీ వా శునకుని పుత్రుడవు కనుక శౌనక నామముతో ప్రసిద్ధి చెందినావు. నీతండ్రి శునకుడు. మహా సత్త్వగుణ సంపన్నుడై భృగు వంశము నకు ఆనందవర్ధనుడుగా నుండెను. అతడు జన్మము నుండియే తపస్సునందు నిమగ్నుడై యుండెను. దీనిచేత నతని యచంచల కీర్తి అన్ని దిక్కులందు వ్యాపించెను.

"బ్రహ్మన్! మహాతేజస్సంపన్నుడైన రురువుయొక్క సమగ్ర చరిత్రను విస్తారముగా వర్ణించెదను వినుము:-

"పూర్వము స్థూలకేశుడు అను పేరుగల మహర్షి యుండెను. అతడు తపోవిద్యాసంపన్నుడై సమస్త ప్రాణులకు హితకరుడుగా నుండెను. ఆ సమయమందే 'విశ్వావసుడు' అను గంధర్వరాజువలన అప్సరసయైన మేనక సకాలములో స్థూలకేశమునియొక్క ఆశ్రమ సమీపమునందు ఒక శిశువును కనెను. నిర్దయురాలు, నిర్లజ్జయునయిన మేనక ఆ నవజాత శిశువును అక్కడనే నదీతీరమందు విడిచి వెడలిపోయెను.

"శౌనకా! తరువాత స్థూలకేశుడు, ఏకాంతమునందు ఒంటరిగా విడువ బడిన ఆ కన్యకను చూచెను. ఆ శిశువు దేవబాలికవలె దివ్యశోభతో ప్రకాశించు చుండెను. అట్టి పరిస్థితిలో నక్కడనున్న యా శిశువుపై స్థూలకేశునకు మిక్కిలి దయకలిగి ఆ కన్యకను తెచ్చుకొని రక్షించుచు, పోషించుచునుండెను. ఆ కన్య ఆ మహాముని పోషణములో దినదినాభివృద్ధి చెందుచుండెను స్థూలకేశుడు ఆ సుందరకన్యకు క్రమముగా జాతకర్మాది సంస్కారములు శాస్త్రోక్తముగా నెరవేర్చెను.

"బ్రహ్మర్షీ! ఆ కన్యక బుద్ధి - రూప - సౌందర్యాది సమస్త సద్గుణ ములచే శోభిల్లుచు జగత్తులోని సర్వప్రమదలలో (సుందరస్త్రీలు) శ్రేష్ఠురాలై యుండెను గనుక స్థూలకేశ మహర్షి ఆ కన్యకకు 'ప్రమద్వర' అని పేరు పెట్టెను.

"శౌనకా! ఒకనాడు రురు మహర్షి స్థూల కేశాశ్రమములో ప్రమద్వరను చూచిన - వెంటనే యతని మనస్సు కామవశమయ్యెను. అప్పుడతడు తన

పరిస్థితి మిత్రునిద్వారా తన తండ్రియైన ప్రమతికి తెలిపెను. తరువాత ప్రమతి ఆ కన్యను తన పుత్రునికొరకు ఇమ్మని స్థూలకేశుని యాచించెను. స్థూలకేశుడు ప్రమతి కోరికను అంగీకరించి కన్య నిచ్చుటకు వాగ్దానముచేసి రాబోవు ఉత్తర ఫల్గునీ నక్షత్రమందు వివాహముహూర్తము నిశ్చయించెను.

"శౌనకా! ఆ వివాహముహూర్తము సమీపించుచుండగా ప్రమద్వర తన సఖీజనముతో క్రీడించుచు వనములో తిరుగుచుండెను. మార్గములో ఒక సర్పము అతి విశాలముగా అడ్డముగాను నిద్రించుచుండెను. ప్రమద్వర ఆ పామును చూడక కాలప్రేరితురాలై, ఆ సర్పమును త్రొక్కుచు ముందుకు నడచిపోయెను. అప్పుడు కాలధర్మప్రేరితమైన ఆ సర్పము తన విషభరిత దంతములను ఆ కన్యక శరీరమునందు గట్టిగా గ్రుచ్చి కాటువేయగా నామె హటాత్తుగా క్రింద పడెను. ఆమె శరీరవర్ణము, శోభయు నశించి, ఆభరణములు అంతట చెదిరిపడి, ఆమె అచేతనురాలయ్యెను. ఆమె కేశములు చెదిరియుండెను.

ఆమె తన బంధుజనులకు దుఃఖము కలిగించుచుండెను. క్షణమునకు ముందు అత్యంత సుందరిగా నున్న ప్రమద్వర ప్రాణహీనురాలగుటచేత చూచుటకు యోగ్యముగా లేకుండెను. ఆమె సర్పవిషము చేత పీడితురాలై గాఢ నిద్ర పోవుచున్నట్లు నేలపై బడియుండెను. ఆమె అట్టి అచేతానావస్థలో నున్నను మిక్కిలి మనోహరముగా నుండెను.

"మహర్షీ! ఆమె తండ్రి స్థూలకేశుడు ఇతర మహర్షి జనములు గూడ వచ్చి చూచిరి. కమలకాంతితోనున్న ఆ కన్యక చేష్టలుడిగి నేలపై పడియుండెను. తరువాత స్వస్త్యాత్రేయ - మహాజాను - కుశిక - శంఖమేఖల - ఉద్దాలక - కఠ - శ్వేత - భరద్వాజ - కౌణకుత్స - ఆర్ష్టిషేణ - గౌతమ - రురు - ప్రమతి - నామకులైన మహర్షులు, ఇతర వనవాసులైన బ్రాహ్మణులందరున్నూ, దయార్ద్ర హృదయులై అక్కడకు వచ్చి, సర్పదష్టయై చచ్చిపడియున్న ప్రమద్వరను చూచి దుఃఖింపజొచ్చిరి. రురువైతే మిక్కిలి ఆర్తుడై అక్కడి నుండి వెడలిపోయెను. తక్కిన వారందరు అక్కడనే కూర్చొని యుండిరి.

**రురువు తన అర్ధాయుస్సునిచ్చి ప్రమద్వరను బ్రతికించుట రురువుతో ఆమె వివాహము - రురువు సర్పములను నశింపజేయుటకు నిశ్చయించుట- రురు-డుండుభ సంవాదము :-**

"శౌనకా! అప్పుడు రురువు అతి దుఃఖితుడై దుర్గమ వనములో బిగ్గరగా ఏడ్చుచుండెను. తన ప్రియతమయైన ప్రమద్వరను తలచుచు, శోకనిమగ్నుడై, యిట్లనెను : "అయ్యో! ఆ కృశాంగి మమ్మందరను దుఃఖములో ముంచి నేలపై పరుండియున్నది. ఇంతకంటే మించిన దుఃఖమేమియుండగలదు? నేను దానము తపస్సు-గురుజన సేవ చేసియుండిన యెడల, ఆ పుణ్యము చేత నా ప్రియురాలు జీవించుగాక! నేను పుట్టినప్పటినుండి మనస్సు, ఇంద్రియములు నిగ్రహించుకొని బ్రహ్మచర్యాది వ్రతములు దృఢముగా పాలించియుండిన యెడల, నా ప్రమద్వర తత్క్షణమే జీవించుగాక! అసుర సంహారకుడు, ఇంద్రియములకు ప్రభువు, జగదీశ్వరుడు, సర్వవ్యాపియునైన శ్రీకృష్ణభగవానుని యందు నాకు అచంచల భక్తి యుండినయెడల నా ప్రియురాలు బ్రతుకునుగాక!"

ఈ విధముగా రురువు తన భార్యకొరకు దుఃఖించుచుండినపుడు ఒక దేవ దూత అతని కడకు వచ్చి యిట్లనెను :-

"రురుమహాముని! నీవు దుఃఖవ్యాకులుడవై నీ యిష్టము వచ్చినట్లు మాట లాడుట వ్యర్థము. ఎందుకనగా మరణించినవారు తిరిగి బ్రతుకరు. ఈ ప్రమ ద్వర అప్సరసకు గంధర్వునకు పుట్టిన కన్య. ఈమెకు ఆయుస్సు తీరినది. కావున నీవు శోకింపకుము. ఈ విషయములో దేవతలొక యుపాయము నిశ్చ యించినారు. అది నీవు చేయదలచిన యెడల, ఈ లోకమందు, మరల ప్రమద్వరను పొందగలవు."

"శౌనకా! ఆ దేవదూత చెప్పిన మాటలు విని రురుడు, అతనితో, 'దేవ దూతా! దేవతలు నిర్ణయించిన యుపాయమేమి? నేను తప్పక దానిని ఆచ రించెదను. ఎట్లైనను నన్ను బ్రతికింపుము' అని యనగా రురువుతో నతడు, 'నీవా కన్యకకు నీ యాయుస్సులో సగము ఇచ్చిన యెడల మరల ఆమె బ్రతుక గలదు' అని యనగా రురుడు, 'దేవోత్తమా! నే నామెకు నాయర్ధాయుస్సు ఇచ్చెదను. నా ప్రియురాలు రూప-సౌందర్య-శృంగార భూషణములతో జీవించు గాక!' అనెను.

"శౌనకా! అప్పుడు గంధర్వ రాజైన విశ్వావసుడు దేవదూతయు కలిసి యమధర్మరాజుకడకు పోయి, 'ధర్మరాజా! రురుభార్య ప్రమద్వర మరణించెను. నీవు అంగీకరించిన యెడల రురువుయొక్క సగము ఆయుస్సుతో ప్రమద్వర జీవించగలదు' అని యనగా యముడు, దేవదూతా! అట్లే యగుగాక' అని యనెను.

"శౌనకా! తరువాత రురువు సర్పనాశము చేయుటకు నిశ్చయించెను. అతడు సర్పములను చూడగనే కఱ్ఱతో కొట్టుచుండెను. ఒకనాడు రురువు వనములో డుండుభ (రెండు తలల పాము) జాతికి చెందిన యొక వృద్ధసర్పము నిద్రించుచుండగా దానిని అతిక్రుద్ధుడై చంపదలచి, కాలదండము వంటి తన కఱ్ఱను ఎత్తినప్పుడు డుండుభుడు మనుష్యభాషతో 'తపోధనా నేను నీకు ఏ యపరాధమున్ను చేయలేదు, కనుక క్రోధావేశముతో నన్నెందుకు కొట్టుచున్నావు" అని రురువుతో ననెను.

**రురు-డుండుభుల సంవాదము:**

"శౌనకా! డుండుభుని మాటకు రురు డిట్లనెను:- 'సర్పమా! నా ప్రాణ సమాన పత్నిని సర్పము కఱచెను. అప్పుడే నేను కనపడిన సర్పముల నన్నిటిని చంపెద'నని ప్రతిజ్ఞచేసి యున్నాను. కనుక నిన్ను చంపుచున్నాను. 'నీ ప్రాణములు నీవు నేడు పోగొట్టుకొనక తప్పదు.' ఆ మాటకు డుండుభు డతనితో, "బ్రహ్మన్! అవి వేరు సర్పములు. అవియే లోకమునందలి మనుష్యులను కఱచును. సర్పాకారము ఉన్నంత మాత్రమున నీవు డుండుభులను చంపగూడదు. ఆహా! ఎంత ఆశ్చర్యము! అమాయికులైన డుండుభులు అనర్థములు అనుభవించుటలో అన్ని సర్పములతో సమానులు. కాని వానిస్వభావము ఇతర సర్పములకన్న భిన్నమైనది. రెండువిధముల సర్పములకున్ను దుఃఖానుభవము సమానము. సుఖము భిన్నము. నీవు ధర్మాత్ముడవు కనుక, డుండుభహింస చేయగూడదు" అని యనెను.

"శౌనకా డుండుభసర్పమిట్లు చెప్పగా విని, అతడొక ఋషియగునని తలచి రురుడు ఆ సర్పమును వధించలేదు అప్పుడు రురుడా సర్పముతో భుజంగమా! యీ వికృత సర్పయోనిలో పడిన నీ వెవడవు? అని యడుగగా, డుండుభుడతనితో నిట్లనెను".

''రురు మహామునీ! నేను పూర్వజన్మమునందు 'సహస్రపాదుడు' అను మునిగా నుంటిని. కాని ఒక బ్రాహ్మణుని శాపముచేత నేను ఈ సర్పయోనిలో పడితిని''.

''ఇట్లు డుండుభుడు చెప్పగా, రురు డతనితో, భుజగోత్తమా! ఆ బ్రాహ్మణుడే కారణము చేత నీకు శాపమిచ్చెను? నీ యీ శరీరమింకను నెంతకాల మిట్లుండును?'' ఆ మాటకు డుండుభు డిట్లనెను:-

డుండుభుని ఆత్మకథ - అతడు రురునకు అహింసను ఉపదేశించుట:-

''నాయనా! రురూ! పూర్వము 'ఖగముడు' అను పేరు గల యొక బ్రాహ్మణుడు నాకు మిత్రుడుగా నుండెను. అతడు మహా తపోబల సంపన్నుడైనను కఠోర వచనములు పలుకు చుండెను. ఒకనాడతడు 'అగ్నిహోత్ర హోమము' చేయుచుండెను. అప్పుడు నేను ఆడుకొనుచు గడ్డితో నొక సర్పము చేసి యతనిని బెదిరించగా నతడాభయముచే మూర్ఛిల్లెను. మూర్ఛ దేరిన తరువాత ఆ మహాముని క్రోధముతో దహించుచున్నాడాయనునట్లు చూచుచు నిట్లనెను:-

''అరే నీవు నన్ను భయపెట్టుటకు అల్పశక్తిగల సర్పమును చేసితివి. కనుక, నీవుగూడ నా శాపముచేత అల్పశక్తి గల సర్పమే యగుము'' అని శపించెను.

''తపోధనా! నాకు అతని తపోబలము తెలిసియుండెను. కనుక నామనస్సు చాల దుఃఖితమై, అతనికి ప్రణామము చేసి అంజలిబద్ధుడనై యతనితో మిత్రమా నేను ఈ కార్యము పరిహాసమునకై చేసితిని నన్ను క్షమింపుము. ఈ శాపము నుపసంహరించుకొనుము.' అని యంటిని. నేను చాల భయపడియుండుట చూచి ఆ మహర్షి ఉష్ణముగా నిశ్వసించుచు నాతో, నామాట యెప్పటికిన్ని అసత్యము గాదు. చెప్పెడు మాట వినుము. భావికాలములో ప్రమతిపుత్రుడైన రురువును దర్శించినప్పుడు నీకు శాపవిముక్తి కలుగును.' అని యనెను. కనుక నీవే రురుమహాముని వని తలచెదను. నేను పూర్వరూపము ధరించి నీకు హితకరమైన మాట చెప్పెదను.''

"శౌనకా! యిట్లు చెప్పి సహస్రపాదుడు డుండుభరూపము విడిచి ప్రకాశ మాన మైన తన స్వరూపము ధరించి రురువుతో నిట్లనెను :-

"బ్రాహ్మణోత్తమా! అహింస అన్నిటికంటే ఉత్తమ ధర్మము. కనుక బ్రాహ్మణుడు ఎక్కడగూడ ఏ ప్రాణినికూడ హింసించగూడదు. బ్రాహ్మణుడు సర్వదా సౌమ్యస్వభావుడుగా నుండును అని వేదములు చెప్పుచున్నవి. బ్రాహ్మణుడు వేదశాస్త్రవిద్వాంసుడై, సర్వప్రాణులకు అభయ మిచ్చువాడుగా నుండును. అహింస - సత్యభాషణము - క్షమ - వేదాధ్యయనము - ఇవియే బ్రాహ్మణుని యుత్తమ ధర్మములు. క్షత్రియధర్మములు నీకు ఇష్టములు కావు. రురూ! దండధారణము, ఉగ్రత్వము - ప్రజాపాలనము - ఇవి యన్నియు క్షత్రియ కర్మములు. నామాట వినుము. పూర్వము జనమేజయ సర్పయాగము నందు చాల గొప్ప సర్పహింస జరిగెను. ఆ సర్ప సత్రయాగమునందే మహా తపస్సంపన్నుడైన ఆస్తీక మహాముని సర్పముల ప్రాణరక్షణము చేసెను."

**జనమేజయుని సర్పసత్రవిషయమై రురుని జిజ్ఞాస - తండ్రి దానిని తీర్చుట :-**

"ద్విజోత్తమా! జనమేజయమహారాజు సర్పహింస ఎట్లు చేసెను? అతడెందుకు సర్పహింస చేయించెను? ఆస్తీక మహాముని ఆ యజ్ఞమునుండి సర్పములనెందుకు రక్షించెను? తెలుపుము? ఇట్లు రురువు సహస్రపాదు నడుగగా నతడు, రురూ నీవు కథకులనుండి ఆస్తీకచరిత్రము వినియుందువు" అని చెప్పి అంతర్ధానము చెందెను."

శౌనకా! తరువాత రురుడు అట్లు అదృశ్యుడైన సహస్రపాదుని కొరకు ఆ వనము నలువైపుల పరుగెత్తుచు వెదకెను. చివరకు అలసిపోయి క్రిందపడి మూర్ఛిల్లెను. అతని చైతన్యము నశించెను. సహస్రపాదుడు చెప్పినమాట మాటి మాటికి తలచుచు మూర్ఛదేరి రురువు ఇంటికి తిరిగిపోయెను. తన తండ్రితో జరిగిన సంగతియంతయు చెప్పెను. అప్పుడు తండ్రియయిన ప్రమతి, పూర్వము సౌతి శౌనకునకు చెప్పినట్లు చెప్పెను.

(పౌలోమ పర్వము సమాప్తము)

# ఆస్తీక పర్వము

**పితరుల నిర్బంధము చేత జరత్కారుడు వివాహమునకు ఉద్యుక్తుడగుట.**

ఇట్లు సౌతి చెప్పగా శౌనకుడతనినిట్లు ప్రశ్నించెను:-

"మహాత్మా జనమేజయమహారాజు సర్పసత్రముద్వారా సర్పనాశమెందుకు చేసెను? ఆ సమాచారమంతయు తెలుపుము. జపతపో-యజ్ఞానుష్ఠాతయైన ఆస్తీకుడు ఎందుకు సర్పములను ప్రజ్వలితాగ్ని నుండి కాపాడెను? సర్పసత్రము చేసిన జనమేజయుడెవని కొడుకు? ఆస్తీకముని ఎవని పుత్రుడు? తెలుపుము''.

ఆమాటకు సూతపుత్రుడయిన ఉగ్రశ్రవుడు శౌనకునితో "బ్రహ్మన్! ఆస్తీకోపాఖ్యానము చాలా పెద్దది అంతయు చెప్పెద వినుము." అని యనగా, శౌనకు డతనితో సూతపుత్రా! ప్రాచీనమునీశ్వరుడైన ఆస్తీకునిచరిత్ర వినుటకు ఉత్సుకుడనై యున్నాను చెప్పుము' అని యనగా నుగ్రశ్రవు డాకథ యిట్లు చెప్పదొడగెను.

"శౌనకా ఈ యితిహాసము చాల పురాతనమైనది. పూర్వము నా తండ్రి లోమహర్షణుడు తన గురువైన శ్రీకృష్ణద్వైపాయనుడు చెప్పిన ఈకథను నాకు చెప్పెను. ఆది చెప్పెద వినుము ఆస్తీకోపాఖ్యానము సర్వపాపహరము.

శౌనకా ఆస్తీకునితండ్రి ప్రజాపతి వంటి ప్రభావశాలియై యుండెను. అతడు బ్రహ్మచారిగా ఆహారనియమముతో సర్వదా తపస్సు చేయుచుండెను. అతని పేరు జరత్కారు అని యుండెను. అతడు ఊర్ధ్వరేతస్కుడైన మహా మునిగా నుండెను.

శౌనకా! యాయావరులలో* అతని స్థానము అత్యున్నతముగా నుండెను. అతడు ధర్మజ్ఞుడు. ఒక సమయమందు మహాతపోబల సంపన్నుడైన జరత్కా

* యాయావర శబ్దమునకు సర్వదా తిరుగు ముని యని యర్థము. యాయావార మనగా ధాన్యము బిచ్చమెత్తుకొని జీవించుట యని తెలుగు నాట వాడుకలో నున్నది. ముని వృత్తిచేత ఇటు నటు సర్వదా తిరుగు గృహస్థ బ్రాహ్మణుల సమూహమునకు 'యాయావరులు' అని పేరు.

రుడు దేశ సంచారము చేయుటకు బయలుదేరెను. అతడు మునివృత్తితో యత్ర సాయంగృహుడు (ఎక్కడ సూర్యాస్తయమగునో అక్కడ బసచేయువాడు) అయ్యెను. అతడన్ని తీర్థములయందు స్నానము చేయుచు తిరుగుచుండెను. జితేంద్రియులకుగూడ దుఃసాధ్యమైన కఠోర వ్రతదీక్షతో యాత్ర చేయుచుండెను.

"శౌనకా అతడొకప్పుడు వాయుభక్షణముచేసి మరియొకప్పుడు పూర్తిగా నిరాహారుడై శరీరమును శుష్కింప జేయుచుండెను. అతడు నిద్రను జయించి యుండెను. కనుక అతని రెప్పవాలకుండెను. ఇటునటు తిరుగుచున్న యతడు ప్రజ్వలితాగ్నివలె తేజస్వియై కనపడుచుండెను. ఇట్లు తిరుగుచు నతడొకసారి ఒక గర్తము(గోయి)నందు తలక్రిందుగా వ్రేలాడి యున్న తన పితామహులను చూచి, వారితో నిట్లనెను :-

"మహాత్ములారా! మీరెవరు? ఈ గర్తమునందు తలక్రిందుగా ఎందుకు వ్రేలాడియున్నారు? మీరు అధారముగా పట్టుకొనియున్న వీరణస్తంబము(అవురు గడ్డివెన్ను)ను ఈ గర్తమునందు గుప్తముగా నివసించుచున్న యెలుక పూర్తిగా తినెను.*

వీరు ఒక గ్రామమునందు ఒక రాత్రి కంటె ఎక్కువ నివసించరు. వీరు పక్షమున కొకసారి అగ్నిహోత్ర యాగము చేసెదరు. పక్షహోమ సంప్రదాయము వీరి నుండియే ప్రవర్తిల్లినది. దీని విషయమై భరద్వాజ మహాముని వచనమిట్లున్నది :-
"యాయావరా నామ బ్రాహ్మణా అసంస్తే అర్ధమాసాదగ్ని హోత్ర మజుహ్వాన్" అని.

* ఇక్కడ భూలోకమే గర్తము. స్వర్గవాసులైన పితరులు 'మేము క్రింద పడుదు'మను భయమును సూచించుటకే తలక్రిందుగా నున్నారని తెలుప బడినది. కాలుడే(యముడు) యెలుక. వంశపరంపరయే వీరణస్తంబము (అవురగడ్డి వెన్ను) ఆ వంశమునందు జరత్కారు డొక్కడే మిగిలి యుండెను. ఇతరు లందరూ కాలాధీనులై పోయిరి. ఈ విషయము స్పష్టపరచుటకే యెలుక ఆ గడ్డి సముదాయమంతయు తినెనని చెప్పబడి నది. జరత్కారుడు వివాహము చేసికొన కుండుటచేత ఆ వంశమునందు మిగిలిన ఆయొక ఆధారము గూడి నష్టము కా దలచు చున్నది. ఈ కారణముచేతనే పితరులు వ్యాకులులై జరత్కారునకు ఇవి తెలుపుటకు వారు అతనికి దర్శనము ఇచ్చిరి.

శౌనకా! ఇట్లడిగిన జరత్కారునితో నతని పితరులిట్లనిరి :-

"బ్రహ్మన్! మేము కఠోర వ్రతమును పాలించు యాయావరులు* అను మునులము. మా సంతాన పరంపర నశించుటచేత మేము క్రిందపడెదము. మా కిపుడు ఒక సంతానము మాత్రమే మిగిలియున్నది. అతని పేరు జరత్కారుడు. భాగ్యహీనుల మైన మాకు భాగ్యహీను డైన ఆ ఒక్క పుత్రుడుగూడ తపస్సులో నిమగ్నుడై యున్నాడు.

"మునీంద్రా! ఆ మూర్ఖుడు సంతానోత్పత్తికై వివాహము చేసికొనకున్నాడు. కనుక మా వంశపరంపర నశించుటచేత మేమీగర్తములో వ్రేలాడుచున్నాము. మమ్ము రక్షింపగలవాడు మా వంశములో నొక్కడే యున్నాడు. ఐనను, మేము పాపకర్ములవలె అనాథులమైనాము."

"సాధుశిరోమణీ! మా బంధువువలె మా దయనీయస్థితి చూచి యీవిధముగా శోకించుచున్న నీ వెవరు? తెలుపుము. నీ వెందుకు మా కొరకు శోకమగ్నుడవై యున్నావు?" ఆ మాటకు జరత్కారు డిట్లనెను:-

"మహాత్ములారా! మీరు నాకు పితామహులైన నా పూర్వపితృగణము. నేనే జరత్కారుడను. మీకు నే నేమి చేయుదునో తెలుపుడు."

ఆ మాటకు పితరులిట్లనిరి :- "నాయనా నీవు మా వంశపరంపర విచ్ఛిన్నము కాకుండుటకు నిరంతరము ప్రయత్నము చేయుచు వివాహము చేసికొనుము. నీవు, నీ కొరకు, మా కొరకు, ధర్మరక్షణము కొరకున్ను పుత్రోత్పత్తి కొరకు ప్రయత్నింపుము. పుత్రవంతులు ఈ లోకమందు ఉత్తమ గతిని పొందినంతగా తదితరులు ధర్మానుసారము చేసిన తపస్సుచేత కూడ పొందజాలరు. కనుక, పుత్రా! నీవు మా యాజ్ఞచేత వివాహము చేసికొని సంతానోత్పత్తి కొరకు పూనుకొనుము."

* యాయావరులు తిరుగుచు నెక్కడ సంధ్యాకాలమైన నక్కడ నివసించెదరు. కనుక వారికి యత్రసాయంగృహులు అని పేరు.

"శౌనకా! పితరుల మాటలు విని జరత్కారుడు వారితో నిట్లనెను":-

"పితరులారా! నేను జీవితములో సుఖమనుభవించుటకు పత్నీ పరిగ్రహము, ధనసంగ్రహమును ఎప్పుడుగూడ చేయనని నిశ్చయించుకొని యుంటిని. కాని మీ యాజ్ఞ నెరవేర్చుట చేత మీకు హితము కలుగునెడల, దాని కొరకు తప్పక ప్రయత్నము చేసెదను. కాని నా కొక నియమము కలదు. ఆ నియమము ప్రకారము కన్యక లభించిన యెడల అట్టి కన్యకతో వివాహము చేసికొనెదను. అట్లు కానియెడల చేసికొనను. ఆ నియమ మేమనగా, ఆమెకు నా పేరే యుండవలెను. ఆమె బంధువులు నాకు ఆమెను, ఈయగోరవలెను. భిక్షము వలె స్వయముగా నాకు ప్రాప్తించిన కన్యకతోనే శాస్త్రోక్తవిధి ననుసరించి పాణిగ్రహణము చేసికొనెదను.

"పితామహులారా! నేను దరిద్రుడను. నేను అడిగినను ఎవడు నాకు కన్య నిచ్చును? కనుక ఎవడైన భిక్షగా కన్యను నా కిచ్చిన యెడల నే నామెను గ్రహించెదను. నేను ఈ విధముగానే వివాహము చేసికొనుటకు ప్రయత్నము చేయుచుండెదను. దీనికి వ్యతిరేకమైన యెడల నేను పెండ్లియే చేసికొనను. ఈ నియమము ప్రకారము నాకు లభించిన పత్ని గర్భమునుండి కలిగిన సంతతి మిమ్ము ఉద్ధరించగలదు. కనుక నా పితృదేవులైన మీరు మీ పూర్వస్థానమునకు పోయి సంతోషముతో నుండుడు."

జరత్కారుడు వాసుకి సోదరిని పెండ్లియాడుట:-

"శౌనకా! తరువాత జరత్కారుడు భార్యను పొందగోరి, భూమండల మంతట తిరుగ జొచ్చెను. కాని, అతనికి పత్ని లభించలేదు. ఇట్లుండగా, నొక నాడు జరత్కారుడు వనమునకు పోయి పితరులమాట స్మరించుచు ఎవరైన కన్యాభిక్ష యివ్వగలరా? అని మెల్లమెల్లగా మూడుసార్లు అరచెను.

"శౌనకా అప్పుడు నాగరాజైన వాసుకి తన సోదరిని వెంటనిడుకొని ఆ మునీశ్వరునికడకు వచ్చి 'ఇదిగో భిక్ష గైకొనుము' అని యనగా. 'ఆమె తన పేరుగలదో లేదో' యని వాసుకి నడుగగా, నతడు 'జరత్కారూ! ఈమె నా చెల్లెలు. ఈమె పేరు జరత్కారువు. ఈ సుందరకన్యను నికిచ్చుటకు

తోడ్కొని వచ్చినాను. స్వీకరింపుము. ఈమెను చాలకాలమునుండి నీకొరకే రక్షించియున్నాను. గైకొనుము' అని చెప్పి వాసుకి తన చెల్లెలు జరత్కారువును జరత్కారున కిచ్చెను. ఆ మునీశ్వరుడామె పాణిని శాస్త్రోక్తముగా పరిగ్రహించెను."

ఆస్తీక జననము - అతడు, తల్లి శాపముచేత సర్పయాగములో నశించు నాగులను రక్షించుట:-

"శౌనకా పూర్వము నాగమాత కద్రువ 'జనమేజయుని సర్పయాగములో మిమ్ము అగ్ని భస్మము చేయుగాక' యని సర్పములకు శాపమిచ్చియుండెను. ఆ శాపమును శాంతింపజేయుటకే వాసుకి జరత్కారునకు తన చెల్లెలి నిచ్చి పెండ్లిచేసెను ఆ దంపతుల గర్భమునుండి ఆస్తీకుడు పుట్టెను. ఆస్తీకుడు వేదవేదాంగ పారగుడైన విద్వాంసుడు. తపస్వి, మహాత్ముడు. అందరి యెడల సమానభావము గలవాడు. పితృవంశమునకు, మాతృవంశమునకున్నూ అతడు భయము పోగొట్టువాడుగా నుండెను.

"శౌనకా తరువాత చాల కాలమునకు పాండవవంశీయుడైన జనమేజయుడు 'సర్పసత్ర' మను మహాయజ్ఞమును చేయదలచెనని వినినాను. సర్పసంహారము కొరకు ఆరంభింపబడిన సత్రమునకు వచ్చిన ఆస్తీకుడు నాగులకు మృత్యువు నుండి విముక్తి కలిగించెను. అతడు మాతులాది సమస్త బంధుజనులను గూడ కాపాడెను. ఈ విధముగానే ఆస్తీకుడు తపస్సుచేత సంతానోత్పత్తిచేతను పితృ దేవతలను గూడ ఉద్ధరించెను.

"శౌనకా! జరత్కారుడు వివిధ వ్రతములను వేదాధ్యయనమును చేసి సర్వవిధ ఋణముల నుండి విముక్తుడాయెను. వివిధ దక్షిణలతో యజ్ఞము లనుష్ఠించి, దేవతలను, బ్రహ్మచర్య పాలనము చేత ఋషులను, సంతానోత్పత్తి చేత పితరులను తృప్తిపరచెను. ఈ విధముగా జరత్కారు మహాముని ఆస్తీకుని వంటి పుత్రుని, పరమ ధర్మమును, పొంది పితరుల చింతా భారము దించి తన పితామహులతో బాటు చాలకాలము తరువాత స్వర్గమునకు పోయెను. భృగువంశ శిరోమణీ! యీ విధముగా నేను ఆస్తీకోపాఖ్యానమును యథావత్తుగా వర్ణించి చెప్పితిని. ఇంక నేమి చెప్పుమనెదవో, అడుగుము". ఆ మాటకు శౌనకుడుగ్ర శ్రవుని నిట్లడిగెను:-

కద్రూ-వినతలకు కశ్యపుని వరము చేత పుత్రప్రాప్తి:-

"సూతనందనా! ఆస్తీకుని కథ సవిస్తారముగా చెప్పుము. వినుటకు ఉత్కంఠులమై యున్నాము. నీవు చాల మధురముగా కథలు చెప్పెదవు. నీ కథనము నందలి ప్రతి పదము ప్రత్యక్షరమును అతి కోమలముగా నున్నది. సౌమ్యా! నీ ముఖము నుండి కథ విని మేము చాల ప్రసన్నుల మైతిమి. నీవు నీ తండ్రి లోమహర్షునివలెనే కథా ప్రవచనము చేసెదవు. నీ తండ్రి సర్వదా మాసమక్షమునందు ఉండును. ఆ రూపములోనే నీవుగూడ కథ చెప్పుము." ఆ మాటకు సౌతి యిట్లనెను:-

"ఆయుష్మంతుడా! కథాకథనకుశలు డైన నా తండ్రి ముఖము నుండి యథాతథముగా నేను వినిన యీ ఆస్తీక కథ చెప్పెద వినుము".

"బ్రహ్మన్! పూర్వము దేవ(కృత) యుగము నందు దక్ష ప్రజాపతికి కద్రువ-వినత యని ఇద్దరు పుత్రికలుండిరి. ఆ యిరువురు సోదరీమణులు రూప యౌవన సంపన్నురాండ్రై అత్యద్భుతముగా నుండిరి. ఆ యిరువురి వివాహము కశ్యపమహర్షితో జరిగెను. ఒకనాడు బ్రహ్మ సమాన శక్తిగల పతి యైన కశ్యప మహర్షి మిక్కిలి హర్షముతో తన యిరువురు భార్యలకు వర మీయదలచి 'మీలో ఎవతెకు ఏ కోరిక గలదో కొరుకోనుడు.' అని యనగా వారికి అత్యానందము కలిగెను. కద్రువ తనకు సమానమైన తేజస్సు గల ఒక వేయి మంది నాగులను పుత్రులుగా ప్రసాదింపుమని కోరెను. వినత, బల-పరాక్రమ-శరీర-తేజస్సులలో కద్రూ పుత్రులకన్న శ్రేష్ఠులైన యిద్దరు పుత్రులను మాత్రమే ప్రసాదింపుమని కోరెను. ఆమె కోరిన వరమును కశ్యపుడిచ్చెను.

"శౌనకా! తాను కోరిన వరము పొంది వినత మిక్కిలి ప్రసన్నురాలయ్యెను. కద్రూపుత్రులకన్న అధిక బలశాలురైన పుత్రులు తనకు కలుగుదురని వినత తనను కృతకృత్యురాలినిగా భావించెను. సమాన తేజశ్శాలు రైన వేయిమంది పుత్రులు తనకు కలుగుదు రని కద్రువగూడ తన మనోరథపూర్తికి సంతోషించెను. అప్పుడు కశ్యపుడు తన ధర్మపత్నులతో 'మీరు జాగ్రత్తతో మీ గర్భరక్షణము చేసికొను చుండుడు'. అని చెప్పి వనమునకు పోయెను.

"శౌనకా! చాలకాలమున కద్రువ వేయి అండములను, వినత రెండు అండములను కనిరి. వారి దాసీజనము మిక్కిలి ప్రసన్నులై ఆ యండములను వేడి పాత్రములలో ఉంచిరి. అవి ఆ పాత్రలలోనే ఐదునూర్ల యేండ్లు ఉండెను. అప్పుడు కద్రువ యండములు స్వయముగా చీలి వానినుండి వేయిమందిపుత్రులు బయలు వెడలిరి. కాని, వినత రెండు గుడ్లనుండి పుత్రులు పుట్టలేదు. అప్పుడు పుత్రార్థిని యైన వినతాదేవి సవతియెదుట లజ్జతో నుండెను. తరువాత వినత తన చేతులతో నొక యండమును చిదిమెను. దానినుండి ఒకపుత్రుడు పుట్టెను. కాని అతని శరీరములో పూర్వభాగము పూర్తిగా వికసితమై పరిపుష్టముగా నుండెను. కాని, క్రింది సగము శరీరము లేకుండెను."

"శౌనకా! అప్పు డాపుత్రుడు క్రోధావేశముతో వినతకు ఇట్లు శాప మిచ్చెను :-

"అమ్మా! నీవు లోభముచేత నన్ను అర్ధశరీరుని చేసితివి. నా సర్వాంగములు పూర్తిగా వికసితములై, పరిపుష్టములు కానీయక పోయితివి. కనుక, ఏ సవతియందలి అసూయతో నన్ను ఇట్లు చేసితివో, ఆ సవతికే నీవు ఐదునూర్ల యేండ్లవరకు దాసి వై యుండుము."

ఇట్ల తల్లికి శాపమిచ్చి యాబాలకుడు మరల తల్లితో నిట్లనెను :-

"అమ్మా! నీయా రెండవయండమునం దున్న నీపుత్రుడే నీకు దాసీత్వము నుండి విముక్తి గలిగించును. కాని, అమ్మా! నీ వీ రెండవయండమును నాయందమునువలె చిదిమి అంగహీనునిగా చేయక యుండినప్పుడే ఆ పుత్రుడు సర్వాంగములతో పుట్టి నీ దాస్యము బాప గలడు. కనుక నీ వీబాలకుని విశేష బలశాలిగా చేయ దలచిన యెడల, ఐదునూర్లయేండ్లు గడచువరకు ధైర్యముతో ఇతని జననమును ఎదురుచూచు చుండవలెను."

"శౌనకా! యావిధముగా ఆ బాలకుడు 'అరుణుడు' వినతకు శాప మిచ్చి అంతరిక్షమునకు ఎగిరి పోయెను. అప్పటి నుండియె ప్రాతఃకాలమునందు తూర్పుదిక్కు నందు ప్రతిదినము కనపడుచుండు ఎఱ్ఱరంగు రూపములో వినతాపుత్రు డైన అరుణుడే దర్శన మిచ్చుచుండును. ఆ యరుణుడు సూర్యభగవానుని రథముపై గూర్చొని సూర్యునకు రథసారథిగా నుండెను."

''శౌనకా! తక్కిన అయిదు నూరేండ్లు సమయము పూర్తిగా ముగిసిన తరువాత వినతకు సర్వసంహారకు డైనగరుడుడు జన్మించెను. పక్షిరా జైన గరుడుడు జన్మించగనే ఆకలితో బాధపడి, తనకొరకు విధాత నియమించిన ఆహార పదార్థములు పొందుటకు తల్లి వినతను విడిచి ఆకాశములో ఎగిరి పోయెను.''

**మేరు పర్వతము నందు అమృతము కొరకు యోచించు దేవతలకు శ్రీమన్నారాయణుడు సముద్రమథనమునకు ఆజ్ఞాపించుట :-**

''శౌనకా! ఈ సమయమందే కద్రూ-వినత లిరువురు చేరి విహారార్థము తిరుగునప్పుడు వారు 'ఉచ్చైఃశ్రవము'అను గుఱ్ఱమును చూచిరి. ఆయశ్వరత్నము అమృతము కొరకు సముద్రము చిలుకునప్పుడు పుట్టెను. ఆ గుఱ్ఱమునకు అమోఘ మైన బల ముండెను. అది ప్రపంచములోని యశ్వము లన్నిటికంటే శ్రేష్ఠముగా నుండెను. అది ఉత్తమగుణ-సౌందర్యశాలియై, అజరము (ముసలితనము లేనిది), దివ్యము, సర్వశుభలక్షణ యుక్తమై యుండెను. దాని యవయవములు మిక్కిలి పరిపుష్టములై యుండెను. దానిని దేవత లందరు మిక్కిలి ప్రశంసించు చుండిరి.''

ఉగ్రశ్రవు డిట్లు చెప్పగా, శౌనకు డతని ని ట్లడిగెను :

''సూతనందనా! దేవతలు అమృత మథన మే విధముగా చేసిరి? ఎక్కడ చేసిరి ? దానినుండియేకదా మహాబల - పరాక్రమ సంపన్నము, అతితేజశ్శాలియునైన అశ్వరాజు ఉచ్చైః శ్రవము జన్మించెను."

ఇట్లు శౌనకుడు అడుగగా, ఉగ్రశ్రవు డిట్లు చెప్ప దొడగెను :-

**దేవ-దానవుల సముద్రమథనముచే అనేక రత్నములు - అమృతము పుట్టుట విష్ణుమూర్తి మోహినీరూపముతో దైత్యులనుండి అమృతము తీసికొనుట :**

"శౌనకా! అత్యుత్తమము, తేజోరాశియునై ప్రజ్వరిల్లుచున్న మేరు పర్వతము సూర్యకిరణములవంటి సువర్ణప్రభలు తన శిఖరములతో వెదజల్లు చుండెను.

అది కనకమయము, అపరిమితము. అధర్మపరులు అక్కడికి పోవ జాలరు. ఘోరసర్పములచేత అది వ్యాప్తమై యుండును. ఆ మేరువుపై సర్వదా దివ్యౌషధులు దీపించు చుండును. స్వర్గమును ఆవరించి యున్న ఆ ఉన్నతగిరి మనసునకు గూడ అగమ్యము. కాని, యందు అనేక నదీవృక్షములు ఉండి నానా పక్షి సంఘముల నాదములు మనోహరముగా వినబడు చుండును.

దేవతలందరు బహురత్నశోభిత మైన మేరుశిఖరమునకు చేరి అమృత ప్రాప్తికొరకు తపోనియమానుష్ఠానములు చేయు చుండిరి. ఇట్లున్న దేవతలను చూచి శ్రీమన్నారాయణుడు బ్రహ్మదేవునితో ని ట్లనెను :-

"దేవతలు, అసురసంఘములు సముద్రమును మథించినయెడల అక్కడ అమృతము పుట్టును. సర్వౌషధులు, సర్వరత్నములు (ఉత్తమ ద్రవ్యములు) దానినుండి చిలికి చివరకు అమృతమును పొందవచ్చును."

"శౌనకా ! శ్రీమన్నారాయణమూర్తి యాజ్ఞ ప్రకారము దేవగణము లందరు ఆకాశ శిఖరములవలె నున్న గిరిశృంగములతో అలంకృతమైన మందరపర్వతమును చేరిరి. అనేక క్రూరమృగములు, పక్షులు, కిన్నరులు, అప్సరసలున్ను ఆ పర్వతమును సేవించు చుండిరి. అది భూమికిపైన పదకొండు వేల యోజనముల యెత్తు, అడుగునగూడ అంతయే లోతు కలిగియుండెను. సముద్రమథనమునకు దానిని కవ్వముగా చేయ దలచిన దేవతలు దానిని పెరకజాల కుండిరి. అప్పుడు అక్కడనున్న బ్రహ్మ - విష్ణుదేవు లిరువురితో 'భగవంతులారా, మీరు నిఃశ్రేయసకరమైన యా మందరపర్వతోద్ధరణము మా హితముకొరకు చేయుడు' అని ప్రార్థించిరి.

"దేవతల ప్రార్థనల నంగీకరించి బ్రహ్మ - విష్ణువులు ఫణీంద్రుని ప్రోత్సహించిరి. అపుడు సర్పరాజయిన అనంతుడు వారియాజ్ఞచేత ఆ పనికి పూనుకొనెను. అనంతుడు మహా బలశాలి కాబట్టి ఆ పర్వత రాజును ఉద్ధరించెను. అప్పుడు దేవతలు అనంతునితోపాటు సముద్రుని కడకు పోయి అతనితో మేము అమృతముకొరకు నీజలమును చిలికెద మనిరి. అప్పుడు 'నాకుగూడ ఆ యమృతములో ఒక భాగము ఇచ్చినయెడల మందర పర్వతము నా జలములో తిరుగు నప్పటి సమ్మర్దమును సహించెదను' అనెను. దానికి దేవతలు అంగీకరించిరి.

తర్వాత సురాసురులు ఆ మందర పర్వతమును సముద్రములో వేసినప్పుడు దానికి అధిష్ఠానముగా నుండుమని కూర్మరాజును కోరగా సముద్రమునందే యున్న కూర్మరాజు అంగీకరించి తన వీపుపై మందరము నిలిపికొనెను.

"ఆ తాబేటి వీపుపై నున్న మందరమును ఇంద్రుడు వజ్రాయుధముతో అదిమి కవ్వముగా మలచెను. ఆమందరమును దేవతలు కవ్వముగా, వాసుకిని కవ్వపుత్రాడుగాను చేసికొని సముద్రమును అమృతము కొరకు మథించుటకు ఆరంభించిరి. వాసుకి పడగలవైపు రాక్షసులు, పుచ్ఛము వైపు దేవతలున్ను పట్టుకొని చిలికిరి. అప్పుడు అనంతభగవానుడు ఆనాగరాజ శిరస్సును మాటి మాటికి పైకెత్తి విడుచుచుండెను. అప్పుడు ఆనాగరాజు ముఖముల నుండి పొగతో, అగ్నిజ్వాలలతో గూడిన వాయువులు వెడలెను. ఆ ధూమ సంఘములు విద్యుత్తుతో గూడిన మేఘ సంఘములవలె నుండెను. అప్పుడు ఆ కదలికచేత పర్వత వృక్షములు కంపించి పుష్పవృష్టి దేవతలపై కురిసి వారిశ్రమ పోగొట్టు చుండెను. అప్పుడు మేఘ ధ్వని వంటి మహానాదము సముద్రమును మథించు చుండగా వెడలెను.

అక్కడ అనేక జలచరములు ఆ మహామందరము చేత నలిగి నశించు చుండెను, వారుణములు-పాతాళ వాసులు నైన అనేక భూతములను ఆ పర్వతము నశింప జేసెను. పర్వతాగ్రమునుండి అనేక వృక్షములు పక్షులతోపాటు సంఘర్షము చెంది కూలిపోవు చుండెను. ఆ చెట్ల ఒరపిడివలన వెడలిన యగ్ని జ్వాలలు విద్యుత్తులు నీలాకాశమునువలె మందరగిరిని ఆవరించెను. ఆ సంఘర్షము చేత గుహలనుండి వెడలిన గజ సింహాది మృగములను ఆయగ్ని దహించెను. అట్లు పుట్టిన యగ్నిని దేవేంద్రుడు మేఘజలముచేత ఆర్పివేసెను.

తరువాత అచ్చటి మహా వృక్షముల నుండి అనేక విధములైన నిర్యాసములు (జిగురులు), ఓషధీరసములు స్రవించెను. అమృత వీర్యము గల ఆ రసముల క్షీరముచేతనే దేవతలు అమరత్వము పొందిరి. సముద్రజలము అమృతోపమానమైన ఆ వృక్షాదుల రసముచేత మిశ్రితమై, క్షీరమై దానినుండి ఘృతము జన్మించెను.

అప్పుడు దేవతలు బ్రహ్మదేవుని కడకు వచ్చి 'మహాత్మా ! మేము అధిక శ్రమతో సముద్రమును చిలికినను అమృతము పుట్టలేదు' అని యనిరి. అప్పుడు బ్రహ్మదేవుడు విష్ణువుతో 'దేవదానవులకు సముద్ర మథనమునకుగాను బలమును ప్రసాదింపుము' అని ప్రార్థింపగా, విష్ణువు వారికి అమోఘమైన బలమును ఇచ్చి 'ఇక మథింపుడు' అనెను.

శ్రీ మహావిష్ణువు యొక్క ఆజ్ఞప్రకారము అధికబలవంతులైన దేవదానవులు సముద్రజలమును మథింపగా, దానినుండి అనేక శతసహస్ర కిరణశోభితుడైన చంద్రుడు పుట్టెను. తర్వాత లక్ష్మీదేవి ఆఘృతమునుండి పాండుర వస్త్రధారిణియై పుట్టెను. పిదప సురాదేవి, తెల్లని అశ్వము, దివ్యమైన కౌస్తుభమణి పుట్టెను. ఆ కౌస్తుభమణి శ్రీమన్నారాయణుని వక్షఃస్థలమును అలంకరించెను. తర్వాత పారిజాతము, కామధేనువు పుట్టెను. ఇవి యన్నియు సూర్యమార్గములో పోయి దేవతలను చేరెను. పిదప ధన్వంతరి, ఉజ్జ్వలశరీరముతో, అమృతభరితమైన శ్వేతకమండలువును చేత ధరించి పైకి వెడలి వచ్చెను.

అత్యద్భుతమైన ఆ యమృతము కొరకు రాక్షసులు 'అది మాకు కావలె, మాకు కావలె నని' బిగ్గరగా అరచిరి. పిదప నాలుగు శ్వేతదంతములు గల ఐరావత మహాగజము వెడలెను. దానిని ఇంద్రుడు గైకొనెను. సముద్రము అతిగా చిలుకుటవలన కాలకూట విషము పుట్టెను. అది సధూమాగ్నివలె ప్రపంచమును వ్యాపించి జ్వలించు చుండగా, ఆ విషగంధము నాఘ్రాణించిన లోకత్రయ జనులందరు మోహితులయిరి. లోకరక్షణార్థము అప్పుడు బ్రహ్మదేవుడు పరమశివుని కోరగా, మంత్రమూర్తి యయిన ఆ మహేశ్వరుడు కాలకూట విషమును కంఠమున ధరించెను. ఆతని కంఠము విషముచేత నల్లనై, ఆ దేవుడు నీలకంఠుడు అను పేర ప్రఖ్యాతు డయ్యెను.

''శౌనకా, ఆ యద్భుతమును చూచి దానవులు నిరాశ చెందిరి. దేవ-దానవులకు అమృతము కొరకు, లక్ష్మీ దేవికొరకున్ను గొప్ప వైరము కలిగెను. అప్పుడు శ్రీమన్నారాయణుడు మాయా మోహినీ రూపమును ధరించి, దానవులను ఆశ్రయించెను. అప్పుడు రాక్షసులా యమృతమును మూఢచేతస్కులై ఆ మోహినికి ఇచ్చిరి. ఆ స్త్రీరూపమునందే దైత్య-దానవులు మోహితులై అమృతమును మోహినీరూపధారి యైన శ్రీ మహావిష్ణువునకు ఇచ్చిరి.

భగవన్నారాయణుని మాయ అమృతకలశము పట్టుకొని దైత్య-దానవులు ఒక పంక్తిలో నుండగా రెండవ పంక్తిలో నున్న దేవతలకు మాత్రమే అమృతము పంచుచుండెను. అది చూచి దైత్యులు మిక్కిలి కోపించి అరచిరి."

**దేవతల అమృత పానము - దేవాసుర సంగ్రామము - దేవతల విజయము :-**

"శౌనకా! అప్పుడు రాక్షసులు అనేకాయుధములతో దేవతలపై పడిరి. అప్పుడు నర-నారాయణులు అమృతమును హరించిరి. తరువాత దేవతలు అమృతమును విష్ణువు నుండి తీసికొని త్రాగిరి. దేవతల పంక్తిలో 'రాహువు' అను రాక్షసుడు దేవతారూపములో కూర్చొని అమృతము త్రాగుచుండగా, అది అతని కంఠమునుండి కడుపులో దిగుటకు పూర్వమే, దేవతల హితము కోరిన చంద్ర సూర్యులు విష్ణువునకు తెలిపిరి. వెంటనే విష్ణువు ఆ రాహువు కంఠము చక్రముతో ఖండించెను. అతనిశిరస్సు ఆకాశమున ఎగిరి అఱచెను. మొండెము భూమిపై పడెను, దానిచేత పర్వత-వన - ద్వీపసహితమైనభూమి కంపించెను. తరువాత రాహువు తనను గూర్చి విష్ణువునకు తెలిపిన చంద్ర సూర్యులపై పగబూని వారిని మ్రింగ జొచ్చెను. అది శాశ్వతముగ నేటికిని గ్రహణముల రూపములో మనకు కనపడు చున్నది."

"శౌనకా! తరువాత విష్ణుమూర్తి మోహినీ రూపము విడిచి వివిధ శస్త్రాస్త్రములచేత రాక్షసులను కంపింప జేసెను. సముద్రతీరము నందు పెద్ద యుద్ధము సురాసురులకు జరుగుచుండగా, శ్రీహరి చక్రాయుధము చేత వధింపబడిన రాక్షసులు క్షతగాత్రులై రక్తము గ్రక్కుచు నేల గూలిరి. సువర్ణ హార భూషితములైన రాక్షసుల తలలు శస్త్ర ఖండితములై పడిపోయెను. నెత్తుట దోగిన రాక్షస శరీరములు గైరికాది ధాతువుల చేత రక్త వర్ణములైన కొండ చరియలవలె కనపడెను".

"శౌనకా! ఆసంకుల యుద్ధములో నొండొరులు కొట్టుకొనుచుండగా, హా హా కారము వెడలెను అప్పుడు సూర్య మండలము ఎఱ్ఱబారెను. వారు వివిధ శస్త్రములతో కొట్టుకొనుచు అరచుచు చుండిరి. ఇట్లు యుద్ధము జరుగుచుండగా, నర-నారాయణులు యుద్ధము చేయుటకు వచ్చిరి. నరుని చేతిలో ధనుస్సు చూచి నారాయణుడు గూడ చక్రమును స్మరించెను".

"శౌనకా! ఆ చక్రము మహాప్రభలు గ్రక్కుచున్న సూర్యమండలము వలె విరాజిల్లు చుండెను. అది మండుచున్న అగ్నివలె భయంకర జ్వాలలు గలదై యుండెను. శ్రీమహా విష్ణువు గజతుండము వంటి తన బాహువుతో శత్రునాశకర మైన చక్రమును ప్రయోగించెను. అది ప్రళయాగ్నివలె దైత్య - దానవులను కొందరిని దహించి, పడగొట్టు చుండెను. కొందరి శిరస్సులను ఛేదించెను. వారి రక్తమును పిశాచమువలె త్రాగెను".

"శౌనకా! తరువాత అసురులు పర్వతములతో దేవతలను కొట్టిరి తరువాత వృక్షసహిత పర్వతసానువులు భయంకరముగా కూలు చుండెను. దానిచేత భూమండలము కంపించెను. అప్పుడు నరుడు అనేక బాణములతో ఆకాశము కప్పెను. గిరిశిఖరములను చీల్చెను. అప్పుడు దానవులు చక్రము ఆకాశములో పోవుట చూచి భూమిలోను, సముద్రములోను బాధతో దూరిరి."

"శౌనకా! దేవతలు విజయము సాధించి మందరపర్వతమును యథా స్థానము చేర్చి, సింహనాదములతో, మేఘములు తిరిగి స్వస్థాన మైన ఆకాశము చేరినట్లు, స్వర్గమునకు పోయిరి. అమృతమును దేవతలు మహానిధివలె సురక్షిత ముగా కాపాడిరి."

**కద్రూ - వినతల పందెము :**

"శౌనకా! సముద్ర మథనకాలమందు అసమానపరాక్రమము గల 'ఉచ్చైః శ్రవము' అనుఅశ్వము పుట్టెను. దానిని చూచి కద్రువ, వినతను, 'ఈ గుఱ్ఱము ఏ వర్ణము గలది?' అని యడిగెను. అప్పుడు వినత 'ఇది శ్వేతవర్ణము కలది గదా! నీవు చెప్పుము. ఈ విషయములో మనము పందెము వేసికొందము' అని కద్రువతో ననగా, కద్రువ 'ఈ యశ్వముతోక నల్లగా నున్నది. అట్లు లేకున్నచో నేను నీకు దాసి నయ్యెదను. తోక నల్లగా నున్న యెడల నీవు నాకు దాసివి కావలెను' అని వినతతో ననెను."

"శౌనకా! ఇట్లు ఆ యిద్దరు దాసీత్వమును పందెముగా బెట్టుకొని, 'రేపు వచ్చి చూతము' అని యిండ్లకు పోయిరి. తరువాత కద్రువ తనవేయిమంది పుత్రు లైన సర్పములను పిలిచి, 'మీరు తెల్లవారులోపల మినల్లని శరీరములతో ఉచ్చైఃశ్రవము తోకను చుట్టుకొనియుండ వలెను. అట్లైన యెడల నాకు

దాసీత్వము సంభవించదు' అని ఆజ్ఞాపించెను. తన యాజ్ఞను మీరిన వారిని కద్రువ జనమేజయుని సర్పయాగములో అగ్ని దహించు నని శపించెను."

**ఆ శాపమునకు బ్రహ్మ యనుమోదము :**

"శౌనకా! ఈ శాపము బ్రహ్మదేవుడే పూర్వము సర్పములకు ఇచ్చి యుండెను. ఆ శాపమే ఇప్పుడు కద్రువ యిచ్చెను. పూర్వము బ్రహ్మశాపమును దేవతలు అనుమోదించిరి. సర్పములు అసంఖ్యాకములుగా నుండుటచేత ప్రజా హితము కోరి బ్రహ్మ ఈశాప మిచ్చెను విషధర్మము లైన సర్పములు జంతు పీడన కరములు. కనుక కద్రువ ఈశాప మిచ్చుట యుక్తమే. సర్పములకు ప్రాణాంతకరమైన దండనము దైవమే విధించెను. బ్రహ్మదేవుడు కద్రువ కీవిషయము తెలిపి, కశ్యపునితో, 'అనఘా! విషము గ్రక్కుచున్న క్రూర సర్పములను నీవు కంటివి. అవి యాగాగ్నిలో దగ్ధము అగు చున్నందుకు నీవు శోకింపకుము, అని చెప్పి కశ్యప ప్రజాపతిని ప్రసన్నుని జేసి, అతనికి విషహార మైన ఓషధిని ఇచ్చెను."

**సముద్ర వర్ణనము :**

ఉగ్రశ్రవుడు తరువాతి కథ శౌనకునకు ఇట్లు చెప్ప దొడగెను:

"శౌనకా! ఆ రాత్రి గడచిన తరువాత కద్రూ - వినతలు సవతుల ఈర్ష్యతో, ఒండొరులను సేవికలనుగా చేసికొను నిచ్ఛచేత, సముద్ర తీరమునకు పోయి ఉచ్చైఃశ్రవమును చూచిరి."

"శౌనకా! సముద్రము అగాధమైన జలమునకు నిధి. అది క్షోభిల్లుచు శబ్దించుచు నుండెను దానిలో నంతటను తిమి - తిమింగిల మహామత్స్యాదులు, మహామకరములు, అనేక సహస్రసంఖ్యలో నానా రూపములైన యితర జల జంతువులుగూడ నుండెను. సముద్రములో ఎవరికిని ప్రవేశించుటకు శక్యము కాదు. అది సర్వరత్నములకు మూలనిధి. అది వరుణదేవునకు ఆలయము. సర్ప ములకు ఆశ్రయము సమస్త నదులకు పతి. దానిలో పాతాళాగ్ని ఉండును. అది రాక్షసులకు బంధువు. జంతువులకు భయంకరము. దేవతలకు శుభంకరము. అమృతమునకు గని. అది అపారము. అనూహ్యము. పవిత్ర జలనిధి. అత్యద్భు తము. జలచరముల భయంకర శబ్దముచేత సముద్రము అతి ఘోరముగా

నుండును. దానిలో లోతైన సుడులు ఉండి అది ఒడ్డులను ఒరసికొనుచు, చలించుచు, క్షోభిల్లుచు నుండును."

"శౌనకా! సముద్రము అల లనెడు హస్తములచేత నృత్యము చేయుచున్నట్లుండును. చంద్రుని వృద్ధి-క్షయముల ననుసరించి; ఉప్పొంగుచు అణగుచు నుండును. మహావిష్ణువు ధరించు పాంచజన్య శంఖము సముద్రమునుండియే పుట్టినది. శ్రీమన్నారాయణమూర్తి వరాహావతారములో సముద్రము నుండి భూదేవిని ఉద్ధరించినప్పుడు దాని జలము, లొడబెట్టబడుటచేత, అది మురికిగా నైనది. బ్రహ్మర్షియైన అత్రి మహాముని నూరేండ్లు తపోవ్రత నిష్ఠాపరుడై యుండికూడ సముద్రపు లోతును, దానిలోపల నున్న పాతాళమును కనుగొన జాలక పోయెను."

"శౌనకా! యుగాదికాలము నందు అధ్యాత్మ యోగనిద్రలో నున్న శ్రీమహావిష్ణువునకు సముద్రము శయనయోగ్య మయ్యెను. ఇంద్రుని వజ్రాయుధమునకు భయపడిన మైనాక పర్వతము ఇందులోనే తల దాచుకొనెను. డింబాహవము (దొమ్మియుద్ధము)లో బాధపడిన రాక్షసులకు ఈ సముద్రము ఆశ్రయ మయ్యెను. బడబాగ్ని (సముద్రమునందున్న అగ్ని-దీనికి ఔర్వాగ్ని అనికూడ పేరు గలదు.) ముఖమునందు శుభప్రదమైన జలహావిస్సును సముద్రము వేల్చును. ఇది అగాధము, అపారము, విశాలము, అపరిమితము. అనేక సహస్రమహానదులు స్పర్థ (పోటీ) బడి, నదీపతియైన సముద్రుని సర్వదా అభిసరించు చుండును. (ప్రియునిసంకేత స్థలమునకు ప్రియురాలు పోవుట అభిసరణ మనబడును.) శౌనకా! అట్లు పరిపూర్ణముగా అలలతో నాట్యము చేయుచున్నట్లుండి, తనలో ప్రతిబింబించిన ఆకాశము గల సముద్రమును కద్రూ - వినతలు చూచిరి.

## సర్పములు ఉచ్చైః శ్రవము తోకను చుట్టుకొని నల్లగా చేయుట :

"శౌనకా! తల్లి యాజ్ఞమీరక, ఆమె శాపమునకు భయపడిన నాగములు, 'స్నేహములేని తల్లి, తనకోరిక తీరనందుచేత మనలను శాపదగ్ధులను చేయును. ఆమె యాజ్ఞ నెరవేర్చినచో ప్రసన్నురాలై శపించదు, కనుక తెల్లగుఱ్ఱపు తోకను చుట్టుకొని నల్లగా చేయుదము' అని పరస్పరము, కూడబలుకుకొని, కాలనాగములు దానిపుచ్ఛముగా అంటుకొని యుండెను."

"శౌనకా! ఇంతలో పందెము చరచుకొనిన కద్రూ - వినతలు సముద్ర తీరమునకు వచ్చి అక్కడ, శరీరమంతయు వెన్నెలవలె తెల్లగా మెఱయుచు, తోకమాత్రము నల్లగా నున్న అశ్వమును చూచిరి"

**వినత దాస్యము - గరుడోత్పత్తి - దేవత లతనిని స్తుతించుట :**

"శౌనకా! అప్పుడు దుఃఖార్తురాలై యున్నవినతను కద్రువ, తనదాసిగా నుండు మనెను. పందెమునకు కట్టుబడి వినత దాస్యమునకు అంగీకరించెను."

"శౌనకా! తరువాత కొంతకాలమునకు, వినత ఛేదించక యుంచిన రెండవ యండమునుండి, మహాబలుడు, సమస్త దిక్ప్రకాశకుడు, కామరూప - కామగమన - కామవీర్యములు గల ఒక పక్షిరాజు, అగ్నిరాశివలె, భాసించుచు పుట్టెను. అతడు అతిభయంకరముగ విద్యుత్తువలె ప్రకాశించు చున్న పచ్చని కనుగవ గలిగి, ప్రళయాగ్ని ప్రభలతో వృద్ధి చెంది. తన మహాకాయముతో ఆకాశమునకు ఎగిరెను. ఆ విహంగమరాజు అతిఘోర ధ్వని చేయుచు, రెండవ బడబాగ్నియా యన్నట్లు రౌద్రాకారముతో నుండెను".

"శౌనకా! అప్పుడు ఆ పక్షిరాజును దేవతలు ఋషులున్ను చూచి అది నిక్కముగ అగ్ని యనియే భావించి, దానికి శరణు జొచ్చి, నమస్కరించి 'అగ్నిదేవా! నీవు పెరుగక యుండుము. మమ్ము దహింప గోరుచున్నట్లున్నావు. ఈ నీ మహాజ్వాలలు మాపైపే సాగివచ్చుచున్నవి' అని వేడుకొనిరి. అప్పుడు అగ్ని దేవుడు వారితో నిట్లనెను :

"దేవతలారా! మీ రనుకొన్నట్లు కాదు. ఇతడు మహాబలశాలియైన గరుడుడు. నాతో సమానమైన తేజస్సు గలవాడు. తేజోరాశియైన యితనిని చూచి మీరు మోహము చెంది యున్నారు. ఇతడు సర్పనాశకరుడు. వినతా - కశ్యపుల పుత్రుడు. దేవతలకు హితుడు. దైత్య - దానవులకు అహితకరుడు. కనుక, ఇతని విషయములో మీరు భయపడకుడు. నాతో గలిసి మీరు ఇతనిని చూడుడు".

ఇట్లు అగ్ని దేవుడు చెప్పిన తరువాత, దేవతలు, ఋషులు గరుడునకు దూరముగా నిలిచి అతనిని ఇట్లు స్తుతించిరి.

"మహాత్మా! నీవు ఋషితుల్యుడవు, పక్షిరాజువు, నీవే ప్రభుడవు, తపించు సూర్యుడవు, పరమేష్ఠియైన ప్రజాపతివి. నీవే యింద్రుడవు, హయగ్రీవుడవు, శర్వుడవు, జగత్పతివి. త్రిమూర్తి స్వరూపుడవు, నీవే అమృతము, మాకందఱకు రక్షకుడవు, చరాచర జగత్స్వరూపుడవు, అగ్నిప్రభలు గల నీవు సూర్యునివలె తపింప జేయుదువు, ప్రళయాగ్నివంటి వాడవు.

"మహాత్మా! దేవతల నందరను రక్షింపుము. వారు నీ తేజస్సు చూచి భయపడి దిక్కులకు, ఆకాశమునకు పారిపోవు చున్నారు. నీవు దయాళువైన కశ్యపమహాముని కి పుత్రుడవు, కనుక కోపింపకుము. ప్రపంచమును దయతో జూడుము, శాంతింపుము, మము రక్షింపుము, పిడుగు చప్పుడు వంటి నీ ధ్వని చేత సమస్త దిక్కులు, ఆకాశము, స్వర్గము, భూమి, మా హృదయములు - అన్నియు గడగడ వడకుచున్నవి. కనుక, అగ్నివంటి నీ యీ భయంకరాకారమును ఉపసంహరించుకొనుము. నీ తేజస్సు క్రుద్ధుడైన యముని తేజస్సువలె నున్నది. నిన్ను యాచించు చున్నాము. మా యెడల ప్రసన్నుడవు కమ్ము. మాకు శుభంకరుడవు కమ్ము.''

**గరుడుడు తేజస్సును శరీరమును సంకోచించుకొనుట-సూర్యుని క్రోధ తేజశ్శాంతికై అరుణుడు అతని రథసారథి యగుట :**

"శౌనకా! ఇట్లు దేవతలు, ఋషులు అనేక విధముల స్తుతించిన తరువాత గరుడుడు తన తేజస్సును ఉపసంహరించుకొని దేవతలతో 'మహాత్ములారా! నా యీ భయంకర రూపము చూచి, సర్వభూతములు భయపడకుండుగాక! అందుకై నా యీ తేజస్సును ఉపసంహరించుకొను చున్నాను' అని చెప్పెను.

''శౌనకా! తరువాత గరుడుడు తన యన్న యగు అరుణుని వీపుపై నెక్కించుకొని తన తండ్రి యింటి నుండి తల్లి కడకు వచ్చి, సముద్ర తీరము నందు అరుణుని తూర్పుముఖముగా దించెను. అప్పుడు సూర్యుడు సమస్త లోకములను దహించు చున్నాడా యనునట్లు ఉగ్రుడై వెలుగు చుండెను.''

''శౌనకా! ఈ కథను 'ప్రమతి' తన పుత్రుడైన 'రురు' నకు చెప్పగా రురుడు తండ్రి యైన ప్రమతితో, 'తండ్రీ! సూర్యునకు దేవతలు ఏమి యప

కారము చేసిరి? సూర్యుడు ఎందుకు లోకములను దహింప దలచెను? అని యడుగగా, ప్రమతి రురునకు ఇట్లు చెప్ప దొడగెను :

పుత్రా! సూర్యుడు దేవతలకు సహాయము చేయు నుద్దేశముతో, అమృత పాన సమయమునందు వారిలో చేరిన రాహువును విష్ణువునకు తెలిపెను. అందు చేత రాహువునకు కోపము వచ్చి సూర్యుని తరచుగా అతడు మ్రింగుచుండెను. అట్లు మ్రింగుట చూచుచుగూడ దేవతలు సహానుభూతియైనను లేక ఆనందించు చున్నారు. దేవతలకు సహాయము చేసిన నాపైన రాహువునకు కోపము వచ్చెను. కనుక దేవతలందరు అనుభవింప వలసిన యీ పాపము నా యొక్కనికే తగి లినది. నేను సహాయము చేయు చున్నప్పుడు దేవతలకు నాయందు గల ఆదరము ఈ నాసంకట పరిస్థితిలో లేదు. రాహువు నన్ను మ్రింగుచుండగా దేవతలు చూచి మౌనముతో సహించి యున్నారు.

"ఇట్లు సూర్యునకు దేవతలపై కోపము వచ్చి ప్రపంచమును దహింప జేయు తేజస్సుతో వెలుగు చుండెను. ఈ నిశ్చయముతోనే సూర్యుడు అస్తాద్రి చేరి రాత్రియందు లోకములకు దాహము కలిగింపగా, మహర్షులు ఆ వేడిమి భరించ జాలక, దేవతలతో 'అర్ధరాత్రి సమయములో ఈ దాహమేమి? ఇది లోక వినాశకరము' అని చెప్పిరి.

ఆ దాహమును భరించజాలక అప్పుడు మునులు, దేవతలున్ను బ్రహ్మ దేవుని ప్రార్థించి, అగ్నిని శాంతింపజేయు మనిరి. ఆ దేవుడు దానికి ఉపాయ ముగా 'మీరు అరుణుని సూర్యసారథిగా చేయుడు. సూర్యుని తేజస్సును తొలుత అరుణుడు ఆకర్షించి వెలుగును. అంతటితో సూర్యుని తేజస్సు లోకులకు సహింపదగినదిగా నగును' అని చెప్పెను.

దేవతలు, మహర్షులు అప్పుడు బ్రహ్మదేవుడు చెప్పినట్లే అరుణుని సూర్య సారథిగా చేసిరి. దానిచేత సూర్యుని తేజస్సు తగ్గి లోకములకు క్షేమము కలిగెను. అరుణుడును, సూర్య తేజస్సుచేత దేదీప్యమానుడై వెలుగు చున్నాడు".

ఇట్లు ప్రమతి రురునకు చెప్పెను.

**సూర్యతాప మూర్ఛిత సర్పముల రక్షణమునకు కద్రువ యింద్రుని స్తుతించుట :-**

"అరుణుడు సూర్యసారథియై పోవగానే గరుడుడు వేగముగా తల్లియైన వినతయొద్దకు పోయెను. తల్లి అప్పుడు సవతియైన కద్రువకు దాస్యము చేయుచు అనేక బాధలను అనుభవించు చుండుట గరుడుడు చూచెను. కాని, ఏమియు అన జాలక ఊరకుండెను".

ఇట్లుండగా ఒకనాడు, కద్రువ కనపడగనే, వినత ఆమెకు నమస్కరించి నిలుచుండెను. అప్పుడు కద్రువ "నన్ను నీవు మోసికొని సముద్ర మధ్యము నందున్న నాగ ద్వీపమునకు కొనిపొమ్ము. గరుడుడు నా పుత్రులను వహించి తీసికొనిపోవలెను". అని వినతను ఆజ్ఞాపించెను. వెంటనే వినత కద్రువను భుజముపై నెక్కించుకొని నడవ జొచ్చెను.

గరుడుడు నాగులను మోసికొని మార్గములో సూర్యమండలమును చుట్టి పోవు చుండెను. అప్పుడు రవితేజముచేత తపించి సర్పములు మూర్ఛిల్లెను. కొడుకుల దురవస్థను చూచి కద్రువ ఇంద్రుని ఈ విధముగా స్తుతించెను:-

"దేవేశా! సహస్రాక్షా! శచీపతీ! నీకు నమస్కారము. సూర్యతాపతప్తులైన సర్పములపై జలము వర్షించి కాపాడుము. నీవే మాకు రక్షకుడవు. జలము అత్యల్పముగా సృష్టించుటకు నీవే సమర్థుడవు. నీవు అగ్ని - వాయు - మేఘ - విద్యుత్తుల స్వరూపముతో ఆకాశమున విరాజిల్లు చున్నావు. మహామేఘము నీవే; మేఘగణములను చెదర జేయునదియు నీవే. పిడుగుకూడ నీవే. ప్రపంచ సృష్టి-సంహారములను చేయుచు నీవు ఎవరికిగూడ ఓడ కుండువాడవు. ఆశ్చర్యకరమైన మహాభూతము నీవే. జ్యోతిస్సు, సూర్యుడు, అగ్ని నీవే! సర్వవ్యాపకుడవైన సహస్రాక్షా! నీవు అమృతస్వరూపుడవు. సోముడవు. నీవే తిథి-ముహూర్త-క్షణ-లవ స్వరూపుడవు. కలా-కాష్ఠా - (త్రుటి స్వరూపుడవు). సంవత్సర - మాస - రాత్రి - దిన - స్వరూపుడవు. గిరి - కానన సహితభూమి నీవే; చీకట్లు లేక సూర్యునితోగూడిన ఆకాశము, తిమి - తిమింగిల - సహితమై, బహుమకర మత్స్యాకులయై, మహాతరంగ శోభితమైన మహోదధి నీవే! విద్వాంసు లందరు సర్వదా నిన్ను పూజించు చుందురు. మహర్షులు స్తుతింపగా నీవు యజ్ఞములందు

సోమరసపానము చేసెదవు. హవిస్సులను ప్రపంచక్షేమము కొరకు గైకొనెదవు. బ్రాహ్మణులు ఫలమును కోరి నిన్నుగూర్చి యజ్ఞములు చేసెదరు. దానికొరకు వారు వేద -వేదాంగములను అభ్యసించెదరు. ఆ విద్యలందు నీవు కీర్తింప బడు చున్నావు."

**ఇంద్రుని వర్షముచేత సర్పములు ప్రసన్నములగుట :**

"శౌనకా! ఇట్లు కద్రువ ఇంద్రుని ప్రార్థింపగా అతడు మేఘములచేత సమస్తాకాశమును ఆచ్ఛాదించెను. మేఘములకు 'మీరందరు శీతలము కురియుడు, అని యాజ్ఞ యిచ్చెను.

ఇంద్రాజ్ఞపై మేఘములు మెరపులతో మెరయుచు పరస్పరము గర్జిల్లుచు ఆకాశమునుండి నిరంతరము వర్షము కురియ జొచ్చెను. ఆ వర్షముచేత సమస్తా కాశమును మేఘములు ఆవరించెను. అసంఖ్యాకములైన ధారలనెడు అలలతో గూడిన ఆకాశసముద్రము నృత్యముచేయు చున్నదా యనునట్లు ఉండెను. భయంకరముగా గర్జిల్లుచున్న మేఘములు విద్యుత్తుచేత - వాయువుచేతను కంపించుచు నప్పుడు నిరంతరము కుంభవృష్టి గురిసెను. మేఘచ్ఛాదితమైన ఆకాశమందు చంద్ర సూర్య కిరణములుగూడ అదృశ్యము లయ్యెను. ఇంద్రు డిట్లు జలము వర్షింపగా నాగులకు మిక్కిలి హర్షము గలిగెను. నేలపై నెల్ల యెడల జలమే నిండి యుండెను. ఆశీతల - నిర్మలజలము రసాతలమువరకు పోయెను. అప్పుడు సమస్తభూతలము అసంఖ్యాకము లైన నీటియలలచేత కప్పబడి యుండెను. ఈ విధముగా వర్షముచేత సంతుష్టులైన సర్పములు తమతల్లితోపాటు 'రామణీయకద్వీపము'నకు వచ్చిరి."

**రామణీయక ద్వీప వర్ణనము-గరుడుడు దాస్యవిముక్తికై సర్పములను ఉపాయ మడుగుట :-**

"శౌనకా! తరువాత గరుడునిపై నెక్కిపోవుచున్న సర్పము లప్పుడు జల ధారలచే స్నానము చేసి మిక్కిలి ప్రసన్నములై త్వరగా రామణీయక ద్వీపము చేరెను. విశ్వకర్మ నిర్మించిన ఆ ద్వీపమునందు పూర్వము వీరు వచ్చినప్పుడు మకరములు ఉండెను. అక్కడ భయంకరుడైన లవణాసురుని దర్శన మయి యుండెను. ఆ వనము సాగరజలముచేత నిండి పక్షి సంఘనాదము

గలిగి, విచిత్రఫలపుష్ప విరాజితవృక్షములచే శోభిల్లుచు రమ్యభవనములు, తామర కొలకులు, స్వచ్ఛ జలముగల మడుగులును కలిగి వాయువుచేత కంపితములైన వృక్షముల నుండి రాలిన సుగంధిపుష్ప వాసనలు నిండి అవి సర్పములకు హర్షము గలిగించెను. ఆ వనము గంధర్వాప్సరసలకు ప్రియమై యుండెను.

అట్లు రమణీయము, మంగళకరము, పవిత్రము, జనమనోహరము కద్రువ పుత్రులకు ఆనందకరము నైన ఆ వనమునందు సర్పములు విహరించి గరుడునకు "మమ్ము సుందరమైన మరియొక ద్వీపమునకు కొనిపొమ్ము. నీవును, అనేక రమ్య ప్రదేశములను చూచెదవు" అని ఆజ్ఞ యిచ్చిరి.

అప్పుడు గరుడుడు తన తల్లితో "అమ్మా! నే నేల ఈ సర్పముల యాజ్ఞకు లోబడవలెను? దానికి కారణ మేమి? అని యడిగెను. ఆ మాటకు వినత జరిగిన సంగతి యంతయు పుత్రునకు తెలిపి, 'నాయనా! ఇది సర్పమాత చేసిన కుట్ర. దీనిచేత ఈ నా సవతికి నేను దాసి నైతిని. నీవు నా పుత్రుడవు గనుక నీకును దాస్యము తప్పదు' అని చెప్పెను.

ఆమాట విని గరుడుడు మిక్కిలి దుఃఖించి సర్పములను 'మీకు నే నేమి చేసినచో ఈ దాస్యమునుండి మేము విముక్తుల మగుదుము?' అని అడిగెను. దానికి వారు 'అమృతము తెచ్చి యిమ్ము' అనిరి. దానికి అంగీకరించి గరుడుడు తల్లితో 'అమ్మా! నాకు అమృతము తెచ్చుబలము వచ్చుటకు తగిన ఆహారమును సూచింపుము' అని యనెను.

**గరుడుడు అమృతము కొరకు పోవుట - తల్లి యాజ్ఞపై నిషాదులను భక్షించుట :-**

అప్పుడు వినత గరుడునితో "నాయనా! సముద్రమధ్యములో నిషాదుల పురము కలదు. అందలి నిషాదుల నందరిని నీవు పట్టి భక్షింపుము. మహాతేజోబల సంపన్నుడ వగుదువు. బ్రాహ్మణుని మాత్రము భక్షింపకుము. నీవు బ్రహ్మణుని జీర్ణించుకొన జాలవు. ఎందుకనగా, బ్రాహ్మణుడు అగ్నిసమానుడు; కనుక, ఏ జంతువులున్ను అతనిని వధింప గూడదు. విప్రుడు కోపించిన యెడల, అతడు,

అగ్ని - సూర్య - విషశస్త్రములవంటివా డగును. బ్రాహ్మణుడు సర్వభూతములకు గురువు. నాయనా! ఈమొదలైన స్వరూపములు గలవా డగుటచేత, బ్రాహ్మణుడు సత్పురుషులకు పూజ్యుడు కనుక, నీకు ఎంత కోపము వచ్చినను, బ్రాహ్మణుని నీవు సంహరింప గూడదు. అతనికి ఎప్పుడుగూడ ద్రోహము చేయకూడదు. క్రుద్ధుడైన బ్రాహ్మణుడు సూర్యాగ్నులకన్న మిన్నగా దహించును. తపోనియమ వ్రతనిష్ఠుడైన బ్రాహ్మణుడు కోపించిన యెడల ప్రపంచమును భస్మీపటలము చేయ గలడు. ఇటువంటి గుర్తులచేత సర్వభూతములలో అగ్రజాతివాడు, వర్ణశ్రేష్ఠుడు! తండ్రి, గురువునగు ద్విజోత్తముని తెలిసికొనుము" అని చెప్పెను.

తర్వాత గరుడుడు తల్లితో "అమ్మా! చేపలవారిని తినునప్పుడు బ్రాహ్మణుని నే నెట్లు గుర్తుపట్ట గల్గుదును?" అని యడిగెను. ఆ మాట కామె, "ఏ వ్యక్తిని మ్రింగునప్పుడు నీ గళమునందు అతడు గాలమువలె అడ్డుపడి దహించునో, అట్టివాడు బ్రాహ్మణు డని గ్రహించి అతనిని విడిచివేయుము" అని చెప్పి, "నాయనా! నీరెక్కలను వాయువు, వీపును, చంద్ర-సూర్యులు, శిరస్సును అగ్ని, శరీరమంతయు వసువులున్ను రక్షింతురుగాక నేను ఇక్కడినుండియే నీ మంగళముకొరకు యత్నించు చుండెదను. నీ కార్యసిద్ధికొరకు నీకు, ఏ కీడుగూడ మూడనిమార్గములో పొమ్ము!" అని ఆశీర్వదించి పంపెను.

తరువాత గరుడుడు రెక్కలు విప్పికొని ప్రళయకాల యముని వలె సముద్రము మధ్యమునకు పోయి, నిషాదులను భక్షింప జొచ్చెను. అతని వేగమునకు రేగినదుమ్ము సముద్రజలమును శోషింప జేసెను. వృక్షములను కంపింప జేసెను. తెరచుకొనిన గరుడుని నోటిలో అనేక నిషాదులు గగనచరములు ప్రవేశించిన వెంటనే అతడు నోరు మూసికొనెను.

**కశ్యపుడు గరుడునకు గజ - కచ్ఛపముల పూర్వజన్మకథ చెప్పుట - గరుడుడు ఆరెంటిని పట్టుకొని దివ్యవటవృక్షమునకు పోవుట - దానిశాఖ విరుగుట :-**

"శౌనకా! వారిలో ఒక బ్రాహ్మణుడు తనభార్యతోపాటు గరుడుని నోటిలో పడి అతని కుత్తుకను గాలమువలె బాధించి దహింప జొచ్చెను. అప్పుడు అతడు బ్రాహ్మణుడని తలచి గరుడుడు అతనిని తొలగిపొమ్మని వేడుకొనెను.

అప్పు డా బ్రాహ్మణుడు, 'నా భార్య నిషాదస్త్రీ. ఆమెనుగూడ నాతోపాటు విడిచినచో నేను పోయెదను. లేకున్న నీ కంఠమునందు ఇట్లే అడ్డుపడి నిన్ను బాధించు చుందును' అని చెప్పగనే, గరుడుడు అతనిని, భార్యతోపాటు విడిచి 'నీవు నా కడుపులో జీర్ణ మగుటకు పూర్వమే తొలగిపొమ్ము' అని చెప్పెను. విప్రుడు గరుడుని ఆశీర్వదించి భార్యతో వెడలి పోయెను."

"శౌనకా! ఇట్లు, చేపలవారిని భక్షించి గరుడుడు ఆకాశమార్గమున పోయి తండ్రి యగు కశ్యపుని దర్శించెను. అత డాశీర్వదించి 'నాయనా! మీ కంద రకు కుశలమా! ఎక్కడకు పోవుచున్నావు?' అని అడిగెను. గరుడుడు జరిగిన సంగతి యంతయు చెప్పి 'తండ్రీ! నా కింకను ఆకలి తగ్గలేదు. కనుక నా తల్లి దాస్య విముక్తి కొరకుగాను, అమృతము తెచ్చుటకు దగిన శక్తిని గలిగించు నాహారమును నాకు ప్రసాదింపుము' అని వేడుకొనెను."

"శౌనకా! అప్పుడు కశ్యపుడు పుత్రుని కరుణించి అతని కోరిక తీర్చ దలచి అతనితో నిట్లనెను:-

"నాయనా! పూర్వము అతికోపిష్ఠు డైన విభావసు డనుపేరు గల ఒక ముని యుండెను. అతని తమ్ముడు, మహాతపశ్శాలి, అతని పేరు సుప్రతీకుడు. సుప్రతీకుడు సోదరుని నుండి ధనమును పంచుకొన దలచెను. అప్పుడు, తమ్మునితో విభావసుడు ఇట్లనెను:-

"సోదరా! మనకు భాగము పంచుకొనుట తగదు. కొందరు సోదరులు మోహముచేత, విభాగమును కోరెదరు. పాళ్ళు పంచుకొన్న సోదరులు ధన మోహముచేత, ఒండొరులు ద్వేషించుకొనెదరు. అట్లు పంచుకొన్న స్వార్థపరు లైన మూర్ఖులతో శత్రువులు చేరి, మిత్రులవలె నటించుచు, ఆ సోదరులలో భేద భావమును పెంచెదరు. కొందరు విభక్తులమధ్య కుట్ర చేసెదరు. అట్టి సోదరులకు నాశము కలుగును. కనుక సోదరులలో విభాగమును సజ్జనులు మెచ్చరు.*

---

* "కనిష్ఠం పుత్రవత్ పశ్యేజ్జ్యేష్ఠో భ్రాతాపితుః సమః"
అనగా 'పెద్ద అన్న తండ్రివంటివాడు. అతడు తన తమ్ములను పుత్రుల వలె చూడవలెను' అని యర్థము. ఇట్లు శాస్త్రము ఆజ్ఞాపించు చున్నది. వేరుపడిన సోదరులు ఈ యాజ్ఞను పాలించరు.

నీవు-విభాగమునకు పట్టుబట్టుచున్నావు గనుక, ఏనుగు కమ్ము" అని శపించెను. అప్పుడు తమ్ముడు సుప్రతీకుడు 'నీవు తాబేలువు కమ్ము' అని ప్రతిశాపమిచ్చెను.

"నాయనా! గరుడా! ఆ గజకచ్ఛపములు సర్వదా ధనముకొరకు పోరాడుచు, ఈ సమీపములో నున్న సరస్సులో నున్నవి. ఆ రెంటిని నీవు భక్షించినచో మహాబల సంపన్నుడవై అందరికిని అజయుడ వయ్యెదవు. ఆ సరస్సులో గజకచ్ఛపములు పరస్పర రోషదోషముచేత తిర్యగ్యోనులను చెంది యున్నవి. ఆ రెంటి శరీరములు, బలమున్ను చాల గొప్పవి. అందుచేత అవి ద్వేషింపి పూర్వవైరముతో పోరాడుచున్నవి. వానిలో గజము యొక్క ఘీంకారము చేత, నీటిలో నున్న కూర్మము పైకి లేచుచు ఆ సరస్సును క్షోభింపజేయుచుండును. కూర్మమును చూచి, తొండము త్రిప్పి గజము జలముపై తన దంతములతో, తుండాగ్రముతో, తోకతో, పాదములతోను కచ్ఛపమును కొట్టుచుండును. కూర్మము గూడ జలమునుండి తల పైకెత్తి పోరాడసాగుచుండును. గజము ఆరు యోజనముల యెత్తు. కూర్మము పన్నెండు యోజనముల వైశాల్యము, పది యోజనముల యెత్తు కలవై యుండును. ఆ రెంటిని నీ కోరెక సిద్ధించుటకొరకు భుజించి అమృతము తెచ్చుకొనుము. అక్కడ మహామేఘము వలె కూర్మము, మహాగిరివలె గజము నుండును. వానిని నీవు భక్షించుము," అని కశ్యపుడు చెప్పి గరుడుని ఇట్లు ఆశీర్వదించెను :

"పుత్రా! నీవు దేవతలతో యుద్ధముచేయు చున్నప్పుడు నీకు మంగళమగుగాక! పూర్ణకుంభము-బ్రాహ్మణులు-గోవులు-తదితర శ్రేష్ఠవస్తువులు నీకు శుభము కలిగించుగాక. సుఖ - సౌభాగ్యములు కలుగుగాక. నీవు దేవతలతో యుద్ధముచేయు నప్పుడు ఋగ్యజుస్సామవేదములు-పవిత్రములైన హవిస్సులు-సర్వరహస్యములు-సర్వవేదములున్ను నీకు బలమును ప్రసాదించుగాక."

"శౌనకా! యీ విధముగా గరుడుడు తండ్రి యాశీర్వాదము పొంది బయలుదేరి ఆసమీపమునందున్న సరస్సునకు పోయెను. అది నిర్మల జలముతో, నానా పక్షిసమూహములమై యుండెను. అప్పుడు తండ్రి మాటను స్మరించి, ఆకాశము నుండి క్రిందకు వాలి ఒక నఖముతో గజమును మరియొక నఖముతో కచ్ఛపమును

పట్టి పైకెత్తి ఆకాశమునకు ఎగిరి, 'అలంబ' తీర్థమునందలి దేవవృక్షముల (కల్పతరువులు) కడుకు పోయెను. అది అతని వేగమునకు భయపడి, అతని రెక్కలగాలికి, కంపించి, 'మమ్ము విరువకుము' అని గరుడుని ప్రార్థించెను. అట్లు కంపించుచున్న, దివ్యములు - మనోరథ ఫలముల నిచ్చునవియు నగు ఆ కనక వృక్షములను విడిచి, సువర్ణరజత ఫలములతో వైడూర్యమణి శాఖలతో నొప్పుచు, సముద్ర జలముచేత అభిషేకింప బడుచు ప్రకాశించుచున్న యితర వృక్షముల కడకు పోయెను.

**గరుడుడు కశ్యపునితో కలియుట-కశ్యప ప్రార్థనచేత - వాలఖిల్య మునులు ఆ కొమ్మ విడచిపోవుట గరుడుడు నిర్జనవనమందు ఆశాఖను విడుచుట-**

"శౌనకా! ఆ వృక్షములలో, మిక్కిలి పెద్దది, ముసలిదియు నగు 'రౌహిణి' వృక్షము (బాడిదచెట్టు) మనోవేగముతో వచ్చుచున్న గరుడునితో, 'నూరు యోజనముల పొడవు గల నా యీ శాఖపై కూర్చొని గజ-కచ్ఛపములను భక్షింపుము' అని చెప్పెను. అప్పుడు గరుడుడు వేలకొలది పక్షులకు ఆశ్రయమై, పర్వతమువలె నున్న రౌహిణి వృక్షమును ఊపుచు దానిశాఖపై వేగముగా కూర్చొనిన వెంటనే అది విరిగెను నిండుగా ఆకులుగల ఆ శాఖ గరుడుడు కాలూనిన వెంటనే, విరుగగా అది క్రిందపడకుండ నతడు పట్టుకొని నవ్వెను."

"శౌనకా! ఆ శాఖకు తలక్రిందుగా వ్రేలాడుచు దానిని పట్టుకొని తపస్సు చేయుచున్న వాలఖిల్యాది మహర్షులను చూచి 'యీ శాఖ క్రింద పడినచో, ఈ మహామునులు మరణించెదర'ని గరుడుడు నఖములతో గజ - కచ్ఛపములను పట్టుకొని నోటితో శాఖను పట్టుకొనెను. దేవతలకు గూడ సాధ్యము కాని యతని యీ కర్మను, ఋషులు చూచి ఆశ్చర్యపడి ఆ ఖగేంద్రుడు మహాభారమును మోయుచు నెగిరినవాడు గాబట్టి, అతనికి 'గరుడుడు' అని పేరు పెట్టిరి"*

* ఇతడు మహాభారమును మోసికొని యెగిరెను. కనుక "గురుం ఆదాయ ఉడ్డీన ఇతి-గరుడః" - అనగా, పెద్ద భారమును తీసికొని యెగిరినవాడు కాబట్టి 'గరుడ' నామము గలవాడు అను నీ వ్యుత్పత్తి చేత అతడు 'గరుడుడు' అనబడెను.

"శౌనకా! వానిని పట్టుకొని మెల్లగా ఎగిరి, పర్వతములను కంపింప జేయుచు గరుడుడు, వాలఖిల్యులపై దయచేత, అనేక దేశములను అట్లే తిరుగుచు నెక్కడగూడ, ఆ వృక్షశాఖను పెట్టుకొని, గజకచ్ఛపములను భక్షించుటకు వీలు గాక గంధమాదన పర్వతమునకు పోయి, అక్కడ తపస్సు చేసికొనుచున్న తండ్రి కశ్యపుని చూచెను."

"శౌనకా! అప్పుడు కశ్యపుడు దివ్యరూపుడు, తేజో - బల - పరాక్రమ సంపన్నుడు, వాయువేగ-మనోవేగము గలవాడు పర్వతమువలె నున్నవాడు, బ్రహ్మదండమువలె పైకి లేచినవాడు, అచింత్యుడు, సర్వభూత భయంకరుడు, మహావీరుడు, రౌద్రాకారుడు, అగ్నివలె పైకి మంటలుగ్రక్కువాడు, ఎవరికిగూడ చెనకరానివాడు, దేవదానవులకు అజయ్యుడు గిరి శిఖరములను గూడ భేదింప గలవాడు, సముద్రమును శోషింపజేయగలవాడు, లోకములను కలియ బెట్టు వాడు, ప్రళయకాల యమునివలె నున్న వాడునగు పుత్రుని చూచి, సంతసించి కశ్యప ప్రజాపతి అతని సంకల్పము కనుగొని అతనితో నిట్లనెను :

''పుత్రా! సాహసము చేయకుము. వెంటనే నీవు బాధ పడవలసివచ్చును. క్రుద్ధులైన వాలఖిల్యాది మునీంద్రులు నిన్ను దహింపకుందురు గాక. వీరు కిరణములను పానము చేయుచు, తపస్సు చేయు మహాత్ములు''.

ఇట్లు గరుడునితో చెప్పి కశ్యపుడు తన పుత్రుని రక్షణము కొరకు వాలఖిల్యాదులను ఇట్లు ప్రార్థించెను:-

''మహాత్ములారా! ప్రజాహితము కొరకు మహాకార్యము చేయుచున్న యీ నా పుత్రుడు గరుడుని మీరు క్షమించి ఆ కార్యమునకు అనుజ్ఞ ఇచ్చి అనుగ్రహింపుడు.''

ఇట్లు కశ్యపుడు చేయుచున్న ప్రార్థనను అంగీకరించి వాలఖిల్యాదులు రౌహిణ వృక్షశాఖను విడిచి, తపస్సు చేసికొనుటకై హిమవత్పర్వతమునకు పోయిరి.''

''శౌనకా! వాలఖిల్యాదులు వెడలిపోయిన తరువాత గరుడుడు ఆ రౌహిణ వృక్షశాఖను అట్లే నోట గరచుకొని కశ్య ప్రజాపతితో, 'భగవన్! ఈ మహా

శాఖను ఏ నిర్జన ప్రదేశము నందు విడుతునో చెప్పుము?' అని అడుగగా కశ్యపుడు గరుడునితో 'పుత్రా! మంచు గప్పిన 'నిష్పురుష' పర్వతమునకు పొమ్ము! అది నిర్జన ప్రదేశము. ఇతరులక్కడకు మనస్సుతో గూడ పోవజాలరు' అని చెప్పగా గరుడుడు మహావేగముతో ఆ 'నిష్పురుషపర్వతము నకు పోయెను.'

అతడు నోట గరచుకొనిన యామహాశాఖ నూరు చర్మముల (నూరు పశువుల చర్మముల) కొలతగల 'వధ్రి' (చర్మనిర్మితమైనపట్టి)తో గూడ కొలువ జాలనంత వైశాల్యము గలదై యుండెను. ఆ మహాశాఖను గరుడుడు నోటగరచు కొని లక్ష యోజనముల దూరము పోయి, నిష్పురుష పర్వత శృంగమునందు వాలెను. ఆ ధ్వనికి ఆ పర్వతము దద్దరిల్లెను. గరుడుని రెక్కలగాలికి అక్కడి చెట్లనుండి పుష్పములు రాలి పడెను. ఆ పర్వత మణికనకశిఖరములు ఆ యొత్తిడికి చీలెను. అనేక వృక్షములు పడిపోయెను. అవి వివిధ పుష్పములతో, విద్యుత్తుతో గూడిన మేఘమువలె శోభిల్లు చుండెను. గైరికాది ధాతుమిశ్రితము లైన యా పుష్పితవృక్షములు సూర్యకిరణవ్యాప్తములై యినుమడించిన శోభ గలవై యుండెను.

తరువాత గరుడుడు ఆ గిరిశిఖరమునందు గజ - కచ్ఛపములను భక్షించి అతివేగముగ అమృతాహరణార్థము స్వర్గమునకు బయలుదేరి పోయెను."

"శౌనకా! గరుడుడు దేవలోకము చేరబోవు చుండగా, అక్కడ అనేకము లైన ఉత్పాతములు, అపశకునములు కలిగెను. ఇంద్రునకు ప్రియమైన వజ్రాయు ధము ప్రజ్వరిల్లెను. ఆకాశమునుండి పొగలతో మంటలు గ్రక్కుచున్న ఉల్కలు (కొరవులు) పడెను. వసు-రుద్ర-ఆదిత్య-సిద్ధ-సాధ్యాదిదేవగణములు తమ తమ ఆయుధములతో పోరాడ బూనిరి. అది, దేవాసురసంగ్రామము కంటె మించి యుండెను. పిడుగులతో సుడిగాలి వీచెను. వేలకొలదిగ ఉల్కలు పడెను. మేఘములు లేకున్నను ఆకాశము బిగ్గరగా ఉరిమెను. రక్తము వర్షించెను. దేవతల పుష్పమాలికలు వాడి, తేజోహీనము లయ్యెను. ఉత్పాతకాలపు మేఘ ములు నెత్తురు గురిసెను. పైకి లేచిన దుమ్ము దేవతల కిరీటములను కప్పెను. అప్పుడు, దేవతలు, ఇంద్రుడు అతిఘోరము లైన ఉత్పాతములను చూచి, తమ గురువైన బృహస్పతితో నిట్లనిరి.

"భగవన్! ఘోరము లైన యీ యుత్పాతములు ఎందులకు ఉప్పతిల్లెను? ఇప్పుడు ఏ శత్రువుగూడ మనతో యుద్ధము చేయుటకు వచ్చు చున్నట్లు కనబడుట లేదు కదా! ఎందు కింత దారుణోత్పాతములు సంభవించెను?" ఆ మాటకు బృహస్పతి ఇంద్రునితో నిట్లనెను:-

"దేవేంద్రా! నీయపరాధముచేత (పొరపాటుచేత) మహాత్ములైన వాలఖిల్యా మహర్షుల తపోబలముచేత కశ్యపమహామునికి వినతకును పుత్రుడుగ ఒక పక్షిరాజు పుట్టెను. ఆ పతగేంద్రుడు మహాబలశాలి కామరూపధరుడు, అతి సమర్థుడు. అత డిప్పుడు అమృతమును హరించుటకు ఇక్కడికి వచ్చు చున్నాడు. అతడు సాధింప జాలనిపని ఏదియు లేదు."

"శౌనకా! బృహస్పతి మాట విని ఇంద్రుడు అమృతరక్షకులతో నిట్లనెను:-

"మహావీర్య-బలసంపన్నుడైన పక్షిరాజు అమృతమును హరించుటకు మిక్కిలి సంరంభముతో వచ్చు చున్నాడు. అతడు దానిని హరించుకొని పోవుటకు సాధ్యపడనట్లుగా అమృతరక్షణము చేయుడు. అతనిబలము అసమాన మని బృహస్పతి చెప్పెను."

"శౌనకా! ఇంద్రునియాజ్ఞపై దేవతలు ఆశ్చర్యపడి అతిప్రయత్నముతో అమృతమును కాపాడిరి. ఇంద్రుడు గూడ అమృతరక్షణము చేసెను. దేవ సైన్యములు శస్త్రాస్త్రాదులు ధరించి బయలుదేరిరి. అగ్నివలె పొగలు గ్రక్కుచు మండుచున్న చక్ర-త్రిశూల-ఖడ్గాదులనువారు ధరించి యుండిరి. శస్త్రములతో, ఆభరణములతోను దేవతలు వెలుగుచుండగా ఆ సమరభూమి సూర్యకిరణ ప్రకాశిత మైన రెండవయాకాశమా యనునట్లు శోభిల్లెను."

ఉగ్రశ్రవు డిట్లు చెప్పగా విని శౌనకుడు అతని నిట్లు ప్రశ్నించెను:-

**ఇంద్రుడు వాలఖిల్యులను అవమానపరచుట - వారి తపఃప్రభావము చేత అరుణ-గరుడోత్పత్తి :**

"మహాత్మా! మహేంద్రుడు ఏ యపరాధము - పొరపాటు చేసెను? వాలఖిల్యులతపోబలముచేత గరుడుడు ఎట్లు జన్మించెను? బ్రాహ్మణుడైన

కశ్యపునకు పక్షిరాజు గరుడుడు ఎట్లు పుట్టెను? అతడు సర్వభూతములకు చెనకరాని వాడుగా, అవధ్యుడుగాను నెట్లయ్యెను? గరుడుడు కామచారిగా, కామ వీర్యుడుగా నెట్లయ్యెను? ఈ విషయము లన్నియు చెప్పుము".

ఆ మాటకు సూతపుత్రుడైన ఉగ్రశ్రవుడు శౌనకునకు ఇట్లు చెప్పెను:

"శౌనకా! ఇది చాల పురాతనకథ. సంగ్రహముగా చెప్పెద వినుము:

"పూర్వము కశ్యపప్రజాపతి పుత్రులకొరకు యాగము చేసెను. ఆ యాగమునకు ఋషులు, దేవగంధర్వులున్ను సాహాయ్యము చేసిరి. ఆ యాగములో సమిధలు తెచ్చుటకు ఇంద్రుని, వాలఖిల్యమునులను, ఇతర దేవతల నున్ను కశ్యపుడు నియమించెను.

వారిలో నింద్రుడు తన - బలపరాక్రమములకు తగినట్లుగా గిరి సదృశ మైన ఒక పెద్ద ఇంధనముల మోపును ఎత్తుకొని అనాయాసముగ వచ్చుచు, అంగుష్ఠప్రమాణ శరీరములు గలిగి పొట్టివారుగా నున్న వాలఖిల్యమును లందరు కలిసి ఒక మోదుగుపుల్లను మోసికొని తెచ్చుచుండుట చూచెను. వారు అతి కృశులుగా, వారి శరీరములలో వారు విలీనులైనట్లుగాను నుండిన తపోధనులు, అందరున్ను నిరాహారులే, బలహీనులే వారు గోవు అడుగులో నిలిచిన జలములో మునుగ దగినంత కృశమైన శరీరము గలిగి యుండిరి.

వారినందరును వీర్యబలోన్మత్తు డైన యింద్రుడు విస్మయముతో చూచి పరిహసించి మెల్లగా నడుచు చుండిన వారిని దాటి అవమానించుచు త్వరగా వెడలి పోయెను. ఆ మహాముని లప్పుడు మిక్కిలి రోషముతో ఇంద్ర భయంకర మైన మహాయజ్ఞకర్మ చేయుటకు ఆరంభించి, అగ్నియందు విధివత్తుగా హోమ ములు చేసిరి. ఆ మహామునులు అప్పుడు అనేక మంత్రములు ఉచ్చరించుచు, "కామవీర్యుడు, కామగమనుడు, దేవరాజభయంకరుడు నైన మరియొక యింద్రుడు సర్వదేవతలకు ప్రభువుగా పుట్టుగాక! అతడు ఇంద్రునకన్న నూరు రెట్లు అధిక మగు వీర్యము, మనోవేగమున్ను గలిగి మా తపోబలము చేత పుట్టు గాక!" అని కోరుచు హోమములు చేసిరి.

"శౌనకా! ఆ విషయము తెలిసికొని ఇంద్రుడు మిక్కిలి సంతప్తుడై అక్కడ నియమవ్రత నిష్ఠలోనున్న కశ్యప ప్రజాపతిని శరణు వేడెను. ఇంద్రుని మొర విని కశ్యపుడు వాలఖిల్యుల కడకు పోయి, 'నా కార్యము సిద్ధించుట కొరకు మీరు అనుగ్రహింపుడు' అని కోరగా, వారును "అట్లే యగుగాక!" యని చెప్పిరి. అప్పుడు సత్యవాదులైన వాలఖిల్యులతో కశ్యప ప్రజాపతి యిట్లనెను:-

"మహామునులారా! ఈ యింద్రుడు త్రిలోకాధిపతిగా బ్రహ్మదేవుని చేత నియమింప బడెను. ఇంద్రుని కొరకు మీరుగూడ ప్రయత్నము చేయు చున్న వారే! కనుక బ్రహ్మ వాక్యమును మీరు వమ్ముచేయ గూడదు. అట్లే, మీ సంకల్పముగూడ వ్యర్థము కాకూడదు గదా! కనుక, అత్యంత బలపరాక్రమ సంపన్నుడై పుట్టబోవు గరుడుడు పక్షులకు ఇంద్రుడుగానగు గాక! ఇప్పుడు యాచించు చున్న ఈ యింద్రుని మీరు అనుగ్రహింపుడు."

"శౌనకా! యిట్లు కశ్యపుడు అడుగగా, వాలఖిల్యులు కశ్యప ప్రజాపతిని పూజించి యిట్లనిరి :

"మునీంద్రా! మా యందరి యీ ప్రయత్నము ఇంద్రుని కొరకు చేయ బడుచున్నవి. నీ ప్రయత్నము సంతానము కొరకు కనుక, నీవే యీ యజ్ఞకర్మ సఫలమగు నట్లు చేయుము. నీ యభిప్రాయములో శ్రేయస్కరమైన దానినే చేయుము."

"శౌనకా! ఆ కాలమునందే, దక్షప్రజాపతి పుత్రియైన వినతాదేవి సంతానము కొరకు తపస్సుచేసి వ్రత నిష్ఠాపరురాలై శుచిస్నాతయై భర్తయైన కశ్యప బ్రహ్మ కడకు వచ్చెను. అప్పు డామెతో కశ్యపుడు ఇట్లనెను :

"దేవీ! నీ ప్రయత్నము సఫలమగుగాక! నీ కోరిక ప్రకారము నీవు ఇరువురు పుత్రులను కనెదవు. ఆ ఇరువురు త్రిలోకాధిపతులైన వీరులుగా నుండెదరు. వారు వాలఖిల్యుల తపోబలముచేత నా సంకల్పబలముచేతను పుట్టి మహాభాగ్యవంతు లయ్యెదరు. కనుక మహాభాగ్యకరమైన యీ నీ గర్భమును

నీవు ఏమాత్రము ఏమరుపాటు లేక ధరించుము. నీ యిరువురు పుత్రులు సమస్త పక్షిగణ పూజ్యులు, వీరులు, కామగమనము గల విహంగములుగా నుండెదరు."

శౌనకా! యిట్లు కశ్యప ప్రజాపతి వినతాదేవికి చెప్పి, యింద్రునితో ప్రీతి పూర్వకముగా నిట్లనెను.

"ఇంద్రా! మహా బల-పరాక్రమ సంపన్నులైన యీ యిరువురు నీకు సహాయకులైన సోదరులుగా నుండెదరు.వీరినుండి నీకు ఏ దోషమున్ను కలుగ బోదు. నీవే యింద్రుడవుగా నుండెదవు. నీ సంతాపము తీరిపోవుగాక ! ఈ విధముగ నీవు ఇకపైన నెప్పుడుగూడ, బ్రహ్మవాదులైన మునీంద్రులను ఆక్షేపించి, దర్పముతో అవమాన పరచకుము, త్వరగా కోపము వచ్చునట్టి యీ బ్రహ్మర్షుల వాక్కే వజ్రముగా నుండును సుమా!"

"శౌనకా ! యిట్లు కశ్యపప్రజాపతి చెప్పగనే యింద్రుడు నిర్భయుడై స్వర్గమునకు వెడలి పోయెను. వినతగూడ తన కోరిక సిద్ధించుటచేత సంతసించినదై, 'అరుణుడు - గరుడుడు' అను నిరువురు పుత్రులను కనెను. వికలాంగుడైన అరుణుడు సూర్యునకు ముందు పోవుచుండెను. పక్షు లన్నిటికి నింద్రుడుగా గరుడు నభిషేకించిరి. అతని యద్భుత కార్యములను గూర్చి చెప్పెద వినుము."

**గరుడుడు దేవతలతో పోరాడుట - దేవతలపరాజయము :-**

"శౌనకా ! తరువాత గరుడుడు, వెంటనే దేవతలకడకు పోయెను. అతి బలశాలి యైన గరుడుని చూచి దేవతలు భయముచేత గడగడ వడకిరి. వారు ఏమియు తోచక పరస్పరము ఆయుధములతో కొట్టుకొనిరి. వారిలో విద్యుదగ్ని ప్రభలు గల 'భౌమనుడు' అనువాడు మహావీర్య బలసంపన్నుడు. అతడు అమృత రక్షకుడుగా నుండెను. అతనికి గరుడునితో జరిగిన యుద్ధములో గరుడు డతనిని రెక్కలతో, ముక్కుతో, నఖములతో కొట్టి, ఒక ముహూర్తకాలములో భౌమనుని సంహరించెను."

"శౌనకా! గరుడుని రెక్కల వాయువుచేత రేగిన దుమ్ము, లోకములలో నంధకారము గలిగించి, దేవతలను గప్పెను. అప్పుడు అమృతరక్షకు లెవర్ధు

గూడ కనపడ కుండిరి. ఈ విధముగా గరుడుడు స్వర్గమును గగ్గోలు పరచెను. అతడు పక్షతుండ - నఖప్రహారములచేత దేవతలను చీల్చెను.''

''శౌనకా! అప్పుడు ఇంద్రుడు వాయువును ప్రోత్సహించి, "ఈ రజో వృష్టిని చెదరగొట్టుము. ఇది నీ కార్యము.'' అని యనగా, వాయువు ఆ రజస్సును అణచెను. దానితో చీకటి చెదరి పోయెను. వెంటనే దేవతలు గరుడుని కొట్టిరి. గరుడుడు ఆకాశమునందు మహా మేఘమువలె బిగ్గరగా అరచెను. అట్లు దేవతల చేత కొట్టబడుచు గరుడుడు, సర్వభూతములను భయపెట్టుచు ఎగిరి దేవతలపై బడెను. అప్పుడు ఇంద్రాది దేవతలు 'పట్టిశ (అడ్డకత్తి) పరిఘ (గడియ)-శూల-గదా-క్షురప్ర (అర్ధచంద్ర బాణము) - చక్రాద్యా యుధములచేత కొట్టగా, గరుడుడు వారితో ఘోరముగా పోరాడుచు ఏ మాత్రము చలించలేదు.''

''శౌనకా! అప్పుడు గరుడుడు ఆకాశమునందు రెక్కలచేతను, వక్షము చేతను దేవతలను కొట్టుచు వారిని దహించుచున్నాడా యనునట్లు కనబడెను. అప్పుడు దేవతలు భయపడి పారిపోయిరి. గరుడుని దెబ్బలచేత గాయపడిన వారి శరీరముల నుండి నెత్తురు స్రవించెను.''

''శౌనకా! సాధ్యులు తూర్పునకు, వసువులు, గంధర్వులు దక్షిణదిక్కునకు, రుద్రులు పడమటికి, ఆదిత్యులు, నాసత్యులు ఉత్తర దిక్కునకున్ను పారిపోయిరి. 'అశ్వక్రంద-రేణుక-క్రథన-తపన-ఉలూక-శ్వసన - ప్రరుజు'లతో గరుడుడు సంగ్రామము చేసి, పక్ష - తుండ - నఖాగ్రములచేత వారిని ఛేదించెను. అతడప్పుడు ప్రళయకాల రుద్రునివలె దేవతలను అనేక విధములుగా క్షతగాత్రులను చేసెను. వారి శరీరములనుండి నెత్తురు గురియు చుండెను. గరుడుడు వారి కందరకు ప్రాణాంతకర సంకటము గలిగించి, వారిని దాటి, అమృతము కొరకు ముందుకు సాగి పోయెను. అక్కడ అగ్ని మహాజ్వాలలతో అన్నివైపుల వ్యాపించి యుండెను. అది ప్రచండ వాయువుచేత వీవ బడుచు తీక్ష్ణజ్వాలలతో మండు చుండెను.

"శౌనకా! అప్పుడు గరుడుడు తొంబది ముఖములచేత తొంబది నదుల జలమును పుక్కిట గొనివచ్చి ఆ యగ్నిని ప్రవేశింప దలచెను."

**స్వర్గమునుండి గరుడుడు అమృతము తెచ్చుట :-**

"శౌనకా! అప్పుడు గరుడుడు సువర్ణమయ శరీరముతో కిరణ సమూహ ములవలె ఉజ్జ్వలుడై సముద్రజల వేగమువలె బలముతో అమృత మున్న చోటికి దూరెను. అక్కడ అమృత సమీపమునందు చుట్టియున్న చురకత్తుల చక్రము పదునైన అంచులు గలిగి, సర్వదా తిరుగు చుండు 'అయోమయ'• మైనది కాన్పించెను. అది జ్వలించుచున్నసూర్యప్రభలు గ్రక్కుచు 'అమృత హరణము* చేయువారిని ఛేదించునదిగా నుండెను. అది దేవనిర్మిత మైన ఘోరరూపముగల యంత్రము.

''శౌనకా! దానిని చూచి గరుడుడు ముడుచుకొనిన తన శరీరముతో ఆ చక్రము ఆకుల సందులో దూరి క్రిందకు పోవగనే అక్కడ జ్వలితాగ్నివంటి ప్రభలు గలిగి, మెరపులవంటి నాలుకలు - మహావీర్యము దీపించు చున్ననోర్లు - ప్రకాశించు చున్న కన్నులు-చూపులలోనే విషము (చక్షుర్విషము) - వేగము - నిత్యక్రోధమున్ను గలిగి, మహా ఘోరములుగా నుండి అమృతరక్షణార్థమే నియమింపబడిన రెండు సర్పములను చూచెను. ఆ సర్పముల కన్నులు సర్వదా సంరంభముతో సర్వత్ర చూచుచు, రెప్పపాటు లేక యుండెను. ఆ రెండింటిలో నొకటిని చూచినవాడు గూడ వెంటనే భస్మీభూతు డగును".

''శౌనకా! అట్టున్నయాసర్పముల కన్నులలో దుమ్ముగప్పి, అవి యెప్పుడుగూడ చూడనట్టి రూపము గల గరుడుడు, వానిని కొట్టి పట్టుకొని అంతరిక్షమునకు పోయి, వానిని నడిమికి ఖండించి, తిరిగి అమృతము కడకు పరుగెత్తి వచ్చి, అమృత భాండమును ఊడ బెరకి, యంత్రమును మథించి, పైకి ఎగిరి, అమృతమును త్రాగకయే, దానిని గైకొని, సూర్యప్రభను గప్పి అవలీలగా వచ్చి శ్రీమహావిష్ణువును దర్శించెను''.

**గరుడునకు విష్ణువరప్రాప్తి:**

''శౌనకా! అప్పుడు మార్గమధ్యములో ఆకాశమునందు గనపడిన శ్రీమహావిష్ణువును గరుడుడు స్తుతింపగా! ఆ దేవుడు గరుడుని యనన్యసాధ్యమైన

---

• అయోమయ శబ్దమునకు 'అయస్మయము' అని వ్యాస ప్రయోగము.

* అమృతమునకు 'సోమము' అను పేరు వ్యాసుని ప్రయోగములో నున్నది.

కార్యమును ప్రశంసించుచు 'నీకు వర మిచ్చెదను. కోరుకొనుము' అని యనగా, గరుడుడు, 'భగవన్! నేను అంతరిక్షమునందు నీపైభాగమునందు ఉండునట్లు, నేను అమృతపానము చేయకున్నను ఎల్లప్పటికి అజరుడనుగా, అమరుడనుగా నుండునట్లున్నూ వరము ప్రసాదింపుము' అని కోరుకొనెను. అప్పుడు శ్రీమహావిష్ణువు 'తథాఽస్తు' (అట్లేయగు గాక) అని వర మిచ్చెను".

"శౌనకా! తరువాత గరుడుడు ఆ దేవునితో, నీవు భగవంతుడ వైనను నీకు నేనొక వరమిచ్చెదను. కోరుకొనుము'. అని యనెను. అప్పుడు శ్రీమహావిష్ణువు 'గరుడా! నీవు నాకు వాహనముగా నుండుము, అట్లే నా ధ్వజములో గూడ నుండుము. దానివలన నీవు నన్ను కోరినట్లు. నా పైభాగమునందు ధ్వజ చిహ్నముగా నుండెదవు' అని చెప్పెను. దానికి గరుడుడు అంగీకరించి 'తథాస్తు' అని యనెను."

"శౌనకా! యిట్లు, విష్ణు-గరుడులు పరస్పరము వరము లిచ్చుకొనిన తరువాత గరుడుడు త్వరగా వాయువుతో స్పర్ధ (పోటీ) పడుచు పోవుచున్నాడా యనునంత వేగముతో పోవుచుండెను."

### గరుడునిపై ఇంద్రుని వజ్రప్రహారము:-

"శౌనకా! అట్లు గరుడుడు అమృతహరణము చేసి అతి వేగముతో పరుగెత్తి పోవుచుండగా, సహించక యింద్రుడు వజ్రాయుధముతో కొట్టెను. అప్పుడు గరుడుడు నవ్వుచు నింద్రునితో మృదువుగా నిట్లనెను:

"దేవేంద్రా! యీ వజ్రాయుధము ఏ మహర్షి యెముకవలన సంభవించినదో ఆ దధీచి మహర్షియందు ఈ వజ్రాయుధమునందున్న నాకుగల గౌరవముచేత, నీయందలి గౌరవముచేతను, ఈ దెబ్బ వ్యర్థము కాకుండుటకు ఒక రెక్క విడిచెదను కాని, దానియంతము మాత్రము దొరకదు. ఈ దెబ్బ చేత నాకు బాధయు గలుగదు."

"శౌనకా! యిట్లు చెప్పి గరుడుడు తనరెక్క నొకదానిని విడిచెను. అది చూచి సర్వభూతములు సంతోషించి, అతని రెక్క (పర్ణము) మంచిరూపము గలదగుటచేత అతనికి 'సుపర్ణుడు' అని పేరు పెట్టిరి. ఆశ్చర్యకరమైన యా

విషయముచూచి యింద్రుడు 'ఈ పక్షి పహాభూతము' అని తలచి, గరుడునితో 'ఖగోత్తమా! పరమోత్తమమైన నీ బలమును గూర్చి తెలిసికొన గోరుచున్నాను. నీతో మైత్రి చేయదలచుచున్నాను' యని యనెను."

**ఇంద్ర - గరుడుల మైత్రి :**

"శౌనకా! యింద్రుని మాటకు గరుడు దతనితో నిట్లనెను :-

"దేవేంద్రా! నీ కోరిక ప్రకారమే, నాతో నీకు మైత్రి యగుగాక! నా బలమునుగూర్చి చెప్పెద వినుము. అది చాల గొప్పది. ఎవరికిగూడ సహింపరానిది. సాధారణముగా సత్పురుషులు స్వబలస్తోత్రము చేసికొనుట మెచ్చరు. స్వగుణకీర్తనముగూడ మెచ్చరు. కాని, నీవు మిత్రుడవు కనుక, చెప్పుచున్నాను. ఆత్మస్తుతికి సంబంధించిన విషయము నిష్కారణముగ ఎవరుగూడ చెప్పగూడదు."

"దేవరాజా! వన-పర్వత-సాగర సహిత సమస్త భూమండలము నేను ఒక రెక్కచేతనే వహించెదను. దానికి వ్రేలాడుచున్న నిన్నుగూడ మోసెదను. అథవా! స్థావర-జంగమాత్మకము లైన సమస్తలోకములను ఒకటిగా చేసి, ఒక రెక్కతో అనాయాసముగా వహించెదను. ఇది నామహాబలము.''

"శౌనకా! గరుడు డిట్లు చెప్పగా విని దేవేంద్రుడు, "పక్షిరాజా! నీవు చెప్పిన దంతయు, నీయందుండుట సంభావ్యమే యగును. పరమోత్తము మైన నా మైత్రిని అంగీకరింపుము. నీకు ఈ యమృతముతో అక్కర లేకున్న యెడల, నాకు తిరిగి యిమ్ము. నీవు దీనిని ఎవరి కిచ్చెదవో వారు ఈ యమృతమును పయోగించి మమ్ము బాధించెదరు." అని యనగా, గరుడుడు, ఇంద్రునితో, "శక్రదేవా! ఒక కారణము నుద్దేశించి నేను అమృతము కొనిపోవు చున్నాను; దీనిని ఎవరికిగూడ, ఉపయోగించుటకు, నే నీయను. నేను అమృతము పెట్టిన చోటికి నీవు వచ్చి తీసికొని స్వర్గమునకు పొమ్ము!' అని యనగా ఇంద్రుడు గరుడునితో, 'ఖగేంద్రా! నీ మాటచేత నేను సంతుష్టి చెందితిని. వరము కోరు కొనుము ఇచ్చెదను' అని యనెను."

"శౌనకా! ఇట్లు ఇంద్రుడు చెప్పగనే గరుడుడు కద్రువ పుత్రులను వారు తన తల్లి దాస్యమునకై చేసిన కపటకృత్యములనున్న జ్ఞప్తికి తెచ్చుకొని ఇంద్రునితో, 'దేవేశా! నేను, సర్వ ప్రపంచమునకు ఈశ్వరుడనైనను, మహా బలశాలురైన సర్ప రాజులు నాకు ఆహారములగునట్లు చేయుమని నిన్ను వరము కోరుచున్నాను' అని గరుడుడు కోరగనే ఇంద్రుడు 'అట్లే యగుగాక!' అని వరమిచ్చి యోగీశ్వరుడైన శ్రీ మహా విష్ణువుకడకు పోయెను. ఆ దేవుడు గరుడునకు ఇంద్రుడిచ్చిన వరమును అనుమోదించెను. ఇంద్రుడు, 'గరుడుడు అమృతము పెట్టిన చోటికి పోయి హరించుకొని తెచ్చెదను' అని శ్రీహరికి చెప్పి, గరుడుని అనుసరించి పోయెను."

## గరుడుడు అమృతముతో సర్పముల కడకు వచ్చుట :-

"శౌనకా! తరువాత గరుడుడు త్వరగా తల్లి కడకు వచ్చి అక్కడ నున్న సర్పములతో, "ఇదిగో అమృతము తెచ్చితిని. ఈ దర్భలయందు ఉంచెదను. మీరు స్నానము చేసి పవిత్రులై వచ్చి శుభముగా అమృతము త్రాగుడు. మీ కోరిక తీర్చితిని. ఇప్పటి నుండి మా తల్లికి దాస్య విముక్తి కల్గుగాక!' అని చెప్పెను. తరువాత సర్పములు గరుడుని మాట అంగీకరించి వినతకు దాస్య విముక్తి చేసి, స్నానమునకు పోయిరి."

"శౌనకా! అట్లు సర్పములు పోవగనే, ఇంద్రుడు అమృతమును ఎత్తుకొని స్వర్గమునకు పోయెను. తరువాత సర్పములు అమృతపానమునకు ఉబలాట పడుచు త్వరగా స్నానము, జపము, ముగించుకొని అమృతము పెట్టబడిన దర్భల పరపుకడకు సంతోషముతో వచ్చి, అది అక్కడ లేకుండుట చూచి అది గరుడుని కపటకృత్యమని తలచి అమృతము ఉంచబడిన దర్భలను నాకిరి. పదునైన ఆ దర్భలచేత సర్పముల నాలుకలు రెండుగా చీలెను. అప్పటినుండి సర్పములు "ద్విజిహ్వము'లు అని ప్రసిద్ధములయ్యెను. అమృత స్పర్శచేత దర్భలు గూడ పవిత్రములయ్యెను."

"శౌనకా! ఈ విధముగ గరుడుడు చేసిన అమృతహరణము, ఆ అమృతమును ఇంద్రుడు తిరిగి తీసికొని పోవుట, సర్పములు దర్భలకోతచేత ద్విజిహ్వములగుట, అమృత స్పర్శచేత దర్భలు పవిత్రములగుట మొదలగు విషయములు నీకు వివరించితిని."

"శౌనకా! తరువాత సుపర్ణుడు ఆ యడవియందు తల్లితోపాటు సంతోష పూర్వకముగ ఉండి సర్పభక్షకుడై, సమస్తపక్షి గణములచేత పూజితుడై, అనల్పకీర్తిని గడించి వినతను ఆనందింప జేసెను."

"శౌనకా! ఈ గరుడోపాఖ్యానమును వినినవాడు గాని బ్రాహ్మణసభలో సత్వ్వదా పఠించువాడు గాని' నిస్సందేహముగా పుణ్యవంతుడై, గరుడుని కీర్తించుచు స్వర్గసుఖము పొంద గలడు."

"జనమేజయా! ఉగ్రశ్రవుడు 'సర్పములకు తల్లిశాపము, వినతకు-గరుడునకు లభించినవరములు, కద్రూ-వినతలకు పుత్రప్రాప్తి' మొదలైన సమాచారమంతయు చెప్పగా విని శౌనకుడు సూతపుత్రుడైన ఉగ్రశ్రవునితో, 'మహాత్మా! వినతాపుత్రుల పేర్లు చెప్పితివి. కాని, కద్రూపుత్రులైన నాగుల పేర్లు చెప్పవైతివి. సర్పములలో ప్రధానులపేర్లైనను విన గోరుచున్నాను. దయయుంచి చెప్పుము,' అని యడుగగా ఉగ్రశ్రవుడు ప్రధాన సర్పముల నామములు ఇట్లు చెప్ప దొడగెను:

**ప్రధాన సర్పముల నామములు :**

"శౌనకా! పన్నగులు అసంఖ్యాకులు; కనుక, అందరి పేర్లుచెప్పుటకు వీలు పడదు. వారిలో ముఖ్యుల పేర్లు మాత్రము చెప్పెదను."

"శౌనకా! అందరికన్న తొలుత శేషుడు పుట్టెను. తరువాత 'వాసుకి-ఐరావత-తక్షక-కర్కోటక-ధనంజయ-కాళియ-మణినాగ-ఆపూరణనాగ-పింజరకనాగ-ఏలాపత్ర-వామన-నీలనాగ-అనీలనాగ-కల్మాష-శబల-ఆర్యక-ఉగ్రకనాగ-కలశపోతక-సుమనాఖ్య-దధిముఖ-విమలపిండక-ఆప్త-కర్కోటక (ద్వితీయ)-శంఖ - వాలిశిఖ - నిష్టానక - హేమగుహ - నహుష - పింగళ - బాహ్యకర్ణ - హస్తిపద - ముద్గర పిండక - కంబల - అశ్వతర - కాళీయకనాగ - వృత్త - సంవర్తకులు, పద్మనామకు లిరువురు, శంఖముఖ - కూష్మాండక - క్షేమక - పిండారక - కరవీర - పుష్పదంష్ట్రి - బిల్వక - బిల్వపాండుర - మూషకాద - శంఖశిరస్ - 'పూర్ణభద్ర - హరిద్రక - అపరాజిత - జ్యోతిక - శ్రీవహ - కౌరవ్య - ధృతరాష్ట్రి - శంఖపిండ - విరజస్ - సుబాహు - శాలిపిండ - హస్తిపిండ - పిఠరక - సుముఖ - కౌణపాశన - కుఠర - కుంజర - ప్రభాకర - కుముద - కుముదాక్ష - తిత్తిరి - హాలిక - కర్దమ - మహానాగ - బహుమూ

లక - కర్కర - అకర్కర - కుండోదర - మహోదరులు" ఇవి ముఖ్య సర్పములు."

"శౌనకా! ఈ సర్పముల సంతానములు వారి సంతాన సంతానములున్ను లెక్క లేనన్ని యున్నవి. కనుక వానిని గూర్చి చెప్పను. అవి యనేక సహస్రములు-ప్రయుతముల (పదిలక్షలు) -అర్బుదముల (పదికోట్లు) సంఖ్యలో నున్నవి. వానిని లెక్క పెట్టుట యసాధ్యము.

"జనమేజయా ! ఇట్లు ఉగ్రశ్రవుడు చెప్పగా విని శౌనకుడు అతనితో నిట్లనెను :

**శేషుని తపస్సు - బ్రహ్మవరప్రాప్తి - భూభారవహనము :**

''మహాత్మా ! నీవు భుజగులను గూర్చి చెప్పితివి. వారికి సంభవించిన తల్లి శాపమునకు వారు ఏమి ప్రతిక్రియ చేసిరి? తెల్పుము"

ఆ మాటకు ఉగ్రశ్రవు డిట్లనెను :

"శౌనకా ! నాగులలో భగవంతుడైన ఆదిశేషుడు, తల్లిని విడిచి గంధమాదన పర్వతముపైన, బదరీక్షేత్రమునందు, గోకర్ణమునందు, పుష్కరారణ్యమునందు, హిమాలయమునందున్ను ఉండి వాయు భక్షణముచేయుచు నియమవ్రతనిష్ఠుడై, జితేంద్రియుడై ఆ యా పుణ్యతీర్థములందు ఆశ్రయములందున్ను ఘోర తపస్సు చేయుచుండుట బ్రహ్మదేవుడు చూచెను."

"శౌనకా! శేషనాగరాజు శరీరము మిక్కిలి శుష్కించి 'మాంస-చర్మస్నాయు (సన్నని నరములు) వులు' ఎండిపోయి' జటావల్కల (నార చీరలు) ధారియై మునిగా నుండెను. ధైర్యముతో తపస్సు చేయుచున్న శేషునితో బ్రహ్మదేవుడు, 'శేషా! ఈ తపస్సు ఎందుకు చేయుచున్నావు? ఏదైన ప్రజా శ్రేయస్కర కార్యము చేయుము. ఈ తీవ్ర తపస్సుచేత ప్రజలను తపింప జేయుచున్నావు. నీ కోరిక యేమో చెప్పుము. తీర్చెదను' అని యనగా బ్రహ్మతో శేషు డిట్లనెను.

"దేవా! నా సహోదరులందరు మందబుద్ధి గలవారై యున్నారు. కనుక వారితో కలిసియుండుట నాకు ఇష్టము కాదు. వారు శత్రువులవలె ఒండొరులు ద్వేషించుకొను చున్నారు. కనుక, నేను తపస్సు చేయుటకు వచ్చితిని. ఇక

వారివి చూచెను. వారు వినతాదేవిని, ఆమె పుత్రులను సర్వదా ద్వేషించుచు ఓర్వలేకున్నారు.

"దేవా! మాకు మరియొక సోదరుడు వైనతేయుడనువాడు ఉన్నాడు. అతడు పక్షిరాజు, అంతరిక్షమునందు తిరుగుచుండును. అతనిని సర్పములు సర్వదా ద్వేషించుచుండును. అతడు మహాబల పరాక్రమ సంపన్నుడు. అతనికి ఆ శక్తి మా తండ్రియగు కశ్యప ప్రజాపతి వరప్రసాదముచేత లభించినది. నేను తపస్సుచేసి, ఈ శరీరము విడిచెదను. దేవా! నేను మరణించిన తరువాత గూడ సర్పముల సాంగత్యము నాకు ఎట్లు లేకుండునో, ఆ యుపాయము చెప్పుము." ఆ మాటకు బ్రహ్మదేవుడు శేషునితో నిట్లనెను:-

"శేషా! నీ సోదరుల దుష్కృత్యము లన్నియు నే నెరుగుదును. నీ తల్లి యపరాధము వలన నీ సోదరులకు మహాభయము సంభవించెను. దానికి పరిహారము పూర్వమేచేయ బడెను. కనుక నీ సోదరులను గూర్చి నీవు విచారింపకుము. వరము కోరుకొనుము. ఇచ్చెదను. నీ యెడల నాకు పరమప్రీతి గలదు. నీ భాగ్యవశముచేత నీ బుద్ధి ధర్మమునందు నిలిచి యున్నది. ఇట్లే యది స్థిరముగా నుండుగాక !"

ఆ మాటకు శేషుడు 'భగవన్! నాబుద్ధి సర్వదా శమ - దమ - ధర్మ - తపస్సులందు స్థిరముగ నుండునట్లు వరము ప్రసాదింపుము' అని కోరగా, బ్రహ్మదేవుడు 'శేషా! నేను నీ శమదమాది గుణముల చేత ప్రీతి జెందితిని. నా యాజ్ఞచేత నీవు ఒక ప్రజాహిత కార్యము చేయవలెను—— 'పర్వత - వన - సాగర - గ్రామ - నగర - విహార' సహిత సమస్త భూమండలము చలించక స్థిరముగా నుండునట్లు ధరించి నిలుపుము. దానిచేత ఈ భూమికి 'అచల, అను పేరు శాశ్వతముగ నుండు గాక! అని యనెను. ఆ మాటకు శేషుడు ఇట్లనెను:

"దేవా ! జగత్పతి వైన నీ యాజ్ఞ మేరకు ఈ భూమిని నిశ్చలముగా నుండునట్లు ధరించెదను. నా తలపై నుంచుము." ఆ మాట విని బ్రహ్మదేవుడు శేషునితో భుజగరాజా! నీవు భూమి క్రిందకు పొమ్ము. భూమియే నీవు లోపలికి పోవుటకు వివరము కల్పించును ఈ భూమిని ధరించుటచేత నీవు నాకు మిక్కిలి ప్రియము చేసినవాడ వగుదువు. "అనెను."

''శౌనకా! బ్రహ్మదేవుని యాజ్ఞప్రకారము ఆదిశేషుడు భూవివరములో ప్రవేశించి సమస్త భూమండలమును తన శిరస్సులపై ధరించుచుండగా, బ్రహ్మదేవుడు అతనితో ''నాగరాజా! నీ వొక్కడవే అనంతఫణముల చేత ఈభూమి నంతటిని ధర్మస్వరూపుడవై నావలెను, ఇంద్రునివలెను, ధరించు చున్నావు'' అని యనెను.

''శౌనకా! భూమి క్రింది భాగమునందు ప్రతాపశాలియైన అనంతుడు (శేషుడు) ఒక్కడే సమస్త భూమండలమును ధరించు చున్నాడు. బ్రహ్మదేవుడు గరుడుని అనంతునకు సహాయకునిగా ఏర్పరచెను. అనంతుడు భూభారార్థమై వెడలి పోయిన తరువాత సర్పము లన్నియు వాసుకిని, దేవతలు దేవేంద్రునివలె, తమ రాజ్యమునందు రాజుగా పట్టాభిషిక్తుని జేసిరి''.

ఇట్లు చెప్పి ఉగ్రశ్రవుడు తరువాతి కథ శౌనకునకు చెప్ప దొడగెను.

**మాతృ శాపమునుండి రక్షణమునకు నాగుల పరస్పర మంత్రాలోచనము :**

''శౌనకా! మాతృశాపవిముక్తి కొరకు వాసుకి ఉపాయమును ఆలోచించుచు నైరావతాది నాగులతో నిట్లనెను.

''నాగులారా! మాతృ శాపమును గూర్చి మీ కందరకు తెలియును. శాప విముక్తి కొరకు మనమందరము ప్రయత్నింతము. అన్ని శాపములకు ప్రతిక్రియ ఉన్నది. కాని మాతృ శాపమునకు విముక్తి లేదు. సత్యము యొక్క సమక్షమున మనకు శాప మీయబడినట్లు విని చాల భయకంపములు గలుగు చున్నవి. మన యందరకు వినాశము నిశ్చయముగా మూడినది. శపించు చున్న మన తల్లిని దేవుడు నివారించ లేదు. కనుక సర్పములకు క్షేమము గలుగుటకు గాను మన మిప్పుడు ఆలోచింతము. ఈ సమయము మించగూడదు. మనలో బుద్ధిమంతు లందరు ఆలోచించి, ఈ శాప విముక్తికి హేతువును కనుగొనెదరు గాక. జనమేజయుడు సర్పవినాశముకొరకు చేయు యజ్ఞమునందు అగ్నిని, నిగూఢముగా నుంచి యజ్ఞము జరుగకుండుటకు గాని లేక యజ్ఞపరాభవము చేసి కాని, యజ్ఞభంగము చేయుదుము''.

"శౌనకా! యిట్లు వాసుకి చెప్పగా, సర్పశ్రేష్ఠులు అంగీకరించిరి. వారిలో కొందరు, 'మనము బ్రాహ్మణవేషములో పోయి, యజ్ఞము చేయకు మని జనమేజయుని ప్రార్థింతము' అని యనిరి. మరికొందరు మన మా రాజునకు మంత్రుల ముగా అతనికడ చేరి, యజ్ఞము అపుటకు ఉపదేశింతము. అతడు సర్వకార్యములు మంత్రుల మగు మనతో సంప్రదించి నిశ్చయించును. ఆ రాజు బుద్ధిమంతుడు గాబట్టి, బహుజనమతము అడగినప్పుడు, స్పష్టముగా నతనితో, యజ్ఞ కర్తకు ఇహపరలోకములందు గలుగు ననేక భయంకర దోషములను, సకారణముగా నిరూపించి చెప్పి, యజ్ఞమును అపుదము అని యనిరి."

"శౌనకా! మరికొందరు, 'యజ్ఞము చేయించునుపాధ్యాయుని మనలో నొకడు కరచి చంపినయెడల, యజ్ఞము జరుగదు' అని యనిరి. ఇంకకొందరు, మనము యజ్ఞఋత్విక్కుల నందరిని కరచి చంపినయెడల, మనకార్యము నెరవేర గలదు' అని యనిరి."

"శౌనకా! అది విని కొందరు ధర్మాత్ము లైన నాగులు దయాళువులై, 'ఋత్విక్కులను, ఉపాధ్యాయునిన్ని చంపుటవలన మనకు బ్రహ్మహత్యాదోషము కలుగును. ఇది తగదు. వ్యసనమునందు సద్ధర్మమూలమైన శాంతి వహించుట ఉత్తమము. అధర్మాశ్రయణమువలన సర్వప్రపంచము నశించును' అని యనిరి. మరికొందరు, 'మనము మేఘులమై జలము వర్షించి, యజ్ఞాగ్నిని చల్లార్పుదము. మనలో కొందరము 'స్రుగ్భాండము'(యజ్ఞోపకరణపాత్రము) రాత్రి హరింతము అని యనిరి. మరికొందరు 'యజ్ఞశాలలో నున్న జనులను కరచుదము. అట్లు చేసినయెడల మనకు భయము కలుగదు లేదా సంస్కరింపబడిన భోజ్యవస్తువులలో మల - మూత్రములు చేసి చెడగొట్టుదము లేదా మనము ఆయజ్ఞములో ఋత్విక్కుల మై 'దక్షిణ పూర్తిగా ని'మ్మని యజ్ఞవిఘ్నము చేయుదము' అని యనిరి. ఇతరులు, 'జనమేజేయుడు స్నానార్థము పోయినపుడు, అతనిని బంధించి తెచ్చినయెడల యజ్ఞము నిలిచి పోవును. లేదా, ఆ రాజునే కరచి చంపుదము అతడు చచ్చినయెడల అన్ని యనర్థములకు మూలము ఛిన్న మగును' అని యనిరి.

"వాసుకిరాజా! ఇది మా యందరి యభిప్రాయము. ఇక నీకు తోచినట్లు చేయుము." అని చెప్పి, యతనిమాటకై యెదురుచూచు చుండగా నత డిట్లనెను:-

"సర్పములారా! మీరు చెప్పిన యుపాయములు మంచివి కావు. అవినాకు నచ్చ లేదు. కనుక మనతండ్రి కశ్యపప్రజాపతి యొక్క జ్ఞాతులపై మైత్రిచేత, మన కేది శ్రేయస్కరమో, హితమో యోచింతము. నా కేమియు తోచుట లేదు. మీకు హితమే నేను చేయ వలెను కాబట్టి, నా యందలి గుణదోషములను గూర్చి మిక్కిలి పరితపించు చున్నాను."

"శౌనకా! సర్పములు - వాసుకియు చెప్పినమాటలు విని 'ఏలాపత్రుడు' అను సర్పరాజు వారితో నిట్లనెను:-

**ఏలాపత్రుడు బ్రహ్మమాట చెప్పుట :-**

"సర్పములారా! ఆ యజ్ఞము జరుగదు. మనకు ఎవని వలన భయము గలుగు చున్నదో, ఆ జనమేజయరాజు అట్టివాడు కాడు. దైవోపహతు డైన పురుషుడు దైవమునే ఆశ్రయించును. అతనికి ఇతరాశ్రయ మేదియు నుండదు. మన కీభయము పోవుటకు దైవమునే ఆశ్రయింతము. కనుక, మీరు ఈ విషయములో నా మాట వినుడు.''

''సర్ప రాజులారా! నేను మన తల్లియొడిలో నున్నప్పుడు ఆమె యిచ్చిన శాపమును విన్నాను. దేవతలు ఆ శాపమును గూర్చి బ్రహ్మదేవునితో నిట్లనిరి:-

''దేవా! తల్లి తన ప్రియపుత్రుల నిట్లు శపించునా? కద్రువదప్ప మరి యెవ్వరు ఇట్లు శపించెదరు? ఆమె అతి తీక్ష్ణ రూపము గలది. నీ యెదుట ఆమె శాపమును గూర్చి చెప్పినప్పుడు నీవు గూడ, 'అట్లేయగుగాక!' యని ఆమెతో నంటివి. ఆమె నప్పుడు నీ వెందుకు వారించవైతివి? దానికి కారణము తెలిసికొన గోరుచున్నాము''.

''సర్ప రాజులారా! యిట్లు దేవతలు అడుగగా, బ్రహ్మదేవుడు వారితో నిట్లనెను:-

"దేవతలారా! అనేక పన్నగములు అతి ఘోరరూపములు-తీక్ష్ణములు-అధిక విషము గలవి. కనుక నేను ప్రజాహితము గోరి, అప్పుడు కద్రువను వారింపనైతిని. ఆమె యిచ్చిన శాపముచేత క్షుద్రములు-పాపాచారములు-విషాధిక్యము గలవి-అధర్మాచరణములునగు సర్పములు వినాశము చెందగలవు. ఆ సర్పములకు గలుగు మహా భయము నుండి విముక్తి సకాలమునందు కలుగుటకు కారణము చెప్పెదను వినుడు:-

"దేవతలారా! యాయావరుల కులము (బ్రాహ్మణ వంశము) నందు బుద్ధిమంతుడైన మహర్షి పుట్టబోవుచున్నాడు. అతని పేరు 'జరత్కారుడు' అతడు మహాతపస్వి-జితేంద్రియుడు. అతనికి పుత్రుడై 'ఆస్తీకుడు' అనువాడు పుట్టును. అతడు గూడ మహా తపశ్శాలియే. ఆస్తీకుడు జనమేజయుడు చేయు సర్పయాగమును ఆప గలడు. అప్పుడు, ధర్మాత్ములైన సర్పములు విముక్తి పొందగలవు."

బ్రహ్మదేవు డిట్లు చెప్పగా, దేవత లిట్లనిరి :-

"బ్రహ్మన్! మహాతపస్సంపన్నుడైన జరత్కారుడు ఏ స్త్రీనుండి ఆస్తీకుని కనును?" ఆమాటకు బ్రహ్మదేవుడి ట్లనెను :-

"దేవతలారా! జరత్కారుమహాముని తనకు సనామధేయురాలైన 'జరత్కారువు' అను భార్యనుండి తపోవీర్యసంపన్నుడైన ఆస్తీకుని కన గలడు. ఆమె వాసుకిచెల్లెలు. ఆమె పుత్త్రుడు ఆస్తీకుడు నాగులకు శాపమోక్షము కలిగించ గలడు."

శౌనకా! యిట్లు బ్రహ్మదేవుడు దేవతలకు చెప్పినమాటలు ఏలాపత్రుడు సర్పములకు చెప్పి పన్నగులతో మరల నిట్లనెను :-

"పన్నగులారా! అట్లు బ్రహ్మదేవుడు చెప్పగనే దేవతలు 'అట్లే యగుగాక!' యనిరి. పిదప బ్రహ్మ దేవుడు స్వస్థానమునకు వెడలి పోయెను. కనుక, వాసుకీ! 'జరత్కారు' వనుపేరు గలనీ సహోదరిని, జరత్కారుమహామునికి, నాగుల భయ శాంతి కొరకు, ఇమ్ము. ఆముని బిచ్చ మెత్తుకొనుచు, మహా వ్రత నిష్ఠాపరుడై తిరుగు చుండును, ఇదియే, సర్పములకు మోక్షోపాయ మని వింటిని"

### వాసుకి తన చెల్లెలి వివాహప్రయత్నము చేయుట :-

"శౌనకా! సర్పములు ఏలాపత్రుని మాట విని సంతసించి, 'బాగు-బాగు' అనిరి. అప్పటినుండి వాసుకి తనచెల్లెలగు జరత్కారువును రక్షించు చుండెను. కొంతకాలము గడచిన తరువాత దేవాసురులు సముద్రము మథించనప్పుడు వాసుకి కవ్వపుత్రాడుగా నుండెను. ఆ కార్యము ముగించి, దేవతలు వాసుకితో బ్రహ్మదేవుని కడకు పోయి యిట్లనిరి :-

"భగవన్! ఈ వాసుకి మాతృశాపభీతితో మిక్కిలి పరితపించు చున్నాడు. ఇతని మనశ్శల్యము తీసివేయుము. ఇతడు జ్ఞాతులహితము గోరుచున్నాడు. ఈ నాగరాజు మాకు సర్వదా హితుడుగా నుండును. దేవేశా ! యితనిని అనుగ్రహింపుము. ఇతని మనోబాధ తీర్చుము."

"శౌనకా! ఆ మాటలు విని బ్రహ్మదేవుడు దేవతలతో, 'పూర్వము ఏలాపత్రు డను నాగరాజు నాతో ఈ విషయము చెప్పినప్పుడు, నా మనోభిప్రాయ మతనికి చెప్పితిని. ఆ విధముగానే యీ వాసుకి, సకాలములో ఆ కార్యము చేయుగాక! సర్పయాగమునందు పాపులైన సర్పములు నశించగలవు. ధర్మాత్ములు నశించరు. దేవతలారా ! ఆ జరత్కారుముని జన్మించి యిప్పుడు ఉగ్రతపస్సు చేయు చున్నాడు. అతనికి వాసుకి, తన సోదరిని ఇచ్చుగాక! అదియే పన్నగులకు హితమైన కార్యము." అని చెప్పెను.

"శౌనకా ! బ్రహ్మమాట విని, శాపమోహితుడైన వాసుకి తన చెల్లెలిని జరత్కారుమునికి ఇచ్చుటకు ప్రయత్నించుచు, 'ఆ ముని వివాహము చేసి కొనుటకు కోరినసంగతి తెలిసిన వెంటనే, వచ్చి నాకు తెలుపుడు. అది మనకు శ్రేయోదాయకము' అని సమస్త సర్పములను ఆజ్ఞాపించెను."

ఇట్లు ఉగ్రశ్రవుడు చెప్పగా విని, శౌనకు డా మహాశయునితో 'మహాత్మా! నీవు 'జరత్కారు' అని మునిపేరు చెప్పితివి. జరత్కారు శబ్దమునకు అర్థమేమి ? ఆ మహర్షికి జరత్కారునామము ఏర్పడుటకు కారణమేమి ? జరత్కారు పదార్థ నిర్వచనము విన గోరుచున్నాను' అని యడుగగా, నుగ్రశ్రవుడు శౌనకునితో నిట్లనెను:-

"శౌనకా! 'జర' యనగా 'నాశ' మని యర్థము. భయంకరమ్మునకు 'కారు' అని పేరు. అతని శరీరము బలిసి భయంకరముగా నుండెను. అట్టి శరీరమును బుద్ధిమంతుడైన ఆ మహాముని తీవ్ర తపస్సుచేత మెల్లమెల్లగా క్షీణింప జేసెను. కనుక అతనికి 'జరత్కారు' అను పేరువచ్చెను. వాసుకి సోదరి జరత్కారువు గూడ అటువంటిదే."

**జరత్కారుని తపస్సు:-**

ఉగ్రశ్రవుని మాట విని శౌనకుడు 'చాల బాగుగా నున్నది' అని చెప్పి మరల సతనితో 'ఆ మహామునికి ఆస్తీకుడు ఎట్లు జన్మించెను?' అని యనగా, ఉగ్రశ్రవు డతనితో 'శౌనకా! పన్నగములకు వాసుకి అట్లు ఆజ్ఞ యిచ్చి, చెల్లెలిని జరత్కారుమునికి ఇచ్చుటకు ప్రయత్నించు చుండెను' అని చెప్పి, తరువాత ఇట్లనెను:-

"శౌనకా! తరువాత చాలకాలము వరకు, జరత్కారు మహాముని తపోనిష్ఠుడై యుండి, పెండ్లిచేసికొనుటకు ఇష్టపడకుండెను. ఆ ముని ఊర్ధ్వరేతస్కుడై, తపోనిమగ్నుడై వేదాధ్యయనాదులు చేయుచు నిర్భయుడై భూమండల మంతటను సంచరించుచుండెను. కాని, భార్యనుచేసికొనవలె నని తలచకుండెను.

**పరీక్షిత్తు ఉపాఖ్యానము:-**

శౌనకా! యిట్లు కొంతకాలము గడువగా, 'పరీక్షిత్తు' అను పేరుగల కౌరవ వంశపురాజు, అతని ముత్తాత యగు పాండురాజువలె, వేటయందలి యాసక్తితో, అనేక వరాహములను, సివంగులను దున్నపోతులను, ఇతర వివిధ వన్యమృగములను వధించుచు తిరుగుచుండెను."

"శౌనకా! ఒకప్పుడు పరీక్షిత్తు ఒక మృగమును బాణముతో కొట్టి, తరుముచు, పూర్వము పరమేశ్వరుడు యజ్ఞమృగమును వెన్నంటినట్లు, ఆ మృగము వెనువెంటనే పోయెను. కాని, అది ఆ శరీరముతోనే స్వర్గమునకు పోవుచు, తన రూపము మార్చుకొని, ఆ రాజునకు కనపడకుండ పోయెను. అప్పుడు పరీక్షిత్తు అరువది సంవత్సరముల వృద్ధుడు".

"శౌనకా! పరీక్షిత్తు వనములో మృగము వెంబడి తిరుగుచు, మిక్కిలి అలసి, దప్పికొని, ఒక ముని కడకు పోయెను. ఆ ముని తన యాశ్రమము నందలి గోశాలలో, దూడలు పాలు త్రాగుచుండగా, వాని నోటి నుండి వెడలు పాల నురుగు ఆహారముగా గొని, తపస్సు చేయుచు, మౌనియై యుండెను. పరీక్షిత్తు ఆ మునిని "ఓయీ! నేను అభిమన్యు పుత్రుడను. నా పేరు పరీక్షిత్తు. నా బాణము దెబ్బ తిని పారిపోయిన మృగమును నీవు చూచితివా?" అని యడిగెను.

"శౌనకా! మౌనముతో నున్న యా మునీంద్రుడు ఆ మాటకు బదులు చెప్ప లేదు. అప్పుడు పరీక్షిత్తు కోపముతో, ఒక మృత సర్పమును తన ధనుష్కోటితో ఎత్తి ఆ ముని మూపుపై వేసెను. అది ఆ ముని చూచెను. కాని ఆ కార్యము 'మంచిదని కాని, చెడ్డదని కాని' అనక ఊరకుండెను. అతని ధర్మ పరత్వమును శాంతిని చూచి, పరీక్షిత్తు క్రోధము విడిచి, తన చెడు పనికి మిక్కిలి వ్యథ చెంది, తన హస్తినాపురమునకు తిరిగి పోయెను. ఆ మునీంద్రుడున్ను అట్లే సర్పము తన మూపుపై నుండగా, ఓర్పుతో, ధర్మాత్ముడైన ఆ రాజుపై కోపము లేక యుండెను.

"శౌనకా! ఆ మునీంద్రునకు గోవునుండి జన్మించిన 'శృంగి' యను పుత్రుడుండెను. అతడు యువకుడు - మహా తపస్సంపన్నుడు - ఉగ్ర తేజస్కుడు - మహా క్రోధము గలవాడుగా నుండెను. ఆశృంగి అప్పుడప్పుడు బ్రహ్మదేవునికడకు పోయి, ఆ దేవుని సేవించుచు, వచ్చు చుండెను. ఆనాడతడు బ్రహ్మయనుజ్ఞ తీసికొని, తిరిగి తండ్రికడకు వచ్చు చుండగా, తన యాశ్రమము నందు క్రీడించు చున్న యతని మిత్రుడు 'కృశుడు' అను బాలకుడు, శృంగి తండ్రికి గలిగిన యవమానమును గూర్చి శృంగికి చెప్పెను."

**కృశుడు శృంగిరోషము పెంచుట:-**

"శౌనకా! ఆ మాట వినినవెంటనే, విషకల్పుడైన శృంగి, మిక్కిలి క్రోధావిష్టుడయ్యెను. అతని కోపము పెంచుచు కృశుడు అతనితో "శృంగీ! నీవు అతితేజశ్శాలివి గదా! అట్టి నీతండ్రి స్కంధమునందు సర్పశవము పడి యున్నది చూడుము. ఇక నీ దర్పము విడువుము. బ్రహ్మ విదులు-తపస్కులు-

సిద్ధులు నైన మావంటిఋషుల నికపై ఏమియు ననకుము. ఇప్పుడు సర్పశవము ధరించిన నీతండ్రిని చూచి, మహానుభావుడైన నీతండ్రికి అపరాధము చేసిన వానిపై నీపౌరుషము-దర్పవచనములు ప్రయోగింపుము. నీ తండ్రియవమానము చూచి నాకు చాల దుఃఖము కలుగు చున్నది."

**శృంగి పరీక్షిత్తును శపించుట :-**

"శౌనకా! అట్లు 'కృశుడు' శృంగిరోషము పెంచగా, శృంగి మిక్కిలి క్రోధముతో, శోకపరితప్తుడై కృశుని 'తన తండ్రిమెడపై మృతసర్ప మెట్లు పడెను?' అని యడుగగా, కృశుడు, 'పరీక్షిత్తు అనురాజు నేడు వేట యాడుచు నిచటికి వచ్చి నీతండ్రిస్కంధముపై సర్పశవము వేసెను' అని చెప్పగా, శృంగి "మాతండ్రి ఆ రాజునకు ఏ యనిష్టము చేసెను? చెప్పుము, నేడు నాతపోబలము చూడుము" అని యనగా, కృశు డతనితో నిట్లనెను :-

"శృంగీ! పరీక్షిద్రాజు వేటాడుచు మృగమును వెన్నంటి వచ్చి మృగ మును గావక, మీతండ్రిని అడుగగా, మౌనముతోనున్న మీ తండ్రి, యేమియు బదులు చెప్పనందున, కోపముతో నా రాజు మీ తండ్రి మెడపై మృతసర్పము వేసి పోయెను."

"శౌనకా! యిట్లు కృశుడు జరిగిన సమాచార మంతయు శృంగికి చెప్పగా, శృంగి అతికోపముతో, ఆచమనము చేసి; "వృద్ధు డై, కృశుడుగా నున్న నా తండ్రి 'శమీక' మహామునిమూపుపై మృతసర్పము వేసి, బ్రాహ్మణులను అవ మాన పరచిన కురువంశకళంకు డైన పరీక్షిద్రాజా ధముని, తక్షకుడు, నాశాపము చేత పురికొల్పబడి, నేటికి ఏడవ నాడు కరచి చంపును గాక" అని శాప మిచ్చెను."

"శౌనకా! తరువాత శృంగి సర్పశవము మూపుపై పడి యుండగా, గోశాలలో నున్నతండ్రి పరిస్థితి చూచి, మిక్కిలి దుఃఖించి, కన్నీరు గార్చుచు తండ్రితో, 'తండ్రీ! ఆదురాత్ముడు నీకు చేసిన అత్యాచారమునకు కోపము వచ్చి నేను 'నేటికి ఏడవనాడతడు తక్షకదష్టుడై మరణించుగాక! అని శపించితిని' అని యనెను."

"శౌనకా! మిక్కిలి కుపితుడై యున్న పుత్రునిమాట విని శమీక మహాముని యతనితో ని ట్లనెను:-

**శృంగి యిచ్చినశాపము అనుచిత మని శమీకుడు చెప్పుట :-**

"పుత్రా! నీవు చేసినపని నాకు ప్రియము గాదు. తపస్వులకు అది ధర్మము గాదు. మనము ఆ రాజు రాజ్యములో నివసించు చున్నాము. అతడు మనను న్యాయముగా పాలించు చున్నాడు. అట్టి ధర్మాత్మునకు శాప మిచ్చుట నాకు ఇష్టము గాదు.

"నాయనా! మనకు హితుడుగా నున్న ఆ రాజును మనము క్షమించవలెను. ధర్మము హతమైనప్పుడు, అది మనను చంపును. సందేహము లేదు. రాజు మనను రక్షించని యెడల మనకు చాల బాధలు గలుగును. అప్పుడు మనము సుఖముగా ధర్మాచరణముచేయ జాలము. ధర్మాత్ములైన రాజులచేత రక్షింపబడుచు, మనము ధర్మాచరణము నిర్విఘ్నముగా నెరవేర్చు చున్నాము. మన మాచరించు ధర్మములో రాజునకు గూడ భాగము గలదు. కనుక, మనకు ఎన్ని కష్టములు వచ్చినను సన్మార్గ ప్రవర్తకుడైన రాజును క్షమించవలెను. విశేషించి పరీక్షిత్తు, అతని ముత్తాత పాండురాజు వలెనే, మనను తన సంతానము వలె రక్షించుచున్నాడు. కనుక, అతనిని సర్వదా మనము క్షమించవలెను."

"పుత్రా! పరీక్షిత్తు ఆకలిగొని అలసిపోయి నా మౌన వ్రతము తెలియక ఆ పని చేసెను. రాజు లేని దేశమునందు అనేక దోషములు సర్వదా కలుగుచుండును. లోకులు ఉన్మార్గములై యున్నప్పుడు రాజు వారిని దండించి శాసించును. దండన భయముచేత దేశములో శాంతి కలుగును. దుఃఖ సంతాపములు గలవాడు ధర్మమును గాని, ఏ పనిగాని చేయజాలడు."

"రాజు ధర్మమును లోకములో ప్రతిష్ఠించును. ధర్మము వలన స్వర్గము ప్రతిష్ఠితమై యున్నది. రాజువలననే యజ్ఞక్రియలు సక్రమముగా జరుగును. యజ్ఞమువలన దేవతలు స్థిరముగా నిలిచి యుందురు. దేవతల వలన వానలు కురియును. వర్షమువలన ఓషధులు పెరుగును, ఓషధులవలన మనుష్యులకు హితము చేకూరును. రాజ్యమును సక్రమముగా ఏలునట్టి రాజు మనుష్యులకు

సృష్టికర్తయైన బ్రహ్మదేవుని వంటివాడు. 'రాజు పదిమంది శ్రోత్రియులతో సమానుడు' అని మనువు చెప్పెను.''

''పుత్రా ! ఈ కారణములచేత ఆకలిగొని అలసి, తపస్వియైన ఆ మహా రాజు, నేను మౌనవ్రతములో నుండుట యెరుగక మృతసర్పమును నాపై వేసెను. అది నీవు అపరాధముగా తలచితివి. నాయనా ! బాల్యదోషమువలన ఈ దుష్కార్యము తొందరపాటుతో ఎందుకు చేసితివి? ఆ రాజునకు మనము శాపము ఇచ్చుట తగదు.''

''శౌనకా ! ఈ విధముగ ఉపదేశించిన తండ్రితో శృంగి ఇట్లనెను :-

**శమీకుని యుపదేశము - పరీక్షిత్తుకడకు గౌరముఖుని పంపుట :-**

''తండ్రీ! నేను చేసిన యీపని సాహసమైనను, లేదా, దుష్కార్య మైనను, కావచ్చును. ఇది నీకు ప్రియమైనను అప్రియ మైనను కావచ్చును, కాని, నేను అనినమాట అసత్యము మాత్రము కాదు. నే నెప్పుడుగూడ వినోదార్థమైనను అసత్యము పలుకను. ఇట్లుండగా ఉద్దేశ పూర్వకముగా పలికిన శాపవచన మెట్లు అసత్య మగును?'' ఆ మాట విని శమీకు డిట్లనెను :-

''నాయనా నీప్రభావము అత్యుగ్రమని, నీవు సత్యవచనుడవని, నీవు ముం దెప్పుడుగూడ అసత్య మాడలే దని నీ మాట మిథ్యగా దనియు నే నెరుగుదును. ఐనను, తండ్రి, కొడుకునకు సద్గుణములు, మంచియశస్సున్ను కలుగుటకు ఉపదేశింపవలెనుగదా! నీ వింకను బాలకుడవు. తపోనిష్ఠుడవు. ప్రభావశాలివి. మహాత్ములకు కోపము మిక్కిలి వర్ధిల్లు చుండును. కనుక, ధర్మజ్ఞుడ వైన నీకు ఉపదేశించవలె నని తలచు చున్నాను. నీవు నా పుత్రుడవు, బాలకుడవు గాబట్టి నీ సాహసము చూచి నీకు ఉపదేశించుట నాకు అత్యావశ్యకము.''

''కనుక, పుత్రా! నీవు శాంతితో వన్యాహారములు గొనుచు క్రోధము విడువుము. నీవు ధర్మము విడువగూడదు. మిక్కిలి దుఃఖముచేత సంకటముల చేత అతికష్టముతో మునీశ్వరులు సంపాదించిన ధర్మమును క్రోధము హరించును. ధర్మహీనుల యాచరణము పెద్దలకు ఇష్టము గాదు. క్షమావంతులకు శాంతియే, సిద్ధిని కలిగించును. వారికి ఇహ - పరలోకములు సిద్ధించును. కనుక, పుత్రా!

నీవు ఎల్లప్పుడున్ను, క్షమాశీలుడవు - జితేంద్రియుడవునై నడచుకొనుము. క్షమ చేత నీవు బ్రహ్మలోకముగూడ పొందగలవు.

పుత్రా! నేను శాంతితో, నాకు సాధ్యమైన కార్యమిప్పుడు చేసెదను. పరీక్షిత్తునకు, 'రాజా! బాలుడు - అల్పబుద్ధిగలవాడునగు నా పుత్రుడు, నీవు నాకు చేసిన యపరాధము చూచి, కోపముచేత నిన్ను శపించెను' అని సందేశమం పెదము."

"శౌనకా! శమీకుడు పుత్రునకిట్లు ఉపదేశించి, దయాళువై పరీక్షిత్తుకడకు సుశీలుడు, చతురుడునైన 'గౌరముఖుడు' అను శిష్యుని పంపెను. అతని ద్వారా ఆ రాజునకు జరిగిన సంగతి యంతయు చెప్పి, కుశలప్రశ్నపూర్వకముగా సందేశము పంపెను. గౌరముఖుడు గుర్వాజ్ఞ ప్రకారము పరీక్షిత్తుకడకు శీఘ్ర ముగాపోయి, ఆ రాజుచేత పూజితుడై, శృంగి ఘోరశాపవృత్తాంత మంతయు శమీకుడు చెప్పుమన్నట్లుగా, ఆ రాజునకు, అతని మంత్రి పురోహితాదుల సమక్ష ములో నిట్లు చెప్పెను:-

"రాజేంద్రా! నీ రాజ్యమునందు, శమ - దమాదిగుణ సంపన్నుడు - మహా తపశ్శాలి - పరమధర్మాత్ముడు నైన 'శమీకుడు' అనుమహర్షి యున్నాడు. మౌనవ్రతములో నున్న యా మహర్షి స్కంధముపై నీవు మృతసర్పమును ధనుష్కోటితో ఎత్తివేసి వచ్చితివి. ఆ నీ దుష్కార్యమును, ఆ ముని పుత్రుడు క్షమాశీలు డైనను, నిన్ను క్షమించక, శమీకునకు తెలియకుండ, నిన్ను, 'నేటికి ఏడవనాడు తక్షకుడు కరచి చంపుగాక!' యని శపించెను. అది తెలిసి, పశ్చాత్తాపపడిన యతని తండ్రి శమీకుడు 'ఆ విషయములో నీ రక్షణము నీవు చేసికొను' మని పలుసార్లు నీకు బోధింపుమని నన్ను సందేశహారునిగా నీ కడకు పంపెను.

"రాజా! ఆ శాపమును ఎవరుగూడ అన్యథా చేయ జాలరు. క్రుద్ధుడైన పుత్రుని నియమించుటకు, శమీకునకు శక్యము కానందుచేత, ఆ మహాముని నీహితము గోరి నన్ను, నీకడకు పంపెను.''

"శౌనకా ! యిట్లు గౌరముఖుడు చెప్పిన ఘోరశాపవృత్తాంతము విని పరీక్షిద్రాజు, తాను ఆ పాపకార్యము చేసినందుకు పశ్చాత్తప్తుడై మిక్కిలి పరితపించెను. శమీక మహాముని, మౌనవ్రతములో నుండినాడని తెలిసి, ఆ రాజు మిక్కిలి దుఃఖించెను. శమీకుడు దయాళువులలో నగ్రగణ్యు డని తెలిసి, తన పాపకృత్యమునకు, అధికాధిక పరితాపము చెందెను. తనకు మృత్యువు ప్రాప్తించిన దానికన్న, ఆ దుష్కృత్యము మహాత్ముల యెడల తాను చేసినందుకు మిక్కిలి శోకించెను. 'నా పైన ఇంతకన్న ఎక్కువ అనుగ్రహము మరలగూడ, భగవంతుడైన శమీక మహాముని చూపును గాక !' యని గౌరముఖునితో చెప్పి పంపెను."

**పరీక్షిత్తు ఆత్మరక్షణ వ్యవస్థ :**

"శౌనకా! గౌరముఖుడు వెడలి పోయిన తరువాత పరీక్షిత్తు సంతప్త మానసుడై మంత్రులతో సమాలోచనము సలిపి, ఒంటి స్తంభపు మేడను నిర్మింపజేసి, ఆ మేడకు రక్షణము, దానితో వివిధ ఔషధములతో విషవైద్యులను, విష మంత్రసిద్ధులైన బ్రాహ్మణులను అంతట నియమించెను. ఆ మేడయందు ఉండియే పరీక్షిత్తు సమస్త రాజకార్యములను మంత్రులతో సంప్రదించుచు చేయుచుండెను. సంపూర్ణ రక్షణము గల యారాజు కడకు ఎవరును పోవ జాల కుండిరి. వాయువు రాకపోకలు గూడ నివారింపబడినవా అన్నట్లు ఉండెను".

**పరీక్షిద్రక్షణార్థమై కాశ్యపుడు పోవుట :**

"శౌనకా! పరీక్షిత్తు మరణకాల మగు నేడవ నాడు ప్రాప్తించగనే కాశ్యపుడు అను బ్రాహ్మణోత్తము డొకడు 'రాజు తక్షకదష్టుడై మరణించు'నని తెలిసి, సర్పదష్టుడైన యా రాజు విషము పోగొట్టి బ్రతికించెదను. దానివలన నాకు, ధర్మార్థములు రెండున్ను సిద్ధించును' అని తలచి పరీక్షిత్తునకు చికిత్స చేయుటకుగాను, హస్తినాపురికి పోవు చుండెను".

"శౌనకా! అట్లు మార్గములో ఏకాగ్ర మనస్సుతో పోవు చున్న కాశ్యపునితో తక్షకుడు వృద్ధ బ్రాహ్మణ వేషముతో కలిసి 'నీ వెక్కడకు, ఏ కార్యముకొరకు పోవుచున్నావు?' అని అడుగగా కాశ్యపుడు ఇట్లనెను.

"ద్విజోత్తమా! కురుకులశ్రేష్ఠుడైన పరిక్షిద్రాజును సర్ప రాజైన తక్షకుడు నేడు కరవ నున్నాడు. అట్లు కరవబడిన పరీక్షిత్తునకు చికిత్స చేసి, విషబాధనుండి త్వరగా నతనిని విముక్తుని చేయుటకు పోవుచున్నాను".

ఆ మాట విని తక్షకుడు 'బ్రాహ్మణోత్తమా! నేనే తక్షకుడను, ఆ రాజును కరవ బోవు చున్నాను. నేను కరచిన వారికి చికిత్సచేయుటకు నీకు శక్తి చాలదు. కనుక, తిరిగి పొమ్ము!' అని చెప్పగా కాశ్యపుడు 'తక్షకా! నాబుద్ధి మహావిద్యా బల సంపన్న మైనది. కనుక నీవు కరచిన యీ రాజును బ్రతికించెదను' అని చెప్పెను."

**తక్షకుడు ధనదానము చేసి కాశ్యపుని తిరిగి పంపుట.**

"శౌనకా! కాశ్యపునిమాట విని తక్షకుడు అతనితో, 'బ్రాహ్మణోత్తమా! నేను కరచినవారికి చికిత్స చేసి, బ్రతికించుటకు నీకు శక్తి యున్నచో ఈ వృక్షమును కరచి చంపెదను. బ్రతికింపుము. నీ మంత్రబలముచూపి ప్రయత్నింపుము. ఇదిగో! ఈ మఱ్ఱిచెట్టును కరచెదను' అని యనగా కాశ్యపుడు 'తక్షకా! కరువుము, నేను ఈ చెట్టును జీవింప జేసెదను' అని చెప్పెను".

"శౌనకా! కాశ్యపుని మాట విని తక్షకుడు ఆ వట వృక్షమును కరవగా, అది విషదగ్ధమై అంతయు కాలిపోయెను. అప్పుడు తక్షకుడు, 'బ్రాహ్మణా! ఈ వృక్షమును పునర్జీవితము చేయుము, నీశక్తి చూచెదను గాక! అని యనెను."

"శౌనకా! అట్లు తక్షకవిషదగ్ధమై, భస్మీభూత మైన యీ వట వృక్షపు భస్మమంతయు కుప్పగా చేసి, కాశ్యపుడు 'పన్నగేంద్రా! నా విద్యాబలము చూడుము! ఇప్పుడు ఈవృక్షమును నీవు చూచు చుండగనే బ్రతికించెదను' అని చెప్పి, ఆ బ్రాహ్మణోత్తముడు తన విద్యాప్రభావము చేత, భస్మరాశిగా నున్న వృక్షమును జీవింప జేసెను. తొలుత దానినుండి మొలక, తరువాత దానికి, రెండాకులు, పుట్టించి, పిదప దానిని శాఖలతో పెంచి మహా వటవృక్షము చేసెను."

"శౌనకా! ఆ బ్రాహ్మణుని మాహాత్మ్యము చూచి తక్షకుడు 'బ్రహ్మన్', నా విషముగాని, లేక నావంటి ఇతరుర విషముగాని, నశింప జేయుట నీ మహా శక్తికి అత్యద్భుత మేమియుకాదు. ఇప్పుడు నీవు ఏ కోరికతో పరీక్షిత్తును బ్రతి

కించుటకు పోవుచున్నావో ఆ రాజువలన నీవు పొందబోవుఫలము నేనే నీకు, అది ఎంత దుర్లభమైనను, ఇచ్చెదను. అతడు బ్రాహ్మణశాప తిరస్కృతుడై క్షీణాయుస్సుతో నున్నాడు. కనుక నా విషమేకాక, విషాతిఘోరమైన బ్రాహ్మణ శాపముకూడ పరీక్షిత్తును నష్టపరచును. కనుక నా విషహననము చేసితివి. కాని, విప్రశాప సంయుక్తమైన నా విషశక్తిని నీవు నశింపచేయ జాలవేమో? కనుక, ఈ కార్యమునందు నీకు సిద్ధి కలుగుట సంశయాస్పదము. నీవు ఈ పరిస్థితిలో పరీక్షిత్తును బ్రతికించజాలని యెడల మూడు లోకములందు ప్రఖ్యాతమై దీపించుచున్న నీ యశస్సు, కిరణములులేని సూర్యునివలె అంతర్ధానము చెందును సుమా!' అని చెప్పెను."

"శౌనకా! తక్షకుని మాట విని కాశ్యపుడు, తక్షకునితో, 'భుజంగరాజా! నేను ధనార్థినై పరీక్షిత్తు కడకు పోవుచున్నాను. అతనినుండి ధనము తీసికొని తిరిగిపోయెదను.' అని చెప్పగా, తక్షకుడతనితో 'ద్విజోత్తమా! నీవు రాజు నుండి కోరు ధనముకన్న అధిక ధనము నేనే యిచ్చెదను. తిరిగి పొమ్ము' అని చెప్పెను.'

**కాశ్యపుని పంపి తక్షకుడు కపటముచేత పరీక్షిత్తు కడకు పోయి అతనిని కరచుట:-**

"శౌనకా తక్షకుని మాట విని కాశ్యపుడు రాజునుగూర్చి దివ్యదృష్టితో ధ్యానపూర్వకముగా చూచి, ఆ రాజుయొక్క ఆయుస్సు క్షీణించినదని తెలిసికొని అతనికడకు పోవుట మాని, తాను కోరినంత ధనము తక్షకునినుండి పొంది, అచటినుండి తిరిగి పోవగా, తక్షకుడు త్వరగా హస్తినాపురికి పోయి, అక్కడ ఆ రాజు అనేక మంత్రములచేత, విషహర ఔషధములచేత, అతి ప్రయత్న పూర్వకముగ రక్షింపబడుచున్నాడని వినెను. అప్పుడు తక్షకుడు తాను ఈ రూపముతో రాజుకడకుపోవ గూడదని తలచి, మాయచేత అతనిని వంచింపవలెను అని దానికొరకు ఒక ఉపాయమునుపన్ని, ఆ ప్రకారమే అతడు అనేక సర్పములను ఫలదర్భోదకములు చేతబట్టు కొనిన మునుల రూపములలో ఆ రాజు కడకు పంపుచు, వారితో 'మీరు జాగ్రత్తతో కార్యతత్పరులై ఆ రాజు కడకు పోయి, అతనికి ఆశీర్వాదపూర్వకముగ, ఈ ఫలపుష్పోదకములను ఇచ్చి అతడు వానిని గ్రహించునట్లు చేయుడు' అని చెప్పి వారిని పంపెను.

"శౌనకా! ముని వేషము ధరించిన యాసర్పములు తక్షకుని యాజ్ఞచేత రాజుకడకు పోయి, అతనిని ఆశీర్వదించి దర్భ-ఫలోదకములను సమర్పింపగా ఆ రాజు వారినుండి అవి గ్రహించి వారు వచ్చిన పని నెరవేర్చి పంపెను. (దీనివలన, ఎవరికిని, ప్రవేశింపరానిచోట గూడ మునులు ప్రవేశించుటకు ఏ నిర్బంధము ఉండదని భావము తెలియవలెను.

శౌనకా! మునిరూపధరులైన పన్నగులు వెడలిపోయిన పిదప పరీక్షిత్తు* మంత్రి-మిత్ర-పురోహితులతో 'రుచ్యములైన ఈ పండ్లు మీరుగూడ భక్షింపుడు, ఇవి తాపసులు తెచ్చినారు' అని చెప్పి రాజు మంత్రులతో పాటు ఆ ఫలములను తీసికొన గోరెను. అప్పుడు దైవ ప్రేరితుడై ఋషిశాపదష్టుడైన పరిక్షిత్తు తక్షకుడు పురుగుగాలోపల చేరియున్న ఫలము నే తీసికొని భక్షింప నుండగా ఆ ఫలము నుండి నల్లని కన్నులు, ఎఱ్ఱని శరీరవర్ణము గల క్రిమిని ఆరాజు పట్టుకొని మంత్రులతో 'ఇప్పుడు సూర్యు డస్తమించుచున్నాడు. కనుక ఇక నాకు విషమువలన భయము లేదు. శృంగిమహాముని సత్యవచను డగుగాక! ఈ కీటకము తక్షకుడుగా అయి నన్ను కరచుగాక! అయినను 'సూర్యాస్తమయము అయినది కనుక శాపదోషము పరిహరింపబడి తక్షకుడు నన్నేమియు చేయజాలడు!' అని చెప్పెను. మంత్రులు గూడ ఆ రాజు మాటనే అనుమోదించిరి."

"శౌనకా! ఇట్లు చెప్పి పరిక్షిన్మహారాజు ఆ పండును నోట వేసుకొని ఆ పురుగును చూచి నవ్వగా, అది వెంటనే తక్షకుడై ఆ ఫలము నుండి బయలు వెడలి వేగముగా అరచుచు ఆ రాజును కరచెను."

"శౌనకా! తక్షక పరివేష్టితుడైన రాజును చూచి మంత్రులందరు మిక్కిలి దుఃఖించిరి. తక్షకుని అరపు విని మంత్రులు పారిపోయిరి. అప్పుడు, ఆకాశము

* కురువంశ పరిక్షీణమైన పిదప పుట్టినవాడు కాబట్టి 'పరిక్షిత్తు' అని, తాను ఉత్తరా గర్భములో నుండగా తనపై అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరోనామకాస్త్రము నుండి రక్షించిన శ్రీకృష్ణుని, పుట్టగానే నలువైపుల పరీక్షించినవాడు కాబట్టి 'పరీక్షిత్తు' అనియు రెండు పేర్లు ఈ రాజునకు ప్రఖ్యాతములుగా నున్నవి. కనుక, ఈ రచనలో అక్కడక్కడ రెండు పేర్లు కూడ విడివిడిగా వాడబడినవి.

నంధు పోవుచున్న యద్భుత నాగరాజును వారు చూచిరి ఆ తక్షకుడు పద్మ కాంతితో ఆకాశమునకు పాపటతీయుచున్నాడా యనునట్లు పోవుచుండెను."

"శౌనకా! తరువాత తక్షక విషాగ్నిచేత ఒంటిస్తంభపుమేడ పూర్తి దహింపబడగా భయముచేత అందరు దిక్కులు బట్టి పారిపోయిరి. పరిక్షిద్రాజు పిడుగుదెబ్బ తినినవానివలె నేలపై కూలిపడెను. తరువాత అతనికి రాజ పురోహితుడు, మంత్రులు సమస్త పరలోకక్రియలు చేసిరి."

**జనమేజయుని రాజ్య పట్టాభిషేకము-వివాహము :**

"శౌనకా! తరువాత పరీక్షిత్తు కుమారుడైన జనమేజయుని మంత్రి-పురోహితాదులు, పురజనులున్ను రాజుగా అంగీకరించి పట్టాభిషిక్తుని జేసిరి. అతడు బాల్యమునందే ప్రశంసనీయమైన బుద్ధిగల రాజుగా మంత్రి-పురోహితులతో పాటు అతని ముత్తాత పాండురాజువలె రాజ్యమును పాలించెను. తరువాత అతనికి వివాహము చేయ దలచి, వారందరు కాశి రాజుకడకు పోయి యతని కూతురైన 'వపుష్టమ' అను కన్యను జనమేజయుని కొరకు వరించిరి. కాశిరాజు, కురురాజు ధర్మపరుడని తెలిసికొని, వపుష్టమను అతని కిచ్చెను. ఆ కన్యను పెండ్లియాడి జనమేజయుడు, ఇతర స్త్రీల యందు మనస్సు ఉంచక, ఏక పత్నీ వ్రతుడై సరస్సులయందు, పుష్పిత వనములందున్ను ఆమెతో, పూర్వము పురూరవుడు ఊర్వశితో విహరించినట్లు, సంతోషపూర్వకముగా విహరించెను. ప్రఖ్యాత రూపము, పాతివ్రత్యమున్ను గల వపుష్టమ గూడ ఆ రాజును పొంది, ఆయనతో విహార కాలమునందు అంతఃపురములందు మనఃపూర్వకముగ విహరించి ఆయనను ఆనందపరచుచుండెను."

**జరత్కారుడు తన పితరులను చూచి మాట్లాడుట :**

"శౌనకా! ఇట్లుండగా, మహా తపస్వియైన జరత్కారుడు 'యత్ర సాయం గృహ'* మునిగా సమస్త భూమండల సంచారము చేసెను. అపుణ్యాత్ములకు అసాధ్యమైన దీక్షతో మహాతేజస్వియైన యతడు పుణ్య తీర్థములయందు స్నానములు చేయుచు, సంచరించుచుండెను. వాయుభక్షుడై, ఇతరాహారము లేవియు

* (ఎక్కడ సాయంకాలమైన నక్కడనే బస చేయు ముని.)

తీనక ఆ ముని దిన దినము కృశించుచు సంచరించుచుండగా, వనములో ఒక చోట ఒక గుంటలో అధోముఖులై అవురుగడ్డియొక్క ఒక వెన్ను మాత్రము పట్టుకొని వ్రేలాడుచున్న తన పితరులను చూచెను. ఆ యవురు గడ్డికి గల వెన్ను లన్నియు పోయి వారు పట్టుకొనిన ఒకే ఒక వెన్ను మాత్రము మిగిలి యుండెను. ఆ వెన్నుగూడ ఒక ఎలుక మెల్లమెల్లగా కొరుకు చుండెను. కనుక నిరాహారులై కృశులై దీనులై తమ రక్షణమును కోరు చున్నపితరులు ఆ గుంటలో పడిపోవుచున్న ట్లుండిరి. వారు తన పితరులని జరత్కారునకు తెలి యక దీనుడై వారితో నిట్లనెను" :

"మహాత్ములారా ! మీరెవరు ? ఇక్కడ గుంటలో నున్న అవురుగడ్డి వేళ్ళన్నియు, ఈకలుగులోని యెలుకలు కొరకగా! ఒక వేరు మాత్రము మిగిలి యున్నది. దానిని గూడ ఎలుక మెల్లమెల్లగా కొరకు చున్నది. అట్లు నశింపబోవు చున్న ఒక మూలమును మాత్రము పట్టుకొని మీరు వ్రేలాడు చున్నారు. ఈ యొక్కవేరు గూడ, అల్పావశిష్టమై యుండుటచేత, త్వరలోనే ఛేదింపబడ నున్నది. ఇదిగూడ తెగిన తరువాత మీరు ఈ గర్తము (గుంట)లో తలక్రిందుగా పడబోవుచున్నా రనుట స్పష్టము. మిక్కిలి కఠినమైన యాపదను పొందిన మీకు, ఏమి ప్రియమో తెలుపుడు, చేసెదను. నా తపస్సులో చతుర్థ - తృతీయ - అర్ధ భాగములలో నెంతయైనను కోరుకొనుడు అది యిచ్చి మిమ్ము ఆపదనుండి తరింప జేసెదను. చెప్పుడు - ఎంతభాగ మిత్తునో? లేదా, మీరు తరించుటకు నా తపస్సు నంతయు ధారపోసెదను. మీరందరు మీయిష్టప్రకారము కోరుకొనుడు."

"శౌనకా! జరత్కారు డిట్లు చెప్పగా విని, పితరు లతనితో నిట్లనిరి :-

"అయ్యా! నీవు వృద్ధుడవు - బ్రహ్మచారివి. ఇట్టి నీవు మమ్ము రక్షింప గోరుచున్నావు. బ్రాహ్మణోత్తమా! తపస్సుచేత, మా యాపద పోగొట్టుట శక్యము గాదు. మాకు గూడ కావలసినంత తపస్సు ఉన్నది.

"బ్రహ్మన్ ! మేము సంతానక్షయమువలన, అశుచియైన నరకములో పడెదము. అన్నింటికన్న సంతాన ప్రాప్తి పరమ ధర్మమని బ్రహ్మదేవుడు చెప్పెను. తలక్రిందుగా వ్రేలాడుచున్న మాకు నీ వెవడవో తెలియ కున్నది.

నీవు ప్రపంచవిఖ్యాత పౌరుషము గలవాడవుగా తోచుచున్నావు: నీవు మహాను భావుడవు. కనుక, శోచ్యులము-దుఃఖితులము నైన మా యెడల దయతో నీవుగూడ శోకించుచున్నావు. మే మెవరమో చెప్పెదము వినుము :-

"విప్రోత్తమా! మేము యాయావర వంశీయులము. నియమవ్రతనిష్ఠ గల ఋషులము. సంతానక్షయము వలన ఈ లోకమందు పుణ్యమునుండి భ్రష్టుల మైతిమి. తీవ్రమైన మా తపస్సు నష్టమైనది. మా వంశతంతువు లేదు. మా కిప్పుడు ఒకేయొక తంతువు మిగిలి యున్నది. అదిగూడ ఉండవలసిన విధముగా లేదు. అల్పభాగ్యులమైన మాకు మిగిలిన యాయొక్కడు గూడ మంద భాగ్యుడై, తపస్సును మాత్రమే ఆశ్రయించి తదితరము లన్నియు విడిచి యున్నాడు. అతడు 'జరత్కారుడు' అను పేరుతో విఖ్యాతుడై యున్నాడు. అతడు వేదవేదాంగ పారగుడు. నియత మనస్సు గల యా మహాత్ముడు వ్రత నిష్ఠతో మహాతపస్సు చేయుచున్నాడు. తపస్సునందు గల లోభముచేత నతడు మాకు కష్టము కలిగించెను.

బ్రాహ్మణోత్తమా! ఆ జరత్కారునకు భార్యా-పుత్ర-బంధువు లెవరు గూడ లేరు. అందుచేత మేము అనాథలవలె ఈ గర్తమునందు వ్రేలాడు చున్నాము; కనుక, మహాత్మా! నీ వతనిని చూచిన యెడల మా మాటగా నతనితో, 'జరత్కారూ, నీ పితరులు దీనులై గర్తములో అధోముఖముగ వ్రేలాడుచున్నారు. కనుక, నీవు పెండ్లి జేసికొని సంతానోత్పత్తి చేయుము. నీ వొక్కడవే ఇప్పుడు మీ కులమునకు తంతువుగా మిగిలి యున్నావు' అని యనుము.

బ్రహ్మన్! ఇప్పుడు నీవు ఈ అవురుగడ్డి వెన్నులో మిగిలియున్న ఒకటే తంతువును చూచు చున్నావు గదా! ఇది ఒక్కటియే మాకు కులవర్ధకమైన స్తంబము (వెన్ను)గా నున్నది. ఈ తీగకు నీ విప్పుడు చూచుచున్న వేళ్ళన్నియు నశించిపోయినట్టి మా కులతంతువులు. సగము కొరకబడిన దీని వేరునే ఆశ్ర యించి మేము తలక్రిందుగ వ్రేలాడుచు గర్తములో నున్నాము. ఆ యొక్క తంతువు కూడ తపోనిష్ఠలో నున్నది. నీవు చూచుచున్న యెలుక మహాబలశాలి యైన కాలము (యముడు) అని యెరుగుము. తపోనిరతుడై మందబుద్ధి గల మా యొక్క తంతువును గూడ యముడు నశింపజేయును.

పండితోత్తమా! భిన్న మూలములు గలవారమై, భ్రష్టులమై కాలోప హతులమై, అధఃపతితుల మగుచున్న మమ్ము ఆ జరత్కారుని తపస్సు తరింప జేయజాలదు. పాపాత్ములమైన మమ్ము చూడుము. మే మందరము ఈ గుంటలో పడిపోయిన తరువాత జరత్కారుడు గూడ కొంతకాలమునకు తెగి ఇందులో పడి నరకమునకు పోవగలడు.

నాయనా! 'తపస్సు - యజ్ఞము - మరి యితర పవిత్ర కార్యము లేవియు సంతానముతో సరి కాజాలవు,' అని శాస్త్ర సిద్ధాంతము. నీవు ఆ జరత్కారుని చూచి, ఇక్కడ చూచిన దంతయు నతనికి చెప్పుము. అతడే మాకిప్పుడు గతి. కాబట్టి అతడు పెండ్లి చేసికొని సంతానము కనునట్లు నీవు చెప్పుము. దాని వలన బంధువులకు, కులమునకున్ను హితము కలుగును. బంధువువలె మా యెడల సహానుభూతి చూపుచున్న నీ వెవడవు? నీవు మాకు ఏమగుదువు? చెప్పుము.''

''శౌనకా! తన పితరులు చెప్పినమాట విని జరత్కారుడు మిక్కిలి శోకించి అశ్రుగద్గద స్వరముతో నిట్లనెను :-

**జరత్కారుని వివాహ ప్రయత్నము - నాగరాజు వాసుకి జరత్కారువుని తోడ్కొని వచ్చుట :-**

''మహాత్ములారా! మీరు నా పితృపితామహులు. కనుక, మీ ప్రీతికొరకు నేను ఏమి చేయవలెనో ఆజ్ఞాపింపుడు. నేనే పాపాత్ముడైన జరత్కారుడను. ఈ దురాత్మునకు దండనము విధింపుడు." ఆమాట విని పితరులు, పుత్రా! మాభాగ్య వశముచేత నీవు ఇక్కడికి వచ్చితివి. నీవు ఎందుకు పెండ్లి చేసికొనలేదు'? అని యడుగగా, జరత్కారుడు ఇట్లు బదులుచెప్పెను.

"పితరులారా! 'నేను, ప్రాపంచికమైన యుపయోగమును చూచుకొనిన యెడల, ఊర్ధ్వరేతస్కుడనై యెట్లు పరలోకసుఖము పొందగలను' అని పెండ్లి చేసికొనుటయందు నాకు ఇష్టము లేకుండెను ఇట్లు పక్షులవలె వ్రేలాడుచున్న మిమ్ముచూచి, బ్రహ్మచర్యము నుండి నాబుద్ధిని మరలించుకొంటిని. మీ కోరిక ప్రకారము నేను గృహస్థాశ్రమము స్వీకరించెదను; కాని, నాకొక నియమము కలదు. ఎక్కడనైన ఎప్పుడైన నాపేరు గలకన్యక లభించినయెడల పరి

గ్రహించెదను. అట్టి కన్యకొరకు నేను స్వయముగ బిచ్చమెత్తుచు వెదకెదను నాపు సనామధేయురాలు లభించనియెడల పెండ్లి చేసికొనను. ఇవి సత్యము. ఆమెనుండి నేను మిమ్ము తరింపజేయగల సంతానము కనెదను."

"శౌనకా! ఈవిధముగ జరత్కారుడు, అతని పితరులకుచెప్పి సమస్త భూమండలమునందు తనపేరుగల కన్యకై వెదకెను. కాని ఎక్కడను అట్టికన్యక లభించలేదు. అప్పుడు అతడు మిక్కిలి వేసరిక చెందెను. కాని, పితరులు చెప్పిన మాట స్మృతికి తెచ్చుకొని అడవికిపోయి మిక్కిలి దుఃఖముతో పితరులకు హితము చేయగోరి 'మూడుసార్లు' కన్యకను యాచించుచున్నాను' అని బిగ్గరగా ఇట్లు అరచెను.

"స్థావరజంగమ భూతములు, అంతర్హితములుగానున్న భూతములున్ను నామాట వినుడు. ఉగ్రతపస్సులోనున్న నాపితరులు దుఃఖార్తులై సంతానము కొరకు నన్ను పెండ్లి చేసుకొనుమని ఆజ్ఞాపించుచున్నారు. నాపేరు జరత్కారుడు. దుఃఖితుడనై దరిద్రుడుగా నున్ననేను పితృాజ్ఞచేత కన్యకను యాచించుచున్నాను. నాపేరుగల కన్యక నాకు ఇచ్చుటకు పుట్టియుండిన యెడల దరిద్రుడనైననాకు ఇచ్చి పెండ్లి చేయుడు. ఆమెను నేను భరించలేక పోయినను నాకు ఆమె నిచ్చి పెండ్లి చేసి యామెతోపాటు నన్నుగూడ భరించగలరు."

"శౌనకా! జరత్కారునికొరకు వెదకుటకుగాను వాసుకి పంపిన పన్నగులు ఆవార్త వాసుకికి తెలుపగా వెంటనే ఆతడు తనచెల్లెలు జరత్కారువును అలంకరించుకొని జరత్కారు మునికడకు తోడుకొని పోయి అతనికి బిచ్చమువలె ఆ కన్యక నిచ్చెను. వాసుకి తిరిగి ఆమెను గైకొనలేదు. ఆమె సనామధేయురాలో కాదో అని సందేహించి జరత్కారుడు వెనుకాడుచు 'ఆమెపేరు ఏమి' యని వాసుకిని అడిగెను.*

* (ఈ జరత్కారు కథ పూర్వము వ్రాసినను ఇక్కడ మరల విశేషాంశముతో వ్యాసుడు వ్రాసెను. కనుక వ్రాయబడెను.)

**జరత్కారువుల వివాహము - ఆమె పతిసేవ - పతి యామెను విడిచి తపస్సుకు పోవుట :**

"శౌనకా! ఆ మాట విని వాసుకి జరత్కారు మహామునితో నిట్లనెను :-

"బ్రాహ్మణోత్తమా! ఈమె నీపేరు గల జరత్కారువే. ఈమె నాచెల్లెలు. నీకు భార్యగా ఇచ్చు చున్నాను. గ్రహింపుము. నా సర్వశక్తులచేత ఈమెను నేను రక్షించెదను. నీ కొరకే ఇంతదాక రక్షించు చున్నాను."

ఇట్లు వాసుకి చెప్పినమాటలు విని జరత్కారు మహాముని వాసుకితో "ఈమెను నేను భరించను. ఇది నాశపథము. కనుక నాశపథ భంగము చేసి నాకు అప్రియము మీరు చేసినయెడల ఈమెను నేను విడిచెదను" అని చెప్పెను.

"శౌనకా! జరత్కారుని మాట విని వాసుకి 'నా సోదరిని నేను అవశ్యము నీతోపాటు భరించెదను'. అని ప్రతిజ్ఞ చేసిన తరువాత జరత్కారుడు వాసుకి యింటికి పోయి విధి పూర్వకముగ ఆమె పాణిగ్రహణము చేసెను. తరువాత రమ్యమైన పడకటింటికి ఆమెను తోడ్కొని పోయెను. అక్కడ వాసుకి అమూల్యమైన పరపుతో శయనము ఏర్పరచి యుండెను. జరత్కారుడు భార్యతో ఆ తొలి రాత్రి ఒక ఒడంబడిక చేసికొనెను. అది ఏమనగా, 'నాకు ఎప్పుడు గూడ వ్యతిరేకముగ నీవు పనిచేయ గూడదు. మాట్లాడ గూడదు. అట్లు చేసినచో నిన్ను విడిచి పోయెదను. ఈ నా మాట తప్పదని తెలిసికొనుము' అని.

ఆ ఒడంబడిక విని వాసుకి చెల్లెలు మిక్కిలి దుఃఖముతో 'అట్లే యగు గాక!' అని చెప్పెను. ఆ ప్రకారమే ఆమె అతి కష్టముతో పతిపరిచర్య చేయుచు నుండెను. అతని ప్రియము కోరుచు, ఆమె* శ్వైతకాకీయములైన యుపాయము లతో పతిని సేవించుచుండెను

* శ్వైత కాక శబ్దమునకు అర్థమేమనగా శ్వా + ఏత + కాక = శ్వైతకాకములు, వానికి సంబంధించినవి శ్వైతకాకీయములు (శ్వా + ఏత అను పదముల కిచట పరరూప సంధి వచ్చినది.) భావమేమనగా, ఆమె కుక్కవలె తక్కువ నిద్రించుచు, జింకవలె భయపడుచు, కాకివలె పతి యింగితము నెరిగి సేవచేయు చుండెను అని. (శ్వా-కుక్క, ఏత-జింక, కాక-కాకి)

ఇట్లుండగా, ఒకనాడు ఆమె ఋతుస్నానము చేసి ధర్మానుసారముగ పతిని సమీపించెను. అప్పుడు ఆమెకు అగ్నివలె తేజస్వియైన గర్భము నిలిచెను. ఆ గర్భము శుక్లపక్ష చంద్రునివలె ఆమెలో పెరుగు చుండెను.

ఇట్లుండగా కొన్నాళ్ళకు జరత్కారు మహాముని అలసి ఆమె యొడిలో తల పెట్టి గాఢముగా నిద్రించెను. అప్పుడు సూర్యు డస్తమించు చుండెను. అప్పుడు ఆమె ధర్మలోపమువలన భయపడి 'ఇప్పుడు నేను భర్తను మేల్కొల్ప వలెనా? వలదా? ఈ రెంటిలో ఏది మంచి పని' అని చింతించుచు 'ఇతనిని మేల్కొల్పినచో కోపము వచ్చును. లేకున్నచో ధర్మలోపము కలుగును. కోపము కంటె ధర్మలోపము మిక్కిలి దుష్టము కనుక, ఇతనిని మేల్కొల్పెదను, అట్లు చేసినచో ఇతనికి తప్పక కోపము వచ్చును. చేయనిచో సంధ్యాతిక్రమణమువలన తప్పక ధర్మ లోపము ఇతనికి కల్గును' అని తలచెను."

"శౌనకా! యిట్లు నిశ్చయించుకొని భుజంగకాంతయైన జరత్కారువు మహా తపస్వి, అగ్ని సమాన తేజశ్శాలియు నైన ఆ ఋషీశ్వరుడు నిద్రించు చుండగా మృదువుగా నిట్లనెను :-

"మహాభాగా! మేల్కొనుము! సూర్యుడు అస్తమించు చున్నాడు. సంధ్యోపాసన చేయుము. ఆచమనము చేయుము. అగ్నిహోత్ర కార్యము చేయు సమయ మిది. పశ్చిమ దిక్కునందు సంధ్య ప్రవర్తించుచున్నది.''

ఇట్లు ఆమె చెప్పగా జరత్కారు మహాముని కోపముతో పెదవు లదరు చుండగా, భార్యతో నిట్లనెను :

"పాపీ! నాకు అవమానము చేసితివి, కనుక నీ యొద్ద నివసించక వచ్చినచోటికి వెడలి పోయెదను. 'నేను నిద్రించి యుండగా సూర్యునకు అస్తమించుటకు శక్తి చాలదు' అని నాకు తెలియును. ఎవడుగూడ అవమాన పడినచోట ఉండుటకు ఇష్టపడడుగదా, ధర్మశీలుడైన నావంటి వాడు ఇక్కడ ఉండుటకు ఎట్లు ఇష్టపడును.''

"శౌనకా! ఇట్లు భర్త హృదయ విదారకముగ మాట్లాడినప్పుడు, ఆమె ఆయనతో 'విప్రోత్తమా! నిన్ను నేను మేలుకొలిపినది అవమానించుటకు కాదు. నీకు ధర్మలోపము కాగూడదని అట్లు చేసితిని' అని యనెను. ఆ మాట విని జరత్కారు ముని భార్యను విడువదలచి అతి కోపముతో 'భామినీ! నా మాట యెప్పుడున్ను అసత్యము కాదు. నేను వెడలిపోయెదను. ఇది పూర్వము మన మిరువురము చేసికొనిన యొడంబడిక. నేను వెడలిపోయిన తరువాత నేను పోయినట్లు నీ సోదరునకు తెల్పుము. నీవు గూడ శోకింపకుము." అని ఆమెతో అనెను.

అది విని ఆమె చింతా-శోక నిమగ్నురాలై నోరు ఎండిపోవగా చేతులు జోడించి ధైర్యముతో హృదయము కంపించుచుండగ బాష్ప గద్గద స్వరముతో ఇట్లనెను:

"ధర్మజ్ఞా! నిరపరాధురాలనైన నన్ను విడుచుట నీకు తగదు. నేను, నీవు, ఇరువురమున్ను ధర్మమునందే ఉన్నాము. ఎల్లప్పుడు నీ ప్రియమును హితమునే కోరుచున్నాను. నన్ను ఏ కారణము చేత నా సోదరుడు నీకు ఇచ్చెనో ఆ ఫలము పొందకయే నీవు నన్ను విడిచినచో మందభాగ్యురాలనైన నన్ను జూచి వాసుకి యేమనును? మాతృ శాపముచేత తిరస్కృతులైన నా బంధువులను తరింపజేయగల సంతానము నీ వలన కోరబడి యుండెను. అది కలుగలేదు. సంతాన లాభము వలన మా జ్ఞాతులకు శుభము కలుగును. నీతో నేను కలిసినది వ్యర్థము కాగూడదు. నా జ్ఞాతుల హితము కోరుచు నిన్ను ప్రార్థించుచున్నాను. భగవాన్! అస్పష్ట రూపములో నున్న ఈ గర్భము ధరించిన నన్ను మహాత్ముడవైన నీవు విడిచి యెట్లు పోయెదవు? నా యపరాధమేమియు లేదు."

"శౌనకా! ఈ విధముగ మొర పెట్టుకొనుచున్న భార్యతో జరత్కారు మహాముని యుక్తముగ, అనురూపముగను నిట్లనెను:-

"భామినీ! నీ గర్భములో అగ్ని సమానుడు, వేదవేదాంగ పారగుడు పరమ ధర్మాత్ముడునైన ఋషి ఉన్నాడు చింత చేయకుము."

"శౌనకా! ఇట్లు చెప్పి జరత్కారు మహాముని తపస్సు చేయుటకు వెడలిపోయెను."

**వాసుకి చింతను జరత్కారువు నివారించుట - ఆస్తీకుని జననము- విద్యాభ్యాసము :**

"శౌనకా! అట్లు భర్త విడిచి వెళ్ళిపోవగనే భార్య జరత్కారువు అన్న యగు వాసుకి కడకు వచ్చి జరిగిన సంగతి యంతయు ఉన్నదున్నట్లు చెప్పెను. అప్పుడు వాసుకి అప్రియమైన యా వార్త విని దీనురాలుగా నున్న సోదరితో, దీనుడై యిట్లనెను :

"సోదరీ! నిన్ను అతనికి ఇచ్చి పెండ్లి చేయుటకు కారణము నీవు ఎరుగుదువు. అతని నుండి నీకు పన్నగుల హితార్థమై కొడుకు పుట్టిన యెడల ఆ బాలకుడు సర్పయాగము నుండి మనను విడిపించగలడని పూర్వము దేవతల సమక్షము నందు బ్రహ్మదేవుడు చెప్పియుండును. జరత్కారు మునినుండి నీకు గర్భము నిలిచినదా? అట్లు కాకున్నయెడల అతడు పెండ్లి చేసికొనుట విఫలము. ఇటువంటి పనికి నిన్ను పురికొల్పుట గూడ నాకు న్యాయమై యుండదు. కాని, గురుతర కార్యభార ముండుటచేత నిన్ను ఆ వివాహమునకు, ఆ ముని అసాధ్యు డని తెలిసి కూడ, పురికొల్పితిని. ఇప్పుడు నేను ఒకవేళ, ఆయన కడకు పోయినను అతడు నన్ను శపించును. కనుక సోదరీ! నీ భర్త యొక్క చర్య లన్నియు నాకు చెప్పి, నా హృదయము నందు చాలకాలముగ నాటుకొనియున్న భయంకర శల్యమును ఊడదీయుము."

"శౌనకా! యిట్లు వాసుకి చెప్పిన మాట విని జరత్కారువు అతనిని ఊరడించుచు నిట్లనెను :-

"సోదరా! సంతానము కొరకై ఆ మహాత్ముని నే నడిగినప్పుడు ఆయన "అస్తి" అని నాకు బదులు చెప్పి వెడలిపోయెను. ఆయన అలవోకగా చెప్పిన మాట గూడ అసత్యము కాదు. ఇట్లుండగా ఇనమిత్తముగా చెప్పినమాట అసత్య మెట్లగును? ఆయన నాతో 'కాంతా! నీవు బాధపడకుము సూర్యప్రభ గల పుత్రుడు నీకు పుట్టగలడు' అని చెప్పి వెడలిపోయెను. కాబట్టి సోదరా! నీ దుఃఖము తీరి పోవుగాక!" అని చెప్పెను."

"శౌనకా! ఆమాట విని వాసుకి సంతోషముతో 'అట్లే అగుగాక!' అని, ఆమెను గౌరవించి, పూజించి, ఆదరించు చుండెను. తరువాత కొంత కాలమునకు మహా తేజస్సుతో శుక్లపక్ష చంద్రునివలె ఆ గర్భము పెరుగుచుండెను. సకాలము నందు వాసుకి చెల్లెలు పితృమాతృ కులముల భయము పోగొట్టు కుమారుని దేవ గర్భతుల్యుని కనెను. ఆ శిశువు వాసుకి యింటిలోనే అల్లారుముద్దుగా పెరుగుచు శుక్రాచార్యులకడ, చ్యవనమహాముని యొద్దను వేద - వేదాంగములను అభ్య సించెను."

"శౌనకా! ఈ విధముగా ఆ బాలకుడు బ్రహ్మచర్యవ్రతమును ఆచరించి, బాల్యమునందే మహాబుద్ధిబలముగల వాడై యుండెను. లోకములందు ఆ బాలకుడు 'ఆస్తీక' నామముతో ప్రసిద్ధుడయ్యెను. అతడు గర్భములో నుండగనే అతని తండ్రి 'అస్తి' అని చెప్పి తపస్సునకు పోయెను గనుక అతనికి 'ఆస్తీకుడు' అనుపేరు విఖ్యాతమయ్యెను. బాల్యమునందు అమిత బుద్ధిశాలియైన ఆ బాలకుడు మేనమామ యగు వాసుకి ఇంటిలోనే మిక్కిలి జాగ్రత్తతో రక్షింపఁ బడుచు హిరణ్మయుడు, శూలపాణి, దేవేశ్వరుడు నగు శంకర భగవానునివలె పెరుగుచు సర్పముల నందరిని సంతోషపరచెను.

**పరీక్షిత్తు ధర్మప్రవర్తనము:- అతని యుత్తమ గుణముల వర్ణనము ఆ రాజు వేటకుపోవుట-అతడు శమీక మహామునిని తిరస్కరించుట:-**

ఉగ్రశవుడు జరత్కారుని వివాహము-ఆస్తీకోత్పత్తిని గూర్చి చెప్పిన తరువాత, శౌనకుడు జనమేజయుని విషయమై ఉగ్రశ్రవుని ఇట్లడిగెను:-

"మహాత్మా! జనమేజయుడు, తన తండ్రి పరీక్షిత్తు స్వర్గ గమనమును గూర్చి, మంత్రులం నడిగిన వృత్తాంతము సవిస్తరముగ చెప్పుము." ఇట్లు అడుగగా, ఉగ్రశ్రవుడు శౌనకునితో, "బ్రహ్మన్! జనమేజయుడు మంత్రుల నడిగిన సంగతి, మంత్రులతని తండ్రి మరణమును గూర్చి చెప్పిన సంగతియు సవిస్తరముగా చెప్పెద వినుము:-

"శౌనకా! జనమేజయుడు, 'మంత్రులారా! మాతండ్రి సమాచార మంతయు మీ రెరుగుదురు. అది మీనుండి విని, నాకు ఏది శ్రేయస్కరమో అది

చేసెదను' అని యడుగగా, ధర్మాత్ములు - ప్రాజ్ఞులు నైన మంత్రులు జనమేజ యునితో నిట్లనిరి:-

"రాజా ! మహాత్ముడైన నీతండ్రి ధర్మనిష్ఠను, అతని చరిత్రను గూర్చి చెప్పెదము వినుము:- నీతండ్రి పరీక్షిత్తు ధర్మాత్ముడు - మహాత్ముడు - ప్రజా పాలన తత్పరుడు - ధర్మశాస్త్రానుసారముగా ధర్మము నాచరించువాడు - మూర్తీభవించిన ధర్మమా యనునట్లున్నవాడు. అసమానబల పరాక్రమములతో భూదేవిని రక్షించినవాడు. అతనిని ద్వేషించువా రెవరుగూడ లేకుండిరి. అత డెవరిని గూడ ద్వేషించినవాడు కాడు. ప్రజాపతివలె సర్వభూతసముడు. బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య - శూద్రులు మంచి మనస్సుతో స్వస్వధర్మము నందు చరించునట్లు నిలిపినవాడు."

"రాజా ! పరీక్షిన్మహారాజు, 'విధవా - అనాథ - వికలాంగ - దీనులను భరించి పోషించినవాడు. అతడు సర్వభూతములకు చంద్రునివలె సుందరుడుగా కనపడు చుండెను. అతని పాలనములో ప్రజలు తృప్తితో ఆరోగ్యముతోను నుండిరి. అతడు సత్యవచనుడు, పరీక్షిత్తు ధనుర్వేదమునందు శారద్వతుడైన కృపాచార్యునకు శిష్యుడు. శ్రీకృష్ణభగవానునకు, సర్వలోకములకున్ను ప్రియుడు."

"రాజా ! నీతండ్రి, కురుకుల సంతతి యంతయు క్షీణమైన తరువాత ఉత్తరాదేవికి అభిమన్యుని వలన జన్మించెను. కాబట్టి 'పరిక్షిత్' అను పేరుతో ప్రసిద్ధు డయ్యెను. అతడు రాజధర్మార్థ కుశలుడు - యోగ్యుడు - సర్వసద్గుణ సంపన్నుడు - జితేంద్రియుడు - ఆత్మాభిమానము గలవాడు - మేధావి - కామ - క్రోధ - లోభ - మోహ - మద - మాత్సర్యము లనెడు ఆరు అంతశ్శత్రువులను జయించినవాడు."

"రాజా ! అటువంటి సర్వసద్గుణ సంపన్నుడైన నీ తండ్రి పరీక్షిత్తు ప్రజలను అరువది సంవత్సరములు పాలించి యందరను దుఃఖములో ముంచి దైవగతిని చెందెను. తరువాత పురుషశ్రేష్ఠుడవగు నీవు, వేయి సంవత్సరములుగా కురుకుల సార్వభౌములు ధర్మప్రకారము ఏలుచున్న యీ రాజ్యమును పొంది, సర్వభూతములను పాలించువాడవుగా, బాల్యమునందే పట్టాభిషిక్తుడ వైతివి."

"శౌనకా! మంత్రులు చెప్పిన పరీక్షిన్మహిమ విని, జనమేజయుడు మరల వారితో నిట్లనెను :-

"మంత్రివర్యులారా! మా కురుకులమునందు ప్రజలకు ప్రియము చేయని రాజు, వారికి ప్రియుడు కాని రాజున్ను పుట్టలేదు. విశేషించి, అందరుగూడ, సత్ప్రవర్తకులైన తమ తండ్రి తాతల మార్గము ననుసరించియే, ప్రజాపాలనము చేసిరి. అటువంటి ధర్మాత్ముల వంశములో జన్మించిన నా తండ్రి యెట్లు మరణించెను? జరిగినది జరిగినట్లు వినగోరుచున్నాను. వివరింపుడు."

"శౌనకా! జనమేజయునిమాటలు విని మంత్రులు, ఆ రాజునకు హితము-ప్రియముకోరుచున్న వారై, పరీక్షిన్మరణవృత్తాంత మంతయు యథావత్తుగా చెప్పి, ఆ రాజుతో, 'రాజా! అంతయు వింటివిగదా! పరీక్షిత్తునకు, ఉత్తంకునకున్ను గలిగిన పరాభవమునుగూర్చి యిప్పుడు నీవు చేయవలసినది చేయుము.' అని చెప్పిరి.

"శౌనకా! అప్పుడు జనమేజయుడు ఇట్లనెను :-

"మంత్రులారా! ఆ వటవృక్షమునకు గలిగిన నాశోత్పత్తులను గూర్చి మీకు ఎవరు చెప్పిరి? అది అత్యాశ్చర్యకర విషయముగదా! తక్షకుడు విషాగ్నిచేత కాల్చిన చెట్టు యొక్క బూడిదను కుప్పచేసి, మరల దానిని చెట్టుగా కాశ్యపుడు పుట్టించుట అనన్య సాధ్యముగాదా! విషముచే మరణించినవాడు, కాశ్యపుని మంత్రబలముచేత జీవించుననుట, దీనిచేత ధ్రువమయ్యెను.

తక్షకుడు, "నేను కరచి చంపిన పరీక్షిద్రాజును ఈ కాశ్యపుడు జీవింపచేయగలడు. అప్పుడు లోకములో నేను పరిహాసాస్పదుడ నగుదును. దానిచేత ఈ బ్రాహ్మణుడు సంతుష్టు డగును. కనుక నేదో యొక యుపాయముచేత ఆ రాజునకు బాధ గలిగించెదను' అని తప్పకచింతించి యుండును.

"మంత్రులారా! ఒక ముఖ్యవిషయము తెలుపుడు - ఆ నిర్జనవనమందు, తక్షక-కాశ్యపులకు జరిగిన సంవాదమును ఎవడు విని, చూచి, మీకు చెప్పెను? అది యంతయు నేను విని, సర్పవినాశకర విధానమును గూర్చి నిశ్చయించెదను."

"శౌనకా! జనమేజయుని మాటలు విని మంత్రు లిట్లనిరి :-

"రాజా! తక్షక-కాశ్యపులు మాట్లాడుకొను చున్నప్పుడు ఆ వృక్షముపై నొక పురుషుడు ఇంధనముల కొరకు, అంతకు పూర్వమే పోయి, కట్టెలు ఏరు కొనుచు, ఎండుకొమ్మపై కూర్చొని యుండెను. ఆ చెట్టుపై నతడున్నట్లు తక్షక కాశ్యపు లెరుగరు.

రాజా! అప్పుడు తక్షక విషముచేత, ఆ పురుషుడు వృక్షముతోపాటే, భస్మమై, బ్రాహ్మణ ప్రభావముచేత ఆ చెట్టుతో పాటే, అతడు గూడ మరల జీవించెను. ఆ పురుషుడే, ఈ సంగతి యంతయు మాకు చెప్పెను. అది నీ కిప్పుడు మేము చెప్పితిమి. రాజా! యిక సముచిత కార్యము చేయుము."

"శౌనకా! జనమేజయుడు మంత్రుల మాట విని, దుఃఖార్తుడై, పరి తపించుచు, చేతులు పిసికికొనుచు, దీర్ఘముగా వేడినిట్టూర్పు పలుసార్లు విడుచుచు, ఏడ్చుచు కన్నీరు గార్చెను. తరువాత నతడు కొంచెముసేపు ధ్యానించి మంత్రు లతో నిట్లనెను :-

"మంత్రులారా! నా తండ్రి స్వర్గగమన వార్త వినిన తరువాత నా మనస్సులో గలిగిన నిశ్చయము చెప్పెద వినుడు :- దురాత్ముడైన తక్షకునకు ప్రతి క్రియ చేయవలెను. అతడు శృంగిని కారణమాత్రునిగా జేసికొని తన విషాగ్నిచేత రాజును దహించెను. ఇంతియేకాక, తక్షకుడు నా తండ్రికి చికిత్స చేయుటకు వచ్చిన కాశ్యపుని గూడ నివారించెను. ఒకవేళ, కాశ్యపుడు వచ్చి నా తండ్రిని బ్రతికించి యుండిన యెడల, ఆ తక్షకునకు ఏమి నష్టము కలిగి యుండును? రాజును బ్రతికించుటకు వచ్చిన కాశ్యపుని తక్షకుడు నివారించెను గదా! ఇది తక్షకుడు చేసిన మహాపరాధము. ఇంతకన్నను 'కాశ్యపా! నీవు రాజును బ్రతికించకుము. అతడు నీ కిచ్చుధనము నే నిచ్చెదను' అని కాశ్యపునకు చెప్పుట అతని క్షమింపరాని యపరాధము. కనుక మంత్రు లారా! ఉత్తంకునకు, నాకున్ను ప్రియము చేయుటకు, మిమ్మందరను గౌర వించుటకున్ను, ఇప్పుడే నేను పోయి ప్రయత్నించెదను."

**జనమేజయుని సర్పయాగ ప్రయత్నము :**

"శౌనకా! జనమేజయు డిట్లు చెప్పి, మంత్రుల సమ్మతి గొని, సర్ప యాగము చేయుటకు ప్రతిజ్ఞ పూనెను. తరువాత, పురోహిత - ఋత్విక్కులను పిలిచి వారితో నిట్లనెను:-

"మహాత్ములారా! నా తండ్రిని హింసించిన దురాత్ముడైన తక్షకునకు ప్రతిక్రియ చేసెదను. పూర్వము తక్షకుడు విషాగ్నిచేత నాతండ్రిని చంపిన విషయము మీకు తెలిసినదే కదా! తక్షకుడు నా తండ్రిని దహించినట్లు నేనుగూడ అతనిని బంధుసహితముగా, జ్వలితాగ్నిలో వేసి కాల్చెదను. సర్పయాగ కర్మా నుష్ఠాన విధి మీకు తెలియునా?"

"శౌనకా! ఆ మాటకు ఋత్విక్కులా రాజుతో నిట్లనిరి :

"రాజా! నీకొరకే దేవతలు ఏర్పరచిన 'సర్పసత్ర' మనునొక యాగము గలదు. అది పురాణములలో చెప్పబడినది. 'ఆ యాగము చేయువారు నీవు దప్ప మరి యెవరున్ను లేరు' అని పౌరాణికులు చెప్పెదరు.ఆ క్రతువునుగూర్చి మాకు గూడ తెలియును."

"శౌనకా! యీ విధముగా ఋత్విక్కులు చెప్పిన మాట విని జనమే జయుడు తక్షకుడు మండుచున్న యగ్నిలో పడి దగ్ధుడైనట్లుగానే నిశ్చయించు కొని, వారితో, "మహాత్ములారా! నేనా సర్పయాగము చేసెదను. దానికి కావలసిన సామాగ్రులన్నియు కూర్చుకొనుడు" అని యనెను."

"శౌనకా ! తరువాత ఆ బ్రాహ్మణోత్తములు, శాస్త్రప్రకారముగా, యజ్ఞశాల కొరకు స్థలమును కొలిపించిరి. ఆ విషయము లన్నియు బాగుగా తెలిసిన-బుద్ధిమంతులైన వేద విద్వాంసులు, ఆ స్థలమును మిక్కిలి సంపద్యుక్త ముగా, బ్రాహ్మణ గణ పరివృతముగా, అత్యధిక ధన-ధాన్య సమృద్ధముగా, అనేక ఋత్విక్కులతో కూడినదిగాను నిర్మించి, సర్పయాగ విధి కొరకు జనమే జయ మహారాజునకు దీక్ష యిచ్చిరి."

"శౌనకా ! అప్పుడు జరుగబోవు యజ్ఞమునకు విఘ్నకరమైన విషయ మొకటి రాజునకు తెలిసెను. అది యేమనగా, బుద్ధి కుశలుడు-వాస్తు విద్యా

విశారదుడునగు 'స్థపతి' (వాస్తుశాస్త్ర పండితుడైన శిల్పి) రాజుతో "రాజా! నీవు ఏ ప్రదేశమును, ఏ కాలమునందు, యజ్ఞశాల కొరకు కొలిపించి, శాలను నిర్మింప జేసితివో, ఆ లక్షణములను ముహూర్తమును బట్టి యీ యాగము నిర్విఘ్నముగా నెరవేరదు. నడుమనే యొక బ్రాహ్మణుని మూలముగా ఈ యాగము ఆగి పోవును." అని చెప్పెను."

"శౌనకా! ఆ మాట విని జనమేజయుడు, యజ్ఞ దీక్ష తీసికొనుటకు పూర్వమే, 'అజ్ఞాతుడైన వాని నెవనిని గూడ యజ్ఞశాలలో ప్రవేశింప జేయకుము' అని ద్వారపాలకునకు కఠినముగా ఆజ్ఞ యిచ్చెను."

**సర్పయాగారంభము-సర్పసంహారము :**

"శౌనకా! తరువాత జనమేజయుడు శాస్త్రోక్తముగా, సర్పయాగ మారంభించెను. ఋత్విక్కులు తమ తమ కర్మలలో నిమగ్నులైరి. వారు పొగచేత ఎఱ్ఱని కన్నులు నల్లని వస్త్రములున్ను గలవారై హోమములు చేయు చుండిరి. సర్పముల మనస్సులు కంపించుచుండగా, వానిని అగ్ని ముఖమునకు మంత్ర బలముతో ఆహ్వానించి హోమము చేయుచుండిరి. ప్రదీప్తాగ్నిలో సర్పములు వచ్చి పడుచుండెను. అవి కంపించుచు, నిశ్శ్వసించుచు, ఒండొంటిని పుచ్ఛములతో శిరస్సులతోను చుట్టుకొనుచు అగ్నిని చేరుచుండెను."

"శౌనకా! కొన్ని సర్పములు తెల్లనివి, కొన్ని నల్లనివి, కొన్ని నీల వర్ణము గలవి. కొన్ని వృద్ధావస్థలో నున్నవి. కొన్ని శిశువులుగాను నుండెను. అవి యన్నియు వివిధ ధ్వనులు చేయుచు మండుచున్న యగ్నిలో పడుచుండెను."

"శౌనకా! కొన్ని సర్పములు ఒక కోసు పొడవైనవి; మరికొన్ని ఒక యోజనము (ఆమడ) పొడవైనవి; కొన్ని 'గోకర్ణ' (జిబ్బెడు) ప్రమాణము గలవి; కొన్ని సర్పములు అశ్వముల వంటివి; కొన్ని యేనుగు తుండముల వంటివి; కొన్ని మద గజములవలె మహా కాయములు-మహా బలము గలవిగాను నుండెను. ఈ విధముగ, వివిధాకారములు, వివిధ వర్ణములు, విషాధికములు, భయంకరములు, గడియమానుల వంటివియు నగు సర్పములు మాతృ శాప పీడితములై నూర్లు-వేను-కోట్లకొలదిగ వివశములై వేగముగా వచ్చిమండు చున్న యగ్నిలో పడి నశించుచుండెను."

**సర్పయాగము నందలి ఋత్విక్కుల పేర్లు :**

ఉగ్రశ్రవుడు, ఇట్లు చెప్పగా విని శౌనకుడు ఆయనను ఇట్లనెను :

"మహాత్మా! అప్పుడు జనమేజయుని సర్పసత్రమునందు ఏ యే మహర్షులు ఋత్త్విక్కులుగా, ఎవరెవరు సదస్సులుగా నుండిరి? అది మహా భయంకరము. దుఃఖజననము నయిన యాగము కదా! అన్ని విషయములున్ను విస్తారముగ తెలుపుము. అక్కడ సర్పయాగ విధానమును తెలిసిన పండితులు ఎవ రుండిరి? ఆ మాటకు ఉగ్రశ్రవుడు ఇట్లనెను :

"శౌనకా! ఆ సర్పయాగములో నున్న ఋత్త్విక్కులను సదస్సులను గూర్చి చెప్పెద వినుము :

చ్యవన వంశమునందు పుట్టి వేదజ్ఞులలో శ్రేష్ఠుడని విఖ్యాతుడైన 'చండ భార్గవుడు' అను బ్రాహ్మణుడు "హోత"[1] అను ఋత్త్విక్కుగా నుండెను. 'కౌత్స' గోత్రుడైన విద్వాంసుడు, వృద్ధబ్రాహ్మణుడునైన 'జైమిని' యనుముని "ఉద్గాత"[2]గా, "శార్ఙ్గరవుడు' "బ్రహ్మ[3]గా, 'పింగళుడు' "అధ్వర్యుడు"[4]గా వ్యాసుడు అతని పుత్రులతో శిష్యులతోనూ "సదస్యుడు"[5]గానూ నుండిరి.

1. ఇతడు "హోత - బ్రహ్మ - ఉద్గాత-అధ్వర్య 'అను నలుగురు ప్రధాన ఋత్త్విక్కులలో నొకడు ఋగ్వేదము పఠించును. ఇతనికి యాగములో 'మైత్రావరుణ - అచ్ఛావాక - గ్రావస్తుత' అను ముగ్గురుసహాయకులుగా నుండెదరు.
2. ఇతడుగూడ నలుగురు ముఖ్యఋత్త్విక్కులలో నొకడు. ఇతడు యజ్ఞములో సామవేదముగానము చేయును. ఉద్గాత యనగా గానము చేయువాడు.
3. ఇతడుగూడ నలుగురు ముఖ్యఋత్త్విక్కులలో నొకడు. ఇతడు తక్కిన ముగ్గురికన్నను గొప్పవిద్వాంసుడుగా నుండును. ఇతనికి మూడువేదముల లోను పాండిత్యము ఉండవలెను. ఇతడు యజ్ఞమును పర్యవేక్షించుచు, తప్పులు దిద్దుచుండవలెను. చివరకు ప్రధానముగా యాగములో నితని కార్యము అథర్వవేదకర్మలపై నాధారపడియుండును.
4. అధ్వరము (యజ్ఞము) నడపు ప్రధాన ఋత్త్విక్కు. ఇతడు ఋత్త్వి క్కులకుపెద్ద. హోత - ఉద్గాత - బ్రహ్మలకంటె ఇతడు విశిష్టుడుగా

ఉద్దాలకుడు - ప్రమతకుడు - శ్వేతకేతుడు - పింగళుడు - అసితుడు-దేవలుడు - నారదుడు - పర్వతుడు - ఆత్రేయుడు - కుండజఠరులు - కాలఘటుడు - వాత్స్యుడు - వృద్ధుడు - జపస్వాధ్యాయపరుడు నైన శ్రుతశ్రవుడు-కోహాలుడు - దేవశర్మ - మౌద్గల్యుడు - సమసౌరభుడు ఈ మొదలైన ఋషులే కాక, వేదపారగులైన ఇతర బ్రాహ్మణు లనేకులుగూడ ఆయజ్ఞమునందు సదస్యులుగా నుండిరి.

**సర్ప నాశము :-**

"శౌనకా! ప్రాణి భయంకరములు, క్రొవ్వు-మెదడుల నీరు కాలువలుగా పారుచున్నవియు నగు ననేక భయంకర సర్పములు ఆ యజ్ఞాగ్నిలో పడెను. అవి, కాలుచుండగా ఎల్లప్పుడు దుర్గంధము వెడలుచుండెను. అగ్నిలో పడుచున్న,-ఆకాశమునందు నిలిచియున్న - అగ్నిలో పక్వములగుచున్న-అనేక సర్పముల శబ్దములు సర్వదా వినవచ్చుచుండెను."

**తక్షకుడు ఇంద్రుని శరణువేడుట:-**

"శౌనకా! జనమేజయుడు యజ్ఞదీక్షితుడైన సంగతి వినిన వెంటనే, నాగ రాజైన తక్షకుడు ఇంద్రునికడకు పోయి ఆ సమాచార మంతయు ఇంద్రునకు చెప్పి, తాను అపరాధము చేసినందువలన భయము చెంది ఇంద్రుని శరణు వేడెను. అప్పుడు ఇంద్రుడు తక్షకుని యెడల ప్రీతుడై అతనితో నిట్లనెను :

---

నుండును. అధ్వర్యుడు యజ్ఞభూమిని కొలుచుట, యజ్ఞవేది నిర్మాణము యజ్ఞపాత్రల నిర్మాణము, సమిధలు - జలము తెచ్చుట-ఈపనులన్నియు చేయుచునే యజ్ఞములో యజుర్వేద మంత్రములను పఠించుచుండవలెను. (కనుకనే, యజుర్వేదమునకు గూడ 'అధ్వర్యు' అని పేరు గలదు.) యజుర్వేద మంత్రపఠనమందే నిమగ్నుడైన వాడుగా నితడుఉండవలెను. అధ్వర్యుపత్నికిగూడ 'అధ్వర్యు' అని పేరుగలదు.

5. యజ్ఞశాలలో నొకవిశిష్టస్థలమందు సదస్యులు కూర్చొని యాగకర్మల నిర్ధారణము చేయుటకు జాగ్రత్తగా యజ్ఞకర్మలను గమనించుచుందురు. సదస్యుడు పదియేడవ ఋత్విక్కుగా నుండును. ఇతడు కేవలము యజ్ఞమునుచూచుచు - తప్పులు దిద్దుచుండును.

"నాగేంద్రా! ఆ సర్పయాగమునకు ఎప్పుడు గూడ నీవు భయపడకుము. పూర్వమే నేను నీకొరకు బ్రహ్మదేవుని ప్రార్థించి ప్రసన్నుని చేసినాను. కనుక నీకు భయము లేదు. నీ మనోవ్యథ తొలగిపోవుగాక!"

"శౌనకా! ఈ విధముగ ఇంద్రునిచేత ఊరడింపబడి తక్షకుడు సంతోషముతో ఇంద్రుని భవనమునందే సుఖముగా నుండెను. కాని, అగ్నిలో నాగులు దగ్ధు లగుచుండుటవలన తక్షకుడు మిక్కిలి దుఃఖితుడై యుండెను. వాసుకి పరివారము గూడ దగ్ధము కాగా మిగిలిన కొద్ది పరివారముతో పరితపించెను. అతనికి ఘోరమైన మనోబాధ కలిగెను.

**వాసుకి సర్పరక్షణము కొరకు ఆస్తీకుని పంపుమని చెల్లెలిని కోరుట:**

అప్పుడు వాసుకి మనస్సు కలతచెందగా, తన సోదరియైన జరత్కారువుతో నిట్లనెను:

"సోదరీ! పారిక్షితుడైన జనమేజయుడు, మన సర్పజాతిని చంపు నిచ్ఛతో ప్రారంభించిన యాగమునందలి యగ్నియందు నేను గూడ పడిపోయి యమసదనమునకు పోవుదునను భయముచేత నా యవయవములు మండు చున్నవి. దిక్కులు తెలియకున్నాను. మోహముచేత శిథిలుడ నగుచున్నాను. నా మనస్సు, దృష్టి గిరగిర తిరుగుచున్న ట్లున్నది. హృదయము చీలు చున్నదా అనున ట్లున్నది. నేడు నేను మండుచున్న యజ్ఞాగ్నిలో వివశుడనై పడబోవు చున్నాను.

కనుక సోదరీ! ఏ యుద్దేశముతో నిన్ను జరత్కారునకు ఇచ్చి పెండ్లి చేసితినో, ఆ యుద్దేశము నెరవేరుటకు సరియైన కాలము ఇప్పుడు సంప్రాప్తమైనది. మమ్ము మా బాంధవులతోపాటు రక్షింపుము. నీ కొడుకు ఆస్తీకుడు ఆ యజ్ఞమును ఆపివేయగలడని పూర్వము నాకు బ్రహ్మదేవుడు చెప్పియుండెను. కనుక, బిడ్డా! నీవు నీ కుమారునకు చెప్పుము. అతడు పెద్దలకు సమ్మతుడు. వేద విద్వాంసుడు. భృత్యసహితునగు నాకు నేడు అతడు విముక్తి నీ యాజ్ఞచేత కలిగించ గలడు".

**తల్లి యాజ్ఞచేత ఆస్తీకుడు సర్పయాగమునకు పోవుట:**

''శౌనకా! యిట్లు వాసుకి కోరిన తరువాత జరత్కారువు తన కొడుకును పిలిచి, 'పుత్రా! నన్ను నా సోదరుడు నీ తండ్రికి ఒక కారణమును బట్టి ఇచ్చి పెండ్లి జేసెను. ఇప్పు డా యుద్దేశము నెరవేరు సమయ మాసన్నమైనది. కనుక, చేయవలసిన దంతయు ఇప్పుడు నీవు చేయుము!' అని చెప్పగా ఆస్తీకుడు తల్లితో 'తల్లీ! నా మేనమామ నిన్ను నా తండ్రికి ఏ కారణముచేత ఇచ్చి పెండ్లి చేసెను? అది చెప్పుము. నేను విని చేయవలసిన దంతయు చేసెదను.' అని చెప్పగా, అతని తల్లి జరత్కారువు బంధువుల హితము కోరుచు, ఆస్తీకునకు కద్రువకు సర్పజననము, సర్పములు తల్లిచేత శపింపబడుట, ఉచ్చైః శ్రవపు వృత్తాంతము. వినతా - కద్రువలు పందెము వేసికొనుట, పుత్రులను శపించిన కద్రువకు బ్రహ్మదేవుడు తన సమ్మతి తెలుపుట, వాసుకి బ్రహ్మదేవుని వచనము ప్రకారము దేవతలను శరణు వేడుట, దేవతలు వాసుకి సహాయముతో అమృతము చిలుకుట, దేవతలకు అమృతము లభించుట,వారు వాసుకిని ముందిడు కొని బ్రహ్మకడకు పోయి, 'మా శాపము నివర్తింపు' మని బ్రహ్మను వేడుట, బ్రహ్మదేవుడు, జరత్కారు దంపతులకు పుట్టిన బ్రాహ్మణుడు పన్నగులకు శాపవిముక్తి కలిగించు'నని చెప్పుట, వాసుకి జరత్కారుల వివాహము చేయుట. సర్పయాగ కాలమునకు పూర్వమే ఆస్తీకుడు తనకు జనించుట, ఈ మొదలైన కథ యంతయు, విస్తారముగా ఆస్తీకునకు జరత్కారువు చెప్పి ఇట్లనెను.

"పుత్రా! ఇప్పుడు సర్పయాగకాలము సంప్రాప్త మైనది. మమ్మందరను నా సోదరుడు వాసుకినిన్ని యజ్ఞాగ్నినుండి కాపాడుము. ఏయుద్దేశముతో నన్ను నీ తండ్రికి ఇచ్చి పెండ్లి చేసిరో, ఆ యుద్దేశము వ్యర్థము కాకుండ ఇప్పుడు నీవు సర్పములను రక్షింపుము. ఇందులో నీ యభిప్రాయము తెలుపుము".

"శౌనకా! ఈవిధముగ తల్లి ఆదేశింపగా, ఆస్తీకుడు అంగీకరించి దుఃఖ సంతప్తుడైన వాసుకిని బ్రతికించు చున్నాడా అనునట్లు అతనితో, "వాసుకీ! ఆ శాపమునుండి నిన్ను నేను విడిపించెదను సత్యము చెప్పుచున్నాను. ఇక నీకు భయము లేదు. శాంతితో నుండుము. నీకు మేలు కలుగునట్లు ప్రయత్నించెదను. నా వాక్కు అసత్యము కాదు. నేను వినోదార్థముగూడ అసత్యము చెప్పను.

యజ్ఞదీక్షితుడైన జనమేజయమహారాజు కడకుపోయి, నేను మంగళకరము లైన ఆశీర్వాదములతో అతనిని సంతోషపరచెదను. మామా! అతని యజ్ఞమును

ఆపెదను. ఇది నాకు సాధ్యమగు నని నిశ్చయింపుము. ఎప్పుడుగూడ నన్ను మిథ్యగా భావింపకుము".

"శౌనకా! ఆస్తీకుని మాట విని వాసుకి అతనితో 'ఆస్తీకా! నేను గిరగిర తిరుగు చున్నాను. హృదయము చీలు చున్నది. బ్రహ్మదండ పీడితుడనై దిక్కులు తోచక యున్నాను' అని చెప్పగా, ఆస్తీకుడు, 'సర్పరాజా! నీవు ఏ విధముగ గూడ సంతాపము చెందకుము. మండుచున్న యాగాగ్ని వలన నీకు కలిగిన భయము పోగొట్టెదను. ప్రళయకాలాగ్ని సమానమగు మహా భయంకర బ్రహ్మదండమును నశింప జేసెదను. ఈ విషయములో నీవు ఏ మాత్రము భయము చెందకుము' అని చెప్పి వాసుకిని ఆస్తీకుడు ఊరడించెను."

"శౌనకా! వాసుకి భయమును పోగొట్టిన తరువాత ఆస్తీకుడు త్వరితముగా జనమేజయుని యజ్ఞశాలకు పోయెను. ఆ యజ్ఞము సర్వసద్గుణ సంపన్నమై యుండెను. అప్పుడు, ఆస్తీకుడు యజ్ఞశాలను చూచెను, అది సూర్యాగ్ని సమ తేజస్సు గల యనేక సదస్సులచేత చుట్టబడి యుండెను. అట్టి యజ్ఞశాలలో ఆస్తీకుడు ప్రవేశింపబోవగా, ద్వారపాలకులచేత వారింపబడి, ఆ శాలలో ప్రవేశమును కోరుచు యజ్ఞశాలను సమీపించి, జనమేజయ మహారాజును, ఋత్విక్కులను, సదస్యులను, అగ్నిని ఈ విధముగా స్తుతించెను :

**ఆస్తీకుడు యజమాన-ఋత్విక-సదస్య-అగ్నులను స్తుతించుట :-**

"పారీక్షిత జనమేజయా! నీవు చేయు ఈ యజ్ఞము పూర్వము ప్రయాగ క్షేత్రమునందు సోముడు, వరుణుడు ప్రజాపతియు చేసిన యజ్ఞములవలె నున్నది. దీనివలన మా బ్రాహ్మణులకు మంగళము కలుగు గాక!

రాజా! పూర్వము ఇంద్రుడు పూరుడు చెరి నూరు యజ్ఞములు చేసిరి. ఈ నీ యజ్ఞము గూడ అట్లే జరుగుచున్నది. దీనివలన బ్రాహ్మణులమైన మాకు శుభము కలుగుగాక!

పారీక్షితా! పూర్వము యముడు, హరిమేధసుడు, రంతి దేవుడున్ను చేసిన యజ్ఞముల వలెనే ఈ యజ్ఞము గూడ జరుగుచున్నది. మా విప్రులకు శుభము కలుగుగాక!

రాజా! పూర్వము గయుడు, శశబిందు మహారాజు కుబేరుడున్ను చేసిన యజ్ఞమువలెనే నీ యజ్ఞము గూడ బ్రాహ్మణులకు క్షేమము కలిగించుగాక!

రాజా! పూర్వము నృగుడు, అజమీఢుడు, శ్రీరాముడున్ను చేసిన యజ్ఞము వంటిదే నీ యజ్ఞము గూడ. కాబట్టి దీనిచేత బ్రాహ్మణులకు శుభము కలుగుగాక!

రాజా! పూర్వము దేవపుత్రుడు, అజమీఢుడు.* నైన యుధిష్ఠిరుడు చేసిన యజ్ఞమువంటి యజ్ఞము నీవు చేయు చున్నావు. దీని వలన బ్రాహ్మణుల మైన మాకు క్షేమము కలుగుగాక.

రాజా! పూర్వము సత్యవతీ పుత్రుడైన కృష్ణద్వైపాయనుడు స్వయముగా చేసిన యజ్ఞమువలెనే నీ యజ్ఞము జరుగుచున్నది. దీనివలన బ్రాహ్మణుల మైన మాకు శ్రేయస్సు కలుగుగాక।

జనమేజయా! సూర్యసమాన తేజస్సుగల యీ ఋత్విక్కులు ఇంద్రుని క్రతువులో చేరినట్లు నీ యజ్ఞములో చేరినారు. వీరి జ్ఞానమును తెలిసికొనుటకు సాధ్యము కాదు. నేడు వీరికి నీవు చేసిన దానము ఎప్పుడు గూడ నశింపదు.

రాజా! లోకములందు ద్వైపాయనునితో సమానుడైన ఋత్విక్కు లేడని నా నిశ్చయము. ఈ మహాముని శిష్యులు భూమండలమంతటా సంచరించెదరు. ఈ ఋత్విక్కులందరు తమ కర్మలయందు సమర్థులు.

రాజా! విభావసుడు (ప్రభయే ధనముగా గలవాడు.) చిత్రభానుడు (చిత్రములైన కిరణములు గలవాడు), మహాత్ముడు, హిరణ్యరేతసుడు (హిరణ్యమే రేతస్సుగా గలవాడు) హుతభుక్కు (హోమము చేయబడిన ద్రవ్యములను భుజించువాడు), కృష్ణవర్త్మ ధూమ (నల్లని మార్గము గలవాడు, ప్రదక్షిణముగా తిరుగు జ్వాలలు కలిగి దీపించుచున్న యగ్ని గమనశీలుడు) దేవుడు నీవు హోమము చేయు హవ్యద్రవ్యములను కోరి తృప్తిగా స్వీకరించు చున్నాడు.

* 'అజమీఢ' నామము, సుహోత్రుని పుత్రునకు, (ఇతడు వేదద్రష్ట)- సుహోత్రుని పౌత్రునకు, యుధిష్ఠిరునకున్ను గలదు.

జనమేజయ మహారాజా! నీవలె ధైర్యముతో ప్రజలను పాలించు రాజు ప్రపంచములో మరియొకడు లేడు. నీ యెడల నా మనస్సు సర్వదా ప్రీతి చెంది యున్నది.

రాజా! సాక్షాత్తు ఇంద్రుడు వజ్రపాణియై ప్రజలను రక్షించునట్లే నీవు గూడ ప్రజారక్షణము చేయుచున్నావు. నీవంటి రాజు మరియొకడు పుట్టలేదు.

రాజా! నీవు ఖట్వాంగ-నాభాగ-దిలీప-యయాతి-మాంధాతృ సమాన ప్రభావము గలవాడవు. సూర్యాగ్ని తుల్య తేజస్సుగల వాడవు. భీష్మునివలె వ్రత నిష్ఠాపరుడవై నీవు విరాజిల్లు చున్నావు.

పారీక్షితా! వాల్మీకివలె నీ వీర్యము నిశ్చలమైనది. వసిష్ఠునివలె నీ కోపము అధ్దుపులో నున్నది. నీ ప్రభుత్వము ఇంద్రత్వముతో సమానము. నీ కాంతి నారాయణునివలె భాసిల్లుచున్న దని నా యభిప్రాయము.

రాజా! యమునివలె నీవు ధర్మనిశ్చయమ్ము చేయగలవాడవు. కృష్ణునివలె సర్వసద్గుణ సంపన్నుడవు. సర్వ సంపదలకు నీవు నివాసస్థానము. ధనములకు నీవు నిధానమైనట్లే, క్రతువులకు గూడ నిధివి.

రాజా! బలములో నీవు 'దంభోద్భవుని'తో సమానుడవు. శాస్త్రజ్ఞానములో, శస్త్రవిద్యలోను శ్రీరామునివంటి వాడవు. ఔర్వాగ్ని (బడబాగ్ని)తో, త్రేతాగ్ను (దక్షిణాగ్ని-గార్హపత్యము-ఆహవనీయము) లతోను సమానమైన తేజస్సు గలవాడవు. భగీరథునివలె ఇతరులకు కన్నెత్తి చూచుటకుగూడ అసాధ్యమైన పరాక్రమము గలవాడవు".

"శౌనకా! ఈ విధముగ ఆస్తీకుడు ఆ యజ్ఞశాలలోని రాజును, సదస్సులను, ఋత్విక్కులను, అగ్నిదేవుని స్తుతింపగా వారు మిక్కిలి ప్రసన్నులైరి. ఆయందరి మనోభిప్రాయములను కనుగొని జనమేజయుడు ఇట్లనెను!

**జనమేజయుడు ఆస్తీకునకు వర మీయ గోరుట :-**

"సభాసదులారా! ఇతడు బాలుడైనను వృద్ధునివలె మాట్లాడు చున్నాడు కనుక ఇతడు వృద్ధుడనియే నా భావము. కనుక ఇతనికి వర మీయ గోరు

చున్నాను. మీరందరు నాకు సమ్మతి ఇవ్వగలరు." ఆ మాటకు సదస్యులు ఇట్లనిరి:

రాజా! బాలుడైనను బ్రాహ్మణుడు రాజులకు పూజ్యుడే. అదిగాక ఇతడు విద్వాంసుడు. ఇతని కోరిక లన్నియు నీనుండియే నేడు తీర్చుకొనదలచినాడు. తక్షకుడుగూడ శీఘ్రముగా ఇతని యనుగ్రహమువలన మనకడకు రావచ్చును".

"శౌనకా! వర మీయదలచి రాజు 'వరము కోరుకొను' మని ఆ బ్రాహ్మణునితో అనెను. అప్పుడు హోత, ఆ విషయములో సంతోషించక 'ఈ యజ్ఞ కర్మలో తక్షకుడు రానంతవరకు వర మిచ్చుట తగదు" అని యనెను. అప్పుడు జనమేజయుడు ఋత్విక్కులతో 'ఈ యాగము పరిసమాప్తి చెందుటకు, తక్షకుడు శీఘ్రముగా వచ్చుటకును మీ రందరు సమగ్రశక్తిని ఉపయోగించి ప్రయత్నింపుడు. తక్షకుడు నాకు పరమద్వేషి' అని చెప్పెను. ఆ మాటకు ఋత్విక్కులు ఇట్లనిరి;

"రాజా! మాకు శాస్త్రములు,అగ్నిదేవుడున్ను తెలిపిన విధముగ తక్షకుడు భయపీడితుడై ఇంద్ర భవనమునందు ఉన్నాడు." ఈ విషయము మహాత్ముడైన సూత పౌరాణికుడు రాజునకు చెప్పియుండెను. "ఇంద్రుడు తక్షకునితో,'నీవు నా కడనే ఉండు' మని వర మిచ్చి తనయొద్ద అతనిని దాచి ఉంచుకొనినాడు. అతనితో ఇంద్రుడు'నా రక్షణలో నీవు ఉన్నంతవరకు అగ్ని నిన్ను దహింపడు' అనికూడ చెప్పెను." ఆమాట విని రాజు పరితపించుచు హోతను ప్రోత్సహించెను.

హోత యజ్ఞకర్మకాలమునందు మంత్రములచేత ప్రయత్నపూర్వకముగా తక్షకుని ఆహ్వానించెను. అప్పుడు ఇంద్రుడు విమానములో దేవతలచే స్తుతింపబడుచు మేఘములచే విద్యాధరులచే అప్సరోగణముల చేతను అనుసరింప బడుచు స్వయముగా వచ్చెను. ఇంద్రుని యుత్తరీయమునందు తక్షకుడు భయోద్వేగముతో దాగి యుండెను. అతనికి సుఖము లేకుండెను. అప్పుడు, జనమేజయుడు క్రుద్ధుడై తక్షక నాశమును కోరుచు ఋత్విక్కులతో నిట్లనెను.

"యాజకులారా! తక్షకుడు ఒకవేళ ఇంద్రభవనమునందు ఉండినయెడల అతనిని ఇంద్రునితో సహితునిగ అగ్నిలో పడవేయుడు."

"శౌనకా! ఈవిధముగ జనమేజయుడు పురికొల్పగనే హోత తక్షకుని ఇంద్రసహితునిగా ఆహ్వానించెను. అప్పుడు ఆకాశమునందు ఇంద్రుడు క్షణ కాలము బాధపడి ఆ యజ్ఞము చూచి మిక్కిలి భయముతో తక్షకుని అక్కడ విడిచి తన యింటికి పోయెను. ఇంద్రుడు పోవగనే తక్షకుడు భయమోహితుడై ఋత్విజుల మంత్రబలముచేత వివశుడై అగ్నిజ్వాలల సమీపమునకు పోయెను. అప్పుడు ఋత్విజులు రాజుతో 'రాజా! నీయజ్ఞకర్మ విధివత్తుగా నెరవేరనున్నది. కనుక ఇప్పుడు నీవు ఈ బ్రాహ్మణునకు వర మీయవచ్చును' అని చెప్పిరి. ఆ మాటకు జనమేజయుడు ఆస్తీకునితో ఇట్లనెను :

"బ్రాహ్మణోత్తమా! నీవు మహానుభావుడవు. బలసౌందర్యసంపన్నుడవు. నీకు వర మిచ్చెదను కోరుకొనుము. నీవు కోరువరము ఇవ్వరాని దైనను ఇచ్చెదను. ఆ మాటకు ఋత్విజులు రాజుతో నిట్లనిరి:

"రాజా! ఇదిగో! శీఘ్రముగా తక్షకుడు నీ వశమునకు వచ్చుచున్నాడు. అతని భయంకరధ్వని వినబడు చున్నది. నిక్కముగా నతడు ఇంద్రునిచేత విడువబడి మా మంత్రముల ప్రభావముచేత శిథిలమైన శరీరముతో స్వర్గభ్రష్టుడై ఆకాశమునందు గిరగిర తిరుగుచు తెలివి దప్పి తీవ్రముగ నిశ్వసించుచు ఇటే వచ్చుచున్నాడు."

"శౌనకా! తక్షకుడు అగ్నిలో పడబోవు చుండగా ఇదే యవకాశ మని అప్పుడు ఆస్తీకుడు ఇట్లు రాజును వరము కోరెను:-

"జనమేజయా! వరము కోరుచున్నాను. ఇప్పుడు వెంటనే నీ యజ్ఞమును ఆపవలెను. ఈ యగ్నిలో ఇక సర్పములు ఏవి గూడ పడగూడదు."

"శౌనకా! ఈ విధముగ ఆస్తీకుడు వరము కోరగా, పారీక్షితుడు సంతోషము ఉడిగినవాడై ఆస్తీకునితో, 'బ్రాహ్మణోత్తమా! సువర్ణము, రజతము, గోవులు మరి యన్యమేదైనను కోరుకొనుము. అవి యన్నియు నీకు వరముగా నిచ్చెదను. కాని, నాయజ్ఞమును ఆపకుము' అని యనగా ఆస్తీకుడు జనమేజయునితో, 'రాజా! ఇవి ఏవియు నిన్ను నేను కోరను. ఈ నీయజ్ఞము విరమించుగాక. దానివలన నా మాతృకులమునకు క్షేమము కలుగును' అని యనెను.

"శౌనకా! ఆస్తీకుడు ఇట్లు అనగనే జనమేజయుడు 'మాటిమాటికి ఇతర వరములను కోరుము. నీకు మంగళ మగుగాక!' అని ఎంత చెప్పినను ఆస్తీకుడు అన్యమైన వర మేదియు కోర లేదు. అప్పుడు వేదవిదులైన సదస్యు లందరు ఏక వాక్యముతో ఆ రాజుతో, 'ఈ బ్రాహ్మణుడు తాను కోరిన వరము పొందుగాక!' అని యనిరి. దానితో యాగము ఆగిపోయెను."

## సర్పయాగమునందు దహింపబడిన ప్రధాన సర్పముల పేర్లు :-

ఈ విధముగ ఉగ్రశ్రవుడు చెప్పగా విని శౌనకుడు అతనితో 'మహాత్మా! ఈ సర్పయాగమునందు అగ్నిలో పడి మరణించిన సర్పముల నామములను వినగోరు చున్నాను చెప్పుము.' ఆ మాటకు ఉగ్రశ్రవుడు ఇట్లనెను.

"శౌనకా! యజ్ఞములో దహింప బడిన సర్పములు అనేక సహస్రములు, లక్షలు, కోట్లకొలదిగ నున్నవి. కనుక వానిని లెక్కపెట్టుట సాధ్యముకాదు. నాకు జ్ఞాపకమున్నంతవరకు ఆ పన్నగముల నామములు చెప్పెద వినుము. వానిలో అగ్నిలో హుతములైన ప్రధాన సర్పములపేర్లే చెప్పెదను. వానిలో ముఖ్యులు, వాసుకి కులోత్పన్నులు. ఆ సర్పములు నీల - రక్త - శ్వేతములు. మహాకాయములు, అధికవిషము కలిగినవి, అతి ఘోరములు, మాతృశాప పీడితములు. అవి వివశములై దీనములై పిల్వబడినవి. అవి కోట్లకొలదిగ నున్నవి వానిపేర్లు ఇవి :

"మానస - పూర్ణ - శల - పాల - హలీమక - పిచ్ఛల - కౌణప - చక్ర-కాలవేగ - ప్రకాలన - హిరణ్యబాహు-శరణ - కక్షక - కాలదంతకులు" ఈ పదునాల్గురు వాసుకి కులోత్పన్నులు. వీరు అగ్నిలో పడిపోయిరి.

"శౌనకా! అట్లే ఇతరులు గూడ సర్పరాజ కులోత్పన్నులు అనేకులు ప్రదీప్తాగ్నిలో హోమము చేయబడిరి. వా రందరు ఘోరస్వరూపులు మహాబలులు, తక్షకకులోత్పన్నులు, వారి నామములు చెప్పెద వినుము.

"పుచ్ఛాండక - మండలక - పిండసేక్తృ - రభేణక - ఉచ్ఛిఖ - శరభ భంగ - బిల్వతేజస్ - విరోహణ-శిలి - శలకర - మూక - సుకుమార - ప్రవేపన - ముద్గర - శిశురోమన్ - సురోమన్-మహాహను" నామకులు పదునెనిమిది తక్షక కులోత్పన్న సర్పములు అగ్నిలో పడినవి.

"పారావత - పారిజాత - పాండర - హరిణ - కృశ - విహంగ - శరభ - మేద - ప్రమోద - సంహతాపనులు ఈ పదకొండుగురు ఐరావతకుల జాతులు అగ్నిలో పడిరి.

"శౌనకా! కౌరవ్యకుల జాతులను గూర్చి చెప్పెద వినుము :- 'ఏరక - కుండల - వేణిన్ -వేణీ స్కంధ - కుమారక-బాహుక - శృంగవేర - ధూర్తక - ప్రాతరాతకులు' - ఈ పదుగురు అగ్ని ప్రవిష్టులైరి."

"శౌనకా! ధృతరాష్ట్రకులజులైన 'శంకుకర - పిఠరక - కుఠారముఖ - సేచక - పూర్ణాంగద - పూర్ణముఖ - ప్రహాస - శకుని - దరి - అమహఠ - కామఠక - సుషేణ - మానస - అవ్యయ - భైరవ - ముండ వేదాంగ - పిశంగ - చోద్ర పారక - ఋషభ - వేగవన్ - పిండారక - మహాహను - రక్తాంగ - సర్వసారంగ - సమృద్ధ - పటవాసక - వరాహక - వరణక - సుచిత్ర - చిత్ర వేణిక - పరాశర - తరుణక - మణిస్కంధ - అరుణులు ఈ ముప్పదినలుగురు అగ్నిలో పడిరి. వీరు వాయువేగము అధిక విషమున్ను గలవారు."

"శౌనకా! యశస్కరులైన ఈ సర్పశ్రేష్ఠులను గూర్చి చెప్పితిని. వీరు ప్రధానులు. అసంఖ్యాకులుగ నుండుట వలన అందరిపేర్లు నేను చెప్పలేదు. వీరి పుత్రపౌత్రాది సంతతిని లెక్కపెట్టుట అసాధ్యము. వారందరున్ను ఈ యజ్ఞము నందు ప్రజ్వలితాగ్నిలో పడి నశించిరి."

"శౌనకా! వారిలో కొందరు త్రిశీర్షులు కొందరు, ఏడుపడగలు గలవారు, మరికొందరు, దశశిరస్కులుగాను నుండిరి. అందరు ప్రళయకాలాగ్ని వంటి విషమును ధరించి భయంకరులుగా నుండిరి. వారు నూర్లకొలది వేలకొలదిగ నుండిరి. మహాకాయులు, మహావేగులు, పర్వతశృంగములవలె ఉన్నతులు, ఒక యోజనపు పొడవు, ఒక యోజనపు విస్తారము గలవారు, రెండు యోజనముల పొడవైనవారు, కామరూపులు, కామబలులు, ప్రజ్వలితాగ్నివలె అధికవిషము గలవారుగను నుండిరి. వీరందరుగూడ ఈ మహాసర్పయాగము నందు బ్రహ్మ దండపీడితులై దగ్ధులైరి.

**సర్పయాగ సమాప్తి - ఆస్తీకునకు సర్పములు వరమిచ్చుట :-**

"శౌనకా! ఆస్తీకుని యొక్క అత్యద్భుతమై మరియొక సమాచారము వినినాము. అది యేమనగా - జనమేజయుడు ఆస్తీకునకు వరమిచ్చిన తరువాత

ఇంద్రహస్తమునుండి జారిపోయిన తక్షకుడు ఆకాశము నందే నిలిచెను. అప్పుడు జనమేజయుడు మిక్కిలి చింతించి తక్షకుని ఆహ్వానింపగా, అతడు ప్రజ్వలితాగ్నిలో భయపీడితుడై పడ లేదు" ఆ మాట విని శౌనకుడు, 'మహాత్మా ! ఆ యజ్ఞమునందు ఋత్విక్కులకు మంత్రములు అప్పుడు స్ఫురింప లేదా ? ఆ కారణముచేతనే తక్షకుడు అగ్నిలో పడ లేదని భావించెదను' అని యనగా, ఉగ్రశ్రవు డిట్లనెను :

"శౌనకా! ఇంద్రుని హస్తము నుండి విడువబడి తెలివి దప్పియున్న తక్షకుని ఆస్తీకుడు 'నిలు! నిలు! నిలు!' మని మూడు పర్యాయములు చెప్పగా తక్షకుడు మనస్సులో బాధపడుచు అంతరిక్షమునందు భూమ్యాకాశముల నడుమ నిలిచిన మనిష్యునివలె నిలిచెను."

"శౌనకా! అప్పుడు జనమేజయుడు సదస్యుల ప్రోత్సాహముచేత ఇట్లనెను:-

"తక్షకుడు ఆస్తీకునిమాట ప్రకారమే అంతరిక్షమునందు నిలిచియుండుగాక! ఈ యజ్ఞకర్మ ఇంతటితో ముగింప బడుగాక! పన్నగములు నశింపకుండగాక! ఈ ఆస్తీకుడు ప్రీతి జెందుగాక! సూతుని వాక్కు సత్యమగు గాక!

"శౌనకా! తరువాత సంతోషముతో గూడిన కోలాహల శబ్దము కలిగెను. ఆస్తీకునకు వరము ఈయబడిన తరువాత ఆ యజ్ఞము ముగిసెను. దానితో జనమేజయుడు ప్రీతి చెందెను. ఋత్విక్కులకు, సదస్యులకు, అక్కడికి వచ్చిన ఇతర బ్రాహ్మణులకు నూర్లకొలది, వేలకొలది ధనము దక్షిణగ జనమేజయు డిచ్చెను."

"శౌనకా! ఒక బ్రాహ్మణుని మూలముగా ఈ సర్పయాగము ఆగిపోవునని తొలుత చెప్పిన స్థపతికి జనమేజయుడు అనేక ధనములు ఇచ్చెను. ధనమే కాక అన్న - వస్త్రములు ఇచ్చి జనమేజయుడు అతనికి ప్రీతి కలిగించెను. తరువాత రాజు విధివత్తుగా, అవభృథస్నానము (యజ్ఞాంత స్నానము) చేసి, ఆస్తీకుని సంతోషపరచి సన్మానించి కార్యము నెరవేర్చుకొనిన యతనిని అతని యింటికి పంపుచు అతనితో 'మహాత్మా ! నీవు మరల ఇక్కడికి వచ్చి నేను చేయబోవు అశ్వమేధ మహా యాగమునందు సదస్యుడవుగా నుండుమని ప్రార్థించెను."

"శౌనకా ! జనమేజయుని మాట విని ఆస్తీకుడు సంతోషముతో 'అట్లే యగుగాక !' యని చెప్పి అసమానమైన తన కార్యమును నెరవేర్చుకొని ఆ

రాజును సంతోషపరచి ప్రీతితో తిరిగి పోయి మేనమామను తల్లిని సమీపించి నమస్కరించి వారిని ఆలింగనము చేసికొని జరిగిన సమాచార మంతయు వారికి తెలిపెను."

"శౌనకా ! ఆస్తీకుడు చెప్పిన సమాచార మంతయు విని అక్కడచేరి యున్న సర్పశ్రేష్ఠులు మిక్కిలి ప్రీతి జెంది మోహము విడిచి ఆస్తీకుని యెడల ప్రీతి గలవారై అందరు ఏకకంఠముతో అతనిని వరము కోరుకొను మని ప్రార్థించిరి. నీకు మరియింకేమి ప్రియము చేయుదుమో చెప్పుమని, మేమందరము నీ యెడల మిక్కిలి ప్రీతి జెంది యున్నామని, మాకందరకు విముక్తి కలిగించితి వనియు చెప్పి, నీకు ఏమి యిష్టమో కోరుకొనుము అని అందరు మాటిమాటికి అతనితో ననిరి. వారి మాటలు విని ఆస్తీకుడు వారితో నిట్లనెను !

"సర్పరాజులారా ! ఈ లోకమునందు పరలోకమునందునను ఏ విప్రులు, మానవులు ఈ నా యొక్క ధర్మాఖ్యానమును వినెదరో వారికి మీనుండి ఏలాంటి భయము కలుగకుండుగాక !" అని వరము కోరెను !

"శౌనకా ! అతని వరము విని సర్పములు అతనితో 'మేనల్లుడా ! నీవు కోరిన వరము సత్య మగుగాక !' నీవు కోరినట్లే మేమందరము ప్రీతితో ఆ వరమును ఆసక్తి పూర్వకముగ ఇచ్చెదము"

"శౌనకా ! 'అసితుని - ఆర్తిమంతుని - సునీథుని' రాత్రిగాని పగలు గాని స్మరించినవానికి సర్పభయము ఉండదు. "జరత్కారువునకు జరత్కారుని వలన పుట్టిన ఆస్తీకుడు మీ సర్పముల నందరిని రక్షించెను.అతనినిస్మరించు చున్న నన్ను మీరు హింసించకుడు సర్పమా ! జరుగుము ! నీకు మంగళ మగు గాక! మహావిషము గల సర్పమా! వెడలిపొమ్ము! జనమేజయుని యజ్ఞాంతమందు ఆస్తీకునిమాట స్మరింపుము.ఆస్తీకునిమాట విని ఏ సర్పము తొలగిపోవదో దాని తల 'శింశ' వృక్షపు (ఇది ఒక విధమైన పండ్లచెట్టు) పండ్లవలె నూరుముక్కలై పగిలి పడును, "అనిన వారికి సర్పభయము ఉండదు "

"శౌనకా! అక్కడ చేరి యున్న సర్పరాజు లిట్లు ఆస్తీకునకు చెప్పగా ఆ మహాత్ముడు మిక్కిలి ప్రీతి జెంది అక్కడినుండి బయలుదేరి పోవ దలచెను.

"జనమేజయా!ధర్మాత్ముడైనఆస్తీకుడు సర్పయాగమునుండి సర్పములకు విముక్తి కలిగించి పుత్రపౌత్రవంతుడై కొంతకాలమునకు దైవగతిని పొందెను.

"శౌనకా! ఆస్తీకోపాఖ్యానము యథావత్తుగా నీకు చెప్పితిని. దీనిని వినిన వారికి ఎక్కడగూడ సర్పములభయము ఉండదని నీవంశములో పూర్వజుడైన ప్రమతి తన పుత్రుడైన గురువునకు చెప్పెను. ఆ కథ నేను విని నీకు చెప్పితిని శ్రీమంతమైన ఆస్తీకుని కథ మిక్కిలి ధర్మిష్ఠమైనది. పుణ్యప్రవర్ధనము. శౌనకా! డుండుభునిమాట వినినీవు నన్ను ఈ ఆస్తీకోపాఖ్యానమునుగూర్చి అడిగి, నేను చెప్పగా వింటివి నీకౌతూహలము ఇంతటితో తొలగి పోవుగాక"

ఆస్తీక పర్వము సమాప్తము

# అంశావతార పర్వము

**మహాభారత కథారంభము :**

శౌనకుడు ఉగ్రశ్రవుడు చెప్పిన భృగువంశాదుల కథ లన్నియు విని ఆతనితో నిట్లనెను :

"ఉగ్రశ్రవా ! నీవు చెప్పిన దంతయు విని ప్రీతి జెందితిని. ఇంకను వ్యాసుడు చెప్పినకథ అన్నియు చెప్పుము. ఆ సర్పయాగమునందలి సదస్యులకు ఇతర యాగములందు ఉన్న సదస్యులకున్ను సంబంధించిన కథ లన్నియు నీనుండి వినగోరు చున్నాము. చెప్పుము: 'ఆ మాటకు సూతపుత్రుడు ఇతర యాగములందు బ్రాహ్మణులు వేద సంబంధములైన కథలు చెప్పిరి. వ్యాసుడైతే, చిత్రమైన మహాభారతాఖ్యానము చెప్పెను'. అని యనగా శౌనకు డిట్లనెను:

"సూతపుత్రా ! పూర్వము జనమేజయుడు అడుగగా ఇతర యాగము నందు కృష్ణద్వైపాయనుడు పాండవుల యశస్కరమైన కథను వినిపించెను. గదా! అట్టి పవిత్ర కథను సమగ్రముగా విన గోరుచున్నాను. ఆ కథ మహాను భావుడైన వ్యాసమహర్షి యొక్క మనస్సముద్రము నుండి పుట్టిన సర్వరత్న మయము. దానిని చెప్పుము." ఇట్లు అడుగగా, సూతపుత్రుడు చెప్ప దొడగెను.

"శౌనకా ! ఇది ఉత్తమమైన మహాకథ ! దీనిని కృష్ణద్వైపాయనుడు చెప్పెను. మహాభారత కథ ఆదినుండి నీకు సమగ్రముగ చెప్పెద వినుము. నీకు చెప్పుటకు నాకు గూడ చాల సంతోషము కలుగుచున్నది.

**సర్పయాగమునందు వ్యాసుని యాగమనము - ఆయనకు పూజ :**

"శౌనకా ! జనమేజయుడు సర్పయాగమునందు దీక్షితుడై యున్నా డని విని కృష్ణద్వైపాయన మహాముని అక్కడకు వచ్చెను."

శౌనకా! అతనిని 'శక్తి' పుత్రుడైన పరాశర మహామునినుండి సత్యవతి కన్యకగా నున్నప్పుడే యమునా నదీ ద్వీపమునందు కనెను. (కనుక నతనికి 'ద్వైపాయను' డని పేరు.) ఆకృష్ణ ద్వైపాయనుడు పాండవులకు పితామహుడు. అతడు పుట్టగనే యజ్ఞాదులచేత దేహమును పెంచుకొనెను. మహాయశస్కుడై, వేద-వేదాంగ ఇతిహాసాదులను నేర్చెను. తపస్సుచేత గాని, వేదాధ్యయనముచేత గాని, వ్రతోపవాసాదులచేత గాని, శాంతిచేత గాని, కోపముచేత గాని అసాధ్యమైనవేదవిభాగమును అతడు చేసెను. వేదమును నాలుగుగా విభజించెను. (అందుచేత అతనికి 'వేదవ్యాసుడు' అనుపేరు ప్రసిద్ధమయ్యెను.)"

"శౌనకా! ఆమహాముని ఇహలోక - పరలోకజ్ఞానము కలవాడు సత్యవ్రతనిష్ఠుడు. పవిత్రుడు. ధృతరాష్ట్ర - పాండు - విదురులను కనినవాడు. శాంతను మహారాజు సంతతిని విస్తరింప జేసినమహాకీర్తిశాలి. అట్టి మహాత్ముడైన వేదవ్యాసుడు అప్పుడు వేద - వేదాంగపారగులైనశిష్యులతో జయమేజయునిసర్పయాగ సభకు వచ్చి, అక్కడ కూర్చొని యున్నజనమేజయుని చూచెను. ఆ రాజుచుట్టు అనేకసదస్యులు, ఇంద్రుని దేవతలు చుట్టినట్లు మూగి యుండిరి. రాజులు, దేశాధిపతులు, బ్రహ్మసమానులైన ఋత్విక్కులు కూడ ఆసభలో నుండిరి."

"శౌనకా! అట్లు వచ్చిన కృష్ణద్వైపాయనమహామునిని జనమేజయుడు సపరివారముగా ఎదుర్కొని ఆయనకు స్వాగతము పలికి బంగరుపీఠమును ఇంద్రుడు బృహస్పతికివలె సమర్పించి దానిపై సుఖాసీనుని చేసెను. ఆపీఠముపై కూర్చొని, యున్నవరదుడు, దేవర్షిగణపూజితుడునైన వ్యాసమహామునిని శాస్త్రోక్తముగ అర్ఘ్య - పాద్యాచమనీయాదులచేత పూజించి అర్హుడు తనకు ప్రప్రపితామహుడు నైనఆమహామునికి గోవును సమర్పించెను. (పెద్దలకు చేయబడు నతిథి పూజలో గోవును గూడ ఇచ్చుట ఆచారము.)

"శౌనకా! జనమేజయునిపూజను గ్రహించి వ్యాసుడు సంతుష్టు డయ్యెను. అట్లు తనముత్తాతకు తండ్రియైనవ్యాసుని పూజించి అతనిసమీపమందు కూర్చొని జనమేజయుడు క్షేమసమాచార మడిగెను. వ్యాసభగవానుడు తనకుశలముచెప్పి సదస్యులచేత పూజితుడై తిరిగి వారిని పూజించెను. తరువాత జనమేజయుడు, సదస్యులతోపాటు అంజలిబద్ధుడై వ్యాసభగవానుని ఇట్లు ప్రశ్నించెను:-

"భగవాన్! కౌరవులను, పాండవులను ప్రత్యక్షముగ నీవు చూచినావు. వారి చరిత్రము నీనోట విన గోరుచున్నాను. పుణ్యాత్ములైన ఆ సోదరులలో ఎట్లు భేదము కలిగెను? సమస్త జంతు నాశకరమైన యుద్ధము వారికి ఎట్లు కలిగెను? నా ప్రపితామహులైన వారందరి చరిత్రను సంపూర్ణముగ జరిగినది జరిగినట్లు నాకు చెప్పుము. వారికి దైవికముగ ద్వేషము కలిగినది".

"శౌనకా! జనమేజయునిమాట విని కృష్ణద్వైపాయనుడు అప్పుడు తనకడ కూర్చొని యున్న తన శిష్యుడైన వైశంపాయనునకు ఇట్లు ఆజ్ఞ యిచ్చెను:-

"వైశంపాయనా! పూర్వము కౌరవ-పాండవులకు ఎట్లు భేదము కలిగెను అను విషయము నానుండి నీవు విని యున్నావుకదా! అది జనమేజయునకు చెప్పుము".

"శౌనకా! గురువచనము శిరసా వహించి వైశంపాయన మహాముని ప్రాచీనమైన భారతేతిహాస మంతయు జనమేజయ మహారాజునకు, సదస్యులకు, అక్కడ చేరియున్న రాజులకు అందరికిన్ని కౌరవ-పాండవ భేదమును గూర్చి వారి వినాశమును గూర్చియు నిట్లు చెప్పదొడగెను".

**కౌరవ-పాండవులకు భేదము కలుగుట-వారి యుద్ధ వృత్తాంతము యొక్క సంగ్రహ వర్ణనము :**

"జనమేజయ మహారాజా! తొలుత గురువునకు మనోబుద్ధి-భక్తి-ఏకాగ్ర చిత్తములచేత నమస్కరించి, సమస్త బ్రాహ్మణులను, ఇతర విద్వజ్జనములను పూజించి సర్వలోక ప్రసిద్ధుడు బుద్ధిమంతుడు మహాత్ముడునైన నా గురువు వ్యాసమహాముని నాకు చెప్పిన భారతకథ యంతయు చెప్పెదను:-

రాజా! ఈకథ వినుటకు సత్పాత్రుడవైన నీవు లభించితివి. కనుక గురువు యొక్క ఆజ్ఞ నన్ను ప్రోత్సహించుచున్నది. 'కురుపాండవులకు రాజ్యముకొరకై జూదమువలన పుట్టిన భేదము పాండవుల వనవాసము ప్రపంచ వినాశకరమైన యుద్ధము' ఇది యంతయు నీకు చెప్పెద వినుము :-

"జనమేజయా! తండ్రి యైన పాండురాజు మరణించిన తరువాత, వీరులైన పాండవులు వనమునుండి తమ యింటికి వచ్చి క్రమముగ వేద ధనుర్వేదములందు విద్వాంసులైరి. ఆ విధముగ బలపరాక్రమ సంపన్నులు,

ప్రజలకు ఇష్టులు నైన పాండవులను కౌరవులు అసూయతో సహించ లేదు. పాండవుల సంపదను యశస్సును చూచి దుర్యోధనునకు ఈర్ష్య కలిగెను.

రాజా! తరువాత క్రూరులైన దుర్యోధన - కర్ణ - శకునులు పాండవులను నిగ్రహించి నగరమునుండి వెడలగొట్టుటకు వివిధ ప్రయత్నములు చేసిరి. తరువాత శూరుడైన దుర్యోధనుడు దుష్ట జనుల యభిప్రాయము ప్రకారము రాజ్యకాంక్షతో పాండవులను వివిధోపాయములచేత పీడించెను.

రాజా! దుర్యోధనుడు భీమునకు అన్నములో విషము పెట్టెను. అతడు దానిని అన్నముతో జీర్ణించుకొనెను. ఒకసారి భీముడు గంగాతీరమునందలి పెద్ద మేడిచెట్టు కొనపై నిద్రించి యుండగా, నతనిని కౌరవులు బంధించి గంగలో వేసిరి. భీముడు మేల్కొని బంధనములు త్రెంచుకొని ఏ బాధయు లేనివాడై గంగనుండి యావలకు వచ్చెను. ఒకసారి నిద్రించుచున్న భీమసేనుని దుర్యోధనుడు కృష్ణ సర్పములచేత అన్ని అంగములందు కఱపించినను అతడు మరణించ లేదు.

రాజా! ఈ విధముగ దుర్యోధనుడు చేసిన యపకారముల నన్నింటిని తప్పించుకొనుటలో వానికి ప్రతి క్రియ చేయుటలోను పాండవుల హితము కోరిన విదురుడు సావధానుడై యుండెను. స్వర్గమునందున్న యింద్రుడు జీవ లోకమునకు సుఖము కలిగించునట్లే విదురుడు గూడ పాండవులకు సర్వదా, సుఖము కలిగించుచునే యుండెను.

రాజా! రహస్యముగా, ప్రకటముగాను చేసిన వివిధోపాయములచేత దైవముచేత భవిష్యత్తు నందలి యోగముచేతను రక్షింపబడిన పాండవులను సంహరించుటకు దుర్యోధనునకు సాధ్యము కానప్పుడు ధృతరాష్ట్రుని ఒప్పించి ఒక లక్క యింటిని నిర్మింప జేసెను. అప్పుడు పుత్రునకు ప్రియము చేయ గోరుచున్న ధృతరాష్ట్రుడు రాజ్య సుఖమంతయు అనుభవించు నిచ్ఛతో పాండవులను హస్తినాపురము నుండి బయటకు పంపెను. అతని యాజ్ఞచేత పాండవులు 'వారణావతపుర'మునకు పోవుటకు ప్రయాణము చేసినప్పుడు వారికి మంత్రిగా హితము చెప్పుటకు విదురుడు ఉండెను.

రాజా! ధృతరాష్ట్రుని యాజ్ఞచేత పాండవులు అర్ధరాత్రమునందు బయలు దేరి వారణావతము చేరి అక్కడ తల్లితోపాటు లక్కయింటిలో నివసించు

చుండిరి. అక్కడ పురోచనునిచేత కనిపెట్టబడుచు ఒక సంవత్సరము జాగ్రత్తతో నివసించి విదురునిచేత నిర్మింప జేయబడిన సొరంగముగుండా బయలుదేరుచు లక్కఇంటిని అందులో పురోచనుని దహించి తల్లితోపాటు పరుగెత్తి పోయిరి.

జనమేజయా! అట్లు పోవుచున్న పాండవులు వనమునందలి సెలయేటి ప్రదేశమునందున్న హిడింబుడు అను భయంకర రాక్షసుని భీమసేనుడు చంపగా అతని భుజముపై నిద్రించుచున్న సోదరులు, తల్లి మేలుకొనిరి. అందరు దుర్యోధన భయపీడితులై ఆ రాత్రి పరుగెత్తి పోయిరి. అక్కడ భీముడు హిడింబుని చెల్లెలైన హిడింబను చేపట్టి ఆమెవలన ఘటోత్కచుని కనెను. అక్కడినుండి వారు ఏకచక్రపురము పోయిరి.

రాజా! ఏకచక్రపురమునందు పాండవులు నియమవ్రతనిష్ఠతో బ్రహ్మచారులై వేదాధ్యయనము చేయుచు కొంతకాలము ఒక బ్రాహ్మణ గృహమునందు నివసించు చుండిరి. ఆ పురమునందు భీముడు నరభక్షకుడైన బకుడు అను రాక్షసుని చంపి ఏకచక్ర పురవాసులకు శాంతి చేకూర్చెను.

రాజా! తరువాత పాండవులు పాంచాలదేశమునందు జరుగ నున్న ద్రౌపదీ స్వయంవరమును గూర్చి విని అక్కడికి పోయి ఆమెను పొంది అక్కడ మిగిలిన సంవత్సరకాలము ఉండి హస్తినాపురమునకు తిరిగి వచ్చిరి.

రాజా! అప్పుడు ధృతరాష్ట్రుడు, భీష్ముడు పాండవులతో 'మీకు సోదరులతో విరోధము కలుగకుండుటకు గాను మీ నివాసము ఖాండవప్రస్థ నగరమందు ఏర్పరచుట యుక్తము' అని ఆలోచించి నిర్ణయించితిమి. కనుక మీరు అనేక జనపదములతో గూడి మంచి రాజమార్గములు గల ఖాండవప్రస్థములో నివసించుటకు పొండు".

రాజా! ఆ ఇరువురు పెద్దల యాజ్ఞప్రకారము పాండవులు బంధు మిత్రులతోపాటు అన్ని రత్నములు (ఉత్తమ ద్రవ్యములు) తీసికొని ఖాండవ ప్రస్థమునకు పోయి అక్కడ అనేక సంవత్సరములు నివసించుచుండిరి.

జనమేజయా! పాండవులు తమబల - పరాక్రమ - ప్రతాపములచేత ఇతర రాజులను వశపరచుకొని ధర్మప్రధానులై సత్యవ్రత నిష్ఠులై ఏమరుపాటు లేక ఓర్పుతో శత్రువులను తపింప జేయుచునుండిరి.

రాజా! భీమసేనుడు తూర్పు దిక్కును, అర్జునుడు ఉత్తరదిక్కును, నకులుడు పడమటి దిక్కును, సహదేవుడు దక్షిణ దిక్కును జయించిరి. ఈ విధముగ నలుగురు తమ్ములు దిగ్విజయము చేయగా, సమస్తభూమండల రాజ్యమును సూర్యసమాన తేజస్సుగల పంచపాండవులు తమతో సూర్యుడు ఆరవవాడుగా నుండగా పాండవులతోపాటు భూమి ఆరుగురు సూర్యులతో విరాజిల్లుచున్నదా యనునట్లుండెను.

జనమేజయా! తరువాత ఏదోయొక నిమిత్తమునుబట్టి ధర్మరాజు తన ప్రాణములకన్న ప్రియతరుడైన అర్జునుని వనమునకు పంపెను. అర్జునుడు ధైర్య-సత్య-ధర్మ- విజయములలో అన్నకు అధిక ప్రియుడై అతనిమాట ఎప్పుడు గూడ అతిక్రమించకుండెను. అర్జునుడు వనమునందు పన్నెండు సంవత్సరముల ఒకమాసము నివసించినప్పుడు తీర్థయాత్రచేసి నాగకన్యకను, పాండ్యరాజకన్యకను పెండ్లియాడి వారితో కొంతకాలముండి హృషీకేశమునకు పోయెను.

రాజా! తరువాత అర్జునుడు ద్వారకా పట్టణమునకు పోయి కృష్ణుని చెల్లెలగు సుభద్రను పెండ్లి యాడెను. ఆమె ఇంద్రునితో శచీదేవివలె, శ్రీకృష్ణునితో కలసి లక్ష్మీదేవివలె, అర్జునునితో కలిసి యుండెను. తరువాత అర్జునుడు శ్రీకృష్ణునితో ఖాండవవనమునందు అగ్నిని తృప్తిపరచెను. శత్రువధకు పూనినయర్జునునకు శ్రీకృష్ణ సహాయముతో శత్రువధ భారముగా తోచలేదు.

జనమేజయా! ఖాండవ వనమునందు తృప్తి జెందినఅగ్నిదేవుడు అర్జునునకు గాండీవధనుస్సు రెండు అక్షయతూణీరములు హనుమంతుని చిహ్నము గల రథము ఇచ్చెను. అర్జునుడు ఖాండవవనదహనమునుండి మయుడు అను రాక్షసుని విడిపింపగా నాతడు సంతోషించి సర్వోత్తమవస్తువులచే సౌందర్య భరితమైన ఒక దివ్యసభను నిర్మించి ఇచ్చెను.

రాజా! ఆ మయసభయందలి ఆశచేత దుర్బుద్ధియైనదుర్యోధనుడు శకునితో కలిసి జూదమాడి యుధిష్ఠిరుని ఓడించి పన్నెండేండ్లు అరణ్యవాసము, పదుమూడవయేడు ఒకరాష్ట్రమునందు అజ్ఞాతవాసమున్ను చేయుటకు పంపెను.

రాజా! పదునాలుగవ సంవత్సరమునందు పాండవులు అజ్ఞాతవాసము నుండి తిరిగివచ్చి తమరాజ్యభాగమును యాచించిరి. కాని, ధుర్యోధనాదులు వారి భాగము ఇవ్వనందుచేత కౌరవ పాండవులకు యుద్ధము కలిగెను. పాండవులు అనేక క్షత్రియం సంహారము చేసి, దుర్యోధనుని సంహరించి తిరిగి భూయిష్ట మైన రాజ్యమును పొందిరి.

జనమేజయమహారాజా! ఈ విధముగ పాండవులకు కౌరవులకు గలిగిన భేదమును గూర్చి పాండవుల విజయమునుగూర్చి సంగ్రహముగా చెప్పితిని.

అదివిని జనమేజయుడు, మహాభారతకథ ఆదినుండి సవివరముగా విన గోరి వైశంపాయనమహామునిని ఇట్లు ప్రశ్నించెను.

**మహాభారత మహిమ :**

"వైశంపాయన మహామునీ! మహాభారతాఖ్యానము, కౌరవులచరిత్ర సంగ్రాహముగా చెప్పితివి. ఆకథ విస్తారముగ వినుటకు నాకుచాల కుతూహలము కలుగు చున్నది. కనుక నీవు ఆకథను సవిస్తరముగ చెప్పుము. నాపూర్వుల మహాచరిత్రను వినుచున్న నాకు తృప్తి దీరకున్నది. ధర్మజ్ఞులైన పాండవులు అనేకులను అవధ్యులను సంహరించినప్పటికిని వారు మానవులచే పూజింప బడు చున్నారు అనుటకు అల్ప కారణము ఉండదు.

"మహామునీ! దురాత్ములు ప్రయోగించిన యనేక క్లేశములను నిరప రాధు లై శక్తిమంతులై యున్నప్పటికిని పురుషశ్రేష్ఠులైన పాండవులు ఓర్చుకొని ఎట్లు ఉండిరి? పదివేల యేనుగుల బలము గలిగి బాహుబలశాలి యైన భీముడు క్లేశము ననుభవించుచుగూడ ఎట్లు కోపమును అణచుకొనెను? పతివ్రత యై, శక్తిమంతురాలైన ద్రౌపదీదేవి దురాత్ములచేత బాధపడుచుగూడ దుర్యోధనాదులను తన క్రోధదృష్టితో ఎందుకు దహించలేదు? దురాత్ములచేత బాధింప బడుచున్నను భీమార్జున నకుల సహదేవులు ద్యూతవ్యసనుడైన యుధిష్ఠిరుని ఎట్లు అనుస రించిరి? ధర్మజ్ఞుడైన యుధిష్ఠిరుడు క్లేశము పొందుటకు అనర్హుడైనను ఎట్లు క్లేశమును ఓర్చుకొనెను. కృష్ణసారథియైన అర్జునుడు సమస్త సేనలను ఏకాకిగానే ఎట్లు సంహరించెను? ఈ కథలన్నియు జరిగినవి జరిగినట్లుగ నాకు చెప్పుము."

ఆ ప్రశ్నలకు వైశంపాయనుడు జనమేజయునకు ఇట్లు బదులు చెప్పెను:

"రాజా! ఈ మహాభారతపుణ్యాఖ్యానము విపుల మైనది. సావకాశముగా వినుము. కృష్ణ ద్వైపాయనుడు చెప్పిన విధముగ నీకు చెప్పుచున్నాను. ఇది ఒక లక్ష శ్లోకముల గ్రంథము.

రాజా! మహాభారతకథను వినిపించిన విద్వాంసుడు వినినమానవులు బ్రహ్మ లోకమునకు పోయి దేవతాసమానులయ్యెదరు. ఈ కథ వేదసమ్మతము. పవిత్రము ఉత్తమము వినిపింపదగి వాటిలో శ్రేష్ఠమైన కథ.

రాజా! మహాపుణ్యకరమైన యీ యితిహాసమునందు ధర్మార్థములు రెండును సమగ్రముగ ఉపదేశింప బడినవి. ఉత్తములు, దాన - సత్యశీలురు, అనాస్తికులు నైనవారికి ఇది నైష్ఠికబుద్ధి కలిగించును.

రాజా! కృష్ణద్వైపాయన ప్రోక్తమైన మహాభారత వేదమును వినిపించి విద్వాంసుడు ధనవంతుడై, భ్రూణహత్యాపాతకమును పోగొట్టుకొనును. భయ కరుడైన పురుషుడుగూడ మహాభారతేతిహాసమువిని, రాహువునుండి చంద్రుడువలె మహాపాపముల నుండి విముక్తుడగును.

రాజా ! జయేచ్ఛగల రాజు 'జయము' అను పేరు గల యీ యితిహాసము వినవలెను. అట్టిరాజు శత్రువులను, భూమండలమునున్ను, జయించును. ఈ యితిహాసము పుంసవనము (పుత్రోత్పత్తికరము) స్వస్త్యయనము (మంగళ కరము), దీనిని పట్టమహిషీ- యువరాజులు అనేక పర్యాయములు వినవలెను. అట్టి దంపతులకు వీరుడగు పుత్రుడు గాని, రాజ్యాధికారిణియైన కన్యక గాని పుట్టును.

రాజా ! ఈ మహాభారతేతిహాసము పుణ్యకరమైన ధర్మశాస్త్రము. శ్రేష్ఠమైన అర్థశాస్త్రము, మోక్షశాస్త్రము నని వేదవ్యాసుడు చెప్పెను. ఇది వినిన పుత్రులు పితృశుశ్రూషాపరులగుదురు. సేవకులు ప్రియము చేయుదురు. మనో- వాక్కాయ కృతపాపములనుండి ఇది వినిన నరుడు విముక్తి చెందును.

రాజా! ఈ కథ వినిన వారికి వ్యాధిభయము, పరలోకభయము నుండవు. ఈ కథ ధనము, యశస్సు, ఆయుస్సు, పుణ్యము, స్వర్గము కలిగించును,

పుణ్యముకొరకు వ్యాసుడీ కథ రచియించెను. మహాత్ములైన పాండవుల యొక్క, అనేక విద్వాంసులయొక్క, పుణ్యకర్ముల యొక్కయు కీర్తిని ఈ కథ లోకము నందు ప్రకటించును.

రాజా : ఈ భారతేతిహాసమును బ్రాహ్మణులకు వినిపించిన మానవునకు మహాపుణ్యకరమైన సనాతన ధర్మము ప్రాప్తించును. ప్రఖ్యాతమైన కురువంశమును కీర్తించిన వాని వంశము లోకములో విస్తరించి, పూజ్యతమ మగును. పవిత్రభారతమును సంవత్సరములో నాలుగు నెలలు నియమవ్రతనిష్ఠతో పఠించిన బ్రాహ్మణుడు సర్వపాప విముక్తుడగును. అతనికి వేదవిజ్ఞాన పాండిత్యము గలుగును.

రాజా ! ఈ మహాభారతమునందు, దేవతలు-రాజర్షులు - బ్రహ్మర్షులు - భగవంతుడైన కేశవుడు వీరందరు కీర్తింపబడుదురు. మహాభారతము నందు అనేక జన్మము లెత్తిన కుమారస్వామి జననము, గో-బ్రాహ్మణుల మాహాత్మ్యమున్ను కీర్తింప బడినవి.

జనమేజయా ! మహాభారతము సమస్త వేదసమూహస్వరూపము, కనుక బుద్ధిమంతులు దీనిని వినవలెను. పర్వదినములందు బ్రాహ్మణులకు మహాభారతము వినిపించిన వాని పాపములు నశించి యతడు స్వర్గమును జయించి, శాశ్వత బ్రహ్మలోకము చేర గలడు.

రాజా!మహాభారతము వినిన రాజు సమస్త భూమండల రాజ్యమును పొంద గలడు. గర్భిణిస్త్రీ పుత్రుని గని, ఆ తరువాత త్వరలోనే కన్యకను కనును. వర్తకులు వాణిజ్యయాత్రలో సిద్ధి పొందెదరు. వీరులు విజయము సాధించెదరు. మహాభారతమును వేదవిద్వాంసులు - ఆస్తికులు - అసూయారహితులునైన బ్రాహ్మణులకు జయశీలురైన క్షత్రియులకు, స్వధర్మనిరతులైన వైశ్యులకు వినిపించవలెను.

రాజా ! విశేషించి బ్రాహ్మణుని నుండి ఈ భారతము వినుట సమస్త పురాతన ధర్మములలో నుత్తమమని చెప్పబడెను. సర్వదా దీనిని చదివినవాడు పరమగతి చెందగలడు ఒక శ్లోకము, శ్లోకార్ధము, శ్లోకపాదము గాని, నిత్యము పఠించవలెను. కాని, మహాభారత పఠనము చేయక యుండగూడదు.

రాజా! మహాభారతములో మహాత్ములైన అనేక వంశ రాజర్షుల జన్మ వృత్తాంతములు, మహామంత్రములు అనేక విధధర్మములు, రాజుల విచిత్ర యుద్ధములు వారి యభివృద్ధి ఋషుల కథలు, గంధర్వ - రాక్షసుల కథలు వివరింపబడినవి.

రాజా! మహాభారతమునందు అనేక పుణ్య తీర్థములు-దేశములు-వన-పర్వత-నదులు-సముద్రము-పట్టణములు ఈ మొదలైనవాని పేర్లు కీర్తింపబడినవి. దీనియందు వేదవ్యాస మహాముని 'మానవాతీత పరాక్రమము, సత్కార యోగము, రథాశ్వ గజముల కల్పనము, యుద్ధ కౌశలము అనేక వాక్య వివరణములు' మొదలైనవి వివరించెను.

జనమేజయా! శ్రాద్ధకాలమునందు ఒక శ్లోకపాదమైనను బ్రాహ్మణులకు వినిపించిన యెడల పితరులకు అక్షయఫలము కలుగును. ఒకనాడు ఇంద్రియముల చేతను, మనస్సుచేతను, తెలిసికాని, తెలియకకాని నరుడు చేసిన పాపము మహాభారతాఖ్యాన శ్రవణముచేత నశించును.

రాజా! కృష్ణద్వైపాయన మహాముని మూడు సంవత్సరములు ప్రతి దినము శుచియై తపోనియమ నిష్ఠుడై మహాభారతము రచియించెను. కనుక దీనిని నియమ - నిష్ఠలతో వినవలెను.

రాజా! వ్యాసప్రోక్తమైన పవిత్ర భారతమును వినిపించిన బ్రాహ్మణులు వినిన మానవులున్ను క్షేమముగానుండి కృతాకృతముల (చేసిన - చేయని కార్యములు) చేత శోకింపరు. ధర్మకాంక్ష కలవారందరు మహాభారతమును సమగ్రముగా వినినయెడల కార్యసిద్ధి పొందెదరు. ఈ మహా పవిత్రేతిహాసము వినుట వలన పొందినంత సంతుష్టి మానవుడు స్వర్గగమనము వలన గూడ పొందడు. మహాభారతమును శ్రద్ధాళు వినిన-వినిపించిన పుణ్యాత్ముడు రాజసూయాశ్వమేధయాగానుష్ఠాన ఫలము పొందగలడు.

రాజా! మేరు పర్వతము - సముద్రము ఈ రెండున్ను రత్న నిధులని ప్రసిద్ధములైనట్లే మహాభారతముగూడ రత్నములకు (ఉత్తమ విషయములకు) నిధి యని ప్రఖ్యాతిగాంచినది. ఇది వేద సమానము - పవిత్రము - ఉత్తమము - శ్రవణ యోగ్యము - కర్ణానందకరము - సత్స్వభావవర్ధకము నైనది.

రాజా! మహాభారత పాఠకునకు ఈ గ్రంథము దానము చేసినవాడు సముద్ర పర్యంత సమస్త భూమండలము దానము చేసినంత ఫలము పొందును. పారీక్షితా! నీవు పుణ్యాత్ముడవు. జయశీలుడవు. అట్టి నీకు నేను చెప్పెడు ఈ దివ్యకథ నంతయు వినుము. దీనిచేత నీకు హర్షము గలుగును.

జనమేజయా! ఈ మహాభారతము ధర్మ - అర్థ - కామ - మోక్ష ప్రదము. ఈ గ్రంథములో వర్ణింపబడినదే యితర గ్రంథములలో కలదు. ఇందులో లేనిది ఇతరత్ర ఎక్కడగూడ లేదు. ఇంతటి అద్భుత గ్రంథమిది. దీని సంగ్రహశ్లోక మిట్లున్నది :

"ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ।
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్॥"

ఇట్లు చెప్పి, వైశంపాయనుడు తరువాతి భారతకథ జనమేజయునకు ఇట్లు చెప్ప దొడగెను.

**ఉపరిచర మహారాజు చరిత్ర - సత్యవతీ - వ్యాసాదుల సంగ్రహజన్మ కథ :**

జనమేజయా! పూర్వము 'ఉపరిచరు' డను పేరుగల రాజు ఉండెను. అతడు నిరంతరము ధర్మాచరణమునందే నిమగ్నుడై యుండెను. అతడు వేటాడుటకు వనమునకు పోవుచుండెను. పౌరవనందనుడైన ఉపరిచరవసువు ఇంద్రుని కోరికపై రమణీయ మగుచేది దేశ రాజ్యమును స్వీకరించెను.

ఒక సమయమందు వసురాజు అస్త్ర - శస్త్రములు త్యజించి ఆశ్రమము నందు నివసించుచు తపస్సు చేసెను. అతడు మహాతపోనిధి యని ప్రసిద్ధుడాయెను. అప్పుడు ఇంద్రాది దేవతలు 'ఈ రాజు తపస్సుచేత ఇంద్ర పదవి పొందదలచు చున్నాడని తలచి ఆ రాజుకడకు పోయిరి. దేవతలు అతనికడకు పోయి శాంతముగా వివరించి చెప్పి యతనిని తపస్సు నుండి విరమింపజేసి యిట్లనిరి :

"రాజా! భూమండలమునందు వర్ణసాంకర్యము కలుగ కుండునట్లు నీవు ప్రయత్నించవలెను. నీవు లేకున్నయెడల దేశములో అరాజకత్వము కలుగును.

దానిచేత ప్రజలు స్వధర్మమునందు స్థిరముగా నుండ జాలరు. కనుక నీవు తపస్సు చేయక భూమిని రక్షించవలెను. రాజా! నీవు రక్షించిన ధర్మమే జగత్తును ధరించు చున్నది."

తరువాత ఇంద్రు డతనితో నిట్లనెను :-

"రాజా! నీవు ఈ లోకమునందు సర్వదా ధర్మరక్షణము చేయు చుండుము. ధర్మపరుడవై యుండుటచేత నీవు సనాతన పుణ్యలోకములను పొందగలవు. నేను స్వర్గమునందు, నీవు భూలోకమునందు ఉన్నప్పటికిన్ని, నేటినుంటి నీవు నాకు ప్రియమిత్రుడ వైతివి. రాజా! ఈ భూమండలమందు అన్నింటికంటే సుందరము, రమణీయమునైన దేశమునందే నీవు నివసింపుము."

"రాజా! యిప్పుడు చేదిదేశము పశువులకు హితకరము, పుణ్యజనకము, పుష్కల ధన - ధాన్యసంపన్నము, స్వర్గతుల్య సుఖప్రదము నగుటచేత ఆ దేశమునందలి భోగ్యపదార్థములచేత ఉత్తమములైన భూగుణములచేతను సమృద్ధమై యున్నది. అది ధన - కనక - రత్నరాశి సంపన్నము. సమస్త పదార్థములు అక్కడ సులభ్యములు. అక్కడి 'వసుధ' (భూమి) వాస్తవముగా వసువు (ధనసంపత్తి) చేత పరిపూర్ణమై యున్నది."

"రాజా! కాబట్టి నీవు చేదిదేశ పాలకుడవై యచటనే నివసింపుము. ఆ దేశము ధర్మశీలము - సంతోషయుక్తము - సాధుజనసమృద్ధమునై యున్నది. అక్కడ పరిహాసమునకు గూడ అసత్య మాడరు. పుత్రులు సర్వదా గురుజన హితమునందు నిమగ్నులై యుండెదరు. తండ్రులు బ్రతికియుండగా పుత్రులలో విభక్తులు కారు. అక్కడివారు ఎద్దులచేత బరువు మోయించరు. దీనులను, అనాథులను పోషించు చుండెదరు. రాజా! చేదిదేశమందు నాలుగు వర్ణముల ప్రజలు తమతమ ధర్మములను సర్వదా అనుష్ఠించు చుండెదరు. మూడులోకములలో కలుగు సంఘటనములు భూలోకమునందున్న నీకు తెలియకుండ నుండవు. నీవు సర్వజ్ఞుడవై యుండెదవు."

"రాజా! దేవతలకు ఉపభోగయోగ్యమైన స్ఫటిక మణి నిర్మిత దివ్య విమానము నీకు బహుమానముగా నిచ్చుచున్నాను. ఆ విశాల విమానము ఆకాశ

సంచారియై నీ సేవకొరకు సర్వదా సంసిద్ధముగా నుండును. మనుష్యులందరిలో నీ వొకడవే ఈ యుత్తమ విమానములో కూర్చొని మూర్తీభవించిన దేవతవలె అందరిపైన సంచరించ గలవు''.

"రాజా! నేను నీ కిచ్చు ఈ 'వైజయంతీ'మాల 'ఇంద్రమాల' నామముతో ప్రఖ్యాతమై ప్రపంచమునందు ఇది నిన్ను గుర్తింప జేయును. అమ్లాన కమలముల చేత కూర్చబడిన యీ మాల ధరించి యుద్ధము చేయుచున్నప్పుడు నిన్ను అస్త్రశస్త్రాఘాతముల నుండి యిది కాపాడ గలదు."

"జనమేజయా! యిట్లు చెప్పి యింద్రుడు ఉపరిచరవసు మహారాజునకు ప్రేమోపహారముగా నొక వెదురు దండము నిచ్చెను. ఆ యష్టి శిష్టులను రక్షించు నదిగా నుండెను. ఒక సంవత్సరము గడచిన తరువాత ఉపరిచరుడు ఇంద్ర పూజకొరకు ఆ వేణుదండమును భూమిలో నాటెను. ఆనాటినుండి యిప్పటిదాక రాజులు ఇంద్రోత్సవములో ఈ దండమును భూమిలో నాటు సంప్రదాయము పాటించు చున్నారు. దీనిని వసుమహారాజు ప్రవర్తిల్ల జేసెను. ఇంద్రోత్సవపు మరునాడు అనగా, నూతన సంవత్సర ప్రథమ దినమైన ప్రతిపదనాడు ఆ వేణుదండము అక్కడినుండి తీసి చాల యెత్తైన స్థానమునందు ఉంచబడును. తరువాత అది బట్టపెట్టెలో గంధ-మాల్య-భూషణములచేత అలంకరించి యుంచబడును. ఆ దండమునకు విధిపూర్వకముగా పుష్పమాలలు దారములు చుట్టబడి యుండును. తరువాత ఆ దండము పైననే ఇంద్రుని హంసరూపములో పూజించెదరు."

"జనమేజయా! ఇంద్రుడు ఉపరిచరవసువుపై ప్రేమచేత స్వయముగా హంసరూపము ధరించి అక్కడ తన పూజను గ్రహించెను. వసువు చేయు పూజకు మిక్కిలి ప్రసన్నుడై యింద్రు డిట్లనెను :-

"చేది దేశరాజు - ఉపరిచరవసువు ఏ విధముగా నా పూజ చేయునో, ఆ విధముగనే, యే మనుష్యుడు గాని, రాజు గాని నాపూజ చేసి, నాయుత్సవము చేసిన యెడల, అతనికి,అతని రాష్ట్ర మంతటికిన్ని లక్ష్మి, విజయము కలుగును. అతని దేశ మంతయు ఉత్తరోత్తరాభివృద్ధి నొంది ప్రసన్నముగా నుండును."

"జనమేజయా ! యిట్లు దేవేంద్రుడు ఉపరిచరవసు మహారాజును సత్కరించెను. భూమిని రత్నాదులను దానము చేయుచు 'ఇంద్రోత్సవము' చేయు

మనుష్యుడు ఆ యుత్సవము ద్వారా యింద్రుని నుండి వరములు పడసి, భూదానాదుల వలన గలుగు పుణ్యములు సంపాదించినవారు పొందునుత్తమ గతిని పొందగలరు. ఈ విధముగా నింద్రునిచేత సమ్మానితుడైన చేదిరాజు చేదిదేశమందే నివసించుచు భూమండలమును ధర్మపూర్వకముగా పరిపాలించెను. ఇంద్రుని ప్రసన్నుని చేయుటకు ఉపరిచరవసువు ప్రతి సంవత్సరము ఇంద్రోత్సవము చేయు చుండెను."

"జనమేజయా! ఉపరిచరవసువునకు మహాబల - పరాక్రమసంపన్నులైన యైదుగురు పుత్రులుండిరి. వసుచక్రవర్తి యైదుగురు పుత్రులను ఐదు రాజ్యము లందు అభిషిక్తులను జేసెను. వారిలో మహారథికుడైన 'బృహద్రథుడు' మగధ దేశమునకు రాజయ్యెను. రెండవ కొడుకు, 'ప్రత్యగ్రహుడు' మూడవవాడు 'కుశాంబుడు' (అతనికి 'మణివాహనుడు' అని కూడ మరియొక పేరు గలదు.) నాలుగవ కొడుకు 'మావెల్లుడు' ఐదవ రాజకుమారుడు, 'యదు' నామముతో ప్రఖ్యాతుడయ్యెను. అతడు యుద్ధమునందు ఎవరి చేతగూడ పరాజితుడు గాకుండెను."

"జనమేజయా ! వసురాజు పుత్రులైదుగురున్ను తమ తమ పేర్లతో దేశములను నగరములనున్ను ఏర్పరచిరి. ఐదుగురున్ను వేర్వేరు దేశములకు రాజులుగా నుండిరి. వారు తమ సనాతన వంశపరంపరమ వేర్వేరుగా ప్రవర్తింపజేసిరి. ఉపరిచరవసుమహారాజు ఇంద్రుడిచ్చిన స్ఫటిక విమానములో నాకాశమునందే నివసించు చుండెను. ఎల్లప్పుడున్ను నతడు ఉపరిలోకములందే సంచరించుటచేత నతడు ఉపరిచర నామముతో ప్రఖ్యాతుడయ్యెను.

"జనమేజయా! ఉపరిచరవసువు యొక్క చేదిరాజధానీ నగర సమీపమందు 'శుక్తిమతి' యను పేరు గల నది ప్రవహించుచుండెను. ఒకప్పుడు 'కోలాహల' నామము గల సచేతన పర్వతము కామవశమై, దివ్యరూపధారిణియైన శుక్తిమతీ నదిని ఆపెను. దానిచేత ఆ నదీ ప్రవాహము ఆగిపోయెను. అది చూచి ఉపరిచరవసువు కోలాహల పర్వతమును తన్నెను ఆ దెబ్బచేత పర్వతమునందు ఏర్పడిన వివరమునుండి శుక్తిమతీ నది వెడలి పూర్వమువలె ప్రవహింప జొచ్చెను.

"జనమేజయా! కోలాహల పర్వతము ఆ నదీ గర్భము నుండి ఒక పుత్రుని, ఒక పుత్రికను కవలలుగా కనెను. పర్వతావరోధమునుండి తనకు విముక్తి కలిగించినందుకు ఆ నది ఉపరిచరవసు రాజునకు తన యిరువురు పిల్లలను కానుకగా సమర్పించెను. ఆ కుమారుని ఆ రాజు తన సేనాపతిగా నియమించెను. అతని పేరు 'వసుప్రదుడు'. ఆ కన్యకను తాను పెండ్లియాడెను. ఆ కన్యక పేరు గిరిక!"*

"జనమేజయా! ఒకనాడు ఋతుకాలమందు స్నానము చేసి పరిశుద్ధురాలైన వసురాజు పత్ని గిరిక పుత్రోత్పత్తి యోగ్య సమయమందు రాజుతో సమాగము చేయగోరెను. ఆనాడే ఆ రాజు యొక్క పితరులు 'నీవు క్రూరమృగ సంహారము చేయుము' అని యాజ్ఞ యిచ్చిరి. అప్పుడు ఉపరిచరవసువు పితరుల యాజ్ఞను ఉల్లంఘించజాలక కామవశుడై సాక్షాత్తు లక్ష్మివలె అత్యంత రూప - సౌందర్య వైభవ సంపన్నురాలైన గిరికను తలచుచు క్రూరమృగ సంహారముకొరకు వనమునకు పోయెను".

"జనమేజయా! ఆ వనము దేవతల 'చైత్రరథము'వలె శోభిల్లు చుండెను. (కుబేరుని యుద్యానమునకు చైత్రరథ మని పేరు). అది వసంత సమయము.

'అశోక-కర్ణికార (గన్నేరు) - చంపక (సంపంగి) - చూత (మామిడి)- అతి ముక్తక (మాధవీలతా) పున్నాగ (నాగకేసర) - వకుళ (పొగడ) - దివ్యపాటల (దేవలోకపు కలిగొట్టు) - పాటల (కలిగొట్టు) - నారికేళ-చందన- అర్జున (కడిమి)' వృక్షములు ఆవనమందు. స్వాదుఫల-సుగంధి పుష్పభరితములై రమణీయములుగా, పవిత్రములుగాను ఆవనశోభను పెంపొందించు చుండెను. కోకిల లయ వ్యక్త మధురకూజితములు వినపడు చుండెను. నలువైపుల మత్తభ్రమరములు కలకలనాదములు చేయుచుండెను."

"జనమేజయా! ఈ ఉద్దీపన సామగ్రిచేత రాజుమనస్సు కామబాధ పీడితమై విరాళి చెందెను. అప్పుడు ఆరాజునకు తనరాణి గిరిక కనపడ కుండుటచేత

* ఈ కథను ఆధారముగా చేసికొనియే రామరాజ భూషణుడు 'వసు చరిత్రము' అను ఆంధ్ర ప్రబంధము రచియించెను.

కామాగ్నిసంతప్తుడై యతడు ఇచ్ఛ వచ్చినట్లెల్ల వనములో తిరుగుచు రమణీయ మైన యొక యశోకవృక్షము చూచెను. అశోకవృక్షము పల్లవశోభితమై పుష్పా చ్ఛాదితమై యుండెను. మకరంద సౌరభభరితమైన ఆవృక్షచ్ఛాయలో నారాజు సుఖముగా కూర్చొని యుండెను పుష్పపరిమళ మతనిమనస్సును మోహింప జేయుచుండెను."

"జనమేజయా! కామోద్దీపకవాయు ప్రేరితమైన మనస్సులో స్త్రీరతివిష యక ప్రీతితో నతడు ఆవనమునందు సంచరించుచుండగా నతని వీర్యము స్ఖలిత మయ్యెను. వెంటనే ఉపరిచరుడు దాని నొక యాకులో తీసికొని, ఈ వీర్యము వ్యర్థము కా గూడదు. నాభార్య గిరిక ఋతుకాలము గూడ వ్యర్థము కాకూడద'ని యోచించి, ఆవీర్యము అమోఘము చేయనిశ్చయించెను."

"జనమేజయా! తరువాత ఉపరిచర వసువు తనవీర్యము రాణికడకు పంపు టకు వేచియుండి ఆవీర్యమును పుత్రోత్పత్తికారక మంత్రములచేత అభిమంత్రిం చెను. వసుమహారాజు ధర్మార్థముల సూక్ష్మతత్త్వముల నెరిగి యుండెను. కాబట్టి తన విమానముకడనే కూర్చొని యున్న శీఘ్రగామియైన డేగ పక్షికడకు పోయి 'సౌమ్యా! నీవు నాకు ప్రియము చేయుటకు ఈ వీర్యమును నాయింటికి కొనిపోయి, నారాణి గిరికకు శీఘ్రముగా నిమ్ము ఎందుకనగా, నేడే ఆమె ఋతుకాలము' అని చెప్పగనే డేగ ఆ వీర్యముతో అతివేగముగ అక్కడినుండి యెగిరిపోయెను."

"జనమేజయా! ఇట్లాడేగ పోవుచుండగా మరియొకడేగ దానిని చూచి అది మాంసపుముక్క కరచుకొని పోవుచున్నదని తలచి దానిపై బడెను. అప్పుడా రెండుశ్యేన పక్షులు ఒండొంటిని ముక్కులతో పొడుచుకొనుచు యుద్ధము చేయు చుండగా, ఆవీర్యము డేగ పాదమునుండి జారి యమునానదీ జలములోపడెను."

"జనమేజయా! 'అద్రిక' యను నప్సరఃస్త్రీ బ్రహ్మశాపముచేత మత్స్యమై ఆ యమునానదీ జలమందే యుండెను. ఆ చేప అప్పుడా వీర్యమును మ్రింగెను. రాజా! తరువాత పదవమాసమందు మత్స్యజీవులైన జాలరివారు మత్స్యరూపధారిణి యైన అద్రికను వలలో బంధించి తెచ్చి దానికడుపు చీల్చగా దానినుండి స్త్రీ-పురుష శిశువులు రెండు బయలువెడలెను. ఆశ్చర్యకరమైన యీ సంఘటనము చూచి జాలరివారు ఆ శిశువులను ఉపరిచరవసు మహారాజునకు సమర్పించిరి.

అప్పుడా రాజు పురుషశిశువును తాను తీసికొనెను. ఆ బాలకుడే ధర్మాత్ముడు సత్యప్రతిజ్ఞుడునైన 'మత్స్యరాజు' అని ప్రసిద్ధుడయ్యెను."

"జనమేజయా! 'అద్రిక' శాపవిముక్తురాలయ్యెను. బ్రహ్మదేవుడు పూర్వమే ఆ యప్సరసతో 'తిర్యగ్యోనిలో పడియున్న నీవు రెండు మానవ సంతానములను కని శాపవిముక్తురాలవయ్యెదవు' అని చెప్పియుండెను. కనుక చేపలవాడు ఆ చేపను కోసినప్పుడు ఆయప్సరస ఇద్దరుమనుష్య బాలకులను కని మత్స్యరూపము విడిచి దివ్యరూపముతో సిద్ధ-చారణుల మార్గము గుండా స్వర్గమునకు పోయెను."

"జనమేజయా! ఆయిద్దరు కవల పిల్లలలో కన్యక మత్స్య పుత్రిక యగుటచేత దానిశరీరము నుండి చేపలకంపు వచ్చుచుండెను. కాబట్టి ఉపరిచరవసువా కన్యను చేపలవానికిచ్చి 'ఇది నీ కూతురై యుండు'నని చెప్పెను. ఆ కన్యక రూప-సత్త్వ (సత్య)ములు ఇతర సమస్తసద్గుణములున్ను గలదగుటచేత 'సత్యవతి' యను పేరుతో ప్రసిద్ధురాలాయెను. చేపలవారి యాశ్రమములో నుండుటచేత ఆ కన్యక కొంతకాలమువరకు 'మత్స్యగంధ[1] యను పేరుతో ప్రఖ్యాతురాలుగా నుండెను. ఆమె తండ్రియాజ్ఞచేత పితృసేవార్థమై యమునానదియందు నావ నడుపుచుండెను."

"జనమేజయా! ఇట్లుండగా నొకనాడు తీర్థయాత్రకొరకు దేశమంతట తిరుగు 'పరాశరమహర్షి' 'మత్స్యగంధ'ను చూచెను. ఆమె అతిశయ రూప-సౌందర్యశోభితురాలై యుండుటచేత సిద్ధులుగూడ ఆమెను పొందుటకు అభిలషించుచుండిరి. ఆ కన్యకసన్ను మిక్కిలి మోహజనకముగా నుండెను. ఆమె తొడలు కదళీ స్తంభములవలె శోభిల్లు చుండెను. ఆ దివ్యసుకుమారిని చూచి పరాశరమహాముని యామెతో సమాగమము చేయ గోరుచు నామెతో, 'కల్యాణీ! నాతో సంగమము చేయుము' అని యనగా నామె, భగవాన్! ఈ నదికి ఇరువైపుల అనేక ఋషులు నిలిచి యున్నారు. వారు మన నిరువురను చూచుచున్నారు. ఇట్టి పరిస్థితిలో మన సమాగమమెట్లు సంభవించును?' అని యనగా నవ్వుతూ పరాశరుడు వెంటనే మంచు సృష్టించెను. దానిచే ఆ ప్రదేశమంతయు

అంధకారము కప్పినట్లయ్యెను. అది చూచి యామె యాశ్చర్యచకితురాలై సిగ్గు చెంది యిట్లనెను.

"భగవన్! నేను నా తండ్రి యధీనములోనున్న కన్యకను నీ సంగమము చేత కన్యాత్వము దూషితమగును. తరువాత ఇంటికి ఎట్లు పోవుదును? నా కన్యకాత్వము కళంకితమైన తరువాత నేను జీవించను. ఈ విషయము బాగుగా యోచించి, యేది సముచితమో ఆ కార్యము చేయుము."

"జనమేజయా! సత్యవతి యిట్లు చెప్పగా పరాశరమహాముని ప్రసన్నుడై యామెతో నా యిష్టము నెరవేర్చినను నీవు కన్యకగానే యుండెదవు. నీవు కోరిన వరమిచ్చెదను. కోరుకొనుము. పూర్వమెప్పుడుగూడ నాయనుగ్రహము వ్యర్థము గాలేదు అని యనెను. పరాశరముని యిట్లనగా, సత్యవతి తన శరీరమునందు సుగంధము కలుగ జేయుమని వరము కోరగా, పరాశరుడా వరము ప్రసాదించెను.

"జనమేజయా! వరము బడసిన తరువాత సత్యవతి ప్రసన్నురాలై స్త్రీసమాగమోచితములైన ఋతుస్నానాలంకారాదులచే భూషితురాలై పరాశర మహర్షితో సమాగము చేసెను. ఆమె శరీరమునుండి సుగంధము వెడలుటచేత ఆమెకు గంధవతియను పేరు ప్రసిద్ధమయ్యెను. ఒక యోజనము (ఆమడ) దూరమునందున్న వారుగూడ ఆమె సుగంధమును ఆఘ్రాణింప గలుగుచుండిరి. కనుక ఆమెకు, 'యోజనగంధ'[2]యను మరియొక పేరుగూడ ప్రసిద్ధమాయెను.

1, 2 'గంధస్యేదుత్పూతిసుసురభిభ్యః' అను వ్యాకరణ సూత్రము ప్రకారము 'ఉత్ - పూతి - సు - సురభి' అనునీ నాలుగు పూర్వ పదములుగా నున్నప్పుడే గంధశబ్దాంత బహువ్రీహి సమాసమునకు సమాసాంతమునందు 'ఇ' కారము ఆదేశముగా వచ్చును కనుక 'మత్స్యగంధ - యోజనగంధ' అను వ్యాసప్రయోగము సరియైనది. 'మత్స్యగంధి-యోజనగంధి' యను నన్నయ ప్రయోగములు పాణినీయవ్యాకరణ విరుద్ధములు. పై సూత్రముచేత నాలుగు పదములు దప్ప ఇతరపదములు ఉపపదములుగా నున్నప్పుడు 'ఇ' కారము అంతాదేశము విధింప బడలేదు.

"జనమేజయా! యిట్లు సత్యవతి వరము పొంది హర్షోల్లాసభరితురాలై పరాశర మహర్షితో సంయోగము చేసి, సద్యోగర్భముచేత ఒక శిశువును కనెను. ఆ యమునా ద్వీపమునందు మహాశక్తిసంపన్నుడైన పరాశరనందనుడు వ్యాసుడు అవతరించెను. అప్పుడు వ్యాసుడు తల్లితో, 'అమ్మా అవసరమున్నప్పుడు నన్ను స్మరింపుము. తప్పక వచ్చెదను' అని చెప్పి, తల్లియాజ్ఞ గొని తపస్సు చేయుటకు పోయెను."

"జనమేజయా! యీ విధముగా పరాశరముని సత్యవతి గర్భమునుండి ద్వైపాయనవ్యాసుని కనెను. అతడు బాల్యావస్థలోనే యమునాద్వీపమునందు విడవబడెను కనుక, నతడు 'ద్వైపాయను'డనుపేర ప్రసిద్ధుడాయెను. తరువాత సత్యవతి సంతోషముతో తన యింటికి పోయెను. ఆ నాటినుండి అందరు ఆమె దివ్యగంధమును ఒకయోజనము ఆమడ దూరమునుండియే ఆఘ్రాణించుచుండిరి. ఆమె శరీర సుగంధముచేత ఆమె తండ్రి దాశరాజుగూడ మిక్కిలి ప్రసన్నుడాయెను. అప్పుడు దాశరాజు సత్యవతితో, 'పుత్రీ నీవు మత్స్యగంధవుగా నుంటివిగదా! నీ శరీరమునందీ సుగంధ మెట్లు వచ్చెను?' అని యడుగగా సత్యవతి తండ్రితో నిట్లు చెప్పెను :-

"తండ్రీ! శక్తిమహాముని పుత్రుడైన పరాశరముని నేడు యమునా తీరమునకు వచ్చినప్పుడు నేను నావ నడుపు చుంటిని. ఆ మహాముని నా శరీర దుర్గంధమును పోగొట్టి ఒక యోజన దూరమువరకు వ్యాపించునట్టి యీ సుగంధము నాకు అనుగ్రహించెను. ఆ మహర్షి యొక్క యీ కృపాప్రసాదము చూచి అందరు ప్రసన్నులైరి."

"జనమేజయా! విద్వాంసుడైన ద్వైపాయనుడు ప్రతి యుగమునందు ఒక్కొక్కపాదము చొప్పున ధర్మము లోపించుచు, మనుష్యుల యాయుస్సు-శక్తి క్షీణించుచు ఈ యుగమునకు ఈ దురవస్థ ప్రాప్తించుట చూచి, విని, వేదములను బ్రాహ్మణులను అనుగ్రహింపదలచి, వేదముల వ్యాసము విస్తారము చేసెను. కాబట్టి యతనికి 'వ్యాసుడు' అనుపేరు వచ్చెను.

వ్యాసభగవానుడు నాలుగు వేదములను, పంచమ వేదమైన మహాభారతమును 'సుమంతు-జైమిని-పైల-శుకదేవు'లకు వైశంపాయనుడనైన నాకున్ను

నేర్పెను. శుకుడు వ్యాసపుత్రుడు. తరువాత వారందరు వేర్వేరుగా మహాభారత సంహితను ప్రపంచములో ప్రకాశింపజేసిరి".

"జనమేజయా! శాంతనుమహారాజునకు భీష్ముడు ఎనిమిదవ వసువు యొక్క అంశముచేత గంగాదేవి గర్భమునుండి పుట్టెను. అతడు మహా కీర్తి-పరాక్రమ సంపన్నుడు".

"జనమేజయా! పూర్వము వేదార్థజ్ఞుడు పురాతనుడునైన 'అణీ మాండవ్య' మహాముని దొంగ గాకున్నను దొంగ యను సందేహము చేత శూలారోహణము చేయబడెను. అతడు పరలోకమునకు పోయినప్పుడు తొలుత యమధర్మరాజుతో నిట్లనెను:

"యమరాజా! పూర్వము నేనొకప్పుడు బాల్యావస్థలో ఒక పక్షి పిల్లను ముల్లు గ్రుచ్చి యుంటిని. ఆ పాప మొక్కటియే నాకు జ్ఞప్తియందున్నది. మరి యేపాపముగూడ నేను చేసి యెరుగను. నేను వేయిరెట్లు అగణిత తపస్సు చేసితిని. ఆ నా తపస్సు నేను బాల్యములో చేసిన చిన్న పాపము నెందుకు నష్టము చేయజాలదు? బ్రాహ్మణ వధ సమస్త ప్రాణి హత్యకంటే పెద్దదిగదా! నీవు నన్ను శూలము నెక్కించి బ్రాహ్మణవధ పాపము చేసితివి. కనుక నీవు మహా పాపిష్ఠుడవు. నీవు భూమండలమునందు శూద్రయోనిలో జన్మింపుము".

"జనమేజయా! అణీమాండవ్యుడు యమధర్మరాజున కిచ్చిన ఆ శాప ప్రభావముచేత యముడు విదురుని రూపములో నవతరించెను. ఆ సమయమందే 'గవల్గణుడు' అను సూతుని (సారథి జాతివాడు) నుండి సంజయుడు పుట్టెను. సంజయుడు మునులవలె జ్ఞానియై ధర్మాత్ముడునై యుండెను."

"జనమేజయా! కుంతి భోజరాజు కూతురైన కుంతీదేవి గర్భము నుండి సూర్యయంశములో కర్ణుడు పుట్టెను. అతనికి జన్మము నుండియే సహజ కవచ-కుండలములు శరీరముతోనే పుట్టి యుండెను. వానితో నతడు ప్రకాశించు నుండెను."

"జనమేజయా! ఆ సమయమందే విశ్వవందితుడైన విష్ణుభగవానుడు లోకానుగ్రహార్థము దేవకీ-వసుదేవులకు పుట్టెను. ఆ భగవంతుడు ఆద్యంత రహితుడు, సమస్త జగత్కర్త, జగత్ప్రభువు. అతడు అవ్యక్తుడు - అక్షరుడు

(అవినాశి)నైన పరబ్రహ్మ స్వరూపుడు. అతడే త్రిగుణాత్మకమైన ప్రధానమని చెప్పెదరు. ఆ మహానుభావుడే! ఆత్మ - అవ్యయుడు - ప్రకృతి (ఉపాదానము) ప్రభవుడు (ఉత్పత్తి కారణుడు ప్రభువు (అధిష్టాత)- పురుషుడు (అంతర్యామి) విశ్వకర్మ - సత్యగుణము చేత పొంద దగినవాడు - ప్రణవాక్షరము (ఓంకారము) గూడ నతడే. ఆ దేవుడే 'అనంత - అచల - దేవ-హంస - నారాయణ ప్రభు - ధాతృ - అజన్మ - అవ్యక్త - పర - అవ్యయ - కైవల్య - నిర్గుణ-విశ్వరూప - అనాది - జన్మరహిత - అవికారి స్వరూపుడని చెప్పబడెను. అతడు సర్వవ్యాపి - పరమ పురుషుడు - పరమాత్ముడు - సర్వమునకు కర్త- సమస్తప్రాణి పితామహుడని యెరుగుము."

"జనమేజయా! ఆ మహానుభావుడే ప్రపంచమునందు ధర్మము వృద్ధి నొందించుటకు అంధక - వృష్ణికులమందు బలరామ-శ్రీకృష్ణరూపములో నవతరించెను. ఆ యిరువురు అన్నదమ్ములు సమస్త శస్త్రాస్త్రజ్ఞులు మహా పరాక్రమశాలురు. సమస్త శాస్త్రజ్ఞానమునందు ప్రవీణులుగా నుండిరి. సత్యకునినుండి సాత్యకి, హృదికునినుండి కృతకర్మయు పుట్టిరి ఆ యిరువురు అస్త్రవిద్యా నిపుణులు. శ్రీకృష్ణభగవానునకు అనుగాములుగా నుండిరి.

"జనమేజయా! ఒకప్పుడు భరద్వాజ మహాముని వీర్యము ఒక ద్రోణ పర్వత గుహలో స్ఖలితమై మెల్లమెల్లగా పరిపుష్ట మగుచు వచ్చెను. దాని నుండియే ద్రోణాచార్యుడు పుట్టెను. గౌతమ గోత్రీయుడైన 'శరద్వంతుని' వీర్యము రెల్లు గడ్డిలోపడి అది రెండుగా చీలి ఒక బాలకుడు ఒక కన్యకయు జన్మించిరి. ఆ కన్యక పేరు 'కృపి' ఆ బాలకుడు 'కృపుడు' అను పేరుతో ప్రఖ్యాతుడయ్యెను. తరువాత ద్రోణాచార్యుడు కృపిని పెండ్లియాడి 'అశ్వత్థామ'ను కనెను. ఇట్లే యజ్ఞకర్మానుష్ఠాన సమయమందు అగ్ని సమాన తేజశ్శాలియైన ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యుని వినాశార్థమై ధనుస్సుతోపాటు అగ్నికుండమునుండి పుట్టెను. ఆ యజ్ఞవేది నుండియే శుభాంగి ద్రౌపది జన్మించెను. ఆమె అత్యంతరూప - సౌందర్యములు గల శరీరముతో శోభిల్లుచుండెను."

"జనమేజయా! ప్రహ్లాదపుత్రుడైన 'అగ్నిజిత్తు' సుబలరాజుగా పుట్టెను. దేవతల కోపముచేత అతని కుమారుడు - శకుని ధర్మనాశకరుడయ్యెను. శకునికి 'సౌబలుడు' అని మరియొక పేరు ఉండెను. సుబలుని పుత్రి గాంధారి.

ఆమె దుర్యోధనుని తల్లి శకుని - గాంధారీ దేవులు అర్థశాస్త్ర జ్ఞానము గలవారై యుండిరి."

"జనమేజయా! శ్రీకృష్ణద్వైపాయన మహాముని నుండి విచిత్ర వీర్యుని భార్యలైన 'అంబికా - అంబాలికా' అనువారి గర్భమందు ధృతరాష్ట్ర - పాండు రాజులు జన్మించిరి. వ్యాసుని నుండియే విదురుడు శూద్రస్త్రీ గర్భమునందు పుట్టెను. విదురుడు ధర్మార్థజ్ఞాన నిపుణుడు, మేధావి పాపరహితుడుగా నుండెను. పాండురాజునకు ఇద్దరు భార్యలనుండి వేర్వేరుగా అయిదుగురు పుత్రులు గలిగిరి. వారందరు దేవసములు. వారిలో జ్యేష్ఠుడు యుధిష్ఠిరుడు. అతడు పరమోత్తమ గుణ - ధర్మసంపన్నుడు. యమరాజునకు యుధిష్ఠిరుడు, వాయుదేవునకు భీముడు, ఇంద్రునకు అర్జునుడు, అశ్వినీకుమారులకు నకుల - సహదేవులున్ను కవలగా పుట్టిరి. ఆ యిరువురు గురుజనసేవాతత్పరులై యుండిరి."

"జనమేజయా! ధృతరాష్ట్రునకు గాంధారియందు దుర్యోధనాదులు నూరుగురు పుత్రులు పుట్టిరి. ఆ నూరుగురు కాక, ధృతరాష్ట్రునకు 'యయుత్సుడు' నూటయొక పుత్రుడుగా పుట్టెను. అతడు వైశ్యజాతి స్త్రీకి ధృతరాష్ట్రునివలన గలిగెను. అట్టి పుత్రుడు 'కరణ'* జాతివా డనబడును. ధృతరాష్ట్ర పుత్రులలో 'దుర్యోధన-దుశ్శాసన-దుస్సహ-దుర్మర్షణ-వికర్ణ-చిత్రసేన - వివింశతి-జయ - సత్యవ్రత-పురుమిత్ర-యుయుత్సు-నామకులు పదకొండుగురు మహారథులు".

"జనమేజయా! అర్జునునకు సుభద్రా గర్భము నుండి అభిమన్యుడు, యుధిష్ఠిరునకు ప్రతివింధ్యుడు, భీమునకు సుతసోముడు, అర్జునునకు శ్రుతకీర్తి, నకులునకు శతానీకుడు, సహదేవునకు శ్రుతసేనుడున్ను ద్రౌపదినుండి పుట్టిరి. భీమసేనునకు హిడింబనుండి ఘటోత్కచుడు వనమునందు జన్మించెను. ద్రుపదునకు 'శిఖండి' యనునొక కన్యక పుట్టెను. ఆ కన్య భావికాలములో పుత్రుడుగా మారెను. 'స్థూణాకర్ణు' డను యక్షుడు శిఖండిని పురుషుడుగా మార్చెను."

* "వైశ్యాయాం క్షత్రియాత్ జాతః కరణః పరికీర్తితః" - అనగా, (వైశ్య మాతనుండి క్షత్రియ పితకు పుట్టిన పుత్రుడు 'కరణుడు' అని చెప్పబడును.) ఈ ధర్మశాస్త్ర వచనము ననుసరించి యుయుత్సునకు 'కరణ' నామ మేర్పడినది.

"జనమేజయా! కౌరవుల మహా సంగ్రామమునందు యుద్ధము చేయుటకు లక్షలకొలది రాజయోధులు వచ్చి యుండిరి. పదివేల సంవత్సరములు లెక్కపెట్టినను, అసంఖ్యాకులైన ఆ యోధులపేర్లు పూర్తిగా చెప్పుటకు వీలుపడదు. ఇక్కడ కొందరు ముఖ్యులైన రాజులపేర్లు మాత్రమే తెలుపబడెను. వారి చరిత్రలచేత ఈ మహాభారతకథ అతివిస్తృత మాయెను."

ఇట్లు వైశంపాయనుడు చెప్పగా విని జనమేజయుడా మహాముని నిట్లు ప్రశ్నించెను :-

**బ్రాహ్మణులవలన క్షత్రియ వంశోత్పత్తి-అభివృద్ధి-అప్పటి ధార్మిక రాజ్యవర్ణనము - అసురుల జననము అసురభార పీడిత భూదేవి బ్రహ్మను శరణు జొచ్చుట-దేవతలు తమ యంశములతో భూమండలమునందు జన్మించుటకు బ్రహ్మదేవుని యాదేశము :**

"బ్రహ్మన్! ఇంతవరకు నీవు చెప్పినవారు చెప్పనివారు చాలా మంది ఉన్నారు. వారిని గూర్చి సవివరముగ వినగోరు చున్నాను. వారు, వేలకొలది రాజు లున్నారు. వారందరు దేవతుల్యులు. మహా రథికులు. వారు ఈ భూలోకమునందు ఎందుకు జన్మించిరి?" ఆ మాటకు, వైశంపాయను డిట్లనెను :-

"రాజా ! ఇది దేవరహస్యము. బ్రహ్మదేవునకు నమస్కరించి చెప్పుచున్నాను వినుము - పూర్వము జమదగ్ని పుత్రుడైన పరశురాముడు ఇరువదియొక్క పర్యాయములు భూమండల మంతట తిరిగి, క్షత్రియసంహారము చేసి, మహేంద్ర పర్వతమునందు తపస్సు చేసికొను చుండెను."

"రాజా! భార్గవుడు లోకమంతయు క్షత్రియరహితము చేయగా, పుత్రులను గోరు క్షత్రియకాంతలు బ్రాహ్మణులను ఆశ్రయించిరి. నియమవ్రతనిష్ఠ గల బ్రాహ్మణులు ప్రతి ఋతుకాలమునందున్న క్షత్రియస్త్రీలతో కలసి వేలకొలదిగా క్షత్రియ సంతానమును కనిరి. ఆ బ్రాహ్మణులు కామముచేత గాని, ఋతుకాలేతర సమయమందు గాని, క్షత్రియస్త్రీలతో కలియ లేదు."

"రాజా! బ్రాహ్మణుల వలన క్షత్రియస్త్రీలు పరాక్రమవంతులైన పుత్రులను, పుత్రికలను క్షత్రియ వంశాభివృద్ధి కొరకు కనిరి. ఈ విధముగ క్షత్రియ సంతతి ఆ క్షత్రియ విధవలనుండి మరల పెరిగి ధర్మముగా రాజ్యపాలన చేసిరి.

ఇట్లే, తిర్యగ్యోనుల నుండి కూడ అనేక జంతువులు పుట్టి అనేక సంవత్సరములు జీవించెను."

"రాజా! అట్లు పుట్టిన క్షత్రియులు భూమిని పాలించుచుండగా బ్రాహ్మణాది వర్ణములవారు సంతోషముతో నుండిరి. క్షత్రియులు కామక్రోధాదులు విడిచి, ధర్మము ప్రకారము శిష్ట రక్షణ - దుష్టశిక్షణములు చేయుచుండిరి. వారి ధర్మపరిపాలనములో ఇంద్రుడు సకాలములో వర్షములు కురిసెను. ఎవడు గూడ బాలుడుగా మరణించలేదు. యౌవనము రాకుండ ఎవడును స్త్రీతో కలియ లేదు. ప్రజలు దీర్ఘాయుష్మంతులై యుండిరి. క్షత్రియులు అనేక దక్షిణలిచ్చి మహా యజ్ఞములు చేసిరి. బ్రాహ్మణులు సాంగవేదములను చదివిరి. వారు, వేద విక్రయము చేయ కుండిరి. శూద్రుని సమక్షములో వేదోచ్చారణము చేయ కుండిరి."

"రాజా! వైశ్యులు కృషికర్మ చేయుచుండిరి. వారు కృశములైన గోవులను నాగలికి కట్టి దున్నకుండిరి. పాలనురుగు త్రాగుచున్నదూడలు గల గోవులపాలు పిదుక కుండిరి. వైశ్యులు తప్పుడు కొలతలతో విక్రయము చేయ కుండిరి. ధర్మముప్రకారమే మానవులు అన్ని కర్మలు చేయుచుండిరి. అన్ని వర్ణముల వారు తమ తమ కర్మలందు ఆసక్తులై యుండిరి".

"రాజా! ఆక్షత్రియుల పాలనలో ధర్మలోపము లేకుండెను. సకాలము నందు గోవులు, స్త్రీలు సంతతి కనుచుండిరి. ఆ యా ఋతువులందు వృక్షములకు ఫల - పుష్పములు కలుగుచుండెను. అట్టి కృతయుగమునందు సమస్త భూమండలము ప్రాణులచే నిండి యుండెను".

"రాజా! ఇట్లు మనుష్య లోకము ఉత్పన్నము కాగా, రాజుల భార్యలందు అసురులు పుట్టిరి. అప్పుడు దేవతలు యుద్ధమునందు దైత్యులను జయించిరి. అందువలన ఐశ్వర్య భ్రష్టులై వారు స్వర్గమునుండి భూమిలో దేవత్వమును కోరుచు మనుష్యులుగ పుట్టిరి. ఆ యా జంతువులందు అసురులు జనించిరి".

"రాజా! గోవులు, అశ్వములు, గాడిదలు, ఒంటెలు, మహిషములు, గజములు, మృగములు మొదలైన జంతువులందు పుట్టినవారిచేత, పుట్టుచున్న వారిచేతను పెరిగిన భారము భూమి వహించ లేకుండెను. కొందరు రాజులు దర్పితులై దితిపుత్రులుగా, దనుపుత్రులుగాను పుట్టి దైత్యులు, దానవులుగా

పేర్కొనబడిరి. వారు పరాక్రమవంతులుగాను గర్వితులుగాను అనేక రూపములు ధరించి భూలోకమునందంతటను ఉండి ఇక్కడి నాలుగు వర్ణముల వారిని, ఇతర జంతువులను బాధించుచుండిరి. ఆ దుష్టులు వేలకొలదిగ భూమండల మంతట తిరుగుచుండిరి. మహర్షులను బెదరించుచు, బ్రహ్మవాదమును ధిక్కరించుచు మదబలమత్తులై యుండిరి.

"రాజా! ఇట్లు పీడింప బడుచున్న భూదేవి బాధపడుచు బ్రహ్మదేవుని శరణు వేడెను. దేవర్షి-గాంధర్వ - ద్విజులచేత సేవింపబడు చుండెను. అప్పుడు బ్రహ్మదేవునకు నమస్కరించి భూదేవి అందరి సమక్షమునందు తన బాధ తెలిపికొనెను. అంతకు పూర్వమే ఈ విషయము తెలిసియున్న బ్రహ్మదేవుడు భూదేవితో "దేవి! నీవు వచ్చినపని నెరవేర్చుటకు దేవతలను నియోగించెదను." అని చెప్పి భూదేవిని పంపి అక్కడ నున్న దేవతలందరితో మీరు భూభారము పోగొట్టుటకు వేరువేరు అంశములతో భూమియందు జన్మింపుడు. అట్లే గంధర్వాప్సరసలకు గూడ ఈవిధముగనే ఆజ్ఞ యిచ్చుచు బ్రహ్మ, "మీరందరు మీ మీ యంశములతో యథేష్టముగ మనుష్యులయందు జన్మింపుడు" అని చెప్పెను. ఇట్లు బ్రహ్మయాజ్ఞ మేరకు బృహస్పతిమాట విని గంధర్వాప్సరసలు వేర్వేరు అంశములతో భూమండలమునకు పోవుటకు నిశ్చయించుకొనిరి.

తరువాత ఇంద్రుడు శ్రీమన్నారాయణమూర్తి దగ్గరకు పోయి, 1 శంఖ-చక్ర-గదాధరుడైన ఆభగవంతునితో "భగవన్! నీవు గూడ భూమిని చక్కదిద్దుటకు నీ యంశముతో భూమండలమునందు అవతరింపుము!" అని ప్రార్థింపగా, ఆ భగవంతుడు ఇంద్రుని ప్రార్థన నంగీకరించెను."

వైశంపాయనుడు ఇట్లు చెప్పి, తరువాతికథ జనయేజయునకు ఇట్లు చెప్పదొడగెను :-

**అంశావతార పర్వము సమాప్తము**

# సంభవ పర్వము

**మరీచ్యాదుల యొక్క-దక్షకన్యల యొక్కయు వంశముల వర్ణనము:-**

"రాజా! తరువాత ఇంద్రుడు నారాయణమూర్తితో సంప్రదించి దేవతలను భూమియం దవతరించుటకు ఆదేశించెను. తరువాత దేవశత్రు వినాశము కొరకు

సర్వలోకహితము కొరకున్ను దేవతలు స్వర్గమునుండి బ్రహ్మర్షి - రాజర్షి వంశములయందు క్రమముగా నవతరించి లోకమునందు రాక్షసాది దుష్టసంహారము చేసిరి." ఆ మాట విని జనమేజయుడు, 'బ్రహ్మన్! దేవదానవ గంధర్వాదుల యుత్పత్తిని గూర్చి చెప్పుము' అని అడుగగా వైశంపాయనుడు ఇట్లనెను:

"జనమేజయ మహారాజా! బ్రహ్మమానసపుత్రులైన మహర్షులు 'మరీచి - అత్రి - అంగిరస్ - పులస్త్య - పులహ - క్రతు' నామములు గలవారు ఆరుగురు ఉండిరి. మరీచిపుత్రుడు కశ్యపుడు, కశ్యపునకు ప్రజలందరు పుట్టిరి."

"రాజా! దక్షప్రజాపతికి పదుముగ్గురు కన్యకలు పుట్టిరి. వారు 'అదితి - దితి - దను - కాల - దనాయున్ - సింహిక - క్రోధ - ప్రాధ - విశ్వ - వినత - కపిల - ముని - కద్రూ' నామములు గలవారు. ఈ పదముగ్గురికి అసంఖ్యాకులైన పుత్ర - పౌత్రులు జన్మించిరి."

"రాజా! అదితికి ప్రపంచ ప్రభువులైన పన్నెండుగురు ఆదిత్యులు పుట్టిరి. వారు, 'ధాతృ - మిత్ర - అర్యమన్ - శక్ర - వరుణ - అంశ - భగ - వివస్వన్ - పూషన్ - సవితృ - త్వష్టృ - విష్ణు' నామములు గలవారు. ఈ పన్నెండుగురిలో కనిష్ఠుడైన విష్ణువు ఆదిత్యు లందరిలో గుణాధికుడు.

"రాజా! దితియను నామెకు హిరణ్యకశిపుడు అనునొక్కకొడుకే పుట్టెను. అతనికి ప్రహ్రాద - సంహ్రాద అనుహ్రాదాదులు ఐదుగురు పుత్రులు పుట్టిరి. అనుహ్రాదునకు 'శిబి-బాష్కల' నామకు లిరువురు. ప్రహ్రాదునకు 'విరోచన-కుంభ - నికుంభు' లను ముగ్గురు పుత్రులు, విరోచనునకు ప్రతాపశాలియైన 'బలి' అను నొక పుత్రుడు బలికి పరమేశ్వరభక్తుడైన బాణుడున్ను పుట్టిరి."

"రాజా! 'దను' అను దక్షకన్యకు ప్రఖ్యాతులైన యిరువది నలుగురు పుత్రులు పుట్టిరి. వారిలో జ్యేష్ఠుడు 'విప్రచిత్తి' అనురాజు. 'శంబర - నముచి- పులోమన్ - అసిలోమన్ - కేశిన్ - దుర్జయ - అయశ్శిరస్ - అశ్వశిరస్ - అశ్వశంకు - గగనమూర్ధన్ - వేగవాన్ - కేతుమాన్ - స్వర్భాను - అశ్వ - అశ్వపతి - వృషపర్వన్ - అజక - అశ్వగ్రీవ - సూక్ష్మ - తుహుండ - ఇషపాద - ఏకచక్ర - విరూపాక్ష - హర - అహర - నిచంద్ర - నికుంభ - కుపట - కపట - శరభ - శలభ - సూర్య - చంద్రమన్" నామములుగల

వీరందరు దనువంశమునందు పుట్టి 'దానవులు' అని ప్రసిద్ధి గాంచిరి "దానవులైన సూర్యచంద్రులు దేవతలలోని సూర్యచంద్రులున్ను వేరు."

"రాజా! ఈ వంశములందు పుట్టినవా రందరు మహాబలపరాక్రమ సంపన్నులు. వీరేకాక, పదుగురు దానవవంశోత్పన్నులు కూడ నున్నారు. వారు 'ఏకాక్ష - మృతప - ప్రలంబి - నరక - వాతాపి - శత్రుతపన - శఠ - గవిష్ఠ - వనాయు - దీర్ఘజిహ్వ' నామములు గలవారు, వారి పుత్రపౌత్రులు అసంఖ్యాకులుగా నున్నారు."

"రాజా! 'సింహిక' అనుదక్షపుత్రి చంద్ర సూర్యులను పీడించు రాహువును సుచంద్రుని, చంద్రహర్తను చంద్రమర్దనున్ని కనెను. సింహికయొక్క పుత్ర - పౌత్రులు అసంఖ్యాకులు. 'గణ - క్రోధవశ - క్రూరకర్మ - అరిమర్దన' నామకులు నలుగురు రాక్షసులు దనాయువునకు పుట్టిరి. 'కాలా' అను దక్ష పుత్రికి యమకల్పులైన విక్షర, బల, వీర, వృత నామకులు పుత్రులు పుట్టిరి. వారు దానవులలో మహా వీర్యశాలురు. అట్లే ఆమెకు 'వినాశన-క్రోధ - క్రోధ హంతృ-క్రోధ శత్రు'వులు కాలకేయులున్ను పుట్టిరి".

"రాజా! అసురులకు ఉపాధ్యాయుడుగా ఋషి పుత్రుడైన శుక్రు డుండెను. 'ఉశనస్' అను పేరుగల శుక్రునకు అసుర గురువులుగా నలుగురు పుత్రులు ఉండిరి. వారు 'త్వష్టాధర-అత్రి' నామకులు, మరి యిద్దరు క్రూరకర్ములు నుండిరి. వారు సూర్య సమాన తేజస్సు, బ్రహ్మలోకమునందు ఆసక్తియు గలవారు".

"రాజా! ఈ విధముగ పురాణములందు చెప్పబడిన సురాసుర వంశముల యుత్పత్తిని గూర్చి నీకు చెప్పితిని. వీరికి పుట్టిన అసంఖ్యాక సంతానమును గూర్చి సమగ్రముగ చెప్పుటకు సాధ్యముకాదు. 'తార్క్ష్యుడు-అరిష్టనేమి-గరుడుడు-అరుణుడు-ఆరుణి-వారుణి' అనువారు వినత సంతానము".

"రాజా! శేష - అనంత - వాసుకి - తక్షక-భుజంగమ-కూర్మ-కలికులు' కద్రూ పుత్రులు. భీమసేన - ఉగ్రసేన - సుపర్ణ - వరుణ - గోపతి - ధృతరాష్ట్ర-సూర్యవర్చస్-సత్యవాక్-అర్కపర్ణ-ప్రయుత-చిత్రరథ-సర్వవిత్ - శాలిశిరస్-పర్జన్య-కలి-నారద నామకులు పది యారుగురు దేవ గంధర్వులు 'ముని' అను దక్ష కన్యకకు పుత్రులు".

"రాజా! ఇతర వంశము లనేకములను గూర్చి చెప్పెద వినుము. 'అనవద్య - మను - వంశా - అసురా - మార్గణప్రియా - అరూపా - సుభగా-భాసీ- నామములు గల కన్యకలను 'ప్రాధా' యను దక్ష కన్యక కనెను. ఆమెకే 'సిద్ధ - పూర్ణ - బర్హి - పూర్ణాయున్ - మహాయశన్' నామకులు బ్రహ్మచారి యగు 'రతిగుణుడు' - 'సుపర్ణ-విశ్వావసు-భాను-సుచంద్ర' నామములు గల పదుగురు దేవ గంధర్వులు పుట్టిరి. ప్రాధాదేవి పూర్వము దేవర్షి నుండి అప్సరసల వంశమును కనెను. 'కపిల' యను దక్ష పుత్రికి 'అలంబుషా - మిశ్రకేశీ - విద్యుత్పర్ణా - తిలోత్తమా - అరుణా - రక్షితా - రంభా - మనోరమా - కేశినీ - సుబాహు - సురతా - సురజన్ - సుప్రియా' నామములు గల కన్యకలు, 'అతిబాహు - హాహా - హూహూ - తుంబురు' నామములు గల నలుగురు గంధర్వులు, 'అమృతము - బ్రాహ్మణులు - గోవులు - గంధర్వాప్స రసలు' జన్మించిరని పురాణములందు చెప్పబడినది."

"జనమేజయా ! యిట్లు నీకు సర్వభూతముల యుత్పత్తిని గూర్చి చెప్పితిని. గంధర్వాప్సరసల సంభవము గూడ యథావత్తుగా చెప్పితిని. 'భుజంగ - సుపర్ణ - రుద్ర - మరుత్ - గో - బ్రాహ్మణుల'ల యుత్పత్తిని గూర్చి చెప్పితిని. ఈ వంశముల వర్ణనము ఆయుష్కరము - పుణ్యకరము - శ్రవణసుఖ కరము గనుక, అసూయ లేక అవశ్యముగ వినవలసినది - సర్వదా వినిపించ వలసినదియు నగును. ఈ వంశముల వర్ణనము నియమముతో మహాత్ముల సన్నిధిలో, దేవబ్రాహ్మణుల సన్నిధిలోను చదివిన వారికి పుష్కలమైన అపత్య లాభము - సంపద యశస్సున్ను గలిగి చివరకు వారు సద్గతిని పొందగలరు."

**ఋషుల యొక్క - కశ్యపపత్నుల యొక్కయు సంతాన పరంపరా వర్ణనము :-**

"జనమేజయా ! బ్రహ్మమానసపుత్రులైన ఆరుగురు మహర్షులను గూర్చి తెనిసికొంటివి. బ్రహ్మయొక్క యేడవ పుత్రుడైన 'స్థాణువు'నకు పదకొండు గురు పుత్రులు గలరు. వారు 'మృగవ్యాధ - సర్ప - నిర్ఋతి - అజైకపాద - అహిర్బుధ్న్య - పినాకిన్ - దహన - ఈశ్వర - కపాలిన్ - స్థాణు - భవ' నామములు గలవారు. వారికి ఏకాదశరుద్రులని లోకములో ప్రఖ్యాతి గలదు."

"రాజా ! పూర్వము చెప్పబడిన ఆరుగురు బ్రహ్మమానస పుత్రులలో 'అంగిరసుడు' అను ఋషికి, తపోవ్రతనిష్ఠులైన 'బృహస్పతి - ఉతథ్య - సంవర్త' నామకులు ముగ్గురు పుత్రులు పుట్టిరి. అత్రి మహాముని పుత్రులు అనేకులు, వారందరు వేదవిదులు-సిద్ధులు-శాంతమనస్కులు నైన మహర్షులు."

"రాజా! పులస్త్యమహామునికి రాక్షసులు - వానరులు - కిన్నరులు - యక్షులున్ను పుట్టిరి. పులహ మహర్షికి శరభములు - సింహములు - కింపురుషులు - వ్యాఘ్రములు - ఎలుగుబంట్లు - తోడేళ్ళున్ను పుట్టెను. క్రతు (యజ్ఞ) మహర్షికి, క్రతువుతో సములైన పుత్రులు పుట్టిరి. వారు త్రిలోక విఖ్యాతులు - పతంగ సహచరులు - సత్యవ్రత నిష్ఠులు. వారు సూర్య భగవానుని యగ్ర భాగమందు పోవు అరువదివేల వాలఖిల్యమునులు."

"రాజా! బ్రహ్మదేవుని కుడి బొటనవ్రేలినుండి దక్షుడు పుట్టెను. అతడు శాంతాత్ముడు. మహాతపశ్శాలి. అతని భార్య బ్రహ్మయొక్క యెడమ బొటన వ్రేలినుండి పుట్టెను. ఆమెనుండి దక్షప్రజాపతి యేబది మంది కన్యలను కనెను. వారందరు సుందరాంగులు-కమలలోచనులు. దక్షప్రజాపతిపుత్రు లందరు నశించుటచేత ఆ యేబదిమంది పుత్రికలను అతడు పుత్రులనుగా స్వీకరించెను. దీనికి 'పుత్రికావిధి,* యని పేరు

---

* మనుస్మృతిలో పుత్రికావిధికి దక్షప్రజాపతియే ప్రవర్తకుడని యీ లక్షణము చేత తెలుపబడెను.

"అపుత్రోఽనేన విధినా సుతాం కుర్వీత పుత్రవత్,
యదపత్యం భవవేదస్యాం తన్మమ స్యాత్ స్వధాకరమ్"

అనగా పుత్రులు లేనివాడు ఈ విధానముచేత తన కన్యకనే పుత్రునిగా చేసికొనును. 'ఈ కన్యకగర్భమందు పుట్టబోవు బాలకుడు నాకు శ్రాద్ధాది కర్మలు చేయు పుత్రుడుగా నుండుగాక!' యని 'సంకల్పము చేసి, కన్యకను వరునకు దానము చేసి, ఆమెనే తన పుత్రునిగా చేసికొనవచ్చును. 'పుత్' అను నరకమునుండి తండ్రిని రక్షించువాడు 'పుత్రుడు' అని యనబడును కాబట్టి 'పుత్రికా' శబ్దమునకు గూడ ఆ యర్థమే యీ సందర్భమునందు చెప్పవచ్చును. దీనినే 'పుత్రికావిధి' యందురు.

"రాజా! దక్ష ప్రజాపతి! ఆ యేబదిమంది కన్యకలలో, పదుగురిను ధర్మునకు, ఇరువదియేడుగురను (అశ్విన్యాది నక్షత్రములు) చంద్రునకు పదముగ్గురను, కశ్యపునకున్ను దివ్యవిధిప్రకారము ఇచ్చి, పెండ్లి చేసెను. వారిపేర్లు చెప్పెద వినుము.

'కీర్తి - లక్ష్మి - ధృతి - మేధ - పుష్టి - శ్రద్ధ - క్రియ - బుద్ధి - లజ్జ-మతి" యను పదుగురు ధర్ముని ధర్మపత్నులు. ఈ పదుగురున్ను ధర్మమునకు ద్వారము లని బ్రహ్మదేవుడు విధించెను."

"చంద్రునకు పత్నులైన యిరువదియేడుగురు ప్రపంచ ప్రసిద్ధలు. వీరు సమయదృష్టికి సంబంధించిన వారు. శుచిస్మితలైన యీ సప్తవింశతి నక్షత్ర భార్యలు లోకయాత్రా విధానము ప్రకారము నక్షత్రయోగినులుగా చంద్రునకు భార్యలైరి."

"రాజా! బ్రహ్మదేవుని స్తనమునుండి పుట్టినవా డగుటచేత మునివరుడైన ధర్మదేవుడు బ్రహ్మపుత్రు డనబడెను. దక్ష ప్రజాపతిగూడ బ్రహ్మపుత్రుడే - దక్షకన్యల గర్భములనుండి ధర్మునకు 'ధర - ధ్రువ - సోమ - అహస్ - అనిల - అనల - ప్రత్యూష - ప్రభాస' నామములు గల అష్టవసువులు పుట్టిరి. ధర్మునకు 'ధూమ్రా' దేవియందు 'ధరుడు - ధ్రువుడు'నను నిరువురు పుత్రులు పుట్టిరి. వారు బ్రహ్మవిద్యా విశారదులు. ధర్మునకు 'మనస్విని'యందు చంద్రుడు 'శ్వస' యను భార్యయందు 'అనిలుడు', 'రత' యను నామెయందు 'అహస్సు' 'శాండిలి' నామముగల భార్యయందు 'అనలుడు', 'ప్రభాత' యను నామె యందు 'ప్రత్యూష - ప్రభాస'నామకు లిరువురున్ను పుట్టిరి."

"రాజా! ధరునకు 'ద్రవిణుడు - హుతహవ్యవహుడు' నను నిరువురు పుత్రులు, ధ్రువునకు లోకమును అంత మొందించు యమరాజు, సోమునకు తేజస్వియైన 'వర్చా' అను పుత్రుడు తొలుత మనోహర యందు పుట్టెను. అతని వలన లోకులు తేజస్సు - కాంతి - పరాక్రమమున్ను గలవా రగుదురు. ఆ మనోహరకే సోమునివలన తరువాత 'శిశిర - ప్రాణ - రమణ' నామకులు ముగ్గురు కొడుకులు పుట్టిరి. 'అహస్సు' అనువానికి 'జ్యోతిన్ - శమ - శాంత - ముని. నామకులు నలుగురు పుత్రులు పుట్టిరి. అనలునకు కుమారస్వామి (స్కందుడు) పుట్టెను. అతడు జన్మకాలమందే రెల్లు గడ్డియందు నివసించు

చుండెను. కుమారస్వామి ఆరుగురు కృత్తికలకు కొడుకు గనుక, 'కార్తికేయ' నామముతో ప్రసిద్ధుడాయెను. కుమారస్వామికి 'శాఖ - విశాఖ - నైగమేయ* నామకులు ముగ్గురు తమ్ములు పుట్టిరి.

"రాజా! అనిలునకు 'శివా' యను భార్యయందు 'మనోజవుడు - అవిజ్ఞాతగతి' యను నిరువురు పుత్రులు పుట్టిరి. 'ప్రత్యూష'నకు 'దేవలుడు' అను పుత్రుడు, దేవలునకు క్షమ గలవారు - బుద్ధిమంతులునైన యిద్దరు కొడుకులున్ను పుట్టిరి. బృహస్పతి సోదరి, ఉత్తమస్త్రీ - బ్రహ్మవాదిని - యోగినియునై, సమస్త ప్రపంచమునందు విరాగిణియై సంచరించెను. ఆమె, అష్టమవసువైన 'ప్రభాసు'నకు భార్యయై, శిల్ప ప్రజాపతియైన 'విశ్వకర్మను' కనెను. విశ్వకర్మ సమస్త భూషణములను నిర్మింప గలవాడు. అతడు దేవతలకు వర్ధంగిగా నుండెను. శిల్పిశ్రేష్ఠుడైన విశ్వకర్మ దేవతలకొరకు అనేక దివ్య విమానములను నిర్మించెను. అతని శిల్పము నాశ్రయించియే మనుష్య లోకములో శిల్పులు జీవికా నిర్వాహణము చేయుచున్నారు. అట్టి విశ్వకర్మను శిల్పులు సర్వదా పూజించుచుందురు."

"రాజా! బ్రహ్మదేవుని దక్షిణస్తనమును భేదించి సర్వలోక సుఖకరుడైన ధర్ముడు మానవ రూపములో పుట్టెను. అతనికి అతి సుందరులు - శ్రేష్ఠులునైన 'శమ-కామ-హర్ష' నామకులు ముగ్గురు పుత్రులు పుట్టిరి. వారు లోకము నంతటిని తమ తేజస్సుచేత ధరించుదురు".

"రాజా! 'కాముడు' అనువానికి 'రతీదేవి' 'శము' డనువానికి 'ప్రాప్తి' 'హర్షు'నకు 'నంద' యనువారు భార్యలుగా నుండిరి. ఆ ముగ్గురు స్త్రీలయందే సమస్త లోకములున్ను ప్రతిష్ఠితములై యున్నవి".

"రాజా! 'మరీచి'కి కశ్యపుడు పుట్టెను. కశ్యపునకు సురాసురులున్ను పుట్టిరి. ఆ కశ్యపుడే సమస్త లోకములకు ఉత్పత్తి హేతువు. 'త్వష్ట' పుత్రియైన

* కొందరి మతములో 'శాఖ - విశాఖ - నైగమేయ' నామములు కుమారస్వామికే కలవని యున్నది. మరికొందరు 'ఆముగ్గురున్ను కుమారస్వామి పుత్రులు' అని యనెదరు. కల్పభేదముచేత రెండు మతములున్ను గ్రాహ్యములే యగును.

'సంజ్ఞ'కు సూర్యునినుండి అంతరిక్షమునందు 'అశ్వినీ దేవతలు' అనునిరువురు పుత్రులు పుట్టిరి. ఆసంజ్ఞ అశ్వరూపధారిణి".

"రాజా! కశ్యపునకు అదితియందు ఇంద్రాదులైన పన్నెండుగురు పుత్రులు పుట్టిరి. వారిలో కనిష్ఠుడైన 'విష్ణు' వను పుత్రునందు సర్వ లోకములు ప్రతిష్ఠితములై యున్నవి. ఈ విధముగా 'అష్టవసువులు - ఏకాదశరుద్రులు - ద్వాదశాదిత్యులు - ప్రజాపతి - వషట్కారము (మంత్రోచ్చారము చేసి దేవతను ఆహ్వానించుట) వీరు ముప్పది ముగ్గురు ముఖ్య దేవతలు అని యెరుగుము".

"జనమేజయా! ఈ ముప్పది ముగ్గురు దేవతల యొక్క పక్ష- కులాదుల యొక్క వంశగణాదులను గూర్చి సవివరముగా చెప్పెద వినుము".

"రుద్రుల పక్షము (గణము) 'సాధ్య - మరుత్ - వసు'వుల పక్ష (గణ) మున్ను వేర్వేరుగా నున్నవి. ఇట్లే 'భార్గవ-విశ్వేదేవ' గణములను గూడ తెలిసి కొనవలెను.

"రాజా! వినతపుత్రులైన 'అరుణ-గరుడులు' - బృహస్పతియు ఆదిత్యాదులలోనే పరిగణింప బడుదురు. అశ్వినీకుమారులు గుహ్యకు లని సర్వౌషధులు పశువులు ననియు తెలిసికొనుము. రాజా! దేవగణములను గూర్చి క్రమముగా నీకు చెప్పితిని. వీరిని కీర్తించిన మనుజుడు సర్వపాప విముక్తు డగును"

"జనమేజయా! బ్రహ్మదేవుని హృదయము భేదించి భగవంతుడైన 'భృగుడు' బయలు వెడలెను. భృగునకు 'కవి' యనుపుత్రుడు కవికి శుక్రాచార్యుడు పుట్టిరి. మహావిద్వాంసు డైనశుక్రుడు 'గ్రహ' మై, మూడు లోకముల జీవిత రక్షణముకొరకు 'వృష్టి- అనావృష్టి-భయము - అభయము' నను నవి కలిగించును. బ్రహ్మదేవుని ప్రేరణచేత - శుక్రుడు ప్రపంచమంతట తిరుగును. యోగాచార్యుడు దైత్యులకు గురువు, యోగబలసంపన్నుడు, మహాబుద్ధిశాలి, నియమవ్రతనిష్ఠుడు; బ్రహ్మచారియు నైన శుక్రాచార్యుడే బృహస్పతిరూపములో దేవతలకుగూడ గురువగును శుక్రునకు, 'చండ - అమర్క-త్వష్ట్ర - ధరాత్ర' నామకులు నలుగురు పుత్రులు పుట్టిరి. ఆ నలుగురున్ను అసురులకు యాజ్ఞికు లైరి."

"రాజా! బ్రహ్మదేవుడు ప్రపంచయోగ - క్షేమకార్యములందు శుక్రుని నియోగించినప్పుడు, భృగుమహర్షి 'చ్యవనుడు' అను మరియొక నిర్దుష్టుడైన

పుత్రుని కనెను. చ్యవనుడు నిరంతరతపోనిష్ఠుడు. అతడు తనతల్లిసంకటము పోగొట్టుటకు కోపముతో మాతృగర్భమునుండి చ్యుతు డయ్యెను. కనుక నతనికి 'చ్యవను' డనుపేరు వచ్చెను.

"రాజా! చ్యవనునకు 'మను' పుత్రియైన 'ఆరుషి' యనునామె భార్యగా నుండెను. చ్యవనునకు 'ఆరుషి' తొడనుండి యశస్వి యైన 'ఔర్వుడు' అను ముని పుట్టెను. అతడు తల్లితొడను (ఊరువును) భేదించుకొని పుట్టెనుగనుక, అతనికి ఔర్వు డనుపేరు వచ్చెను. అతడు తేజస్వి - పరాక్రమవంతుడు. ఔర్వుడు బాల్యమునుండియే అనేక సద్గుణములచేత శోభిల్లుచుండెను. ఔర్వునకు ఋచీకుడు మున్నగు నూరుగురు పుత్రులు పుట్టిరి. ఋచీకునకు 'జమదగ్ని' పుట్టెను.

"రాజా! జమదగ్నికి నలుగురు పుత్రులు జనించిరి. వారందరు మహాత్ములే. వారిలో కనిష్ఠుడు 'పరశురాముడు'. అతడు ఉత్తమ గుణసంపన్నుడు- సర్వశాస్త్ర విద్యాకుశలుడు - క్షత్రియకుల సంహారకుడు - జితేంద్రియుడునై యుండెను. రాజా! యీ విధముగా భృగువంశమందు వేలకొలది పుత్రులు పుట్టి భూమండల మంతట విస్తరించిరి."

"జనమేజయా! బ్రహ్మదేవునకు 'ధాత - విధాత' యని మరియిరువురు పుట్టి మనువునకు సహచరులైరి. ఆ యిరువురకు పద్మాలయయైన లక్ష్మి చెల్లెలుగా పుట్టెను. ఆమెకు ఆకాశమునందు సంచరించు 'తురగులు' మానస పుత్రులుగా పుట్టిరి."

"రాజా! వరుణుని వీర్యము నుండి యతని 'జ్యేష్ఠాదేవి' యను భార్యకు 'బలుడు' అను పుత్రుడు దేవతలను సంతసింపజేయు 'సుర' యను పుత్రికయు పుట్టిరి. అన్నాశచేత, ప్రజలు పరస్పరము పీకికొని తినుటవలన సర్వభూత వినాశకుడగు 'అధర్ముడు' ఆమెకు పుట్టెను అధర్మునకు 'నిరృతి' యను భార్య యందు క్రూరులు - రాక్షసులునైన నైరృతులు, పుట్టిరి. అధర్మునకే పాప కర్ములు - సర్వప్రాణి నాశకరులునైన 'భయ - మహాభయ - మృత్యు 'నామకులైన ముగ్గురు పుత్రులున్ను పుట్టిరి. 'మృత్యువు' సమస్త ప్రాణులకు అంతకుడు కనుక నతనికి భార్యా - పుత్రులు లేకుండిరి.

"రాజా! 'తామ్ర'యనునామె 'కాకి - శ్యేని - భాసి - ధృతరాష్ట్రి - శుకి' యని లోకప్రసిద్ధలైన యైదుగురు కన్యలను కన్నెను. వారిలో, 'కాకి' 'గుడ్లగూబలను

శ్యేని' డేగలను, 'భాసి' కోళ్ళను - గ్రద్దలను, మంగళకరురాలైన 'ధృతరాష్ట్రి' హంసలను - కలహంసలను, 'భద్ర' చక్రవాకములను, కళ్యాణ గుణములుగల 'శుకి' చిలుకలనున్ను కనెను. శుకి సర్వలక్షణ సంపన్నురాలు.

"రాజా! 'క్రోధవశ' 'మృగి - మృగమంద - హరి - మాతంగి - భద్ర మన - శార్దూలి - శ్వేత - సురభి - సుర' యను తొమ్మండుగురు క్రుద్ధలైన స్త్రీలను కనెను. ఇవి యన్నియు మృగ సంతానములు."

'మృగమంద'కు ఎలుగుబంట్లు - సృమరములు (చిన్నజాతి మృగములు) పుట్టెను. 'భద్రమన' ఐరావత గజమును కనెను. అది దేవతాగజము. 'హరికి' అశ్వములు - వానరములు - కొండముచ్చులున్ను పుట్టెను. 'మాతంగి' ఏనుగులను, 'శ్వేత' 'శ్వేతు'డను దిగ్గజమును, 'సురభి' 'రోహిణి - గంధర్వి - విమల - అనల' అను నలుగురు కన్యలను కనెను. 'రోహిణి' గోవులను, 'గంధర్వి' గుఱ్ఱములను కనెను. 'అనల' ఏడు 'పిండఫల* వృక్షములను కనెను. అనలకు 'శుకి' యనునొక పుత్రిగూడ పెట్టెను. 'సురస'కు 'కంక(రాబందు) నామకుడు పుట్టెను. అరుణుని భార్య యగు 'శ్యేని' మహాబలశాలురైన 'సంపాతి - జటాయువు' అను నిరువురు కొడుకులను కనెను. 'సురస'కు నాగములు, 'కద్రువ'కు పన్నగములు, 'వినతకు అరుణ - గరుడులు ఇరువురు పుట్టిరి. 'సురస' ఒకతల గలనూరు సర్పములను కనెను. ఆమెకు, 'అనల - రుహ - వీరుధ అను ముగ్గురు కన్యకలు పుట్టిరి. వారికి వనస్పతులు - వృక్షములు - లతలున్ను పుట్టెను. 'పిండఫల వృక్షములు' అనలాసుతులు. వానినే వనస్పతులనెదరు. పుష్పములతో ఫలములను కాచుచెట్లు 'రుహ'కు పుత్రులు 'పొదరిండ్లు- లతలు-

* "ఖర్జూరం తాల - హింతాలౌ తాళీ ఖర్జూరికాతథా।
గుణకా నారికేలశ్చ సప్త పిండఫలా ద్రుమాః॥"

అనగా ఖర్జూర - తాల (తాడి) - హింతాల (గిరిక - పొట్టి తాడిచెట్టు. ఈ పేరు ఈతచెట్టుకు గూడ ఉన్నదని కొందరిమతము) తాళీ (నేల ఉసరికి) - ఖర్జూరికా (చిన్న ఖర్జూరము) - గుణక (పోక) - నారికేళ 'వృక్షములు ఈ యేడు చెట్లకు పూవులు పూచకుండ పిండాకారములో నున్న పండ్లు పుట్టును, కనుక నివి పిండఫలవృక్షము' లనబడును.

త్వక్సారములు (వెదుళ్ళు)' మొదలైన తృణజాతులు 'వీరుధ'కు పుట్టిరి. దీనితో ఈ వంశాను క్రమము ముగియును."*

"రాజా! యీ విధముగా సర్వభూతముల యుత్పత్తిని గూర్చి సవిస్తరముగా నీకు చెప్పితిని. ఈ సృష్టిక్రమమును వినిన మానవుడు పాపవిముక్తుడై సర్వజ్ఞుడై పుణ్యగతిని పొందగలడు."

ఇట్లు వైశంపాయనుడు చెప్పగా విని జనమేజయు డాముని నిట్లడిగెను :-

**దేవ - దైత్యుల అంశావతార వర్ణనము :-**

"మహాత్మా! దేవ - దానవులు, గంధర్వ - నాగ రాక్షసులు, సింహ - వ్యాఘ్ర - హరిణ - సర్పములు, - పక్షులు ఈ మొదలైన సర్వభూతముల యుత్పత్తి మానవుల యోనులలో కలిగిన విషయమును గూర్చి ఆ ప్రాణుల జన్మ-కర్మలను గూర్చియు విన గోరుచున్నాను. అన్నిటిని క్రమముగా చెప్పుము". ఆ మాటకు వైశంపాయనుడు ఇట్లు బదులు చెప్పదొడగెను :

"జనమేజయా! మనుష్యుల యందు పుట్టిన దేవదానవులను గూర్చి తొలుత చెప్పెద వినుము :

'విప్రచిత్తి' అను రాక్షసరాజు మనుష్యులలో 'జరాసంధుడు'గ, దితి పుత్రుడైన హిరణ్యకశిపుడు 'శిశుపాలుడు'గ హిరణ్యకశిపుని కొడుకైన ప్రహ్లాదునకు తమ్ముడు సంహ్రాదు డనువాడు బాహ్లీక దేశ రాజైన 'శల్యుడు'గ, 'అనుహ్రాదు'డను** ప్రహ్రాదుని కనిష్ఠ భ్రాత 'ధృష్టకేతువు'గ, 'శిబి' యను దైత్యుడు 'ద్రుము'డను రాజుగ, 'బాష్కలుడు' అను దైత్యుడు 'భగదత్తుడు' గను పుట్టిరి.

* ఈ విధముగా సర్వప్రపంచము కశ్యపసంతానమే యగును. కనుకనే, భూమికి 'కాశ్యపి' యనిపేరు. సాధారణముగా శ్రాద్ధాదులందు బంధువుల గోత్రములు తెలియనివారు, ఆ యా బంధువు పేరుతో, 'కాశ్యపగోత్రము' చేర్చి తర్పణాదులు చేయుట నేటికిని ఆచారము గలదు. అనగా, ఏ గోత్రము తప్పినను, అందరు కశ్యపుని సంతతియే కనుక 'కాశ్యప' గోత్రము తప్పదని భావము.

** ప్రహ్రాదుడు - ప్రహ్లాదుడే అయియుండును.

"రాజా ! అయశ్శిరస్-అశ్వశిరస్-అయశ్శంకు-గగనమూర్ధన్-వేగవాన్ అను నైదుగురు దైత్యులు ఐదుగురు కేకయ రాజులుగ, 'కేతుమాన్' అను దైత్యుడు 'అమితౌజుడు'గ, 'స్వర్భాను (రాహువు)' అను దైత్యుడు 'ఉగ్ర సేనుడు'గ, 'అశ్వ' నామక దైత్యుడు 'అశోకరాజు'గ, అశ్వుని తమ్ముడగు 'అశ్వపతి' యను దైత్యుడు 'హార్దిక్య' రాజుగ, 'వృషపర్వ' మహాసురుడు 'దీర్ఘప్రజ్ఞుడు' అను రాజుగ, 'వృషపర్వు'నకు తమ్ముడైన 'అజకుడు' 'శాల్వ' రాజుగ, 'అశ్వగ్రీవ' దైత్యుడు 'రోచమానుడు'గ 'సూక్ష్మ'డను దైత్యుడు 'బృహద్రథ' రాజుగ, 'తుహుండ' దైత్యుడు 'సేనాబిందు' రాజుగ, 'ఇషుపాద' నామక దైత్యుడు 'నగ్నజిత్' అను రాజుగ, 'ఏకచక్ర' దైత్యుడు 'ప్రతి వింధ్యు'డుగ, 'విరూపాక్ష' దైతేయుడు 'చిత్రధర్మ' రాజుగను మానవ లోక ములో జన్మించిరి.

"రాజా! 'హర' నామకుడైన దైత్యుడు 'సుబాహు' నామక రాజుగ, దైత్యుడైన 'అహరుడు' 'బాహ్లీకు'డను పేరుగల రాజుగ, 'నిచంద్రుడు' 'ముంజకేశ' రాజుగ, 'నికుంభుడు' 'దేవాధిపుడు' అనురాజుగ, 'శరభుడు' అనునసురుడు 'పౌరవుడు' అను రాజర్షిగ 'కుపటుడు, 'సుపార్శ్వుడు'గ 'క్రథ' దైత్యుడు 'పార్వతీయుడు'గ, క్రథుని తమ్ముడు 'శలభుడు' బాహ్లీకుడైన 'ప్రహ్లాదుడు'గను జన్మించిరి".

"రాజా! దైత్య శ్రేష్ఠుడైన 'చంద్రుడు' కాంభోజరాజైన చంద్రవర్మగ, 'అర్క' దానవుడు 'ఋషికుడు' అను రాజర్షిగ, 'మృతపుడు' అనునసురుడు 'పశ్చిమానూపకరాజు'గ, 'గవిష్ఠుడు' అనుదానవుడు 'ద్రుమసేన' రాజుగ 'మయూర' రాక్షసుడు 'విశ్వుడు' అనురాజుగ, మయూరుని తమ్ముడు 'సుపర్ణు' డనువాడు, 'కాలకీర్తి' అనురాజుగ, 'చంద్రహంత' అనునసురుడు 'శునకుడు' అను రాజర్షిగ, 'చంద్రవినాశను'డను రాక్షసుడు 'జానకి' అను రాజుగాను మానవ లోకమందు జన్మించిరి".

"రాజా! 'దీర్ఘజిహ్వ' రాక్షసుడు 'కాశిరాజు'గ, సూర్యచంద్రులను మర్దించు సింహికాపుత్రుడు 'రాహువు' అనుపేరు గలవాడు 'క్రాథ' నాయకరాజుగ 'దనాయుస్' అను రాక్షసుని నలుగురు పుత్రులలో జ్యేష్ఠుడు 'విక్షరు' డనువాడు 'సుమిత్రు' డను రాజుగ, విక్షరుని పెద్ద తమ్ముడు 'బల' నామరాక్షసుడు

'పాంశ్యరాజు'గ విక్షరుని రెండవ తమ్ముడు 'శూరుడు' అనురాక్షసుడు 'పౌండ్రమాత్స్యక' రాజుగ విక్షరుని మూడవ తమ్ముడు 'వృతు' డను రాక్షసుడు 'మణిమంతుడు' అనురాజుగ, వృతుని తమ్ముడు 'క్రోధహంత' దండనాయక రాజుగ, మరియొక తమ్ముడు 'క్రోధవర్ధను' డనువాడు 'దండధారుడు' అను రాజుగను మానవ లోకములో పుట్టిరి".

"రాజా! 'కాలేయు' రాక్షసుని పుత్రులలో ఎనమండుగురు పుత్రులు సింహసములు. వారిలో జ్యేష్ఠుడు 'జయత్సేనుడు' అను మగధరాజుగ, రెండవ రాక్షసుడు 'అపరాజిత' రాజుగ, మూడవవాడు 'నిషాద' రాజుగ. నాలుగవరాక్షస పుత్రుడు 'శ్రేణిమంతుడు'గ, ఐదవ కాలేయపుత్రుడు 'మహౌజస్' అను రాజుగ, ఆరవవాడు 'అభీరు' రాజర్షిగ, ఏడవవాడు 'సముద్రసేనుడు' అనుధర్మపరుడైన రాజుగ, కాలకేయపుత్రులలో ఎనిమిదవవాడు 'బృహత్' అను ధార్మాత్ముడైన రాజుగను భూలోకములో పుట్టిరి."

"రాజా! 'కుక్షి' అను దానవోత్తముడు 'పార్వతీయుడు'గ, 'క్రథనుడు' అను నసురుడు 'సూర్యాక్షు'డను రాజుగ, 'సూర్యుడు' అనురాక్షసుడు, బాహ్లీకుడైన దరదుడు అను రాజుగ మనుష్య లోకములో పుట్టిరి."

"రాజా! 'క్రోధవశ' నామముగల గణములను గూర్చి తెలిపి యుంటిని గదా! వారిలోనే కొందరు రాజులుగ ఈ భూలోకమునందు పుట్టిరి. వారు - 'మద్రక - కర్ణవేష్ట - సిద్ధార్థ - కీటక - సువీర - సుబాహు - మహావీర - బాహ్లీక - క్రథ - విచిత్ర - సురథ - నీల - చీరవాసన్ - భూమిపాల - దంతవక్త్ర - దుర్జయ - రుక్మిన్ - జనమేజయ - ఆషాఢ - వాయువేగ - భూరితేజస్ - ఏకలవ్య - సుమిత్ర - వాటధాన - గోముఖ - కారూషక - క్షేమధూర్తి - శ్రుతాయుస్ - ఉద్వహ - బృహత్సేన - క్షేమ - ఉగ్రతీర్థ - కుహర - మతిమాన్ - ఈశ్వర' - నామకరాజు లందరు క్రోధవశ రాక్షస గణమునుండి భూమండలము నందు పుట్టిరి. వారందరు అత్యంత సౌభాగ్య - యశో - బల సంపన్నులుగ నుండిరి."

"రాజా! దానవశ్రేష్ఠుడైన 'కాలనేమి' 'కంస' నామముతో ఉగ్రసేన పుత్రుడుగ పుట్టెను."

"రాజా! 'గంధర్వపతి' 'దేవకుడు'గ పుట్టెను. 'బృహస్పతి అంశము చేత భరద్వాజ పుత్రుడైన 'ద్రోణాచార్యుడు' పుట్టెను. సర్వధనుర్ధరులలో శ్రేష్ఠుడు, సమస్తశస్త్రాస్త్ర విద్యావిశారదుడు, మహాకీర్తి - తేజశ్శాలి, వేద - ధనుర్వేదముల యందు పండితుడు, విచిత్ర యుద్ధకర్మ చేయువాడు ద్రోణాచార్యుడు అని తెలియను".

"రాజా! ఆ ద్రోణునకు 'మహాదేవుడు, యముడు' ఈ ఇరువురి యొక్క కామ క్రోధ గుణములు ఒకచోట వెలసిన శూరుడైన అశ్వత్థామ పుట్టెను. అతడు మహాపరాక్రమశాలి, శత్రు సంహారకుడు, కమలదళ విశాలనేత్రుడునై యుండెను".

"రాజా! అష్టవసువులు గంగాదేవికి పుత్రులుగ శాంతన మహారాజువలన వసిష్ఠశాపము చేత, ఇంద్రుని ఆజ్ఞచేతను పుట్టిరి. ఆ వసువులలో కనిష్ఠుడు 'ప్రభాసు'దను వాడు భీష్ముడుగ పుట్టెను. అతడు వేద - వేదాంగములు, ధనుర్వేదము తెలిసిన శత్రుభయంకరుడు. అతడు, కురువంశమును నిర్భయము జేసెను. భీష్ముడు మహాపరాక్రమశాలియైన పరశురామునితో యుద్ధము చేసెను."

"రాజా! కృపాచార్యుడు అను బ్రహ్మర్షి రుద్రగణము నుండి పుట్టెను. అతడు అపార పౌరుష - పరాక్రమ సంపన్నుడు. 'ద్వాపరుని' యంశమున 'శకుని', సత్యసంధుడైన 'సాత్యకి' దేవగణము నుండి పుట్టిరి. సాత్యకి వృష్ణి వంశ భారవహనుడు. ఆ దేవగణము నుండియే ద్రుపదుడు, కృతవర్మ, విరాటుడున్ను పుట్టిరి."

"రాజా! 'అరిష్ట' పుత్రుడైన 'హంసు' డను గంధర్వపతి ధృతరాష్ట్రుడుగ వ్యాసపుత్రుడై పుట్టెను. అతడు కురువంశ వివర్ధనుడు - ప్రజ్ఞాచక్షువు (అంధుడు)గ నుండెను. అతనికి తల్లిదోషమువలన ఋషికోపము వలనను అంధత్వము కలిగెను. ధృతరాష్ట్రుని బాహువులు చాలపెద్దవి. అతని తమ్ముడు పాండురాజు సత్యధర్మనిరతుడుగా పుట్టెను. అత్రి* పుత్రుడైన యముని యంశమునందు బుద్ధిమంతుడైన విదురుడు పుట్టెను."

1. ఇక్కడ 'అత్రి' శబ్దముచేత సూర్యుడు అనునర్థము గ్రహింపబడెను. నీలకంఠ పండితుడుగూడ ఈ యర్థమే చెప్పెను.

"రాజా! కలియంశమునందు దుర్బుద్ధి, కురువంశమునకు అకీర్తికరుడు, సమస్త ప్రపంచద్వేషియునగు దుర్యోధనుడు పుట్టెను. 'కలి'స్వరూపుడైన యతడు ప్రాణినాశకరమైన మహావైరమును దీపింపజేసి సమస్త భూమండల వీరులతో యుద్ధము చేయించి చంపించెను. పులస్త్యకులోత్పన్నులైన రాక్షసులు దుర్యోధనునకు తమ్ములుగ, నూరుగురు దుశ్శాసనాదులు పుట్టిరి. వారు దుర్ముఖ, దుస్సహాదులు. వారు పౌలస్త్యాంశసంభూతులు, దుర్యోధనునకు సహాయకులుగ నుండిరి. ధృతరాష్ట్రునకు* వైశ్యాపుత్రుడైన యుయుత్సుడు నూటఒక్క కొడుకుగ నుండెను."

వైశంపాయను డిట్లు చెప్పగా విని జనమేజయు డిట్లు ప్రశ్నించెను :-

"మహాత్మా! ధృతరాష్ట్రపుత్రులయొక్క పేర్లు జ్యేష్ఠానుక్రమముగ వరుసగా చెప్పుము." ఇట్లు అడుగగా వైశంపాయనుడు జనమేజయునకు ధృతరాష్ట్రపుత్రులందరిపేర్లు వరుసగా నిట్లు చెప్పెను.

**"దుర్యోధన-యుయుత్సు-దుశ్శాసన-దుస్సహ-దుశ్శల- దుర్ముఖ-వివింశతి-వికర్ణ - జలసంధ - సులోచన - వింద - అనువింద - దుర్ధర్ష - సుబాహు - దుష్ప్రధర్షణ - దుర్మర్షణ - దుర్ముఖ - దుష్కర్ణ - కర్ణ - చిత్ర - ఉపచిత్ర-చిత్రాక్ష - చారు - చిత్రాంగద - దుర్మద - దుష్ప్రధర్ష-వివిత్సు-వికట-సమ-ఊర్ణనాభ - పద్మనాభ - నంద - ఉపనందక - సేనాపతి - సుషేణ - కుండోదర - మహోదర - చిత్రబాహు - చిత్రవర్మన్ - సువర్మన్ - దుర్విరోచన - అయోబాహు - మహాబాహు - చిత్రచాప - సుకుండల - భీమవేగ - భీమబల - బలాకిన్ - భీమ-విక్రమ - ఉగ్రాయుధ - భీమశర - కనకాయు - దృఢాయుధ - దృఢవర్మన్ - దృఢక్షత్ర - సోమకీర్తి - అనూదర - జరాసంధ - దృఢసంధ - సత్యసంధ - సహస్రవాక్ - ఉగ్రశ్రవన్ - ఉగ్రసేన - క్షేమమూర్తి - అపరాజిత - పండితక - విశాలాక్ష - దురాధన - దృఢహస్త - సుహస్త - వాతవేగ-సువర్చస్- ఆదిత్యకేతు - బహ్వాశిన్ - నాగదత్త - అనుయాయిన్ - కవచిన్ -

* "వైశ్యాయాం క్షత్రియాజ్జాతః కరణః పరికీర్తితః"
ఈ ధర్మశాస్త్రము ప్రకారము యుయుత్సుడు 'కరణ' జాతివాడు.

** ఈ నూరుగురి పేర్లు నన్నయ ఆంధ్రభారతములో నించుక వ్యత్యాసముతో నున్నవి. ఇచ్చటనే ధృతరాష్ట్ర సుతులు, మహారథికులలో వ్యత్యాసముగా జయ-సత్యవ్రత-పురుమిత్రులపేర్లు న్నవి. చూడుడు - పుట. 193.

నిషంగిన్ - దండిన్ - దండ ధార - ధనుర్గ్రహ - ఉగ్ర - భీమరథ - వీర - వీరబాహు - అలోలుప - అభయ - రౌద్రకర్మన్ - దృఢరథ - అనాధృష్య - కుండభేదిన్ - విరావిన్ - దీర్ఘలోచన - దీర్ఘబాహు - మహాబాహు - వ్యూఢోరు - కనకాంగద - కుండజ - చిత్రకులు" ఈ నూరుగురికి 'దుశ్శల' అను చెల్లెలు ఉండెను. ఆమెకాక ధృతరాష్ట్రునకు వైశ్యాపుత్రుడైన యుయుత్సుడు గూడ శతాధికుడే, ఈ విధముగ ధృతరాష్ట్రునకు నూటయిద్దరు సంతానము కలరు.

"జనమేజయా ! జ్యేష్ఠానుక్రమముగ ధార్తరాష్ట్రుల పేర్లన్నియు నీకు చెప్పితిని. వీరందరు యుద్ధవిశారదులైన అతిరథశూరులు, వేద - శాస్త్రపండితులు. ధనుర్వేద విద్వాంసులు. ఈ పుత్రుల కందరకు ధృతరాష్ట్రుడు వివాహములు చేసిన తరువాత సైంధవునకు శకుని యనుమతిపై దుశ్శలనిచ్చి పెండ్లి చేసెను."

"రాజా! యుధిష్ఠిరుడు యమధర్మరాజు యొక్క అంశమునందు, భీమసేనుడు వాయు దేవుని యంశమునందు, అర్జునుడు దేవేంద్రుని యంశమునందు, నకుల-సహదేవులు అశ్వినీ దేవతల యంశమునందు కవల పుత్రులుగాను పుట్టిరి."

"రాజా! చంద్రపుత్రుడైన 'వర్చా' అనువాని యంశమునందు 'అభిమన్యుడు' పుట్టెను. ఆతని జన్మకాలమునందు చంద్రుడు దేవతలతో నిట్లనెను:-

"దేవతలారా! నాప్రాణాధికుడైన ప్రియపుత్రుని నేను మీకు చాలాకాలము దాకా ఈయను. ఒక ఒడంబడిక చేసికొని దానిని అతిక్రమించనిచో అసుర నాశముకొరకు సురకార్యార్థమై ఈ నాపుత్రుడు 'వర్చా' భూలోకమునందు పుట్టి ఆకార్యము నెరవేర్చిన తరువాత అక్కడనిలువక తిరిగి నాకడకు రాగలడు. ఒడంబడికతో 'వర్చా' భూలోకములో పుట్టుటకు అంగీకరించుచున్నాను."

దేవతలారా! ఇంద్రపుత్రుడుగా పుట్టబోవు నారాయణ సఖుడైన నరుడు 'అర్జున' నామముతో పాండుపుత్రుడై భూమండలము నందు వెలయును. అతనికి పుత్రుడుగా ఈ 'వర్చా' అనువాడు జనించి పదియారు సంవత్సరములు మాత్రము భూలోకము నందు ఉండ గలడు. ఇతని పదియారవ సంవత్సరపు ప్రాయములో మీ రందరు మనుష్యులుగా పుట్టి యుద్ధము చేసెదరు. అప్పుడు నరనారాయణులను దగ్గర లేకుండ జేసి చక్రవ్యూహము రచియింపబడి మీతో యుద్ధము జరుగును.

దేవతలారా! నాకుమారుడైన 'వర్చా' అభిమన్యురూపములో చక్రవ్యూహము ను భేదించి అందులో దూరి, సమస్తశత్రువులను జయించ గలడు. అభేద్యమైన ఆ వ్యూహమునందు ఇతడు, మహారథికవీరులతో ఘోరయుద్ధము చేసి సగము దినములో శత్రువులలో నాలుగవ భాగము సంహరించ గలడు.

దేవతలారా! తరువాత ఇతడు మహావీరులతో గొప్పగా యుద్ధము చేసి, ఆనాటి సాయంకాలము నాకడకు తిరిగి వచ్చును. ఈలోపుగ వంశకరుడైన ఒక వీరపుత్రుని అభిమన్యుడు కనును. ఆపుత్రుడు నశించిన భరతవంశమును నిలిపి, వృద్ధిచెందించ గలడు"

"జనమేజయా! ఇట్లు చంద్రుడు చెప్పగా విని దేవతలు 'అట్లే యగు గాక!' అని ప్రతివచనము చెప్పి చంద్రుని పూజించిరి."

"జనమేజయా! యిట్లు నీ తండ్రి తాతల జన్మరహస్యము చెప్పితిని.

రాజా! ధృష్టద్యుమ్నుడు అగ్నిదేవుని యంశలో పుట్టెను. శిఖండి స్త్రీపూర్వుడుగ రాక్షసుని యంశములో పుట్టెను. ఐదుగురు ద్రౌపదీపుత్రులు ఐదుగురు విశ్వేదేవగణముల యంశములందు జనించిరి. యుధిష్ఠిరునకు ప్రతివింధ్యుడు, భీమసేనునకు సుతసోముడు, అర్జునునకు శ్రుతకీర్తి, నకులునకు శతానీకుడు, సహదేవునకు శ్రుతసేనుడు అను పుత్రులు ద్రౌపదియందు పుట్టిరి.

"రాజా! యదుకులశ్రేష్ఠుడైన 'శూరసేనుడు' వసుదేవుని తండ్రిగా పుట్టెను. అతని కూతురు 'పృథ' అను నామె అసదృశరూపసంపన్నురాలు. ఆమెను, ఆమె తండ్రి శూరసేనుడు అతని మేనబావయైన కుంతిభోజునకు దత్తపుత్రికగా నిచ్చెను. కుంతిభోజునకు సంతానము లేకుండినందుచేత అతని కోరికపై శూరసేనుడు తన ప్రథమ సంతానమును కుంతిభోజున కిచ్చుటకు ప్రతిజ్ఞచేసి యుండెను. ఆ ప్రకారమే అతడు 'పృథ' నిచ్చెను.

"జనమేజయా! ఆమె పితృగృహమునందు బ్రాహ్మణాతిథిపూజ కొరకు నియోగింపబడెను. ఆమె నియతవ్రతనిష్ఠుడు, ధర్మనిశ్చయము కలవాడు నగు 'దుర్వాసు డను బ్రాహ్మణునకు పరిచర్యచేసి ఆతనిని సంతోషపరచగా, దుర్వాసుడు ఆమెతో 'బిడ్డా! నేను నీ యెడల ప్రీతిచెంది యున్నాను' అని ఆమెకు ఒక

మంత్రమును ఉపదేశించి 'ఈ మంత్రము చేత దేవతలలో నీవు ఎవనిని ఆహ్వానించినను అతడు నిన్ననుగ్రహించి నీకు పుత్రులను ప్రసాదించును' అని చెప్పెను.

"రాజా! ఇట్లు దుర్వాసుడు చెప్పగా ఆ మంత్రమును పరీక్షింపదలచి కుతూహలముతో కన్యకగా నున్న పృథ సూర్యుని ఆహ్వానించెను. వెంటనే సూర్యుడు వచ్చి, ఆమెకు గర్భధారణ చేసి సర్వధనుర్ధరశ్రేష్ఠుడైన కుమారుని కవచకుండల సహితునిగా కనెను. సూర్యసమాన తేజస్సుగల ఆ పుత్రుడు పుట్టగనే బంధుభయము వలన పృథాదేవి అతనిని దాచి, జలమునందు విసర్జించెను."

"రాజా! అట్లు జలములో విసర్జింపబడి ప్రవాహములో పోవుచున్న ఆ బాలకుని అనపత్యుడైన 'అధిరథు'డను సూతజాతివాడు తన భార్య రాధకు పుత్రునిగా నిచ్చెను. ఆ దంపతులు ఆ బాలకునకు 'వసుషేణుడు' అను పేరు పెట్టిరి. ఇట్లు పెరుగుచు ఆ బాలకుడు బలవంతుడు, వేద - ధనుర్వేదాది విద్యల యందు పండితుడునై సర్వవేద శాస్త్రములను నిత్యము జపించు చుండెను."

"రాజా! వసుషేణుడు సత్యపరాక్రముడు. అతడు జపకాలము నందు బ్రాహ్మణులు వచ్చి ఏ వస్తువును యాచించినను ఇచ్చు చుండెను. ఇవ్వగూడని వస్తువు అతనికడ లేకుండెను. ఇట్లుండగా నొకనాడు, ఇంద్రుడు బ్రాహ్మణవేష ధరుడై అతనికడకు వచ్చి తన పుత్రుడైన అర్జునుని హితము కొరకు వసుషేణుని సహజములైన కవచకుండలములను యాచింపగా కర్ణుడు శరీరము వానిని ఛేదించి విడదీసి ఇంద్రునకు ఈయగా, ఇంద్రుడు విస్మయము అతనికి 'శక్తి'ని ఇచ్చి అతనితో నిట్లనెను:-

"కర్ణా! దేవ-అసుర-మనుష్య-ఉరగ-గంధర్వాదులలో నెవనిపైన నైనను నీవు ఈశక్తిని ప్రయోగించిన యెడల అతడొక్కడు మాత్రము మరణించును."

"రాజా! అతనికి పూర్వము 'వసుషేణుడు' అను పేరు ఉండెను. తరువాత కవచకుండలములు కత్తిరించి యిచ్చుటవలన 'వైకర్తనుడు' అని కవచకుండలములతో పుట్టినవాడు కాబట్టి 'కర్ణుడు' అనియు అతనికి పేర్లు వచ్చెను. కర్ణుడు పృథా (కుంతీ) దేవికి మొదటి పుత్రుడు. అతడు సూత (సారథి) కులమునందు పెరుగుచుండెను. అతడు దుర్యోధనునకు మంత్రి - మిత్రుడు. వికర్తనునకు

(సూర్యునను) పుత్రు డగుటచేత నతనికి 'వైకర్తనుడు' అను పేరుగూడ నుండెను."

"రాజా! శ్రీమన్నారాయణమూర్తి యంశమునందు శ్రీకృష్ణుడు అవతరించెను. ఆదిశేషుని యంశముతో బలరాముడు, సనత్కుమారుడు ప్రద్యుమ్నుడుగా (రుక్మిణీకృష్ణుల పుత్రుడు) నవతరించిరి.

"రాజా! ఇట్లే అనేకమనుష్యశ్రేష్ఠులు వసుదేవుని కులమునందు దేవతల యంశములలో పుట్టి కులవర్ధనులైరి. అప్సరసలగణము ఇంద్రాజ్ఞచేత పదియారు వేల దేవీజనముగ మనుష్యలోకములో జన్మించిరి. వారిని శ్రీకృష్ణుడు భార్యలనుగా పరిగ్రహించెను. లక్ష్మీదేవి యంశములో భీష్మకుని కులమందు రుక్మిణీదేవి పుట్టి శ్రీకృష్ణుని పట్టపుదేవి యయ్యెను. శచీదేవి యంశమునందు ద్రౌపది ద్రుపదునియింట, యజ్ఞవేదిమధ్యమున జన్మించెను. ఆమె అతిహ్రస్వముగా, అతి పొడవుగాను లేకుండెను. ఆమె శరీరము నల్లకలువ సుగంధము గలది. ఆమె కన్నులు కమలదళములవలె సుందరములు, విశాలములునై యుండెను. సర్వలక్షణపరిపూర్ణురాలై, వైడూర్యమణిశోభతో విరాజిల్లుచు, మనోహర నితంబములు నల్లనికురులున్ను గలదై ఐదుగురు పురుషశ్రేష్ఠుల మనుస్సులను ఏకాంతమునందు ఆకర్షించినదై యుండును, 'సిద్ధి - ధృతి' యనుదేవత లిరువురు ఆ ఐదుగురు పురుష శ్రేష్ఠులకు తల్లులుగా, 'కుంతీ - మాద్రీ' నామములతో జన్మించిరి. 'మతి' యనుదేవి గాంధారిగా పుట్టెను.

"జనమేజయా! 'దేవాసురులు గంధర్వాప్సరసలు రాక్షసులు వీరియొక్క యంశావతారమును గూర్చి నీకు చెప్పితిని. వా రందరు భూలోకములో యుద్ధకుశలురైన రాజులుగా యదుకులము నందు ఏయే రాజులు, బ్రాహ్మణ-క్షత్రియ - వైశ్యులుగా పుట్టిరో, ఆ యందరి స్వరూపము గూర్చి చెప్పితిని."

"రాజా! ఈ యంశావతార శ్రవణము 'ధన - యశస్ - ఆయుస్ - విజయప్రదము. కనుక దీనిని అసూయారహితుడై వినవలెను. ఈ యంశావతారములు వినినట్టి ప్రాజ్ఞుడు కష్టములందు క్లేశములందున్ను బాధపడడు."

ఇట్లు వైశంపాయనుడు చెప్పగా విని జనమేజయుడు మరల ఆ మహామునిని ఇట్లు ప్రశ్నించెను.

**వంచవ పర్వము నందలి యంశావతరణ కథనము సమాప్తము**

# సంభవ పర్వము నందు శకుంతలోపాఖ్యానము

**దుష్యంతుని రాజ్య శాసన - సామర్థ్యముల వర్ణనము:-**

"మహాత్మా! అంశావతరణము గూర్చి నీ వలన సవివరముగా వింటిని. ఇప్పుడు కురువంశము మొదటినుండి ఎట్లు అభివృద్ధి పొందినదో చెప్పుము."

ఆ మాటకు వైశంపాయనుడు ఇట్లనెను :-

"జనమేజయా! పౌరవవంశకరుడైన దుష్యంతుడను రాజు పరాక్రమవంతుడై నేల నాలుగు చెరగుల, మ్లేచ్ఛదేశము మొదలుకొని అన్ని దేశములు పాలించెను. అతని శాసనములో వర్ణసంకరము మొదలైన అధర్మ కార్యములు జరుగకుండెను. ఎవడు గూడ పాపకర్మలు చేయకుండెను. అందరున్ను ధర్మము నందు ఆసక్తిగలవారై ధర్మార్థసాధనము చేయుచుండిరి."

"రాజా ! దుష్యంతుని రాజ్యములో చోరభయము-ఆకలి భయము వ్యాధి భయమున్ను లేకుండెను. ఆ రాజును ఆశ్రయించి, ప్రజలందరు స్వస్వధర్మము అందు ఆసక్తి గలవారై, దైవాధీనకర్మలందు నిఃస్పృహులై, నిర్భయముగా నుండిరి. అతని రాజ్యకాలములో మేఘుడు సకాలమునందు వానలు కురియుచుండెను. పంటలు రుచికరములుగా నుండెను. భూమి సర్వరత్న (శ్రేష్ఠవస్తువులు) సమృద్ధి పశుసంపదయు కలిగి యుండెను."

"రాజా ! దుష్యంతుని రాజ్యశాసనములో బ్రాహ్మణులు స్వకర్మనిరతులై, అసత్యమాడకుండిరి. ఆ రాజు అద్భుత పరాక్రమ సంపన్నుడు, వజ్రకాయుడు, యువకుడు, మందరపర్వతమును గూడ భుజములపై వహింప గలవాడుగా నుండెను."

"రాజా ! దుష్యంతుడు "1 ప్రక్షేప - 2 విక్షేప - 3 పరిక్షేప - 4 అభిక్షేప"ము లనెడు నాలుగు విధములైన గదాయుద్ధము చేయుటలో సమర్థుడు.

1. దూరమునందున్న శత్రువుపై, గదను విసరి వేయుట 'ప్రక్షేపము' అనబడును.
2. సమీపమునందున్న శత్రువుపై గదయొక్క కొనతో కొట్టుట 'విక్షేపము' అనబడును.
3. శత్రువులు అనేక సంఖ్యలో నున్నప్పుడు, గదను అన్ని వైపుల త్రిప్పుచు కొట్టుట 'పరిక్షేపము' అనబడును.
4. గదయొక్క అగ్రభాగముతో కొట్టుట 'అభిక్షేపము' అనబడును.

అన్ని విధములైన యుద్ధములలో, గజాశ్వారోహణములందున్ను, అతడు ఆరితేరి యుండెను."

"రాజా! దుష్యంతుడు బలమునందు విష్ణువుతో, తేజస్సునందు సూర్యునితో, అక్షోభ్యత్వము(క్షోభిల్లకుండుట)నందు సముద్రముతో, ఓర్పునందు భూమితోను సమానుడై, సర్వసమ్మతుడుగా నుండెను. అతని రాష్ట్రము నందలి పుర-గ్రామములు ప్రసన్నములుగా నుండెను. అట్లు సంతుష్టులైన జనులకు దుష్యంతుడు పలుసార్లు ధర్మోపదేశములు చేయుచు, వారిని ఆజ్ఞాపించుచుండెను."

ఇట్లు వైశంపాయనముని చెప్పగా విని జనమేజయుడు ఆ మునితో నిట్లనెను :-

**దుష్యంతుడు వేటకై అడవికి పోవుట-వివిధ క్రూర వన్యమృగ సంహారము:**

"మహామునీ! నేను భరతకులోత్పత్తిని గూర్చి, శకుంతల జననమును గూర్చియు వినగోరుచున్నాను. దుష్యంతుడు శకుంతలను ఎట్లు పడసెను? ఆ వృత్తాంత మంతయు సవివరముగా చెప్పుము".

ఆ మాటకు వైశంపాయనుడు ఇట్లు చెప్పెను :-

"జనమేజయా! దుష్యంత మహారాజు ఒకప్పుడు దుర్గమారణ్యమునకు చతురంగ బలములతో పోయి వివిధ శస్త్రాస్త్రములు ధరించిన యనేక యోధులతో, భేరీ మృదంగాది వివిధ వాద్యములతో, రథ చక్ర గజ ఘీంకార ధ్వనులతో, అశ్వ ఘోషములతో నలు దిక్కులు మారుమ్రోగుచుండగా, వేటకు పోయెను".

"రాజా! అతడు పురవీథులలో పోవుచుండగా అలంకృతలై మేడల పైన నిలుచుకొని యున్న పౌరాంగనలు, ఇంద్రసమానుడు అమిత్రఘ్నుడునైన ఆ రాజును చూచుచు "ఇతడు ఇంద్రుడే, ఇతని బాహుబలము చేత శత్రువులు పరాజితు లగుదురు" అని చెప్పుకొనుచు ప్రేమతో దుష్యంతుని స్తుతించుచు అతని పై పుష్పవృష్టి గురిపించిరి. దారిలో అక్కడక్కడ బ్రాహ్మణులచేత పొగడ్త బడుచు అతడు వెడలెను.

"రాజా! మదగజారూఢుడైన దుష్యంతమహారాజు ఐరావత గజారూఢుడైన యింద్రుని వలె శోభిల్లుచు పురము వెడలి పోవుచుండగా, నాలుగు వర్ణముల పురజనులు ఆ రాజును అనుసరించి వెంట పోవుచు, అతనికి ఆశీర్వాదములు, జయ శబ్దములు చెప్పుచు చాల దూరము అనుసరించిరి. దుష్యంతుడు వారిని సమాధానపరచి త్రిప్పి పంపి గరుడునివంటి రథముపై త్వరగా వెడలుచు రథ ధ్వనిచేత భూమ్యాకాశములను ప్రతిధ్వనింపజేసెను".

"రాజా! దుష్యంతుడు అట్లు పోయి, నందనవనమువంటి వనము చూచెను. ఆ వనము 'మారేడు-జిల్లేడు-చంద్ర - వెలగ' - మొదలైన వృక్షముల చేత వ్యాప్తమై పర్వతములచేత విషమమై, నిర్జలముగ, నిర్మానుష్యముగ బహుయోజన దీర్ఘముగ, మృగవ్యాఘ్రాది క్రూర వన్యమృగ సమాకులముగను నుండెను.

ఆ వనమంతట దుష్యంతుడు సపరివారముగా కలియ దిరుగుచు వివిధ మృగములను వధించుచు దూరమునందున్న మృగములను బాణములతో భేదించుచు, సమీపించినవానిని ఖడ్గముతో నరకుచు, కొన్ని తేళ్ళను 'శక్తి' ఆయుధముతో సంహరించుచు అమితపరాక్రమశాలియై గదను మండలాకారముగ త్రిప్పుచు తోమర - ఖడ్గ - గదా - ముసలాయుధములను జళిపించుచు స్వేచ్ఛగా తిరుగుచున్న వన గజములను చంపుచు తన యోధులతోపాటు కలియ తిరుగుచ నుండెను. ఆ మహారణ్యమును సింహవ్యాఘ్రాది మృగములు మందలు మందలుగ-విడిచి పోయెను".

"రాజా! వేటలో పరిశ్రాంతములైన మృగములు శుష్కనదులకు పోయి అందు జలము లేకుండుటచేత నిరాశ చెంది బాధపడి వ్యాయామముచేత అలసి పోయి అచేతనములై పడిపోయెను. అవి ఆకలి గొన్న యడవి మనుష్యులచేత, వ్యాఘ్రములచేత భక్షింపబడెను. కొందరు వనేచరులు అగ్ని రగిలించి మృగములను కాల్చి తినిరి. మరికొందరు మృగ మాంసములను నలగ దంచి తినిరి. కొన్ని మదగజములు క్షతగాత్రమ్ములై తొండములు ముడుచుకొని భయము చేత వేగముగ పారిపోవుచు, మలమూత్రములను విడుచుచు నెత్తురు స్రవింపగా పోవుచు మనుష్యులను త్రొక్కుచుండెను. ఆ వనము సైన్యమేఘముచేత విడువ

బడిన శర (జలము) ధారలచేత వ్యాప్తమై, అంతట మృగరాజులు మృగము లున్ను దుష్యంతునిచేత చంపబడి పరవబడి యుండెను".

ఇట్లు చెప్పి వైశంపాయనుడు తరువాతికథ జనమేజయునకు ఇట్లు చెప్ప దొడగెను :

**తపోవన - కణ్వాశ్రమముల వర్ణనము - దానిలో దుష్యంతుని ప్రవేశము :-**

"జనమేజయా! ఆ వనమునందు దుష్యంతుడు అనేక మృగ సంహారము చేసి, ఒక మృగమును తరుముచు మఱియొక వనములో పరిమిత పరివారముతో ప్రవేశించెను. అప్పుడు ఆకలి - దప్పులు అలసట కలవాడై, ఆ రాజు శూన్యమైన ఒక మహావనమును చేరి దానినిగూడ దాటి మరియొక మహావనము చేరెను. అది మునుల యాశ్రమములతో మనస్సునకు, దృష్టికిన్ని సంతోషజనకమై చల్లని వాయువు కలిగి యుండెను."

"రాజా! పూచిన చెట్లు విశాలమైన పచ్చికబయళ్ళు, మధురముగ నినదించు పక్షులు; గండుకోయిలల నినాదములు. ఈల పురుగుల నాదములు పెరిగిన వృక్షముల సుఖకరమైన నీడలు, భ్రమర ఝుంకారములు ఈ మొదలైన వానిచేత ఆ వనము శోభిల్లు చుండెను."

"రాజా! ఆ వనమునందలి వృక్షము లన్నియు ఫల పుష్ప భరితములై, కంటక రహితములై, భ్రమర ఝుంకారనాదితములై యుండెను. పక్షినాదములు గలిగి పుష్పాలంకృతమై సర్వఋతు కుసుమములు గలిగి సుఖప్రదమైన ఛాయ లతో ఆ వృక్ష రాజీ మనోహరముగ నుండెను. అట్టి వనములో దుష్యంతుడు ప్రవేశించెను. పుష్పవృక్షములు గాలిచేత చలించి చిత్ర - విచిత్రములైన పూవు లను కురియు చుండెను. పక్షుల మధురస్వనములచేత నిండిన వృక్షములు ఆ వనమునందు ఆకాశమును తాకుచుండెను. అవి పుష్పము లనెడు వస్త్రములను ధరించి యుండెను."

"రాజా! ఆ వనవృక్షములయొక్క చిగురుటాకులయందు పుష్పముల యందున్ను మధువుకొరకు వచ్చిన భ్రమరములు మధురముగ ధ్వనించు చుండెను. ఆ వనమునందు కుసుమాలంకృతములు లతాగృహశోభితములు మానస ప్రీతివర్ధనములునైన యనేకప్రదేశములను చూచుచు దుష్యంతుడు సంతోషించెను."

"రాజా! ఒండొంటిని ఒరసికొనిన శాఖలు గలిగి, పుష్పభరితములైన వృక్షములచేత ఆవనము సిద్ధ - చారణ-గంధర్వాప్సరోగణములచేత శోభిల్లుచు ఇంద్రవనమువలె నుండెను."

"రాజా! ఆ వనమునందు పుష్పరేణు మిశ్రితమైన సుగంధి శీతలవాయువు వీచుచు వృక్షములతో రమించుటకా యనునట్లు వానిని సమీపించు చుండెను."

"రాజా! ఇట్టి గుణములుగల వనమును దుష్యంతుడు చూచెను. అది, అక్కడ ఒక నదీతీరమునందు అందముగా ఉన్నత ధ్వజమువలె నుండెను. అక్కడ అనేక వృక్షపరివృతమై జ్వలించుచున్న అగ్నిగలదై రమ్యముగా నున్న యొక మున్యాశ్రమమును గౌరవపూర్వకముగ చూచెను. అది, వాలఖిల్యాది మునులచేత, పరివృతమై అగ్నిహోత్ర శాలలచేత నిండి యుండెను. అక్కడ పుష్పములు పరచబడి, పూదోటలచేత, ప్రకాశించుచున్న పవిత్రోదకముగల మాలినీనదిని ఆరాజు చూచెను. ఆ నది అనేక పక్షిగణవ్యాప్తమై, తపోవనములచే మనోహరమై శాంతమృగ - సర్పములుగలదై యుండెను. దానిని చూచి రాజు పరమసంప్రీతుండయ్యెను.

"రాజా ! దేవలోకమువలె సర్వత్ర మనోహరముగ నున్న ఆ యాశ్రమమును సమీపించి దానికడ నున్న పవిత్రోదకనది అన్ని ప్రాణులకు తల్లివలె ఆశ్రయ మిచ్చుచుండెను. ఆనది చక్రవాకపక్షు లనెడు ఇసుకతిన్నెలు, పుష్పము లనెడునురుగుల ప్రవాహమున్ను కలిగి కిన్నెర గణములకు నివాసమై, వానరాదిమృగ సేవితమై పవిత్రవేదాధ్యయన నాదితమై, అనేక పులిన (ఇసుక దిబ్బలు) శోభితమై యుండెను."

"రాజా! ఆ నదీ తీరమునందు భగవంతుడు, మహాత్ముడునైన కాశ్యపుని యొక్క రమ్యమైన యాశ్రమము మహర్షి గణసేవితమై శోభిల్లు చుండెను. ఆ యాశ్రమమును, ఆ నదిని, దుష్యంతుడు చూచి అందులో ప్రవేశింప దలిచెను. మాలినీనదిచేత అలంకృతమైన ఆ యాశ్రమము గంగానదిచేత శోభితమైన నారాయణాశ్రమమువలె నుండెను. మత్తమయూరవ్యాప్తమై చైత్రరథ (కుబేర వనము) సమానమైన యాశ్రమవనములో దుష్యంతుడు ప్రవేశించెను"

"రాజా! ఆయాశ్రమమునందు ఉన్నసమస్త గుణసంపన్నుడు మహా వర్చస్వి కాశ్యపుడు నైన కణ్వమహాముునిని దర్శించుటకు తన చతురంగ సైన్య

మును వనద్వారమునందే నిలిపి వారితో "నేనుమునీంద్రుని దర్శించుటకు పోవుచున్నాను. నేను తిరిగి వచ్చువరకు ఇక్కడనే ఉండుడు" అని చెప్పి నందనవన సమానమైన ఆశ్రమములో ప్రవేశించి దానిరామణీయకమును చూచి అతడు ఆకలి-దప్పులు మరచి అత్యంతానందము పొందెను. అతడు అతనిమంత్రులున్ను కవచ 'కిరీటాదిచిహ్నములు విడిచి వినీతవేషముతో పురోహితుని వెంట దీసికొని ముని దర్శనాకాంక్షతో పోయి బ్రహ్మలోకమువంటి యాశ్రమమును చూచెను"

"రాజా! ఆ యాశ్రమము అనేక పక్షిగణములు గల వృక్షములతో నిండి అచట భ్రమరధ్వనులు వినపడుచుండెను. ఋగ్వేదాది చతుర్వేదములు పదక్రమాదులతో వినపడు చుండెను. యజ్ఞ విద్యా విశారదులైన విద్వాంసులచేత, మధుర సామగానములు చేయుచున్న ఋషులచేత, 'భారుండ' (వివిధసామములపేరు) సామక సామగానములను అథర్వ వేదములను పఠించుచు నియమ వ్రతనిష్ఠులైయున్న యాజకులచేత ఆ యాశ్రమము శోభిల్లు చుండెను. "అథర్వ వేదపండితులు, యాగయజ్ఞియ (అనేక వ్యక్తులకొరకు చేయబడు యజ్ఞమునకు సంబంధించిన) సామగానము చేయువారు, పదక్రమములతో వేద సంహితాపాఠముచేయు వారు శబ్ద సంస్కార యుక్తమైన శాస్త్రములను పఠించు బ్రాహ్మణులు" - ఈ మొదలైన వారిచేత శబ్దించుచున్న ఆ యాశ్రమము బ్రహ్మలోకమువలె భాసిల్లుచుండెను."

"రాజా! యజ్ఞమండప నిర్మాణ కుశలురు, క్రమపాఠ విశారదులు, న్యాయతత్త్వ-ఆత్మజ్ఞాన సంపన్నులు, వేదవిద్వాంసులు, అనేక వాక్య సమన్వయ విశారదులు, విశేషకార్యజ్ఞులు, మోక్షధర్మపరాయణులు, 'స్థాపన (నిర్ణయ) - ఆక్షేప (పూర్వపక్ష)—సిద్ధాంత-పరమార్థములను తెలిసినవారు. వ్యాకరణ-ఛందస్-నిరుక్త' జ్యోతిష-శిక్షా-కల్ప'ము లనెడు షడ్ వేదాంగ విదులు, ద్రవ్య-గుణ-కర్మ జ్ఞాన సంపన్నులు. కార్య (దృశ్యములు) కారణజ్ఞులు, పక్షి-వానర ధ్వని జ్ఞానము కలవారు వ్యాస గ్రంథము నాశ్రయించి మంత్రవ్యాఖ్య (మూల ప్రకృతి) చేయు పండితులు, నానాశాస్త్రకోవిదులు, లోకాయతికులు (స్వాభావమే కర్త యను నాస్తికులు) వీరందరి ధ్వనులు ఆశ్రమమునందు వినపడుచుండెను".

"రాజా! దుష్యంతుడు నియమ నిష్ఠలు కలిగి జపహోమతత్పరులైన బ్రాహ్మణులను అచ్చట చూచెను. ఆ యాశ్రమమునందు విచిత్రములైన యనే

తాసనములు పరవబడియుండుట చూచి, ఆశ్చర్యపడెను. వివిధ దేవాలయములందు పూజలు చేయుచున్న బ్రాహ్మణులను చూచి దుష్యంతుడు తాను బ్రహ్మలోకము నందున్నట్లు తలచెను. అది ఎంత చూచినను అతనికి తృప్తి దీరకుండెను."

"రాజా! మహావ్రతనిష్ఠాగరిష్ఠులైన తపోధనుల చేత పరివృతమై శాంతము, అతిమనోహరము శుభప్రదమునైన యా కణ్వాశ్రమము నందు దుష్యంతుడు మంత్రి పురోహితులతో ప్రవేశించెను."

**శకుంతలా - దుష్యంతుల పరస్పర సంభాషణము; శకుంతల తన జన్మకారణము చెప్పుట - విశ్వామిత్రుని తపోభంగమునకు ఇంద్రుడు మేనకను పంపుట :**

"జనమేజయా! తరువాత దుష్యంతుడు తన పరివారమును ఆశ్రమ బహిర్భాగమునందే ఆపి, తాను ఆశ్రమములో ప్రవేశించెను. ఆ ఆశ్రమమునందు కణ్వమహాముని మొదలైన వారు ఎవరుగూడ లేకుండిరి. దుష్యంతుడు 'ఎవ రిక్కడ?' అని బిగ్గరగా అరచెను. అది విని సాక్షాత్తు లక్ష్మీదేవివలె సమగ్ర సౌందర్యరూపసంపన్నురాలైన యొక కన్యక ఆశ్రమము నుండి బయటికి వచ్చెను. తాపస వేషధారిణియైన ఆ కన్యక, విశాలవక్షము, సింహస్కంధము ఆజానుబాహువులు సర్వలక్షణ లక్షితుడునైన ఆ రాజును చూచి యతనికి స్వాగతము చెప్పి అర్ఘ్య పాద్యాసనములతో అతనిని పూజించి, క్షేమ సమాచారము అడిగి చిరునవ్వుతో, "నీకు ఏసేవ అవసరము? ఈ ఆశ్రమమునకు ఏ పనికై వచ్చితివి? నీ వెవరు?" అని యడుగగా ఆమెతో దుష్యంతుడు ఇట్లనెను:

"శుభాంగీ! నేను, 'ఇలలుడు'* అను రాజర్షి పుత్రుడను. నా పేరు దుష్యంతుడు కణ్వమహామునిని ఉపాసించుటకు ఇక్కడికి వచ్చితిని. కణ్వ భగవాను డిప్పుడు ఎక్కడికి పోయెను?"

"ఆ మాటకు ఆ కన్యక, "నా తండ్రియైన కణ్వ భగవానుడు పండ్లు తెచ్చుటకు అడవికి పోయెను. త్వరలోనే వచ్చును. కొంచెము వేచియుండి ఆయ నను నీవు దర్శించవచ్చును" అని చెప్పెను."

* దుష్యంతుని తండ్రికి 'ఇలలుడు' 'ఈలనుడు' అని రెండు పేర్లు కలవు.

"జనమేజయా! చాలసేపు వేచియున్నను, ఆ మహాముని రాలేదు. అప్పుడు, అతిసౌందర్యశాలినియై, తపస్సు, ఇంద్రియ నిగ్రహము, రూప యౌవనములు" - వీనిచే ప్రకాశించుచున్న యాకన్యతో దుష్యంతు డిట్లనెను :

"సుందరీ! నీ వెవరి కన్యకవు? ఈ వనమునకు ఏల వచ్చితివి, నీ రూప యౌవనములు చూచి, నా మనస్సు అపహరింపబడెను. నీ వివరములన్నియు తెలిసికొన గోరుచున్నాను. నేను 'పూరు' రాజర్షి వంశము నందు పుట్టినాను. నిన్ను వరించదలచినాను. క్షత్రియస్త్రీ యందు దప్ప ఇతర స్త్రీల యందు నా మనస్సు ఎప్పుడుగూడ ప్రవర్తింపదు. కనుక, నీయందు నా మనస్సు లగ్నమై యున్నది. కాబట్టి నీవు క్షత్రియ కన్యవనియే నా విశ్వాసము. నా మనస్సు ఎప్పుడుగూడ బ్రాహ్మణస్త్రీ యందు లగ్నముకాదు. కనుక, నీవు నన్ను వరించి రాజ్యము ననుభవింపుము."

ఇట్లు దుష్యంతుడు చెప్పగా విని ఆమె చిరునవ్వుతో మధురముగా "దుష్యంత మహారాజా! బ్రహ్మర్షి శ్రేష్ఠుడు, ధర్మజ్ఞుడు, మహాత్ముడునైన కణ్వ భగవానునకు నేను కూతురను. ఆ కాశ్యపుడే నాకు గురువు, తండ్రి. నేను అస్వతంత్రురాలను. కనుక, నీ స్వార్థము నెరవేర్చుకొనుటకు ఆయననే ప్రార్థింపుము. ధర్మజ్ఞుడవైన నీవు అయుక్తము చేయగూడదు." అని చెప్పెను.

"ఆ మాటకు దుష్యంతుడు," లోకపూజితుడైన కణ్వమహాముని ఊర్ధ్వరేతస్కుడు, బ్రహ్మచర్య వ్రతనిష్ఠుడుగదా! ధర్మముగూడ తనపరిమితినుండి దాటును. కాని, నియమవ్రతనిష్ఠాపరుడైనయామహాత్ముడు, బ్రహ్మచర్యమును అతిక్రమించడు. అట్టిబ్రహ్మర్షికి నీ వెట్లు కూతురవైతివి? ఈ నా సంశయము తీర్పుము." అని యడుగగా, ఆకన్యక ఇట్లనెను;

"రాజా! నేను ఆ మహాత్మునకు ఎట్లు బిడ్డనైతినో చెప్పెద వినుము. సాధారణముగా కొందరు ఒక విధముగానున్న తన పరిస్థితిని కప్పిపుచ్చి, దానికి వ్యతిరేకముగా పెద్దలకుచెప్పు చుందురు. అట్టిమూర్ఖులు మహాపాపు లగుదురు. ఆత్మాపహారము చేసిన దొంగలే వారు. కనుక, నా జన్మవృత్తాంతమును గూర్చి ఒకమహర్షి యిక్కడికి వచ్చి కణ్వభగవానుని, నీవు ఇప్పుడు నన్నడిగినట్లే, అడుగగా, కాశ్యపుడు ఆ మహర్షితో ఇట్లు నా జన్మవృత్తాంతముగూర్చి చెప్పెను.

"పూర్వము విశ్వామిత్రుడు తీవ్రమైన తపస్సుచేసి దేవేంద్రుని పరితపింప జేసెను. అప్పుడింద్రుడు 'ఈ మహాముని తన తపఃప్రభావము చేత ఇంద్ర పదవినుండి నన్ను భ్రష్టుని జేయును' అని అని భయపడి మేనకను పిలిచి ఆమెతో 'నీవు అప్సరసలందరిలో, నుత్తమ రూప-సౌందర్య సంపన్నురాలవు. సూర్య సమాన తేజస్సుతో భాసిల్లుచున్న విశ్వామిత్ర మహాముని ఘోరతపస్సుచేత నా మనస్సు కంపింప జేయుచున్నాడు. కనుక, అటువంటి అపాయము నాకు గలుగ కుండుటకుగాను నీవు ఆ మహామునిని మోహపరచి నీరూప-యౌవన - మధుర వచన-చేష్టితములచేత అతనికి తపో భంగము చేయుము."

ఆ మాటలకు మేనక యిట్లనెను :-

"మహాభాగా! 'విశ్వామిత్రడు మహాతేజస్వి - తపస్వి అతికోపనుడు' అని నీకుగూడ తెలియును. నీవే యతని కోపమునకు తాళజాలనప్పుడు నాకు సాధ్యమగునా! పూర్వము విశ్వామిత్రుడు వసిష్ఠుని పుత్రుల నందరిని నశింప జేసెను. క్షత్రియ జాతిలో పుట్టిన యతడు, తన తపోబలముచేత బ్రహ్మర్షి పదమును సాధించెను. తన స్నానాదులకొరకు చాల జలముచేత దుర్గమమైన 'కౌశికి' యను పుణ్యనదిని నిర్మించెను.

పూర్వకాలమునందు విశ్వామిత్రుని భార్య దుర్భిక్ష సంకటావస్థలో నున్నప్పుడు, ఆమెను శాపముచేత వ్యాధత్వము పొందిన ధర్మాత్ముడైన మతంగ రాజర్షి భరించి పోషించెను. ఆమె పతియే యీ విశ్వామిత్రుడు.

దుర్భిక్షము గడచిపోయిన తరువాత ఆ ముని తిరిగి ఆశ్రమమునకు వచ్చి ఆ నదికి 'సరా' అను పేరుపెట్టెను

"ఇంద్రా! ఆ విశ్వామిత్రుడు మతంగముని చేసిన యుపకారమునకు ప్రసన్నుడై, తాను పురోహితుడుగా నుండి మతంగునిచేత యజ్ఞము చేయించెను. ఆ యజ్ఞమునందు నీవుగూడ ఆ మునికి భయపడి సోమపానము చేయుటకు పోయి యుంటివిగదా.

ఇంద్రా! ఆ విశ్వామిత్రుడే కుపితుడై, మరియొక లోకమును సృజించెను. నక్షత్రములపైన కోపముతో, 'ప్రతిశ్రవణము' అను మొదలైన నూతన నక్షత్రములను సృజించి యుండెను. ఆ విశ్వామిత్రుడే గురు శాపముచేత, హీనావస్థలో పడియున్న త్రిశంకు మహారాజునకుగూడ శరణమిచ్చి యుండెను.

"దేవతలు అప్పుడు విశ్వామిత్రుని చూచి, ఈ విశ్వామిత్రుడు బ్రహ్మర్షి యైన వసిష్ఠుని శాపమునుండి ఈ త్రిశంకును ఎట్లు విడిపింప జాలును ? అని పరిహసించి త్రిశంకుని యజ్ఞసామాగ్రి యంతయు నష్టపరచిరి. కాని, మహా తేజశ్శాలి, శక్తిమంతుడునైన విశ్వామిత్రుడు ఇతర యజ్ఞసామగ్రిని సృజించి యజ్ఞమును సంపూర్ణము చేసి గురుశాపహతుడైన త్రిశంకునకు అభయమిచ్చి యా రాజును స్వర్గము చేర్చెను."

"దేవా ! ఇటువంటి యనేక మహాకార్యములు చేసిన విశ్వామిత్రుని మాట వినగానే, నాకు భయము కల్గుచున్నది. ఆయన నన్ను దహింపని పద్ధతిలో నాకు ఆజ్ఞ యిమ్ము. ఆ మహాముని తన తేజస్సుచేత లోకములను దహింపగలడు. భూమిని కంపింపగలడు. మహామేరుపర్వతమును కురుచగా చేయగలడు. దిక్కులను త్రిప్పగలడు. అటువంటి తపోమహిమచేత నతడు జ్వలించుచున్న అగ్నివలె నున్నాడు. ఆ మహామునిని నా వంటి స్త్రీ యెట్లు చెనకగలదు ? దీప్తాగ్ని వంటి ముఖము, సూర్యచంద్రులవంటి కనుగ్రుడ్లు, యముని జిహ్వవంటి జిహ్వయు గల యా మహామునిని నా వంటిది యెట్లు తాకగలదు ?

"దేవా ! మహర్షులు, సిద్ధ - సాధ్యులు, వాలఖిల్యాదులు, యముడు మొదలైనవారు విశ్వామిత్రుని ప్రభావమునకు ఉద్వేగము చెందుచుండగా, నావంటిది యెట్లు ఉద్వేగము పొందదు ? ఇట్లుండినను నీ యాజ్ఞ మీరజాలను; కాబట్టి, అతని కడకు నేను పోయెదను. కాని దేవా ! నాకు రక్షణ కల్పింపుము. నాకు సహాయకుడుగా వాయువు, నేను క్రీడించునపుడు వీచుచుండు గాక ! మన్మథుడు నాకుతోడై యుండుగాక. ఇట్లు నేను, ఆ మహామునిని ప్రలోభపరచునప్పుడు సురభివాయువు వీచవలెను."

ఇట్లు మేనక కోరగా, ఇంద్రుడు అంగీకరించెను.

ఇట్లు చెప్పి కణ్వమహాముని తరువాతి నా జన్మవృత్తాంతము ఆ మహర్షికి ఈ విధముగ చెప్ప దొడగెను:-

**మేనకా - విశ్వామిత్రుల సమాగమము :-**

**శకుంతలా జన్మము - శకుంతము లా శిశువును రక్షించుట-కణ్వుడు ఆశ్రమమునకు తెచ్చి శకుంతలా నామకరణము చేయుట :-**

"మహర్షీ! మేనక కోరిక ప్రకారము ఇంద్రుడు వాయువునకు సందేశ మంపెను. వాయువుతోపాటు, మేనక బయలుదేరి పోయి తపస్సుచేత దగ్ధపాపుడైన విశ్వామిత్రునకు నమస్కరించి, అతని సమక్షమున క్రీడించుచుండగా, చంద్రునివంటి ఆమె తెల్లని వస్త్రమును వాయువు తొలగించెను. వెంటనే ఆమె వస్త్రమును గ్రహించుటకు భూమిపైన ఆ మహర్షి చూచుచుండగా వంగెను. అట్లు విషమపరిస్థితిలో నుండి, ఆశగలదై, వస్త్రముకొరకై సంభ్రమముతో నగ్నముగా తిరుగుచున్న మేనకను విశ్వామిత్ర మహాముని చూచి, కామవశుడై ఆమెను దగ్గరకు రమ్మనగా, ఆమె యిచ్ఛపడి వచ్చెను.

"మునీంద్రా! ఆ మేనకా విశ్వామిత్రులు అక్కడ చాలకాలము విహరించుచు యథేచ్ఛగా రమించిరి. చాలకాలము ఒక దినమువలె వారికి గడచెను. కామ - క్రోధములు జయించి క్షమా - సహితుడై ఆ మునీశ్వరుడు చిరకాలము సంపాదించిన తన తపస్సును నష్టపరచుకొనెను. తపోనాశము వలననే, ఆ మునికి మోహము కలుగుటచేత అతనిని మేనక సమీపించగలిగెను. తరువాత, విశ్వామిత్రుడు మేనకయందు శకుంతలను కనెను. రమ్యమైన హిమాలయపు చరియలో మాలినీ నదీ తీరమున ఆ బాలికను మేనక విడిచి, తన కార్యము నెరవేరినందుకు కృతార్థురాలై, తిరిగి ఇంద్రుని కడకు పోయెను".

"మహర్షీ! వనములో సింహ వ్యాఘ్రాది మృగముల మధ్యనున్న ఆ శిశువును శకుంతములు (పక్షులు) చుట్టు చేరి రక్షించెను. అట్లు, శకుంత రక్షితయైన ఆ శిశువును నేను మాలినీ నదికి స్నానార్థమైపోయి చూచితిని. అప్పుడు, ఆ పక్షులు నా పాదములపై వాలి "బ్రహ్మన్! విశ్వామిత్ర సుతయైన యీ బాలికను నీవు న్యాసము (ఇల్లడ)గా భరింపుము. నీ మిత్రుడు విశ్వామిత్రుడు కౌశికీ నది పోయినాడు. కనుక దయాళువైన నీవు అతని పుత్రిని పోషింపుము". అని చెప్పెను. ఆ మాటకు సర్వభూతముల మాటలను తెలిసికొనగల నేను ఆ పక్షుల మాటలను గ్రహించి ఆ కన్యకను తెచ్చి కూతురుగా పెంచితిని.

'జన్మదాత, ప్రాణదాత, అన్నదాత' ఈ ముగ్గురు ధర్మము ప్రకారము తండ్రులే యగుదురు. శకుంతములు ఈ బాలికను రక్షించుటచేత ఈమెకు 'శకుంతల' యని పేరు పెట్టితిని. ఈ విధముగ ఈమె నాకు కూతురగును. ఈమె గూడ నన్ను తండ్రిగానే తలంచుచున్నది.

"దుష్యంత మహారాజా! ఇట్లు నా జన్మ వృత్తాంతమును గూర్చి ఆ మహర్షికి కణ్వమహాముని చెప్పగా వినినాను. కనుక ఈ విధముగా నేను కణ్వునకు బిడ్డను. ఆయన నాకు తండ్రిగానే నాకు జ్ఞానము తెలియునప్పటి నుండి భావించు చున్నాను. ఇది నా జన్మ కథ".

ఇట్లు చెప్పగా విని దుష్యంతుడు ఆమెతో నిట్లనెను :

**శకుంతలా దుష్యంతుల గాంధర్వ వివాహము :-**

"కల్యాణీ! నీ మాటల వలన నీవు రాజపుత్రివని స్పష్టమైనది. కనుక నాకు భార్యవు కమ్ము. నీ కోరిక యేమో తెలుపుము. నెరవేర్చెదను. నీకు సువర్ణ హారములు, కుండలములు, అనేక మణులు నీవు కోరినవి తెచ్చి ఇచ్చెదను. ధనములు, వస్త్రములు, నా సమస్త రాజ్యము నీకు ఇచ్చెదను. ఇప్పుడే గాంధర్వ విధితో నన్ను పెండ్లి చేసికొనుము. వివాహము లన్నింటిలో గాంధర్వము శ్రేష్ఠము".

ఆ మాటకు శకుంతల యిట్లనెను :-

"రాజా! నా తండ్రి ఫలములు తెచ్చుటకు అడవికి పోయినాడు. ఒక ముహూర్తకాలములో వచ్చి, ఆయన నన్ను నీకు ఇవ్వగలడు. అంతదాక వేచి యుండుము. నాకు తండ్రియే ప్రభువు, దేవుడు. ఆయన నన్ను ఎవరికి ఇచ్చునో అతడే నా భర్త. బాల్యమునందు తండ్రి, యౌవనమునందు భర్త, వార్ధకము నందు పుత్రులు స్త్రీని రక్షింతురు. కనుక స్త్రీకి స్వాతంత్ర్యము లేదు. తండ్రి యంగీకారము లేక అధర్మముగా నిన్ను ఎట్లు వరింతును? నీవు గూడ ధర్మజ్ఞుడవేకదా!" ఆ మాటకు 'సుందరీ! ఆ మహాముని మహా దయాళువు, తపోధనుడు, అతనిని గూర్చి నీవు ఇట్లనకుము!' అని దుష్యంతుడనగా, శకుంతల అతనితో, 'రాజా! బ్రాహ్మణులకు కోపమే ఆయుధము. ఇతర శస్త్రము లుండవు. అగ్ని తేజస్సుతో, సూర్యుడు కిరణములతో, రాజు దండముతో, బ్రాహ్మణుడు కోపముతోనూ దహింతురు. క్రుద్ధుడైన బ్రాహ్మణుడు, వజ్రాయుధ పాణియైన యింద్రుడు రాక్షసులనువలె దహించును'. అని చెప్పగా విని దుష్యంతు డిట్లనెను :

"సుందరీ! నన్ను సేవించుచు నీయందే లగ్నమైన మనస్సు కలవానినిగా నన్ను తెలిసికొనుము. తనకు తానే బంధువు, తనకు తానే గతి, తనకు తానే మిత్రుడు, తనకు తానే తండ్రి. కనుక తనను తానే దత్తము చేసికొనుట తగును.

ధర్మసమ్మతములైన వివాహములు ఎనిమిది కలవు. అవి *బ్రాహ్మ-దైవ-ఆర్ష-ప్రాజాపత్య-ఆసుర-గాంధర్వ-రాక్షస-పైశాచ'ములు అని.

"ఈ యెనిమిదింటిలో పూర్వ పూర్వములు ధర్మ్యములు అని స్వాయంభువమనువు చెప్పెను. మొదటి నాలుగు బ్రాహ్మణునకు తగినవి. ఆరు వివాహములు క్షత్రియునకు ధర్మ్యములు. రాజులకు రాక్షస వివాహము, వైశ్య-శూద్రులకు ఆసుర వివాహము చెప్పబడినది. చివరి ఐదింటిలో ప్రాజాపత్యాదులు మూడు ధర్మ్యములు, రాక్షస-పైశాచములు అధర్మ్యములు. పైశాచ - ఆసుర వివాహములు రెండున్ను ఎప్పుడుగూడ చేయగూడదు. ఈ విధి చేతనే వివాహ కార్యము జరుపవలెను. గాంధర్వ - రాక్షస వివాహములు క్షత్రియులకు ధర్మ్యములు. నీవు సందేహింపకుము. ఈ రెండు వివాహములు విడివిడిగా గాని, కలిసి గాని, చేసికొన వచ్చును. కనుక, భామినీ! సకాముడనైన నాకు సకామురాలవైన నీవు గాంధర్వ వివాహ విధిచేత భార్యవు కాదగుదువు." "జనమేజయా! దుష్యంతుని మాట విని శకుంతల అతనితో నిట్లనెను:-

విద్య, ఆచారము గల సజాతీయవరుని పిలిచి అతనిని వస్త్రాదులచే వధువుతోపాటు అలంకరించి చేయు వివాహము బ్రాహ్మ మనబడును. (2) యజ్ఞము ప్రారంభించినప్పుడు శాస్త్రోక్తముగ యజ్ఞకర్మ జరిపిన ఋత్విక్కును అలంకరించి కన్య నిచ్చి చేయు వివాహము దైవము అనబడును. (3) ధర్మార్థము వరునినుండి గోమిథునము శుల్కముగా తీసికొని కన్య నిచ్చి శాస్త్రప్రకారముగ చేయబడునది. ఆర్షవివాహ మనబడును. (4) 'మీ దంపతులిద్దరు కలిసి ధర్మము చేయు'డని వరునితో మాట్లాడి కన్యనిచ్చి చేయునది ప్రాజాపత్య వివాహము. (5) ధని మిచ్చి కన్యను కొని చేసుకొనునది ఆసుర వివాహము. (6) వధూవరులు పరస్పరేచ్ఛతో చేసికొనబడునది గాంధర్వ వివాహము. (7) బలాత్కారముగ కన్య నపహరించుకొనివచ్చి చేసికొనునది రాక్షస వివాహము. (8) నిద్రపోయి కాని, త్రాగి మైమరచిగాని యుండి, తన శీలమును రక్షించుకొనుటకు పరాకుపడియున్న కన్యను, సంభోగేచ్ఛచే రహస్యముగా చేసికొనునది పైశాచ వివాహము.

"రాజా! నీవు చెప్పినట్లే నాకు నేనే ప్రభువు. ఇట్టి వివాహము ధర్మ సమ్మతమైన యెడల, నన్ను నేను నీకు ఇచ్చుటకు నీ వాకశపథము చేయవలెను. నీవు నేను చెప్పినట్లు ప్రతిజ్ఞ చేయుము. అది ఏమనగా-నాకు నీవలన పుట్టబోవు పుత్రుడు నీ తరువాత రాజ్యాధికారి కావలెను. ఈ నియమము నీవు సత్యముగా అంగీకరించినచో నీతో నాకు సమాగమము కలుగును."

"జనమేజయా! శకుంతలమాట విని దుష్యంతుడు ఆమె కోరికను, ఏ మాత్రము వెనుకాడక, అంగీకరించి ఆమెతో,నతడు "శుభాంగీ! నా నగరమునకు నిన్ను గౌరవ పూర్వకముగా తోడ్కొని పోయెదను" అనిచెప్పి ఆమెను గాంధర్వ విధిచేత పాణిగ్రహణము చేసికొని ఆమెతో కొంత సేపు ఉండి ఆమెను విశ్వసింప జేసి తననగరమునకు వెడలి పోవుచు, 'ప్రియే! నిన్ను నానగరమునకు తోడ్కొని వచ్చుటకు చతురంగ సేనను పంపెదను.' అని చెప్పి ఆమె నాలింగనము చేసి కొనగా నామె, అతనికి ప్రదక్షిణ నమస్కారములు చేసి, అశ్రుముఖియై అతని పాదములపై పడగా, నత డామెను లేవనెత్తి, 'దుఃఖింపకుము. పుణ్యముపైన శపథముచేసి చెప్పు చున్నాను. నిన్ను తప్పక నగరమునకు తోడ్కొని పోయెదను' అని చెప్పెను.

"జనమేజయా! దుష్యంతుడు అట్లు శకుంతలకు ప్రతిజ్ఞ చేసి, మనస్సులో 'భగవంతుడైన కాశ్యపుడు మహా తపస్సంపన్నుడు, ఈ విషయము తెలిసి యే మనునో'యని చింతించుచు తన పట్టణమునకు పోయెను."

జనమేజయా! ఆ ముహూర్తకాలము గడవగనే కణ్వమహాముని ఆశ్రమ మునకు రాగా, శకుంతల సిగ్గుచేత అతనికడకు పోవలేక అతనితో మాట్లాడ జాలక యుండెను. ఆ విధముగ ధర్మచ్యుతురాలైతినని ఆమె భయపడియుండగా చూచి, కణ్వమహాముని ఆమెతో, 'బిడ్డా! నీవు పూర్వమువలె లేవు. సిగ్గుతో నున్నావు. జరిగిన సమాచారము చెప్పుము. భయపడకుము' అని యడుగగా, శకుంతల లజ్జితురాలై అతికష్టముగా గద్గదస్వరముతో ఇట్లనెను :

"తండ్రీ! ఈపేరు "ఈలినః" అని సంస్కృతమున యున్నట్లు ఆంధ్ర భారతమున చెప్పబడినది. ఇలిల పుత్రుడైన దుష్యంతమహారాజు ఇక్కడికి రాగా, దైవయోగముచేత అతనిని నేను పతిగా వరించితిని. నీవు శాంతించి నన్ను క్షమింపుము. మహాయశస్వియైన ఆ రాజు నాకు భర్త. ఆ తరువాతి సంగతి నీవే దివ్యజ్ఞానముచేత తెలిసికొనగలవు. నన్ను అనుగ్రహింపుము."

''జనమేజయా! కణ్వమహాముని దివ్యజ్ఞానము చేత సమాచార మంతయు తెలిసికొని, ప్రీతిపూర్వకముగ శకుంతలతో నిట్లనెను :".

"మంగళకరురాలా! నీవు నేడు నాకు తెలియకుండ రహస్యముగ పురుషునితో చేసిన సమాగమము ధర్మవిరోధము కాదు. క్షత్రియునకు గాంధర్వ వివాహము శ్రేష్ఠము. 'పరస్పర ప్రేమ గల క్షత్రియ వధూ - వరులు మంత్ర రహితముగ రహస్యముగ గాంధర్వ వివాహము చేసికొనవచ్చు' నని ధర్మ శాస్త్రములో చెప్పబడినది. దుష్యంతుడు ధర్మాత్ముడు, మహాత్ముడు, పురుషోత్తముడు. అట్టి వానిని నీవు పతిగా వరించితివి. అది మంచిదే. నీకు మహాబలవంతుడైన పుత్రుడు పుట్టగలడు. అతడు సముద్రముద్రితమైన సమస్త భూమండలమును ఏల గలడు. అతని రథచక్రములు సాగుటకు ప్రపంచమునందు ఎక్కడ గూడ అడ్డు ఉండదు. చక్రవర్తి కాగలడు."

"జనమేజయా! తరువాత ఆ మహాముని పాదములను కడిగికొని ఆయన విశ్రమించి యుండగా శకుంతల ఆయనతో నిట్లనెను :

"తండ్రీ! నేను వరించిన దుష్యంతుని, అతని మంత్రి పురోహితాది పరివారమును అనుగ్రహింపుము." ఆ మాటకు కణ్వమహాముని 'బిడ్డా! నీ కొరకు అతనియెడల నేను ప్రసన్నుడనై ఉన్నాను. అనేక ఋతువులు నీకు వ్యర్థముగా గడిచి పోయెను. అది యిప్పుడు సార్థక మాయెను. ఇందులో నీకు పాపము లేదు. వరము కోరుకొనుము ఇచ్చెదను' అని యనగా, శకుంతల దుష్యంతుని హితము కోరుచు అతని కొరకు ధర్మిష్ఠత్వము, రాజ్యచ్యుతి లేకుండుట వరము కోరెను.

"జనమేజయా! శకుంతల కోరిన వరమును కణ్వమహాముని యిచ్చి, లక్ష్మీదేవివలె నున్న బిడ్డను చేతులతో ప్రేమపూర్వకముగ తడవి, 'బిడ్డా! నేటి నుండి నీవు మహాత్ముడైన దుష్యంతుని దేవివి. నీవు పతివ్రతలవృత్తిని పాలించుచు సుఖముగా నుండుము" అని చెప్పెను.

**శకుంతలకు పుత్ర జననము :**

**శకుంతలా పుత్రుని యద్భుత పరాక్రమము - పుత్రునితో శకుంతల దుష్యంతుని కడకు పోవుట - శకుంతలా - దుష్యంతుల సంవాదము - ఆకాశవాణి కథనము - భరతుని పట్టాభిషేకము :**

"జనమేజయా ! దుష్యంతుడిట్లు ప్రతిజ్ఞ చేసి వెడలిపోయిన తరువాత, శకుంతల గర్భవతియై, రాజును చింతించుచు స్నాన - పానాదులు వీడి రాత్రిం బగళ్ళు నిద్రలేక గడపెను. రాజు పంపు చతురంగబలములు, నేడో రేపో తనను కొనిపోవుటకు వచ్చును' అని నిశ్చయించుకొని దినములు, వారములు, పక్షములు, మాసములు, ఋతువులు, అయనములు లెక్కపెట్టుచునే మూడు సంవత్సరములు గడపెను.

అప్పుడు అమిత-పరాక్రమశాలియైన పుత్రుని మూడు సంవత్సరములు గర్భధారణ చేసి కనెను. అతడు జ్వలించుచున్న యగ్నివలె ప్రకాశించుచు, రూప-సౌందర్యాది గుణములచేత భాసిల్లుచు నుండెను. అప్పుడు, అంతరిక్షము నుండి ఆ బాలకునిపై పుష్పవృష్టి కురిసెను. దేవదుందుభులు మ్రోగెను. అప్సరసలు పాడుచు నృత్యము చేసిరి.

అప్పుడు ఇంద్రుడు దేవతలతో గూడి, అంతరిక్షము నుండి శకుంతలతో, 'బిడ్డా ! నీ పుత్రుడు చక్రవర్తి కాగలడు. అతడు అసమాన బల - రూపములు కలిగి యుండును. నూరు అశ్వమేధయాగములు, అనేక సహస్ర రాజసూయాది యాగములున్ను చేసి తన ధనము నంతటిని బ్రాహ్మణులకు దక్షిణగా నిచ్చును' అని చెప్పెను.

"జనమేజయా ! దేవతల మాటను కణ్వాశ్రమవాసులు విని శకుంతలను సమ్మానించిరి. శకుంతల గూడ సంతోషించి అక్కడి మునులను బ్రాహ్మణులను పూజించెను.

తరువాత కణ్వమహాముని వర్ధమానుడైన యా బాలకునకు శాస్త్రోక్తముగా జాతకర్మాది సంస్కారములు చేసెను. శుభ్రమైన పలువరుస, సింహమువంటి శరీరము, శంఖచక్రాంకిత హస్తములు, కాంతి, పెద్ద శిరస్సు, మహాబలమున్ను గల యా కుమారుడు, దేవకుమారునివలె వర్ధిల్లు చుండెను.

ఇట్లా బాలుడు కణ్వాశ్రమమునందు ఆరు సంవత్సరముల ప్రాయము వరకు పెరిగి, సింహ-వ్యాఘ్ర-వరాహ-మహిష-గజాది వన్యమృగములను పట్టి తెచ్చి, వృక్షములకు బంధించు చుండెను. వానిపై స్వారి చేయుచు, వానిని అదుపుచు, వానితో ఆడుకొనుచు, వానితో పరుగెత్తుచు, వినోదముగ కాలము గడపుచుండెను.

"జనమేజయా! ఆ బాలకుడు రాక్షసులను, పిశాచములను, శత్రువులను ముష్టియుద్ధములో జయించి, మునులను ఆరాధించుచు నుండెను. ఒక రాక్షసుడు ఆ బాలకుని చంపుటకు రాగా అతనిని నవ్వుచునే బాహువులచేత బంధించి, పీడించి నలిపెను. ఆ రాక్షసుని సర్వ శరీర ద్వారములనుండి రక్తము చిమ్మెను. ఆ రాక్షసుడు అప్పుడు అరచిన శబ్దముచేత, సింహాది క్రూరమృగములు, ఆశ్రమ వాసులున్ను మిక్కిలి భయముచెంది మలమూత్రములు విసర్జించిరి. క్రింద పడవేసి మోకాళ్ళతో నొక్కి బాలకుడు ఆ రాక్షసుని చంపెను."

"జనమేజయా! ఆ బాలకుని యత్యద్భుత శౌర్యమును చూచి, రాక్షసులు అతని భయమువలన ఆ యాశ్రమమువైపునకే పోవజాల కుండిరి. తరువాత, కణ్వాశ్రమవాసు లందరు 'ఇతడు సర్వమును దమించు చున్నాడు (అణచు చున్నాడు) కనుక అతనికి 'సర్వదమనుడు' అని పేరు పెట్టిరి."

"జనమేజయా! దుష్యంతుడు భార్యా పుత్రులకొరకు సైన్యము పంపక పోవగా, శకుంతల విరహబాధచేత శరీరమంతయు పాలిపోయి వెంట్రుకలు విరియబోసికొని మలిన వస్త్రముతో దీనురాలై యుండెను. అట్లున్న శకుంతలను చూచి కణ్వమహాముని మిక్కిలి చింతించెను. ఆ బాలకునకు పన్నెండు సంవత్సరముల వయస్సు వచ్చువరకు ఆమహాముని సర్వవేద - శాస్త్రములు నేర్పెను.

"జనమేజయా! ఆ కుమారుని, అతని అమానుష పరాక్రమమునున్ను చూచి, కణ్వమహాముని 'ఇతనికి యౌవరాజ్యాభిషేక సమయము వచ్చినది' అని శకుంతలతో నిట్లనెను:-

"బిడ్డా! పతివ్రతలకు విశిష్టమైన మాట చెప్పెద వినుము. పతిసేవ మనోవాక్కాయకర్మలచేత చేయవలెను. ఈనా యాజ్ఞను నీవు అన్నిటికంటె మొదటి వ్రతమువలె ఆదరించవలెను. ఇట్టి ప్రవర్తనచేతనే, నీకు సర్వోత్కృష్టమైన సంపద కలుగును ఇక నీవు పతికడకు పోవలెను. అతడు స్వయముగా రాలేదని ఇంతకాలము గడపితివి. పతిహితము కోరుచు నీవు అక్కడికి పోయి దుష్యంతుని సేవింపుము. యౌవరాజ్యపట్టాభిషిక్తుడైన నీ కొడుకును చూచి నీవు ప్రీతి చెందగలవు. దేవతలకు, గురువులకు, క్షత్రియులకు, విశేషించిభర్తకు హితము తలచుచు వారితో కలియుట యుక్తము కనుక నీకుమారునితో పతికడకు పోవుట నాకు చాల ప్రియము. ఈ మాటకు బదులు చెప్పకుము. ఈ మాట దప్పినచో నాపాదములపై ఒట్టేసుమా!"

"జనమేజయా! ఇట్లు కణ్వమహాముని శకుంతలకు ఆజ్ఞ యిచ్చి, మనుమని ఆలింగనము చేసికొని, తల మూర్కొని అతనితో నిట్లనెను:-

"నాయనా! చంద్రవంశమునందు ప్రసిద్ధుడైన దుష్యంత మహారాజునకు నీ తల్లి పట్టపుదేవి. ఆమె నీతో కలిసి నీతండ్రి కడకుపోవ గోరుచున్నది. నీవు అక్కడికిపోయి; ఆ రాజునకు నమస్కారము చేసి, యౌవరాజ్యమును పొందగలవు. నీ తండ్రియైన ఆ రాజేంద్రునివశములో నీవు మెలగి తండ్రి-తాతల రాజ్యమును అనుభవింపుము."

"జనమేజయా! తరువాత, కణ్వమహాముని శకుంతలతో, 'బిడ్డా! పతివ్రతాత్వగుణములను విడిచినచో ఏ పనియు నీవు సాధింప జాలవు. పతివ్రతల యెడల దేవతలు సంతుష్టులై కోరినవరము లిచ్చి ఆస్త్రీలకు ఆపదలు వచ్చినప్పుడు అనుగ్రహించి ఆదుకొనెదరు. పతిప్రసాదము వలన పతివ్రతలు ఎప్పుడుగూడ అశుభములు పొందక పుణ్యలోకము చేరెదరు. కనుక నీవు రాజుకడకు పోయి అతనిని ఆరాధింపుము' అని చెప్పెను."

"జనమేజయా! కణ్వమహాముని యుక్తవయస్కుడైన బాలకుని చూచి అతనిబలము తెలిసికొని శిష్యులతో, 'మీరు శకుంతలను పుత్రునితోపాటు త్వరగా తోడ్కొని పోయి ఆమెభర్తయిల్లు చేర్చుడు. స్త్రీలు, తమ బంధువుల యొద్ద చాల కాలము నివసించుట తగదు. అది ఆ స్త్రీలయొక్క కీర్తిని, నడవడికను, ధర్మమును నశింపజేయును. కనుక త్వరగా ఈమెను తోడ్కొని పొండు' అని చెప్పెను."

"జనమేజయా! శకుంతల కాశ్యపుని-మాటలు విని సంతోషించెను. 'ఇక వెడలి పొమ్ము' అని కణ్వుడు ఆ బాలకునితో ననగా, నతడు అంగీకరించి, తల్లితో, 'తల్లీ! ఎందుకు జాగు చేయుచున్నావు? రాజగృహమునకు ఇక పోవుదము' అని, ఆ మహాముని పాదములకు నమస్కరించి 'పోవుట కాజ్ఞ యిమ్మని' ప్రార్థించెను. శకుంతలగూడ తండ్రికి ప్రదక్షిణ - నమస్కారములు చేసి, చేతులు జోడించి ఇట్లనెను :-

"తండ్రీ! నీవు తండ్రి వని చనవుతో అజ్ఞానమువలన నేను చెడుమాటలు అసత్యములు చెప్పి యుందును. చెడుపనులు, నీకు ఇష్టము లేని కార్యములుచేసి యుందును. నన్ను క్షమింపుము." ఆ మాటలు విని కణ్వమహాముని తల వంచు

కాని ఏమియు మాట్లాడక మహాత్ముడైనను మనుష్య భావముచేత కన్నీరు కార్చెను. జలము, వాయువు, ఎండుటాకులు, ఫలమూలములు భక్షించి ఇంద్రియ నిగ్రహులై కృశించి, తపోవ్రతనిష్ఠితులై, జటావల్కలాజినములు ధరించి యున్న ఆశ్రమవాసులైన మునులను పిలిచి కణ్వుడు వారితో నిట్లనెను :

'మునులారా! యశస్వినియైన యీ నా పుత్రిని మిక్కిలి ప్రేమతో లాలించి పెంచితిని. ఈమె అడవిలో పుట్టి పెరిగినది. గనుక ఏమియు ఎరుగదు. కనుక శ్రమము కలుగని మార్గముతో మీ రందరు ఈమెను రాజగృహమునకు తోడుకొనిపొండు".

"జనమేజయా! కణ్వుని యాజ్ఞ ప్రకారము ఆశ్రమవాసులు శకుంతలను ముందిడుకొని ఆమె పుత్రునితోపాటు దుష్యంతపురమునకు వెడలి పోయిరి".

"జనమేజయా! దుష్యంత భవనమునందు మునులు రాజు నొద్దకు శకుంతలను, ఆమె పుత్రుని తోడుకొని పోయి రాజునకు ఒప్పగించి తిరిగి తమ యాశ్రమమునకు వెడలి పోయిరి".

"రాజా! తరువాత శకుంతల దుష్యంతుని పూజించి, ధర్మయుక్తముగా పుత్రునితో, 'పుత్రా! నీ తండ్రికి నమస్కరింపుము' అని చెప్పి, సిగ్గుతో తల వంచుకొని స్తంభము నానుకొని రాజు సమక్షములో నిలిచెను. శకుంతలా పుత్రుడు గూడ రాజున కభివాదము చేసి అంజలి బద్ధుడై, సంతోషముతో రాజును చూచుచు నిలిచి యుండెను".

"జనమేజయా! ధర్మబుద్ధిగల వాడైన దుష్యంతుడు ధర్మ చింతతోనే, యోచించుచు, శకుంతలతో, 'భామినీ! నీవు వచ్చిన కార్య మేమియో చెప్పుము. తప్పక చేసెదను' అని యనగా, శకుంతల దుష్యంతునితో నిట్లనెను :

"మహారాజా! శాంతింపుము. ఈ నీ పుత్రుని యౌవరాజ్యమునందు అభిషేకింపుము. దేవ సమానుడైన యీ కుమారుడు నీ వలన నాకు పుట్టెను. నీవు, నాతో పూర్వము చేసిన ప్రతిజ్ఞమేరకు నడచుకొనుము. రాజా! పూర్వము కణ్వాశ్రమమున నాతో నీకు సమాగమమైనప్పుడు నీవు చేసిన ప్రతిజ్ఞ స్మరింపుము."

ఆ మాట విని దుష్యంతుడు పూర్వప్రతిజ్ఞ స్మరించుచున్నను 'నాకు స్మరణకు వచ్చుట లేదు' అని చెప్పి, మరల శకుంతలతో నిట్లనెను:-

"దుష్టతాపసీ! నీ వెవరిదానవు? నీతో ధర్మకామార్థ సంబంధము నాకు కలిగినట్లు జ్ఞప్తికి వచ్చుట లేదు. కనుక నీవు ఇష్టము వచ్చినచోటికి పొమ్ము."

"జనమేజయా! అట్లు కఠినముగ దుష్యంతుడు చెప్పగా విని శకుంతల దీనురాలై లజ్జతో చైతన్యము వీడి కదలనిగుంజవలె దుఃఖించుచు నిలిచి తొందర పాటుతో, కోపముతో, ఎఱ్ఱబారిన కన్నులు గలదై పెదవు లదరగా తన కటాక్షములచేత రాజును దహించుచున్నదా యన్నట్లు ఓరకంట అతనిని చూచెను. తన యాకారమును దాచుకొనుచు కోపోద్రిక్తురాలై తపస్సుచేత సంపాదించిన తేజస్సును ధరించిన శకుంతల ముహూర్తకాలము ధ్యానము చేసి, దుఃఖ-క్రోధ భరితయై భర్తతో నిట్లనెను :

"రాజా! అజ్ఞానివలె ప్రాకృతుడవై నిర్భయముగ నిస్సందేహముగా 'నా కేమియు తెలియ' దనుచున్నావే. ఈ విషయములో సత్యాసత్యములను గూర్చి నీ హృదయమే నీకు చెప్పుచున్నది."

"రాజా! నీ మనస్సాక్షిగా చెప్పుము. నిన్ను నీవు అవమాన పరచు కొనకుము. తానొక విధముగా నుండి, దానికి వ్యతిరేకముగా చెప్పినచో నతడు ఆత్మాపహారము చేసిన చోరుడగును. అతడు మహాపాపము చేసినవాడగును."

"రాజా! నేనొక్కడనే ఉన్నానని అనుకొనుచున్నావు. నీ హృదయము నందున్న పురాణపురుషుని తెలిసికొనకున్నావు. ఆ పరమాత్ముడు పాపకర్మ లన్నియు నెరుగును. అతని సమక్షములోనే పాపముచేయు చున్నావు. సమస్త సత్పురుషులకు హితము చేయునది ధర్మమే. ఆ ధర్మము సత్యవాదులకు దుఃఖ ప్రదము కాదు. పాపము చేయువాడు 'తనను ఎవరుగూడ ఎరుగరు' అని తల చును. కాని దేవతలు, అంతర్యామిగానున్న పరమాత్ముడు, సూర్యచంద్రాగ్ని వాయుపులు, భూమ్యాకాశములు, జలము, హృదయము, యముడు, అహోరాత్ర ములు, ఉభయ సంధ్యలు, ధర్మము నరునియొక్క ప్రవర్తనను బాగుగా తెలిసికొందురు".

"రాజా! హృదయమునందు కర్మసాక్షిగా నున్న క్షేత్రజ్ఞుడైన పరమా త్ముడు ఎవని ప్రవర్తనము పట్ల సంతుష్టు డగునో, యతని పాపమును, వైవస్వతుడైన యముడు తొలగించును. పరమాత్ముడు ఎవని యెడల సంతుష్టుడు కాడో, అట్టి పాపకర్ముని పాపమును యముడు తొలగించడు. ఎవడు తనను

తాను అవమానపరచుకొని యథార్థమునకు వ్యతిరేకముగా ప్రవర్తించునో, అతనికి దేవతలు శ్రేయస్సు కల్గించరు. ఎవనికి ఆత్మగూడ సత్య నిర్ణయము నందు కారణము కాదో, వానికి శ్రేయస్సు కలుగదు".

"రాజా! 'నేను స్వయముగా వచ్చితి'నని అవమానించకుము. పతివ్రత, పూజార్హురాలు, నీ సమక్షమునకు వచ్చిన భార్యయైన నన్ను ఆదరించకున్నావు. ప్రాకృత పురుషునివలె సభలో నన్ను ఏల ఉపేక్షించుచున్నావు? నేను నిర్జన ప్రదేశములో ఏడ్చుట లేదు. అయినను, నా మొర వినకున్నావు. ఈ విధముగ దైన్యముతో యాచించుచున్న నా మాట నీవు విననిచో, రాజా! నీ తల నూరు వ్రక్కలుగా పగిలిపోవును."

"రాజా! భార్యకు 'జాయ' అని పేరు. అనగా, 'పతి, భార్యయందు ప్రవేశించి పుత్రుడుగ జనించును' అని యర్థము. ఇదియే జాయకు జాయాత్వము' అని పెద్దలు చెప్పిరి. అట్టి భార్యనుండి పుట్టిన పుత్రుడు తండ్రిని, తత్పూర్వులైన పితామహాదులను 'పుత్' అనునరకమునుండి తరింప జేయును. కనుకనే, కొడుకునకు 'పుత్ర' నామ వ్యవహారము కలదు. ఇది బ్రహ్మదేవుడు చెప్పినమాట. 'పుత్రునిచేత తండ్రి లోకములను జయించును. పౌత్రునిచేత తాత అవినాశ్యమైన లోకమును పొందును. మునిమనుమనిచేత ముత్తాత శాశ్వతానందమును పొందగలడు' అని శాస్త్రజ్ఞులు చెప్పెదరు.

"రాజా! 'గృహ కృత్యములందు దక్షురాలు, సంతానవతి, పతియే ప్రాణముగా దలచునది, పతివ్రతయునైనదియే భార్య యగును. మనుష్యునిలో సగముపాలు భార్య. ఉత్తమ మిత్రుడు భార్య. ధర్మార్థసాధనమునకు మూలము భార్య. సంసార సముద్ర తరణమునకుగూడ మూలము భార్యయే యని ఎరుగుము. భార్యావంతులే క్రియావంతులు. భార్య గలవారే గృహస్థులు. వారే సంతోషముతో నుండెదరు. భార్యావంతులకే సంపదలు చేకూరును. ప్రియభాషిణులైన భార్యలు విజనప్రదేశములందు మిత్రులుగ, ధర్మకార్యమునందు పితరులుగ, రోగాదిబాధలందు తల్లులుగాను నుండెదరు.

"రాజా! భార్యలుగల వారినే లోకులు విశ్వసించెదరు. కనుక పురుషునకు భార్యయే పరమగతి అని తెలియుము. సంసారము చేయునపుడు, మరణించినప్పుడు, సంకటావస్థలో నున్నప్పుడుగూడ పతివ్రతయైన భార్య సర్వదా

భర్తను అనుసరించును. పతికన్న తొలుత మరణించిన భార్య పరలోకమునందు పతికై ఎదురుచూచు చుండును. తనకన్న పూర్వము మరణించిన పతితో సహ గమనము చేసి సతి యగును. పతి, భార్యను ఇహలోక పరలోకముల యందు పొందును. కాబట్టియే 'పాణిగ్రహణము' అను పవిత్ర కార్యము జరుగుచున్నది.

"రాజా! 'తనచేత జనింపబడిన తానే పుత్రుడగు'నని పెద్దలు చెప్పెదరు గనక భార్యను పురుషుడు తన తల్లివలె, పుత్రుని తల్లివలెను ఉభయ విధము లుగ భావింపవలెను. అందరి యంతరాత్మయే పుత్రుడు అను పేరుతో చెప్ప బడును.* పుత్రులయందు తండ్రి ప్రవర్తన, రూపము, చేష్టలు, నడులు, లక్షణ ములున్ను కనపడుచుండును. పితృ సంబంధము చేత పుత్రులకు తండ్రుల స్వభావ - సదాచారములు మొదలైన శుభాశుభ గుణములు కలుగును. భార్య యందు పుట్టిన పుత్రుని అద్దమునందు ముఖమునువలె తండ్రి చూచి తన పుణ్యముచేత స్వర్గము పొందినంతగా ఆహ్లాదించును.

"రాజా! మహాదుఃఖములచేత, వివిధ రోగములచేతను దహింపబడుచున్న పురుషులు తమ భార్యల యందు, గ్రీష్మాతపము చేత పీడితులైనవారు శీతల జలములందు వలె, ఆహ్లాదించెదరు. వియోగముచేత కృశులు, దీనులు, మలిన వస్త్రధారులునైన దరిద్రులు గూడ భార్యను పెన్నిధివలె చూచుచు, సంతోషించె దరు. ఎంత తొందరపాటు కలవాడైనను పురుషుడు భార్య యందు తన రతి, ప్రీతి, ధర్మమున్ను వశములై యున్నవని తలచి, ఆమెకు అప్రియము చేయడు. 'తనలో అర్ధభాగము భార్యయే' యనుట వేద సమ్మతము. భార్య పతికి అర్ధభాగముగా నుండి ధనము, సంతానము, శరీరము లోక యాత్ర, ధర్మము, ఋషులను, పితృదేవతలనున్ను రక్షించును. తాను పుత్రు డుగా జన్మించుటకు స్త్రీలు సనాతనములైన పుణ్య క్షేత్రములు గదా! మహాతప శ్శక్తి సంపన్నులైన మహర్షులు గూడ స్త్రీ లేక ప్రజోత్పత్తి చేయజాలరు. పుత్రుడు పుట్టి, దుమ్ములో పొరలాడి, ఆ మలిన శరీరముతో తండ్రిని ఆలింగ నము చేసికొనినప్పుడు తండ్రికి దానికంటె మించిన యానందమేమి యుండును?.

* (ఈ యర్థమే 'ఆత్మా వై పుత్రనామాఽసి') అని వేదము చెప్పుచున్నది.

రాజా! కనుక, అభిలాషపడి స్వయముగా నీకడకు వచ్చి నిన్ను ప్రేమతో చూచుచున్న కొడుకును ఎందుకు అవమానపరచు చున్నావు? తాము కనిన అండములను చీమలుగూడ పగులగొట్టవు. ఇట్లుండగా ధర్మజ్ఞుడవైన నీవు నీ యాత్మజుని ఏల భరింపకున్నావు? కాకులు గూడ కోకిలములను తమ యండములుగానే భావించి, పెంచి, పోషించును. సర్వజ్ఞుడవైన నీవు ఇట్టి ఉత్తము పుత్రుని ఏమని తలచుచున్నావు? 'మలయ పర్వతము' నుండి పుట్టిన చందనము 'అతిశీతల' మనెదరు. దానికంటె అత్యధిక శీతలమైనది పుత్రాలింగనము. పుత్రాలింగనము వలన కలుగునట్టి సుఖము 'స్త్రీలు, వస్త్రములు, జలములు' ఈ మొదలైన వాని స్పర్శమువలన గూడ కలుగదు.

"రాజా! ద్విపాదులలో బ్రాహ్మణుడు, చతుష్పాదులలో గోవు, గొప్పవారిలో గురువు, స్పర్శ సుఖమిచ్చు వారిలో పుత్రుడున్ను శ్రేష్ఠులు. కనుక, రాజా! ప్రియదర్శనుడైన ఈ నీపుత్రుడు నిన్ను కౌగిలించుకొని స్పృశించుగాక! పుత్రస్పర్శకంటె అధికసుఖము నిచ్చునది లోకములో మరియొకటి ఏదియు లేదు.

"రాజా! మూడేండ్లు పూర్తిగ నిండిన తరువాత నేను ఈ పుత్రుని కనినప్పుడు 'ఇతడు నీకు శోకవినాశకరు డగును. నూరు అశ్వమేధ యాగములు చేయగలడు' అని అంతరిక్షవాణి నాకు చెప్పెను. ప్రపంచములో పుత్రస్నేహము చేత తండ్రులు పుత్రులను ఒడిలో ఎక్కించుకొని గ్రామాంతరమునకు నడచుచు పోయెదరు. పుత్రునితలను మూర్కొని ఆనందించెదరు.

"రాజా! పుత్రులజాతకర్మ అనుష్ఠించునపుడు వేదములలో ఈమంత్ర చెప్పెదరు:-

"అంగాదంగాత్సంభవసి హృదయాదధిజాయసే
ఆత్మా వై పుత్రనామాఽసి, సజీవ శరదశ్శతమ్
జీవితం త్వదధీనం మే సంతానమపి చాక్షయమ్
తస్మాత్ త్వం జీవ మే పుత్ర సు సుఖీ శరదాం శతమ్"

ఇది నీకు తెలియనిది కాదు ఈ మంత్రమువలన పితాపుత్రుల యవినాభావ సంబంధము స్పష్టముగా తెలియు చున్నది.

"రాజా! నీశరీరమునుండి ఈపుత్రుడు పుట్టెను. ఒక పురుషుని నుండి మరియొక పురుషుడు ఒక సరస్సునుండి మరియొక సరస్సు పుట్టినట్లుగా నీకు, ఈకుమారుడు ప్రతిరూప మని తలచుము. యజ్ఞమునందు గార్హపత్యాగ్నినుండి ఆహవనీయాగ్నిని తెచ్చినట్లుగా నీ నుండి యితడు జన్మించెను. నీ వొకడ వైనను రెండుగా నున్నా వని తలచుము.

"రాజా! పూర్వము నీవు వేటలో మృగముచేత ఆకృష్టుడవై, పరుగెత్తుచు మా యాశ్రమునకు వచ్చి కన్యకగా నున్ననన్ను పొందితివి.'ఊర్వశి, పూర్వచిత్తి, మేనక, విశ్వాచి, సహజన్య, ఘృతాచి' ఈ ఆరుగురున్ను అప్సరసలలో శ్రేష్ఠురాండ్రు. వారిలో మేనక బ్రహ్మపుత్రి. ఆమె స్వర్గమునుండి భూమికి వచ్చి విశ్వామిత్రమహాముని వలన నన్ను కనెను. ధర్మపరుడు, రెండవయగ్నివంటివాడు నగు కుశమహారాజునకు విశ్వామిత్రుడు ప్రపౌత్రుడు. కుశుని పుత్రుడు ధార్మికుడైన కుశనాభుడు. అతని కొడుకు గాధిరాజు. ఆ గాధి కొడుకే విశ్వామిత్రుడు. ఆయన నాకు తండ్రి. మేనక తల్లి.

మేనక హిమాలయ సానువు నందు నన్నుకని, కులట ఇతరుని వలన కనిన సంతానమునువలె నన్ను అక్కడ పడవేసి వెడలి పోయెను. అప్పుడు, పుణ్యవంతములైన శకుంతములు దయతో నన్ను రెక్కలతో కప్పి కాపాడుట చేత నాకు 'శకుంతల' అనుపేరు ఏర్పడెను. (అనగా శకుంతముల చేత రక్షింపబడినది అని యర్థము.)

రాజా : తరువాత, కాశ్యపుడైన కణ్వమహాముని అగ్నిహోత్ర జలార్థమై మాలినీనదీ తీరమునకు పోవగా, పక్షులు చూచి దయాళువైన ఆ మునికి న్యాసము (ఇల్లడ)గా నన్ను ఇచ్చెను. ఆ మహాముని నన్ను అరణిని (అగ్నిచిలుకు కొయ్య) వలె తన యాశ్రమమునకు కొనిపోయి ఆదరించి దయతో కన్నబిడ్డ వలె పెంచెను.

రాజా : నేను విశ్వామిత్రుని బిడ్డను. కణ్వమహాముని చేత పెంచబడిన దానను. యౌవనమునందున్న నన్ను నీవు ఆశ్రమము నందలి పర్ణశాలలో విజనస్థలమునందు చూచితివి. అట్లు కుమారిగా నుండి, తండ్రి సమక్షంలో లేనప్పుడు దైవయోగముచేత నన్ను గాంధర్వ విధిని పరిగ్రహించి అనేక సత్య వచనములు చెప్పి సంతానము కొరకు పురికొల్పితివి.

రాజా! అట్టి నేను నీపుం-సత్యవాదిత్వములను, స్వధర్మమును దృష్టియం దుంచుకొని నిన్ను నమ్మి శరణు జొచ్చితిని. కనుక నీవు ప్రతిజ్ఞాభంగము చేయ దగవు. నీకడకు వచ్చిన నన్ను స్వధర్మమును వెనుకకు నెట్టి నీవు విడువగూడదు. నిన్నే నాథునిగా ఎంచితిని. నిరపరాధురాలనైన నన్ను లోకనాథుడవైన నీవు విస ర్జించుట తగదు. నేను పూర్వజన్మలో ఏ యశుభకర్మ చేసితినో, ఈ జన్మమున బాల్యమునందు బాంధవులైన తల్లిదండ్రులచేత, ఇప్పుడు పతివైన నీచేతను విడువ బడితిని. ఇక నేను నా యాశ్రమమునకే తిరిగి పోయెదను. ఈ బాలకుడు నీ పుత్రుడు గనుక ఇతనిని నీవు విడువదగవు. కాబట్టి ఇతనిని నీకడనే విడిచి పోయెదను."

"జనమేజయా! యిట్లు శకుంతల చెప్పగా విని దుష్యంతుడు ఆమెను అధిక్షేపించుచు మరల నిట్లనెను:-

"శకుంతలా! నాకు నీయందు ఈ పుత్రుడు కలిగినట్లు నాకు తెలియదు. స్త్రీలు అసత్యవచనములు చెప్పెదరు. కనుక, నీ మాటలు ఎవడు నమ్మగలడు? నిర్దయురాలు, వేశ్యయునైన మేనక నీకు తల్లి. బ్రహ్మర్షి పథమునందు దురాశగల విశ్వామిత్రుడు నిర్దయుడు. అతడు కామవశుడై నిన్ను కనెను. అట్టివాడు నీకు తండ్రి. హిమాలయమునందు నీ తల్లి నిన్ను నిర్మాల్యమువలె విడిచి పోయెను. అటువంటి యధర్మపరులైన తల్లి-దండ్రులకు పుట్టితివి కనుకనే నీవుగూడ కులట వలె మాట్లాడు చున్నావు. ఇట్లు అవిశ్వసనీయమైన మాట చెప్పుచున్న నీకు సిగ్గు లేదా? విశేషించి రాజసభలో చెప్పుచున్నావు. దీనిచేత నీ కులటాత్వము స్పష్టమగు చున్నది.

దుష్టతాపసీ! ఇక్కడినుండి వెడలి పొమ్ము. మహర్షి ఎక్కడ? మేనక ఎక్కడ? తాపసీ వేషధారిణివైన నీవెక్కడ! ఈ యల్పకాలములోనే, ఇతడు మద్దిచెట్టువలె పెరిగినాడు. నీ యోని అతి నికృష్టమైనది. నీవు స్వేచ్ఛాచారిణియై, కామవశురాలైన మేనకకు పుట్టిన కులటవు. నీవు చెప్పుమాట లేవియు నేనెరుగను. ఒక్కటిగూడ ప్రత్యక్షముగ నేను చూడలేదు. నీ వెవతెవో నేనెరుగను. కనుక నీ యిష్టము వచ్చినచోటికి పొమ్ము."

"జనమేజయా! యిట్లు దుష్యంతు డాడిన దుర్భాషలు విని, శకుంతల యతని నధిక్షేపించుచు నిట్లనెను :

"రాజా! నీవు ఆవగింజలంతటి యితరుల దోషములను చూచెదవు. కాని, బిల్వఫల ప్రమాణము గల నీ దోషములను నీ వెరిగి యుండియు చూడకున్నావు. మేనక దేవతాకాంత. దేవత లామె ననుసరించెదరు. అట్టి స్త్రీకి నేను పుట్టితిని. కనుక, నీ జన్మకంటె నా జన్మ ఉత్కృష్టమైనది. నీవు భూమిపై తిరిగెదవు. నేనో అంతరిక్ష సంచారము చేయుదానను. మన యిరువురిలో మేరుపర్వతమునకు ఆవగింజకు నున్నంత భేదము కలదు. ఇంద్ర - కుబేర - యమ - వరుణాది దిక్పాలకుల భవనములకు స్వేచ్ఛగా నేను పోవు చుందును. నా ప్రభావము ఎంత గొప్పదో తెలిసికొనుము.

"నీకు సత్యమైన యొకమాట చెప్పెదను. అది ద్వేషముచేత చెప్పను. నిదర్శనముకొరకై చెప్పెదను. విని నన్ను క్షమింపుము. అది ఏమనగా,-వికార రూపము గలవాడు, తన ముఖమును అద్దమునందు చూడనంతవరకు తాను ఇతరులకన్న మిక్కిలి అందగాడ నని తలచును. అద్దములో చూచినపిదప తనకు ఇతరునకున్ను గల భేదము తెలిసికొనును.

అతి రూప సంపన్నుడు ఎవరినిగూడ అవమానపరచడు. దుర్వచనములు వదరువాడు ఇతరుల మనస్సునకు కష్టము గలిగించు మాటలాడు (విహేఠకుడు) వాడుగా నుండును. మూర్ఖుడు, పురుషులు పలుకు శుభాశుభ వచనములు విని వానిలో అశుభమునే - పంది పురీషము (మలము)ను వలె స్వీకరించును. బుద్ధిమంతులు వట్లు గాక పురుషుల శుభాశుభ వచనములలో శుభవచనమున్నే, హంస నీటి నుండి క్షీరమునువలె స్వీకరించును.

"రాజా! సత్పురుషుడు ఇతరులను నిందించి పరితపించును. దుర్జనుడు పరనిందచేయుచు సంతుష్టుడగును. సత్పురుషులు పెద్దలకు నమస్కరించి, శాంతి జెందెదరు. మూర్ఖులు సత్పురుషులను ఆక్రోశింపజేసి శాంతి పొందెదరు. దోషజ్ఞులు కానివారు సుఖముగా జీవించెదరు. దోషమును మాత్రమే చూచు మూర్ఖులు పరులచేత నిందింపబడుచు సత్పురుషులను గూడ నిందనీయులనుగానే తలచెదరు."

"రాజా! దుర్జనుడు, సత్పురుషుని 'దుర్జను'డని చెప్పుటకన్న పరిహాసాస్పదమైన విషయము మరియొకటి యేమున్నది? సత్య - ధర్మముల నుండి

భ్రష్టుడై సర్పమువలె కృద్ధుడైన పురుషుని చూచి నాస్తికుడే, ఉద్వేగము చెందు ననగా, ఆస్తికుని విషయము చెప్పవలసిన దేమున్నది?"

"రాజా! తనకు సమానుడైన పుత్రుని స్వయముగా కని స్వీకరించని తండ్రి యొక్క సంపదలను దేవతలు నశింపజేసెదరు. ఆతడు ఏ పుణ్యలోకము లను గూడ పొందడు. పుత్రుడు కుల - వంశ ప్రతిష్ఠాకారకుడు, సర్వ ధర్మము లలో నుత్తముడునని పితృదేవతలు చెప్పెదరు. కాబట్టి, రాజా! పుత్రుని విడువ గూడదు."

"రాజా! మనువు పంచవిధ పుత్రులను చెప్పెను :- 1) తన పత్నినుండి పుట్టిన ఔరస పుత్రుడు, 2) ఇతర స్త్రీలకు పుట్టి - తాను గైకొనినవాడు 3) ధనమిచ్చి కొనినవాడు, 4) పోషింపబడినవాడు, 5) ఉపనయనాది సంస్కార ములు చేయబడినవాడు - ఈ యైదుగురు కొడుకులని మనువు చెప్పెను."

"రాజా! ఈ పుత్రులందరు కులధర్మమును, కీర్తిని పెంచుచు మనస్సుకు సంతోషము కలిగించెదరు. పుత్రులు తండ్రులకు ధర్మపు పడవలై, నరకము నుండి తండ్రులను తరింపజేసెదరు. కనుక, రాజా! నీవు పుత్రుని విడువదగవు. సత్య ధర్మపరుడవై, ప్రజలను పాలించు నీవు కపటముగా వ్యవహరింప దగవు.

నూరు నూతులకన్న ఒక నడ బావి మేలు. నూరు నడబావుల కన్న ఒక యజ్ఞానుష్ఠానము శ్రేష్ఠము. నూరు క్రతువులకన్న ఒక పుత్రుడు ఉత్తముడు. నూరుగురు పుత్రులకన్న సత్యము అత్యుత్తమము. వేయి అశ్వమేధ యాగములు త్రాసులో ఒకవైపు ఉంచి మరియొక పళ్ళెములో సత్యమును ఉంచి తూచినప్పుడు అశ్వమేధ సహస్రముకన్న సత్యమే ఎక్కువ బరువుగ తూగును. సత్యవచన ముతో సర్వ వేదాధ్యయనములు, సర్వతీర్థయాత్రలు సమములు కావచ్చు ననుట సంశయాస్పదము. సత్యమునకు ఈడైన ధర్మము మరియొకటి లేదు. సత్యముకన్న మించినది లేదు. అసత్యముకన్న తీవ్రతరమైనది మరియొకటి లేదు.

రాజా! సత్యము పరబ్రహ్మ స్వరూపము. అదియే ఉత్తమవ్రతము. కనుక, నీవు చేసిన సత్య ప్రతిజ్ఞను విడువకుము. దానిని పాలింపుము. నీవు అసత్యమునే పలుకుచు, నిన్ను నీవు నమ్మకయుండిన యెడల, నేను వెడలి

పోయెదను. నీవంటి వానితో మాట్లాడుట సముచితము కాదు. ఏ బాలకుని యందు తండ్రియొక్క బుద్ధి, గతి, స్వరము, స్మృతి, బలము, శీలము, విజ్ఞానము, విక్రమము, ధైర్యము, సుడులు, స్వభావము, రోమములున్ను సమానముగ నుండునో, ఆ బాలకుడు అతని పుత్రుడే యనుటకు సందేహము లేదు. నీ సాదృశ్యముచేత నీ దేహ ప్రతిబింబముగా, విరాజిల్లుచు ఈ బాలకుడు 'తండ్రీ!' యని నిన్ను పిలుచు చున్నాడు. అట్టి వీనిని వ్యర్థముగా నీవు విడువకుము.

నీవు లేకున్నను, ఈ బాలకుడు పర్వతములు శిరోభూషణములుగా గల చతుర్దిగంత భూమండలమును పాలించగలడు. పూర్వము ఇంద్రుడు నాతో 'శకుంతలా! ఈ నీ కొడుకు చక్రవర్తికా గలడు' అని చెప్పినమాట అన్యథా కాదు. ఆ మాటకు దేవదూత లెందరో సాక్ష్యము పలికిరి. వారు సత్యాసత్యములు యధార్థముగ పలికెదరు. కనుక, రాజా! నాకు ఇక్కడ సాక్ష్యము చెప్పువారు లేరు. కాబట్టి, మందభాగ్యురాల నైన నేను వచ్చిన చోటికే పోయెదను.''

"జనమేజయా! యిట్లు చెప్పి శకుంతల అక్కడినుండి వెడలుటకు బయలుదేరగా, అంతరిక్షమునుండి అశరీరవాణి మంత్రి పురోహితాది పరివృతు డైన దుష్యంతునితో నిట్లనెను.

"దుష్యంతమహారాజా! పుత్రునకు తల్లి 'సంచి' వంటిది. కనుక, ఆ పుట్టిన కొడుకు తండ్రికే చెందును. కనుక, పుత్రుని నీకు భరింపుము. శకుంతలను అవమానపరచకుము. సర్వావయవములనుండి పుత్రుడు తండ్రికి అంగముగ పుట్టును. 'పుత్రుడు ఆత్మకంటె వేరుకాడు. నీయాత్మచేతనే కలిగిన నీయాత్మ స్వరూపుడైన యీ పుత్రుని రక్షింపుము. అనన్యగతకురాలై, నీ కడకు వచ్చిన శకుంతలను అవమాన పరచకుము.

స్త్రీలు అసమాన పవిత్రురాండ్రు అని తెలిసికొనుము. ప్రతిమాసము వారికి కలుగు రజస్సు వారి పాపము లన్నియు నశింప జేయును. ఇది ధర్మ సమ్మతము. తండ్రిరేతస్సును ధరించిన పుత్రుడు, తండ్రిని, యమలోకమునుండి ఉద్ధరించును. నీవే ఈమెకు గర్భమును ధరింప జేసితివి. శకుంతల సత్యమే చెప్పెను. తండ్రి తన శరీరమును పుత్రుని రూపములో రెండుగా చేయును. తల్లి పుత్రుని కనును. కనుక, శాకుంతలుడైన యీ పుత్రుని భరింపుము. జీవించియున్న యీ పుత్రుని విడిచినచో, నీకు, అశుభము కలుగును. మామాట

చేత నైనను నీవు ఈ బాలకుని భరింపక తప్పదు. కనుక, ఇతడు 'భరతుడు' అను పేరుతో నుండుగాక!''

''జనమేజయా! ఇట్లు దేవతలు, మునులున్ను 'ఈమె పతివ్రతయే' అని చెప్పి హర్షముతో ఆమెపై పుష్పవృష్టిని కురిసిరి. దేవతలమాట విని దుష్యంతుడు మంత్రి పురోహితులతో 'దేవదూతల భాషితము మీరు వింటిరి కదా! నేనుగూడ శకుంతల మాట సత్యమే అని, ఇతడు నా కొడుకే అనియు ఎరుగుదుము. ఒక వేళ నేను, ఈమె మాటపైననే, ఈమెను, కుమారునిన్ని స్వీకరించిన యెడల, లోకులు నన్ను సందేహించి ఈ పుత్రుడు పరిశుద్ధుడు కాడని తలంచెదరు' అని నేను ఇట్లు నటించితిని."

"జనమేజయా! యిట్లు దుష్యంతుడు దేవదూతమాట చేత ఆ బాలకుని పవిత్రత్వమును నిరూపింప చేసి, సంతోషముతో పుత్రుని స్వీకరించెను. తరువాత, దుష్యంతుడు ఆదర పూర్వకముగా అతని తల మూర్కొని, ఆలింగనము చేసికొని, అతనికి చేయవలసిన శుభకర్మలన్నియు చేసెను.

తరువాత, దుష్యంతుడు, బ్రాహ్మణుల చేత, వంది - మాగధుల చేతను సమ్మానింప బడుచు స్తుతింప బడుచు పుత్రగాత్ర స్పర్శమువలన పరమానంద మందెను."

''రాజా! తరువాత, దుష్యంతుడు ధర్మనుసారముగా భార్య యైన శకుంతలను సమ్మానించి ఊరడించుచు నిట్లనెను :-

''ప్రియే నీతో నాకు సంబంధము ప్రజలకు పరోక్షముగ జరిగినది. కనుక, నీ శుద్ధి కొరకు ఇట్లు చేయుట మంచిదని నేను తలచితిని. ఇక నిప్పుడు ఈ రాజ్యములోని నాలుగు వర్ణములవారు పతివ్రతవైన నిన్ను ఏమాత్రము సందేహించక పూజించగలరు. కనుక, ఈ రాజ్యమునందు ఈ కుమారుని పట్టాభిషిక్తుని జేయవలెనని నేను తలచినాను.

"ప్రియే! నీవు నా యెడల మిక్కిలి కోపించి ఎన్నియో అప్రియ వచనములు పలికితివి. నీవు నాకు ప్రియురాలవు. కనుక, నేను నిన్ను క్షమించితిని. నేను అసత్యమునో నీకు ఇష్టముకాని మాటనో, దుష్ట భాషణమునో, పలికి దుష్కృత్యము చేసితిని. కనుక నా దుర్వచనములను నీవు గూడ క్షమింపుము. ఓర్పు గల స్త్రీలు పాతివ్రత్యముతో భాసిల్లెదరు".

"జనమేజయా! యిట్లు రాజర్షియైన దుష్యంతుడు ప్రియురాలైన పట్టమహిషికి చెప్పి ఆమెకు అన్న-పానీయ-వస్త్రాదు లిచ్చి సంభావించెను."

"జనమేజయా! తరువాత, దుష్యంతుడు 'రథంతర్య' అను తన తల్లి దగ్గరకు పోయి ఆమెతో 'అమ్మా! ఈ కుమారుడు నా పుత్రుడు. వనము నందు పుట్టినాడు. ఇతడు నీ శోకమును పోగొట్టును. ఈ నీ పౌత్రునిచేత నేను ఋణ విముక్తుడనైతిని. ఈ కాంత, విశ్వామిత్రుని కూతురు. కణ్వ మహామునిచేత పెంచబడినది. ఈమె నీకు కోడలు. ఈమె పేరు శకుంతల. ఈమె యెడల నీవు ప్రసన్నురాలవు కమ్మా' అని చెప్పెను".

"జనమేజయా! రథంతర్యాదేవి కొడుకు చెప్పిన మాటలు విని మనుమని కౌగిలించుకొని, తనకు పాద ప్రణామము చేసిన శకుంతలనుగూడ కౌగిలించుకొని హర్షాశ్రువులు రాల్చి శకుంతలతో ఇట్లనెను:

"బిడ్డా! ఈ కుమారునకు చక్రవర్తి లక్షణములున్నవి. కనుక, నితడు చక్రవర్తి కాగలడు. నీ భర్త దుష్యంతుడు త్రిలోక విజయమును సాధింపగలడు. నీవు దివ్య భోగములను అనుభవించుచు సుఖముగా నుండగలవు".

"జనమేజయా! ఇట్లు రథంతర్యాదేవి శకుంతలకు చెప్పి మిక్కిలి సంతోషించెను. అప్పుడు రాజు శాస్త్రోక్త విధిచేత శకుంతలను పరిగ్రహించి సర్వాభరణ భూషితురాలిని చేసి, అగ్రమహిషిగా స్వీకరించి బ్రాహ్మణులకు, సైనికులకు విరివిగా ధనమును పంచెను."

"జనమేజయా! తరువాత దుష్యంతుడు శకుంతలా పుత్రునకు 'భరతుడు' అని నామకరణము చేసి, అతనిని యౌవరాజ్యమునందు పట్టాభిషిక్తుని జేసెను. దుష్యంతుడు భరతుని యందు యౌవరాజ్య భారము ఉంచి కృతకృత్యుడాయెను. తరువాత, దుష్యంతుడు నూరు సంవత్సరములు రాజ్యపాలనము చేసి, వివిధ దానములు చేసి స్వర్గలోకమునకు పోయెను."

"జనమేజయా! తరువాత మహాత్ముడైన భరతుని యొక్క అతి తేజస్వంతము, దివ్యము, అజేయము, ప్రపంచమును మార్మ్రోగించునదియు నగు చక్రము* సర్వత్ర ప్రవర్తిల్లెను. భరతుడు సమస్త రాజులను జయించి, వశ

*ఇచట 'చక్ర' శబ్దమునకు గల విశేషణములను బట్టి, భరతుని కడ సుదర్శనచక్ర సమానమైనదే మరియొక చక్రము ఉండి యుండునని అనుమానము కలుగుచున్నది.

పరచుకొని, సత్పురుషుల ధర్మమును ఆచరించి, అసమానయశమును సంపాదించెను."

"జనమేజయా! భరతుడు ప్రతాపవంతుడైన చక్రవర్తియై అనేక యజ్ఞములు, ఇంద్రునివలె చేసెను. కణ్వమహాముని అతనితో ఆ యజ్ఞములు చేయించెను. యజ్ఞములందు భరతుడు భూరి దక్షిణలు ఇచ్చి, అనేక గోవులను దానము చేసెను. అతడు అశ్వమేధ యాగము చేసి, సహస్ర పద్మముల (వేల కొలది లక్షల) ధనము నిచ్చి కణ్వమహామునిని పూజించెను."

"జనమేజయా! భరతునివలన భారతదేశము కీర్తి వర్ధిల్లి, ఇది 'భారత కులము' అని ప్రసిద్ధి చెందెను. ఈ భరత వంశమునందు పూర్వము ప్రఖ్యాతులుగా మహాపరాక్రమశాలురుగా, దేవసమానులుగా, బ్రహ్మకల్పులుగను ననేక రాజులు విరాజిల్లిరి. అసంఖ్యాకులైన వారిపేర్లు సర్వత్ర వ్యాపించి యున్నవి. వారిలో సత్యము, ఋజుత్వమున్ను గల యతిముఖ్యులనుగూర్చి చెప్పెద వినుము:-

**దక్ష - వైవస్వతమనువులు - వారిపుత్రుల ఉత్పత్తి :**
**పురూరవస్ - నహుష - యయాతుల చరిత్ర :-**

"జనమేజయా! ఇప్పుడు నేను దక్షప్రజాపతి-వైవస్వతమనువు-భరతుడు-కురువు - పూరుడు - అజమీఢుడు - మొదలైన యాదవ - కౌరవ - భరత వంశీయుల కులపరంపరను గూర్చి నీకు వర్ణించి చెప్పెదను. వారికులములు పరమపవిత్రములు, మహామంగళకరములు 'ధనము - కీర్తి-ఆయువు'లను కలిగించునవి."

"రాజా! ప్రచేతసునకు (వరుణుడు) మహాతేజస్వంతులైన పదుగురుపుత్రులుండిరి. వారందరు పుణ్యకర్ములు, మహర్షులవంటి సత్పురుషులు నని ప్రసిద్ధి. వారు, పూర్వము తమముఖములనుండి వెడలించిన అగ్నిచేత ప్రాణిపీడాకరములైన పెద్దపెద్దవృక్షములను కాన్చి భస్మముచేసిరి."

"రాజా! ఆపదుగురు ప్రాచేతసులకు 'మరిష' అనునామె గర్భమునుండి దక్షప్రజాపతి జన్మించెను. ఆ దక్షుని నుండియే సమస్త ప్రజాసంతతి ఉత్పన్నమయ్యెను. ఆ ప్రాచేతసులు సమస్త ప్రపంచమునకు పితామహులు.

"జనమేజయా! ప్రాచేతసముని యైనదక్షుడు 'వీరిణి'[1] యనుభార్యతో సమాగమము చేసి, తనవంటి గుణ - శీలములు గల వేయిమంది పుత్రులను కనెను. ఆవేవురు కఠోరనియమనిష్ఠా పరులుగ నుండిరి. ఆ వేయిమందికి దేవర్షి యైననారదుడు మోక్షశాస్త్రము నేర్పి, పరమోత్తమ మైన సాంఖ్యాజ్ఞానమును ఉపదేశించెను.

"జనమేజయా! ఆ వేయిమంది జ్ఞానము చేత విరక్తులై, ఇల్లు విడిచి పోయినప్పుడు దక్షప్రజాపతి మరల సంతానోత్పత్తి చేయవలె నను నిచ్చచేత, పుత్రికవలన దౌహిత్రుడు కలిగినప్పుడు ఆ పుత్రికనే తన పుత్రుడుగ చేసికొన దలచి, ఏబదిమంది పుత్రికలను కనెను."

"రాజా! వారిలో పదుగురను ధర్మునకు, పదుమ్ముగ్గురు కన్యలను కశ్య పునకు, కాలమును నడుపుటకు నియుక్తములైన నక్షత్రముల[2] రూపములో నున్న యిరువది యేడుగురు కన్యకలను చంద్రునకున్ను దక్షుడు ఇచ్చి వివా హము చేసెనని యిదివరకే చెప్పబడెను.

"రాజా! మరీచినందనుడైన కశ్యపుడు తన పదుమ్ముగ్గురు భార్యలలో పెద్దదైన దక్షకన్య 'అదితి' గర్భము నుండి యింద్రాదులైన పన్నెండుగురు ఆదిత్యులను కనెను. తరువాత, ఆమె నుండియే వివస్వంతుని (సూరుని) కనెను. సూర్యుని పుత్రుడు యముడు; కనుకనే యమునకు 'వైవస్వతుడు' అను పేరు కలదు. అతను సమర్థుడై సమస్త ప్రాణులకు నియంతగా నున్నాడు. ఆ వివ స్వంతునకే పుత్రుడుగా పరమ బుద్ధిశాలియైన మనువు పుట్టెను. అతడు మహా ప్రభావశాలి. మనువునకు తమ్ముడుగా, వివస్వంతునకు 'యముడు' అను పుత్రుడు కలిగెను. ఆ యముడు ప్రాణుల నందరిని నియమించుటకు సమర్థుడు."

"జనమేజయా! మనువు మహాధర్మాత్ముడు. అతడు సూర్యవంశమునకు మూలపురుషుడు. మానవులతో సంబధము గల యీ మనువంశము మనువు నుండియే ప్రఖ్యాత మయ్యెను. మనువు నుండియే బ్రాహ్మణ - క్షత్రియాది సమస్త మానవులు పుట్టిరి. అప్పటినుండియే బ్రాహ్మణ కులము క్షత్రియ కుల ముతో సంబంధము కలదయ్యెను."

1. ఈమె 'వీరణుని' కూతురు. ఈమెకు 'అసిక్ని' యను మరియొక పేరు గలదు
2. ఈ యిరువదియేడే అశ్విన్యాది నక్షత్రములు.

"జనమేజయా! వారిలో బ్రాహ్మణజాతీయులైన మానవులు షడంగ సహిత వేదములను అధ్యయనము చేసి తరించిరి. 'వేన - ధృష్ణు - నరిష్యంత - నాభాగ - ఇక్ష్వాకు - కారూష - శర్యాతి - ఇలా - పృషధ్ర - నాభాగారిష్ట' నామకులు పదుగురు మనవునకు పుత్రులు. వీరుకాక, మనువునకు మరి యేబది మంది పుత్రులు పుట్టిరి."

"జనమేజయా! వా రందరు పరస్పర ద్వేషముచేత నశించిరని వింటిని. తరువాత 'ఇలా'* అనునామెగర్భము నుండి పురూరవుడు పుట్టెను. 'ఈ పురూర వునకు తల్లియు తండ్రియుగా ఇలయే యుండెను', అని తెలియుచున్నది. పురూరవుడు సముద్రమునందలి త్రయోదశ ద్వీపములను ఏలుచుండెను."

"జనమేజయా! మహాయశస్వియైన పురూరవుడు మానవుడై యుండి కూడ మానవేతరప్రాణులతో పరివృతుడై యుండెను. అతడు, బలపరాక్ర మోన్నతుడై బ్రాహ్మణులతో వివాదము చేయుచుండెను. అమాయకులైన బ్రాహ్మ ణులు అరచుచు, మొత్తుకొనుచున్నప్పటికిన్ని పురూరవుడు ఆ బ్రాహ్మణుల సమస్త ధనరత్నరాసులను అపహరించుచుండెను."

"జనమేజయా! బ్రహ్మలోకమునుండి సనత్కుమారుడు వచ్చి, పురూరవు నకు ఎంతయో సమాధానము చెప్పి, బ్రాహ్మణులపైన అత్యాచారము చేయవద్దని ఉపదేశించెను. కాని, పురూరవుడు సనత్కుమారుని యుపదేశము గ్రహింప నప్పుడు సనత్కుమార మహర్షి క్రోధభరితుడై, పురూరవునకు శాపమిచ్చి నశింప జేసెను.

"జనమేజయా! పురూరవుడు లోభావిష్టుడై, బలదర్పముచేత వివేక శూన్యుడై యుండెను. ఆ రాజే గంధర్వ లోకమునందు శాస్త్రోక్తముగా స్థాపింప బడిన త్రివిధాగ్నులను ఊర్వశితో పాటు ఈ భూమండలమునకు తెచ్చెను.

* వాస్తవముగా ఇలాదేవి పురూరవునకు తల్లియే. అతనికి జన్మదాతయైన తండ్రి చంద్రపుత్రుడైన బుధుడు. కాని, ఇలాదేవి పురుష రూపములో మారినప్పుడు ఆమె 'సుద్యుమ్నుడు' అను పేరుగల దయ్యెను. ఆ సుద్యు మ్నుడే పురూరవునకు రాజ్యమిచ్చెను. కాబట్టి, పూర్వము ఇలగా నున్న సుద్యుమ్నుడు పురూరవునకు తండ్రియని కూడ చెప్పబడెను.

"జనమేజయా! ఇలా నందనుడైన పురూరవునకు ఆరుగురు పుత్రులు కలిగిరి. వారు, 'ఆయుస్-ధీమన్-అమావసు-ధృడాయుస్-వనాయుస్-శతాయుస్' నామములు గలవారు. ఆ యారుగురు ఊర్వశికి పుత్రులు. వారిలో ఆయువునకు స్వర్భాను కుమార్తె గర్భమునుండి 'నహుష-వృద్ధశర్మన్-రజి-గయ-అనేనస్' నామకులు ఐదుగురు పుత్రులు పుట్టిరి. ఆయుర్నందనుడైన నహుషుడు మహా బుద్ధిమంతుడు, సత్యపరాక్రముడుగ నుండెను."

"జనమేజయా! నహుషుడు విశాలమైన తన రాజ్యమును ధర్మపూర్వకముగ నేలెను. పితృదేవతలను, దేవతలను, ఋషులను, బ్రాహ్మణులను, గంధర్వులను, నాగులను, రాక్షసులను, బ్రహ్మక్షత్రాది చతుర్వర్ణముల వారి నన్ని పాలించెను. నహుషరాజు గుంపులు గుంపులుగా వచ్చిన దొంగలను, బంది పోటు దొంగలను వధించి, ఋషులుగూడ అతనికి పన్నులు చెల్లింపవలసినట్లు చేసెను."

"జనమేజయా! నహుషుడు తాను, ఇంద్రపదవిలో నున్నప్పుడు మహర్షులను పశువులనువలె తనకు వాహనములుగ చేసికొని వారివీపులపై స్వారి చేసెను. తన పరాక్రమము - తేజస్సు - తపస్సు, ఈ మొదలైన వానిచేత సమస్తదేవతలను తిరస్కరించి నహుషుడు ఇంద్రపదవిని అనుభవించెను."

"జనమేజయా! నహుషుడు 'యతి - యయాతి - సంయాతి - ఆయాతి - ఆయతి - ధ్రువ' నామములు గల ప్రియవాదులైన ఆరుగురు పుత్రులను కనెను. ఈ యారుగురిలో 'యతి' యను జ్యేష్ఠపుత్రుడు యోగమును ఆశ్రయించి బ్రహ్మభూతుడైన ముని యయ్యెను. రెండవ వాడైన యయాతి చక్రవర్తి యయ్యెను. అతడు, భూమిని పాలించి అనేక యజ్ఞములను అనుష్ఠించెను."

"జనమేజయా! యయాతి ఎవనికిని ఓడకుండెను. అతడెల్లప్పుడు మనోనిగ్రహము, ఇంద్రియ నిగ్రహమున్ను గలవాడై, భక్తిభావముతో దేవతలను, పితృదేవతలనున్ను, పూజించుచు ప్రజలను ప్రేమతో పాలించుచుండెను. ఆ యయాతి మహారాజునకు 'దేవయాని, శర్మిష్ఠ' అను నిరువురు భార్యల నుండి మహాధనుర్ధరులు, సమస్తసద్గుణ సంపన్నులునైన పుత్రులు జనించిరి. వారిలో 'యదు - తుర్వసు' లిద్దరు దేవయాని పుత్రులు; 'ద్రుహ్యు - అను - పూరు' నామకులు ముగ్గురు పుత్రులు శర్మిష్ఠ గర్భమునుండి పుట్టిరి.

"జనమేజయా! ఆ యైదుగురు కొడుకులతో గూడ యయాతి ధర్మ సమ్మతముగ ప్రజాపాలనము చేయుచుండెను. ఇట్లుండగా నొకప్పుడు నహుషపుత్రుడైన యయాతికి అతిభయంకర మైన వృద్ధావస్థ ప్రాప్తించి, యతనిరూప - సౌందర్యములు నశించెను. అప్పుడు యయాతి తనయైదుగురు పుత్రులను పిలిచి 'పుత్రులారా! నేను యువకుడనై కామోపభోగము సల్పుచు ఇంకను యువతులలో విహరింప గోరుచున్నాను. మీరు నాకు సహాయము చేయుడు' అని యనెను."

"జనమేజయా! తండ్రిమాట విని దేవయాని జ్యేష్ఠ పుత్రుడైన యదువు 'భగవాన్! మా యౌవనము తీసికొని నీవు ఏకార్యము చేయవలెను' అని తండ్రిని అడుగగా, యయాతి యదువుతో 'నీవు నావార్థకము తీసికొనుము. నేను నీ యౌవనము తీసికొని విషయోపభోగము చేసెదను" అని చెప్పి, మరల పుత్రులతో నిట్లనెను :-

"పుత్రులారా, ఇంతదాక నేను సుదీర్ఘకాలము యజ్ఞానుష్ఠానము నందు నిమగ్నుడనై యుంటిని. ఇప్పుడు శుక్రాచార్యుని శాపముచేత, నాకు ముసలితనము వచ్చి నన్ను అణచి వేసెను. దానిచేత నా కామ పురుషార్థము అపహరింప బడెను. కనుకనే నేను మిక్కిలి పరితపించు చున్నాను. నా వృద్ధ శరీరముతో మీలో ఒకడు రాజ్యము ఏలుగాక! నేను యౌవన శరీరమును పొంది విషయోపభోగము చేసెదను."

"జనమేజయా! యిట్లు యయాతి మహారాజు చెప్పినను యదువు మొదలైన నలుగురు పుత్రులు తండ్రి ముసలితనమును తీసికొన నిష్టపడక పోయిరి. అప్పుడు అందరికన్న చిన్నవాడు, సత్యపరాక్రముడునైన 'పూరుడు' తండ్రితో, 'రాజా! నీవు నా నూతన శరీరము గ్రహించి నవయువకుడవై విషయోపభోగము చేయుము. నేను నీయాజ్ఞచేత నీ వృద్ధాప్యము గ్రహించి రాజ్యసింహాసనమును అధిష్ఠించెదను' అని యనెను.

"జనమేజయా! పూరుడు ఇట్లు చెప్పగనే రాజర్షియైన యయాతి తన తపో-బల వీర్యములచేత వృద్ధావస్థను మహాత్ముడైన తన పుత్రుని యందు సంక్రమింపజేసి, తాను, పూరునియొక్క నవయౌవనము గ్రహించి, నవయువకుడయ్యెను. పూరుడు వృద్ధుడై, రాజ్యపాలనము చేసెను".

"జనమేజయా! తరువాత, అజేయ పరాక్రముడైన యయాతి మహారాజు వేయి సంవత్సరములవరకు యువకుడుగా నుండి తన యిరువురు భార్యలతో

చాలకాలము విహరించి, కుబేరునివసమైన చైత్రరథమునకు పోయి 'విశ్వాచి' యను నప్సరసతో రమించినప్పటికిన్ని యయాతికి కామోపభోగమునందు తృప్తి తీరలేదు".

"జనమేజయా! అప్పుడు, యయాతి 'విషయములను అనుభవించుటచేత భోగేచ్ఛ యెప్పుడు గూడ శాంతించదు' అని నిశ్చయించుకొని ప్రపంచహితము కొరకు ఈ గాథను గానము చేసెను".

"న జాతు కామః కామనాముపభోగేన శామ్యతి।
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే॥"

అనగా - 'విషయములను అనుభవించుటచేత విషయ భోగేచ్ఛ నేయి పోయుటచేత అధికముగ ప్రజ్వలించు అగ్నివలె, ఎప్పటికిన్ని అణగారక, విశేషముగ వృద్ధి చెందుచునే ఉండును' అని.

"జనమేజయా! తరువాత యయాతి యిట్లు చింతించెను :

"రత్నభరితమైన సమస్త భూమండలము, ప్రపంచమునందలి సమస్త సువర్ణము, సర్వపశువులు, సుందర స్త్రీలు" ఈ వస్తువు లన్నియు ఏయొక్క పురుషునికి లభించినప్పటికిన్ని అవి యన్నియు నతనికి చాలవు. ఇంకను వానినే అధికముగ పొంద గోరును" అని తలచి శాంతితో పురుషుడు భోగేచ్ఛను అణగ ద్రొక్కవలెను.

"మనుష్యుడు ఎప్పుడుగూడ మనోవాక్కాయ కర్మలచేత ఏ ప్రాణియెడల గూడ చెడుభావము లేక యుండినచో బ్రహ్మను పొందగలడు. అతనికి అంతటను బ్రహ్మదృష్టి యుండుటచేత, ఎవరికిని భయపడక, అతనినుండి ఏ ప్రాణికిగూడ భయము కలుగకుండునట్లు మెలగి, దేనినిగూడ కోరక, దేనినిగూడ ద్వేషించక యుండినప్పుడు అతడు, బ్రహ్మమును పొందగలడు."

"జనమేజయా! పరమ బుద్ధిశాలియైన యయాతి మహారాజు ఇట్లు విషయ భోగములు నిస్సారములని తలచి బుద్ధిచేత మనస్సు ఏకాగ్రము చేసి, పుత్రుని నుండి తన ముసలితనమును తిరిగి గ్రహించి, ఆ పూరునకు అతని యౌవనము తిరిగి యిచ్చి, ఆ పుత్రునే రాజ్యమునందు పట్టాభిషిక్తుని చేసి తాను విషయోపభోగములందు అసంతృప్తితో నుండినప్పటికిన్ని పుత్రుడైన పూరునితో, 'పుత్రా!

నీవంటి సంత్పుత్రునిచేతనే నేను పుత్రవంతుడనై యున్నాను. నా వంశ ప్రవర్తకుడవు కాగల పుత్రుడవు నీవే. నీ వంశము ఈ ప్రపంచమునందు "పౌరవ వంశము'' అను పేరుతో ప్రసిద్ధి చెందగలదు' అని చెప్పెను.''

"జనమేజయా! పూరునకు రాజ్యాభిషేకము చేసిన తరువాత యయాతి మహారాజు తన భార్యలతో 'భృగుతుంగ' పర్వతమునకు పోయి, సత్కర్మాను ష్ఠానములు చేయుచు అక్కడ గొప్ప తపస్సు చేసెను. ఈ విధముగా చాలకాలము గడచిన పిదప తన భార్యలతో నిరాహారవ్రతము చేసి యయాతి భార్యా సహితముగ స్వర్గలోకమునకు పోయెను.''

ఇట్లు వైశంపాయనుడు చెప్పగా విని జనమేజయుడు ఆ మహామునిని ఈ విధముగా ప్రశ్నించెను :-

**కచుడు శుక్ర శిష్యుడై-శుక్ర-దేవయానులను సేవించుట - అతడు అనేక కష్టములు సహించి మృత సంజీవినీ విద్యను పొందుట :-**

"మహాత్మా ! ప్రజాపతికి పదియవ తరమువాడైన యయాతి మాకు పూర్వజుడు కదా! ఆయన అతి దుర్లభురాలైన శుక్రాచార్య పుత్రిని ఎట్లు పొందెను? విన గోరుచున్నాను. వరుసగా నాకు ఆ రాజు యొక్క వంశకరులను గూర్చి విడివిడిగా చెప్పుము".

ఆ మాటకు వైశంపాయనుడు జనమేజయునకు ఇట్లు చెప్ప దొడగెను:-

"జనమేజయా! దేవరాజ సమానకాంతి గలవాడుగా యయాతి మహారాజు విరాజిల్లెను. అతనిని శుక్రాచార్యుడు, రాక్షస రాజైన వృషపర్వుడున్ను తన తన కూతుల కొరకు వరించిన విధము గూర్చి దేవయానికి, యయాతికిన్ని గలిగిన సమాగమము గూర్చియు చెప్పెద వినుము:-

"రాజా! పూర్వము ఐశ్వర్యము కొరకు దేవ - దానవులకు పరస్పరము యుద్ధము జరిగెను. మూడు లోకములను ఆక్రమింప దలచి దేవతలు జయేచ్ఛ చేత చేయు యజ్ఞమునందు అంగిరసుని పుత్రుడైన బృహస్పతిని పురోహితునిగా వరించిరి. అట్లే రాక్షసులు శుక్రాచార్యుని తమ పురోహితునిగా వరించిరి".

"జనమేజయా! ఆ యిరువురు బ్రాహ్మణులు సర్వదా మిక్కిలి స్పర్థ (పోటీ) పడుచు నుండిరి. దేవ-దానవ యుద్ధమునందు మరణించిన దానవులను

శుక్రాచార్యుడు తన 'మృత సంజీవనీ' విద్యా ప్రభావము చేత బ్రతికించు చుండెను. అట్లు బ్రతికిన రాక్షసులు మరల దేవతలతో యుద్ధము చేయుచుండిరి. అసురులచేత యుద్ధములో చంపబడిన దేవతలను మరల బ్రతికించుటకు బృహస్పతికి మృత సంజీవని విద్య తెలియకుండెను. కనుక, దేవతలను బ్రతికింపజాలకుండెను. దానిచేత దేవతలు మిక్కిలి దుఃఖించి, శుక్రాచార్యునకు భయపడి బృహస్పతి జ్యేష్ఠ పుత్రుడైన కచుని కడకు పోయి యిట్లనిరి.

"మహాభాగా ! నిన్ను సేవించుటకు వచ్చినాము. మా కొక గొప్ప సహాయము చేయుము. అమిత తేజస్వియైన శుక్రాచార్యునకు తెలిసిన మృత సంజీవనీ విద్యను నీవు గ్రహించి, త్వరగా రమ్ము. శుక్రాచార్యుడు వృషపర్వుని కడ నున్నాడు. అతడు దానవులను రక్షించుచు అదానవులను రక్షింపకున్నాడు. యువకుడవైన నీవే ఆ శుక్రాచార్యుని, అతని కూతురు దేవయానిని సేవించుటకు సమర్థుడవు. నీవుదప్ప ఈ కార్యమును సాధించుటకు సమర్థుడు మాకు మరి యొకడు లేడు. నీవు శీలము, దాక్షిణ్యము, మాధుర్యము, సత్ప్రవర్తన, ఇంద్రియ నిగ్రహమున్ను గలవాడవు. నీ యెడల దేవయాని సంతుష్టురాలైనచో నీవు ఆ విద్యను తప్పక పొందగలవు."

"జనమేజయా ! యిట్లు దేవతలు చేసిన ప్రార్థనను అంగీకరించి బృహస్పతి సుతుడైన కచుడు వృషపర్వ మహారాజుకడకు త్వరగా పోయి, అచట శుక్రాచార్యుని దర్శించి ఆయనతో నిట్లనెను :

"మహాత్మా! నేను అంగిరసునకు పౌత్రుడను, బృహస్పతికి పుత్రుడను. 'కచ' నామధేయుడను. నన్ను శిష్యునిగా పరిగ్రహింపుము. నేను నిన్ను పరమ గురువుగా భావించి బ్రహ్మచర్యమును అనుష్ఠించుచు వేయి పరిపూర్ణవత్సరములు సేవించు చుండెదను. నన్ను అనుగ్రహింపుము."

ఆ మాటకు శుక్రాచార్యుడు 'కచా! నీకు స్వాగతము. నీ మాటను అంగీకరించు చున్నాను. పూజార్హుడవైన నిన్ను అర్చించుటచేత బృహస్పతిని అర్చించినవా డనగుదును. ఇది నాకు సంతోషదాయకము' అని చెప్పెను.

"జనమేజయా! తరువాత కచుడు శుక్రునకు శిష్యుడై, వ్రతనియమములను పాలించుచు ఆయన యాజ్ఞను న్యాయముగా నెరవేర్చుచు, ఆయన చెప్పినట్లుగా నడచుకొనుచు కాలమును ప్రతీక్షించుచు, ఉపాధ్యాయుని, ఆయన పుత్రి

దేవయానిని ప్రతినిత్యము ఆరాధించుచుండెను. తరుణవయస్కుడైన కచుడు పాడుచు, ఆడుచు, వాద్యములు వాయించుచు దేవయానిని సంతోషపరచెను. ఆమెకు పుష్పములు, ఫలములు ఆమె కోరిన యితర వస్తువులు తెచ్చి యిచ్చును, ఆమె మెప్పుపడసెను."

"జనమేజయా! దేవయానిగూడ నియమవ్రతధరుడైన ఆ విప్రకుమారుని కడ రహస్యముగ పాడుచు, అతనిని లాలించుచు, అతనికి పరిచర్యలు చేసెను. ఈ విధముగ ఐదునూర్లు సంవత్సరములు గడచెను."

"జనమేజయా! తరువాత రాక్షసులు కచుని ప్రవర్తనము తెలిసికొని కచుడు గోవులు గాచుటకై అడవికి పోయినప్పుడు బృహస్పతిపై ద్వేషముచేత, మృతసంజీవనీ విద్యను రక్షించుకొను నిచ్ఛచేతను కచుని రహస్యముగ అడవిలో చంపి, ముక్కలు ముక్కలుగ, ఖండించి శాలావృకములకు (తోడేళ్ళు, కుక్కలు, నక్కలు, పిల్లులు, మొదలైనవి) ఆహారముగ నిచ్చిరి."

"జనమేజయా! తరువాత, గోరక్షకుడైన కచుడు లేకుండ తిరిగి వచ్చిన గోవులను దేవయాని చూచి, శుక్రాచార్యునితో నిట్లనెను:-

"తండ్రీ! సూర్యుడస్తమించెను. సాయంకాలాగ్నిహోత్ర కార్యము ముగిసెను. రక్షకుడు లేక గోవులు తిరిగివచ్చెను. ప్రతిదినము గోవులవెంట వచ్చు కచుడు నేడు కానరాడు. అతడు ఎవరిచేతనైన చంపబడియో, లేక ఏ యపాయమునకో గురియై చచ్చియో యుండునని స్పష్టమగుచున్నది. అతడు లేక నేను జీవింపజాలనని సత్యముగ చెప్పుచున్నాను."

"జనమేజయా! అప్పుడు శుక్రాచార్యుడు దేవయాని యావేదనను చూచి "బిడ్డా! నీవు చింతింపకుము. మరణించిన కచుని బ్రతికించెదను." అని చెప్పి మృతసంజీవినీ విద్యను ప్రయోగించి, 'కచా! ఇక్కడికి రమ్ము!' అని బిగ్గరగా అరచి పిలిచెను. శుక్రుడు పిలిచిన వెంటనే ఆ మృగముల కడుపులలో ఖండములుగా నున్న కచుడు మృగములను భేదించి బయలువెడలి తిరిగి రాగా, దేవయాని అతనితో 'నీవు తిరిగి వచ్చుటకు ఎందుకు ఇంత జాగుచేసితివి' అని యనగా, కచుడు దేవయానితో నిట్లనెను:-

భామినీ! నేను అడవిలో సమిధలు, దర్భలు మోసికొని వచ్చుచు ఆ బరువునకు అలసి ఒక వటవృక్షము క్రింద కూర్చొని యుంటిని. గోవులు గూడ

ఆ వృక్షచ్ఛాయ చేరి యుండెను. అప్పుడు రాక్షసులు నన్ను చూచి, 'నీవెవడవు?' అని అడిగిరి. 'నేను బృహస్పతి పుత్రుడను, కచుడను' అని చెప్పిన వెంటనే వారు నన్ను చంపి, ముక్కలు చేసి, శాలావృకాది మృగములకు ఆహారముగా నిచ్చి, హాయిగా తమ యిండ్లకు పోయిరి. ఇప్పుడు భార్గవుడైన శుక్రచార్యుని విద్యాప్రభావముచేత పిలువబడి అతికష్టముతో జీవించి నీ కడకు వచ్చితిని."

"జనమేజయా! తరువాత కొంతకాలమునకు దేవయాని కోరికపై పువ్వులు తెచ్చుటకు కచుడు అడవికి పోయినప్పుడు దానవులు చూచి అతనిని మరల చంపి పొడిచేసి, సముద్రజలములో కలిపిరి".

"జనమేజయా! చాల సేపటి వరకు కచుడు తిరిగి రాకుండుట చూచి దేవయాని మరల తండ్రికి చెప్పగా, శుక్రాచార్యుడు విద్యాప్రభావము చేత పిలువగా కచుడు సముద్ర జలమునుండి బ్రతికి తిరిగి వచ్చి ఆ సమాచార మంతయు తెలిపెను."

జనమేజయా! (ఈ ఉపాయములు ఎన్ని చేసినను శుక్రాచార్యుడు మరల కచుని బ్రతికించునని తలచి) రాక్షసులు మూడవ పర్యాయము కచుని చంపి, దహించి, ఆ బూడిదను మద్యములో కలిపి, ఆ మద్యమును శుక్రాచార్యునికే త్రాపిరి. తరువాత దేవయాని తండ్రితో 'పుష్పాహరణార్థము పంపబడిన కచుడు తిరిగి రాలేదు. అతడు చంపబడి యుండుననుట స్పష్టము. అతడు లేక నేను జీవింప జాలను' అని యనెను."

"జనమేజయా! అప్పుడు, శుక్రాచార్యుడు దేవయానితో 'పుత్రీ! కచుడు మరణించెను. ఎన్ని పర్యాయములు నేను బ్రతికించినను అతడు మరల చంపబడుచునే యున్నాడు. ఇక నేనేమి చేయుదును. నీవు దుఃఖింపకుము. నీవంటి కన్యక, మరణించిన వాని కొరకు దుఃఖింప గూడదు. నీ మహిమ గొప్పది. వేదము, బ్రాహ్మణులు, దేవతలు, ఇంద్రుడు, వసువులు, అశ్వినీదేవతలు, రాక్షసులు మొదలైన సర్వప్రపంచము నీ ప్రభావమువలన నీ యెదుట తల వంచి యున్నది. కచుని మరల బ్రతికించుట యసాధ్యము. అతడు బ్రతికింప బడినను మరల చంపబడును' అని చెప్పగా, విని దేవయాని తండ్రితో మరల నిట్లనెను:-

"తండ్రీ! ఎవని పితామహుడు అంగిరసుడో, తండ్రి తపోనిధి యైన బృహస్పతియో, అట్టి కచుని గూర్చి నేను ఎట్లు దుఃఖింప కుండెదను? కచుడు

బ్రహ్మచారి, తపోధనుడు, అన్ని పనులు సామర్థ్యముతో చేయుటకు పూనుకొను వాడు. కనుక అతనికై వేచి యుండెదను. అతడు వచ్చుదాక నేను భుజింపను. తండ్రీ! అతిసుందరుడైన కచుడు నాకు ప్రియుడు."

"జనమేజయా! దేవయాని మాట విని, ఆమెతోపాటు తాను గూడ దుఃఖించిన శుక్రాచార్యుడు అసురులయెడల కోపముతో నిట్లు చింతించెను :-

"అసురులు నన్ను ద్వేషించు చున్నారు. కనుకనే నా కడకు వచ్చిన నా శిష్యులను చంపుచున్నారు. క్రూరులైన దైత్యులు నన్ను బ్రాహ్మణత్వమునుండి భ్రష్టుని జేయ జూచు చున్నారు. కనుకనే, ప్రతిదినము వారు నాకు విరుద్ధముగా నాచరించు చున్నారు. ఈ పాపఫలము వారు అనుభవించ గలరు. బ్రహ్మహత్య యెవరిని దహింపదు? ఇంద్రుడుగూడ ఆ దోషమునుండి తప్పించుకొన జాలడు."

"జనమేజయా! యిట్లు చింతించి శుక్రాచార్యుడు కచుని పిలిచెను. అప్పుడు కచుడు శుక్రునిగర్భమునందు బ్రతికి గురువునకు భయపడి, మెల్లగా గురువుతో 'భగవన్! కచుడను. నమస్కరించు చున్నాను. నీ పుత్రుని వంటి వాడను. నన్ను అనుగ్రహింపుము' అని యనగా, శుక్రుడు కచునితో, 'నీవు ఏమార్గమున నా కడుపులో ప్రవేశించితివి?' అని యడుగగా కచుడిట్లనెను:-

"మహాత్మా! నీ యనుగ్రహముచేత నాకు స్మృతి చెడలేదు. జరిగిన సమాచార మంతయు స్మరించుచున్నాను. దీనిచేత నా తపస్సు నశించలేదు. తపోబలముచేత ఘోరమైన యీ కష్టమును సహించు చున్నాను. రాక్షసులు నన్ను చంపి, దహించి, ఆ భస్మము మద్యములో కలిపి, నీకు త్రాపిరి. నీవు 'బ్రాహ్మి-ఆసురి - దైవి' అనుమూడు విధములైన మాయల నెరిగి యున్నావు. నీ వుండగా నెవడుగూడ ఈ మాయల నుల్లంఘించ జాలడు."

"జనమేజయా! కచునిమాట విని, శుక్రుడు దేవయానితో, 'బిడ్డా! ఇప్పుడు నేను మరణించినచో, కచుడు జీవించును. నాకడుపు ఛేదించక, కచుడు బయటకు రాజాలడు కనుక మా యిరువురిలో నెవడు బ్రతుకుట నీకు ఇష్టమో చెప్పుము' అని యనెను.

"జనమేజయా! శుక్రు డిట్లనగా దేవయాని, 'ఈరెండు శోకములున్ను అగ్నికల్పములై నన్ను దహించును. మీ యిరువురినాశము నాకు దుఃఖకరమే.

కచుడు నశించినచో నేను బ్రతికి సుఖపడను నీవు నశించినచో నేను జీవించను' అని తండ్రితో ననెను."

"రాజా! అప్పుడు శుక్రుడు కచునితో, 'నాయనా! నీ యిష్టార్థము సిద్ధించినది. నిన్ను దేవయాని భజించు చున్నది. కనుక, మృతసంజీవనీవిద్య నీవు నా నుండి గ్రహింపుము. నీవు కచరూపములో వచ్చిన యింద్రుడవు కాకున్నచో, ఈ విద్యను పొందగలవు. బ్రాహ్మణుడుదప్ప మరియొకడైనచో బ్రతికి నా యుదరమునుండి రాజాలడు. కనుక, నీవు ఆ విద్య గ్రహింపుము. నా శరీరము నుండి బయటకు వచ్చి, నన్ను మరల బ్రతికింపుము' ఇప్పుడు నీవు నాకు పుత్రతుల్యుడవైతివి. ఈ విద్యను గ్రహించి నీవు మహా విద్వాంసుడవై గురువునైన నన్ను ధర్మదృష్టితో జూచుము' అని యనెను.''

"జనమేజయా! అట్లు కచుడు గురువు గర్భములో ఉండియే మృతసంజీవనీవిద్య నేర్చి, గురువు కుక్షిని భేదించి, పున్నమచంద్రునివలె అధిరూపసంపన్నుడై బయలువెడలెను. అప్పుడు, గురువుపడి యుండుటచూచి, తాను నేర్చిన మృతసంజీవనీ విద్యచేత గురువును జీవింపజేసి, యిట్లనెను :

"విద్యావిహీనుడనైన నా చెవులలో విద్యామృతము పోసిన యీ నా గురువును నా తల్లి - దండ్రులుగా తలచుచున్నాను. ఈ నా గురువు నాకు చేసిన మేలు తలచుచు, నెప్పుడుగూడ ఈయనకు ద్రోహము తలపెట్టను. నిధులకెల్ల పరమనిధియైన యుత్తమ విద్యను నాకు ప్రసాదించిన గురుదేవుని ఆదరించని విద్యార్థులు అప్రతిష్ఠపాలై, పాపలోకమునకు పోయెదరు.''

"జనమేజయా! విద్వాంసుడైన శుక్రాచార్యుడు మద్యపానముచేత వంచింపబడి అతి భయంకర పరిస్థితికి లోనయ్యెను. సురాపానముచేత కొంచెముగూడ తెలివి యుండదు సురాపానమోహితుడగుటచేతనే శుక్రాచార్యుడు అప్పుడు తన ప్రియశిష్యుడు, బ్రాహ్మణకుమారుడునైన కచునిగూడ మద్యముతో త్రాగెను. ఇది యంతయు చూచి, యోచించి, మహానుభావుడైన శుక్రాచార్యుడు మద్యపానము వలన కోపముచేత దానిని అసహ్యించుకొనుచు బ్రాహ్మణులకు హితము చేయ దలచి యిట్లు ప్రకటించెను.

"ఏ బ్రాహ్మణుడు నేటి నుండి మందబుద్ధియై మోహముచేత మద్యపానము చేయునో, అట్టివాడు ధర్మభ్రష్టుడై బ్రహ్మ హత్యా పాపము పొందును, ఇహ - పర

లోకములందు నిందితుడగును. ధర్మశాస్త్రములలో ప్రాథమిక ధర్మములకు సీమగా నిర్ధరింపబడిన కట్టుబాట్లలో నిప్పుడు నేను నిర్ణయించిన, యీ మద్యపాన నిషేధము గూడ చేరుగాక! సర్వలోకములలోని మనుష్యులు - సత్పురుషులు - బ్రాహ్మణులు - దేవతలు - గురువుకడ అధ్యయనము చేయు శిష్యులున్న ఈనా నిర్ణయమును వినెదరు గాక!"

"జనమేజయా! మహానుభావుడైన శుక్రుడు ఇట్లు చెప్పి, మూర్ఖులైన దానవులను పిలిచి వారితో 'మీరు మూర్ఖులు. నాయొద్ద కచుడు నివసింప గలడు. అతడు మృతసంజీవనీ విద్యను పొంది నాతో సమానుడైనాడు. అతడు దేవతల కోరికపై దుష్కరమైన కర్మ చేసెను. అతని కీర్తి తరుగదు. అతడు యజ్ఞాను ష్ఠాత కాగలడు అని చెప్పెను. అప్పుడు దానవులు విస్మయము చెంది తమ యిండ్లకు వెడలి పోయిరి".

''జనమేజయా! కచుడు గురువుకడ వేయి సంవత్సరములు నివసించి, గుర్వనుజ్ఞ పడసి స్వర్గమునకు పోవదలచెను".

**దేవయాని కచుని పాణిగ్రహణమునకు నిర్బంధించుట - కచుని యనంగీకారము - వారు పరస్పరము శపించుకొనుట:-**

''జనమేజయా! విద్యాభ్యాసమైన తరువాత గుర్వాజ్ఞచేత స్వర్గమునకు ప్రయాణమగుచున్న కచునకు దేవయానికి నిట్లు సంవాదము జరిగెను :-

దేవయాని :- కచా! 'నీ ప్రవర్తన, సద్వంశము, విద్య, తపస్సు, ఇంద్రియ నిగ్రహము' ఈ మొదలైన సద్గుణములచేత నీవు ప్రకాశించు చున్నావు. 'నీ పితామహుడైన అంగిరసుడు నా తండ్రివలె నాకు మాన్యుడు. అట్లే, మీ తండ్రి బృహస్పతి గూడ నాకు పూజ్యుడే,' అని తెలిసికొని నీవు నా మాట వినుము. నీవు ఇంతకాలము నియమవ్రతము నందు బ్రహ్మచర్యముతో నుంటివి. ఇప్పుడు విద్యాసమావర్తనము (ముగింపు) చేసి గృహస్థుడవు కాబోవు చున్నావు. కనుక, ఇంతకాలము నిన్ను భజించుచున్న నన్ను సేవించుటకు నీవు శాస్త్రోక్తముగ నా పాణిగ్రహణము చేయుము."

కచుడు :- భామినీ! నీ తండ్రి నాకు మాననీయుడైనట్లే నీవుగూడ పూజనీయురాలవు. నీవు శుక్రాచార్యునకు ప్రాణాధికురాలవైన ప్రియపుత్రివి. గురుపుత్రివైన నీవు ధర్మముప్రకారము నాకు పూజ్యురాలవు. కనుక, నన్ను నీవు ఇట్లు అడుగదగవు."

దేవయాని :- "ద్విజోత్తమా! నీవు నా తండ్రి యొక్క గురుపుత్రునకు పుత్రుడవు. కాని, నా తండ్రికి పుత్రుడవు కావు. కనుక, నాకు గూడ నీవు పూజ్యుడవే. అసురులు మాటిమాటికి నిన్ను చంపినప్పుడు బ్రతికించితిని. అప్పటినుండి నీయెడల నాకుగల ప్రీతిని స్మరింపుము. నీయందు నాకు మైత్రి, అనురాగము, ఉత్తమ భక్తియు గలవు. ఇది తెలిసి, ధర్మజ్ఞుడవైన నీవు నీ భక్తురాలను, నిరపరాధరాలనునైన నన్ను విడువదగదు.

కచుడు :- "శుభాంగీ ! నియోగింప దగని నియోగమునందు నన్ను నియోగించుచున్నావు. నీవు నాకు గురువు కంటె గురుతరురాలవు. కనుక, నా యెడల ప్రసన్నురాలవు కమ్ము. ఏ శుక్రాచార్యుని కుక్షియందు నీవు నివసించితివో, ఆ కుక్షియందే నేను గూడ ఉంటిని. కనుక, నీవు నాకు సోదరివి! నీ పిట్లనగూడదు. ఇక్కడ నేను సుఖముగ నుంటిని. దుఃఖ మేమియు కలుగలేదు. కనుక, నాకు అనుజ్ఞ యిమ్ము. నేను వెడలి పోయెదను. నా మార్గమునందు శుభమునుకోరు చుండుము. నీ గోష్ఠి ప్రసంగమునందు ధర్మావిరోధముగ నన్ను స్మరింపుము. అప్రమత్తురాలవై నిత్యము నా గురువును ఆరాధింపుము."

దేవయాని :- ధర్మ కామార్థము నిన్ను యాచించిన నన్ను నిరాకరించుచున్నావు కనుక, నీ విక్కడ నేర్చుకొనిన మృత సంజీవినీ విద్య నీకు సిద్ధించ కుండుగాక ! అని శపించెను.

కచుడు :- భామినీ ! నీవు గురుపుత్రివని నిన్ను నిరాకరించితినే కాని, నీయందు దోషమున్నదని కాదు. నాకు గురువు గూడ నీ పాణిగ్రహణమునకు అనుజ్ఞ యీయలేదు. నీవు శపించిన శపింపుము. ఆర్షధర్మము ననుసరించి చెప్పితిని. శాపమునకు అనర్హుడనైన

నన్ను కామవశురాలవై శపించితివి. ఇది నీకు అధర్మము కనుక, నీవు కోరినట్లు నీకామము నెరవేరదు. ఎప్పుడు గూడ నిన్ను ఋషిపుత్రుడు పాణిగ్రహణము చేసికొనడు" అని కచుడు దేవయానికి ప్రతిశాపమిచ్చి, ఆమెతో 'ఈ మృతసంజీవనీవిద్య నీవనినట్లు నాకు ఫలించకపోయినను, ఈ విద్యను నేను ఎవరికి నేర్పెదనో వారికి ఫలించ గలదు'అని చెప్పెను."

"జనమేజయా! యిట్లు కచుడు దేవయానికి చెప్పి శ్రీఘ్రముగ స్వర్గమునకు పోయెను. అతనిని ఇంద్రాది దేవతలు చూచి, బృహస్పతిని సమ్మానించి, కచునితో, 'గురుపుత్రా! మా హితమును కోరి నీవు మిక్కిలి అద్భుతమైన కార్యమును చేసితివి. నీ కీర్తి ఎప్పుడు గూడ నశించదు' అని చెప్పిరి.

**దేవయానీ శర్మిష్ఠల కలహము :- శర్మిష్ఠ దేవయానిని నూతిలో త్రోయగా ఆమెను యయాతి తీయుట - దేవయానీ శుక్రాచార్యుల సంభాషణము :-**

"జనమేజయా! దేవతలు మిక్కిలి సంతుష్టులై, కచుని నుండి మృతసంజీవినీ విద్యను నేర్చుకొని కృతార్థులై, అందరు కలిసి ఇంద్రునితో నిట్లనిరి:-

"పురందరా! యిప్పుడు నీపరాక్రమము చూపుటకు సమయము వచ్చినది. శత్రుసంహారము చేయుము."

ఆ మాటకు ఇంద్రుడు 'అట్లే యగుగాక!' అని యచటినుండి వనమునకు పోయి, అక్కడ క్రీడించుచున్న కన్యకలను చూచి యింద్రుడు వాయువుగామారి, ఆ స్త్రీల వస్త్రముల నన్నిటిని ఒకచోటచేర్చి కలిపెను."

''జనమేజయా! తరువాత ఆ కన్యకలందరు ఒక్కసారిగా జలమునుండి పైకివచ్చి కలిసి యున్నవస్త్రములను తీసికొని ధరించిరి. ఆతొందరపాటులో దేవయాని వస్త్రము వృషపర్వపుత్రియైన శర్మిష్ఠ తీసికొని కట్టుకొనెను. అప్పుడు దేవయానీ-శర్మిష్ఠ లకు పరస్పర విరోధము కలిగి దేవయాని శర్మిష్ఠతో 'నీవు నాకు శిష్యురాలవై యుండి సత్ప్రవర్తన విడిచి నా వస్త్రమేల గ్రహించితివి? దీనివలన నీకు శ్రేయస్సు కలుగబోదు' అని యనగా, శర్మిష్ఠ దేవయానితో నిట్లనెను:-

"యాచకురాలా! నా తండ్రియైన వృషపర్వ మహారాజును, ఆయన కూర్చొనినప్పుడు, శయనించినప్పుడు, నీ తండ్రి శుక్రాచార్యుడు క్రింద నిలిచి స్తోత్రపాఠకునివలె వినయముతో స్తుతించుచు, నా తండ్రినుండి దానము తీసికొనుచున్న యాచకునకు నీవు బిడ్డవు. నీ తండ్రిచేత స్తుతింపబడుచు ఎప్పుడు గూడ ప్రతిగ్రహ మెరుగక దానముచేయు వృషపర్వునకు నేను బిడ్డను. భిక్షుకీ! నీవు ఎంత పరితపించినను, నిందించినను, ద్రోహించినను, కోపించినను నాకు లెక్కలేదు. సాయుధురాలనైన నన్ను నిరాయుధురాలవైన నీవు క్షోభింప జేసినచో, నిన్ను ప్రతిఘటించు యోధుడు రాగలడు. నిన్ను నేను లెక్కచేయను. నాకు ప్రతికూలముగా మాట్లాడిన యెడల, యాచకురాలా! నా దాసీజనముచేత నిన్ను ఈడ్పించి బయటకు నెట్టించెదను."

"జనమేజయా! అప్పుడు శర్మిష్ఠ తనను నిందించిన దేవయానిని అక్కడి కూపమునందు త్రోసి, తన పురమునకు పోయెను. దేవయాని చచ్చి యుండునని పాపనిశ్చయురాలైన శర్మిష్ఠ తలచి, దేవయానిని చూడక క్రోధముతో తన యింటికి పోయెను."

"జనమేజయా! తరువాత నహుష పుత్రుడైన యయాతి వేటాడుచు అలసిపోయి, ఆ చోటికి వచ్చి, తాను తన అశ్వమున్ను దప్పిగొనగా అక్కడ జలముగల జలాశయమును వెదకుచు ఆ కూపమునందు పడి అగ్నిశిఖవలె వెలుగుచున్న దేవయానిని చూచి, ఆమెను ఊరడించి మృదువచనములతో నిట్లనెను:-

"యువతీ! నీ వెవతెవు? సువర్ణమణి భూషణాలంకృతురాలవై యున్నావు. ఏల చింతించుచు ఏడ్చుచున్నావు? తృణలతాదులు కప్పిన యీ నూతిలో ఎట్లు పడితివి? నీ వెవరిబిడ్డవు? సత్యము చెప్పుము."

ఇట్లు యయాతి యడుగగా నతనితో దేవయాని యిట్లనెను:-

"మహాభాగా! దేవతలచేత చంపబడిన రాక్షసులను మృతసంజీవినీ విద్యచేత మరల జీవింప జేసిన శుక్రాచార్యునకు నేను కన్యకను. నేనిట్లు ఈ కూపమునందు పడి యుండుట నా తండ్రి యెరుగడు. నన్నిట్లు ఆదరించి అడుగుచున్న నీ వెవడవు? రూప - బలపరాక్రమశాలివిగా కనపడుచున్నావు. ఇక్కడి కేల వచ్చితివి?"

ఆ మాటకు దేవయానితో యయాతి యిట్లనెను:-

"మంగళకరురాలా! నేను నహుష పుత్రుడను. 'యయాతి' యను వాడను. వేటలో అలసి జలార్థమై వచ్చి తృణలతాదులు కప్పియున్న యీ కూపము నందు నిన్ను చూచితిని."

ఆ మాట విని దేవయాని యతనితో నిట్లనెను:-

"రాజా! 'నీవు సత్కులసంజాతుడవు. పరమశాంతుడవు. పరాక్రమ వంతుడవు, కీర్తిమంతుడవు' అని నాకు తెలిసినది కనుక, 'ఇదిగో నా కుడిచేతిని నీకు అందించెదను. ఎఱ్ఱని నఖాంగుళులు గల యీ నా చేతిని పట్టుకొని, ఈ కూపమునుండి నన్ను నీవు ఉద్ధరింప దగుదువు".

"జనమేజయా! దేవయానిమాట విని యయాతి ఆమె బ్రాహ్మణ కన్యక యని తెలిసికొని ఆమె దక్షిణహస్తమును గ్రహించి ఆ నూతినుండి ఆమెను పైకి లాగి, ఆమెతో నిట్లనెను :-"

"మంగళకరురాలా! ఇక నీకు భయము లేదు. నీ యిచ్ఛ వచ్చిన చోటికి పొమ్ము."

ఆ మాటకు అ రాజుతో దేవయాని యిట్లనెను :-

"రాజా! నీవు నన్ను గైకొని పొమ్ము. నీవు నాకు ప్రియుడవు. నా పాణి గ్రహణము చేసితివి. కనుక, నాకు భర్తవు కాగలవు!" అని అనగా, యయాతి మహారాజు దేవయానితో నిట్లనెను :-

"భామినీ! నేను క్షత్రియుడను. నీవు బ్రాహ్మణివి. కనుక, నాతో నీకు సమాగమము తగదు. నీవు సర్వలోక గురుడైన శుక్రుని బిడ్డవు. కనుక, ఆయ వలన నాకు భయము కలుగుచున్నది. నీవు నాకు అర్హురాలవు కావు".

"ఆ మాటకు దేవయాని యయాతితో, 'రాజా! నన్ను నీ విప్పుడు గ్రహింపకుండినచో తండ్రిద్వారా నిన్నే వరించెదను. ఆ విషయము నీకు తెలియ గలదు. ఇక నీవు పొమ్ము' అని యనెను"

"జనమేజయా! యయాతి మహారాజు అప్పుడు దేవయానిని వీడ్కొని తన నగరమునకు పోయెను. తరువాత దేవయాని అర్తురాలై, ఒక వృక్షమూల మున ఏడ్చుచు కూర్చొనెను. ఇట్లు తనబిడ్డ చాలసేపటివరకు ఇంటికి రానందు

చేత శుక్రాచార్యుడు దాదితో, 'నీవు త్వరగా పోయి దేవయానిని తోడ్కొని రమ్ము!' అనిన వెంటనే ఆ దాది ఆమెకొరకు అచ్చటచ్చట వనములో వెదకి ఒకచోట అలసి దైన్యముతో ఏడ్చుచు కూర్చొనియున్న దేవయానితో, 'భద్రే! ఇది ఏమి? ఎందుకేడ్చుచున్నావు? నిన్ను నీ తండ్రి పిలుచుచున్నాడు' అని యనగా, దేవయాని తనకు శర్మిష్ఠ చేసిన యవమానమును 'ఘూర్ణిక' యను పేరుగల ఆ దాదితో, 'ఘూర్ణికా! నీవు త్వరగా పోయి నా తండ్రికి ఈ సమాచారము చెప్పుము. ఇప్పుడు నేను వృషపర్వుని పట్టణములో ప్రవేశించను' అని యనెను".

"జనమేజయా! వెంటనే ఘూర్ణిక నగరమునకు పోయి అతిసంభ్రమముతో శుక్రాచార్యునకు జరిగిన సమాచారమంతయు చెప్పెను. అప్పుడు శుక్రాచార్యుడు, దేవయానిని శర్మిష్ఠ కొట్టుట, నూతిలో త్రోయుట విని దేవయాని కడకు దుఃఖించుచు పోయి, ఆమెను వనమునందు చూచి, శుక్రాచార్యుడు కౌగిలించుకొని యిట్లనెను:-

బిడ్డా! లోకములో అందరుగూడ ఆత్మ దోషముల మూలముగనే సుఖ దుఃఖములు అనుభవించు చుందురు. నీ వేదైన దుష్ప్రవర్తనకు లోనైయుందువు. దానికి ఈ నిష్కృతి (ప్రాయశ్చిత్తము) నీకు కల్గినది".

ఆ మాటకు దేవయాని తండ్రితో నిట్లనెను:-

"తండ్రీ! నాకు ప్రాయశ్చిత్తము అయినను, కాకున్నను సరియే! కాని నేను చెప్పునది సావధానుడవై వినుము. శర్మిష్ఠ, 'నీవు రాక్షసులను స్తుతించుచు, గానము చేయుచుందువు' అని చెప్పినమాట సత్యమేకదా! ఈ మాటనే ఆమె క్రోధముతో మాటిమాటికి అతిపరుషముగ నాతో, నిట్లనెను:-

"దేవయానీ! నాతండ్రిని పొగడుచు నీతండ్రి యాచించుచు, దానములు గ్రహించును. నేను ప్రతిగ్రహ మెరుగని తండ్రికి బిడ్డను!" అని దర్పముతో పలుమార్లు అనెను. అప్పుడునేను ఆమెతో, 'అట్లైనచో నిన్ను నేను ప్రసన్నురాలిని చేసెదను' అని యెంత చెప్పినను వినక మిక్కిలి కోపముతో నన్ను పట్టుకొని నిర్జనవనము నందలి నూతిలో దాసీజనముచేత త్రోయించి వెడలిపోయెను.

ఆమాట విని శుక్రాచార్యుడు దేవయానితో నిట్లనెను:-

"బిడ్డా! స్తుతించుచు, యాచించుచు దానములు తీసికొనువానికి నీవు బిడ్డవు కావు! ఎవనిగూడ స్తుతించక, ఎల్లప్పుడు స్తుతింపబడువానికే నీవు కూతురవు! ఈవిషయము వృషపర్వరాజు, ఇంద్రుడు, నహుషపుత్రుడైన యయాతి మహారాజున్ను ఎరుగుదురు. అచింత్యమైన అద్వితీయపర బ్రహ్మైశ్వర్యము నాకు బలము. భూలోక-స్వర్గలోకము లందలి సమస్తవస్తువులకు నేను అధికారి నని బ్రహ్మదేవుడు నా యెడల సంతుష్టుడై చెప్పెను. నేను ప్రజాహితము కోరుచు జలమును వర్షించెదను. అన్ని యోషధులను పుష్పములను సృజించెదను. ఇది సత్యము."

"జనమేజయా! యిట్లు శోకక్రోధములచేత పీడితురాలైన దేవయానిని తండ్రియైన శుక్రాచార్యుడు మృదు - మధురవచనములచేత ఇట్లు ఊరడించెను.

**శుక్రాచార్యుడు దేవయానిని ఓదార్చుట - దేవయాని యసంతుష్టి :-**

"బిడ్డా! నా విద్య సాటిలేనిది. నాకు దానివలన ఫలముగా ఐశ్వర్యము లభించినది. అధర్మములైన దైన్య - శాఠ్య (రహస్యముగా అపకారము చేయుట) కుటిలత్వములు నాకు లేవు. ఇతరుల యపవాదములను, నిందలను ఓర్చుకొనువాడు, సమస్త ప్రపంచమును జయించునని తెలిసికొనుము. ఉద్ధృతముగా వచ్చిన క్రోధమును, చెలరేగిన అశ్వమువలె, నిగ్రహించినవాడు మంచి అశ్వికునివలె, ఇంద్రియ నిగ్రహము కలవాడగును. అశ్వమును అణచజాలక, పగ్గములపై ఒరగిన వానివలె ఇంద్రియములను నిగ్రహించజాలక, వానికి లోబడినవాడు నశించును. ఉద్ధృతమైన క్రోధమును అక్రోధముచేత నిరసించినవాడు ఈ సమస్త ప్రపంచమును జయించినవాడని తెలిసికొనుము. సర్పము జీర్ణించి కుబుసమును విడిచినట్లే క్రోధమును ఓర్పుచేత విడిచినవాడే పురుషుడనబడున కోపమును, పరుషవాక్యములనున్ను ఓర్చుకొని, యితరులు తన మనస్సునకు సంతాపము కలిగించినప్పుడు తపించనివాడే పురుషార్థములను సాధించగలడు.

"బిడ్డా! ప్రతిమాసమునందు అలపు లేకుండ యజ్ఞములు నూరు సంవత్సరములు చేసినవానికంటె ఎవరి యెడలగూడ కోపగించనివాడు అధికుడు. క్రుద్ధుడు చేసిన దాన - యజ్ఞ - తపస్సులు నిష్ఫలములగును. అక్రోధనుడు చేసిన యా కార్యములు మహాఫలము నిచ్చును. క్రోధవశు డెప్పుడుగూడ పవిత్రుడు కాడు. తపస్సుగూడ చేయ జాలడు. అతడు యజ్ఞానుష్ఠానము గూడ

చేయజాలడు, క్రోధి కర్మ రహస్యమునుగూడ నెరుగ జాలడు. అతనికి ఇహలోక పరలోకములు రెండున్ను సుఖకరములు గాక, అతడు నశించును. క్రుద్ధుని యొక్క పుత్ర - భృత్య - మిత్రులు, భార్య, ధర్మము, సత్యము, ఇవి యన్నియు నశించి, అతనిని విడిచి పోవుట నిశ్చయము. అజ్ఞానులైన బాలబాలికలు అవివేకులై చేసిన వైరమును ప్రాజ్ఞులు అనుకరించగూడదు. ఎందుకనగా, ఆ యల్ప వయస్కులు ఇతరుల బలాబలములను ఎరుగక పరస్పరము ద్వేషించుకొనుచుందురు".

"జనమేజయా! ఆ మాట విని దేవయాని యిట్లనెను:"

"తండ్రీ! నేను బాలికనైనను ధర్మాధర్మములలోని భేదమును క్షమా - నిందల బలాబలములను గూడ నెరుగుదును. కాని, శిష్యవృత్తిలో లేని శిష్యుని, తన హితము గోరు గురువు క్షమించగూడదు. కనుక, సంకీర్ణ ప్రవర్తన గల దానవులకడ నివసించుట నాకు ఇష్టము కాదు. ఇతరుల ప్రవర్తనను, అభిజాత్యమునున్ను నిందించు పాపులయొద్ద, శ్రేయస్సు కోరు ప్రాజ్ఞు డెవడు గూడ నివసించ గూడదు. ఇతరుల ప్రవర్తనను, అభిజాత్యమునున్ను ప్రశంసించు సాధువులకడనే యుండవలెను. అట్టి నివాసమే శ్రేష్ఠమైనది.

తండ్రీ! ఇంద్రియ నిగ్రహము గలవారు ధనహీనులైనను శ్రేష్ఠులే. దుష్ప్రవర్తన గలవారు, పాపకర్ములు, ధనవంతులైనను, చాండాలురతో సమానులు. నిష్కారణముగ నితరులను ద్వేషించి, నిందావాక్యములు పలుకునట్టి వారి యొద్ద సత్పురుషులు నివసించ గూడదు. వారి పాపములు సత్పురుషులకు గూడ అంటుకొనును. పాపమునందో, పుణ్యమునందో ఆసక్తిగలవానికి ఆ కృత్యములందే ప్రీతియుండును. కనుక, పాపమెప్పుడు గూడ చేయగూడదు.

తండ్రీ! వృషపర్వుని కూతురు శర్మిష్ఠ అతిఘోర దుర్భాషలాడినది. ఆ మాటలు, అగ్నిని చిలుకువాడు అరణిని మథించినట్లు నా హృదయమును మథించుచున్నది. ఇంతకంటే దుఃఖకరమైన మాట మరియొకటి యుండదు. కటు వచనములు మర్మచ్ఛేదకరములగును. పరుష వచనములు పలుకువానిని అతని మిత్ర - బాంధవులెవరు గూడ ప్రేమించరు. సంపదలు లేక, శత్రువు యొక్క సంపదను ఆశ్రయించినవాని జీవనముకంటె మరణము శ్రేష్ఠమని పెద్దలు చెప్పెదరు

తండ్రీ! నీచులతో సాంగత్యము చేసినవాడు అవమానము పొందును. వాగ్బాణములచేత కొట్టబడినవాడు రాంత్రిబగళ్ళు దుఃఖించును. శస్త్ర విషాగ్నుల వలన గలుగు దుఃఖము మెల్లమెల్లగా అనుభవమునకు వచ్చును. కాని, కటు వచనము వెంటనే కష్టము కలిగించును. కనుక, పండితుడైనవాడు ఇతరులను పరుష వాక్యములతో బాధింపగూడదు. బాణతాడిత వృక్షము, గొడ్డలిచేత నరక బడినవనమున్ను తరువాత, మెల్లమెల్లగా మొలిచి పెరుగును. కాని, పరుష వాక్కులచేత గాయపడిన మనస్సు యొక్క గాయము నశించదు.

**శుక్రాచార్యుడు వృషపర్వుని తిరస్కరించి, విడిచి పోవ బూనుట - వృష పర్వుడు శర్మిష్ఠను దేవయానికి దాసిగా చేసి శుక్రాచార్యుని, దేవయానిని సంతోషపరచుట :-**

"జనమేజయా! యిట్లు దేవయాని పలుకగా, శుక్రాచార్యుడు అతిక్రుద్ధుడై, వృషపర్వునికడకు పోయి యిట్లనెను :-

"రాజా! పరుషవాక్కు ఫలించినంత త్వరగా, అధర్మాచరణము ఫలించదు. అధర్మము మెల్ల మెల్లగా, దానిని ఆచరించినవాని మూలములను ఛేదించును. పుత్రులు, పౌత్రులున్ను చేసినపాపకర్మ తనది కాదనుకొనువారికి తప్పక ఆపాపఫలము అధికముగా భుజించినవాని యుదరమును భోజనమువలె బాధించును. నాకు హితుడు, ఓర్పు గలవాడు, జితేంద్రియుడు, నాకడ విద్యా భ్యాసము చేయుచున్న కచుడను బ్రాహ్మణుని నీవు చంపించితివి. అతడు ఏపాపము నెరుగని ధర్మాత్ముడై, నాయింటిలో నివసించి నన్ను సేవించు చుండెను. 'అట్లు వధార్హుడు కాని వానిని నీవు చంపించుట, నాబిడ్డను చంపుటకు కూపములో నీ బిడ్డ త్రోయుట' ఈరెండు కారణముల వలన నేను నిన్ను నీ బంధువులను విడిచెదను.

కనుక, రాజా! నీ రాజ్యమునందు ఇకపైన నీతో కలిసి క్షణముగూడ నుండజాలను ఇక నిన్ను, నీ బంధువులను విడిచి పోయెదను. నన్ను అసత్య వాది యని తలచితివి. నీ దోషమును అరికట్టక నన్ను ఉపేక్షించుట నీకు తగదు."

ఆ మాట విని వృషపర్వుడు శుక్రాచార్యునితో నట్లనెను :-

"బ్రహ్మన్! నే నొకవేళ శర్మిష్ఠచేత దేవయానిని కొట్టించి, నిందింప జేసి యుండినయెడల, ఆపాపముచేత నాకు సద్గతి అందకుండుగాక! ఆచార్య! నీవు అధర్మము, అసత్యమున్ను ఆచరించినట్లు దోషము నీపై నెప్పుడుగూడ నేను ఆరోపించలేదు. నీ యందు సర్వదా సత్య ధర్మములు ప్రతిష్ఠితములై యున్నవి. మా యెడల దయతో ప్రసన్నుడవు కమ్ము! నీవు మమ్ము విడిచి వెడలి పోయిన యెడల మాకు గత్యంతరము లేక సముద్రములో పడి పోయె దము. నీ వొకవేళ నన్ను విడిచి దేవతలకడకు పోయిన యెడల, నేను సమస్త మును త్యజించి ప్రజ్వలితాగ్నిలో పడెదను."

ఆ మాట విని శుక్రుడు ఇట్లనెను :-

"వృషపర్వరాజా! మీ యసురు లందరు సముద్రములో పడినను నలు దిక్కులకు పారిపోయినను నేను లెక్కచేయను. నా ప్రియపుత్రికకు జరిగిన యవమానమును సహింపజాలను. నా జీవితము ఆమెపైననే ఆధార పడియున్నది. కనుక, ఆమెను ప్రసన్నురాలిని చేసికొనుము. అట్లైనచో, ఇంద్రునకు బృహస్పతి వలె నేను నీ యోగక్షేమములను వహించు చుందును."

ఆ మాటకు వృషపర్వుడు, 'భార్గవా! రాక్షసేంద్రులకు గల గజగవాశ్వాది సంపద కంతయు నీవు అధిపతివి' అని యనగా, శుక్రుడు 'రాజా! దేవయానిని నీవు ప్రసన్నురాలిని చేసినచో రాక్షసుల యైశ్వర్యమున కంతటికి నేను ప్రభువు నయ్యెదను' అని వృషపర్వునితో ననెను."

"జనమేజయా! ఇట్లు శుక్రాచార్యుడనిన మాటను వృషపర్వుడు అంగీ కరించి 'అట్లే యగుగాక!' అని చెప్పగనే, వారిరువురు దేవయాని కడకు పోయి శుక్రాచార్యు డీ విషయ మామెకు తెలుపగా, దేవయాని, 'తండ్రీ! నీవు రాజ్య సంపద కంతటికి ప్రభువునని చెప్పుచున్నావు. అది నాకు తెలియదు, ఆ విషయము వృషపర్వుడే స్వయంగా నాకు చెప్పవలెను!' అని అనగా వృష పర్వుడు, 'దేవయానీ! నీకోరిక యెంత దుర్లభమైనను తప్పక నెరవేర్చెదను. అడుగుము' అని అనగా, దేవయాని, 'రాజా! కన్యాసహస్రముతో పాటు శర్మిష్ఠ నాకు దాసి కావలెను. నేను వివాహము చేసికొని పతి గృహమునకు పోయిన తరువాత గూడ శర్మిష్ఠ నన్నే యనుసరించి, కన్యాసహస్రముతో నాకు దాస్యము చేయుచు నుండవలెను. ఇది నా కోరిక!' అని యనెను."

"జనమేజయా ! వృషపర్వుడు దేవయాని కోరిక వినిన వెంటనే దాదిని పిలిచి, ఆమెతో, 'నీవు త్వరగా పోయి శర్మిష్ఠను తోడుకొని రమ్ము ! ఆమె దేవయాని కోరికను నెరవేర్చుగాక! ఒక కులము రక్షించుటకు ఒక వ్యక్తిని, గ్రామ రక్షణార్థము ఒక కులమును, దేశ రక్షణార్థము ఒక గ్రామమును, ఆత్మ రక్షణార్థము సమస్త భూమండలమున్ను విడువవలెను కదా!' యని యనెను."

"జనమేజయా ! వృషపర్వుని యాజ్ఞచేత దాది శర్మిష్ఠ కడకు పోయి, 'శర్మిష్ఠా! లెమ్ము! బంధువులకు సుఖము కలిగింపుము. దేవయానిచేత పురికొల్పబడిన శుక్రాచార్యుడు శిష్యులైన రాక్షసులను విడుచుచున్నాడు. కనుక, నీవు దేవయాని కోరిన పనులన్నియు చేయుచు ఆమెకు దాస్యము చేయవలెను." అని యనగా శర్మిష్ఠ దాదితో 'నేను దేవయాని కోరిన పనులన్నియు నేటినుండి చేసేదను. ఈ విధముగ దేవయాని కొరకు శుక్రాచార్యుడు నన్ను పిలిచి చెప్పినచో తప్పక దాస్యమును అంగీకరించెదను. నా దోషమువలన దేవయానీ - శుక్రులు మమ్ము విడిచి పోవకుందురు గాక!' అని అనెను."

"జనమేజయా ! తరువాత శర్మిష్ఠ పల్లకిలో, కన్యా సహస్రముతో పాటు తండ్రి యాజ్ఞ ప్రకారము నగరము దాటి పోయి దేవయానితో, 'నేను దాసీ సహస్రముతో పాటు నేటినుండి నీకు పరిచారికగా నుండి, నీవు పతిగృహమునకు పోయినప్పుడు నిన్ను అనుసరించెదను' అని చెప్పగా, దేవయాని శర్మిష్ఠతో 'నిన్ను స్తోత్రము చేసి, దానములను యాచించి, ప్రతిగ్రహించు వానిబిడ్డను నేను. నీవో, స్తుతింపబడుచున్న వాని కూతురవు. ఇట్టి నీవు నాకు దాసి వెట్లయ్యెదవు?' అని ఎత్తిపొడువగా, శర్మిష్ఠ దేవయానితో, 'ఎన్ని కష్టము లనుభవించియైనను, నేను పీడితులైన నా బంధువులకు సుఖము కలిగించవలెను కాబట్టి, నీవు పోయినచోటుకెల్ల నిన్ననుసరించుచు దాస్యము-చేయుచుండెదను' అని యనెను."

"జనమేజయా! శర్మిష్ఠ దేవయానికి దాస్యము చేయుటకు అంగీకరించిన తరువాత, దేవయాని శుక్రాచార్యునితో 'తండ్రీ! నీ విజ్ఞానము, విద్యాబలము అమోఘమైనవి. నే నిప్పుడు సంతోషించితిని. ఇక మనము వృషపర్వుని నగరములో ప్రవేశింతము' అని యనగనే, శుక్రాచార్యుడు దేవయానితోపాటు నగర ప్రవేశము చేసెను. రాక్షసు లందరు ఆయనను పూజించిరి."

**దేవయానీ-శర్మిష్ఠల వన విహారము:. యయాతి-దేవయానుల సంవాదము:**

"జనమేజయా! తరువాత చాలకాలమునకు దేవయాని ఆ వనమునకే విహారార్థమై పోయెను. శర్మిష్ఠ దాసీ సహస్రముతో దేవయాని ననుసరించి పోయి ఆ వనమునందు సఖులతో స్వేచ్ఛగా సంచరించెను. అచట క్రీడించుచు, మధు పానము చేయుచు, వివిధ భక్ష్యములను భుజించుచు, అనేక ఫలములను నమలి తినుచు, విహరించు చుండిరి."

"జనమేజయా! నహుష పుత్రుడైన యయాతి వేటాడుచు, యదృచ్ఛగా ఆ చోటికే జలపానార్థము వచ్చి, దేవయానిని, శర్మిష్ఠను, ఆమె దాసీ జనమును, వారు త్రాగుచు, తినుచు, ఆడుచునుండగా, చూచెను. అచ్చట నొక దివ్యాసనము నందు సర్వాభరణ భూషితురాలై, కూర్చొనియున్న అసమాన సౌందర్యరాశియైన దేవయానిని చూచెను. ఆమె పాదము లొత్తుచు శర్మిష్ఠ అచట కూర్చొని యుండెను. అప్పుడు యయాతికి దేవయానికిన్ని సంవాదము జరిగెను.

యయాతి:- శుభాంగీ! రెండు* కన్యాసహస్రములచే పరివృతురాండ్రైన మీ రిరువురు కన్యక లెవరు? మీ గోత్రనామము లేమి...?

దేవయాని:- రాజా! నేను అసురగురువైన శుక్రునకు కూతురను. ఈమె దాన వేంద్రుడైన వృషపర్వుని కూతురు శర్మిష్ఠ. ఈమె నాకు దాసిగా నుండి నన్ను సర్వదా అనుసరించుచుండును.

యయాతి:- రాక్షసరాజు కూతురైన ఈమె నీకు ఎట్లు దాసి యయ్యెను? నాకు చాల కుతూహలముగ నున్నది.

దేవయాని:- రాజా! అన్నియు విధి విధానము ననుసరించి యుండును. ఇది యంతయు విధివిహిత మని తలచి నీవు దీనికి సంబంధించిన విచిత్ర కథను అడుగకుము నీ రూపవేషములు రాజునకువలె నున్నవి. నీ మాట బ్రాహ్మణ వాక్కుగా నున్నది. నీ వెవడవు? ఎవని కొడుకువు? ఎక్కడనుండి వచ్చితివి?

* కొన్ని శ్లోకములలో రెండువేల సఖీ జనమని, మరి కొన్నింటిలో ఒక వేయి సఖురాండ్రనియు చెప్పబడినది. అవసరమును బట్టి రెండును సరియే.

యయా :- భామినీ! నేను బ్రహ్మచర్యము నవలంబించి సమస్త వేదములను నేర్చితిని. నేను రాజపుత్రుడను. రాజును. నాపేరు యయాతి.

దేవ :- రాజా! నీవు ఏ పనికై ఇచటకు వచ్చితివి? జలమును గ్రహించుటకా? లేక మృగయార్థమై వచ్చితివా?

యయా :- కాంతా! నేను వేటాడుచు జలపానార్థమై ఇక్కడికి వచ్చితిని. నన్ను అనేక ప్రశ్నల్ను అడిగితివి. ఎందుకో తెలుపుము.

దేవ :- రెండు కన్యా సహస్రములతో, నాకు దాసి యైన శర్మిష్ఠతోను నీకు వశురాలనైతిని. నీకు మంగళ మగుగాక! నాకు సఖుడవు, భర్తవు కమ్ము!

యయా :- శుక్రాచార్య పుత్రీ! నిన్ను చేపట్టుటకు నేను అర్హుడను కాను. రాజులు నిన్ను పెండ్లియాడుటకు నీ తండ్రి యిష్టపడడు.

దేవ :- బ్రాహ్మణ జాతివలన క్షత్రియ జాతి ఉత్పన్నమైనది. క్షత్రియ జాతివారితో బ్రాహ్మణ జాతివారు సమాగమము చేసినారు. నీవు ఋషివో, ఋషి పుత్రుడవో కనుక నన్ను పెండ్లియాడుము.

యయా :- భామినీ! నాలుగు వర్ణములవారుగూడ ఒక దేహము నుండియే ఉద్భవించిన వారయినను, వారికి వేరు వేరు ధర్మములు వేర్వేరు శౌచాచారములున్ను కలవు. వారిలో బ్రాహ్మణుడు శ్రేష్ఠుడు.

దేవ :- యయాతీ! ఇది పాణిగ్రహణ ధర్మము. ఇంతకు పూర్వము ఏ పురుషులుగూడ దీనిని అనుసరించలేదు. కనుక, నీవు నా పాణిని గ్రహించితివి. నేను నిన్ను వరించుచున్నాను. మానవతినైన నా హస్తమును మరియొకడెవడు స్పృశించగలడు? ఋషి పుత్రుడవు, ఋషివియునైన నీవు స్వయముగా నా పాణిగ్రహణము చేసితివి. అట్టి హస్తమును మరియొకడు తాకజాలడు.

యయాతి :- దేవయానీ! కోపించిన సర్పము కంటెను, జ్వలించుచున్న అగ్ని కంటెను బ్రాహ్మణుడు మిక్కిలి దురాధర్షుడు' అని 'విజ్ఞానవంతుడైన పురుషుడు తెలిసికొనవలెను.

దేవ:- రాజా! ఆరెండిటికన్న బ్రాహ్మణుడు అధికదురాధర్షుడు (తిరస్కరింపదగనివాడు) అని నీవు ఎట్లు చెప్పగలుగుచున్నావు?

యయాతి :- కాంతా! సర్పము, శస్త్రము ఒక్కనినే చంపును. కోపించిన బ్రాహ్మణుడు నగరములను రాష్ట్రములనే నశింపజేయ గలడు. కనుక, బ్రాహ్మణుడు అధిక దురాధర్షు డని నాయభిప్రాయము. కాబట్టి మంగళకరురాలా! నీతండ్రి నాకు నిన్ను ఈయనిచో నేను నిన్ను వివాహము చేసికొనను.

దేవ:- రాజా! నీవు యాచించకుండనే నేను నిన్ను వరించితిని. కనుక, నీకు నాతండ్రి నన్ను ఇచ్చును. నన్ను పరిగ్రహించుటలో నీకు భయము లేదు. కాబట్టి, నన్ను పెండ్లి చేసికొనుము. రాజా! క్షణ కాలము నిలువుము. నాతండ్రిని పిలిపించెదను.

ఇట్లు చెప్పి దాదితో, 'నీవు త్వరగాపోయి బ్రహ్మకల్పుడైన నా తండ్రిని ఇక్కడకు తోడుకొని రమ్ము. నేను, యయాతిని స్వయంవరమునందు వరించితినని ఆయనకు తెల్పుము' అని యనెను."

"జనమేజయా! దావి, వెంటనే శుక్రాచార్యునికడకు పోయి దేవయాని సందేశమును యథాతథముగా ఆయనకు తెలిపెను. అది విని శుక్రుడు యయాతి కడకు వచ్చెను. యయాతి అంజలిబద్ధుడై ఆబ్రాహ్మణునకు నమస్కరించి, నిలిచి యుండగా, దేవయాని, 'తండ్రీ! ఇతడు నహుష పుత్రుడైన యయాతి. నేను దుర్గమావస్థలో నుండగా, నా పాణిగ్రహణము చేసి, కూపమునుండి నన్ను వెలికి తీసెను. నీకు ప్రణామము చేయుచున్నాను. ఈ రాజునకు నన్ను సమర్పింపుము. ఇతనిని నేను పతిగా వరించితిని' అని యనెను. అది విని శుక్రాచార్యుడు యయాతితో నిట్లనెను :-

"వీరవరా! నా కూతురు ఇష్టపడి నిన్ను పతిగా వరించెను. కనుక, ఈమెను నీకు భార్యగా నిచ్చుచున్నాను. గ్రహింపుము!" ఆ మాటకు యయాతి, 'భార్గవా! ఈమెను పెండ్లియాడిన నన్ను వర్ణసాంకర్యము వలన కలుగ నధర్మము స్పృశించకుండునట్లు అనుగ్రహింపుము.' ఆ మాట విని శుక్రాచార్యుడు యయాతితో నిట్లనెను :-

"రాజా! నీకు అధర్మము నుండి విముక్తి కలిగించెదను. వరము కోరు కొనుము. నీవు చింతింపకుము. నీ పాపములను నేను తొలగించెదను. ఈ దేవయానిని ధర్మయుక్తముగ నీవు పెండ్లి యాడుము. ఈమెతో అసమాన ప్రీతిని పొందుము."

"రాజా! వృషపర్వుని కూతురైన ఈ శర్మిష్ఠా కుమారిని గూడ నీవు సర్వదా సమ్మానింపుము. కాని, ఎప్పుడుగూడ నీవు ఈ శర్మిష్ఠను రహస్యముగ శయనమునకు ఆహ్వానించుట గాని, ఈమెతో మాట్లాడుటగాని, ఈమెను స్పృశించుట గాని చేయగూడదు. దేవయానిని భార్యగా స్వీకరించి స్వేచ్ఛగా నీ కామేచ్ఛను అనుభవింపుము."

"జనమేజయా! ఇట్లు శుక్రాచార్యుడు చెప్పగా, యయాతి శుక్రునకు ప్రదక్షిణ - నమస్కారములుచేసి దేవయానిని శాస్త్రోక్తవిధిచే వివాహము చేసికొనెను. శుక్రాచార్యుడు దేవయానితోపాటు శర్మిష్ఠనుగూడ నిచ్చెను. అట్లు యయాతి శుక్రాచార్యునిచేత, రాక్షసులచేతను పూజితుడై, శుక్రాచార్యుని యనుజ్ఞ గొని సంతోషముతో తన పట్టణమునకు పోయెను".

**దేవయానికి పుత్రోత్పత్తి - శర్మిష్ఠా యయాతుల సమాగమము - ఆమె కొక పుత్రుడు కలుగుట :**

"జనమేజయా! యయాతి, మహేంద్రపుర సమానమైన తన పట్టణమునకు పోయి, అంతఃపురములో దేవయానిని ప్రవేశింపజేసి, ఆమె యనుమతితో శర్మిష్ఠ కొరకు, అశోకవన సమీపమునందు ఒక గృహము నిర్మించి, శర్మిష్ఠను అందులో ప్రవేశింపజేసి, ఆమెకు, ఆమె వేయి మంది దాసీజనమునకున్ను విడివిడిగా అన్న పానీయవస్త్రములను ఇచ్చి సత్కరించెను".

"జనమేజయా! దేవయాని అశోకవనమునకు వచ్చి రమణీయమైన ఆ వనమునందు శర్మిష్ఠతో క్రీడించి, ఆమెను అక్కడనే యుండు మని నిర్దేశించి, రాజుతోపాటు తన గృహమునకు పోయెను. ఇట్లే, చాలకాలము శర్మిష్ఠతో వ్యవహరించుచు, రాజుతో ప్రీతి పూర్వకముగ సుఖ మనుభవించు చుండెను".

"జనమేజయా! దేవయానితో యయాతి, అనేక సంవత్సరములు సుఖముగ విహరించెను. ఋతుకాలము రాగా దేవయాని గర్భధారణ చేసి ఒక కుమారుని కనెను.

"జనమేజయా! ఇట్లు వేయి సంవత్సరములు గడవగా శర్మిష్ఠకు యౌవనము వచ్చి, ఋతుకాలము రాగా, ఆమె ఋతుస్నాతయై, సర్వాభరణ భూషితురాలై, వికసిత కుసుమ స్తబక పరివృతమైన యశోకవృక్షశాఖ-క్రింద కూర్చొని అద్దమునందు తన ముఖము చూచుకొని పతిదర్శన లాలసురాలై, శోక - మోహములు కలుగగా అశోక వృక్షముతో నిట్లనెను.

"అశోకమా! నీవు నా శోకమును పోగొట్టి, నాకు ప్రీతికలిగించి, 'అశోకము' అను నీపేరును సార్థకము చేసికొనుము. నాకు ఋతుకాలము సంప్రాప్తించినది. నాకు పతి లేడు. ఇప్పుడు నేనేమి చేయుదును? దేవయాని పుత్రుని కనెను. నా యౌవనము వ్యర్థమై పోవుచున్నది. దేవయాని వరించిన పతినే నేనుగూడ వరించెదను. నాకు పుత్రఫలమిమ్మని ఆ రాజునే కోరుటకు నిశ్చ యించినాను. అతడు రహస్యముగా నన్ను చూచుటకు వచ్చునా?" అని యను కొను చుండగానే, యయాతి, యదృచ్ఛగా అక్కడకు వచ్చి శర్మిష్ఠనుచూచి యెదుట నిలిచెను. అతనికి శర్మిష్ఠ ఎదురేగి, అంజలిబద్ధురాలై యిట్లనెను :-

"జనమేజయా! వారిరువురకు నిట్లు సంవాదము జరిగెను.

శర్మిష్ఠ :- యయాతి మహారాజా! నీ యింటిలో రహస్యముగానున్న స్త్రీని ఇంద్ర - చంద్ర - విష్ణు - యమ - వరుణాదులు ఎవ్వరుగూడ చూడజాలరుగదా! నా సౌందర్య - కుల - శీలములను నీ వెరుగుదువు. కనుక, 'నాకు ఋతుకాలమును ప్రసాదింపు' మని నిన్ను యాచించు చున్నాను.

యయాతి :- వృషపర్వకుమారీ! నీవు అనిందితమైన శీలవతివని యెరుగుదును. నీ రూపములో సూది మొనయంతగూడ దోషము లేదని చూచు చున్నాను. నేను, దేవయానిని చేపట్టినప్పుడు, శుక్రాచార్యుడు నిన్ను నా శయనమునకు పిలువగూడదని కట్టడిచేసి చెప్పెను.

శర్మిష్ఠ :- రాజా! పరిహాసవచనమును అసత్యమైనను హాని కలిగించదు. తన స్త్రీలతో పలికినపుడు, వివాహ కాలమందు, ప్రాణాపాయము నందు, సర్వధనాపహరణమునందు, ఎప్పుడైన విధిలేక అసత్యము చెప్పవలసివచ్చినప్పుడున్ను అసత్య దోషము కలుగదు. ఈ యైదు విధములైన యసత్యములు పాపరహితము లని చెప్ప బడెను.

రాజా! నిర్దోష ప్రాణి యొక్క ప్రాణరక్షణము కొరకు సాక్ష్యమిచ్చునపుడు, తన నెవరైన నడుగగా, అసత్యమాడిన యెడల, నతడు పాపము పొందడు. కాని, తన ప్రాణములను, ఇతరుల ప్రాణములనున్ను రక్షింపవలసిన సమయము వచ్చినప్పుడు తన ప్రాణములను మాత్రము రక్షించుకొనుటకు అసత్యము లాడిన వాడు నశించును.

యయా :- భామినీ! సమస్త ప్రాణులకు రాజు ప్రమాణము (అతనివలెనే యందరు నడచుకొనెదరు). కనుక, అసత్యమాడిన రాజు నశించును. ఆర్థిక సంకటము ప్రాప్తించినను నేను మిథ్యాభాషి నగుటకు ఇష్టపడను.

శర్మిష్ఠ :- రాజా! 'తన పతి, సఖురాలిపతి యిరువురును సమానులు' అని శాస్త్ర సమ్మతము. నా సఖురాలితోపాటే నేను నిన్ను వరించితిని. కనుక, మా యిరువురి వివాహము సమానము. దేవయానితోపాటే శుక్రాచార్యుడు నన్ను నీకు ఇచ్చి, 'నన్నాదరించి, పోషించు'మని నీకు చెప్పెను. ఆయనమాట అసత్యము చేయపగవు. యాచించిన వారికి నీవు సువర్ణ మణిరత్నములు, వస్త్రభూషణములు, గోభూమ్యాదులున్ను దానముగ నిచ్చుచున్నావు.

తనకంటె వేరైన వస్తువును ఇచ్చుట దాన మనబడును. కాని, శరీరాశ్రితమైన వస్తువు నిచ్చుట దానము కాదు. అన్నిటి కంటె దుష్కరమైనది పుత్రదానము, ఆత్మదానము, కనుక శరీర దానముచేత, ఆ యితర దానము లన్నియు చేయబడి నట్లగును. 'ఎవరికేది కావలెనో, అది వారికి ఇచ్చెదను' అని నీవు పట్టణము నందు మూడువేళల ప్రతిదినము చాటించు చున్నావు. ఆ చాటింపు అసత్యమై, వ్యర్థమగును కదా! కనుక, నీవు కుబేరునివలె నీ మాటను సత్యము చేసికొనుము.

యయా :- భామినీ! ఎవరేది కోరినను అది వారి కిచ్చుటకు నేను నియమము చేసికొనినాను. ఇది నా వ్రతము కనుక, నీవు ఇష్టము వచ్చినది కోరుకొనుము. ఇచ్చెదను.

శర్మి :- రాజా! నన్ను అధర్మమునుండి కాపాడుము. ధర్మము పాలింపుము. నీ నుండి నేను సంతానవతినై, లోకమునందు ఉత్తమ ధర్మము నాచరించెదను. ప్రపంచములో భార్య, దాసుడు, పుత్రుడు ఈ ముగ్గురున్ను ధనమునకు అధికారులు కారు. ఈ ముగ్గురు ఎవరిని పొందెదరో, వారికి ధన మయ్యేదరు. అనగా భార్యధనమునకు భర్త, సేవకుని ధనమునకు ప్రభువు, పుత్రుని ధనమునకు తండ్రి అధికారు లయ్యేదరు. నేను, దేవయానికి దాసిని. దేవయాని నీకు వశ్యురాలు. కనుక, నిన్ను నేను సేవించదగిదానను. నన్ను గ్రహింపుము."

"జనమేజయా ! యిట్లు శర్మిష్ఠ చెప్పినమాట యథార్థమే యని తలచి, యయాతి ఆమెను ఆదరించి, ధర్మమును పాలించి, ఆమె కోరిక మేరకు ఆమెతో సమాగమము చేసి, ఇరువురున్ను పరస్పరము సమ్మానించుకొని తమ తమ నివాసములకు పోయిరి."

"జనమేజయా ! ఆ సమాగమమునందు శర్మిష్ఠ ఆ రాజువలన ప్రథమ గర్భము ధరించి, సకాలమునందు దేవపుత్రునివంటి సుందరకుమారుని కనెను."

**దేవయానీ - శర్మిష్ఠల సంవాదము - శర్మిష్ఠకు పుత్రజననము తెలిసి దేవయాని కోపముతో తండ్రికడకు పోవుట - శుక్రాచార్యుడు యయాతికి వృద్ధత్వ శాపమిచ్చుట :**

"జనమేజయా ! శర్మిష్ఠకు పుత్రుడు కలిగిన సంగతి విని దేవయాని దుఃఖించుచు చింతతో శర్మిష్ఠకడకు పోయెను. వారిరువురికి నిట్లు సంవాదము జరిగెను.

దేవయాని:- శర్మిష్ఠా నీవు కామలోభము చేత ఈ పాపమెందుకు చేసితివి ?

శర్మిష్ఠ:- దేవయానీ! ధర్మాత్ముడు, వేద పండితుడునైన యొక ఋషి నా కడకు రాగా, నేను ధర్మసంగతముగ ఆ ఋషిని వరమిమ్మని కోరితిని. అన్యాయముగ నేను కామాభిలాష చేయలేదు. ఆ ఋషి యనుగ్రహము చేత ఈ సంతానము నాకు కలిగెను. ఇది సత్యము.

దేవ:- శర్మిష్ఠా ! మంచిదే ! నీవు చెప్పినమాట సత్యమైనచో, నీతో సమాగమము చేసిన యాబ్రాహ్మణుని గోత్ర-నామ-కులములు చెప్పుము. ఆతనిని గూర్చి తెలిసికొన గోరుచున్నాను.

శర్మి:- తపస్సుచేత, తేజస్సు చేతను సూర్యునివలె ప్రకాశించుచున్న యామహాత్ముని చూచి ఈ ప్రశ్నలడుగుటకు నాకు శక్తి చాలక పోయెను.

దేవ:- శర్మిష్ఠా! జ్యేష్ఠుడు, శ్రేష్ఠుడునైన బ్రాహ్మణునివలన నీకు సంతానము కలిగియుండిన యెడల, నాకు కోపము లేదు.

"జనమేజయా ! వారు, ఇట్లు పరస్పరము మాట్లాడుకొని, నవ్వుకొనిరి. దేవయాని శర్మిష్ఠమాట సత్యమే యని తలచి తన యింటికి పోయెను.

"జనమేజయా! యయాతి దేవయాని గర్భమునుండి 'యదు - తుర్వసు' లను ఇంద్ర విష్ణువులవంటి యిద్దరు కుమారులను కనెను. అతనినుండియే శర్మిష్ఠ 'ద్రుహ్యు - అను - పూరు' నామములు గల ముగ్గురు కొడుకులను కనెను."

"జనమేజయా! ఇట్లు కొంతకాలము గడవగా, ఒకనాడు దేవయాని, యయాతితోపాటు ఏకాంతముగ వనమునకు పోయి దేవసమాన రూపములు గలిగి స్వేచ్ఛగా క్రీడించు చున్న కుమారులను చూచి యయాతితో, 'ఈ బాలకులు దేవ పుత్రులవలె నున్నారు. ఎవరి కొడుకులు? వీరికి నీ వంటి వర్చస్సు రూపమే కలదు' అని యడిగి, ఆ బాలకులను గూడ నిట్లడిగెను :-

"బాలకులారా! మీ పేరేమి? వంశమేది? మీ తండ్రి యెవడు? సత్యముగ చెప్పుడు."

ఇట్లు దేవయాని యడుగగా ఆ ముగ్గురు బాలకులు యయాతిని, శర్మిష్ఠను తమ చూపుడు వ్రేళ్ళతో చూపుచు, 'వీరు మా తలిదండ్రులు' అని చెప్పిరి.

ఆ మాట విని దేవయాని శర్మిష్ఠతో నిట్లనెను :-

"భామినీ! నీ కడకు ఒక ఋషి వచ్చి సమాగమము చేసినట్లు చెప్పితివి. నీవు యయాతినే ప్రోత్సహించితివి. నీవు పాపము చేసితివని తొలుతనే చెప్పితిని. నా యధీనములో నాకు దాసిగా నున్న నీవు నాకు అప్రియము చేసితివి. నీవు

అసురపుత్రివి గనుక, ఆ యసుర ధర్మమునే ఆశ్రయించి నాకు భయపడ కున్నావు."

ఆ మాట విని శర్మిష్ఠ దేవయానితో నిట్లనెను :-

"దేవయానీ! నేను నీతో ఋషి యని చెప్పినమాట సత్యమే. న్యాయముగ ధర్మమార్గములో చరించుచున్న నేను భయపడను. నీవు ఈ రాజును భర్తగా వరించినప్పుడే నేనుగూడ ఇతనినే వరించితిని. సఖురాలి భర్త ధర్మము ప్రకారము నాకుగూడ భర్త యగును. నీవు నాకు పూజ్యురాలవు, మాన్యురాలవు, నాకంటె వయస్సులో జ్యేష్ఠురాలవైన బ్రాహ్మణ స్త్రీవి. నీకంటెగూడ నాకు ఈ రాజర్షి అత్యంత పూజ్యుడని తెలిసికొనుము. నీతండ్రి నాకు గురువు, మన యిద్దరను అయన యీ రాజున కిచ్చెను. ఈ రాజు నీకు పూజ్యుడైన భర్త. నన్నుగూడ పోష్యురాలినిగ పోషించు చున్నాడు."

"జనమేజయా! శర్మిష్ఠ మాట విని, దేవియాని, యయాతితో, "రాజా! నీవు నాకు అపకారము చేసితివి. కనుక, నీయొద్ద నేను ఉండను' అని చెప్పి త్వరగా లేచి, దుఃఖించుచు శుక్రాచార్యుని కడకు పోవుటకు పూనుకొనియుండగా, ఆమె వెనుకనే రాజు ఆమెను ఓదార్చుచు, సంభ్రమముతో అనుసరించి పోయెను.

క్రోధముచేత ఎఱ్ఱబడిన కన్నులు గల దేవయాని అతనిని తిరిగికూడ చూడక, అతనితో ఏమియు మాట్లాడక, ఏడ్చుచు శుక్రాచార్యుని కడకు త్వరగా పోయి, ఆయనకు నమస్కరించి, నిలిచెను. యయాతిగూడ శుక్రుని పూజించెను. అప్పుడుడు దేవయాని శుక్రాచార్యునితో నిట్లనెను:

"తండ్రీ! అధర్మముచేత ధర్మము జయింపబడినది. క్రిందిది మీదకు మీదిది క్రిందకునైనది. శర్మిష్ఠచేత నేను మోసగింపబడితిని. ఈ యయాతి రాజు వలన ఆమెకు ముగ్గురు కొడుకులు పుట్టిరి. దౌర్భాగ్యురాలనైన నాకు ఇద్దరు కొడుకులు! తండ్రీ! ఈ రాజు ధర్మజ్ఞుడని ప్రసిద్ధి పొందినాడు. నియమమును కట్టుబాటును ఉల్లంఘించెను.

ఆ మాట విని శుక్రాచార్యుడు యయాతితో నిట్లనెను :-

"మహారాజా! నీవు ధర్మజ్ఞుడవై యుండికూడ అధర్మమునే ప్రియమని తలచి ఆచరించితివి. అందువలన నీకు త్వరలోనే ముసలితనము ప్రాప్తించి నిన్ను అణచివేయగలదు."

ఇట్లు శపింపగా యయాతి శుక్రాచార్యునితో నిట్లనెను :-

"భగవన్! నన్ను శర్మిష్ఠ ఋతుఫలప్రాప్తికి యాచించెను. కనుక, అది ధర్మకార్యమని చేసితిని. ఋతువును యాచించిన స్త్రీకి ఋతుసమాగమము ఈయని పురుషుడు భ్రూణహత్య చేసినవాడు అగునని బ్రహ్మవాదులు చెప్పిరి. రహస్యమునందు తన సమాగమము యాచించిన స్త్రీని పొందనివాడు భ్రూణ హంతకుడు అని పండితులు ధర్మశాస్త్రములలో చెప్పిరి. 'ఎవడు ఏది కోరినను ఆతనికి ఆ వస్తువు ఈయవలెను.' అను వ్రతము నాకు గలదు. నీవు ఆమెను నాకు ఇచ్చితివి. ఆమె నన్నుదప్ప మరియొకనిని పతిగా కోరలేదు. అందుచేత అది ధర్మమని తలచి నేను ఆ కార్యము చేసితిని. బ్రహ్మన్! నన్ను క్షమింపుము. ఇవి యన్ని యోచించియే 'అధర్మము - భయము' ఈ రెంటిచేత ఆక్ర మింపబడిన నేను శర్మిష్ఠను పొందితిని."

"అది విని శుక్రాచార్యుడు 'రాజా! నీవు నా యధీనములో నుంటివిగదా! నన్ను ఈ విషయమును గూర్చి అడుగవలసియుంటివి. నీవు ధర్మము విషయ ములో చేసిన అసత్య ప్రవర్తనము చౌర్యమేయగను' అని యనెను!"

"జనమేజయా! అట్లు క్రుద్ధుడైన శుక్రాచార్యునిచేత శపింపబడిన యయా తికి పూర్వ వయస్సు పోయి ముసలితనము ఆక్రమించెను. అప్పుడు యయాతి శుక్రులకు ఇట్లు సంవాదము జరిగెను:-

యయాతి:- "భార్గవా! దేవయానియందు నాకు యౌవనసుఖతృప్తితీర లేదు. అందుచేత నన్ను ముసలితనము ఆక్రమింపకుండ అనుగ్ర హింపుము.

శుక్రుడు:- రాజా! నామాట అసత్యము కాజాలదు. నీకు ముసలితనము వచ్చెను. నీవు కోరినచో ఈ 'జర'ను ఇతరునియందు సంక్ర మింప జేయవచ్చును.

యయాతి:- ఏ కొడుకు నాకు తనవయస్సును ఇచ్చునో, అట్టి పుణ్యవంతుడు' కీర్తిమంతుడునైన నా పుత్రుడు నా రాజ్యమును పొందునట్లు అను గ్రహింపుము.

శుక్రుడు:- రాజా! నీవు నన్ను హృదయములో ధ్యానించి యథేచ్ఛగా, నీజ రను ఇతరునియందు సంక్రమింప జేయగలవు. అప్పుడు నీకు పాపము అంటదు. నీకు యౌవన మిచ్చిన నీ పుత్రుడు నీ రాజ్య మునకు రాజై ఆయుష్మంతుడై, కీర్తిమంతుడై, బహుసంతాన సంపన్ను డగును.

**యయాతి తననలుగురు పుత్రులను తనజరను తీసికొని వారి యౌవ నము తన కిమ్మని కోరుట - వారియనంగీకారము కనిష్ఠుడు పూరుని యంగీ కారము - అతనికి మెచ్చి యితరులకు శాప మిచ్చుట:-**

"జనమేజయా! యయాతి ముసలితనము పొంది తన పట్టణమునకు వచ్చి, జ్యేష్ఠపుత్రుడైన యదువుతో నిట్లనెను:-

"నాయనా! నాశరీరమునందు ముసలితనము, ముడుతలు కలిగి, నావెంట్రు కలు నెరసెను. ఇది శుక్రుని శాపమువలన నాకు కలిగెను. యౌవనసుఖమునందు నాకు తృప్తి దీరకున్నది. కనుక, నీవు నాజరతోపాటు పాపమునుగూడ తీసికొని, నీ యౌవనము నాకిమ్ము! దానిచేత నేను వేయి సంవత్సరములు ఇంద్రియ విషయ సుఖము అనుభవించి నీకు తిరిగి తారుణ్యము ఇచ్చి నీకున్న జరతోపాటు పాప మునుగూడ తిరిగి తీసికొనెదను".

ఆ మాట విని యదువు యయాతితో నిట్లనెను:-

"రాజా! జరయందు అన్న పానీయములవలన కలిగిన యనేక దోషములు సంభవించును. కాబట్టి, నీ ముసలితనమును తీసికొనుటకు నాకిష్టము లేదు, ముసలితనమువలన వెంట్రుకలు తెల్లబడి, సంతోషము తరిగిపోయి సడలిన శరీరము గలవాడనై, అవయవములందంతట ముడుతలుబడి, దుర్బలుడనై. కృశుడనై, అసహ్యదర్శనుడనై, ఏ పని చేయుటకును శక్తి చాలక యువతుల చేత, బంధుపరివారములచేత తిరస్కరింపబడుదును. కాబట్టి, అట్టి ముసలితన మును నేను కోరను. నీకు నాకంటె అధిక ప్రియులైన అనేక పుత్రులు, నీ ముసలితనము తీసికొనుటకు ఉన్నారు. నీవు మరియొక పుత్రుని కోరుము!"

ఆ మాటకు యయాతి, 'పుత్రా! నీవు నాకు ఔరసపుత్రుడవు. నా హృద యము నుండి పుట్టికూడ నీ వయస్సు నాకివ్వకున్నావు కాబట్టి, నీ సంతతి రాజ్య

మును పొందుటకు అర్హులు కారు' అని చెప్పి యయాతి 'తుర్వసు' అను రెండవ కుమారునితోగూడ 'నా పాపమును, జరను తీసికొని నీ యౌవన మి'మ్మని యడుగగా నతడుగూడ యదువువలెనే జర వలన గలుగు కష్టములను తెలిపి, తండ్రి కోరికను నిరాకరించగా, యయాతి తుర్వసుతో నిట్లనెను:-

"నాయనా! నాకు పుట్టిన నీవు నీ యౌవనమును నా కీయ కున్నావు. కాబట్టి, నీకు సంతతి కలుగదు. నీవు సంకరాచారములు గల ధర్మములందు, సంకరజాతులందు మాంసాశనులైన యంత్యజులయందు మూర్ఖుడవై పుట్టి వారికి రాజు వయ్యెదవు. నీవు గురు భార్యాగమనము చేసినవారికి పశుపక్ష్యాది తిర్యగ్యోనులకు, పశుధర్మము గల పాపులకు, మ్లేచ్ఛులకున్ను పుత్రుడవుగా పుట్ట గలవు".

"జనమేజయా! ఇట్లు యయాతి తుర్వసుని శపించి, శర్మిష్ఠా పుత్రుడైన 'ద్రుహ్యు' అనువానితో 'పుత్రా! నాజరను తీసికొని, నీ యౌవన మిమ్ము! వేయి సంవత్సరముల తరువాత మరల నేను నాజరను, పాపమును తీసికొనెదను' అని యనగా, ద్రుహ్యుడు ఆయనతో, తండ్రీ! జరాజీర్ణుడైనవాడు గజరథాశ్వ, స్త్రీలను అనుభవింప జాలడు. స్త్రీలతో మాట్లాడుటకు గూడ వాడు అనర్హుడగును. కనుక, నేను, ముసలితనము కోరను' అని యనగా, యయాతి యతనితో నిట్లనెను."

"ద్రుహ్యుకుమారా! నీవు నాకు జనించి కూడ నా యాజ్ఞను తిరస్కరించి, నీ యౌవనము నా కీయ కున్నావు. కాబట్టి, నీ కోరికలు ఎప్పుడు గూడ సిద్ధింపవు. ఎక్కడ అశ్వములు కట్టబడిన రథములు, గజములు, అశ్వములు, పీఠకములు (పల్లకీలు), గర్దభములు, మేకలు, గోవులు, శిబికలు మొదలైనవి పోవజాలవో, ఎక్కడనైతే ప్రతిదినము ఓడలలో, పడవలలోను తిరుగవలసి యుండునో, అట్టి ప్రదేశములందు నీవు నీ సంతతితోపాటు పోవగలవు అక్కడ నీ వంశమువారు రాజులుగా నుందురు. వారు భోజవంశీయు లని చెప్పబడెదరు".

ఇట్లు చెప్పి యయాతి 'అను' అను కుమారునిగూడ ఆ ప్రశ్నము నే యడుగగా, తండ్రీ! జరాజీర్ణుడు శిశువువలె, అపరిశుద్ధునివలె అకాలమునందు అన్నము తినును. సకాలమునందు అగ్నియందు హోమము చేయడు, కాబట్టి,

ముసలితనమును నేను కోరను' అని యనగా, యయాతి అనుమారునకు 'అనూ! యువకులైన నీకొడుకులు నశించెదరు. నీవుగూడ అగ్నిప్రస్కందన పరుడవై, (అగ్నిపై దుమికి గంతులు వేయువాడు) నశించెదవు."

"జనమేజయా! తరువాత, యయాతి కనిష్ఠ పుత్రుడైన 'పూరు' అను వానితో, 'నాయనా! నీవు చాల గొప్పవాడవు కాగలవు. నాకు శుక్రుని శాపము వలన ముసలితనము వచ్చినది. యౌవనసుఖానుభవమునందు తృప్తిదీరకున్నాను. నా ముసలితనముతోపాటు నా పాపము తీసికొని, నీ యౌవనము నాకు ఇమ్ము! వేయి సంవత్సరములు యౌవనసుఖ మనుభవించి, మరల నీ కిచ్చి నీనుండి నా జరను, పాపమును తీసికొనెదను' అని చెప్పెను."

"జనమేజయా! యిట్లు తండ్రి చెప్పగా, పూరుడు తండ్రితో, 'అట్లే యగుగాక! రాజా! నీ యాజ్ఞ నెరవేర్చెదను. తండ్రి యాజ్ఞ నెరవేర్చుట పుణ్యకరము. ఆయుర్వృద్ధి, స్వర్గప్రాప్తియు గలుగును. గుర్వనుగ్రహమువలన ఇంద్రుడు త్రైలోక్యమును పాలించెను. గుర్వాజ్ఞ నెరవేర్చినవానికి అన్ని ఇష్టార్థసిద్ధులు కలుగును. కనుక, రాజా! నీజరతోపాటు పాపమునుగూడ తీసికొనెదను. నా యౌవనము తీసికొని నీ యిష్టకామము లన్నియు అనుభవింపుము. నేను, నీవు చెప్పినట్లే నీ వృద్ధాప్యమును ధరించి సంచరించగలను!' అని యనెను.

ఇట్లు చెప్పగా, యయాతి పూరువుతో నిట్లనెను:-

"నాయనా! పూరూ! నేను నీ యెడల మిక్కిలి సంప్రీతుడనైతిని. నీకు రాజ్యము నిచ్చెదను. నీ రాజ్యమునందు ప్రజలు సర్వకామ పరిపూర్ణులై యుండెదరు."

జనమేజయా! అట్లు యయాతి చెప్పి, శుక్రాచార్యుని ధ్యానించి, తనముసలితనమును పూరువునందు సంక్రమింప జేసెను.

**యయాతి విషయ సుఖానుభవము - వైరాగ్యము - పూరు రాజ్యాభిషేకము - యయాతి వనప్రస్థానము:-**

"జనమేజయా! యయాతి మహారాజు పూరువు ఇచ్చిన యౌవనముచేత తనకుఇష్ట మైనవిషయసుఖములను యథేచ్ఛగా ఉత్సాహముతో ఆయా కాలములం

దా యా సుఖములను ధర్మమునకు విరోధము లేకుండగ యోగ్యతానుసారము అనుభవించెను. వాస్తవముగా ఆ సుఖానుభవమునకు అతడే యోగ్యుడుగా నుండెను.

అతడు యజ్ఞములచేత దేవతలను, శ్రాద్ధములచేత పితరులను, అనుగ్రహములచేత దీనులను, ఇష్టకామదానములచేత బ్రాహ్మణోత్తములను, అన్న పానముల చేత అతిథులను, పరిపాలనముచేత వైశ్యులను, అక్రౌర్యముచేత శూద్రులను, దండనముచేత దొంగలను, ధర్మముచేత సర్వప్రజలను సంతోషపరచుచు ఇంద్రునివలె రాజ్యము పాలించెను.

"జనమేజయా! యయాతి మహారాజు సింహవిక్రమము కలవాడై, యౌవనముచేత ధర్మావిరోధముగ విషయసుఖములను అనుభవించుచు, సంతృప్తుడై యుండెను. ఇట్లు వేయి సంవత్సరములు గడపి ఆరాజు ఖేదము చెందినవాడై, గడచినకాలము నిమిషములు గంటలతో లెక్కపెట్టెను.

"జనమేజయా! తరువాత యయాతి 'విశ్వాచి' యనునప్సర స్త్రీతో నందన వనమునందు, అలకాపట్టణమునందు మేరువుయొక్క ఉత్తర శృంగమునందును, రమించెను.

"జనమేజయా! యిట్లు తనకాలము పరిపూర్ణమైనదని యయాతి తలచి, పుత్రుడైన పూరువుతో, "నాయనా! నేను యథేచ్ఛగా, ఉత్సాహముతో, కోరినంత కాలమున యౌవనముతో నింద్రియవిషయ సుఖములను సేవించితిని, ఎప్పుడు గూడ కామోపభోగముచేత, కామము, హవిస్సుచేత అగ్నివలె అనాగరక యభివృద్ధి చెందుచుండును. భూమండలమునందలి వ్రీహియవాది ధాన్యములు హిరణ్య-పశు-వనితాదులు ఎవనికిగూడ పూర్తిగ తృప్తినీయ జాలవు. కాబట్టి ఆశను విడువవలెను. ఆశను విడుచుట, దుర్మతులకు కష్టసాధ్యము. మనుష్యుడు జీర్ణించుచున్నను ఆశ జీర్ణించక, ప్రాణాంతకరమైన రోగముగా నగును. కనుక, తృష్ణను జయించినవానికే సుఖము కలుగును. విషయములందు ఆసక్తిచేత నేను వేయి సంవత్సరములు పూర్తిగ సుఖ మనుభవించినప్పటికిన్ని ఈ యింద్రియ విషయములందు ప్రతి దినము నాకు ఆశ కల్గుచునే యున్నది. కనుక, నేను ఈ తృష్ణను విడిచి మనస్సును పరబ్రహ్మమునందు లగ్నము చేసి సుఖదుఃఖాది ద్వంద్వరహితుడనై, అహంకార మమకారములను వీడి మృగములతోపాటు సంచరించెదను. నాయనా!

పూరూ ! నీ యెడల నేను చాల ప్రీతితో నున్నాను. నీ యౌవనముతో పాటు రాజ్యమును గూడ గ్రహింపుము. నీవు నాకు అత్యంత ప్రియపుత్రుడవు." అని యనెను.

"జనమేజయా ! యయాతి మహారాజు పుత్రునినుండి ముసలితనమును తీసికొని, అతనికి యౌవనమిచ్చిన తరువాత అతనికి రాజ్యపట్టాభిషేకము చేయ గోరుచున్నప్పుడు, బ్రాహ్మణాది రాజ్య ప్రజలు యయాతితో 'రాజా ! జ్యేష్ఠపుత్రుడైన యదువు మొదలగు నలుగురను విడిచి కనిష్ఠపుత్రుడైన పూరునకు పట్టాభిషేకము ఎట్లు చేయుచున్నావు ? జ్యేష్ఠభ్రాతల నందరను అతిక్రమించి కనిష్ఠుడు రాజ్యార్హుడెట్లగును ? నీవు ధర్మమును పాలింపుము' అని యనగా యయాతి వారితో నిట్లనెను.–

"పౌరులారా ! జ్యేష్ఠుడైన యదువు నా యాజ్ఞను పాలించ లేదు. తండ్రికి ప్రతికూలుడైన వాడు సజ్జనులకు సమ్మతుడు కాడు. తలిదండ్రుల యాజ్ఞను నిర్వర్తించుచు వారికి హితుడు ఇష్టుడునైనవాడే పుత్రుడనిపించుకొనును. "పుత్" అను దుఃఖకరమైన నరకము నుండి రక్షించుటవలన 'పుత్రు' డనబడును. అతడు ఇహ పరలోకములందు తండ్రికి సహాయకారి కనుక తలిదండ్రులు అతనిని కోరుదురు. పుత్రుడు తనతో సమానుడు దేవ-పితృదేవ - ఋషిపూజనములందు- తండ్రికి-సహాయము చేయుచు గుణవంతుడైన పుత్రుడే జ్యేష్ఠపుత్రుడననబడును. అట్టి కొడుకే ఇహపరలోకములందు తండ్రియొక్క జ్యేష్ఠాంశమును పొందగలరు.

"పురజనులారా ! గుణవంతుడైన పుత్రుడే శ్రేష్ఠుడు. తదితరులు వ్యర్థులు అని పితృధర్మజ్ఞులు చెప్పెదరు. యదు తుర్వసు - ద్రుహ్యు - అనువులు నన్ను తిరస్కరించిరి. పూరువు నా మాట గౌరవించి కనిష్ఠుడైనను నా ముసలితనము తీసికొని నాకు మిత్రుడై, నా కోరిక నెరవేర్చెను. నా యాజ్ఞను నెరవేర్చినవాడే నా రాజ్యమునకు రాజగును." అని శుక్రాచార్యుడు నాకు వరమిచ్చెను.

"మిమ్ము గూడ వేడుచున్నాను. పూరుడు రాజ్యమునందు అభిషేకింపబడుగాక !"

ఆ మాటవిని పౌరులు యయాతితో నిట్లనిరి.

"రాజా ! ఏ పుత్రుడు గుణసంపన్నుడో, తలి - దండ్రులకు సర్వదా హితుడో, అట్టి సత్పుత్రుడు కనిష్ఠుడైనను, సమస్త కల్యాణములు పొందుటకు అర్హుడు. నీకు ప్రియంకరుడైన పూరుడే, ఈ రాజ్యమునకు అర్హుడు. శుక్రునివర దానము గూడ ఈ విషయమునే సమర్థించు చున్నది."

"జనమేజయా! పౌర జానపదులను సంతుష్టులై యిట్లు చెప్పగా యయాతి పూరుని తన రాజ్యమునందు అభిషేకించెను. తరువాత, అతడు వనవాసము చేయుటకు బ్రాహ్మణులతో, ఋషులతోను కలిసి నగరము విడిచిపోయెను."

"జనమేజయా! జ్యేష్ఠపుత్రుడైన యదువునకు యాదవులు, రెండవ వాడైన తుర్వసునకు యవనులు, ద్రుహ్యునకు భోజులు, అనువునకు మ్లేచ్ఛజాతుల వారున్ను పుట్టిరి. పూరువునుండి పౌరవవంశము సంభవించి, నేటిదాక సాగుచువచ్చుచున్నది. జనమేజయా! ఆ పౌరవవంశమునందే, నీవు జనించితివి. ఆ వంశము వారే యింద్రియ నిగ్రహము కలవారై, వేయియేండ్లు ఈ రాజ్యమును పాలించగలరు."

**వనమునందు యయాతి తపస్సు - స్వర్గలాభము :-**

"జనమేజయా! 'యయాతి, తన యిష్టపుత్రుని రాజ్యాభిషిక్తుని జేసి, సంతోషముతో వానప్రస్థాశ్రమమును గడపుచు నియమవ్రతనిష్ఠుడై, ఫలమూలములు భుజించుచు నింద్రియ నిగ్రహము గలవాడై, బ్రాహ్మణులతో వనమునందు నివసించి స్వర్గమునకు పోయెను. స్వర్గమునందు సుఖసంతోషములతో నివసించుచు మరల నింద్రునిచేత చాల కాలమునకు స్వర్గమునుండి త్రోయ బడి క్రింద బడుచు భూమండలము చేరక, అంతరిక్షమునందే నిలిచియుండెనని, అక్కడ యయాతి, 'వసుమంతుడు, అష్టకుడు, ప్రతర్దనుడు, శిబి' అను నలుగురి సమావేశములో ఉండి, అక్కడినుండియే మరల స్వర్గమునకు పోయెనని కూడ వింటిని."

ఆ మాటకు జనమేజయుడు వైశంపాయనుతో నిట్లనెను :-

"మహాత్మా! స్వర్గము నుండి త్రోయబడిన తరువాత, యయాతి ఏ కర్మలు చేసి, మరల స్వర్గమునకు పోయెను. నీ మాటలవలన యయాతి మహారాజు దేవేంద్ర సమానుడని, కురువంశవర్ధనుడని, సూర్యసమాన తేజస్కుడనియు తెలియుచున్నది. అటువంటి మహాకీర్తిసంపన్నుని చరిత్రమును విన దలచుచున్నాను. చెప్పుము."

ఆ మాటకు వైశంపాయను డిట్లు బదులు చెప్పెను :-

"జనమేజయా! భూలోక - స్వర్గలోకములందు పాపనాశకరము, పుణ్యకరము నైన యయాతి చరిత్ర వినుము."

"అట్లు యయాతి పూరునకు పట్టాభిషేకము చేసి, తక్కిన నలుగురు పుత్రులను వారికి తగిన స్థానములందు త్రోసియుంచి వనమునందు క్రోధామాత్స మములు విడి నివసించుచు, చాలకాలము పితృదేవతలను తృప్తిపరచుచు, వానప్రస్థ విధానములో అగ్నులయందు శాస్త్రోక్తముగ హోమము చేయుచు, శిలోంఛ వృత్తిని ఆశ్రయించి, (చేల్లలో కోత కోసిన మళ్ళయందు జారిపడిన పైర్ల ధాన్యాలు మొదలగువానిలోని గింజలు ఏరుకొని బ్రతుకుట శిలవృత్తి యన బడును - ఎక్కడబడిన ధాన్యమైనను ఏరుకొని బ్రతుకుట ఉంఛవృత్తి యన బడును) అతిథులు తినగా మిగిలినదానిని తినుచు వేయి సంవత్సరములు వాన ప్రస్థాశ్రమము గడిపి తరువాత ముప్పది సంవత్సరములు జలభక్షుడై వాక్కున్ను మనస్సునున్ను నిగ్రహించుకొని యుండి తరువాత ఒక సంవత్సరము వాయు భక్షణము చేయుచు సోమరితనము లేక యుండి, తరువాతి సంవత్సరము పంచాగ్ని మధ్యమునందు (నాల్గువైపుల అగ్నులను రగిలించి, తలపైన సూర్యుడు తపించు చుండుట పంచాగ్ని లనబడును) తపస్సు చేసి, పిదప ఆరు నెలలు వాయుభక్షుడై ఒంటికాలిమీద నిలిచి తపస్సు చేసి ఆ పుణ్యముచేత స్వర్గమునకు పోయెను."

**ఇంద్రుడు అడుగగా యయాతి తాను పూరునకు చేసిన ఉపదేశమును వర్ణించుట :-**

"జనమేజయా! యయాతి మహారాజు స్వర్గమునందు దేవ - గంధర్వా దులచేత పూజింపబడుచు, దేవలోకమునందు, బ్రహ్మలోకమునందున్ను సంచ రించుచు చాలకాలము గడపెనని వింటిని.

"జనమేజయా! ఒకానొకప్పుడు యయాతి ఇంద్రునికడకు పోయి, అతని చేత 'రాజా! నీకు ఇష్టుడైన పుత్రుడు నీనుండి ముసలితనము గ్రహించిన తరువాత, నీవు అతనికి రాజ్యము ఇచ్చినప్పుడు నీవు ఏమి ఉపదేశము చేసితివి' అని యడుగబడి ఇంద్రునితో పూరునకు తాను చేసిన యుపదేశమును గూర్చి యిట్లు చెప్పెను:

'నాయనా పూరూ గంగా - యమునా మధ్యమునందున్న సమస్త భూమండల రాజ్యమునకు నీవు అధిపతివి. నీ యన్నలు నలుగురు అంత్యులకు అధిపతులై పోయిరి. నీకు సదుపదేశము చేసెద వినుము. మనుష్యుడు దైన్యము

గూఢముగ అపకారము చేయుట' క్రోధమును, కపటమున్ను ఎప్పుడుగూడ చేయ గూడదు. తలిదండ్రులను, విద్వాంసులను, తపోధనులను, ఓర్పుగలవారిని ఎప్పుడు గూడ బుద్ధిమంతుడు అవమానపరచగూడదు శక్తిగలవాడు క్షమించును. అశక్తుడు కోపించును. దుర్జనుడు సుజనుని, దుర్బలుడు బలవంతుని, కురూపి రూపవంతుని, నిర్ధనుడు ధనవంతుని, పనిచేయనివాడు చేయువానిని, అధార్మికుని. నిర్గుణుడు గుణవంతుని ద్వేషించుట లోకములో కనపడు చున్నవి.

"నాయనా! అక్రోధనుడు క్రుద్ధునకన్నను, ఓర్పు గలవాడు అది లేనివాని కన్నను, మానవత్వము గలవాడు మానవత్వరహితునికన్నను, విద్వాంసుడు అవిద్వాంసునికన్నను శ్రేష్ఠులు. పుత్రా! ఇతరులు తనను నిందించినప్పుడు తాను కోపముతో తిరిగి వారిని నిందింప గూడదు. క్షమావంతునకు కోపమే శత్రువై దహించును. అట్లు నిందించిన వాని సుకృతమును నిందితుడు పొందును. సంతాపకరుడుగా, క్రూరభాషిగాను, నుండగూడదు. శ్రేష్ఠవస్తువైనను నీచుని నుండి తీసికొన గూడదు. ఇతరులకు ఉద్వేగము కలిగించుమాట పలికినవాడు పాపలోకమునకు పోవును. అట్లు సంతాపకరములు, పరుషములు, తీక్ష్ణములునైన కంటకములవంటి వాక్కులచేత మనుష్యులను బాధించువానియొద్ద లక్ష్మి నిలువదు. ఎప్పుడుగూడ జనులనోటిలో చెడ్డవాడుగా మెలగగూడదు.

"పుత్రా! తాను ఆశ్రయించిన సత్పురుషులు తనను ప్రత్యక్షముగ సమ్మానించి పరోక్షముగా రక్షించెదరు. సత్పురుషుడు పలికిన చెడుమాటలను సర్వదా, ఓర్చుకొనుచు సత్ప్రవర్తన గలవాడై యుండవలెను. పండితుడైన వాడు వాగ్బాణములతో మర్మములను ఛేదించునట్లుగా నితరులను కొట్టినచో, నతడు రాత్రింబగళ్ళు దుఃఖించును. కనుక పండితుడు క్రూర వాక్యములు పలుక గూడదు. ఇటువంటి సంవననము (వశీకరణ క్రియ వంటిది) మూడు లోకము లందున్ను మరియొకటి లేదు. కాబట్టి, దయా స్నేహములు ప్రాణులందు చూపుచు, దానము చేయుచు, మధురముగ మాట్లాడుచు నుండవలెను. కనుక, నాయనా! ఎప్పుడు గూడ పరుషముగ మాట్లాడక, శాంతవచనములనే పలుక వలెను. పూజ్యులను పూజించవలెను. దానము చేయవలెనే కాని, ఎప్పుడు కూడ యాచించ గూడదు. వీనిచేతనే ప్రపంచము తనకు వశమగును. ఇట్లు యయాతి

పూరునకు చేసిన యుపదేశమును గూర్చి యింద్రునకు చెప్పగా, నింద్రుడు యయాతితో నిట్లనెను..

**యయాతి స్వర్గపతనము - అష్టకుని ప్రశ్నము :-**

జనమేజయా! ఇంద్ర - యయాతులకు ఇట్లు సంవాదము జరిగెను.

ఇంద్రుడు - 'యయాతి మహారాజా నీవు సర్వకర్మలు ముగించి, ఇట్లు ఇల్లు విడచి వనమునకు పోయితివి. కాబట్టి, నీవు తపస్సులో ఎవనితో సమానుడవు".

యయాతి :- దేవేంద్రా! దేవ-మనుష్య-గంధర్వ - మహర్షులలో నెవరు గూడ తపస్సులో నాకు సమానులు కారు.

ఇంద్రుడు :- రాజా! నీవు ఇతరుల ప్రభావము తెలియక అందరు నీ కంటె తక్కువవారని అవమానపరచితివి. కనుక,యిక నీకు ఈ పుణ్యలోకములు నశించినవి. నీ పుణ్యము క్షీణించినది. కనుక, నీవు స్వర్గమునుండి పతితుడవగు చున్నావు.

యయాతి :- దేవరాజా! దేవర్షి - గంధర్వాదులను, అవమానించుటవలన నాకు ఈ పుణ్యలోకములు నశించిన యెడల దేవలోక విహీనుడనైనపుడు సత్పురుషులమధ్య పడ గోరుచున్నాను

ఇంద్రుడు:- రాజా! స్వర్గమునుండి జారి, నీవు సత్పురుషులకడ పడి, మరల ప్రతిష్ఠను పొంద గలవు. ఇప్పుడు నీకు గలిగిన యీ నష్టమును జ్ఞప్తి యుంచుకొని, యికపైన నెప్పుడుకూడ యితరులను అవమానపరచకుము.

"జనమేజయా! తరువాత, యయాతి పుణ్యలోకములను విడచి, క్రింద బడుచుండుగా, ధర్మపరుడైన "అష్టకుడు" యయాతితో నిట్లనెను" :-

"మహాభాగా! ఇంద్ర సమానరూపుడవై, అగ్నివలె తేజస్సుతో దీపించుచు, యువకుడవైన నీవు ఎవడవు? మేఘాంధకారము గల యాకాశము నుండి సూర్యునివలె పడుచున్నావు. అగ్ని-సూర్య సమాన తేజస్సుతో, నాకాశమునుండి పడుచున్న నిన్ను చూచి, "ఇది యేమి పడుచున్నది?" అని మేమందరము మోహితుల మైతిమి. దేవమార్గమువందు నిలిచి, ఇంద్ర - సూర్య - విష్ణు సమాన

ప్రభావము గల నిన్ను చూచి, మేమందరము నీకు స్వాగతము చెప్పుచు, నీవు పడుటకు కారణము తెలియ గోరుచున్నాము".

"మే మెవరమో నీ వడుగకుము. నీవు యెవడవు? ఇక్కడకు ఎందుకు వచ్చితివి? భయము, దుఃఖము, మోహమున్ను విడువుము. నీవు సత్పురుషులకడ నున్నావు. నిన్ను బలాత్కరించుటకు ఇంద్రుడుగూడ ఇక్కడ సమర్థుడు కాడు. సుఖముగ పడిన సజ్జనులకు సత్పురుషులే, ఆశ్రయ మిచ్చెదరు. స్థావరజంగమాత్మకులైన మంచి ప్రాణులలో చేరి యున్నావు. అగ్ని తపించుటకు, భూమి ఆవపనమునకు (బీజావాపము సేయుటకు) సూర్యుడు ప్రకాశమునకు, అతిథి సత్పురుషులకున్ను ప్రభువగును."

"జనమేజయా! ఇట్లు అష్టకుడు చెప్పిన తరువాత యయాతి అష్టకునితో నిట్లనెను:

### యయాత్యష్టక సంవాదము :

యయాతి :- "మహాత్మా! నేను నహుషపుత్రుడను. నాపేరు యయాతి. నేను సమస్త ప్రాణులను అవమానించుటచేత నాపుణ్యము క్షీణించుటవలన దేవ-సిద్ధ-మహర్షుల లోకము నుండి భ్రష్టుడనై క్రింద పడుచున్నాను. నేను మీకంటె వయస్సులో పెద్దవాడను. కనుక మీకు ప్రణామము చేయను. ద్విజాతులలో విద్యా-తపస్-వయస్సులలో పెద్దవాడు పూజనీయు డగును"

అష్టకుడు :- "రాజా! వయస్సులో పెద్దయైన వాడే మాననీయు డని నీవు చెప్పితివి. కాని, ద్విజులలో విద్యాతపస్సులలో గొప్పవాడే పూజ్యుడగును కదా."

యయాతి:- "మహాత్మా పాపము, పుణ్యకర్మలను నశింప జేసి, నరక ప్రాప్తి కలిగించును. ఆ పాపము క్రూరులయందే యుండునని చెప్పబడెను. దురాచారుల యొక్క దుష్ప్రవర్తనను శ్రేష్ఠపురుషులు అనుసరించరు. ప్రాచీన సత్పురుషుల యాచరణము గూడ అట్టి శ్రేష్ఠపురుషులకు అనుకూలముగానే యుండును.

"అష్టకా! నాకు చాల పుణ్యధనము ఉండెను. ఆ పుణ్యమంతయు నితరులను నిందించుటచేత నశించి పోయెను. ఇప్పుడు నేను ప్రయత్నము చేసినను

ఆ పుణ్యమును సంపాదింప జాలును. అట్టి దురవస్థను తెలిసికొని, "ఆత్మ శ్రేయస్సు కొరకు అసక్తుడై యుండు నజ్ఞానియే ధీరు డనబడు"నని తలంచు చున్నాను.

"మహాత్మా! మహా ధనసంపన్నుడై, ఉత్తమ యజ్ఞముల ద్వారా, భగవంతుని ఆరాధించి, సమస్త విద్యలను అభ్యసించి వినయముగల బుద్ధితోనుండి, వేదములను చదివి, శరీరమును తపస్సులో లగ్నము చేసిన మనుష్యుడే మోహ రహితుడై, స్వర్గమునకు పోవును.

"అష్టకా! మహా ధనమును పొందినను హర్షోత్సాహములు లేక యుండి, ఆణకువతో వేదాధ్యయనము చేయవలెను. కాని, ఆ విద్యాధనములచేత అహంకారి కాగూడదు. ప్రపంచమునందు వేరువేరు స్వభావములు గల ప్రాణులు అనేకులు కలరు. వారందరు పూర్వజన్మ కృతకర్మలకు అధీనులుగా నుండెదరు. కనుక, ఆ ప్రాణులు ధనాది వస్తువులకొరకు చేయు ప్రయత్నములు వారి అధికారములు అన్నియు వ్యర్థములగును. కనుక ధీరుడు తన బుద్ధిచేత 'పురాకృతకర్మయే ప్రబలమైనది' అని తలచి సుఖదుఃఖములు కలిగినప్పుడు వికారము చెందకుండ నుండవలెను.

"మహాత్మా! సుఖదుఃఖములు జీవునకు ప్రారబ్ధ కర్మముల చేతనే కలుగును. కాని, అతని శక్తివలన కలుగవు. కాబట్టి, అన్నిటికన్న ప్రారబ్ధ కర్మమే అధిక బలశాలి, యని తలచి, మనుష్యుడు సుఖదుఃఖములందు ఎప్పుడు గూడ హర్షశోకములు పొందగూడదు. దుఃఖములందు తపించక, సుఖములందు హర్షించక ధీరపురుషుడు సర్వదా సమభావముతోనే యుండి తన యదృష్టమే ప్రబలమని తలచి ఏ విధమైన చింతకుగాని, సంతోషమునకు గాని వశుడు కాగూడదు.

"అష్టకా! నేను ఎప్పుడు గూడ భయపడి మోహము చెందను. నా మనస్సులో ఏ విధమైన సంతాపము గూడ కలుగదు. ఎందుకనగా, 'బ్రహ్మదేవుడు, ప్రపంచమునందు నన్ను ఎట్లు నడపించునో, అట్లే యుండెదను', అని తలచుచుండును.

"మహాత్మా! స్వేదజ (చమటనుండి పుట్టు - పేలు మొదలైనవి) - అండజ (గ్రుడ్లనుండి పుట్టు పక్షులు మొదలైనవి) - ఉద్భిజ్జ (భూమిని భేదించి పుట్టుకొని వచ్చు వృక్షలతాదులు) - సర్ప - క్రిమి (పురుగులు) - మత్స్యాది జల జంతు - పర్వత - తృణ - కాష్ఠాదులన్నియు పురాకృతకర్మలను అనుభ వించి అవి నశించిన తరువాత తమ తమ ప్రకృతులలో (మూల పదార్థములు) చేరిపోవును.

"అష్టకా! నేను సుఖదుఃఖములు అనిత్యములని తలచినను, నాకు సంతాపము కలుగుచున్నది. కనుకనే నేను చేయుదును. ఏ కార్యము చేసి, సంతాపము చెందిక యుందును?' ఈ మొదలైన చింతలు విడిచితిని, కనుక, మిక్కిలి జాగ్రత్తతో నేను శోక - సంతాపములను నాకు దూరముగ నుంచెదను. దుఃఖమునందు ఖేదపడక, సుఖమునందు గర్వించక అందరితోను సమాన భావ ముతో వ్యవహరించువాడే ధీరుడనబడును. విజ్ఞుడైనవాడు, తన వివేకబుద్ధితో పురాకృత కర్మము మిక్కిలి ప్రబలమని తలచి, ఇక్కడ ఏ విషయమునందు గూడ అధికముగ ఆసక్తుడు కాక యుండును".

"జనమేజయా! యయాతి మహారాజు సమస్త సద్గుణసంపన్నుడు. అతడు అష్టకునకు మాతామహుడు. అతడు అంతరిక్షమునందు, స్వర్గమునందువలె, అట్లే నిలిచి యుండెను. అతడు ఇట్లు చెప్పగా అష్టకుడు మరల యయాతితో నిట్లనెను".

"మహారాజా నీవు ఏయే ముఖ్య లోకములందు ఎంత యెంత కాలముండి అక్కడి సుఖములను పరిపూర్ణముగ అనుభవించితివో, ఆ లోకములన్నింటిని గూర్చి నాకు తెల్పుము. రాజా! నీవు మహాత్ములవలె ధర్మములను ఉపదేశించు చున్నావు' అని ప్రశ్నింపగా, యయాతి అష్టకునితో నిట్లనెను:-

అష్టకా! నేను సమస్త భూమండలమునకు సుప్రసిద్ధ చక్రవర్తిగా నుంటిని. తరువాత సత్కర్మలద్వారా గొప్ప గొప్ప లోకములకు పోయి అక్కడ వేలకొలది సంవత్సరములు నివసించి, తరువాత వానికన్న ఉన్నతమైన లోకమునకు పోయితిని.

"అష్టకా! అక్కడ నూరు యోజనముల విస్తారము కలిగి, వేయిద్వార ములతో గూడిన యింద్రుని రమణీయ నగరము చేరితిని. అక్కడ నేను ఒక వేయి సంవత్సరములు మాత్రము నివసించిన తరువాత, వానికన్న ఉన్నతమైన లోకమునకు పోయితిని.

"అష్టకా! తరువాత లోకపాలురకు గూడ దుర్లభమైన ప్రజాపతి లోక మున్ను చేరితిని. అక్కడ ముసలితనము ఉండనే యుండదు. అట్టిచోట నొక వేయి సంవత్సరములు నేను ఉండి అంతకన్న నుత్తమమైన లోకమునకు పోయితిని. ఆ లోకము దేవాది దేవుడైన బ్రహ్మదేవునకు నివాసమైనది. అక్కడ నేను నా యిష్టము వచ్చిన వేరు వేరు లోకములందు విహరించుచు సమస్త దేవతలచేత సమ్మానింపబడు చుంటిని. అప్పుడు, నా ప్రభావము. తేజస్సున్ను, దేవేశ్వరుం వంటివిగా నుండెను.

"అష్టకా! ఈ విధముగనే నేను నందనవనమునందు నా యిచ్ఛానుసారము లైన రూపములు ధరించి, అప్సరఃస్త్రీలతో విహరించుచు, పది లక్షల సంవత్సర ములు గడపితిని. ఆ వనమునందు నేను పవిత్ర - సుగంధ - మనోహర రూప ములు గల పుష్పభరిత వృక్షములను చూచితిని. నేను దేవలోక సుఖములందు ఆసక్తి గలవాడ నైతిని. నేను అక్కడ అత్యధిక సమయము గడిపిన మీదట భయంకర రూపము గల యొక దేవదూతవచ్చి నాతో, 'పడిపొమ్ము, పడిపొమ్ము పడిపొమ్ము' అని మూడుసార్లు బిగ్గరగా అరచి చెప్పెను.

"అష్టకా! ఆ దేవదూత చెప్పిన యామాట మాత్రమే నా జ్ఞప్తియందున్నది. తరువాత నా పుణ్యము క్షీణించినందున నేను, నందనవనము నుండి క్రింద పడితిని. అప్పుడు నా కొరకు దుఃఖించుచున్న దేవతల యొక్క దయాభరిత మైన వాక్కు అంతరిక్షమునందు, "ఆహో! పవిత్ర కీర్తిశాలి పుణ్యకర్మకరుడు నైన యయాతి మహారాజు యొక్క పుణ్యము క్షీణించుటచేత నతడు క్రింద పడుచున్నాడు" అనుమాట వినపడెను. ఆ మాట విని క్రింద పడుచున్న నేను, "దేవతలారా! నేను సత్పురుషుల నడుమ పడుటకు ఏ యుపాయము కలదు?" అని యడుగగా, ఆ దేవతలు నాకు మీ యొక్క యజ్ఞ భూమిని గూర్చి తెలుపగా నేను దీనినే చూచుచు త్వరగా ఇక్కడకు వచ్చి చేరితిని. ఇది యజ్ఞ భూమియే యని ఇక్కడి హవిర్హోమముల సుగంధము ననుభవించి, ధూమ ప్రాంతమును

చూచి నాకు మిక్కిలి సంతోషము. నా మనస్సునకు ఊరటయు కలిగెను." జనమేజయా యయాతి యిట్లు చెప్పగా, అష్టకుడు యయాతితో నిట్లనెను:

**యయాతి - అష్టకుల సంవాదము :**

అష్టకుడు :- కృతయుగ రాజులలో ప్రధానుడవైన యయాతి మహా రాజా! నీవు ఇచ్ఛ వచ్చిన రూపములు ధరించి పదిలక్షల సంవత్సరముల వరకు నందనవనమునందు విహరించినప్పుడు దానిని విడచి మరల భూలోకమునకు వచ్చుటకు కారణమేమి?

యయాతి :- అష్టకా! ఈ లోకమునందు ధనము నశించిన వానిని బంధువులు, మిత్రులు, తనవారు అందరుగూడ ఎట్లు విడిచెదరో, ఆ విధముగనే పర లోకమునందు ఎవని పుణ్యము సమాప్తి చెందునో, అట్టి మనుష్యుని ఇంద్రాది దేవతలందరు వెంటనే విడిచెదరు.

అష్టకుడు:- "రాజా! దేవలోకమునందు మనుష్యుని పుణ్యములు ఎట్లు క్షీణించును. విశిష్టపురుషులు పోవునట్టి పునరావృత్తి రహితమైన ప్రజాపతి స్థానము ఏది? ఎందుకనగా నాకు నీవు 'క్షేత్రజ్ఞుడవు (ఆత్మజ్ఞాన సంపన్నుడవు') అని తోచు చున్నావు."

యాయతి:- "అష్టకా! స్వయముగ తాము తమ పుణ్యకర్మలను (ప్రశం సించుకొనువా రందరుగూడ ఈ భౌమ (భూలోక సంబంధమైన) నరకమునందు వచ్చి పడెదరు. అట్టివా రందరు 'కంక (రాబందులు) - గోమాయు (నక్కలు) బల* (కాకులు) - ములు' ఈ మొదలైనవి తినుటకు యోగ్యమైన మీ శరీరము కొరకు అత్యంత ప్రయత్నము చేసి, ఇది క్షీణమై పుత్ర - పౌత్రాది రూపము లలో ననేక విధములుగ విస్తరించును. కనుక, ఈ లోకమునందు దుష్టములు, నింద్యములు నైన కర్మలను పూర్తిగా విడువవలెను. అష్టకా! నీకు అంతయు చెప్పితని. ఇక ఏమి చెప్పుదునో అడుగుము.

అష్టకుడు:- మనుష్యులు మరణించిన తరువాత పక్షులు, గ్రద్దలు, నెమళ్ళు, మిడుతలు, మొదలైనవి పొడిచి - పొడిచి తినునుగదా! అప్పుడు ఆ మనుష్యులు ఏరూపములో ఉత్పన్నులగుదురు? నేను భౌమము అనుపేరు గల యేనరకము గూర్చి గూడ ఇంతదాక వినలేదు.

బల శబ్దమునకు ఇక్కడ ''కాకి'' యని అర్థము, ''స్థౌల్య - సామర్థ్య - సైన్యేషు బలం నా కాక సీరిణోః'' అని అమరకోశము, సమర్థించుచున్నది.

యయాతి:- అష్టకా కర్మానుసారముగా పుట్టి పెరుగునట్టి శరీరములను పొంది, తల్లిగర్భమునుండి బయలు వెడలిన తరువాత జీవులు అందరి సమక్షములో ఈ భూ మండలముపై (విషయములందు) సంచరింతురు. ఇక్కడ ఆ జీవులు సంచరించుటయే, 'భౌమ నరకము' అన బడును. దీనిలోనే వారు పడెదరు. ఈ నరకమునందు పడిన తరువాత వారు వ్యర్థముగా గడచు చున్నట్టి యనేక సంవత్సరములవైపు దృష్టి సారించరు. ఎందరో ప్రాణులు ఆకాశ (స్వర్గాదులు) ము నందు అరువది వేల సంవత్సరములు ఉండెదరు. కొందరు ఎనుబది వేల సంవత్సరముల వరకు కూడ అక్కడ నివసించెదరు. తరువాత వారు భూమిపై పడెదరు. ఇక్కడ పడునటువంటి ఆ జీవులకు తీక్ష్ణములైన కోరలు గల పృథివి యందు భయంకర రాక్షసులు (దుష్ట ప్రాణులు) మిక్కిలి బాధ గలిగింతురు.

అష్టకుడు :- "రాజా! తీక్ష్ణదంష్ట్రిలు గల ఆ రాక్షసులు, ఆకాశము నుండి పడుచున్న యే యే జీవులను బాధించెదరు? ఆ జీవులు భూమిపై పడి ఎట్లు జీవించి యుండెదరు? వారు ఏ విధముగ నింద్రియాదులతో కూడి యుందురు? వారు గర్భమునందు ఎట్లు వచ్చెదరు?

యయాతి :- అష్టకా అంతరిక్షమునుండి పడిన ప్రాణులు అస్రము* (జలము) గ మారిపోయి, అది క్రమముగ నూతన శరీరమునకు బీజభూత మైన వీర్యముగా నగును, ఆ వీర్యము పుష్ప - ఫలరూపము లైన మిగిలిన కర్మములతో చేరి, దానికి తగిన యోనితో పడును. గర్భాదానము చేయు పురుషుల ద్వారా స్త్రీ సంపర్కము కలిగినప్పుడు ఆ వీర్యము నందు చేరి యున్న జీవుడు ఆ స్త్రీ యొక్క రజస్సుతో కలిసిపోయి గర్భరూప ములో మారిపోవును. జీవుడు జలరూపములో పడి, వృక్షములలో ఔషధులలోను ప్రవేశించును. జల - వాయు - భూమి - అంతరిక్షాదులలో ప్రవేశించుచు జీవులు తమతమ కర్మానుసారముగా జన్మించెదరు. ఇట్లు భూమిలో పడిన తరువాత, జీవులు పూర్వోక్తక్రమము ననుసరించియే, గర్భభావమును పొందెదరు.

* 'అస్ర' శబ్దమునకు నిఘంటువులో 'కన్నీరు' అనునర్థము గూడ నున్నట్లు చెప్పబడినది. కాని, వ్యాసుడిక్కడ 'జలము' అనునర్థమునందు 'అస్ర' శబ్దము వాడెను.

అష్టకుడు :- "రాజా! మనుష్య యోనిలో పడు జీవులు తమ యీ శరీరముతోనే గర్భములో ప్రవేశించెదరో? లేక, ఇతర శరీరములను ధరించి, ప్రవేశించెదరా? ఈ రహస్యమును నాకు తెలిపి, నా సంశయమును తీర్పుము. గర్భములోపడిన తరువాత, జీవుడు వేరు వేరు శరీరములను నేత్రశ్రోత్రాదులైన యింద్రియములను చైతన్యమును గూడ ఎట్లు పొందగలడు? నీవు క్షేత్రజ్ఞుడవుగ (ఆత్మజ్ఞాన సంపన్నుడవుగ) మే మందరము తలచుచున్నాము. కాబట్టి, నే నడిగిన యీ విషయము లన్నియు తెలుపుము.

యయాతి :- "అష్టకా! ఋతుకాలమునందు పుష్పరసముతో గూడిన వీర్యమును వాయువు గర్భాశయమునందు లాగి తెచ్చును. సూక్ష్మమైన ఆ వీర్యము గర్భాశయమునందు ఆక్రమించుకొని, క్రమముగా గర్భమును వృద్ధి పరచుచుండును. గర్భము పెరిగి, సమస్తావయవ పరిపూర్ణమైనప్పుడు చైతన్యము పొంది, యోనినుండి బయటకు వెడలి, మనుష్యుడనిపించుకొనును. అప్పుడు అతడు చెవులతో శబ్దము వినును. కన్నులతో రూపము, నాసికతో వాసనయు చూచును. నాలుకతో రుచిని ఆస్వాదించును. చర్మముతో స్పర్శమును, మనస్సు చేత లోపలి భావములను అనుభవించును. ఈ విధముగ ప్రాణుల శరీరమునందు మహాత్ముడైన జీవుని స్థాపన జరుగును.

అష్టకుడు :- రాజా! మరణించిన మనుష్యుడు దహింపబడియో, లేక, పూడ్చబడియో, లేక, జలప్రవాహమునందు విడువబడియో, నశించిన తరువాత, అతని స్థూల శరీరము లేకుండపోవునుగదా! అప్పుడు ఆ శరీరములో చేతన రూపములో నుండిన జీవాత్మ ఏ శరీరమును ఆధారము చేసికొని చైతన్య యుక్తుడై, వ్యవహరించును?

యయాతి :- అష్టకా! మనుష్యుడు ఊపిరి పీల్చుచు, ప్రాణముగల స్థూల శరీరమును విడిచి, స్వప్నమునందు సంచరించు చున్నట్లే, చేతనుడైన యీ జీవాత్ముడు గూడ, అస్పష్టమైన శబ్దోచ్చారణముతో పాటు మరణించిన యీ స్థూల శరీరమును విడిచి, సూక్ష్మ శరీరము పొందును. అథవా, పాపమును ముందిడుకొని వాయువువలె వేగముగ సంచరించుచు నితర యోనిలో ప్రవేశించును. పుణ్యాత్ములు పుణ్యయోనిలో, పాపాత్ములు పాపయోనిలోను ప్రవేశించెదరు. ఇట్లు పాపాత్మ జీవులు కటక - పతంగాదులుగ పుట్టెదరు. ఈ విషయములన్నియు

పవిస్తరముగ చెప్పుటకు ఇచ్ఛకము గాకున్నది. ఈ విధముగనే జీవులు గర్భములో పడి, చతుష్పాదులు, షట్పాదులు, ద్విపాదులునైన ప్రాణుల రూపములలో పుట్టెదరు. ఇవి యన్నియు నేను సమగ్రముగ నీకు తెలిపితిని. ఇకనేమి కోరెదవో అడుగుము.

అష్టకుడు :- "రాజా! మనుష్యులు ఏకర్మ చేసి ఉత్తమలోకమును పొంద గలరు? ఆ లోకము వారికి తపస్సుచేత కలుగునా? లేక, విద్యచేత కలుగునా? ఉత్తమ లోకములను పొందించగల కర్మల నన్నింటినిగూడ యథార్థముగ తెల్పుము.

యయాతి:- "అష్టకా స్వర్గలోకమునకు ఏడు ద్వారములు కలవని, వాని ద్వారా ప్రాణులు స్వర్గమునందు ప్రవేశించెదరనియు పెద్దలు చెప్పెదరు. ఆ యేడు ద్వారములు - 'తపస్సు, దానము, శమము (మనోనిగ్రహము) దమము (బహిరింద్రియ నిగ్రహము), లజ్జ, సరళత్వము, సమస్త ప్రాణులయందు దయ' యని చెప్పబడినవి. ఆ యేడు ద్వారములు పురుషునకు అభిమాన రూపమైన తమోగుణముచేత అచ్ఛాదింపబడి, సర్వదా నశించి యుండునని సత్పురుషులు చెప్పెదరు. వేదాధ్యయనము చేసి, అందరికన్న గొప్ప పండితుడనని తలచి, తన విద్యచేత ఇతరుల యశస్సును నశింపజేసినవారికి, పుణ్యలోకములు నశించిపోయి, వారు చదివిన వేదములుగూడ వారికి ఫలమును ఈయజాలవు.

'అగ్ని హోత్రము (ఇది యొక హోమము), మౌనము, వేదాధ్యయనము, యజ్ఞము'- ఈ నాలుగు కర్మలు మనుష్యుని భయ విముక్తుని జేయును. కాని, అవియే సక్రమముగా, శ్రద్ధగాను చేయక, అభిమానపూర్వకముగ అనుష్ఠించిన యెడల నిర్భయమునకు బదులు భయము కలిగించును. విద్వాంసులు సమ్మానింప బడినప్పుడు మిక్కిలి ఆనందింపక, అవమానింపబడినప్పుడు సంతాపము చెందకయు నుండవలెను. ప్రపంచమునందు సత్పురుషులే సత్పురుషులను ఆదరించెదరు. 'వీరు సత్పురుషులు అను బుద్ధి దుష్ట పురుషులకు కలుగనే కలుగదు.

'నేను దానము చేయగలను! యజ్ఞము చేయగలను; వేదాధ్యయనము చేయగలను; ఇది నా వ్రతము' అని అహంకార పూర్వక వచనములే భయరూపము లని చెప్పబడెను. కాబట్టి, యిట్టి మాటలు పూర్తిగా విడువవలెను.

సర్వ ప్రపంచమునకు ఆశ్రయభూతుడు, పురాణపురుషుడు, మనస్సునకు అగోచరుడు నగు పరబ్రహ్మ - పరమాత్మ మీకందరకు శ్రేయస్సు కలిగించు గాక! అట్టి పరమాత్మను తెలిసికొనిన విద్వాంసులు ఆ పరబ్రహ్మలో ఐక్యము చెంది, ఇహలోక పరలోకములందు పరమశాంతిని పొంద గలరు."

**యయాతికి అష్టకునకు ఆశ్రమధర్మసంవాదము :**

అష్టకుడు :- మహారాజా! వేద విద్వాంసులు ఈ ధర్మములో నున్న యనేక కర్మలు ఉత్తమ లోక ప్రాప్తికి ద్వారములని చెప్పెదరు. కాబట్టి గురు సేవ చేయు బ్రహ్మచారి గృహస్థుడు, వానప్రస్థుడు, సన్యాసి' - ఈ నాలుగు ఆశ్రమముల వారు ఏ విధముగ ధర్మాచరణము చేసెదరు?

యయాతి :- 'అష్టకా! గురువు పిలిచినప్పుడు శిష్యుడు అయనకడకు పోయి, చదువుట ఉచితము. గురువు చెప్పకుండనే ఆయన సేవలు చేయుచు, రాత్రి గురువు నిద్రించిన తరువాత తాను నిద్రించి, ప్రాతఃకాలమునందు గురువుకంటె పూర్వమే మేల్కొనవలెను. శిష్యుడు గురువుకడ వినమ్రుడు, జితేంద్రియుడు, ధైర్యవంతుడు, శ్రద్ధాళువు, అధ్యయనశీలుడునై యుండవలెను. ఈ నియమములు పాటించు బ్రహ్మచారి సిద్ధిని పొంద గలడు.

గృహస్థుడు న్యాయముగా లభించిన ధనముతో యజ్ఞములు, దానములు అతిథి భోజనములున్ను చేయించవలెను. ఇతరుల వస్తువులు వారు తన కివ్వక తాను తీసికొన గూడదు. ఇది గృహస్థ ధర్మము యొక్క ప్రాచీన రహస్య స్వరూపము.

వానప్రస్థుడైన ముని, వనమునందు నివసించవలెను. ఆహార-విహారములు, నియమితములుగా నుంచుకొనవలెను. స్వయంశక్తితో, పరిశ్రమతోను జీవనము నిర్వహించుకొనుచు, పాపదూరుడై, యుండవలెను. ఇతరులకు దానములు చేయుచు, ఎవరికిన్ని కష్టము కలిగించక యుండవలెను. ఇటువంటి వానప్రస్థముని పరమమోక్షమును పొందగలడు.

సన్న్యాసి, శిల్పకళలచేత జీవన నిర్వాహము చేసికొన గూడదు. అతడు శమ-దమాదులైన యుత్తమ గుణములు గలిగియుండ వలెను. ఇంద్రియములను సర్వదా, తనవశములో నుంచుకొనవలెను. ఎవరితోను సంబంధము లేక, వేరుగా నుండవలెను. గృహస్థుని యింట సన్న్యాసి నిద్రించ గూడదు. దానము పరిగ్రహించక, తాను ఏభారమున్ను లేకుండ మెల్లమెల్లగా సంచరించు చుండవలెను. ఏకాకిగానే యనేకస్థలములలో భ్రమణము చేయుచుండవలెను. ఇటువంటి ప్రవర్తన గల సన్న్యాసియే వాస్తవముగ భిక్షుకుడు అనిపించుకొనుటకు యోగ్యుడు.

ఏ సమయమునందు, రూప - రస - గంధాది విషయము తుచ్ఛములని తోచునో, తాను స్వేచ్ఛగా వానిని జయించి పరిత్యజించుటలోనే, సుఖమున్నదని తెలిసికొనునో, ఆ సమయమునందే విజ్ఞానవంతుడైన విద్వాంసుడు తనయొద్ద నున్న సమస్త వస్తువులను త్యజించి వనవాసి యగుటకు ప్రయత్నించవలెను.

ఏ వానప్రస్థముని, వనమునందే తన పంచభూతాత్మక శరీరమును విడుచునో, అతడు తనకు పూర్వము పది తరములవారు తన తరువాత పది తరములవారునైన తన వంశీయులు, తాను, వెరసి యిరువదియొక్క తరముల వారికి పుణ్యలోకములు కలిగించును.

అష్టకుడు:- 'రాజా! మునులు ఎందరు ? మౌనము ఎన్ని విధములుగ నుండును ?

యయాతి:- 'అష్టకా! అరణ్యమునందు నివసించునప్పుడు గ్రామము ఎవనికి వెనుక పడిపోవునో, గ్రామమునం దుండునప్పుడు ఎవనికి అరణ్యము వెనుకబడిపోవునో అతడు ముని యనబడును.

అష్టకుడు:- 'రాజా! అరణ్యవాసికి గ్రామము, గ్రామవాసికి అరణ్యము ఎట్లు వెనుకబడిపోవును ?

యయాతి:- 'అష్టకా! వనములో నివసించుచు గ్రామములందు లభించు వస్తువులను ఉపయోగించని వానప్రస్థునకు గ్రామము వెనుకబడిపోవును.

ఎవడు అగ్నిని, గృహమును పరిత్యజించి గోత్రముతో, వేదశాఖతోను సంబంధము లేకుండ మౌనముగ నుండుచు కౌపీనమాత్ర వస్త్రమును కట్టు

కొనుటకు, కప్పుకొనుటకుమాత్రము అవసరమైన భోజనము కోరుచు గ్రామము నందే నివసించునో, అట్టి సన్యాసికి అరణ్యము వెనుకబడిపోవును.

ఏ ముని, అన్ని కోరికలను, కర్మలను విడిచి, ఇంద్రియనిగ్రహముతో సర్వదా మౌనముగా నుండునో, అట్టి సన్యాసి పరమసిద్ధిని పొందగలడు.

పరిశుద్ధమైన దంతములు గలిగి, కేశములు, నఖములు ఖండితములై, సర్వదాస్నానము చేయుచు యమనియమాదులు అవలంబించి శీతోష్ణాది ద్వంద్వములను సహించుటచేత శరీరము నల్లబడి ఉత్తమాచరణము కలిగియున్న సన్యాసి, లోకములో నెవరికి పూజనీయుడు కాడు?

తపస్సుచేత శరీరమునందలి అస్థి-మాంస- రక్తములు క్షీణములై, ఎవని శరీరము కృశమై, దుర్బలమగునో అట్టి వానప్రస్థముని ఇహపరలోకములను జయింపగలడు.

వానప్రస్థముని, సుఖ-దుఃఖ-రాగ-ద్వేషాదిద్వంద్వాతీతుడై, మౌనము నవలంబించినప్పుడు ఇహ-పరలోకములను జయించగలడు. సన్యాసి, ముని గో-వృషభములవలె నోటితోనే ఆహారము భుజించుచు, హస్తాదుల సహాయము తీసికొనక యుండునప్పుడు ఈసమస్తలోకములను జయించి మోక్షము పొందుటకు సమర్థుడగును.

బ్రాహ్మణునికే ప్రతిగ్రహాధికారము గల దని యయాతి చెప్పుట :-

అష్టకుడు :- "రాజా! సూర్యచంద్రులవలె తమ తమ లక్ష్యముల వైపు పరుగెత్తు చున్న వానప్రస్థసన్యాసు లిరువురిలో మొదట నెవడు ఆత్మభావము (బ్రహ్మభావము) పొందగలడు?"

యయాతి :- 'అష్టకా! గ్రామమునందు కామప్రవృత్తి గల గృహస్థుల మధ్యము నందే నివసించుచున్నను, జితేంద్రియుడు, గృహరహితుడునైన వాడు సన్యాసి యగును. అట్టి సన్యాసియే వానప్రస్థులలో మొదట బ్రహ్మభావమును పొందగలడు.

ఏ వానప్రస్థుడు దీర్ఘాయువై యుండి కూడ అనేక ప్రాపంచిక విషయములు లభించినపుడు వానిచేత వికారము పొంది వానియందే సంచరించుచు,

విషయోపభోగానంతరము పశ్చాత్తాపము పొందువాడు మోక్షము కొరకు మరల తపస్సు చేయవలెను.

ఏ వానప్రస్థుడు పాపకర్మలు చేయుటకు భయపడుచు స్వధర్మమును ఆచరించునో, అట్టివాడు అత్యంత సుఖస్వరూపమైన మోక్షమును అనాయాసముగానే పొందగలడు. పాపబుద్ధిగల వాడై, అధర్మమును ఆచరించువాడు చేయు కర్మలు క్రూరములు, పాపమయములు, అసత్యములు నని చెప్పబడెను. అట్లు జితేంద్రియుడు కానట్టి వాని ధనము గూడ పాపమయము, అసత్యము నని తెలిసికొనుము. కాని, వానప్రస్థముని చేయు ధర్మానుసరణయే సరళము. అదియే సమాధి. అదియే శ్రేష్ఠాచరణ మనబడును.

అష్టకుడు :- 'మహారాజా! ఇక్కడికి నిన్ను ఎవరు పిలిచిరి? ఎవరు పంపిరి? నీవు యౌవనములో నున్నావు. పుష్పమాలలచేత శోభితుడవై, అందముగా, తేజస్సుచేత భాసించు చున్నావు. నీవు ఎక్కడనుండి వచ్చితివి? ఏ దిక్కునకు పంపబడితివి? నీకు ఈ భూమండలమునందు ఏదైన ఉత్తమ స్థానము కలదా?

యయాతి :- 'అష్టకా!' నేను నా పుణ్యము నశించుటచేత భౌమ నరకములో ప్రవేశించుటకు ఆకాశమునుండి క్రింద పడుచున్నాను. బ్రహ్మదేవుని యొక్క లోకపాలకులు నేను పడుటకు త్వరపెట్టు చున్నారు. కనుక, మిమ్ము వీడ్కొని భూమిపై పడెదను.

'అష్టకా!' నేను భూతలముపై పడబోవు చున్నప్పుడు సత్పురుషుల సమీపమునందు పడునట్లు చేయు మని ఇంద్రునితో వరము కోరి యుంటిని. నీ వంటి సత్పురుషుల సాంగత్యము వరప్రభావముచేత నాకు కలిగెను.

అష్టకుడు :- 'మహారాజా! నీవు పరలోక ధర్మ జ్ఞానము కలవాడ వని నా విశ్వాసము. నిన్నొక విషయ మడిగెదను. చెప్పుము. అంతరిక్షము నందు గాని, లేక స్వర్గలోకము నందు గాని నాకు లభింపబోవు పుణ్యలోకము గూడ నున్నదా? అట్లు ఉన్నచో, నా పుణ్య ప్రభావముచేత నీవు క్రింద పడకుండెదవు గాక!

యయాతి :- 'అష్టకా! ఈ భూమండలము నందు అడవి జంతువులు, పర్వతీయ జంతువులు, గోవులు, అశ్వములు మొదలైనవి యుండును. స్వర్గ లోకమునందు గూడ ఈ యన్ని లోకములు నీకు ఉండు నని నిశ్చయముగా తెలిసికోనుము.

అష్టకుడు :- 'మహారాజా! స్వర్గము నందు నా కొరకు ఉన్న లోకము అన్నియు ఇచ్చెదను. వాని ప్రభావము చేత నీకు పతనము కలుగకుండుగాక! అంతరిక్షము నందు గాని, లేక స్వర్గలోకము నందు గాని, నాకు గల స్థానము నందు నీవు శీఘ్రముగ మోహము విడచి పోయి యుండుము.

యయాతి :- అష్టకా! వేదవేత్తలైన బ్రాహ్మణులే దానము ప్రతి గ్రహించెదరు. నా వంటి క్షత్రియుడు ఎప్పుడుగూడ ప్రతిగ్రహము చేయడు. పూర్వము నేనుగూడ దానవిధి ప్రకారము ఉత్తమ బ్రాహ్మణులకు సర్వదా దానము చేయుచుంటిని.

బ్రాహ్మణుడు కానివాడు దైన్యముతో యాచనము చేయుచు ఎప్పుడుగూడ తన జీవనము గడపికొన గూడదు. 'యాచనయనునది విద్యచేత దిగ్విజయము చేయు విద్వాంసులైన బ్రాహ్మణుల యొక్క పత్ని'యని భావింపుము. అనగా, బ్రహ్మ (వేద) వేత్తలైన బ్రాహ్మణులకు యాచన చేయు నధికారము కలదు. నాకు సత్కర్మలుచేయు నిచ్ఛ కలదు. కనుక పూర్వము ఎప్పుడుగూడ నేను చేయని కార్యము ఇప్పుడెట్లు చేసెదను?

"జనమేజయా! అష్టక-యయాతి రాజులకు ఇట్లు సంవాదము జరిగిన తరువాత అష్టకుని సోదరుడైన ప్రతర్దనునకు, యయాతికిని ఇట్లు సంవాదము జరిగెను.

ప్రతర్దనుడు :- 'రాజా! నేను ప్రతర్దనుడను. ఒకవేళ అంతరిక్షమునందు గాని, స్వర్గమునందుగాని, నా కొరకుగూడ ఏదైన లోకమున్నచో తెల్పుము. నీవు పారలౌకిక ధర్మజ్ఞానముగలవాడ వని తలచెదను.

యయాతి :- 'ప్రతర్దనా! నీ కైతే అనేక లోకములు ఉన్నవి. ఒక్కొక్క లోకమునందు ఏడేడు దినముల చొప్పున నీవు ఉండినను, ఆ లోకములకు

అంతము లేదు. అవి యన్నియు అమృతము ప్రవహింప జేయుచుండును. వానిలో ఘృతము (తేజస్సు) నిండి యుండును. ఆ లోకములందు ఏ మాత్రము శోకము ఉండదు. అవి యన్నియు నీ కొరకు ఎదురుచూచుచున్నవి.

ప్రతర్దనుడు :- మహరాజా! ఆ లోకములన్నియు నేను నీకు ఇచ్చెదను. నీవు క్రిందపడ కుందువుగాక! నా లోకములన్నియు నీవిగానే అగుగాక! అవి అంతరిక్షమునందున్నను లేక స్వర్గమునందున్నను, నీవు శీఘ్రముగా మోహము విడిచి ఆ లోకములకు పొమ్ము!

యయాతి :- ప్రతర్దనా! పరాక్రమవంతుడైన యే రాజు గూడ ఇతరుల నుండి పుణ్యమును, యోగక్షేమములను కోరగూడదు. విద్వాంసుడైన రాజు దైవవశము చేత మహావిపత్తిలో పడినప్పటికిన్ని ఏలాటి పాపకార్యము చేయ గూడదు.

ధర్మ దృష్టి గల రాజు ధర్మము - కీర్తి - కలిగించు మార్గమునందే నడచుటకు ప్రయత్నించవలెను. ధర్మబుద్ధిగల నావంటి మనుష్యుడు దెలిసి - దెలిసి ఇటువంటి దైన్యముతో గూడిన కార్యము చేయగూడదు.

శుభకర్మ చేయగోరువాడు ఇట్టి కర్మ చేయజాలడు. ఇవి మరియే రాజులు గూడ చేయలేదు. ఎవడు ధర్మాధర్మములను బాగుగా నిశ్చయించుకొని కర్తవ్యా కర్తవ్య కర్మలు శ్రద్ధగా అనుష్ఠించునో అట్టి రాజే బుద్ధిమంతుడు సత్యసంధుడు, మనస్వి యనబడును. అట్టి రాజు తన మహిమచేత లోకపాలకుడు కాగలడు.

ధర్మకార్యమునందు సంశయము గలిగినప్పుడు, న్యాయమార్గములో అర్థకామములు రెండున్ను లభించినప్పుడు తొలుత ధర్మసంపాదకమైన కార్యము చేయవలెను. కాని, అర్థ-కామములు సంపాదించుకార్యములు చేయగూడదు. ఇదియే ధర్మము."

"జనమేజయా! ఈ విధముగ మాట్లాడుచున్న యయాతి మహారాజుతో వసుమంతుడు ఇట్లనెను:-

వసుమంతుడు:- 'మహారాజా! నేను ఉషదశ్వుని పుత్రుడైన వసుమంతుడను. నీవు పారలౌకిక ధర్మజ్ఞానము గలవాడవు. కాబట్టి, స్వర్గాంతరిక్షములలో నాకొరకేదైన ప్రసిద్ధలోకమున్నచో తెలుపుము.

యయాతి:- 'వసుమంతా! పృథివ్యాకాశదిక్కులలో సూర్యభగవానుని కిరణములు తపించుచు ప్రకాశింపజేయుచున్నంత విశాలలోకము నీకు స్వర్గములో నున్నది. అది యెప్పుడున్ను నశించక సర్వదా స్థిరముగ నుండును. అది నీకొరకు ఎదురుచూచుచున్నది.

వసుమంతుడు:- 'రాజా! ఆ లోకములన్నియు నీకిచ్చెదను. నీవు క్రింద బడకుందువు గాక! ఆ నా లోకములన్నియు నీవియే యగుగాక! నీవు ఒకవేళ ప్రతిగ్రహము చేయుట దోషమని తలచిన యెడల నీవు నాకు ఒక పిడికెడు తృణము నిచ్చి నీవు ఆ లోకములన్నియు తీసికొనుము.'

యయాతి:- 'వసుమంతా! నేను ఈ విధముగ ఎప్పుడు గూడ అసత్యమైన క్రయవిక్రయములు చేసినట్లుగాని, లేక కపటపూర్వకముగ వ్యర్థమైన యే వస్తువు గూడ తీసికొనినట్లుగాని నాకు జ్ఞాపకము లేదు. కాలచక్రమునకు భయపడెదను. ఇట్టి కార్యము ఏ మహాపురుషులు గూడ పూర్వము చేయలేదు. నేను గూడ చేయజాలను. సత్కర్మనే చేయ గోరెదను.

వసుమంతుడు :- రాజా! ఒకవేళ నీవు వెలయిచ్చి కొనగోరనిచో నేను స్వయముగా అర్పించిన యీ పుణ్యలోకములను తీసికొనుము. నేను ఆ లోకములకు పోవను. అవి యన్నియు నీ యధికారములో నుండగలవు.

"జనమేజయా! ఇట్లు యయాతి - వసుమంతులు మాట్లాడుకొనిన పిదప శిబి - యయాతులకు ఈ విధముగా సంవాదము జరిగెను.

శిబి :- 'మహారాజా! నేను ఉశీనర పుత్రుడను. శిబి యనువాడను. నీవు సర్మధర్మములు తెలిసినవాడవు. కనుక, నాకు గూడ స్వర్గాంతరిక్షములలో ఏవైన పుణ్యలోకము లున్నచో చెప్పుము?

యయాతి :- 'శిబీ! సత్పురుషులు ఎందరు నీ కడకు వచ్చి, యేది యడిగినను నీవు వాక్కుతోనే కాక, మనస్సుతో గూడ లేదనలేదు. వారిని

అవమానపరచలేదు. కనుక, స్వర్గమునందు నీకొరకు అనంతలోకములు ఉన్నవి. అవి విద్యుత్తువలె తేజోమయములై, వివిధ-మధుర-శబ్దములతో నిండియున్నవి."

శిబి :- 'మహారాజా! ఒకవేళ నీవు వెలయిచ్చి ఆలోకములను కొనగోరవేని, నేను స్వయముగ ఆ పుణ్యలోకములను నీకు అర్పించుచున్నాను. తీసికొనుము. నీ కిచ్చిన తరువాత, నే నాలోకములకు ఎప్పుడు గూడ పోవను. అక్కడికి పోయిన విద్వాంసులు ఎప్పుడు గూడ శోకము చెందరు.

యయాతి :- శిబీ! నీవు ఇంద్రుని వంటి ప్రభావము గలవాడవైనట్లే, నీ లోకములు గూడ అనంతములు. ఐనను ఇతరు లిచ్చిన లోకములో నేను విహరింపజాలను. కనుక, నీవు ఇచ్చిన దానికి నిన్ను నేను అభినందించను.

"జనమేజయా! యిట్లు "అష్టకుడు - ప్రతర్దనుడు - వసుమంతుడు - శిబి' అను నలుగురకు యయాతికిన్ని విడి - విడిగా సంవాదము జరిగిన తరువాత అష్టక - యయాతులకు ఈ విధముగ మరల సంవాదము జరిగెను.

అష్ట : రాజా! ఒక వేళ నీవు మా నలుగురిలో నొక్కొక్కడు వేర్వేరుగా నిచ్చిన లోకములను సంతోషపూర్వకముగ గ్రహింపనియెడల మే మందరము కలిసి మా నలుగురి పుణ్యలోకములను నీకు సమర్పించి, మేము భౌమ" నరకమునకు పోవుటకు సంసిద్ధులమై యున్నాము.

యయా : అష్టకా! నేను దేనికి యోగ్యుడనో దానికొరకే నీవు ప్రయత్నింపుము. ఎందుకనగా సత్పురుషులు సత్యమునే యభినందించెదరు. నేను పూర్వకాలమునందు ఏ కార్యము చేయలేదో, అది ఇప్పుడుగూడ చేయుటకు యోగ్యుడను కానని తలచెదను.

అష్ట : రాజా! ఆకాశమునందు కనబడుచున్న యీ సువర్ణ రథములు ఎవరివి? వీనిపై నెక్కి ఏ మనుష్యులు సనాతన లోకమునకు పోవగోరు చుండెదరు?

యయా : అష్టకా! ఆకాశమునందు కనబడుచున్న యీ యైదు సువర్ణ రథములు అగ్ని జ్వాలలవలె ప్రకాశించుచున్నవి. ఇవి మిమ్మే స్వర్గమునకు కొనిపోవును.

"జనమేజయా! ఆ సమయమునందే యక్కడకు తపస్వినియైన మాధవి వచ్చెను. ఆమె తన శరీరము నిండ మృగ చర్మము కప్పుకొని యుండెను. ఆమె వృద్ధావస్థలో నుండినప్పుడు మృగములతోపాటు సంచరించుచు మృగవ్రతమును పాలించు చుండెను. ఆమె భోజన సామగ్రి చేష్టలు అన్నియు మృగములవలెనే యుండెను. ఆమె మృగముల గుంపుతో యజ్ఞ మండపము నందు ప్రవేశించి, యజ్ఞ ధూమ సుగంధమును గ్రహించుచు మృగములతోపాటు యజ్ఞశాలలో సంచరించుచు తన పుత్రులను చూచుచు యజ్ఞ మహిమను అనుభవించుచు మిక్కిలి ప్రసన్నురాలుగా నుండెను. స్వర్గమునందు నివసించుచున్న యయాతి మహారాజు అక్కడకువచ్చి యుండుట ఆమె చూచెను. కాని, అతడు భూమిని తాకక ఆకాశమునందే యుండెను. 'అతడు తన తండ్రి' యని గుర్తించి మాధవి ప్రణామము చేసెను. అది చూచి ఆమె పుత్రుడైన వసుమనసుడు* తల్లితో నిట్లనెను:-

"అమ్మా! నీవు ఉత్తమ వర్ణమునకు చెందిన దేవతవు! అట్టి నీవు ఈ మహాపురుషునకు ప్రణామము చేసితివి. ఈయన ఎవరు? దేవతయా? రాజా? నీకు తెలిసియుండిన చెప్పుము.

ఆ మాటకు మాధవి వారితో నిట్లనెను :-

"పుత్రులారా! మీరందరు ఒక్కటిగా నిలిచి, నా మాట వినుడు. ఈయన నహుష పుత్రుడైన యయాతి మహారాజు. నాకు తండ్రి. నా పుత్రులైన మీకు ఈ యయాతి మహారాజు మాతామహుడు (తల్లికి తండ్రి). ఈయన నా సోదరుడైన పూరును రాజ్యమునందు అభిషిక్తునిజేసి స్వర్గలోకమునకుపోయి యుండెను. కాని, మహాకీర్తి శాలియైన యీ మహారాజు ఏ కారణముచేత మరల నిక్కడికి వచ్చెనో నాకు తెలియదు".

"జనమేజయా! యిట్లు తల్లి చెప్పగా విని వసుమంతుడు ఆమెతో 'అమ్మా! ఈ మహారాజు తన స్థానమునుండి భ్రష్టుడాయెను.' అని యనగా, మాధవి సంభ్రమము చెంది దౌహిత్రుల (కూతు కొడుకులు) తో గూడి యుండిన తండ్రితో నిట్లనెను.

* ఇతనికి 'వసుమంతుడు' అను పేరు గూడ ప్రసిద్ధముగా నున్నది.

"తండ్రీ! నేను తపస్సుచేసి, సంపాదించుకొనిన లోకములను గ్రహింపుము. పుత్ర-పౌత్రులవలెనే, పుత్రికలు, దౌహిత్రులును చేసిన ధర్మాచరణము చేత లభించిన ధనము గూడ తనకొరకే' యని వేదవిదులైన ఋషులు చెప్పెదరు. కనుక, నీవు మేము చేసిన దానములచేత, మా తపోజనితమైన పుణ్యము చేతను స్వర్గమునకు పొమ్ము!"

ఆ మాటకు యయాతి యిట్లనెను :-

"బిడ్డా! ఒకవేళ ఇది ధర్మజనిత ఫలమైనచో దీనికి శుభాపరిణామము అవశ్యంభావి యగును. నేడు నా కూతురు, మహాత్ములైన నా దౌహిత్రులున్ను నన్నుద్ధరింప జేసిరి.

కనుక, నేటినుండి, శ్రాద్ధాది పితృకర్మలయందు దౌహిత్రుడు పరమ పవిత్రుడుగా భావింపబడగలడు. దౌహిత్రుడు పితృదేవతల హర్షమును పెంపొందించు ననుటలో ఏ మాత్రము సందేహము లేదు.

శ్రాద్ధము నందు 'దౌహిత్రుడు, కుతపకాలము*, నువ్వులు' ఈ మూడున్ను పవిత్రములని తలచబడినవి. 'ఈ మూడింటికి వరుసగా 'పవిత్రత్వము', అక్రోధము, అత్వర (తొందరపాటులేకుండుట)' అను మూడును గుణములు గలవు.

శ్రాద్ధము నందు భోజనము చేయువారు, వడ్డించువారు, వైదిక పౌరాణిక మంత్రములను వినిపించువారు ఈ మూడు విధములైన మనుష్యులు కూడ పవిత్రులు అని భావింపబడుదురు. పగటియందలి యెనిమిదవ భాగము నందు సూర్యుని తాపము దిగజారు చుండును. దానికి 'కుతప కాలము' అని పేరు. ఆ సమయమంతు పితరులకు ఇవ్వబడిన దానము అక్షయమగును. నువ్వులు శ్రాద్ధమును పిశాచముల నుండి రక్షించును. దర్భలు రాక్షసుల నుండి రక్షించును.

---

పగటి ముప్పది గడియలు పదునైదు భాగములు చేయగా ఎనిమిదవ భాగము 'కుతపకాల'మనబడును. అనగా సూర్యోదయము నుండి పదునైదవ - పదునారవ గడియలు. ఇవి అపరాహ్ణమనబడును.

శ్రోత్రియ బ్రాహ్మణులు భోజన పంక్తిని రక్షింతురు. సన్న్యాసులు శ్రాద్ధము నందు భుజించిన యెడల, ఆ శ్రాద్ధము అక్షయమగును

ఉత్తమ వ్రతములను ఆచరించు పవిత్ర శ్రోత్రియ బ్రాహ్మణుడు శ్రాద్ధమునకు యోగ్యుడు. అట్టి బ్రాహ్మణుడు లభించిన సమయమే శ్రాద్ధమునకు ఉత్తమ కాలమని తలచవలెను. అప్పుడు అట్టి బ్రాహ్మణునకు ఇవ్వబడిన దానము ఉత్తమకాల దానమగును. ఇదితప్ప మరియొకటి ఏది కూడ శ్రాద్ధోపయుక్త కాలము కాదు.

"జనమేజయా! యయాతి మహారాజు ఈ మాటలు చెప్పి, మరల తన దౌహిత్రులతో 'నాయనలారా! మీరందరు అవభృథ స్నానము చేసినవారు. ఇప్పుడు మహాకార్యసిద్ధికిగాను అతి శీఘ్రముగ సంసిద్ధులు కండు' అని యనెను. ఆ మాటకు అష్టకుడు యయాతితో 'రాజా! నీవు ఈ రథము నందు కూర్చొని ఆకాశముపై పొమ్ము. సమయము వచ్చినప్పుడు మేముగూడ నిన్ను అనుసరించెదము" అని యనగా యయాతి వారితో 'మనమందరము కలిసి ఒకసారియే స్వర్గమును జయించితిమి. కనుక ఇప్పుడు మనమందరము అక్కడికి కలిసియే పోవలెను. ఇక్కడ రజోగుణరహితమైన సాత్విక దేవలోక మార్గము మనకు స్పష్టముగ కనబడుచున్నది' అని యనెను.

"జనమేజయా! ఆ రాజులందరు ఆ దివ్య రథములపై కూర్చొని వారి ధర్మబలముచేత స్వర్గమునకు వెడలిపోయిరి. అప్పుడు వారి కాంతులు భూమ్యాకాశముల యందు వ్యాపించెను. 'అష్టకుడు, శిబి, కాశిరాజైన ప్రతర్దనుడు, ఇక్ష్వాకు వంశీయుడైన వసుమనసుడు ఈ నలుగురు నుత్తములైన రాజులు. వీరందరు గూడ యజ్ఞాంత స్నానము చేసినవారు. వీరు కలిసి యేకముగా స్వర్గమునకు పోయిరి. అప్పుడు అష్టకుడు యయాతితో నిట్లనెను:-

"రాజా! ఇంద్రుడు నాకు మిత్రుడు. కనుక, అందరికన్న తొలుత నేనే ఇంద్రునికడకు పోయెదనని తలచియుంటిని. కాని, ఉశీనరపుత్రుడైన యీ శిబి

యొక్కడే మిక్కిలి వేగముతో మన వాహనముల నన్నింటిని దాటి ముందుకు పోయెను. ఇట్లెందుకయ్యెను?

ఆ మాటకు యయాతి యిట్లనెను:-

"అష్టకా! శిబి బ్రహ్మలోక ప్రాప్తి కొరకు తన సర్వస్వ దానము (ధన-ధనేతరము లైన సంపదలన్నియు దానము చేయుట) చేసి యుండెను. కాబట్టి మీ యందరిలో నితడు శ్రేష్ఠుడు. అష్టక రాజా! 'దానము, తపస్సు, సత్యము, ధర్మము, లజ్జ, శ్రీ, క్షమ, సౌమ్య భావము, వ్రతపాలనాభిలాష, ఈ సద్గుణములు శిబిరాజులోన సమానముగ నున్నవి. అతడు ఇతరులకంటె నధిక బుద్ధిశాలి. శిబిరాజు సదాచార సంపన్నుడు, లజ్జాశీలుడు. ఇతనికి కొంచెము గూడ స్వాభిమానము లేదు. కనుక ఈ శిబి మన యందరి కంటె ముందు పోవుచున్నాడు."

"జనమేజయా! తర్వాత అష్టకుడు ఇంద్ర సమానుడైన తన మాతామహుడగు యయాతితో నిట్లు మరల ప్రశ్నించెను:-

మహారాజా! నీ వెక్కడినుండి వచ్చితివి? నీ వెవడవు? ఎవరి పుత్రుడవు? నీవు చేయుపని చేయగలవాడు మఱియొక క్షత్రియుడు గాని, బ్రాహ్మణుడు గాని ఎవడు గూడ ఈ ప్రపంచమునందు లేడు."

ఆ మాటకు యయాతి యిట్లనెను :-

"అష్టకా! నేను నహుష పుత్రుడను. పూరునకు తండ్రిని. నా పేరు యయాతి. ఈ భూలోకమునందు నేను చక్రవర్తిగా నుంటిని. మీ రందరు నా వారు గనుక నీతో రహస్యము చెప్పుచున్నాను. నేను నీకు మతామహుడను. (ఈ విషయము తొలుత మీకు తెలిసినప్పటికిన్ని స్పష్టీకరించుచున్నాను).

"అష్టకా! నేను ఈ సమస్త భూమండలమును జయించినాను. బ్రాహ్మణులకు అన్నవస్త్రదానములు చేయుచుంటిని. నూరు పవిత్రములైన సుందరాశ్వములను దానముగా నిచ్చు మనుష్యుడు పుణ్యాత్ముడైన దేవత యగును. నేను 'వాహనములు, గోవులు, సువర్ణము, ధనము' ఈ మొదలైన వానితో నిండిన

సమస్త భూమండలమును దానముగా నిచ్చియుంటిని. నూరు అర్బుదముల (దశకోటి) గోవులను ఇచ్చితిని."

"అష్టకా! సత్యముచేతనే భూమ్యాకాశములు స్థిరముగా నిలిచియున్నవి. మనుష్య లోకములో అగ్నిగూడ సత్యము చేతనే జ్వలించుచున్నది. నేనెప్పుడు గూడ అసత్యము చెప్పలేదు. ఎందుకనగా, సత్పురుషులు సర్వదా సత్యమునే ఆదరించెదరు."

"అష్టకా! నేను, మీతో, ప్రతర్దనునితో, వసుమంతునితోను నిప్పుడు చెప్పబోవు మాట సత్యమైనదే. 'సమస్తలోకములు, మునులు, దేవతలు, సత్యము చేతనే పూజనీయు లగుదురు.' అని నా విశ్వాసము. మనస్సులో ఈర్ష్య లేకుండ స్వర్గమును సాధించిన మన యందరి యొక్క యీ వృత్తాంతము యథార్థముగా ద్విజుల సమక్షమున వినిపించినవాడు మనకు సమానమైన పుణ్యలోకములను పొందగలడు."

"జనమేజయా! యయాతి మహారాజు గొప్ప మహాత్ముడుగా నుండెను. శత్రువులకు అజేయుడు ఉత్తమ కర్మలు చేసిన వాడు. అతని దౌహిత్రులు అతనిని ఉద్ధరించిరి. వారు తమ సత్కర్మల ద్వారా సమస్త భూమండలము నందు సుప్రసిద్ధులై, భూమి విడిచి స్వర్గలోకమునకు వెడలిపోయిరి."

తరువాత జనమేజయుడు వైశంపాయనునితో నిట్లనెను :-

**పూరువంశ వర్ణనము :**

"భగవన్! ఇప్పుడు నేను పూరు వంశమును విస్తరింపజేయు రాజుల చరిత్రలు వినగోరుచున్నాను. వారి బలపరాక్రమములు ఎట్లుండెను? వారు ఎటువంటివారు? ఎందరు? ఈ వంశమునందు ఏ రాజు గూడ సచ్ఛీలము లేనివాడు, బలపరాక్రమశూన్యుడు, సంతాన హీనుడున్ను, లేకుండె'నని నా విశ్వాసము. మునీంద్రా! 'సత్ప్రవర్తన, వివేకమున్ను కలవారని ప్రసిద్ధి పొందిన మా పూర్వవంశపురాజు లందరి చరిత్రలను విస్తారముగ వినగోరుచున్నాను".

ఆ మాటకు వైశంపాయను డిట్లనెను:-

"జనమేజయా! నీవు నన్నడిగిన ప్రశ్నము లన్నింటికి సమాధానము చెప్పెద వినుము :-

పూరు వంశమునందు పుట్టిన రాజులు ఇంద్ర సమాన తేజస్సు గలవారు. మిక్కిలి ధనవంతులు. పరాక్రమవంతులు. శుభ లక్షణములు కలవారునై యుండిరి.

"పూరునకు 'పౌష్టి' యను భార్యనుండి 'ప్రవీర' - 'ఈశ్వర' - 'రౌద్రాశ్వ' నామములు గల మహారథికులైన ముగ్గురు పుత్రులు పుట్టిరి. వారిలో ప్రవీరుడు తన వంశ పరంపరను పెంపొందించువాడుగా నుండెను.

"రాజా! ప్రవీరుని పుత్రుని పేరు 'మనస్యుడు'. అతడు 'శూరసేని' యను నామె గర్భమునుండి పుట్టి, మహా శక్తిశాలిగా నుండెను. అతడు చతుస్సముద్ర ముద్రితమైన సమస్త భూమండలమును పాలించెను.

"రాజా! 'మనస్యు'నకు 'సౌవీరి' అను భార్య నుండి 'శక్తుడు - సంహననుడు - వాగ్మి' అను పేర్లు గల వీరులైన ముగ్గురు పుత్రులు పుట్టిరి.

"రాజా! పూరుని మూడవ కొడుకైన 'రౌద్రాశ్వ'నకు 'మిశ్రకేశి' అను అప్సరః స్త్రీ నుండి 'అన్వగ్భానుడు' మొదలైన పదుగురు పుత్రులు పుట్టిరి. వారు, మహా ధనుర్ధరులు, యజ్ఞకర్తలు, శూరులు, సంతానవంతులు, అనేక శాస్త్ర విద్వాంసులు, సమస్త శస్త్రాస్త్ర విద్యా నిపుణులు, ధర్మపరులునై యుండిరి. ఆ పదుగురి పేర్లు :- 'ఋచేయు* - కక్షేయు - కృకణేయు - స్థండిలేయు - వనేయు - జలేయు - తేజేయు - సత్యేయు - ధర్మేయు - సన్నతేయు' నామములు ఉండెను. ఋచేయుడు దేవతలలో ఇంద్రునివలె తన సోదరులందరిలోను విద్వాంసుడు, పరాక్రమవంతుడునై యుండి, సమస్త భూమండలమునకు చక్రవర్తి యయ్యెను.

"ఋచేయు నామకుడైన అనాధృష్టికి 'మతినారుడు' అను పుత్రుడుండెను. అతడు రాజసూయాశ్వమేధ యాగములు చేసిన ధర్మాత్ముడు. అతనికి 'తంసు-మహాన్-అతిరథ-అనుపమ-ద్రుహ్యు' నామకులైన యెదుగురు పరాక్రమవంతులైన పుత్రులు పుట్టిరి.

'ఋచేయు - అన్వగ్భాను - అనాధృష్టి' యను మూడున్ను ఒకని నామములే.

"రాజా! వారిలో తంసునకు 'ఈలినుడు' అను పేరు గల పుత్రుడు పుట్టెను. అతడు విజయశీలుడు, పురుష శ్రేష్ఠుడుగ నుండెను. సమస్త భూమండలము నతడు జయించెను. 'ఈలిను'నకు 'రథంతరి' అను పత్ని నుండి పంచ మహా భూతముల వంటి దుష్యంతుడు మొదలైన ఐదుగురు పుత్రులు పుట్టిరి. వారు: 'దుష్యంత-శూర-భీమ-ప్రవసు-వసు' నామకులు. వారిలో జ్యేష్ఠుడగుటచేత దుష్యంతుడు రాజయ్యెను. (ఇంతకు పూర్వము దుష్యంతుని తండ్రి 'ఇలిలుడు' అని శకుంతలోపాఖ్యానములో చెప్పబడెను)

"జనమేజయా ! దుష్యంతునకు శకుంతల నుండి భరతుడు పుట్టెను. అతనిచేతనే భరతవంశ కీర్తి వ్యాపించెను. భరతుడు తన ముగ్గురు పత్నుల యందు తొమ్మండుగురు పుత్రులను కనెను. కాని, 'వీరు నాకు తగిన పుత్రులు కారు' అని చెప్పి భరతుడు, ఆ పుత్రులను అభినందించలేదు. అప్పుడు ఆ శిశువుల తల్లులు కోపముతో వారిని చంపిరి. దీనిచేత భరతునకు కలిగిన పుత్ర సంతతి వ్యర్థమయ్యెను.

"జనమేజయా ! అప్పుడు భరతుడు పెద్ద పెద్ద యజ్ఞములు చేసి, భరద్వాజ మహాముని కృప చేత, 'భుమన్యు' నామకుడైన యొక పుత్రుని కనెను. అప్పుడు భరతుడు పుత్రవంతుడనైతినని సంతసించి, భుమన్యుని యువరాజ పదవి యందు అభిషిక్తుని చేసెను.

"జనమేజయా ! భుమన్యునకు, 'పుష్కరిణి' యను భార్య నుండి 'దివిరథ - సుహోత్ర - సుహోత-సుహవిః-సుయజున్-ఋచీక' నామములు గల ఆరుగురు పుత్రులు పుట్టిరి. వీరిలో సుహోత్రుడు జ్యేష్ఠుడు. కనుక, అతనికి రాజ్యము లభించెను.

"జనమేజయా! సుహోత్రుడు రాజసూయాశ్వమేధాద్యనేక యాగములు చేసి గజాశ్వరత్న సువర్ణాదుల చేత సంపన్నమైన సముద్ర పర్యంత సమస్త భూమండలమును అనుభవించెను.

సుహోత్రుడు ధర్మముతో ప్రజాపాలనము చేయుచున్నప్పుడు సమస్త భూమండలము గజాశ్వ - రథ మనుష్యుల చేత నిండి యుండెను సుహోత్రుని

శాసన కాలము నందు అనేక ప్రాణుల భారముచేత భూమి పీడితమై క్రిందకు అణగిపోవు చుండెను. అతని రాజ్యము నందు భూమి, లక్షల కొలది చైత్యముల (దేవమందిరములు)తో, యజ్ఞయూపస్తంభములతో (యజ్ఞములో పశువును కట్టుటకు నాటబడు స్తంభము-ఇది యూపము అనబడును) శోభిల్లు చుండును. ప్రజలందరు హర్షముతో పరిపుష్టులై యుండిరి. పైర్లు అధికముగ పండు చుండెను. ఈ విధముగా అతని రాజ్యమునందు భూమి సర్వదా వైభవములతో శోభిల్లు చుండెను.

"జనమేజయా ! సుహోత్రునకు 'ఐక్ష్వాకి' యను భార్య నుండి 'అజమీఢ - సుమీఢ - పురుమీఢ' నామములు గల ముగ్గురు పుత్రులు పుట్టిరి. వారిలో జ్యేష్ఠుడైన అజమీఢుడు వంశ ప్రతిష్ఠను నిలిపెను. అతనికి 'ధూమిని - నీలి - కేశిని' యను ముగ్గురు భార్యలు ఉండిరి. వారిలో ధూమిని నుండి ఋక్షకుడు, నీలి నుండి దుష్యంతుడు, పరమేష్ఠి యను వారు, కేశిని నుండి 'జహ్ను - వ్రజన - రూపిణ' నామకులు ముగ్గురున్ను వెరసి ఆరుగురు పుత్రులను కనెను. వీరిలో దుష్యంత పరమేష్ఠుల పుత్రులు 'పాంచాలురు' అనబడిరి.

"జనమేజయా ! జహ్ను వంశము నందు పుట్టిన వారు 'కుశికులు' అను పేరుతో ప్రసిద్ధులైరి. వ్రజన - రూపిణుల యొక్క జ్యేష్ఠభ్రాత యగు ఋక్షకుడు రాజయ్యెను. ఋక్షకునకు వంశోద్ధారకుడైన 'సంవరణుడు' అను పుత్రుడు పుట్టెను. సంవరణుడు రాజ్యమేలు చుండగా చాల ప్రజా సంహారము జరిగెనని వింటిని.

"జనమేజయా ! ఇట్లు అనేక విధనాశములు కలుగుట చేత సంవరణుని రాజ్యమంతయు నష్టమయ్యెను. అందరు 'ఆకలి - మృత్యువు - అనావృష్టి - వ్యాధులు' వీని చేత బాధపడుచుండిరి. శత్రుసేనలు భరతవంశ యోధులను నశింపజేయ దొడగెను. పాంచాలరాజు, భూమిని దద్దరిల్ల జేయుచు చతురంగ సేనలతో సంవరణునిపై ఆక్రమణము చేసి అతని సమస్త భూమిని తన పది అక్షౌహిణీ సేనల చేత జయించుకొని సంవరణుని గూడ ఓడించెను

"జనమేజయా ! తరువాత, సంవరణుడు మిక్కిలి భయముచేత భార్యా-పుత్ర - మిత్ర - మంత్రి సహితుడై అక్కడినుండి పారిపోయెను అప్పుడు

అతడు 'సింధు' మహానదము (పడమరగా పారు నదికి నదమని పేరు) యొక్క తీరమునందు ఒక పర్వత సమీపమునుండి నదీతీరమువరకు వ్యాపించియున్న పొదలో నివసించుచుండెను. ఆ నికుంజ దుర్గమును ఆశ్రయించి భరతవంశ క్షత్రియులు ఒక వేయి సంవత్సరముల వరకు నివసించి యుండిరి.

"జనమేజయా! ఆ సమయమునందే వసిష్ఠ మహాముని వారికడకు రాగా, ఆ రాజులు ఆ మహామునికి స్వాగతము చెప్పి నమస్కరించి, అర్ఘ్యాదులతో పూజించి, తమ సర్వస్వమును ఆ మునికి సమర్పించి, ఆయనను ఉత్తమాసనమునందు కూర్చొనబెట్టి ఆ మహామునితో, 'భగవన్! మేము మరల రాజ్యప్రాప్తికై ప్రయత్నము చేయుచున్నాము. నీవు మాకు పురోహితుడవుగా నుండవలెను' అని ప్రార్థింపగా, వసిష్ఠుడు 'చాల మంచిది' అని చెప్పి భరతవంశ రాజులను తన వారుగా స్వీకరించి భూమండలమునందు ఉత్తమ పూరు వంశీయుడైన సంవరణుని సమస్త క్షత్రియ సామ్రాజ్య పదమునందు అభిషిక్తుని జేసెనని వింటిమి.

"జనమేజయా! తరువాత, సంవరణ మహారాజు, ప్రాచీన భరతవంశ రాజులు నివసించిన పట్టణమునందు నివాసము చేయ దొడగెను. తరువాత, అతడు, రాజులందరను జయించి, తనకు కప్పము కట్టునట్లు చేసెను. పిదప సంవరణుడు బహుళ దక్షిణ లిచ్చి అనేక మహాయజ్ఞములచేత భగవంతుని పూజించెను.

"జనమేజయా! కొంతకాలము తరువాత సంవరణుని వీర్యముచేత సూర్య కన్యయైన 'తపతి', 'కురు' నామకుడైన పుత్రుని కనెను. కురుడు ధర్మజ్ఞుడని ప్రజలందరు అతనిని వరించి రాజ్యపదవియందు ప్రతిష్ఠించిరి. అతని పేరనే భూమండలమునందు 'కురుజాంగల దేశము' ప్రసిద్ధమయ్యెను.

"జనమేజయా! మహా తపస్వియైన కురురాజు తన తపోబలముచేత కురుక్షేత్రమును పవిత్రము చేసెను. అతనికి 'వాహిని' యను పత్నినుండి 'అశ్వవంతుడు - అభిష్యంతుడు - చైత్రరథుడు - ముని - జనమేజయుడు' అను పేర్లుగల ఐదుగురు పుత్రులు పుట్టిరి".

"జనమేజయా! అశ్వవంతునకు 'అవిక్షిత్' అని మరియొక పేరు ఉండెను. అతనికి 'పరిక్షిత్ - శబలాశ్వ - ఆదిరాజ - విరాజ - శాల్మలి - ఉచ్చైశ్రవస్-భంగకార - జితారి' నామకులైన యెనమండుగురు పుత్రులు పుట్టిరి. ఈ వంశమునందు జనమేజయాదులైన మహారథికులు ఏడుగురు గూడ పుట్టిరి. వారు, తమ సత్కర్మ గుణములచేత ప్రసిద్ధులుగా నుండిరి.

"జనమేజయా! పరిక్షిత్తు యొక్క పుత్రులందరు ధర్మార్థ జ్ఞానము గలవారు. వారు, 'కక్షసేన - ఉగ్రసేన - చిత్రసేన - ఇంద్రసేన - సుషేణ - భీమసేన' నామకులు. జనమేజయుని పుత్రులు భూమండలమునందు సుప్రసిద్ధులై యుండిరి. వారిలో జ్యేష్ఠుని పేరు ధృతరాష్ట్రుడు అని యుండెను. అతనికి తమ్ములు వరుసగా - 'పాండు - బాహ్లీక - నిషధ - జాంబూనద - కుండోదర - పదాతి - వసాతి' నామకులు ఉండిరి. వీరందరు ధర్మార్థకుశలురు. సర్వప్రాణులకు హితము చేయువారుగా నుండిరి.

"జనమేజయా! వీరిలో ధృతరాష్ట్రుడు రాజయ్యెను. అతనికి, 'కుండిక - హస్తిన్ - వితర్క - క్రాథ - కుండిన - హవిఃశ్రవస్ - ఇంద్రాభ - భుమన్యు - అపరాజిత - ప్రతీప - ధర్మనేత్ర - సునేత్ర' నామకలు పన్నెండుగురు పుత్రులు పుట్టిరి. వారిలో ప్రతీప - ధర్మనేత్ర - సునేత్రులు ముగ్గురు భూమండలమునందు మిక్కిలి ప్రసిద్ధులైయుండిరి. ఆ ముగ్గురిలోను ప్రతీపుని ప్రఖ్యాతి అధికముగ నుండెను. భూమండలములో అతనికి సమానుడు మఱియొకడు లేకుండెను.

"జనమేజయా! ప్రతీపునకు 'దేవాపి, శాంతనుడు, బాహ్లీకుడు' అను ముగ్గురు పుత్రులు పుట్టిరి. జ్యేష్ఠుడైన దేవాపి, ధర్మాచరణముచేత శ్రేయస్సు పొందగోరి, వనమునకు పోయెను. కనుక, శాంతను - బాహ్లీకులు ఈ రాజ్యము పొందిరి. భరతవంశ రాజులందరు ధైర్యవంతులు, శక్తిమంతులు. వారిలో నవేక రాజులు దేవర్షి సమానులుగా నుండిరి.

"జనమేజయా! ఇటువంటివారే, అనేకులు దేవతుల్యులు, మహారథికులును మనువంశమునందు పుట్టిరి. వారు పురూరవ మహారాజు వంశమును వృద్ధి పొందించు వారుగా నుండిరి".

ఇట్లు వైశంపాయన ముని చెప్పగా విని జనమేజయుడు ఆయనతో నిట్లనెను.

**దక్షప్రజాపతి నుండి పూరు - భరత-పాండు వంశముల పరంపర :**

"బ్రహ్మన్ ! మా వంశపు పూర్వరాజుల యుత్పత్తి క్రమము నీ వలన విని సంతోషించితిని. పూరువంశములో పుట్టిన రాజుల నామములు గూడ వింటిని. కాని, నీవు ఈ వృత్తాంతము సంగ్రహముగ చెప్పుట చేత నాకు పూర్తిగా తృప్తి తీరలేదు. కనుక, ఈ దివ్యకథ నాకు విస్తారముగా చెప్పుము. దక్షప్రజాపతి మనువులు మొదలుకొని అందరు రాజుల పవిత్ర జన్మవృత్తాంతము వినుటకు, ఎవ్వరికి ప్రసన్నముగా నుండదు ? ఈ రాజుల యశస్సు మిక్కిలి పెంపొందిన, ఉత్తమ ధర్మగుణముల చేత మూడు లోకములందు ఉజ్జ్వలముగా వ్యాపించి యున్నది. ఈ రాజులందరు ఉత్తమ గుణ - ప్రభావ - బల - పరాక్రమ - ధైర్య - ఉత్సాహ - తేజస్సుల చేత పరిపూర్ణులు. వారి కథ అమృత మధురమై ఎన్నిసార్లు వినినను తృప్తి దీరకున్నది."

ఆ మాట విని వైశంపాయను డిట్లనెను :-

"జనమేజయా! నేను పూర్వము కృష్ణద్వైపాయన మహర్షి నుండి వినిన విషయము లన్నియు నీకు చెప్పెదను. నీ వంశోత్పత్తి వృత్తాంతము వినుము.

"దక్షునకు అదితి, ఆమెకు వివస్వంతుడు (సూర్యుడు),* అతనికి మనువు మనువునకు ఇల, ఇలకు పురూరవుడు, అతనికి ఆయువు, ఆయువునకు నహుషుడు, నహుషునకు యయాతి, క్రమముగా పుట్టిరి. యయాతికి దేవయానీ - శర్మిష్ఠలు ఇద్దరు భార్యలుండిరి. జ్యేష్ఠభార్య దేవయానికి యయాతి వలన యదు-తుర్వసులు ఇద్దరు, శర్మిష్ఠకు 'ద్రుహ్యు-అను - పూరు'లు ముగ్గురు పుత్రులు పుట్టిరి. ఈ యైదుగురిలో యదువు నుండి యాదవులు పూరువునుండి పౌరవులు పుట్టిరి.

* పాండవులు చంద్రవంశీయులు. ఇచ్చట వివస్వంతు డనగా, సూర్యుడని అర్థముచెప్పినచో మరి వారు సూర్యవంశీయు లగుదురు-ఇది పరీక్షించ దగిన విషయము. వివస్వంతుడు అనగా ప్రకాశముగలవాడు, చంద్రుడు అని అర్థము చెప్పవచ్చునా?

"రాజా! పూరునకు కౌసల్య (ఈమెకే పౌష్టి అని మఱియొక పేరు గూడ కలదు) భార్యగా నుండెను. ఆమె గర్భము నుండి పూరునకు జనమేజయుడు (ఇతని మరియొక పేరు ప్రవీరుడు) పుట్టెను. ఆ జనమేజయుడు మూడశ్వమేధ యాగములు, ఒక విశ్వజిద్యాగమున్ను చేసి వానప్రస్థాశ్రమము స్వీకరించెను.

"జనమేజయా! పూరు పుత్రుడైన జనమేజయుడు 'అనంత' యనెడు మధు వంశీయ కన్యకను పెండ్లియాడి ఆమె గర్భము నుండి ప్రాచిన్వంతుడు అను పుత్రుని కనెను. అతడు ఉదయాచలము నుండి ప్రాచీ (తూర్పు) దిక్కునంతటిని ఒక దినమునందే జయించెను. కాబట్టి, అతనికి ప్రాచిన్వంతుడు అను పేరు వచ్చెను. అతడు యదు కుల కన్యకయైన 'అశ్మకి' అను నామెను పెండ్లియాడి, ఆమె గర్భము నుండి 'సంయాతి' అను పుత్రుని కనెను. అతడు దృషద్వంతుని పుత్రియైన 'పీరాంగిని' పెండ్లి చేసుకొని ఆమె గర్భము నుండి 'అహంయాతి' అను పుత్రుని కనెను. అహంయాతి కృతవీర్యుని కుమారి 'భానుమతి'ని పత్నిగా చేసుకొని ఆమె నుండి 'సార్వభౌమ' నామకుడైన పుత్రుని కనెను.

"రాజా! ఆ సార్వభౌముడు కేకయ రాజపుత్రియైన 'సునంద'ను జయించి తెచ్చుకొని, పెండ్లి చేసుకొని ఆమె వలన 'జయత్సేనుడు' అను పుత్రుని కనెను. ఆ జయత్సేనుడు విదర్భ రాజకుమారియైన 'సుశ్రవ'ను పెండ్లియాడి, ఆమె నుండి 'అవాచీనుడు' అను పుత్రుని కనెను. అవాచీనుడుగూడ మరియొక విదర్భరాజ కుమారియైన 'మర్యాద' అనునామెను పెండ్లియాడి ఆమె గర్భము నుండి 'అరిహ' నామక పుత్రుని కనెను. ఈమె ఇకపైన చెప్పబడు 'దేవాతిథి' పత్ని యైన 'మర్యాద' అను నామె కంటె వేరైనది. దేవాతిథికి పుట్టిన అరిహుని కంటె గూడ ఈ అరిహుడు వేరు.

"రాజా! అరిహుడు అంగదేశ రాజకుమారిని పెండ్లియాడి, ఆమె నుండి 'మహాభౌముడు' అను పుత్రుని కనెను. మహాభౌముడు ప్రసేనజిత్తు కుమారియైన 'సుయజ్ఞ'ను పెండ్లి చేసికొని, ఆమె గర్భము నుండి 'అయుతనాయి' అను పుత్రుని కనెను. అతడు అయుత (పదివేలు) పురుషమేధ యజ్ఞములు చేసెను. అయుత సంఖ్యాక యజ్ఞములను ఆనయనము (అనుష్ఠానము) చేసినందుచేత అతనికి 'అయుతనాయి' అను పేరు వచ్చెను అతడు పృథుశ్రవుని పుత్రి యైన 'కామ' అనునామెను పెండ్లి చేసికొని, ఆమె గర్భము నుండి 'అక్రోధనుడు'

అనువానిని కనెను. అతడు కళింగదేశరాజకుమారియైన 'కరంభ'ను పెండ్లి చేసికొని ఆమె నుండి 'దేవాతిథి' అను పుత్రుని కనెను. అతడు విదేహరాజ కుమారియైన 'మర్యాద' అనునామెను వివాహమాడి, ఆమె నుండి 'అరిహ' నామక పుత్రుని కనెను.

"రాజా! ఆ అరిహుడు అంగరాజ కుమారియైన 'సుదేవ' అను నామెను పెండ్లియాడి, ఆమె నుండి 'ఋక్ష' నామకుడైన పుత్రుని కనెను. ఋక్షుడు తక్షక పుత్రియైన 'జ్వాల'ను చేసికొని, ఆమె గర్భము నుండి 'మతినార' నామక పుత్రిని కనెను. మతినారుడు సరస్వతీ నదీతీరము నందు ద్వాదశ వార్షిక సత్రము (యజ్ఞము) అనుష్ఠించెను. అది ముగిసిన తరువాత సరస్వతీ నదీ దేవత మతి నారుని కడకు వచ్చి అతనిని పతిగా వరించెను. మతినారుడు సరస్వతీ గర్భము నుండి 'తంసు' నామక పుత్రుని కనెను.

"రాజా! తంసుడు కళింగ రాజకుమారిని పెండ్లియాడి, ఆమె గర్భము నుండి ఈలిన నామము గల పుత్రుని కనెను. ఈలినుడు 'రథంతరి'యను భార్య గర్భము నుండి దుష్యంతుడు మొదలైన యైదుగురు పుత్రులను కనెను. (దుష్యం తుని తండ్రి 'ఇలిలుడు' అని ఈ పర్వమునందే శకుంతలోపాఖ్యానము నందు చెప్పబడినది. ఇక్కడి 'ఈలిన' నామము ఆ పేరునకే పర్యాయమై యుండవచ్చును) దుష్యంతుడు విశ్వామిత్ర పుత్రియైన శకుంతలను పెండ్లియాడి ఆమె గర్భము నుండి భరతుని కనెను.

"తల్లి సంచి వంటిది. పుత్రుడు వాస్తవముగా తండ్రికే చెందును. ఎవని నుండి పుత్రుడు జన్మించునో అతడే ఆ బాలకుని రూపములో ప్రకటితు డగును. దుష్యంతా! నీవు నీ పుత్రుని భరించి పోషించుము. శకుంతలను అవమాన పరచ కుము. గర్భాధానము చేయు తండ్రియే పుత్ర రూపములో పుట్టును. దుష్యంతా! పుత్రుడు తండ్రిని యమలోకము నుండి ఉద్ధరించును. నీవే ఈ గర్భముయొక్క ఆధానము (స్థాపన) చేసిన వాడవు" అని ఆకాశవాణి చెప్పిన మాట సత్యము.

"జనమేజయా! ఆకాశవాణి ఆ బాలకుని భరణ-పోషణములుచేయు మని దుష్యంతునకు చెప్పియుండెను గనుక, యతని పేరు భరతుకు అని ప్రఖ్యాత

మయ్యెను. భరతుడు కాశికి రాజైన సర్వసేనుని పుత్రి 'సునంద'ను పెండ్లి యాడి, ఆమె గర్భము నుండి 'భుమన్యుడు' అను పుత్రుని కనెను. భుమన్యుడు దాశార్హ కన్యకయైన 'విజయ' అను నామెను చేసికొని ఆమెనుండి 'సుహోత్రు'ని కనెను. సుహోత్రుడు ఇక్ష్వాకుకుల కన్యకయైన 'సువర్ణ' అను నామెను చేసికొని ఆమెనుండి 'హస్తిన్' అను పుత్రుని కనెను. అతడే 'హస్తినాపుర'మను నగరమును నిర్మించెను. హస్తి నిర్మితము కాబట్టి ఆ నగరమునకు హస్తినాపురము అను పేరు ఏర్పడెను.

"రాజా! ఆ హస్తిరాజు త్రిగర్తరాజపుత్రియైన 'యశోధర'ను భార్యగా గొని ఆమెనుండి 'వికుంఠనుడు' అను పేరుగల పుత్రుని కనెను. వికుంఠనుడు దశార్హ కుల కన్యకయైన 'సుదేవ' అను నామెను చేసికొని ఆమె గర్భము నుండి 'అజమీఢ' నామక పుత్రుని కనెను. అజమీఢుడు 'కైకేయి - గాంధారి - విశాల - ఋక్ష' అను నలుగురు భార్యలను చేసికొని, నూట యిరువది నలుగురు పుత్రులను కనెను. ఆ పుత్రులందరు, వేరు - వేరు వంశములకు ప్రవర్తకులైరి. వారిలో సంవరణుడు, అనువాడు కురువంశమును ప్రవర్తిల్లజేసెను.

"జనమేజయా! సంవరణుడు సూర్య పుత్రియైన 'తపతి'ని వివాహము చేసికొని ఆమె గర్భము నుండి 'కురు' అను వానిని కనెను. కురుడు దశార్హ కుల కన్యకయైన 'శుభాంగి' యను నామెను పెండ్లియాడి, ఆమె నుండి 'విదూర' నామక పుత్రుని కనెను. విదూరుడు మధువంశ కన్యకయైన 'సంప్రియ' అను నామెను చేసికొని, 'అనశ్వ' నామక పుత్రుని కనెను. అనశ్వుడు మగధరాజ పుత్రియైన 'అమృత' అను నామెను పత్నిగా చేసికొని, ఆమె నుండి 'పరిక్షిత్తు' అను పుత్రుని కనెను. అతడు బాహుదరాజపుత్రియైన 'సుయశ' అను నామెను చేసికొని ఆమె నుండి 'భీమసేనుడు' అను పుత్రుని కనెను.

"జనమేజయా! భీమసేనుడు కేకయరాజ పుత్రియైన 'కుమారి' యను నామెను పెండ్లియాడి ఆమె గర్భము నుండి 'ప్రతిశ్రవసుడు' అను పుత్రుని కనెను. అతనికి 'ప్రతీపుడు' పుట్టెను. ప్రతీపుడు శిబిదేశ రాజ కన్యయైన 'సునంద'ను పత్నిగా చేసికొని యామె నుండి 'దేవాపి - శాంతను - బాహ్లీక' నామములు గల ముగ్గురు పుత్రులను కనెను.

"రాజా! దేవాపి బాలుడుగానే అడవికి పోయెను. కనుక, శాంతనుడు రాజుగా పట్టాభిషిక్తుడాయెను. శాంతనుడు చేతులతో స్పృశించిన వృద్ధులందరు మిక్కిలి సుఖశాంతులు కలిగి, మరల నవయువకు లయ్యెదరు. అతడు శాంతిని కలిగించువాడు గనుక 'శాంతనుడు' అని సార్థకనామము అతని కేర్పడెను.

"రాజా! శాంతనుడు భాగీరథియైన 'గంగ'ను భార్యనుగా బడసెను. ఆమె గర్భము నుండి శాంతనునకు 'దేవవ్రతు'డను పుత్రుడు పుట్టెను. అతనిని 'భీష్ముడు' అని యనెదరు.

"రాజా: భీష్ముడు తండ్రియైన శాంతనునకు ప్రియము చేయగోరి అతనితో 'సత్యవతి'కి వివాహము జరిపించెను. సత్యవతికి 'గంధకాలి' యని కూడ పేరు గలదు,

"రాజా! సత్యవతికి కన్యాత్వములోనే పరాశర మహర్షి నుండి'ద్వైపాయన వ్యాసుడు' జన్మించెను. తరువాత ఆ సత్యవతికే శాంతను మహారాజు వలన 'విచిత్రవీర్యుడు - చిత్రాంగదుడు' అను నిరువురు పుత్రులు కలిగిరి. చిత్రాంగదుడు యువకుడు అగుటకు పూర్వమే ఒక గంధర్వునిచేత చంపబడెను. విచిత్రవీర్యుడు రాజయ్యెను.

"రాజా! విచిత్రవీర్యుడు 'అంబిక - అంబాలిక' యను నిరువురను పెండ్లి చేసికొనెను. వారు కాశిరాజు పుత్రికలు. వారి తల్లి 'కౌసల్య' విచిత్రవీర్యునకు సంతానము అగుటకు పూర్వమే అతడు మరణించెను. అప్పుడు దుష్యంత వంశము నష్టమగును గదా!' యని సత్యవతి చింతించెను.

"రాజా! అప్పుడు సత్యవతి వేదవ్యాసుని తలచెను. అతడు వెంటనే రాగా, నతనితో, "పుత్రా! నీ తమ్ముడు విచిత్ర వీర్యుడు సంతాన హీనుడుగా మరణించెను. కనుక, నతని వంశము రక్షించుటకు నీవు ఉత్తమ సంతానము కనుము." అని సత్యవతి యనెను.

రాజా! వ్యాసుడు తల్లిమాట యంగీకరించి, 'ధృతరాష్ట్ర-పాండు-విదుర' నామకులను ముగ్గురు పుత్రులను కనెను. వారిలో ధృతరాష్ట్రునకు గాంధారీ

గర్భము నుండి నూరుగురు పుత్రులు, వ్యాసుని వరప్రభావము చేత పుట్టిరి. ఆ నూరుగురిలో 'దుర్యోధన - దుశ్శాసన - వికర్ణ-చిత్రసేన' నామకులు నలుగురు పుత్రులు ప్రధానులు.

"జనమేజయా! పాండునకు కుంతి భోజపుత్రియైన 'పృథ-' మాద్రి' యను నిద్దరు భార్యలుండిరి. ఒకనాడు పాండురాజు అడవికి వేటకై పోయి నప్పుడు అక్కడ మృగరూపధారియైన యొక ఋషి మృగరూపధారిణియైన తన పత్నితో సంగమము చేయుచుండెను. ఆ ఋషికి కామతృప్తి తీరకముందే పాండురాజు అతనిని బాణముతో కొట్టెను.

"రాజా! అట్లు గాయపడిన ఆ మునీశ్వరుడు పాండురాజును 'రాజా! నీవు గూడ స్త్రీ సంగమము చేయువాడవే. కామరసము నెరిగిన వాడవు. ఐనను, నీవు నన్ను కామరసతృప్తి దీరక ముందే కొట్టితివి. కనుక, నీవు గూడ స్త్రీ సంగమము చేయుచు కామరసతృప్తి దీరక పూర్వమే మరణించెదవు' అని శపించెను. ఆ శాపము విని పాండురాజు నిరుత్సాహుడై, శాపభయముచేత భార్యాసంబంధము విడిచి యుండి కుంతితో నిట్లనెను:-

"ప్రియే! నా చాపలముచేత నాకీ శాపము వచ్చెను. సంతాన హీనులకు పుణ్యలోక ప్రాప్తి లేదని వినినాను. కనుక నీవు నా కొరకు పుత్రులను కనుము" అని యనగా, కుంతీదేవి, యమధర్మరాజు నుండి యుధిష్ఠిరుని, వాయుదేవుని నుండి భీమసేనుని. ఇంద్రుని నుండి అర్జునుని కనెను. అట్లు ముగ్గురు పుత్రులను కనిన కుంతీదేవిని చూచి పాండురాజు సంతోషించి కుంతితో నిట్లనెను:-

"దేవీ! ఈ నీ సవతి సంతానహీనయైయున్నది. ఈమెకు కూడ సంతతి కలుగుటకు ఏర్పాటు చేయుము." ఇట్లు పాండురాజు చెప్పగా కుంతీదేవి అట్లేయగు గాక! యని చెప్పి, తనకు గల దేవతాహ్వాన విద్యను మాద్రికి గూడ నీయగా, నామెకు అశ్వినీకుమారుల వలన 'నకుల-సహదేవ' నామకులైన యిద్దరు కవల కొడుకులు పుట్టిరి.

"జనమేజయా! యిట్లుండగా నొకనాడు మాద్రి శృంగారించుకొని యుండుటచూచి, పాండురాజు ఆమె యందు ఆసక్తుడై, ఆమెను స్పృశించగనే అతని ప్రాణము పోయెను. తరువాత, పాండురాజు శవముతో పాటు మాద్రి

చితిపై నెక్కి సహగమనము చేయ నిశ్చయించి, కుంతీదేవితో 'సోదరీ! నా కవల కొడుకులను గూడ నీవు జాగ్రత్తతో లాలించి పాలింపుము' అని యనెను."

"రాజా! తరువాత ఆ వనము నందలి మునులు కుంతీ - పాండవులను హస్తినాపురికి తోడ్కొనిపోయి భీష్మ - విదురులకు ఒప్పగించిరి. అక్కడి ప్రజా సముదాయమునకు వనమునందు జరిగిన సమాచారమంతయు తెలిపి యా మునులు వెడలిపోయిరి. ఆ మునుల మాట విని ఆకాశమునుండి పుష్పవర్షము గురిసెను. దేవ దుందుభులు మ్రోగెను."

"రాజా! భీష్మ - ధృతరాష్ట్రులు ఆ బాలకులను స్వీకరించిన తరువాత పాండవులు తండ్రికి శాస్త్రోక్తముగా అపరకర్మలు చేసి, అక్కడనే ఉండిరి. దుర్యోధనుడు బాల్యావస్థ నుండియే పాండవులతో నుండుటకు సహించకుండెను."

"రాజా! పాపిష్ఠుడైన దుర్యోధనుడు రాక్షసబుద్ధిగలవాడై యెన్నియో ఉపాయములు చేసి పాండవులను సమూలముగా పెరకుటకు ప్రయత్నించు చుండెను. కాని, భవిష్యత్తులో జరగవలసిన దానికి అనుగుణముగానే యిప్పుడు జరిగితీరును. కనుక, దుర్యోధనాదులు పాండవులను నష్టపరచ జాలక పోయిరి."

"జనమేజయా! తరువాత, ధృతరాష్ట్రు డేదియో సాకుచేత పాండవులను 'వారణావత' నగరమునకు పంపదలచినప్పుడు, పాండవులు అంగీకరించిరి. అక్కడ గూడ వారిని లక్క యింటిలో కాల్చుటకు ప్రయత్నము చేయబడెను. కాని, పాండవులు విదురుని యుపదేశము ననుసరించి నడచుకొనుటచేత, శత్రువులు వారిని లక్క యింటిలో కాల్చజాలక పోయిరి."

"రాజా! పాండవు లచటి నుండి ప్రచ్ఛన్నముగా పోవుచు మార్గమధ్యములో హిడింబాసురుని వధించి, 'ఏకచక్రపురము'నకు పోయి బకాసురుని సంహరించి పాంచాల నగరమునకు పోయి ద్రౌపదిని పెండ్లియాడి, తిరిగి, తమ రాజధాని యైన హస్తినాపురమునకు వచ్చిరి."

"రాజా! అచట పాండవులకు ద్రౌపది నుండి యైదుగురు పుత్రులు కలిగిరి. యుధిష్ఠిరునకు 'ప్రతివింధ్యుడు', భీమసేనునకు 'సుతసోముడు'

అర్జునునకు 'శ్రుతకీర్తి', నకులునకు 'శతానీకుడు', సహదేవునకు 'శ్రుతకర్మ' యను పుత్రులు పుట్టిరి."

"జనమేజయా! ఈ యైదుగురుపుత్రులే కాక, యుధిష్ఠిరుడు శిబిదేశ రాజైన 'గోవాసనుని' పుత్రి 'దేవిక'ను స్వయంవరము నందు పొంది ఆమె గర్భమునుండి 'యౌధేయుడు' అను పుత్రుని కనెను. భీమసేనుడు గూడ కాశి రాజు పుత్రియైన 'బలంధర'ను పెండ్లియాడెను. ఆ కన్యకొరకు బల - పరాక్రమములు శుల్కముగా పెట్టబడి యుండెను. అనగా, అధిక బలవంతుడే ఆమెను పెండ్లి చేసికొనగలడు' అని నియమము పెట్టబడి యుండెను. భీమసేనుడా 'బలంధర' గర్భము నుండి'సర్వగుడు' అను పుత్రుని కనెను.

"రాజా! అర్జునుడు ద్వారకా నగరమునకు పోయి శ్రీకృష్ణునకు సోదరి యగు సుభద్రను పెండ్లియాడి, యామెతో తన రాజధానికి వచ్చి, ఆమె గర్భము నుండి, అత్యంత గుణసంపన్నుడైన 'అభిమన్యు'ని కనెను. ఆ బాలకుడు శ్రీకృష్ణభగవానునకు అతిప్రియుడుగా నుండెను. నకులుడు చేదిదేశ రాజపుత్రి యైన 'కరేణుమతి'ని పెండ్లియాడి యామె నుండి 'నిరమిత్ర' నామకుడైన పుత్రుని కనెను. సహదేవుడు గూడ మద్రదేశరాజు 'ద్యుతిమంతు'ని కుమారి యైన 'విజయ'ను స్వయంవరమునందు గైకొని యామె నుండి 'సుహోత్ర' నామముగల పుత్రుని గనెను. భీమసేనుడు పూర్వమే 'హిడింబ' నుండి 'ఘటోత్కచ' నామకుడైన రాక్షసుని కని యుండెను.

"జనమేజయా! యిట్లు పాండవులకు పదకొండుగురు పుత్రులుండిరి. ఆ యందరిలోను అభిమన్యుడు వంశకరు డాయెను. అతడు విరాట రాజపుత్రి యైన 'ఉత్తర'ను పెండ్లి యాడెను. అతనికి ఆమె గర్భము నుండి మరణించిన పుత్రుడు పుట్టెను. అప్పుడు శ్రీకృష్ణుడు ఆరు నెలలు మాత్రమే పెరిగిన ఆ మృత శిశువును కుంతీదేవియొడిలో ఉంచి, 'ఈ శిశువును బ్రతికించెద' నని కుంతీదేవిని ఊరడించెను.

"రాజా! అశ్వత్థామాస్త్రాగ్ని చేత నా శిశువు తల్లి కడుపునందే దగ్ధుడై పూర్ణముగా గర్భములో పెరుగక ముందే అసమయములో పుట్టెను. ఆ శిశువునకు బల - వీర్య పరాక్రమములు లేకుండెను. కాని, శ్రీకృష్ణ భగవానుడు తన

తేజస్సుచేత ఆ శిశువును బ్రతికించి, 'ఈ కులము పరిక్షీణమైన తరువాత నితడు జన్మించెను కాబట్టి, యీ బాలకుడు 'పరిక్షిత్' నామముతో ప్రఖ్యాతుడగును.' అని చెప్పెను.

"జనమేజయా! పరిక్షిత్తు నీ తల్లి 'మాద్రవతి'ని పెండ్లియాడి 'జనమేజయ' నామకుడవైన నిన్ను కనెను. నీ పత్నియైన 'వపుష్టమ' గర్భము నుండి 'శతానీకుడు - శంకుకర్ణుడు' అను నిద్దరు పుత్రులు జన్మించిరి. శతానీకుని భార్య "వైదేహి' (విదేహ రాజపుత్రి) గర్భము నుండి 'అశ్వమేధదత్త' నామక పుత్రుడు పుట్టెను.

జనమేజయా! ఇప్పుడు నీకు పూరువంశమును, పాండవ వంశమునున్ను గూర్చి వర్ణించి చెప్పితిని. ఆ రెండు వంశములు ధనము, పుణ్యమున్ను సంపాదించి పరమ పవిత్రములుగా నున్నవి. ఆ వంశ చరిత్రలు నియమ పరాయణులైన బ్రాహ్మణులు, ధర్మముతో ప్రజా పాలనము చేయు క్షత్రియులు, వైశ్యులు, ఈ మూడు వర్ణములకు సేవచేయు శూద్రులున్ను శ్రద్ధాళువులై వినవలెను. చదువవలెను.

జనమేజయా! మనస్సు వశము నందుంచుకొని, ఈర్ష్యను విడిచి, అందరి యెడల మైత్రీభావము కలిగి, వేదపరాయణుడై, పుణ్యకరమైన యీ యితిహాసము నంతయు, వినిపించి, లేక, వినినట్టి పుణ్యాత్ములు స్వర్గలోకమునకు పోయెదరు. అట్టివారు దేవ - బ్రాహ్మణ - మనుష్యులకు సర్వదా ఆదరణీయులై, పూజనీయు లయ్యెదరు.

జనమేజయా! బ్రాహ్మణాది వర్ణములవారు మత్సరము లేకుండ, మైత్రి కలిగి, వేదాధ్యయన సంపన్నులై, వ్యాసమహాముని చెప్పిన యీ పరమ పావనమైన మహాభారత గ్రంథమును శ్రద్ధతో వినిన యెడల, వారుగూడ స్వర్గమునకు పోయెదరు. ఈ కర్మ మేము ఎందుకు చేసితిమి? ఇది యెందుకు చేయలేదు?' అని దుఃఖింపవలసిన యవసరము వారికి ఉండదు. ఈ విషయములో ఈ సూక్తి చెప్పబడినది :-

"ఇదం హి వేదైస్సమితం పవిత్రమపి చోత్తమమ్ ।
ధన్యం యశస్య మాయుష్యం శ్రోతవ్యం నియతాత్మభిః ॥"

అనగా - ఈ మహాభారతము వేదములవలె పవిత్రము, ఉత్తమము, ఆయుర్ధన కీర్తి ప్రాప్తికరము నైనది. మనస్సును వశమునందుంచుకొనిన సత్పురుషులు సర్వదా దీనిని వినవలెను."

ఇట్లు వైశంపాయన మహాముని జనమేజయునకు చెప్పి తరువాతి వృత్తాంతము నిట్లు చెప్పదొడగెను :-

**మహాభిషునకు బ్రహ్మశాపము - శాపగ్రస్తులైన వసువులతో గంగ మాట్లాడుట :**

"జనమేజయా! 'ఇక్ష్వాకు' వంశములో జన్మించిన 'మహాభిష'డను సుప్రసిద్ధరాజు సత్యవాది, సత్యపరాక్రముడునై యుండెను. అతడు వేయి అశ్వమేధ యాగములు నూరు రాజసూయ యజ్ఞములున్ను చేసి ఇంద్రుని సంతోషపరచి యుండెను. ఆ యాగముల పుణ్యముచేత నతడు స్వర్గలోకమునకు పోయెను.

"రాజా! ఒకసారి సమస్త దేవతలు బ్రహ్మలోకమునందు బ్రహ్మదేవుని సేవించుచు నుండిరి. అక్కడ అనేక దేవర్షులు, మహాభిషరాజు గూడ నుండిరి. ఆ సమయ మందే నదీ శ్రేష్ఠురాలైన గంగాదేవి బ్రహ్మకడకు వచ్చెను. అప్పుడు వాయువు తాకిడిచేత గంగాదేవియొక్క వెన్నెల వంటి సూక్ష్మ వస్త్రము హఠాత్తుగా పైకి ఎగిరెను. అదిచూచి, దేవతలందరు తలవంచుకొని యుండిరి. కాని, మహాభిషుడు నిశ్శంకముగా దేవనదిని చూచు చుండెను.

"రాజా! అది కనిపెట్టి బ్రహ్మదేవుడు 'దుర్మతీ! నీవు మనుష్యులలో జన్మించి, మరల పుణ్యలోకములకు పోయెదవు. నీ మనస్సును హరించిన గంగ గూడ మనుష్యలోకములో జన్మించి నీకు ప్రతికూలముగా నాచరించ గలదు' అని యిరువురకున్ను శాపమిచ్చి, 'నీకు గంగపై కోపము వచ్చినప్పుడు నీవు గూడ శాప విముక్తుడ వయ్యెదవు.' అని యా రాజునకు శాపాంతము చెప్పెను.

"జనమేజయా! అప్పుడు మహాభిషరాజు అనేక రాజర్షులను తలచి, మహాతేజశ్శాలియైన 'ప్రతీప' మహారాజే తనకు తండ్రిగా చేసుకొనుటకు యోగ్యుడని నిర్ణయించుకొనెను.

గంగానది, మహాభిషరాజు ధైర్యచ్యుతు డగుట చూచి, యతనినే చింతించుచు తిరిగిపోయెను. మార్గమధ్యము నందు గంగాదేవి "వసు" దేవతలను చూచెను. ఆ వసువుల శరీరములు క్రింద పడుచుండెను. అప్పుడు గంగాదేవి వారితో 'మీ దివ్యరూపములు ఎందుకు నశించెను? దేవతలు క్షేమముగా నున్నారు గదా!' యని యడుగగా వసువులు గంగాదేవితో నిట్లనిరి:-

"దేవీ మేము చేసిన కొంచెము అపరాధమునకే వసిష్ఠమహాముని కోపముతో మమ్ము శపించెను— పూర్వ మొకప్పుడు వసిష్ఠుడు చెట్లచాటుగా నుండి సంధ్యోపాసన చేయుచుండగా, మేము అతనిని ఉల్లంఘించి పోయితిమి. ఆ మహర్షి యావునుగూడ నపహరించితిమి. అప్పుడు క్రోధముచేత నా మహాముని, మీరు మనుష్య యోనిలో పుట్టుడు' అని మమ్ము శపించెను.

"దేవీ! బ్రహ్మవాదియైన యా మహర్షిమాట మీర జాలనిది గనుక, నీవు భూమండలమునందు మనుష్యునకు పత్నివై, మమ్ము కనుము. మేము మనుష్య స్త్రీయోనిలో పడకుందుము గాక' యని నిన్ను ప్రార్థించుచున్నాము."

ఇట్లు వసువులు చెప్పగా, వారి మాట గంగాదేవి యంగీకరించెను. వారికి ఇట్లు సంవాదము జరిగెను:-

గంగ:- మనుష్య లోకమందు మీకు తండ్రికాగల శ్రేష్ఠపురుషు డెవడు కలడు?

వసువులు:- ప్రతీపమహారాజు పుత్రుడైన 'శాంతనుడు' ప్రపంచ ప్రఖ్యాతుడైన సత్పురుషుడు. మనుష్య లోకమునందు అతడు మాకు తండ్రి కాగలవాడు.

గంగ:- వసువులారా! మీ యభిప్రాయమే నాది గూడ! నేను శాంతను మహారాజునకు ప్రియముచేసి మీ యభీష్టము గూడ సిద్ధింపజేసెదను.

వసు:- త్రిలోకవాహిని యగు గంగాదేవీ! మేము నీకు పుట్టగనే మమ్ము నీ జలమునందు పడవేయుము. అట్లైన యెడల మేము త్వరగా మానవలోకము నుండి విముక్తులము కాగలము.

గంగ:- సరియే, అట్లే యగు గాక! కాని, ఆ రాజునకు నాతో పుత్రుల కొరకు చేసిన సంబంధము వ్యర్థము కాకూడదు. కనుక ఒక పుత్రుడైనను నతనికి ఉండునట్లు వ్యవస్థ చేయవలెను.

వసు:- దేవీ! మేమందరము మా తేజస్సులో నొక్కొక్క యష్టమాంశము ఇచ్చెదము. ఆ తేజస్సుచేత నీకు పుట్టబోవు ఆ యొక పుత్రుడు ఆ రాజుయొక్క ఇచ్ఛ ననుసరించి యుండగలడు. కాని, అతనికి మనుష్య లోకములో సంతానము కలుగదు. అతడు మహా పరాక్రమ సంపన్నుడగును.

"జనమేజయా! యీ విధముగా గంగాదేవితో నిబంధనము చేసికొని, వసువులు సంతోషముతో స్వేచ్ఛగా వెడలిపోయిరి.

**శాంతనుని జననము - రాజ్యాభిషేకము - గంగతో కలియుట:-**

"జనమేజయా! ప్రతీప మహారాజు రాజ్యమేలుచు సమస్త ప్రాణులకు హిత సాధనమునందే నిమగ్నుడై ఉండెను. ఒకనా డా రాజు గంగాద్వారము (హరిద్వారము)నకు పోయి యచట జపము చేయుచు నుండెను.

"అప్పుడు గంగ సుందరరూపము ఉత్తమ గుణములున్ను గల యువతి రూపముతో జలమునుండి వెడలి వచ్చి జప - తపస్స్వాధ్యాయ నిమగ్నుడైన ప్రతీపుని యొక్క శాల వృక్షమువంటి కుడి తొడపైన కూర్చొనెను. అప్పు డామె యాకృతి మిక్కిలి యాకర్షణీయముగా నుండెను. దేవతా తుల్యారూపము గలిగి యామె యుండెను. అప్పు డా రాజు 'కల్యాణీ! నీకు నేను ఏ ప్రియము చేయుదును? నీ యిచ్ఛ యేమి? యని యడగెను. అప్పుడా యిరువురకు నిట్లు సంభాషణ జరిగెను.

స్త్రీ :- రాజా! నేను నిన్ను కోరుచున్నాను. నీ యందే నాకు అనురాగము గలదు. కనుక నన్ను స్వీకరింపుము. కామవశురాలై తన కడకు వచ్చిన స్త్రీని సత్పురుషులు విడుచుట నింద్యమని చెప్పబడెనది.

ప్రతీపుడు :- సుందరీ! నేను కామవశుడనై పర స్త్రీ సంగమము చేయజాలను. ఇది నా ధర్మానుకూలమైన వ్రతము.

స్త్రీ :- రాజా! నేను అమంగళకరు రాలనుగాను. సమాగమమునకు గూడ అయోగ్య రాలనుగాను. ఎవరు గూడ నాపై కళంకము మోపజాలరు. నేను నీ యందు అనురక్తురాలనై వచ్చిన సుందర దివ్య కన్యకను. కనుక నన్ను నీవు స్వీకరింపుము.

ప్రతీ :- సుందరీ! నీవు ఏ మనోరథపూర్తికై నన్ను ప్రోత్సహించు చున్నావో, దాని నిరాకరణము గూడ నీవే చేసితివి. నే నొక వేళ ధర్మ విపరీత మైన నీ కోరిక నెరవేర్చిన యెడల ఈ ధర్మనాశము నన్ను గూడ నశింప జేయును. నీవు నా కుడి తొడపై కూరుచుంటివి. ఇది పుత్ర - పుత్రీ - స్నుష (కోడలు)లు మాత్రమే కూర్చొనదగిన యాసనము. పురుషుని యెడమ తొడయే కామినీ స్త్రీకి ఉపభోగయోగ్యమగుసు. కాని, నీవు దానిని విడిచితివి. కనుక నేను నీతో కామాచరణము చేయను. నీవు నా కోడలవు కమ్ము. నేను నా పుత్రుని కొరకు నిన్ను వరించెదను.

స్త్రీ :- "ధర్మజ్ఞా! నీవు చెప్పినట్లే కావచ్చును. నేను నీ పుత్రునితోనే సమాగమము చేసెదను. నీ యెడల నాకు గల భక్తిచేత నేను ప్రఖ్యాతమైన భరతవంశమును సేవించెదను. భూమండలము నందలి రాజు లందరకును మీరు ఆశ్రయభూతులు. మీ భరతవంశీయ గుణములను నేను నూరేండ్లలో గూడ వర్ణింపజాలను.

"రాజా! మీ కులములో గడచిన రాజులందరును సువిఖ్యాతులు. వారి సాధుత్వము అందరికన్నను మించి యున్నది. ధర్మజ్ఞా నేనొక కట్టడితో నీ పుత్రుని పాణిగ్రహణము చేసెదను. ఏమనగా, నేను ఏ పని చేసినను అతనికి అంగీకార్యముగా నుండవలెను. ఆ విషయములో నతడేలాటి ఆటంకము చేయ గూడదు. ఈ నిబంధనముతోనే నేను నీ పుత్రుని ప్రేమించెదను. నాకు నీ పుత్రుని నుండి పుట్టిన పుత్రుల ద్వారా నీ పుత్రునకు స్వర్గప్రాప్తి కలుగును.

"జనమేజయా! యిట్లు గంగాదేవి చెప్పిన మాటలు ప్రతీప మహారాజు 'తథాస్తు' అని యంగీకరించగా, గంగాదేవి యచటనే యంతర్ధానము చెందెను. తరువాత ప్రతీపుడు పుత్రజన్మకై యెదురు చూచు, ఆ మాట జ్ఞప్తికి రాగా; పుత్రుని కొరకు పత్నితో తపస్సు చేయసాగెను.

"అప్పుడు ప్రతీపుని పత్ని గర్భము నందు తేజస్వి యైన యొక శిశువు శరత్కాల శుక్లపక్ష చంద్రునివలె కాంతిమంతుడై, ప్రతిదినము పెరుగుచు వచ్చెను. తరువాత పదవ మాసము నందు ప్రతీప పత్ని దేవ సమానుడు, సూర్యునివలె ప్రకాశమానుడునైన పుత్రుని గనెను. ఆ వృద్ధ దంపతులకు 'మహాభిష' రాజే పుత్రుడుగా పుట్టెను. ఆ బాలకుడు శాంతుడైన తండ్రికి పుట్టినందు చేత 'శాంతనుడు' అను పేరుతో పిలువబడెను. ప్రతీప మహారాజు ఆ బాలకునకు జాతకర్మ - నామకరణాది సంస్కారములు పురోహితుల చేత వేదోక్త విధిగా చేయించెను.

"రాజా! ఆ బాలకుడు పెద్దవాడైన తరువాత ప్రజా రక్షణ కార్యము చేయ దొడగెను. శాంతనుడు ధర్మజ్ఞులలో శ్రేష్ఠుడై, వేద - ధనుర్వేదము లందు గూడ ఉన్నత పాండిత్యము సంపాదించి, వక్తలలో సర్వశ్రేష్ఠుడై, మెల్ల-మెల్లగా, యువావస్థకు చేరెను. శాంతనుడు, తన సత్కర్మల ద్వారా సంపాదించిన యక్షయ పుణ్యలోకములను స్మరించుచు, సర్వదా పుణ్యకర్మానుష్ఠానము నందే నిమగ్నుడై యుండెను.

"జనమేజయా! యువకుడైన శాంతనునకు ప్రతీపుడు, ఇట్లు ఆజ్ఞ యిచ్చెను.

"పుత్రా! పూర్వము నా కడ కొక దివ్యస్త్రీ నీ శ్రేయస్సు కొరకే వచ్చి యుండెను. ఆమె యొకవేళ ఏకాంతము నందు నీ యొద్దకు వచ్చి నీ యందు కామము గలదై, నీ నుండి పుత్రులను పొందగోరు నెడల, నీవు ఉత్తమ రూప - సౌందర్య శోభితురాలైన యా దివ్యస్త్రీని, నీ వెవతెవు? ఎవరి పుత్రివి? అని యడుగక, యామెను పెండ్లి యాడుము. ఆమె యే కార్యము చేసినను నీవు ఏ మాత్రము ప్రశ్నింపక, ఆమె యిచ్ఛానుసారముగా నడుచుకొనుము".

"జనమేజయా! ప్రతీప మహారాజు శాంతనున కిట్లు ఆజ్ఞ యిచ్చి, యప్పుడే తన రాజ్యమునందు శాంతనుని అభిషేకించి, తాను వనమునకు పోయెను.

"రాజా! ఇంద్రసమాన తేజశ్శాలి యైన శాంతనుడు క్రూరమృగ సంహారము కొరకు వనములో సిద్ధ - చారణ సేవితమైన గంగాతీరమునందు ఒంటరిగా సంచరించుచుండెను.

"రాజా ! ఇట్లుండగా నొకనాడు, అతడు రెండవ లక్ష్మీదేవియా యనునట్లు తేజస్వినిగా నున్న యొక పరమసుందరిని చూచెను. ఆమె సర్వావయవములు నిర్దోషములుగా నుండెను. దివ్యభూషణ భూషితురాలై, సూక్ష్మవస్త్రము ధరించి, కమలమధ్యకాంతి గలదై యొంటరిగా నచట తిరుగాడు చుండెను.

"జనమేజయా! ఆ సుందరిని చూడగనే శాంతనునకు పులకాంకురములు పొడమి, ఆమె రూపసంపదకు ఆశ్చర్యచకితుడై, లేచి, ఆమె సౌందర్యామృత మును కనులతో నెంతగా పానము చేసినను, తృప్తిదీరకుండెను. ఆమె గూడ నచట సంచరించుచు మహా తేజశ్శాలియైన శాంతనుని చూచి, మోహము చెందెను. నామెకు అతని యెడల సౌహార్దము కలిగెను. అతనిని ఎంతగా చూచినను నామెకు తృప్తిదీరకుండెను.

"జనమేజయా! అప్పుడు శాంతను డామెను శాంతపరచుచు మధురముగా నిట్లనెను :-

"సుందరీ! నీవు 'దేవ - దానవ - గంధర్వ - అప్సరస్ - యక్ష - నాగ - మానవ' స్త్రీలలో నెవతెవైన నేమి? దేవకన్యవలె సుశోభిత సుందరివిగానున్నావు. 'నా పత్నివి కమ్ము' అని నిన్ను యాచించుచున్నాను".

**గంగా - శాంతనుల సమాగమము - వసువుల జన్మము - వారి శాపోద్ధారము - భీష్ముని జననము :**

"జనమేజయా! శాంతనుని మధురస్మిత వచనములు విని గంగాదేవి, యతని కడకుపోయి తాను వసువులకు చెప్పిన మాట స్మరించి, ప్రతీపుని మాట గూడ గుర్తుంచుకొని, యిదియే యుక్త సమయమని తలచి, సంతానేచ్ఛ చేత నతనితో మధురముగా, "రాజా! నేను నీ రాణినై, నీ యధీనములో నుండెదను" అని చెప్పెను.

"కాని యొక కట్టడి కలదు. ఏమనగా, నేను మంచి చేసినను, చెడు కార్యము చేసినను నన్ను నీవు నివారింపగూడదు. నాతో నెప్పుడు గూడ అప్రియము లాడగూడదు. ఇట్లు నీవు నడచుకొనినప్పుడే నేను నీ యొద్ద నుండెదను. నీవెప్పుడైన నా కార్యము నాపినప్పుడుగాని, నాతో అప్రియములు మాట్లాడి నప్పుడు గాని, నేను నిన్ను విడిచెదను. ఇది తప్పదు".

"జనమేజయా! యిట్లు గంగాదేవి చెప్పగా, శాంతను డంగీకరించెను. అప్పుడా రాజును గంగపతిగా పొంది యానందించెను. శాంతను డామెను రథముపై తన రాజధానికి తోడ్కొనిపోయి యామెతో నిక్షేపభోగములనుభవించు చుండెను. తండ్రి యాజ్ఞానుసారము ఆమెను ఏమియు నడుగకుండెను. ఆమె యొక్క యుత్తమ స్వభావ - సత్ప్రవర్తన - రూప - ఔదార్య - సద్గుణ - ఏకాంత సేవలచేత శాంతనుడు మిక్కిలి సంతుష్టుడైయుండెను.

"జనమేజయా! అతనికి భాగ్యవశాత్తు స్వేచ్ఛగా సుఖము తనంతట లభించి యుండెను. గంగాదేవి, తన హావ - భావములతో, సంభోగ చాతుర్యముతో, ప్రణయ చాతుర్యముతోను ఆ రాజును రమింపచేయుచు నుండెను. ఆమె యుత్తమ గుణములచేత, ఆ రాజు చిత్తమును దొంగిలించెను. కనుక, ఆ రాజు ఆమెతో రతిభోగములందు ఆసక్తుడయ్యెను. ఈ విధముగా నెన్నియో యేండ్లు ఋతువులు, మాసములున్ను గడచెను. కాని, యామె యందు ఆసక్తుడగుటచేత శాంతనునకు ఆ కాలగమన మేమాత్రమున్ను తెలియకుండెను.

"జనమేజయా! శాంతను మహారాజు ఆమె గర్భము నుండి దేవ సమాన తేజశ్శాలురైన యెనమండుగురు పుత్రులను కనెను. కాని, పుట్టిన కొడుకుల నందరను గంగాజలములో త్రోసి యా పుత్రునితో, 'వత్సా! యీ విధముగా నిన్ను శాపవిముక్తుని జేసి, నీకు సంతోషము కలిగించుచున్నాను' అని చెప్పుచుండెను. పత్నియొక్క యీ ప్రవర్తన చూచి, శాంతనునకు బాధ కలిగెను. ఐనను, ఆమె తనను విడిచిపోవునను భయముచేత నేమియు ననకుండెను.

"రాజా! యిట్లు గంగాదేవి యేడుగురు పుత్రులను గంగలో త్రోసి, ఎనిమిదవ కొడుకు పుట్టిన వెంటనే, యతడు నవ్వుచ్చు, భార్యతో పుత్ర ప్రాణరక్ష చేచ్ఛతో దుఃఖించుచు, 'ఓసీ! ఈ బాలకుని వధింపకుము. నీవు ఎవరి బిడ్డవు? ఎవతెవు? నీ కొడుకులనే యెందుకు చంపుచున్నావు? పుత్రఘాతీ! నీకు నింద్యము మహాఘోరమునైన పుత్రహత్యా పాపము కలిగెను.' అనియనెను.

జనమేజయా! యిట్లు శాంతనుడనగా, గంగాదేవి యతనితో నిట్లనెను :-

"రాజా! నీవు పుత్రవంతులలో శ్రేష్ఠుడవు. నేను ఈ నీ పుత్రుని చంపను. కాని, యిక్కడ నేనుండ వలసిన సమయము సమాప్తమైనది. తొలుతనే నేను

నీతో ఈ నిబంధనము చేసియుంటిని గదా! నేను 'జాహ్ను' మహర్షి పుత్రికను. మహాముని సేవితయైన గంగను. దేవతల కార్యము నెరవేర్చుటకు నేను నీతో నుంటిని. ఈ నీ యెనమండుగురు పుత్రులు 'వసు' దేవతలు. వసిష్ఠ మహాముని శాపదోషము చేత ఈ వసువులు మనుష్య యోనితో పుట్టిరి. ఈ వసువులకు తండ్రి కాదగినవా డీ భూమండలములో నీవుదప్ప మరియొకడు లేకుండెను. ఇట్లే, భూలోకమునందు వీరిని గర్భము నందు ధరించుటకు నావంటి మనుష్య స్త్రీ లేకుండెను. కనుక, ఈ వసువులకు తల్లి యగుటకు నేను మనుష్య శరీరము ధరించి వచ్చితిని.

''రాజా! నీవు ఎనమండుగురు వసువులను కని, అక్షయ పుణ్యలోకములను జయించితివి. 'వసువు లందరు పుట్టగనే వారికి మనుష్య యోని నుండి విముక్తి కలిగించుటకు వసుదేవతలు నాతో నొక నిబంధనము చేసికొని యుండిరి. వారి కోరిక తీర్చుటకై నేను ప్రతిజ్ఞచేసి యుంటిని. కనుకనే, యిప్పుడా వసువులు 'ఆపవుని' (వసిష్ఠుని) శాపము నుండి నిముక్తులైరి. రాజా! నీకు శుభమగు గాక! ఇక నేను నిన్ను విడిచి పోయెదను. మహావ్రతధారియైన యీ పుత్రుని పాలింపుము.

''శాంతను రాజా! యీ యెనిమిదవ పుత్రుడు వసువుల పరాక్రమముతో గూడి, తన కులమునకు ఆనందవర్ధను డగుటకు నవతరించెను. ఈ బాలకుడు బల పరాక్రమములలో నితరు లందరను మించి యుండగల డనుటలో సందేహము లేదు. ఈ బాలకునియందు వసువులలో ప్రతియొకని యంశము గలదు. నేను వసువులను, 'రాజున కొక పుత్రుడు జీవించి యుండవలె'నని నీకొరకు ప్రార్థించి యుంటిని. ఇతడు నా పుత్రుడని తలచి, యితనికి 'గంగాదత్తుడు' అని పేరు పెట్టవలెను.

''జనమేజయా! గంగాదేవి యిట్లు చెప్పగా, శాంతను డామెతో నిట్లనెను:-

## వసిష్ఠ మహర్షి వసువులకు శాప మిచ్చిన వృత్తాంతము :-

''దేవీ! 'ఆపవ' నామకుడైన మహాత్ము డెవడు? వసువు లతనికి ఏ యపరాధము చేసిరి? ఆపవుని శాపముచేతనే కదా వసువులందరు మనుష్య యోనిలో రావలసి వచ్చెను. నీవు నాకిచ్చిన యీ పుత్రుడు ఏ కర్మఫలముచేత మనుష్య లోకము

నందు నివసించును? వసువులు సర్వలోకా ధీశ్వరులు కదా! అట్టివా రెట్లు మనుష్య లోకములో జన్మించిరి? ఆ వివరము లన్నియు తెలుపుము.

"జనమేజయా! శాంతను డిట్లడుగగా, గంగాదేవి యతనితో నిట్లనెను:-

"మహారాజా! పూర్వము వరుణదేవుడు పుత్రునిగా బడసిన వసిష్ఠుడే 'ఆపవ' నామముచేత విఖ్యాతుడై యుండెను. మేరు పర్వత పార్శ్వము నందు ఆ మహాముని యాశ్రమము గలదు. అక్కడ మృగ-పక్షులు నిండి యుండును. అన్ని ఋతువులందు పూచు పువ్వులు ఆ యాశ్రమ శోభను వృద్ధిపొందించు చుండును. ఆ యాశ్రమ వనమందు రుచికరములైన ఫల-మూల-జలములు పుష్కలముగా లభించు చుండెను. పుణ్యాత్ములలో శ్రేష్ఠుడు, వరుణ నందనుడునైన వసిష్ఠ మహర్షి ఆ యాశ్రమమునందే తపస్సు చేయు చుండెను.

"శాంతను మహారాజా! 'సురభిదేవి'యని విఖ్యాతురాలైన దక్ష ప్రజాపతి కూతురు కశ్యపుని సహవాసము చేత నొక గోవును కనెను. ఆ గోవు సమస్త జగత్తును అనుగ్రహించుటకు జన్మించి కోరిక లన్నియు తీర్చునదిగా నుండెను. వరుణ పుత్రుడైన వసిష్ఠు డా గోవును తన హోమధేనువుగా బడసెను. సమస్త ముని సేవితమైన యా గోవు పవిత్రము, రమణీయము నైన యా తపోవన మందు ఉండి నిర్భయముగా అన్నివైపుల సంచరించు చుండెను.

"రాజా! యిట్లుండగా, నొకనాడు 'పృథు' మొదలైన వసువులు, సర్వ దేవతలున్ను వచ్చి, తమ స్త్రీలతో ఆ వనమునం దంతటను తిరుగుచు, సుందర గిరులపై వనములందున్ను రమించు చుండిరి. ఆ వసువులలో నొకని భార్య వనములో తిరుగుచు ఆ గోవును చూచి, ఆ 'నందినీ' ధేనువు యొక్క శీల సంపత్తికి మిక్కిలి ఆశ్చర్య చకితురా లయ్యెను.

"రాజా! ఆ గోవును ఆ వసుపత్ని 'ద్యౌ' అను పేరు గల తన పతికి చూపి, "అది మిక్కిలి బలిసి యున్నది. దాని స్తనములు దుగ్ధభరితములై సుందరములుగా నున్నవి. దాని గిట్టలు, పుచ్ఛమున్ను చాల బాగున్నవి. గోవు సమస్త సద్గుణ – శీల సంపన్నమై యున్నది. కనుక, దానిని నాకు తెచ్చి యిమ్ము" అని కోరెను. వెంటనే యతడు తన పత్నితో నిట్లనెను :-

"దేవీ! కాటుక కన్నులు గల యీ గోవు దివ్యధేనువు. ఇది యీ తపోవనమునకు అధిపతి యైన వరుణ పుత్రుడు వసిష్ఠ మహామునిది. ఈ యావుపాలు త్రాగినవాడు పదివేల యేండ్లు యువకుడుగానే జీవించి యుండును."

"శాంతను రాజా! అట్లు ద్యోవసువు చెప్పగా విని యామె యిట్లనెను :-

"ప్రాణనాథా! మనుష్యలోకమునందు సత్య ప్రతిజ్ఞుడైన 'ఉశీనర' రాజర్షి పుత్రియైన 'జితవతి' యను రాజకుమారి నా ప్రియసఖి యున్నది. ఆమె సుందర రూప యౌవనములతో శోభిల్లు చుండును. మనుష్య లోకములో నామె రూప సంపద మిక్కిలి ప్రఖ్యాతమై యున్నది. ఆమెకొరకే యీ ఆవుదూడలను కోరు చున్నాను. ఈ యావును శీఘ్రముగా తెచ్చియిమ్ము. దీని పాలుత్రాగి ఆ నా సఖి యొకతెయే మనుష్యలోకమునందు ముసలితనము, రోగములున్ను లేక యుండ గలదు. నాకు ఇంతకన్నను ప్రియతరమైన కార్యము మరియొకటి లేదు. కనుక ఈ నా కోరిక తీర్చుము."

"శాంతను రాజా! ఆ దేవి మాట విని యామెకు ప్రియము చేయదలచి, ద్యో వసువు పృథ్వాదులైన తన సోదరుల సహాయముతో ఆ గోవును అపహరించెను. కాని, అప్పుడు అతడు వసిష్ఠ మహాముని తీవ్రతపస్సు ప్రభావమును గమనించ బూనలేదు. ఆ మహర్షి కోపమువలన తనకు స్వర్గమునుండి పతన మగుననికూడ ద్యో యోచించలేదు."

"రాజా! తరువాత కొంత కాలమునకు వరుణనందనుడైన వసిష్ఠుడు ఫల - మూలములను తీసుకొని తన యాశ్రమమునకు వచ్చి యచట యావు దూడలను గానక ఆ వనమంతట వెదకినను నతనికి ఎక్కడగూడ గోవు కనబడలేదు. అప్పుడాముని దివ్యదృష్టితో చూచి, 'వసువులు దాని నపహరించి' రని తెలిసికొనెను. అతి క్రోధముతో 'వసువులు మనుష్యయోనిలో జన్మించెదరు గాక!' యని వారి నందరను శపించెను.

"శాంతను మహారాజా! యీ విధముగా వసిష్ఠ భగవానుడు క్రోధావేశముతో శాపమిచ్చి తపస్సులో నిమగ్నుడయ్యెను. ఆ మహర్షి ప్రభావము చాల గొప్పది. కనుకనే, దేవతలైనను వారికి శాపమిచ్చెను. ఆ సంగతి తెలిసిన

తరువాత వసువులను వసిష్ఠాశ్రమమునకు పోయి యా మహర్షిని ప్రసన్నుని చేయుటకు ప్రయత్నించినను ఆయన యనుగ్రహము బడయజాలక పోయిరి. అప్పుడు వసిష్ఠుడు వారితో నిట్లనెను:-

"వసువులారా! 'ధరుడు' మొదలైన మీ వసువు లందరకు నేను శాప మిచ్చితిని. కాని, మీరు ప్రతిసంవత్సర మొక్కొక్కరుగా నందరున్ను శాప విముక్తు లయ్యెదరు. కాని, యీ ద్యోవసువు కారణముగా మీ కందరకు శాపము వచ్చెను. గనుక, యితడు మనుష్య లోకమునందు, తన కర్మానుసారముగా, చాలకాలము నివసించును. నేను క్రోధముతో మీకిచ్చిన శాపము అసత్యము చేయ గోరను. ఈ ద్యోవసువు మనుష్య లోకమునందు సంతానోత్పత్తి చేయడు. కాని, యితడు ధర్మాత్ముడై, సర్వశాస్త్ర విద్వాంసుడై, తండ్రికి ప్రియ - హితములు చేయుట యందు తత్పరుడై స్త్రీ సుఖములను విడువ గలడు."

"మహారాజా! యిట్లు చెప్పివసిష్ఠుడు వెడలిపోయిన తరువాత వసువు లందరు నాకడకువచ్చి," గంగా! మేము పుట్టిన వెంటనే నీవు మమ్ము నీ జలములో పడవేయుము' అని నన్నుకోరగా, వారి కోరిక నెరవేర్చితిని. రాజా! వారి శాప విముక్తులై వేనట్లు చేసితిని. ఈ ద్యో ఒక్కడే మహర్షి శాపముచేత చాలకాలము మనుష్య లోకమునందు నివసించును.

"రాజా! ఈ నాపుత్రుడు 'దేవవ్రత-గంగాదత్త'నామద్వయముచేత ప్రఖ్యాతు డగును. నీ యీ బాలుడు నీ కంటెను నధిక గుణసంపన్నుడు కాగలడు. ఇక నేను పోయెదను. ఈ నీ పుత్రుడింకను శిశువుగానున్నాడు ఇతడు పెద్దవాడై నపిదప నీ కడకు రాగలడు. నీవు నన్ను పిలిచినప్పుడు వెంటనే నీ యొద్దకు వచ్చెదను"

"జనమేజయా! యీ విషయము లన్నియు చెప్పి, గంగాదేవి ఆ శిశువును తన వెంట నిడుకొని యక్కడనే యంతర్థానము చెందెను.

"రాజా! ఆ బాలకుడు 'దేవవ్రతుడు-గాంగేయుడు నని రెండు పేర్లు గల వాడాయెను. ఆ 'ద్యు' 'ద్యు'అను వానిపేరే 'ద్యో' అనికూడ నున్నది. ఈ రెండు పేర్లు కలవాడే. ద్యు అను వసువు శాంతను పుత్రుడై తండ్రిని మించిన గుణవంతు డయ్యెను. శాంతనుడు శోకార్తుడై, తన నగరమునకు పోయెను."

**శాంతనుని ప్రశంస - అతడు గంగాదేవి చేత సుశిక్షితుడైన పుత్రుని బడయుట - దేవవ్రతుని భీష్మ ప్రతిజ్ఞ :-**

"జనమేజయా ! మహాభారత నామముతో ప్రఖ్యాతమైన యితిహాసమునకు ముఖ్యకారణుడైన రాజును గూర్చి వర్ణించి చెప్పెద వినుము :-

"శాంతను మహారాజు మిక్కిలి బుద్ధిమంతుడై యుండెను. అతనిని దేవతలు, రాజర్షులు గూడ సత్కరించు చుండిరి. సమస్త ప్రపంచములో 'నతడు సత్యవాది' యని ప్రసిద్ధి కెక్కెను. అతనికి 'ఇంద్రియ నిగ్రహము, దానము, ఓర్పు, బుద్ధి, లజ్జ, ధైర్యము, తేజస్సు, ఈ మొదలైన సద్గుణము లుండెను. ఇట్టు ఉత్తమ గుణసంపన్నుడై ధర్మార్థములను సాధించుటతో సమర్థుడైన శాంతనుడు భరతవంశమును ప్రజల నున్ను పాలించుచుండెను.

"జనమేజయా ! శాంతనుడు అజానుబాహు సుందరవిగ్రహము గలవాడై, మదగజ సమాన పరాక్రమ శాలియై ఉండెను. అతనికి అన్ని రాజ లక్షణములు ఉండెను. అతని సత్ప్రవర్తనము, ధర్మపరిపాలనమున్ను చూచి మనుష్యులు అర్థకామముల కంటె ధర్మమే శ్రేష్ఠమని తలచుచుండిరి. అతనివలె ధర్మసమ్మతముగా రాజ్యపాలనము చేయువాడు మరి యొకడు లేకుండెను. కనుక, సమస్త రాజులు శాంతనుని సార్వభౌమ పదము నందు అభిషిక్తుని జేసిరి. తరువాత, దేశము నందు ఎవరికి గూడా దుఃఖము, భయమున్ను మానసిక సంతాపము లేకుండెను. అందరు సుఖముగా నుండిరి.

"జనమేజయా ! ఇంద్రసమాన పరాక్రమ సంపన్నుడై, కీర్తిమంతుడైన శాంతనుని శాసనమునం దుండిన రాజులు గూడ యజ్ఞ దానాది కర్మలు చేయుట యందు ప్రవృత్తి గల వారైరి. ఆ సమయము నందు దేశములో అన్ని వర్ణముల వారు తమ - తమ వర్ణధర్మముల ప్రకారము నడచుకొనుచుండిరి. క్షత్రియులు, బ్రాహ్మణులను సేవించుచుండిరి. వైశ్యులు, బ్రాహ్మణ క్షత్రియుల యందు అనురక్తులై యుండిరి. శూద్రులు, బ్రాహ్మణ క్షత్రియుల యందు అనురాగము గలవారై వైశ్యులను సేవించు చుండిరి.

"జనమేజయా! శాంతను మహారాజు హస్తినాపురమునందు నివసించుచు సముద్ర పర్యంత భూమండలమును పాలించుచుండెను. అతడు ఇంద్రునివంటి

పరాక్రమము గలవాడై, ధర్మజ్ఞుడై, సత్యవాదియై, సరళుడుగా నుండెను. అతని యందు "దాన-ధర్మ-తపస్సులు' ఈ మూడింటి సంబంధము చేత దివ్య కాంతి వృద్ధి పొందుచుండెను. అతనికి రాగ ద్వేషములు లేకుండెను. చంద్రుని వలె నతని దర్శనము అందరికి ప్రియమై యుండెను. అతడు తేజస్సునందు సూర్యు నితో, వేగమునందు వాయువుతో, క్రోధమునందు యమరాజుతో, ఓర్పునందు పృథివితో సమానుడుగా నుండెను."

"జనమేజయా! శాంతనుడు రాజ్యము నేలుచున్నప్పుడు పశు-వరాహాది మృగములు, పక్షులున్ను చంపబడకుండెను. అతని రాజ్యములో బ్రహ్మ (వేదము) - ధర్మములకు ప్రాధాన్యముండెను. శాంతనుడు వినయశీలుడై, కామ-రాగాది-దోషరహితుడై యుండెను. సమస్త ప్రాణులను సమాన భావముతో ఏలుచుండెను.

"రాజా! ఆ దినములందు దేవ యజ్ఞము, ఋషి యజ్ఞము, పితృ యజ్ఞ మున్ను సక్రమముగా జరుగుచుండెను. అధర్మ భయము చేత ఏ ప్రాణి వధ గూడ జరుగకుండెను. 'దుఃఖితులు, అనాథులు, పశుపక్ష్యాదులు' ఈ సమస్త ప్రాణులను శాంతనుడు తండ్రివలె పాలించుచుండెను."

"రాజా! శాంతనుని రాజ్యమునందు అందరు సత్యము మాట్లాడుచుండిరి. అందరి మనస్సులు దాన-ధర్మములందు ఆసక్తి గలిగియుండెను. శాంతను మహారాజు ముప్పదినాలుగు సంవత్సరముల వయస్సుదాక స్త్రీ సంబంధము లేక వనమునందు ఉండెను. వసువు యొక్క అవతారభూతుడైన గాంగేయుడు శాంతనునకు పుట్టెను. అతనికి 'దేవవ్రతుడు' అని పేరు ఉండెను. తండ్రివలెనే దేవవ్రతుడు గూడ సదాచార వ్యవహారములతో నడచుచు విద్యా సంపన్నుడై యుండెను. అతడు, లౌకికాలౌకికములైన శస్త్రాస్త్ర కళయందు పారంగతుడై యుండెను. అతని బల-సత్త్వ(ధైర్యము)-వీర్య(పరాక్రమ)ములు మిక్కిలి గొప్పవిగా నుండెను.

"జనమేజయా! శాంతను మహారాజు ఒకనాడు వేటలో ఒక క్రూర మృగమును బాణముతో కొట్టి, దానినిని తరుముచు గంగా తీరమునకు వచ్చి ఆ

నదీ జలము చిన్నగా పారుచుండుట చూచి, ఆశ్చర్యపడి దానికి కారణము తెలియగోరుచుండెను. అప్పు డక్కడ సుందర శరీరముతో, ఇంద్ర సమాన దేహ కాంతితో దివ్యాస్త్రములను అభ్యసించుచు ఒక బాలకుడు గంగా ప్రవాహమును అడ్డగించి యుండుట చూచెను. ఆ బాలకుని యలౌకిక కర్మ చూచి, శాంతనునకు మిక్కిలి ఆశ్చర్యము కలిగెను."

"రాజా! ఆ బాలకుడు శాంతను పుత్రుడే. కాని అతడు పుట్టినప్పుడే యతనిని చూచి యుండెను. కనుక, అతనినిప్పుడు గుర్తుపట్టజాలకుండెను. ఆ బాలకుడు తన తండ్రిని చూచి మాయచేత మోహితుని చేసి అంతర్ధానము చెందెను. ఆ యద్భుతము చూచిన శాంతనునకు సందేహము కలిగి గంగతో "తన పుత్రుని చూపు'మని యడిగెను."

"రాజా! అప్పుడు గంగ సుందర స్త్రీరూపధారిణియై, తన పుత్రుని కుడి చేయి పట్టుకుని శాంతనుని యెదుటకు వచ్చి దివ్య వస్త్రాభరణ భూషితుడైన దేవవ్రత కుమారుని చూపించెను. ఆమె గూడ దివ్యాభరణభూషితమై, స్వచ్ఛ - సుందర వస్త్రము ధరించియుండెను. తొలుత ఆమెను అతడు చూచియుండినను గురుతు పట్టజాలనంతగా ఆమె సౌందర్యము పెంపొంది యుండెను. అప్పుడు గంగ, శాంతనునితో నిట్లనెను :-"

"మహారాజా! పూర్వము నీవు నానుండి కనిన వారిలో ఇతడు ఎనిమిదవ కొడుకు. ఇతడు సమస్త శస్త్రాస్త్ర విదుడు. ఇతనిని నేను పాలించి పోషించితిని. ఇప్పుడు ఈ నీ పుత్రుని గ్రహించి ఇంటికి తోడుకొని పొమ్ము. ఈ నీ పుత్రుడు వసిష్ఠ మహాముని కడ సమస్త వేదములు షడంగ సహితముగ అధ్యయనము చేసెను. ఇతడు అస్త్రవిద్యా పండితుడు. యుద్ధము నందు ఇంద్ర సమాన పరాక్రమశాలి. ఇతనిని దేవాసురులు గూడ సమ్మానించెదరు. శుక్రాచార్యుని నీతి శాస్త్రమును పరిపూర్ణముగ నేర్చినవాడు. అట్లే బృహస్పతి నీతిశాస్త్రము గూడ సాంగోపాంగముగ నితనికి తెలియును. పరుశురాముని నుండి అస్త్రవిద్య కూడ నితడు నేర్చినాడు. రాజధర్మ - అర్థశాస్త్రము లందు మహాపండితుడు. ఇట్టి పుత్రుని నీకు నర్పించుచున్నాను. ఇంటికి తోడుకొని పొమ్ము."

"జనమేజయా! యట్లు చెప్పి గంగాదేవి యంతర్ధానము చెందెను. ఆమె యాజ్ఞ ప్రకారము శాంతనుడు సూర్య సమాన ప్రకాశము గల తన పుత్రుని తోడ్కొని రాజధానికి పోయెను. అతని హస్తినాపుర రాజధాని ఇంద్రుని అమరావతివలె సుందరముగా నుండెను. రాజు పుత్రునితో నచటికి పోయి తనను సఫల మనోరథునిగా తలచెను.

"రాజా! తరువాత అందరకు అభయమిచ్చువాడు, మహాత్ముడు, గుణవంతుడు నైన పుత్రుని రాజకార్యములందు సహకరించుటకు సమస్త పౌరవుల మధ్య యువరాజుపదవి యందు పట్టాభిషిక్తుని జేసెను. ఆ బాలకుడు తన యాచార (సత్ప్రవర్తన) వ్యవహారముల చేత తండ్రికి, సమస్త పౌరవులకు, రాష్ట్రమునకున్ను సంతసము కూర్చెను. శాంతనుడు గుణవంతుడైన పుత్రునితో ఆనందమనుభవించుచు నాలుగు సంవత్సరములు గడిపెను.

"జనమేజయా! శాంతను డొకనాడు యమునానదీ సమీప వనమునకు పోయి, యచట అపూర్వము, అవర్ణనీయమునైన సుగంధము నాఘ్రాణించెను. ఆ పరిమళము వచ్చినచోటు కనుగొనుటకు అంతట సంచరించుచు నచట నొక 'దాశ' (చేపలుపట్టు జాలరి) కన్యను చూచెను. ఆమె దేవాంగన వంటి రూపము గలదై యుండెను. అప్పుడు శాంతనుడు ఆమెను, 'నీ వెవరవు? ఎవరి పుత్రివి? ఏమి చేయుచున్నావు?' అని యడిగెను. ఆమాట కామె, 'రాజా! నేను 'నిషాద' కన్యను. నా తండ్రి నిషాదరాజు యొక్క యాజ్ఞచేత ధర్మార్థము ఇచట పడవ నడుపుచున్నాను' అని యనెను.

"రాజా! అప్పుడు శాంతనుడు, 'రూప-మాధుర్య-సుగంధములు గల యా దాశకన్యను పొందదలచి, ఆమె తండ్రికడకు పోయి, యామెను వరించెద' నని చెప్పగా నిషాదరాజు శాంతనునితో నిట్లనెను:-

"రాజా! ఈ కన్యక పుట్టినప్పటి నుండి 'ఈమె వివాహమొక శ్రేష్ఠ వరునితో చేయవలె'నని చింతించుచు నొక కోరిక గలిగి యుంటిని. నీ కన్న ఉత్తమవరు డీమెకు లభించడు. ఐనను నొక నిబంధనముతో నీమెను నీ సేవకు గాను సమర్పించెదను. నీవు సత్యవాదివి కనుక, సత్యమును ముందిడుకొని

నా కోరిక నెరవేర్చుటకు ప్రతిజ్ఞ చేసిన యెడల, నీ యిచ్ఛమేరకు ఈమెను నీ కిచ్చి వివాహము చేసెదను." ఆ మాట విని శాంతనుడు అతనితో "నిషాద రాజా! తొలుత నీ యభీష్టము తెలిసిన తరువాత నీ కోరిక విషయమై నిశ్చయించెదను. అది తీర్చుటకు యోగ్యమైన యెడల తీర్చెదను. అట్లు కానిచో, నెప్పుడుగూడ దానిని చేయజాలను" అని యనగా, దాశరాజు శాంతనునితో, 'రాజా! ఈమెకు పుట్టబోవు పుత్రుని నీ యనంతరము నీ రాజ్యమునందు పట్టాభిషిక్తుని చేయవలెను. ఇతరుని చేయగూడదు.' అని యనెను."

"జనమేజయా! శాంతనుడు తీవ్ర కామాగ్నిచేత జ్వలించు చుండెను. ఐనను, నిషాదునకు ఆ వరమిచ్చుటకు ఇచ్ఛయించకుండెను. కామవేదనచేత అతని మనస్సు చంచలమై యుండెను. ఆ నిషాదకన్యకనే చింతించుచు నప్పుడతడు హస్తినాపురమునకు వచ్చెను. తరువాత శాంతనుడు మిక్కిలి చింతించుచు నుండి నప్పుడు అతని పుత్రుడు దేవవ్రతుడు తండ్రి యొద్దకు వచ్చి యిట్లనెను:-

"తండ్రీ! నీకు సర్వత్ర క్షేమము శుభమే యున్నది. రాజులందరు గూడ నీకువశులై యున్నారు. ఇట్లుండగా నీవు నిరంతరం దుఖించుచు చింతా నిమగ్నుడవై యున్నావు. ఏదో ధ్యానించుచున్నట్లు నీవు మౌనముతో నున్నావు. నాతో నేమియు మాట్లాడకున్నావు. అశ్వారూఢుడవై బయట ఎక్కడకున్ను పోవ కున్నావు. నీ కాంతి మలినమగుచున్నది. నీ శరీరము పాలిపోయి కృశించినావు. నీకు ఏమిజబ్బు వచ్చినది? దానికి నేను ప్రతీకారము చేసెదను. తెలుపుము."

ఇట్లు దేవవ్రతు డడుగగా శాంతను డిట్లనెను :-

"పుత్రా! నేను చింతానిమగ్నుడనై యుండుటకు కారణము చెప్పెద వినుము.

నాకు నీవు ఒకడవే పుత్రుడవు. నీవుగూడ ఎల్లప్పుడు అస్త్ర - శస్త్రాభ్యాసములందు నిమగ్నుడవై పౌరుషముకొరకు సర్వదా ప్రయత్నించు చుందువు. ప్రపంచము అనిత్యమని నేను నిరంతరము దుఃఖించుచు చింతితుడనై యుండెదను. నీకు ఏదైన ఆపద సంభవించిన యెడల, ఆ నాడే మన వంశము

సమాప్తమగును. నీ వొక్కడివే నాకు నూర్గురు పుత్రుల కంటె మించి యున్నా వనుటలో సందేహము లేదు. నేను మరల వ్యర్థముగ వివాహము చేసికొన గోరను. ఐనను, మన వంశ పరంపర విచ్ఛిన్నము కాగూడదని నాకు మరల వివాహము చేసికొను నిచ్ఛకలదు.

"కుమారా! 'ఒక పుత్రుడు గలవాడు సంతాన హీనునితో సమానుడు', అని ధర్మజ్ఞులు చెప్పెదరు. ఒక కన్ను - ఒక పుత్రుడు ఉండుట లేని దానితో సమానము. నేత్రము నశించిన తరువాత శరీరమే నశించి పోవును. ఇట్లే, పుత్రుడు పోయినచో కులపరంపరయే నష్టమగును. 'అగ్నిహోత్రము' మూడు వేదములు, శిష్య - ప్రశిష్య క్రమముచేత నడుచుచున్న విద్యావంశము' ఇవి అక్షయములైనను, జన్మమువలన గలుగు సంతాన పరంపరకు పదియారవ వంతు గూడ సమానములు కాజాలవు. సంతాన మహత్త్వము మనుష్యులకు మాననీయమైనట్లే, ఇతర సమస్త ప్రాణులకు గూడ మాననీయము.

"నాయనా! నీవు మహాప్రాజ్ఞుడవు. 'సంతానము, కర్మలు, విద్య' ఈ మూడు జ్యోతులలో సంతానము యొక్క మహత్త్వము అన్నిటికంటె అధిక మైనదని మూడు వేదములు, పురాణములు, దేవతలు గూడ అంగీకరించిన సనాతన మతము. నా చింతకు కారణము నీకు స్పష్టముగా తెలిపితిని. నీవు వీరుడవు. ఏ మాట గూడ సహించవు. అస్త్రశస్త్రాభ్యాసము నందే నిరంతరము నిమగ్నుడవై యుండెదవు. కనుక, యుద్ధము దప్ప మరియొక కారణము చేత నీకు మృత్యువు సంభవించదు.కనుకనే,'నీవు మరణించిన తరువాత ఈవంశ పరంపర ఎట్లు నిర్వహింపబడు"నని సందేహించుచున్నాను. పుత్రా! ఇదియే నా దుఃఖ కారణము.

"జనమేజయా! శాంతనుని దుఃఖకారణము తెలిసికొని దేవవ్రతుడు తన బుద్ధితో గూడ విచారించి, తన తండ్రి హితముకోరు వృద్ధమంత్రి కడకుపోయి, 'తండ్రి శోకకారణము వాస్తవముగా తెలుపు' మని అతని నడుగగా, ఆ మంత్రి దేవవ్రతునితో, 'మహారాజు ఒక కన్యకను వివాహము చేసికొన గోరుచున్నాడు' అని తెలిపెను. అది విని, దేవవ్రతుడు దుఃఖితుడై తండ్రి సారథిని వెంటనే పిలిచి, 'సారథీ! నీవు నా తండ్రి రథ సారథివి. కనుక, అతనికి మిత్రుడవు.

మహారాజునకు ఏ స్త్రీ యందు అనురాగము గలదో, నీకు తెలియునా? చెప్పుము. నీవు చెప్పినట్లే చేసెదను.' అని యడిగెను. ఆ మాటవిని సారథి, దేవవ్రతునితో నిట్లనెను:-

"రాజకుమారా! ఒక జాలరుని కూతునందు నీ తండ్రికి అనురాగము కలిగినది. మహారాజు ఆ చేపలు పట్టువానితో అతని కన్యకను తన కిమ్మని కోరెను. కాని, అప్పు డా నిషాదుడు ''ఈ కన్యక పుత్రుడే నీ యనంతరము రాజు కావలెను' అని ఒక నిబంధనము చేసెను. నీ తండ్రి, ఆ ధీవరుడు కోరిన వరము ఇచ్చుటకు ఇచ్ఛయించ లేదు. ఆ దాశరాజు గూడ తన నింబంధనను ఒప్పుకొనని యెడల, కన్యను ఈయనని చెప్పెను. రాజకుమారా! ఇదియే అక్కడ జరిగిన వృత్తాంతము. ఇక నీవు సముచితమైన కార్యము చేయుము."

"జనమేజయా! యిట్లు సారథి చెప్పగా, దేవవ్రతుడు వృద్ధ క్షత్రియులతో పాటు నిషాదరాజు కడకుపోయి, "తన తండ్రి కొరకు అతని కన్యకను ఇమ్ము" అని కోరెను. అప్పుడు ఆ జాలరి దేవవ్రతుని మిక్కిలి సత్కరించి, ఆ క్షత్రియు లందరి సమక్షమందు అతనితో నిట్లనెను:

"రాజకుమారా! ఈ కన్యకను నీ తండ్రికి ఇచ్చుటకు అతని రాజ్యమునే శుల్కముగా పెట్టితిని. ఈమె పుత్రుడే నీ తండ్రి యనంతరము రాజ్యాధికారి కావలెను. నీ వొక్కడవే పుత్రుడ వైనను,సర్వరక్షకుడుగా నున్నావు. శస్త్రధారు లలో శ్రేష్ఠుడవు. ఐనను, నా యభిప్రాయము నీకు తెలిపితిని. ఇటువంటి స్పృహ ణీయమైన ఉత్తమ వివాహ సంబంధము నిరాకరించి సంతాపము చెందకుండు వాడు, ఇంద్రు నంతటివా డైనను, ఎవడు ఉండును?

"రాజకుమారా! ఈ కన్యక ఒక అర్య పురుషుని కూతురు. అతడు, సద్గుణములలో నీ వంటి వాడే. అతని వీర్యమునుండి 'సత్యవతి' అను పేరుగల యీ కన్యక జన్మించెను. అతడు నీ తండ్రి విషయమై యనేక పర్యాయములు నాతో చర్చించి, "సత్యవతి వివాహమునకు యోగ్యుడు ధర్మజ్ఞుడునైన శాంత నుడే!" అని చెప్పెను. శాంతనుడు సత్యవతి నిమ్మని నన్ను అడిగెను. కాని, నేను అంగీకరించలేదు. కన్యకకు తండ్రి నగుటచేత నీతోగూడ ఒక మాట చెప్పెదను వినుము :

మీతో చేయు సంబంధము, 'బలవంతులతో శత్రుత్వము చేయుట' అను నొక దోషము మాత్రము నాకు కనబడుచున్నది. నీ శత్రువు గంధర్వుడైనను, రాక్షసుడైనను చిరంజీవియై యుండజాలడు. ఈ వివాహమునకు ఈ ఒక్కదోషము తప్ప మరి యొకటి లేదు. కన్యకను ఇచ్చుటకు, ఇవ్వకుండుటకు గూడ ఈ దోషము విచారించ దగినది. నీవు దీనిని బాగుగా తెలిసికొనుము."

"జనమేజయా! యిట్లు నిషాదుడు చెప్పిన తరువాత, దేవవ్రతుడు, తండ్రికోరిక తీర్చుటకు రాజులందరు వినుచుండగా, దాశ రాజుతో, 'నా సత్యప్రతిజ్ఞ వినుము. ఇట్టి ప్రతిజ్ఞ చేయువాడు ఇంతవరకు పుట్టలేదు-పుట్టబోవడు. ఇదిగో వినుము. నీవు కోరునట్లే - అనునట్లే చేసెదను. ఈ సత్యవతికి పుట్టబోవువాడే మాకు రాజు కాగలడు' అని ప్రతిజ్ఞ చేసెను.

"జనమేజయా! దేవవ్రతుని ప్రతిజ్ఞ విని నిషాద రాజు, అతనితో మరి యొక దుష్కర ప్రతిజ్ఞ చేయింప దలచి, 'యువరాజా! నీవే శాంతను మహారాజు పక్షమున అధికారివై వచ్చితివి. ఈ కన్యకపై గూడ నీకు సంపూర్ణాధికారము కలదు. నీవు కోరిన కోర్కెలన్నియు తీర్చగలవు. అన్ని పనులు చేయుటకున్ను సమర్థుడవు. కనుక, ఈ విషయములో నీచేత మరియొక కార్యము కావలసి యున్నది. కనుక, నా మాట వినుము. 'కన్యకకు తండ్రిగా నేను కోరుచున్నాను. నీవు సత్యవతీ హితముకొరకు చేసిన ప్రతిజ్ఞ మిక్కిలి యోగ్యముగా నున్నది. ఆ ప్రతిజ్ఞ ఎప్పటికిన్ని తప్పదని నిస్సందేహముగా చెప్పెదను. కాని, 'నీకు పుట్టబోవు పుత్రుడు ఒకవేళ, ఈ ప్రతిజ్ఞ యందు దృఢముగా నిలువడేమో యని నాకు సంశయము కలుగుచున్నది' అని యనెను.

"జనమేజయా! నిషాద రాజు యొక్క యభిప్రాయము తెలిసికొని, సత్య ధర్మ తత్పరుడైన దేవవ్రతుడు అప్పుడు తండ్రికి ప్రియము చేయగోరి యిట్లు కఠిన ప్రతిజ్ఞచేయుచు దాశరాజుతో ననెను :-

"నిషాదరాజా! నా మాట వినుము. ఋషులు, దేవతలు, అంతరిక్ష ప్రాణులు గూడ వినెదరు గాక! నా వలె మాట యిచ్చువాడు మఱియొకడు లేడు, నేను సత్యము చెప్పుచున్నాను. రాజులందరు వినుచుండగా తండ్రి హితముకొరకు చెప్పెదను. నేను పూర్వమే రాజ్యము విడిచితిని. ఇప్పుడు సంతానము కొరకు

గూడ స్థిరమైన నిశ్చయము చేసెదను. నేటినుండి నా జీవితాంతము అఖండ బ్రహ్మచర్య వ్రతమును అనుష్ఠించెదను. నాకు పుత్రులు లేకున్నను, స్వర్గము నందు అక్షయ లోకములు కలుగును. పుట్టుకనుండి నేటిదాక నేను ఎప్పుడు గూడ అసత్యమాడ లేదు. నా శరీరములో ప్రాణములుండునంతవరకు నేను సంతానోత్పత్తి చేయను. కనుక, నీవు నా తండ్రి కొరకు నీ కన్యకను ఇమ్ము. దాశరాజా! నేను రాజ్యమును స్త్రీ సంగమమునున్ను పూర్తిగా విడిచి ఊర్ధ్వ రేతస్కుడనై, నైష్ఠిక బ్రహ్మచారిగా నుండెదను. సత్యముగా నీకు చెప్పు చున్నాను".

"జనమేజయా! దేవవ్రతుని యొక్క యీ కఠోర ప్రతిజ్ఞవిని, ధర్మాత్ముడైన నిషాదరాజు శరీరమందు పులకలు పొడమెను. అతడు వెంటనే 'నేను ఈ కన్యకను నీ తండ్రి కొరకు తప్పక యిచ్చెదను' అని బదులు చెప్పెను. అప్పుడు అంతరిక్షము నుండి అప్సరసలు - దేవతలు - ఋషులు అతనిపై పుష్పములు గురిపించి 'భయంకర ప్రతిజ్ఞ చేసిన యీ రాజకుమారుడు 'భీష్ముడు' అను పేరుతో ప్రఖ్యాతుడగును' అని భీష్మ ప్రతిజ్ఞ చేసిన దేవవ్రతుని ప్రశంసించిరి. తరువాత భీష్ముడు తండ్రియొక్క మనోరథ సిద్ధికై ఆ నిషాద కన్యకతో 'తల్లీ! ఈ రథముపై నెక్కుము. ఇక మనము మన యింటికి పోవుదము' అని యనెను.

"జనమేజయా! భీష్ముడు ఆమెను రథ మెక్కించుకొని తన రాజధానికి పోయి ఆమెను శాంతనునకు ఒప్పగించెను. అతడు చేసిన యీ దుష్కర కార్యమును చూచి, అక్కడ నున్నవారు అతనిని మిక్కిలి ప్రశంసించి 'ఈ రాజ కుమారుడు వాస్తవముగా భీష్ముడే' అని అందరు ఏక కంఠముతో ననిరి.

"జనమేజయా! భీష్ముని దుష్కరకార్యము విని శాంతన మహారాజు మిక్కిలి సంతుష్టుడై, భీష్మునకు స్వచ్ఛంద మరణము' (తాను కోరినప్పుడు మరణించుట) వరముగా నిచ్చి, 'పుత్రా! నీవు ఇక్కడ జీవించి యుండదలచినంత కాలము మృత్యు ప్రభావము నీపై పడదు. నీ యాజ్ఞ యైనప్పుడే మృత్యువు నీపై తన ప్రభావమును చూపగలదు".

**సత్యవతికి చిత్రాంగద - విచిత్రవీర్యులు పుట్టుట - శాంతను - చిత్రాంగదుల మరణానంతరము విచిత్రవీర్యుని రాజ్యాభిషేకము :-**

"జనమేజయా ! 'సత్యవతి చేదిరాజైన 'వసువు' యొక్క కూతురు. నిషాదరాజు ఆమెను పాలించి పోషించెను.' అను విషయము తెలిసికొని శాంతనుడు సత్యవతితో శాస్త్రీయముగా వివాహము చేసికొనెను. కొంతకాలమునకు సత్యవతి గర్భము నుండి శాంతనునకు మహాబల - పరాక్రమ సంపన్నులైన 'చిత్రాంగదుడు - విచిత్రవీర్యుడు' నను నిరువురు పుత్రులు క్రమముగా పుట్టిరి. విచిత్రవీర్యుడు యువకుడగుటకు పూర్వమే శాంతనుడు మరణించెను. తరువాత భీష్ముడు చిత్రాంగదునకు రాజ్యపట్టాభిషేకము చేసెను. చిత్రాంగదుడు శౌర్య గర్వము చేత రాజుల నందరను తిరస్కరించుచు నెవరు గూడ తనకు సమానులు కారని తలచుచుండెను. మనుష్యులనేకాక, దేవ దానవులను గూడ నత డాక్షేపించుచుండెను.

"రాజా ! ఇట్లుండగా నొకనాడు అతనికి సనామధేయుడైన గంధర్వుడు 'చిత్రాంగదు'డను మహా బలశాలి యతని కడకు వచ్చి యిట్లనెను :-

"రాజకుమారా ! నీవు నా పేరు పెట్టుకున్నావు. కనుక, నాతో యుద్ధము చేయుము నీకు చేతగానిచో మరియొక పేరు మార్చుకొనుము. నీతో యుద్ధము చేయ గోరుచున్నాను. మన పేర్లు ఒకటిగా నుండుట• చేతనే నీ యొద్దకు వచ్చినాను. నా పేరు వ్యర్థముగా పెట్టుకొనినవాడు నా యెదుట నుండి క్షేమముగా పోవజాలడు."

"జనమేజయా ! అప్పుడు ఆ యిరువురకు కురుక్షేత్రమందు చాల గొప్ప యుద్ధము జరిగెను. ఇరువురున్ను బలవంతులే. వారికి సరస్వతీ నదీ తీరమందు మూడు సంవత్సరములు యుద్ధము జరిగెను. శస్త్రాస్త్ర వర్షము చేత వ్యాప్తమైన ఆ ఘోర యుద్ధము నందు మహామాయావియైన యా గంధర్వుడు చిత్రాంగదుని వధించి స్వర్గలోకమునకు పోయెను. తరువాత భీష్ముడతనికి ప్రేతకర్మలు చేయించెను.

"రాజా ! అప్పుడు విచిత్రవీర్యుడు బాలకుడు గానే యున్నను భీష్ముడతనినే రాజ్యపట్టాభిషిక్తుని జేసెను విచిత్ర వీర్యుడు భీష్ముని యాజ్ఞ ప్రకారము

తండ్రి -తాతల రాజ్యమును ఏలు చుండెను. విచిత్రవీర్యుడు, ధర్మశాస్త్ర కుశలు డైన భీష్ముని ధర్మ పూర్వకముగా పూజించుచు నుండెను. భీష్ముడు గూడ చిన్న వయస్సు గల రాజునకు అన్ని విధముల విద్యాబుద్ధులు నేర్పుచు దిద్ది తీర్చు చుండెను."

**భీష్ముడు అంబికా - అంబాలికలను హరించి, రాజులను, శాల్వుని జయించి ఆ కన్యలతో విచిత్రవీర్యునకు పెండ్లి చేయుట - విచిత్రవీర్యుని మరణము :**

"జనమేజయా ! విచిత్ర వీర్యుడు చిన్న వయస్సు వాడగుట చేత సత్యవతి యభిప్రాయము ప్రకారము భీష్ముడే ఆ రాజ్యమును పాలించు చుండెను. విచిత్రవీర్యుడు క్రమముగా యువావస్థకు వచ్చినప్పుడు భీష్ము డతనికి వివాహము చేయ సంకల్పించెను.

"రాజా! అప్పుడు కాశిరాజు అప్సరసల వంటి తన ముగ్గురు కన్యలకు స్వయంవరము ఏర్పరచిన సంగతి భీష్ముడు విని, సత్యవతి యాజ్ఞ తీసికొని రథమాత్ర సహాయముతో వారాణసికి పోయెను. అప్పుడు అన్ని వైపుల నుండి వచ్చిన రాజులను ముగ్గురు కాశిరాజు కన్యలనున్ను స్వయంవర సభలో భీష్ముడు చూచెను. ఆ సభలో నొక్కొక్క రాజును గూర్చి వర్ణింపబడుచుండెను. ఇంతలో వృద్ధుడైన భీష్మ డొక్కడే యచటకు వచ్చెను. అతనిని చూచి అతి సుందరులైన యా ముగ్గురు కన్యలు వెగటు చెంది 'యితడు వృద్ధుడు' అని అక్కడి నుండి పోయిరి.

"జనమేజయా! అప్పు డక్కడ చేరియున్న నీచ స్వభావము గల రాజు లందరు గూడ ఆ వృద్ధ భీష్ముని జూచి, 'భీష్ముడు మిక్కిలి ధర్మాత్ముడని విని యుంటిమి. ఇతడు వృద్ధుడైనాడు. ఇతని శరీరములో ముడుతలు పడినవి. తల వెంట్రుకలు నెరసినవి. ఇత డెందు కిక్కడకు వచ్చినాడు? ఇతడు చాల నిర్లజ్జు డని తోచుచున్నది. తన ప్రతిజ్ఞను అసత్యము చేసి లోకుల కెట్లు ముఖము చూపించును? 'భీష్ముడు బ్రహ్మచారి' యని లోకములో వ్యర్థ ప్రచారము వ్యాపించినది' అని యనుకొనిరి."

"జనమేజయా! ఆ రాజుల మాటలు విని భీష్ముడు మిక్కిలి కుపితుడై, యప్పుడా కన్యలను తానే తమ్ముని కొరకు వరించి, తీసికొనిపోయి తన రథము పై కూర్చొన బెట్టుకొని, ఆ రాజులతో నిట్లనెను :-

"రాజులారా! కన్యకను యథాశక్తిగా వస్త్రాభరణములతో నలంకరించి గుణసంపన్నుడైన వరుని పిలిచి, యతనికి కొంత ధనమిచ్చి, కన్యాదానము చేయుట ఉత్తమ 'బ్రహ్మ వివాహ'మని, గో-వృషభములను రెంటిని తీసికొని కన్యాదానము చేయుట 'అర్ష వివాహ'మని కొంత ధనము తీసికొని కన్యాదానము చేయుట 'ఆసుర వివాహ'మని, బలప్రయోగము చేసి కన్యకను అపహరించుట 'రాక్షస వివాహ'మని, వధూవరులు పరస్పరము అంగీకరించుకొని చేసికొనునది 'గాంధర్వ వివాహ'మని, నిద్రాదుల చేత తెలివి దప్పియున్న కన్యకను ఎత్తుకొని పోవుట 'పైశాచ వివాహ'మని,వధూవరులను ఒకచోట కూర్చొనబెట్టి స్వయముగా వారితో 'మేము గార్హస్థ్య ధర్మమును పాలించెదము' అని ప్రతిజ్ఞ చేయించి' కన్యక తండ్రి ఆ యిరువురను పూజించి అలంకార యుక్తముగా కన్యాదానము చేయుట 'ప్రాజాపత్య వివాహ'మని, అర్షవిధి (యజ్ఞము) చేసి, ఋత్విక్కునకు కన్యాదానము చేయుట 'దైవ వివాహ'మనియు నిట్లు ఎనిమిది వివాహములని విద్వాంసులు అంగీకరించినారు. ఇవి మీరు తెలిసికొనుడు. క్షత్రియులు స్వయంవరమును ప్రశంసించి, దానికి పోయెదరు. ఈ యెనిమిదింటిలోను రాజులందరను ఓడించి కన్యకను అపహరించి చేసికొను వివాహము క్షత్రియునకు అన్నిటికన్న శ్రేష్ఠమని యంగీకరింపబడినది.

"కనుక రాజులారా!నేను ఈ కన్యలను ఇక్కడ నుండి బలాత్కారముగ తీసికొని పోవదలచినాను. మీ శక్తినంతయు ఉపయోగించి నాతో పోరాడి నన్ను జయించుటకో, నాచేత పరాజయము పొందుటకో ప్రయత్నము చేయుడు. నేను యుద్ధముకొఱ కిక్కడ దృఢనిశ్చయముతో స్థిరముగా నిలిచియున్నాను."

"జనమేజయా! ఈ విధముగ భీష్ముడు ఆ రాజులకు, కాశీరాజునకు చెప్పి, ఆ కన్యకలు ముగ్గురను వెంటతీసికొని వెడలిపోయెను."

**భీష్ముడు రాజులను జయించుట :**

తరువాత రాజు లందరు తమకు జరిగిన యవమానమును సహించజాలక భుజములు చఱచుకొనుచు, ఔడుగఱచుచు లేచి, తమ భూషణములు తీసి, కవచములను, ఆయుధములను ధరించి కోలాహలము చేసిరి.

"జనమేజయా! ఆ తొందరపాటులో వారి భూషణములు ఇట్టునట్టు ఆకాశము నుండి నక్షత్రములు రాలిపడినట్లు చెల్లాచెదురుగ పడిపోయెను. వారు కోపముతో కనుబొమ్మలు ముడిపెట్టి కన్నులెఱ్ఱచేసిరి. తరువాత, తమ తమ సారథులు తెచ్చిన రథములపై కూర్చొని, యనేక శస్త్రాస్త్రములతో, కన్యలతో పోవుచున్న భీష్ముని వెన్నంటిరి. ఆ రాజులకు భీష్మునకు ఘోర సంగ్రామము జరిగెను. భీష్ముడు ఏకాకిగాను, రాజులు అధిక సంఖ్యలోను ఉండిరి. వారికి రోమాంచకరమైన యుద్ధము జరిగెను."

"జనమేజయా! ఆ రాజులు ఒకేసారి పదివేల బాణములు భీష్మునిపై ప్రయోగించిరి. కాని, భీష్ముడు ఆ బాణములు తనపైకి వచ్చుటకు పూర్వము నడుమనే బాణములతో ఖండించెను. తరువాత, వారందరు భీష్ముని నలువైపుల చుట్టుముట్టి, మేఘములు పర్వతముపై జలధారలు వర్షించునట్లు భీష్మునిపై బాణములు గురిపించిరి. భీష్ముడు తనపైన అన్నివైపుల నుండి వచ్చిపడుచున్న బాణములను తన శరపరంపరతో ఆపి, ఆ రాజు లొక్కొక్కరిని మూడు మూడు బాణములతో కొట్టి, గాయపరచెను. అప్పుడు ఆ రాజులు గూడ ఒక్కొక్కరు ఐదైదు బాణములతో భీష్ముని కొట్టిరి.

"జనమేజయా! భీష్ముడు గూడ, తన పరాక్రమము ప్రదర్శించుచు నొక్కొక్క యోధుని రెండు రెండు బాణములతో కొట్టెను. శక్తి - బాణాద్యా యుద్ధముల చేత జరుగుచున్న ఆ దొమ్మియుద్ధము దేవాసుర సంగ్రామమువలె భయంకరముగా కనబడు చుండెను. ఆ యుద్ధరంగము నందు ఆ వీరులు చూచు చుండగనే భీష్ముడు వారి ధనుస్సులను, ధ్వజకవచాదులను మస్తకములను వేల కొలదిగ ఖండించెను.

"జనమేజయా! యుద్ధమునందు రథములో తిరుగుచున్న భీష్ముని యొక్క అతి తీవ్రమైన హస్తలాఘవము, ఆత్మరక్షణ మొదలైన సామర్థ్యములను శత్రు

వులు గూడ ప్రశంసించిరి. వీరశిరోమణియైన భీష్ముడు, ఆ యోధుల నందరను జయించి, కన్యకలను వెంట దీసికొని హస్తినాపురమునకు పోయెను.

"జనమేజయా! అప్పుడు మహారథికుడైన శాల్వరాజు వెనకనుంచి వచ్చి యుద్ధము చేయుటకు భీష్మునిపై దాడి చేసెను. శాల్వుడు అపరిమిత శరీరబలము కలవాడు. అతడు ఒక కరిణిని వెన్నంటిన గజరాజును వెన్నంటి, తఱుముచున్న మరియొక గజ యూథపతి, తన దంత ప్రహారములచేత ఆ గజరాజును చీల్చ గోరుచున్నట్లే శాల్వరాజు, స్త్రీని పొందుకోరికలో ఈర్ష్యా క్రోధములచేత భీష్ముని వెన్నంటి తరుముచు 'అరే! నిలు - నిలుము!' అని యనెను. ఆ మాట విని భీష్ముడు క్రోధముతో ధూమరహితాగ్నివలె మండుచు, ధనుర్బాణములు ధరించి, లలాటము ముడుచుకొని నిలిచెను.

"జనమేజయా! భీష్ముడు భయము, తొందరపాటున్ను విడిచి. శాల్వుని కెదురుగా పోవుటకు తన రథమును మరలించెను. అక్కడి రాజు లందరు శాల్వ భీష్ముల యుద్ధమును చూచు చుండిరి. ఆ యిరువురువీరులు, మైథునేచ్ఛగల గోవుకొఱకు, పరస్పరము పోరాడు రెండు ఆబోతులవలె హుంకరించుచు ఒండొరులు తలపడిరి.

"జనమేజయా! తరువాత శాల్వుడు భీష్మునిపై వేలకొలది బాణములను కురిపించెను. అదిచూచి రాజులందరు ఆశ్చర్యకితులై, "బాగు! బాగు! అనజొచ్చిరి. యుద్ధమునందు శాల్వుని లాఘవము చూచి, రాజులు ప్రసన్నులై, అతనిని ప్రశంసించిరి. భీష్ముడు, వారు శాల్వుని ప్రశంసించుట విని కుపితుడై, 'నిలు-నిలుము!' అని సాల్వునితోనని తన సారథితో అతనికడకు రథము కొనిపొమ్ము. గరుడుడు సర్పమును పట్టిచంపునట్లు నేను ఇప్పుడే శాల్వుని సంహరించెదను! అని యనెను.

"జనమేజయా! భీష్ముడు వారుణాస్త్రమును సంధించి శాల్వుని నాలుగు రథాశ్వములను అణచివేసి! తన యస్త్రములచేత శాల్వుని యస్త్రముల నివారించి, అతని సారథిని చంపెను. అప్పుడు భీష్ముడు శాల్వుని జయించి, ప్రాణావశిష్టునిగా విడిచి ఆకన్యలతో హస్తినాపురికి పోయెను.

"జనజమేజయా! అప్పుడు విచిత్రవీర్యుడు తన తండ్రి శాంతనుని వలె రాజ్యము పాలించుచుండెను. భీష్ముడు కొలది కాలములోనే నదీ-పర్వత-వనములను దాటి తన పట్టణమునకు పోయెను.

''జనమేజయా! భీష్ముడు కాశిరాజు పుత్రికలను తన కోడండ్రవలె, చెల్లెండ్రవలె, కూతులవలె ప్రేమతో తన రథమునందు కూర్చొన బెట్టుకొని కురు దేశమునకు తెచ్చి తన తమ్ముడైన విచిత్ర వీర్యునకు అప్పగించెను.''

"జనమేజయా! ధర్మజ్ఞుడైన భీష్ముడు ఇట్లు అలౌకిక పరాక్రమము ప్రదర్శించి, తల్లియైన సత్యవతి యాజ్ఞ ప్రకారము ఆ కన్యకలను విచిత్ర వీర్యునకు ఇచ్చి వివాహము చేయుటకు ఏర్పాట్లు చేయదొడగెను.

"ఆ కన్యలలో జ్యేష్ఠురాలైన 'అంబ' మహాపతివ్రత. ఆమె వివాహము భీష్ముడు తన తమ్మునితో చేయదలచినప్పుడు అతనితో ఆమె యిట్లనెను:-

"ధర్మాత్మా! నా మనస్సులో తొలుతనే 'సౌభము' అనబడు విమానమునకు అధిపతియైన శాల్వరాజును వరించి యుంటిని. అతడుగూడ పూర్వము నన్ను వరించి యుండెను. అతనితోనే నా పెండ్లి జరుగవలెనని నా తండ్రి గూడ కోరుచుండెను. స్వయంవరమునందు నేను, శాల్వరాజునే వరించవలసి యుంటిని. గనుక, ఈ విషయములన్నియు గమనించి, ధర్మము ప్రకారము నడుచుకొనుము.''

"జనమేజయా! ఆ కన్యక భీష్మునితో నిట్లుచెప్పినప్పుడు అక్కడి బ్రాహ్మణులు కూడ ఈ వివాహ విషయములో యుక్తియుక్తముగ వేదపండితులు - విచారించి, శాల్వుని కడకు పోవుటకు అనుమతి యిచ్చిరి.

"జనమేజయా! తక్కిన యిరువురు కన్యకలైన 'అంబిక-అంబాలిక' యను వారలను భీష్ముడు శాస్త్రవిధి ప్రకారము విచిత్రవీర్యున కిచ్చి పెండ్లి చేసెను. పిదప విచిత్రవీర్యుడు, ఆ యిరువురితో కామోపభోగములు అనుభవించెను. ఇరువురు పదియారు వర్షముల ప్రాయము గడచిన నవయువతులుగా నుండిరి. వారి కేశములు నల్లగా, ఉంగరములు తిరిగి ఉండెను. వారి హస్త పాదముల నఖములు ఎఱ్ఱగా, ఎత్తుగాను ఉండెను. నితంబములు, స్తనములు స్థూలముగా నుండెను.

"జనమేజయా! 'తమకు అనురూపపతి లభించె'నని ఆ యిరువురు సంతోషముతో విచిత్రవీర్యుని సేవించుచు పూజించుచు నుండిరి. విచిత్రవీర్యుని రూపము అశ్వినీ కుమారుల రూపమువలె అందముగ నుండెను. ఏకాంతము నందు తన స్త్రీల మనస్సు మోహింపజేయు శక్తిగలవాడుగా నుండెను.

"జనమేజయా! విచిత్రవీర్యుడు, అంబిక, అంబాలికలతో ఏడు సంవత్సరములు విహరించెను గనుక, ఆ స్వేచ్ఛా విహారమునకు పరిణామముగా అతనికి యువావస్థయందే క్షయరోగము వచ్చెను. అప్పుడు పెద్ద-పెద్ద వైద్యులచేత చికిత్స చేయించి యతని రోగ నివారణకు బంధువులు ఎంత ప్రయత్నించినను, సూర్యుడు అస్తాచలమునకు పోవునట్లే విచిత్రవీర్యుడు యమలోకమునకు పోయెను.

"జనమేజయా! భీష్ముడు సోదరుని మరణము వలన చింతించుచు దుఃఖించెను. తల్లి సత్యవతి యాజ్ఞ ప్రకారము విచిత్రవీర్యునకు ప్రేతకార్యములు నెరవేర్చెను.

**సత్యవతి భీష్ముని రాజ్యపాలనకు సంతానోత్పత్తికి నిర్బంధించుట, భీష్ముని అనంగీకారము:-**

జనమేజయా! తరువాత సత్యవతి తన పుత్రుల మరణముచేత మిక్కిలి దీనురాలై, కోడండ్రతోపాటు విచిత్ర వీర్యుని ప్రేతకార్యముచేసి, వారికి, భీష్మున కున్ను ధైర్యము గొలిపి, ధర్మ-పితృకుల-మాతృకులము లను గూర్చి విచారించి భీష్మునితో నిట్లనెను.

"పుత్రా! ధర్మతత్పరుడైన శాంతనునకు పిండ ప్రదానము, అతని కీర్తి వంశము అన్నియు నిప్పుడు నీ యందే అవలంబించి యున్నది. శుభకర్మలచేత స్వర్గమునకుపోవుట,సత్యము పలుకుటచేత ఆయుర్వృద్ధికలుగుటయు నిశ్చితమైనట్లే నీ యందు ధర్మముండుట గూడ నిశ్చితమే. ధర్మజ్ఞా! నీవు సర్వ ధర్మముల సంక్షేప - విస్తారముల నెరిగి యున్నావు. వివిధ వేద - వేదాంగ (శాస్త్ర)ముల పరిపూర్ణజ్ఞానము గూడ నీకు గలదు. నీ ధర్మనిష్ఠను, కులోచిత సత్ప్రవర్తనను గూడ నేను చూచుచున్నాను. సంకట సమయమందు శుక్రాచార్య - బృహస్పతుల వలె కర్తవ్య నిర్ణయమునందు నీ బుద్ధి సమర్థమైయున్నది. కనుక, నీపై విశ్వాస

ముంచియే నేను ఒక అవశ్యక కార్యము నీకు ఒప్పగించుచున్నాను. విని, దానిని చేయుటకు ప్రయత్నించుము.

"నాయనా! నా పుత్రుడు, నీ తమ్ముడునైన విచిత్రవీర్యుడు పరాక్రమ వంతుడే కాక, నీకు అత్యంత ప్రియుడుగా గూడ నుండెను. అతడు చిన్న వయస్సులోనే మరణించెను. అతనికి పుత్రులు కలగలేదు అతని యిరువురి భార్యలు మనోహర రూప - సౌందర్య - యౌవనములతో నున్నారు. వారికి పుత్రులను కనవలెనను నభిలాష ఉన్నది. నీవు మన కులము యొక్క సంతాన పరంపర విచ్ఛిన్నము కాకుండ రక్షించుటకు నీవే ఈ యిరువురు స్త్రీల గర్భ ములనుండి ధర్మానుసారము పుత్రులను కనుము. నా నియోగము చేత నీవు ఈ ధర్మకార్యము తప్పక చేయుము.

"పుత్రా! రాజ్యాభిషేకము చేసికొని, భారత ప్రజలను పాలింపుము. ధర్మానుసారముగ వివాహము చేసికొని మన పితరులు నరకమునందు పడకుండ చూడుము".

"జనమేజయా! తల్లియైన సత్యవతి మిత్రులున్ను ఇట్లు చెప్పగా, ధర్మా త్ముడైన భీష్ముడు సత్యవతితో ధర్మానుకూలముగ నిట్లనెను:-

"తల్లీ! నీవు చెప్పినది ధర్మయుక్తమనుటలో సందేహము లేదు. కాని, నేను రాజ్యలోభము చేత పట్టాభిషేకము గాని, స్త్రీ సహవాసము గాని చేయను. ఈ రెండు విషయములలో నేను కఠిన ప్రతిజ్ఞ చేసితినని నీ వెరుగుదువు అమ్మా! నీ వివాహ సమయములో శుల్క మిచ్చుటకు జరిగిన విషయము లన్నియు నీకు తెలియును. ఆ ప్రతిజ్ఞలను సత్యము చేయుటకు నేనును మరల నా దృఢనిశ్చ యము తెలిపెద వినుము:-

"తల్లీ! నేను త్రిలోక రాజ్యము, లేదా దేవతా సామ్రాజ్యము, అథవా, ఈ రెండింటి కంటె మించిన మహత్త్వము గల వస్తువు గూడ ఒక్కసారిగానే విడిచెదను. కాని, ఎట్టి పరిస్థితిలోను నా సత్య ప్రతిజ్ఞను విడవజాలను. పృథివి గంధము, జలము, రసము, తేజము, రూపము, వాయువు స్పర్శమున్ను విడిచిన విడుచుగాక! సూర్యుడు ప్రభను, అగ్ని ఉష్ణత్వమును, ఆకాశము

శబ్దమును, చంద్రుడు చల్లదనమును, ఇంద్రుడు పరాక్రమమును, యమధర్మ రాజు ధర్మమున్ను విడిచిన విడుతురుగాక! నేను మాత్రము ఎట్టి పరిస్థితిలోను సత్యము విడువజాలను. అమ్మా! సమస్త ప్రపంచము నశించినను నాకు అమరత్వము, అథవా, త్రిలోక రాజ్యము లభించినను నేను నా ప్రతిజ్ఞను భంగ పరచజాలను.

"జనమేజయా! భీష్ముడు ఇట్లు చెప్పగా సత్యవతి అతనితో నిట్లనెను:-

"పుత్రా! నీవు సత్య పరాక్రమము గలవాడవు. సత్యమునందు నీకు దృఢనిష్ఠ కలదని నాకు తెలియును. నీవు తలచిన యెడల, నీ తేజస్సుచేతనే నూతనముగ మూడు లోకములను సృజించగలవు. నీ సత్య ప్రతిజ్ఞను నేను మరవజాలను. నా కొరకు నీవు ప్రతిజ్ఞ చేసియుంటివి. ఐనను, నీవు ఆపద్ధర్మ మును విచారించి, తండ్రి - తాతలు ఇచ్చిన యీ రాజ్య భారమును వహించుమని నేను నిర్బంధ పూర్వకముగా చెప్పుచున్నాను. ఏ యుపాయముచేత నీ వంశ పరంపర నష్టము కాకుండునో, ధర్మమునకు గూడ పరాభవము కలుగకుండునో, మిత్ర జనులు గూడ సంతుష్టులగుదురో, అట్టి యుపాయమునే చేయుము".

"జనమేజయా! యిట్లు సత్యవతి వంశమునకు పుత్రుడు కలుగవలెనను నిచ్ఛతో దీనముగ ధర్మరహితమైన మాట చెప్పగా భీష్ముడు మరల నామెతో నిట్లనెను :

"రాజమాతా! ధర్మమువైపు చూడుము. మన యందరి నాశము చేయకుము. క్షత్రియుడు సత్యమునుండి విచలితుడగుట ఏ ధర్మములందు గూడ మంచిదని చెప్పబడలేదు. శాంతను మహారాజు యొక్క సంతాన పరంపర గూడ భూమండలమందు అక్షయముగా నుండుటకు ధర్మసంగతమైన యొక యుపాయము నీకు తెలిపెదను. సనాతనమైన క్షత్రియ ధర్మము. ఆపద్ధర్మ నిర్ణయమందు సమర్థులైన విద్వాంసుల నుండి పురోహితుల నుండియు విని లోక తంత్రమును గూడ చూచి నీవు నిశ్చయింపుము".

**భీష్ముని సమ్మతితో సత్యవతి వ్యాసుని పిలుచుట - తల్లి యాజ్ఞచేత వ్యాసుడు విచిత్ర వీర్యుని భార్యల నుండి సంతతి కనుట:-**

"తల్లీ! గుణవంతుడు, నియమవంతుడునైన బ్రాహ్మణుని ద్వారా నీ కోడండ్ర యందు సంతానము బడయుము. ఇది "నియోగధర్మ" మనబడును."

"విధవ యందు ధర్మము కొఱకు సంతానోత్పత్తి చేయుటకు నియుక్తుడైనవాడు శరీరమునకు నేయి పూసికొని, వికార రూపము కల్పించుకొని, మౌనముతో ఆ స్త్రీయందు ఒక్క కొడుకును మాత్రమే కనవలెను. రెండవ కొడుకును కూడదు. ఆ నియోగ ధర్మము నెరవేరిన తరువాత వారిరువురు మామవలె, కోడలువలె, పితృ-పుత్రీ భావముతోనే మెలగవలెను".

"ఇది 'నియోగ ధర్మము'. దీని వలన క్షత్రియ సంతతి విచ్ఛిన్నము కాదు. ధర్మమునకు భంగము కలుగదు.

"ఇదిగాక, మరి యొక ధర్మ సూక్ష్మము కలదు. ఎక్కడ విధి లేనప్పుడు ఒక గుణవంతుడైన బ్రాహ్మణునకు ధనమిచ్చికూడ అతని వలన విచిత్రవీర్యుని క్షేత్రమందు సంతానము బడయవచ్చును.

"తల్లీ ! ఈ నియోగ ధర్మము అనుష్ఠించినవారు పూర్వము గూడ ఎందరో ఉండిరి. ఆ కథలు చెప్పెద వినుము :-

"పూర్వము పరశురాముడు ఇరువదియొక్క మార్లు భూప్రదక్షిణముచేసి, క్షత్రియజాతినంతయు సంహరించెను. తరువాత ఆ క్షత్రియుల విధవల యందు ఉత్తమ బ్రాహ్మణులు సంతానోత్పత్తి చేసి, క్షత్రియజాతిని ఎడతెగక నిలబెట్టిరి".

"తల్లీ! ఇట్లే మరియొక కథ చెప్పెద వినుము :-

***దీర్ఘతముని వృత్తాంతము :**

"తల్లీ! 'ఉచథ్యుడు' అను మునీశ్వరుని భార్య 'మమత' అను నామెను అతిథిగా వచ్చిన బృహస్పతి, 'దేవరన్యాయము'** చేత కోరెను. అప్పుడు ఆమె గర్భవతిగా నుండెను. ఆమె గర్భమందున్న శిశువు బృహస్పతి కోరికను తెలిసికొని, ఇది ధర్మవిరుద్ధమని ఆక్రోశించెను.

* ఈ కథ సంస్కృత మహాభారతము గోరఖ్‌పూరు ప్రతిలో లేదు. ఇది నన్నయ భారతము నుండి గ్రహింపబడినది.

** 'దేవర' శబ్దమునకు భర్తయొక్క అన్నదమ్ములు అని యర్థము. 'ఒక స్త్రీ పుత్రవతి యగుటకు పూర్వమే విధవ యైనప్పుడు ఆమె దేవరుడు గురుజనాజ్ఞచేత ఆ విధవ యందు సంతతి కనవచ్చును' అనునది 'దేవర న్యాయ' మనబడును. దీనికి ప్రమాణము- "అపుత్రాం గుర్వనుజ్ఞాతో, దేవరః పుత్ర కామ్యయా" అని యాజ్ఞవల్క్య స్మృతి -అ-1-శ్లో-68.

"అప్పుడు బృహస్పతి కోపించి "సర్వభూతములకు ఇష్టమైన యీ కార్యము చేయుచున్న నాకు నీవు ప్రతికూలుడవైతివి. కాబట్టి 'దీర్ఘతమము' (అంధత్వము)ను పొందుము" అని ఆ శిశువునకు శాపమిచ్చెను.

"ఆ శాపముతో ఆ బాలకుడు పుట్టి దీర్ఘతముడు (పుట్టుగుడ్డి) అను పేరుతో వెలసెను. అతడు పుట్టుగ్రుడ్డివా డయినను, సకలవేద శాస్త్ర పండితుడై, తన విద్యాబలము చేత చాల కాలమునకు 'ప్రద్వేషిణి' అను నొక బ్రాహ్మణ స్త్రీని పెండ్లి చేసికొని, గౌతమాదులైన కొడుకుల ననేకులను కనెను. ఆమె తాను పుత్రవతి యైనందుకు తనను మెచ్చుకొనెను.

"అప్పుడు దీర్ఘతముడు 'నేను గూడ పుత్రవంతుడనైతిని గదా, నన్ను ఎందుకు మెచ్చికొనవు ?" అని ప్రద్వేషిణిని అడిగెను.

ఆ మాటకు ఆమె యిట్లనెను :-

"భార్యను భరించువాడు గనుక 'భర్త' అనబడును. భరింపబడునది గనుక, 'భార్య' అనబడును. నన్ను నీవు భరించుటకు మారుగా, నీవు అంధుండ వగుట చేత నిన్నే నేను భరించు చున్నాను. ఇట్లు చాల కాలము నిన్ను భరింప జాలను. కనుక, ఇక నీవు మఱియొక చోటికి పొమ్ము."

ఆ మాట విని దీర్ఘతముడు మిక్కిలి కోపించి, లోకములోని స్త్రీల నందఱిని ఇట్లు శపించెను :-

"పతిలేని స్త్రీలు మిక్కిలి ధనవంతులైనను, సత్కుల సంజాతలైనను, నేటి నుండి భూషణాలంకారములు లేకుండ, మాంగల్య రహితలై, దీనవృత్తిలో నుందురు గాక !"

"జనమేజయా ! ఈ విధముగ శాపమిచ్చిన దీర్ఘతమునిపై కోపముతో ఆమె కొడుకులకు "ఈ వృద్ధుని ఎక్కడికైనను, తీసికొని పొండు" అని ఆజ్ఞ యిచ్చెను.

"తల్లి యాజ్ఞ ప్రకారము వారు అతి వృద్ధుడు, జాత్యంధుడునైన ఔచథ్యుని కట్టెలతో కట్టి మోహాంధులై గంగలో విడిచిరి.

"అట్లు విడువబడిన దీర్ఘతముడు గంగా ప్రవాహములో కొట్టుకొని, అనేక దేశములు దాటి పోయెను.

తరువాత ఒకనాడు "బలి'' అను రాజు గంగా స్నానము కొఱకు పోయి, కట్టెల బంధమున నుండి కూడ ఉదాత్త-అనుదాత్త-స్వరిత-ప్రచయ-స్వర భేదములు స్పష్టముగ తెలియునట్లు సలక్షణముగ వేదములు చదువుచు గంగయొక్క అలల తాకిడి చేత తానున్న తీరమునకు వచ్చిన యా మునిని చూచి, యొడ్డునకు చేర్చి, అతని కట్లు విప్పి, అతడు మహర్షి యగు 'మామతేయు'డని తెలిసికొని, అతనికి తనను గూర్చి తెలిపి, నమస్కారము చేసి, అతనితో నిట్లనెను :-

—"మహాత్మా! నీవు ఎక్కడి నుండి యిక్కడకు వచ్చితివి? మరి యెక్కడకు పోయెదవు? నా పుణ్యవశము చేత నీ దర్శనము లభించెను. మహా మునీ! నాకు సంతానము లేదు. కనుక నీవు నాకు సంతతిని ఇమ్ము."

ఇట్లు చెప్పి అతనిని పూజించి తన పట్టణమునకు తోడ్కొని పోయి, ఋతిమతియై యున్న తన భార్య సుధేష్ణకు ఆ మునిని అప్పగించెను.

"పుట్టు గ్రుడ్డి, వృద్ధుడు, దుర్గంధ ముఖము గలవాడు, వేదజడుడునైన యా మునిని సుధేష్ణ చూచి, అతనిని పొందుటకు అసహ్యపడి తన వలెనేయున్న తన దాది పుత్రికను ఆ మునీశ్వరుని కడకు పంపెను.

"దీర్ఘతముడు ఆ దాది కూతు వలన "కాక్షీవంతుడు" మొదలైన పది కొండుగురు పుత్రులను కనెను. అప్పుడు 'బలి' అను రాజు మిక్కిలి సంతోషించి "వీరలు నా పుత్రులే కదా!" అనెను. ఆ మాటకు దీర్ఘతము డిట్లనెను :-

"రాజా! వీరు నీ కుమారులు కారు. నీ భార్య దాది కూతురు వీరిని నా వలన కనెను. వీరు మహా ధర్మాత్ములు, గొప్ప బలవంతు లయ్యెదరు."

ఇట్లు దీర్ఘతముడు చెప్పిన మాట విని బలిరాజు సంతానమును కోరువాడు కాబట్టి, మరల ఆ మహామునిని ప్రార్థించి, అతని అంగీకారముపై మరల సుధేష్ణను నియోగించెను.

అప్పుడు దీర్ఘతముడు ఆమె యవయవములను ముట్టి చూచి, "వంశోద్ధారకుడు, మహా బలపరాక్రమ సంపన్నుడైన పుత్రుడు నీకు పుట్టు గాక!" అని ఆమెను అనుగ్రహించెను. ఆమెకు 'అంగరాజు' అను రాజర్షి పుట్టెను.

కాబట్టి, తల్లీ! ఉత్తమ క్షత్రియుల భార్యలందు ధర్మ మార్గము చేత ఋషీశ్వరుల వలన పుత్రులు పుట్టి, వారు వంశోద్ధారకులైరి. అట్టి క్షత్రియు లనేకులు కలరు."

''జనమేజయా: ఆ మాటలు విని, సత్యవతి చిరునవ్వుతో సిగ్గుపడుచు, భీష్మునితో తన యభిప్రాయము చెప్పుటకు సంకోచపడుచు, వాక్కుతో నిట్లనెను:-

"భీష్మా! నీవు చెప్పిన మాటయే బాగున్నది. నీ యందు విశ్వాసముచేత మన కుల సంతతిని రక్షించుట కొరకు నీ కొకమాట చెప్పెదను. ఇటువంటి యాపద కలిగినప్పుడు ఆ మాట నీకు చెప్పక ఉండజాలను. నీవే మన కులమందు మూర్తీభవించిన ధర్మముగా సత్యముగానున్నావు. నీవే మాకు పరమగతివి. *గుణవంతుడైన బ్రాహ్మణునకు ధనమిచ్చి విచిత్రవీర్యుని స్త్రీల గర్భమునుండి

ఇక్కడ గుణవంతునకు అర్థము ఏమనగా - 'నియోగవిధి తెలిసిన సంయమము గల పురుషుడు' అని. స్త్రీల ఆపద్ధర్మ విషయమునందు మనువు, ఇట్లు చెప్పెను - 'విధవాయాం నియుక్తస్తు ఘృతాక్తో వాగ్యతో నిశి

'ఏక ముత్పాదయే త్పుత్రం న ద్వితీయం కథంచన' (మనుస్మృతి 9-61) అనగా విధవా స్త్రీతో సహవాసము కొరకు (ఆమె పతివైపు గురుజనములచేత) నియోగింపబడిన పురుషుడు తన శరీరమంత నేయి రాచుకొని (సౌందర్యమును చెఱచుకొని), వాక్కును సంయమము చేసి (మౌనముతో నుండి) రాత్రి యందు సహవాసము చేయవలెను. ఈ విధితో నతడు ఒక పుత్రునే కనవలెను. రెండవ వానిని ఎప్పుడు గూడ కన కనగూడదు.

'విధవాయామ్ నియోగార్థే నిర్వృత్తేతు యథావిధి।
గురువచ్చ స్నుషావచ్చ వర్తేయాతామ్ పరస్పరం॥"

(మను. 9-63)

అనగా, విధవా స్త్రీ యందు నియోగము కొరకు విధి ననుసరించి (అనగా కామవశుడు కాకుండ కర్తవ్య బుద్ధిచేత) మనస్సును అదుపులో నుంచుకొని ఇంద్రియములను ఆసక్తి రహితములుగా నుంచుకొని నియోగము యొక్క ప్రయోజనము నెరవేరిన తరువాత అయిరువురు పరస్పరము తండ్రివలె, కోడలివలె వ్యవహరించవలెను. (అనగా స్త్రీ అతనిని తండ్రివలె, తలచి వ్యవహరించవలెను పురుషుడు ఆమెను కోడలివలె తలచి వ్యవహరించవలెను).

కలియుగము నందు మనుష్యులకు సంయమము ఉండదు. వారు మనస్సు, ఇంద్రియములు అదుపులో నుంచుకొనజాలరు. కాముకులై యుండెదరు. కనుక, కలియుగమునందు నియోగము వర్జితమైనది.

సంతానోత్పత్తి చేయవచ్చునని చెప్పితివి. కనుక, నేను చెప్పెడు మాటవిని తరువాతి కార్యము చేయుము.

"దేవవ్రతా! నీవు వసుమహారాజు పేరు వినియుందువు. పూర్వకాలమునందు నేను, అతనికే పుట్టితిని. నన్ను ఒక చేప మ్రింగియుండెను. ఒక ధర్మాత్ముడైన దాశజాతివాడు జలమునందు నా తల్లిని పట్టుకొని ఆమె గర్భము నుండి నన్ను బయటకుతీసి. తన యింటికి తెచ్చుకొని, తన కూతురుగా చేసికొనెను. ధర్మాత్ముడైన ఆ నా తండ్రికి ఒక నౌక యుండెను. అది ధర్మము కొరకు (ధనముకొరకు కాక) నడపబడు చుండెను.

"భీష్మా! ఒకనాడు నేను ఆ యోడ నడపుచుంటిని. ఆ దినములలో నాకు యౌవనము ప్రారంభమై యుండెను. ఆ సమయమందే పరాశర మహాముని యమునానది దాటుటకు నా నావపైకి వచ్చెను. నేను ఆ మునిని నది దాటించు చుంటిని. అప్పుడు నన్నుచూచి మునీంద్రుడు కామ పీడితుడై, నా కడకువచ్చి నాకు నచ్చజెప్పుచు, మధురవాక్కులు పలుకుచు, తన జన్మమును, కులమును గూర్చి చెప్పెను. అప్పుడు నేను ఆయనతో "భగవన్! నేను నిషాద రాజపుత్రిని" అని చెప్పితిని. నేనొకవైపు మా తండ్రికి, మరియొక వైపు ఆ మహాముని శాపమునకు భయపడు చుంటిని, అప్పుడు ఆ ముని నాకు దుర్లభమైన వరమిచ్చి నన్ను ఉత్సాహపరచెను, దానిచేత నేను ఆయన నిర్బంధమును త్రోసిపుచ్చజాలనైతిని.

"భీష్మా! నాకు ఇష్టము లేకుండినను, ఆ మహాముని తన తేజస్సుచేత అబలనైన నన్ను తిరస్కరించి, ఆ నౌకపైననే, వశపరచుకొనెను. అప్పుడు, పరాశర మహాముని చీకటికల్పించి, సమస్త లోకమును అంధకారావృతము చేసెను. పూర్వము నా శరీరము నుండి మిక్కిలి అసహ్యమైన చేపల దుర్గంధము వచ్చుచుండెను. దాని నాముని పోగొట్టి, ఈ యుత్తమ సుగంధము నాకు ఇచ్చియుండెను. తరువాత, ఆ ముని నాతో, 'యమునానదీ ద్వీపమునందే నేను నీకు ఇచ్చిన యీ గర్భశిశువును విడిచి, కన్యక గానే యుండెదవు'' అని చెప్పెను.

"దేవవ్రతా! నా గర్భము నుండి పరాశర పుత్రుడు, మహాయోగీశ్వరుడునైన వ్యాసమహర్షి పుట్టెను. అతడే 'ద్వైపాయనుడు' (ద్వీపము నందు పుట్టిన

వాడు) అను పేరుతో వ్యాసుడు ప్రసిద్ధుడయ్యెను. అతడు నాకు కన్యకావస్థలో పుట్టిన పుత్రుడు. ఆ ద్వైపాయన ముని తన తపోబలముచేత నాలుగు వేదములను వేరు వేరుగా విస్తరించి, విభజించి, 'వ్యాస' (విభజించువాడు) పదవిని పొందినాడు. అతని శరీరవర్ణము నల్లగా నుండుటచేత అతనిని లోకులు 'కృష్ణ' (నల్లనివాడు) అను పేరుతో గూడ పిలిచెదరు. భీష్మా! అతడు సత్యవాది, శాంతుడు, తపస్వి, పాపరహితుడుగా నుండెను. అతడు పుట్టగనే పెద్దవాడై ఆ ద్వీపము నుండి తన తండ్రితోపాటు వెడలి పోయెను.

"దేవవ్రతా! మన మిరువురము అతనిని నిర్బంధించి అడిగినచో నతడు తప్పక తన సోదరుని భార్యలయందు శుభసంతానమును కనును. అతడు వెడలి పోవునప్పుడు నాతో, 'తల్లీ! నీకు సంకటము కలిగినప్పుడు నన్ను స్మరింపుము' అని చెప్పి యుండెను. కనుక నీవుకోరినచో అతనినిప్పుడు స్మరించెదను. నీ యనుమతిపై "వ్యాస మహాముని తప్పక విచిత్రవీర్యుని భార్యలనుండి పుత్రులను కనును."

"జనమేజయా! అప్పుడు సత్యవతి వ్యాసునిపేరు ఉచ్చరించగనే, భీష్ముడు చేతులు జోడించుకొని ఆమెతో నిట్లనెను:-"

"తల్లి! ధర్మార్థకామములను మాటిమాటికి విచారించుచు, అర్థముచేత అర్థము, ధర్మముచేత ధర్మము, కామముచేత కామము ఫలముగా ఎట్లు కలుగును? అది పరిణామమునందు ఎట్లు సుఖప్రదమగును? అర్థాదులను సేవించుటచేత ఎటువంటి విపరీత ఫలములు (అర్థనాశాదులు) కలుగును? ఈ మొదలైన విషయములను వేరు వేరుగా విచారించి తన బుద్ధిచేత కర్తవ్యాకర్తవ్యములను నిర్ణయించు ధీరపురుషుడే బుద్ధిమంతుడనిపించుకొనును. అమ్మా నీవు చెప్పినమాట ధర్మయుక్తముగానే యున్నది. అది మన కులమునకు హితకరము. శుభంకరము. కనుక, ఆ మాట చాల మంచిదని నాకు తోచినది."

"జనమేజయా! ఈ విధముగా భీష్ముని సమ్మతి లభించిన తరువాత, కాళి (సత్యవతి) కృష్ణద్వైపాయన మహామునిని స్మరించగానే, ఆయన వేదమంత్రములను పఠించుచు వెంటనే అక్కడ ప్రత్యక్షమయ్యెను. ఆయన ఎప్పుడు,

ఎక్కడనుండి వచ్చినది ఎవరికిని తెలియలేదు. అప్పుడు సత్యవతి తన పుత్రుడైన వ్యాసుని బాగుగా సత్కరించి, కౌగలించుకొని, తన స్తనములనుండి పొంగుచున్న పాలతో ఆయనను అభిషేకించెను. చాల కాలము తరువాత పుత్రుని చూచిన సత్యవతి కన్నులనుండి స్నేహానంద బాష్పములు కురిసెను.

"జనమేజయా! తరువాత, సత్యవతి ప్రథమ పుత్రుడైన వ్యాసుడు తన కమండలువునందలి పవిత్ర జలముచేత దుఃఖితురాలైన తల్లి నభిషేకించి ఆమెకు ప్రణామముచేసి, ఇట్లనెను:-

"తల్లీ! నీకు ధర్మతత్త్వము బాగుగా తెలియును. నీ మనస్సులోని కోరికను నెరవేర్చుటకు వచ్చినాను. ఆజ్ఞ యిమ్ము. నా కర్తవ్యమేమో తెలుపుము".

"జనమేజయా! తరువాత పురోహితుడు విధి పూర్వకముగా వ్యాస మహర్షికి పూజ చేసెను. ఆ పూజ గ్రహించి వ్యాసుడు మిక్కిలి ప్రసన్నుడై, ఆసనముపై కూర్చున్నప్పుడు తల్లి సత్యవతి ఆయన క్షేమ సమాచారమడిగి, ఇట్లనెను :-

"విద్వన్! మాతా - పితరు లిరువురినుండి పుత్రుడు జన్మించును. కనుక, అతనిపై ఇరువురకును సమానాధికారము ఉండును. తండ్రి పుత్రునకు ప్రభువైనట్లే, తల్లిగూడ అగును. ఇందులో సందేహము లేదు. బ్రహ్మర్షీ! విధి విధానము ప్రకారమో లేక, నా పూర్వజన్మ పుణ్యము చేతనో నీవు నాకు ప్రథమ పుత్రుడ వైనట్లే, విచిత్రవీర్యుడు నాకు కనిష్ఠ పుత్రుడు. అతనికి తండ్రి వైపు నుండి భీష్ముడు అన్న యైనట్లే, నీవు గూడ తల్లివైపు నుండి విచిత్రవీర్యునకు అన్నవు. సత్యపరాక్రమముగల శాంతను నందనుడైన యీ భీష్ముడు సత్యమును పాలించుచున్నాడు.

"పుత్రా! భీష్మునకు సంతతి కనుట యందు, రాజ్యాపాలనము నందున్ను ఇచ్ఛలేదు. కనుక, నీవు నీ సోదరుని పరలోక హితముకొరకు, కులముయొక్క సంతాన పరంపరా రక్షణముకొరకున్ను భీష్ముని నిర్బంధముచేత, నా యాజ్ఞ చేతను, ప్రజలను దయతో రక్షించుటకున్ను, నీయంతఃకరణము యొక్క మృదు ప్రవృత్తిని అనుసరించి, నా మాట ప్రకారము నడచుకొనుము.

"పుత్రా! నీ తమ్ముడైన విచిత్రవీర్యుని భార్యలు దేవకన్యకలవలె సుందర రూప సంపన్నలై, యౌవనావస్థలో నున్నారు. వారికి ధర్మప్రకారము పుత్రులను పొందుటకు ఇచ్ఛకలదు. దానికి నీవు సమర్థుడవు. కనుక, ఆ యిరువురి గర్భముల నుండి ఈ కురుకుల పరంపరను రక్షించి, వృద్ధి పొందించుటకు యోగ్యమైన సంతానము కనుము."

తల్లి మాట విని వ్యాసుడు ఆమెతో నిట్లనెను :-

"తల్లీ! సత్యవతీ దేవీ! నీవు పరాపర ధర్మములను రెంటిని తెలిసిన దానవు. మహా ప్రాజ్ఞురాలవు. నీ బుద్ధి సర్వదా ధర్మమునందే యుండును. కనుక, నేను నీ యాజ్ఞచేత ధర్మమునే దృష్టియందుంచుకొని (కామవశుడను కాకుండ) నీవు కోరిన కార్యము చేసెదను ఈ సనాతన మార్గము శాస్త్రములలో నున్నది. నేను, నా సోదరుని కొరకు మిత్రావరుణులవలె తేజశ్శాలురైన పుత్రులను కనెదను. విచిత్రవీర్యుని భార్యలు నేను తెలుపు విధముగ ఒక సంవత్సరము విధిపూర్వకముగ వ్రతనియమములు (జితేంద్రియలై, కేవలము సంతాన సాధనకు) అనుష్ఠించ వలెను. అప్పుడే వారు పరిశుద్ధ లయ్యెదరు. వ్రతనియమానుష్ఠానములు చేయని స్త్రీ ఎవతె గూడ నా దగ్గరకు రాజాలదు.''

ఆ మాటలు విని సత్యవతి వ్యాసునితో నిట్లనెను :-

"పుత్రా! ఈ యిద్దరు రాణులు త్వరలో గర్భధారణము చేయునుపాయము చేయుము. ఇప్పుడు రాజ్యమునకు రాజు లేడు. రాజు లేని రాజ్యమునందలి ప్రజలు అనాథులై, నశించెదరు. యజ్ఞ దానాది కర్మలు గూడా లోపించును. అట్టి రాజ్యము నందు వర్షములు కురియవు. దేవతలు నివసించరు. రాజు లేని రాజ్యము సురక్షితముగ క్రమశిక్షణముతో ఎట్లు ఉండగలదు? కనుక, నీవు శీఘ్రముగా వీరియందు గర్భాధానము చేయుము. ఆ పుట్టబోవు బాలకులను భీష్ముడు పాలించి, పోషించి, పెంచగలడు."

ఆ మాటకు వ్యాసుడు తల్లితో నిట్లనెను :-

"తల్లీ! ఒకవేళ కాలనియమము లేకుండ శీఘ్రముగా (సద్యోగర్భము చేత) నా సోదరునకు నేను పుత్రదానము చేయవలసిన యెడల, ఆ రాణులిద్దరు నా యొక్క సౌందర్య రహితమైన అసహ్య రూపము చూచి భయపడకుండ

శాంతముగనుండుట పరమావశ్యకము. ఒకవేళ, కౌసల్య (అంబిక) నా గంధమును, రూపమును, వేషమును, (వికృత) శరీరమును సహించగలిగినయెడల, ఆమె ఒక ఉత్తమ పుత్రుని కనగలదు."

"జనమేజయా! ఇట్లు వ్యాసుడు చెప్పి సత్యవతితో, 'మంచిది. కౌసల్య (ఋతుస్నానము చేసిన తరువాత) పరిశుద్ధ వస్త్రములు, భూషణములు ధరించి నాతో కలియుటకు శయ్యపై వేచియుండవలెను' అని చెప్పి అంతర్ధానము చెందెను."

"జనమేజయా! తరువాత, సత్యవతీదేవి తన కోడలు అంబిక కడకు ఏకాంతమునందు పోయి ఆమెతో (ఆపత్) ధర్మార్థయుక్తముగ నిట్లు హితము బోధించెను :-"

"కౌసల్యా! నేను నీకు ధర్మసంగతమైన మాట చెప్పుచున్నాను. సావధానముగ వినుము. నా దౌర్భాగ్యవశమున ఇప్పుడు భరత వంశమునకు ఉచ్ఛేదము (నిలుపుదల) కలుగుచున్నట్లు స్పష్టముగ కనబడుచున్నది. కనుక, నేను, బాధపడుచుండుట, పితృకులము పీడింపబడి యుండుటయు చూచి భీష్ముడు ఈ కులము వృద్ధిచెందు నుపాయము చేయుటకు నాకు సమ్మతి యిచ్చినాడు. పుత్రీ! ఆ సమ్మతి సార్థకమగుట నీ యధీనములో నున్నది. భీష్ముడు తెలిపిన ప్రకారము నా యభీష్టము నెరవేరుటకు నీవు సంసిద్ధురాలవు కమ్ము. నశించుచున్న భరత వంశమును పునరుద్ధరింపుము. నీవు, ఇంద్రుని వంటి తేజశ్శాలియైన పుత్రుని కనుము. అతడే మన కులము యొక్క మహారాజ్య భారమును వహించగలడు."

"జనమేజయా! కౌసల్య గూడ ధర్మాచరణము చేయునదిగానే యుండెను. సత్యవతి ధర్మానుసారముగానే కౌసల్యకు ఏదోయొక విధముగ నచ్చచెప్పి మిక్కిలి కష్టముతో ఆ కార్యమునకు ఆమెను ఒప్పించి సిద్ధపరచెను. తరువాత, సత్యవతి బ్రాహ్మణులకు దేవర్షులకు, అతిథులకు భోజన సంతర్పణలు చేసెను."

**ధృతరాష్ట్ర - పాండు - విదురుల జననము :**

"జనమేజయా! తరువాత సత్యవతి ఋతుస్నాతయైన కోడలిని శయ్యపై కూర్చొనబెట్టి మెల్లగా ఆమెతో, 'కౌసల్యా, నీకు ఒక 'దేవరుడు' (పతికి సోదరుడు) ఉన్నాడు. అతడే నేడు, నీ యెద్దకు గర్భాధానము చేయుట కొరకు వచ్చును. నీవు జాగ్రత్తతో అతని కొరకు వేచియుండుము. అతడు సరిగా అర్ధరాత్రి సమయమందు ఇక్కడకు వచ్చును" అని చెప్పెను.

"జనమేజయా! అత్తగారు చెప్పిన మాట విని కౌసల్య పవిత్రమైన ఆ శయ్యపై పరుండి, అప్పుడు మనస్సులో భీష్ముని ఇతర కురువంశ శ్రేష్ఠులను తలచుచు నుండెను. అప్పుడు నియోగ విధిని అనుసరించి సత్యవాదియైన వ్యాస మహర్షి శరీరమునకు నెయ్యి పూసికొని మనోనిగ్రహముతో, అసహ్య రూపముతోను అంబిక యింటిలో ప్రవేశించెను. అప్పుడు అనేక దీపములక్కడ వెలుగుచుండెను. వ్యాసుని శరీరము నల్లగా, జటలు పసపు వర్ణముతో, కన్నులు మెఱియుచు, గడ్డము మీసములున్ను గోరోచన వర్ణముతోను కనబడుచుండెను. అతనిని చూచి కౌసల్యా దేవి భయపడి కన్నులు మూసికొనెను.

"జనమేజయా! అప్పుడు వ్యాసుడు తల్లి కోరిక ప్రకారము అంబికతో సమాగమము చేసెను. కాని, ఆమె భయము చేత అతని వైపు బాగుగా చూడ జాలకుండెను. వ్యాసుడు అంబిక యింటి నుండి బయలు వెడలినప్పుడు తల్లి సత్యవతి వచ్చి ఆయనతో, 'పుత్రా! అంబిక గర్భము నుండి గుణవంతుడైన రాజకుమారుడు పుట్టునా?' అని యడిగెను.

తల్లి మాటకు వ్యాసుడు ఆమెతో నిట్లనెను :-

"తల్లీ! ఆ పుట్టిన బాలకుడు పదివేల యేనుగులబలము గలవాడు, విద్వాంసుడు, రాజర్షులలో శ్రేష్ఠుడు, పరమ సౌభాగ్యశాలి, మహాపరాక్రమ సంపన్నుడు అత్యంత బుద్ధిశాలియు నగును. అతనికి నూరుగురు పుత్రులు పుట్టెదరు. కాని, తల్లి దోషముచేత ఆ బాలకుడు అంధుడగును".

"జనమేజయా! వ్యాసుని మాట విని తల్లి సత్యవతి ఆయనతో, 'తపోధనా! ఈ కురువంశపు రాజు అంధుడుగా నుండుట సముచితము కాదు. కనుక, తన్ను జ్ఞాతి

బంధువులను, సమస్త కురుకులమును రక్షించి, పితృవంశమును అభివృద్ధిపరచు నట్టి మరియొక రాజకుమారుని కురువంశము కొరకు అనుగ్రహింపుము' అని యనగా, వ్యాసుడు 'తథాస్తు!' (అట్లే యగుగాక!) అని చెప్పి అక్కడి నుండి వెడలిపోయెను.

"జనమేజయా! ప్రసవకాలము వచ్చినప్పుడు, కౌసల్య గ్రుడ్డివానిని కనెను. అప్పుడు సత్యవతి, తన రెండవ కోడలను 'అంబాలిక'ను అంగీకరింప జేసి, పూర్వమువలెనే వ్యాసుని స్మరింపగా, ఆ మహాముని వచ్చి నియోగ విధి ప్రకారము అంబాలికతో సమాగమము చేసెను. వికృతరూపము గల వ్యాసుని చూచి యామె భయముచేత వివర్ణురాలై, పాలిపోయి, పాండు వర్ణముగల దానివలె నయ్యెను. ఆమె భయముచేత విషాదముతో, పాండు (తెల్ల) వర్ణము గల దానివలె నగుట చూచి, వ్యాసు డామెతో నిట్లనెను:-

"అంబాలికా! నీవు, విరూపుడుగా నున్న నన్ను చూచి పాండు వర్ణము గల దాని వలెనైతివి. కనుక, నీకు పుట్టబోవు పుత్రుడు తెల్లరంగు గలవాడగును. ఈ బాలకుని పేరు గూడ ప్రపంచములో 'పాండు' అని ప్రసిద్ధమగును."

"జనమేజయా! యిట్లు చెప్పి వ్యాసభగవాను డచటి నుండి వెడలిపోవు చుండగా, సత్యవతి అతనిని పూర్వము వలెనే యడిగెను. అతడు, జరిగిన సంగతి యామెకు చెప్పెను. తరువాత సత్యవతి మరియొక పుత్రుని కొరకు వ్యాసుని యాచింపగా నతడు 'సరియే' యని తల్లి యాజ్ఞను అంగీకరించెను.

"జనమేజయా! తరువాత అంబాలిక సకాలములో పుత్రుని కనెను. ఆ బాలకుడు పాండు వర్ణముతో భాసిల్లుచుండెను. అతడే పంచ పాండవులకు తండ్రి. తరువాత, సత్యవతి, తన పెద్ద కోడలు అంబికను 'మరల వ్యాసునితో సమాగమము చేయు' మని నియోగించెను. కాని, దేవకన్య వంటి అంబిక, వ్యాసముని వికృతరూపమును, గంధమును తలచి, భయముతో, సత్యవతీదేవి యొక్క ఆజ్ఞను అంగీకరించక, అప్సరసవంటి తన దాసిని, తన యాభరణములతో నలంకరించి, ఆ నల్లని వ్యాసుని కలియుటకు పంపెను. వ్యాస మహర్షి రాగానే, ఆ దాసి ముందుకుపోయి ఆయనకు స్వాగతము చెప్పి, నమస్కారము చేసి,

ఆయన యాజ్ఞపై శయ్యపైన కూర్చొని, ఉత్సాహముతో ఆయనకు సేవలు, పూజలు చేసెను.

"జనమేజయా ! వ్యాస మహర్షి ఆ దాసితో ఏకాంతము నందు సమాగమము చేసి మిక్కిలి సంతష్టుడయ్యెను. కఠోర తపోవ్రత పాలనము చేయు వ్యాసమహర్షి ఆ దాసితో శయనించి లేచినపుడు ఆమెతో 'శుభాంగీ! ఇక నీవు దాసిగా నుండవు. నీ గర్భమునం దొక యత్యంత శ్రేష్ఠ బాలకుడు ప్రవేశించెను. అతడు ప్రపంచములో ధర్మాత్ముడు, బుద్ధిమంతు లందరిలో శ్రేష్ఠుడు నగును' అని చెప్పెను.

"జనమేజయా! ఆ బాలకుడు విదురు డాయెను. అతడు శ్రీకృష్ణద్వైపాయనుని పుత్రుడు. తండ్రి యొకడే అగుటచేత విదురునకు, ధృతరాష్ట్ర-పాండువులు భ్రాతలైరి. యమధర్మరాజు విదురుని రూపములో, మాండవ్యమహాముని శాపముచేత జన్మించెను. అతడు అర్థతత్త్వము నెరిగినవాడు, కామక్రోధరహితుడుగా నుండెను.

"జనమేజయా! కృష్ణద్వైపాయన మహాముని సత్యవతికి, 'అంబిక తన దాసిని నా కడకు పంపి నాతో కపటముగా వ్యవహరించెను. గనుక, శూద్రస్త్రీయగు దాసి గర్భము నుండి పుత్రుడు పుట్టును' అను రహస్యము తెలిపెను.

"జనమేజయా! యీ విధముగా వ్యాస భగవానుడు మాత యాజ్ఞ పాలించుట యనెడు ధర్మము అనుష్ఠించి, తల్లి ఋణము నుండి విముక్తుడై, తల్లి యాజ్ఞ గొని యంతర్ధానము చెందెను. విచిత్ర వీర్యునకు వ్యాసునివలన ఈ ముగ్గురు పుత్రులు పుట్టిరి. వారు దేవకుమారులవలె తేజస్వులై', కురువంశమును వృద్ధిపరచువారుగా నుండిరి".

**మాండవ్యుని కథ :**

ఆ కథ విని జనమేజయుడు వైశంపాయన మునితో నిట్లనెను :

"బ్రహ్మన్! యమధర్మరాజునకు ఏ కార్యము చేసినందున, శాపము వచ్చెను. అతడు ఏ బ్రహ్మర్షి శాపముచేత శూద్ర స్త్రీ యోని యందు పుట్టెను?"

ఆ మాటకు వైశంపాయను డిట్లు చెప్ప దొడగెను :-

''జనమేజయా! పూర్వము ''మాండవ్యుడు' అను పేరుతో ప్రసిద్ధుడైన యొక బ్రాహ్మణుడుండెను. అతడు దైర్యవంతుడు - ధర్మజ్ఞుడు - నిత్యవ్రత నిష్ఠుడు - తపస్విగా నుండెను. ఆ మహాముని, తన యాశ్రమద్వారమునందలి యొక వృక్షమూలమున, రెండు చేతులు పైకెత్తి, మౌనవ్రతముతో నిలిచియుండి మహా కఠిన తపస్సు చేయుచుండెను. అతడు గొప్ప యోగీశ్వరుడు. ఇట్లా ముని చాల నాళ్ళు తపస్సు చేసెను.

ఇట్లుండగా, నొకనాడు, చాలమంది దొంగలు దొంగ వస్తువులతో ఆ యాశ్రమమునకు వచ్చిరి. అనేక సైనికులా దొంగలను వెన్నంటుచుండిరి. అప్పుడా దొంగలు, దొంగవస్తువులను ఆ యాశ్రమమునందుంచి, సైనికుల భయముచేత, వారు వచ్చుటకు పూర్వమే దొంగలెక్కడనో దాగియుండిరి. తరువాత రక్షక సైనికులు అక్కడకు వచ్చి, అక్కడ తపస్సు చేయుచున్న మాండవ్యమునితో, 'చోరు లేమార్గమున పారిపోయిరి? వారిని వెన్నంటి పోయెదము' అని యడిగిరి."

"జనమేజయా! ఆ భటులట్లడిగినప్పుడు, ఆ తపోధనుడు ఏమియు పలుకక, మౌనముతో నుండెను. అప్పుడు ఆ సైనికులు ఆ యాశ్రమమునందే చోరులను వెదకి, అక్కడనే దాగియున్న చోరులను, దొంగవస్తువులనున్ను చూచిరి. తరువాత వారు, 'ఆ మునీశ్వరుడే దొంగ' యని సందేహించి, అతనిని బంధించి రాజుకడకు కొనిపోయి, రాజునకు అన్ని సంగతులుచెప్పి, ఆ దొంగలనుగూడ రాజునకు ఒప్పగించిరి. అప్పుడారాజు 'వారందరిని వధింపు' దని అజ్ఞయీయగా, ఆ భటులు దొంగలతోపాటు ఆ మాండవ్య మహామునిని గూడ, ఎరుగక, శూలముపై నెక్కించిరి. అట్లు ఆ మునిని, దొంగలను శూలారోపణ ముచేసి, ఆ దొంగ వస్తువులను రాజునకు ఒప్పగించిరి.

"జనమేజయా ! ధర్మాత్ముడైన మాండవ్యుడు ఆ శూలమునందు చాల కాలము నిరాహారుడై యుండినను మరణించలేదు. ఆ మహాముని ప్రాణధారణము చేసి మునులను స్మరించి పిలువగనే వారు వచ్చి శూలము కొనపై తపస్సు చేయుచున్న ఆ మహాత్ముని శక్తిచేత ప్రభావితులై, ఆ మునులందరు మిక్కిలి సంతా

పముచెందిరి. వారు రాత్రియందు పక్షుల రూపము ధరించి, ఎగిరి అక్కడకు వచ్చి, తమ శక్త్యనుసారముగ తమ స్వరూపమును ప్రకటింపజేయుచు మాండవ్య మహా మునిని, 'బ్రహ్మన్! నీవు ఏ పాపముచేసి ఇక్కడ శూలముపై కూర్చుని మహా కష్టము అనుభవించు చున్నావు?' అని యడిగిరి."

**మాండవ్యుడు యమధర్మరాజును శపించుట :**

"జనమేజయా! అట్లు మునీశ్వరు లడుగగా, మాండవ్యుడు వారితో, 'నేను ఎవరిపై దోషము మోపెదను? ఇతరుడెవడు గూడ నాకు అపరాధము చేయలేదు! అనిచెప్పెను.

"జనమేజయా! అట్లు అనేక దినములదాక మాండవ్య మహాముని శూలముపై కూర్చొని యుండుట చూచి, రక్షకభటులు తమ రాజు కడకు పోయి ఆ సమాచారమంతయు ఉన్నదున్నట్లు రాజునకు తెలిపిరి. వారి మాటలు విని, రాజు మంత్రులతో సంప్రదించి, మాండవ్య మహామునిని ప్రసన్నుని జేయుటకు ప్రయత్నించి, ఆ మునితో, 'మునీంద్రా! నేను మోహము చేతనో, అజ్ఞానముచేతనో నీకు చేసిన యపరాధమునకు నన్ను కోపింపకుము. నీవు ప్రసన్నుడవుకమ్ము అని ప్రార్థించు చున్నాను.' అని యనెను.

"జనమేజయా! రాజు మాటలు విని మాండవ్య ముని ప్రసన్నుడయ్యెను. వెంటనే, ఆ మునిని శూలము నుండి రాజు దింపి, శూలాగ్ర భాగమును పట్టుకొని ఆ మహాముని శరీరాంతర్భాగము నుండి శూలమును ఊడ పెఱకెను. కాని, ఆ కార్యము సఫలము గానందు చేత అతడు ఆ శూలపు మూల భాగమును ఖండించెను.

"జనమేజయా! అప్పటి నుండి ఆ మహాముని ఆ శూలాగ్ర భాగమును తన శరీరములోపల ఉంచుకొనియే సంచరింప దొడగెను. మాండవ్య మహాముని యొనర్చిన ఘోరమైన తపస్సు చేత ఇతరులకు దుర్లభములైన పుణ్యలోకములను జయించి, పొందెను. 'అణి'యనగా శూలాగ్రభాగము. దానితో గూడిన వాడగుట చేత ఆ మహాముని అప్పటినుండి అన్ని లోకములలోను 'అణీ మాండవ్యుడు' అనబడజొచ్చెను.

"జనమేజయా! ఒకసారి పరమాత్మ తత్త్వజ్ఞుడైన అణీమాండవ్య మహాముని యమధర్మరాజు భవనమునకు పోయి ధర్మాసనమునందు కూర్చునియున్న యమధర్మరాజును నిందా పూర్వకముగా, 'ధర్మరాజా! నేను అజ్ఞానము చేత ఏ పాపము చేసితిని? తత్ఫలానుభవము ఈ రూపములో నాకు కలిగెను. నాకు శీఘ్రముగ ఈ రహస్యము తెలుపుము. తరువాత నా తపోబలమును చూచెదవు గాక!' అని యడిగెను. అప్పుడు ఆ యిరువురకు నిట్లు సంవాదము జరిగెను :-

యముడు :- 'తపోధనా! నీవు తేనెటీగ తోకలో ఒక ముల్లు గ్రుచ్చితివి. ఆ కార్యమునకు ఫలముగా ఈ కష్టము నీకు ప్రాప్తించెను. బ్రహ్మర్షీ! కొద్దిగా దానము చేసినను దానికి యెన్నియో రెట్లు సత్ఫలము కలుగునట్లే, అధర్మము గూడ మిక్కిలి దుఃఖదాయకమైన దుష్ఫలము నిచ్చును.'

అణీమాండవ్యుడు :- 'ధర్మరాజా! నీవు చెప్పునది సరియే! నేను ఏ సమయమందు ఏ వయస్సునందు ఆ పాపము చేసితిని? సరిగా చెప్పుము.

యమ :- 'మహర్షీ! బాల్యావస్థలో నీవు ఆ పాపము చేసితివి!'

మాండవ్యుడు :- 'ధర్మరాజా! ధర్మశాస్త్రానుసారముగా, జన్మము నుండి పన్నెండు సంవత్సరముల వయస్సు వరకు బాలకుడు ఏ పని చేసినను, అది అధర్మము కాదు. ఎందుకనగా, అప్పుడు ఆ బాలకునకు ధర్మశాస్త్ర జ్ఞానము ఉండజాలదు. నీవు కొద్ది అపరాధమునకే నాకు చాల పెద్ద దండనము విధించితివి. బ్రాహ్మణుని వధించుట సమస్త ప్రాణుల వధకంటె గూడ అధిక భయంకరము. కనుక, ధర్మరాజా! నీవు శూద్రయోని యందు మనుష్యుడవై జన్మింపుము. నేటి నుండి ప్రపంచమునందు నేను ధర్మఫలమును ప్రకటించునట్టి యొక మర్యాద (పరిమితి) స్థాపించెదను– 'పదునాలుగు సంవత్సరముల వయస్సువరకు ఎవరికి గూడ పాపము అంటదు. ఆ వయస్సు దాటినవారు చేయు పాపమునకే దోషము అంటును."

"జనమేజయా! ఈ యపరాధము వలననే మహాత్ముడైన మాండవ్య మహాముని యొక్క శాపముచేత శూద్రయోని యందు విదురుడుగా పుట్టెను. విదురుడు ధర్మశాస్త్ర - అర్థశాస్త్రములందు పండితుడై క్రోధ - లోభ రహితుడై,

దూరదృష్టి గలవాడై, శాంతి తత్పరుడై, కౌరవుల హితమునందు ఆసక్తి గల వాడై యుండెను."

**ధృతరాష్ట్రాదుల జననము - భీష్ముని ధర్మ పరిపాలనము :**

"జనమేజయా! ధృతరాష్ట్ర - పాండు - విదురుల జన్మము నుండి కురు వంశ - కురుజాంగల - కురుక్షేత్రములు మూడున్ను మిక్కిలి అభివృద్ధి చెందెను. సస్యాభివృద్ధి, రుచికర ధాన్యము, సకాల వర్షములు, వృక్షముల ఫల - పుష్పవృద్ధి ఆ దేశములలో విశేషముగ జరిగెను. గజాశ్వాది వాహనములు హర్ష ముతో బలిసియుండెను. మృగ పక్ష్యాదులు ఆనందముతో కాలము గడుపు చుండెను. పుష్పములలో సాటిలేని సుగంధము, ఫలములలో అపూర్వమైన రుచి ఉండెను. అన్ని నగరములు వ్యాపారకుశలురైన వైశ్యులతో, శిల్పకళా నిపుణు లైన కళాభిజ్ఞులతోను నిండియుండెను. వీరులు, విద్వాంసులు, సజ్జనులున్ను సుఖముగా నుండిరి.

"రాజా! ఆ దేశములలో దొంగలు, పాపిష్ఠులు పూర్తిగా లేకుండిరి. రాష్ట్రపు ప్రాంతము లన్నిటిలోను కృతయుగము ఆవరించియుండెను. ప్రజలు సత్యవ్రతులై, యజ్ఞకర్మల యందు ఆసక్తులై, ధర్మ కర్మల యందు నిమగ్నులై పరస్పర సుఖమును కోరుచు అభివృద్ధి పథమునందు సాగుచుండిరి.

"రాజా! ప్రజలందరు అభిమానము, క్రోధ-లోభములున్ను లేకుండ, ఒండొరులు ప్రసన్నముగ నుండుటకు ప్రయత్నించు చుండిరి. లోకుల యాచార వ్యవహారములలో ధర్మమునకే ప్రాధాన్యము ఉండెను. కౌరవ నగరము సముద్రమువలె అన్ని విధముల పరిపూర్ణమై యుండి మేఘసమూహముల వంటి పెద్ద-పెద్ద ద్వారములతో, గోపురములతోను శోభిల్లుచుండెను.

"రాజా! నూర్లకొలది మేడలు గల ఆ పట్టణము ఇంద్రుని అమరావతి వలె శోభిల్లుచుండెను. అక్కడి ప్రజలు నదీ-వన జలాశయ - పర్వత - రమణీయో ద్యానముల యందు సంతోషముతో విహరించు చుండిరి. అప్పుడు దక్షి ణోత్తర కురుదేశములలోని ప్రజలు దేవతా-ఋషి-చారణులతో స్పర్ధ (పోటీ) పడి స్వేచ్ఛగా తిరుగుచుండిరి. ఆ రాష్ట్రమునందలి ఆరామ-కూప-వాపీ-సభా భవనాదులు పరిపూర్ణములై, బ్రాహ్మణ గృహాదులు సర్వవిధ సమృద్ధులతో తులదూగుచుండెను. అక్కడ నూతనోత్సవములు జరుగుచుండెను.

"జనమేజయా! భీష్ముడు ఆ రాష్ట్రమును అన్నివైపుల ధర్మపూర్వకముగ రక్షించుచుండగా, కురుదేశము నూర్లకొలది దేవస్థానములతో, యజ్ఞస్తంభ యూపములతో విరాజిల్లుచుండెను. ఆ దేశము ఇతర రాష్ట్రములను మించి నిరంతరము అభివృద్ధి పొందుచుండెను. భీష్ముని ధర్మశాసనము అంతట సాగుచుండెను. ఆ రాష్ట్రమునందు లోభులు, విధవాస్త్రీలున్ను లేకుండిరి.

"రాజా! భీష్ముడు ధృతరాష్ట్రాది కుమారులు ముగ్గురికి యజ్ఞోపవీతాది సంస్కారములు చేయుచున్నప్పుడు దేశమంతటా వేడుకలు జరిపికొనిరి. కురుకులము నందుఅందరి యిండ్లలో 'దానము ఇమ్ము - అతిథులకు భోజనము పెట్టుము' అను మాటలు ఎల్లప్పుడు వినబడుచుండెను."

"జనమేజయా! భీష్ముడు, ధృతరాష్ట్ర - పాండు - విదురులను జన్మము నుండి పుత్రులవలె పోషించుచు వారికి అన్ని సంస్కారములు చేసెను. వారు బ్రహ్మచర్యవ్రత పాలనముతో వేదాధ్యయనము నందు ఆసక్తులై యుండిరి. వ్యాయామాది పరిశ్రమలు చేయుచు యువావస్థకు వచ్చిరి. ధనుర్వేద - అశ్వారోహ - గదాయుద్ధ - గజశిక్ష - నీతిశాస్త్రములందు, ఖడ్గ యుద్ధము నందున్ను ముగ్గురు పారంగతులైరి. ఇతిహాస పురాణాదులు, వివిధ శిష్టాచారములు, వేద - వేదాంగములు వారికి నేర్పబడెను. అంతట గూడ ఒకే సిద్ధాంతము అంగీకరింపబడుచుండెను."

"జనమేజయా! పాండురాజు ధనుర్విద్యలో తనసాటి వారందరికన్న నధిక పరాక్రమము కలిగియుండెను. ఇట్లే ధృతరాష్ట్రుడు ఇతరులకన్న నధిక బలశాలిగ నుండెను. మూడు లోకములలోను విదురునితో సమానుడైన ధర్మపారాయణుడు, ధర్మము నందు ఉన్నతస్థితిని పొందినవాడు, (ఆత్మద్రష్ట)*

"అయంతు పరమో ధర్మో యద్ యోగేనాత్మదర్శనమ్" అనగా, 'యోగాభ్యాసము చేత పరమాత్మ సాక్షాత్కారము చేయుట మిక్కిలి ఉత్కృష్టమైన ధర్మము' అని అర్థము. ఈ యాజ్ఞవల్క్య స్మృతి వాక్యము చేత 'ఆత్మదర్శనమే యన్నిటికన్న ఉత్తమ ధర్మ'మని తెలియవలెను. అదే విదురుని ధర్మము.

మరియొకడు లేకుండెను. నశించిన శాంతను వంశము పునరుద్ధరింపబడుట చూచి, రాష్ట్ర ప్రజలు ఇట్లు అనుకొన జొచ్చిరి."

"వీరమాతలైన స్త్రీలలో కాశిరాజు పుత్రికలు ఉత్తమురాండ్రు. కురు జాంగలము అన్నిటికన్న ఉత్తమ దేశము. భీష్ముడు ధర్మజ్ఞులందరిలోను ఉన్న తుడు. నగరము లన్నింటిలో హస్తినాపురము సర్వోత్తమము."

"జనమేజయా! ధృతరాష్ట్రుడు అంధుడగుటచేతను, విదురుడు పారశవుడు* అగుటచేతను రాజ్యమును పొందజాలనందువలన పాండురాజు రాజ్యాధికారి అయ్యెను."

"జనమేజయా! తరువాత ఒకసారి భీష్ముడు ధర్మతత్త్వజ్ఞుడైన విదు రునితో న్యాయసమ్మతముగా నిట్లుచెప్పెను :-"

**ధృతరాష్ట్రుని వివాహము :**

"పుత్రా! విదురా! మన కులము అనేక సద్గుణ సంపన్నమై ప్రపంచములో ప్రఖ్యాతి చెందియున్నది. ఈ వంశము వారు ఇతర రాజులను జయించి, భూమండల సామ్రాజ్యాధికారము వహించినారు. ధర్మజ్ఞులు, మహాత్ములునైన ప్రాచీన రాజులు ఈ కులమును రక్షించినారు. కాబట్టి ఇది ఎప్పుడుగూడ విచ్ఛిత్తి పొందదు. ఈ మధ్య కొంతకాలము సంకటములు సంభవించి నప్పటికిన్ని, నేను, తల్లి సత్యవతీదేవి, వ్యాసమహాముని ముగ్గురము కలిసి, ఈ కులమును పునః ప్రతిష్ఠించినాము. మీరు ముగ్గురు సోదరులు ఈ కులమునకు ఎడతెగని తంతువు లుగా నున్నారు. మీ పైననే ఇప్పుడు కుల ప్రతిష్ఠ నిలిచియున్నది.

"వత్సా! ఈ మన కులము, పూర్వముగూడ సముద్రమువలె విశాలమై, ముందుకు సాగుటకుగాను మన మిరువురము తగిన యుపాయము యోచించవలసి యున్నది. యదు వంశీయుడైన శూర సేనుని పుత్రి 'పృథ' యనునామె ఇప్పుడు కుంతి భోజునకు దత్త పుత్రికగా నున్నది. ఆమె మన కులమునకు తగిన కన్యక.

* శూద్రస్త్రీ గర్భము నుండి బ్రాహ్మణునకు పుట్టినవాడు 'పారశవుడు' అనబడును.

ఇట్లే గాంధార రాజైన సుబలునకు, మద్రదేశ రాజునకున్ను కన్యకలున్నట్లు తెలిసినది. పుత్రా! ఈ కన్యకలందరు ఉత్తమ కులమునందు పుట్టిన సౌందర్యవతులు. ఉత్తమ క్షత్రియ కన్యకలు గనుక, మనతో వివాహ సంబంధమునకు అన్ని విధముల తగినవారు. కనుక, మన కులము యొక్క సంతాన పరంపరను వృద్ధిపరచుటకు ఆ కన్యకలను వరించవలెనని నా యభిప్రాయము. లేదా, ఈ విషయములో నీ యభిప్రాయము ప్రకారమే జరుగుగాక!" ఆ మాటకు విదురు డిట్లనెను :-

"మహారాజా! నీవే మాకు తల్లివి, తండ్రివి, గురుడవుగాను నున్నావు. కనుక, నీవు స్వయముగా యోచించి, ఈ కులమునకు హితకరమైన కార్యము చేయుము".

"జనమేజయా! తరువాత, 'గాంధార రాజపుత్రి గాంధారి శంకర భగవానుని ఆరాధించి తనకు నూరుగురు పుత్రులు కలుగుటకు వరము బడసి యుండె" నని భీష్ముడు బ్రాహ్మణుల ద్వారా వినియుండెను. ఆ విషయము సరియేయని తెలిసినప్పుడు భీష్ముడు గాంధారరాజు కడకు (ధృతరాష్ట్రుని కొరకు కన్యకకై) దూతను పంపెను. అది విని సుబలుడు, 'ధృతరాష్ట్రుడు అంధు'డని మిక్కిలి చింతించెను. కాని అతని కులము, ప్రసిద్ధి, ప్రవర్తన మొదలైన విషయములను గూర్చి బాగుగా విచారించి సుబలుడు ధర్మపరురాలైన గాంధారిని ధృతరాష్ట్రున కిచ్చుటకు వాగ్దానము చేసెను.

"జనమేజయా! 'ధృతరాష్ట్రుడు అంధుడని అతనితో తన వివాహము చేయుటకు తన తల్లిదండ్రులు కోరుచున్నా'రనియు వినినప్పుడు గాంధారి పట్టు వస్త్రమును చాల మడతలు మడిచి కన్నులకు కట్టుకొనెను. ఆమె చాల పతివ్రతగా నుండెను. ఆమె 'తాను, సర్వదా పతికి అనుకూలురాలుగా నుండెదను, పతిదోషములను చూడను' అని నిశ్చయించుకొని యుండెను.

"జనమేజయా! తరువాత నొకనాడు గాంధార రాజకుమారుడైన శకుని, సర్వశుభలక్షణురాలైన తనసోదరి గాంధారిని తోడుకొని కౌరవుల కడకుపోయి

మిక్కిలి ఆదరసత్కార పూర్వకముగా గాంధారిని భీష్మని సమ్మతితో ధృత-రాష్ట్రునకు సమర్పించి, ఆ యిరువురకు వివాహము చేసెను. తరువాత చెల్లెలికి యోగ్యమైన కట్నములు శకుని ఇచ్చెను. భీష్ముడుకూడ శకునిని సన్మానించెను. తరువాత శకుని తన రాజధానికి తిరిగిపోయెను.

"జనమేజయా! సౌందర్యవతియైన గాంధారి తన ఉత్తమ స్వభావము, సత్ప్రవర్తన అందరితో బాగుగా మెలగుట ఈ మొదలైన సద్గుణములచేత సమస్త కౌరవులను సంతోషపరచెను. ఇట్లు అందరి మెప్పువడసి ఉత్తమ వ్రతమును పాలించుచు పతివ్రతయైన గాంధారి పరపురుషుల పేరు ఎప్పుడున్ను ఉచ్చరించ లేదు."

**కుంతికి దుర్వాసుని మంత్రప్రాప్తి - ఆమె సూర్యుని వలన కర్ణుని కనుట - కర్ణుడు ఇంద్రునకు కవచకుండలము లిచ్చుట :-**

"జనమేజయా! యదువంశీయుడైన శూరసేనుడు వసుదేవునకు తండ్రి. అతనికి, 'పృథ' అనునొక కూతురు ఉండెను. ఆమె అతిలోక సౌందర్యవతి. సత్యవాదియైన శూరసేనుడు తన మేనత్త కొడుకైన కుంతిభోజుడు సంతాన హీనుడు గనుక తన తొలి సంతానమును కుంతిభోజునకు ఇచ్చెదనని ప్రతిజ్ఞ చేసి యుండెను గనుక, తన తొలిసంతానమైన కన్యకను తన మిత్రుడైన కుంతి భోజునకు ఇచ్చెను."

"జనమేజయా! కుంతిభోజుని యింటిలో పృథాకన్యకు దేవతాపూజలు, అతిథి సత్కారములు చేయుట ఒప్పగింపబడి యుండెను. ఒకనాడు. కఠోర తపస్వి, సర్వదా ధర్మవిషయమై తన నిశ్చయమును గుప్తముగా నుంచువాడు నగు నొక బ్రహ్మర్షి సత్తముడు 'దుర్వాసు' డనువాడు కుంతిభోజుని యింటికి వచ్చెను. ఆ యతిథికి పృథాకన్యకసేవ చేయుచుండెను. దుర్వాసుడు మిక్కిలి ఉగ్రస్వభావము గలవాడు. కఠిన హృదయుడు. అట్లయినను, పృథ సర్వ ప్రయత్నములచేత అతనిని పూర్తిగా సంతుష్టిపరచెను.

"జనమేజయా! దుర్వాసుడు పృథకు రాబోవు సంకటములను విచారించి ఆమె ధర్మమును రక్షించుటకై ఆమె కొక వశీకరణమంత్రము ఉపదేశించి, దానిని ప్రయోగించు విధిని గూడ తెలిపి, ఆమెతో 'శుభాంగీ! నీ వీ మంత్రము

చేత ఆహ్వానించిన యే దేవతయైనను వచ్చి నిన్ననుగ్రహించి నీకు పుత్రుని ప్రసాదించును' అని చెప్పెను.

"జనమేజయా! బ్రహ్మర్షియైన దుర్వాసుడు ఇట్లు చెప్పిన మీదట కుంతీ దేవికి మిక్కిలి కౌతూహలము కలిగి, ఆమె కుమారి (అవివాహిత)గా నున్నప్పటి కిన్ని మంత్రము పరీక్షించుటకు సూర్యదేవతను ఆహ్వానించెను. వెంటనే సమస్త జగదుత్పత్తిరక్షణకర్తయైన సూర్యభగవానుడు ఆమె కడకు వచ్చెను. అత్యాశ్చర్యకరమైన ఈ విషయము చూచి కుంతి చకితురాలయ్యెను. సూర్యభగవానుడు ఆమె కడకు వచ్చి 'కుంతీ! నేను వచ్చితిని. నీకు ఏమి కావలయునో చెప్పుము. నేను దుర్వాసమహర్షి నీకు ఇచ్చిన మంత్రముచేత ప్రేరితుడనై నీవు పిలువగనే, నీకు పుత్రప్రాప్తి కలిగించుటకు వచ్చితిని. నేను సూర్యదేవుడను" అని చెప్పెను. ఆ మాటకు కుంతి ఇట్లనెను:-

"దేవా! ఒక బ్రాహ్మణుడు నాకు వరముగా దేవతలను ఆహ్వానించు మంత్రము ఉపదేశించెను. ఆ మంత్ర పరీక్షకొరకు నేను నిన్ను ఆహ్వానించితిని. నేను ఈ విషయములో అపరాధము చేసినప్పటికిన్ని నీ చరణములపై మస్తకము ఉంచిన, నన్ను క్షమించి ప్రసన్నుడవుకమ్మని ప్రార్థించుచున్నాను. స్త్రీలు అపరాధము చేసినప్పటికిన్ని దానిని నీవంటి శ్రేష్ఠపురుషులు క్షమించి వారిని రక్షించవలెను" ఆ మాటకు సూర్యభగవానుడు కుంతితో నిట్లనెను :

"శుభాంగీ ! నీకు దుర్వాసుడు వరమిచ్చిన సంగతియంతయు నాకు తెలియును. నీవు నిర్భయముగా ఇక్కడ నాతో సమాగమము చేయుము. నా దర్శనము వ్యర్థము కాదు. నీవు నన్ను ఆహ్వానించితివి. ఇక్కడకు నా రాక వ్యర్థమైన యెడల నీకు చాలా దోషము కలుగును. ఇందులో సందేహము లేదు."

"జనమేజయా ! సూర్యభగవానుడు కుంతీదేవికి ఇట్లు నచ్చజెప్పెను. కాని ఆమె యోచించి ఆయనతో సమాగమమునకు ఇష్టపడలేదు. బంధువులలో తనకు అపకీర్తి కలుగునను భయము చేతను లజ్జ చేతను ఆమె సూర్య సమాగమము అంగీకరింపజాలక పోయెను. అప్పుడు సూర్యుడు మరల ఆమెతో నిట్లనెను :

"రాజకుమారీ! నీకు పుత్రుడు మా తల్లి అదితి యిచ్చిన దివ్యకుండలము లతోను, కవచము తోను పుట్టగలడు. ఆ సహజ కవచము ఏ శస్త్రాస్త్రముల చేతను భేదింపబడ జాలదు. ఆ బాలకుని యొద్దనున్న ఏ వస్తువైనను బ్రాహ్మణులకు అదేయము కాదు. నేనే వచ్చి అతని కొంత వేళ వలదని చెప్పినప్పటికిని అతడు ఎప్పుడు గూడ అయోగ్యమైన కార్యము చేయడు. బ్రాహ్మణులు యాచించి నప్పుడు అతడు వారు కోరిన వస్తువులన్నియు తప్పక ఇచ్చును. ఆ బాలకుడు ఆత్మాభిమానము కలవాడు. నా దయ చేత నీకు ఏ దోషము గూడ కలుగదు.

"జనమేజయా ! సూర్యుడిట్లు చెప్పి, కుంతితో సమాగమము చేసెను. వెంటనే, సమస్త శస్త్రధారులలో శ్రేష్ఠుడైన ఒక వీరపుత్రుడు పుట్టెను. అతడు జన్మము నుండియే కవచధారణము చేసి దేవకుమారుని వలె తేజస్వియై, శోభిల్లు చుండెను. అతని ముఖము సహజ కుండములచే భాసిల్లు చుండెను. తరువాత సూర్యుడు కుంతికి మరల కన్యాత్వము ఇచ్చి దేవలోకమునకు వెడలిపోయెను."

"జనమేజయా ! ఆ కుమారుని చూచి, కుంతిదేవి మిక్కిలి దుఃఖించి 'ఇప్పుడు ఏమి చేసినచో దీనికి మంచి పరిణామము కలుగును'' అని యేకాగ్ర చిత్తముతో విచారించి, కుటుంబ జనుల భయము చేత తన యనుచిత కృత్యమును కప్పిపుచ్చుచు కర్ణుని జలము నందు విడిచెను.

"జనమేజయా ! ఆ శిశువును సూతపుత్రుడు (సారథి జాతివాడు) 'అధిరథు'డను వాడు జలము నుండి తీసికొనెను. అతడు, అతని భార్య 'రాధ'యను నామెయు ఆ బాలకుని తమ పుత్రునిగా స్వీకరించి, ఆ బాలకుడు వసువు (కవచ కుండలాది ధనము)తో పుట్టినవాడు. కాబట్టి, అతనికి 'వసుషేణుడు' అని నామకరణము చేసిరి. ఆ బాలకుడు పెరుగుచున్న కొలది అస్త్ర విద్యా నిపుణుడాయెను. అతడు ప్రాతఃకాలము నుండి సూర్యుడు పడమటివైపు వాలునంత దాక, సూర్యోపస్థానము (సూర్యుని ఉపాసన పూజ) చేయు చుండెను. అతడు మంత్ర జపము చేయుచున్నపుడు బ్రాహ్మణులు ఏది అడిగినను ఆ వస్తువులన్నియు దానముగా నిచ్చుచుండెను. అతడీయజాలని వస్తువు ప్రపంచములో ఏదియు లేదు.

"జనమేజయా! ఇట్లుండగా, నొక నాడు సూర్యుడు బ్రాహ్మణ రూపముతో కర్ణునకు స్వప్నమునందు దర్శనమిచ్చి ఇట్లనెను:-

"వీరాగ్రేసరా! నా మాట వినుము. రేపు తెల్లవారగనే నీ కడకు ఇంద్రుడు బ్రాహ్మణ వేషముతో వచ్చి నిన్ను భిక్షము యాచించును. అతడు కోరినది నీవు ఈయకుము. అతడు నీ సహజ కవచకుండలములను అపహరించుటకు నిశ్చయించెను. కనుక, ఈ రహస్యము నీకు తొలుతనే తెలిపి జాగ్రత్తపరచుచున్నాను" ఆ మాట విని కర్ణు డిట్లనెను":

"బ్రహ్మన్! ఒకవేళ ఇంద్రుడే బ్రాహ్మణ రూపముతో వచ్చి నన్ను యాచించిన యెడల నీ యుపదేశమును అనుసరించి అతడు కోరిన వస్తువును నేనెట్లు ఈయకుండగలను? బ్రాహ్మణులు దేవతలకు గూడ పూజనీయులు. దేవాధి దేవుడైన యింద్రుడే బ్రాహ్మణ రూపములో వచ్చినాడని తెలిసి కూడ నేను అతని నెట్లు తిరస్కరించగలను?"

ఆ మాటకు సూర్యుడు కర్ణునితో 'వీరవరా! అట్లైనచో, నీ దానమునకు బదులుగా, ఇంద్రుడు గూడ నీకు వరము ఇచ్చును. అప్పుడు నీవు ప్రపంచములో సమస్త శస్త్రాస్త్రములను అణచగల 'శక్తి' ఆయుధమును అడిగి తీసికొనుము'. అని చెప్పి బ్రాహ్మణవేషధారియైన సూర్యుడు అంతర్ధానము చెందెను. అప్పుడు కర్ణుడు మేలుకొని స్వప్న వృత్తాంతమును చింతింప దొడగెను.

"రాజా! తరువాత ఒకనాడు ఇంద్రుడు బ్రాహ్మణ రూపముతో భిక్ష కొరకు కర్ణుని కడకు వచ్చి కవచకుండలములను యాచించెను. అప్పుడు కర్ణుడు ఇంద్రునకు నమస్కరించి తన పుట్టుకతో శరీరమునకు అంటుకొనియున్న కవచకుండలములను పెరికి ఛేదించి అతనికి ఇచ్చెను. వానిని తీసికొని ఇంద్రుడు మిక్కిలి సంతుష్టుడై కర్ణునితో 'ఆహా! నీవు మహా సాహసము చేసితివి. దేవ - దానవ - యక్ష - గంధర్వ - నాగ - రాక్షసాదులలో నింతటి సాహసముచేసిన వారి నెవరిన్ని గూడ నేను చూడలేదు. ఎవడిట్టి కార్యము చేయగల్గును?" అని చెప్పి. 'నేను నీయెడల ప్రసన్నుడనైతిని. నీవు ఏది కోరినను ఇచ్చెదను. అడుగుము.' అని యనెను. ఆ మాటకు కర్ణుడు, భగవన్! శత్రుసంహారకమైన నీ యమోఘ 'శక్తి' యాయుధమును కోరుచున్నాను. అనుగ్రహింపుము! అని యడిగెను.

"జనమేజయా! అప్పుడు ఇంద్రుడు కవచకుండలములకు బదులుగా, శక్తిని కర్ణునకు ఇచ్చి ఇట్లనెను:-

"వీరాగ్రేసరా! నీవు దేవాసుర - మనుష్య - గంధర్వ నాగులలో ఎవరిని జయింపదలచినను ఒక్కడు మాత్రము ఈ శక్తిప్రహారముచేత నశించగలడు."

"జనమేజయా! తొలుత అతని పేరు 'వసుషేణుడు' అని యుండెను. తరువాత కవచకుండలములు ఛేదించి ఇచ్చుటచేత 'కర్ణుడు' అను పేరుతో, వికర్తనుని (సూర్యుడు) పుత్రుడగుటచేత 'వైకర్తనుడు' అను పేరుతో ప్రసిద్ధుడాయెను."

**కుంతీ - పాండురాజుల వివాహము :**

"జనమేజయా! కుంతి భోజుని పుత్రి 'పృథ' ధర్మపరురాలు, రూప - సౌందర్య - సద్గుణ సంపన్నురాలుగాను నుండెను. అట్టి కన్యకను అనేక రాజకుమారులు కోరుచుండిరి. అప్పుడు కుంతిభోజుడు రాజులందరిని పిలిచి కుంతికి స్వయంవరము ఏర్పచెను. ఆ కన్యక అందరిలోను తనకు శ్రేష్ఠుడుగా తోచిన పాండును వరించెను. అతడు సింహసమానుడై, విశాల వక్షఃస్థలముతో, వృషభ నేత్రములతో, బలవంతుడై విరాజిల్లుచుండెను. అక్కడి రాజుల తేజస్సును తన తేజస్సుతో కప్పుచు సూర్యభగవానునివలె పాండురాజు ప్రకాశించుచుండెను.

"జనమేజయా! ఆ రాజసమూహములో పాండురాజు రెండవ చంద్రునివలె విరాజిల్లుచుండుట చూచి కుంతి స్వయంవర రంగమునందు అతనినే వరించుటకు ఉబలాటపడుచుండెను. ఆమె యవయవములన్నియు కామముచేత వ్యాప్తములై - మనస్సు చంచలమయ్యెను. అప్పుడు కుంతి లజ్జతో పాండురాజు కంఠమునందు స్వయంవరమాలికవేసెను. అదిచూచి అక్కడి రాజులందరు నిరాశతో తమ - తమ స్థానములకు తిరిగి పోయిరి.

"జనమేజయా! తరువాత ఆమె తండ్రి కుంతి భోజుడు పాండురాజుతో శాస్త్రవిధిగా కుంతికి వివాహము చేసెను. కుంతితో గూడిన పాండురాజు శచీ సహితుడైన యింద్రునివలె శోభిల్లెను.

"జనమేజయా! కుంతిభోజుడు తరువాత వారికి అనేక ధనములు రత్నములు ఇచ్చి సమ్మానించి పాండురాజును కుంతితో అతని రాజధానికి పంపెను.

అప్పుడు పాండురాజు తన సేనతో పోవుచుండగా అనేక బ్రాహ్మణులు, మహర్షులు అతనిని ఆశీర్వదించి స్తుతించిరి.

**మాద్రీ–పాండురాజుల వివాహము-పాండురాజు దిగ్విజయము:**

"జనమేజయా! తరువాత భీష్ముడు పాండునకు ద్వితీయ వివాహము చేయ దలచి, మంత్రి-బ్రాహ్మణ మహర్షులతో మద్రదేశ రాజధానికి పోయెను. 'వాహీక' శిరోమణియైన శల్యుడు, భీష్ముడు వచ్చుట విని నగర బహిర్భాగమునకు పోయి, భీష్మునకు ఎదురేగి, నగరమునకు తోడ్కొని వచ్చి, అక్కడ అతనికి అర్ఘ్య పాద్యాసనమధుపర్కాదు లిచ్చి, భీష్ముని యాగమన కారణమడిగెను.

"జనమేజయా! అప్పుడు భీష్ముడు శల్యునితో 'నేను కన్యక కొరకు వచ్చినాను. నీ సోదరి ఉన్నదని, ఆమె మిక్కిలి సాధుస్వభావురాలని, ఆమె పేరు 'మాద్రి' యనియు వినినాను. ఆమెను మా పాండుని కొరకు వరించు చున్నాను. మనము పరస్పరము సంబంధము చేయుటకు యోగ్యులము. కనుక మమ్ము నీవు అంగీకరింపుము?' అని యనెను.

"జనమేజయా! భీష్ముని మాట విని శల్యుడు భీష్మునితో నిట్లనెను:-

"దేవవ్రతా! ఇంతకంటె శ్రేష్ఠుడైన వరుడు వెదకినను నాకు లభించడు. కాని, మా కులమునందు పూర్వరాజులు శుల్కము తీసికొను నియమము ననుస రించుచున్నారు. అది మంచిదైనను చెడ్డదైనను, ఉల్లంఘించజాలను. ఈ విషయము అందరికి, మీకున్ను తెలియును. ఇట్టి పరిస్థితిలో 'నీవు, కన్యకను ఇమ్మని అడుగుట ఉచితము కాదు. అది మా కులధర్మము. మాకు అదియే పరమ ప్రమాణము. కనుక కన్యక నిచ్చెదనని నేను నీకు నిశ్చయముగ చెప్పజాలను."

"జనమేజయా! ఇట్లు శల్యుడు చెప్పగా భీష్ము డతనితో, రాజా! ఇది ఉత్తమ ధర్మము. స్వయంభువైన బ్రహ్మదేవుడే ఇది ధర్మమని స్వయముగా చెప్పెను. మీ పూర్వరాజులు ఈ శుల్కవిధిని అంగీకరించుట దోషము కాదు. ఇది సత్పురుష సమ్మానితమైన మీ వంశమర్యాద యని అందఱకు తెలియును" అని యనెను.

"జనమేజయా! ఇట్లు చెప్పి భీష్ముడు శల్యునకు సేనలు, భూషణములు, రత్నములు, గజాశ్వరథ వస్త్రాలంకారాదులు, మణులు, ముత్యములు, పగడము లున్న కానుకగా నిచ్చెను. ఆ ధనమంతయు తీసికొని శల్యుడు సంతోషించి వస్త్రాభరణములచే భూషితురాలైన తన సోదరిని పాండురాజు కొరకు భీష్మునకు ఒప్పగించెను."

"జనమేజయా! తరువాత భీష్ముడు మాద్రిని తోడ్కొని హస్తినాపురము నకు పోయి, ఒక శుభముహూర్తమునందు పాండునకిచ్చి వివాహము చేసెను. పాండురాజు తన యిరువురి భార్యలతో యథేష్ట విహారము ఆనందముతో చేసెను. ముప్పది దినములు అట్లు విహరించి పాండురాజు సమస్త భూమండల మును జయింపగోరి దిగ్విజయార్థమై బయలుదేరెను. అతడు భీష్మాదులైన పెద్దల కందరకు నమస్కరించి వారి యాజ్ఞ తీసికొని వారి యాశీర్వాదము గొని గజాశ్వరథ సేనలతో ప్రయాణము చేసెను."

"జనమేజయా! పాండురాజు తమకు పూర్వము అపరాధము చేసిన దశార్ణ* దేశములపై దాడిచేసి ఓడించెను. తరువాత నతడు మగధ దేశముపై తన చతురంగ సేనతో దాడిచేసి అక్కడ 'రాజగృహము' అను నగరమునందు అనేక రాజుల ఎడల అపరాధము చేసియున్న 'దీర్ఘుడు' అను మగధరాజును సంహ రించెను. అక్కడి ధనసంపదలు, వాహనములు తీసికొని పోయి పాండురాజు మిథిలా నగరమును ముట్టడించి, అక్కడ విదేహవంశ క్షత్రియులను ఓడించెను."

"జనమేజయా! ఈ విధముగ పాండురాజు కాశీ - సుహ్మ - పుండ్ర - దేశములను జయించి కురుకుల యశస్సును విస్తరింప జేసెను. ప్రజ్వలితాగ్నివలె శోభిల్లుచున్న పాండురాజు బాణము లనెడు జ్వాలలతో ఖడ్గమనెడు తేజస్సుతో

* వింధ్య పర్వతమునకు ఆగ్నేయ దిక్కుననున్న ప్రదేశమునకు, ప్రాచీన నామము 'దశార్ణ' మనబడును. ఆ ప్రాంతంలోనే 'ధసాన్' అను ఏరు ప్రవహించును. ఇప్పుడు 'భిల్సా' అను పేరుగల 'విదిశా'నగర మీ దేశమునకు రాజధానిగా నుండెను.

భాసిల్లుచుండెను. అతని నెదిరించిన రాజు లనేకులు భస్మమైరి. అతడు అనేక రాజుల యొక్క సేనలను నశింపజేసి వారిని వశపరచుకొని తన యాజ్ఞలో నుంచుకొనెను."

"జనమేజయా! పాండురాజునకు ఓడిన రాజులు, 'దేవతలలో ఇంద్రుని వలె, మనుష్యులలో అతడొకడే శూరుడు' అని తలచి అతని యెదుట చేతులు జోడించి తలవంచి అనేక మణిధనములను అతనికి కానుకలుగా నిచ్చిరి.

''జనమేజయా! ఆ రాజులు గుట్టలు గుట్టలుగా ఇచ్చిన మణి - ముక్తా - ప్రవాళ (పగడములు) - సువర్ణ - రజత - అశ్వ - గో - రథ - గార్దభ - ఉష్ట్ర (ఒంటెలు) - మహిష - అజ (మేకలు) - అవిక - (గొఱ్ఱెలు) -కంబళ - మృగ చర్మ - రత్న - రాంకవ (ఉన్ని వస్త్రములు)' ములు మొదలైన వస్తువులను పాండురాజు గ్రహించెను. వానిచేత తన రాష్ట్ర ప్రజలను సంతోష పరచెను. తన పూర్వజులైన శంతను భరతాదుల కీర్తిని పాండురాజు పునరుజ్జీవింప జేసెను.

''జనమేజయా! కురుదేశ ధనమును, కురు రాష్ట్రమును పూర్వము అపహరించిన రాజులను పాండురాజు తనకు పన్నులు కట్టువారినిగా చేసెను. అనేక రాజులు, వారి మంత్రులు, వారి దేశ ప్రజలు పాండురాజు నందు విశ్వాసముంచి తమ సంతోషమును ప్రకటించిరి.

''జనమేజయా! పాండురాజు దిగ్విజయము చేసి, రాజధానికి తిరిగి వచ్చినప్పుడు, భీష్మాది కౌరవులందరు అతనికి స్వాగతము చెప్పుటకు పోయిరి. పాండురాజు మిక్కిలి ఉత్సాహముతో వచ్చుచున్నప్పుడు, అందరు సంతోషించి అతడుగెలుచుకొని తెచ్చిన యనంతమైన వస్తు సామగ్రిని వారు చూచిరి.

*కౌసల్యా కొడుకైన పాండురాజు భీష్మునకు నమస్కరించి దేశవాసులను యోగ్యతానుసారముగ గౌరవించెను. అట్లు గెలిచి వచ్చిన పాండును భీష్ముడు ఆలింగనము చేసుకొని, ఆనందబాష్పములు కురిసెను. అప్పుడు నూర్లకొలది

* కాశీరాజైన కోసలునకు కన్యకలగుటచేత అంబిక - అంబాలిక ఈ యిరువురకును 'కౌసల్య' అను పేరు వచ్చినది.

శంఖ - తూర్య - భేరీ - మృదంగాది వాద్యధ్వనులు మిన్నుముట్టగా పాండురాజు ప్రజలనుసంతోష పరచుచు హస్తినాపురము నందు ప్రవేశించెను.

**పాండురాజు భార్యలతో వనమునం దుండుట-విదురుని వివాహము :**

"జనమేజయా! పాండురాజు తన యన్న ధృతరాష్ట్రుని యాజ్ఞతో తాను తెచ్చిన ధనమంతయు భీష్మునకు, సత్యవతీదేవికి, తల్లులైన అంబిక - అంబాలికల కున్ను కానుకలుగా నిచ్చెను. కొంత ధనము విదురునకు గూడ నిచ్చెను. ఇతర మిత్రులను గూడ ఆ ధనముతో తృప్తి పరచెను. అందరు సంతోషించిరి. పాండు రాజుయొక్క తల్లి కౌసల్యా (అంబాలిక) దేవి, శచీదేవి జయంతుని ఆ లింగనము చేసికొని అభినందిచినట్లు పాండురాజును కౌగిలించుకొని మెచ్చుకొనెను.

"జనమేజయా! పాండురాజు యొక్క బల - పరాక్రమముల యాధార ముతో ధృతరాష్ట్రుడు నూరు అశ్వమేధ యాగములనుచేసి, ఒక్కొక్క యజ్ఞము నందు ఒకలక్ష బంగారు నాణెములు దక్షిణగా దానముచేసెను.

"జనమేజయా! పాండురాజు తన భార్యల ప్రోత్సాహముచేత రాజభవన నివాసాది సౌఖ్యములను విసర్జించి, వనమునందు నివసించి, ఎల్లప్పుడు మృగయా సక్తుడై యుండెను. అతడు హిమాలయ దక్షిణ ప్రాంతమునందు సంచ రించుచు పర్వత శిఖరములందు అనేక మహావృక్ష శోభితములైన వనము లందున్న నివసించుచుండెను. కరిణీ సమానలైన తన యిరువురు భార్యల మధ్య పాండు రాజు ఐరావతగజమువలె శోభిల్లు చుండెను. అతడట్లు వనములందు సంచరించు చుండగా వనవాసులు చూచి అతడొక దేవతయా యని భావించిరి.

"జనమేజయా! ధృతరాష్ట్రుని యాజ్ఞచేత అనేక సేవకులు పాండురాజు కొరకు అనేక సుఖసామాగ్రిని, భోజనాదులను వనమునకు కొనిపోయి ఇచ్చు చుండిరి.

"జనమేజయా! అప్పుడు దేవకుడు అను రాజునొద్ద శూద్రజాతి స్త్రీకి బ్రాహ్మణుని వలన పుట్టినయొక కన్యక సౌందర్యముతో, యౌవనముతోను శోభిల్లుచున్నదని భీష్ముడు విని, ఆ 'పారశవ' కన్యను విదురుని కొరకు వరించి తెచ్చి విదురునకిచ్చి వివాహము చేసెను. విదురుడు ఆమె గర్భమునుండి, తన వంటి సద్గుణ-వినయశీలురైన యనేక పుత్రులను కనెను"

### ధృతరాష్ట్రునకు సంతానోత్పత్తి :

"జనమేజయా! తరువాత ధృతరాష్ట్రునకు అతని భార్య గాంధారీదేవి నుండి నూరుగురు పుత్రులు పుట్టిరి. అతనికి మరియొక భార్య వైశ్యజాతి స్త్రీ యుండెను. ఆమెనుండి కూడ నతని కొక పుత్రుడు కలిగెను. అతడా నూరుగురకన్న నధికుడు. పాండురాజునకు కుంతీ - మాద్రీ భార్యల నుండి అయిదుగురు పుత్రులు పుట్టిరి. వారు కురుకుల సంతాన పరంపరను రక్షించుటకు దేవతల యంశము లతో నవతరించిరి."

ఇట్లు వైశంపాయనుడు చెప్పగా జనమేజయు డా మునితో నిట్లనెను:-

"బ్రాహ్మణోత్తమా! గాంధారికి నూరుగురు పుత్రులు ఏ విధముగ నెంత సమయములో పుట్టిరి? వా రందరి యాయుస్సు ఎంత యుండెను? వైశ్యజాతి స్త్రీ గర్భమునుండి ధృతరాష్ట్రునకు ఆ యేక పుత్రు డే విధముగా పుట్టెను? ధృతరాష్ట్ర మహారాజు సర్వదా తనకు అనుకూలవతి, యోగ్యురాలు; ధర్మపరురాలునైన గాంధారీదేవితో నెట్లు వ్యవహరించు చుండెను? పాండురాజునకు మహారథికులైన యైదుగురు పుత్రులు దేవతల యంశచేత ఎట్లు జన్మించిరి? తపోధనా! యీ విషయము లన్నియు సవిస్తరముగా చెప్పుము. నా బంధుజనుల సమాచారము విని నాకు తృప్తిదీరకున్నది."

జనమేజయు డిట్లడుగగా వైశంపాయను డతనితో నా వృత్తాంత మంతయు నీ విధముగా చెప్పదొడగెను:-

"జనమేజయా! పూర్వమొకప్పుడు వ్యాసమహర్షి ఆకలిదప్పులతో ఖేదము చెంది, ధృతరాష్ట్రుని కడకు వచ్చెను. అప్పుడు గాంధారీదేవి యా మహర్షికి భోజనము పెట్టి, విశ్రాంతికి ఏర్పాటుచేసి సంతోషము కలిగించగా, వ్యాసుడు గాంధారికి వర మీయ దలచెను. అప్పు డామె తన పతివంటి పుత్రులను నూరుగురను కోరెను.

"రాజా! తరువాత గాంధారి కొంతకాలమునకు గర్భధారణ రెండు సంవత్సరములు చేసెను. కాని, ప్రసవము కాలేదు. ఇంతలోనే కుంతీదేవికి ప్రాతఃకాల సూర్యతేజస్సుగల పుత్రుడు కలిగినట్లు విని గాంధారికి మిక్కిలి దుఃఖము కలిగెను. తన గర్భము స్థిరముగా నుండుట వలన గాంధారి చింతించి,

దుఃఖముచేత మూర్ఛిల్లెను. ఆమె ధృతరాష్ట్రునకు తెలియకుండానే తన యుద రముపై దెబ్బలుకొట్టెను. దానిచేత ఆమె గర్భము నుండి యొక మాంసపిండము బయటపడెను. అది యినుపగుండు వలె కఠినముగా నుండెను. ఆమె దానిని రెండేండ్లు గర్భములో ధరించినను అది మిక్కిలి కఠినముగా నుండుట చూచి, ఆ మాంసపిండమును పారవేయ ప్రయత్నించుచుండు నంతలోపలనే అది తెలిసి వ్యాసుడు మిక్కిలి త్వరగా అక్కడకు వచ్చి ఆ మాంసపిండమును చూచి గాంధారిని, 'నీవు దీనిని ఏమి చేయదలచు చుంటివి?' అని యడుగగా గాంధారి యిట్లనెను.

"మహర్షీ! కుంతికి సూర్యసమానుడైన జ్యేష్ఠ పుత్రుడు కలిగినట్లు విని నేను మిక్కిలి దుఃఖముచేత నా యుదరముపైన కొట్టి గర్భము పడగొట్టితిని. 'తొలుత నాకు నూరుగురు పుత్రులు పుట్టెద' రని నీవు నాతో నని యుంటివి. కాని, యిన్ని దినములకు నాకు పుత్రులకు బదులు మాంసపిండము పుట్టెను."

జనమేజయా! గాంధారీదేవి యిట్లు చెప్పగా విని వ్యాసు డామెతో నీ విధ ముగా బదులు చెప్పెను:-

"సుబల కుమారీ! నా వరదానము ప్రకారమే యిది యంతయు జరుగు చున్నది. నా వర మెప్పుడు గూడ అన్యథా కాదు. నే నెప్పుడు గూడ పరిహాసమున కైనను అసత్యము చెప్పలేదు. ఇట్లుండగా వర మిచ్చునప్పుడు చెప్పిన మాట యెట్లు అసత్యమగును? నీవు వెంటనే నూరు కుండలను సిద్ధపరపించుము. ఆ కుండలను నేయితో నింపుము. తరువాత వానిని మిక్కిలి గుప్తమైన స్థానములో ఉంచి జాగ్రత్తగా రక్షింపుము. మాంస పిండమును చల్లనీటితో తడుపుము"

"జనమేజయా! అప్పుడా మాంస పిండమును తడుపగా అది నూరు తునక లయ్యెను. ఒక్కొక్క శకలము బొటనవేలి గెణుపు (పర్వము) ప్రమాణ ముతో నుండి గర్భములుగా మారెను. కాలము గడవగా, నవి నూటి యొక్క ముక్కలాయెను. తరువాత గాంధారి గర్భ భాగములను నేతి కుండలలో నుంచి వానిని రహస్యస్థానములలో పెట్టించి వాని రక్షణమునకు పరిపూర్ణ వ్యవస్థ చేసెను.

"రాజా! అప్పుడు వ్యాస భగవానుడు గాంధారితో, 'నీవు ఈ కుండలను మరి రెండు సంవత్సరముల వరకు కాపాడుచు వేచి యుండుము. తరువాత ఈ కుండల మూతలు తెరవవలెను. అని చెప్పి హిమాలయమునకు తపస్సుకై వెడలి పోయెను.

"జనమేజయా! రెండు సంవత్సరములు గడచిన పిదప ఆ గర్భ భాగములు ఆ కుండలలో నుంచబడిన క్రమములోనే అందరికన్న తొలుత దుర్యోధనుడు పుట్టెను. జన్మకాలమును బట్టి యతనికంటే యుధిష్ఠిరుడు జ్యేష్ఠుడు.

"రాజా! దుర్యోధనుని జన్మమునుగూర్చి భీష్మ-విదురులకు తెలుపబడెను. ఆనాడే భీమసేనుడుగూడ పుట్టెను. దుర్యోధనుడు పుట్టినతోడనే గాడిదలు ఓండ్ర పెట్టుచున్నట్లు ఏడ్వదొడగెను. అతని గార్దభ ధ్వని విని యితర గార్దభములు గూడ దానికి ప్రతిశబ్దముగా ఓండ్రపెట్టదొడగెను. గ్రద్దలు-నక్కలు-కాకులు గూడ అరచుచుండెను. చాల పెద్ద సుడిగాలులు వీచెను. సర్వ దిక్కులు దహించుచుండెను.

"రాజా! అప్పుడు ధృతరాష్ట్రుడు భయపడి అనేక బ్రాహ్మణులను, భీష్మ-విదురులను, ఇతర మిత్రులను, సమస్త కురువంశీయులనున్ను పిలిపించి, వారితో నిట్లనెను :-

"గురుజనులారా! మా వంశ కీర్తివర్ధనుడైన రాజకుమారుడు యుధిష్ఠిరుడు అందరికన్నను జ్యేష్ఠుడు. అతడు తన సద్గుణముల చేత రాజ్యాధికారము పొందుటకు యోగ్యుడయ్యెను అతని విషయములో మీకు చెప్పవలసిన దేమియు లేదు. కాని, యతని యనంతరము ఈ నా పుత్రుడే జ్యేష్ఠుడు ఇతడు రాజు కాగలడా ? ఈ విషయములో బాగుగా విచారించి మీ యభిప్రాయము తెలుపుడు. అవశ్యముగా జరుగబోవు విషయములు స్పష్టముగా తెలుపుడు.''

"జనమేజయా ! ధృతరాష్ట్రుడిట్లు చెప్పగనే, నలువైపుల మాంసాహారులైన ప్రాణులు భయంకరముగా గర్జిల్ల జొచ్చెను. నక్కలు అమంగళ సూచకముగా కూయజొచ్చెను. అన్ని దిక్కుల కలుగుచున్న భయంకరములైన యపశకునములను గమనించి, బ్రాహ్మణులు, విదురుడున్ను నిట్లనిరి :-

"ధృతరాష్ట్ర మహారాజా! నీ జ్యేష్ఠ పుత్రుని జన్మ సమయమందు సంభవించిన భయంకర దుర్నిమిత్తముల వలన, నితడు సమస్త కురుకుల నాశకుడు కాగలడని స్పష్టముగా తెలియుచున్నది. ఇతనిని విడిచిన యెడల, అన్ని విఘ్నములు శాంతించగలవు. విడువక ఇతనిని రక్షించినచో, భవిష్యత్తులో చాలా గొప్ప ఉపద్రవములు కలుగును. రాజా! నీకు తొంబది తొమ్మండుగురు పుత్రులే యుండెదరు గాక! నీవు నీ వంశపు శాంతిని కోరిన యెడల, నీ యీ యొక్క పుత్రుని విడువుము.

"రాజా! కేవలము ఒక్క పుత్రుని విడుచుట ద్వారా సమస్త కులమునకు జగత్తునకున్ను శ్రేయస్సు కలిగించుము.

"త్యజేదేకం కులస్యార్థే గ్రామస్యార్థే కులం త్యజేత్
గ్రామం జనపదస్యార్థే ఆత్మార్థే పృథివీం త్యజేత్॥"

అనగా, "కులము యొక్క హితము కొరకు ఒక వ్యక్తిని విడువవలెను. గ్రామ హితము కొరకు ఒక కులమును త్యజించవలెను. దేశ హితము కొరకు ఒక గ్రామమును విడువవలెను. తన శ్రేయస్సు కొరకు సమస్త భూమండలమునే విడువవలెను." అని భావము. రాజా! ఈ నీతి ననుసరించి నీవు నీ పుత్రుని త్యజింపుము."

"జనమేజయా! యిట్లు విదురుడు, బ్రాహ్మణులున్ను నీతి వాక్యములు చెప్పినను, పుత్రస్నేహము చేత ధృతరాష్ట్రుడు వారి మాటలు అంగీకరించలేదు.

"రాజా! తరువాత ఒక నెలకే గాంధారికి ఒక కన్యక పుట్టెను. ఆ కన్యక నూరుగురకన్న అధికముగా నూటయొకటవ సంతానము. గర్భధారణ చేత గాంధారి యుదరము పెరుగగా. నామె గర్భభార క్లేశము ననుభవించు దినములలో నొక వైశ్యజాతి స్త్రీ ధృతరాష్ట్రుని సేవించు చుండెను. ఆ సంవత్సరమే ధృతరాష్ట్రునకు ఆ వైశ్యజాతి స్త్రీ నుండి, 'యుయుత్సు' నామము గల యొక పుత్రుడు జన్మించెను. అతడు* 'కరణ' జాతివాడు ఈ విధముగా ధృతరాష్ట్రునకు నూట యిద్దరు సంతానము పుట్టిరి."

* వైశ్యజాతి స్త్రీకి క్షత్రియుని నుండి పుట్టిన జాతి 'కరణ' జాతి యనబడును. దీనికి ప్రమాణము - 'వైశ్యాయాం క్షత్రియాజ్జాతః కరణః పరికీర్తితః అని ఈ ధర్మశాస్త్రము ప్రకారము యుయుత్సునకు 'కరణుడు' అని పేరు గూడ చెప్పబడినది.

ఇట్లు వైశంపాయన మునీంద్రుడు చెప్పగా జనమేజయమహారాజు ఆ మునితో నిట్లనెను :

**దుఃశలా జన్మవృత్తాంతము :**

"బ్రహ్మన్! వ్యాసమహర్షి యనుగ్రహముచేత ధృతరాష్ట్రునకు నూరుగురు పుత్రులు పుట్టిరి." అని నీవు చెప్పినప్పుడు, అతని కొక కన్య కలదని నీవు చెప్పలేదు. ఇప్పుడు నీవు యుయుత్సుని విషయము, కన్యక విషయము గూడ నూరుగురకన్న నధికముగా చెప్పితివి. వ్యాసుడు గాంధారికి నూరుగురు పుత్రులు కలుగుదురనియే వరమిచ్చెను గదా! కన్యక గూడ పుట్టినట్లు నీ వెట్లు చెప్పెదవు? ఒకవేళ వ్యాసమహర్షి మాంసపిండమును నూరు భాగములు చేసి యుండినయెడల గాంధారికి యే విధముగ గూడ మరల గర్భధారణము-ప్రసవము కాకుండిన యెడలను 'దుఃశల' యను కన్యక యెట్లు జన్మించెను? ఇది యంతయు యథార్థముగా నాకు తెలుపుము."

ఇట్లు జనమేజయు డడుగగా వైశంపాయను డిట్లు చెప్పెను:-

"పాండవనందనా! నీవు మంచి ప్రశ్నము చేసితివి. చెప్పెద వినుము:- వ్యాసమహర్షియే ఆ మాంసపిండమును స్వయముగా చల్లనీటితో తడిపి నూరు భాగములుగా విభజించి, వానిని దాదిచేత ఆ మహర్షి ఒక్కొక్కటిగా నేతికుండలలో వేయించుచు పోయెను. ఈ లోపలనే గాంధారి కన్యకా స్నేహముచేత ఒక కూతురు గూడ కావలెనని యాశించి, మనస్సులో నిట్లు చింతించెను.

ఈ మాంసపిండమునుండి నాకు నూరుగురు పుత్రులు తప్పక పుట్టెదరు. ఎందుకనగా, వ్యాసముని యెప్పుడు గూడ అసత్యము చెప్పడు. కాని, నాకు ఒక పుత్రిక గూడ కలిగినప్పుడే అధిక సంతోషము కలుగును. ఒకవేళ నూరుగురు పుత్రులే కాక, ఒక చిన్న కన్య గూడ కలిగిన యెడల నా పతిదేవునకు దౌహిత్రుని (కూతుయొక్క పుత్రుడు) వలన గలుగు పుణ్యముచేత గూడ ప్రాప్తించు లోకములు కలుగును. స్త్రీలకు పుత్రునికన్న 'అల్లుని యందు అధిక స్నేహము ఉండు'నని చెప్పెదరు. నాకు నీ నూరుగురే కాక యొక పుత్రిక గూడ పుట్టినచో, నేను పుత్రులతో, దౌహిత్రులతోను పరివేష్టింపబడి యుండి ధన్యురాల నయ్యెదను.

"నేనొకవేళ వాస్తవముగా తపో-దాన-హోమములు చేసియుండినచో గురుజనములను సేవించి ప్రసన్నులను చేసియుండిన యెడలను నాకు అవశ్యముగా కూతురు పుట్టును గాక!"

"జనమేజయా! ఈ లోపలనే వ్యాసభగవానుడు స్వయముగానే ఆ మాంస పిండమును విభజించి, నూరు భాగములను ఎంచి, గాంధారితో నిట్లనెను:-

"గాంధారీ! నేను నీకు అసత్యము చెప్పియుండలేదు. ఇదిగో! ఈ నూరుగురు పుత్రులను చూడుము. నూరే కాక, మరియొక మాంస పిండపు భాగము మిగిలినది. ఈ నూట యొకటవ భాగమునుండి నీకు దౌహిత్ర యోగము కలుగును. ఈ భాగమునుండి నీకు ఒక భాగ్యవతియైన కన్యక పుట్టును".

"జనమేజయా! వ్యాసమహర్షి యిట్లు గాంధారితో చెప్పి, నేయి నింపిన మరియొక కుండను తెప్పించి, ఆ మిగిలిన కన్యాభాగమును ఆ కుండలో వేసెను. రాజా! ఈ విధముగా నేను నీకు దుఃశల యొక్క జన్మ వృత్తాంతము తెలిపితిని. ఇక నేమి చెప్పుమనెదవో అడుగుము".

ఇట్లు వైశంపాయను డనగా, జనమేజయు డా మునితో, 'బ్రహ్మన్! ధృతరాష్ట్ర పుత్రులలో సర్వజ్యేష్ఠుని తరువాత పుట్టినవారి పేర్లు క్రమముగా చెప్పుము' అని యడుగగా, వైశంపాయను డిట్లు చెప్పదొడగెను.

**దుర్యోధనాదుల పేర్లు***

"జనమేజయా! ధృతరాష్ట్ర పుత్రుల పేర్లు క్రమముగా చెప్పెద వినుము:-

(1) దుర్యోధనుడు (2) యుయుత్సుడు (3) దుశ్శాసనుడు (4) దుస్సహుడు (5) దుశ్శలుడు (6) జలసంధుడు (7) సముడు (8) సహుడు

* ఇంతకు పూర్వము ఆదిపర్వమునందే దుర్యోధనాదులు నూర్గురి పేర్లు చెప్పబడెను. వానిలో చాల పేర్లు ఇక్కడ గూడ ఉన్నవి. కాని, కొన్ని పేర్లలో, అక్కడికి ఇక్కడికి కొంత భేదము ఉన్నది. ఆ భేదము ఇక్కడ కుండలీకరణములో వ్రాయబడినది. ఇట్లే ఇక్కడి పేర్లను అక్కడి పేర్లకు ఏకత్వము చేయబడినది. కొన్ని పేర్లు పరస్పరము కలియుట లేదు. పేర్ల వరుసలో గూడ రెండు చోట్ల భేదమున్నది. అందువలన ఒక్క వ్యక్తికే రెండు పేర్లు ఉండి, అక్కడ ఒక పేరు, ఇక్కడ ఒక పేరు వ్రాయబడియుండవచ్చునని తలచి ఇక్కడ మరల ఆ నూరు పేర్లు వ్రాయబడుచున్నవి.

(9) వింధుడు (10) అనువిందుడు (11) దుర్ధర్షుడు (12) సుబాహుడు (13) దుష్ప్ర ధర్షణుడు (14) దుర్మర్షణుడు (15) దుర్ముఖుడు (16) దుష్కర్ణుడు (17) కర్ణుడు (18) వివింశతి (19) వికర్ణుడు (20) శలుడు (21) సత్త్వుడు (22) సులోచనుడు (23) చిత్రుడు (24) ఉపచిత్రుడు (25) చిత్రాక్షుడు (26) చారు చిత్ర శరాసనుడు (చిత్రచాపుడు) (27) దుర్మదుడు (28) దుర్విగాహుడు (29) వివిత్సుడు (30) వికటాననుడు (వికటుడు) (31) పూర్ణనాభుడు (32) సునాభుడు (పద్మనాభుడు) (33) నందుడు (34) ఉపనందుడు (35) చిత్రబాణుడు (చిత్రబాహుడు) (36) చిత్రవర్మ (37) సువర్మ (38) దుర్విరోచనుడు (39) అయోబాహుడు (40) మహాబాహుడైన చిత్రాంగుడు (చిత్రాంగదుడు) (41) చిత్రకుండలుడు (సుకుండలుడు) (42) భీమవేగుడు (43) భీమబలుడు (44) బలాకి (45) బలవర్ధనుడు (విక్రముడు) (46) ఉగ్రాయుధుడు (47) సుషేణుడు (48) కుండోదరుడు (49) మహోదరుడు (50) చిత్రాయుధుడు (దృఢాయుధుడు) (51) నిషంగి (52) పాశి (53) బృందారకుడు (54) దృఢవర్మ (55) దృఢ క్షత్రుడు (56) సోమకీర్తి (57) అనూదరుడు (58) దృఢసంధుడు (59) జరాసంధుడు (60) సత్యసంధుడు (61) సదస్సువాక్ (సహస్రవాక్) (62) ఉగ్రశ్రవుడు (63) ఉగ్రసేనుడు (64) సేనాని (సేనాపతి) (65) దుష్ప్ర రాజయుడు (66) అపరాజితుడు (67) పండితకుడు (68) విశాలాక్షుడు (69) దురా ధర్షుడు (దురాధనుడు) (70) దృఢహస్తుడు (71) సుహస్తుడు (72) వాతవేగుడు (73) సువర్చుడు (74) ఆదిత్యకేతుడు (75) బహ్వాశి (76) నాగదత్తుడు (77) అగ్రయాయి (అనుయాయి) (78) కవచి (79) క్రథనుడు (80) దండి (81) దండధారుడు (82) ధనుర్గ్రహుడు (83) ఉగ్రుడు (84) భీమరథుడు (85) వీరబాహుడు (86) అలోలుపుడు (87) అభయుడు (88) రౌద్రకర్ముడు (89) దృఢరాథాశ్రయుడు (దృఢరథుడు) (90) అనాధృష్యుడు (91) కుండభేది (92) విరావి (93) విచిత్ర కుండల శోభితుడైన ప్రథముడు (94) ప్రమాథి (95) వీర్యవంతుడైన దీర్ఘరోముడు (దీర్ఘలోచనుడు) (96) దీర్ఘబాహుడు (97) మహాబాహువైన వ్యూఢోరుడు (98) కనకధ్వజుడు (కనకాంగదుడు) (99) కుండాశి (కుండజుడు) (100) విరజుడు"

"జనమేజయా! ఈ క్రమముతోనే ఈ నూరుగురి జన్మము కలిగినదని తెలిసికొనుము. వీరందరు అతిరథులైన శూరులు, యుద్ధవిద్యా నిపుణులు, వేద విద్వాంసులు, అస్త్రవిద్యలన్నింటి మర్మము నెఱిగినవారు. ధృతరాష్ట్ర మహారాజు అనేక కన్యకలను పరీక్షించి, పుత్రులందరికిన్ని సకాలము నందు వివాహములు చేసెను. అట్లే, కూతురైన దుశ్శలకు గూడ సైంధవునితో విధిపూర్వకముగ వివాహము చేసెను!"

తరువాత జనమేజయుడు వైశంపాయనునితో నిట్లనెను :-

**పాండురాజునకు శాపప్రాప్తి :**

"భగవన్! వ్యాసమహాముని యనుగ్రహము వలన కలిగిన ధృతరాష్ట్ర పుత్రుల జన్మవృత్తాంతము చెప్పితివి. నీవు బ్రహ్మవాదివి. మనుష్యుల జన్మ వృత్తాంతము చెప్పినప్పటికిన్ని ఇట్టి జన్మము ఇతర మనుష్యుల యందు నాకు కనపడలేదు. నీవు చెప్పిన నూరుగురు దుర్యోధనాదుల పేర్లను వింటిని. ఇప్పుడు పాండవుల జన్మవృత్తాంతము చెప్పుము. మహాత్ములైన పాండవులు ఇంద్ర సమాన పరాక్రమ సంపన్నులు. అంశావతరణమును గూర్చి నీవు చెప్పినప్పుడు పాండవులు దేవాంశ సంభూతులని, మానవాతీతశక్తిగల వారనియు చెప్పితివి. కనుక వారి వృత్తాంత మంతయు దయయుంచి చెప్పుము. ఆ మాటకు వైశంపాయను డిట్లనెను :-"

"జనమేజయా! ఒకప్పుడు పాండురాజు వనమునందు సంచరించుచు ఒక మృగితో సంగమము చేయుచున్న మృగమును చూచి ఐదు బాణములతో ఆ జంటను కొట్టెను. ఒక ఋషిపుత్రుడు మృగరూపధారియై, మృగరూపము ధరించిన తన పత్నితో సంగమము చేయుచుండెను. పాండురాజు కొట్టిన వెంటనే మృగరూపధారియైన యాముని మనుష్య వాక్కులతో మాట్లాడగా ఆ యిరువురకు నిట్లు సంవాదము జరిగెను.

మృగము :- "రాజా! కామక్రోధములు గలిగి బుద్ధి శూన్యులై, పాప కర్మలు చేయు మనుష్యులు గూడ ఇటువంటి క్రూరకర్మలు చేయరు. బుద్ధి ప్రారబ్ధమును దాటజాలదు. ప్రారబ్ధమే బుద్ధిని భ్రష్టము చేయును. ప్రారబ్ధకర్మ వశమున ప్రాప్తమగు పదార్థములను బుద్ధిమంతులుగూడ ఎరుగజాలరు. సర్వదా

ధర్మమార్గము నందు సంచరించు ప్రధాన క్షత్రియ కులములో నీవు పుట్టినప్పటి కిని, కామ - లోభ వశీభూతుడవైన నీ బుద్ధి ధర్మమునుండి ఎట్లు చలించెను?"

ఇట్లనెను :-

పాండు :- "మృగరాజా! శత్రు వధమునందు రాజులకు ఎట్టి ప్రవృత్తి తెలుపబడెనో, అట్లే మృగవధము నందు గూడ తెలుపబడినది. కనుక నీవు మోహముచేత నన్ను నిందింపగూడదు. మృగములను ప్రత్యక్షముగా, పరోక్షము గాను వధించుట మాకు అభీష్టము. అది రాజులకు ధర్మము. ఇట్లుండగా నీవు ఎందుకు నన్ను నిందించు చున్నావు?"

"మృగరాజా! పూర్వము అగస్త్య మహాముని ఒక సత్రయాగమునందు దీక్షితుడై యుండినప్పుడు అతడు గూడ, దేవతల హితము కొరకై తాను చేయు చున్న సత్రయాగమునకు విఘ్నముచేయు మృగములను వనమునందు వేటాడి వధించెను. అగస్త్యుడు చేసిన హింసాకార్యమును బట్టి చూడగా క్షత్రియుడైన నాకు మృగమైన నిన్ను చంపుట ఉచితమే. నేను, ధర్మానుకూలముగ నడచినను నీవు నన్ను ఎందుకు నిందించు చున్నావు?"

మృగము :- "రాజా! మనుష్యులు సంకటావస్థలో నున్న శత్రువులపై బాణప్రయోగము చేయరు. యుద్ధ సమయములందే చేయు శత్రువధ ప్రశంస నీయ మగును."

పాండు:- "మృగమా! రాజులు వేరు వేరు ఉపాయములతో బహిరంగముగ మృగములను వధించెదరు. ఇట్లుండగా నన్ను నీవు నిందింపగూడదు".

మృగము :- "రాజా! నన్ను నీవు కొట్టినందులకు నిన్ను నిందించుట లేదు. కాని, నేను సంగమము చేయునంతవరకు నీవు దయతో వేచియుండుట అవసరమని మాత్రమే నేను నీకు చెప్పవలెను. సర్వ ప్రాణులకు హితకరము, అభీష్టమునైన మైథున కార్యమును చేయుచున్న మృగమును వివేకముగల పురుషుడెవడు కొట్టును? నేను మిక్కిలి హర్షముతో, ఉల్లాసముతో నా కామ పురుషార్థమును సఫలము చేసికొనుటకు ఈ మృగితో సంగమము చేయుచుంటిని. కాని, దీనిని నీవు నిష్ఫలము చేసితివి. పవిత్రమైన కురుకులమునందు పుట్టిన నీవు

చేసిన యీ కార్యము నీకు అనురూపముగ లేదు. ఇది అన్ని లోకములలోను నిందితమైన కఠిన కర్మ, కీర్తి, స్వర్గము రెండింటిని ఇది దూరము చేయును. అన్నిటిని మించి ఇది మహా పాప కృత్యము.

"రాజా! నీవు స్త్రీ భోగములను గూర్చి విశేషముగ తెలిసిన వాడవు. శాస్త్రోక్తములైన ధర్మార్థముల నెరిగినవాడవు. అట్టి నీవు నరక ప్రదమైన పాప కార్యముచేసియుండకూడదు. ధర్మార్థ కామహీనుడైన పాపపు మనుష్యుడు చేయు కఠిన కర్మలకు దండము విధించుట నీకు కర్తవ్యము. నేను ఫలమూలాహారములు చేయు తాపసుడను. మృగరూపము ధరించి, ఇంద్రియ నిగ్రహము కలిగి సర్వదా వనములందు నివసించుచుందును. నిరపరాధినైన నన్ను చంపిన నీకు ఏమి లాభము కలిగెను? నాకు నీవు చేసిన హత్యకు బదులుగా నీకు శాప మిచ్చెదను. నీవు మైథున ధర్మమునందు ఆసక్తులైన స్త్రీ పురుషులను నిష్ఠురముగా వధించితివి. నీవు ఇంద్రియ జయము లేని కామమోహితుడవు. కనుక నీవు స్త్రీ సంగమము చేసినప్పుడు మరణించెదవు.

"రాజా! నేను 'కిందముడు' అను పేరు గలవాడను, తపస్సుచేయుచున్న తాపసుడను. మానవ శరీరముతో ఈ కార్యముచేయుటకు సిగ్గుపడుచుంటిని, కనుక, మృగ శరీరము ధరించి నా మృగితో సంగమము చేయుచుంటిని. నేను తరచుగ ఈ రూపముతోనే మృగములతోపాటు వనమునందు సంచరించెదను. నన్ను చంపుటవలన నీకు బ్రహ్మహత్యా దోషమైతే కలుగదు. ఎందుకనగా, ఈ మృగము మునియని నీకు తెలియదు. కాని, మృగ రూపముతో నేను కామ మోహితుడనైయున్న పరిస్థితిలో క్రౌర్యము చేత నన్ను చంపితివి. కనుక మూఢుడా! నీవు చేసిన ఈ కర్మకు ఇటువంటి ఫలమే నీకు తప్పక కలుగ గలదు. నీవు గూడ పూర్తిగా కామమోహితుడవై నీ ప్రియపత్నితో సమాగమము చేసినప్పుడు యమలోకమునకు పోయెదవు. అప్పుడు నీ పత్నిగూడ నీ యందలి భక్తిభావము చేత నిన్ను అనుసరించగలదు. నేను సుఖ మనుభవించుచుండగా నాకు దుఃఖము కలిగించితివి. కనుక, నీవు గూడ పత్నీ సంయోగ సుఖమనుభవించుచున్నప్పుడు నీకు దుఃఖము కలుగును."

"జనమేజయా! మృగధారియైన కిందమ మహాముని ఇట్లు పాండురాజును శపించి, దుఃఖపీడితుడై మరణించెను. పాండురాజుగూడ తన దుష్కార్యమునకు దుఃఖించెను."

**పాండురాజు పశ్చాత్తాపము - సన్యాసమునకు నిశ్చయము - భార్యల కోరికపై వానప్రస్థాశ్రమ స్వీకారము :**

"జనమేజయా! మృగరూపములో నున్న కిందమ మహాముని మరణించిన తరువాత పాండురాజు ఆ మునిని విడిచిపోవుచున్నప్పుడు బంధువును విడిచిపోవు చున్నంతగా పత్నీ సహితుడై దుఃఖించుచు తన యపరాధమునకు మిక్కిలి పశ్చాత్తాపపడి ఇట్లనుకొనెను.

"ఉత్తమ కులోత్పన్నులు గూడ, మనో నిగ్రహము లేకుండుటచేత కామవశులై వివేకము పోగొట్టుకొని, అనుచిత కార్యముచేసి, దానివలన మహా దుర్గతికి పాల్పడుదురు. ధర్మాత్ముడైన శాంతనుని కుమారుడు మా తండ్రి విచిత్రవీర్యుడు గూడ కామభోగాసక్తుడగుట చేతనే చిన్న వయస్సులోనే మర ణించెనని విన్నాను. అయన భార్య నుండియే వ్యాస భగవానుడు నన్ను కనెను. నేను మృగయాసక్తుడనై యుండుటచేత దేవతలు నన్ను విడిచిరి. పవిత్ర వంశమునందు జన్మించినను నేను దుర్వ్యసనములలో చిక్కుకొనుట చేత నా బుద్ధి ఇంత నీచమైనది. కనుక నేను మోక్షమార్గమును అనుసరించుట చేతనే నాకు శ్రేయస్సు కలదని నిశ్చయించుకొనుచున్నాను. అన్నిటికంటే భార్యా పుత్రాది బంధనమే దుఃఖకరము. నేటి నుండి నా తండ్రి వ్యాసమహాముని మార్గ మును ఆశ్రయించినచో నా పుణ్యము ఎప్పుడు గూడ నశించదు.

"నేను నా శరీరేంద్రియములను కఠోర తపస్సు నందు లగ్నమును చేసెదను. అందుచేత ఇకపైన నేను ఒంటరిగా భార్యా - సేవకాదులను విడిచి ఉండి ఒక్కొక్క వృక్షము కడకు పోయి పండ్లను యాచించెదను. శిరోముండ నము చేయించుకొని, మౌనముతో సన్న్యాసినై వాన ప్రస్థాశ్రమము నందు దుమ్ము గ్రమ్మిన శరీరముతో నిర్జన ప్రదేశము నందు ఉండెదను. లేదా, వృక్ష చ్ఛాయలోనే ఉండెదను

"నేను, ప్రియాప్రియములైన వస్తువు లన్నింటిని విడిచెదను. అప్పుడు నాకు వస్తువుల యొక్క వియోగ సంయోగముల వలన శోక - హర్షములు కలుగవు. నిందా - స్తుతులు రెండున్ను అప్పుడు నాకు సమానము అగును. నాకు ఒకరి యాశీర్వాద నమస్కారములపై ఇచ్ఛ ఉండదు. నేను సుఖదుఃఖాది

ద్వంద్వ రహితుడనై సంగ్రహ (వస్తువులు కూర్చుకొనుట) పరిగ్రహ (దానము గొనుట) ములకు దూరముగ నుండెదను. ఇతరులను పరిహసించుట గాని, కోపించుట గాని చేయను.

"నేను సర్వదా ప్రసన్నుడనుగా నుండి ప్రాణుల హితము కొరకు ప్రయతించెదను. చతుర్విధ (వీని వివరము ఇంతకు పూర్వము అధోదీపికలో తెలుపబడినది) చరాచర ప్రాణులను హింసించను. పుత్రులందరి యందున్న తండ్రికి సమభావమున్నట్లే, సమస్త ప్రాణుల యెడల నాకు గూడ సమాన భావము ఉండగలదు.

(పూర్వము చెప్పినట్లు) నేను ఒక పూట మాత్రమే ప్రతి దినము వృక్షముల నుండి పండ్లను యాచించి కాని, అది అసంభవమైనయెడల, ఐదారు ఇండ్లలో తిరిగి (మధుకర వృత్తితో కొంచెము - కొంచెము) బిచ్చమెత్తి కాని, అది గూడ అసంభవమైన యెడల అనేక దినములు ఉపవాసముతో గాని, ఉండెదను. (భిక్ష లభించినప్పుడు గూడ) కొంచెము - కొంచెమే భుజించెదను. ఈ విధముగ చేసి నను ఎక్కడ గూడ ఆహారము దొరకనప్పడే ఇతర విధమును ఆశ్రయించెదను. కాని, లోభినై, కనబడిన ప్రతి ఇంటికిని పోయి బిచ్చమెత్తను. ఎక్కడ గూడ ఏమియు దొరకనప్పుడు భిక్షా పూర్తి కొరకు ఏడు ఇండ్లు మాత్రము తిరిగి ఆ ఇండ్లలో భిక్షము దొరకినను దొరకకున్నను సమదృష్టితో నుండి తపస్సు చేసెదను.

"ఒకడు బాడిసతో ఒక చేతిని చెక్కుచున్నను, మరియొకడు రెండవ బాహువునకు చందనము పూయుచున్నను ఇరువురిని సమానముగ చూచెదను. ఒకరికి కీడు, ఒకరికి మేలు తలచను. జీవించగోరువాడు - చావగోరువాడున్న చేయు పనులను చేయక యుండి, జీవితమును అభినందించుట గాని, లేక మరణమును ద్వేషించుట గాని-చేయను. జీవించదలచిన వారు తమ యభ్యుదయము కొరకు చేయు సకామ కర్మలన్నిటిని, అవి పరిమిత కాలమునకు చెందినవి కనుక, విడిచెదను. నా యంతఃకరణ మలమును కడిగి పరిశుద్ధుడ నయ్యెదను.

"నేను సర్వపాప విముక్తుడనై, అజ్ఞానజనిత సమస్త బంధనములను త్రెంపికొని, ఎవరి వశమునందు ఉండక, అంతట సమానముగ సంచరించెదను.

ఇట్టి భావముతోనే సర్వదా వ్యవహరించుచు నేను భయరహితుడనై, మోక్ష మార్గమునందు నిలిచి ఈ దేహము విడిచెదను. నాకు సంతానోత్పాదావకాశము పోయినది. నా గృహస్థాశ్రమము సంతానోత్పదనాది ధర్మ శూన్యమైనది. నా వీర్యనాశము చేత పూర్తిగా శోచనీయుడనైతిని. కనుక, అత్యంత దీనమైన ఈ గృహస్థాశ్రమ మార్గమునందు ఇక నేను నడవజాలను. సత్కార-తిరస్కారము లను పొంది, దైన్యముతో చూచుచు ఇతరుల నాశ్రయించి జీవితాశచేత తిరుగు కామాత్ములైన మనుష్యులు శునకముల మార్గములో తిరిగెదరు. (అట్టివారిది కుక్కబ్రతుకే యగును).

"జనమేజయా! పాండురాజు ఇట్లు చెప్పి దుఃఖముతో దీర్ఘముగ నిట్టూర్చి భార్యలతో నిట్లనెను:-

"రాణులారా! మీరు హస్తినాపురమునకు వెడలి పొండు. అక్కడ ఉన్న నా తల్లులు, సోదరులు, నాయనమ్మ సత్యవతి, పెదతండ్రి భీష్ముడు, రాజ పురోహితులు, బ్రాహ్మణులు, పౌరవృద్ధులు-వీరందరికి 'పాండురాజు సన్న్యాసియై అడవికి పోయెను' అని చెప్పుడు.

''జనమేజయా! ఇట్లు వనవాసము కొరకు ధృఢనిశ్చయముతో నున్న పతిదేవుని మాటలు విని కుంతి-మాద్రులు ఇట్లనిరి:-

"రాజోత్తమా! సన్యాసము దప్ప మరియొక యాశ్రమము కూడ నున్నది కదా! ఆ యాశ్రమమునందు నీవు ధర్మపత్నులతో ఉండి తపస్సు చేసికొనగలవు గదా! ఆ తపస్సు స్వర్గదాయకమై మహాఫలమును కలిగించి, ఈ శరీరముతోనే ముక్తి ఇప్పించుటకు సమర్థమగును కదా! ఆ తపఃప్రభావము చేత నీవు ఇంద్రపదవిని గూడ సాధించవచ్చు ననుటలో సందేహము లేదు. మేము ఇరువు రము కామసుఖము విడిచి, పతిలోక ప్రాప్తియందే లక్ష్యముంచి ఇంద్రియము లన్నిటిని నిగ్రహించి తపస్సు చేసెదము. రాజేంద్రా! నీవు మహా ప్రాజ్ఞుడవు. మా యిద్దరిని నీవు విడిచినయెడల మేము ప్రాణములు విడిచెదము. ఇది నిశ్చ యము."

"జనమేజయా! ఇట్లు కుంతీ - మాద్రులు చెప్పగా పాండురాజు వారితో నిట్లనెను:

"రాణులారా! ఇదియే మీ యిరువురి ధర్మయుక్త నిశ్చయమైన యెడల (నేను సన్యసించి వాన ప్రస్థాశ్రమము నందు ఉండెదను) నేటినుండి నా తండ్రి వేదవ్యాసునివలె అక్షయ ఫలమునిచ్చు వైరాగ్య జీవితమును వల్కలములు ధరించి ఫలమూలాహారముతో వనమునందు సంచరించెదను. ఉభయ సంధ్యల యందు స్నాన-సంధ్యా-అగ్నిహోత్రాదులను అనుష్ఠించెదను. జటలను మృగ చర్మమును ధరించెదను. అల్పాహారముచేసి శరీరము దుర్బల పరచెదను.

"రాణులారా! శీతోష్ణములను, మహావాయువును సహించెదను. ఆకలి-దప్పులను లెక్కచేయక, దుష్కర తపస్సుచేసి శరీరమును శుష్కింప జేసెదను. ఏకాంతమునందు ఆత్మచింతన చేసెదను. (కందమూలాదులు) పచ్చివి-పండినవి తినుచు జీవనము గడపెదను. దేవతలను, పితృదేవతలను ఆటవిక ఫలమూలములతో, జలముతో వేదమంత్రములతోను తృప్తిపరచెదను. నేను వానప్రస్థులకు, గృహస్థులకున్ను అప్రియము చేయను. ఇట్లుండగా గ్రామవాసుల విషయము చెప్పవలసిన దేమున్నది? ఈ విధముగ నేను వానప్రస్థా శ్రమమునకు సంబంధించిన యతి కఠినశాస్త్ర విధులను అవలంబించ దలచుచున్నాను. శరీరమునకు అంతముకలుగు వరకు వానప్రస్థాశ్రమము నందే ఉండెదను.

"జనమేజయా! పాండురాజు ఈ విధముగ భార్యలకు చెప్పి, తన చూడామణి (శిరోభూషణము) నిష్కము (వక్షఃస్థల భూషణము), భుజకీర్తులు, కుండలములు, బహుమూల్య వస్త్రములు తీసి, కుంతీ-మాద్రుల యాభరణములు గూడ తీయించి బ్రాహ్మణులకు ఇచ్చి సేవకులతో, 'మీరు హస్తినాపురమునకు పోయి పాండురాజు అర్థ-కామ విషయ సుఖములను, స్త్రీ సంగమాదులను విడిచి, భార్యలతో వానప్రస్థాశ్రమము నందు ఉన్నాడని చెప్పుడు.' అని యనెను.

"జనమేజయా! పాండురాజు మాట విని సేవకులు దుఃఖముతో ఆర్తనాదము చేసి కన్నీరుతో రాజును విడిచి మిగిలిన ధనము తీసికొని హస్తినాపురికి పోయి ఈ సమాచారమంతయు ఉన్నదున్నట్లు ధృతరాష్ట్రునకు తెలిపి, తాము తెచ్చిన ధనము ఆయునకు ఒప్పగించిరి.

"జనమేజయా! సేవకుల వలన పాండురాజు వృత్తాంతమంతయు వినిన ధృతరాష్ట్రుడు పాండురాజు చింతతోనే దుఃఖించుచు ఆసన - శయ్యాది వివిధ

భోగములందు రుచి లేక సోదర శోకమునందు నిమగ్నుడై సర్వదా ఆతని విషయమే చింతించుచుండెను.

"జనమేజయా! పాండురాజు వనమునందు ఫలమూలములను తినుచు తన యిరువురు భార్యలతో 'నాగశత' పర్వతమునకు పోయి, అక్కడి నుండి 'చైత్రరథ' వనమునకు పోయి, 'కాలకూట - హిమాలయ' పర్వతములను దాటి గంధమాదన పర్వతమునకు పోయెను.

"జనమేజయా! అప్పుడు పంచమహాభూతములు, సిద్ధ పురుషులు, మహర్షులున్ను పాండురాజు రక్షణము చేయుచుండిరి. ఆతడు మిట్ట పల్లముల నేలపై శయనించుచుండెను. తరువాత పాండురాజు 'ఇంద్రద్యుమ్న' సరోవరమునకు పోయి 'హంసకూట'మును దాటి 'శత శృంగ' పర్వతమునకు పోయెను. అక్కడ అతడు తపస్వి జీవనము గడుపుచు కఠోర తపస్సు చేయుచుండెను.

**పాండురాజు పుత్రప్రాప్తికి కుంతిని ఆదేశించుట :**

"జనమేజయా! శతశృంగమునందు కఠిన తపస్సు చేయుచున్న పాండురాజును అక్కడి సిద్ధచారణులు చూచి ప్రసన్నులై అతనికి ప్రియులైరి. పాండురాజు అహంకారము లేక మనో నిగ్రహముతో అక్కడి మునీశ్వరులను సేవించుచుండెను. అతడు ఇంద్రియ నిగ్రహముతో, తన శక్తి చేతనే స్వర్గము చేరుటకు ప్రయత్నించుచుండెను. అనేక ఋషులు అతని యెడల సోదర ప్రేమ గలిగియుండిరి. అనేకులు మిత్రులైరి. మునీశ్వరులు చాలమంది పుత్రప్రేమతో నతనిని చూచుచుండిరి. అందరు ఆయన రక్షణము కొరకు ప్రయత్నించుచుండిరి ఇట్లు పాండురాజు పాపరహితుడై తపస్సుచేసి బ్రహ్మర్షుల వలె మహిమాన్వితు డయ్యెను.

"జనమేజయా! ఒక అమావాస్యనాడు అక్కడియనేక మునీశ్వరులు కలిసి బ్రహ్మదేవుని దర్శనమునకై బ్రహ్మలోకమునకు ప్రయాణమైరి. అది చూచి పాండురాజు 'మునీశ్వరులారా! మీ రెక్కడికి పోవుచున్నారు?' అని అడుగగా, మునులు ఆయనతో, 'రాజా! నేడు బ్రహ్మలోకమునందు దేవతలు - పితృదేవతలు - మునీశ్వరులు అందరు కలిసి సమావేశము కానున్నారు. మేమక్కడికి బ్రహ్మదేవుని దర్శనార్థమై పోవుచున్నాము' అని చెప్పిరి.

"జనమేజయా! ఈ సమాచారము విని పాండురాజుగూడ వారితోపాటు పోవుటకు నిశ్చయించెను. స్వర్గము దాటుటకు అతనికి ఇచ్ఛ గలిగి భార్యలతో శతశృంగ పర్వతమునుండి ఉత్తరదిశకు పోయెను. అట్లు వచ్చుచున్న పాండు రాజును చూచి, హిమాలయములపైన ఉత్తరదిక్కుగా ప్రయాణము చేయుచున్న మునీశ్వరులు అతనితో నిట్లనిరి:-

"రాజేంద్రా! ఈ రమణీయ పర్వతమునందు పోవుటకు అతి కఠినము లైన యనేక ప్రదేశములను మేము చూచినాము. అవి దేవగంధర్వాప్సరసలకు క్రీడాభూములు. అక్కడ నూర్లకొలది విమానములు నిండి యుండును. అచ్చట మధురగాన ధ్వనులు మారుమ్రోగుచుండును. ఈ పర్వతము పైననే కుబేరుని ఉద్యానవనములు అనేకములు కలవు. అక్కడినేల మిట్టపల్లములు గలదిగా నుండును.

"రాజా! ఈ మార్గమునందు మేము అనేక మహానదులను, దుర్గములైన అనేక పర్వతగుహలను చూచినాము. ఇక్కడ సర్వదా మంచు గప్పియుండి, వృక్షములు, మృగములు, పక్షులు ఏవియు లేని యనేక స్థలములు కలవు. కొన్ని చోట్ల ప్రవేశించుటకు అలవికాని మహాగుహలు ఉన్నవి. ఇటువంటి అనేక గుహల కడకు పోవుటగూడ కఠినము. ఇట్టి స్థలములు పక్షులుగూడ దాటజాలవనగా, మృగాదుల విషయము చెప్పవలసిన దేమున్నది? ఈ మార్గమునందు కేవలము వాయువు, సిద్ధపురుషులు, మహర్షులు మాత్రమే పోగలరు. ఈ పర్వతముపై నడచుచున్న ఈ యిరువురు రాజకుమారికలు నశించెదరు. వీరు దుఃఖము సహించ జాలరు. కనుక. నీవు రాకుము."

"జనమేజయా! ఆ మహర్షుల మాటలు విని పాండురాజు వారితోనిట్లనెను:-

"మహర్షులారా! సంతాన హీనునకు స్వర్గద్వారము మూయబడి యుండు నని పెద్దలు చెప్పెదరు. నేను గూడ సంతతి లేనివాడను. కనుక,మీతో ఒక మనవి చేసెదను. నేను పితౄణము నుండి యింతవరకు విముక్తుడను కాలేదు. కనుక, చింతిల్లు చున్నాను. సంతానహీన పరిస్థితులలో నా యీ శరీరము నశించిన తరువాత నా పితృదేవతలు తప్పక పతనము చెందెదరు. మనుష్యుడు నాలుగు ఋణములతో జన్మించును. అవి - 'పితౄణము - దేవఋణము-ఋషిఋణము-

మనుష్య ఋణము అని. ఇవన్నియు ధర్మము ప్రకారము మనుష్యుడు తీర్చ వలెను. 'ఈ ఋణములను గూర్చి సకాలమునందు చింతించని మనుష్యునకు పుణ్యలోకములు సులభములు కావు' అను కట్టుబాటు ధర్మజ్ఞులు చేసినారు. యజ్ఞముల ద్వారా మనుష్యుడు దేవతలను, వేదాధ్యయన-తపస్సులచేత మునులను సంతోషపరచును. పుత్రోత్పాదన - శ్రాద్ధకర్మలచేత పితృదేవతలను, దయా పూర్వకముగ వ్యవహరించుటచేత మనుష్యులను సంతోష పరచును.

"మునీంద్రులారా! నేను ధర్మదృష్టితో 'ఋషి - దేవ - మనుష్యులు' - ఈ ముగ్గురి ఋణముల నుండి విముక్తుడనైనాను. పితౄణము నా శరీరము నశించినప్పుడే తీరిపోవునేమో! నేను పితౄణము నుండి విముక్తుడను కాలేదు. ఆ ఋణవిముక్తి కొరకు, పురుషులు సంతానోత్పత్తికై ప్రయత్నించి, పుత్ర రూపములో తామే, భార్యల గర్భమునుండి పుట్టెదరు. నేను నా తండ్రి భార్యల నుండి వ్యాసమహాముని వలన జన్మించినట్లే, నా యీ భార్యలనుండి కూడ ఎట్లు సంతతి కలుగ గలదు? దయయుంచి తెలుపుడు"

"జనమేజయా ! ఆ మాటకు ఋషీశ్వరులు పాండురాజుతో నిట్లనిరి :-

"రాజా! నీకు శుభసంతానము గలుగు యోగము గలదు. మేము దివ్య దృష్టితో కనుగొనినాము. అదృష్టము నీ కిచ్చిన ఫలమును నీవు ప్రయత్నము చేసి పొందుము. బుద్ధిమంతుడు తొందరపాటు విడిచి, క్లేశ పడకయే, తానుకోరిన ఫలము పొందగలడు. నీవు అదృష్టఫలముకొరకు ప్రయత్నించ వలెను. నీకు తప్పక గుణవంతులు - సంతోషకరులు నగు పుత్రులు కలిగెదరు".

"జనమేజయా! ఋషీశ్వరుల మాట విని పాండు రాజు మిక్కిలి విచారింప జొచ్చెను. మృగరూపధారియైన ముని శాపమువలన, తనకు సంతానోత్పాదన పురుషార్థము నశించినదని యతనికి తెలియును. కనుక, ఒక నాడతడు ఏకాంతము నందు కుంతితో నిట్లనెను :-

"దేవీ! ఇది మనకు ఆపత్తికాలము. ఇప్పుడు మనకు సంతానము కలుగు టకు గాను, చేయవలసిన ప్రయత్నము నీవు సమర్థించి చెప్పుము. 'సమస్తలోక ములందు సంతానమే పురుషునకు ధర్మసంగతమైన ప్రతిష్ఠ' యని ధర్మజ్ఞులు

చెప్పెదరు. ఈ లోకములో సంతాన హీనుడు యజ్ఞ-దాన-తపోనియమము లెన్ని యనుష్ఠించినను, అవి పవిత్రములు కావు. దేవీ! ఎంత యోచించినను నేను సంతానహీనుడనగుటచేత, నాకు పుణ్యలోకము లభించ జాలదని తోచుచున్నది. నేను నిరంతర మీ చింతలోనే మునిగియున్నాను.

"కుంతి భోజకుమారీ! నా మనస్సు నా వశములో లేదు. నేను క్రూర కర్మలు చేయువాడను. మృగశాపము చేత నా సంతానోత్పాదన శక్తి, నేను మృగమును వధించుటచేత దాని మైథునకర్మ చెడిపోయినట్లే, నశించినది.

"దేవీ! ధర్మశాస్త్రములలో, 'బంధు దాయాదులు' ఆరుగురని చెప్పబడినది. వారు కుటుంబ వ్యక్తులగుట చేత సంపదకు ఉత్తరాధికారు లయ్యెదరు. వారు గాక 'అబంధుదాయాదులు' ఆరుగురని చెప్పబడినది. వారు కుటుంబ వ్యక్తులు కాకున్న ప్పటికిన్ని ఉత్తరాధికారు లగుదురని చెప్పబడెను.* ఈ యందరినిగూర్చి చెప్పెద వినుము :-

"దేవీ! శాస్త్రోక్తముగా వివాహము చేసికొనబడిన ధర్మపత్ని నుండి, తనకు పుట్టిన పుత్రుడు 'స్వయంజాతుడు' అనబడును. ఇతడు మొదటివాడు. రెండవవాడు 'ప్రణీతుడు' అనబడును. అతడు, తన పత్నిగర్భము నుండియే ఉత్తమ పురుషుని యనుగ్రహముచేత పుట్టినవాడు. మూడవ పుత్రుడు 'దౌహిత్రుడు' (తన పుత్రికయొక్క పుత్రుడు) అతడు గూడ తన పుత్ర సముడు గానే తలచబడును. నాలుగవ పుత్రుడు 'పౌనర్భవుడు' అనబడును.

* 'బంధు' శబ్దమునకు అర్థము - సంస్కృత శబ్దార్థ కౌస్తుభము'లో, 'ఆత్మబంధు - పితృబంధు - మాతృబంధువు' లని చెప్పబడినది. కనుక బంధు శబ్దమునకు అర్థము కుటుంబ వ్యక్తి యని చెప్పబడెను. 'దాయాద' శబ్దమునకు అర్థము, ఆ నిఘంటువులోనే, 'ఉత్తరాధికారి' యని చెప్పబడెను. కనుక, 'బంధు దాయాద' శబ్దమునకు అర్థము, 'కుటుంబ వ్యక్తి యగుటచేత ఉత్తరాధికారి' యని చెప్పబడెను.
'అబంధు దాయాద' శబ్దమునకు అర్థము 'కుటుంబ వ్యక్తి కాకున్నను ఉత్తరాధికారి' యని చెప్పబడెను.

*అతడు రెండవసారి వివాహము చేసికొనబడిన స్త్రీకి (విధవకు - లేక- ఒక పతిని విడిచి, తనను చేసికొనినదానికి) తననుండి పుట్టిన పుత్రుడు. అయిదవవాడు, 'కానీనుడు' అనబడును. (వివాహముకంటే పూర్వమే 'ఈమెకు పుట్టబోవువాడు నా పుత్రుడు అను నిబంధనము చేసికొని, కన్యకనుండి తనకు పుట్టిన కొడుకు**), ఆరవవాడు మేనల్లుడు (భగినీపుత్రుడు).

(ఈ యారుగురు బంధుదాయాదులు)

''దేవీ! యిక ఆరువిధములైన 'అబంధు దాయాదులను' గూర్చి చెప్పెద వినుము :-"

''మొదటివాడు 'దత్తుడు' - తల్లిదండ్రులచేత స్వయముగా నితరునకు ఈయబడిన పుత్రుడు. రెండవవాడు, క్రీతుడు'. ఇతడు ధనమిచ్చి కొనబడిన పుత్రుడు. మూడవవాడు, కృత్రిముడు'- ఇతడు స్వయముగా, 'నేను నీ పుత్రుడను' అనిచెప్పి తన యొద్దకు వచ్చిన పుత్రుడు. నాలుగవవాడు,' సహోఢుడు'- పెండ్లి యగుటకు పూర్వమే గర్భవతియైన కన్యకను పెండ్లిచేసికొనిన తరువాత పుట్టిన పుత్రుడు, 'తన కొడుకు' అనబడును. అయిదవవాడు 'జ్ఞాతి రేతస్కుడు'- అనగా, తవ వంశీయులకు పుట్టినవాడు. ఆరవవాడు, తనకంటే హీనజాతి స్త్రీనుండి తనకు పుట్టిన పుత్రుడు.

''దేవీ! యీ పన్నెండు విధములైన పుత్రులలో వరుసగా, 'మొదటివాడు లేనప్పుడు రెండవవాడు' అని యీవిధముగా పూర్వ పూర్వుల అభావమునందు ఉత్తరోత్తరులను పుత్రుగా స్వీకరించవలెను. ఆపత్తికాలమునందు నీచజాతి పురుషులు తమ భార్యలకు ఉత్తమజాతి పురుషుల వలన పుత్రులను కనవచ్చును. తన వీర్యమువలన కాకున్నను, ఇతర శ్రేష్ఠపురుషుని సంబంధముచేత, తన

* 'పౌనర్భవ' శబ్దమునకు అర్థము 'పద్మచంద్ర నిఘంటువు'లో, రెండవ సారి పెండ్లి చేసికొనబడిన స్త్రీనుండి, తనకు పుట్టిన పుత్రుడు అని చెప్ప బడినది.

** 'కానీన' శబ్దమునకు ఈ యర్థము మహాభారత ప్రసిద్ధ వ్యాఖ్యాతమైన 'నీలకంఠ' పండితుడు చెప్పెను.

పత్నికి ఉత్తమ పుత్రోత్పత్తి కలిగించినను, అది ధర్మ ఫలప్రదమగునని 'స్వాయంభువమనువు' చెప్పెను. కనుక, దేవీ! నేను సంతానోత్పాదన శక్తి రహితుడనైతిని. కాబట్టి, నేడు నిన్ను మరియొకని కడకు పంపెదను. నీవు నావంటి వానివలనగాని, లేక, నాకంటే, శ్రేష్ఠపురుషుని వలనగాని సంతానము కనుము.''

''జనమేజయా! ఇట్లు పాండురాజు చెప్పగా, కుంతీదేవి ఆయనతో నిట్లనెను:-

**కుంతీదేవి పాండురాజునకు వ్యుషితాశ్వుని కథ చెప్పుట :**

''ధర్మజ్ఞా! నీవిట్లు అనగూడదు. నేను నీ ధర్మపత్నిగా, నీయందే అనురక్తురాలనైయున్నాను. నీవే, ధర్మము ప్రకారము, నా గర్భము నుండి పుత్రులను కనుము నేను నీతోపాటే స్వర్గమునకు పోయెదను. పుత్రోత్పత్తి కొరకు నీవు నాతోనే సమాగమము చేయుము. నేను నిన్ను దప్ప మరియొక పురుషునితో సమాగమము చేయను. ఈ భూమండలమునందు నీ కంటే శ్రేష్ఠ పురుషుడెవ డున్నాడు? నేను చెప్పబోవు పౌరాణిక కథ వినుము:

''మహారాజా! పూర్వము పూరు వంశమునందు 'వ్యుషితాశ్వుడు' అను రాజుండెను అతడు పరమ ధర్మాత్ముడు. అతడు చేయు యజ్ఞములందు, ఇంద్రాది దేవతలు స్వయముగా వచ్చుచుండిరి ఆ యాగములలో నింద్రుడు సోమపానము చేసి మత్తిల్లుచుండెను. బ్రాహ్మణులు పుష్కలముగా దక్షిణలు తీసికొని హర్షోత్ఫుల్లులగుచుండిరి. రాజర్షియైన వ్యుషితాశ్వుడు చేయు యజ్ఞములందు, దేవతలు - బ్రహ్మర్షులున్ను వచ్చి స్వయముగా అన్ని పనులు చేయుచుండిరి. దీనిచేత ఆ రాజర్షి మనుష్యులందరి కంటే ఉన్నత స్థితిలో నుండి శోభిల్లుచుండెను.

''ప్రాణపతీ! వ్యుషితాశ్వుడు సర్వ ప్రాణులకు ప్రీతిపాత్రుడుగా నుండెను. ఆ రాజు చేసిన అశ్వమేధ యాగమునందు నలు దిక్కులనున్న రాజులను జయించి, శిశిరఋతువు నంతమందు సూర్య భగవానుడు సమస్త ప్రాణులను జయించునట్లే, వ్యుషితాశ్వుడు అందరిని తపింపజేయజొచ్చెను. ఆ రాజునకు పదియేనుగుల బలముండెను. వ్యుషితాశ్వుని యశోగానమిట్లు చేయబడెను.

''వుషితాశ్వరాజు సముద్ర పర్యంతముగల సమస్త భూమండలము జయించి, ఔరస పుత్రులను తండ్రి రక్షించునట్లే, అన్ని వర్ణముల ప్రజలను పాలించుచుండెను. అతడు పెద్ద పెద్ద యజ్ఞములు చేసి బ్రాహ్మణులకు బహుళ ధనమిచ్చెను.

''దేవా! అనేక రత్నములను కానుకలుగా తీసికొని వ్యుషితాశ్వుడు పెద్ద-పెద్ద యజ్ఞములు చేసెను. అనేక సోమయాగములను గూడ అనుష్ఠించెను.

''రాజా! 'కక్షీవంతుని' పుత్రియైన 'భద్ర' అను నామె ఆ రాజర్షికి ప్రియపత్నిగా నుండెను. ఆమె అసమాన రూప - సౌందర్య సంపన్నురాలు. ఆ దంపతులు పరస్పరము ప్రేమతో నుండిరి. వ్యుషితాశ్వుడు ఆమెతో అత్యంత ముగా కామోపభోగములు జరుపుటచేత అతనికి క్షయవాధి వచ్చెను. అందుచేత రాజు కొలది కాలములోనే సూర్యుని వలె అస్తమించెను. అతని పత్ని మిక్కిలి దుఃఖించెను. అంతపర కామెకు సంతానము కలుగకుండెను. కాబట్టి మిక్కిలి దుఃఖించుచు శవముపై బడి పతిని సంబోధించుచు ఇట్లు విలపించెను :

"మహారాజా! విధవా స్త్రీ జీవించి యుండి నిరంతరము దుఃఖించుట చేత ఆమె మృత ప్రాయయే యగును. పతిలేని స్త్రీ మరణించుటలోనే ఆమెకు శ్రేయస్సు గలదు. కనుక నేను గూడ నీ మార్గము నందే పోవగోరుచున్నాను. నీవు ప్రసన్నుడవై నీతో నన్ను కొనిపొమ్ము. నీవు లేక, నేను ఒక క్షణము గూడ జీవించి యుండ జాలను. కనుక, శీఘ్రము నన్ను కొనిపొమ్ము."

"రాజా! నీవు మరల ఎప్పుడు గూడ ఇక్కడకు తిరిగిరాని చోటికి పోయితివి. ఆ మార్గము సమముగా నున్నను, విషమముగా నున్నను, నీ వెంట నేను ఛాయ వలె అనుసరించి వచ్చి నీ యాజ్ఞా ప్రకారము నడచుకొనెదను. నీకు సర్వదా హితము, ప్రియము చేయుచుందును. నీవు లేకుండుట చేత నేటి నుండి హృదయము శుష్కింపజేయ కష్టములు, మానసిక చింతలు నను బాధించు చుండును."

"రాజా! భాగ్యహీనురాల నైన నేను ఎందరు పతి - పత్నులను ఎడబాపి యుందునో? కనుక నే నేడు నీతో వియోగము నాకు కలిగినది. పతి వియోగము

చెందిన తరువాత రెండు ఘడియలు జీవించి యున్నను ఆ పాపిష్ఠురాలు నరకములో పడినంత దుఃఖముతో జీవనము గడపును. పూర్వజన్మము నందు పతి - పత్నీ వియోగకరణ రూపము లైన అనేక పాపకర్మలు చేసితిని. కాబట్టి, అవి బీజ రూపములో నా యందుండుట చేత నేడు నీతో నాకు వియోగము కలిగినది. నేటి నుండి నీ దర్శనము కోరుచు నేను దర్భశయ్యపై శయనించెదను. దుఃఖించుచు దీనురాలనై యున్న నాకు నేడు నీవు దర్శనమిచ్చి నా కర్తవ్యమును ఆదేశింపుము."

"జనమేజయా! కుంతీదేవి యిట్లు భద్రాదేవి విలాపమును గూర్చి పాండు రాజునకు చెప్పి మరల అతనితో నిట్లనెను :

"మహారాజా! ఈ విధముగ భద్రాదేవి వ్యుషితాశ్వుని శవమును కౌగిలించు కొని పలుమారులు దుఃఖించుచున్నప్పుడు, శవములో నుండి వాణి ఆమెకు ఇట్లు వినబడెను :

"మంగళకరురాలా! ఇక లెమ్ము. వెడలి పొమ్ము. నేను నీకు వరమిచ్చె దను. నీ గర్భము నుండి అనేక పుత్రులను పుట్టించెదను. నీవు ఋతుస్నానము చేసిన తరువాత ఎనిమిదవనాటి రాత్రిగాని, పదునాలుగవ నాటి రాత్రిగాని, నీ శయ్యపై నా యీ శవముతో శయనింపుము."

"పాండు మహారాజా! భద్రాదేవి పుత్రార్థినియై ఆ మాట ప్రకారమే చేసెను. ఆ శవమునుండి ఆమెకు ఏడుగురు పుత్రులు పుట్టిరి. వారిలో ముగ్గురు సాళ్వదేశమునకు, నలుగురు మద్ర దేశమునకున్ను రాజులైరి."

**పతియాజ్ఞచేత కుంతీదేవి, సంతతి కొరకు యమధర్మరాజు నాహ్వానించుట:-**

"జనమేజయా! కుంతీదేవి ఇట్లు చెప్పిన తరువాత ధర్మజ్ఞుడైన పాండు రాజు ఆమెతో మరల నిట్లనెను :-

"దేవీ! నీ మాట బాగుగనే యున్నది. పూర్వకాలమునందు వ్యుషితాశ్వుడు నీవు చెప్పినట్లే చేసెను. అతడు దేవసమాన తేజశ్శాలి. ఇప్పుడు నీకు ధర్మతత్త్వము తెలిపెద వినుము. ఇది ధర్మజ్ఞులైన ప్రాచీన మహర్షులు ప్రత్యక్షముగా చూచి నది. ఇదియే ప్రాచీన ధర్మమని సత్పురుషు లనెదరు. పతిపత్నితో చెప్పిన మాట

ధర్మమునకు అనుకూలమైనను, ప్రతికూలమైనను పత్ని తప్పక నెరవేర్చవలెను. ఇది వేదజ్ఞులు చెప్పిన మాట. విశేషించి, పుత్రేచ్ఛతో సంతానోత్పాదనము చేయు శక్తిలేని పతి చెప్పిన మాట పత్ని అవశ్యముగా అంగీకరింపవలెను. నేను, పుత్రముఖ దర్శనము కొరకు ఉత్సుకుడనై యున్నాను. కనుక, నీ శిరస్సుపై అంజలియుంచి వేడుకొనుచున్నాను. కనుక, ప్రియే! నీవు నా నియోగము (ఆజ్ఞ) చేత ఒక మహా తపస్వియైన ఉత్తమ బ్రాహ్మణునితో సమాగము చేసి, గుణవంతులైన పుత్రులను కనుము. నీ ప్రయత్నముచేత నేను పుత్రవంతుల సద్గతి చెందవలెనని కోరుచున్నాను."

"జనమేజయా! ఇట్లు పాండురాజు చెప్పిన తరువాత పతికి ప్రియము, హితము చేయదలచిన కుంతీదేవి పాండురాజుతో నిట్లనెను :-

"భరతవంశ శిరోమణీ! పత్నిని ప్రసన్నురాలినిచేయుట కొరకు పతియే మాటి - మాటికి భార్యను ప్రార్థించుట చాల అధర్మము. ఎందుకనగా పతిని ప్రసన్నుని చేయుటయే పత్ని కర్తవ్యము. నేను చెప్పబోవు మాట వినుము. నీకు సంతోషము కలుగును. నేను బాల్యావస్థలో తండ్రి యింట నున్నప్పుడు అతిథి సత్కారము చేయు పని నాకు ఒప్పగింపబడి యుండెను. అప్పుడొక పారి కఠిన తపోవ్రతము పాలించుచున్న ఉగ్రస్వభావుడైన దుర్వాసుడను నొక బ్రాహ్మణుడు వచ్చెను. అతడు మహాధర్మజ్ఞుడని యితరులకు తెలియకుండెను. నేను అతనికి మిక్కిలి శ్రద్ధాభక్తులతో సేవచేసి వివిధ ప్రయత్నముల చేత అతనిని సంతుష్టపరచితిని. అప్పుడా మహాముని నాకు వరదానముగ నొక మంత్రమును, ప్రయోగవిధి సహితముగ ఉపదేశించి నాతో నిట్లనెను :

"కల్యాణీ! నీవు ఈ మంత్రము చేత ఏ దేవతను పిలిచినను అతడు నీ కడకు వచ్చి, నీ యధీనములో నుండును. నీ యాహ్వానము సకామమైనను, నిష్కామమైనను అతడు తప్పక వచ్చును. ఆ దేవత యొక్క యనుగ్రహము చేత నీకు పుత్రుడు కలుగును."

"పాండు మహారాజా! నా తండ్రి యింటిలో ఆ బ్రాహ్మణుడు చెప్పిన ఆ మాట సత్యమే ఐయుండును. దాని కిప్పుడు అవసర మేర్పడినది. నీ యాజ్ఞ యైనది. కాబట్టి, ఆ మంత్రము చేత ఏ దేవతనైన నాహ్వానించెదను. అతడు మన యిరువురకు హితమైన సంతానమును కలిగించును. ఆ మంత్రము చేత నేను ఏ దేవతను పిలిచినను వచ్చి, సంతానము లేనందు వలన నీకు కలిగిన శోకము పోగొట్టును. ఈ విధముగ నేను సంతానవతి నగుటయే కాక, నీ పుత్రేచ్ఛ గూడ సఫలమగును. ఇప్పుడు, నేను ఏ దేవతను పిలువవలెనో చెప్పుము. నీ సంతోషార్థమై ఈ కార్యమునకు నేను సిద్ధముగ నున్నాను. నీ యాజ్ఞకై వేచి యున్నాను.

"జనమేజయా! ఇట్లు కుంతీదేవి చెప్పగా విని పాండురాజు ఆమెతో నిట్లనెను :

"ప్రియే! నీవు నాపై చాల దయ జూపితివి. ధన్యుడనైతిని. నా కుల పరంపరను నిలిపితివి. నీకు అట్టి వరమిచ్చిన మహర్షికి నమస్కారము చేయు చున్నాను. ధర్మజ్ఞురాలా! అధర్మము చేత ప్రజాపాలనము జరుగదు. కనుక, నేడే నీవు విధిపూర్వకముగ ఆ కార్యము కొరకు ప్రయత్నించుము. దేవత లందరి కంటె తొలుత ధర్మదేవతయైన యమధర్మరాజును ఆహ్వానింపుము. అతడే సర్వ ప్రపంచములో ధర్మాత్ముడు.

"దేవీ! ఇట్లు చేయుట చేత మన ధర్మమునకు ఎప్పుడు గూడ అధర్మ ముతో సాంకర్యము కలుగదు. అట్టి పుత్రుని ప్రపంచ జనులు గూడ ధర్మ స్వరూపుడని తలచెదరు. యమధర్మరాజు వలన ఉత్పన్నుడైన పుత్రుడు కురు వంశీయులలో అందరికన్న అధిక ధర్మాత్ముడు కాగల డనుటలో సందేహము లేదు. ధర్మదేవత ప్రసాదించిన పుత్రుని మనస్సు అధర్మమునందు ఎట్లు లగ్న మగును? నీవు మనోనిగ్రహము, ఇంద్రియ నిగ్రహము కలదానవై ధర్మమును ముందిడుకొని, పూజా ప్రయోగ విధుల ద్వారా, ధర్మ దేవతను ఆహ్వా నింపుము."

"జనమేజయా! తన పతిదేవుడైన పాండురాజు ఇట్లు చెప్పిన తరువాత, కుంతీదేవి 'అట్లే యగుగాక!' అని పతికి నమస్కరించి ప్రదక్షిణము చేసెను.''

**యుధిష్ఠిర-భీమార్జునుల జననము :**

"జనమేజయా! గాంధారి గర్భధారణ చేసి ఒక సంవత్సరము గడచి నప్పుడు కుంతి గర్భధారణ కొరకు యమధర్మరాజును ఆహ్వానించెను. కుంతీదేవి ధర్మదేవతను ఆరాధించి, దుర్వాసుడు ఉపదేశించిన మంత్రమును విధిపూర్వక ముగా జపించెను. అప్పుడు ఆ మంత్ర బలము చేత ఆకృష్టుడై యమధర్మరాజు సూర్యతేజోవిరాజితమైన విమానములో అక్కడకు వచ్చెను. అప్పుడు జపములో నిమగ్నురాలై యున్న కుంతీదేవితో నవ్వుచు, 'కుంతీ! చెప్పుము. నీకు ఏమి యివ్వమనెదవు?' అని యడుగగా, కుంతి 'నాకు పుత్రుని ఇమ్ము' అని అనెను.

"తరువాత యోగ మహిమ చేత, మానవాకరములో నున్న యమధర్మ రాజుతో కుంతీదేవి సమాగమము చేసి సర్వ ప్రాణులకు హితకరుడైన యొక పుత్రుని కనెను అప్పుడు చంద్రుడు జ్యేష్ఠా నక్షత్రమునందు, సూర్యుడు తులా రాశి యందు ఉండిరి. శుక్ల పక్షమునందు 'పూర్ణ' అను పంచమీ తిథియందు మిక్కిలి శ్రేష్ఠమైన అభిజిత్తు* అనెడు ఎనిమిదవ ముహూర్తము నందు ఆ బాల కుడు పుట్టెను. అతడు జన్మించగనే ఆకాశవాణి ఇట్లు వినపడెను :-

"ఈ ఉత్తమ పురుషుడు ధర్మాత్ములలో అగ్రగణ్యు డగును. భూ మండలము నందు ఇతడు పరాక్రమవంతుడు, సత్యవాదియు నగు రాజగును. యుధిష్ఠిరు డను పేరుతో మూడు లోకములందును ప్రఖ్యాతిగాంచును. ఇతడు తేజస్సు, యశస్సు గలవాడై సత్త్వవర్తకుడుగా నుండును."

"ఇట్లు, ధర్మాత్ముడైన పుత్రుని కాంచి పాండురాజు కుంతితో మరల నిట్లనెను :-

"ప్రియే! బలవంతుడైన క్షత్రియుడే గొప్పవా డనిపించుకొనును. కనుక సర్వాధిక్య బలము గల పుత్రుని కనుము. యజ్ఞములలో అశ్వమేధము ప్రకాశ వంతులలో సూర్యుడు మనుష్యులలో బ్రాహ్మణుడున్ను శ్రేష్ఠులైనట్లే.

* 'అభిజిత్తు' అను ముహూర్తము, మధ్యాహ్నమునకు పూర్వము 24 నిముష ములు, తరువాత 24 నిముషములు, ఈ 48 నిమిషముల కాలము 'అభి జిత్తు ముహూర్త' మనబడును.

బలవంతులలో వాయుదేవుడు అందరి కంటే శ్రేష్ఠుడు. కనుక, నీవు మహా బలుడైన వాయువు నాహ్వానించి, అతని వలన మనుష్యులలో అత్యంత బలాధికుడు, ప్రాణశక్తి సంపన్నుడైన పుత్రుని కనుము.

"జనమేజయా! పతియాజ్ఞ ప్రకారము కుంతీదేవి వాయుదేవుని ఆహ్వానింపగా, ఆయన మృగ వాహనముపై వచ్చి 'కుంతీ! నీ కోరిక యేమి? నే నేమి చేయుదును?' అని యడుగగా, కుంతీదేవి లజ్జతో చిరునవ్వుతోను 'సురశ్రేష్ఠా! నాకు మహా బలము, మహాకాయమున్ను కలిగి, శత్రుదర్పనాశకుడైన యొక పుత్రుని ఇమ్ము!?' అని యడుగగా, వాయుదేవుడు మహాబలపరాక్రమ-బాహుబల సంపన్నుడగు భీమసేనుని కుంతి నుండి కనెను. ఆ పుత్రుని చూచి, ఆకాశవాణి 'ఈ కుమారుడు బలవంతు లందరిలో శ్రేష్ఠుడు.' అని పలికెను."

"జనమేజయా! భీమసేనుడు జన్మించగనే ఒక యద్భుతమైన సంఘటనము జరిగెను. అది యేమనగా, ఆ బాలకుడు తల్లి యొడి నుండి క్రింద పడినప్పుడు తన యవయవముల బలము చేత అక్కడి పర్వత సానువులను చూర్ణము చేసెను."

కుంతీదేవి ప్రసవించిన పదవనాడు ఆ పుత్రుని ఒడిలో తీసికొని సుందర సరోవరమునకుపోయి, స్నానము చేసి వచ్చి దేవతాపూజ కొరకు కుటీరము నుండి బయటకు వచ్చి పర్వత సమీపమున పోవుచుండెను. ఇంతలోనే ఒక వ్యాఘ్రము పర్వత గుహ నుండి బయటకు వచ్చి ఆమెను చంపబోవగా, పాండు రాజు మూడు బాణములతో ఆ వ్యాఘ్రమును చంపినప్పుడు అది వికట గర్జనము చేసి సమస్త పర్వత గుహలను ప్రతిధ్వనింప జేసెను. అప్పుడు కుంతీదేవి, వ్యాఘ్ర భయము చేత ఎగిరిపడి నప్పుడు తన యొడిలో నిద్రించుచున్న భీమసేనునిపై ఆమెకు ధ్యానము లేకుండెను. అందుచేత వజ్రశరీరము గల యా బాలకుడు పర్వత శిఖరముపై పడినప్పుడు అతని యంగముల శక్తి చేత పర్వత పాషాణములను చూర్ణము చేయగా. పాండురాజు మిక్కిలి ఆశ్చర్యపడెను.

"జనమేజయా! భీముని జన్మకాలము నందు చంద్రుడు మఘా నక్షత్రము నందు, బృహస్పతి సింహ లగ్నము నందు ఉండిరి. సూర్యుడు మధ్యాహ్నము

నందు ఆకాశ మధ్యభాగమున తపించుచుండెను. ఆనాడు త్రయోదశీ తిథి 'మైత్ర* ముహూర్తము నందు కుంతీదేవి అచంచల శక్తి శాలియైన భీమసేనుని కనెను. ఆనాడే హస్తినాపుర మందు దుర్యోధనుడు గూడ జన్మించెను.

"జనమేజయా! భీమసేనుడు పుట్టిన తరువాత పాండురాజు మనస్సులో ఇట్లు విచారించెను.

"అందరికన్న ఉత్తమ పుత్రుడు నాకు ఎట్లు కలుగును? ఈ ప్రపంచము నందు 'దైవ-పౌరుషములు' రెండు గూడ ఆవశ్యకములు. దైవము సకాలములో ప్రయత్నించి నప్పుడే పౌరుషము సులభమగును. ఇంద్రుడు దేవతలలో ప్రధానుడు. అతనికి అమితమైన బలపరాక్రమోత్సాహ సంపద కలదు. నేను తపస్సు ద్వారా, అతనినే సంతుష్టుని చేసి మహా బలశాలియైన పుత్రుని కనెదను. అత డిచ్చు పుత్రుడు తప్పక సర్వశ్రేష్ఠుడు, అసమాన యుద్ధ కుశలుడు, దైత్య దానవాదులను గూడ సంహరించువాడుగా ఉండగలడు. కనుక, నేను మనోవాక్కాయ కర్మలతో (త్రికరణ శుద్ధిగా) గొప్ప తపస్సు చేసెదను" అని విచారించెను.

"జనమేజయా! పాండురాజు ఇట్లు నిశ్చయించుకొని అక్కడి మహర్షులతో సంప్రదించి, వారి సమ్మతితో, ఒక సంవత్సరము వ్రత మవలంబించు మని కుంతికి చెప్పి, తాను గూడ ఇంద్రుని ఆరాధించుటకు చిత్తవృత్తిని ఏకాగ్రము చేసి, సూర్యోదయము నుండి సూర్యాస్తమయము వరకు ఒంటి కాలిపై నిలిచి ఉగ్ర తపస్సు చేసెను. ఇట్లు చాల కాలము తపస్సు చేసిన తరువాత ఇంద్రుడు ప్రసన్నుడై, అతని కడకు వచ్చి ఇట్లనెను :-

"పాండురాజా! నేను నీకు త్రిలోక ప్రసిద్ధుడైన పుత్రుని ఇచ్చెదను. అతడు గో - బ్రాహ్మణ - మిత్రుల యొక్క మనోరథమును తీర్చి శత్రువులకు దుఃఖమును బంధువుల కానందము కలిగించు వాడుగా నుండగలడు.

"జనమేజయా! ఇంద్రుడిట్లు చెప్పిన తరువాత పాండురాజు మిక్కిలి ప్రసన్నుడై కుంతీదేవితో నిట్లనెను :-

* పగలు 15 సమభాగములు చేయగా, అందు మూడవ భాగము 'మైత్ర' ముహూర్త మనబడును.

"కల్యాణీ! నీవు చేసిన వ్రతమునకు భవిష్యత్ఫలము మంగళకరముగా నున్నది. ఇంద్రుడు, మన యెడల సంతుష్టుడై మన సంకల్పానుసారముగ నీకొక యుత్తమ పుత్రుని ఇవ్వదలచినాడు. ఆ బాలకుడు అలౌకిక కార్యములు చేయ గలవాడు, యశస్వి, శత్రుదమనుడు, నీతిజ్ఞుడు, మహాత్ముడు, సూర్య సమాన తేజస్కుడు, కర్మయోగి, అద్భుత దర్శనుడు గాను నుండగలడు. ఇక నీవు, క్షత్రియ తేజోభరితుడైన పుత్రుని కనుము. నేను, దేవేంద్రుని కృప సంపాదించినాను. అతనినే నీవు ఆహ్వానింపుము."

"జనమేజయా! పాండురాజు ఇట్లు చెప్పిన తరువాత కుంతీదేవి ఇంద్రుని ఆహ్వానింపగా నతడు వచ్చి ఆమె నుండి అర్జునుని కనెను. ఆ బాలకుడు ఫాల్గుణ మాసమునందు పగలు పూర్వ ఫల్గునీ- ఉత్తర ఫల్గునీ నక్షత్రముల సంధి కాలము నందు పుట్టెను. అతడు ఫాల్గున మాసమునందు, ఫల్గునీ నక్షత్రమునందు పుట్టెను గనుక, అతని పేరు 'ఫాల్గుణుడు' అని యేర్పడెను.

"జనమేజయా! అర్జునుడు జన్మించగనే ఒక గంభీర నాదము చేత ఆకాశమంతయు మారుమ్రోగగా, ఆకాశవాణి, సమస్త ప్రాణులు, ఆశ్రమవాసు లున్ను వినుచుండగా, కుంతితో స్పష్టముగా నిట్లనెను:-

"కుంతి భోజకుమారీ! ఈ బాలకుడు కార్తవీర్యార్జునుని వంటి తేజస్సు, పరమేశ్వరుని వంటి పరాక్రమమున్ను గలవాడై, ఇంద్రుని వలె అజేయుడై నీ కీర్తిని విస్తరింపజేయగలడు. మహా విష్ణువు వామన రూపములో నవతరించి దేవమాతయైన అదితికి హర్షము పెంపొందించినట్లే విష్ణుతుల్యుడైన యీ అర్జునుకు గూడ నీ సంతోషమును పెంచగలడు. ఈ నీ వీరపుత్రుడు మద్ర-కురు-సోమక-చేది-కాశీ-కరూష దేశములను వశపరచుకొని కురువంశ రాజ్యలక్ష్మిని పాలించ గలడు. ఈ వీరార్జునుడు ఉత్తరదిక్కు రాజులను జయించి అనంత ధన రత్న రాసులను తేగలడు. ఇతని బాహు బలముచేత ఖాండవవనమునందు అగ్నిదేవుడు సమస్త ప్రాణుల మేదస్సును ఆస్వాదించి సంతృప్తి చెందగలడు. సమస్త క్షత్రియ సమూహములకు నాయకుడై శత్రు రాజులను జయించి, సోదరులతో పాటు మూడు అశ్వమేధ యాగములు అనుష్ఠించగలడు. ఇతడు పరశురాముని వలె వీరయోధుడై విష్ణు సమాన పరాక్రమశాలియై బలవంతులలో శ్రేష్ఠుడుగా విరాజిల్లును.

"కుంతీ! యుద్ధమునందు దేవాధిదేవుడైన శంకర భగవానుని ఇతడు సంతోషపరచి, ఆ భగవంతుని నుండి పాశుపతాస్త్రము సంపాదించగలడు. దేవతలను ద్వేషించుచున్న నివాత కవచ రాక్షసులను నీ యీ పుత్రుడు ఇంద్రుని యాజ్ఞ చేత సంహరించ గలడు. సమస్త దివ్యాస్త్ర జ్ఞానము గలవాడై తాను పోగొట్టుకొనిన రాజ్య సంపదను తిరిగి సంపాదించుకొనగలడు".

"జనమేజయా ! కుంతీదేవి సూతకము (పురిటి)లో నుండగనే ఈ యాకాశవాణిని వినెను. దీని చేత, శతశృంగ పర్వత నివాసులైన మునులు, విమానములందున్న యింద్రాది దేవతలున్ను మిక్కిలి హర్షము చెందిరి. ఆకాశము నుండి పుష్ప వర్షము కురిసెను. దేవదుందుభులు మ్రోగెను. అక్కడ దేవతలందరు చేరి అర్జునుని ప్రశంసించిరి. నాగ-గరుడ-గంధర్వ-అప్సరస-బ్రహ్మలు, భరద్వాజ-కశ్యప-గౌతమ-విశ్వామిత్ర-జమదగ్ని-వసిష్ఠాది సప్తర్షి గణము, సూర్యాస్తమయమైన తరువాత నక్షత్రరూపములో ఉదయించు అత్రి భగవానుడు, మరీచి-అంగిరస-పులస్త్య-పులహ-క్రతు-దక్ష ప్రజాపతి-గంధర్వాదులున్ను దివ్యవస్త్రాభరణములు ధరించిన యప్సరసలున్ను అక్కడ చేరి అర్జునుని గుణములను గానము చేయుచుండిరి. మహర్షులు ఒక వైపు నిలిచి మంగళకర మంత్రములను జపించుచుండిరి. గంధర్వులతో తుంబురుడు మధుర స్వరములతో గానము చేయుచుండెను.

"జనమేజయా ! 'భీమసేన - ఉగ్రసేన - ఊర్ణాయున్-అనఘగోపతి - ధృతరాష్ట్ర - సూర్యవర్చస్ - యుగపాలక - తృణపాలక - కార్ష్ణినంది - చిత్రరథ - శాలిశిరస్ - పర్జన్య - కలి - నారద - ఋత్వాన్ - బృహత్త్వాన్ - బృహక - కరాళ' నామకులు, బ్రహ్మచారి, గుణవంతుడునైన సువర్ణుడు, విశ్వావసు - భుమన్యు - సుచంద్ర - శరు' నామకులు, గానమాధుర్య సంపన్నులైన 'హాహా - హూహూ' నామక దేవ గంధర్వులు నక్కడకు వచ్చిరి.

"జనమేజయా ! అనూచానా - అనవద్యా - గుణముఖ్యా - గుణావరా - అద్రికా - సోమా - మిశ్రకేశీ - అలంబుషా - మరీచి - శుచికా - విద్యుత్పర్ణా - తిలోత్తమా - అంబికా - లక్షణా - క్షేమా-దేవీ- రంభా - మనోరమా - అసితా - సుబాహు - సుప్రియా - వపుస్ - పుండరీకా - సుగంధా - సురసా - ప్రమాథినీ -

కామ్యా - శారద్వతీ' నామములుగల యప్సరః స్త్రీలు గుంపులు-గుంపులుగా వచ్చి అక్కడ నాట్యము చేయుచుండిరి. వారిలో 'మేనకా - సహజన్యా - కర్ణికా - పుంజికస్థలా - ఋతుస్థలా - ఘృతాచీ - విశ్వాచీ - పూర్వచిత్తి - ఉమ్లోచా - ప్రమ్లోచా' నామములు గల పదుగురు అప్సరసలు సుప్రసిద్ధులు. వారితో పాటు పదకొండవదిగా ఊర్వశి గూడ ఉన్నది.

"జనమేజయా! ధాతృ - అర్యమన్ - మిత్ర - వరుణ - అంశ - భగ - ఇంద్ర - వివస్వాన్ - పూషన్ - త్వష్ట్ర - సవితృ - పర్జన్య - విష్ణు నామములైన పన్నెండుగురు* ఆదిత్యులు ఆకాశమునందు నిలిచియుండిరి.

"జనమేజయా! 'మృగవ్యాధ - సర్ప - నిర్‌ఋతి - అజైకపాద - అహిర్బుధ్న్య - పినాకిన్ - దహన - ఈశ్వర - కపాలిన్ - స్థాణు - భగ' నామములైన ఏకాదశ రుద్రులు గూడ ఆకాశమునందు నిలిచి యుండిరి.

"జనమేజయా! 'ఇరువురు అశ్వినీ కుమారులు, అష్ట వసువులు, మరుద్గణము, విశ్వేదేవగణము, సాధ్యగణము' వీరందరు అక్కడ నిలిచి యుండిరి.

"జనమేజయా! 'కర్కోటక - వాసుకి - కశ్యప - కుండ - తక్షక' నామములైన నాగరాజులే కాక, బలవంతులు, క్రుద్ధులు, తపస్వులునైన అనేక నాగులు అక్కడకు వచ్చి నిలిచిరి.

"జనమేజయా! 'తార్క్ష్య - అరిష్టనేమి - గరుడ - అసిత ధ్వజ - అరుణ - ఆరుణి' నామములైన వినతా పుత్రులు, పక్షిరాజులు వచ్చి ఉత్సవమునందు నిలిచిరి.

* ఇక్కడ ఆదిత్యుల పేర్లు పదమూడు ఉన్నవి. పన్నెండు నెలలకు పన్నెండుగురు ఆదిత్యులు, అధిక మాసమును (మల మాసమును) ప్రకటించుటకు విష్ణువు పదమూడవ ఆదిత్యుడగును. కనుక, అధిక మాసమును, 'పురుషోత్తమ మాసము' అని యనెదరు. ఆ మాసము వేరుగా లెక్క పెట్టబడలేదు. కనుక పన్నెండు మాసములను ప్రకాశింపజేయు ద్వాదశాదిత్యులే ఇక్కడ చెప్పబడిరి.

"జనమేజయా! దేవతలు విమానములందు పర్వత శిఖరములపై నిలిచి యుండిరి. వారిని తపస్సిద్ధులైన మహర్షులు మాత్రమే చూడగలుగు చుండిరి. ఆ మహాశ్చర్యమును చూచి అక్కడి మునులు మిక్కిలి విస్మయము చెందిరి. అప్పటి నుండి అక్కడి మునులకు పాండవుల యెడల మిక్కిలి ప్రేమాదరములు కలిగెను.

"జనమేజయా! తరువాత పాండురాజు పుత్రలోభముచేత కుంతితో ఏమియో చెప్పదలచు చుండగా, కుంతి అతనిని ఆపి ఇట్లనెను:-

"ఆర్యపుత్రా! ఆపత్తికాలమునందు గూడ ముగ్గురి కంటె ఎక్కువ నాలుగవ సంతానము కనుటకు శాస్త్రములు ఆజ్ఞాపించలేదు. ఈ నియోగ విధిచేత నాలుగవ సంతానము గూడ కోరు స్త్రీ స్వైరిణి (వ్యభిచారిణి) అగును. ఐదవ పుత్రుని కనినచో ఆమె కులట యగును. నీవు విద్వాంసుడవు, ధర్మజ్ఞుడవునై యుండి కూడ పొరపాటున మాట్లాడు వానివలె ధర్మ లోపముచేసి నన్ను మరల సంతానోత్పత్తికి గాను ఎందుకు ప్రోత్సహించు చున్నావు?"

"జనమేజయా! కుంతీదేవి మాటలు విని పాండురాజు ఆమెతో, "ప్రియే! వాస్తవముగా ధర్మశాస్త్ర మతమదియే అని అనెను".

**నకుల - సహదేవుల జననము - పాండవుల నామకరణము :**

"జనమేజయా! కుంతీదేవికి ముగ్గురు, గాంధారీదేవికి నూరుగురున్ను పుత్రులు గలిగినప్పుడు మాద్రి పాండురాజుతో ఏకాంతమున నిట్లనెను:-

"కురురాజా! నీకు సంతానోత్పత్తి శక్తి లేకుండ పోయెను. నీకు ఈ లోపము, దౌర్బల్యమున్ను గూర్చి నాకు సంతాపములేదు. నేను కుంతీదేవి కంటె శ్రేష్ఠురాల నగుటచేత, పట్టపురాణి పదవికి అధికారిణినై నప్పటికిన్ని, సర్వదా చిన్నదానవై యుండవలసి వచ్చుచున్నది. దీనికొరకు గూడ నాకేలాటి దుఃఖము లేదు. గాంధారీ - ధృతరాష్ట్రులకు నూరుగురు పుత్రులు పుట్టిన సమాచారము విని నప్పటికిన్ని నా కంత దుఃఖము కలుగలేదు. కాని, నేను, కుంతీదేవి యిద్దరము గూడ నీకు భార్యలము. మాలో అంతరము లేకున్నప్పటికిన్ని, ఆమెకు

పుత్రులు గలిగిరి. నేను సంతానహీనురాల నయియే యున్నాను. నా ప్రాణనాథునకు కుంతీగర్భము నుండి పుత్రులు కలుగుట యెంతయో సౌభాగ్యము. కుంతీదేవి నాగర్భము నుండి కూడ సంతతి కలిగింపజాలిన యెడల, ఆమె నాయందెంతయో యనుగ్రహము చూపిన దగును. దీని చేత నీకు గూడ హితము కలుగును. కుంతీదేవికి నేను సవతి నగుటచేత నా కెంతయో యభిమానము గలదు. అందు చేత ఆమెను నే నీ విషయ మడుగుటకు బాధపడుచున్నాను. కనుక, నీవు నా యెడల ప్రసన్నుడవైనచో, స్వయముగానే ఆమెను నాకొరకు ప్రోత్సహింపుము."

జనమేజయా! ఆ మాట విని పాండురాజు మాద్రీదేవితో నిట్లనెను:-

"దేవీ! యీ విషయము నా మనస్సులో గూడ నిరంతరము మెదలు చున్నది. కాని, యీ విషయములో నీతో నేమైన అనుటకు నాకు సాహసము చాల కుండెను. ఈ విషయము నీవు విని ప్రసన్నురాల వయ్యెదవో లేక యిది చెడుగా దలచెదవో యని సంశయించు చుంటిని. కాని. నేడు నీ సమ్మతి తెలిసినది. కాబట్టి, యిక ప్రయత్నించెదను. నేను చెప్పిన మీదట కుంతీదేవి తప్పక నామాట అంగీకరించునని విశ్వసించెదను."

జనమేజయా! తరువాత పాండురాజు ఏకాంతమునందు కుంతీదేవితో నిట్లనెను :-

"కల్యాణీ! నా కులపరంపరకు విచ్ఛేదము కలుగకుండుటకు, సమస్త ప్రపంచమునకు ప్రీతి కలుగుటకున్ను యోగ్యమైన పని యొకటి చేయుము. నాకు, నా పూర్వులకున్ను పిండోదక దానములు లోపించకుండుటకు, నాకు గూడ ప్రీతి గలుగుటకున్ను నీవొక ఉత్తమ శ్రేయస్కర కార్యము చేయుము. నీ యశోవిస్తారమునకై, ఇంద్రుడు, స్వర్గ సామ్రాజ్యము పొందిన తరువాతగూడ కేవలము కీర్తి కాంక్షచేత అనేక యజ్ఞానుష్ఠానములు చేసినట్లే, నీ వొక అతి దుష్కర కార్యము చేయుము. అట్లే, వేదవిదులైన బ్రాహ్మణులు కఠిన తపస్సు చేసినప్పటికిన్ని, యశస్సు కొరకు గురుజనము నాశ్రయించెదరు. రాజర్షులు గూడ యశస్సు కొరకు చిన్నవి, పెద్దవియు నగు కఠిన కార్యములు చేసెదరు. ఆ విధముగానే కుంతీ! నీవు గూడ, మాద్రీదేవిని తాపసముద్రను దాటింపుము. ఈమెకు గూడ సంతతిని ఇచ్చి ఉత్తమ యశస్సును సంపాదింపుము".

జనమేజయా! పాండు మహారాజు కుంతీదేవితో నిట్లు చెప్పగా ఆమె మాద్రీ దేవితో నిట్లనెను:-

"సోదరీ! నీ వొకసారి, ఏ దేవతనైన ధ్యానింపుము. అతనివలన నీకు యోగ్య సంతానము కలుగును. సంశయింపకుము".

"జనమేజయా! అప్పుడు మాద్రీదేవి, కొంచెము సేపు విచారించి, అశ్వినీ కుమారు లిద్దరిని స్మరించెను. అప్పు డా యిద్దరు వచ్చి మాద్రీ గర్భము నుండి యిద్దరు కవల కొడుకులను కనిరి. ప్రపంచములో ఆ యిరువురు బాలకులతో సమానమైన సుందరరూపము గలవారు మరియొకరు లేకుండిరి. ఆ కవలను గూర్చి కూడ ఆకాశవాణి, 'యీ యిరువురు బాలకులు అశ్వినీ కుమారుల కంటే మించిన రూపగుణసంపదతో, తేజస్సుతోను ప్రకాశించెదరు' అని చెప్పెను.

"జనమేజయా! తరువాత, శతశృంగవాసులైన ఋషులు ఆ బాలకు లందరకు నామకరణము చేసి, ఆశీర్వదించిరి. ఆ అయిదుగురు బాలురకు వరుసగా 'యుధిష్ఠిర - భీమసేన - అర్జున - నకుల - సహదేవ నామములు ఆ మునులు పెట్టిరి. ఆ పాండవులు, ఒక్కొక్క యేడు ఒక్కొక్కరి చొప్పున వయస్సు వ్యత్యాసముతో జన్మించినను, వారు దేవస్వరూపులగుట చేత, అందరు గూడ అయిదేండ్ల యీడు గలవారి వలెనే శోభిల్లుచుండిరి.

"జనమేజయా! ఆ బాలకులు మహాధైర్య - వీర్య - బల - పరాక్రమ సంపన్నులుగా నుండిరి. తేజస్వులైన పుత్రులను చూచి పాండురాజు ప్రసన్నుడయ్యెను. ఆ బాలకులు శతశృంగవాసులైన మునులకు, మునిపత్నులకున్ను అతిప్రియులుగా నుండిరి. తరువాత, పాండురాజు మాద్రికి ఇంకను సంతానము కలిగించుటకు ఏకాంతమునందు కుంతిని మరల ప్రోత్సహించెను. అప్పుడు కుంతి యిట్లనెను :-

"ప్రాణపతీ! నేను ఒక పుత్రుని కొరకు మాద్రిని నియోగించి యుంటిని. కాని, ఆమె యిరువురను పొందెను. నేను ఆమెచేత మోసగింపబడితిని. ఇకమీద నైనను నన్ను ఆమె తిరస్కరించకుండు గాక యని భయపడుచున్నాను. దుష్ట

స్త్రీల బుద్ధి యిట్లే యుండును. ఇద్దరు దేవతలను ఆహ్వానించుట చేత ఇద్దరు పుత్రులు కలుగుదురని మూర్ఖురాలనైన నాకు తెలియకుండెను. కనుక, రాజా! నన్ను ఈ కార్యము నందిక నియోగింపకుము. ఈ వరమే నేను నిన్ను కోరు చున్నాను."

"జనమేజయా! తరువాత ఆ బాలకు లైదుగురు పెరుగుచు చంద్రునివలె అందరకు ప్రియులుగా నుండిరి. వారు సింహమువంటి అభిమానము గలిగి, పెద్ద - పెద్ద ధనుస్సులు ధరించుచు దేవతలవలె సర్వలక్షణములు గలిగి, శత శృంగ శిఖరముపై పెరుగుచు మహర్షులకు ఆశ్చర్యము కలిగించు చుండిరి. శత శృంగ నివాసులైన మునులు ఆ బాలకులను తమ ఔరస పుత్రులవలె లాలించు చుండిరి".

"జనమేజయా! అప్పుడు ద్వారకా పురములో వసుదేవాది వృష్ణి వంశీయు లందరు పాండురాజు విషయమై యిట్లు చింతించు చుండిరి:-

"అయ్యో! పాండురాజు కిందమ ముని శాపభయముతో శతశృంగమునకు పోయి అక్కడి ఋషులతో తపస్సు చేయుచున్నాడు. ఆతడు శాక - మూల - ఫలములు తినుచు, ఇంద్రియ నిగ్రహముతో సర్వథా ధ్యానయోగ సాధనము చేయుచున్నాడని అక్కడి సందేశ హారుల వలన తెలిసినది."

"జనమేజయా! యీ సమాచారము విని, పాండురాజునకు ప్రియులైన యదువంశీయులందరు దుఃఖించిరి. వారు, 'పాండురాజుతో మాట్లాడు భాగ్యము మా కెప్పుడు కలుగునో' యని విచారించుచుండిరి. ఒకనాడు వృష్ణి వంశీయులందరు తమ బంధుమిత్రులతో కలిసి యిట్లు పాండురాజు విషయమై మాట్లాడుకొను చుండగా, అతనికి పుత్రులు కలిగినారని తెలియగానే వారు మిక్కిలి సంతసించి, వసుదేవునితో, 'ఆర్యా! పాండుపుత్రులు సంస్కార హీనులు కాకుండుటకు గాను, పాండురాజు హితముగోరి అతని కడకు పురోహితుని పంపగోరుచున్నాము' అనిరి.

"జనమేజయా! అప్పుడు వసుదేవుడు 'అట్లే యగుగాక!' యని, పురోహితుని పాండురాజు కడకు, బాలకుల కొరకు వస్త్ర భూషణాదులతో, పంపెను.

కుంతీ - మాద్రుల కొరకుకూడ వస్త్ర - భూషణ - దాస - దాసీ - గో - సువర్ణ - రజతాది వస్తువులను వసుదేవుడు పంపెను.

"జనమేజయా! ఆ సామగ్రితో పురోహితుడైన కాశ్యపుడు - పాండురాజు కడకు పోవగానే, ఆ రాజు అతనికి విధి పూర్వకముగా పూజలు చేసెను. కుంతీ మాద్రులు వసుదేవుని మిక్కిలి ప్రశంసించిరి. అప్పుడు పాండురాజు, కాశ్యపుని చేత, తన కుమారులకు చూడాకర్మ, ఉపనయనాది సమస్త సంస్కారములున్ను చేయించెను. పాండవులకు ఉపాకర్మ అయిన తరువాత వారు వేదాధ్యయనాదులు పరిపూర్ణముగా చేసిరి.

"జనమేజయా! శర్యాతి వంశీయుడైన 'పృషత్' అనువానికి 'శుకుడు' అను నొక పుత్రుడుండెను. అతడు పరాక్రమ వంతుడై సముద్ర పర్యంత భూమిని జయించి వశపరచుకొని, అశ్వమేధాది మహాయజ్ఞములు నూరుచేసి, దేవతలను, పితృదేవతలను ఆరాధించి, శతశృంగ పర్వతమునకు ఒకనాడు పోయి, ఆ శుకుడు, శాక - ఫల - మూలాహారములతో తపస్సు చేయదొడగెను. ఆ శుక రాజర్షియే, పాండవులకు ధనుర్విద్య నేర్పి వారిని ధనుర్వేద పండితులను చేసెను.

"జనమేజయా! భీమసేనుడు గదా సంచాలనములో, యుధిష్ఠిరుడు తోమరము ప్రయోగించుటలో, నకుల సహదేవులు డాలు, - కత్తి త్రిప్పుటలోను నిపుణులైరి. అర్జునుడు సమస్త ధనుర్వేద పారంగతుడాయెను. శుకుడు, 'అర్జునుడు తనతో సమానముగా ధనుర్వేద పారంగతుడయ్యెను' అని తెలిసికొనినప్పుడు మిక్కిలి ప్రసన్నుడై, అర్జునునకు, 'శక్తి - ఖడ్గ - బాణములు,* తాటిచెట్టంత పొడవైన ధనుస్సు, విపాఠ - క్షుర - నారాచాది అస్త్రములు నిచ్చెను. ఆ అస్త్రములు సర్పములవలె భయంకరముగా కనబడుచుండెను. ఆ శస్త్రాస్త్రము లన్నిటిని పొంది అర్జునుడు మిక్కిలి ప్రసన్నుడయ్యెను. అతడు, 'భూమండలములో నాతో సమానమైన పరాక్రముగల రాజులెవరు గూడలేరు' అని తలచెను."

* ఏడు మూరల పొడవుగల ధనుస్సునకు 'తాటిచెట్టు ప్రమాణము' అని సాంకేతిక నామము.

"జనమేజయా! కుంతీ - మాద్రీ పుత్రులు ప్రతిదినము పెరుగుచువచ్చిరి. ఇట్లే ధార్తరాష్ట్రులు గూడ పెరిగిరి. ఈ విధముగా, జలములో కమలములవలె కురువంశ వర్ధనులైన నూటఅయిదుగురు బాలకులు కొలది కాలములోనే, పెరిగి యువకులైరి."

**పాండురాజు మరణము - మాద్రి సహగమనము :**

"జనమేజయా! ఆ మహాపర్వత శిఖరము నందు పాండురాజు సుందరులైన అయిదుగురు కొడుకులను చూచుచు ఆనందించు చుండెను. అర్జునునకు పదునాలుగు వర్షముల ప్రాయము వచ్చినప్పుడు, అతని జన్మదినోత్సవమును ఉత్తర ఫల్గునీ నక్షత్రము నందు అక్కడి బ్రాహ్మణులు జరిపి స్వస్తివాచనము చేసిరి. అప్పుడు కుంతీదేవి, పాండురాజును జాగ్రత్తతో చూచుకొను చుండెను. ఆమె బ్రాహ్మణులకు, పురోహితునితో పాటు భోజనము వడ్డించుచుండెను. అప్పుడు కామమోహితుడైన పాండురాజు మాద్రిని తోడుకొని వనమునకుపోయెను. అది, చైత్ర - వైశాఖ మాసముల సంధికాలము. వనమంతయు వివిధ విచిత్ర పుష్పాలంకృతమై అసమాన శోభతో సమస్త ప్రాణులను మోహింపజేయు చుండెను. అప్పుడు పాండురాజు తన చిన్న భార్యతో వనమునందు సంచరించు చుండెను."

"జనమేజయా! ఆ వనమునందు మోదుగు, తిలక వృక్షము (బొట్టుగు), మామిడి, సంపెంగ, పారిభద్రకము (దేవదారు), ఇంకను అనేక వృక్షములు ఫల - పుష్ప భరితములై వనమునకు శోభ గలిగించుచునుండెను. కమల కుసుమ భరితములైన వివిధ జలాశయములు చూచి పాండురాజు మిక్కిలి ఆనందించు చుండెను. అప్పుడు అతని మనస్సులో మన్మథ వికారము కలిగెను. హర్షోల్లాస భరితుడై, అతడు దేవతామూర్తివలె అక్కడ సంచరించుచున్నప్పుడు మాద్రి ఒక్కతెయే అతని వెనువెంట పోవుచుండెను. ఆమె యువతిగా సున్నితమైన సుందర వస్త్రము ధరించి శోభిల్లుచుండెను. ఆమెను చూడగనే కామాగ్ని అతని మనస్సునందు, దుర్గమ వనమునందు దావాగ్నివలె, ప్రజ్వరిల్లెను.

"జనమేజయా! ఒంటరిగా మాద్రిని చూచిన పాండురాజు కామవేగమును ఆపలేక పూర్తిగా మన్మథవశుడై, ఆమెను బలాత్కారముగా పట్టుకొనెను. అతని

పట్టు విడిపించుకొనుటకు మాద్రి శక్తికొలది ప్రయత్నించుచు మాటి మాటికి అతనిని ఆపుచుండెను. కాని అతని మనస్సుపై కామవేగము స్వారి చేయు చుండెను గనుక, మృగరూపధారియైన ముని తనకిచ్చిన శాపమునుగూర్చి అతడు విచారించలేదు. కామవశుడై ఉండుట చేత ప్రారబ్ధకర్మ ప్రేరితుడై, శాప భయ మును నిర్లక్ష్యముచేసి, తాను స్వయముగా ప్రాణములు విడుచుటకు బలాత్కార ముగా ఆమెతో సంగమము చేయుటకు ఆమెను అనుసరించి పట్టుకొనెను.

"జనమేజయా! సాక్షాత్తు యముడే కామాత్ముడైన పాండురాజు బుద్ధిని మోహపరచెను. అతని బుద్ధి పూర్తిగా ఇంద్రియములను మథించి అతని వివేక ముతో పాటు అతడు గూడ నశించెను. ఈ విధముగ పాండురాజు మాద్రితో సమాగమముచేసి కాలధర్మము చెందెను.

"జనమేజయా! యింతలోనే కుంతీదేవి ఐదుగురు పుత్రులతో పాండురాజు మరణించియున్న చోటికి వచ్చెను. అప్పుడు మాద్రి కుంతితో 'సోదరీ! నీ వొక్కతెవే ఇక్కడికి రమ్ము. పిల్లలక్కడనే ఉండనిమ్ము' అని యనెను. మాద్రి మాట విని కుంతీదేవి పిల్లలను అక్కడనే యుంచి 'అయ్యో! నేను చచ్చితిని' అని ఆర్తనాదము చేయుచు త్వరగా మాద్రి కడకు వచ్చి పాండురాజు, మాద్రి నేలపై పడియుండుట చూచి, శోకాగ్ని చేత సంతాపము చెంది మిక్కిలి దుఃఖించుచు మాద్రితో నిట్లనెను:-

"మాద్రీ! జితేంద్రియుడైన మహారాజును నేను సర్వదా రక్షించుచు వచ్చితిని. మృగశాపము తెలిసియుండికూడ ఆయన నీతో బలాత్కారముగ ఎట్లు సమాగమము చేసెను? నీవు మహారాజును రక్షింపవలసి యుండెను. ఏకాంతము నందు ఆయనకు నీవు ఎందుకు లోభము కలిగించితివి? ఆ మహారాజు ఎల్లప్పుడు శాపమును గూర్చి చింతించుచు దీనుడై నిరుత్సాహముతో నుండెను. అట్టి మహా రాజునకు వనములో ఏకాంతము నందు నీవులభింపగా ఆయనకు కామజనిత సంతో షము ఎట్లు కలిగెను? మాద్రీ! నీవు ధన్యురాలవు నా కంటె అధిక భాగ్యశాలినివి. ఎందుకనగా, నీవు హర్షోల్లాసభరితమైన మహారాజు ముఖచంద్రుని చూచితివి!"

"ఆ మాటకు మాద్రి కుంతితో, "మహారాజ్ఞీ! నేను మిక్కిలి ఏడ్చుచు, మొరపెట్టుచు మాటి-మాటికి మహారాజును ఆపుటకు ప్రయత్నించితిని. కాని,ఆయన

మోహవశుడై, శాపజనిత దౌర్భాగ్యమును సత్యము చెయదలచెను గనుక, తన్ను తాను నిగ్రహించుకొన జాలక పోయెను." అని చెప్పెను.

"జనమేజయా! మాద్రి మాటలు విని కుంతీదేవి శోకాగ్ని సంతప్తురాలై, మొదలంట నఱకబడిన వృక్షమువలె హఠాత్తుగా నేలపై బడి మూర్ఛిల్లి, నిశ్చేష్టురాలై, కదలక మెదలక చైతన్యరహితురాలుగా నుండెను. అప్పుడు మాద్రి ఆమెను పైకెత్తి 'సోదరీ! రమ్మ. రమ్మ' అని చెప్పి పాండురాజు దర్శనము చేయించెను కుంతీదేవి లేచి మరల పాండురాజు పాదములపై పడెను. ఆయన అప్పుడప్పుడే ఏదోమాట చెప్పబోవుచున్నట్లు ఆయన ముఖము చిరునవ్వుతో నుండెను అప్పుడు మోహముతో ఆయనను ఆలింగనము చేసికొని కుంతీదేవి విలపింపజొచ్చెను. ఆమె యింద్రియము లన్నియు వ్యాకులము లయ్యెను. మాద్రీదేవి గూడ మహారాజును ఆలింగనము చేసికొని దుఃఖించెను.

"జనమేజయా! ఈ విధముగ మృత్యుశయ్యపై పడియున్న పాండురాజు కడకు చారణులు - ఋషులువచ్చి అశ్రువులు రాల్చుచు నుండిరి. అస్తమించిన సూర్యునివలె, ఒక్కసారిగా వట్టి - పోయిన సముద్రము వలెను నున్న పాండు రాజును చూచి, మహర్షులందరు శోకనిమగ్నులైరి. అప్పుడు పాండుపుత్రులు, ఋషులున్ను సమానముగా దుఃఖము అనుభవించిరి. బ్రాహ్మణులు పాండుపత్నుల నిద్దరిని సమాధాన పరచుచు జ్ఞానబోధతో ఊరడిల్ల జేసినప్పటికిన్ని వారి దుఃఖము ఆగకుండెను. అప్పుడు కుంతి ఇట్లనెను :-

"మహారాజా! నీవు మమ్మిద్దరను ఎవరికి ఒప్పగించి స్వర్గమునకు పోవు చున్నావు? అయ్యో! నేనెంత దౌర్భాగ్యురాలను? ఓ నా రాజా! నీవు ఒంటరిగా నున్న మాద్రితో కలిసి హఠాత్తుగా మృత్యుముఖములో దూరితివి. నా భాగ్యము నశించుట చేతనే ఈ దుర్దినము నాకు చూడవలసి వచ్చెను. నాథా! ప్రియపుత్రులైన యుధిష్ఠిర - భీమ - అర్జున - నకులసహదేవులను ఎవరికి ఒప్పగించి పోయితివి? దేవతలు నిన్ను అభినందించు చుండెదరు. ఇది నిశ్చయము. ఎందు కనగా, నీవు బ్రాహ్మణ సంఘములో ఉండి కఠిన తపస్సు చేసితివి. నీ పూర్వ రాజులు పుణ్యకర్మలచేత పొందిన స్వర్గమునకే మా యిరువురితో పొమ్ము!"

"జనమేజయా! యిట్లు ఆ యిరువురు పాండు పత్నులు దుఃఖించి అచేతనలై, నేలపైబడిరి. యుధిష్ఠిరాది పాండుపుత్రులు ఐదుగురు అక్కడ మరణించి పడియున్న తండ్రిని చూచి, చైతన్యము లేక నేలపైబడి తండ్రి చరణములను హృదయమునకు హత్తుకొని విలపించిరి. అప్పుడు కుంతి మాద్రితో నిట్లనెను:-

"మాద్రీ! నేను మహారాజునకు జ్యేష్ఠ పత్నిని కనుక, ధర్మము యొక్క శ్రేష్ఠఫలముపై గూడ నాకే యధికారము కలదు. అవశ్యముగా జరుగవలసిన విషయములో నన్ను నివారింపకుము. మృత్యువశగతుడైన మన ప్రభువుతో నేనే సహగమనము చేసెదను. ఇక నీవు ఈ రాజు శరీరము విడిచి లెమ్ము. ఈ పిల్లలను పోషింపుము. పుత్రులను కనిన నాకు ఇహలోక మనోరథము నెరవేరినది. ఇప్పుడు నేను పతితో చితిలో దహింపబడి వీరపత్నీ స్థానమును పొందగోరుచున్నాను". ఆ మాటకు మాద్రి యిట్లనెను:-

"సోదరీ! మన పతిదేవునితో నేనే పోయెదను. ఎందుకనగా, ఆయనతో జరిగిన కామోపభోగముల యందు నాకు తృప్తిదీరలేదు. నీవు జ్యేష్ఠ భగినివి. కనుక, నాకు నీవు ఆజ్ఞ యివ్వవలెను. మన పతి దేవుడు నా యందు ఆసక్తుడై, నాతో సమాగమముచేసి మరణించెను. కనుక నేను ఏదో యొక విధముగ పరలోకమునకు పోయి ఆయన కామవాసనను పూర్తిగా తీర్చవలెను. పూజ్యురాలా! నేను నీ పుత్రులతో నా సొంత పుత్రులతో వలె వ్యవహరింప జాలను. అట్టి పరిస్థితిలో నాకు పాపము అంటును. కనుక నీవే బ్రతికి యుండి నా పుత్రులను గూడ నీ పుత్రులతో సమానముగా పోషింపుము. ఇదియేకాక, ఈ మహారాజు నా యందే కోరిక యుంచి మరణించెను".

"జనమేజయా! తరువాత అక్కడి మహర్షులు పాండు పుత్రులకు ధైర్యము గొలిపి, కుంతీ - మాద్రులను ఊరడించుచు నిట్లనిరి:-

"పుణ్యాంగన లారా! మీ యిరువురి పుత్రులు ఇంకను పసివారుగా నున్నారు గనుక, ఏ విధముగా గూడ మీరు దేహ త్యాగము, చేయగూడదు.

మేము ఈ పాండుపుత్రులను హస్తినాపురము చేర్చెదము. ధృతరాష్ట్రునకు అధర్మమార్గములో లభించిన ధనముపై అధిక లోభము గలదు గనుక, అత డెప్పుడు గూడ పాండుపుత్రులతో యోగ్యముగ వ్యవహరింపజాలడు. కుంతీదేవికి రక్షకుడుగాను, సహాయకుడు గాను, కుంతిభోజుడు ఉన్నాడు. మాద్రీదేవికి గూడ శల్యుడున్నాడు. పతితో సహమరణము చేయుట పత్నికి అత్యంత ఫలదాయక మైనను, మీ యిరువురకు ఈ కార్యము చేయుట అతికఠినమని బ్రాహ్మణులు చెప్పుచున్నారు.

"పతివ్రత యైన స్త్రీ పతిమరణానంతరము బ్రహ్మచర్య పాలనము చేయుచు అచంచల భావముతో ఉండి యమ - నియమములను పాలించి, క్లేశము లను సహించుచు, మనోవాక్కాయముల చేత పుణ్యకర్మలు,* కృచ్ఛ్ర - **చాంద్రాయణాది వ్రతములు, ఉపవాసములు, నియమానుష్ఠానములున్ను చేయును. ఆమె ఉప్పు - కారములు విడిచి ప్రతిదినము ఏకభుక్తము చేసి, నేలపై శయనించును. ఆమె ఏదో యొక విధముగ తన శరీరమును శుష్కింపజేయుటకు ప్రయత్నించును.

* మూడు దినములు పగళ్ళను, మూడు దినములు రాత్రులును భోజనము చేసి, తరువాత మూడు దినములు యాచించకుండ లభించిన పదార్థము లను భుజించి, పిదప మూడు దినములు నిర్జలోపవాసము చేయు వ్రతము 'కృచ్ఛ్ర వ్రతము' అనబడును. కొందరు, పంచగవ్యము, కుశోదకము మాత్రము పుచ్చుకొని, ఒకనాడు ఉపవాసముండుట కృచ్ఛ్ర మని చెప్పె దరు. ఈ కృచ్ఛ్ర వ్రతమునకు 'సాంతపన' వ్రత మను పేరు కూడ కలదు.

** ప్రతిదినము భుజింపదగిన ముప్పది రెండు కబళములలో చంద్రుని క్షయ - వృద్ధుల ననుసరించి కృష్ణ పక్షమందు దిన మొక్కొక్క కబళము చొప్పున తగ్గించుచు, శుక్ల పక్షమందు ఒక్కొక్క కబళము చొప్పున హెచ్చించుచు భుజించి ఆచరించు వ్రతమునకు 'చాంద్రాయణ వ్రతమని పేరు.

"విషయోప భోగములందు ఆసక్తి గలిగి అవివేకిని యైన స్త్రీ. శరీరమును పరిపుష్టము చేయుట యందే ఒగ్నురాలై యుండును. ఆమె దుర్లభమైన మనుష్య శరీరమును వ్యర్థముగా నష్టపరచి మహానరకమును పొందును కనుక, ప్రతివ్రతకు సమస్త విషయేచ్ఛలు నశించునట్లు, తన శరీరమును శుష్కింప జేయుట చాల సముచితము.

"ఈ విధముగ ధర్మమును పాలించు పుణ్య లక్షణములు గల స్త్రీ, తన పతిదేవుని ధ్యానించుచుండిన యెడల ఆమె తన పతిని గూడ ఉద్ధరించగలదు. ఇట్లు పతివ్రతా స్త్రీ, తనను, పతిని, పుత్రులను గూడ సంసార సాగరము నుండి తరింపజేయును. కనుక మీ రిరువురు జీవించి యుండుటయే మంచిదని మా యభిప్రాయము."

ఆ మహర్షుల మాటలు విని కుంతీదేవి వారితో నిట్లనెను :-

"మహాత్ములారా! మాకు పాండురాజుయొక్క ఆజ్ఞ ఎట్లు శిరోధార్యమో, అట్లే బ్రాహ్మణు లందరి యాజ్ఞగూడ శిరసావహింప దగినదియే. మీ యాజ్ఞ నెరవేర్చెదను. పూజ్యులైన బ్రాహ్మణులు చెప్పిన మాట నేను, నా పతి - పుత్రులకు శ్రేయస్కరమని తలచెదను. ఇందులో ఏమాత్రము సందేహము లేదు," తరువాత మాద్రీదేవి యిట్లనెను:-

"మహర్షులారా! కుంతీదేవి పుత్రులందరి యోగక్షేమములు విచారించుటలో వారిని పాలించి పోషించుటలోను సమర్థురాలు. అరుంధతివంటి ఉత్తమస్త్రీ గూడ, బుద్ధిలో ఈమెతో సమానురాలు కాజాలదు. వృష్ణి వంశీయులు, కుంతి భోజ మహారాజున్ను కుంతీదేవికి సంరక్షకులుగా నున్నారు."

"సోదరీ! పుత్రుల పాలన - పోషణములందు నీకు గల శక్తి నాకు లేదు. నేనే పతితో సహగమనము చేసెదను. పతి సంయోగసుఖము నందు నాకు గూడ తృప్తి దీరలేదు. కనుక, నీవు పట్టపురాణివి. పతిలోకమునకు పోవుటకు నాకు ఆజ్ఞ ఇమ్మని నిన్ను ప్రార్థించెదను. నేను పతిచరణసేవ చేసెదను. నా యిచ్ఛను అనుమతించుము."

"జనమేజయా! పతివ్రతయైన మాద్రి యిట్లు చెప్పి, కుంతికి నమస్కరించి, తన కవల పిల్లల నిరువురను ఆమెకే అప్పగించెను. తరువాత ఆమె మహర్షులకు తలవంచి నమస్కరించి, పాండు పుత్రులను కౌగిలించుకొని, మాటి - మాటికి కుంతియొక్క, పుత్రులయొక్కయు శిరస్సులు మూర్కొని యుధిష్ఠిరుని చేయిపట్టుకొని పుత్రులతో నిట్లనెను:-

పుత్రులారా! కుంతీదేవియే మీ కందరికి వాస్తవముగా తల్లి, నేను కేవలము పాలు త్రాపు దాని మాత్రమే. మీ తండ్రి మరణించెను. ఇప్పుడు జ్యేష్ఠభ్రాతయైన యీ యుధిష్ఠిరుడే ధర్మముప్రకారము మీకు తండ్రి. మీ రందరు పెద్దలను, గురుజనులను సేవించుచుండి సత్య - ధర్మములను పాలించుటలో వెనుకాడకుడు. అట్లు చేయువారు ఎప్పటికిన్ని నష్టపడరు. వారికి ఓటమియే ఉండదు. కనుక, మీరందరు సోదరులు సోమరితనము విడిచి గురుజన సేవ యందు నిమగ్నులు కావలెను."

"జనమేజయా! తరువాత మాద్రి మహర్షులకు, కుంతీ దేవికిన్ని నమస్కరించి, కుంతీదేవితో దీనురాలై ఇట్లనెను :-

"సోదరీ! నీవు ధన్యురాలవు. నీకు అమిత తేజస్వులు, కీర్తిమంతులు నైన యీ యైదుగురు పుత్రుల బల - పరాక్రమ - తేజో - యోగబల - మాహాత్మ్యములు చూచు సౌభాగ్యము లభించెను. నేను స్వర్గమునకు పొవగోరి ఈ మహర్షుల సమక్షమున చెప్పిన మాట ఎప్పుడు గూడ వమ్ముకాదు. దేవీ! నీవు నాకు గురువు- వందనీయురాలవు - పూజ్యురాలవు. వయస్సులో జ్యేష్ఠ రాలవు. గుణములలో శ్రేష్ఠురాలవు. నీకు సహజముగానే యున్న సద్గుణములు నిన్ను శోభిల్ల జేయుచున్నవి. ఇప్పుడు నీ యాజ్ఞ గోరుచున్నాను. నీ ప్రయత్నముచేత నాకు ధర్మము, కీర్తియు ప్రాప్తించునట్టి సహాయోగము ఇప్పుడు నీ విచ్చుటకు అవసరమైన ప్రయత్నము చేయుము. మనస్సునందు అన్యథా భావింపకుము".

ఆ మాట విని కుంతీదేవి దుఃఖించుచు మాద్రితో, "శుభాంగీ! నేను నీకు ఆజ్ఞ యిచ్చితిని. నీకు నేడే స్వర్గమునందు పతి సమాగమము ప్రాప్తించు గాక! పతితోగలసి అనంత సంవత్సరములు స్వర్గమునందు నీవు సుఖముగా నుండుము"

అని యనగా, మాద్రి కుంతితో, "సోదరీ! ఈ శరీరమును మహారాజు శరీరముతో పాటే, బాగుగా కప్పి దహించవలెను. అక్కా! నాకు ప్రియమైన యీ కార్యము చేయుము. నా పుత్రుల హితము కోరుచు నీవు జాగ్రత్తతో వారిని పాలించి పోషించుము. ఇంతకు దప్ప మరి యే విషయము గూడ నేను నీకు చెప్పదగినది లేదు' అని యనెను.

"జనమేజయా! కుంతితో నిట్లు చెప్పి, మాద్రిపోయి, చితిపై నుంచబడిన పాండురాజు శవముతో పాటు తానుగూడ కూర్చొనెనను. తరువాత, పురోహితుడైన కాశ్యపుడు స్నానముచేసి, సువర్ణఖండము, ఘృతము, తిలలు, పెరుగు, బియ్యము, నీటికడవ, గండ్రగొడ్డలి మొదలైన వస్తువులను ఒకచోట చేర్చి, మునులచేత అశ్వమేధాగ్నిని తెప్పించి, దానిని చితికి నలువైపుల అంటించి, శాస్త్ర విధి ప్రకారము, పాండురాజునకు దహన సంస్కారము చేయించెను.

జనమేజయా! యధిష్ఠిరుడు, తమ్ములతో పాటు నూతన వస్త్రములు ధరించి పురోహితుని యాజ్ఞ ప్రకారము తండ్రికి జలాంజలి యిచ్చెను. శతశృంగ నివాసులైన మునులు, చారణులును పూజ్యుడైన పాండురాజు యొక్క పరలోక క్రియ లన్నియు విధిపూర్వకముగ చేయించిరి.

**ఋషులు, కుంతీ-పాండు పుత్రులను హస్తినాపుర మందు భీష్మాదులకు అప్పగించుట :-**

"జనమేజయా! పాండురాజు మరణానంతరము శతశృంగ నివాసులైన మహర్షులు, 'పాండురాజు తన రాజ్యమును విడిచి వచ్చి యిక్కడ తపస్సు చేయుచు మునులతో నుండెను. అతడు పత్నీ పుత్రులను ఇక్కడ న్యాసముగా నుంచి మరణించెను. ఆయన పుత్రులను, మాద్రీ - పాండుల శరీరములను* (అస్థులను), కుంతినిన్ని తీసికొని హస్తినాపురము పోవుట మన ధర్మము' అని పరస్పరము సంప్రదించుకొనిరి".

* వీరి శరీరములు శత శృంగము నందే దహింపబడినవి. కనుక, ఇక్కడ శరీర శబ్దమునకు 'అస్థులు' అని అర్థము. శరీరములోని ముఖ్య భాగములకు గూడ శరీరము అని అర్థ మున్నది. కనుక, ఇట్లు చెప్పబడినది.

"జనమేజయా! ఈ విధముగ మహర్షులు మాట్లాడుకొని పాండవులను వెంట బెట్టుకొని మాద్రీ - పాండుల అస్థులతో పాటు హస్తినాపురమునకు ప్రయాణమై పోయిరి.

అది దూరమార్గమైనను మహర్షుల యోగ ప్రభావము చేత వారికి సమీపము గానే అయెను. హస్తినాపురము నందు 'వర్ధమానము' అను పేరుగల ప్రధాన నగర ద్వారము చేరి, ద్వార పాలకునితో, 'మేము వచ్చిన సమాచారము రాజుకు తెల్పుము' అని యనగానే, వారు పోయి రాజునకు తెలుపగా వారి కందరకు ఋషులు వచ్చిన సంగతి తెలిసి మిక్కిలి ఆశ్చర్యము కలిగెను. నగరవాసులైన స్త్రీ బాల వృద్ధులతో పాటు మునుల దర్శనార్థమై పురబహిర్భాగమునకు చాతుర్వర్ణ్య ప్రజల సముదాయము వచ్చెను.

"జనమేజయా! భీష్మ - సోమదత్త - బాహ్లిక - ధృతరాష్ట్ర - సంజయ- విదురులు, సత్యవతి - అంబాలిక మొదలైన స్త్రీలతో గాంధారి, దుర్యోధనాదులున్ను అక్కడికి వచ్చి మహర్షులకు నమస్కరించి, పురోహితునితో పాటు అక్కడ కూర్చొనిరి. నగరవాసు లందరు వచ్చి అందరికిని నమస్కరించి కూర్చొనిరి.

"జనమేజయా! తరువాత భీష్ముడు అర్ఘ్యపాద్యాదులతో మహర్షులను పూజించి తమ క్షేమ సమాచారములను వారికి తెల్పెను. అప్పుడు, ఆ మహర్షులలో వయోవృద్ధుడైన మునీశ్వరుడు భీష్మునితో నిట్లనెను.

"భీష్మా! ఇక్కడి విషయ భోగములను విడిచి శతశృంగ పర్వతమునకు పోయిన నీ పుత్రుడు పాండురాజు ఫలమూలములు భుజించుచు తన భార్యలతో పాటు అక్కడ కొంతకాలము తపస్సుచేసెను. అతని ప్రవర్తనమునకు అక్కడి మునీశ్వరులు సంతుష్టులై యుండిరి.

అక్కడ బ్రహ్మచర్య వ్రతములోనున్న పాండురాజునకు ఏదోయొక దివ్యకారణముచేత యమధర్మరాజు వలన 'యధిష్ఠిరుడు' అను పుత్రుడు పుట్టెను. వాయుదేవుడి వలన బలవంతుడైన 'భీముడు' అను పుత్రుడు పుట్టెను. ఇంద్రుని అంశములో ఈ మూడవ పుత్రుడైన 'ధనంజయుడు' పుట్టెను. ఇతడు గొప్ప

ధనుర్ధరుడని కీర్తి సంపాదింపగలడు. ఈ ముగ్గురు పుత్రులు ఆ దేవతలవలన కుంతీదేవికి పుట్టిరి. అశ్వినీ కుమారుల వలన మాద్రీదేవికి 'నకుల-సహదేవు'లను ఈ యిరువురు కవలు పుట్టిరి. ఈ ఐదుగురు పాండుపుత్రులను ధర్మతత్పరుడైన పాండురాజు వనమునందు కని తన పితామహుడైన శాంతను మహారాజు యొక్క విచ్ఛిన్నమైన వంశమును పునరుద్ధరించెను. వీరి జన్మము, అభివృద్ధి, వేదాధ్యయనాదులున్ను చూచి మీకు సంతోషము కలుగును.

"భీష్మా! సత్పురుషుల ప్రవర్తనములో నున్న పాండురాజు ఉత్తమ పుత్రులను కని నేటికి ముందు పదిహేడవ నాడు దివంగతు డయ్యెను. అతని శరీరమును, చితిపైన ఉంచి అగ్నిముఖము నందు హోమము చేసినప్పుడు మాద్రీదేవి, జీవితముపై మోహము విడిచి ఆ యగ్నిలోనే ప్రవేశించి పతితోసహ మరణము చేసెను.

పతివ్రతయైన మాద్రీదేవికి, పాండురాజున కున్ను, చేయవలసిన ప్రేతకార్యములు మీరు చేయుడు. ఈ కుమారులను, కుంతీదేవినిన్ని స్వీకరింపుడు. ఇదియే సనాతన ధర్మము. ఇవి మాద్రీ - పాండుల శరీరాస్థులు. ఈ శరీర ప్రధానావయవములకు శ్రాద్ధాది కర్మలు చేయుడు. పాండురాజునకు మీరు సపిండీకరణ పర్యంతము ప్రేతకర్మ చేయుట చేత, అతడు పితృమేధ యజ్ఞ లాభము పొందుగాక!"

"జనమేజయా! మహర్షులు కౌరవుల కీ మాట చెప్పి క్షణములో అక్కడి నుండి అంతర్ధానము చెందిరి. అది చూచి అక్కడి వారందరు విస్మితులైరి.

**మాద్రీ - పాండుల అస్థి సంస్కారము - జలాంజలి దానము :-**

"జనమేజయా! అప్పుడు ధృతరాష్ట్రుడు విదురునితో నిట్లనెను :-

"విదురా! మాద్రీ-పాండవులకు ప్రేతకార్యము లన్నియు రాజోచితముగ చేయింపుము. వారి కొరకు అనేక విధ పశు - వస్త్ర - రత్న-ధనాదుల దానము చేయింపుము. ఎవరు ఎంత కోరిన, వారికి అంత ధనము ఇప్పింపుము. కుంతీదేవి ఇచ్చు ప్రకారము మాద్రీదేవి కర్మలు చేయింపుము. మాద్రీదేవి యస్థులను వస్త్రములతో ఎండా, గాలి తగులకుండ కప్పింపుము. పాండురాజు పాపము చేయలేదు. అతడు ప్రశంసనీయుడు దేవ సమాన పుత్రులను ఐదుగురిని కనెను."

"జనమేజయా! ధృతరాష్ట్రుడు ఇట్లు చెప్పగా విదురుడు అట్లే యగుగాక!" యని చెప్పి భీష్మునితో సంప్రదించి ఒక పవిత్ర స్థానము నందు పాండునకు అంతిమ సంస్కారము చేయింప దలచెను. దాహ సంస్కారము కొరకు పురోహితులు ఘృతసుగంధాది ద్రవ్యములతో ప్రజ్వలితాగ్నిని తీసికొని పోయిరి.

తరువాత వసంత ఋతువు నందు సులభములైన బహువిధ సుందర పుష్పములతో, సుగంధ ద్రవ్యములతోను ఒక పల్లకిని అలంకరించి దాని కన్ని వైపుల వస్త్రము కప్పిరి. ఇట్లు అలంకరింపబడిన పల్లకి దగ్గరకు మంత్రులు, సోదరులు, బంధువులు, మిత్రులున్ను చేరిరి. ఆ పల్లకిలో మాద్రి - పాండుల యస్థులను కట్టిపెట్టి దానిని అందరు మోసికొనుచు పోయిరి. ఆ పల్లకిపై ఛత్రము ఉంచి చామరములతో వీచు చుండిరి. అనేక వాద్యములు వాయింపబడు చుండెను. ఆనాడు అక్కడి పౌరులు యాచకులకు రత్నములు పంచిరి. తరువాత, అక్కడి ప్రజలు పాండువు కొరకు ఛత్ర చామర వస్త్రాదులు తెచ్చిరి.

"జనమేజయా! పురోహితులు శ్వేత వస్త్రములు ధరించి అగ్నిహోత్రాగ్ని యందు ఆహుతులు వేయు చుండిరి. ఆ యగ్నులు పల్లకి ముందు కొనిపోవబడు చుండెను. వేలకొలదిగ చాతుర్వర్ణ్య ప్రజలు శోక సంతప్తులై పల్లకి వెనుక, 'అయ్యో! ఈ మహారాజు మమ్ము విడిచి, దుఃఖము కలిగించి అనాథులను చేసి, ఎక్కడికి పోవుచున్నాడు?' అని అరచుచు పోవుచుండిరి. భీష్మ-విదురాదులుగూడ దుఃఖించుచు గంగా తీరమునందు రమణీయమైన యొక సమతల ప్రదేశము నందు ఆ పల్లకిని ఉంచిరి.

"జనమేజయా ! తరువాత ఆ యస్థులకు అగరు మొదలగు సువాసన ద్రవ్యములు, చందనము పూసి, సువర్ణ కలశములతో తెచ్చిన గంగాజలముచేత బంధువులందరు అభిషేకము చేసి, వానిపై అగరు మిశ్రమైన 'తుంగ రసము' అనెడు సుగంధ ద్రవ్యమును శ్వేత చందనమును పూసి, స్వదేశ శ్వేత వస్త్రములు చేత కప్పిరి. ఇట్లు అలంకరింపబడిన ఆ యస్థులు జీవించిన మనుష్యునివలె శోభిల్లుచుండెను.

యాజకులు, పురోహితులున్ను అశ్వమేధాగ్ని చేత వేదోక్త విధి ననుసరించి మంత్రోచ్చారణ పూర్వకముగ సమస్త ప్రేతకర్మలు చేయుటకు

ఆరంభించినప్పుడు ఆ యస్థులకు ఘృతముతో నభిషేకము చేసిరి. తరువాత, తుంగ - పద్మక - సుగంధ ద్రవ్యములతో మిశ్రితమైన చందనముతో, ఇతర సుగంధ ద్రవ్యములతోను బంధువులు యుధిష్ఠిరునిచేత విధి పూర్వకముగా ఆ యస్థులకు దాహ సంస్కారము చేయించిరి.

"జనమేజయా ! అప్పుడు ఆ యస్థులను చూచి, పాండురాజు తల్లి 'అంబాలికా దేవి' 'అయ్యో! కొడుకా! అయ్యో! కొడుకా!' అని అరచుచు హఠాత్తుగా నేలపై బడి మూర్ఛిల్లెను. అట్టి పరిస్థితిలో ఆమెను చూచిన పురజనులు గూడ దుఃఖించిరి. కుంతీదేవి యార్తనాదముతోపాటు, మనుష్యులు, ఇతర జంతువులు గూడ ఆక్రందనము చేసిరి. తరువాత, భీష్మ-విదుర-ధృతరాష్ట్రులు, కురువంశ స్త్రీలు, పాండు పుత్రులు, భీష్మ - విదురాది బంధువులున్ను జలాంజలి యిచ్చిన తరువాత శోకముచేత దుర్బలులైన పాండు పుత్రులను మంత్రులు మొదలైన వారు సమాధానపరచిరి. తరువాత, పన్నెండు రాత్రులు పాండు పుత్రులు, బంధువుల వలెనే, బ్రాహ్మణాది పురజనులుగూడ నేలపై శయనించిరి. ఆ పన్నెండు దినములు హస్తినాపురమంతయు ఆనంద శూన్యమై, స్త్రీ బాల వృద్ధ సహితముగా అందరు దుఃఖ నిమగ్నులై యుండిరి. నగరవాసులు అస్వస్థచిత్తులుగా నుండిరి."

**పాండు - ధృతరాష్ట్ర పుత్రుల బాలక్రీడలు :**

"జనమేజయా! తరువాత కుంతీ - ధృతరాష్ట్ర భీష్మాది బంధువులందరు పాండువు కొరకు అప్పుడు అమృత స్వరూపమైన స్వధామయ శ్రాద్ధదానములు చేసిరి. వేలకొలది బ్రాహ్మణులకు భోజన సంతర్పణలు చేసి రత్నరాసులను, గోవులను దానముగా నిచ్చిరి. మృతాశౌచము తీరిన తరువాత పాండుపుత్రులు శుద్ధిస్నానము చేసిరి. అప్పుడు వారిని తోడ్కొని అందరు హస్తినాపురము నందు ప్రవేశించిరి. పాండు మరణము చేత కురుదేశవాసు లందరు తమ ఆప్తబంధువు మరణించినంతగా దుఃఖించిరి."

శ్రాద్ధకర్మ లన్నియు ముగిసిన తరువాత అక్కడి ప్రజలందరు దుఃఖితులై యుండుట చూచి వ్యాసభగవానుడు, దుఃఖముచే మోహితురాలై యున్న తల్లి, సత్యవతితో నిట్లనెను :-

"తల్లీ! యింతవరకు నీ దినములు సుఖముగా గడచెను. ఇకపైన అతి భయంకర కాలము రానున్నది. పృథివి యొక్క యౌవనదశ గడచిపోయెను. (అనునర్థముగల యీ శ్లోకము ఇట్లు వ్యాసుడు చెప్పెను)-"

"అతిక్రాంత సుఖాఃకాలాః పర్యుప స్థిత దారుణాః
శ్వః శ్వః పాపిష్ఠ దివసాః పృథివీగత యౌవనా"

"ఇక అన్నివైపుల కపటములు, మాయలు, కుట్రలు, జరుగునట్టి భయంకర కాలము రానున్నది. ప్రపంచము నందు అనేక విధ దోషములు కలుగును. ధర్మకర్మలు, సదాచారములు, సత్ప్రవర్తనలు లోపించిపోవును. (ఈ యర్థము గల శ్లోకమిట్లున్నది) :-"

"బహూ మాయా సమాకీర్ణో నానా దోష సమాకులః
లుప్త ధర్మ క్రియాచారో ఘోరః కాలో భవిష్యతి" అని.

"తల్లీ! దుర్యోధనాదుల యన్యాయము చేత సమస్త భూమండలము వీర శూన్యమగును. కనుక, నీవు యోగమును ఆశ్రయించి, తపోవనము నందు నివసింపుము. నీవు ఈ కులమునకు కలుగబోవు భయంకర సంహారమును చూడకుము."

"జనమేజయా! యిట్లు వ్యాసుడు చెప్పగా విని, సత్యవతీదేవి, 'అట్లే యగు గాక!' యని లోపలికి పోయి పెద్దకోడలితో నిట్లనెను :-"

"అంబికా! నీ పౌత్రులు దుర్యోధనాదుల యొక్క అన్యాయము చేత భరత వంశ వీరులు, బంధువులు, పౌరులున్ను నశింపగలరని నేను విన్నాను. కనుక, నీ సమ్మతియైనచో నేను, పుత్రశోక పీడితురాలైన అంబాలికతో వనమునకు పోయెదను."

"జనమేజయా! సత్యవతి మాటకు అంబిక అంగీకరించి తాను గూడ వారితో పోవుటకు సిద్ధము కాగా, సత్యవతి భీష్మునకు చెప్పి, తన యిరువురు కోడండ్రతో అడవికి పోయెను. వారు తపస్సుచేసి, శరీరము విడిచి ఉత్తమగతిని పొందిరి.

"జనమేజయా! అప్పుడు పాండవులకు వేదోక్త (సమావర్తనాది) సంస్కారములు జరిగెను. వారు తండ్రి యింటిలో నానా విధ సుఖ భోగములు

అనుభవించుచు పోషింపబడుచు ధృతరాష్ట్ర పుత్రులతో క్రీడించుచు సర్వదా ప్రసన్నులుగా నుండిరి అన్ని విధములైన బాలక్రీడలందు, వారు తమ తేజస్సుతో అందరికన్న మిన్నగా నుండిరి.

"జనమేజయా! పరుగెత్తుటలో, దూరమందున్న వస్తువును తొలుత అందు కొనుటలో, ఆహార పానీయములలో, దుమ్ము రేగగొట్టు ఆటలలోను భీమసేనుడు ధార్తరాష్ట్రులందరికన్న మిన్నగా నుండి, వారిని అవమానపరచు చుండెను. సంతోషముతో క్రీడించుచున్న కౌరవులను పట్టుకొని భీమసేనుడు, ఎక్కడనో దాగుచుండెను. ఒక్కొక్కసారి భీముడు ధార్తరాష్ట్రుల తలలు పట్టుకొని పాండవులతో డీ కొట్టించుచుండెను. నూట ఒక్కరు ధార్తరాష్ట్రులు మిక్కిలి బలవంతులుగా నుండిరి. కాని, భీమసేనుడు చాల అవలీలగా వారిని తన వశములో తీసికొను చుండెను. అతడు, వారి జుట్టు పట్టుకొని, బలాత్కారముగా, వారిలో ఒకరితో మరియొకరిని డీకొట్టించు చుండెను. వారు ఎంత అరచి మొత్తుకొనుచున్నను విడువక, వారిని నేలపై ఈడ్చుచుండెను. అప్పుడు వారి మోకాళ్ళు, తలలు, భుజములున్ను రాచుకొనుచుండెను.

"జనమేజయా! వారందరు జలక్రీడ చేయుచున్నప్పుడు, భీమసేనుడు తన భుజములతో పదుగురు ధార్తరాష్ట్రులను పట్టుకొని, నీటిలో చాలసేపు ముంచి యుంచు చుండెను. వారు సగము చచ్చినట్లయినప్పుడు విడుచుచుండెను. కౌరవులు చెట్లెక్కి పండ్లు కోసికొనుచున్నప్పుడు భీమసేనుడు, కాలితో గట్టిగా తన్ని ఆ చెట్లను ఊపుచుండెను. అప్పుడు ధార్తరాష్ట్రులు భయపడుచు, పండ్లతోపాటు క్రింద పడుచుండిరి.

"జనమేజయా! ధృతరాష్ట్ర పుత్రులు, బాహు యుద్ధములో వేగముగా పరుగెత్తుటలో, యుద్ధ విద్యా శిక్షణములోను, భీమసేనునితో ఎంత స్పర్ధ (పోటీ) పడినను సమానులు కాజాలకుండిరి. ఈ విధముగానే, భీమసేనుడు గూడ, ధృత రాష్ట్ర పుత్రులతో స్పర్థపడి, వారికి మిక్కిలి అప్రియములే చేయుచుండెను. కాని, అతనికి కౌరవుల యెడల ద్వేషభావము లేకుండెను. బాల స్వభావము చేతనే అట్లు చేయుచుండెను.

"జనమేజయా! తరువాత, భీమసేనునకు చాల బలమున్నదని దుర్యోధ నుడు అతని యెడల చెడుగా ప్రవర్తింప జొచ్చెను. అతడు సర్వదా, ధర్మదూరుడై పాపకర్మలు చేయుటయందే దృష్టి గలిగి యుండెను. మోహముచేత, ఐశ్వర్య

లోభము చేతను అతని మనస్సులో పాపచింతనమే యుండెను. దుర్యోధనుడు, తన సోదరులతో నిట్లు చింతించెను:-

"ఈ భీముడు బలవంతు లందరిలో శ్రేష్ఠుడు. ఇతనిని వంచించి బంధింప వలెను. ఇతడు బల-పరాక్రమ సంపన్నుడు మాత్రమే కాక, అధిక శౌర్యశాలిగా గూడ నున్నాడు. భీమసేను డొక్కడే మన యందరితో స్పర్ధ పడుచున్నాడు. కనుక, నగరోద్యానమునందు ఇతడు నిద్రించినప్పుడు, ఎత్తుకొనిపోయి గంగలో త్రోయుదము. తరువాత, యుధిష్ఠిరార్జునులను మనము బంధించి బలాత్కార ముగా చెరలో బెట్టి, నే నొక్కడనే సమస్తరాజ్యమును ఏలెదను."

"జనమేజయా! యిట్లు నిశ్చయించుకొని పాపిష్ఠుడైన దుర్యోధనుడు భీమ సేమునకు కీడు చేయదలచి, సమయమునకై వెదకుచుండెను. తరువాత, దుర్యో ధనుడు గంగానదిలో జలక్రీడ చేయుటకై, నదీ తీరమునందు ఉన్ని బట్టలతో, నూలు బట్టలతోను విచిత్రమైన ఒక విశాల భవనము నిర్మింపజేసెను. ఆ భవన ములో నన్ని విధములైన అభీష్ట వస్తువులు సిద్ధపరచెను. ఆ పట కుటీరముపై ఎత్తైన పతాకములు ఎగురు చుండెను. దానిలో నతడు చాల గదులు నిర్మింప జేసెను.

"జనమేజయా! గంగా తీరమునందలి 'ప్రమాణకోటి' యను తీర్థము నందు దుర్యోధనుడు ఈ యేర్పాట్లు చేయించెను. అతడు దానికి 'ఉదక క్రీడనము' అని పేరు పెట్టెను. అక్కడ పాకశాస్త్ర కుశలురైన అనేక పాచకులతో 'భక్ష్య[1]- [2]భోజ్య - [3]పేయ - [4]చోష్య - [5]లేహ్యా'ము లనెడు పంచవిధాహార పానీయ

1. దంతములతో కొరకి తినబడు చక్కిలములు, గారెలు, వడియములు మొదలైనవి 'భక్ష్య'ము లనబడును.
2. దంతముల సహాయము లేకుండ, కేవలము నాలుక తోనే చప్పరించి తినబడు మెత్తని వస్తువులు - చక్కెర పొంగలి - సిరా వంటివి - 'భోజ్య'ము లనబడును.
3. త్రాగదగిన పాలు - పాయసము మొదలైనవి 'పేయ'ము లనబడును.
4. రసము మాత్రము చీకి, పిప్పి పారవేయు చెరకు, మామిడిపండ్లు మొదలైనవి, జుర్రుటకు యోగ్యమైన పులుసు - రసము మొదలైనవి 'చోష్యము' లనబడును.
5. నాలుకతో నాకదగిన పచ్చడి, చెట్నీ మొదలైనవి 'లేహ్యా'ము లనబడును. (ఇవి అయిదు విధములైన ఆహార పదార్థములు).

పదార్థములను సిద్ధము చేయించి దుర్యోధను డుంచెను. తరువాత రాజపురుషులు 'అన్ని వస్తువులు సిద్ధపరచబడినవి' అని దుర్యోధనునకు తెలిపినప్పుడు, దుర్మతి యైన యతడు పాండవులతో—

"నేడు మనము వివిధ వనములతో ఉద్యాన వనములతోను శోభిల్లుచున్న గంగా తీరమునకు పోవుదము. అక్కడ సోదరుల మందరము జలక్రీడలు చేయుదము" అని చెప్పగా, యుధిష్ఠిరుడు 'సరే అట్లేకానిమ్ము' అని యతనిమాట అంగీకరించెను.

అప్పుడు వారందరు వివిధ వాహనములపై ఉద్యానవన సమీపమునకు పోయి తమ వెంటవచ్చిన ప్రజా ప్రముఖులను వీడ్కొలిపి, సింహములు పర్వత గుహలో ప్రవేశించినట్లు, ఉద్యానములలో ప్రవేశించిరి. అది, సమావేశ మందిరములతో, చూరులతో, గవాక్షములతో శోభిల్లుచుండి, శుభ్రముగా ఊడ్చబడి, చిత్రములచేత నడబావులచేత, పద్మసరస్సులచేత, కమలాచ్ఛాదితమైన జలముచేత, సర్వఋతుపుష్పములచేతను ప్రకాశించుచు నుండెను.

**దుర్యోధనుడు భీమునకు విషముపెట్టి గంగలో త్రోయించుట :-**

"జనమేజయా! వారందరు అక్కడికి పోయి, యోగ్యములైన స్థానములలో కూర్చొని, అక్కడ లభించిన వివిధ సుఖభోగములను అనుభవించుచుండిరి. తినుబండారములను వినోదముగా పరస్పరము నోళ్ళలో పెట్టుకొనుచుండిరి. అప్పుడు దుర్యోధనుడు చురకత్తివలె అతి తీక్ష్ణముగా నుండెను. కాని, అతి మధురముగా మాట్లాడుచుండెను. అతడు హితైషియగు సోదరునివలె, మిత్రునివలెను భీమసేనుని కొరకు వివిధ భక్ష్య పదార్థములను స్వయముగా వడ్డించుచుండెను. వానిలో నతడు కాలకూట విషము పెట్టియుండెను. ఆ వస్తువులలో దోషము ఉన్నట్లు భీమసేనునకు తెలియకుండెను. కనుక, దుర్యోధనుడు వడ్డించిన భక్ష్యము లన్నియు తినెను. అది చూచి పాపిష్ఠుడు, నీచుడునైన దుర్యోధనుడు మనస్సులో నవ్వుకొనుచు, తనను కృతార్థునిగా తలచెను.

"తరువాత వారందరు జలక్రీడ ముగించి, సాయంకాలము వస్త్రాలంకారములు ధరించి, ఆ క్రీడాభవనములోనే ఆ రాత్రి గడపదలచిరి. భీమసేన

డప్పుడు అధిక పరిశ్రమచేసి యుండుటచేత మిక్కిలి అలసి యుండెను. తనతో పాటు జలక్రీడకు వచ్చిన కురుకుమారులతో భీముడప్పుడు విశ్రమించుటకు 'ప్రమాణకోటి' భవనములో నిద్రించెను. అతడప్పుడు విషముతో మోహితుడై, చల్లనిగాలి వీచు చుండగా, జడునివలె నిశ్చేష్టుడై పడియుండెను. అప్పుడు దుర్యోధనుడు శవమువలె నున్న భీముని స్వయముగా లతలతో బంధించి, గంగలో త్రోయించెను.

**భీమసేనుడు నాగలోకమునకు పోయి యెనిమిది కడవల దివ్యరసము త్రాగుట :-**

"అప్పుడు భీమసేనుడు స్మృతితప్పి యుండి, జలములో మునిగి నాగలోకమునకు పోయెను. అక్కడ అనేక నాగ కుమారులు భీముని శరీరమునకు చుట్టుకొని, విషపు కోరల చేత కరచిరి. కాని, అతని మర్మస్థానములలో సర్పములు కోరలను గ్రుచ్చినప్పటికిన్ని, సర్పముల జంగమ (క్రొత్త) విషము, పూర్వము (భక్షముల ద్వారా) తినబడిన స్థావర విషమును హరించుట చేత విషప్రభావము నశించెను. భీముని శరీర చర్మము ఇనుమువలె కఠినముగా నుండుటచేత, విషము దానిని భేదించజాల కుండెను.

"జనమేజయా! తరువాత భీముడు మేల్కొని, తన శరీర బంధనము లన్నియు ఛేదించి, ఆ సర్పములను పట్టుకొని, నేలపై కొట్టు చుండెను. అనేక సర్పములు భయముతో పరుగెత్తి పోయెను. చావగా మిగిలిన సర్పములు నాగరాజైన వాసుకి కడకు పోయి నిట్లనినవి:-

"నాగేంద్రా! ఒక మనుష్యుడు బంధింపబడి జలములో పడవేయ బడినాడు. అతడు విషము త్రాగి యుండవచ్చునని మా విశ్వాసము. అతడు స్మృతి తప్పిన పరిస్థితిలో మా దగ్గరకు వచ్చి మా చేత కఱవబడి మూర్ఛదేరి స్మృతి వచ్చిన తరువాత కట్లు త్రెంపికొని మమ్ము విసిరి - విసిరి నేలకు కొట్టెను. నీవు పోయి అతడెవరో తెలిసికొనుము?"

"జనమేజయా! అప్పుడు వాసుకి నాగులతో వచ్చి భీమసేనుని చూచెను. ఆ సమయము నందే నాగరాజైన ఆర్యకుడు కూడ భీముని చూచెను. ఆర్యకుడు

కుంతీదేవి తండ్రియైన శూరసేనునకు మాతామహుడు. కనుక, నతడు తన దౌహిత్రునకు దౌహిత్రుడైన భీమసేనుని కౌగిలించుకొనగా, వాసుకి గూడ ప్రసన్నుడై, 'ఇతనికి ప్రియమైన కార్యమేది చేయవలెను? ధన - సువర్ణ - రత్న రాసులు ఇతనికి కానుకలుగా ఈయబడు గాక!' అని యనెను.

"వాసుకి అట్లు చెప్పిన మీదట ఆర్యకుడు వాసుకితో నిట్లనెను:-

"నాగరాజా! ఇతడు ధనరాసులతో ఏమి చేయగలడు? నీవు సంతుష్టుడవైతివి. కనుక, ఇతడు నీ యాజ్ఞచేత ఈ కడవలోని (దివ్య) రసము త్రాగవలెను. దానిచేత ఇతనికి ఒక వేయి యేనుగుల బలము కలుగును. కనుక ఈ భీమసేనుడు త్రాగ గలిగినంత రసము ఇప్పింపుము." ఆ మాట విని వాసుకి 'అట్లే యగు గాక!' యని ఆర్యకునితో చెప్పెను."

"అప్పుడు నాగులు భీమసేనునకు స్వస్తివాచనము చేయగా, నతడు పవిత్రుడై పూర్వాభిముఖముగ కూర్చొని, ఆ కుండలోని రసమంతయు ఒక్కగుటకలో త్రాగెను. తరువాత భీముడు ఎనిమిది కుండల దివ్యరసము త్రాగి నాగు లేర్పరచిన దివ్యశయ్యపై సుఖముగా నిద్రించెను."

**భీమసేనుడు రానందుచేత పాండవులు - కుంతి చింతించుట :-**

"జనమేజయా! తరువాత కౌరవ పాండవులు క్రీడా విహారములు ముగించుకొని భీమసేనుడు లేకయే హస్తినా పురమునకు పోయిరి. అందరితోను వారు, 'భీమసేనుడు మాకంటే ముందే వెడలిపోయెను' అని చెప్పుచుండిరి. పాపిష్ఠుడైన దుర్యోధనుడు భీమసేను డక్కడ లేకుండుట చూచి, సోదరులతో నగరమునకు పోయెను. ధర్మాత్ముడైన యుధిష్ఠిరుని మనస్సులో గూడ దుర్యోధనుని పాపపు తలంపు తోచలేదు. అతడు తనవలెనే యితరులు గూడ సాధువులని తలచుచు కుంతి కడకు పోయి నమస్కరించి యిట్లనెను :-"

"తల్లీ! భీమసేనుడు ఇక్కడకు వచ్చెనా? అత డెక్కడకు పోయి యుండును? నా కతడు ఇక్కడ గూడ కనపడుటలేదు. అక్కడ మేము అతనికొరకు ఉద్యాన వనములో, అడవిలోను మూల మూల వెతకినను కనబడలేదు. అప్పుడు మాకంటే

ముందే అతడిక్కడకు వచ్చి, మరి యెక్కడ కైనను పోయెనా? లేక, నీవే పంపి తివా? తెలుపుము. అతని విషయములో నేను చింతించు చున్నాను. అతడు నిద్రించిన చోటనే ఎవరైన అతనిని చంపలేదు గదా?"

"జనమేజయా! ధర్మరాజు ఇట్లు అడుగగా, కుంతీదేవి, 'అయ్యో! అయ్యో!' అనుచు భయపడి యుధిష్ఠిరునితో నిట్లనెను :-"

"కొడుకా! నేను భీముని చూడలేదు. అతడు నా కడకు రానే లేదు. నీవు నీ తమ్ములతోపాటు అతనిని శీఘ్రముగా వెదకుము." ఇట్లు చింతించి కుంతీదేవి, విదురుని పిలిపించి అతనితో నిట్లనెను :-

"భగవన్! భీమసేనుడు కనబడుటలేదు. ఎక్కడికి పోయెనో! ఉద్యాన వనము నుండి భీముడు తప్ప నా పుత్రులందరు వచ్చిరి. భీముని చూచి దుర్యోధనునకు సర్వదా కనుగుట్టు చుండెను. దుర్యోధనుడు క్రూరుడు, దుర్బుద్ధి గల వాడు, క్షుద్రుడు, రాజ్యలోభము గలవాడు, నిర్లజ్జుడు. కనుక, అతడు క్రోధ ముతో భీమసేనుని వంచించి తప్పక చంపియుండును. ఈ చింతతోనే నా హృదయము వ్యాకులమై దహించు చున్నది." కుంతి మాటలు విని విదురు డామెతో నిట్లనెను :-

"కల్యాణీ! ఇట్లనకుము. ఇతర పుత్రులను రక్షించుకొనుము. ఈ విషయ ములో దుర్యోధనుని ఎదిరించుచు అడిగిన యెడల అతడు నీ యితర పుత్రులను గూడ బాధించగలడు. పూర్వము వ్యాసమహాముని చెప్పినట్లు, నీపుత్రు లందరు దీర్ఘాయుష్మంతులు. కనుక, భీమసేనుడు ఎక్కడకు పోయినను తప్పక తిరిగివచ్చి, నీకు ఆనందము కలిగించును."

"జనమేజయా! విదురు డిట్లు చెప్పి తన యింటికి పోయిన తరువాత, కుంతీదేవి చింతతో తన నలుగురు పుత్రులతోపాటు ఇంటిలో నూరకుండెను.

"జనమేజయా! నాగలోకము నందు భీమసేనుడు ఎనిమిది కుండల దివ్య రసము త్రాగి ఎనిమిది దినములు నిద్రించెను. ఆ రసము జీర్ణించిన తరువాత, అతడు మేల్కొని నప్పుడు అతనికి అనంతమైన బలము వచ్చెను. అప్పుడునాగు లందరు అతనిని ఊరడించుచు, నిట్లనిరి:-

"వీరాగ్రేసరా! నీవు శక్తివంతమైన ఈ రసము త్రాగుటచేత నీవు పదివేల యేనుగుల బలము గలుగును. యుద్ధమునందు అజేయుడ వయ్యెదవు. నేడు ఈ దివ్యజలము నందు స్నానముచేసి మీ యింటికి తిరిగిపొమ్ము. నీ సోదరులు నీవు లేకుండుట చేత చింతతో దుఃఖించు చుండెదరు.

"జనమేజయా! అప్పుడు భీమసేనుడు నాగులు చెప్పినప్రకారము దివ్యజల స్నానముచేసి, పరిశుద్ధుడై, శ్వేత వస్త్రములను, శ్వేత పుష్పమాలికలను ధరించెను. తరువాత నాగరాజు భవనమునందు అతనికొరకు మంగళాచరణములుచేయబడెను. తరువాత భీముడు విషనాశకములైన ఓషధులతోపాటు నాగులు ఇచ్చిన సుగంధి పాయసము త్రాగెను. పిదప నాగులు భీమసేనుని సత్కరించి, ఆశీర్వదించి, దివ్యభూషణములతో అలంకరించిరి. అప్పుడు భీముడు నాగుల యాజ్ఞ తీసికొని వెడల బూనుచుండగా, ఒక నాగరాజు భీముని జలము నుండి పైకెత్తి గంగా తీరము నందలి వనము సందున్న 'ప్రమాణకోటి' గృహము నందుంచి అంతర్ధానము చెందెను.

"జనమేజయా! తరువాత భీమసేనుడు తల్లిదగ్గరకు త్వరగా వచ్చి,ఆమెకు, అన్నగారికి నమస్కరించి, తమ్ములను కౌగిలించుకొని, తలలు మూర్కొనెను. తల్లి, సోదరులున్ను అతనిని కౌగిలించుకొని 'ఆహా! మాకు నేడు ఎంతటి సౌభాగ్యము' అని భీముని రాకను అభినందించిరి. అప్పుడు భీముడు తనకు దుర్యోధనుడు చేసిన దుష్ట చేష్టలన్నియు సోదరులకు చెప్పి, నాగలోకము నందు తనకు సంభవించిన సంఘటనములు కూడ వారికి తెలిపెను.

"జనమేజయా! అప్పుడు యుధిష్ఠిరుడు భీమునితో ముఖ్యమైన మాటగా, 'సోదరా! నీ వూరకుండుము. నీకు జరిగిన దంతయు ఎవరికిని చెప్పకుము!' అని చెప్పి తన యితర సోదరులనుగూడ ఆ విషయములో జాగరూకులను చేసెను.

"జనమేజయా! 'దుర్యోధనుడు భీమసేనుని ప్రియసారథిని గొంతు పిసికి చంపెను. ఆ విషయము కూడ మీరు తెలియనట్లు ఊరక యుండు'డని విదురుడు

పాండు పుత్రులకు బోధించెను తరువాతకూడ దుర్యోధనుడు భీముని భోజనము నందు తీక్ష్ణమైన కాలకూట విషము పెట్టించెను. అప్పుడు వైశ్యా పుత్రుడైన యుయుత్సుడు పాండవులహితము కోరి వారికి ఈ సంగతి తెలిపెను. కాని, భీమసేనుడు ఆ విషముకూడ తిని ఏమాత్రము వికారము చెందక జీర్ణించుకొనెను. ఆ విషము అతి తీక్ష్ణమైనను, అతనిని కొంచెము కూడ బాధించలేదు. భీముని కడుపులో 'వృకము' అను అగ్ని ఉండెను. కనుక, ఆ విషము దానిలో పడి జీర్ణమయ్యెను.

"జనమేజయా! యిట్లు దుర్యోధన-కర్ణ-శకునులు అనేక దుష్టోపాయములు పన్ని పాండవులను చంపదలచుచుండిరి. కాని, పాండవులు ఇది యంతయు తెలిసి క్రుద్ధులైనను, విదురుని యభిప్రాయము ప్రకారము నడచుటచేత తమ కోపమును వెల్లడి చేయకుండిరి.

"జనమేజయా! ధృతరాష్ట్ర మహారాజు కుమారులందరు ఆటల వ్యసనములో తగులుకొని ఉద్దండులై యుండుట చూచి, వారికి విద్య గరపుటకు గౌతమ గోత్రీయుడైన కృపాచార్యుని వెదకించెను. కృపాచార్యుడు రెల్లు గడ్డి నుండి పుట్టియుండెను. అతడు వివిధ వేదశాస్త్ర పారంగతుడు. అతనిని గురువుగా చేసి ధృతరాష్ట్రుడు కుమారులందరిని అతనికి ఒప్పగింపగా వారు ధనుర్వేదాధ్యయనము చేయుచుండిరి."

ఇట్లు, వైశంపాయనుడు చెప్పగా విని జనమేజయుడు ఆ మహామునిని ఈ విధముగ ప్రశ్నించెను :-

**కృప - ద్రోణాశ్వత్థామల జననము - పరశురాముని కడ ద్రోణుని అస్త్ర విద్యాభ్యాసము :-**

"మహా మునీ! కృపాచార్యుని జన్మ మెట్లయ్యెను? అతడు రెల్లు గడ్డిలో ఎట్లు పుట్టెను? అస్త్ర విద్యాభ్యాస మెట్లు చేసెను?" జనమేజయుని ప్రశ్నములకు వైశంపాయను డిట్లు బదులు చెప్పెను:-

"జనమేజయా! గౌతమ మహర్షికి 'శరద్వంతుడు' అను పేరు గల *గౌతముడు అను పుత్రుడు ఉండెను. అతడు రెల్లు గడ్డిలో పుట్టెను. అతని బుద్ధి ధనుర్వేదమునందు లగ్నమైనట్లు వేదాధ్యయనమునందు కాకుండెను. ఇతర బ్రహ్మచారి విద్యార్థులు తపస్సు చేయుచు వేదాధ్యయనము చేయుచున్నట్లే శరద్వంతుడు తపస్సు చేయుచు సమస్త శస్త్రాస్త్ర విద్యలు నేర్చెను.

"జనమేజయా! ఆ గౌతముడు తపోనిష్ఠుడై, ధనుర్వేద పారంగతుడై యుండుటచేత ఇంద్రునకు చాల చింత గలిగి, 'జానపది' అను నొక దేవకన్యను గౌతముని కడకు, 'అతని తపస్సునకు విఘ్నము చేయుము' అని ఆజ్ఞ యిచ్చి పంపెను. జానపది శరద్వంతుని యాశ్రమమునకుపోయి, ధనుర్బాణ ధారియైన యతనిని తన సౌందర్యమునకు లోభపరచుచు వచ్చెను. వనమునందు, ఒంటి వస్త్రము ధరించిన ఆ యప్సరసను గౌతముడు చూచెను. వెంటనే యతని కన్నులు వికసించెను. అతని చేతినుండి ధనుర్బాణములు జారిపడి శరీరము కంపించెను.

"జనమేజయా! శరద్వంతుడు మహాజ్ఞాన సంపన్నుడు. అత్యంత తపోబలశాలి. కనుక, మహా ప్రాజ్ఞుడైన యతడు మిక్కిలి ధైర్యముతో తన పరిమితి మీరకుండెను. కాని, అతని మనస్సులో గలిగిన వికారముచేత అతని వీర్యము స్ఖలితమయ్యెను. కాని యది అతనికి తెలియకుండెను. అప్పుడా ముని, ధనుర్బాణములు, మృగచర్మము, అప్సరసను అక్కడే విడిచి వెడలిపోయెను. అతని వీర్యము రెల్లు గడ్డి సమూహములో పడెను. అక్కడ పడుటచేత అది రెండు భాగములుగా చీలిపోయెను. గౌతమ పుత్రుడైన శరద్వంతుని యొక్క వీర్యము నుండి, ఒక పుత్రుడు, ఒక కన్యకయు పుట్టిరి.

"ఆనాడు, దైవికముగా శంతను మహారాజు వేటాడుటకు అక్కడకు వచ్చి యుండెను. అతని సైనికుడొకడు వనములో తిరుగుచు, ఆ శిశువులను, అక్కడ పడియున్న ధనుర్బాణములను, కృష్ణ మృగచర్మమును చూచి, 'యీ శిశువులు

* గౌతమ గోత్రీయుడగుటచేత శరద్వంతుడు గూడ 'గౌతముడు' అని చెప్పబడుచుండెను.

ధనుర్వేద పారంగతుడైన ఒక బ్రాహ్మణుని సంతానమని తెలిసికొని, శంతను మహారాజునకు ఆ బాలురను, ఆ వస్తువులను చూపించగా నతడు వారిని చూడ గనే, వారి యందు కృపతో తన యింటికి తీసికొని పోయెను. ఆ పిల్లలను గూర్చి యెవరైన అడిగినప్పుడు 'వారిద్దరు నా సంతానమే' యని చెప్పుచుండెను.

తరువాత ఆ యిరువురను శంతనుడు రక్షించి పోషించుచు సకాలములో వారికి అన్ని సంస్కారములు చేసెను.

"జనమేజయా! గౌతముడు (శరద్వంతుడు) గూడ, తన యాశ్రమము నుండి మరియొక చోటికి పోయి, ధనుర్వేదమును అభ్యసించు చుండెను. శంతనుడు, 'నేను ఈ పిల్లలను కృపతో పోషించితిని గనుక, వీరికి 'కృప - కృపి' యనియే పేర్లు పెట్టెద' నని యా పేర్లే పెట్టెను. శరద్వంతుడు, 'తన సంతానమును శంతనురాజు పోషించుచున్నాడు' అని తపోబలము చేత తెలిసికొనెను. అక్కడకు గుప్తముగా వచ్చి వారికి వారి గోత్రాదులు తెలిపెను. *నాలుగు విధములైన ధనుర్వేదము, అనేక శాస్త్రములు, వాని రహస్యములు గూడ, పరిపూర్ణముగా నేర్పెను. కృపుడు కొలది కాలములోనే ఉత్కృష్ట ధనుర్వేదాచార్యుడయ్యెను.

* ధనుర్వేదము యొక్క నాలుగు విధములు ఇట్లు గలవు :- 'ముక్త - అముక్త - ముక్తాముక్త - మంత్ర ముక్తములు' అని.

1) విడువబడు బాణాదులు 'ముక్తము' లనబడును. 2) చేతిలో పట్టుకొని కొట్టు ఖడ్గాదులు 'అముక్తము' లనబడును. 3) ప్రయోగింపబడి, ఉపసంహరించు కొనబడు అస్త్రములు 'ముక్తాముక్తము' లనబడును. 4) మంత్రములు పఠించి విడువబడి, తిరిగి ఉపసంహరించుకొన బడ జాలని యస్త్రములు 'మంత్రముక్తము' లనబడును.

'శస్త్ర - అస్త్ర - ప్రత్యస్త్ర - పరమాస్త్రములు' అనునవి గూడ ధనుర్వేదము యొక్క నాలుగు విధములు గలవు. ఇట్లే,

'ఆదాన - సంధాన - విమోక్ష - సంహారములు' అనబడు నాలుగు క్రియల భేదము చేత గూడ, ధనుర్వేదముయొక్క నాలుగు విధములు గలవు.

"జనమేజయా! కౌరవ - పాండవ-యాదవు లందరున్ను కృపాచార్యుని నుండియే ధనుర్వేదము నేర్చుకొనిరి. ఇతర దేశములనుండి గూడ రాజపుత్రులు వచ్చి, ఆ యాచార్యుని సేవించి ధనుర్విద్యాభ్యాసము చేయుచుండిరి.

"జనమేజయా! తన పౌత్రులు కృపాచార్యుల కడ పరిపూర్ణముగా విద్య నేర్చిన తరువాత, వారికి విశిష్టమైన యోగ్యత కలిగించుటకు గాను, భీష్మ పితామహుడు, బాణప్రయోగములో నిపుణుడై, అత్యంత సమ్మానితుడైన యొక యాచార్యుని కొరకు వెదక జొచ్చెను. 'తక్కువ బుద్ధి గలవాడు, భాగ్యవంతుడు కానివాడు, వివిధ శస్త్రాస్త్ర విద్యలలో నిపుణుడు కానివాడు, దేవతా సమానశక్తి సంపన్నుడు కానివాడున్ను మహా బలశాలురైన కురుకుమారులకు అస్త్ర విద్య నేర్పజాలడు' అని తలచి, భీష్ముడు భరద్వాజ వంశీయుడు, వేదవేత్త, బుద్ధిమంతుడునైన ద్రోణుని ఆచార్య పదమునందు ప్రతిష్ఠించి, అతనికి శిష్యులుగా, కౌరవ - పాండవులను సమర్పించెను.

"జనమేజయా! భీష్ముడు అస్త్రవిద్యాపారంగతుడైన ద్రోణుని పూజించి సంతుష్టుని చేసెను. ఆచార్య ద్రోణుడు, కురు కుమారుల నందరను శిష్యులనుగా స్వీకరించి, వారికి ధనుర్వేదము నేర్పెను. తేజస్వులైన పాండవ - కౌరవులు కొలది కాలములోనే శస్త్ర విద్యలో పరిపూర్ణముగా ప్రవీణులైరి."

ఇట్లు వైశంపాయన మహాముని చెప్పగా విని జనమేజయు డీ విధముగ ప్రశ్నించెను.

"బ్రహ్మన్! ద్రోణాచార్యుని జనన మెట్లయ్యెను? అత డే విధముగా అస్త్ర విద్య నేర్చుకొనెను? అతడు కురుదేశమున కెట్లు వచ్చెను? అత డెవని పుత్రుడు? ద్రోణపుత్రుడు, శస్త్రాస్త్రపారంగతుడునైన అశ్వత్థామ యెట్లు జన్మించెను? ఈ విషయము లన్నియు విస్తారముగా చెప్పుము." ఆ మాటకు వైశంపాయను డిట్లనెను:-

"జనమేజయా! గంగాద్వారము (హరిద్వారము) నందు భరద్వాజు డను పేరుగల ఒక ప్రసిద్ధ మహర్షి యుండెను అతడు అతి కఠిన తపో వ్రత

ములు అనుష్ఠించు చుండెను. అతడొకనాడు ఒక విశేష యజ్ఞము చేయవలసి యుండి, మునులతో పాటు స్నానము చేయుటకు గంగానదికి పోయి, అక్కడ అంతకు పూర్వమే స్నానము చేసి, గంగాతీరమునందు నిలిచియున్న 'ఘృతాచీ' అను అప్సరసను చూచెను. ఆమె, రూప - యౌవన - సౌందర్య సంపన్నురాలై యౌవన మదోన్మత్తురాలుగా నుండెను. ఆమె ధరించిన వస్త్రము తొలగిపోయి యుండగా, భరద్వాజ మహాముని చూడగా మనస్సులో ఆయనకు కామ వాసన కలిగెను. అప్పుడా మహాముని ఆ యప్సర స్త్రీ యందు ఆసక్తుడై యుండుట చేత అతని వీర్యము స్ఖలితము కాగా, దానిని భరద్వాజుడు ఒక ద్రోణము (యజ్ఞ కలశము) నందు ఉంచెను.

"జనమేజయా! అప్పుడు ఆ కలశము నుండి ఒక పుత్రుడు పుట్టెను. అతడు ద్రోణము నుండి పుట్టిన వాడు గనుక, 'ద్రోణ' నామముతో ప్రసిద్ధుడయ్యెను. ఆ బాలకుడు వేద వేదాంగములను చదివెను.

భరద్వాజ మహాముని శస్త్రాస్త్ర విదులలో శ్రేష్ఠుడుగా నుండెను. అతడు అగ్నివేశునకు ఆగ్నేయాస్త్రము నేర్పియుండెను. అగ్నివేశుడు అగ్నిదేవుని పుత్రుడు. అతడు తన గురు పుత్రుడైన ద్రోణునకు ఆగ్నేయాస్త్రము ఇచ్చెను.

ఆ దినములలో 'పృషతు'డను పేరుగల రాజు భరద్వాజ మునికి మిత్రుడుగా నుండెను. పృషతునకు 'ద్రుపదుడు' అను పుత్రుడుండెను. ఆ రాజకుమారుడు ప్రతి దినము భరద్వాజాశ్రమమునకు పోయి ద్రోణునితో ఆడుకొనుచు, చదువుకొనుచుండెను.

"జనమేజయా! పృషత మహారాజు మరణించిన తరువాత ద్రుపదుడు ఉత్తర పాంచాల దేశమునకు రాజయ్యెను. కొన్ని దినముల తరువాత భరద్వాజుడు కూడ మరణించగా, అతని యాశ్రమమునందే ద్రోణుడు తపస్సు చేయుచు నుండెను. అతడు వేద - వేదాంగ పారగుడుగా ఉండి తపస్సు ద్వారా సమస్త పాపములను దగ్ధము చేసియుండెను. అతని కీర్తి అన్నివైపుల వ్యాపించి యుండెను."

''జనమేజయా! ఒకనాడు ద్రోణుని పితృదేవతలు, అతనిని, పుత్రులను కనుమని ప్రోత్సహించిరి. కనుక ద్రోణాచార్యుడు పుత్రలోభముచేత శరద్వంతుని పుత్రియైన కృపిని ధర్మపత్నిగా గ్రహించెను. కృపి అగ్నిహోత్ర - ధర్మానుష్ఠాన - ఇంద్రియ నిగ్రహాదు లందు ద్రోణునితో సహకరించుచునుండెను. ఆ కృపి ద్రోణుని నుండి 'అశ్వత్థామ' అను పుత్రుని కనెను. అతను పుట్టగనే 'ఉచ్చైఃశ్రవము' అను గుఱ్ఱము వలె ధ్వని చేసెను. అది విని, అంతరిక్షము నందలి యొక అదృశ్య వ్యక్తి 'ఈ బాలకుడు అరచునప్పుడు అశ్వధ్వని దిక్కులు పిక్కటిల్లునట్లు చేసెను గనుక, ఇతడు 'అశ్వత్థామ' నామముతో ప్రసిద్ధుడగును.' అని యనెను. ఆ పుత్రుని చేత ద్రోణునకు మిక్కిలి సంతోషము కలిగెను.''

''జనమేజయా! ద్రోణుడు ఆ యాశ్రమము నందు ఉండియే ధనుర్వేదాభ్యాసము చేయుచుండగా నొకనాడు 'మహాత్ముడైన పరశురాముడు సమస్త ధనుర్ధరులలో శ్రేష్ఠుడై; శత్రుసంతాపకరుడైన బ్రాహ్మణుడు. అతడు తన సర్వస్వమును బ్రాహ్మణులకు దానము చేయదలచినా'డని వినెను. పరశురాముడు సమస్త ధనుర్వేద - దివ్యాస్త్ర సంపన్నుడని కూడ ద్రోణుడు విని, ఆ విద్యను, అతనికడ నీతిశాస్త్రమున్ను నేర్చుకొనగోరెను. అప్పుడు బ్రహ్మచారులైన శిష్యులతో కలిసి ద్రోణుడు మహేంద్ర పర్వతమునకు పోయి, భృగునందనుడైన పరశురాముని దర్శించి 'తాను ఆంగిరసకులోత్పన్నుడను, ద్రోణ నామకుడను' అని తన నామగోత్రములు తెలిపి నేలపై పరశురామునకు సాష్టాంగ నమస్కారము చేసి, యతనితో, 'బ్రాహ్మణోత్తమా! నేను భరద్వాజ పుత్రుడను, అయోనిజుడను, ధనేచ్ఛ చేత వచ్చినాను' అని యనెను. ఆ మాట విని పరశురాముడు ద్రోణునితో నిట్లనెను :-''

"బ్రాహ్మణోత్తమా! నీకు స్వాగతము. నీవు కోరిక తెలుపుము." ఇట్లనగా ద్రోణుడు పరశురామునితో 'మహర్షీ ఎప్పుడు గూడ నశించని యమిత ధనము నిమ్మని నిన్ను యాచించుచున్నాను' అని కోరగా, పరశురాముడు అతనితో, 'తపోధనా! నా యొద్ద నున్న సమస్త సువర్ణరత్నాది ధనరాసులు బ్రాహ్మణులకు ఇచ్చితిని. సముద్ర పర్యంతమైన సమస్త భూమిని కశ్యప

మహర్షికి ఇచ్చితిని. ఇప్పుడు నాకు శరీరము మాత్రము మిగిలియున్నది. దానితో పాటు అమూల్యమైన బహువిధ శస్త్రాస్త్ర జ్ఞానము మిగిలియున్నది. కనుక, ఈ శస్త్రాస్త్ర జ్ఞానముగాని, లేక నా శరీరముగాని కోరుకొనుము. ఇది యిచ్చుటకు నేను సంసిద్ధుడనై యున్నాను!'' అని యనెను.

"జనమేజయా! పరశురాముని మాట విని ద్రోణుడు భృగునందనునితో, 'మహర్షీ! నీవు నాకు ప్రయోగ-రహస్య-ఉపసంహార విధిపూర్వకముగా సమస్త శస్త్రాస్త్ర జ్ఞానము ప్రసాదింపుము' అని యడుగగా, పరశురాముడు 'తథాస్తు' అని ద్రోణునకు అస్త్ర ప్రదానము చేసి వాని రహస్యమును, సమస్త ధనుర్వేదమునున్ను ఉపదేశించెను. ద్రోణుడు అవి యన్నియు గ్రహించి అస్త్ర విద్యాపారంగతుడై మిక్కిలి సంతోషించి తన ప్రియమిత్రుడైన ద్రుపదుని కడకు పోయెను.

**ద్రోణునకు ద్రుపదుని తిరస్కారము - ద్రోణుడు హస్తినాపురమునందు కురుకుమారులతో కలియుట :-**

"జనమేజయా! ద్రోణుడు ద్రుపద రాజుతో, 'నేను నీ మిత్రుడైన ద్రోణుడను నిన్ను కలియుటకు వచ్చితిని.' అని ప్రేమతో చెప్పగా, అత డా మాటను సహింపజాలక కోపముతో కనులెఱ్ఱ జేసి, కనుబొమలు ముడివెట్టి, ధనైశ్వర్య మదోన్మత్తుడై ద్రోణునితో, "బ్రాహ్మణా! నీ బుద్ధి పూర్తిగా సంస్కార శూన్యము, అపరిపక్వముననై యున్నది. అది యథార్థ బుద్ధి కాదు. కనుకనే, నీవు ధృష్టుడవై 'నేను నీకు మిత్రుడను' అని యనుచున్నావు. మూర్ఖుడా! మహారాజులకు నీ వంటి దరిద్రులతో ఎప్పుడు గూడ మైత్రి కలుగదు.

మనుష్యుడు వృద్ధుడగుకొలది అతని మైత్రిగూడ క్షీణించి పోవును. పూర్వము నీతో నాకు మైత్రి, సామర్థ్యమునుబట్టి యుండెను అప్పుడు మన మిరువురము సమాన శక్తి శాలురమై యుంటిమి. లోకమునందు ఏ మనుష్యుని హృదయమునందుగూడ మైత్రి మాసిపోవక స్థిరముగా నుండదు. కాలమను 'నది' మిత్రులను దూరము చేయును. అథవా, క్రోధము మనుష్యుని మిత్రత్వము నుండి తొలగించును. ఈ విధముగ క్షీణించి పోవుచుండు మైత్రిపై విశ్వాసము

ఉంచకుము. మనమిరువురము 'మిత్రులముగా నుంటిమి' అను భావము నీ హృదయము నుండి తొలగింపుము. బ్రాహ్మణోత్తమా! నీతో నాకు పూర్వము ఉండిన మైత్రి ఇరువురము కలిసి ఆడుకొనుట, చదువుకొనుట మొదలైన మైత్రి స్వప్రయోజనములను బట్టి యుండెను.

వాస్తవ మేమనగా, దరిద్రుడు ధనవంతునకు, మూర్ఖుడు విద్వాంసునకు, పిరికిపంద శూరునకు ఎప్పుడుగూడ మిత్రుడు కాజాలడు గనుక, పూర్వపుమైత్రి పైన ఎందుకు విశ్వాసము ఉంచెదవు? సమాన ధన - విద్యాసంపన్నులకే వివాహ - మైత్రీ సంబంధము లేర్పడును. హర్షముతో బలిసియున్న వానికి దుర్బలునితో (ధనవంతునకు నిర్ధనునితో) ఎప్పుడుగూడ మైత్రి ఏర్పడజాలదు. శ్రోత్రియుడు కాని వాడు శ్రోత్రియునకు (వేదవేత్తకు) మిత్రుడు కాజాలడు. అరథికునకు రథికునితో మైత్రియుండదు. అట్లే, రాజుకాని వాడు రాజునకు మిత్రుడు కాజాలడు. ఇట్లుండగా, నీవు ప్రాచీనమైత్రిని ఇప్పుడెందుకు స్మరించు చున్నావు?"—

ఈ యర్థముగల శ్లోకము లిట్లున్నవి:-

"న దరిద్రో వసుమతో, నా విద్వాన్ విదుషస్సఖా ।
న శూరస్య సఖా క్లీబః, సఖిపూర్వం కిమిష్యతే ॥ (1)

యయోరేవ సమం విత్తం, యయోరేవ సమం శ్రుతమ్ ।
తయోః వివాహః సఖ్యం చ న తు పుష్ట - విపుష్టయోః ॥ (2)

నా శ్రోత్రియః శ్రోత్రియస్య, నా రథీ రథిన స్సఖా ।
నా రాజా పార్థివస్యాపి, సఖి పూర్వం కిమిష్యతే॥" (3)

జనమేజయా! ద్రుపదరాజు ఇట్లనిన తరువాత, ప్రతాపశాలియైన ద్రోణుడు కోపముతో మండిపడి రెండు గడియలు గాఢచింతామగ్నుడై యుండెను. బుద్ధిమంతుడైన ద్రోణుడు ద్రుపదునకు ప్రతీకారము చేయుటకు మనస్సులో నిశ్చయించుకొని, కౌరవ రాజధానియైన హస్తినాపురమునకు పోయి కృపాచార్యుని యింటిలో రహస్యముగా నుండి, అశ్వత్థామతో కలిసి పాండవులకు అస్త్రవిద్య నేర్పుచు నుండెను. కాని, ద్రోణుని ఎవరుగూడ గుర్తింపజాలకుండిరి.

### గోనెబిళ్ళ - ఉంగరములను నూతి నుండి ద్రోణుడు తీయుట:-

"జనమేజయా! ఈ విధముగ ద్రోణుడు కొంతకాలము ఎవరికిని తెలియక రహస్యముగా నుండిన తరువాత ఒకనాడు కౌరవ - పాండవ కుమారు లందరు హస్తినాపుర బహిర్భాగము నందు పోయి ఉత్సాహముతో, *'వీట' (గోనెబిళ్ళ) ఆడుచుండగా, ఆ వీట నూతిలో పడిపోయెను. అప్పుడు వారు ఆ వీటను పైకి తీయుటకు అనేక విధముల ప్రయత్నించిరి. కాని ఏ యుపాయము గూడ వారికి తోచకుండెను. కనుక లజ్జతో, తలవంచుకొని, ఒండొరులు చూచుకొనుచు ఉత్కంఠితులై యుండిరి.

"జనమేజయా! అప్పుడు కొంతదూరములో కూర్చొనియున్న శ్యామ వర్ణముగల ఒక బ్రాహ్మణుని చూచిరి. అతడు అగ్నిహోత్రముచేసి, ఏదో ప్రయోజనము కొరకు అక్కడ ఆగియుండెను. అతడు ఆపదలలో చిక్కుకొనినట్లు తోచుచుండెను. వెంట్రుకలు నరసి దుర్బలుడై యుండెను. అట్టి బ్రాహ్మణుని చూచి కురుకుమారులందరు అతని కడకుపోయి నిరుత్సాహులై యుండుటచూచి ద్రోణుడు 'వీరి కోరిక నెరవేరలేదు. అందుకొరకే నా కడకు వచ్చినారు' అని తలచి, మందహాసము చేసి, నిపుణముగా వారితో నిట్లనెను:-

"అయ్యో! మీ క్షత్రియ బలమునకు, మీ యస్త్రవిద్యా నైపుణ్యమునకు ధిక్కార (నింద) మగు గాక! ఎందుకనగా, మీరు భరతవంశములో జన్మించి కూడ నూతిలో పడిన వీటను బయటకు తీయజాలకున్నారు. నా ఉంగరము గూడ ఈ కూపములో వేసెదను. ఈ రెంటినిగూడ నేను ఇషీక(ముండ్ల బాణము) లతో పైకి తీసెదను. తరువాత నాకు మీరు జీవిక కల్పింపవలెను."

"జనమేజయా! శత్రు దమనుడైన ద్రోణు డిట్లు కురు కుమారులతో చెప్పి, తన ఉంగరమును ఆ నిర్జల కూపములో వేసెను. అప్పుడు యుధిష్ఠిరుడు

* 'వీట' యనగా, మూడు అంగుళముల అడ్డుకొయ్య, దానిని నేలపై నుంచి మూరెడు పొడుగు కొయ్యతో చిమ్మి దూరముగా పడునట్లు కొట్టు క్రీడను ఆడెదరు. సంస్కృతములో ఆ అడ్డకొయ్యను 'వీట' యందురు. ఈ ఆటయే 'గోనెబిళ్ళ' ఆట, అని మనరు వాడుకలో నున్నది.

"భీష్మా! నేను పూర్వము అస్త్ర-శస్త్ర విద్య, ధనుర్వేదము నేర్చుకొనుటకు అగ్నివేశ మహర్షి కడకు పోయి బ్రహ్మచర్యముతో జటలు ధరించి అనేక సంవత్సరములు నిరంతరము గురు సేవ చేయుచు, ఆ మహర్షి యాశ్రమము నందు ఉంటిని. ఆ దినములలో పాంచాల రాజకుమారుడు ద్రుపదుడు గూడ ధనుర్వేదాభ్యాసము కొరకు అగ్నివేశ మహాముని కడకే వచ్చెను. అప్పు డతడు నాకు చాల ఉపకారము చేయుచు ప్రియమిత్రుడుగా కలిసిమెలసి ఆ యాశ్రమము నందు నాతో నుండెను. బాల్యము నుండియే మే మిరువురము కలిసి చదువుకొను చుంటిమి. అతడు మైత్రితో నాతో ప్రియముగా మాట్లాడుచు, నాకు ప్రియమైన కార్యములు చేయుచు, నుండెను.

"భీష్మా! అప్పుడు ద్రుపదుడు నాతో, 'తాను తండ్రికి ప్రియ పుత్రుడనని తాను రాజైన తరువాత తన రాజ్యము నాకు ఉపభోగ యోగ్యము చేసెద ననియు' శపథము చేసి చెప్పెను. 'తన సుఖభోగములు, వైభవములు అన్నియు నాకు అధీనములు చేసెదను' అని కూడ చెప్పి, యతడు అస్త్ర విద్యా నిపుణుడై, నాచే సమ్మానింపబడి తన దేశమునకు తిరిగి పోయెను. ద్రుపదుడు అప్పుడు అనిన మాట నేను జ్ఞప్తి యందుంచుకొని యుంటిని.

"భీష్మా! కొంత కాలము తరువాత నా పితృదేవతల ప్రోత్సాహముచేత పుత్రప్రాప్తి లోభముతో బుద్ధిమంతురాలు, శమదమాది గుణ సంపన్నురాలు అగ్నిహోత్ర వ్రత నిష్ఠాపరురాలునైన శరద్వంతుని పుత్రి కృపిని పెండ్లి యాడితిని. ఆమె తల వెంట్రుకలు చిన్నవిగా నుండెను. ఆమె వలన నేను సూర్యసమాన తేజస్సు గలవాడు, పరాక్రమ-పౌరుష సంపన్నుడునైన 'అశ్వత్థామ' యను కొడుకును కంటిని. నేను, నా తండ్రి భరద్వాజునకు ప్రియుడ నైనట్లే, అశ్వత్థామ గూడ నాకు ప్రియ పుత్రుడై సంతోషము కలిగించు చుండెను.

"భీష్మా! యిట్లుండగా నొకనాడు, గోధన సమృద్ధి గల ఋషి కుమారులు ఆవు పాలు త్రాగుచుండుట చూచి, చిన్న పిల్లవాడైన అశ్వత్థామ గూడ బాల స్వభావము చేత పాలు త్రాగుటకు ఏడ్చుచుండెను. అప్పుడు నా కనులకు చీకట్లు గ్రమ్మి ఏమియు తోచక 'నేనొక వేళ తక్కువ గోవులు గల బ్రాహ్మణుని నుండి

"బ్రాహ్మణా నీబుద్ధి అసంగతముగ, అపరిశుద్ధమగును నున్నది. కనుకనే నీవు ధృష్టత్వముతో, 'నాకు మిత్రుడనను చున్నావు. వృద్ధుడగు కొలది మనుష్యుని మైత్రి గూడ క్షీణించి పోవును. పూర్వము మన యిరువురి శక్తి సమానముగ నుండెను. కనుక, మైత్రి కలిగెను. ఇప్పుడు అట్లుకాదు. అని ఎన్నెన్నియో దుర్భాష లాడి సమానులకే మైత్రిగాని, విషములకు మైత్రి ఎట్లు సంభవించును? అది ఎప్పుడు గూడ అజరామరము కాదు. కాలగతి ననుసరించి మైత్రిగూడ దూరమగును కనుక, మనకు మైత్రి యుండిన మాట మరచిపొమ్ము. మందమతీ మహా రాజులతో నీ వంటి దరిద్రునకు మైత్రి ఎట్లు పొసగును? ఎప్పుడో జీర్ణించిన మైత్రిని నీవు నాకు జ్ఞప్తికి తెచ్చుచున్నావు. నా రాజ్యసుఖ మిచ్చెద నని నీతో నేను ప్రతిజ్ఞ చేసినట్లు నాకు జ్ఞాపకమున లేదు. కావలసినచో, ఒక రాత్రి నీకు భోజనము పెట్టెదను" ఇట్లా ద్రుపదుడు చెప్పిన తరువాత నేను భార్యా పుత్రులతో అక్కడనుండి వెడలి పోయితిని.

భీష్ముడు ద్రోణుని సమ్మానపూర్వకముగ నుంచుకొనుట :

"భీష్మా! నే నక్కడి నుండి వెడలిపోవు నప్పుడు ఒక ప్రతిజ్ఞ చేసితిని. అది త్వరగా నెరవేర్చెదను ద్రుపదుడు చేసిన అవమానమునకు నేను మిక్కిలి వ్యాకులపడుచున్నాను. గుణవంతులైన శిష్యులద్వారా, నా యభీష్టము సిద్ధింపజేయ దలచి, నా కోరిక నెరవేర్చుటకు పాంచాల దేశమునకు, కురు రాజ్యమునకు మధ్య నున్న ఈ హస్తినాపురమునకు వచ్చితిని. నీకు ప్రియము చేసెదను చెప్పుము.

"జనమేజయా! ద్రోణాచార్యు డిట్లు చెప్పిన తరువాత భీష్ము డతనితో నిట్లనెను":-

"బ్రాహ్మణోత్తమా! ఇకనీప్పుడు నీవు ధనుస్సునుండి అల్లెత్రాడు దించుము. ఇక్కడ ఉండి రాజకుమారులకు ధనుర్వేదము, అస్త్ర - శస్త్రవిద్య బాగుగా నేర్పుము. కౌరవులయింటిలో నీవు సర్వదా సమ్మానితుడవై యుండి, సంతోష ముతో నీవు కోరిన సుఖములు అనుభవింపుము. కౌరవులయొద్ద నున్నధన-రాజ్య-వైభవ - రాష్ట్రము లన్నింటికి నీవే అందరికన్న పెద్ద రాజువుగా నుండెదవు. సమస్త కౌరవులు. నీ యధీనములో నుండెదరు.

"బ్రహ్మన్! నీ కోరిక నెరవేరిన దని తలచుము. మా సౌభాగ్యముచేత నీ విక్కడికి దయచేసి మమ్ము మిక్కిలి యనుగ్రహించితివి.

**ద్రోణాచార్యుడు రాజకుమారులకు విద్య గఱపుట :-**

**ఏకలవ్యుని గురుభక్తి - ద్రోణుడు శిష్యులను పరీక్షించుట :-**

"జనమేజయా! తరువాత ద్రోణాచార్యుడు భీష్ముని చేత పూజితుడై కౌరవులయింటిలో విశ్రమించి యుండెను. అప్పుడు భీష్ముడు తన పౌత్రులను ద్రోణునకు శిష్యులనుగా సమర్పించి, అతనిని వివిధ ధన - రత్నములచేత సత్కరించి, ధన-ధాన్య సమృద్ధమైన భవనము అతని నివాసమునకు ఇచ్చెను. ద్రోణుడు కురుకుమారులను శిష్యులనుగా గ్రహించిన తరువాత తన యొద్ద కూర్చొని యున్న శిష్యులతో నిట్లనెను.

"రాజకుమారులారా! నాకు ఒక యిచ్ఛ కలదు. మీరు అస్త్రవిద్య నేర్చుకొనిన తరువాత నా యిచ్ఛ నెరవేర్చ వలెను."

"జనమేజయా! ఆచార్యుని మాట విని కౌరవు లందరు నూరకుండిరి. అర్జునుడుమాత్రము ఆయన కార్యము పూర్తిగా నెరవేర్చుటకు ప్రతిజ్ఞ చేసెను. అప్పు డాచార్యుడు అర్జునుని మస్తకము మాటి - మాటికి మూర్కొని ప్రేమ పూర్వకముగా కౌగలించుకొని హర్షావేశముతో బాష్పములు రాల్చెను.

"తరువాత ద్రోణాచార్యుడు పాండవులకు ఇతర శిష్యులకున్ను వివిధములైన దివ్య - మానవ శస్త్రాస్త్రములు నేర్పెను. విద్య నేర్చుకొనుటకు వృష్ణి - అంధక వంశీయ క్షత్రియులు, నానాదేశ రాజకుమారులు, కర్ణుడుగూడ అందరు ఆచార్య ద్రోణునికడ అస్త్రవిద్య నభ్యసించుటకు వచ్చిరి.

"జనమేజయా! కర్ణుడు సర్వదా అర్జునునితో స్పర్ధ (పోటీ) పడుచు మిక్కిలి క్రోధముతో, దుర్యోధనుని యాశ్రమములో పాండవులకు అవమానము చేయుచుండెను. అర్జునుడు సర్వదా విద్యాభ్యాసమునందు నిమగ్నుడై యుండుట చేత ధనుర్వేదమునందు జిజ్ఞాస, అభ్యాసము, బాహుబలము ప్రయత్నము మొదలైనవానిలో శిష్యులందరికంటె శ్రేష్ఠుడు, అచార్యద్రోణునితో సమానమైన

యోగ్యత కలవాడు నయ్యెను. అతనికి అస్త్రవిద్యయందు మిక్కిలి ప్రేమ యుండెను. కనుక, తాను నేర్చుకొనిన యస్త్రములకు తుల్యములైన యస్త్రముల ప్రయోగమునందు, లాఘవమునందు, సౌష్ఠవమునందున్ను అతడు అందరిని మించియుండెను. ఆచార్య ద్రోణుడు విద్యాగ్రహణమునందు అర్జునుడు అసమాన ప్రతిభాశాలియని తలచెను.

ఇట్లు ఆచార్యుడు అందరికిన్ని విద్యనేర్పుచు శిష్యులను నీరు తెచ్చుటకు గాను కమండలువులు ఇచ్చి ఆజ్ఞాపించెను. చిన్నమూతి గల ఆ కమండలువులలో నీరు నింపికొని తెచ్చుటకు విలంబము కావలెనని ఆచార్యు డట్లు చేయుచుండెను. కాని, అశ్వత్థామకు వెడల్పు ముఖముగల కడవయిచ్చి, అతడు త్వరగా వచ్చుటకు అవకాశము కల్పించెను. కనుక, అశ్వత్థామ అందరికంటె మొదలే కడవలో నీరు నింపుకొని, తిరిగి వచ్చుచుండెను. ఇతర శిష్యులు నీరు తెచ్చులోపల ఆచార్యుడు రహస్యముగ అస్త్రప్రయోగమునందలి యొక ఉత్తమ విధానము తన పుత్రునకు నేర్పుచుండెను.

"జనమేజయా! ఆచార్యుని యీ రహస్యమును అర్జునుడు తెలిసికొని 'వారుణాస్త్రము' చేత తన కమండలువును త్వరగా నింపికొని ఆచార్యపుత్రుని కంటె ఏమాత్రము హెచ్చు - తగ్గులు లేకుండ విద్యాభ్యాసము చేసెను. కనుకనే మేధావియైన అర్జునుడు ఏ విషయములోగూడ అశ్వత్థామకంటె తగ్గకుండెను. అతడు అస్త్రవిదు లందరికంటె శ్రేష్ఠుడుగా నుండెను. గురుదేవుని సేవించి పూజించుటకుగూడ మిక్కిలి యత్నము చేయుచుండెను. అస్త్రవిద్యాభ్యాసము నందు సర్వదా తత్పరుడై యుండెను. కనుకనే అర్జునుడు ద్రోణాచార్యునకు మిక్కిలి ప్రియుడయ్యెను.

"జనమేజయా! అర్జునుడిట్లు ధనుర్విద్యాభ్యాసమునందు నిరంతరము తత్పరుడై యుండుట చూచి ద్రోణాచార్యుడు అర్జునుని యేకాగ్రత పరీక్షించుటకు ఒకనాడు వంట వానిని ఏకాంతమునందు పిలిచి 'నీవు అర్జునునకు ఎల్లపుడున్ను చీకటిలోనే భోజనము వడ్డించకుము. ఈ విషయము అర్జునకు ఎప్పుడును చెప్పకుము." అని యనెను. తరువాత నొకనాడు అర్జునుడు భోజనము చేయుచున్నప్పుడు వడిగా గాలి వీచుటచేత అక్కడి దీపములు ఆరిపోయెను.

అప్పుడు చీకటిలోగూడ అర్జునుడు భోజనము చేయుచుండెను. అతని చేయి అలవాటు ప్రకారము చీకటిలోగూడ అన్నివస్తువులు తీసికొని నోటికి అందించు చుండెను. ఈ అభ్యాసము వలననే అర్జునుడు రాత్రిగూడ ధనుర్విద్యాభ్యాసము చేయుచుండెను. ఒకరాత్రి ద్రోణుడు, నిద్రించుచు అర్జునుని ధనుష్టంకారధ్వని విని, నిద్రలేచి, అర్జునుని కడకు పోయి కౌగిలించుకొని 'అర్జునా! ప్రపంచములో నీతో సమానుడైన ధనుర్ధరుడు మరియొకడు లేకుండునట్లు చేసెదను. ఇది సత్యము' అని యనెను.

"జనమేజయా! తరువాత ద్రోణాచార్యుడు అర్జునునకు గజాశ్వరథములపై కూర్చొని, భూమిపైన నిలిచి యుండియు యుద్ధములు చేయుట నేర్పెను. ఆయన కౌరవులకు 'గద - ఖడ్గ - తోమర - ప్రాస - శక్తి' - యాయుధముల ప్రయోగ విద్యను, అనేక శస్త్రప్రయోగముల శిక్షణమును, ఒంటరిగా శత్రువులతో పోరాడు విద్యను నేర్పెను. ద్రోణాచార్యునకుగల యస్త్రవిద్యానైపుణ్యము విని వేలకొలది రాజులు, రాజకుమారులు ధనుర్విద్యాభ్యాసము కొరకు ఆయన కడకు వచ్చుచుండిరి.

"జనమేజయా! తరువాత నిషాద (అడవిజాతివారు) రాజైన 'హిరణ్య ధనువు' యొక్క పుత్రుడు ఏకలవ్యుడు ద్రోణునికడకు వచ్చెను. కాని, అతడు నిషాద పుత్రుడని ధర్మజ్ఞుడైన ఆచార్యద్రోణుడు ఏకలవ్యుని శిష్యునిగా అంగీక రించియును అతనిని ఇంటికి పంపివేసెను. కౌరవులపై దృష్టి యుంచియే అతడట్లు చేసెను.

అప్పుడు ఏకలవ్యుడు ద్రోణాచార్యునకు నమస్కరించి తిరిగి అడవికి పోయి మంటిలో ద్రోణుని మూర్తిని నిర్మించి ఆ మూర్తియందు ఆచార్యభావన ఉంచి దాని యెదుట అస్త్ర విద్యాభ్యాసము మిక్కిలి నియమముతో చేసెను.

"జనమేజయా! ఆచార్యుని యందు శ్రద్ధాభక్తులతో చేసిన అభ్యాసపు బలము చేత, అతడు బాణము యొక్క 'ప్రయోగ - ఉపసంహార - సంధానము' లందు గొప్పలాఘవమును సంపాదించెను.

"జనమేజయా! తరువాత నొకనాడు కౌరవ - పాండవులు ద్రోణాచార్యుని యనుమతితో రథములపై వేటాడుటకు పోయిరి. కావలసిన వస్తువులతో ఒక మనుష్యుడు ఒక కుక్కను వెంట బెట్టుకొని, వారి వెనువెంటనే పోవుచుండెను. అప్పుడు వారు వేటకై అడవిలో తిరుగుచుండగా, ఆ కుక్క అక్కడక్కడ తిరుగుచు ఏకలవ్యుని యొద్దకు పోయెను. అతని శరీర వర్ణము నల్లగా, అవయవము లన్నియు మురికిగా దుమ్ముక్రమ్మి యుండి, అతడు కృష్ణమృగ చర్మము, జటలు ధరించి యుండెను. అట్లు వికృత రూపములో నున్న ఏకలవ్యుని చూచి ఆ కుక్క 'భౌ! భౌ!' అని మాటి మాటికి మొఱుగుచుఅతని యెదుట నిలువగా, అభిల్లుడు తన యస్త్రలాఘవ సామర్థ్యమును చూపుచు, మొఱుగుచు తెఱచు కొనిన కుక్కనోటిలో ఒక సారిగ ఏడు బాణము లెక్కపెట్టి కొట్టెను. ఆ బాణము లట్లే నోటిలో గ్రుచ్చుకొని యుండగా, ఆ కుక్క పాండవుల యొద్దకు పోయెను. అది చూచి పాండవులు మిక్కిలి విస్మయము చెందిరి. ఆ బాణములు కొట్టిన వాని హస్తలాఘవమును శబ్దము ననుసరించి లక్ష్యమును కొట్టు శక్తిని రాజకుమారు లందరు చూచి లజ్జితులై ఆ బాణ ప్రయోగము చేసిన వానిని ప్రశంసించిరి.

"జనమేజయా! తరువాత ఆ యాటవిక వీరుని కొరకు అడవిలో వెదకుచు, నిరంతరము బాణ ప్రయోగము చేయుచున్న యేకలవ్యుని చూచిరి. అప్పుడు వికార రూపము గల యతనిని పాండవులు, 'నీవు ఎవడవు? ఎవని పుత్రుడవు?' అని యడుగగా, ఏకలవ్యుడు వారితో 'వీరులారా! నేను నిషాద రాజైన హిరణ్యధనువు యొక్క పుత్రుడను. ద్రోణాచార్యుని శిష్యుడను. ధనుర్వేదమునందు విశిష్టమైన పరిశ్రమ చేసితిని' అని చెప్పెను.

"జనమేజయా! ఆ మాట విని పాండవులు తిరిగివచ్చి. ఆ సంగతి ద్రోణాచార్యునకు తెలిపిరి. అప్పుడర్జునుడు పలుసార్లు ఏకలవ్యుని స్మరించుచు ఏకాంతమునందు ద్రోణాచార్యునితో 'ఆచార్యా! ఆనాడు, నీవు నన్ను కౌగిలించుకొని నీ శిష్యులలో ఎవడుగూడ నాతో సమాను డుండడు' అని చెప్పి యుంటివి. కాని, నీ మరియొక శిష్యుడు, నిషాద పుత్రుడు అస్త్ర విద్యలో నా కంటె మించిన నైపుణ్యము గలవాడై సర్వ జగత్తు నందు 'అధికపరాక్రమశాలిగా నున్నాడు' అని యనెను.

"జనమేజయా! ఆచార్య ద్రోణుడు నిషాద పుత్రుని విషయమై ముహూర్త కాలము (రెండు గడియలు) చింతించి, ఒక నిశ్చయమునకు వచ్చి, అర్జునునితో ఏకలవ్యుని కడకు పోయి చూడగా, నతడు నిరంతరము బాణవర్షము కురియు చుండెను. అతని శరీరము మురికిగా, దుమ్ము గ్రమ్మి యుండెను. జటలు, నార చీరలు ధరించి యుండెను. అప్పుడు ద్రోణాచార్యుడు తన కడకు వచ్చుచుండుట చూచి, ఏకలవ్యుడు ఆచార్యుని ముందుకు పోయి, స్వాగతము చెప్పి, అతని పాదములు పట్టుకొని నేలపై తల మోపి నమస్కరించి, తనను శిష్యుడుగా అతనికి సమర్పించుకొని, పూజించి చేతులు జోడించి ఆచార్యుని యెదుట నిలిచెను.

"జనమేజయా! అప్పుడు ద్రోణాచార్యుడు ఏకలవ్యునితో, 'వీరుడా! నీవు నాశిష్యుడవైన యెడల నాకు గురుదక్షిణ యిమ్ము' అని యనగా, ఏకలవ్యుడు మిక్కిలి సంతుష్టుడై, ఆచార్యునితో, 'భగవాన్! నేను నీకుఏమి యివ్వవలెను? గురుదేవుడవైన నీవే ఆజ్ఞయిమ్ము. బ్రహ్మవిదులలో శ్రేష్ఠుడైన నా ఆచార్యునకు ఇవ్వగూడని వస్తువు నాకడ లేదు,' అని యనెను.

"జనమేజయా! ఇట్లు ఏకలవ్యుడు సత్యప్రతిజ్ఞుడై యుండుటచూచి, ద్రోణాచార్యుడు ప్రసన్నుడై ఏకలవ్యుని దక్షిణాంగుష్ఠమును గురుదక్షిణగా కోరుకొనెను. అట్లు అంగుష్ఠదానము చేసిన ఏకలవ్యునకు ద్రోణుడు, చూపుడు-నడిమి వ్రేళ్ళతో బాణము పట్టుకొని అల్లెత్రాడు లాగు విధమును తెలిపెను. అప్పటినుండి ఏకలవ్యుడు తనవ్రేళ్ళతోనే బాణసంధానము చేయుచుండెను. కాని, బాణప్రయోగము పూర్వమువలె శీఘ్రముగ చేయజాలకుండెను. ఈ సంఘటనముచేత అర్జునుడు మిక్కిలి ప్రసన్నుడై, అతనికి గలిగిన చింతతొలగి పోయెను. 'అర్జునుని ఇతరుడెవ్వడు గూడ ఓడించజాలడు,' అను ద్రోణాచార్యుని మాటగూడ సత్యమయ్యెను.

"జనమేజయా! అప్పుడు ద్రోణాచార్యుని శిష్యులలో దుర్యోధన-భీమసేను లిరువురు గదాయుద్ధములో నిపుణులైరి. ఆ యిరువురు సర్వదా క్రోధముతో స్పర్థపడుచుండిరి. అశ్వత్థామ ధనుర్వేద రహస్య జ్ఞానముతో అందరిని మించి యుండెను. నకుల -సహదేవు లిరువురు ఖడ్గయుద్ధమునందు అందరిని మించి నిపుణులుగా నుండిరి. రథయుద్ధములో యుధిష్ఠిరుడు శ్రేష్ఠుడు. అర్జునుడు సర్వవిధ యుద్ధకళలతో అందరిని మించి యుండెను. అతడు సముద్ర పర్యంత సమస్త భూమండలమునందు రథయూథ పతులందరికి యూథపతిగా

ప్రసిద్ధుడాయెను. అర్జునుడు ఏకాగ్రముగా మనస్సు నిలుపుట చేత, బలోత్సాహములు గలవాడగుట చేతను, సర్వాస్త్ర విద్యలలో సమర్థుడయ్యెను. అస్త్ర విద్యాభ్యాము నందు, గురుభక్తి యందున్న అర్జునుడు అందరికంటె ఉన్నతుడుగా నుండెను. కుమారులందరికి సమానముగ అస్త్రవిద్య యుపదేశింపబడినప్పటికిన్ని అర్జునుడు తన విశిష్ట ప్రతిభ చేత కుమారులందరిని మించిన అతిరథుడయ్యెను.

"జనమేజయా! దురాత్ములైన ధృతరాష్ట్ర పుత్రులు భీమసేనుని బలాధిక్యమును, అర్జునుని అస్త్ర విద్యా ప్రావీణ్యమును చూచి సహింప జాలకుండిరి. కుమారులందరి విద్యాభ్యాసము ముగిసిన తరువాత ద్రోణాచార్యుడు వారికి పరీక్ష పెట్టదలచి, శిల్పులతో ఒక గ్రద్దను కృత్రిమముగా నిర్మింపజేసి, వృక్షాగ్ర భాగమునందు పెట్టించెను. అది ఉన్నచోటు రాజకుమారులకు తెలియకుండెను. కొట్టుటకు లక్ష్యముగా దానిని ఏర్పరచి, కురుకుమారులతో, మీరందరు ఈ గ్రద్దను కొట్టుటకు ధనస్సుపై బాణము ఎక్కుపెట్టి నిలచి యుండుడు. నా యాజ్ఞ కాగానే ఆ పక్షి శిరస్సు ఖండించి పడగొట్టుడు. నేను ఒకరి తరువాత నొకరిని ఈ కార్యమునకు నియోగించెదను. నేను చెప్పినట్లు చేయుడు! అని యనెను.

"జనమేజయా! ద్రోణాచార్యుడు అందరికంటె తొలుత యుధిష్ఠిరునకు ఆజ్ఞ యీయగా, అతడు ధనుర్బాణములు పట్టుకొని నిలిచి యుండగా, ద్రోణుడతనితో, 'కుమారా! వృక్ష శిఖరముపై కూర్చొనియున్న యీ గ్రద్దను చూడుము' అని యనగా, యుధిష్ఠిరుడు 'చూచుచున్నా'ననెను. తరువాత రెండు గడియలకు మరల ద్రోణుడు అతనితో 'నీవు ఈ వృక్షమును, నన్ను, నీ సోదరులను గూడ చూచుచున్నావా?' అని యడుగగా, యుధిష్ఠిరుడు ఔను, నేను ఈ వృక్షమును, నిన్ను నా సోదరులను, ఈ గ్రద్దను గూడ చూచుచున్నాను. అని యనగా, అది విని ద్రోణుడు అసంతుష్టుడై, యుధిష్ఠిరుని గద్దించుచు, 'వెడలిపొమ్ము, నీవు ఈ గురిని కొట్టజాలవు' అని యనెను.

"జనమేజయా! తరువాత ఆచార్య ద్రోణుడు దుర్యోధనాది ధృతరాష్ట్ర పుత్రులను, భీమ - నకుల - సహదేవులను, ఇతర దేశ రాజులను గూడ పరీక్ష కొరకు పిలువగా, వారందరున్ను ఆచార్యుని ప్రశ్నమునకు యుధిష్ఠిరుని వలెనే,

'మేము అన్నియు చూచుచున్నాము.' అని చెప్పగా ఆచార్యుడు అందరిని యుధిష్ఠిరుని తిరస్కరించి, నట్లే గద్దించుచు దూరముగ తొలగిపొం డనెను."

**అర్జునుడు లక్ష్యమును కొట్టుట - ద్రోణుడు మొసలినుండి విడిపించుకొనుట - అర్జుననకు 'బ్రహ్మశిర' మను అస్త్రము లభించుట :**

"జనమేజయా ! తరువాత ద్రోణాచార్యుడు అర్జునునితో, ఇప్పుడిక నీవు ఈ లక్ష్యమును కొట్టవలెను. దీనిని బాగుగా చూడుము. 'నా యాజ్ఞయైన వెంటనే, నీవు దీనిపై బాణ ప్రయోగము చేయవలెను. నాయనా ! నీవు ధనుస్సు ఎక్కుపెట్టుకొని నిలిచి యుండుము. రెండు గడియలు నా యాజ్ఞకై ఎదురు చూచుచుండుము'' అనెను.

"జనమేజయా ! ఆచార్యు డిట్లు చెప్పగా, అర్జునుడు ధనుస్సును మండలాకారముగా లాగి, గ్రద్దను గురిపెట్టి చూచుచు, ఆచార్యుని యాజ్ఞకై ప్రతీక్షించుచుండెను. అప్పు డాచార్యుడు "అర్జునా ! నీవు చెట్టుపైన నున్న గ్రద్దను, చెట్టును, నన్ను చూచుచున్నావా ?" యని యితరుల నడిగినట్లే యడుగగా అర్జునుడు, "ఆచార్యా! నేను గ్రద్దను మాత్రమే చూచుచున్నాను. చెట్టునుగాని, నిన్ను గాని చూచుట లేదు." అనెను.

"జనమేజయా ! అర్జునుని ఉత్తరము విని ద్రోణుడు ప్రసన్నుడై, రెండు గడియల పిదప మరల నర్జునుని, "పుత్రా నీవు గ్రద్దను మాత్రమే చూచుచుండిన యెడు, దాని శరీర మెట్లున్నది ?'' అని యడగగా, అర్జునుడు, "గురుదేవా ! నేను గ్రద్ద శిరస్సును మాత్రమే చూచుచున్నాను. దాని శరీరమంతయు చూచుట లేదు." అని యనగా, ద్రోణాచార్యుని శరీరము హర్షాతిరేకముచేత పులకితమై అర్జునునితో, "బాణము ప్రయోగించుము " అని యనిన తోడనే యర్జునుడు, ఏ మాత్రము విచారించక బాణము విడిచెను. వెంటనే ఆ గ్రద్ద శిరస్సు తెగి క్రింద పడెను. అప్పుడు, ఆచార్యుడు సంతసించి యర్జునుని కౌగిలించుకొనెను. అర్జునుడు ద్రుపదరాజును బంధయుక్తముగా తప్పక ఓడించగలడు అను విశ్వాసము ఆచార్యునకు కలిగెను.

"జనమేజయా ! తరువాత ఒకనాడు ద్రోణాచార్యుడు తన శిష్యులతో పాటు గంగా స్నానమునకు పోయి, జలములో మునిగి నప్పుడు, కాలప్రేరితమైన యొక మొసలి ద్రోణుని జంఘాంతము (పిక్కకు - పాదమునకు నడిమి భాగము) పట్టుకొనెను. ఆయన, దానిని విడిపించుకొన బూని నప్పటికిన్ని, తన శిష్యులతో 'ఈ మొసలిని చంపి నన్ను రక్షింపుడు' అని యనిన వెంటనే, అర్జునుడు ఐదు అమోఘ బాణములచేత నీటిలో నున్న మొసలిని కొట్టి చంపెను.

"జనమేజయా ! అప్పుడు ఇతర శిష్యులు మూఢులవలె నిలిచి యుండిరి. తాను కోరినవెంటనే యర్జునుడు, ఆపని జయప్రదముగా చేసినందుకు, ఆచార్యుడు అర్జునునియెడల మిక్కిలి ప్రసన్నుడై, యతడు శిష్యులందరికన్న మిన్న యని తలచెను. అర్జునబాణములచేత మొసలి ముక్కలై చచ్చి ఆచార్యుని పిక్కను విడిచెను. అప్పుడు ఆచార్యుడు అర్జునునితో నిట్లనెను :-

"మహాబాహూ! ఈ బ్రహ్మశిరము, అను నస్త్రము నీకు, ప్రయోగోప సంహార పూర్వకముగా నిచ్చు చున్నాను. ఇది అన్ని యస్త్రములకన్న అధిక శక్తి గలది. దీనిని ధరించుటగూడ అతి కఠినము. దీనిని నీవు తీసికొనుము. ఈ యస్త్రమును నీవు ఎట్టి పరిస్థితిలోగూడ మనుష్యులపై ప్రయోగించ గూడదు. ఇది ఒకవేళ అల్పతేజస్సు గల వానిపై ప్రయోగించినయెడల, అతనితోపాటు సమస్తప్రపంచమును భస్మముచేయును. నాయనా! యీ యస్త్రము మూడు లోకముల లోను అసాధారణ మైనది. నీవు మనస్సును, ఇంద్రియములను నిగ్రహములో నుంచుకొని, ఈ యస్త్రమును ధరించుము, ఈ నామాట వినుము. "వీరుడా! ఎవడైన మానవేతర శత్రువు నిన్ను యుద్ధములో పీడించినప్పుడు, అతనిని వధించుటకు నీవు ఈ యస్త్రమును ప్రయోగింపవచ్చును" అని యనెను.

"జనమేజయా! గురుదేవుడు చెప్పిన మాట విని, యర్జునుడు 'తథాస్తు' (అట్లే యగుగాక!) అని ప్రతిజ్ఞ చేసె, చేతులు జోడించి, ఆ యుత్తమాస్త్రమును గ్రహించెను. అప్పుడు ఆచార్య ద్రోణుడు అర్జునునితో మరలగూడ "ప్రపంచము నందు నీతో సమానుడైన ధనుర్ధారుడు మరియొక డెవడుగూడ నుండడు'' అని యనెను.

**రాజకుమారులు అస్త్రకౌశలము చూపుట :-**

"జనమేజయా! ధార్తరాష్ట్రులు - పాండవులు అస్త్రవిద్యను పరిపూర్ణముగా నభ్యసించిన తరువాత ద్రోణాచార్యుడు, 'కృపాచార్య - సోమదత్త - బాహ్లీక - భీష్మ - వ్యాసమహర్షి - విదురుల సమక్షములో, ధృతరాష్ట్రునితో, "రాజా! నీ పుత్రులు అస్త్రవిద్య నేర్చుకొనినారు. నీ యనుమతి యైనయెడల వారు తమ యస్త్ర కళాప్రదర్శనము చేసెదరు." అని యనగా, ధృతరాష్ట్రుడు మిక్కిలి ప్రసన్నుడై ద్రోణాచార్యునితో, "బ్రాహ్మణోత్తమా! నీవు రాజకుమారులకు అస్త్రవిద్య నేర్పి, చాల గొప్ప ఉపకారము చేసితివి. కుమారుల యస్త్రవిద్యా ప్రదర్శనము కొరకు నీవు, ఎప్పుడు, ఎచ్చట, ఏ విధముగా ఏర్పాట్లు చేయదలచెదవో, అట్లు నాకు ఆజ్ఞ యిమ్ము. చేయించెదను.

"ఆచార్యా! నేడు నేను నేత్రహీనుడ నగుటచేత, దుఃఖించుచు నేత్రములు గలవారి యదృష్టము పొందుటకు ఉబలాటపడు చున్నాను. ఎందుకనగా, కన్నులు గలవారు, వివిధ పరాక్రమములతో కుమారులు, అస్త్రకౌశలము ప్రదర్శించుటను చూడగలరు. ఆ భాగ్యము నాకు లేదు. ఇంతమాత్రము ఆచార్యునితో చెప్పి ధృతరాష్ట్రుడు విదురునితో "విదురా! ఆచార్య ద్రోణుడు చెప్పినట్లు చేయుము. దానికంటే ప్రియమైన కార్యము మరియొకటి లేదని నా యభిప్రాయము."

"జనమేజయా! రాజాజ్ఞ గొని, విదురుడు ద్రోణాచార్యునితో వెలుపలకు పోయెను. ద్రోణుడు ప్రదర్శన రంగస్థలమునకు గాను ఒక స్థలము నిర్ణయించి కొలిపించెను.

"ఆ భూమి, సమతలమై, వృక్షలతాదులు లేక, ఉత్తరదిశకు వంపుగా నుండెను ద్రోణాచార్యుడు వాస్తుపూజ చూచుటకై, దండోరా వాయింప జేసి పౌరులను ఆహ్వానింపజేసెను. మంచి నక్షత్రము గల తిథియందు వాస్తుపూజ చేయించెను తరువాత శిల్పులచేత, ఆ రంగభూమిలో వాస్తుశాస్త్రాను సారముగా, అతివిశాలమైన '*ప్రేక్షాగృహము'నకు శంకుస్థాపనము చేయించెను. రాజులు, అంతఃపుర స్త్రీలున్ను కూర్చొనుటకు అక్కడ అన్ని విధములైన అస్త్రశస్త్రములు

* ఒక ఉత్సవమును గాని, నాటకమును గాని, సౌకర్యముతో చూచుటకు గాను నిర్మింపబడిన శాల 'ప్రేక్షాగృహము-ప్రేక్షాభవనము' అనబడును.

గల అతి సుందరభవనము నిర్మింప జేసెను. దేశీయ ప్రజలు కూర్చొనుటకు అక్కడ విశాలమైన ఉన్నత 'మంచము' (మంచె)ను నిర్మింప జేసెను. స్త్రీలను తోడ్కొని వచ్చుటకు పల్లకీలు ఏర్పరచెను.

"తరువాత, ప్రదర్శన దినమున మంత్రిసహితుడై ధృతరాష్ట్రుడు, భీష్మ-కృపాచార్య - బాహ్లిక - సోమదత్త - భూరిశ్రవసులు, ఇతర కౌరవులున్ను నగర బహిర్భాగమునందున్న ప్రేక్షాగృహమునకు వచ్చిరి. దానికి ముత్యముల హారములు వ్రేలాడ గట్టబడి యుండెను. వైడూర్యమణులు అలంకరింపబడి యుండెను. గోడలకు సువర్ణఖండములు పొదుగబడి యుండెను.

"జనమేజయా! గాంధారీ - కుంత్యాది రాజస్త్రీ లందరు, వస్త్రాభరణ భూషితలై, దాసదాసీ జనముతో ఆ భవనమునకు వచ్చి, దేవతా స్త్రీలు మేరు పర్వత మెక్కినట్లు, మంచె యెక్కి కూర్చొనిరి. బ్రాహ్మణ - క్షత్రియాది చాతుర్వర్ణ్యముల ప్రజలు కుమారుల అస్త్ర విద్యాకౌశలము చూచునిచ్ఛతో నగరమునుండి త్వరగా వచ్చిరి. ఒక క్షణములో నక్కడ జనసముదాయము నిండెను. వాద్య ధ్వనులచేత, జనకోలాహలముచేతను అప్పుడా భవనము, క్షోభిల్లిన మహా సాగరమువలె నుండెను.

"తరువాత, శ్వేత వస్త్ర - శ్వేత యజ్ఞోపవీతములు ధరించిన ద్రోణాచార్యుడు, తన పుత్రుడు అశ్వత్థామతో రంగస్థలములో మేఘ సహితమైన ఆకాశములో చంద్రుడు కుజునితోపాటు ప్రవేశించినట్లు, ప్రవేశించెను. ఆచార్యుని తల, గడ్డము, మీసములున్ను నెరసి తెల్లగా నుండెను. ఆయన శ్వేతపుష్పమాలికలు ధరించి, శ్వేతచందనము పూసికొని యుండెను. ఆయన సకాలములో దేవపూజ చేసి, బ్రాహ్మణులచేత మంగళాచరణము చేయించెను.

జనమేజయా! అప్పుడు ధృతరాష్ట్రుడు మణిసువర్ణాది ధనములు, వస్త్రములున్ను ఆచార్యులైన కృప - ద్రోణులకు దక్షిణగా నిచ్చెను. పుణ్యాహవాచన - హోమాదులు జరిగిన తరువాత అనేక శస్త్రాస్త్రములు తీసికొని మనుష్యులు, ఆరంగస్థలమునకు వచ్చిరి. తరువాత భరత వంశీయ రాజకుమారులు, అంగుళిత్రాణములు కట్టుకొని, ధనుస్సులు ధరించి రథములపై రంగస్థలమునకు వచ్చిరి. యుధిష్ఠిరాదులు జ్యేష్ఠానుక్రమముగా కూర్చుని యుండిరి. వారు ఆచార్య ద్రోణ-కృపులకు నమస్కరించి పూజ చేసి, వారి యాశీర్వాదము తీసికొని ప్రసన్నులైరి.

"జనమేజయా! తరువాత, ఆ కుమారులు, పూజాపుష్పములచేత ఆచ్ఛాదితములైన శస్త్రాస్త్రములకు ప్రణామము చేసి, రక్తచందన - పుష్పములచేత మరల ఆయుధములకు పూజ చేసిరి, వారందరు రక్తచందనము శరీరమునకు పూసికొని, రక్తపుష్పమాలికలు ధరించి యుండిరి. అందరి రథముల పైన రక్తవర్ణపతాకలుండెను. అందరి కనుకొనలు ఎఱ్ఱబారి యుండెను.

"జనమేజయా ! తరువాత, రాజకుమారులు, తప్తకాంచన భూషణ భూషితులై, ఆచార్య ద్రోణుని యాజ్ఞచేత తొలుత తమ - తమ ధనుస్సులపై నారి సారించి, బాణములు సంధించి, ధనుష్టంకార ధ్వని చేసి, కరతాళధ్వనులతో సభవారి నందరిని ఆదరించి, తమ - తమ యస్త్రకౌశలము ప్రదర్శింప జొచ్చిరి.

జనమేజయా! ప్రేక్షకులలో కొందరు, బాణములు తగులు నను భయము చేత తలవంచుకొనుచుండిరి, మరికొందరు, ఆశ్చర్యముతో నిర్భయముగా అది యంతయు చూచుచుండిరి. అప్పుడు రాజకుమారులు స్వనామాంకితములైన బాణములతో మిక్కిలి చురుకుగా లక్ష్యములను కొట్టుచుండిరి. గంధర్వ నగరమువలె అద్భుతముగా నున్న రాజకుమారుల సముదాయమును చూచి, ప్రేక్షకులందరు ఆశ్చర్యచకితు లగుచు 'చాల బాగున్నది' అని సాధువాదములచే కోలాహలము చేసిరి.

"జనమేజయా! ఆ రాజకుమారులు అశ్వారూఢులై స్వనామాంకితములైన బాణములను చాల చురుకుగ ప్రయోగించి, లక్ష్యములను కొట్టుచుండిరి. తరువాత, రథసంచాలనములో రాజకుమారులు వివిధ మార్గములను త్వరగా నడుపుట, త్రిప్పి తెచ్చుట, కుడియెడమలకు నడపుట, మండలాకారముగ నడపుట మొదలైనవి ప్రదర్శించిరి. తరువాత బాహుయుద్ధము, గజాశ్వ యుద్ధములు చేయు చాతుర్యము చూపిరి. కత్తి, డాలు పట్టుకొని ఇతరులను కొట్టుచు ఖడ్గ సంచాలనమునందు శాస్త్రోక్తమార్గములను (పైకి క్రిందకు, ప్రక్కలకు కత్తి త్రిప్పు కళలు) ప్రదర్శించిరి. రథాశ్వగజ పదాతి యుద్ధములలో కౌశలము చూపించిరి.

"జనమేజయా! ప్రేక్షకులు కుమారుల ఖడ్గ ప్రయోగ కౌశలము చూచి దానిలో వారికి గల లాఘవమును, చాతుర్యమును, శోభను, ధైర్యమును, పిడికిట దృఢత్వమునున్ను ప్రశంసించిరి. తరువాత, పరస్పరము జయించుట యందు ఉత్సాహము గల దుర్యోధన-భీమసేనులు గదాధరులై రంగస్థలమునకు వచ్చినప్పుడు వారు శిఖరములు గల రెండు పర్వతములవలె శోభిల్లుచుండిరి. వారిరువురు పౌరుషము చూపించుటకు ఎదు-రెదురుగా నడుము గట్టిగట్టిగా నిలిచి, రెండు మదగజములు ఒక హస్తినికొరకు పరస్పరము తలపడి ఘీంకరిల్లు చున్నట్లు గర్జిల్లుచుండిరి. వారు గదలను కుడి యెడమలకు మండలా కారముగ త్రిప్పుచు రెండు మదోన్మత్త గజములవలె రంగస్థల మధ్యమున సంచరించు చుండిరి. విదురుడు ధృతరాష్ట్రునకు, కుంతీదేవి గాంధారికిన్ని, రాజకుమారుల బాణ ప్రయోగ కౌశలమును తెలుపుచుండిరి."

**దుర్యోధన-భీమార్జునుల అస్త్ర కౌశల ప్రదర్శనము :-**

"జనమేజయా! భీమ - దుర్యోధనులు రంగస్థలమందు గదా యుద్ధము చేయుచున్నప్పుడు వారి యందు పక్షపాతముగల ప్రేక్షకులు రెండు దళములుగ విభక్తులైరి. కొందరు 'దుర్యోధనుడు ఎంతటి యద్భుత పరాక్రమము చూపు చున్నాడు' అని యనగా, మరికొందరు 'ఆహా! భీమసేనుడు ఎంత యాశ్చర్య కరముగ కొట్టుచున్నాడు!' అని వివిధములుగ మాట్లాడుచున్న ప్రేక్షకుల ధ్వని అన్ని వైపుల మ్రార్మోగెను. రంగస్థలమంతయు ఆ ధ్వనులచేత క్షోభిల్లిన మహా సముద్రమువలె నుండుట చూచి, ద్రోణాచార్యుడు తన పుత్రుడు అశ్వత్థామతో, 'వత్సా! ఈ యిరువురు వీరులు మంచి యస్త్ర విద్యాభ్యాసము కలవారు. నీవు వీరిని యుద్ధము నుండి ఆపుము. ఈ భీమ - దుర్యోధనుల వలన రంగస్థలములో వీరి పక్షపాతులైన ప్రేక్షకులకు పరస్పరము క్రోధము కలుగకుండు గాక! అని యనెను.

"జనమేజయా! తరువాత అశ్వత్థామ త్వరగా లేచి, భీమ దుర్యోధనులను ఆపుచు నిట్లనెను:-

"భీమా! నీకు గుర్వాజ్ఞ యున్నది, దుర్యోధనా ఆచార్యుని ఆదేశమైనది. మీరిరువురు యుద్ధమును ఆపుడు ఇరువురును యోగ్యులే. మీ పరస్పరాక్రమణము

వాంఛనీయము కాదు. ఈ దుస్సాహసము చేయుట మీకు ఉచితము కాదు. కనుక, ఆపుడు."

"జనమేజయా! యిట్లు చెప్పి, అశ్వత్థామ ప్రళయకాల వాయువుచేత క్షోభిల్లి ఉత్తుంగ తరంగములు గల రెండు సముద్రములవలె గదలు పై కెత్తుచున్న భీమ దుర్యోధనులను యుద్ధము నుండి ఆపెను. తరువాత ద్రోణాచార్యుడు మహా మేఘములవలె కోలాహలము చేయుచున్న వాద్యములను ఆపి, ప్రేక్షకులతో నిట్లనెను:-

"మహాజనులారా! నాకు పుత్రుని కంటె అధిక ప్రియుడు, సమస్త శస్త్ర నైపుణ్యమును సంపాదించినవాడు, శ్రీమన్నారాయణమూర్తితో సమానమైన పరాక్రమము గలవాడు నైన యింద్రకుమారుడు అర్జునుని అస్త్రకౌశలము ఇప్పుడు మీ రందరు చూచెదరు."

"జనమేజయా! తరువాత, ఆచార్యుని యాజ్ఞపై స్వస్తివాచనము చేయించి వీరార్జునుడు ఉడుము తోలుతో చేయబడిన అంగుళి త్రాణము చేతికి తొడిగికొని బాణభరితమైన అంబులపొది ధరించి ధనుర్ధారియై, రంగభూమియందు కనబడెను. నల్లని శరీరముపై సువర్ణ కవచము ధరించిన యర్జునుడు 'సూర్యుడు ఇంద్రధనుస్సు విద్యుత్తు - సంధ్యాకాలము'వానితో కలిసిన మేఘమువలె శోభిల్లుచుండెను. తరువాత, రంగస్థల మంతట హర్షోల్లాసములు వ్యాపించెను. అన్ని వైపుల వివిధ వాద్యములు, శంఖములు మ్రోగెను.

"జనమేజయా! అప్పుడు "ఇతడు కుంతియొక్క తేజస్వియైన పుత్రుడు. ఇతడే పాండవ మధ్యముడు. ఇంద్రపుత్రుడు. కురువంశ రక్షకుడు. అస్త్ర విద్యాపారంగతు లందరిలోను ఉత్తముడు. ధర్మాత్ములలో శీలవంతులలోను శ్రేష్ఠుడు. ఇతడు శీలజ్ఞానములకు ఉత్తమ నిధి"అను మాటలు అప్పుడు ప్రేక్షకుల ముఖము నుండి కలకల ధ్వనితో పాటు వెడలగా విని కుంతీదేవి స్తనముల నుండి పాలు, నేత్రముల నుండి ఆనందాశ్రువులు ప్రవహించెను. ఆ దుగ్ధ మిశ్రితమైన కన్నీటి చేతకుంతీదేవి వక్షస్థలము తడిసెను.

ఆ మహాకోలాహలము విని ధృతరాష్ట్రుడు ప్రసన్నచిత్తుడై విదురునితో 'విదురా! క్షోభిల్లిన మహా సముద్రమువలె ఈ మహాకోలాహలం మెక్కడిది? ఇది ఆకాశమును చీల్చుచు రంగస్థలమునందు హఠాత్తుగా వ్యక్తమై నట్లున్నది,' అని యనగా, విదురుడు 'మహారాజా! అర్జునుడు రంగస్థలమునందు ప్రవేశించుటచేత ఈ మహాధ్వని కలిగెను' అనియనగా, ధృతరాష్ట్రుడు 'కుంతియను అరణి(అగ్నిని మథించుకొయ్య) నుండి ఉద్భవించిన ఈ ముగ్గురు పాండవులు అను అగ్నులచేత నేను ధన్యుడనైతిని, ఈ ముగ్గురిచేత నేను అనుగ్రహింపబడి సురక్షితుడనై యున్నాను అని విదురునితో ననెను."

"జనమేజయా! యిట్లు అత్యానందముచేత ధ్వనించిన రంగస్థలము కొంత శాంతమైనప్పుడు, అర్జునుడు ఆచార్యునకు తన అస్త్రప్రయోగలాఘవమును చూపింప జొచ్చెను. అతడు ఆగ్నేయాస్త్రముచేత అగ్ని పుట్టించి పిదప వారుణాస్త్రముచేత జలము పుట్టించి అగ్నిని ఆర్పెను. తరువాత, వాయవ్యాస్త్రముచేత సుడిగాలి పుట్టించి, పర్జన్యాస్త్రముచేత మేఘములను పుట్టించెను. తరువాత భౌమాస్త్రముచేత భూమిని, పార్వతాస్త్రముచేత పర్వతములను పుట్టించి అంతర్ధానాస్త్రముచేత తాను స్వయముగా అదృశ్యుడయ్యెను. ఇట్లు అర్జునుడు క్షణములో పొడవై, మరుక్షణములో పొట్టివాడగుచు నుండెను. ఒక క్షణకాలము రథపు నొగలపై నిలుచుచు, తరువాత, రెప్పపాటు కాలములో నేలపై దిగి అస్త్ర కౌశలము చూపుచుండెను.

"జనమేజయా! గురువునకు ప్రియశిష్యుడైన అర్జునుడు మిక్కిలి లాఘవముతో, అతిచమత్కారముగ, సుకుమారములు, సూక్ష్మములు పెద్దవియునగు వివిధ లక్ష్యములను గూర్చి అచంచలుడై బాణములచేత ఛేదింప జేయుచుండెను. రంగస్థలమునందు లోహముతో చేయబడిన కృత్రిమ వరాహము గిర - గిర యంత్రమువలె తిరుగుచుండెను. అట్లు తిరుగుచున్న అపంది ముఖమునందు అర్జునుడు ఒకేసారి ఒక బాణమువలె ఐదు బాణములతో కొట్టెను. ఆ ఐదున్ను ఒకదాని కొకటి తగులకుండ విడి-విడిగా ఆపంది ముఖమునందు గ్రుచ్చుకొనెను. ఇట్లే ఒకచోట ఆవు కొమ్ము త్రాటితో, కట్టబడి వ్రేలాడి కదలుచుండెను. పరాక్రమవంతుడైన అర్జునుడు ఆశృంగము యొక్క రంధ్రమునందు ఇరువది యొక్క బాణములు గ్రుచ్చెను. ఈ ప్రకారముగ ఖడ్గ - ధనుస్ - గదాది శస్త్ర సంచాలనము నందు కుశలుడైన అర్జునుడు తన సామర్థ్యమును చూపించెను.

అంతటిలో అస్త్రకళా ప్రదర్శనము చాలవరకు ముగిసి పోయెను. మనుష్యుల కోలాహల ధ్వని, వాద్య ధ్వని శాంతిల్లు చుండెను. అప్పుడు ద్వారము వైపు నుండి ఒక వీరుడు భుజములు చరచిన శబ్దము, పిడుగులు ఒండొంటిని కొట్టుకొనుచున్నవా అన్నట్టు వినపడెను. ఆశబ్దము ఒకవీరుని మాహాత్మ్యమును, బలమును సూచించునదిగా నుండెను.

"జనమేజయా! అప్పుడు ప్రేక్షకు లందరు ద్వారము వైపు చూచిరి. పంచపాండవులతో గూడిన ద్రోణుడు పంచ నక్షత్రములు గల హస్త నక్షత్రము చేత గూడియున్న చంద్రునివలె శోభిల్లుచుండెను.

"జనమేజయా! దుర్యోధనుడు గూడ లేచి నిలబడెను. అతని నూర్గురు తమ్ములు, అశ్వత్థామయు అతనికి నలువైపుల చుట్టి నిలిచిరి. అట్లు ఆయుధధారులై నిలిచియున్న సోదరులచేత పరివృతుడైన గదాధారి దుర్యోధనుడు, పూర్వము దానవసంహార సమయమున దేవతాపరివృతుడైన యింద్రునివలె శోభిల్లుచుండెను".

**కర్ణుని రంగస్థల ప్రవేశము-రాజ్యాభిషేకము :**

"జనమేజయా! అప్పుడు ఆశ్చర్యముతో చూచుచున్న ద్వారపాలకులు మార్గము విడిచినప్పుడు, కర్ణుడు విశాలమైన రంగస్థలమునందు ప్రవేశించి సహజ కవచకుండలములతో భాసిల్లుచు ధనుర్ధారియై, నడుమున కత్తి గట్టుకొని, నడచుచున్న పర్వతమువలె ప్రకాశించుచుండెను. కుంతి కన్యకగా ఉండినప్పుడు పుట్టిన కర్ణుని యశస్సు నలువైపుల వ్యాపించియుండెను. అతడు ప్రచండ కిరణములు గల సూర్యభగవానుని యంశముచేత పుట్టియుండెను. అతనికి సింహము వంటి బలము, అబోతువంటి వీర్యము. గజరాజు వంటి పరాక్రమమున్ను ఉండెను. అతడు దీప్తిచేత సూర్యుడుగా, కాంతిచేత చంద్రుడుగా, తేజస్సుచేత అగ్నిగాను కనపడుచుండెను."

"జనమేజయా! కర్ణుని శరీరము ఉన్నతముగా నుండెను గనుక, నతడు సువర్ణమయ తాళవృక్షమువలె కనపడుచుండెను. అతని యవయవముల పొందిక సింహమువలె నుండెను. అసంఖ్యాక గుణములు గలిగి తరుణ వయస్కుడైన కర్ణుడు సూర్యుని పుత్రుడు గనుక, సూర్యునివలెనే దివ్యశోభ గలవాడై యుండెను."

"జనమేజయా! అప్పుడు కర్ణుడు రంగస్థలము నందు అన్నివైపుల దృష్టి సారించి చూచి, ద్రోణాచార్య - కృపాచార్యులకు, వారిపై అధికాదరము లేనట్లుగా ప్రణామము చేసెను. రంగస్థలములోని వారందరు నిశ్చల దృష్టితో నతనిని చూచుచుండిరి. 'ఇతడెవడు?' అని తెలిసికొనుటకు వారి మనస్సు చంచలమగు చుండెను" అందరున్ను ఉత్కంఠతతో నుండిరి. ఇంతలోనే కర్ణుడు, తనకు అజ్ఞాత సోదరుడైన అర్జునునితో మేఘ గంభీర ధ్వనితో నిట్లనెను :-

"కుంతీనందనా! నీవు ఈ ప్రేక్షకుల యెదుట ఏయే కార్యములు చేసి చూపించితివో, వానికన్న అధికాద్భుత కార్యములు చేసి చూపించెదను. కనుక, నీవు పరాక్రమవంతుడవని గర్వింపకుము."

"జనమేజయా! కర్ణుని మాటలు పూర్తి కాకముందే, అక్కడి ప్రేక్షకులందరు, యంత్రములతో, లేప బడినట్లు లేచి నిలబడిరి. అప్పుడు దుర్యోధనునకు మిక్కిలి సంతోషము కలిగెను. అర్జునునకు క్షణములో లజ్జా - క్రోధములు గలిగెను. అప్పుడు కర్ణుడు, ద్రోణాచార్యుని యాజ్ఞ తీసికొని, అర్జునుడక్కడ చూపించిన యస్త్ర కౌశములన్నియు చేసి చూపించెను. తరువాత, దుర్యోధనుడు, అతని సోదరులున్ను మిక్కిలి సంతోషముతో కర్ణుని ఆలింగనము చేసి కొనిరి.

"జనమేజయా! అప్పుడు దుర్యోధనుడు కర్ణునితో, 'మహాబాహూ! నీకు స్వాగతమగుగాక! నీ విక్కడికి మా సౌభాగ్యము వలన వచ్చితివి. నా యీ కౌరవ రాజ్యము, నీయదిగానే భావించి, యథేచ్ఛగా అనుభవింపుము.' అని యనగా కర్ణుడతనితో, ప్రభూ! నీవు చెప్పిన దంతయు నేను నెరవేర్చితి నని విశ్వసించు చున్నాను. నేను నీ మైత్రి కోరుచున్నాను. అర్జునునితో ద్వంద్వ యుద్ధము చేయ వలెనని కోరుచున్నాను' అని యనగా దుర్యోధను డతనితో 'శత్రుదమనా! నీవు నాతోపాటు ఉత్తమ సుఖము లనుభవింపుము. నా, సోదరులకు బంధువులకున్ను ప్రియము చేయుము. సమస్త శత్రువుల మస్తకములపై కాలూనుము' అని యనెను.

"జనమేజయా! అప్పు డర్జునుడు, తాను కర్ణుని చేత తిరస్కరింపబడిన వాడుగా భావించి, దుర్యోధనాది సోదరుల మధ్య అచంచలముగా నిలిచి కర్ణునితో,

'కర్ణా!' పిలువకుండ వచ్చిన వారికి, పిలువక మాట్లాడిన వారికిన్ని ప్రాప్తించు (నిందనీయ) లోకములకు, నా చేత చంపబడిన తరువాత నీవు పోవగలవు' అని యనగా కర్ణుడతనితో, 'అర్జునా!' యీ రంగస్థలము అందరికిన్ని సమానము. ఇందులో నీ యధికార మేమున్నది? బల - పరాక్రమములలో శ్రేష్ఠుడే 'రాజు' అని పిలిపించుకొనుటకు అర్హుడగును. ధర్మముగూడ బలమునే యనుసరించును. ఆక్షేపించుట దుర్బలుని పని. దీనిచేత ఏమి లాభము? నీకు సాహసము ఉండినచో బాణములతో మాట్లాడుము. నేను, నేడు నీ గురువు సమక్షములోనే - బాణముల చేత నీ శిరస్సు ఖండించెదను' అని యనెను".

"జనమేజయా! తరువాత అర్జునుడు ఆచార్య ద్రోణుని యాజ్ఞ గొని, సోదరులను కౌగిలించుకొని, యుద్ధము చేయుటకు కర్ణునివైపు సాగెను. అప్పుడు దుర్యోధనుడు అతని తమ్ములున్ను, యుద్ధసన్నద్ధుడై యున్న కర్ణుని, కౌగిలించు కొనిరి. అప్పుడు కొంగల పంక్తులనెడు నవ్వు గలిగిన మేఘములు, విద్యుత్కాంతితో, ఉరుములతో, ఇంద్రధనుస్సుతోను సమస్తాకాశమును ఆచ్ఛాదించెను. తరువాత, ఇంద్రుడు, తన పుత్రుడైన యర్జునుని యెడల ప్రేమతో రంగస్థలమును చూచుచుండుట గమనించి, (వానవచ్చుటచూచి), సూర్యుడుగూడ తన పుత్రుడైన కర్ణునిపై ప్రేమచేత, మేఘములను తన తేజస్సుచేత భిన్నభిన్నము చేసెను. అప్పుడు అర్జునుడు మేఘపునీడలో దాగి యుండెను. కర్ణుడు సూర్యుని ప్రభచేత ప్రకాశించుచు కనపడెను."

"జనమేజయా! ధృతరాష్ట్ర - పుత్రులు కర్ణుని వైపుననే నిలిచి యుండిరి. ద్రోణ - కృప - భీష్ములు అర్జునునివైపు, నిలిచి యుండిరి. రంగస్థలము నందలి స్త్రీపురుషులు గూడ, రెండు పక్షములలో విభక్తులై, విడి - విడిగా నిలిచిరి. కుంతీదేవి మాత్రము (ఈ యిరువురున్ను తన పుత్రులే యని) వాస్తవిక రహస్యమెరిగి యుండెను. కనుక, చింతతో మూర్ఛిల్లెను. అప్పుడు విదురుడు దాసీ జనము చేత చందనజలమును ఆమెపై చల్లించి, ఆమెను మూర్ఛ దేర్చుటకు ప్రయత్నించెను." దానిచేత కుంతిదేవి మూర్ఛ దేరెను. కాని, తన పుత్రు లిద్దరు పోరాడుచుండుట చూచి, ఆమె భయపడెను. వారి యుద్ధమును ఆపుటకు ఆమెకు ఏ యుపాయమును తోచకుండెను.

"జనమేజయా! కర్ణార్జునులు ద్వంద్వ యుద్ధమునకు సన్నద్ధులైనప్పుడు, ద్వంద్వ యుద్ధ నీతిని, రీతిని బాగుగా నెరిగి, దానిలో కుశలుడు, ధర్మజ్ఞుడు నైన శరద్వంతుని పుత్రుడు కృపాచార్యు డిట్లనెను:-

"కర్ణా! యితడు కుంతీదేవి కనిష్ఠ పుత్రుడు. పాండునందనుడైన అర్జునుడు. కురువంశ రత్నము. ఇతడిప్పుడు నీతో యుద్ధము చేయగలడు. ఈ విధముగనే, నీవు గూడ నీ తలిదండ్రులను, కులమునున్ను, గూర్చి తెలుపుము. నీ వంశము నలంకరించిన రాజుల పేర్లు తెలుపుము. ఈ వివరములు తెలిసిన తరువాత, 'అర్జునుడు నీతో యుద్ధము చేయునా? లేదా?' అని నిశ్చయింప వచ్చును. ఎందుకనగా, రాజకుమారుడు నీచకులులతో, హీనములైన ఆచార - వ్యవహారములు గల వారితోను యుద్ధము చేయడు".

"జనమేజయా! కృపాచార్యు డిట్లనగానే, కర్ణుని ముఖము లజ్జతో క్రిందకు వాలెను. వాన నీటిచేత తడిసిన కమలమువలె కర్ణుని ముఖము వాడి పోయెను". అప్పుడు దుర్యోధనుడు కృపాచార్యునితో, "ఆచార్యా! శాస్త్ర సిద్ధాంతానుసారము, రాజులకు మూడు జన్మస్థానము లుండును. ఒకటి, ఉత్తమ కులము, రెండు శౌర్య - పరాక్రమములు, మూడు - సేనాపతిత్వము, కనుక, శౌర్య - పరాక్రమములచేత కర్ణుడు గూడ రాజే యగును. ఒకవేళ అర్జునుడు రాజు కాని వానితో యుద్ధము చేయుటకు ఇష్టపడని యెడల, నే నిప్పుడే యతనిని అంగదేశ రాజ్యమునందు అభిషిక్తుని జేసెదను" అని యనెను.

"జనమేజయా! తరువాత, దుర్యోధనుడు, ధృతరాష్ట్ర భీష్ముల యాజ్ఞ దీసికొని, బ్రాహ్మణులచేత అభిషేక సామగ్రి తెప్పించి, అప్పుడే కర్ణుని సువర్ణ సింహాసనమునందు కూర్చొన బెట్టి వేద విదులైన బ్రాహ్మణులు, పేలాలతో, పువ్వులతోను గూడిన సువర్ణ కలశ జలము చేత, అంగదేశ రాజ్యమునకు రాజుగా పట్టాభిషిక్తుని చేసినాడు. అప్పుడు, 'కిరీట - పర - కేయూర (భుజ కీర్తులు) - కంకణములు' మొదలైన రాజ చిహ్నములతో, ఇతర భూషణముల తోను అలంకృతుడై, కర్ణుడు ఛత్ర - చామరములతో, జయశబ్దములతోను రాజ్యలక్ష్మి శోభితుడై యుండెను.

"జనమేజయా! తరువాత, కర్ణభూపతి బ్రాహ్మణులకు అనంత ధనము లిచ్చెను. అప్పుడతడు దుర్యోధనునితో 'రాజా! నీవు నాకు రాజ్యమిచ్చితివి. దీనికి తగిన ప్రత్యుపకారమునకు నే నేను చేయుదునో తెలుపుము. నీవు చెప్పినట్లే చేసెదను.' అని యనగా, దుర్యోధనుడు, అంగరాజా! నేను నీతో ఎప్పుడు గూడ అంతము గాని మైత్రిని కోరెదను.' అని యనగా, కర్ణుడు 'తథాస్తు' అట్లే యగుగాక! అని దుర్యోధనునితో మైత్రి చేసెను. తరువాత వారిరువురు మిక్కిలి హర్షముతో బరస్పరము కౌగిలించుకొని ఆనంద మగ్నులైరి.

**భీమసేనుడు కర్ణుని తిరస్కరించుట - దుర్యోధనుడు కర్ణుని సమ్మానించుట**

"జనమేజయా! తరువాత, కఱ్ఱ మాత్రమే సహాయముగా గలిగిన (వృద్ధుడు) 'అధిరథుడు' కర్ణుని పిలుచుచు, వణకుచు రంగస్థలములోనికి వచ్చెను. అతని యంగవస్త్రము జారిపడెను. అతని శరీర మంతయు చెమటపట్టి యుండెను. అప్పుడు పితృభక్తిచేత కర్ణుడు, అధిరథుని చూడగనే, ధనుస్సు విడిచి, సింహాసనము నుండి దిగి వచ్చెను. కర్ణుని శిరస్సు, పట్టాభిషేక జలముచేత తడిసి యుండెను. అట్టి పరిస్థితిలోనే యతడు అతిరథుని చరణములపై మస్తకము ఉంచి ప్రణామము చేసెను.

"జనమేజయా! తరువాత అధిరథుడు తన పాదములను వస్త్రాంతముతో అచ్ఛాదించుకొని, పుత్రా! పుత్రా! అని అరచుచు తనను కృతార్థునిగా తలచి, స్నేహముతో కర్ణుని కౌగిలించుకొని, అంగదేశ రాజ్యాభిషేక జలముచేత తడిసిన కర్ణుని మస్తకమును, తన ఆనందాశ్రువులతో మరల అభిషేకించెను.

"జనమేజయా! అప్పుడు అధిరథుని చూచి భీమసేనుడు, 'కర్ణుడు సూతపుత్రు'డని తెలిసికొని నవ్వుచు కర్ణునితో "అరే! సూతపుత్రా! నీవు అర్జునుని చేత చచ్చుటకుగూడ తగవు. నేను త్వరగానే చబుకు (చర్మకోల) తీసికొనవలెను. ఎందుకనగా, ఇదియే నీ కులమునకు తగినది. యజ్ఞములో అగ్నిసమీపమునందుంచబడిన 'పురోడాశము'(యజ్ఞముకొరకు ఉంచబడిన రొట్టెవంటి అపూపము లేక-సోమ

రసము లేక-హోమశేష హవిస్సు) కుక్క పొందజాలనట్లే నీవు గూడ అంగదేశ రాజ్యమును భరించుటకు యోగ్యుడవు కావు" అని యనెను.

"జనమేజయా! భీమసేను డిట్లనగా, క్రోధముతో కర్ణుని పెదవులు అదిరి, యతడు దీర్ఘముగా, నిట్టూర్చి, ఆకాశ మండలము నందున్న సూర్యభగవానుని వైపు చూచెను. అప్పుడే దుర్యోధనుడు కుపితుడై మదోన్మత్త గజరాజువలె, భ్రాతృసమూహ మనెడు కమలవనము నుండి యెగిరి యీవలకువచ్చి, అక్కడ నిలిచియున్న భీమ కర్ముడైన భీమసేనునితో నిట్లనెను:-

"వృకోదరా! నీ విట్లన గూడదు. క్షత్రియులలో బలమునకే ప్రాధాన్యము గలదు. బలవంతుడైన క్షత్రియుడు, 'క్షత్రబంధువు' (హీన క్షత్రియుడు)తోను యుద్ధము చేయవలెను. లేదా! క్షత్రియుడనైన నాకు కర్ణుడు మిత్రుడగుటచేత, ఇతనితో నీవు యుద్ధము చేయవలెను. వీరుల యొక్క, నదుల యొక్కయు వాస్తవమైన ఉత్పత్తికారణము తెలిసికొనుట అసాధ్యము.

సమస్త చరాచర ప్రపంచమునందు వ్యాపించియున్న తేజస్వియైన అగ్ని జలము నుండి జన్మించెను. రాక్షసులను సంహరించు వజ్రాయుధము, దధీచి మహర్షి యెముకచేత నిర్మింపబడెను. సర్వగుహ్య స్వరూపుడైన కుమారస్వామి 'అగ్ని - కృత్తికా-రుద్ర-గంగలకు పుత్రుడని విన్నాను. ఎందరో బ్రాహ్మణులు క్షత్రియులనుండి పుట్టినారు. వారిపేర్లు నీవు గూడ విని యుందువు. విశ్వామిత్రాది క్షత్రియులుగూడ అక్షయమైన బ్రాహ్మణత్వమును పొందిరి. సర్వధనుర్ధరులలో శ్రేష్ఠుడైన మన యాచార్య ద్రోణుడు కడవనుండి పుట్టెను. గౌతమ మహర్షి కులోత్పన్నుడైన కృపాచార్యుని జన్మము రెల్లుగడ్డినుండి కలిగెను. మీ సోదరుల జన్మమునుగూర్చిగూడ నాకు బాగా తెలియును.

సర్వశుభ లక్షణ శోభితుడై, సహజ కవచకుండలములతో పుట్టి, సూర్య సమాన తేజస్సు గల కర్ణుడు, సూతజాతి స్త్రీకి పుత్రు డెట్లగును? ఒక జింక, వ్యాఘ్రమును కనునా? సమస్త క్షత్రియ గుణసంపన్నుడై, యుద్ధరంగమును శోభిల్ల జేయుచు, సూర్యసదృశ తేజశ్శాలియైన వీరుని, సూతజాతి పురుష డెట్లు కనగలడు? కనుక, కర్ణరాజు, తన బాహుబలముచేత, నా వంటి మిత్రుని సహాయము

చేతను, ఒక అంగదేశమునకు మాత్రమే కాదు, సమస్తభూమండల రాజ్యాధికారమునకు గూడ అర్హుడు. ఈ నా ప్రవర్తనము సహించని మనుష్యుడు, రథమెక్కి, పాదములతో ధనుస్సును వంచి, మాతో యుద్ధము చేయుటకు సంసిద్ధుడగుగాక!"

"జనమేజయా! యిట్లు దుర్యోధనుడనగా విని, రంగస్థలమంతట నున్నవారు దుర్యోధనుని, సాధువాదములతో ప్రశంసించిరి. అప్పుడు యుద్ధము సంభవించ వచ్చునని హాహాకారము రేగెను. ఇంతలోనే సూర్యుడు అస్తమించెను. అప్పుడు దుర్యోధనుడు, కర్ణుని హస్తాగ్రము పట్టుకొని దివిటీ వెలుగుతో, రంగభూమి నుండి బయటకు పోయెను.

"జనమేజయా! పాండవులు, ద్రోణ - కృప - భీష్ములున్ను తమ నివాసస్థానములకు పోయిరి. అప్పుడు ప్రేక్షకులలో, కొందరు అర్జునుని, కర్ణుని కొందరు, దుర్యోధనుని కొందరు ప్రశంసించుచు వెడలిపోయిరి. దివ్య లక్షణలక్షితుడైన తన పుత్రుడు కర్ణుడు అంగరాజగుట చూచి, కుంతీదేవికి చాల సంతోషము కలిగెను కాని, అది యితరులకు తెలియలేదు. అప్పుడు దుర్యోధనుడు, కర్ణుని మిత్రునిగా బడసి, అర్జునునివలన గలుగబోవు భయమునుండి విముక్తుడయ్యెను.

"జనమేజయా! వీరాగ్రేసరుడైన కర్ణుడు, శస్త్రాస్త్ర విద్యాభ్యాసమునందు మిక్కిలి పరిశ్రమ చేసి యుండెను. అతడు దుర్యోధనునితో మిక్కిలి స్నేహపూర్వకముగా అతనికి మనశ్శాంతి గలుగునట్లు మాట్లాడుచుండెను. అప్పుడు యుధిష్ఠిరునకుగూడ, 'ఈ భూమండలమునందు కర్ణునితో సమానుడైన ధనుర్ధరుడెవడు గూడ లేడు' అను విశ్వాసము కలిగెను."

**ద్రోణుడు శిష్యులతో ద్రుపదునిపై ఆక్రమణము చేయించుట - అర్జునుడు ద్రుపదుని బంధించి తెచ్చుట - ద్రోణుడు ద్రుపదునకు అర్ధరాజ్యమిచ్చి విముక్తుణ్ణి జేయుట :-**

"జనమేజయా! పాండవ - కౌరవులు అస్త్రవిద్యానిపుణులగుట చూచి, ద్రోణాచార్యుడు గురుదక్షిణ తీసికొనుటకు సమయము వచ్చినదని తెలిసికొని ఒక నిశ్చయమునకు వచ్చి శిష్యులను పిలిచి వారితో నిట్లనెను:-

"శిష్యులారా! పాంచాల రాజు ద్రుపదుని బంధించి నా యొద్దకు తీసికొని రండు. ఇదియే నాకు మీరు ఇచ్చు సర్వశ్రేష్ఠమైన గురుదక్షిణ కాగలదు." ఆమాట విని రాజకుమారు లందరున్ను యుద్ధసన్నద్ధులై ఆచార్య ద్రోణునితోపాటే బయలు దేరి పోయిరి. తరువాత, దుర్యోధన - కర్ణ - యయుత్సు - దుశ్శాసన - వికర్ణ జలసంధ - సులోచనాదులు, ఇతర రాజకుమారులనేకులున్ను, 'నేను ముందు - నేనుముందు' అని అహమహమికతో పోయి పాంచాల దేశము చేరిరి. అక్కడి వారిని కొట్టుచు, చంపుచు, ద్రుపద రాజధానిని మర్దింప జొచ్చిరి.

"జనమేజయా! తరువాత రాజకుమారులు రథస్థులై, అశ్వికులతోపాటు నగరములో ప్రవేశించి, రాజమార్గములో పోవునప్పుడు, ద్రుపదుడు కౌరవుల యాక్రమణమును గూర్చి విని, విశాలమైన కౌరవసేనను చూచి, మిక్కిలి త్వరగా, తన సోదరులు తానున్ను రాజభవనమునుండి బయలు వెడల, బాణవర్షము కురియుచు గర్జిల్లుచుండిరి. యుద్ధములో ద్రుపదరాజును జయించుట చాల కఠిన ముగా నుండెను. అతడు రథముపై వచ్చి కౌరవుల నెదిరించి బాణములు ప్రయోగించెను.

"జనమేజయా! కౌరవులకు, ఇతర రాజకుమారులకున్ను తమ బల పరాక్రమములపై చాల పొగరుండెను. గనుక, అర్జునుడు తొలుతనే బాగుగా యోచించి, ఆచార్య ద్రోణునితో నిట్లనెను :-"

"గురుదేవా! ఇతడు తన పరాక్రమము చూపిన తరువాత, మనము యుద్ధము చేయుదము. మనవారు యుద్ధములో పాంచాల రాజును బంధింప జాలరని నా విశ్వాసము."

"జనమేజయా! యిట్లు చెప్పి అర్జునుడు, తన సోదరులతో, నగరమునకు సగము కోసుదూర మందే నిలిచి యుండెను."

"జనమేజయా! ద్రుపదుడు కౌరవులను చూచి, వారిపై అన్నివైపుల నుండి దాడి చేసి, బాణముల వలనే వారిని ఆచ్ఛాదించి కౌరవ సేనను మూర్ఛ పడగొట్టెను. ద్రుపదు డొక్కడే బాణవర్షము కురియుచున్నప్పటికిన్ని, అతడనేక ద్రుపదులుగా నున్నట్లు కౌరవులు భయముచేత తలచిరి. ద్రుపదుని భయంకర

బాణవర్షములు అన్నిదిక్కుల వ్యాపించెను. అతనికి విజయము కలుగుచుండుట చూచి, పాంచాలుర యిండ్లనుండి, శంఖ- భేరీ - మృదంగాది ధ్వనులు అనేకములు వెడలెను. ఆత్మబల సంపన్నులైన పాంచాల సైనికుల సింహనాదములు బిగ్గరగా విన వచ్చెను. దానితోపాటే, వారి ధనుష్టంకార ధ్వనులు నలువైపుల మారుమ్రోగెను."

"జనమేజయా! ద్రుపదుడు, దుశ్శాసనుని పది, వికర్ణుని ఇరువది, శకునిని ముప్పది - బాణములతో కొట్టి గాయపరచెను. తరువాత ద్రుపదుడు, కర్ణ - దుర్యోధనులను విడివిడిగా మర్మభేదులైన యిరువది యెనిమిది బాణముల చొప్పన కొట్టెను. సుబాహువును అయిదు బాణములతో గాయపరచి, యితర యోధులను అనేక బాణములతో కొట్టెను. తరువాత ద్రుపదరాజు బిగ్గరగా సింహనాదము చేసి, శత్రువుల ధనుస్సులను, రథములను, అశ్వములను, ధ్వజములనున్ను ఖండించెను. తరువాత పాంచాల సైనికులందరు, సింహగర్జనము చేసిరి. అందరున్ను కౌరవ సైనికులపైబడి, వర్షించు మేఘములవలె, ముసలాయుధములు - దండములు కురిసిరి.

"జనమేజయా! అప్పుడు పాంచాల పురవాసులు ఆబాలగోపాలము కౌరవులను ఎదిరించిరి. అక్కడ దొమ్మియుద్ధము జరుగుచున్నదని, కౌరవు లక్కడ లేనట్టుగా, నే యయినదని, ద్రుపదరాజు బాణపు దెబ్బలచేత కర్ణుడు పూర్తిగా క్షతగాత్రుడైనాడని, కర్ణుడు భయడి రథమునుండి దుమికి పారిపోయెనని, కౌరవ సైనికులు మొరపెట్టుకొనుచు, అరచుచు తమ వైపు పరుగెత్తి వచ్చుచున్నారనియు విని పాండవులు, పీడిత సైనికుల యార్తధ్వని వినగానే, ఆచార్య ద్రోణునకు నమస్కరించి రథములపై శీఘ్రముగా బయలుదేరి పోయిరి. అర్జునుడు యుధిష్ఠిరునితో 'యుద్ధము చేయవద్దు' అని చెప్పి అతనిని ఆపెను.

"జనమేజయా! అప్పుడు, అర్జునుడు నకుల-సహదేవులను తన రథచక్ర రక్షకులనుగా చేసికొనెను, భీమసేనుడు గదాధారియై సేనాగ్రభాగమునందు పోవుచుండెను. అర్జునుడు శత్రువుల సింహనాదము విని, మిక్కిలి వేగముగా దిక్కులు ప్రతిధ్వనింప జేయుచు ముందుకు సాగిపోయెను.

"జనమేజయా! పాంచాలసేన ఉత్తుంగతరంగములతో క్షోభిల్లు మహా సాగరమువలె గర్జిల్లుచుండెను. భీమసేనుడు దండపాణియైన యమునివలె ఆమహాసేనలో మకరము సముద్రములోవలె దూరెను. అతడు గదాపాణియై గజసేనపై బడెను. అతడు యుద్ధకుశలుడే కాక, అసమానబలపరాక్రమ సంపన్నుడు. అతడు యమునిరూపము ధరించి, గదాప్రహారముల చేత గజసేనను సంహరించు చుండెను. పర్వతములవలె మహాకాయములు గల గజములు, భీముని గదా ఘాతములచేత తలలు పగిలి, నెత్తురు గారు చుండగా, వజ్రాయుధపుదెబ్బల చేత రెక్కలు తెగిన పర్వతములవలె నేలపై పడుచుండెను. భీమసేనుడు గజాశ్వ రథములను నేల గూల్చుచుండెను. పదాతిదళములను, రథికులను, వధించెను. గోపాలుడు వనమునందు దండముతో పశువులను తోలుచున్నట్లే, భీమసేనుడు రథికులను, గజములను తరుము చుండెను.

"జనమేజయా! అప్పుడు ద్రోణాచార్యునకు ప్రియము చేయ బూనిన అర్జునుడు, ద్రుపదునిపై బాణములు గురియుచు దాడి చేసెను. అతడు చతురంగ సైన్యములను అన్నివైపుల నుండి సంహరించుచు ప్రళయకాలాగ్నివలె ప్రకాశించు చుండెను. అప్పుడు సంహరింపబడు చున్న పాంచాల సైనికులు వివిధబాణములు గురియుచు అర్జునుని అన్నివైపుల అచ్ఛాదించి, సింహనాదము చేయుచు నతనిని పీడింప జొచ్చిరి. ఆ యుద్ధము మిక్కిలి అద్భుతముగాను, భయంకరముగాను నుండెను.

"జనమేజయా! శత్రువుల సింహనాదము విని అర్జునుడు సహించజాలక, బాణములు గురియుచు పాంచాలురను కప్పి, వారిని మోహింపజేయుచు హఠాత్తుగా ఆక్రమణము చేసెను. అర్జునుడు మిక్కిలి లాఘవముతో, క్రొత్త - క్రొత్త బాణములు విడుచు చుండెను. అతని బాణ సంధాన ప్రయోగములలో అంతరము కనపడకుండెను. అర్జునుడు బాణములచేత అంతటను అంధకారము వ్యాపింపజేయుట వలన, దిక్కులు, ఆకాశము, భూమి ఏదియు కనపడ కుండెను. అప్పుడు పాండవుల సేనలో అర్జునుని ప్రశంసించుచు సింహనాదములు బయలు వెడలెను.

"జనమేజయా! ద్రుపదరాజు, తన సోదరుడు సత్యజిత్తుతో పాటు అర్జునునిపై, శంబరాసురుడు ఇంద్రునిపై దాడి చేసినట్లు, ఆక్రమణము చేసెను,

కాని, అర్జునుడు బాణములతో ద్రుపదుని ఆచ్ఛాదించెను. తరువాత సింహము గజయూథపతిని చీల్చుటకు ప్రయత్నించునట్లు, అర్జునుడు ద్రుపదుని పట్టుకొనుటకు పూనుచుండగా పాంచాలసేనలో హాహాకారము బయలుదేరెను.

"జనమేజయా! అప్పుడు, అర్జునుడు ద్రుపదుని పట్టుకొనుటకు వచ్చుచుండగా సత్యజిత్తు ద్రుపదరక్షణార్థమై, అర్జునునిపై దాడి చేసెను. తరువాత, అర్జున - సత్యజిత్తులు ఒండొరులు నెదుర్కొని యుద్ధము చేయుచు సేనలను క్షోభిల్లజేసిరి. అర్జునుడు పది బాణములతో సత్యజిత్తును కొట్టి గాయపరచెను. తరువాత సత్యజిత్తు గూడ నూరు బాణములతో అర్జునుని కొట్టి బాధించెను. అప్పుడు అర్జునుడు సత్యజిత్తుపై బాణములు గురిసి, అతని ధనుస్సు ఖండించి, ద్రుపదునిపై దాడిచేసెను. అప్పుడు సత్యజిత్తు మరియొక ధనుస్సు తీసికొని, అర్జునుని రథాశ్వ సారథులను కొట్టి, అర్జునుని గూడ కొట్టెను. అట్లు సత్యజిత్తు చేత పీడితుడైన అర్జునుడు అతని పరాక్రమమును సహింపజాలక, అతని వినాశము కొరకు బాణపరంపర ప్రయోగించెను.

"జనమేజయా! అప్పుడు అర్జునుడు సత్యజిత్తు యొక్క అశ్వ - ధ్వజ - ధనుస్ - పార్శ్వ రక్షక - సారథులను నష్టపరచెను. ఈ విధముగ పలుసార్లు ధనుస్సు ఖండింపబడి అశ్వములు చంపబడుటచేత సత్యజిత్తు యుద్ధభూమి నుండి పారిపోయెను. తరువాత ద్రుపదరాజు అర్జునునిపై బాణములు కురియ జొచ్చెను. ఆ యిరువురకు గొప్ప యుద్ధము జరిగెను. అర్జునుడు ద్రుపదుని ధనుస్సు ఖండించి ధ్వజము నేల గూల్చి ఐదు బాణములతో అతని సారథిని, అశ్వములనున్ను గాయపరచెను.

"జనమేజయా! తరువాత ద్రుపదుడు మరియొక ధనుస్సు తీసికొనుచున్నప్పుడు అర్జునుడు ఒరనుండి కత్తి తీసి సింహగర్జనము చేయుచు ద్రుపదుని రథము యొక్క నొగలపై దుమికి రథ మెక్కి గరుడుడు, సముద్రమును క్షోభిల్ల జేసి సర్పమును పట్టుకొన్నట్లే, నిర్భయముగ ద్రుపదుని పట్టుకొనెను. అప్పుడు పాంచాల సైనికులు భయపడి దశదిశలకు పారిపోయిరి. అర్జునుడు సింహనాదము చేసెను. అర్జునుడట్లు వచ్చుచుండుట చూచి, రాజకుమారులందరు ద్రుపదనగరమును ధ్వంసముచేసిరి.

"జనమేజయా ! అప్పుడు అర్జునుడు భీమునితో, సోదరా ! ద్రుపదరాజు కౌరవ వీరులకు సంబంధి కనుక, అతని సేనను చంపకుము. ద్రోణునకు గురు దక్షిణ యిచ్చుటకు ద్రుపదుని మాత్రమే పట్టుకొనుము అని యనెను.

"జనమేజయా ! అర్జునుడట్లు చెప్పినప్పుడు భీముడు యుద్ధము నందు తృప్తి దీర కున్నను యుద్ధము మానుకొనెను. అర్జునుడు ద్రుపదుని మంత్రి సహితునిగా యుద్ధభూమి యందు బంధించి తెచ్చి ద్రోణాచార్యునకు కానుకగా నిచ్చెను. ద్రుపదుని యభిమానము నశించెను. అతని ధనము లాగికొన బడెను. అతడు పూర్తిగా వశపడెను. అప్పుడు ద్రోణాచార్యుడు పూర్వవైరమును స్మరించి ద్రుపదునితో నిట్లనెను.

"రాజా! నేను బలాత్కారముగ నీ రాష్ట్రమును మర్దించితిని. నీ రాజధానిని మంట గలిపితిని. ఇప్పుడు నీవు శత్రువునకు వశుడవై ప్రాణములు బిగబట్టుకొని యిక్కడకు వచ్చితివి. ఇక నిప్పుడు చెప్పుము పూర్వపు మైత్రిని కోరెదవా?"

"జనమేజయా! ఇట్లు చెప్పి ద్రోణాచార్యుడు మందహాసము చేసి మరల ద్రుపదునితో నిట్లనెను :-

"వీరవరా! ప్రాణములకు సంకటావస్థ వచ్చిన దని భయపడకుము. మేము క్షమాశీలురమైన బ్రాహ్మణులము. నీవు బాల్యమునందు నాతోపాటు ఆశ్రమము నందు ఆడుకొని నందుచేత నీపై నాకు మిక్కిలి స్నేహము, ప్రేమ పెరిగినది. నేను మరల నీతో మైత్రి చేయ గోరుచున్నాను. నీకు వర మిచ్చుచున్నాను. నీవు ఈ రాజ్యములో అర్ధభాగము నా నుండి తీసికొనుము. 'రాజు కానివాడు' రాజునకు మిత్రుడు, కాజాలడు అని నీవు అని యుంటివి. కనుక, నేను నీ రాజ్యము తీసికొనుటకు ప్రయత్నించితిని. గంగకు దక్షిణ వైపున నున్న దేశమునకు నీవు రాజువు. ఉత్తరపు భూభాగమునకు నేను రాజును. ఇక ఇప్పుడు నీకు సముచిత మని తోచిన యెడల నన్ను మిత్రునిగా తలచుము".

"జనమేజయా! ఆ మాటకు ద్రుపదుడు ఇట్లనెను :-

"బ్రహ్మన్ నీ వంటి పరాక్రమవంతులైన మహాత్ములకు ఇట్టి ఔదార్య ముండుటలో ఆశ్చర్యము లేదు. నేను నీ యెడల మిక్కిలి ప్రసన్నుడ నైతిని. నీతో ఎల్లప్పుడు స్థిరముగా నిలుచు మైత్రిని, ప్రేమను కోరు చున్నాను.

"జనమేజయా! ద్రుపదుడు ఇట్లనగా, ద్రోణాచార్యుడు అతనిని బంధ విముక్తునిజేసి ఆదరించి, అతనికి అర్ధరాజ్య మిచ్చెను. తరువాత ద్రుపదుడు దైన్యముతో గంగాతీరము నందలి యనేక దేశములతో గూడిన 'మాకంద' పురమునందు, నగర శ్రేష్ఠమైన 'కాంపిల్య' నగరమునందున్న నివసించుచు, 'చర్మణ్వతీ' నదికి దక్షిణతీరమం దున్న పాంచాల దేశమును పాలింపదొడ్గెను. ఈ విధముగ ద్రోణాచార్యుడు ద్రుపదుని ఓడించి మరల రక్షించెను.

"జనమేజయా! ద్రోణాచార్యుని క్షాత్రబలముచేత జయించుట అసాధ్య మని ద్రుపదరాజు బ్రాహ్మణ బలముకంటె తనకు హీనబలము గలదు. అని తెలిసికొని ద్రోణాచార్యుని ఓడించుటకు శక్తివంతుడైన పుత్రుని పొందగోరి భూమండలమునందు సంచరింప జొచ్చెను. ద్రోణాచార్యుడు ఉత్తర పాంచాలము లందున్న 'అహిచ్ఛత్ర' నామముగల రాజ్యమును తన యధికారములోకి తీసి కొనెను. ఈ విధముగ అనేక జనపద సంపన్నమైన అహిచ్ఛత్రనగరమును అర్జునుడు యుద్ధములో జయించి, ద్రోణాచార్యునకు గురుదక్షిణగా నిచ్చెను."

**యుధిష్ఠిరుని యౌవరాజ్యాభిషేకము — పాండవుల అధికబలపరాక్రమ యశస్సులకు ధృతరాష్ట్రుడు చింతించుట :-**

"జనమేజయా! అట్లు ఒక సంవత్సరము గడచిన తర్వాత ధృతరాష్ట్రుడు యుధిష్ఠిరునకుగల ధైర్య- స్థైర్య - క్షమా-దయాళుత్వ - సరళత్వ-అచంచల సౌహార్దాది సద్గుణములవలన నతడు ప్రజాపాలనమునకు యోగ్యుడని, యుధిష్ఠిరుని యువరాజపదమునందు అభిషిక్తుని జేసెను. తరువాత కొలది దినములలోనే యుధిష్ఠిరుడు తన యుత్తమ స్వభావము చేత, సత్ప్రవర్తన సద్వ్యవహారముల చేత, నిష్ఠతో ప్రజాపాలనము చేయుటయందు గల ప్రవృత్తి చేతను తన తండ్రి పాండు మహారాజు కీర్తినిగూడ కప్పిపుచ్చునంతటి కీర్తి సంపాదించెను.

"జనమేజయా ! భీమసేనుడు ప్రతినిత్యము బలరాముని నుండి ఖడ్గ - గదా - రథ యుద్ధములను అభ్యసించెను. తరువాత బలమునందు ద్యుమత్సేన మహారాజుతో సమానుడై మహాపరాక్రమ సంపన్నుడై సోదరులకు అనుకూలు డుగా నుండెను.

"జనమేజయా! అర్జునుడు ధనుర్ధారణములో హస్తలాఘవములో లక్ష్య బేధనములోను మిక్కిలి చతురుడుగా నుండెను. అతడు [1]క్షుర - [2]నారాచ - [3]భల్ల - [4]విషాఠ నామకములైన ఋజు - వక్ర - విశాల*, శస్త్రముల సంచాలనము నందలి రహస్యమును బాగుగా తెలిసికొని, వానిని అమోఘముగా ప్రయోగించు చుండెను. కనుక లాఘవములో సౌష్ఠవమునందును అర్జున సమానుడు మరియొక యోధుడు లేడని ద్రోణాచార్యునకు దృఢవిశ్వాసము కలిగెను. ఒకనాడు ద్రోణుడు కౌరవుల నిండుసభలో గుడాకేశు (నిద్రను జయించిన వాడు) డైనయర్జునునితో నిట్లనెను.

"వత్సా! నా గురువు, 'అగ్నివేశుడు'అను సుప్రసిద్ధ మహర్షి యున్నాడు. అతడు పూర్వము అగస్త్యుని కడ ధనుర్వేదము నభ్యసించెను. నేను నా యేకైక గురువైన అగ్నివేశుని నుండి గ్రహించి యితర యోగ్యశిష్యులకు ఇచ్చు నుద్దేశముతో నీకు ఈ బ్రహ్మశిరము అనునస్త్రము నిచ్చితిని. దీనిని నేను మహా తపస్సు చేత సంపాదించితిని. ఈ యమోఘాస్త్రము వజ్రమువలె ప్రకాశించును దీనికి సమస్త భూమండలమును భస్మము చేయశక్తి కలదు.

వాకు, ఈ యస్త్రము నిచ్చు నప్పుడు నా గురువు అగ్నివేశమహాముని, నాతో "భారద్వాజా! నీ యస్త్రమును మనుష్యులపై ప్రయోగింపకుము. మనుష్యేతర ప్రాణులలో గూడ అల్ప వీర్యులపై ప్రయోగింపకుము అని చెప్పి యుండెను. అర్జునా! ఈ దివ్యాస్త్రము నా నుండి నీకు లభించెను. ఇతరులెవ్వరు

1. పదునైన అంచుగలిగి మంగలి కత్తివలె ఉన్న బాణము క్షురము అనబడును.
2. అగ్రభాగము తీక్ష్ణముగా నుండి నిటారుగా నున్న బాణము 'నారాచము' అనబడును.
3. కొనభాగము వెనుక భాగమున్న వెడల్పుగా నుండి కొన పదునుగా నున్నబాణము 'భల్లము' అనబడును.
4. గుద్దలి వంటి ఆకృతిగల బాణము 'విషాఠము' అనబడును అది యితర బాణముల కంటె పెద్దదిగా నుండును.*

పైన చెప్పబడిన బాణములలో 'క్షురము - నారాచము' అనునవి వంకర లేక చక్కగా నుండును. భల్లము వంకరగా నుండును. విషాఠము విశాలముగా నుండును.

గూడ దీనిని పొందజాలరు. ఈ యస్త్రమును ప్రయోగించు విషయములో అగ్ని వేశమహాముని నాకు తెలిపిన నియమములను నీవు గూడ పాటించవలెను. ఇప్పుడు నా సోదరులు బంధువుల సమక్షములోనే నీవు నా కొక గురుదక్షిణ యిమ్ము!"

"ఆ మాట విని అర్జునుడు 'తప్పక గురుదక్షిణ ఇచ్చెద'నని ప్రతిజ్ఞ చేసెను. అది విని గురువు, 'ఒకవేళ యుద్ధములో నేను గూడ నీతో పోరాడుటకు వచ్చినచో నీవు తప్పక నన్ను ఎదురించ వలెను' అని కోరెను. ఆ మాటకు అర్జునుడు 'చాల మంచిది' అని ప్రతిజ్ఞ చేసి గురువునకు నమస్కరించి, గురువు నుండి సర్వోత్తమ మైన యుపదేశమును పొందెను. సముద్ర పర్యంత భూమండలము నందు, అన్ని దిక్కుల, 'ప్రపంచములో అర్జునునితో సమానుడైన ధనుర్ధరుడు మరియొకడు లేడు' అను ఖ్యాతి వ్యాపించెను."

"అర్జునుడు గదా-ఖడ్గ-రథ-ధనుర్యుద్ధ కళలలో పారంగతు డాయెను. సహదేవుడు ద్రోణుడుగా నవతరించిన దేవగురువైన బృహస్పతి నుండి నీతిశాస్త్రమును నేర్చి మహానీతి కోవిదు డై, సోదరుల యధీనములో అనుకూలుడుగా నుండెను. నకులుడు గూడ ద్రోణుని నుండియే శస్త్రాస్త్ర విద్య నేర్చెను. అతడు తన సోదరులకు మిక్కిలి ప్రియుడుగా నుండెను. విచిత్ర యుద్ధము చేయుటలో నకులుడు ప్రసిద్ధుడై అతిరథవీరు డని చెప్పబడెను."

"జనమేజయా! సౌవీరదేశరాజు, గంధర్వులు ఉపద్రవములు చేసినప్పటికిన్ని మూడు సంవత్సరముల వరకు ఏలాటి విఘ్నములు, బాధలు లేకుండ నిరంతరము యజ్ఞములను అనుష్ఠించెను. ఆ రాజు భారత యుద్ధము నందు అర్జునాది పాండవులచేత సంహరింపబడెను. పాండురాజు గూడ జయింపజాలని ఆ యవనదేశ (గ్రీకు) రాజును గూడ అర్జునుడు ఇప్పుడు జయించి వశపరచు కొనెను.

"జనమేజయా! అత్యంతబలశాలి, కౌరవులయెడల సర్వదా అభిమానము గలవాడు. ఉద్దండుడు నైన 'విపులుడు' అను సౌవీర దేశరాజు గూడ భారత యుద్ధములో అర్జునిచేత సంహరింపబడెను. అట్టిరాజును, యుద్ధమునందు దృఢసంకల్పముగల 'దత్తామిత్రుడు' అను ప్రసిద్ధిగల సౌవీరదేశవాసి యైన సుమిత్రుడు అనురాజునుగూడ అర్జునుడు జయించెను.

"జనమేజయా! అర్జునుడు వీరినేకాక కేవలము భీముని మాత్రము సహాయముగా గొని రథారూఢుడై యుద్ధమునందు పూర్వదిక్కునందలి సమస్త యోధులను మరియు పదివేల రథికులను గూడ జయించెను. అట్లే అర్జునుడు ఏకరథ మాత్రసహాయుడై యుద్ధయాత్ర చేసి దక్షిణదిక్కు నందలి రాజుల నందరిని జయించి తన 'ధనంజయ నామము సార్థకము చేయుచు కురురాజధానికి ధనరాసులు తెచ్చెను.

"జనమేజయా! ఈవిధముగానే మహాత్ములైన పాండవులు ఇతర రాష్ట్రములను జయించి తమరాష్ట్రమును అభివృద్ధిపరిచిరి.

"జనమేజయా! అప్పుడు మహాధనుర్ధరులైన పాండవుల యొక్క అతి ప్రసిద్ధ బల పరాక్రమములను గూర్చి తెలిసికొనిన ధృతరాష్ట్రుని భావము పాండవుల యెడల దూషితమై చాలచింతతో మునిగియుండుటచేత అతనికి రాత్రి నిద్ర రాకుండెను.

**కణికుడు ధృతరాష్ట్రునకు కూటనీతిని ఉపదేశించుట :**

"జనమేజయా! పాండుపుత్రులు తేజస్వులు, బలాధికులునని విని ధృతరాష్ట్రుడు వ్యాకులుడై, మహాచింతా నిమగ్నుడయ్యెను. అప్పుడతడు, రాజనీతి అర్థశాస్త్రములోను పండితుడు, మంత్రాలోచన కోవిదుడు, మంత్రిశ్రేష్ఠుడునైన 'కణికుడు' అనువానిని పిలిచి యతనితో నిట్లనెను:-

"ద్విజోత్తమా! పాండవులకు దినదినము ఉన్నతి, ఖ్యాతియు కలుగుచున్నది. ఇందువలన నేను అసూయ చెందు చున్నాను. కణికా! నీవు ఈ విషయములో బాగుగా యోచించి ఒక నిశ్చయముతో, చెప్పుము. వారితో నేను సంధి చేసికొనవలెనా? లేక, విరోధమా? నీవు చెప్పినట్లు నడచుకొనెదను."

"జనమేజయా! ధృతరాష్ట్రు డట్లడుగగా, బ్రాహ్మణోత్తముడైన కణికుడు మనస్సులోనే మిక్కిలి ప్రసన్నుడై రాజనీతి సిద్ధాంతములను తెలుపునట్టి తీక్ష్ణ వచనముల నిట్లు చెప్ప దొడగెను:-

"రాజేంద్రా! నేను ఈ విషయములో చెప్పబోవు మాటలు విని నీవు నాపై దోషము చెప్పకుము. రాజు దండనము విధించుటకు ఎల్లప్పుడు నుద్యుక్తుడై ఉండి

పౌరుషమును ప్రకటించ వలెను. తన ఛిద్రమును, దుర్బలత్వమునున్ను ప్రకటించగూడదు. ఇతరుల ఛిద్రములను దౌర్బల్యములనున్ను సర్వదా గమనించుచు శత్రువులు దుర్బలులని తెలిసిన వెంటనే వారిపై ఆక్రమణము చేయవలెను.

•

"రాజా! సర్వదా దండనము విధించుటకు ఉద్యుక్తుడైన రాజునకు ప్రజలు మిక్కిలి భయపడెదరు. కనుక, అన్ని పనులు దండనముచేతనే సిద్ధింపజేసికొనవలెను. తన దౌర్బల్యమును శత్రువులు తెలిసికొనజాలకుండునట్లు జాగరూకుడై యుండి శత్రువుయొక్క దుర్బలత్వములు వెల్లడియైన యెడల అతనిపై దాడి చేయవలెను తాబేలు తన యంగములను రక్షించుకొనునట్లే రాజు తన యంగములను (రాజు - మంత్రి - రాష్ట్రము - దుర్గము - కోశము (ధనాగారము) బలము (సైన్యము) మిత్రులు ఈ యేడు రాజ్యాంగములు) రక్షించుకొని తన అశక్తిని కప్పి యుంచ వలెను. ఒక కార్యము ప్రారంభించినయెడల దానిని పూర్తిగా నెరవేర్చక ఎట్టి పరిస్థితిలోను విడువగూడదు. ఎందుకనగా, శరీరములో గ్రుచ్చుకొనిన ముల్లు సగము విరిగి మిగిలిన సగము లోపల ఇరికిన యెడల అది చాల దినములవరకు బాధ, క్లేశము కలిగించును.

"మహారాజా! తనకు అనిష్టము చేయు శత్రువులను వధించుటను నీతిశాస్త్రజ్ఞులు ప్రశంసించెదరు. అత్యంత పరాక్రమశాలియైన శత్రువును గూడ, అతడు ఆపదలో చిక్కుకొనినప్పుడు సులభముగా నశింప జేయవచ్చును. ఇట్లే యుద్ధకుశలుడైన శత్రువునుగూడ ఆపత్కాలములో అనాయాసముగా కొట్టి పారద్రోల వచ్చును. కనుక, ఆపత్తిలో చిక్కుకొనిన శత్రువును అవశ్యముగా సంహరింపవలెను. అట్టి సమయములో అతనితో తనకు గల సంబంధమునుగాని, మైత్రి మొదలైనవానిని గాని ఎప్పుడుగూడ విచారింప గూడదు. శత్రువు దుర్బలుడుగా నున్నప్పుడు గూడ అతనిని ఎట్టి పరిస్థితిలోను ఉపేక్షించ గూడదు. ఎందుకనగా, అగ్ని అల్పముగా నున్నను, దానికి ఇంధనము సహాయముగా లభించినపుడు వనమునంతయు అది దహించినట్లే అల్ప శత్రువు గూడ దుర్గము మొదలైన ప్రబలాశ్రయము సహాయముగా గొని వినాశకారి యగును. గ్రుడ్డివాడుగా నుండు సమయము వచ్చినప్పుడు అంధుడు కావలెను.-అనగా, తాను అశక్తుడుగా నున్నప్పుడు శత్రువు దోషములను కనిపెట్టుచు అప్పుడు ఇతరులు

అన్నివైపులనుండి తనను ధిక్కరించి, నిందించినను దానిని విననట్లుగా బధిరుడై యుండవలెను.

"రాజా! అట్టి సమయమునందు తన ధనుస్సును తృణమయ మని తలచవలెను - అనగా, తాను శత్రువు దృష్టిలో పూర్తిగా దీనుడు, హీనుడు, అసమర్థుడు ననుభావము కలిగించవలెను. కాని, 'మృగశాయిక' శయనించవలెను. అనగా, వ్యాధుడు నిద్రను నటించుచు మృగము తనను విశ్వసించి తనయొద్ద తిరుగుచున్నప్పుడు దానిని బాణముతో కొట్టునట్లే, శత్రువును కొట్టుటకు అవసరము చూచుచునే తన స్వరూపమును, మనోభావమును కప్పియుంచుకొని అసమర్థ పురుషునివలె వ్యవహరించవలెను. ఇది 'మృగశాయిక' యనబడును. ఇట్లు నటించి తన వశములో వచ్చిన శత్రువునకు సామాద్యుపాయములచేత విశ్వాసము కలిగించి యతనిని సంహరింప వలెను. 'ఇతడు నా శరణుజొచ్చెను' అని తలచి అతనిపై దయచూప గూడదు. శత్రువును చంపుటచేతనే. రాజు నిర్భయుడగును. శత్రువు చంపబడనిచో రాజునకు సర్వదా భయ ముండును.

"రాజా! సహజ శత్రువునకు, అతడు కోరిన వస్తువు లన్నియు నిచ్చి, అతనికి దానోపాయముచేత విశ్వాసము కలిగించి, యతనిని సంహరించవలెను. పూర్వము -అపకారము చేసిన శత్రువు, తరువాత సేవకు డైనచో అతనినికూడ ప్రాణములతో విడువగూడదు. శత్రు పక్షమునందలి [1]త్రివర్గము, [2]పంచవర్గము

1. 'మూడు విధము'లైన 'ప్రభుశక్తి (ఐశ్వర్యశక్తి) - ఉత్సాహశక్తి - మంత్రశక్తి' అను శక్తులే ఇక్కడ 'త్రివర్గ' మనబడును. దుర్గము మొదలైన వానిని ఆక్రమించి శత్రువు యొక్క ఐశ్వర్యశక్తి నష్టపరచవలెను. విశ్వసనీయ వ్యక్తుల ద్వారా తన ఉత్కర్షమును వర్ణింపజేసి శత్రువులను తేజోహీనునిగా చేయుట, అతని ఉత్సాహ - సాహసములను తగ్గింపజేయుటయే ఉత్సాహశక్తి నాశము చేయుట యగును. గూఢచారుల ద్వారా శత్రువు యొక్క రహస్య మంత్రాలోచనము ప్రకటింపజేయుటయే మంత్రశక్తి నాశమగును.
2. అమాత్యులు - రాష్ట్రము - దుర్గము - కోశము (ధనాగారము) - సైన్యము ఈ యైదు ప్రకృతులు 'పంచవర్గ' మనబడును.

[3]సప్తవర్గము పూర్తిగా నశింప జేయవలెను. అన్నిటికంటె మొదట శత్రు పక్షపు మూలమునే ఛేదించవలెను. తరువాత శత్రుపక్ష సహాయకులను శత్రు పక్షముతో సంబంధము గలవారి నందరి సంహరించవలెను.

"రాజా! మూలధారము నష్టమైనప్పుడు దాని నాశ్రయించి సేవించు శత్రువు లందరు నశించెదరు. వృక్షపు వేరు నలికబడి నప్పుడు దాని శాఖలు ఎట్లు ఉండగలవు. రాజు శత్రువు యొక్క ప్రవర్తనమును తెలిసికొనుటకు సర్వదా ఏకాగ్రచిత్తుడై యుండవలెను. తన రాజ్యము యొక్క అంగము లన్నియు గుప్తముగా నుంచ వలెను. సర్వదా తన శత్రువుయొక్క దుర్బలత్వము నందు దృష్టి యుంచి అతనిపట్ల జాగ్రత్తతో నుండవలెను."

"రాజా! అగ్నిహోత్రమును, యజ్ఞాదులున్ను చేసి కాషాయవస్త్రము, జటలు, మృగచర్మమున్ను ధరించి ప్రజలకు తొలుత తనయందు విశ్వాసము కలిగించి తరువాత సమయము కనిపెట్టి, తోడేలువలె శత్రువులపై బడి నశింప జేయవలెను. కార్యసిద్ధి కొరకు శౌచ - సదాచారాదులు పాలించుట ఒక విధమైన అంకుశమే! (లోకులను ఆకర్షించు సాధనము) అని చెప్పబడెను. పండ్లు నిండిన చెట్టుకొమ్మను తనవైపు వంచుకొనియే మనుష్యుడు పక్వములైన దాని పండ్లను త్రెంపికొనవలె కదా!"

"రాజా ! విద్వాంసులైన పురుషులు ఈ ప్రయత్నము లన్నియు అభీష్ట ఫలసిద్ధి కొరకే చేసెదరు. కాలము మారి తనకు అనుకూల మగువరకు శత్రువును భుజములపై మోయవలసినను మోయ వలెను. కాని, తనకు అనుకూల సమయము వచ్చినప్పుడు శత్రువును కుండను రాతిపై పగులగొట్టినట్లు నశింప జేయవలెను. శత్రువు అతి దీనముగా మాట్లాడినప్పటికిన్ని అతనిని ప్రాణములతో విడవ గూడదు. అతనిపై దయ జూప గూడదు. అపకారియైన శత్రువును చంపనే

3. 'సామ - దాన - భేద - దండ - ఉద్బంధన (ఉరి తీయుటకు బంధించి యుంచుట - విషప్రయోగ - అగ్ని దాహములన బడు ఏడున్ను శత్రువును వశపరచుటకు గాని, లేక, అణచుటకు గాని సాధనము లగును. ఇవియే 'సప్తవర్గ' మన బడును.

వలెను. 'సామ - దాన - భేద - దండ'ములు అను అన్ని యుపాయముల చేత శత్రువును చంపి నిర్మూలించవలెను."

"జనమేజయా ! ఈ విధముగ కణికుడు కూటనీతిని ధృతరాష్ట్రునకు చెప్పగా విని ధృతరాష్ట్రుడు కణికునితో, 'సామ - దాన - భేద - దండోపాయ' ములచేత శత్రునాశము ఎట్లు చేయబడ జాలును ? యథార్థముగా తెలుపుము. అని యడుగగా కణికుడు ధృతరాష్ట్రునితో 'మహారాజా ! ఈ విషయములో నీతి శాస్త్రతత్త్వ జ్ఞానము గల వనవాసియైన ఒక నక్క యొక్క ప్రాచీనమైన కథ చెప్పెద వినుము' అని ఆ కథ యిట్లు చెప్పదొడగెను -

"రాజా ! ఒక వనమునందు 'మహాబుద్ధిశాలి' స్వార్థసాధనమునందు కౌశలము గలదియు నగు నొకనక్క, 'వ్యాఘ్రము - ఎలుక - తోడేలు - ముంగిస ఈ నలుగురు మిత్రులతో నివసించు చుండెను. ఒకనాడు అవి యన్నియు, నొక జింకల నాయకుని చూచెను. అది మిక్కిలి బలము గలదిగా నుండెను. ఈ నలుగురు మిత్రులు ఆ జింకల యూథపతిని పట్టుకొన జాలకుండిరి. కనుక, అవి యన్నియు కలిసి యిట్లు ఆలోచించినవి :

రాజా! అప్పుడు నక్క యిట్లనెను :- "సోదరా వ్యాఘ్రమా! నీవీ హరిణమును చంపుటకు అనేక పర్యాయములు ప్రయత్నించితివి. కాని, ఇది అతివేగముగా పరుగెత్తునది, యువావస్థలో నున్నది. బుద్ధి గలదియు నగుటచేత పట్టుబడలేదు. కనుక, ఇది నిద్రించినప్పుడు ఈ యెలుక దాని రెండుపాదములను కొరకవలెను. తెగిన పాదములతో ఇది ఎక్కువ త్వరగా పరుగెత్త జాలదు. అట్టి పరిస్థితిలో వ్యాఘ్రము దానిని పట్టుకొని చంపును. అప్పుడు మనమందరము సంతోషముతో దానిని తినుదము".

"రాజా! యిట్లు నక్క చెప్పిన మాట విని, అన్ని జంతువులు జాగ్రత్తతో అట్లే చేసెను. ఎలుక కొరకగా, తెగిన పాదములతో కుంటుచున్న జింకను వ్యాఘ్రము వెంటనే చంపెను. నేలపై కదలక మెదలక పడియున్న హరిణశరీరమును చూచి, నక్క 'మీ రందరు స్నానము చేసి రండు అంతదాక ఈ మృగ శరీరమును నేను కాపాడు చుండెదను'- అని చెప్పెను.

"రాజా! తరువాత నక్కమాట ప్రకారమే వ్యాఘ్రాదులు స్నానార్థమై నదికి పోయెను. నక్క చింతతో అక్కడనే యుండెను. ఇంతలోనే మహాబలము గల వ్యాఘ్రము స్నానముచేసి అన్నిటికంటె, మొదటనే అక్కడకు వచ్చి నక్క చింతావ్యాకులయై యుండుట చూచి, 'మిత్రమా! ఎందుకు చింతించు చున్నావు? మా యందరికంటె నీవే మహాబుద్ధిశాలివి గదా! నేడు మనమందరము ఈ హరిణ మాంసము తిని యిక్కడ విహరించెదము' అని యనెను. ఆ మాటకు నక్క యిట్లనెను."

"బాహుబలశాలీ! ఎలుక నీ విషయమై, 'మృగరాజు వ్యాఘ్రముయొక్క బలమునకు ధిక్కారమగు గాక! నేడు ఈ మృగమును నేనే కదా చంపితిని. నా బాహుబలముచేత నేడు వ్యాఘ్రము తన ఆకలి తీర్చుకొనుచున్నది' అని యనెను. మిత్రమా! ఈవిధముగ గర్జించుచు పొగరుతో ఎలుక అనెను. కనుక, దాని సహాయముచేత ప్రాప్తించిన యీ భోజనము నీవు గ్రహించుట నాకు మంచి దనిపించుట లేదు;

రాజా! ఆ మాటకు వ్యాఘ్ర మిట్లనెను :-

"మిత్రమా! యిట్లు చెప్పి, ఎలుక నేడు నా కన్నులు తెరిపించి నన్ను జాగరూకుని చేసెను. నేటినుండి నేను నా బాహుబలము చేతనే వనజంతువులను వధించుచు వాని మాంసమును తినెదను."

"రాజా! యిట్లు చెప్పి వ్యాఘ్రము వనమునకు పోయెను. అప్పుడే ఎలుక గూడ స్నానము చేసి అక్కడకు రాగా, దానితో నక్క యిట్లనెను:-

"సోదరా! ముంగిస, 'వ్యాఘ్రము ఖండించుట చేత ఈ హరిణ మాంసము విషదగ్ధమైనది. నేను దీనిని తినను. నీ అనుమతియైనచో ఎలుకనే తినెదను" అని యనెను. ఆ మాట విని ఎలుక మిక్కిలి భయపడి బిలములో దూరి పోయెను.

"రాజా! తరువాత తోడేలుగూడ స్నానము చేసి అక్కడకు రాగా నక్క, 'సోదరా! వ్యాఘ్రమునకు నీపైన కోపము వచ్చినది. కనుక నీకు క్షేమము లేదు. అది యిప్పుడే వ్యాఘ్రిణితో పాటు ఇక్కడికి వచ్చు చున్నది. కనుక

ఇప్పుడు నీకు ఏది ఉచితమో అది చేయుము. అని చెప్పగా, పచ్చి మాంసము తిను తోడేలు తోక ముడుచుకొని పారిపోయెను. ఇంతలో అక్కడకు ముంగిస గూడ వచ్చు చుండగా వనమునందే నక్క ముంగిసతో, 'మిత్రమా! నా బాహు బలముతో వారి నందరిని, ఓడించగా, వారు వేరు చోటికి పోయిరి. నీకు ధైర్య ముండినచో నాతో పోరాడి స్వేచ్ఛగా మాంసము తినుము' అని యనగా, నకులము నక్కతో వ్యాఘ్రము, తోడేలు, ఎలుక ఈ ముగ్గురు వీరులు నీ చేత ఓడిపోయిరి గనుక, నీవు గొప్ప వీరశిరోమణివి. నేను గూడ నీతో యుద్ధము చేయజాలను' అని చెప్పి ముంగిస గూడ వెడలి పోయెను."

"మహారాజా! ఈ విధముగ అవి యన్నియు పోయిన తరువాత తన యుక్తి ఫలించెనని నక్క సంతోషించి తాను ఏకాకిగానే ఆ మృగమాంసము తినెను.

"రాజా! యిట్లే ఆచరించురాజు సర్వదా సుఖము, ఉన్నతియు పొంద గలడు. భయశీలుని భయపెట్టి, శూరునకు అంజలి ఘటించి వశపరచుకొని, లోభికి ధనమిచ్చి, దుర్బలుని పరాక్రమము చేత వశపరచుకొనవలెను. రాజా! ఈ విధముగ నీకు నీతితో వ్యవహరించుటను గూర్చి వివరించితిని. ఇక ఇతర విషయములు వినుము:-

"రాజా! పుత్రులు, మిత్రులు, సోదరులు, తండ్రి, గురువు, ఎవరైనను సరియే తనకు శత్రువులుగా వచ్చినప్పుడు వారిని తన శ్రేయస్సుగోరు రాజు తప్పక చంపవలెను. శపథము చేసి ధనముగాని, విషముగాని యిచ్చి మోసగించి యైనను శత్రువును చంపవలెను. ఏ విధముగ గూడ అతనిని ఉపేక్షించ గూడదు.

"రాజా! ఒకవేళ యిద్దరు రాజులు సమానముగ విజయశీలురై యున్న ప్పుడు ఒకడు మరియొకనిని జయించుట సందేహాస్పదమైనప్పుడు అతని విషయములో గూడ నేను చెప్పిన నీతిని విశ్వాసముతో అనుసరించినవాడు ఉన్నతి పొందగలడు.

"గురోరప్యవలిప్తస్య కార్యాకార్యమజానతః
ఉత్పథ ప్రతిపన్నస్య న్యాయ్యం భవతి శాసనమ్"

అనగా, గురువైనను, పొగరుతో కర్తవ్యాకర్తవ్యములను తెలియక చెడుమార్గమునందు సంచరించినచో అతనికిగూడ దండనము విధించుట న్యాయమని నీతిశాస్త్రము చెప్పుచున్నది.

రాజా! మనస్సులో క్రోధము నిండి యున్నను, కోపము లేనట్లు పైకి నటించుచు చిరునవ్వుతో మాట్లాడ వలెను. క్రోధముతో ఎప్పుడుగూడ, ఎవరిని గూడ తిరస్కరింప గూడదు. శత్రువును కొట్టుటకు పూర్వము కొట్టునప్పుడున్ను అతనితో మధురముగానే మాట్లాడ వలెను. శత్రువును చంపిన తరువాత గూడ అతనిపై దయ జూపుచు దుఃఖించుచు కన్నీరు గార్చవలెను.

"రాజా! శత్రువును మంచి మాటలతో సమాధాన పరచి ధర్మము తెల్పి, ధన మిచ్చి అతనితో బాగుగా వ్యవహరించి, ఊరడించి, తన యెడల అతని మనస్సులో విశ్వాసము కలిగించి, సమయము వచ్చినప్పుడు, అతడు పెడదారి బట్టిన వెంటనే అతనిని కొట్టవలెను. ధర్మాచరణమును దంభముతో నటించుచు, ఘోరమైన యపరాధము చేసిన వాని దోషము గూడ కారుమబ్బులచేత పర్వతము కప్పబడి నట్లు, ఆచ్ఛాదింప బడును. తాను త్వరగా చంపదలచిన వాని యింటికి నిప్పు అంటించవలెను. ధనహీనులను, నాస్తికులను, చోరులను తన యింటిలో నుండనీయ గూడదు.

"రాజా! శత్రువు వచ్చి నప్పుడు తాను లేచి స్వాగతము చెప్పి, ఆసన మిచ్చి, భోజనము పెట్టి, అతనికి ప్రియమైన వస్తువు కానుకగా ఈయ వలెను. ఇట్లు వ్యవహరించుట చేత, తన యెడల పరిపూర్ణ విశ్వాసము కలిగిన వానిని కూడ తన లాభము కొరకు ఏ మాత్రము సంకోచము లేకుండ సర్పము పదునైన కోరలతో కఱచి చంపునట్లు, శత్రువు మరల పైకి లేవకుండ వధించ వలెను. ఎవనివలన భయము కలుగునని సందేహము ఉండదో అటువంటి శత్రువు పట్ల కూడ సందేహముతో జాగ్రత్తగా నుండ వలెను. భయాశంకగల వాని యెడల పూర్తిగా జాగరుకుడై యుండవలెను. ఎవనివలన భయము కలుగునని సందే

హము ఉండదో అట్టివాని నుండి ఒకవేళ తనకు భయము కలిగిన యెడల వానిని సమూలముగ ఛేదించవలెను.

"రాజా! విశ్వాసపాత్రుడు కానివానిపట్ల ఎప్పుడు గూడ విశ్వాసము ఉంచ గూడదు. కాని, విశ్వాస పాత్రుడైన వానియెడల గూడ అతి విశ్వాసము ఉంచ గూడదు. ఎందుకనగా, అతి విశ్వాసముచేత కలుగు భయము రాజును మూల ముతోపాటు నశింపజేయును. పై కుండలీకరణములోని విషయములుగల శ్లోకములు ఇట్లున్నవి :

"అశంకితేభ్యః శంకేత శంకితేభ్యశ్చ సర్వశః
అశంక్యాత్ భయముత్పన్నమపి మూలం నికృన్తతి"
న విశ్వసే దవిశ్వస్తే విశ్వస్తే నాతి విశ్వశేత్,
విశ్వాసాద్భయ ముత్పన్నం మూలాన్యపి నికృన్తతి"

"రాజా బాగుగా పరిశీలన జరిపి, తన రాజ్యములో, శత్రు రాజ్యములోను విశ్వసనీయులైన గూఢచారులను ఉంచ వలెను. శత్రురాజ్యమునందు ఉంచబడు గూఢచారులు పాషండ (వేదబాహ్యుడు) వేషధారులుగా, లేక, తపస్వులుగా నుండవలెను. 'ఉద్యాన వనములు, విహారస్థలములు, దేవాలయములు, మద్యపాన శాలలు, సందులు, రాజమార్గములు, సమస్తతీర్థస్థానములు, చతుష్పథములు (నాలుగు మార్గములు కలియు చోట్లు,) నూతులు, పర్వతములు, వనములు, నదులు, మనుష్యుల సందడి గలచోట్లు' - ఈ స్థలములన్నింటి యందు తన గూఢచారులను త్రిప్పుచుండ వలెను.

"మహారాజా! రాజైనవాడు మాట్లాడునప్పుడు మిక్కిలి వినయశీలుడుగా నుండ వలెను. కాని, అతని హృదయము మాత్రము చురకత్తి వలె అతితీక్ష్ణముగా నుంచుకొన వలెను. అతడు అత్యంత భయంకర కార్యము చేయుటకు ఉద్యుక్తు డైనప్పుడు గూడ చిరునవ్వుతోనే మాట్లాడ వలెను. అవసరముచూచి, చేతులు జోడించి, శపథముచేసి, ఓదార్చి పాదములపై మస్తకము ఉంచి, ప్రణామము చేసి, తనకోరిక ప్రకటించ వలెను. ఇవి యన్నియు ఐశ్వర్యమును కోరురాజు చేయవలసిన పనులు.

"రాజా! నీతిజ్ఞుడైన రాజు, నిండుగా పూవులుపూచి, ఫలములు లేని వృక్షమువలె నుండ వలెను. అతడు మాటలచేత లోకులకు ఫలాశచూపి, దానిని నెరవేర్చ గూడదు. ఆ వృక్షమునకు పండ్లు పుట్టినను దానిపై ఎక్కుట అతి కఠినముగా నుండవలెను. లోకుల స్వార్థసిద్ధిలో దానికి విఘ్నముగాని, లేక, విలంబనముగాని కలిగించవలెను.ఆ పండ్లు పచ్చివిగానుండి చూచుటకు మాత్రము పక్వములవలె నుండవలెను. అనగా స్వార్థ సాధకుల దురాశ నెరవేరకుండునట్లు ఉండవలెను. రాజు తాను నష్టపడ కూడదు.అనగా తన ధనము వెచ్చించి శత్రువులను పోషించుచు తాను నిర్ధనుడు కాగూడదు.

"రాజా! ధర్మ - అర్థ - కామ"ములు అను త్రివిధ పురుషార్థములను సేవించుటలో మూడు విధములైన బాధలు, విఘ్నములున్ను కలుగును. అవి యేవనగా, ధర్మానుష్ఠానముచేయు వానికి ధర్మమునందు అర్థ కామముల ద్వారా బాధకలుగును. ఇట్లే అర్థలోభికి అర్థమునందు ధర్మ - కామముల ద్వారా, అతి భోగాసక్తునియొక్క కామమునందు గూడ ధర్మార్థముల ద్వారా బాధ కలుగును.

"రాజా! యిట్లే, త్రివర్గమునకు మూడు ఫలములు కలుగును. (ధర్మమునకు ఫలము అర్థము కామములు, అనగా, సుఖప్రాప్తి; అర్థమునకు ఫలము ధర్మమును ఆచరించుట సుఖములు పొందుట యగును. కామమునకు అనగా భోగమునకు ఫలము ఇంద్రియతృప్తి), (మూడువిధములైన) ఈ ఫలములు శుభములు, (కోరదగినవి) అని తెలిసికొన వలెను.

కాని, రాజా! (పైన చెప్పబడిన మూడువిధముల) బాధలనుండి ప్రయత్నపూర్వకముగ తప్పించుకొన వలెను. (వివిధ పురుషార్థములను, ఒండింటికి బాధకరములు కాకుండునట్లుగా సేవించ వలెను. అనగా జీవితమునందు మూడింటి సమన్వయము సమంజసముగా జేసికొనుట సుఖప్రద మగును.

"మహారాజా! రాజైనవాడు తన మనస్సు నుండి అహంకారమును తొలగించి, చిత్తము ఏకాగ్రము చేసికొని, అందరితోను మధురముగా మాట్లాడుచు, ఇతరుల దోషములను వ్యక్తము చేయక, అన్ని విషయములందు దృష్టి ఉంచి, పరిశుద్ధచిత్తుడై, బ్రాహ్మణులతోపాటు కూర్చొని, రహస్యాలోచనము చేయవలెను.

అతడు సంకటావస్థలో మృదువైన కార్యముచేత, లేక భయంకర కార్యము చేత ఆ సంకటావస్థనుండి తనను ఉద్ధరించుకొని, సమర్థుడైన తరువాత ధర్మాచరణము చేయవలెను. కష్టపడక మనుష్యునకు శ్రేయస్సు కలుగజాలదు. ప్రాణ సంకటావస్థలో పడి, మరల నతడు జీవించిన యెడల తన శ్రేయస్సును చూడగలడు.

"రాజా! ఎవని బుద్ధి సంకటములలో పడి, శోకించునో, అట్టి వానికి పూర్వకాలపు కథలు (నల-శ్రీరామచంద్రాదుల జీవిత వృత్తాంతములు) వినిపించి శాంతపరచ వలెను. బుద్ధి సరిగా లేనివానికి భవిష్యత్కాలము నందలి లాభము నందు ఆశ జూపించి అప్పుడే అతనికి ధనాదులు ఇచ్చి, శాంతపరచ వలెను. వృక్షాగ్రము నందలి శాఖపై నిద్రించినవాడు క్రిందపడినప్పుడు మేల్కానినట్లే, తన శత్రువుతో సంధి చేసి, కృతకృత్యునివలె నిద్రించి, (నిశ్చింతుడై) యున్న వాడు శత్రువు వలన వంచింప బడినప్పుడు జాగ్రత్తపడును.

"మహారాజా! రాజైనవాడు ఇతరుల దోషములను వ్యక్తపరచక, తన రహస్యాలోచనమును సర్వదా కప్పియుంచుటకు ప్రయత్నించవలెను. ఇతరుల, గూఢచారులతో తన యాకారమును (క్రోధ-హర్షాదులు సూచించు చేష్టలు) గూడ గుప్తముగా నుంచవలెను.కాని, తన గూఢచారులనుండి గూడ తన రహస్యాలోచనము కాపాడుకొనుచుండవలెను.

"రాజా! రాజైనవాడు చేపలుపట్టి చంపువానివలె, ఇతరుల మర్మస్థానములను చీల్చక, అతి క్రూర కర్మలు చేయక, అనేకుల ప్రాణములు తీయక, గొప్ప సంపదను పొంద జాలడు. శత్రుసేన 'దుర్బలము', రోగగ్రస్తము, దగ్ధము, బురదలో ఇరుకుకొనుట, ఆకలిదప్పులతో పీడితమగుట, అన్ని వైపుల నుండి విశ్వసింపబడి నిశ్చేష్టమై పడి యుండుట ఈ మొదలైన పరిస్థితులలో దానిపై ప్రహారము చేయవలెను.

"రాజా! ధనవంతుడు ఏ యితర ధనవంతుని యొద్దకున్ను పోవడు. ఎవని కోరిక లన్నియు నెరవేరి యున్నవో, అతడు ఎవరితోను మైత్రి నిలబెట్టుకొనుటకు ప్రయత్నించడు. కనుక తనవలన ఇతరులకు నెరవేరవలసిన పనులు గూడ, పూర్తి చేయక, మిగిల్చి యుంచవలెను. అట్లు చేయుటచేత నతడు తన పని

కొరకు, మన కడకు వచ్చుచు పోవుచుండును. ఐశ్వర్యమును కోరు రాజు, ఇతరుల దోషములను వ్యక్తపరచక, సర్వదా, ఆవశ్యకములైన వస్తువులను కూర్చుకొనుచు, శత్రువులతో యుద్ధము చేయుటకు ప్రయత్నించుచుండవలెను. దానితోపాటే, తన ఉత్సాహము విడువకుండవలెను.

"రాజా! రాజు ఎప్పుడు, ఏమి చేయగోరుచున్న సంగతి శత్రువులకు గాని, మిత్రులకు గాని, తెలియక యుండవలెను. కార్యారంభము - లేక, కార్య సమాప్తియైనప్పుడే అంతయు వారు చూడవలెను. తనకు భయ కారణము ప్రాప్తించనంతవరకు భయపడినవానివలె నుండి దానిని ఉపేక్షించుచుండవలెను. కాని, భయ కారణము ప్రాప్తించిన వెంటనే, నిర్భయుడై, శత్రువుపై ప్రహారము చేయవలెను.

"రాజా! దండించి, వశపరచుకొనబడిన శత్రువుపై, దయ జూపినవాడు, మృత్యువును ఆహ్వానించినవాడగును. ఎట్లనగా పెంటికంచరగాడిద, గర్భము రూపములో, తన మృత్యువునే ఉదరమునందు ధరించు నట్లని యెరుగవలెను. కంచరగాడిదకు గర్భమై యీనిన యెడల, యది మరణించును.

"రాజా! భవిష్యత్తులో చేయవలసిన పనిని, బుద్ధితో బాగుగా విచారించి, దానికి అనుకూలముగా వ్యవస్థ చేయవలెను. ఇట్లే, ఎదుటకు వచ్చిన పనినిగూడ, బుద్ధితో బాగుగా, విచారించిన తరువాతనే చేయవలెను. బుద్ధితో నిశ్చయించక, ఏ కార్యముగాని, ఉద్దేశ్యముగాని విడువగూడదు."

"రాజా! తన విభూతిని గోరు రాజు, దేశ - కాలములను విభజించిన తరువాతనే, ప్రయత్న పూర్వకమైన యుత్సాహమును, ఉద్యమమును చేయవలెను. ఇట్లే దేశ - కాలవిభాగ పూర్వకముగా, ప్రారబ్ధకర్మమును, ధర్మార్థ కామములనున్ను అనుభవించవలెను. తన శుభమునకు ప్రధాన కారణములు, దేశ - కాలములే యని తలచవలెను. ఇదియే, నీతిశాస్త్ర సిద్ధాంతము."

"రాజా! అల్పశత్రువును గూడ ఉపేక్షించిన యెడల, అతడు, తాటిచెట్టు వలె వేళ్ళూనుకొని, దట్టమైన వనములో విడువబడిన యగ్నివలె విజృంభించి శీఘ్రముగా మహావినాశము కలిగించగలడు. మనుష్యుడు స్వల్పమైన యగ్ని

వలె తనకుతాను, సహాయక సామగ్రితో మెల్లమెల్లగా ప్రజ్వలితుడై, పెరిగినచో, యొకనాడు చాల పెద్దవాడై, శత్రువు లనెడు ఇంధనముల మహారాశిని గూడ మ్రింగి వేయును."

"రాజా! ఎవరికైన ఏదైన మాట యిచ్చి, ఆశచూపిన యెడల, దానిని త్వరగా నెరవేర్చక, చాల కాలము వరకు అట్లే అనిర్ణీతముగా నుంచవలెను. అది పూర్తిచేయు సమయము వచ్చినప్పును, ఏదైన విఘ్నము కల్పించవలెను. ఈ విధముగా కాలము జరుపుచు నుండవలెను. ఆ విఘ్నమునకు ఏదైన సరియైన కారణము చూపించి, ఆ కారణమును గూడ, ఉపాయములచేత సిద్ధపరచ వలెను."

"రాజా! ఉక్కుతో చేయబడిన చురకత్తి సానరాతిపై పదును చేయబడి, తోలు సంచిలో దాచియుంచబడినప్పుడు అది శిరస్సు మొదలు సర్వావయవ ముల వెంట్రుకలను గొరుగును. ఆ విధముగనే, రాజు అనుకూలమైన సమయము నకై ఎదురుచూచుచు, తన మనోభావమును కప్పిపుచ్చుకొని యుండి, అనుకూల సాధనములను కూర్చుకొనుచుండి, చురకత్తివలె, తీక్ష్ణుడై నిర్దయుడై, శత్రువుల ప్రాణములు తీయవలెను. శత్రువు యొక్క మూలచ్ఛేదము చేయవలెను."

"మహారాజా! నీవు గూడ ఈ రీతినే అనుసరించి, పాండవులతో, ఇతరుల తోను తగినట్లు వ్యవహరించు చుండవలెను. కాని, నీవు స్వయముగా సంకట సముద్రములో మునుగని విధముగా కార్యము చేయవలెను. నీవు సమస్త శ్రేయ స్కర సాధన సంపత్తి గలవాడవు, సర్వశ్రేష్ఠుడవు నని యందరి నిశ్చయము. కనుక, రాజా! నీవు పాండు పుత్రుల నుండి నిన్ను రక్షించుకొనుము. రాజా! నీ సోదర పుత్రులు పాండవులు అతిబలశాలురు. కనుక, భావికాలము నందు నీవు పశ్చాత్తాపపడని విధమున, నీతిని అనుసరించి కార్యము చేయుము"

"జనమేజయా! యీ విధముగా ధృతరాష్ట్రునకు ఉపదేశించి కణికుడు తన యింటికి పోయెను. తరువాత ధృతరాష్ట్రుడు శోకముచేత వ్యాకులుడై యుండెను."

సంభవపర్వము సమాప్తము.

# లాక్షాగృహ పర్వము

## పాండవులయెడల పౌరుల ప్రేమ చూచి, దుర్యోధనుడు చింతించుట :-

ఇట్లు వైశంపాయనుడు జనమేజయునకు సంభవ పర్వ కథలు సవిస్తారముగా చెప్పి, యిప్పుడు 'లాక్షాగృహ' పర్వ కథను చెప్ప దలచి యిట్లనెను :-

"జనమేజయా! తరువాత 'శకుని - దుర్యోధన - దుశ్శాసన - కర్ణులు' పరస్పరము దుష్టమైన రహస్యాలోచనము చేసి, ధృతరాష్ట్రుని యాజ్ఞ గొని, కుంతీదేవిని ఆమె పుత్రులతో పాటు దహించుటకు తలపెట్టిరి."

"జనమేజయా! ఈ వాస్తవము తెలిసికొనిన విదురుడు ఆ దుష్టుల ఆకృతి చేతనే వారి రహస్యాలోచనము కనిపెట్టి పాండవుల హితమునకై కుంతి, ఆమె పుత్రులున్ను, ఇక్కడి నుండి పారిపోవలె నని తలంచి అతడొక ధృడమైన నావను నిర్మింపజేసి దానిని నడపుటకు దానిలో ఒక యంత్రము[1] పెట్టించెను. అది వాయు వేగముతో అలలను ఎదిరించుచు పోవునదిగా నుండెను. తరువాత విదురుడు కుంతీదేవితో నిట్లనెను :-

"దేవీ! ధృతరాష్ట్రుడు ఈ కురుకులమును, కురువంశ పరంపరను నశింప జేయుటకు పుట్టెను. ఇతడు పుత్రుల యందలి మమకారము చేత సనాతన ధర్మము విడిచెను. ఈ నావ ద్వారా నీవు పుత్రులతో పాటు జలమార్గముగుండా పోయి మృత్యుముఖము నుండి తప్పించుకొన గలవు.

"జనమేజయా! ఆ మాట విని కుంతీదేవి మిక్కిలి వ్యధ చెంది, పుత్రులతో వారణావతము నందలి లక్షా గృహమునుండి తప్పించుకొని, ఆ నావపై గంగలో ప్రయాణము చేయుచుండెను.

"జనమేజయా! తరువాత విదురుని యుపదేశము ప్రకారము పాండవులు నావను గంగలోనే ముంచి కౌరవు లిచ్చిన ధనము తీసికొని, ఎలాటి విఘ్నములు, బాధలు లేనివారై వనములో ప్రవేశించిరి

1. దీనిచేత మహాభారత కాలములో గూడ యంత్ర నౌకలు నిర్మింపబడు చున్నట్లు తెలియు చున్నది.

"వారణావతమునందలి లక్క యింటియందు ఒక నిషాద జాతిస్త్రీ ఏదో కారణమువలన తన ఐదుగురు కొడుకులతో బస చేసెను. నిరపరాధులైన ఆ యమాయక స్త్రీ - ఆ లక్కయింటిలో కాలి భస్మమయ్యెను. అక్కడనే మ్లేచ్ఛాధము డైన 'పురోచనుడు' గూడ కాలిపోయెను. దుర్యోధనాదులు దానిచేత మోస పోయిరి.

"విదురుని యుపదేశము ప్రకారము నడచు కొను పాండవులు మృత్యుముఖమునుండి తప్పించుకొని ఏలాటి బాధ లేక బయట బడిరి. వారు బ్రతికి యుండి రను సంగతి ప్రజలకు తెలియ కుండెను. వారు వారణావతము నందు లక్కయిల్లు కాలుట చూచి పాండవుల కొరకు ప్రజలు దుఃఖించి ధృతరాష్ట్రునకు ఈ విషయము తెలుపగా అతడు దుఃఖించి భీష్మ - విదురులతోపాటు పాండవులకు వారి బొమ్మలు చేయించి, ప్రేతకార్యము జరిపించెను.

అది విని జనమేజయుడు లక్షాగృహదాహాదులను వివరముగా చెప్పుమని కోరగా వైశంపాయను డిట్లు చెప్ప దొడగెను :-

"జనమేజయా! భీమసేనుడు అత్యధికబలశాలి, అర్జునుడు అస్త్రవిద్యలో సర్వశ్రేష్ఠుడు నని దుర్యోధనునకు మిక్కిలి సంతాపము గలిగి దుఃఖించెను. అప్పుడు కర్ణ - శకునులు అనేకోపాయముల చేత పాండవులను చంప దలచిరి. పాండవులకు ఎప్పుడు ఏ సంకటము వచ్చినను విదురుని యుపదేశము ప్రకారము కౌరవుల కుట్రను నివారించుకొను చుండిరి. కాని, ఆ కుట్రలను వారు వెల్లడించ కుండిరి.

"సంజయా! ఆ దినములలో సర్వగుణ సంపన్నులైన పాండవులను చూచి నగరవాసు లందరు వారి గుణములను సభలలో ప్రశంసించు చుండిరి. జన సముదాయమున్ను, రాజ్యప్రాప్తికి యుధిష్ఠిరుడే యోగ్యుడని అనుకొను చుండెను.

ధృతరాష్ట్రుడు అంధుడు, కాబట్టి, పూర్వము వలెనే ఇప్పుడు గూడ అతడు రా జెట్లగును ? భీష్ముడు వ్రతనియమములు పాలించు వాడు గనుక, తొలుతనే ప్రతిజ్ఞ చేసి రాజ్యము విడిచెను. కాబట్టి యిప్పుడు మరల నతడు దానిని గ్రహింపడు. పాండవ జ్యేష్ఠుడైన యుధిష్ఠిరుడు యువకుడైనను, సత్స్వభావములో

వృద్ధునితో సమానము. అతడు సత్యవాది, దయాళువు, వేద విజ్ఞాన సంపన్నుడు కనుక, మనమిప్పుడు అతనికే శాస్త్రోక్తముగా రాజ్యాభిషేకము చేయుదము. యుధిష్ఠిరుడు మహా ధర్మజ్ఞుడు. అతడు ఇటు భీష్ముని, అటు సపుత్రకుడైన ధృతరాష్ట్రుని ఆదరించి సుఖపెట్ట గలడు."

"జనమేజయా ! యుధిష్ఠిరుని యందు అనురక్తులై ప్రజలందరు ఇట్లు అనుకొను చుండగా, దుర్యోధనుడు విని మనస్సులోనే మండిపడి ప్రజల మాటలు సహించ జాలక, ఈర్ష్యాగ్నిచే దహింపబడుచు ధృతరాష్ట్రుని కడకుపోయి ఒంటరిగా నున్న యతనితో దుఃఖించుచు ఇట్లనెను :-

"తండ్రీ ! నేను ప్రజల ముఖము నుండి అశుభవార్త వింటిని. వారు, నిన్ను, భీష్ముని ఆదరించక యుధిష్ఠిరుని రాజు చేయగోరుచున్నారు. భీష్మునకు రాజ్యాభిలాష లేదు. కాబట్టి, ప్రజల కోరికను అత డంగీకరించును. కాని, నగర వాసులు మా కొరకు ఒక కష్టతరమైన పథకము పన్న దలచినారు. అది యేమనగా, పాండురాజు సద్గుణవంతు డగుట చేత తండ్రి నుండి రాజ్యము పొందెను. నీవు అధికారము ప్రకారము పొందవలసిన రాజ్యమును అంధుడవగుటచేత పొందజాలక పోయితివి.

"పాండు రాజునకు ఉత్తరాధికారి పుత్రుడే యగును కనుక, రాజ్యమును యుధిష్ఠిరుడు ఇప్పుడు పొందినచో నతని తరువాత గూడ నతని పుత్రునకే రాజ్యము సంక్రమించి, ఆ విధముగనే పాండవుల పుత్ర పౌత్రపరంపరకే రాజ్యాధికారము వచ్చును. ఇట్టి పరిస్థితిలో మాకు గాని, మా పుత్రపరంపరకు గాని రాజ్యము లభించదు కాబట్టి. మేము ప్రజలకు పరిహాసాస్పదుల మయ్యెదము.

కనుక, రాజా! మేము ఇతరులు పెట్టు అన్నముచేత జీవితము గడపికొను నరకతుల్యమైన దురవస్థను పొందకుండ నీవే ఒక యుపాయమును చేయుము. రాజా! మొదలే నీవు ఈ రాజ్యము పొందియుండిన యెడల ఇది తప్పక మాకు లభించి యుండెడిది. అప్పుడు ప్రజలమాట చెల్లకుండెడది.''

**దుర్యోధనుడు పాండవులను వారణావతమునకు పంపుటకు ధృతరాష్ట్రునితో చెప్పుట:-**

"జనమేజయా! ఈవిధముగా దుర్యోధనుడు చెప్పగా విని, ధృతరాష్ట్రుడు కణికుని మాటలుగూడ స్మృతికి తెచ్చుకొని, మిక్కిలి ఆందోళన చెంది శోకాతురుడయ్యెను. దుర్యోధన - కర్ణ - శకుని - దుశ్శాసనులు నలుగురున్ను ఒకచోట కూర్చొని సమాలోచనము సలిపి, మరల దుర్యోధనుడు ధృతరాష్ట్రుని కడకు పోయి ఇట్లనెను :-

"తండ్రీ మాకు పాండవుల నుండి భయము కలుగకుండుటకు నీవు ఏదైన మంచి యుపాయము పన్ని, వారిని వారణావత నగరమునకు పంపుము.

"జనమేజయా! ఇట్లు పుత్రుడు చెప్పిన మాట విని, ధృతరాష్ట్రుడు ఒక ముహూర్తకాలము (రెండు గడియలు) విశేషముగా చింతించి దుర్యోధనునితో నిట్లనెను :-

"పుత్రా! పాండురాజు తనజీవిత మంతయు, ధర్మమే ముఖ్యమని తలచి సమస్త జ్ఞాతి - బంధుజనులతో ధర్మానుకూలముగనే వ్యవహరించు చుండెను. విశేషించి, నా యెడల మిక్కిలి ధర్మముతో ప్రవర్తించెను. అతడు అత్యంత సరళస్వభావముతో నుండెను. తనస్నాన - భోజనాదులైన యిష్టకర్తవ్యముల విషయములో గూడ ఏమియు తెలియక ఉండెను. ఉత్తమ వ్రతమును పాలించుచు ప్రతిదినము నాతో 'ఈ రాజ్యము నీదే!' యని చెప్పుచుండెను.

"పుత్రా ! పాండుపుత్రుడు యుధిష్ఠిరుడు గూడ పాండువు వలెనే ధర్మపరాయణుడుగా నున్నాడు. అతడు ఉత్తమ గుణసంపన్నుడై సమస్త ప్రపంచమునందు ప్రఖ్యాతుడై పూరు వంశీయులకు మిక్కిలి ప్రియుడుగా నున్నాడు. అతనిని అతని తండ్రి తాతల రాజ్యమునుండి బలత్కారముగా ఎట్లు తొలగింపగలుగుదును. విశేషించి, అతనికి సహాయకులు అధిక సంఖ్యలో నున్నప్పుడు అది యెట్లు సాధ్యమగును? పాండురాజు అందరు మంత్రులను, సైనికులనున్ను సర్వదా, పాలించుచు పోషించుచు నుండెను. వారినే కాక, వారి పుత్ర - పౌత్రుల పోషణమునందు గూడ దృష్టి గలవాడై యుండెను.

"నాయనా! పాండురాజు పూర్వము పౌరులతో మిక్కిలి సద్భావముతో వ్యవహరించు చుండెను. ఇప్పుడు వా రందరు మనకు విరోధులై యుధిష్ఠిరుని హితముకొఱకు వారి సోదర బంధువులతోపాటు మన యందరి హత్య చేయకుండ నుందురా ?

"జనమేజయా! ధృతరాష్ట్రుని మాట విని, దుర్యోధనుడు అతనితో నిట్లనెను:-

"తండ్రీ! నేనుగూడ ప్రజలు విరోధులగుదురని భావించి ధనము, సమ్మానము వారికి యిచ్చి ప్రజ లందరను ఆదరించి, సత్కరించితిని. ఇప్పుడు ప్రజలు ముఖ్యముగా మనకు సహాయకులుగా నుండెదరు. ఇప్పుడు ధనాగారము, మంత్రి మండలమున్ను, మన యధీనములోనే యున్నవి. కనుక, నీవు ఏదైన యపాయము మృదువుగా చేసి సాధ్యమైనంత త్వరలో పాండవులను వారణావతమునకు పంపుము. ఈ రాజ్యము పూర్తిగా నా యధికారములో వచ్చినప్పుడు కుంతీదేవి తన పుత్రులతో మరల ఇక్కడకు వచ్చి యుండగలదు.

"జనమేజయా! ఈ విధముగా దుర్యోధనుడు చెప్పిన మాటలు విని ధృతరాష్ట్రు డతనితో నిట్లనెను:-

"దుర్యోధనా! నేనుగూడ ఈ విషయమునే యోచించు చున్నాను. కాని, మన యభిప్రాయము పాపముతో గూడినది. కనుక, దీనిని వెల్లడిచేసి చెప్ప జాలను. ఇంతియేకాక, పాండవులను ఇక్కడినుండి వేరుచోటికి పంపుటకు భీష్మ-ద్రోణ - విదుర - కృపాచార్యులు ఎప్పుడుగూడ అనుమతించరు. వీ రందరకు మనము, పాండవులున్ను సమానులమే. ధర్మాత్ములైన యీ మహాపురుషులు పాండవుల యెడల వ్యతిరేకముగా వ్యవహరించుటకు అంగీకరింపరు. మన మొక వేళ పాండవులతో విషమముగా వ్యవహరించిన యెడల సమస్త కురువంశీయులు, భీష్మ ద్రోణాదులైన మహాత్ములు, సర్వప్రపంచ జనులున్ను మనము వర్ధిల్లమని తలచెదరు.

"జనమేజయా! ఇట్లు ధృతరాష్ట్రుడు చెప్పగా విని, దుర్యోధను డతనితో మరల నిట్లనెను :

"తండ్రీ! భీష్ముడు సర్వదా మధ్యస్థుడుగానే యుండును. అశ్వత్థామ నా పక్షమునందే యున్నాడు. ద్రోణాచార్యుడు కొడుకుతో పాటే ఉండుటకు సందేహించడు. ఈ యిరువురు తండ్రికొడుకులున్న పక్షమందే కృపాచార్యుడు గూడ నుండ గలడు. అతడు అతనిబావ ద్రోణుని, మేనల్లుడు అశ్వత్థామనున్ను విడువ జాలడు. విదురుడు గూడ ప్రచ్ఛన్నముగ మన శత్రువులపై స్నేహభావముతో నున్నప్పటికిన్ని మన యార్థికబంధనములో నున్నాడు. ఐనను, అతడొక్కడు పాండవుల హితముకొఱకు మనను, బాధింపజాలడు. కనుక, నీవు పూర్తిగా నిర్చింతుడవై పాండవులను వారి తల్లితోపాటు వారణావతమునకునే పంపుటకు ఏర్పాట్లు చేయుము. నా హృదయములో భయంకరమైన ముల్లు గ్రుచ్చుకొను చున్నది. అది నన్ను నిద్రింపనీయకున్నది. శోకాగ్ని జ్వలించుచున్నది. నీవు నా కోరిక ప్రకారము ఈకార్యము చేసి నా హృదయ శోకాగ్ని చల్లార్చుము."

**ధృతరాష్ట్రుని యాజ్ఞచే పాండవుల వారణావత యాత్ర:**

"జనమేజయా! యిట్లు దుర్యోధనుడు చెప్పి, ధృతరాష్ట్రుని అంగీకరింప జేసిన తర్వాత అతని తమ్ముల ద్వారా మంత్రులు మొదలైన యధికారులకు ధనమిచ్చి, వారి నందరను మెల్లమెల్లగా తన వశములో తెచ్చుకొనెను. చతురులైన కొందరు మంత్రులు ధృతరాష్ట్రుని యాజ్ఞచేత, వారణావతనగరము మిక్కిలి సుందరమైనది. అక్కడ ఇప్పుడు భగవంతుడైన శివుని పూజకొరకు ఏర్పరుపబడిన గొప్ప యుత్సవములు, భూమండలము నందు అన్నిటికంటె మిక్కిలి మనోహరమైనవి. ఆ పవిత్రనగరము సమస్త రత్న (ఉత్తమవస్తువుల) పరిపూర్ణమై మనుష్యుల మనస్సును మోహింపజేయునదిగా నున్నది" అని నలువైపుల ప్రచారము చేయజొచ్చిరి.

"జనమేజయా! వారణావతనగర రమణీయతనుగూర్చి ఈ విధముగా అంతటను వర్ణింపబడుచున్నప్పుడు పాండవులు అక్కడకు పోవుటకు ఉత్సాహులై యున్నారని ధృతరాష్ట్రునకు తెలిసినప్పుడు అతడు వారికడకు పోయి ఇట్లనెను:-

"పుత్రులారా! మీరు సమస్త శాస్త్రములు చదివినారు. కృపాచార్య - ద్రోణాచార్యుల నుండి శస్త్రాస్త్ర విద్యగూడ విశేషముగ నభ్యసించిరి. ఇట్టి పరిస్థితిలో నే నొక విషయము యోచించు చున్నాను. ఏమనగా - అన్నివైపుల

రాజ్యరక్షణము, రాజకీయ వ్యవహార రక్షణము చేయుచు రాజ్యమునకు నిరంతరము హితము చేయుచున్న మన యీ మంత్రులు 'వారణావతనగరము' ప్రపంచమునందు అన్నిటికంటె మిక్కిలి సుందరమైనది అని ప్రతిదినము మాటి - మాటికి చెప్పుచున్నారు. మీరక్కడి యుత్సవము చూచుటకు పోవదలచిన యెడల మీ కుటుంబముతో, పరివారముతోను అక్కడకు పోయి దేవతలవలె విహరింపుడు. బ్రాహ్మణులకు, గాయకులకు రత్న-ధనాది దానములు చేయుచు అక్కడ కొంతకాలము స్వేచ్ఛగా విహరించుచు సుఖముగా నుండుడు. తరువాత ఈ హస్తినాపురమునకు తిరిగి రండు.

"జనమేజయా! యుధిష్ఠిరునకు, ధృతరాష్ట్రుడు చెప్పిన మాటలలోని రహస్యము తెలిసినప్పటికిన్నీ తాను అసహాయుడు కాబట్టి, యేమియు అనలేక 'సరియే! అట్లే చేసెదము' అని చెప్పి అతని మాట అంగీకరించి భీష్మ-విదుర-ద్రోణ-బాహ్లిక-సోమదత్త-భూరిశ్రవస్-కృపాచార్య-అశ్వత్థామాదులతో మంత్రులతో బ్రాహ్మణ పురోహితులతో, పురజనులతో, గాంధారీదేవితోను కలిసి మెల్ల-మెల్లగా వారితో దీనముగా నిట్లనెను:-

"మేము ధృతరాష్ట్ర మహారాజాజ్ఞచేత వారణావతమునకు సపరివారముగా పోవుచున్నాము. అక్కడ గొప్ప యుత్సవము జరుగుచున్నది. మీరందరు మమ్ము సంతోషముతో ఆశీర్వదింపుడు. మీ యాశీర్వాదముచేత మాకు అభివృద్ధి కలుగును. మాకు పాపముగూడ అంటదు."

"జనమేజయా! యుధిష్ఠిరుడిట్లు చెప్పగా,అందరు సంతోషముతో పాండవులకు అనుకూలముగా 'పాండుకుమారులారా! మార్గమునందు మీకు జంతువుల భయము లేక శుభముగా ప్రయాణము చేయుడు. మీకు ఏ విధమైన యశుభము కలుగకుండు గాక!' అని యనిరి. అప్పుడు పాండవులు రాజ్య లాభము కొరకు స్వస్తివాచనాది కార్యము లన్నియు నెరవేర్చి వారణావతమునకుపోయిరి."

**దుర్యోధనుని యాజ్ఞచేత పురోచనుడు వారణావతమందు లక్క యిల్లు నిర్మించుట:-**

"జనమేజయా! ధృతరాష్ట్రుడు పాండవులకు వారణావతము పొందని ఆజ్ఞ యిచ్చిన తరువాత దురాత్ముడైన దుర్యోధనుడు మిక్కిలి ప్రసన్నుడయ్యెను.

ఆతడు తన మంత్రియైన పురోచనుని ఏకాంతమునందు పిలిచి, అతని కుడిచేయి పట్టుకొని అతనితో నిట్లనెను:-

"పురోచనా! ధన - ధాన్య సంపన్నమైన యీ రాజ్యము నాకు ఎట్లో, నీకు గూడ అట్లే నీదైయున్నది. కనుక, దీనిని నీవు రక్షింపవలెను. నీకంటె మరియొకడు, నాకు విశ్వాసపాత్రుడైన సహాయకుడు లేడు. కనుక, ఇతరులతోనే నీ రహస్య సమాలోచనము, నీతో చేసినంత విశ్వాసపూర్వకముగా చేయజాలను. ఈ రహస్యాలోచనము నీవు గుప్తముగా రక్షింపుము. ఇతరులు చెవిన పడకుండ చూడుము. రహస్యోపాయముచేత నా శత్రువులను పెరికి పారవేయుటకు నేను చెప్పినట్లే చేయుము. మా తండ్రి పాండవులకు వారణావతము పోవుటకు ఆజ్ఞ యిచ్చెను. వారు కొన్ని దినములు అక్కడ ఉండి ఉత్సవములలో పాల్గొని అక్కడి తిరునాళ్ళలో తిరుగుచుండెదరు. కనుక, నీవు కంచరగాడిదలు కట్టబడిన రథముపై నేడే శీఘ్రముగా అక్కడకు పొమ్ము!"

"పురోచనా! అక్కడ నీవు ఒక విశాల, చతుశ్శాలా భవనము నగర సమీపమునందు నిర్మింపుము. దానిలో అన్ని వైపుల గదులు నిర్మించి, సురక్షితముగా నుండునట్లు చూడుము. అనేక ధనములు వెచ్చించి సుందరాతి సుందరముగా అది నిర్మింపుము. దాని నిర్మాణపు మంటిలో, జనపనార, మద్దిజిగురు రాళము (ధూపద్రవ్యము), మొదలైన అగ్నిని మండించు ద్రవ్యములు లోకమునందున్నవన్నియు కలిపి ఆ యింటి గోడలలో పెట్టింపుము. నేయి, నూనె, క్రొవ్వు, అధికమైన లక్కతో మంటిని కలిపి. దానిని గోడలకు పూయింపుము. ఆ యింటికి నలు వైపుల జనపనార, నూనె, నేయి, లక్క, కట్టెలు ఈ మొదలైన వస్తువు లన్ని చేర్చి యుంచుము ఎంత జాగ్రత్తగా చూచినను 'ఈ యిల్లు అగ్నిని రగులుకొలుపు వస్తువుల చేత నిర్మింపబడిన'దని పాండవులకు, తదితరులకున్ను సందేహము కలుగకుండునట్లుగా పరిపూర్ణ జాగ్రత్తతో ఆ రాజభవనము నిర్మింపవలెను."

"పురోచనా! ఆ భవనమునందు పాండవులు ప్రవేశించినప్పుడు, కుంతీదేవిని, వారి మిత్రులను మిక్కిలి ఆదరించి అక్కడనే యుండునట్లు చేయుము. అక్కడ పాండవులకొరకు దివ్యములైన ఆసనములు, వాహనములు,శయ్యలున్ను

ఏర్పరచుము. అది విని మా తండ్రి గూడ సంతోషించును. మన యిష్ట కార్యము సకాలములో సిద్ధించువరకు వారణావత పురజనులకు ఈ విషయము లేశ్మియు తెలియనట్లుగా అన్ని పనులు జరిపింపుము. 'పాండవులు విశ్వాసముతో అక్కడనున్నారు. వారి మనస్సులో ఏ విధమైన సంశయము కలుగలేదు' అని నీకు పూర్తిగా తెలిసినప్పుడు వారు నిద్రించిన సమయమందు ఆ భవనద్వారము వైపునుండి నిప్పు అంటింపుము.''

"పురోచనా! ఆ సమయమందు ఆ యిల్లు అకస్మాత్తుగా కాలి పాండవులు దహింపబడిరి! అని అక్కడి ప్రజలు తలచి, వారు పాండవుల మరణమునకు మనము కారణమని నిందించరు.''

"జనమేజయా! ఇట్లు దుర్యోధనుడు చెప్పిన ప్రకారమే కార్యము చేయుటకు పురోచనుడు ప్రతిజ్ఞచేసి, కంచరగాడిదల రథములో త్వరగా వారణావతమునకు బయలుదేరి పోయి దుర్యోధనుడు చెప్పినట్లే పని నెరవేర్చెను.

**పాండవులు వారణావతయాత్ర - వారికి విదురునిరహస్యోపదేశము :-**

''జనమేజయా! అట్లు పాండవులు తల్లితోపాటు వారణావతమునకు వెడలునప్పుడు వారి యందలి ప్రేమచేత నగరవాసులు వారి వెంటనే పోవుచు నిట్లనిరి.

మందబుద్ధియైన ధృతరాష్ట్రుడు పాండవులను విషమముగా చూచుచున్నాడు. అతడు ధర్మమును చూచుట లేదు. ధర్మాత్ములు, బలవంతులునైన పాండవులు ఎప్పుడుగూడ పాపకార్యము చేయరు. పాండవులకు వారి తండ్రి నుండి రాజ్యము సంక్రమించుట ధృతరాష్ట్రుడు సహించుట లేదు. ఇట్లు యధర్మ కార్యమునకు భీష్ము డెట్లు అనుమతించెను? పాండవులను అన్యాయముగా నిక్కడి నుండి తొలగించి వారణావతమునకు పంపు చున్నారు. ఇట్లుండి కూడ భీష్ముడు మౌనముతో దీనినెందు కంగీకరించినాడు?"

''మనకు తొలుత శంతనుకుమారుడైన విచిత్ర వీర్యుడు, తరువాత, ఆతని కొడుకు పాండువున్ను రాజులుగా నుండిరి. వారు కేవలము రాచరికమే

కాక, మనను తండ్రివలె పాలించి, పోషించుచుండిరి. పాండురాజు స్వర్గస్థుడై నప్పుడు అతని చిన్న కుమారుల భారము ధృతరాష్ట్రుడు వహించి పోషించెను. ధృతరాష్ట్రుడు చేయు ఈయన్యాయము మనము సహించము. కాబట్టి మనయిండ్లు విడిచి యుధిష్ఠిరుని వెంటనే పోవుదము."

"జనమేజయా! ఇట్లు తనకొరకు దుఃఖించుచున్న ప్రజలమాట విని శోకించుచు, ధర్మరాజు వారితో నిట్లనెను :-

"ప్రియబంధువులారా! ధృతరాష్ట్రుడు నాకు పూజ్యుడైన తండ్రి, గురువు. అతని యాజ్ఞను నిస్సందేహముగా పాలించుటయే నావ్రతము. మీరు మా హితము. కోరువారు కనుక, మమ్ము ఆశీర్వదించి సంతుష్టపరచి మాకు కుడిభాగము నుండి మీరు వచ్చినట్లే తిరిగి మీ - మీ యిండ్లకు పొండు. మీతో మాకు నెరవేర వలసిన పని యున్నప్పుడు మాకు హితము చేయుడు.

"జనమేజయా! ఆ మాటలు విని పౌరులు పాండవులను ఆశీర్వదించి ప్రసన్న చిత్తముతో వారికి కుడి వైపుగా నగరమునకు పోయిరి.

"జనమేజయా! తరువాత సత్యధర్మములను తెలిసిన విదురుడు యుధిష్ఠిరునితో మ్లేచ్ఛ భాషలో తెలుప దలచెను. యుధిష్ఠిరునకు గూడ మ్లేచ్ఛ భాష తెలిసి యుండెను. ఆ భాష యితరులకు తెలియదు. కనుక అతనికి తెలియునట్లు విదురుడు ఆ భాషలో రహస్య విషయముల నిట్లు తెలిపెను :-

"నాయనా! శత్రువుల నీతిని తెలిసికొనువాడు అది తెలిసిన తరువాత, శత్రువులు కలిగించు సంకటముల నుండి తప్పించుకొన వలెను. నీతి శాస్త్రము ఉక్కుతో చేయబడినది కాకున్నను, అది తీక్ష్ణ శస్త్రమువలె శత్రు శరీరమును, నష్టపరచును. ఆ శాస్త్రపు దెబ్బను తప్పించుకొనుటకు ఉపాయము తెలిసిన వానిని శత్రువు చంపలేదు.

"కక్షఘ్నము (గడ్డివామి కాల్చునది), శుష్క వృక్షములు గల అడవిని కాల్చునట్టిది, చలిని పోగొట్టునట్టిదియు నగు అగ్ని వనములో వ్యాపించినప్పుడు గూడ బిలముతో నున్న ఎలుకలు మొదలైన జంతువులను కాల్చ జాలదు."

*విదురుడు[1] చెప్పిన ఈ గుప్త వాక్యము వలన 'యుధిష్ఠిరా! శత్రువులు మీ కొరకు అగ్ని చేత కాలు వస్తువులతో ఒక భవనము నిర్మించినారు. ఇక్కడ శస్త్రశబ్దమునకు మూల రూపము 'సస్త్రము' దానికి గృహము అని యర్థము.

అని తలచి తన రక్షణోపాయము చేసికొనువాడే జీవించగలడు.[2]

కన్నులు లేని వానికి త్రోవ తెలియదు. అతనికి దిక్కులు గూడ తెలియవు. ధైర్యము పోయిన వానికి సద్బుద్ధి కలుగదు. ఇట్లు నీకు నేను వివరించి తెలిపిన తరువాత, నీవు నా మాట బాగుగా తెలిసికొనుము.

శత్రువులు ప్రయోగించిన లోహనిర్మితములు గాని శస్త్రములను గ్రహించువాడు, ఏదుపంది బిలములో దూరి, అగ్నినుండి తప్పించుకొని బ్రతకగలడు.

మనుష్యుడు తిరుగుచు, మార్గములను కనుగొన గలడు నక్షత్రములచేత దిక్కులను కనుగొన గలడు. పంచేంద్రియములను తానే అణచినవాడు. శత్రువుల చేత బాధింప బడడు.[3]

1. ఇందలి భావ మేమనగా, ఇక్కడ మీ ప్రక్కనున్న పురోచనుడే మిమ్ము అగ్నిలో కాల్చి నశింప జేయును. అగ్నిని తప్పించుకొనుటకు మీ కొక సొరంగము నిర్మించుకొన వలెను. ఇక్కడ 'కక్షఘ్న' శబ్దమునకు 'కుక్షిఘ్న' అని మూల రూపము. దానికి కుక్షిలో సంచరించునది. అథవా పార్శ్వమునందు ఉండునది అని యర్థము. (ఘ్న శబ్దము 'హన' ధాతువు నుండి యేర్పడినది), ఆ ధాతువునకు 'గతి'యను నర్థముగూడ నున్నది. కనుక, 'సంచరించునది' - 'ఉండునది' యని యిచట గత్యర్థము చెప్ప బడెను.
2. అనగా, దిక్కులు మొదలైన ప్రదేశములను తొలుతనే బాగుగా తెలిసికొన వలెను. దానివలన రాత్రివేళల త్రోవ దప్పుట మొదలైన బాధలు కలుగవు. ఇందలి భావ మేమనగా, మీరు ఈ సొరంగమునుండి తప్పించుకొని బయటకు పోయిన యెడల, లక్కయింటికి అంటుకొనిన అగ్నినుండి తప్పించుకొని బ్రతుక గలరు.
3. అనగా మీ యైదుగురు సోదరులు ఏకాభిప్రాయముతో నుండిన యెడల శత్రువులు మీకు ఏలాంటి యపకారము చేయజాలరు.

"జనమేజయా! యిట్లు విదురుడు మ్లేచ్ఛ భాషలో చెప్పిన తరువాత, యుధిష్ఠిరుడు విదురునితో, 'నీ మాట పూర్తిగా నేను గ్రహించినాను.' అని యనెను. ఈ విధముగా విదురుడు, పాండవులకు పలుసార్లు ఉపదేశించుచు వారి వెంటనే కొంత దూరము పోయి, వారిని వీడ్కొలిపి, వారికి కుడివైపుగా తిరిగి తన యింటికి పోయెను. విదుర - భీష్మాదు లందరు తిరిగి వారి యిండ్లకు పోయిన తరువాత కుంతీదేవి యుధిష్ఠిరునితో నిట్లనెను:-

"పుత్రా! విదురుడు నీతో చెప్పిన మాటలకు నీవు 'చాలమంచిది' అని యంటివి. ఆయన మాటలు మా కేమియు తెలియలేదు. ఆ మాటలు మేము గూడ తెలిసికొనుట తప్పు కాకున్న యెడల మీ యిరువురి మాటల రహస్యము తెలిసి కొన గోరుచున్నాను."

ఆ మాటకు యుధిష్ఠిరుడు తల్లితో నిట్లనెను :-

"అమ్మా! యెల్లప్పుడు ధర్మమునందే బుద్ధి గల విదురుడు రహస్యభాషలో, నాతో, "యుధిష్ఠిరా! నీవు నివసించ బోవు ఇంటిలో అగ్ని భయము గలదు. సందేహము లేదు. అక్కడ నీకు అపరిచితములైన మార్గము లేవి గూడ ఉండ గూడదు. నీవు ఇంద్రియములను వశములో నుంచి కొనిన యెడల, సమస్త భూమండల రాజ్యమును పొందగలవు." అని చెప్పెను. అతని మాటలకు నేను 'నాకంతయు తెలిసినది' అని బదులు చెప్పితిని.

"జనమేజయా! పాండవులు, ఫాల్గుణ శుక్ల అష్టమినాడు, రోహిణీ నక్షత్ర మునందు ప్రయాణము చేసిరి. వారు అనుకున్న నాటికి వారణావతమునకు పోయిరి."

**వారణావతములో పాండవులకు స్వాగతము :**

''జనమేజయా! పాండవులు వచ్చిన సమాచారము విని వారణావత పురవాసులు సంతోషముతో మంగళవస్తువులతో వారికెదు రేగి, స్వాగతము చెప్పిరి. వారు జయజయకారములు చేయుచు పాండవులను దీవించుచు వారిచుట్టు చేరిరి. వారినడుమ నున్న యుధిష్ఠిరుడు దేవతలమధ్య ఇంద్రునివలె ప్రకాశించెను.

"జనమేజయా! పాండవులుగూడ ఆ ప్రజలను ఆదరించుచు పట్టణములో ప్రవేశించి, అక్కడి బ్రాహ్మణ - క్షత్రియ-వైశ్య - శూద్రుల యిండ్లకు పోయి వారిని ఆదర పూర్వకముగా పలుకరించి వారిచే పూజితులై, పురోచనుని ముందిడుకొని అత డేర్పరచిన పటకుటీరము (దేరాకుకు) పోయిరి. అక్కడ పురోచనుడు వారి కొరకు ఆవశ్యకములైన మంచి వస్తువు లన్నియు సిద్ధపరచి యుండెను. నగరవాసులు వారిని సేవించుటకు వచ్చిరి.

"జనమేజయా! పది దినములు ఆ పట కుటీరమునం దుండిన తరువాత పాండవులతో పురోచనుడు, 'వారి కొరకు నిర్మించిన 'శివము' (మంగళకరము) అను అమంగళకరమైన లక్క యింటికి పోవుద' మనగా పాండవులు అంగీక రించి, కైలాస పర్వతమునకు గుహ్యకులవలె పోయిరి.

**భీమ యుధిష్ఠిరుల సంభాషణము :**

"జనమేజయా! ఆ యింటిని బాగుగా పరిశీలించి చూచి యుధిష్ఠిరుడు భీమసేనునితో నిట్లనెను" :-

"సోదరా! ఈ యిల్లు అగ్నిని రగుల్కొల్పు వస్తువులతో నిర్మింప బడినట్లు తోచుచున్నది. ఈ యింటి గోడలనుండి నేయి, లక్క, క్రొవ్వు మొద లగు వస్తువుల వాసన వచ్చుచున్నది. జనుపనార, మద్ది కొయ్యలు, ముంజగడ్డి జమ్ముమవంటి లావుగడ్డి, వెదుళ్ళు మొదలైన వస్తువులను నేతిలో తడిపి మిక్కిలి జాగ్రత్తగా, చాతుర్యముతో చేర్చి ఈ సుందర భవన నిర్మాణము చేయబడినది".

"దుర్బుద్ధి, పాపిష్ఠుడు నైన పురోచనుడు దుర్యోధనాజ్ఞా వశుడై, మనము విశ్వసించి నిద్రించినప్పుడు ఈ యింటికి అగ్ని అంటించి మనను కాల్చవలె నని తలచు చున్నాడు. విదురుడు మనకు కలుగ బోవు ఈ విపత్తిని తెలిసికొని నాకు తెలిపెను. విదురుడు మనకు పిన తండ్రి. మనహితము కోరువాడు. కనుక, అతడు మనయందలి స్నేహము చేత ఈ యమంగళకరమైన గృహమును గూర్చి రహస్యముగా తెలిపెను.

ఆమాట విని భీమసేనుడు 'అన్నా! ఇది సత్యమే యైనచో మనము ఇంతకు ముందున్న చోటికే పోవుదము. క్షేమముగా ఆ యింటిలోనే మనము ఉండగూడదా?' అని యనగా, యుధిష్ఠిరుడు భీమునితో నిట్లనెను:-

"సోదరా! మన మనస్సులోని మాటను బయటకు అన గూడదు. ఇక్కడి నుండి తప్పించుకొని పోవుటకు మార్గమును కనిపెట్టుచు పూర్తిగా జాగ్రత్తతో ఇక్కడనే యుండుట మంచిది. పురోచనుడు మన బాహ్య చేష్టలవలన మన మనో భావమును కనిపెట్టిన యెడల, త్వరగా తన పని నెరవేర్చుటకు ఉద్యుక్తుడై ఏదో యొక కారణముచేత మనను దహించ గలడు. పురోచనుడు అధర్మమునకు గాని, అపనిందకు గాని, భయపడడు. దుర్యోధన వశవర్తియై, అతని యాజ్ఞాను సారముగా నాచరించగలడు.

"సోదరా! మనము ఇక్కడ దహింపబడిన తరువాత భీష్ముడు కౌరవులను కోపించిన యెడల అది ఉపయోగపడదు. 'అయన ఎందుకు కౌరవులను కోపించును? మనను చంపిన దుర్యోధనుని ఒకవేళ కురువృద్ధులు కోపించినను దానివలన మనకు యేమి ఉపయోగము?" అని మనము తలచగూడదు. మనము దహింపబడుదుమను భయముచేత పారిపోయినప్పటికిన్ని, రాజ్యలోభము గల దుర్యోధనుడు తన గూఢచారుల ద్వారా మనను చంపించ గలడు.

"సోదరా! దుర్యోధను డిప్పుడు పరిపూర్ణ రాజ్యాధికారము నందుండి మనను వంచించినాడు. అతనికి పరిపూర్ణ సహాయ సంపత్తి కలదు. మనము అసహాయులము. అతనికి అనంతమైన ధనమున్నది. మనము పూర్తిగా దరిద్రులము. కనుక, దుర్యోధనుడు అనేక విధములైన ఉపాయములతో మన హత్య చేయగల డనుట నిశ్చయము.

"కాబట్టి, తమ్ముడా! పాపాత్ములైన పురోచన - దుర్యోధనులను మనము వంచించి యిక్కడనే ఒక రహస్యస్థానమందు నివసించవలెను. మనమందరము వేట ఆడుచు ఈ ప్రదేశమంతయు తిరుగుదము. అప్పుడు మనకు ఇక్కడినుండి తప్పించుకొని పోవుటకు మార్గములు అనేకములు తెలియగలవు.''

"తమ్ముడా! యిదిగాక, నేటి నుండియే మనము నేలలో ఒక సురంగము నిర్మించి దానిని కప్పి ఉంచుదము. అక్కడ మన శ్వాసముకూడ బయటికి

వెడలకుండు నవగా మనముచేయు ప్రయత్నముల మాట చెప్ప వలసినదేమున్నది? ఆ సురంగములో దూరిన తరువాత అగ్ని మనను దహింపదు.''

"కనుక, తమ్ముడా! మనము సోమరితనము విడిచి ఈ విధముగా ప్రయత్నించవలెను. దీనిచేత మనము ఇక్కడ ఉన్నామని పురోచనునకు గాని, పురవాసులకు కాని ఏ మాత్రము తెలియదు.''

**విదురుడు పంపిన ఖనకుడు సురంగము నిర్మించుట :**

"జనమేజయా! సురంగము త్రవ్వువాడొకడు విదురుని విశ్వాసపాత్రుడు, కార్యచతురుడు ఉండెను. అతడొకనాడు ఏకాంతమునందు, పాండవులతో కలిసి యిట్లనెను :-''

"ప్రభువులారా! నన్ను విదురుడు పంపినాడు. సురంగము త్రవ్వు పనిలో నిపుణుడను. నా పేరు ఖనకుడు. పాండవులకు నేను ప్రియము చేయ వలెను గనుక, నేను చేయవలసిన సేవ తెలుపుడు. నాతో విదురుడు, 'నీవు గుప్తముగా వారణావతమునకు పోయి పాండవులకు హితమైన కార్యము విశ్వాస పూర్వకముగా చేయుము, అని చెప్పెను. కనుక, నేనేమి చేయవలెనో ఆజ్ఞ యివ్వగలరు. ఈ కృష్ణపక్ష చతుర్దశిరాత్రి పురోచనుడు ఈ మీ యింటిద్వారము నకు నిప్పు అంటించ గలడు. 'పాండవులు, వారి తల్లి, దహింపబడ'వలెనని దుర్బుద్ధిగల దుర్యోధనుని ప్రయత్న మిది. రాజా! విదురుడు నీతో మ్లేచ్ఛభాషలో నేదియో చెప్పెను. నీవు అతని సంకేతమునకు 'తథాస్తు' అని యంటివి. ఈ మాట నేను మీకు నా యందు విశ్వాసము కలుగుటకు చెప్పినాను.''

జనమేజయా! అతనిమాట విని యుధిష్ఠిరుడతనితో నిట్లనెను:-

"సౌమ్యా! నేను నిన్ను గుర్తించెదను. నీవు విదురునకు హితైషివి, న్యాయశీలుడవు, విశ్వాసపాత్రుడవు, ప్రియుడవు, విదురునియందు సర్వదా భక్తి గలవాడవు. మాకు ప్రయోజనకర కార్యము విదురునకు తెలియని దేదియులేదు. విదురునకు నీ వెంత ఆదరణీయుడవో, విశ్వసనీయుడవో, మాకును అంతయే. నీ యెడల మాకేలాటి భేదభావము లేదు. విదురుడు మాకెట్లు పాలకుడో, నీవును అట్లే. అతనివలెనే నీవుగూడ మమ్ము రక్షింపుము.

ఈ యిల్లు అగ్ని రగిలించు వస్తువులచేత నిర్మితమైనది. దుర్యోధనుని యాజ్ఞచేత పురోచనుడు దీనిని నిర్మించెనని మా విశ్వాసము. నీవు ప్రయత్నించి, మమ్ము ఈ యగ్నినుండి రక్షింపుము. మేమిక్కడ దగ్ధులమైనచో, దుర్యోధనుని యిష్టార్థము సఫలము కాగలదు. ఇది, ఆ దురాత్ముని యాయుధశాల. ఈ శస్త్రములచేతనే ఈ గృహము నిర్మింపబడినది. ఈ యింటి నాలుగు గోడల నడిమి నుండి బయట పడుటకు మార్గము లేదు. ఈ విషయమంతయు తొలుతనే విదురునకు తెలియునుగనుక, యతడు, మాకు ఈ రహస్యము తెలిపెను. ఈ సంకటమునుండి మమ్ము నీవు పురోచనునకు తెలియకుండ కాపాడుము.

జనమేజయా! అప్పుడు సురంగము త్రవ్వువాడు, 'సరే' యని ప్రతిజ్ఞ చేసి కార్యసిద్ధికొరకు ప్రయత్నింప దొడగెను. అగడ్తను సరిచేయు నెపముతో నతడు ఆభవనము నడుమనుండి పెద్ద సురంగము త్రవ్వెను. దానిముఖ మెవరికిన్ని తెలియబడ జాలకుండెను.

"ఖనకుడు, పురోచనుని భయమువలన, సురంగము ముఖము కప్పి యుంచెను. దుష్టపురోచనుడు సర్వదా యింటి వాకిట్లోనే కూర్చొనుచుండెను. పాండవులుగూడ, రాత్రులలో శస్త్రధారులై జాగ్రత్తతో, ఆ ద్వారమునందే నివసించు చుండిరి. కనుక అగ్ని అంటించునవకాశము పురోచనునకు దొరక కుండెను. పాండవులు పగళ్ళు వేటాడుటకు వనములో తిరుగుచుండిరి. వారికి మనస్సులలో విశ్వాసము లేనందుచేత జాగ్రత్తతోనే యుండిరి. బయటకు మాత్రము పురోచనుని మోసగించుటకు విశ్వాసము గలవారి వలె వ్యవహరించు చుండిరి. రాజా! వారు సంతుష్టులు కాకున్నను, సంతుష్టుల వలెనే నివసించుచు, మిక్కిలి విస్మయము చెంది యుండిరి.

"జనమేజయా! సురంగము త్రవ్వు ఖనకుడు దప్ప, నగరవాసు లెవరున్ను పాండవుల విషయములో నేమియు నెరుగకుండిరి.

**లాక్షా గృహ దహనము - పాండవులు సురంగము నుండి బయలు వెడలి పోవుట :-**

"జనమేజయా! పాండవులు లాక్షాగృహమందు ఒక సంవత్సరము నుండి సంతోషముతో విశ్వాస పూర్వకముగా నున్నట్లు, ఉండుట చూచి, పురోచనునకు

మిక్కిలి సంతోషము కలిగెను. ఇట్లు అతడు ప్రసన్నుడై యుండినప్పుడు యుధిష్ఠిరుడు సోదరులతో నిట్లనెను:-

"తమ్ములారా! పాపిష్ఠుడైన పురోచనుడు మనమిక్కడ పూర్తిగా నమ్మి యున్నట్లు తలచుచున్నాడు. ఇంతదాక మన మీక్రూరుని మోసగించి యున్నాము. 'ఇప్పుడు మనము ఇక్కడినుండి వెడలిపోవుటకు సరియైన కాలము' అని తలచెదను. ఈ యాయుధాగారమునకు నిప్పు అంటించి పురోచనుని దగ్ధునిజేసి దీనిలోపల ఆరుగురు వ్యక్తులను ఉంచి ఎవ్వరికిని కనపడకుండ మనము పారి పోవుదము.

"జనమేజయా! ఇట్లు వారు మాట్లాడుకొనిన తరువాత ఒకనాటి రాత్రి కుంతీదేవి దానములు ఇచ్చుట కొరకు బ్రాహ్మణ భోజనము చేయించెను. ఆ భోజనమునకు అనేక స్త్రీలుగూడ వచ్చి యుండిరి. ఆ స్త్రీ లందరు స్వేచ్ఛగా అక్కడ తిరుగుచు, తిని-త్రాగిన తరువాత కుంతీదేవితో ఆజ్ఞ తీసికొని ఆ రాత్రి మరల తమ-తమ యిండ్లకు పోయిరి. కాని, దైవేచ్ఛ చేత ఆ భోజన సమయ మందు ఒక భిల్ల స్త్రీ ఆమె యైదుగురు కొడుకులతో పాటు, కాలమే ఆమె నక్క డకు ప్రోత్సహించి పంపెనా యనునట్లు, భోజనము చేయుటకు వచ్చెను. ఆభిల్ల స్త్రీ మద్యపానము చేత మత్తిల్లి యుండెను. ఆమె కొడుకులు గూడ మద్యపాన మత్తులై యుండిరి. దానిచేత వారు స్మృతి దప్పి ఆ యింటిలో నిద్రించి, మృతుల వలె పడియుండిరి. ఆ రాత్రి గొప్పగా సుడిగాలి వీచెను. అప్పుడు భీమసేనుడు పురోచనుడు పండుకొనిన యింటికి అగ్ని అంటించి తరువాత లాక్షాగృహ ముఖద్వారమునకు గూడ నిప్పు అంటించెను. ఆ తరువాత, అతడు ఆ ఇంటికి నలువైపుల నిప్పు అంటించెను. ఇల్లంతయు అగ్నిజ్వాలలో రగులుకొను చున్నప్పుడు శత్రుదమనులైన పాండవులు తల్లితోపాటు సురంగములో దూరిరి. ఆ యిల్లంతయు అంటుకొని భయంకరమైన తాపము అంతట వ్యాపించెను. ఆ యిల్లు కాలుచున్నప్పుడు బిగ్గరగా చట-చట ధ్వనులు వినపడుచుండెను. ఆ ధ్వని చేత ఆ పురజనులు మేల్కొని ఆ యిల్లు కాలుచుండుట చూచి మిక్కిలి దుఃఖిం చుచు ఇట్లనుకొనిరి :-

"అయ్యో! పాపిష్ఠుడైన పురోచనుని యంతఃకరణము వశము దప్పి యుండెను. అతడు దుర్యోధనాజ్ఞ చేత తన వినాశము కొరకె ఈ యింటిని నిర్మించి కాల్చెను. ధృతరాష్ట్రుని బుద్ధి చెడిపోయెను. అతడు పవిత్రులైన పాండు పుత్రులను శత్రువులను వలె అగ్నితో కాల్చెను. అతనికి ధిక్కార మగు గాక! ఇందులో మంచి యేమనగా దుర్బుద్ధియైన పురోచనుడు గూడ దగ్ధుడై చచ్చెను. ఏ యపరాధము చేయక తనను పూర్తిగా విశ్వసించిన పాండవులను అతడు దహించెను.

"జనమేజయా! ఈ విధముగా విలపించుచు వారణావత పురజనులు ఆ రాత్రి యంతయు ఆ లక్క యింటి నలు వైపుల చుట్టి నిలిచి యుండిరి.

"జనమేజయా! అటు పాండవులు గూడ మిక్కిలి దుఃఖితులై తమ తల్లితోపాటు సొరంగ మార్గము గుండా బయలుదేరి త్వరగా దూరము వెడలి పోయిరి. వారి నెవరు గూడ చూడలేదు. నిద్రలేనందువలన అలసట గలిగి వారు భయముతో త్వర - త్వరగా నడువజాలకుండిరి. అప్పుడు అతివేగము, పరాక్రమ మున్న గల భీమసేనుడు తన సోదరులను, తల్లిని తీసికొని పోవుచుండెను. తల్లిని భుజముపై నెక్కించుకొని నకుల - సహదేవులను ఒడిలోకి తీసికొని, తక్కిన యిద్దరు సోదరులను రెండు చేతులతో పట్టుకొని వారి కాశ్రయమిచ్చి నడచుచుండెను. పరాక్రమవంతుడైన భీముడు వాయు వేగముతో పోవుచు ఎదురు పడిన వృక్షములను ఎదచేత కొట్టి విఱుచుచు పాదతాడనములచేత భూమిని చీల్చుచు తీవ్ర గమనముతో ముందుకు సాగిపోవుచుండెను".

**విదురుడు పంపిన నావికుడు పాండవులను గంగాతీరము చేర్చుట :-**

"జనమేజయా! ఆ సమయమందే పరమజ్ఞాన సంపన్నుడైన విదురుడు తనకు విశ్వాసపాత్రుడు, పవిత్ర భావములుగలవాడు నగు నొక పురుషుని ఆ వనమునకు పంపెను. విదురుని యుపదేశము ప్రకారము ఆ పురుషుడు, అక్కడ గంగలో ఎంత లోతు జలము ఉన్నదో యని అనుమానముతో పాండవులు నిలిచి యున్న గంగా తీరమునకు పోయి వారిని చూచెను. విదురునకు పురోచనుని పాడు చేష్టలు గూడ గూఢచారుల ద్వారా తెలిసి యుండెను. కనుకనే అతడప్పుడు ఆ మనుష్యుని అక్కడకు పంపి యుండెను.

"జనమేజయా ! ఆ మనుష్యుడు మనో-వాయు వేగముతో నడచునటు వంటి యొక నౌకను పాండవులకు చూపించెను. ఆనావ అన్ని విధములైన వాయువుల వేగమును సహించుటకు సమర్థమై యుండెను. ధ్వజ - పతాకలతో, సుశోభితమైన యాపడవ నడపుటకు దాని కొక యంత్రము చేర్చబడి గంగా తీరమునందు ఉండెను. దానిని విశ్వాసపాత్రులైన మనుష్యులు నిర్మించి అక్కడ సిద్ధముగా నుంచి యుండిరి. అప్పుడు ఆ మనుష్యుడు ఇట్లనెను :-

యుధిష్ఠిర మహారాజా ! నేను నీకు విశ్వాస పాత్రుడనని తెలియుటకు విదురుడు నీకు ఒక సంకేతము తెలుపుమనెను. అది యేమనగా- "ఎండుగడ్డి - ఎండిన వృక్షములున్ను గల అడవిని కాల్చునట్టిది, చలిని నశింప జేయునట్టిదియు నగు అగ్ని విశాల వనమునందు వ్యాపించి యున్నను బలమునందున్న యెలుకలు మొదలైన జంతువులను కాల్చజాలదు. అని తెలిసికొని, తన రక్షణమునకు ఉపాయములు జేసికొను మనుష్యుడు జీవించి యుండను. "అని".

"రాజా ! నీకు సంకేతమునకై విదురుడు నాద్వారా యిట్లు చెప్పి పంపెను. ఈ సంకేతముచేత, నేను విశ్వాసపాత్రుడనని, విదురుడే నన్ను పంపెననియు తెలిసికొనుము. ఇంతియే కాక, విదురుడు మరియొక సందేశము గూడ నీకు పంపెను. అది యేమనగా - 'నీవు యుద్ధమందు సోదర సహితుడైన దుర్యోధనుని, కర్ణ-శకునులనున్ను తప్పక జయించెదవు' అని రాజా! ఈ నౌక జల మార్గమునందు పోవుటకు ఉపయుక్తమైనది. ఇది జలములో మిక్కిలి సుగమముగా పోవును. ఈ నావమిమ్మందరను చాలదూరదేశము కొనిపోయి విడుచును. ఇందులో సందేహము లేదు.

"జనమేజయా! ఇట్లు నావికుడు చెప్పిన తరువాత, పాండవులు, కుంతీదేవి దుఃఖింతులై యుండుటచూచి, నావికుడు వారిని నావలో నెక్కించి గంగలో పోవుచు మరల నిట్లనెను :-

"యుధిష్ఠిర మహారాజా! విదురుడు మిమ్మందరను మనస్సుతో కౌగలించుకొని మీతలలు మూర్కొని మీరు శాంతచిత్తులై మార్గములో సాగిపోవుటకు హృదయపూర్వకముగా మిమ్ము ఆశీర్వదించెను.

"జనమేజయా! విదురుడు పంపిన యానావికుడు పాండవులతో నిట్లు చెప్పి, ఆ నావలోనే, వారిని గంగానదిని దాటించిన తరువాత వారు గంగ యావలియొడ్డు చేరినప్పుడు వారికి ఆ నావికుడు జయ - జయధ్వనులతో తన యభినందనములు తెలిపి తిరిగి వెడలి పోయెను.

"జనమేజయా! పాండవులు విదురుని సందేశమునకు ఉత్తరమును ఆ నావికుని ద్వారా చెప్పి పంపి, గంగదాటి ప్రచ్ఛన్నులుగా ఎవరికిని తెల్లియకుండ వేగముగా అక్కడి నుండి వెడలిపోయిరి. ఎవరుగూడ వారిని గుర్తుపట్టజాలకుండిరి.

**ధృతరాష్ట్రాదులు పాండవుల కొరకు దుఃఖించుట - జలాంజలి యిచ్చుట - పాండవుల వన ప్రవేశము :-**

"జనమేజయా! ఆ రాత్రి గడచిన తరువాత, వారణావత పౌరులందరు, పాండవుల యవస్థ చూచుటకు, చాల త్వరగా, లక్కయింటి కడకు వచ్చి, అగ్నిని చల్లార్చుటకు పూనుకొనిరి. అప్పుడు వారు ఆ యిల్లంతయు - లక్కతో నిర్మింపబడిన దని తెలిసికొనిరి. దానిలోనే పురోచనుడు గూడ కాలి యుండెను.

"జనమేజయా! యిది యంతయు చూచి ప్రజలు పెద్దగా ఆక్రోశించుచు, 'దుర్యోధనుడు పాండవుల వినాశముకొరకే యీ భవనము నిర్మించెను. ఇది నిశ్చయము' అని యన జొచ్చిరి. పాపిష్ఠుడైన దుర్యోధనుడు, ధృతరాష్ట్రునకు తెలిపియే పాండవులను దహించె ననుటలో సందేహము లేదు. ధృతరాష్ట్రుడు కొడుకును నివారించలేదు. ఈ విషయములో భీష్మ-ద్రోణ-విదుర-కృపాచార్యులు, ఇతర కౌరవులు గూడ అధర్మముగానే నడచిరి. ఇప్పుడు మనము దురాత్ముడైన ధృతరాష్ట్రునకు, 'నీకు అన్నిటికన్న పెద్ద కోరిక తీరినది. నీవు పాండవులను దహించుటలో సఫలుడ వైతివి' అని సందేశము పంపుదము.

"జనమేజయా! తరువాత, ఆ పౌరులు పాండవులను వెదకుటకు అగ్నిని ఇటు - నటు కలియ బెట్టినప్పుడు, అయిదుగురు పుత్రులతో నిరపరాధురాలైన భిల్ల స్త్రీ శవములు కనపడెను. ఆ సురంగమును త్రవ్విన ఖనకుడు, ఆ యింటిని ఊడ్చునప్పుడు ఆ సురంగపు రంధ్రమును కప్పుటచేత ఇతరుల దృష్టి దానిపై బడలేదు.

తరువాత, ఆ ప్రజలు ధృతరాష్ట్రునకు, పాండవులు, పురోచనుడున్ను అగ్నిలో కాలినారు అని తెలిపిరి. అదివిని ధృతరాష్ట్రుడు, మిక్కిలి దుఃఖించి, 'అహా!' కుంతీదేవి, ఆమె పుత్రులున్ను దహింపబడుటచేత నేడు నా తమ్ముడు పాండురాజు మరణించినట్లు అనిపించుచున్నది? అని విలపించెను.

"అప్పుడు ధృతరాష్ట్రుడు, ఇప్పుడే మావారు కొందరు వారణావతమునకు పోయి, కౌంతేయులకు, కుంతికిన్ని, ఆదరపూర్వకముగా, దహనసంస్కారము చేయింతురుగాక! ఇంకను ఆ యింటిలో మరణించిన వారి బంధువులుగూడ వారి దహన సంస్కారాదులు చేయుటకు పోవుదురు గాక! ఇట్టి పరిస్థితిలో, పాండవులకు, కుంతీదేవికిన్ని, హితమైన కార్యక్రమము కొరకు, నాకు సాధ్యమైనంతవరకు, ధనము వెచ్చించెదను."

"జనమేజయా! దృతరాష్ట్రుడిట్లు చెప్పి, తన బంధువులతో కలిసి పాండవులకు జలాంజలి యిచ్చెను. అప్పుడు భీష్మాదులందరు సపుత్రభాంధవముగా పాండవులకు జలాంజలి యిచ్చుటకు గంగాతీరమునకు పోయిరి. వారి శరీరములందు ఒక్కొక్క వస్త్రమే ఉండెను. తలపాగలు, భూషణములను తీసి సంతోషశూన్యులుగా నుండిరి. అప్పుడందరు నొకచోట చేరి, పాండవులలో నొక్కొక్కరి పేర్లు ఉచ్చరించుచు నేడ్చిరి. ఇట్లే పురజనులుగూడ పాండవుల కొరకు మిక్కిలి దుఃఖించిరి. విదురుడు, వాస్తవము తెలిసినవాడు గనుక, తక్కువ యేడ్చెను. భీష్మ డెక్కువగా దుఃఖించుచు నిట్లనెను:-

"భీమార్జునులు ఉత్సాహ శూన్యులైనట్లు నాకు తోచదు. వారు వేగముగా, ఒక్క త్రోపు త్రోసినయెడల, దృఢమైన యింటినిగూడ పడగొట్టగలుగు చుండిరి. కనుక, పాండవులు, కుంతియు మరణించినారని నేననుకొనను. వాస్తవముగా వారందరు మరణించియే యుండనయెడల, చాల చెడ్డకార్యమే అయినది. యుధిష్ఠిరుని విషయములో బ్రాహ్మణులు, ఇతడు యమధర్మరాజు అనుగ్రహించిన పుత్రుడు. ఈ రాజకుమారుడు సత్యవ్రత పాలకుడు, సత్యవాది, శుభలక్షణ సంపన్నుడున్ను కాగలడు అని చెప్పియుండిరి.

"ధర్మరాజైన యుధిష్ఠిరుడు అపర్శపురుషుడై, దానికి తగినట్లుగానే, యితరులతో వ్యవహరించుచుండెను. అతడు యువరాజ పదవిలో అభిషిక్తుడైన

వెంటనే, తన తండ్రివలెనే, సత్య-ధర్మములతో వ్యవహరించుట చేత, తన కీర్తియేకాక, తన తండ్రియగు పాండురాజు కీర్తిగూడ విస్తరింపజేసెను. ఉత్తమ కులోత్పన్నురాలైన కుంతి, పుత్రప్రేమచేత, వనవాస క్లేశమును, అనుభవించి, దుఃఖముపై దుఃఖము అనుభవించి, పతి మరణించిన తరువాత గూడ సహ గమనము చేయలేదు. ఆమెకు చాల కొలది కాలమే పతిప్రేమ ప్రాప్తించెను. ఆమె మనోరథము నెరవేరుటకు పూర్వమే పుత్రులతో దగ్ధురాలయ్యెను, ఇటు వంటి యుధిష్ఠిరుడు, తల్లి, కుంతీదేవియు ఎట్లు కాలధర్మము చెందిరి? కాలమునకు ధిక్కార మగుగాక!

"నిండు మెడలు మనోహర భుజములు, మేరు పర్వతశిఖరము వంటి సౌందర్యము, మంచి యౌవనమున్ను గల భీమసేనుడు మరణించెనని వినినను నాకు విశ్వాసము గలుగుట లేదు, సర్వదా ఉత్తమ మార్గములో సంచరించుచు మంచి హస్తలాఘవము, దృఢాయుధములు, గురుజనాశ్రయశీలము, అమోఘ లక్ష్యవేధ, రథచాలనకౌశలము, దూరముదాక, లక్ష్యవేధన సామర్థ్యము, సర్వదా అవ్యాకులత్వము, మహాపరాక్రమము, శస్త్రాస్త్ర పాండిత్యము, దైన్యరాహిత్యము, మనుష్యులలో సింహ పరాక్రమశాలిత్వము, సమస్త ధనుర్ధర శ్రేష్ఠత్వము ప్రాచ్య - సౌవీర - దాక్షిణాత్య రాజుల పరాజయము, త్రిలోక పౌరుష ప్రసిద్ధి తనజన్మము చేత తలిదండ్రుల శోక వినాశము, ఇంద్ర సమాన విజయశాలిత్వమున్ను గల వీరార్జునుడు గూడ కాలవశు డెట్లయ్యెను. అబోతుల వలె బలసిన కబంధములు, సింహము వంటి మత్తగమనమున్ను గలిగి, శత్రు సంహారము చేయగల నకుల - సహదేవులు హఠాత్తుగా నెట్లు మరణించిరి?"

"జనమేజయా! జలాంజలి యిచ్చునప్పుడు భీష్ముడు చేయుచున్న యీ విలాపము విని, విదురుడు - దేశ - కాలములను విచారించి భీష్మునితో నిట్లనెను:-"

"నరోత్తమా! నీవు దుఃఖింపకుము. నీవు మహావ్రత నిష్ఠాపరుడవు, శోకము విడువుము. పాండవులు మరణించ లేదు. ఆ సమయమునందు తగిన కార్యము నేను చేసితిని. నీవు, పాండవులకు జలాంజలి యీయకుము."

"జనమేజయా! ఆమాట విని భీష్ముడు విదురుని చేయి పట్టుకొని; అతని మాట కౌరవులు విన జాలనంత దూరము అతనిని తోడ్కొనిపోయి, కన్నీరు గార్చుచు, గద్గద స్వరముతో నిట్లనెను :-"

"నాయనా! మహారథికులైన పాండు పుత్రులెట్లు బ్రతికిరి? మన వంశములో పాండురాజు పక్షము ఎట్లు నష్టము కాలేదు? గరుడుడు తల్లిని రక్షించినట్లు నీవు ఎట్లు పాండు కుమారులను బ్రతికించి, మాకందరకు భయము లేకుండ జేసితివి?"

"జనమేజయా! భీష్ముని మాటకు విదురుడు, కౌరవులకు వినపడకుండునట్లు భీష్మునితో నిట్లనెను :-"

"మహాత్మా! శకుని - దుర్యోధన - ధృతరాష్ట్రులు పాండవులను నశింపజేయవలెనని దృఢముగా తలచియుండిరి. తరువాత లక్కయింటికి పాండవులు పోయినప్పుడు, దుర్యోధనుని యాజ్ఞచేత కుంతీదేవిని సపుత్రకముగా దహించవలెనని పథకము వేసినప్పుడు, నేనొక భూమి త్రవ్వువానిని పిలిచి, భూగర్భమునందు గుహతోపాటు ఒక సురంగమును త్రవ్వించి, ఆ లక్కయిల్లు కాలుటకు పూర్వమే పాండవులను, కుంతిని ఆ యింటినుండి బయటపడునట్లు చేసితిని. కనుక శోకింపకుము."

"రాజా! పాండవులు తల్లితోపాటు, భయంకరమైన యగ్నిదాహమునుండి దూరముగా పోయిరి. ఈ నా యుపాయముచేతనే, ఈ కార్యము సాధ్యపడెను. నిశ్చయముగా పాండవులు జీవితులై యున్నారు. కనుక, వారికొరకు నీవు శోకింపకుము. ఈ కాలము మారి మంచికాలము వచ్చువరకు పాండవులు గుప్తముగా భూమండలమునందు సంచరించు చుండెదరు. అనుకూలకాలము వచ్చినప్పుడు రాజు లందరు యుధిష్ఠిరుని చూచెదరు."

"జనమేజయా! పాండవులు గూడ వారణావతము నుండి వెడలి, తల్లితో గంగాతీరము చేరిరి. వారు నావికుల భుజబలముచేత, నదీ ప్రవాహవేగముచేత, అనుకూల వాయు సహాయముచేతను, త్వరగా నది దాటి నావ దిగిరి.

"తరువాత వారు రాత్రి నక్షత్రముల వెలుగులో మార్గము కనిపెట్టి, దక్షిణదిశగా పోయిరి. ఇట్లు వారు ముందుకు సాగపోవుచు నొక దుర్గమారణ్యము చూచిరి. అప్పుడు పాండవులు మిక్కిలి అలిసి, దప్పిగొని, ఎక్కువ మేల్కొనుట చేత, నిద్ర వచ్చి, అంధుల వలె అగుచుండిరి. అప్పుడు వారు భీమసేనునితో నిట్లనిరి :-

"వీరవరా! మనము ఈ దుర్గమారణ్యము నందు చిక్కుకొని, దిక్కులు గూడ తెలియక, నడచుటకు గూడ అసమర్థులమై యుండుటకంటె మించిన మహా కష్ట మేముండును? పాపిష్ఠుడైన పురోచనుడు దహింపబడెనా? లేదా? అను విషయము గూడ మనకు తెలియదు. మన మితరులకు కనపడకుండ గుప్తముగా నుండి, యిటువంటి మహా సంకటము నుండి విముక్తి యెట్లు పొందగలము?

"సోదరా! నీవు మరల పూర్వము వలె మమ్ము మోసికొని పొమ్ము. మనలో నీ వొక్కడవే మహాబలశాలివి. నిరంతరము నడచుటలో, తిరుగుటలోను నీవు అతి సమర్థుడవు."

"జనమేజయా! ఆ మాటలు విని, మహాబలశాలియైన భీమసేనుడు, తల్లి కుంతీదేవిని, సోదరులనున్ను తనపైన ఎక్కించుకొని మిక్కిలి త్వరగా నడవ దొడగెను."

**భీమసేనుడు, తల్లికి జలము తెచ్చుట - తల్లి, సోదరులు నేలపై శయనించుట చూచి దుఃఖించుట - దుర్యోధనునిపై క్రోధము :-**

"జనమేజయా! భీమసేనుని గమన వేగము చేత ఆవన మంతయు వృక్ష సహితముగా గిర-గిర తిరుగుచున్నట్లు కనపడెను. జ్యేష్ఠాషాఢ మాసముల సంధి కాలమునందు రేగిన సుడిగాలి వలె, భీమసేనుని పిక్కల వేగము చేత గాలి లేచెను. భీమసేనుడు పోవుచోట్ల నెల్ల, అక్కడి వృక్షలతాదులతని తొక్కిడిచేత అణగి నేలమట్ట మగుచుండెను. అతని మార్గ సమీపమునందున్న పుష్పఫల వృక్ష గుల్మాదులను విరిచి, త్రొక్కుచు నతడు పోవుచుండెను. మూడు అవయవముల నుండి మదము స్రవించు అరువదియేండ్ల గజరాజు కోపముతో, వనమునందలి మహావృక్షములను విరుచునట్లే, మహాతేజస్వియైన భీమసేనుడు, అక్కడి మహా

వృక్షములను నేలగూల్చుచు పోవుచుండెను. గరుడుని వలె, వాయువలెను తీవ్ర గమనము గల భీమసేనుడు నడచునప్పుడు, అతని వేగముచేత ఇతర పాండు పుత్రులకు మూర్ఛ వచ్చుచున్నట్లుండెను :-

"జనమేజయా! అతి దూరతీరములుగల నదీ జలప్రవాహముల నతడు మార్గమందు, భుజము లనెడు పడవలచేత దాటి, సోదరులతో, దుర్యోధనుని భయముచేత, ఏదియో రహస్య స్థానమునకు పోయి నివసించెను. భీమసేనుడు సుకుమారియైన తల్లిని వీపుపై నెక్కించుకొని, ఎగుడు - దిగుడులుగా - పారు చున్న నదీ ప్రవాహములతో, అతి కఠినముగా కొనిపోవు చుండెను. అతడట్లు పోవుచు సంధ్యాకాలమునకు, అల్ప - ఫల - మూల జలములు గలిగి, క్రూర పశు పక్ష్యాదులు గల భయంకర ప్రదేశమునకు పోయెను.

"జనమేజయా! ఆ సంధ్య అతి భయానకముగా నుండును. అక్కడ ఆ కాలములో ప్రచండ వాయువు వీచుటచేత సమస్త దిక్కులు దుమ్ము గ్రమ్మి చీకట్లు వ్యాపించెను. గాలితాకిడిచేత వనము నందలి యనేక వృక్ష - గుల్మ లతాదులు తెగి పడియుండెను. వాని యాకులు, పండ్లున్ను చెల్లా చెదురుగా త్రోవలో పడియుండెను. వానిపై పక్షులు కూయుచుండెను. ఈ యన్నింటిచేత సమస్త దిక్కులయందు చీకటి గప్పియుండెను. అప్పుడు పాండవులు మిక్కిలి అలసి దప్పిచేత మిక్కిలి కష్టపడుచు యుండుటచేత వారికి అతినిద్ర వచ్చు చుండెను. దానిచే బాధపడుచు వారు ముందుకు సాగిపోవ జాలకుండిరి.

జనమేజయా! అప్పుడు వారందరు నీరవమైన ఆ విశాల వనమందు నివసించిరి. తరువాత, తల్లి కుంతీదేవి దప్పిగొని, కొడుకులతో, నేను ఐదుగురు కొడుకుల తల్లిని. వారితో కలిసి యుండికూడ దప్పిచే బాధపడుచున్నాను. అని మాటి - మాటికి అనెను. ఆమె వాత్సల్యముతో చెప్పిన యా మాట విని భీమ సేనుని మనస్సు దయార్ద్రమై సంతాపముచెంది జలము తెచ్చుటకు విశాల - నిర్జన భయంకర వనమునందు ప్రవేశించి, అక్కడ ఒక సుందరమైన విశాల పిప్పల (రావి) వృక్షము చూచెను. దానిక్రింద దట్టముగా చల్లని నీడ యుండెను.

"జనమేజయా! అప్పుడు భీమసేనుడు సోదరులను, తల్లిని ఆ వృక్ష చ్ఛాయలో కూర్చొన బెట్టి వారితో "మీ రిక్కడనే విశ్రమించి యుండుడు. నేను జల మున్నచోటు చూచెదను. ఇక్కడ సారసాది జల పక్షులు మధురముగా కూయుచున్నవి. కనుక, ఈ సమీపములోనే, తప్పక ఒక జలాశయము ఉండును." అని చెప్పెను.

"జనమేజయా! అప్పుడు యుధిష్ఠిరుడు, 'పొమ్ము' అని భీమసేనునకు అనుమతి యీయగా. అతడు ఆ జలచర పక్షులున్న చోటికి పోయి, అక్కడ నీరు త్రాగి, స్నానము చేసి, సోదరుల కొరకు, తల్లి కొరకున్ను తన యుత్తరీయమ్ముతో జలము తెచ్చెను. అతడు రెండు కోసుల దూరము త్వర - త్వరగా నడచి తల్లి కడకు పోయెను. వారిని చూచి యతని మనస్సు శోకవ్యాకులమై యతడు సర్పమువలె బుసకొట్టు చుండెను.

"జనమేజయా! తల్లి, సోదరులు నేలపై శయనించి యుండుట చూచి, భీమసేనుడు శోకసంతప్తుడై యిట్లు విలపింప దొడగెను.

"అహా! నేనెంత భాగ్యహీనుడను నేడు నా సోదరులు నేలపై శయనించి యుండుట చూచు చున్నాను. ఇంతకంటె మించిన కష్ట మేముండును? ఇంతదాక మేము వారణావతము నందు ఉన్నప్పుడు, వీరికి బహుమూల్యము లైన శయ్యలపై కూడ నిద్ర రాకుండెను. అట్టివారే నేడు నేలపై నిద్రించుచున్నారు.

"వసుదేవుని చెల్లెలు, కుంతిభోజమహారాజు కూతురు, సర్వశుభలక్షణ లక్షితురాలు, అందరిచేత ఆదరింప బడినది, విచిత్రవీర్యుని కోడలు, పాండు రాజు ధర్మపత్ని, మావంటి వీరపుత్రులకు తల్లి, కమలకాంతి వంటి యంగకాంతి కలది, అత్యంతసుకుమారి, మెత్తనిశయ్యలపై శయనింప దగినదియు నగుమాతల్లి కుంతీదేవి యిక్కడ నేలపై నిద్రించు చున్నది. దీనికి ఈమె తగినది కాదు. యమ-వాయు-ఇంద్రుల ద్వారా మమ్ము కనిన యీమహారాజ్ఞి రాజభవనమునందు నిద్రించ దగినదై యుండి కూడ నేడు పరిశ్రమచేత అలసి, యిక్కడనేలపై పడి యున్నది. ఇక్కడ భూతలమునందు నిద్రించుచున్న ఈ నరోత్తములను చూచుట కంటె దుఃఖతరమైన విషయము ఏమి యుండును?

"మూడులోకములందు నిరంతర ధర్మాచరణశీలుడై రాజ్యార్హత గల రాజు నేడు పరిశ్రాంతుడై సామాన్య మానవునివలె భూమిపై శయనించి యున్నాడు. నీలమేఘశ్యాముడు, అసమాన నరోత్తముడునైన యర్జునుడు నేడు ప్రాకృతునివలె నేలపై నిద్రించు చున్నాడు. ఇంతకంటె దుఃఖకరమైన విషయ మేమున్నది? అశ్వినీ కుమారులవంటి రూపసంపద కలిగిన నకులసహదేవులు నేడు సామాన్య మానవులవలె నేలపై నిద్రించుచు పడి యున్నారు.

ఎవనికుటుంబజనులు, పక్షపాతము లేకుండ కులకళంకులు కాకుండ నుందురో, అట్టి పురుషుడు గ్రామమునందలి యేకైక వృక్షమువలె ప్రపంచమందు జీవించగలడు. గ్రామమునందు, ఒకటే వృక్షము పత్ర-పుష్ప-ఫల సంపన్నమై యుండి యెడల, అది సజాతీయములైన ఇతర వృక్షములు లేకున్నను చైత్యము (దేవవృక్షము) అని దానిని అందరు పూజించెదరు.

ఎవనియనేక సోదరులు, బంధువులున్ను శూరులై, ధర్మపరాయణులుగా నుండెదరో, అట్టివారుగూడ, ప్రపంచమునందు ఆరోగ్యముతో సుఖముగా జీవించెదరు. బలవంతుడు, ధనసంపన్నుడు, మిత్ర - సోదర - బంధువులను ఆనంద పరచువాడున్ను అడవిచెట్టువలె పరస్పరసహాయముతో జీవించును.

"దురాత్ముడైన ధృతరాష్ట్రుడు, అతనిపుత్రులు మమ్మ ఇంటినుండి వెడల గొట్టి కాల్చుటకుగూడ ప్రయత్నించిరి. కాని; మాయదృష్టవశమున ఏదో యొక విధముగ తప్పించుకొని బ్రతికితిమి. అందువలన మేము నేడు ఈ వృక్షమును ఆశ్రయించి యైన బ్రతికి యున్నాము. ఇప్పుడు ఏ దిక్కునకు పోవలెనని కూడ మాకు తెలియ కున్నది. మేము అత్యంత దుర్భరమైన కష్టమును అనుభవించు చున్నాము.

"దుర్బుద్ధి, హ్రస్వదృష్టియుగల దుర్యోధనా నేడు నీకోరిక పూర్తిగా నెర వేరినది. దైవానుగ్రహము నీకు ఉన్నదనుట నిశ్చయము. కనుకనే, యుధిష్ఠిర మహారాజు నాకు నిన్ను వధించుటకు ఆజ్ఞ ఈయకున్నాడు. దుర్మతీ! ఈ కారణము చేతనే నీవు ఇంతదాక జీవించి యున్నావు. నేను నేడే పోయి, మంత్రులతో కర్ణునితో,తమ్ములతో, శకునితోను కూడిననిన్ను యమలోకమునకు పంపగలను. కాని, ఏమి చేయుదును? ధర్మాత్ముడైన యుధిష్ఠిరునకు నీపైన కోపం రాకున్నది."

"జనమేజయా! అప్పుడు భీమసేనుడు, 'ఆహా! ఈ వనమునకు కొంచెము దూరమునందే ఏదో నగరము కనపడుచున్నది. మేలుకొన వలసిన సమయము నందుకూడ, నా సోదరులు నిద్రించు చున్నారు. కానిమ్ము. నేను జాగరణము చేయుచుండెదను. వీరు అలసట దీరి నిద్ర లేచినప్పుడే జలము త్రాగెదరుగాక!" అని నిశ్చయించుకొని తాను అప్పుడు జాగరణము చేయు చుండెను.

**లక్షాగృహ పర్వము సమాప్తము**

## హిడింబవధ పర్వము

హిడింబుడు పంపగా హిడింబ పాండవుల కడకు వచ్చి భీమసేనునితో మాట్లాడుట :-

"జనమేజయా! పాండవులు శయనించియున్న వనమునకు సమీపము నందున్న యొక మద్దిచెట్టుపై 'హిడింబుడు' అను రాక్షసుడు నివసించియుండెను. అతడు మహాక్రూరుడు, మనుష్యమాంస భోజనుడు, మహాబలపరాక్రమశాలియునై యుండెను. పచ్చని కన్నులు, వర్షాకాల మేఘము వంటి నల్లని శరీరము క్రూరాకృతియు గలవాడై యతడుండెను. వాని ముఖమునందు పెద్దకోరలు ఉండుటచేత, అది మహా భయంకరముగా నుండెను. అతడు ఆకలిచేత, బాధ పడుచు మాంసము నందలి యాశచేత కూర్చొని యుండెను.

అతనియొక్క నితంబ (పిరుదు) భాగము, కడుపున్ను పొడవుగా నుండెను. గడ్డము, మీసములు, తలవెంట్రుకలున్ను ఎఱ్ఱగా నుండెను. అతని కంఠము, స్కంధములున్ను మహావృక్షమువలె నుండెను. చెవులు బల్లెములవలె పొడవుగా, పదునుగాను నుండెను చూచుటకు. భయంకరుడైన యా రాక్షసుని, దృష్టి దైవయోగముచేత పాండవులపై పడెను. ఆకలి బాధచేత, నతడు వచ్చి మాంసము తినగోరు చుండెను.

"జనమేజయా! అట్లున్న హిడింబుడు వ్రేళ్ళతో తల గీరుకొనుచు, పాండవులను మాటి - మాటికి చూచుచు, ఆవలించుచు, మనుష్య మాంసము దొరకెను గదా!' అని మిక్కిలి సంతసించి, తన చెల్లెలైన హిడింబతో నిట్లనెను:-

"సోదరీ! నేడు అనేకదినముల తరువాత నాకు ప్రియమైన భోజనము దొరుకుచున్నది. ఇప్పుడు నాకు నోరు ఊరుచున్నది. లొట్టలు వేయుచున్నాను. నేడు అతి తీక్ష్ణములు, దుస్సహములునైన కొనలు గలిగియున్న నా యెనిమిది కోరలను చాల కాలము తరువాత మనుష్య శరీరమునందు, చిక్కటి మాంసము నందున్న గ్రుచ్చి నేను మనుష్యుని మెడపైన ఎక్కి, కంఠమును, నరముల నున్న కోసి, నురుగులు గ్రక్కుచు, నూతనమైన యుష్ణరక్తమును తృప్తి దీర చప్పరించుచు త్రాగెదను.

"సోదరీ! పొమ్ము! ఈ వనమునకు వచ్చి నిద్రించుచున్న వీరెవరో? అని తెలిసికొనుము. మనుష్యుని తీవ్ర గంధము నేడు నా నాసికాపుటములను తృప్తిపరచుచున్నది.

నీవు ఈ మనుష్యుల నందరను చంపి నా యొద్దకు తెమ్ము. వీరు మన పొలిమేరలో నిద్రించుచున్నారు. కనుక మనకు ఏమాత్రము వీరినుండి భయము లేదు. మన మిరువురము ఒక్కటిగా కూర్చొని మనుష్య మాంసమును ఖండించి-ఖండించి యథేచ్ఛగా తినుదము. నా యాజ్ఞను పాలింపుము. ఇచ్ఛానుసారముగా మనుష్యమాంసము తిని మన మిరువురము కలిసి చప్పట్లు చరచుచు వివిధ నృత్యములు చేయుదము."

"జనమేజయా! హిడింబుని యాజ్ఞ కాగానే హిడింబ అతి త్వరగా, పాండవులున్న చోటికి పోయి, వారు నిద్రించి యుండగా అక్కడ మేల్కొని, అప్పుడే పుట్టిన మద్ది చెట్టు మొలకవలె మనోహరుడుగా నున్న భీమసేనుని చూడగనే ఆ రాక్షసి మోహముచేత అనుపమ రూపసంపన్నుడైన యతనిని కోరెను.

'శ్యామసుందరుడైన యీ యువక వీరుని పెద్ద భుజములు, సింహము వంటి మూపులు, మహా తేజస్సు, శంఖ సమాన కంఠము, సుందర నేత్రము లున్న అతి మనోహరములుగ నున్నవి. ఇతడు నాకు తగిన పతి' అని తలచి హిడింబ మరల ఇట్లనుకొనెను:-

"నా సోదరుడు మిక్కిలి క్రూరముగా మాట్లాడెను. గనుక అతని యాజ్ఞ పాలింపను. స్త్రీ హృదయమునందు పతిప్రేమయే అతి ప్రబలముగా నుండును. దానితో సమానమైనది సోదరప్రేమ కాజాలదు. వీరినందరను చంపిన తరువాత వీరి మాంసముచేత నాకు, నా సోదరునకు రెండు గడియలు మాత్రమే తృప్తి కలుగును. వీరిని చంపని యెడల అనేక సంవత్సరముల వరకు ఇతనితో నేను ఆనందమనుభ వించెదను."

"జనమేజయా! హిడింబ, ఇచ్ఛానుసారముగ రూపము ధరించ గలదు. కనుక, మానవస్త్రీవలె సుందర రూపమును ధరించి, లజ్జావతియైన లలనవలె మెల్లమెల్లగా భీమసేనుని కడకుపోయి చిరునవ్వుతో అతని నిట్లడిగెను:-

"పురుషరత్నమా! నీ వెవడవు? ఎక్కడనుండి వచ్చితివి? దేవ సమాన రూప సౌందర్యములు గలిగి ఇక్కడ నిద్రించుచున్న వీరెవరు? అధిక వయస్సు కలిగి సుకుమారియైన యీ 'శ్యామ'[1] నీ కేమగును? ఈమె నిర్భయముగా తన యింటిలోవలె నిద్రించుచున్నది. ఈ దుర్గమారణ్యము రాక్షసులకు నివాసమని ఈమెకు తెలియదు. ఇక్కడ పాపాత్ముడైన హిడింబ రాక్షసుడు నివసించి యుండును. అతడు నా సోదరుడు. అతడు దుష్టభావముతో మీ మాంసము తిన దలచి మిమ్ము చంపి తెచ్చుటకు నన్నిక్కడకు పంపెను.

"వీరవరా! దేవకుమార తేజస్సు గల నిన్ను చూచిన నే నిక ఇతరుని పతిగా పొందగోరను. ఇది సత్యము. ధర్మజ్ఞా! ఈ విషయము తెలిసి నీవు నాతో తగినట్లు వ్యవహరించుము. నా తను మనస్సులను మన్మథుడు మథించెను. నేను నీ సేవకురాలను. నన్ను స్వీకరింపుము.

"మహాబాహూ! నేను నరభక్షకుడైన యీ రాక్షసుని నుండి నిన్ను రక్షించెదను. మన మిరువురము పర్వతముల దుర్గమ గుహలలో నివసించుదము. నీవు నాపతివి కమ్ము. నీ మేలు కోరుచున్నాను. నీవు నన్ను నిరాకరించినయెడల

1. తప్తసువర్ణ వర్ణము గల స్త్రీ 'శ్యామ' యనబడును. దీనికి ప్రమాణము- 'తప్తకాంచన వర్ణాభా సా స్త్రీ శ్యామేతి కథ్యతే' అని.

నా ప్రాణములనే విడువ గలను, అట్లు కాకుండ చూడుము నేను ఆకాశమునందు సంచరించు దానను. నా యిచ్ఛ వచ్చినచోట తిరుగ గలను. నీవు నాతోపాటు అనేక లోకములందు ప్రదేశములందున్ను విహరించి అసమానమైన యానందము పొందుము."

"జనమేజయా! హిడింబ మాటలు విని భీమసేనుడు ఆ రాక్షసితో నిట్లనెను :-

"రాక్షసీ! ఇతడు నా జ్యేష్ఠభ్రాత. నాకు మాననీయుడైన గురువు. ఇంత దాక, ఇతడు వివాహము చేసికొన లేదు. ఇట్టి పరిస్థితిలో నేను నీతో వివాహము చేసికొని ఏవిధముగ గూడ 'పరివేత్త* అగుటకు ఇష్టపడను. ఈ ప్రపంచమునందు సమర్థుడై యుండికూడ నా వంటి పురుషుడు సుఖముగా నిద్రించియున్న సోదరులను తల్లినిన్ని అరక్షితులనుగా విడచి, వీరిని రాక్షసునకు భోజనముగా చేసి, ఎట్లు మరియొకచోటికి కామపీడితుడై పోవగలడు'?

ఆమాటకు రాక్షసి భీమునితో, 'వీరోత్తమా! నీకు ప్రియమైనదే చేసెదను. నిద్రించి యున్నవీరిని మేల్కొల్పుము. నీ యిచ్ఛానుసారమే వీరిని నేను ఆ రాక్షసునినుండి విడిపించెదను. అని యనగా, భీము డిట్లనెను :-

"రాక్షసీ! నాతల్లి, సోదరులున్ను ఇక్కడ సుఖముగా నిద్రించుచున్నారు. దురాత్ముడైన నీ సోదరునకు భయపడి నేను వీరికి నిద్రాభంగము చేయను. నా పరాక్రమమును యక్ష - రాక్షస - మనుష్య - గంధర్వాదు లెవరుగూడ సహింప జాలరు. నీవు పోవదలచినచో పొమ్ము లేదా ఉండుము. అథవా! నీయిచ్ఛవచ్చి నట్లు చేయుము లేదా నీకు ఇష్టమున్నచో నరమాంస భక్షకుడైన నీ సోదరునే పంపుము."

* 'అంధత్వ - పంగుత్వాది ఏ దోషములు లేని జ్యేష్ఠభ్రాత అవివాహితుడుగా ఉండగా తన వివాహము చేసికొనిన తమ్ముడు 'పరివేత్త' అనబడును. శాస్త్రములో అతడు నిందనీయుడు' అని చెప్పబడెను.

**హిడింబాసురుడు వచ్చుట - అతనికి హిడింబ భయపడుట**

**భీమ - హిడింబాసురుల యుద్ధము :**

"జనమేజయా ! అప్పుడు హిడింబాసురుడు తన చెల్లెలు పోయి, చాల సేపైనదని పాండవుల కడకు పోయెను. అతిభయంకరముగా, కోపముతో వచ్చుచున్న హిడింబుని చూచి హిడింబ మిక్కిలి భయపడి, భీమసేనునితో నిట్లనెను:-

"పురుష రత్నమా ! చూడుము. క్రోధముతో ఆ రాక్షసుడు ఇటువైపే వచ్చుచున్నాడు గనుక, నేను నీకు, నీ సోదరులకున్ను చెప్పు మాట వినుము. నీవు నాకటి ప్రదేశముపైన గాని, వీపుపైన గాని కూర్చొనుము. నాకు రాక్షస బలము పూర్తిగా కలదు. ఇచ్ఛానుసారముగా పోవగలను. నిన్ను ఆకాశమార్గము గుండా తీసికొని పోయెదను. నిద్రించుచున్న నీ సోదరులను, తల్లిని గూడ మేల్కొల్పుము. నేను మిమ్మందరను తీసికొని పోయెదను." జనమేజయా ! ఆ మాట విని భీమసేను డిట్లనెను:-

"సుందరీ ! నీవు భయపడకుము. ఈ రాక్షసుడు నా ముందు ఎంత? నీవు చూచుచుండగనే యతనిని సంహరించెదను. ఇతడు యుద్ధములో నా వేగము సహింపజాలడు. ఏనుగు తొండముల వంటి నా భుజములు, గడియమ్రానుల వంటి నా తొడలు, నా విశాల వక్షస్థలమున్ను ఎంత దృఢముగా నున్నవో చూడుము. ఇంద్ర పరాక్రమ సమానమైన నా పరాక్రమమును గూడ నీవు ఇప్పుడే చూడగలవు. నేను సామాన్య మనుష్యుడనని తలచి అవమానపరచకుము."

ఆ మాట విని హిడింబ, 'నరోత్తమా! నీ రూపము దేవతల రూపమువలె నున్నది. నిన్ను తిరస్కరించను. ఈ రాక్షసుని ప్రభావము నేను చాలసార్లు మనుష్యులపైననే చూచినాను గనుక, చెప్పుచున్నాను! అని యనెను.

"జనమేజయా! హిడింబాసురుడు క్రోధముతో భీమసేనుడనిన మాటలు విని మనుష్య రూపములోనున్న తన చెల్లెలిని చూచెను. ఆమె తన కొప్పులో పువ్వులు ముడుచుకొని పూర్ణచంద్ర ముఖము గలదై మనోహరముగ నుండెను. ఆమెయొక్క భ్రూ-నాసికా-నేత్ర-కేశాంత భాగములన్నియు సుందరములుగా నుండెను ఆమె నఖములు, శరీర చర్మమున్ను సుకుమారములుగా నుండెను.

ఆమె వివిధ సువర్ణరత్నాభరణములతో, బహుమూల్య వస్త్రములతోను అలం కృతయై యుండెను.

"జనమేజయా! అట్లు సుందర మనోహర మనుష్యరూపము ధరించిన హిడింబను చూచి, 'ఈమె పతిని వరించినదా యేమి?' అని రాక్షసునకు సందే హము కలుగగనే అతడు మిక్కిలి కుపితుడై, ఆమెను చూచుచు నిట్లనెను:-

"హిడింబే! నాకు భోజనము కావలెను. భోజనమునకు విఘ్నము కలి గించుచున్న యీ దుష్టమానవు డెవడు? నీవు మోహవశురాలవై నాకు భయపడ కున్నావు. మనుష్యుని పతిగా కోరి నాకు అప్రియము చేయ దురాచారిణివిగా నున్నావు. నీకు ధిక్కారమగు గాక! నీవు మన రాక్షస కులమునకు కళంకము తెచ్చుచున్నావు. నీవు ఎవరిని ఆశ్రయించి నాకు అప్రియము చేసితివో, వారిని అందరను నీతోపాటు నేడు చంపెదను. ఇదిగో చూడుము."

"జనమేజయా! హిడింబుడు హిడింబతో నిట్లు చెప్పి, పండ్లు కొఱుకుచు హిడింబను, పాండవులనున్ను వధించుటకు వారివైపు పోవగనే, భీమసేనుడు, 'అరే! నిలు - నిలుము!' అని హిడింబుని గద్దించుచు అనెను. తరువాత, భీముడు నవ్వుచు హిడింబునితో నిట్లనెను :-

"హిడింబా! సుఖముగా నిద్రించుచున్న నా సోదరులను మేల్కొల్పుట వలన నీకు ఏమి లాభము? నాతో తలపడుము. రమ్ము. నన్నే కొట్టుము. హిడింబ, స్త్రీకదా ఆమెను చంపుట ఉచితము కాదు. విశేషించి ఆమె నిరప రాధురాలు. నీకు ఇతరులు అపరాధము చేసిరి. అమాయకురాలైన యీమె వశము దప్పి మన్మథప్రేరితురాలై నన్ను నేడు పతిగా, చేసికొన గోరుచున్నది. ఈమె నీ యాజ్ఞచేతనే యిక్కడికి వచ్చి నా రూపముచూచి, నన్ను కోరెను గనుక; నీకు ఈమె ఏ యపరాధమున్ను చేయుట లేదు. మన్మథుడు చేసిన యపరాధమునకు గాను ఈమెను నీవు నిందించ గూడదు.

"దురాత్మా! నా రక్షణములో నున్న యీమెను నీవు చంప జాలవు. నాతో నీవు ఒంటరిగానే యుద్ధము చేయుము. నేడు నిన్ను నే నొక్కడనే యము లోకమునకు పంపెదను. అత్యంత బలము గల గజము యొక్క పాదముచేత

త్రొక్కబడిన వానిశిరస్సు నలిగి చూర్ణమైనట్లే, నా ప్రబలమైన దెబ్బచేత నీ శిరస్సు పగిలిపోయెను. నీవధ జరిగిన తరువాత హర్షముతో గ్రద్దలు రాబందులు, డేగలు, నక్కలున్ను నీయంగములను లాగి తిన గలవు. ఇంతకు పూర్వము నీవు సర్వదా మనుష్యులను తిని అపవిత్రము చేసిన యీ వనమును నేడు నేను క్షణకాలములో రాక్షస శూన్యము చేసెదను. పర్వతమువలె నున్న గజమును సింహము ఈడ్చుకొని పోయినట్లే, నేడు నిన్ను ఈడ్చుకొని పోవుచుండగా నీ చెల్లెలు చూడగలదు. నేను నిన్ను చంపిన తరువాత ఈ వనవాసులు ఏలాటి బాధలు విఘ్నములున్ను, లేక ఈ వనమునందు సంచరించ గలరు."

ఆ మాట విని హిడింబాసురుడు భీమసేనునితో నిట్లనెను :-

"అరే! మనుష్యాధమా! వ్యర్థముగా వదరుటచేత ప్రయోజన మేమి, ఇప్పుడు నీవు చెప్పిన దంతయుచేసి చూపిన తరువాత నీ గొప్పలు చెప్పకొనుము. ఇక జాగు చేయకుము. మహా బలపరాక్రమములు గలవాడవని చెప్పికొను చున్నావు. నాతో పోరాడినప్పుడు గాని అందలి తథ్యము నీకు తెలియదు. నీకంటె నాకు ఎంత అధిక బలమున్న సంగతి నీకు ఇప్పుడే తెలియగలదు. దుర్మతీ! నేను తొలుత వీరి నందరను హింసింపను వీరు కొంతసేపు సుఖముగా నిద్రింతురు గాక! నీవు నాతో మిక్కిలి చేదుగా మాట్లాడు చున్నావు. కనుక, అందర కన్న మున్ను నిన్ను చంపి నీ యవయవముల నూతన రక్తము త్రాగిన తరువాత ఈ నీ సోదరులను, నాకు అప్రియము చేసిన నా చెల్లెలిని గూడ సంహరించెదను.

"జనమేజయా ! ఇట్లు చెప్పి క్రుద్ధుడైన రాక్షసుడు చేతిని భీమసేనునిపై కెత్తెను. అప్పుడు భీముడు నవ్వుచు అతని చేయి పట్టుకొనగా ఆ రాక్షసుడు దానిని విడిపించుకొనుటకు తన్నుకొని ప్రయత్నించెను. కాని, భీముడు దానినట్లే పట్టుకొని బలాత్కారముగ నతని నక్కడినుండి యెనిమిది ధనుస్సుల (ముప్పది రెండు మూరలు) దూరమువరకు నేలపై ఈడ్చుకొనుచు, సింహము ఒక చిన్న మృగమును ఈడ్చుకొని పోవునట్లు పోయెను. ఇట్లు భీమునిచేత పీడితుడై హిడింబాసురుడు కోపముతో భీముని తన భుజములతొ అదిమి పట్టి భయంకర గర్జనము చేయగా, భీముడు మరల నతనిని బలాత్కారముగా కొంతదూరము ఈడ్చుకొని

పోయి సుఖనిద్ర చేయు చున్న సోదరులకు నిద్రాభంగము కాకుండ అతనితో పోరాడ జొచ్చెను.

"జనమేజయా! వా రిరువురు పరస్పరము ఈడ్చుకొన జొచ్చిరి ఇద్దరి పరాక్రమము గొప్పగానే యుండెను. అరువది యేండ్ల వయస్సుగల రెండు మద గజములు ఒండొంటితో పోరాడునట్లే, ఆ యిరువురు పరస్పరము తలపడి వృక్షములను విరుచుచు, లతలను లాగుచు పోరాడు చుండిరి. ఆ యిరువురు వృక్షములు పై కెత్తి ఒండొరులపై బడుచు, తను తొడల తాకిడికి అక్కడి లతలను ఛిన్నభిన్నములు చేయుచు, గర్జనములచేత అక్కడి పశుపక్షులను భయపెట్టుచు, బలోన్మత్తులై ఒండొరులను సంహరింప దలచుచుండిరి. అప్పుడు భయంకర యుద్ధము చేయుచున్న ఆ యిరువురు ఒండొరుల భుజములను మెలిపెట్టి త్రిప్పుచు, తొడలను మోకాళ్ళతో పొడుచుచు తన - తన వైపు ఈడ్చుకొను చునుండిరి. తరువాత ఆ యిరువురు మిక్కిలి బిగ్గరగా గర్జించుచు రెండు పర్వత శిఖరములలె కొట్టుకొను చుండిరి.

తరువాత ఆ యల్లరికి పాండవులు, కుంతీదేవియు మేలుకొని తమ యెదుట నిలిచి యున్న హిడింబను చూచిరి.

**కుంతీ - పాండవులకు హిడింబ తన భావము తెలుపుట - హిడింబాసురుని భీమసేనుడు వధించుట :-**

"జనమేజయా ! హిడింబయొక్క అలౌకిక రూప సౌందర్యములను చూచి పాండవులు కుంతీదేవి విస్మయము చెందిరి. అప్పుడు కుంతీదేవి హిడింబతో మధురముగా నిట్లనెను :-

"సుందరీ ! నీ వెవతెవు ? ఎవరికూతురవు ? ఏ పని కొరకు ఇక్కడకు ఎక్కడనుండి వచ్చితివి ? నీవు వనదేవతవో, అప్సరసవో చెప్పుము."

ఆ మాటకు హిడింబ కుంతీదేవితో నిట్లనెను :-

"దేవీ ! ఈ నల్లని విశాలవనము హిడింబ రాక్షసునకు, నాకున్ను, నివాస స్థానము. నేను ఆ రాక్షసుని చెల్లెలను. పూజ్యురాలా! నా సోదరుడు, నిన్ను, నీ పుత్రులను చంపునిచ్ఛతో నన్ను పంపెను. అతడు క్రూరబుద్ధి గలవాడు. అతని

యాజ్ఞచే నే నిక్కడకు వచ్చిన తరువాత తప్త కాంచనశోభ గల నీ పుత్రునిపై నా దృష్టి పడెను. అతనిని చూడగనే నేను కామ ప్రేరితురాలనై నీ పుత్రునకు వశవర్తిని నైతిని. తరువాత నతనిని పతిగా వరించుటకు ప్రయత్నించి, మిమ్మం దఱను తీసికొని వేరు చోటికి పోవదలచితిని. కాని, నీ పుత్రుడు అంగీకరించ కుండుటచేత నా కార్యము సఫలము కాలేదు.

"దేవీ! నేను ఇక్కడ నుండి తిరిగి పోవుటలో విలంబమైనదని, మనుష్య భక్షకుడైన ఆ రాక్షసుడు నీ పుత్రులను చంపుటకు స్వయముగా నిక్కడకు వచ్చెను. కాని, నా ప్రాణ వల్లభుడు, నీ పుత్రుడునైన భీమసేనుడు ఆతనిని బలాత్కారముగా ఈడ్చుకొనుచు దూరము పోయెను. ఆ యిరువురు బలవంతులు ఘోరముగా అఱచుచు ఒకరినొకరు కొట్టుకొనుచు, లాగుకొనుచున్నారు, చూడుము".

"జనమేజయా! ఇట్లు హిడింబ చెప్పిన మాటలు వినగానే యుధిష్ఠిరుడు, అర్జున - నకుల - సహదేవులున్ను ఎగిరిపడి నిలిచిరి. తరువాత, మహాబలము గల రెండు సింహములవలె వారిరువురు తలపడి తన - తన వైపునకు ఈడ్చు కొనుచుండగా భూమినుండి దుమ్ము, దావానలము యొక్క ధూమమువలె రేగెను. ఇరువురి శరీరములు దుమ్ము క్రమ్మియుండెను: ఇరువురును పర్వతములవలె మహాకాయములు గలవారే. ఇద్దరున్ను మంచు గప్పిన పర్వతములవలె శోభిల్లు చుండిరి.

"జనమేజయా! భీమసేనుడు రాక్షసునిచేత పీడితుడగుట, చూచి, అర్జునుడు నవ్వుచు భీమునితో మెల్లగా 'సోదరా! భయపడకుము. నీవు భయంకర రాక్షసునితో తలపడినట్లు ఇంతదాక మాకు తెలియదు. నేను నీ సహాయము కొఱకు వచ్చి, ఈ రాక్షసుని చంపెదను. నకుల - సహదేవులు మన తల్లిని రక్షించుచుండెదరు. అని యనగా భీముడు అర్జునునితో, 'సోదరా! నీవు తటస్థు డవుగా నుండి యూరక చూచుచుండుము. భయపడ నక్కరలేదు. నా బాహు వులలో చిక్కిన యీ రాక్షసుడు బ్రతికి బయటపడజాలడు? అని యనగా, అర్జును డతనితో నిట్లనెను:-

"సోదరా! పాపిష్ఠుడైన యీ రాక్షసుని చాలసేపు జీవితునిగా నుంచిన నేమి లాభము? మనమింకను ముందునకు సాగిపోవలసి యున్నది గనుక, ఇక్కడ

చాలసేపు నిలిచి యుండుటకు సాధ్యము కాదు. మనమెదుట తూర్పునందు అరుణోదయరక్తిను వ్యాపించియున్నది. ప్రాతఃసంధ్యాకాలము సమీపించినది. ఈ రౌద్రముహూర్తమునందు రాక్షసులబలము అధికమగును. కనుక, సోదరా! నీవు త్వరచేయుము. ఈ రాక్షసునితో క్రీడింపకుము. చంపి వేయుము. ఇతడు తనమాయను వ్యాపింప జేయుటకు పూర్వమే యతనిపై నీభుజశక్తిని ప్రయోగింపుము."

"జనమేజయా! అర్జునుడిట్లు చెప్పగా, భీముడు రోషముతో మండిపడి, ప్రళయకాలవాయువు వంటి బలముతో నీలమేఘమువంటి రాక్షసుని శరీరమును క్రోధముతో త్వరగా పైకెత్తి, నూరుమార్లు గిర - గిర త్రిప్పి నిట్లనెను :-

"అరే! రాక్షసాధమా! నీవు వ్యర్థముగా శరీరమాంసము పెంచుకొని బలిసితివి. నీ బుద్ధిగూడ వ్యర్థమే, కనుక, నీవు వ్యర్థమరణమునకే అర్హుడవు కాబట్టి, నేడు నీవు వ్యర్థముగనే నీ జీవితమును ముగించెదను. బాహు యుద్ధములో మరణించుటచేత నీకు అటు స్వర్గము - ఇటు కీర్తి లభించవు, రాక్షసాధమా! నేడు నిన్నుచంపి నేను ఈ వనమును నిష్కంటకము చేసి దీనికి క్షేమము చేకూర్చెదను. ఇక నీవు మనుష్యులను చంపి తినజాలవు."

"జనమేజయా! తరువాత, అర్జునుడు భీమునితో నిట్లనెను.

"సోదరా! నీకు ఒకవేళ, ఈ రాక్షసుడు భారముగా తోచినచో నేను నీకు సహాయము చేసెదను. ఇతనిని త్వరగా చంపి పడగొట్టుము. అథవా, నేనే యితనిని చంపెదను. నీవు ఇంతదాక యుద్ధము చేసి అలసితివి. కనుక, కొంత సేపు నీవు విశ్రాంతి తీసికొనుము."

"జనమేజయా! అర్జునుడిట్లు చెప్పగావిని భీమసేనుడుమిక్కిలి క్రోధముతో బలాత్కారముగా ఆ రాక్షసుని పైకెత్తి నేలపై ఈడ్చి కొట్టి అతనిని త్రొక్కుచు, ఈడ్చుచు పశువునువలె కొట్టజొచ్చెను. భీమసేనుని దెబ్బలు తిని ఆ రాక్షసుడు జలముచేత తడపబడిన భేరీవాద్యపు ధ్వనివలె, సమస్తవనమును మార్మ్రోగించుచు గ్గ రగా అఱచెను.

"జనమేజయా! తరువాత భీమసేనుడు హిడింబుని తన భుజములతో బంధించి వెల్లకిల పడ గొట్టి అతనినడుము విరిచి, పాండవులకు సంతోషము కలిగించెను. హిడింబుడు చంపబడుటచూచి పాండవులు అత్యంత హర్షోల్లాసములతో భీమసేనుని మిక్కిలి ప్రశంసించిరి. అప్పుడు అర్జునుడు భీమునితో నిట్లనెను :-

"సోదరా! ఈ వనమునకు నగరము ఎంతో దూరము లేదని తలచెదను. ఇక మనము దుర్యోధనునకు మన సంగతి తెలియకుండ శీఘ్రముగ పోవుదము. అని చెప్పగా పాండవు లందరు అంగీకరించి తల్లితోపాటు అక్కడినుండి వెడలిపోయిరి. హిడింబకూడ వారివెంటనే పోయెను."

**హిడింబను వధించు భీముని యుధిష్ఠిరుడు ఆపుట - హిడింబ భీముని ప్రార్థించుట - ఆ ఇరువురికలయిక - ఘటోత్కచుని జననము:-**

"జనమేజయా! హిడింబ యుధిష్ఠిరునకు, 'కుంతీదేవికిన్ని ప్రణామము చేసి, తక్కినవారిని ఆదర పూర్వకముగా చూచి, భీమసేనునితో నిట్లనెను :-

"ఆర్యపుత్రా! నిన్ను చూచినతోడనే నేను కామవశురాలనై నాయన్నను తిరస్కరించి నిన్నే అనుసరించితిని. నీవు నాయన్నపై చూపిన పరాక్రమము చూచి, ఆనందించితిని. నేను నీకు సేవకురాలనై నిన్ను సేవింపగోరు చున్నాను.

ఆమాటకు భీమసేనుడు హిడింబతోనిట్లనెను:-

"హిడింబే రాక్షసులు మోహినీమాయతో చాలనాళ్ళవరకు వైరమును స్మరించు చుందురుగనుక, నీవుగూడ నీయన్న మార్గమునందే పొమ్ము"

"ఇట్లు అనగా యుధిష్ఠిరుడు భీమసేనునితో నిట్లనెను";-

"తమ్ముడా! నీ విప్పుడు క్రోధభరితుడవై యున్నప్పటికిన్ని స్త్రీని వధింపకుము. శరీరరక్షణము కంటె ధర్మము మిక్కిలి శ్రద్ధతో రక్షింపుము. హిడింబాసురుడు మనను చంపుటకు వచ్చెను. కాబట్టి, నీ వతనిని వధించుట యుక్తమే ఆ రాక్షసునిసోదరి హిడింబ క్రుద్ధురాలైనను మననేమి చేయగలదు?"

"జనమేజయా! తరువాత హిడింబ చేతులు జోడించుకొని, యుధిష్ఠిరునకు, కుంతీదేవికిన్ని ప్రణామముచేసి, కుంతీదేవితో నిట్లనెను:-

"పూజ్యురాలా! స్త్రీలకు గలుగు కామబాధ నీకు తెలియును. నీ పుత్రుడు భీమసేనునియందు నాకు ఆకామబాధయే, కలిగెను. నేను సమయము కొరకు వేచి యుండి కామదుఃఖమును సహించి యున్నాను. ఇప్పు డాసమయము వచ్చినది. ఇక నాకు అభీష్టసుఖప్రాప్తి కలుగు నను ఆశ యున్నది. నేను నాహితము గోరుమిత్రులను, బంధువులను, స్వధర్మమునున్ను విడిచి, నీపుత్రుడైన భీమసేనుని పతిగా వరించితిని. అతడు గాని, నీవు గాని నాప్రార్థనను నిరాకరించిన యెడల నేను జీవింప జాలను. ఇది సత్యము కనుక, దేవీ! నన్నొక మూఢస్వభావము గలస్త్రీగా గాని, నీభక్తురాల ననికొని, లేక, సేవకురాల ననుకొని భావించి నన్ను కృప జూడుము."

"పూజ్యురాలా! నేనువరించిన నీపుత్రునితో, కలిసికొనుటకు అవకాశము ఇమ్ము. దేవస్వరూపుడైన ఈ నాస్వామిని తోడ్కొని నాకు ఇష్టమైనచోటికి పోయి, మరల మీరు నిర్ణయించిన సమయమునకు ఇతనితో మీకడకు రాగలను. దేవీ! నన్ను విశ్వసింపుము. నీవు నన్ను స్మరించినప్పుడెల్ల మీకడకు వచ్చి మిమ్ము మీరు కోరిన చోటికి తోడ్కొని పోయెదను.

"ఆర్యురాలా! నేను రాక్షస స్త్రీని కాను. రాక్షస జాతిలో సత్స్వభావము గల కన్యకను. నేను 'సాల కటంకటిని' అని యెరుగుము. నేను దేవ సమాన కాంతితో యువావస్థలోనున్నాను. నా మనస్సు నీ పుత్రుడు భీమసేనుని యందు లగ్నమై యున్నది. నేనతని సమక్షములో మిమ్మందరను సేవించుచుండెదను. మీరు అజాగ్రత్తలో నుండినను నేను పూర్తిగా జాగరూకతతో నుండి నిరంతరము మీ సేవయందు లగ్నురాలనై యుండెదను. మిమ్ము సంకటముల నుండి రక్షించెదను. మీరు పోవగోరు చోటికి మార్గము దుర్గమమై మిట్ట - పల్లములు గలదిగా నుండి త్వరగా పోవజాలనప్పుడు మిమ్ము నా వీపుపై కూర్చొన బెట్టుకొని అక్కడకు చేర్చెదను. దయతో భీమసేనుడు నన్ను స్వీకరించునట్లు అనుగ్రహింపుము.

"దేవీ! ఏ యుపాయములతో ఆపదనుండి విముక్తి గలిగి ప్రాణరక్షణము సంభవమగునో అట్టి యుపాయములన్నియు ధర్మానుసరణము చేయు పురుషుడు అనుసరించి, అవలంబించవలెను. ఆపదకాలమునందు ధర్మము ననుసరించువాడే ధర్మాత్ములలో శ్రేష్ఠుడనబడును. ధర్మాత్ములకు ధర్మపాలనమునందు సంకటములు కలుగుటయే ఆపద యనబడును. పుణ్యమే ప్రాణములను ధరించును. కనుక,పుణ్యము ప్రాణదాత యనబడును. కాబట్టి,ఏయే యుపాయముల చేత ధర్మాచరణము సాధ్యమగునో వాని ననుసరించుట, ఏమాత్రము నిందాపాత్రముగాదు.

"తల్లీ! నేను మిక్కిలి కామబాధచే పీడింపబడిన స్త్రీని కాబట్టి, నన్ను రక్షింపుము. సత్పురుషులు ధర్మార్థ కామమోక్షముల సిద్ధికిగాను ఈ నాలుగు పురుషార్థముల కొరకు శరణు జొచ్చిన వారిపై దయజూపెదరు. ధర్మానురాగము గల మహర్షులు దయ యొక్కటే, ధర్మమని తలచెదరు.

దేవీ! నేను దివ్యజ్ఞానముచేత జరిగినది, జరగనున్నదియు నగు సంఘటనములను చూచెదను. కాబట్టి, మీకు శ్రేయస్కరమైన విషయాలు చెప్పెదను. ఇక్కడకు కొలది దూరములోనే ఒక యుత్తమ సరోవరము కలదు. నేడు మీరక్కడకు పోయి ఆ సరస్సులో స్నానము చేసి, అక్కడి చెట్టునీడలో విశ్రమింపుడు. కొన్ని దినముల తరువాత అక్కడ మీరు వ్యాసభగవానుని దర్శించి, శోకవిముక్తు లయ్యెదరు.

"దుర్యోధనుడు 'మిమ్ము హస్తినాపురము నుండి వెడలగొట్టుట, వారణావత నగరమందు మిమ్ము దహించుటకు పంపబడుట, విదురుని ప్రయత్నముచేత మీరు రక్షింపబడుట ఈ మొదలైన విషయము లన్నియు జ్ఞానదృష్టిచేత వ్యాసుడు తెలిసికొనినాడు. ఆ మహాత్ముడు 'శాలిహోత్ర'ముని యాశ్రమమునందు నివసించి యుండును. ఆ యాశ్రమమునందున్న యా పవిత్ర వృక్షము శీతోష్ణ వర్షములను సహింపగలదు. అక్కడ కేవలము జలము త్రాగుటచేతనే ఆకలి-దప్పులు పోవును. శాలిహోత్ర మహాముని తన తపస్సుచేత ఆ సరోవరమును, వృక్షమును నిర్మించెను. అక్కడ కాదంబ (ధూమ వర్ణముగల ముక్కు, కాళ్లు, రెక్కలు గల హంస) - సారస (బెగ్గురు పక్షి) - హంస-కురరీ (ఆడు లకుముకి పక్షి) - కురర (లకుముకి పిట్ట) ఈ మొదలైన పక్షులు మధురముగా గానము చేయుచుండును."

"జనమేజయా! యిట్లు హిడింబ చెప్పిన మాటలు విని కుంతీదేవి సర్వశాస్త్ర పారంగతుడైన యుధిష్ఠిరునితో నిట్లనెను:-

"పుత్రా! ఈ రాక్షసి ఉత్తమ ధర్మమును ప్రతిపాదించుచున్నది. ఒకవేళ ఈమెకు భీమసేనుని యెడల దుష్టభావమున్నప్పటికిన్ని ఈమె అతని నేమి చేయగలదు? కనుక, నీకు సమ్మతమైనచో ఈమె సంతానోత్పత్తికొరకు కొంత కాలము భీమసేనుని సేవించుచుండుగాక!"

కుంతి మాటలు విని, యుధిష్ఠిరుడు హిడింబతో నిట్లనెను:-

"హిడింబా! నీవు చెప్పినదంతయు బాగుగానే యున్నది. ఇందులో సందేహము లేదు. కాని, నేను చెప్పినట్లే నీవు సత్యమునందు స్థిరముగా నుండవలెను. అదియేమనగా, భీమసేనుడు స్నానము నిత్య కర్మానుష్ఠానము చేసి, మంగళకరములైన వేష భూషణములు ధరించి యున్నప్పుడు నీవు ప్రతిదినము సూర్యాస్తమయ మగుటకు పూర్వమే అతనిని సేవించుచుండ వలెను.

నీవు మనోవేగము గలదానవుగనుక, పగలంతయు నితనితో నీ యిచ్ఛానుసారముగ విహరించుము. కాని, ఎల్లప్పుడు సంధ్యాకాలమునకు పూర్వమే భీమసేనుని ప్రతిదినమిక్కడ విడుచుచు నిరంతర మితనిని నీవు రక్షించుచుండవలెను. ఈ నిబంధనపై నీకు గర్భధారణము అగువరకు సుఖముగా నితనితో విహరించుచుండుము. ఈ నియమమే నీవు తప్పక పాలించవలెను. నీవు మిక్కిలి జాగరూకురాలివై భీమసేనుని సేవించుచు సర్వదా అతనికి అనుకూలురాలవై యతనికి మేలు చేయుటయందే నీవు ఆసక్తితో నుండవలెను."

"జనమేజయా! యిట్లు, యుధిష్ఠిరుడు హిడింబకు చెప్పిన తరువాత, కుంతీదేవి హిడింబను కౌగిలించుకొనెను. తరువాత కుంతీదేవి యుధిష్ఠిరునకు కొంచెము దూరముగా నుండి భీమసేనునితో పోవుచు భీమార్జునులనడుమ ఆమె యుండగా, నకుల సహదేవులు ముందు పోవుచుండిరి.

"జనమేజయా! ఇట్లు వారందరు జలపానేచ్ఛచేత శాలిహోత్రముని సరోవర తీరమునకు పోయిరి. తరువాత హిడింబ ఆ చెట్టుక్రింద ఊడ్చి

పాండవులు నివసించుటకు స్థానము ఏర్పరచెను. వారందరకొరకు ఈమె పర్ణ శాలను నిర్మించిన తరువాత తనకొరకు, కుంతీదేవి కొరకున్ను మరియొకచోట నొక కుటీరము నిర్మించెను.

"జనమేజయా! తరువాత పాండవులు స్నానము సంధ్యోపాసనము చేసి, ఆకలి - దప్పులతో బాధపడినప్పటికిన్ని జలముమాత్రము ఆహారముగా తీసి కొనిరి. అప్పుడు శాలిహోత్ర ముని పాండవులు క్షుద్బాధితులైనట్లు తెలిసికొని వారికొరకు అన్న - పానాది సామగ్రిని స్మరించి రప్పించి, పాండవులకు భోజ నము పెట్టెను.

"జనమేజయా! తరువాత కుంతీదేవి, పాండవులు అక్కడ విశ్రమించి యుండి 'లక్కయింటిలో, తమను దహించుటకు చేయబడిన ప్రయత్నము, హిడింబాసురుడు తమపై దాడి చేసినవిధము' మొదలైన ప్రసంగములు చేయుచు నుండిరి. వారిమాటలు ముగిసిన తరువాత కుంతీదేవి భీమసేనునితో నిట్లనెను :-

"పుత్రా! నీకు పాండురాజువలెనే, యుధిష్ఠిరుడు గూడ మాననీయుడు. ధర్మశాస్త్రదృష్ట్యా వారికంటె నేను నీకు అధికమాననీయురాలను. కనుక, నేను పాండు మహారాజు హితము కొరకు నీకు చేయు నాజ్ఞను పాలింపుము.

"నాయనా! పాపాత్ముడైన దుర్యోధనుడు మనకు చేసిన ద్రోహములకు ప్రతిక్రియ చేయుటకుగాను నాకు ఏలాటి యుపాయము కనపడ కున్నది. కనుక, కొన్ని దినముల తరువాత మనకు యోగక్షేమములు కలుగవచ్చును. ఈ నివాస స్థానము మన శత్రువులకు దుర్గమ మైనది. కనుక, మన కిది శ్రేయస్కరము కావచ్చును. ఇక్కడ మనము సుఖముగా నుండుదము.

"నాయనా! భీమసేనా! మనయెదుట నిప్పుడొక దుఃఖకరమైన ధర్మ సంకటము ఏర్పడి యున్నది. అది యేమనగా, హిడింబ నిన్ను చూడగనే, కామ ప్రేరితురాలై, నాకడకు, యుధిష్ఠిరుని కడకున్ను వచ్చి ధర్మము ప్రకారము నిన్ను పతిగా వరించెను. నీవు ఆమెకు ధర్మము కొరకు ఒక పుత్రుని కని యిమ్ము." ఇది నాయాజ్ఞ. ఆ కుమారుడు మనకు శ్రేయస్కరుడు కాగలడు. నీవు దీనికి వ్యతిరేకముగా ఏదిచెప్పినను నేను విన దలచుకొన లేదు. నీవు మా యిరు వురి యెదుట ప్రతిజ్ఞ చేయుము."

"జనమేజయా! భీమసేనుడు తల్లి మాటను అంగీకరించి, అట్లే చేయుటకు ప్రతిజ్ఞ చేసి, హిడింబతో గాంధర్వ వివాహము చేసికొనెను. తరువాత భీమసేనుడు రాక్షసీ! వినుము నేను సత్యముపై శపథము చేసి, నీకొక నిబంధనము విధించు చున్నాను. నీకు పుత్రోత్పత్తి కలుగునంతవరకు నేను నీతో విహరించుటకు వచ్చెదను." అని చెప్పెను.

"జనమేజయా! ఆ ప్రతిజ్ఞను అంగీకరించి హిడింబ భీమసేనుని వెంట బెట్టుకొని, ఆకాశముపైకి ఎగిరిపోయి, రమణీయ పర్వత శిఖరములపైన, దేవతా నివాస స్థానములందు, అనేక పశుపక్షుల మధుర ధ్వనులు గల రమ్య ప్రదేశము లందున్న ఆమె సుందర రూపమును ధరించి, సర్వవిధదివ్యాభరణ భూషితయై మధురముగా మాట్లాడుచు భీమసేనుని సుఖపెట్టు చుండెను.

"జనమేజయా! ఈ విధముగనే పుష్పితలతా వృక్షశోభిత దుర్గమవనము లందు, కమలోత్పాదుల చేత అలంకృతములైన రమణీయ సరోవరములందు, నదీ ద్వీపములందు, వైడూర్యమణుల వంటి యిసుకతో, రేవులతో, తీరవనము లతో, జలముతోను అతి సుందరములై, పవిత్రములైన కాననములందు, హిమ వత్పర్వతపు పొదరిండ్లలో, వివిధ గుహలలో వికసితకమలయుక్త నిర్మల జల సరోవరములందు, మణి - సువర్ణ సంపన్నములైన సముద్రతీర ప్రదేశములలో, చిన్న-చిన్న సుందర తటాక తీరములలో, పెద్ద-పెద్ద మద్దిచెట్ల వనములలో, పవిత్ర దేవతారణ్యములందు, పర్వత శిఖరములపైన, గుహ్యకుల నివాస స్థానము లందు సర్వఋతు పుష్పఫల వృక్షలతాది సంభరితములైన సుందరమున్యా శ్రమములలో, మానస సరోవరము నందు, ఇతర జలాశయములందు తిరుగుచు విహరించుచు హిడింబ పరమ సుందర రూపము ధరించి, భీమసేనునితో రమించెను. ఆమె మనస్సమాన వేగముతో నడచునది. కాబట్టి, ఆయా స్థలము లందు భీమసేనునకు ఆనంద ప్రదానము చేయుచు సంచరించుచుండెను".

"జనమేజయా! కొంతకాలము తరువాత ఆ రాక్షసి భీమసేనునివలన ఒక మహా బలవంతుడైన పుత్రుని కనెను. అతని కన్నులు భయంకరములుగా, ముఖము విశాలముగా, చెవులు శంకువు మేకులవలెను నుండెను. అతడు మహా భయంకరుడుగా కనపడుచుండెను. ఆ బాలకుడు సుందరములైన యెఱ్ఱని

పెదవులు; పదునైన కోరలు, మహాబలము, మిక్కిలి పెద్ద ధనుస్సు, మహా పరాక్రమము, అతి ధైర్య సాహసములు, పెద్ద భుజములు, మహా వేగము, విశాల శరీరమున్ను గలవాడై ఒక విశిష్ట రూపముతో నుండెను. అతడు మహా మాయావియైన రాక్షసుడుగా, శత్రుదమనుడుగాను నుండెను. అతని ముక్కు పెద్దదిగా, వక్షఃస్థలము విశాలముగా, రెండు పిక్కలు బిగువుగాను నుండెను.

"జనమేజయా! అతడు మనుష్యునకు జన్మించినప్పటికిన్ని అతని యాకృతి, శక్తియు, మానవాతీతములుగా నుండెను. అతడు అతి భయంకర వేగము, మహాబలమున్ను కలిగియుండెను. అతడు ఇతర పిశాచ రాక్షసాదుల కంటె అధిక శక్తి సంపన్నుడుగా నుండెను. అతడు చిన్న బాలకుడుగా నున్నప్పటికిన్ని యువకునివలె కనపడుచుండెను. ఆ బలవద్వీరుడు సమస్త శస్త్రాస్త్ర పాండిత్యము కలవాడై యుండెను.

"జనమేజయా! రాక్షస స్త్రీలు గర్భధారణ చేసినప్పుడు సద్యోగర్భము చేత వెంటనే బిడ్డను కనెదరు. ఆ స్త్రీలు ఇచ్ఛానుసారముగా రూపములు ధరించుచు, మార్చుచు నుండెదరు. ఆ మహాధనుర్ధరుడైన బాలకుడు పుట్టగనే, తల్లిదండ్రుల చరణములకు నమస్కరించెను. అతని తలపై వెంట్రుకలు లేకుండెను. కనుక నతని కప్పుడు తలిదండ్రులు ఇట్లు పేరు పెట్టిరి. తల్లి భీమసేనునితో, ఈ బాలకుని ఘటము శిరస్సు ఉత్కచము[1] అనగా కేశరహితమై యున్నది" అనెను. ఆమె యిట్లు చెప్పుటచేత అతనికి 'ఘటోత్కచు'డు అను పేరు వచ్చెను.

"జనమేజయా! ఘటోత్కచునకు పాండవులయెడల మిక్కిలి అనురాగ ముండెను. అతడు వారికి ప్రియుడుగా నుండి వారియాజ్ఞాధీనుడై యుండెను. అప్పుడు హిడింబ, పాండవులతో, 'భీమసేనునితోనే నుండుసమయము సమాప్తమైనది. అవసర మున్నప్పుడు మరల కలిసెద' నని ప్రతిజ్ఞ చేసి, తన యిష్టము వచ్చినచోటకు పోయెను.

1. 'ఉత్కచ' శబ్దమునకు 'పైకి లేచిన వెంట్రుకలు గలవాడు' అని కూడ అర్థము కొందరు చెప్పెదరు.

"జనమేజయా! తరువాత ఘటోత్కచుడు కుంతీదేవికి, పాండవులకున్ను ప్రణామము చేసి, వారితో గురుజనులారా! మీరు నిర్భయముగా నుండుడు. మీకు నేను ఏమి సేవ చేయుదును?' అని యడుగగా, కుంతీదేవి యతనితో, 'పుత్రా! నీవు కురుకులమునందు జన్మించితివి. నీవు నాకు భీమసేనుని వంటి వాడవే. పాండవులకు జ్యేష్ఠపుత్రుడవు కాబట్టి, నీవు మాకు సహాయము చేయుము." అని యనెను.

"జనమేజయా! కుంతీదేవి యిట్లనగానే ఘటోత్కచుడామెకు ప్రణామము చేసి, 'అవ్వా! ప్రపంచమునందు రావణ-ఇంద్రజిత్తులు మహాబలవంతులైనట్లే యిప్పుడున్న జగత్తులో, నేను గూడ మహాశరీరము మహాపరాక్రమమును కలిగి యున్నాను. వారికంటె, అధికుడ ననికూడ తెలియుము. నాతో అవసరము వచ్చినప్పుడు నేను స్వయముగా, నా తండ్రులకడకు వచ్చి నిలిచెదను" అని చెప్పి పాండవులయాజ్ఞ తీసికొని ఉత్తరదిశగా వెడలి పోయెను."

"జనమేజయా! ఇంద్రుడు అసమాన పరాక్రమశాలియైన కర్ణుని శక్తి యాయుధము యొక్క దెబ్బను సహించుటకు, ఘటోత్కచుని సృష్టి చేసెను. అతడు కర్ణునియెదుట నిలిచి యుద్ధము చేయుటకు సమర్థుడైన మహారథిక వీరుడుగా నుండెను."

### పాండవులకు వ్యాసదర్శనము-వారు ఏకచక్రానగరమునకు పోవుట:-

"జనమేజయా! పాండవులు ఆస్థానము విడిచి, ఒక వనమునుండి మరి యొక వనమునకు పోవుచు, అనేక క్రూరజంతువులను చంపుచు మిక్కిలి త్వరగా ముందుకు సాగిపోవుచుండిరి. వారు 'మత్స్య-త్రిగర్త-పంచాల-కచక - జనపదముల మధ్య నున్న రమణీయ వనస్థలులను సరోవరములనున్ను చూచుచు ప్రయాణము చేయుచుండిరి. అందరున్ను తలపై జటలు, శరీరముపైనను వల్కలములు, మృగచర్మములున్ను ధరించి మునివేషధారులై యుండిరి.

"జనమేజయా! యీ విధముగా పాండవులు కుంతీదేవిని కొన్నిచోట్ల వీపుపై నెక్కించుకొని వేగముగా నడచుచు, కొన్నిచోట్ల ఇచ్ఛానుసారముగా మెల్ల

మెల్లగా పోవుచు నుండిరి. శాస్త్రజ్ఞులైన పాండువులు ప్రతిదినము ఉపనిషత్తులు, వేదవేదాంగములు, నీతిశాస్త్రములున్ను పఠించు చుండిరి. ఒకనాడు వారు వేదాధ్యయనము చేయుచుండగా, వారికి వారి పితామహుడైన వ్యాసభగవానుని దర్శనమాయెను. అప్పుడు పాండవులు ఆ మహాత్మునకు ప్రణామము చేసి, తమ తల్లితో ఆయన యెదుట చేతులు జోడించుకొని నిలిచియుండిరి. అప్పుడు వ్యాసుడు వారితో నిట్లనెను:-

"పాండుకుమారులారా! ధార్తరాష్ట్రులు, మిమ్ము అధర్మముగా రాజ్యము నుండి బహిష్కరించుట మొదలైన మీ సంకటము లన్నియు తెలిసి నేను మీకు హితము చేయుటకొరకు వచ్చినాను. దీనికొరకు మీరు దుఃఖింపగూడదు. ఇది యంతయు మీ భావిసుఖముకొరకే జరుగుచున్నది. నాకు మీరు, ధార్తరాష్ట్రులున్ను సమానులే. దీనత్వము, బాల్యమున్ను గల మీపైన నాకు మానవనైజమగు అధిక స్నేహము గలదు. కనుక, మీ హితము గోరు నా మాట వినుడు. ఈ సమీపము నందు కనపడుచున్న రమణీయ నగరమునందు రోగ - వ్యాధుల భయము లేదు. కనుక, మీ రందరు ఈ నగరమే నందే, రహస్యముగా నాకై యెదురుచూచు చుండుడు."

"జనమేజయా! యీ విధముగా వ్యాసుడు పాండవులను ఓదార్చి, వారందరితో ఏకచక్రానగర సమీపమునకు పోయెను. అక్కడ వ్యాసుడు కుంతీదేవిని ఆశ్వాసించుచు నామెతో నిట్లనెను."

"జీవత్పుత్రులు గల కోడలా! నీ పుత్రుడు యుధిష్ఠిరుడు మహాత్ముడు. సర్వదా ధర్మపరాయణుడు. కనుక, నితడు ధర్మము చేతనే సమస్త భూమండలమును జయించి, సమస్త రాజులను శాసించ గలడు. భీమార్జునుల బలము చేత యుధిష్ఠిరుడు సముద్ర పర్యంత భూమండలము నంతటిని, తన యధికారములో తెచ్చికొని, అనుభవించ గలడు. ఇందులో సందేహము లేదు. నీ పుత్రులు, మాద్రీపుత్రులున్ను సర్వదా తమ రాజ్యమునందు సుఖ సంతోషములతో నుండ గలరు.

పురుషులలో సింహసమానులైన పాండవులు, ఈ పృథివిని జయించి, అధికదక్షిణ లిచ్చి, రాజసూయాశ్వమేధ యాగముల ద్వారా భగవంతుని

పూజింప గలరు. నీ యీ పుత్రులు, తమ మిత్రులను, ఐశ్వర్య సుఖ భోగముల ద్వారా ఆదరించి తండ్రి - తాతల రాజ్యమును పాలించు చుండ గలరు.

"జనమేజయా! యిట్లు చెప్పి వేదవ్యాసుడు, వారి నందరను ఒక బ్రాహ్మణ గృహములో నుంచి, యుధిష్ఠిరునితో నిట్లనెను :-

"నాయనా! మీ రిక్కడ నా కొరకు ఒక నెలవరకు ఎదురు చూచు చుండుడు. నేను మరల వచ్చెదను. దేశకాలములను విచారించియే, యే కార్యమైన చేయవలెను. దానిచేత మీరు చాల సుఖపడ గలరు."

"జనమేజయా! అప్పుడు పాండవులు, చేతులు జోడించుకొని, వ్యాసుని యాజ్ఞను అంగీకరించిరి. తరువాత ఆ మహర్షి అక్కడి నుండి వెడలి పోయెను." తరువాత జనమేజయుడు వైశంపాయనమహామునిని ఇట్లడిగెను:-

### హిడింబవధ పర్వముసమాప్తము

## బకవధ పర్వము

**బ్రాహ్మణ కుటుంబ కష్టము పోగొట్టుమని కుంతీదేవి భీమసేనునితో చెప్పుట - బ్రాహ్మణుడు చింతించుట :-**

"మహాత్మా! పాండవులు ఏకచక్రాపురమునకు పోయిన తరువాత ఏమి చేసిరి?" ఆమాటకు వైశంపాయను డిట్లనెను :-

"జనమేజయా! పాండవులా నగరమందు ఒక బ్రాహ్మణ గృహమందు కొద్ది దినము లుండిరి. అప్పుడు వారు వివిధ రమణీయ వనములందు, సుందర ప్రదేశములందు, నదులందు, సరోవము లందున్ను సంచరించుచు, బిచ్చము ద్వారా జీవనము గడపు చుండిరి. తమయుత్తమగుణములచేత ప్రజలకు ప్రీతి పాత్రులైరి. వా రందరు పాండవులనుగూర్చి యిట్లనుకొనిరి :-

"ఈ బ్రాహ్మణులు చూడ ముచ్చటగా నున్నారు. వీరి యాచార వ్యవహారములు పరిశుద్ధములు, సుందరములుగాను నున్నవి. వీరి యాకృతులు దేవ కుమారుల యాకృతులవలె తోచుచున్నవి. వీరు బిచ్చమెత్త దగరు. రాజ్య

మేలుటకు యోగ్యులు. సుకుమారులైనను, తపస్సు చేయుచున్నారు. వీరిలో సర్వ శుభలక్షణములు శోభిల్లుచున్నవి. ఏదో కారణముచేత వీరు భిక్షకుల వేషములో సంచరించు చున్నారు."

"జనమేజయా! ఆప్రజలు, అక్కడకు పాండవులు వచ్చుట, తమ బంధువులు వచ్చినట్లే తలచి, వారికొరకు భక్ష్యభోజ్యాది భోజనపదార్థములు సిద్ధపరచి యిచ్చిరి. వానిని, మౌనవ్రతము పాలించుచున్న పాండవులు గ్రహించిరి. మనము వచ్చి చాలసేపైనది గనుక, మనతల్లి మనకై చింతించు చుండునని, వారి తల్లికడకు తిరిగి పోయిరి.

"జనమేజయా! పాండవులు ప్రతిదినము సాయంకాలము బిచ్చము తెచ్చి, తల్లికి ఒప్పగించు చుండిరి. ఆమె దానిని, ఎవరికెంత యీయవలెనో అంత భాగము వేరు-వేరుగా పంచి యీయగా వారు దానిని భుజించుచుండిరి. వారందరు తెచ్చిన యన్నములో సగము భీమసేనున కిచ్చి, తక్కిన సగము వారందరు తల్లితోపాటు తినుచుండిరి.

"జనమేజయా! పాండవులు ఆ రాష్ట్రమునందు చాలకాలము నివసించి యుండగా, నొకనాడు భీముడు దప్ప తక్కిన నలుగురు భిక్షము తెచ్చుటకు పోయిరి. భీమసేనుడేదో కార్యమువలన కుంతీదేవితో నింటిలోనే యుండెను. ఆనాడు, వారు నివసించిన బ్రాహ్మణ గృహములో హఠాత్తుగా భయంకరమైన యార్తనాదము మిక్కిలి బిగ్గరగా నగుచుండుట కుంతి వినెను. ఆ బ్రాహ్మణ కుటుంబ వ్యక్తులు, మిక్కిలి యేడ్చుచు, మొరపెట్టుచు నుండుట చూచి, కుంతీదేవి, మిక్కిలి దయ, సత్స్వభావమున్ను గలది గనుక, వారి రోదనము విని సహింప జాలక పోయెను. అది ఆమె హృదయమును కలచుచుండెను. కనుక, నామె, భీమసేనునితో నిట్లనెను:-

"కొడుకా! మన మీ బ్రాహ్మణ గృహమునందు దుర్యోధనునకు అజ్ఞాతముగా, మిక్కిలి సుఖముతో నివసించు చున్నాము. వీరు మనను సత్కార పూర్వకముగా నాదరించు చున్నారు. కనుక, మనము దుఃఖము, దైన్యమున్ను మరచియున్నాము. కనుక, పుత్రా! ఇతరుల యింటిలో సుఖముగా నున్నాము.

ఈ యింటివారి ప్రియమునకై యేకార్యము చేయుదునా యని యెల్లప్పుడున్ను విచారించు చుందును.

"నాయనా! ఉపకారమునకు బదులుగా ప్రత్యుపకారము చేయని యెడల అది తీరదు. ఇతరుడు తనకు చేసిన యుపకారముకంటే అధికముగా నతనికి ప్రత్యుపకారము చేసినవాడే పురుషుడనిపించు కొనును. దీనిచేతనే యతని పౌరుషము మానవత్వమున్ను నిలుచును. ఇప్పు డీబ్రాహ్మణున కేదియో మహా దుఃఖము సంప్రాప్తమైనదనుట నిశ్చయము. నేనిప్పుడితనికి సహాయము చేసిన యెడల ఈ బ్రాహ్మణునకు వాస్తవమైన ఉపకారము కాగలదు.

"ఆ మాటకు భీమసేనుడు తల్లితో, 'అమ్మా! యీ బ్రాహ్మణున కిప్పు డేమి దుఃఖము కలిగినదో తెలుత తెలిసికొనుము. ఆ దుఃఖ మెంత దుష్కర మైనను, నేను పోగొట్టుటకు ప్రయత్నించెదను' అని యనెను.

"జనమేజయా! ఆ తల్లీ కొడుకు లిట్లు మాట్లాడుకొను చుండగనే, ఆ బ్రాహ్మణ దంపతుల యార్తనాదము వారి చెవులబడెను. అప్పుడు కుంతీదేవి వెంటనే, ఆ బ్రాహ్మణుని యింటిలో, అక్కడ బంధింపబడిన దూడకొరకు, ఆరాట పడుచు పోవు గోవువలె, పోయి యక్కడ ఆ బ్రాహ్మణ దంపతులు, వారి పుత్రీ-పుత్రులున్ను దుఃఖించుచు, తలలు నేలకు వాల్చుకొని యుండుట చూచెను. అప్పుడు బ్రాహ్మణుడు భార్యతో నిట్లనుచుండుట వినెను :-

"ప్రియురాలా! ప్రపంచమునందు ఈ జీవితమునకు ధిక్కార మగుగాక! ఎందు కనగా, జీవితము సారహీనము, నిరర్థకము, దుఃఖమూలము, పరాధీనము, మిక్కిలి అప్రియము ననుభవించు నదియునై యున్నది జీవించుటలో మహా దుఃఖము గలదు. జీవితకాలమందు, మహాచింత నెదుర్కొన వలసి యుండును, జీవించినవానికి తప్పక దుఃఖము కలుగును.

"ప్రియే! జీవాత్మ యొక్కడే ధర్మార్థకామములను సేవించును. అవి అతని నుండి తొలగిపోవుటవలన గూడ, అతనికి అనంతమైన మహాదుఃఖము కలుగును. నాలుగు పురుషార్థములలో మోక్షమే సర్వోత్తమమని కొందరు చెప్పెదరు. కాని, అదిగూడ నాకు సులభము గాదు. అర్థప్రాప్తి కలిగినప్పుడు, పరిపూర్ణనరక దుఃఖము ననుభవింప వలసియే యుండును.

"ప్రియే! ధనేచ్ఛ అన్నిటికంటే మహాదుఃఖకరము. ధనసంపాదనములో అంతకన్న అధికదుఃఖము సంభవించును. ఎవనికి ధనమునందు ఆసక్తి కలిగినదో* ఆ ధనము నశించిన తరువాత అతనికి అనంతమైన దుఃఖము కలుగును. ఆ విపత్తి నుండి విముక్తి పొందుటకు నాకు ఏయుపాయమున్ను తోచుట లేదు. అథవా, భార్యా - పుత్రులతో నేదైనా విపత్తి రహిత స్థానమునకు పారి పోవుదునా ?

"ప్రియురాలా ! మనకు అన్ని విధముల మేలు కలుగుచోటికి నీతోపాటు పోవుటకు పూర్వము, నేను ప్రయత్నము చేసిన సంగతి నీకు బాగుగా తెలియును. కాని, అప్పుడు నీవు నా మాట వినవైతివి. మూర్ఖురాలా ! నేను, మాటి-మాటికి, వేరుచోటికి పోవుటకుగాను నిన్ను నిర్బంధించు చుంటిని. అప్పుడు, నీవు నాతో, ఇక్కడనే నేను జన్మించి, యిక్కడనే పెరిగితిని నా తండ్రిగూడ నిక్కడనే యుండెను, అని చెప్పుచుంటివి.

"ఓసీ ! నీ ముసలి తలిదండ్రులు, పూర్వపుసోదరులు, బంధువులున్ను, ఏ స్థానమును విడిచి, చాలకాలము క్రితమే స్వర్గమునకు పోయిరో, అట్టిచోటనే నివసించుటకు నీ కెందు కింత యాసక్తి గలదు ? నీవు బంధువులతో నుండు నిచ్ఛతో నామాట విననందుకే దాని ఫలముగా ఇప్పుడు సమస్త బంధునాశకర మైన కాలము సంప్రాప్తమైనది. అది నాకిప్పుడత్యంత దుఃఖకారణమైనది. లేదా యిది నా వినాశకాలమే యగును. ఎందుకనగా, నేను స్వయముగా జీవించి యుండి, క్రూరునివలె, బంధువులను విడిచిపోవ జాలకున్నాను.

"ప్రియే ! నీవు నా సహధర్మచారిణివి. ఇంద్రియ నిగ్రహము గల దానవు. సర్వదా జాగరూకురాలవై, తల్లివలె నన్ను పాలించి పోషించుచున్నావు. దేవతలు నిన్ను నా సఖిగా ఏర్పరిచిరి. నీవు ఎల్లప్పుడు నా పరమగతి (అందరి కంటే పెద్ద ఆశ్రయము) విగా నున్నావు. నీ తలిదండ్రులు నిన్ను ఎల్లప్పటి

---

* "యానంతో యస్య సంయోగా ద్రవ్యైరిష్టైర్భవంత్యుత।
తావంతోఽస్య నిఖన్యంతే హృదయే శోకశంకవః ॥
అనగా, ఎవనికి, ద్రవ్యములతో ఇష్టులతోను, ఎన్ని సంబంధములు ఉండునో, అతని మనస్సులో అన్ని శోకపుమేకులు నాటబడును అని అర్థము.

కొరకున్ను నా గృహస్థాశ్రమమునకు అధికారిణిగా చేసిరి. నేను శాస్త్రోక్తముగా నిన్ను వరించి వివాహము చేసికొంటిని.

"ప్రియే! నీవు సత్కులీనురాలవు. సుశీలవు. సంతానవతివి. పతివ్రతవు. నీ వెప్పుడు గూడ నాకు అపకారము చేయలేదు. నీవు నిరంతరమున్ను నాకు అనుకూలవతివై నడచు ధర్మపత్నివి. కనుక, నా జీవిత రక్షణమునకై నిన్ను విడువ జాలను. నా పుత్రుడింకను పూర్తిగా బాలకుడు. అతడు యువావస్థలో నడుగిడ లేదు. అతని శరీరమునం దింకను యౌవన లక్షణములు కలుగ లేదు. అట్టి నా పుత్రుని, నేనే స్వయముగా నెట్లు విడుతును? అట్లే, నా పుత్రికనుగూడ ఎట్లు విడువగలను.* ఆమెను బ్రహ్మదేవు డామెకు రాబోవు పతికొరకు నా యొద్ద న్యాసము (ఇల్లడ)గా నుంచెను. ఆమెవలన నేను, నా పితృదేవతలున్ను దౌహిత్రుని (కూతురి కొడుకు) వలన గలుగు పుణ్యలోకములను ఆశించు చున్నాము. ఆ బాలికను స్వయముగా కని, మృత్యు ముఖమునందు ఎట్లు విడువ గలను? 'తండ్రికి అధిక ప్రేమ పుత్రునిపై' నుండునని కొందరు, పుత్రికపైననే అధిక ప్రేమ ఉండునని మరి కొందర్ను చెప్పెదరు. కాని, నాకు ఇద్దరున్ను సమానులే.

"ప్రియే! పుణ్యలోకములు వంశపరంపర, నిత్యసుఖము ఇవి యన్నియు సర్వదా పుత్రికవలననే సిద్ధించును. అట్టి పుత్రిని నేనెట్లు విడువ గలను? నన్ను నేను త్యజించుకొని పరలోకమునకు పోయిన తరువాత, నేను ఇక్కడ విడిచిన నా బిడ్డలు జీవించి యుండజాలని నేను పరలోకములో సర్వదా చింతించుచు, సంతాపము చెందు చుండెదను. వీరిలో నెవరిని విడుచుటగూడ, దయారహితము, నిందనీయము నని విద్వాంసులు చెప్పిరి. నేను మరణించిన తరువాత, వీరందరు గూడ మరణించెదరు.

* "భర్తురర్థాయ నిక్షిప్తాం న్యాసం ధాత్రా మహాత్మనా
యయా దౌహిత్రజాన్ లోకానాశంసే పితృభిస్సహ॥
స్వయముత్పాదితాం బాలాం కథముత్స్రష్టు ముత్సహే
మన్యంతే॥ కేచిదధికం స్నేహం పుత్రే పితుర్నరాః ॥
కన్యాయాం కేచిదపరే మమతుల్యావుభౌ స్మృతౌ"

"ఆహా! నేను, మహా కఠిన విపత్తిలో చిక్కుకొనినాను. దీనిని దాటుటకు నాకు శక్తి లేదు. నా యీ జీవితమునకు ధిక్కారమగుగాక! నేను నేడు బంధుపులతో ఏ గతికి పోయెదను? అందరితో చచ్చుటయే మంచిది. నేను జీవించి యుండుట యెప్పటికిన్ని సముచితము గాదు."

"జనమేజయా! అట్లు బ్రాహ్మణుడు చెప్పగా, బ్రాహ్మణి యిట్లనెను:-

"ప్రాణనాథా! నీవు ప్రాకృతునివలె నిట్లు సంతాపము చెందగూడదు. నీవు విద్వాంసుడవు కనుక ఇది నీకు సంతాపము చెందు కాలముగాదు. ఏదో యొకనాడు ప్రపంచములో మనుష్యులందరు అవశ్యముగా మరణించవలసియే యుండును. కనుక, అవశ్యముగా కాదగిన (అవశ్యంభావి) దానికొరకు, ఇక్కడ శోకించవలసిన యావశ్యకత లేదు.

"నాథా! పత్ని - పుత్రీ - పుత్రాదు లందరున్ను పురుషునకు ఆత్మని యభీష్ట సాధనకే యుండెదరు. నీవు వివేకముతో సంతాపము, శోకమున్ను విడువుము. నేను స్వయముగా ఆ రాక్షసుని కడకు పోయెదను. పత్ని తన ప్రాణములనైనను బలి యిచ్చి పతికి మేలు చేకూర్చవలెను. ప్రపంచములో నన్నిటికంటే అది పత్నికి అవశ్యకర్తవ్య మనుట సనాతన ధర్మము. పతి హితము కొరకు నేను చేయు ప్రాణత్యాగము, నీ కెట్లయినను సుఖకారకమగుట స్పష్టము. అది నాకుగూడ పరలోకమందు అక్షయసుఖసాధకము, కీర్తికరము నగును.

"నాథా! యిప్పుడు నీకు నేను తెలిపిన ధర్మము అన్నిటికంటే పెద్దది. దీనితో నాకు అత్యధిక స్వార్థసిద్ధి, ధర్మలాభమున్ను కనపడుచున్నది. ఏ యుద్దేశ్యముతో పత్ని కావలెనని కోరుదురో, అది నీకు నావలన సిద్ధించెను. ఒక పుత్రికను, ఒక పుత్రుని నీనుండి నేను కనినాను. ఈ విధముగా నీవు నన్ను గూడ ఋణవిముక్తురాలిని చేసితివి. ఈ మన బిడ్డల పాలన - పోషణములు చేయుటకు నీవు సమర్థుడవు. నీవలె నేను వీరిని రక్షింపజాలను. ప్రాణేశ్వరా! నీవు లేకున్న యెడల, ఈ మన యిద్దరు పిల్లలగతి యేమి! యగునోకదా! నేను ఏ విధముగ వీరిని రక్షించగలను?

"నాథా! నా పుత్రుడింకను బాలకుడు. నీవు లేని నేను అనాథ విధవనై, సన్మార్గములో నుండి, ఈ పిల్లల నెట్లు జీవింప జేయుదును? నీతో బాంధవ్యము చేయుటకు సర్వథా ఆయోగ్యులైన అహంకారులు, పొగరుబోతులున్ను వచ్చి, యీ కన్యను ఇమ్మని నన్ను కోరినప్పుడు, నేను వారినుండి యీ కన్య నెట్లు రక్షించగలుగుదును?

"నాథా! భూమిపై బడిన మాంసపు ముక్క తీసికొనుటకు పక్షులు వాలునట్లే, విధవాస్త్రీని వశపరచుకొనుటకు అందరు కోరెదరు. ప్రాణేశ్వరా! దురాచారులైన పురుషులు, మాటి - మాటికి నన్ను యాచించుచు నా పాతివ్రత్య మును చెరచుటకు ప్రయత్నించినప్పుడు, నేను ఉత్తమ మార్గమందు స్థిరముగా నుండజాలను. నీ కులమందు జన్మించిన యీ ఒక్క బాలికను, నేను, తండ్రి - తాతల ధర్మమార్గములో నడపుటకు ఎట్లు సమర్థురాల నయ్యెదను?

"నాథా! నీవు ధర్మజ్ఞుడవు. కనుక, నీవు నీ బాలకుని సద్గుణ సంపన్నునిగా చేసినట్లు, నీవు లేనప్పుడు - నేను అన్ని వైపుల ఆశ్రయ హీనురాలనై - యీ యనాథ బాలకునందు, అవసరమైన సద్గుణముల నెట్లు చేకూర్చ గలను? అనధికారియైన శూద్రుడు, వేదశ్రుతిని పొందగోరునట్లే, అయోగ్య పురుషుడు - నన్ను అవమానపరచి, నిర్లక్ష్యముచేసి, ఈ యనాథ బాలికను గూడ గ్రహింప గోరును. నీ యుత్తమ గుణములు గల మన యీ పుత్రికను నే నొకవేళ, అయోగ్య పురుషున కీయ గోరని యెడల, అతడు బలాత్కరించి యీ కన్యను, కాకి యజ్ఞమునుండి హవిర్భాగమును తీసికొని యెగిరిపోవునట్లు హరించుకొని పోవును.

"బ్రహ్మన్! నీ యీ పుత్రుని నీకు అనురూపునిగా తీర్చజాలక, నీ యీ పుత్రిక గూడ అయోగ్య పురుషునకు వశపడుట చూచి, నేను పొగరుబోతులైన దుష్టులచేత అవమానింపబడి, నన్ను పూర్వమువలె సమ్మాన్య పరిస్థితిలో కాపాడు కొన జాలనప్పుడు, ప్రాణత్యాగము చేసెదను. ఇందులో సందేహము లేదు.

"నాథా! నీరు ఎండిన తరువాత, అక్కడి చేపలు నశించునట్లే, మన మిద్దరము లేనప్పుడు మన యీ యిరువురు పిల్లలు తప్పక నశించెదరు. కనుక,

నీవు లేకుండ, నేను, ఈ యిద్దరు పిల్లలు, ముగ్గురమున్ను తప్పక నశించెదము. కనుక, నీవు నన్నొకతెనే ఆ రాక్షసుని కడకు పంపుము.

"బ్రహ్మన్! పుత్రవతులైన స్త్రీలు తమ పతులకంటె పూర్వమే మరణించిన యెడల అది వారికి పరమ సౌభాగ్యముకా గలదని ధర్మజ్ఞులు చెప్పెదరు.

'మితం దదాతి హి పితా మితం మాతా మితంసుతః
అమితస్య హి దాతారం కా పతిం నాభినందతి!॥

అనగా, 'తల్లి, తండ్రి, పుత్రుడు, వీరందరున్నూ, పరిమితముగానే సుఖము, ధనమున్ను ఇచ్చెదరు. అమిత సుఖ-ధనములను ఇచ్చువాడు పతి యొక్కడే. అటువంటి పతిని ఏ భార్య ఆదరించదు?' అని అర్థము.

"నాథా! నీ కొరకు నేను, ఈ పుత్రీ-పుత్రులను, సమస్త బంధువులను గూడ విడిచితిని. ఇక నిప్పుడు నా జీవితమునుగూడ విడుచుటకు పూనుకొనినాను. భార్య యెల్లప్పుడున్ను తన పతి ప్రియ-హితసాధనములోనే నిమగ్నురాలై యుండిన యెడల అది యామెకు 'పెద్ద-పెద్ద యజ్ఞ-తపో-నియమ-దాన'ముల కంటె మించినది. కనుక, నేను చేయగోరు కార్యము ఉత్తమ పురుషులకు సమ్మతమైన ధర్మమేకాక, నీకు, ఈ కులమునకున్ను అన్ని విధముల అనుకూలము హితకరము నైనది.

"నాథా! అనుకూలసంతానము, ధనము, ప్రియమిత్రులు, ప్రియపత్ని-వీరందరు ఆపదలనుండి విముక్తి పొందుటకే కోరదగినవారని సత్పురుషులు చెప్పెదరు.

'ఆపదర్థే ధనం రక్షేత్ దారాన్ రక్షేత్ ధనైరపి
ఆత్మానం సతతం రక్షేత్ దారైరపి ధనైరపి॥

అనగా - 'ఆపత్కాలములో ఉపయోగము కొరకు ధనమును రక్షించవలెను. ధనము చేత భార్యను రక్షించవలెను. భార్య ధనము ఈ రెంటిచేత ఎల్లప్పుడున్ను తనను రక్షించుకొన వలెను అని యర్థము.

"ప్రాణనాథా! 'భార్య - పుత్ర - ధన - గృహములు అన్నియు దృష్టాదృష్ట (లౌకిక - పారలౌకిక) ఫలముల కొరకు సంపాదించుకొనవలెనని పెద్దలు చెప్పెదరు. ఒకవైపు సమస్త కులము, మరియొక వైపు ఆ కులమును వృద్ధి పొందించు శరీరము - ఈ రెండింటికి సామ్యము చేయునప్పుడు కులము శరీరమునకు సమానము కాదని విద్వాంసుల నిర్ణయము.

"కనుక, నాథా! నీవు నా ద్వారా నీ అభీష్ట కార్యమును సిద్ధింపజేసికొనుము. నీవు స్వయముగా ప్రయత్నించి నిన్ను ఈ సంకటమునుండి ఉద్ధరించుకొనుము. రాక్షసుని కడకు పోవుటకు నాకు ఆజ్ఞ యిమ్ము. నా యిరువురు పిల్లలను పాలించుము. ధర్మజ్ఞులైన విద్వాంసులు ధర్మనిర్ణయము చేయునప్పుడు స్త్రీ అవధ్యురాలని చెప్పిరి. రాక్షసులు గూడ ధర్మజ్ఞులని లోకులు చెప్పెదరు. కనుక, నొకవేళ, ఆ రాక్షసుడు గూడ నన్ను స్త్రీ యని తలచి చంపక పోవచ్చును. పురుషుడు ఆ రాక్షసుని కడకు పోయిన యెడల అతడు ఆ పురుషుని వధించుట నిశ్చయము. స్త్రీ వధలో సందేహము కలదు. ఒకవేళ రాక్షసుడు ధర్మము విచారించిన యెడల నేను బ్రతుకుటకు అవకాశము కలదు. కనుక, నీవు నన్నే ఆ రాక్షసుని కడకు పంపుము."

"నాథా! నేను, అన్ని విధములైన సుఖభోగములు అనుభవించితిని. నా మనస్సునకు ప్రియమైన వస్తువులను పొందితిని. గొప్ప ధర్మానుష్ఠానము కూడ చేసితిని. నీ నుండి ప్రియసంతానము కంటిని. ఇక నిప్పుడు నాకు మరణము కలిగినను దుఃఖముండదు. నా నుండి పుత్రులు పుట్టిరి. నేను వృద్ధురాలను గూడ నైతిని. ఇంతదాక ఎల్లప్పుడున్ను నీకు ప్రియము చేయుటకే ఇష్టపడుచుంటిని. ఈ విషయము లన్నియు విచారించియే నే నిప్పుడు మరణించుటకు నిశ్చయించుచున్నాను.

"ఆర్యా! నన్ను విడిచి నీవు మరియొక భార్యను గూడ చేసికొనగలవు. దానిచేత నీ గృహస్థధర్మము పునఃప్రతిష్ఠితము కాగలదు. హృదయేశ్వరా! అనేక స్త్రీలతో వివాహము చేసికొనినప్పటికిన్ని పురుషులకు పాపము అంటదు. కాని, స్త్రీలు తమ పూర్వపతులను ఉల్లంఘించినప్పుడు వారికి చాల గొప్ప పాపము అంటును. ఈ విషయము లన్నియు విచారించి నీవు నీ దేహత్యాగము నిందిత

కార్యమని తలచి యిప్పుడు నన్ను, నీ కులమును, ఈ యిరువురు పిల్లలనున్ను సంకటమునుండి త్వరగా రక్షింపుము."

"జనమేజయా! బ్రాహ్మణి ఈ విధముగా చెప్పినప్పుడు ఆమె పతి మిక్కిలి దుఃఖితుడై ఆమెను కౌగిలించుకొని ఆమెతోపాటే కన్నీరు గార్చుచుండెను.

**బ్రాహ్మణకన్యా త్యాగము - వివేకసహిత వచనము - కుంతీదేవి వారి కడకు పోవుట.**

"జనమేజయా! దుఃఖనిమగ్నులైన తలిదండ్రుల యొక్క అత్యంత శోకభరితమైన సంభాషణము విని వారి పుత్రిక యొక్క సర్వావయవములు దుఃఖవ్యాప్తములై ఆమె తలిదండ్రులతో నిట్లనెను:-

"పూజ్య మాతాపితలారా! మీ రిరువురు ఈ విధముగా బాధితులై అనాథులవలె పలుసార్లు ఎందుకు దుఃఖించుచున్నారు? నా మాట గూడ విని మీరు ఉచితమైన పని చేయుడు."

"పూజ్యులారా! ఒకనాడు గాకున్న మరియొకనాడైనను మీ రిరువురు ధర్మము ప్రకారము నన్ను విడువవలసివచ్చుననుటలో సందేహము లేదు. నేను ఎన్నటికైనను విడువదగినదాననైనప్పుడు నేడే నన్ను మీరు విడిచి నా యొక్క దానిచేతనే ఈ సమస్త కులమును రక్షించుకొనుడు. తమను సంకటమునుండి ఉద్ధరింపగల సంతానమును తలిదండ్రులు కోరెదరు. కనుక నిప్పుడు సంభవించిన సంకటమునందు నన్ను నౌకగా ఉపయోగించుకొని మీరు శోక సాగరమును దాటి పొండు.

"ఏ పుత్రులు ఈ లోకమునందు దుర్గమసంకటము నుండి గాని, లేక మరణించిన తరువాత పరలోక సంకటముల నుండి గాని, అన్నివిధముల తల్లి దండ్రులను తరింప జేయుదురో, వారే వాస్తవముగ పుత్రులగుదురని విద్వాంసులు చెప్పెదరు. పితరులు నాకు పుట్టబోవు దౌహిత్రునిచేత తమ యుద్ధారము కావలెనని సర్వదా కోరుదురు కనుక నేను స్వయముగానే తండ్రిజీవితమును రక్షించుచు సమస్తపితరులను ఉద్ధరించెదను.

"పూజ్యులారా! ఒకవేళ మీరు మరణించినయెడల ఈ నాచిన్నతమ్ముడు త్వరగానే నశించు ననుటలో సందేహము లేదు. తండ్రికొడుకు లిరువురున్ను మరణించినయెడల పితరులకు ఉండడమే లుప్తమగును. అది వారికి మిక్కిలి అప్రియముగదా! తల్లి, తండ్రి, తమ్ముడు, ఈముగ్గురిచేత విడువబడి, నేను ఒక దుఃఖమునుండి మరియొక దుఃఖములోపడి తప్పక మరణించెదను. నేను అట్టి దుఃఖ మనుభవించుటకు యోగ్యురాలను కాకున్నను, మీరు లేనప్పుడు నాకు ఆ దుఃఖము లన్నియు అనుభవింప వలసి యుండును.

"తండ్రీ! ఒకవేళ నీవు మృత్యుసంకటము నుండి విముక్తవై, ఆరోగ్య వంతుడవై యున్నయెడల నా తల్లి తమ్ముడు, సంతానపరంపర, పిండదానాది శ్రాద్ధకర్మలు, అన్నియు స్థిరముగా నుండగలవనుటలో సందేహము లేదు."

"ఆత్మా పుత్రః సఖా భార్యా కృచ్ఛ్రం తు దుహితా కిల
తత్ కృచ్ఛ్రాన్మోచయాత్మానం మాం చ ధర్మే నియోజయ"

అనగా, పుత్రుడు తన యాత్మయని, పత్ని మిత్రురాలని పెద్దలు చెప్పి, పుత్రిక సంకటమనియే చెప్పిరి. కనుక ఈ సంకటము నుండి మిమ్ము రక్షించు కొని నన్నుగూడ ధర్మమునందు నియోగింపుడు అని అర్థము.

"తండ్రీ! నీవు లేకుండ నేను సర్వదా దీనురాలను, అసహాయురాలను నయ్యెదను. నేనే అనాథనై అందరికిన్ని దయనీయురాలను నగుదును. అరక్షిత బాలిక నగుటచేత నేను ఏక్కడ కైనను పోవుటకు వివశురాలను కాగలను. కనుక, నేడు నన్ను మృత్యు ముఖమునందు పడవేసి ఈ కులమునకు సంకటము నుండి విముక్తి కలిగించెదను. దుష్కరమైన యీకార్యము చేయుటచేత నా మరణము సఫలము కాగలదు.

"తండ్రీ! ఒకవేళ నీవు నన్ను కాదని స్వయముగా రాక్షసుని కడకు పోయిన యెడల నేను మహాదుఃఖమునందు పడెదను. కనుక నావైపు గూడ చూడుము. నీవు నాకొరకు, ధర్మము కొరకు సంతతి రక్షణముకొరకు నైనను

నీరక్షణము చేసికొనుము. ఏదో యొకనాడు విడువవలసినదాననే యగునన్ను నేడే విడువుము.

"తండ్రీ! అవశ్యముగ చేయ వలసిన కార్యమును నిశ్చయించుటలో కాలము వ్యర్థము చేయ గూడదు. శీఘ్రముగ నన్ను పరిత్యజించి నీవు ఈ కులమును రక్షించవలెను. నీవు మరణించిన తరువాత మేము ఇతరులనుండి అన్నము బిచ్చ మెత్తుచు ఇటు - నటు కుక్కలవలె పరుగెత్తుచు తిరుగుటకన్నా మించిన మహాదుఃఖము మాకు మరియొకటి ఏమి యుండును?

ఒకవేళ నీవు నన్ను విడిచి నీ భార్యా పుత్రులతో క్లేశవిముక్తుడవై ఆరోగ్యముతో నుండినయెడల నేను అమరలోకమందు మిక్కిలి సుఖముగా నివసించు చుండెదను. ఇటువంటి దానముచేత దేవతలు, పితృదేవతలున్ను సంతోషముతో నుండరని నేను వినినాను. ఐనప్పటికీ తప్పక మనహితము చేసెదరు.

"జనమేజయా! ఈ విధముగా కూతురు చేయుచున్న విలాపము విని తలి-దండ్రులు, ఆ కన్యక ముగ్గురున్ను బిగ్గరగా ఏడ్చిరి. అప్పుడు వారినందరిని చూచి బ్రాహ్మణుని పుత్రుడు వారందరివైపు వికసితనేత్రములతో చూచుచు, అవ్యక్తభాషలో అస్పష్టముగా, మధురముగాను నిట్లనెను.

"తలిదండ్రులారా! సోదరీ! దుఃఖింపకుడు" అని నవ్వుచు ప్రతి యొకరి కడకు పోయి అందరితోను చెప్పి, ఆ బాలకుడు ఒక తృణము పై కెత్తి మిక్కిలి సంతోషముతో నేను ఈ తృణము చేతనే నరభక్షకుడైన ఆ రాక్షసుని సంహరించెదను అని చెప్పెను. వారందరు దుఃఖనిమగ్నులై యున్నప్పటికిన్ని ఆ బాలకుని యొక్క అస్పష్టతకల భాషణము విని వారికి మిక్కిలి సంతోషము కలిగెను.

"జనమేజయా! అప్పుడు కుంతీదేవి 'ఇక నిప్పుడే నేను వారియెదుట పడుటకు సమయము' అని తలచి వారందరి యొద్దకుపోయి శవములవలె కదలక మెదలక యున్న వారికి తన అమృతమయవాణితో జీవన ప్రదానము చేయుచు నిట్లనెను."

**కుంతి యడుగగా బ్రాహ్మణుడు తన దుఃఖకారణము చెప్పుట :**

"బ్రహ్మన్! మీ రందరిట్లు దుఃఖించుటకు కారణమేమి ? మీ దుఃఖము నేను పోగొట్ట గలిగినచో, అట్లు చేయుటకు ప్రయత్నించెదను." ఆ మాటకు బ్రాహ్మణుడిట్లనెను :-

"తపస్వినీ! నీ వంటి సజ్జనులు చెప్పదగిన మాటయే నీవు చెప్పుచున్నావు. కాని, మా యీ దుఃఖము మనుష్యుడు పోగొట్టజాలడు.

"తపోధనులారా ! ఈ నగర సమీపమునందు 'బకుడు' అను రాక్షసుడు గలడు. అతని నివాస మిక్కడకు గవ్యూతి (రెండు కోసులు) దూరములో, యమునా తీరము నందు గల దుర్గమారణ్యములో నొకగుహలో నున్నది. అక్కడ భయంకరుడు, మాంసప్రియుడు, నరభక్షకుడునైన యారాక్షసుడుండును. అతడు చాల బలవంతుడు. అతడే, ఈ దేశమునకు, ఈ నగరమునకున్న ప్రభువు.

"తాపసీ ! ఆ దుర్బుద్ధియైన రాక్షసుడు మనుష్యమాంసముతోనే బలిసి యున్నాడు. ఆ దురాత్ముని చేత ప్రతిదినము భక్షింప బడుచు ఈ నగరము అనాథమైనది. దీనికి రక్షకుడు గాని ప్రభువు గాని లభించుట లేదు. ఆ రాక్షస రాజు సర్వదా యీ దేశమును, నగరమును రక్షించు చున్నాడు. కనుక, మాకు శత్రు రాజ్యముల నుండి కాని, క్రూర జంతువులనుండి కాని, యెప్పుడు గూడ భయము లేదు.

"తపోధను రాలా! ఆ రాక్షసునికొరకు ప్రతిదినము ఒక యెద్దు మోయ గల మంచి బియ్యపు అన్నమును దాదాపు ఇరువది తూముల ధాన్యము, రెండు దున్నపోతులను, ఆహారపదార్థము లతనికడకు తీసికొని పోవు మనుష్యునిన్ని అతనికి ఆహారముగా పంపవలెను. ఇది నియతము. ఇట్లు, ఇక్కడి ప్రతిగృహస్థు డున్ను తనవంతు వచ్చినప్పుడు ఈ భోజనము ఆ రాక్షసునకు పంపవలెను. ఈ వంతు, అనేక సంవత్సరముల తరువాత వచ్చినప్పటికిన్ని, దానిని నెర వేర్చుట ప్రజలకు అతి కఠినముగా నుండును. ఎవడైన, ఈ వంతు తప్పించు కొనుటకు ప్రయత్నించిన యెడల, ఆ రాక్షసుడు, ఆ మనుష్యుని భార్యా-పుత్ర, సహితముగా, చంపి తినును.

"అమ్మా! ఇక్కడి రాజు 'వేత్రకీగృహ' మనుచోట నుండును కాని, యతడు న్యాయమార్గమందు సంచరించడు. మందబుద్ధియైన యా రాజు ప్రజా సంకటము బాపుటకు, ఎప్పుడుగూడ ఏలాటి ఉపాయమున్ను చేయడు. మేము ఇటువంటి దుఃఖము ననుభవించుటకే అర్హులము. ఎందుకనగా దుర్బలుడైన దుష్ట రాజు రాజ్యములో నివసించుచున్నాము.

"తపస్వినీ! బ్రాహ్మణులను ఆదేశించు వాడెవడున్నాడు? వారు యెవని యధీనములో నుండగలరు? వారు, ఇచ్ఛానుసారముగా సంచరించు పక్షులవలె, దేశముయొక్క అథవా, రాజుయొక్క గుణములను చూచిన తరువాతనే యెక్కడ నైన నివసించెదరు. 'అన్నిటికన్న మొదట మంచి రాజును చేరవలెను. తరువాత భార్యను, ధనమున్ను సంపాదించి, ఈ మూడింటిని పొందిన తరువాత, తన జ్ఞాతులను, బంధువులను, పుత్రులనున్ను సంకటమునుండి రక్షించవలెను.' అని నీతిశాస్త్రము చెప్పుచున్నది.

"తపోధనురాలా! నేను ఈ మూడింటిని, విపరీత పద్ధతిచేత సంపాదించితిని. అనగా-దుష్టరాజురాజ్యములో నివసించుచున్నాను. దుష్టరాజ్యమునందు వివాహము చేసికొంటిని. వివాహము తరువాత ధనము సంపాదించ లేదు. కాబట్టి, ఈ విపత్తిలో చిక్కుకొని మేము మహాకష్ట మనుభవించు చున్నాము.

"అమ్మా! నేడు ఆరాక్షసునిభోజమునకు మావంతు వచ్చినది. అది మా కులమునంతటిని నశింపజేయునదిగా నున్నది. ఆ రాక్షసునకు పన్నుగా నేను నేడు నియత భోజనమును, ఒక వ్యక్తినిన్ని బలిగా నీయవలెను. ఎక్కడనైన నొక పురుషుని కొని తెచ్చుటకు నాయొద్ద ధనము లేదు. నా మిత్రులనుగాని, బంధువులను గాని, ఆ రాక్షసునకు నేను ఈయజాలను. ఆ రాక్షసుని నుండి విముక్తి పొందుటకు నాకు ఏ యుపాయముగూడ కనపడుట లేదు. కనుక, నేను అతి దుస్తరమైన మహాదుఃఖసాగరము నందు మునిగియున్నాను. ఇప్పుడు నేనీ బంధు జనులతోనే, ఆ రాక్షసుని యొద్దకు పోయెదను. తరువాత, ఆ నీచనిశాచరుడు ఒక్కసారే, మమ్మందరను భక్షించగలడు."

ఇట్లు ఆ బ్రాహ్మణుని మాటలు విని కుంతి యతనితో నిట్లనెను :-

కుంతీదేవి - బ్రాహ్మణుల సంభాషణము :-

"బ్రహ్మన్! నీపైన వచ్చిన ఈ సంకటమునకై నీవు దుఃఖించనవసరము లేదు. ఆ రాక్షసుని నుండి విముక్తి పొందుటకు ఉపాయము యోచించినాను. నీ యీ యేకైక పుత్రుడు గాని, పుత్రిక గాని, నీభార్య గాని, ఆ రాక్షసునికడకు పోవుట నాకు సరియనిపించదు. నాకు అయిదుగురు పుత్రులు గలరు. వారిలో నొకడా పాపిష్ఠుడైన రాక్షసుని యొద్దకు భోజన సామగ్రి తీసికొని పోవగలడు."

ఆ మాటకు బ్రాహ్మణు డిట్లనెను :-

"తపస్వినీ! నేను నా జీవిత రక్షణమునకై యెప్పుడు గూడ అట్టిపని చేయను. మీరు బ్రాహ్మణులు. అది గాక, అతిథులు, ఇట్టి మిమ్ము, తుచ్ఛమైన కార్యము నీచులు, అధర్ములు గూడ చేయరు. తనను తన పుత్రులను బ్రాహ్మణుల కొరకు బలియిచ్చుటలోనే నాకు శ్రేయస్సు గలదు. బ్రహ్మహత్య - ఆత్మహత్యలలో నాకు ఆత్మహత్యయే మేలని తోచుచున్నది. బ్రహ్మహత్య చాల పాపకరము. ప్రపంచమునందు బ్రహ్మహత్య నుండి విముక్తికి ఉపాయ మేదియు లేదు. అజ్ఞాతముగానైనను, బ్రహ్మహత్య చేయుటకంచే, ఆత్మహత్య చేసికొనుటయే మంచిది.

"కల్యాణీ! నేను స్వయముగా ఆత్మహత్య చేసికొన గోరుట లేదు. కాని, యితరులు నన్ను వధించిన యెడల, దానివలన నాకు పాపము అంటదు. నేను తెలిసి-తెలిసి బ్రాహ్మణవధ చేయించినయెడల, అది అతి నీచమైన క్రూరకర్మ యగును. దాని నుండి విముక్తి పొందుటకు ఉపాయము లేదు. తన యింటికి వచ్చిన శరణార్థిని విడుచుట, తన రక్షణము కొరకు యాచనా వృత్తిచేత జీవించువానిని వధించుట - ఈ రెండు అత్యంత నీచములైన నింద్యకర్మలని విద్వాంసులు చెప్పెదరు. ఎట్టి పరిస్థితిలోగూడ అట్టి కార్యము చేయగూడదని ఆపద్ధర్మము నెరిగిన పెద్దలు చెప్పినారు. కనుక, నేడు నా పత్నితో పాటు నా వినాశమగుటయే మంచిది. కాని, బ్రాహ్మణ వధకు ఎప్పుడుగూడ అనుమతి యీయను."

ఆ మాటకు కుంతి యిట్లనెను:-

"బ్రహ్మన్! బ్రాహ్మణరక్షణము చేయవలెనని నేనుగూడ కోరుచున్నాను. నాకుగూడ ఏపుత్రుడున్ను అప్రియుడుకాడు. నూరుగురు పుత్రులు గల తల్లిగూడ ఒక పుత్రుని విడువ జాలదు. కాని, ఆ రాక్షసుడు నా పుత్రుని సంహరింప

జాలడు. ఎందు కనగా, నా కొడుకు పరాక్రమవంతుడు, మంత్రసిద్ధుడు, తేజస్వి, కమక, అతడు భోజనమును రాక్షసునకు ఇచ్చి తాను విముక్తి పొంద గలడని నాకు విశ్వాసము కలదు. ఇంతకు పూర్వముగూడ బలవంతులు, మహాకాయులు నైన యనేక రాక్షసులు నాపుత్రుని చేత చచ్చిరి. ఐనను, ఒక మాట చెప్పెదను. ఈ విషయము నీవు ఎవరికిగూడ చెప్పగూడదు. చెప్పిన యెడల లోకులు ఆ మంత్రము నేర్పుమని నా పుత్రుని బాధించెదరు. నా పుత్రుడొక వేళ గుర్వాజ్ఞ లేకుండ ఆ మంత్రము ఇతరులకు నేర్పిన యెడల ఆనేర్చుకొనినవాడు ఆ మంత్రముచేత నా పుత్రునివలె ఆకార్యము సాధించ జాలడు."

"జనమేజయా! కుంతీదేవి యిట్లు చెప్పిన తరువాత ఆ బ్రాహ్మణదంపతులు మిక్కిలి ప్రసన్నులై, అమృతమువలె జీవితదాయకములైన కుంతీదేవి యొక్క మధుర వచనములను విని ఆమెను మిక్కిలి ప్రశంసించిరి. తరువాత కుంతీదేవి, బ్రాహ్మణుడున్ను భీమసేనునితో, 'నీవు ఈకార్యము చేయుము' అని చెప్పగా, అతడంగీకరించెను."

**కుంతీ - యుధిష్ఠిరులు భీముని పంపువిషయమై మాట్లాడుట :-**

"జనమేజయా! భీమసేనుడు ఆకార్యము చేయుటకు ప్రతిజ్ఞ చేసినప్పుడు తదితరపాండవులు భిక్షాన్నము తీసికొని వచ్చిరి. అప్పుడు భీమసేనుని యాకారము చూచి, యుధిష్ఠిరుడు 'నేడు ఇత డేదియో చేయ నున్నాడు!' అని తలచి, రహస్యముగా తల్లిని ఇట్లడిగెను :-

"అమ్మా! నేడు భీమసేనుడు ఏదియో భయంకర కార్యము చేయ దలచిన ట్లున్నాడు దానికి నీ సమ్మతియున్నదా? లేక, అతడు స్వయముగానే ఆ పనికి దిగెనా?"

ఆ మాటకు కుంతీదేవి 'నాయనా! భీమసేనుడు నా యాజ్ఞచేతనే బ్రాహ్మణ హితముకొరకు, ఈ నగరము యొక్క సంకటవిముక్తి కొరకున్ను ఈ మహా కార్యము చేయనున్నాడు! అని, యామె జరిగిన సంగతి చెప్పగా, యుధిష్ఠిరుడు తల్లితో నిట్లనెను:-

"అమ్మా! సహించరాని యీ దుష్కరసాహసము నీ వెందుకు చేసితివి? తన పుత్రుని పరిత్యజించుట మంచిదికాదని సత్పురుషులు చెప్పెదరు. ఇతరుల పుత్రుని కొరకు నీ పుత్రుని విడుచుటకు ఎందుకు తలచుచున్నావు? పుత్రత్యాగము చేసి, నీవు లోక-వేద విరుద్ధకార్యము చేసితివి. ఎవని బాహుబలముపై ఆధారపడి మన మందరము సుఖముగా నిద్రించుచున్నామో, నీచులైన శత్రువులు అపహరించిన మన రాజ్యమును తిరిగి తీసికొన దలచుచున్నామో, ఏ యమిత తేజస్వి పరాక్రమమును తలచుచు శకుని - దుర్యోధనాదులు దుఃఖించుచు రాత్రి నిద్రలేక యున్నారో, ఎవని బలపరాక్రమములను ఆశ్రయించి మనము ధృతరాష్ట్రపుత్రులను చంపి ధన-ధాన్య సంపన్నమైన సమస్త భూమండలరాజ్యము మనయధీనమైనట్లుగా తలచుచున్నామో, అట్టి బలవంతుడైన పుత్రుని విడుచుటకు నీవు ఏ తలంపుచే నిశ్చయించితివి? అనేక దుఃఖములచేత వ్యాకులవైన నీవు తెలివి దప్పితివా? నీ బుద్ధి లుప్తమయ్యెనా?"

ఆ మాటకు కుంతీదేవి, యుధిష్ఠిరునితో నిట్లనెను:-

"నాయనా! యుధిష్ఠిరా! నీవు భీమసేనుని కొరకు చింతింప గూడదు. బుద్ధి దౌర్బల్యముచేత నే నీపని చేయలేదు. పుత్రా! మనము ఈ బ్రాహ్మణుని యింటిలో మిక్కిలి సుఖముగా నున్నాము. మన సంగతి దుర్యోధనాదులకు ఏ మాత్రము తెలియకుండ నున్నది. ఈ యింటివారు మనకు చేసిన సత్కారము మన దుఃఖమును, క్రోధమునున్ను మరపించెను. ఈ బ్రాహ్మణుని యుపకారము నుండి మనము ఋణవిముక్తుల మగుటకు ఈ యుపాయ మొక్కటియే నాకు తోచినది. తనకు చేసిన యుపాకారము నష్టము కాకుండ చూచుకొనువాడే మనుష్య డనిపించుకొనును. ఉపకారమును మరవ గూడదు.

"నాయనా! ఇతరుడు తనకు చేసిన యుపకారమున కన్న, ఎన్నియో రెట్లు అధికముగా ప్రత్యుపకారము స్వయముగా నతనికి చేయవలెను. నేను ఆనాడు లక్క యింటిలో భీమసేనుని పరాక్రమము, హిడింబ వధ సంఘటన మున్ను చూచితిని. దానిచేత నాకు భీమసేనునిపై పూర్తిగా విశ్వాసము ఏర్పడినది.

"పుత్రా! భీమసేనుడు పది వేల యేనుగుల బలము గలవాడు. కాబట్టియే అతడు మనను వారణావతమునుండి మోసికొని తెచ్చెను. అతనివంటి బలవంతుడు మరియొకడు లేడు. వజ్రపాణియైన యింద్రుని గూడ నతడు యుద్ధమునందు ఎదురించ గలడు.

"నాయనా! అతడు పుట్టినప్పుడు నా యొడినుండి జారి పర్వతశిఖరముపై పడగా, అది యితని శరీర భారముచేత, చూర్ణమైనట్లు నేటికి గూడ నాకు జ్ఞప్తి యందున్నది. కనుక, పుత్రా! భీమసేనుని యొక్క బలము నాకు బాగుగా తెలియును. గాబట్టియే, బ్రాహ్మణ శత్రువైన రాక్షసుని నుండి వీరి నిష్కృతి (విడుమర) కొరకు నిశ్చయించితిని. నేను 'లోభ - మోహ - అజ్ఞాన'ములచేత ఈ పని చేయలేదు. మీరు మిక్కిలి బుద్ధితో బాగుగా యోచించి, పవిత్ర ధర్మానుకూలమైన యీ నిశ్చయము చేసితిని.

"యుధిష్ఠిరా! నా యీ నిశ్చయముచేత ఈ రెండు ప్రయోజనములు సిద్ధించ గలవు. ఒకటి, మనము ఇక్కడ నివసించినందుకు బ్రాహ్మణుని నుండి ఋణ విముక్తి. రెండవలాభము, బ్రాహ్మణులను, నగర వాసులను రక్షించుట చేత ధర్మపరిపాలనము చేయుట అనునది."

బ్రాహ్మణ కార్యమునందు సహాయము చేయు క్షత్రియుడు ఉత్తమ లోకములకు పోవునని నా విశ్వాసము ఒక క్షత్రియుడు, మరియొక క్షత్రియునకే ప్రాణసంకటము నుండి విముక్తి కలిగించిన యెడల అతడు ఇహ - పర లోకములందు గొప్ప కీర్తిని పొంద గలడు. ఈ భూలోకమునందు వైశ్యుని కార్యములో సహాయము చేయు క్షత్రియుడు నిశ్చయముగా సమస్త లోక ప్రజలను సంతోషపరచు రాజు కాగలడు. ఇట్లే, ఏ క్షత్రియుడు తన శరణు జెందిన శూద్రుని ప్రాణసంకటము నుండి రక్షించునో, అతడు ప్రపంచము నందు ధనధాన్య సంపన్నుడై, రాజ సమ్మానితుడై, ఉత్తమ కులమునందు జన్మించ గలడు.

"యుధిష్ఠిరా! ఈ విధముగ పూర్వము వ్యాసభగవానుడు నాకు చెప్పెను. కాబట్టి, నేను ఈ ప్రయత్నము చేసితిని."

**భీమసేనుడు భోజన సామగ్రితో బకాసురుని కడకు పోవుట :-**

"జనమేజయా ! తల్లి కుంతీదేవి చెప్పినమాట విని యుధిష్ఠిరు డామెతో నిట్లనెను :-"

"అమ్మా ! నీవు యోచించి చేసిన పని సముచితముగానే యున్నది. సంకటావస్థలో పడియున్న బ్రాహ్మణుని యందు దయచేత నిట్లు విచారించితివి. భీమసేనుడు తప్పక రాక్షసుని చంపి తిరిగి వచ్చును. నీవు బ్రాహ్మణ రక్షణము కొరకు బ్రాహ్మణుని యందు మిక్కిలి దయతో ఈ పని చేసితివి. కనుక ఇది నెరవేరి తీరును. నీవు బ్రాహ్మణుని తప్పక అనుగ్రహించవలెను. కాని అతడు నగర వాసులకు ఈ విషయము తెలుపకుండునట్లు, నీవు అతనితో చెప్పవలసి యుండును.

"జనమేజయా! బ్రాహ్మణ రక్షణము కొరకు కుంతీదేవి యుధిష్ఠిరునితో నిట్లు సంప్రదించి లోపలికి పోయి, బ్రాహ్మణ కుటుంబమును ఓదార్చెను. ఆ రాత్రి గడచిన తరువాత భీమసేనుడు భోజన సామగ్రి తీసికొని బకాసురుని కడకు పోయెను. బకాసురుని వనము నతడు చేరిన తరువాత అతని కొరకు కొనిపోయిన యన్నమును తాను తినుచు అతనిని పేరుపెట్టి పిలుచుచు అఱచెను. భీముని పిలుపుచేత ఆ రాక్షసుడు కుపితుడై భీమసేనుడు తినుచున్న చోటికి వచ్చెను.

"జనమేజయా! ఆ రాక్షసుని శరీరము చాల పెద్దగా నుండెను. అతడు భూమిని ఛేదించుచున్నాడా యనునట్లు మహా వేగముతో నడచుచుండెను. అతని కన్నులు రోషముచేత ఎఱ్ఱగా, ఆకారము భయంకరముగా, గడ్డము, మీసములు, తల వెండ్రుకలు ఎఱ్ఱగాను నుండెను. అతని ముఖము చెవులవరకు విశాలముగా, చెవులు శంకువు (మేకు)లవలె పొడవుగా, పదునుగాను నుండి అతడు భయంకరుడుగా నుండెను. అతడు కనుబొమలు ముడివెట్టుటచేత లలాటముపై మూడు రేఖలు పడెను. దంతములతో పెదవులు కఱచుచుండెను.

"జనమేజయా! అట్లు భయంకరముగా నున్న బకాసురుడు అక్కడ అన్నము తినుచున్న భీమసేనుని చూచి మిక్కిలి క్రుద్ధుడై, కన్నులు త్రిప్పుచు,

'ఎవడు ఈ దుర్బుద్ధి మనుష్యుడు?' నా కొరకు తెచ్చిన యన్నమును నా కన్నుల యెదుటనే తాను తినుచున్నాడు. అతడు యమలోకమునకు పోవగోరుచున్నాడా యేమి? అని యనగా, భీమసేనుడు బిగ్గరగా నవ్వుచు ఆ రాక్షసుని తిరస్కరించి, వెక్కిరించుచు నతనివైపు చూడకుండనే తనపాటికి తాను తినుచుండెను.

"జనమేజయా! అప్పు డారాక్షసుడు భీమసేనుని చంపదలచి, భయంకరముగ గర్జించుచు రెండుచేతులెత్తి అతనివైపు పరుగెత్తినను, శత్రువీరసంహారకుడైన భీమసేనుడు ఆ రాక్షసుని చూచి నిర్లక్ష్యము చేసి, ఆయన్నము తినుచునె యుండెను. అప్పుడది సహింపజాలక యా రాక్షసుడు మిక్కిలి కుపితుడై, భీమసేనుని వీపుపై వెనుకనుండి రెండుచేతులతో బిగ్గరగా కొట్టెను. అట్లు దెబ్బ తినినప్పటికిన్ని భీముడు అతనివైపు తిరిగియైన చూడక తినుటయందే నిమగ్నుడై యుండెను. అప్పుడు బలవంతుడైన యారాక్షసుడు కోపముతో ఒక వృక్షము పెఱికి భీమసేనుని చంపుటకు అతనిపై దాడిచేసెను.

"జనమేజయా! భీమసేనుడు అట్లు సావకాశముగా అన్నమంతయు భుజించి ఆచమనము చేసి, చేతులు ముఖము కాళ్ళు కడగికొని ప్రసన్నుడై యుద్ధసన్నద్ధుడాయెను.

"జనమేజయా! అట్లు రాక్షసుడు తనపై కొట్టుచున్న చెట్టును భీమసేనుడు నవ్వుచు అవలీలగా ఎడమచేత పట్టుకొనెను. అప్పుడు రాక్షసుడు అనేకవృక్షములను పెఱికి, భీమసేనునిపై వేయగా, నతడుగూడ ననేకవృక్షములతో బకుని కొట్టెను. నరరాక్షస రాజులకు ఘోరముగా జరిగిన యా వృక్షయుద్ధము సమస్త వృక్ష వినాశకరముగా నుండెను.

"జనమేజయా! బకాసురుడు తనపేరు భీమునకు వినిపించుచు బాహువులతో నతనిని పట్టుకొనెను. అప్పుడు భీముడు గూడ తన భుజములతో నతనిని అదిమి పట్టి యెదపై కరచుకొని యిటునటు బలాత్కారముగ ఈడ్చుచుండగా బకాసురు డతని బాహుపాశమునుండి విడిపించుకొనుటకు తనుకులాడుచుండెను. వారు పరస్పరము ఈడ్చుకొనుచుండగా, ఆ యిగ్గులాటలో రాక్షసుడు మిక్కిలి అలిసెను.

"జనమేజయా! ఆ యిరువురి వేగముచేత భూమి కంపించు చుండెను. అప్పుడు వారు అక్కడి వృక్షములనుగూడ ఖండించిరి. రాక్షసుడు శక్తిహీనుడగుట చూచి భీముడు అతనిని ఎత్తి భూమిపైన కొట్టి, ఈడ్చుచు మోకాళ్ళతో కొట్టు చుండెను. తరువాత, భీముడు ఒక మోకాలితో రాక్షసుని వీపు అదిమిపెట్టి, కుడి చేతితో అతని మెడ పట్టుకొని, ఎడమ చేతితో అతని నడుమునకు బిగించిన వస్త్రమును కౌపీనముతో పాటు పట్టుకొని ఆ రాక్షసుని రెండుగా విరిచెను. అప్పుడతడు బిగ్గరగా అఱచెను. అట్లు భీమసేనుడు ఆ రాక్షసుని నడుము విరుచు చున్నప్పుడు అతని నోటినుండి రక్తము పారెను."

**బకాసుర వధచేత భయపడిన రాక్షసుల పలాయనము - నగర ప్రజల సంతోషము:-**

"జనమేజయా! ఆ రాక్షసుని ప్రక్క యెముకలు విరుగగా పర్వతము వంటి బకాసురుడు అఱచుచు చచ్చెను. ఆ యఱపుచేత భయపడిన రాక్షసులు తమ పరివారములతో తమ యిండ్లు విడిచి బయటకు వచ్చిరి. అప్పుడు భీమసేనుడు వారిని ఓదార్చి వారితో, 'ఇప్పటి నుండి ఎప్పుడుగూడ మీరు మనుష్యులను హింసించగూడదు. హింసించినవారు ఇట్లే వధింపబడుదురు.' అని నిబంధనము చేయగా, రాక్షసులు అంగీకరించిరి.

"జనమేజయా! అప్పటినుండి నగరమునందలి రాక్షసులు సౌమ్య స్వభావముతో నుండుట ఆ నగరవాసులు చూచిరి. తరువాత భీమసేనుడు బకాసురుని శవమును తెచ్చి నగర ద్వారమునందు పడవేసి, తాను ఎవరికిని కనపడకుండ వెడలిపోయెను. భీమసేనుని బలముచేత బకాసురుడు చంపబడుట చూచిన రాక్షస పరివారములు నలువైపుల పారిపోయెను.

"జనమేజయా! రాక్షస వధానంతరము భీమసేనుడు తన నివాసస్థానమునకు పోయి జరిగిన వృత్తాంతము యుధిష్ఠిరునకు చెప్పెను."

మరునాటి యుదయమున పౌరులు నగర బహిర్భాగమునకు వచ్చినప్పుడు బకాసురుడు నెత్తుట దోగిచచ్చి నేలపై పడియుండుట చూచి, వారు రోమాంచితులైరి. అప్పుడు ఆ పౌరులు ఏకచక్రానగరమునందు అంతటను, ఈ సంగతి

తెలుపగా, వేలకొలదిగ నగరవాసులు - స్త్రీ - బాల - వృద్ధులందరు బకాసురుని చూచుటకు వచ్చినప్పుడు ఆ మానవాతీత కార్యమును చూచి అందరు మిక్కిలి ఆశ్చర్య చకితులైరి. అందరు దేవతా పూజలు చేసిరి.

"జనమేజయా! తరువాత, నగరప్రజలు ఆనాడు భోజనము పంపవలసిన వంతు ఎవరిదని దినములు లెక్కపెట్టి ఆనాడు ఆ బ్రాహ్మణుని వంతు అని తెలిసికొని అందరు అతనికడకు పోయి అడిగిరి. ఇట్లు మాటి - మాటికి వారు అడుగగా, ఆ బ్రాహ్మణుడు పాండవుల సంగతి గుప్తముగా నుంచుచు నగరవాసులతో నిట్లనెను :-"

"సోదర ప్రజలారా! నిన్న నాకు భోజనము తీసికొని పోవుటకు ఆజ్ఞ యిచ్చినప్పుడు నేను బంధువులతో ఏడ్చుచుండగా, నన్ను ఒక ఉదార హృదయము గల మంత్రసిద్ధుడైన బ్రాహ్మణుడు చూచి, నా దుఃఖ కారణమడిగి, తెలిసికొని తన యలౌకిక మంత్రశక్తిపై నాకు విశ్వాసము కలిగించి, నవ్వుచు నాతో "బ్రహ్మన్! నేడు నేను స్వయముగానే రాక్షసునకు భోజనము తీసికొని పోయెదను. నన్నుగూర్చి నీవు భయపడకుము" అని చెప్పి, భోజన సామగ్రి తీసికొని బకాసుర వనమునకు పోయెను. అతడే, తప్పక ఈ ప్రజాహితకర కార్యము చేసియుండును."

"జనమేజయా! ఆ మాట విని ఏకచక్రాపురవాసు లందరు ఆశ్చర్య, చకితులై, ఆనంద నిమగ్నులైరి. అప్పుడు వారు ఆ బ్రాహ్మణుని అభినందించుచు వేడుకలు చేసిరి. ఆ యద్భుత సంఘటనము చూచుటకు ఆ దేశవాసులందరు నగరమునకు వచ్చిరి. పాండవులు ఆ నగరమునందే నివసించుచుండిరి."

**బక వధ పర్వము సమాప్తము**

# చైత్రరథ పర్వము

**పాండవులు ఒక బ్రాహ్మణుడు విచిత్రకథలు వినుట :-**

ఇట్లు వైశంపాయనుడు చెప్పిన బక వధ వృత్తాంతమువిని జనమేజయుడు వైశంపాయన మహామునిని, 'మహాత్మా! బక వధ తరువాత పాండవులు ఏమి చేసిరి? అని యడుగగా, వైశంపాయనుడిట్లు జనమేజయునకు చెప్ప దొడగెను:-

"జనమేజయా! బకాసురుని వధ తరువాత పాండవులు బ్రహ్మతత్త్వ మును ప్రతిపాదించు నుపనిషత్తులను చదువుచు ఏకచక్రాపురమునందే బ్రాహ్మణుని యింటిలో నుండిరి. కొన్ని దినముల తరువాత, ఆ యింటికే కఠోరనియమవ్రత పాలకుడైన యొక బ్రాహ్మణుడు వచ్చెను. ఆ యింటి బ్రాహ్మణుడు తన యింటికి వచ్చిన యతిథుల కందరకు సేవచేయు నియమము గలవాడుగా నుండెను. అందుచేత, అతడు ఆగంతకుడైన యా బ్రాహ్మణునకు బాగుగా పూజ చేసి ఆ యింటిలో నుంచుకొనెను.

"ఆ వచ్చిన బ్రాహ్మణుడు మంచి - మంచి కథలు మిక్కిలి సుందరముగా చెప్పుచుండెను గాబట్టి, ఆ కథలను వినుటకు పాండవులు, కుంతీదేవియు అతని కడకు పోయి కూర్చుండిరి. అప్పుడతడు అనేక దేశములు, పుణ్యతీర్థములు నదులు, రాజులు, ఆశ్చర్యజనకములైన వివిధ స్థానములు, పట్టణము - ఈ మొదలైన వాటినిగూర్చి వర్ణించెను.

"జనమేజయా! కథలన్ని చెప్పిన తరువాత చివరకు ఆ బ్రాహ్మణుడు పాంచాల దేశమందు యజ్ఞసేనుని కూతురైన ద్రౌపదికి స్వయంవరము అద్భుతముగా జరుగబోవుచున్న సంగతికూడ చెప్పెను. ధృష్టద్యుమ్న శిఖండుల యుత్పత్తి, ద్రుపదుడు చేసిన మహాయజ్ఞమందు కృష్ణాదేవి (ద్రౌపది)యు అయోనిజయై (మాతృగర్భమునుండి కాక, పుట్టినది). యజ్ఞవేది నుండి పుట్టుట మొదలైన విషయములు గూడ చెప్పెను. మిక్కిలి అద్భుతమైన ఆ యలౌకిక విషయము విని, ఆ కథ సవిస్తరముగా వినుటకు పాండవులు ఆ బ్రాహ్మణుని ఇట్లడిగిరి:-

"మహాత్మా! ద్రుపద పుత్రుడైన ధృష్టద్యుమ్నుడు యజ్ఞాగ్నినుండి? ద్రౌపది యజ్ఞవేది మధ్యనుండి యెట్లు జన్మించిరి? ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యునినుండి అస్త్రశస్త్రవిద్య ఏ విధముగ నేర్చెను? ద్రుపదునకు ద్రోణునకు మైత్రి ఏ విధముగా కలిగెను? వారిరువురకు ఏ కారణముచేత వైరము సంభవించెను:-

ఆ మాటకు వైశంపాయన మహాముని యిట్లు ప్రశ్నింపగా ఆగంతుక బ్రాహ్మణుడు ద్రౌపదీ జన్మవృత్తాంత మంతయు నిట్లు చెప్ప దొడగెను:-

**ద్రోణుడు ద్రుపదుని అవమానించుట:-**

"బ్రాహ్మణోత్తములారా! గంగాద్వారము (హరిద్వారము) నందు భరద్వాజుడు అనునొక మహర్షి యుండెను. అతడు సర్వదా కఠోర వ్రతము పాలించుచుండెను. ఒకనాడతడు గంగలో స్నానము చేయుటకు పోయెను. అక్కడకు అంతకుపూర్వమే 'ఘృతాచి' యను నప్సరఃస్త్రీ వచ్చి స్నానము చేయుచుండెను. భరద్వాజ మహర్షి యామెను చూచెను.

"ఆమె నదీ తీరమునందు నిలిచి బట్టలు మార్చుకొనుచున్నప్పు డామె వస్త్రము గాలిచేత పైకెగిరెను. ఆమె నప్పుడు నగ్నావస్థలో నా మహర్షి చూచి, ఆమెను పొందగోరెను. భరద్వాజ ముని చిన్నతనమునుండియే చాలకాలము వరకు బ్రహ్మచర్యమును పాలించుచుండెను. అతని మనస్సు ఘృతాచి యందు ఆకర్షింపబడుటచేత అతని వీర్యము స్ఖలితమయ్యెను. ఆ మహర్షి ఆ వీర్యము నొక ద్రోణము (యజ్ఞ కలశము) నందుంచెను. దానినుండియే 'ద్రోణు'డను కొడుకు పుట్టెను. ద్రోణుడు సమస్త వేదాంగము (శాస్త్రము)లను చదివెను.

"పృషతు డనునొకరాజు భరద్వాజమునికి మిత్రుడుగా నుండెను. ఆ రాజునకు ఆ దినములలోనే 'ద్రుపదు' డనుపుత్రుడు పుట్టెను. రాజకుమారు డైన ద్రుపదుడు ప్రతిదినము భరద్వాజాశ్రమమునకు పోయి, ద్రోణునితో నాడుకొనుచు, నధ్యయనము చేయుచు నుండెను.

"పృషతుడు మరణించిన తరువాత ద్రుపదుడు రాజయ్యెను. అప్పుడు ద్రోణుడు, 'పరశురాముడు సమస్తధనము దానముచేసి వనమునకు పోవనుద్యుక్తు డైనా'డని విని, పరశురామునికడకు పోయి, 'ద్విజోత్తమా! నేను ద్రోణుడను. ధనేచ్ఛచేత వచ్చినాను.' అని యనెను. ఆ మాటకు పరశురాముడు, 'బ్రహ్మన్! ఇప్పుడు కేవలము నాయొద్ద నాశరీరము మాత్రము మిగిలియున్నది. శరీరముదప్ప అంతయు దానముగా నిచ్చితిని కనుక, నా యొద్దనున్న యస్త్రములు గాని, లేక యీ నా శరీరము గాని కోరుకొనుము. ఇచ్చెదను అని యనగా ద్రోణుడు, 'భగవన్! నీవు నాకు అన్ని యస్త్రములను, వాని ప్రయోగోపసంహారవిధితో నిమ్ము' అని యనెను.

"బ్రహ్మణోత్తములారా! ద్రోణుని కోరిక ప్రకారము పరశురాముడు తన యస్త్రములన్నియు నతని కిచ్చెను. వానిని తీసికొని యతడు కృతార్థు డయ్యెను. ద్రోణుడు ప్రసన్నుడై, పరశురామునినుండి బ్రహ్మాస్త్రమును గూడ బడసెను. దానిచేత నతడందరికన్న మించినవాడై ద్రుపదునికడకు పోయి 'రాజా! నేను నీ మిత్రుడను. నన్ను గుర్తించితివా'? యని యనగా ద్రుపదుడు 'అశ్రోత్రియుడు శ్రోత్రియునకు, అరథికుడు, రథికవీరునకు రాజుకానివాడు రాజునకున్ను మిత్రు డగుటకు అర్హుడు కాడు. కనుక, నీవు పూర్వమైత్రిని ఎందుకిప్పుడు కోరు చున్నావు?' అని ద్రోణునితో ననెను."

"బ్రహ్మణోత్తములారా! అమాట వినిన ద్రోణుడు ద్రుపదునకు ప్రతీ కారము చేయుటకు నిశ్చయించుకొని కురురాజధానియైన హస్తినాపురమునకు పోవగా, భీష్ము డతనికి అనేక ధనములిచ్చి, తనపౌత్రు లందరిని ద్రోణునకు శిష్యులనుగా, నప్పగించెను. అప్పుడు ద్రోణుడు తన కౌరవ - పాండవశిష్యులను ఒకచోట చేర్చిరి వారితో నిట్లనెను :-

"శిష్యులారా! మీ నుండి యొక గురుదక్షిణ కోరు చున్నాను. మీరు అస్త్ర విద్యాపారంగతులైన తరువాత అగురుదక్షిణ నా కీయవలెను. దీనికై మీరు సత్యప్రతిజ్ఞ చేయుడు."

"అ మాటకు అర్జునాదిశిష్యు లందరు గురువుతో అట్లే యగుగాక! యని చెప్పిరి".

"పాండవులు అస్త్రవిద్యాపారంగతులై గురుదక్షిణ యిచ్చుటకు సిద్ధ పడినప్పుడు ద్రోణాచార్యుడు వారితో నిట్లనెను :-

"శిష్యులారా! 'అహిచ్ఛత్ర' నగరమునందు పృషతపుత్రుడైన ద్రుపద రాజు ఉన్నాడు. అతనిరాజ్యమును లాగుకొని నాకు మీరు సమర్పింప వలెను."

"అప్పుడు కౌరవ - పాండవులు పాంచలదేశమునకు పోయి, ద్రుపదునితో కర్ణ - దుర్యోధనాదులు తలపడి ఓడిపోయి తిరిగి వచ్చిరి. అప్పుడు పాండవు లైదుగురున్ను ద్రుపదునితో పోరాడి, అతని నోడించి, బంధించి ద్రోణునికడకు తెచ్చిరి.

"మహేంద్ర పుత్రుడైన అర్జునుడు మహేంద్రపర్వతమువలె దుర్ధర్షుడుగా నుండెను. మహేంద్రుడు రాక్షసరాజును ఓడించినట్లే, అర్జునుడు ద్రుపదరాజును జయించెను. అర్జునుని మహా పరాక్రమము చూచి ద్రుపదరాజు, అతని బంధువు లున్ను మిక్కిలి విస్మితులై అర్జునునితో, సమానుడైన శక్తిమంతుడు, మరియొక రాజకుమారుడు లేడు, అని చెప్ప జొచ్చిరి." అప్పుడు ద్రోణుడు ద్రుపదునితో నిట్లనెను :-

"రాజా! నేను నీ మైత్రి కొరకు మరల అడుగు చున్నాను. 'రాజు కాని వాడు రాజునకు మిత్రుడు కాజాలడు' అని చెప్పి యుంటివి. కనుక, నేను రాజ్య ప్రాప్తి కొరకు నీతో యుద్ధము చేయుటకు ప్రయత్నించితిని. నీవు గంగానదీ దక్షిణ తీరమునకు, నేను ఉత్తర తీరమునకున్ను రాజులము."

"బ్రాహ్మణులారా! ఇట్లు ద్రోణుడనిన తరువాత, ద్రుపదుడతనితో, 'ద్రోణా! అట్లే యగుగాక! నీ యభిప్రాయము ప్రకారము మనమైత్రి పూర్వము వలె నుండుగాక!' అని చెప్పెను. ఇట్లు వారిరువురు మాట్లాడుకొని మైత్రి చేసికొని తమ-తమ స్థానములకు పోయిరి. అప్పుడు ద్రుపదునకు గలిగిన యవమానము నతడు మరవజాలక మనస్సులోనే దుఃఖించుచు, మిక్కిలి బక్కచిక్కి పోయెను."

**ద్రుపదుని యజ్ఞము నుండి ధృష్టద్యుమ్న - ద్రౌపదుల జననము :**

ఆగంతుక బ్రాహ్మణుడు మరల నిట్లు బ్రాహ్మణ వేషములో నున్న పాండవులతో నిట్లనెను :-

"బ్రాహ్మణోత్తములారా! యిట్లు ద్రుపదరాజు అమర్షభరితుడై, యజ్ఞానుష్ఠాన కర్మసిద్ధులైన బ్రాహ్మణుల కొరకు అనేక బ్రహ్మ ఋష్యాశ్రమములకు తిరుగజొచ్చెను. అతడొక యుత్తమ పుత్రుని కనదలచెను. అతని చిత్తము శోక వ్యాకులమై యుండెను. తనకు శ్రేష్ఠ సంతానము లేదని రాత్రింబవళ్ళు చింతించు చుండెను. తనకు గల పుత్రులను, సోదరులను బంధువులనున్ను అతడు ధిక్కరించు చుండెను. ద్రోణునకు ప్రతీకారము చేయదలచుచు సర్వదా దీర్ఘముగా, ఉష్ణముగాను, నిట్టూర్చు చుండెను.

"బ్రాహ్మణులారా! ద్రుపదుడు ద్రోణాచార్యునకు ప్రతీకారము చేయుటకు ఎంత ప్రయత్నించినను, ద్రోణుని 'ప్రభావ - వినయ - విద్యా - సదాచారము లను తలచి, క్షాత్రబలముచేత నతనిని జయించుటకు ఏలాటి యుపాయము ద్రుపదునకు తోచలేదు. అతడు కృష్ణవర్ణము గల యమునా - గంగానదుల తీరములందు తిరుగుచు నొక బ్రాహ్మణుల పవిత్ర స్థానము చేరెను. ఆ చోట విధి విధానము ప్రకారము బ్రహ్మచర్యమును పాలించని వాడు, వేదశాస్త్రాధ్యయనము చేయనివాడు నగు బ్రాహ్మణు డొక్కడుగూడ, ఆ రాజునకు కనపడ లేదు.

అప్పుడు ఆ రాజు అక్కడ కఠోరవ్రత నియమ పాలనము చేయుచున్న యిద్దరు బ్రహ్మర్షులను చూచెను. వారిపేర్లు 'యాజుడు - ఉపయాజుడు' అని యుండెను. ఆ యిరువురున్ను పరమశాంతులు - బ్రహ్మ సమాన ప్రభావము గల వారుగా నుండిరి. వారు వేద సంహితాధ్యయనమునందు నిమగ్నులై యుండిరి. వారు 'కాశ్యప' గోత్రజులు. వా రిరువురు సూర్యభక్తులు. వారు మిక్కిలి యోగ్యులు, శ్రేష్ఠులుగాను నుండిరి.

"ఆ యిరువురి శక్తిని గనిపెట్టి ద్రుపదరాజు వారి మనోవాంఛిత భోగ్య వస్తువు లన్నియు నిచ్చుటకు సంకల్పించి వారిని ఆహ్వానించెను. ఆ యిరువురిలో కనిష్ఠుడైన ఉపయాజుడు ఉత్తమ వ్రతపాలనము చేయు వాడుగా నుండెను. ద్రుపదుడు ఏకాంతమునందు ఉపయాజునితో గలిసి, యతనిని తనకు అనుకూల పరచుకొనుటకు ప్రయత్నించు చుండెను. అతని మనోవాంఛితములైన సమస్త వస్తువుల నిచ్చుటకు ప్రతిజ్ఞ చేసి, ప్రియవచనములు మాట్లాడి ద్రుపదు డాముని చరణసేవ చేయుచు, నతనిని పూజించి యిట్లనెను :-

"బ్రాహ్మణోత్తమా! యే కర్మ చేత ద్రోణాచార్యుని చంపగల పుత్రుడు నాకు గలుగునో, అట్టి కర్మ నీవు నెరవేర్చిన యెడల నీకు ఒక అర్బుదము (పది కోట్లు) ఆవుల నిచ్చెదను. ఇదిగాక, నీకు ప్రియములైన వస్తువు లేవి కోరినను, అవి యన్నియు నీకు సమర్పించెదను.

"బ్రాహ్మణులారా! ద్రుపదు డిట్లు చెప్పిన తరువాత ఉపయాజ మహర్షి, 'నేను అటువంటి పని చేయను' అని చెప్పెను. కాని ద్రుపదుడు అతనిని

ప్రసన్నుని జేయుటకు మరల సరినిసి సేవింప దొడగెను. అట్లు ఒక సంవత్సరము ద్రుపదుడు సేవ చేయుచు గడపగా, ఉపయాజుడు ఉపయుక్తమైన సమయమునందు ద్రుపదునితో మధురముగా నిట్లనెను.

"ద్రుపదరాజా! నా జ్యేష్ఠభ్రాత యాజుడు ఒక సమయమందు దుర్గమ వనమందు సంచరించుచు నొక యపరిశుద్ధమైన ప్రదేశమందు పడిన పండు తీసికొనెను. అప్పుడు నేను గూడ నా యన్నగారి వెనుక పోవు చుంటిని. కనుక, అతని యీ అయోగ్య కార్యము చూచి 'ఈయన అపవిత్ర వస్తువును తీసికొనుటకు గూడ ఏ మాత్రము విచారము చేయడు' అని తలచితిని. ఆయన ఆ పండు యొక్క దోషములవైపు చూడక యుండెను. ఏదైన వస్తువు తీసికొనుటలో శుద్ధి, అశుద్ధి అను విచారము లేని మాయన్న ఇతర కార్యములందు గూడ ఎట్లు వ్యవహరించునో యని చెప్పుటకు సాధ్యము కాదు.

"రాజా! గురుకులమునందు వేద సంహితా భాగమును అధ్యయనము చేయుచుండి కూడ ఆయన యితరులు విడిచిపెట్టిన భిక్షాన్నమును అప్పుడప్పుడు తినుచు, అసహ్యపడక మాటి - మాటికి, ఆ యన్నపు గుణములను వర్ణించు చుండెను. అట్టి, నా సోదరుని నేను, సతర్కముగా చూచినప్పుడు అతడు పండు నందు లోభము కలవాడుగా తోచు చుండెను. కనుక, రాజా! నీవు అతని కడకే పొమ్ము. ధనాశచేత నీ యజ్ఞము చేయించ గలడు".

"జనమేజయా! యిట్లు ఉపయాజుడు చెప్పగా విని ద్రుపదరాజు యాజుని యొక్క ప్రవర్తనను మనస్సులోనే నిందించు చున్నను, తన కార్యసిద్ధి కొరకు ఆ యాశ్రమమునకు పోయి యతనిని పూజించి, అతనితో నిట్లనెను":-

"భగవన్! నేను నీకు ఎనుబది వేల గోవులను సమర్పించెదను. నా యజ్ఞము చేయింపుము. నేను ద్రోణుని యందు వైరము చేత సంతాపము చెందు చున్నాను. నాకు సంతోషము కలిగింపుము. ద్రోణాచార్యుడు బ్రహ్మ విదులలో శ్రేష్ఠుడు. బ్రహ్మాస్త్ర ప్రయోగమునందు గూడ సర్వోత్తముడు. అతనితో నేను మైత్రి అంగీకరించుటయా లేదా అను విషయములో జరిగిన జగడములో అతడు నన్ను ఓడించెను. అతడు రెండు కురువంశముల రాజకుమారులకు

ప్రధానాచార్యుడు. ఈ భూమండలమందు అస్త్రవిద్యలో అతనిని మించిన క్షత్రియ వీరు డెవ్వడు గూడ లేడు."

"బ్రహ్మన్! ద్రోణాచార్యుని బాణములు ప్రాణుల శరీరములను చంపు నవిగా నున్నవి. అతనికి తాళప్రమాణము గల ఆరుమూరల పొడవైన ధనుస్సు కలదు. ఆ మహాధనుర్ధరుడైన ద్రోణాచార్యుడు బ్రాహ్మణ తేజస్సు ద్వారా క్షత్రియ తేజస్సును అణచి వేయును. 'పరశురాముని వలె క్షత్రియ సంహారము నకు అతడు సృజింప బడినాడా' అని తోచును అతని యస్త్ర బలము అతి భయంకరమైనది. భూమండలము నందలి మనుష్యు లందరు ఏకమై కూడ నతని యస్త్రబలమును అణచ జాలరు."

"మహర్షీ! నేతి ఆహుతుల చేత ప్రజ్వలితమైన యగ్నివలె అతనికి ప్రచండమైన బ్రహ్మతేజస్సు కలదు. యుద్ధమునందు క్షాత్రధర్మముతో క్షత్రియులతో తలపడినప్పుడు వారిని అతడు భస్మము చేయును. ద్రోణాచార్యు నకు బ్రాహ్మ తేజస్సుతోపాటు, క్షాత్రతేజస్సు గూడ ఉన్నప్పటికిన్ని నా బ్రాహ్మ తేజస్సు అతని తేజస్సు కన్న మించి యున్నది. నేను కేవలము క్షాత్రబలము మాత్రమే కలవాడను. కనుక, ద్రోణాచార్యుని కంటె, హీనుడను కాబట్టి, నేను నీ బ్రాహ్మ తేజస్సు చూచి శరణు జొచ్చితిని.

"మహాత్మా! నీవు వేదవేత్త లందరిలో శ్రేష్ఠుడవు. కనుక ద్రోణాచార్యుని కంటే చాల గొప్పవాడవు. నేను నిన్ను ఆశ్రయించి, యుద్ధమునందు దుర్జయు డైన ద్రోణాచార్యుని నశింప జేయగల యొక పుత్రుని పొంద దలచు చున్నాను. నా యీ మనోరథమును నెరవేర్చగల యజ్ఞము చేయింపుము. దానికొరకు నేను నీకు ఒక యర్బుదము (పది కోట్లు) గోవులను దక్షిణగా నిచ్చెదను."

"బ్రాహ్మణులారా! ద్రుపదుని మాటలు విని యాజుడు, 'అట్లే కానిమ్ము' అని యజమానుని యభీష్టసిద్ధికొరకు ఆవశ్యకములైన యజ్ఞమును, తత్సాధన ములనున్ను స్మరించెను. 'ఇది చాల పెద్ద కార్యము అని విచారించి యాజుడు ఈ కార్యము కొరకు ఏవిధమైన కోరిక లేని ఉపయాజుని గూడ ప్రోత్సహించి ద్రోణ వినాశముకొరకు ఒకపుత్రుని కలిగించుటకు ప్రతిజ్ఞ చేసెను.

తరువాత మహాతపస్వియైన ఉపయాజుడు ద్రుపదరాజునకు అభీష్టమైన పుత్రఫలసిద్ధికొరకు ఆవశ్యకమైన యజ్ఞ కర్మను ఉపదేశించి, ద్రుపదునితో, రాజా! ఈ యజ్ఞముచేత నీవు కోరిన పుత్రుడు నీకు గల్గును. అతడు మహా పరాక్రమశాలి, మహా తేజస్సంపన్నుడు, గొప్పబలవంతుడున్ను నగును అని చెప్పెను.

"బ్రాహ్మణోత్తములారా! తరువాత ద్రుపదరాజు ద్రోణఘాతుకుడైన పుత్రుని కొరకు సంకల్పముచేసి, తత్కర్మ సిద్ధికొరకు ఉపయాజుని యుపదేశము ననుసరించి సమస్తవ్యవస్థలు చేసెను. హోమాంతమునందు యాజుడు ద్రుపదునిరాణికి 'త్వరగా నీవు నాకడకు వచ్చి హవిష్యమును గ్రహింపుము. నీ కొకపుత్రుడు, ఒక పుత్రికయు కలుగ నున్నారు. వారు తమతండ్రి కులమును వృద్ధిపరచెదరు' అని చెప్పెను. ఆ మాటకు ద్రుపదుని రాణి యిట్లనెను :-

"బ్రహ్మన్! ఇంకను నా నోటిలో తాంబూల లేపము రంగు నున్నది. నా యవయవములందు దివ్య సుగంధితములైన అంగరాగములు అలదుకొను చున్నాను. కనుక, ముఖము కడుగుకొనక, స్నానము చేయక పుత్రదాయకమైన హవిష్యమును స్పృశించుటకు అర్హతలేక యున్నాను. కాబట్టి, యాజమహాముసీ! నాకు ప్రియమైన యీ కార్యము కొరకు కొంచెముసేపు ఆగి యుండుము."

ఆ మాట విని యాజుడు ఇట్లనెను:-

"ఈ హవిష్యమును యాజుడు స్వయముగా వండి సిద్ధపరచినమీదట ఉపయాజుడు దీనిని అభిమంత్రించెను. కాబట్టి, నీవు రమ్ము, లేదా అక్కడనే నిలిచియుండుము. నీ యిష్టము. ఈ హవిష్యము 'యజమానుని కోరికను ఏట్లైనను నెరవేర్చ జాలును."

"బ్రాహ్మణులారా! ఇట్లు యాజుడు ద్రుపదుని రాణికి చెప్పి, సంస్కరింపబడిన ఆ హవిష్యమును అగ్నియందు వేల్చిన వెంటనే అగ్నినుండి దేవతాసమాన తేజస్సుగల ఒక కుమారుడు ఉద్భవించెను. ఆ కుమారుని శరీర కాంతి అగ్నిజ్వాల వలె భాసించుచు, అతని రూపము భయోత్పాదకముగ నుండెను. అతడు తలపై కిరీటము, శరీరమునందు కవచము, చేతులలో ఖడ్గము, ధనుర్బాణములు ధరించి, పలుసార్లు గర్జిల్లుచుండెను.

"బ్రాహ్మణులారా! ఆ కుమారు డప్పుడు ఒక శ్రేష్ఠ రథమును ఎక్కెను. ఆ రథముచేత నతడు యుద్ధ యాత్రకు వెడలు చున్నాడా యనునట్లుండెను. అది చూచి పాంచాలురకు మిక్కిలి హర్షము గలిగి, 'చాల మంచిది! చాల మంచిది!' అని వారు బిగ్గరగా అరచిరి. అప్పుడు హర్షోల్లాసభరితులైన పాంచాలుర భార మును భూమి సహింపజాల కుండెను. ఆకాశమునందు ఏదియో యదృశ్యమైన భూతము, "ఈ రాజకుమారుడు పాంచాలుర భయము పోగొట్టి వారి కీర్తిని పెంపొందింప గలవా డగును. ఇతడు ద్రుపదరాజ శోకమును దూరము చేయ గలడు. ద్రోణాచార్యుని వధకొరకే యితడు జన్మించెను." అని యన జొచ్చెను.

"బ్రాహ్మణులారా! తరువాత ఆ యజ్ఞవేది నుండి ఒకకుమారీ కన్యకగూడ ఉద్భవించెను. ఆమె పేరు పాంచాలి. ఆమె అత్యంత సౌందర్య సౌభాగ్య సంపన్ను రాలుగా నుండెను. ఆమె ప్రతియొక యంగము మిక్కిలి దర్శనీయముగా నుండి, ఆమె నల్లని విశాల నేత్రములు మెరయుచుండెను. ఆమె శరీరకాంతి నీలముగా నుండి, ఆమె నేత్రములు వికసిత కమలదళమువలె నుండెను. కేశములు నల్లగా వడులు దిరిగి యుండెను. నఖములు ఎత్తై ఎఱ్ఱవిగా నుండెను. కనుబొమలు సుందరములుగా, స్తనములు స్థూలములై మనోహరములుగాను నుండెను.

"బ్రాహ్మణులారా! ఆమె సాక్షాత్తు దుర్గాదేవియే మానవ శరీరముతో అవత రించినదా యనునట్లుండెను. ఆమె యవయవములనుండి నీల కమల సుగంధము బయలువెడలి ఒక కోసువరకు అది నలువైపుల ప్రసరించెను. సుందరరూపము గల యాకన్యకతో సమానురాలైన మరియొక సుందరస్త్రీ భూమండలమునందు లేకుండెను. దేవతా సమానురాలైన యా కన్యకను పొందుటకు దేవ - దానవ యక్షులుగూడ ఉబలాట పడుచుండిరి.

"బ్రహ్మణోత్తములారా! సుందర కటిప్రదేశముగల యా కన్యక యజ్ఞ వేదినుండి జన్మించినప్పుడు గూడ ఆకాశవాణి 'ఈ కన్యకపేరు 'కృష్ణా'దేవి. ఈమె సమస్త యువతులలో నుత్తమ సౌందర్య సంపన్నురాలు. ఈమె క్షత్రియ సంహారముకొరకు పుట్టెను. ఈ కన్యక ఒక సమయమునందు దేవతల కార్యము గూడ సిద్ధింపజేయును- కాబట్టి, కౌరవులకు అత్యంత మహాభయము కలుగును. అని బయలు వెడలెను.

"బ్రాహ్మణులారా! ఆయాకాశవాణి విని పాంచాలురందరు సింహసము దాయమువలె గర్జిల్లిరి. అప్పటివారి వేగమును భూమి సహింప జాల కుండెను. ఆ పుత్రీ-పుత్రులిరువురను చూచి, పుత్రేచ్ఛ గల ద్రుపదుని భార్య! యాజ మహర్షి కడకు పోయి 'భగవన్! ఈ యిరువురు పిల్లలు నన్నుదప్ప మరి యెవరిని గూడ తమ తల్లిగా భావించ కుండునట్లు అనుగ్రహింపుము! అని యనగా యాజుడు 'అట్లే యగుగాక!' యని యనెను.

"బ్రాహ్మణులారా! అప్పు డక్కడి బ్రాహ్మణు లందరు సఫల మనోరథులై ఆ పిల్లలకు నామకరణము చేసిరి. ఈ ద్రుపద కుమారుడు ధృష్టుడు; అమర్షశీలుడు, ద్యుమ్నము (తేజోమయ కవచ - కుండలము - క్షాత్రతేజస్సు) మొదలైన వానితో నుత్పన్ను డయ్యెను. కాబట్టి 'ధృష్టద్యుమ్న' నామముతో ప్రసిద్ధుడు కాగలడు. తరువాత ఆ బ్రాహ్మణులు ఆ కుమారి శరీరము నీల వర్ణము గలది గనుక, ఆమెకు 'కృష్ణా' అని పేరు పెట్టిరి. ఈ విధముగ ద్రుపదుని యజ్ఞమునందు ఆ కవల పిల్లలు పుట్టిరి.

"బ్రాహ్మణులారా! ద్రోణాచార్యుడు ప్రారబ్ధము ప్రకారము రాబోవు భవితవ్యమును తప్పించుకొనుట అసంబద్ధ మని తలచి ధృష్టద్యుమ్నుని తన యింటికి తెచ్చి అతనికి అస్త్రవిద్య నేర్పి చాల గొప్ప యుపకారము చేసెను. ద్రోణాచార్యుడు తన కీర్తి రక్షణముకొరకు ఔదార్యముతో ఆ కార్యము చేసెను.

"బ్రాహ్మణులారా! లక్క యింటిలో పాండవులకు సంభవించిన దుర్ఘటనము విని బ్రాహ్మణులు, పురోహితులున్ను ద్రుపదునితో నిట్లనిరి:"

"రాజా! ధృతరాష్ట్ర పుత్రులు తమ మంత్రులతో సంప్రదించి పాండవుల వినాశము కొరకు విచారణ సలిపిరి. వారి క్రూర చింతనము తదితరులు చేయ జాలరు. దుర్యోధనుడు పంపిన పురోచను డను మంత్రి వారణావతనగరమునకు పోయిపాండవులు తమ తల్లి కుంతీదేవితో పరిపూర్ణ విశ్వాసముతో నివసించు చుండిరి.

"మహారాజా! ఒక అర్ధరాత్రి సమయమందు పురోచనుడు లాక్షాగృహము నకుఅగ్ని అంటించెను. నీచుడు, క్రూరుడు నైన పురోచనుడు గూడ ఆ యగ్నిలో దహింప బడి భస్మమయ్యెను. 'పాండవులు దహింప బడిరి' అను సమాచారము

వినిన ధృతరాష్ట్రునకు అతని బంధువులకున్ను మిక్కిలి హర్షము కలిగినను, పైకి మాత్రము కొంచెము శోకము ప్రదర్శించిరి. అప్పుడు ధృతరాష్ట్రుడు విదురునకు ఆ వృత్తాంతము తెలిపి, "నీవు పాండవులకు శ్రాద్ధతర్పణాదులు చేయింపుము. వారి మరణము చేత నా సోదరుడు పాండురాజు నేడే మరణించి నట్లుగా దుఃఖించుచున్నాను గనుక, గంగాతీరమునందు వారి కొరకు శ్రాద్ధ తర్పణాదులు ఏర్పరచుము. అయ్యో! విధివశమున అమాయకులైన పాండవులు మరణించిరి." అని ఆజ్ఞ యిచ్చెను.

"ద్రుపద మహారాజా! యిట్లు చెప్పి, ధృతరాష్ట్రుడు, శకునియు మిక్కిలి దుఃఖించిరి. భీష్ముడు విధి విధానముగా పాండవులకు ఔర్ధ్వ దైహిక సంస్కారములు జరిపించెను. ఇట్లు దురాత్ముడైన దుర్యోధనుడు పాండవుల వినాశము కొరకు భయంకరమైన కుట్ర పన్నెను. ఇటువంటి నీచకార్యము చేసిన వారిని మేము ఇంతకుముందు కని విని యెరుగము.

"మహారాజా! పాండవుల విషయములో ఈ వృత్తాంతము మేము వినినాము."

"బ్రాహ్మణులారా! బ్రాహ్మణులు, పురోహితులున్ను చెప్పిన యా సమాచారము విని, ద్రుపదుడు, తండ్రి తన పుత్రులు మరణించినప్పుడు శోకించినట్లే, పాండవులు నశించిన సమాచారము విని శోకించి,బాధపడెను.అతడు తన బంధువులను సోదరులను ప్రజలనున్ను పిలిపించి మిక్కిలి దయాభరితముగ వారితో నిట్లనెను:-

"బంధువులారా! అర్జునుని రూపము అద్భుతముగా నుండెను. అతని ధైర్యము ఆశ్చర్యజనకముగా నుండెను. అతని పరాక్రమము అస్త్రవిద్యా నైపుణ్యమున్ను అలౌకికములు. నేను రేయింబవళ్ళు అర్జునుని చింతలోనే మునిగి యుందును. అయ్యో! అట్టి యర్జునుడు తల్లితో, సోదరులతోను అగ్నిలో కాలిపోయెను గదా! ప్రపంచములో నింతకు మించిన ఆశ్చర్యకర విషయమేమి యుండును?

"సత్యమే కాలగతిని దాటుట అతికఠినము. నా ప్రతిజ్ఞ మిథ్య యయ్యెను. ఇప్పుడు నేను లోకులతో నేమి చెప్పగలను? మానసిక దుఃఖముతో రాత్రిం దినములు దహింప బడుచున్నాను. నేను 'యాజ - ఉపయాజుల'ను సత్కరించి వారి నిద్దరు సంతానములను యాచించితిని. ఒక సంతానము ద్రోణాచార్యుని వధింప గల పుత్రుడు. రెండవది, అర్జుననకు పట్టపుదేవికా దగిన కన్యక. నా యీ యుద్దేశము అందరు నెరుగుదురు. యాజ మహర్షి గూడ అట్లే వెల్లడించి యుండెను. అతడు, 'పుత్ర కామేష్టి' యజ్ఞము చేసి, ధృష్టద్యుమ్నుని, 'కృష్ణా దేవిని' పుట్టించి యుండెను. ఈ యిరువురు సంతానమును పొంది నాకు చాల సంతోషము కలిగెను. ఇప్పు డేమి చేయుదును? కుంతీ - పాండవులు నశించిరి."

"బ్రాహ్మణులారా! యిట్లు చెప్పి ద్రుపద మహారాజు మిక్కిలి దుఃఖపీడితు డయ్యెను. పాంచాల రాజగురువు మిక్కిలి సాత్వికుడు. మహా విద్వాంసుడు. రాజు అతిదుఃఖ నిమగ్నుడగుట చూచి, ఆ రాజగురు వతనితో నిట్లనెను" :-

"మహారాజా! పాండవులు పెద్దల యొక్క ఆజ్ఞ పాలించుచు ధర్మాత్ము లుగా నున్నారు. అట్టివారు నశించుట గాని, లేక, పరాజితులగుట గాని అసంభ వము. రాజా! నేను చూచిన సత్యమైన విషయము చెప్పెద వినుము. బ్రాహ్మణు లీసత్యమును ప్రతిపాదించినారు. వేద మంత్రముల ద్వారా కూడ నేనీసత్యమును వినినాను :-

"పూర్వము ఇంద్రాణి (ఇంద్రుని భార్య - శచీదేవి) దేవ గురువైన బృహస్పతి ముఖము నుండి యీ 'ఉపశ్రుతి[1]' యొక్క మహిమ వినెను. అది యే మనగా, 'ఉత్తరాయణ కాలము[2]' నకు అధిష్ఠాత్రి యగు దేవి యగు ఉప

1. తాను మాట్లాడునప్పుడు, ఆకస్మాత్తుగా, గలుగు శుభాశుభసూచకమగు నితరుల సంభాషణము వినుట 'ఉపశ్రుతి' యనబడును.
2. పుష్యమాసమందు 'మకర సంక్రాంతి' తరువాత ఆరు నెలలకాలము (దాదాపు ఆషాఢ మాసంలో కొన్ని దినములు) ఉత్తరాయణకాల మన బడును. ఆ తరువాతి ఆరునెలల కాలము (మకర సంక్రాంతి వరకు) దక్షిణాయన కాలమనబడును.

శ్రుతియే అదృశ్యరూపములో నుండి, యింద్రుని కమలనాళ గ్రంథి యందు దర్శన మిచ్చి యుండెను. మహారాజా! యీ విధముగానే, నేను గూడ పాండవుల విషయములో ఉపశ్రుతి విని యుంటిని. ఆ పాండవు లెక్కడనో యొకచోట తప్పక జీవించి యున్నారు.

"మహారాజా! పాండవు లిక్కడకు అవశ్యముగా వచ్చెద రని నేను శుభ చిహ్నములు చూచినాను. వారు, ఏ కారణము చేత ఇక్కడకు వచ్చెదరో చెప్పెద వినుము - క్షత్రియులు కన్యాదానము చేయుటకు శ్రేష్ఠమైన మార్గము 'స్వయంవర'మని చెప్పబడినది. నీవు నగరమంతటను స్వయంవరము ప్రకటింపుము. తరువాత పాండవులు కుంతీదేవితో, వారు దూరమందున్నను, దగ్గరలో నున్నను, స్వర్గములో నున్నను, ఎక్కడ నున్నప్పటికిన్ని, స్వయంవర సమాచారము వినిన వెంటనే యిక్కడకు అవశ్యముగా వచ్చెదరు. సందేహము లేదు. కనుక, రాజా! నీవు అంతటను స్వయంవర సమాచారము ప్రకటింప జేయుము. ఏమాత్రము విలంబము చేయకుము."

"బ్రాహ్మణోత్తములారా! పురోహితుడు చెప్పిన మాటలు విని, ద్రుపద మహారాజునకు మిక్కిలి సంతోషము కలిగెను. అతడు, పాంచాల నగరముల్లో ద్రౌపదీ స్వయంవరము ప్రకటించెను. పౌష్యమాస శుక్లపక్షపు ఏకాదశీ తిథి - రోహిణీ నక్షత్రము నందు స్వయంవరము జరుగును. దానికి నేటి నుండి డెబ్బది యైదు దినముల వ్యవధి యున్నది."

ఇట్లు ద్రౌపదీ వృత్తాంతము తెలిపి, మరల యాబ్రాహ్మణు డిట్లనెను :

"బ్రాహ్మణీ (కుంతీ!) దేవ - గంధర్వ - యక్షులు, తపస్వులైన ఋషులు గూడ స్వయంవరము చూచుటకు తప్పక పోయెదరు. నీ పుత్రులందరున్ను అతిసుందరులుగా నున్నారు. పాంచాల రాజపుత్రి, ఈ నీ పుత్రులలో నొకనిని స్వేచ్ఛగా పతిగా వరింపగలదు లేదా నీ మధ్యమ పుత్రుని తన పతిగా, ద్రౌపది వరించగలదు. ప్రపంచములో విధివిధానము నెవడెరుగ గలడు? కనుక, నా మాట నీకు మంచిదని తోచినయెడల, నీవు పుత్రులతో పాటు తప్పక పాంచాల దేశమునకు పొమ్ము."

"తపోధనులారా! పాంచాల దేశము సర్వదా సుభిక్షముగా నుండును. యజ్ఞసేన (ద్రుపద) మహారాజు సత్యప్రతిజ్ఞుడు. బ్రాహ్మణ భక్తుడు. అక్కడి

ప్రజలు గూడ బ్రాహ్మణుల యెడల శ్రద్ధాభక్తులుగల వారు. అక్కడి బ్రాహ్మణులు గూడ అతిథులందు ప్రేమగలవారు. ఆ బ్రాహ్మణులు, అడుగకుండనే అతిథులను ఆహ్వానించి ఆదరించెదరు. నేనుగూడ ఈ శిష్యులతో అక్కడకే పోయెదను. బ్రాహ్మణీ (కుంతీ!) ఈ విషయము నీకు మంచిదని తోచినయెడల అక్కడకు పోవుటకు బయలుదేరుము. మన మందరమున్ను ఒకటిగా కలిసి పాంచాల దేశమునకు పోవుదము."

"జనమేజయా! ఆగంతకుడగు ఆ బ్రాహ్మణు డిట్లు చెప్పి యూరకుండెను."

**కుంతీదేవి, పుత్రులతో సంప్రదించి పాంచాల దేశ గమనమునకు సిద్ధపడుట :-**

"జనమేజయా! ఆ యాగంతుక బ్రాహ్మణుడు చెప్పిన సమాచారము విని, పాండవుల మనస్సు సంచలనము చెందెను. అప్పుడు కుంతీదేవి, తన పుత్రుల మనస్సు ఆ స్వయంవరమువైపు ఆకర్షింప బడుట చూచి యుధిష్ఠిరునితో నిట్లనెను :-

"పుత్రా! మన మీ బ్రాహ్మణునియింటిలో చాలనాళ్ళుగా నున్నాము. ఈ రమణీయనగరమందు ఆనందముతో తిరిగితిమి. ఇక్కడ మనకు పరిపూర్ణముగా భిక్షము గూడ లభించెను. ఈ ప్రదేశపు రమణీయ వనములను ఉపవనములను అన్నింటినిగూడ పలుసార్లు చూచితిమి. మరల - మరల చూచుటలో మనకు ఎక్కువ ఉత్సాహానందములు కలుగవు. ఇప్పుడు మన కిక్కడ భిక్షముగూడ పూర్వమువలె దొరకుట లేదు. నీ యభిప్రాయమైన యెడల మనము సుఖముగా పాంచాలదేశమునకు పోవుదము. ఆ దేశము మనము పూర్వ మెప్పుడు గూడ చూడలేదు గనుక, అది మనకు రమణీయముగా తోచును. పాంచాలదేశము మిక్కిలి సుభిక్షముగా ఉన్నట్లు తెలియు చున్నది. కనుక మనకు పరిపూర్ణముగా భిక్షము దొరకును. యజ్ఞసేన (ద్రుపద) మహారాజు బ్రాహ్మణ భక్తుడనియు విన్నాను. నాయనా! ఒకేచోట చాలకాలము నివసించుట నాకు ఉచితమని తోచుట లేదు. నీకు మంచిదని తోచినచో మనము సుఖముగా పాంచాల దేశమునకు పోవుదము."

"జనమేజయా! తల్లిమాటలు విని యుధిష్ఠిరు డామెతో నిట్లనెను" :-

"అమ్మా! నీవు మంచిదని తలచిన కార్యము మాకు హితకరముగా నుండును. కాని, నా తమ్ములు అక్కడకు పోవుటకు ఉద్యుక్తులై యున్నారో, లేరో నాకు తెలియదు."

"జనమేజయా! అప్పుడు కుంతిదేవి, భీమార్జున నకులసహదేవులతో గూడ పాంచాలదేశమునకు పోవు విషయమై యడిగెను. వారందరు నంగీకరించిరి. అప్పుడు కుంతీదేవి, అక్కడ తామున్న యింటి యజమానుడు బ్రాహ్మణుని వీడ్కొని తన పుత్రులతో ద్రుపదుని నగరమునకు పోవుటకు సిద్ధపడిరి."

**వ్యాసుడు పాండవులకు ద్రౌపది పూర్వజన్మ వృత్తాంతము చెప్పుట:**

"జనమేజయా! పాండవులు ఏకచక్రాపురమునందు గుప్తముగా నివసించు చున్నప్పుడే వ్యాసభగవానుడు వారితో కలియుట కక్కడకు వచ్చెను. అప్పుడు పాండవులా మహాత్మునకు స్వాగతము చెప్పి నమస్కారము చేసి ఆయన యెదుట చేతులు జోడించుకొని నిలిచిరి. పాండవులచేత గుప్తముగా పూజింపబడిన తరువాత వ్యాసుడు వారిని కూర్చొనబెట్టి, వారితో నిట్లనెను:-

"వీరులారా! మీరు శాస్త్రముయొక్క ఆజ్ఞప్రకారము, ధర్మానుసారము నడచుకొను చున్నారుగదా! పూజనీయులైన బ్రాహ్మణులను పూజించుటలో మీ రెప్పుడుగూడ పొరపాటు చేయ లేదు గదా!"

"జనమేజయా! వ్యాసు డట్లు పాండవుల నడిగి, వారికి ధర్మార్థముల నుపదేశించి చిత్ర - విచిత్రకథలను వినిపించి మరల వారితో నిట్లనెను:-

"నాయనలారా! పూర్వము తపోవనమునం దున్న యొక మహర్షికి ఒక కూతు రుండెను. ఆ కన్యకయొక్క, కటిప్రదేశము కృశముగా, నితంబములు, కనుబొమలున్ను సుందరములుగాను నుండెను. ఆమె సమస్త సద్గుణసంపన్నురాలు. కాని, ఆకన్యక, తాను చేసినకర్మల ఫలితముగా దౌర్భాగ్యవతి యయ్యెను. కాబట్టి, ఆమె రూపవతి, సదాచార సంపన్నురాలునై నప్పటికి, ఆమెకు మంచి పతి లభించ లేదు. అప్పుడామె పతికొరకు ఉగ్రతపస్సు చేసి శంకరభగవానుని ప్రసన్నుని చేసికొనగా, ఆ భగవంతు డామెతో, 'నీకు ఏమి కావలెనో, వరము

కోరుము ఇచ్చెదను' అని యనగా, ఆ కన్యక భగవంతునితో, 'ప్రభూ నేను సర్వగుణసంపన్నుడైన పతిని గోరు చున్నాను' అని ఆ మాటనే పలుసార్లు అనెను.

"అప్పుడా భగవంతుడు ఆమెతో, మంగళకరులారా! నీకు భరత వంశీయులైన యైదుగురు పతులు లభించెదరు. అని యనగా నామె శంకరునితో, దేవా! నీ కృపచేత నే నొక్క పతినే కోరెదను! అని యనగా భగవంతు డామెతో, 'నీవు - పతి నిమ్మని నన్ను ఐదుసార్లు కోరితివి. గనుక, ఉత్తర జన్మలో నీకు నేను చెప్పినట్లు వరము లభింప గలదు' అని అనెను.

"పాండు పుత్రులారా! దేవస్వరూపిణియైన ఆ ఋషి కన్యకయే యిప్పుడు ద్రుపదరాజకులమందు జన్మించెను. అపృషతరాజు పౌత్రియైన కృష్ణాదేవి మీకు పత్నిగా నియతమైయున్నది. కనుక, ఇప్పుడు మీరు పాంచాల దేశమునకు పోయి యుండుడు... ద్రౌపదిని పొంది మీరు సుఖముగా నుండెదరు. సందేహము లేదు.

"జనమేజయా! యిట్లు వ్యాసభగవానుడు పాండవులకు చెప్పి వారిని వీడ్కొని యంతర్ధానము చెందెను".

**పాండవుల పాంచాలదేశ ప్రయాణము - అర్జునునిచేత చిత్రరథ గంధర్వుని పరాజయము - ఆ యిరువురి మైత్రి :**

"జనమేజయా! వ్యాసభగవానుడు వెడలిపోయిన తరువాత పాండవులు ప్రసన్నచిత్తులై, తమ తల్లి కుంతీదేవిని ముందిడుకొని యక్కడి నుండి పాంచాల దేశమునకు పోవుటకు బయలుదేరిరి. వెడలునప్పుడు తాముండిన యింటి యజమానుడు బ్రాహ్మణునకు ప్రణామము చేసి, ఉత్తర దిశాభిముఖులై పాంచాల దేశమువైపు పోవుచుండిరి. వారట్లు, ఒక పగలు ఒక రాత్రి ప్రయాణము చేసి గంగా తీరమునందలి 'సోమాశ్రయాయణ' తీర్థము చేరిరి. పాండవులు ప్రయాణము చేయుచున్నప్పుడు, వారి ముందు భాగమందు, అర్జునుడు, వారికి వెలుగు కొరకు, రక్షణము కొరకున్ను ఒక మండుచున్న కొరవి చేతబట్టుకొని పోవుచుండెను".

"జనమేజయా! ఆ సోమాశ్రయాయణ తీర్థము నందు ఏకాంతముగా, గంధర్వ రాజైన 'అంగారపర్ణుడు' (చిత్రరథుడు) అనువాడు తన స్త్రీలతో జలక్రీడలు చేయు చుండెను. అతడు మిక్కిలి ఈర్ష్యగల వాడుగా నుండెను. జలక్రీడ కొరకే యత డక్కడకు వచ్చి యుండెను. గంగవైపు నడచుచున్న పాండవుల పాద ధ్వని నతడు వినగానే, మిక్కిలి క్రోధముతో వచ్చి వారిని కుంతీదేవినిన్ని చూచి, ధనుష్టంకారము చేయుచు వారితో నిట్లనెను".

"రాత్రియారంభమునకు పూర్వము పశ్చిమదిక్కునందు భయంకర సంధ్యాకాలపు రక్తచ్ఛాయ వ్యాపించినప్పుడు ఎనుబది లవము[1]ల కాలము విడిచి, ఆ [2]ముహూర్తకాలమంతయు, ఇచ్ఛానుసారముగా సంచరించుటకు యక్ష - గంధర్వ - రాక్షసులకొరకు నిశ్చితమైయున్నది. తక్కిన దినమంతయు మనుష్యులు సంచరించుటకు ఏర్పడిన కాలమని నిశ్చితమై యున్నది.

"మనుష్య లెవరైన మేము సంచరించుకాలములో లోభముచేత, ఇక్కడ తిరుగుటకు వచ్చినయెడల అట్టి మూర్ఖులను గంధర్వులు, రాక్షసులునైన మేము బంధించి, చెరబెట్టెదము. కనుక, రాత్రివేళలలో జలములో దిగు మనుష్యులను, బలవంతులైన రాజులనున్ను వేదవేత్తలు నిందించెదరు. మానవులారా! దూరముగ నిలిచి యుండుడు. నా యొద్దకు రాకుడు. గంధర్వరాజు,అంగా రపర్ణుడను పేరు గల నేను గంగా జలములో దిగియున్నానని మీ కెట్లు తెలియలేదు? నన్ను మీరు బాగుగా తెలిసికొనుడి. నేను స్వబలముపై విశ్వాసము గల స్వాభిమానవంతుడను, ఈర్ష్యగలవాడను, కుబేరుని మిత్రుడను సుమా! నా యీ వనమునకుగూడ 'అంగారపర్ణవన'మని పేరు గలదు. నేను గంగాతీరమందు సంచరించుచు, ఈ వనమందు స్వేచ్ఛగా విచిత్ర క్రీడలు చేయుచుందును. నేనిక్కడ నుండగా, నిక్కడకు, యక్ష-రాక్షస-దేవ-మనుష్యాదు లెవరుగూడ రాజాలరు. ఇట్లుండగా, మీరెట్లు వచ్చితిరి?"

1. ఒక నిముషములో 60 వ భాగము (ఒక సెకెండు) 'లవము' అనబడును.
2. 'ముహూర్త' మనగా రెండు గడియల (నలువదియెనిమిది నిముషముల) కాలము.

"జనమేజయా! ఆ మాట విని యర్జునుడతనితో నిట్లనెను:-

"దుర్మతీ! సముద్ర-హిమాలయ, పార్శ్వ - గంగాతీరములందు రాత్రిం దినములు, సంధ్యా సమయములలోను నెవరి! యధికారము గలదు? గంధర్వా! గంగానదీ తీరమునందు, ఎవరున్ను భుజించికాని, భుజించకగాని, రాత్రిగాని, పగలు గాని, యే కాలమునందు గాని వచ్చుటకు ఏలాటి నియమము (అడ్డంకు) లేదు. క్రూరుడా! మేము శక్తిమంతులము. అకాలములోగూడ వచ్చి నిన్ను త్రొక్కి-వేయగలము. యుద్ధము చేయుటకు దుర్బలులైన మనుష్యులే మీ పూజ చేసెదరు.

"పూర్వకాలమందు, హిమాలయపు సువర్ణ శిఖరము నుండి ప్రవహించిన గంగానది, ఏడు పాయలుగా చీలిపోయి సముద్రములో కలిసెను. 'గంగా - యమునా నదులు, ప్లక్ష (రావి) వృక్షపు మూలము నుండి వెడలిన సరస్వతీ రథస్థా-సరయూ-గోమతీ-గండకీ నదులు, ఈ యేడు నదుల జలము త్రాగిన వాని పాపములు తత్క్షణమే నశించును. ఈ గంగ అతి పవిత్రమైనది. ఇది ఆకాశమునే మరల చేరగలదు.

"గంధర్వా! ఈ గంగానది ఆకాశమార్గమందు, దేవలోకమందున్ను 'అలకనంద' యనుపేరు గల దగును. ఇదియే 'వైతరణీ' నామముతో పితృ లోకమునందు ప్రవహించును. పితృలోకమందు ఈ నదిని దాటుట పాపులకు అతికఠినము ఈ భూలోకమునకు వచ్చి ఈ నది గంగయను పేరుతో ప్రసిద్ధ మయ్యెను. ఈ విషయము వ్యాస మహాముని చెప్పెను. కల్యాణకారిణి యైన యీ గంగానదిని సేవించిన వారికి ఇది ఏ విఘ్నములు, బాధలున్ను లేకుండ స్వర్గప్రాప్తి కలిగించును. ఇట్టి గంగ యొద్దకు వచ్చిన మమ్ము నీ వెందుకు ఆపు చున్నావు? నీ యీ పని సనాతన ధర్మ సమ్మతము గాదు. ఎవరుగూడ నివారింప జాలని, యే బాధయు లేని పావనగంగాజలమును, నీమాటచేత, ఎట్లు స్పృశించ కుండెదము?"

"జనమేజయా! అర్జునుని మాట విని, అంగారపర్ణుడు క్రుద్ధుడై విష సర్పము వంటి తీక్ష్ణ బాణములను అర్జునునిపై ప్రయోగింపగా నర్జునుడు వెంటనే చేతిలోని కొరవి త్రిప్పి తనడాలుతో అంగారపర్ణుని బాణములను నివారించుచు, వ్యర్థములు చేసి, యతనితో నర్జును డిట్లనెను.

"గంధర్వా! అస్త్ర విద్యాపారంగతులపై నీయీబిభీషికలు (బెదరింపులు) సాగవు. అట్టివారిపై ప్రయోగించిన నీమాయ నురుగువలె కరగిపోవును. గంధర్వు లందరు మనుష్యులకంటె అధికశక్తి సంపన్ను లని నాకు తెలియును. కనుక, నేను నీతో మాయచేతకాక, దివ్యాస్త్రములచేత యుద్ధము చేసెదను. ఈ ఆగ్నేయాస్త్రము పూర్వము దేవగురులైన బృహస్పతి భరద్వాజ మహా మునికి ఇచ్చి యుండెను. భరద్వాజుని నుండి 'అగ్నివేశ్యుడు', అతని నుండి నా గురువు ద్రోణాచార్యుడున్ను ఈ యస్త్రము బడసెను. ద్రోణాచార్యుడు ఈ యుత్తమాస్త్రమును నాకు ప్రసాదించెను."

"జనమేజయా! యిట్లు చెప్పి యర్జునుడు కుపితుడై ఆ గంధర్వుని పైన, జ్వలించు చున్న ఆగ్నేయాస్త్రము ప్రయోగించగా ఆ యస్త్రము గంధర్వుని రథమును భస్మము చేసెను. అప్పుడతడు రథహీనుడై, ఆగ్నేయాస్త్ర తేజస్సు చేత వ్యాకులుడై మోహముచేత ముఖము క్రిందకు చేసి పడుచుండెను. అప్పుడర్జునుడు, పుష్పమాలాశోభితమైన యతని జుట్టు పట్టుకొని యీడ్చుకొనుచు, తన సోదరుల కడకుతెచ్చెను. అయస్త్రాఘాతముచేత గంధర్వుడు మూర్ఛితుడయ్యెను. అప్పుడా గంధర్వుని పత్ని 'కుంభీనసి' యనునామె తన పతిని రక్షింపుమని, యుధిష్ఠిరుని శరణు జొచ్చి, యతనితో, 'మహాభాగా! నన్ను రక్షింపుము, నా యీ పతిదేవుని విడువుము. గంధర్వ పత్నియైన 'కుంభీనసి' యను నేను నీ శరణు జొచ్చితిని;' అని వేడుకొనెను. ఆమాట విని యుధిష్ఠిరుడు అర్జునునితో నిట్లనెను:-

"తమ్ముడా! యీ గంధర్వుడు యుద్ధములో ఓడిపోయి తన కీర్తిని పోగొట్టుకున్నాడు. ఇప్పు డతనికి రక్షకురాలుగా నితని భార్య వచ్చినది. ఇత డిప్పుడిక పరాక్రమము చూపజాలడు. ఇటువంటి హీనస్థితిలో దీనుడుగా నున్న శత్రువు నెవడు చంపును? కనుక; నితనిని సజీవముగా విడిచిపెట్టుము."

"జనమేజయా! అప్పుడు అర్జునుడు గంధర్వునితో నిట్లనెను:-

"గంధర్వా! యిక బ్రతికి పొమ్ము. దుఃఖింపకుము. ఇప్పుడు కురురాజైన యుధిష్ఠిరుడు నీకు అభయప్రదానము చేసెను.

"జనమేజయా! ఇట్లు అర్జును డనగా, ఆ గంధర్వుడు అర్జునునితో నిట్లనెను:-

"అర్జునా! నేను పరాజితుడ నైతిని. కనుక, పూర్వపు అంగారపర్ణ నామము విడిచితిని. ఇప్పుడు నాబలము నిక శ్లాఘించుకొనను. ఈ పేరు పెట్టుకొని యిక తిరుగను. ఈ నాటికా పరాజయము వలన నాకు చాల లాభము కలిగెను. దివ్యాస్త్రధరుడైన యర్జునునితో నాకు మైత్రి కలిగెను. ఇప్పుడు నేను నీకు గంధర్వమాయను ఇచ్చెదను. నీ యాగ్నేయాస్త్రము చేత, విచిత్రమైన శ్రేష్ఠరథము దగ్ధమయ్యెను. పూర్వము నాకు విచిత్రరథ ముండెను. గనుక, నాపేరు 'చిత్రరథుడు' అని యుండెను. కాని యిప్పుడు నా పేరు 'దగ్ధరథుడు' అని యాయెను.

"పూర్వకాలమందు నేను ఇక్కడ తపస్సు చేసి సంపాదించిన యీ విద్యను నేడు, నా ప్రాణదాతయైన మిత్రునకు సమర్పించెదను. తన వేగముచేత, శత్రువు శక్తిని కుంటువడజేసి యతనిని జయించి, ఆ శత్రువే తన శరణుజొచ్చినప్పుడు ప్రాణ దానము చేసిన వీరుడు, ఏ శ్రేయస్సు పొందుటకు అధికారి కాడు?

'చాక్షుషీ నామముగల యీ విద్యను మనువు సోమున కిచ్చెను. సోముడు విశ్వావసువునకు, అతడు నాకు నిచ్చెను. గురువిచ్చిన యీ విద్య పిరికిపందకు లభించినయెడల నష్టమగును. ఈ విధముగా నేను ఈ విద్యోపదేశపరంపరను గూర్చి వర్ణించితిని, ఇక నిప్పుడు ఈ విద్యాబలమునుగూర్చికూడ నీవు వినుము.

"మూడు లోకములలో ఏ వస్తువునైనను చూడదలచిన యెడల, దానిని ఈ విద్యా ప్రభావముచేత నెవడైనను, ఏ రూపములో చూడదలచినను చూడ గలడు. ఒక నెల కాలము ఒంటికాలిమీద నిలిచి తపస్సు చేసినవాడే ఈ విద్యను పొందగలడు. కాని, అర్జునా నీకు, ఈ నియమపాలనము, తపస్సున్ను అక్కర లేకుండనే నేను స్వయముగా ఈ విద్యను నీ కిచ్చెదను.

"రాజా! ఈ విద్యాబలముచేతనే, మేము మనుష్యులకన్న శ్రేష్ఠులమై, దేవతా ప్రభావమును చూపగలము. నరోత్తమా! నీకు, నీ సోదరులకున్ను నేను ఒక్కొక్కరికి ఒక నూరుచొప్పున గంధర్వాశ్వములను కానుకగా నిచ్చెదను. ఆ యశ్వములు దేవతలకు, గంధర్వులకున్ను వాహనములు. వాని శరీరములకు దివ్యకాంతిగలదు. అవి మనోవేగము గలిగి, అవసరమైనప్పుడు బక్కచిక్కినవిగా లావుగాను అగును. కాని, వాని వేగము ఎప్పుడుగూడ తగ్గదు.

"అర్జునా! పూర్వకాలమందు వృత్రాసుర సంహారమునకుగాను ఇంద్రుని కొరకు నిర్మింపబడిన వజ్రాయుధము వృత్రాసురుని తలపై పడగనే పది పెద్ద ముక్కలుగా, నూరు చిన్నముక్కలుగాను విరిగెను. అనేక భాగములుగానైన యా వజ్రాయుధపు ప్రతిభాగమును దేవతలు ఉపాసించెదరు. లోకములో ధనము, యశస్సు మొదలైన యుత్కృష్టవస్తువు లన్నియు ఆ వజ్రాయుధ స్వరూపములే యగును.

"అర్జునా! 'అగ్నిలో ఆహుతి యిచ్చుటవలన, బ్రాహ్మణుని కుడిచేయి వజ్రము, క్షత్రియునిరథము వజ్రము, వైశ్యుడు చేసిన దానము వజ్రము; శూద్రుని సేవాకార్యము వజ్రమునని తెలిసికొన వలెను. 'క్షత్రియునియొక్క రథరూపమైన వజ్రముయొక్క ముఖ్యాంగము లగుటచేత అశ్వములు అవధ్యములు, అని చెప్పబడెను. దేవ - గంధర్వుల రథములను వహించునట్టి రథాంగ స్వరూప (వజ్రస్వరూప)ములైన అశ్వములను గంధర్వదేశీయమైన అశ్వస్త్రీ కనెను. కనుక, గంధర్వాశ్వములు ఇతరాశ్వము లన్నింటికంటె అధికశౌర్యము కలవని తలచబడు చున్నది."

ఆ గంధర్వాశ్వములు వాని యిచ్ఛానుసారముగా రంగులు మార్చుకొనును. వానిపై నెక్కినవారి యిచ్ఛానుసారముగా నవి తమ వేగమును తగ్గించుచు, పెంచుచు నుండగలవు. అవసరము గాని, లేక, కోరిక గాని కలిగినప్పుడు అవి తలచినంతనే యజమానుని కడకు వచ్చును. ఇది గంధర్వ దేశీయాశ్వముల విశేషము. ఇట్లు నేను నీ కిచ్చు ఈ గంధర్వ దేశీయాశ్వములు నీ యిచ్ఛను పరిపూర్ణము చేయుచుండ గలవు."

"ఆ మాట విని అర్జునుడు చిత్రరథునితో నిట్లనెను :-"

"గంధర్వా! నీవు ప్రసన్నుడవై లేదా ప్రాణ రక్షణము కొరకు ఈ 'చాక్షుషీ విద్య'ను, అశ్వధనమును లేదా శాస్త్రమును నాకు ఇచ్చిన యెడల నేను ఇటువంటి దానము తీసికొనుటకు ఇష్టపడను."

"ఇట్లనగా, గంధర్వుడు అర్జునునితో నిట్లనెను" :-

"మహాభాగా! మహాపురుషులతో సమాగమము ప్రీతిని వృద్ధిపరచునది యగును. నీవు నాకు ప్రాణదానము చేసితివి గనుక, నేను ప్రసన్నుడనై, నీకు చాక్షుషీ విద్యను కానుకగా నిచ్చితిని. దానితోపాటే, నేను, నీ నుండి ఆగ్నేయాస్త్రమును గ్రహించెదను. ఇట్లు చేయుటచేతనే మన యిరువురిమైత్రి దీర్ఘకాలముదాక నిలిచి యుండును."

"ఇట్లు గంధర్వుడు అనగా అర్జును డతనితో నిట్లనెను :-"

"గంధర్వా! నీవు చెప్పిన మాట బాగుగనే యున్నది. నేను ఈ యాగ్నేయాస్త్రవిద్య నీ కిచ్చి నీ నుండి అశ్వములను తీసికొనెదను. మన యిరువురి మైత్రి ఎల్లప్పటికిన్ని స్థిరముగా నుండుగాక."

"మిత్రమా! గంధర్వరాజా! మీ నుండి మనుష్యులమైన మాకు భయ మెందుకు కలుగునో తెలుపుము. మే మందరము వేదవేత్తలము. శత్రువులను జయించు శక్తి మాకు గలదు. ఇట్లుండియు రాత్రి ప్రయాణము చేయునప్పుడు నీవు మాపై ఆక్రమణము చేసితివి. దానికి కారణమేమో తెల్పుము."

ఆ మాటకు గంధర్వుడు పాండవులతో నిట్లనెను :-

1"పాండు కుమారులారా! మీరు అవివాహితులు కనుక, మూడు విధములైన అగ్నులను సేవించరు. వేదాధ్యయనము పూర్తిగా చేసి సమావర్తన (స్నాతక) సంస్కారము నెరవేర్చితిరి గనుక, మీరు ప్రతిదినము అగ్నియందు ఆహుతులు గూడ నీయరు. మీ యగ్ర భాగమునందు ఏ బ్రాహ్మణ పురోహితుడు గూడ లేడు. ఈ కారణముల చేత నేను నీ పైన ఆక్రమణము చేయ గలిగితిని."

"అర్జునా! ఇందుచేతనే నేను నీ పరాక్రమమును, నీ వంశప్రభావమును తెలిసి యుండి కూడ నీపై ఆక్రమణము చేయ దలచితిని. మీరు, మహా

1. ఇవి 'త్రేతాగ్ను' లనబడును. ఇవి - 'దక్షిణాగ్ని - గార్హపత్యము-ఆహవనీయము' అనబడును. యజ్ఞము నందలి యజ్ఞవేదికపై ఈ మూడు అగ్నులు విడివిడిగా నుండి, వీనిలో వేరువేరు హోమములు చేయబడును.

తేజ సంపన్నులు. మీ గుణముల చేత సంపాదితమైన సత్కీర్తి అంతట విస్తరించెను. మూడు లోకముల ప్రజలు మీ మహిమను ఎరుగుదురు. యక్ష - రాక్షస - గంధర్వ - పిశాచ - నాగ - దానవాదులు కురుకుల యశోగాథలను వర్ణించు చుండెదరు.''

''వీరవరా! లోకత్రయమునందు ప్రఖ్యాత యశస్వి యైన మీ ధనుర్వేదాచార్యుడు, వేద గురువు నైన ద్రోణుని గూడ నేను బాగుగా నెరుగుదును. యమ - వాయు - ఇంద్ర - అశ్వినీ దేవతలు, పాండురాజు - ఈ ఆరుగురు మహాత్ములు కురువంశమును వృద్ధి పరచినారు. దేవతలలోను, మనుష్యులలోను, శ్రేష్ఠులైన యీ ఆరుగురు మీకు తండ్రులు. అని కూడ నే నెరుగుదును. మీ సోదరు లందరు దేవ స్వరూపులు, మహాత్ములు, సమస్త శస్త్రధారులలో శ్రేష్ఠులు, శూరులు, బ్రహ్మచర్య వ్రతపాలకులునై యున్నారు. మీ యంతఃకరణము పరిశుద్ధము. ఈ విషయము లన్నియు నాకు తెలిసినప్పటికిన్ని మీపై దాడి చేసితిని.

''అర్జునా! దీనికి కారణ మేమనగా - తన బాహుబలము పైన నమ్మకము గలవా డెవ డైనను, స్త్రీ సమక్షము నందు తనకు తిరస్కారము కలిగినప్పుడు సహింప జాలడు. ఇది గాక, మరియొక విషయమే మనగా రాత్రి వేళల మాకు బలము వృద్ధి చెందును. కనుకనే, స్త్రీతో నుండిన కారణము చేత నాకు క్రోధావేశము కలిగెను.

"తపతీకుల వర్ధనుడవైన అర్జునా ! నీవు ఏ కారణముచేత యుద్ధము నందు నన్ను జయించితివో అది కూడ చెప్పెద వినుము :-

"అర్జునా ! బ్రహ్మచర్యము అన్నిటికన్న పెద్ద ధర్మము. అది నీయందు స్థిరముగా నున్నది. కనుకనే, యుద్ధము నందు నేను నీకు ఓడితిని. కామాసక్తుడైన మరియొక క్షత్రియుడు రాత్రి కాలమున నాతో యుద్ధము చేయుటకు వచ్చి యుండినయెడల నతడు ఎట్టి పరిస్థితిలోను బ్రతికి పోవగలిగి యుండడు.

కౌంతేయా ! కామాసక్తపురుష డైనను, బ్రాహ్మణుని ముందిడుకొని నడచిన యెడల సమస్త నిశాచరులను జయించ గలడు. ఎందుకనగా, అట్టి పరిస్థితి

లోను నతని భారమంతయు, పురోహితుడు వహించును. కనుక, ఈ లోకము నందు మనుష్యులు శ్రేయస్కరకార్యములు ఏవి చేయ గోరినను ఆ కార్యము లందు మనస్సును, ఇంద్రియమును వశపరచుకొనిన పురోహితులను నియోగించ వలెను.

"అర్జునా ! షడంగ సహిత వేదాధ్యయనమునందు తత్పరుడు, న్యాయ శీలుడు, సత్యవాది, ధర్మాత్ముడు, మనో నిగ్రహము కలవాడు నగు బ్రాహ్మణుడు రాజులకు పురోహితుడుగా నుండవలెను. ఏ రాజు నొద్ద ధర్మజ్ఞుడు, వక్త, శీలవంతుడు, న్యాయపరుడునైన బ్రాహ్మణుడు పురోహితుడుగా నుండునో, అట్టి రాజునకు ఈ లోకమునందు విజయము సిద్ధించి, మరణానంతరము స్వర్గలోకము లభించును.

"అర్జునా ! రాజులు ఏదైన అప్రాప్యవస్తువును గాని, ధనమును గాని పొందుటకు, అథవా లభించిన ధనాదులను రక్షించుకొనుటకున్ను గుణవంతుడైన బ్రాహ్మణుని పురోహితునిగా జేసికొనవలెను. సముద్ర పరివృతమైన సమస్త భూమండలముపై తన యధికారమును కోరువాడు లేదా తన కొరకు ఐశ్వర్యమును సంపాదింపగోరువాడున్ను పురోహితుని యాజ్ఞకు వశుడై యుండ వలెను.

"అర్జునా! ఏ రాజుగూడ, ఎక్కడ కూడ పురోహితుని సహాయము లేకుండ, కేవలము తనబలముచేత లేదా తన కులీనత్వమునందలి విశ్వాసముచేతను భూమండలమునందు విజయము సాధింప జాలడు. కనుక, అర్జునా! ఎక్కడ విద్వాంసుడైన బ్రాహ్మణునకు ప్రాధాన్యము గలదో ఆ రాజ్యము చాలకాలము దాక రక్షింపబడునని తెలిసికొనుము."

"జనమేజయా! గంధర్వుని మాటలు విని అర్జును డతనితో నిట్లనెను :-

తపతీ సంవరణోపాఖ్యానము :-

సూర్య పుత్రి తపతిని చూచి సంవరణరాజు మోహితు డగుట :-

"గంధర్వరాజా! నీవు 'తపతీనందనా' అని నన్ను సంబోధించితివి. 'తాపత్య' శబ్దమునకు అర్థమేమియో తెలుపుము 'తపతి' యనగా నెవతె. ఆమె

సంతతివార మగుటచేత మేము 'తాపత్యుల' మనబడు చున్నాముగదా! మేము కుంతీ పుత్రులము అని అనుకొను చున్నాము. కనుక తాపత్య శబ్దముయొక్క యథార్థ రహస్యము తెలియగోరు చున్నాను."

"జనమేజయా! ఇట్లు, అర్జునుడు అడుగగా, గంధర్వుడు అతనికి లోక త్రయమునందు ప్రసిద్ధమైన ఆ కథ యిట్లు చెప్ప దొడగెను.

"కుంతీ కుమారా! ఈ విషయములో అత్యంతమనోరంజకమైన యొక కథ ఉన్నది. అది పూర్తిగా చెప్పెద వినుము :-

"సమస్త లోకములను తనతేజో మండలముచేత ప్రకాశింపజేయు చున్న సూర్యభగవానునకు 'తపతీ' నామముగల యొక కూతురు ఉండెను. ఆమె తండ్రి వలెనే ప్రకాశమానురాలై యుండెను సావిత్రీదేవికి అక్కయైన తపతి తపస్సు నందు లగ్నమై యుండుటచేత మూడులోకములందు ఆమెకు 'తపతి' యను సార్థకనామము ప్రసిద్ధ మయ్యెను.

"అర్జునా! ఆ సమయమందు 'దేవ - అసుర - యక్ష - రాక్షస - జాతి స్త్రీలు, అప్సరసలు. గంధర్వపత్నులు - వీ రెవరుగూడ ఆమెతో సమానరూప వతులు కా కుండిరి. ఆమెయవయవము లన్నియు సుందరములై నిర్దోషములుగా నుండెను. ఆమె నేత్రములు విశాలములుగ నుండెను. ఆసుందరి సత్త్వవర్తనము సద్భావమున్ను గలదై మనోహరవేష భూషితయై యుండెను. మూడులోకము లందున్ను ఆమెకు రూప-శీల-గుణ-శాస్త్రజ్ఞానములలో సమానుడు ఆమెపతి యగుటకు యోగ్యుడుగా సూర్యునకు ఎవరును కనపడ లేదు.

"అర్జునా! ఆమె యువావస్థకు వచ్చిన దగుటచేత ఆమె వివాహము చేయుట, ఆవశ్యకమై యుండెను. సూర్యుడు తపతిని అట్టియువావస్థలో చూచి 'ఈమె వివాహము ఎవరితో చేయవలెను" అని చింతించుచు శాంతి లేక యుండెను.

"అర్జునా! ఆదినములో 'ఋక్ష' మహారాజునకు పుత్రుడైన 'సంవరణ' నామము గలరాజు కురుకులశ్రేష్ఠుడు, బలవంతుడునై యుండెను. సంవరణుడు సూర్యభగవానుని ఆరాధించు చుండెను.

"కుంతీనందనా! సంవరణుడు మనస్సును, ఇంద్రియములనున్ను నిగ్రహించుకొని పవిత్రుడుగా నుండి, అర్ఘ్య - పుష్ప - గంధ-నైవేద్యాది సామగ్రుల చేత, వివిధ నియమములచేత వ్రతములచేత, తపస్సుల చేతను ప్రతిదినము ఉదయము కాగనే, మిక్కిలి భక్తిభావముతో సూర్యుని పూజించు చుండెను. అతని హృదయమందు సేవాభావము ఉండెను. అతడు పరిశుద్ధుడై అహంకార శూన్యుడై యుండెను.

"అర్జునా! రూప-సౌందర్యములలో అతనికి సమానుడైన పురుషుడు ఈ పృథివియందు మరియొకడు లేకుండెను. అతడు కృతజ్ఞుడు, ధర్మజ్ఞుడు నగుట చేత సూర్యభగవానుడు, 'సంవరణుడే తనపుత్రికి తగినపతి' అని తలచి, తన కన్యకను ఆ రాజున కీయ గోరెను.

"అర్జునా! ఆకాశమునందు సూర్యుడు తనతేజస్సుచేత ప్రకాశించు చున్నట్లే, భూమండలమందు సంవరణరాజు తన దివ్యకాంతిచేత, ప్రకాశించు చుండెను. బ్రహ్మవాదులైన బ్రహ్మర్షులు, ఉదయించు సూర్యుని ఆరాధించునట్లే, దేశమునందలి క్షత్రియవైశ్యాది ప్రజలు సంవరణ మహారాజును ఉపాసించు చుండిరి. అతడు తనకమనీయకాంతిచేత చంద్రుని, తేజస్సుచేత సూర్యుని గూడ తిరస్కృతులను జేయు చుండెను. ఆ రాజు శత్రు - మిత్రుల మంతలిలోగూడ తన దివ్య శోభచేత ప్రకాశించు చుండెను.

"కురునందనా! ఇటువంటి యుత్తమగుణ భూషితుడు, ఉత్తమ సదాచార వ్యవహారయుక్తుడునైన సంవరణునకు తాను స్వయముగానే సూర్యుడు తపతిని ఇచ్చుటకు నిశ్చయించెను.

ఇట్లుండగా, ఒకనాడు సంవరణరాజు పర్వత సమీప వనమునందు క్రూర మృగములను వేటాడు చుండగా, అతని యశ్వము ఆ పర్వతముపైన ఆకలి - దప్పులచేత పీడితమై మరణించెను.

"పార్థా! గుఱ్ఱము మరణించుటచేత సంవరణుడు పాదచారిగానే ఆ పర్వత శిఖరముపై తిరుగుచు, ఒక సుందర కన్యకను చూచెను. ఆమెకు సమాన స్త్రీ ఎక్కడను లేదని తలచెను. అప్పుడు సంవరణుడు, ఆ కన్యకయు నొంటరిగానే

యుండిరి. ఆమె కడకు పోయి రాజు రెప్ప వాల్చక ఆమెను చూచుచు నిలిచి యుండెను.

"అర్జునా! తొలుత ఆ కన్యక రూపమును చూచి, సంవరణుడు ఆమె సాక్షాత్తు లక్ష్మీదేవియా యని అనుమానించెను. తరువాత, ఆ కన్యక సూర్య ప్రభయే, సూర్యమండలమునుండి ఆమె రూపములో ఆకాశమునుండి భూమండలముపై వచ్చి యుండునని తలచెను. ఆమె శరీర తేజస్సు అగ్నిజ్వాలవలె భాసిల్లుచుండెను. ఆమె యొక్క ప్రసన్నత్వ - కమనీయకాంతులచేత నామె స్వచ్ఛ చంద్రకళయై యుండ వచ్చునని యతనికి తోచుచుండెను. సుందరములైన కాటుక కన్నులు గల ఆ కన్యక నిలిచియున్న పర్వత శిఖరమందు నామె సువర్ణ ప్రతిమయా యనునట్లు శోభిల్లు చుండెను.

"అర్జునా! ఆమె యొక్క రూప - వేషములచేత భూషితము లైన వృక్ష-గుల్మ - (పొదరిల్లు) - లతాదిసహితమైన ఆ పర్వతము సువర్ణమయమా యనునట్లు తోచు చుండెను.

"అర్జునా! అట్లున్నయా కన్యకను చూచిన సంవరణునకు సమస్త లోకములందలి సుందరస్త్రీ లందరి యందున్న అనాదరబుద్ధి కలిగెను. నాకు నేడు నేత్రఫలము లభించెను'. అని ఆ రాజు తలచెను.

"అర్జునా! సంవరణరాజు జన్మము నుండి ఆనాటివరకు చూచిన రూపవతులలో ఎవరి రూపము గూడ ఈ దివ్యకన్యక రూపముతో సమానము కాకుండెను. అప్పు డాకన్యక తనయుత్తమ గుణపాశములచేత ఆ రాజు యొక్క మనస్సును, నేత్రములను బంధించెను. అతడు కదలక-మెదలక నిలిచి, ఏమియు తోచక యుండెను.

"అర్జునా! 'బ్రహ్మదేవుడు దేవాసురమనుష్య లోకముల సౌందర్య సముద్రమును మథించి, విశాలనేత్రముల గల యీ కన్యకను, ఈమె మనోహర రూపమునున్న ఆవిష్కరించి యుండునని సంవరణుడు తలచెను.

"అర్జునా! ఈవిధముగ అప్పుడు ఆమె రూపసంపత్తిచేత సంవరుణుడు, ఆమె సమానులు మరియొకరు లేరని తలచెను. అట్టి రూప - సౌందర్యసంపన్నురాలిని చూచిన వెంటనే ఆ రాజు కామబాణ పీడితుడై చింతాగ్నిచేత జ్వలించుచుండెను. అట్లున్నయారాజు సిగ్గువిడిచి లజ్జావతియైనయా కన్యకను ఇట్లడిగెను:-

"సుందరీ! నీ వెవతెవు? ఎవరి పుత్రికవు? ఎందులకు ఇక్కడ నిలిచి యున్నావు? ఈ నిర్జనవనమందు ఒంటరిగా ఎందుకు తిరుగుచున్నావు? నీ సుందర సర్వాంగములు నిర్దోషములై యున్నవి. వివిధభూషణభూషితవై యున్న నీయీ భూషణములచేత నీకు శోభ కలుగదు. నీ చేతనే ఈ భూషణములశోభ పెరుగుచున్నది. నీవే భూషణముగా నున్నావు.

"సుందరీ! నీవు దేవాసురయక్ష - రాక్షస - నాగ - గంధర్వులలో ఎవరికన్యకవుగూడ కా వని తోచుచున్నది. నీవు మానవస్త్రీవికూడ కావు. యౌవన మదముచేత శోభిల్లుచున్న నీవు అసమాన్య సౌందర్యవతివిగా నున్నావు. మూడు లోకములందున్ను నిన్ను మించిన సౌందర్యవతి లేదు.

"సుముఖీ! చంద్రునకంటె మించిన సౌందర్యము గలిగి కమలదళ విశాల నేత్రములు గల నీ ముఖమును నేను చూచినప్పటినుండి మన్మథుడు నన్ను మథించుచున్నాడు.

"అర్జునా! ఈ విధముగ సంవరణ మహారాజు ఆసుందరితో ననెను కాని, ఆమె యప్పుడు ఆనిర్జనవనమందు కామపీడితుడైన యారాజునకు ఏమియు బదులు చెప్పలేదు. అప్పుడు సంవరణుడు పిచ్చివానివలె ఉన్మత్తప్రలాపములు చేయుచు నుండగా, అతని యెదుటనే ఆ సుందరి మేఘములలో మెఱుపువలె అంతర్ధానము చెందెను.

"అర్జునా! అప్పుడు సంవరణుడు ఆ దివ్యకన్యను అన్వేషించుటకు వనమునందు అన్నివైపుల ఉన్మత్తునివలె పరిభ్రమించెను. అత డామెను ఎక్కడ గూడ చూడ జాలనప్పుడు మిక్కిలి దుఃఖించుచు, విలపించుచు మూర్ఛితుడై రెండు గడియలవరకు నిశ్చేష్టుడుగా పడి యుండెను.

**తపతీ - సంవరణుల సంభాషణము :**

"అర్జునా! సంవరణుడట్లు మూర్ఛిల్లినప్పుడు తపతి మందహాసముతో సంవరణుని యెదుటకు వచ్చి, నిలిచి యతనితో నిట్లనెను :-

"శత్రుదమనా! లెమ్ము. నీకు శుభ మగుగాక! నీ వీ భూతలమందు ప్రఖ్యాత సార్వభౌముడవు. నీ విట్లు మోహవశుడవు కాగూడదు.''

"అర్జునా! అట్లు తపతి మధురముగా నిట్లు మాట్లాడినప్పుడు సంవరణుడు కన్నులు తెరచి, విశాలనితంబములు గల యా సుందరిని చూడగనే యతని మనస్సులో మన్మథాగ్ని జ్వలింపగా నామెతో నిట్లనెను :-

"సుందరీ! నీవు వచ్చితివా! కామపీడితుడనైన నేను నీ సేవకుడను. నన్ను స్వీకరింపుము. లేకున్నచో నా ప్రాణములు పోవును. మన్మథుడు నన్ను తీక్ష్ణ బాణములచేత మాటి - మాటికిన్ని ఆగక బాధించుచున్నాడు. నాకు రక్షకుడెవడు గూడ లేని యీ సమయమందు మన్మథ సర్పము నన్ను కరచెను. నా యొద్దకు రమ్ము. నా ప్రాణములు నీ యధీనములు. నీ యంగములన్నియు ననింద్యములై సౌందర్య శోభితములుగా నున్నవి. అట్టి నీవు లేక నేను జీవింప జాలను గనుక, నన్ను దయజూడుము. నేను నీ భక్తుడను. నన్ను విడువకుము. నీవు ప్రేమతో నన్ను రక్షింపవలెను. నిన్ను చూడగనే నా మనస్సు నీయందు అనురక్తమైనది. కనుక అది అతి చంచలమయ్యెను. నిన్ను చూచిన తరువాత ఇతర స్త్రీని చూచుటకు నాకు ఇష్టముగాకున్నది. నాయెడల ప్రసన్నురాలవు కమ్ము.

"సుందరీ! నీ ప్రేమ సమాగమమనెడు జలముచేత, నా కామాగ్ని జ్వాలను చల్లార్చి, నాకు ఆహ్లాదము కలిగింపుము. నీ దర్శనము వలన జనించిన మన్మథుడు పుష్పాయుధుడైనప్పటికిన్నీ, మిక్కిలి దుర్ధర్షుడుగా నున్నాడు. (జయింప నసాధ్యుడు). అతని ధనుర్బాణములు మిక్కిలి ప్రచండములుగా నున్నవి. అతడు బాణముల చేత నన్ను గ్రుచ్చుచున్నాడు. నీవు నాకు ఆత్మదానము చేసి, నా కామమును శాంతింపజేయుము. గాంధర్వ విధిచేత నన్ను పొందుము. అన్ని వివాహములలో గాంధర్వము శ్రేష్ఠమని చెప్పబడినది."

ఆ మాటలు విని తపతి యతనితో నిట్లనెను:-

"రాజా! నాకు తండ్రి యున్నాడు. కనుక, ఈ శరీరముపైన నా కేలాటి యధికారము లేదు. నీకు నా పైన ప్రేమ యున్నయెడల నా తండ్రిని అడుగుము. రాజా! నీ ప్రాణములు నాయధీనములైనట్లే. నీవు గూడ దర్శనమాత్రముచేత నా ప్రాణములను హరించితివి. నా శరీరమునకు నేను అధికారిణిని కాను గనుక నీ యొద్దకు రాజాలను. స్త్రీ లెప్పుడుగూడ స్వతంత్రలు కారు. సమస్తలోకము లందు నీ కులము ప్రసిద్ధమైయున్నది. భక్తవత్సలుడైన నీవంటి రాజును పతిగా ఏ స్త్రీ కోరదు?

"రాజా! కనుక, నీవు సకాలములో నా తండ్రియగు సూర్యభగవానునకు నమస్కారము, పూజలున్ను చేసి, ఆయనను ప్రసన్నుని జేసికొని, నన్ను కోరుకొనుము. ఆయన నన్ను నీ సేవకై యిచ్చిన యెడల, నేటినుండియే నేను సర్వదా నీ యాజ్ఞావశనై యుండెదను. నేను, అఖిల భువన భాస్కరుడైన యీ సూర్యభగవానుని కూతురను. సావిత్రి నాకు చెల్లెలు. నాపేరు తపతి.

**వసిష్ఠుని సహాయముతో సంవరణుడు తపతిని పొందుట:-**

"అర్జునా! యిట్లు చెప్పి తపతి వెంటనే ఆకాశములో పోయెను. అప్పుడు సంవరణుడు మరల మూర్ఛితుడై అక్కడనే నేలపై పడియుండెను.

"అర్జునా! అప్పుడు సంవరణుని మంత్రి, సేనాపరివారముతో రాజును వెదకుచు వచ్చి, ఇంద్రధ్వజము వలె నేలపై పడియున్న రాజుచు చూచెను. తన శరీరములో అగ్ని రగిలినట్లు మంత్రి వ్యాకులుడయ్యెను. రాజు కడకుపోయి చూచి మిక్కిలి భయపడెను. ఆ మంత్రి వయస్సు-బుద్ధి-కీర్తి-నీతి-వీనిలో చాల వృద్ధుడు. పడిపోయిన పుత్రుని, తండ్రివలె, కామబాధచేత మూర్ఛిల్లిన తన రాజు సంవరణుని శీఘ్రముగా నెత్తుకొనెను. అప్పుడు రాజు జీవితుడై యుండుట చూచి యతని చింత దూరమయ్యెను. అప్పుడు లేచి కూర్చొనియున్న మహారాజుతో మధురముగా, 'మహారాజా! భయపడకుము. నీకు శుభమగుగాక!' అని యనెను.

"అర్జునా! యుద్ధమునందు శత్రువులను క్రింద పడగొట్టగలడు. మహారాజు, స్వయముగా క్రింద పడియుండుట చూచి, మంత్రి, యీ రాజు ఆకలి-

దప్పులచే పీడితుడై అలసిపడి యుండును' అని ఊహించెను. అప్పుడతని కిరీటము ఛిన్నాభిన్నము కాకుండెను. కనుక, రాజు యుద్ధమునందు గాయపడ లేదు అని తలచెను. అప్పుడు మంత్రి చల్లని కమల సుగంధిత జలముచేత రాజును తడిపెను. దానిచేత రాజునకు తెలివి వచ్చెను. తరువాత, సంవరణుడు మంత్రిని మాత్రము తనయొద్ద నుంచుకొని, సైన్యమును నగరమునకు త్రిప్పి పంపెను. తరువాత ఆ రాజు ఆ పర్వత శిఖరమునకే పోయి కూర్చొనెను. అక్కడ స్నానాదికములు ముగించుకొని సూర్యభగవానుని ఆరాధించుటకు చేతులు జోడించుకొని, పైకి ముఖము పెట్టి నిలిచియుండెను.

"అర్జునా! అప్పుడు సంవరణుడు, తన పురోహితుడైన వసిష్ఠమహామునిని స్మరించి, ఒక చోటనే రాత్రింబగళ్ళు నిలిచి తపస్సుచేయగా, పన్నెండు దినము లకు వసిష్ఠ మహర్షి యక్కడకు వచ్చి, 'ఆ రాజు చిత్తమును సూర్యపుత్రి తపతి హరించె'నని దివ్యజ్ఞానము చేత తెలిసికొనెను."

"అర్జునా! యీ విధముగా, ఇంద్రియ నిగ్రహముతో తపస్సు చేయుచున్న రాజుతో, మాట్లాడి, ఆ రాజు చూచుచుండగనే, సూర్య సమాన తేజస్సుగల వసిష్ఠుడు, సూర్యభగవానుని దర్శించుటకు పోయి, చేతులు జోడించుకొని, 'నేను వసిష్ఠుడను' అని చెప్పి తాను వచ్చిన సమాచార మంతయు సూర్యునకు తెలు పుచు నిట్లు స్తుతించెను" :-

"జన్మరహితుడు లోకత్రయమును పవిత్రము చేయువాడు, సర్వప్రాణుల అంతర్యామి, కిరణములకు అధిపతి, ధర్మస్వరూపుడు, సృష్టి ప్రళయములకు అధిష్ఠానభూతుడు, పరమదయాళువు, దేవతలలో సర్వశ్రేష్ఠుడు నైన సూర్య భగవానునకు నమస్కారము."

"జ్ఞానుల యంతరాత్మ, జగత్తును ప్రకాశింపజేయువాడు, ప్రపంచహితైషి, స్వయంభువు, సహస్రనేత్ర శోభితుడు, అమిత తేజశ్శాలి, సురశ్రేష్ఠుడు నైన సూర్యభగవానునకు నమస్కారము."

"జగదేకలోచనుడు, ప్రపంచ సృష్టి - స్థితి - ప్రళయకారకుడు, వేద త్రయ స్వరూపుడు, త్రిగుణాత్మక స్వరూపధారణము చేసి బ్రహ్మ - విష్ణు - మహేశ్వర నామములతో ప్రసిద్ధుడు నైన సూర్యభగవానునకు నమస్కారము."

"అర్జునా! యిట్లు వసిష్ఠ మహాముని స్తుతించగా, సూర్యభగవానుడు ప్రసన్నుడై ఆ మహామునితో నిట్లనెను :-"

"మహాభాగా! నీవు నన్ను కోరదలచిన వస్తువు ఎంత దుర్లభమైనను నీ కిచ్చెదను. నీవు చేసిన స్తోత్రమునకు[1] మిక్కిలి ప్రసన్నుడ నైతిని. నీకు వర మిచ్చెదను! కోరుకొనుము."

"అజాయ లోకత్రయ పావనాయ భూతాత్మనే గోపతయే వృషాయ,
సూర్యాయ సర్గప్రళయాలయాయ నమో మహాకారుణి కోత్తమాయ.
వివస్వతే జ్ఞానభృదంతరాత్మనే జగత్ప్రదీపాయ జగద్ధితైషిణే,
స్వయంభువే దీప్త సహస్ర చక్షుషే సురోత్తమాయమిత తేజసే నమః,
నమః సవిత్రే జగదేకచక్షుషే జగత్ప్రసూతి స్థితి నాశ హేతవే.
త్రయీమయాయ,త్రిగుణాత్మధారిణే, విరించి నారాయణ శంకరాత్మనే!!।"
నీవు చేసిన నా స్తుతి, భక్తులకు సర్వదాపఠనీయము, జపించదగినది."

"అర్జునా ! సూర్యుడిట్లనిన తరువాత, వసిష్ఠమహాముని, మరీచమాలియైన భాస్కరునకు ప్రణామము చేసి యిట్లనెను:-

"సూర్యభగవన్ ! నీ కూతురు, సావిత్రికి అక్కయునైన తపతిని సంవరణరాజు వరించెను. అతడు ధర్మార్థజ్ఞాన సంపన్నుడు. ఉదారబుద్ధి గలవాడు. కనుక, ఆ రాజు నీ పుత్రికి యోగ్యుడైనపతి యగును."

"అర్జునా ! వసిష్ఠుడిట్లు చెప్పిన తరువాత సూర్యుడు తన కన్యను సంవరణున కిచ్చుటకు నిశ్చయించుకొని, వసిష్ఠుని అభినందించి, యతనితో నిట్లనెను:-

"మహామునీ ! సంవరణుడు రాజులలో శ్రేష్ఠుడు. నీవు మహర్షులలో శ్రేష్ఠుడవు. తపతి స్త్రీలలో సర్వశ్రేష్ఠురాలు. కనుక,ఆమెను అతని కిచ్చుటకంటే శ్రేష్ఠమైన కార్యము మరియొకటి యేది యుండును ?"

1. ఆ సూర్య స్తోత్రము అందరు ప్రతిదినము సూర్యోదయమునందు పఠించు టకుగాను ఇక్కడ వ్రాయబడినది.

"అర్జునా ! యిట్లు చెప్పి సూర్యభగవానుడు సంతోషముతో సంవరణున కిచ్చుటకై, వసిష్ఠ మహామునికి తపతిని సమర్పించెను. వసిష్ఠుడు తపతిని తన వెంట తోడ్కొని, కామబాధతో నిరంతరము తపతినే తలచుచున్న సంవరణుడు ఉన్న చోటికి వచ్చెను. అట్లు తపతితో వచ్చుచున్న యామునిని చూచి సంవరణుడు మిక్కిలి సంతోషించుచు అధికముగా శోభిల్లెను. సూర్యలోకమునుండి భూలోకమునకు దిగి వచ్చుచున్న తపతి, క్రిందకు పడుచున్న మెరపువలె మెరయుచు, సమస్త దిక్కులను ప్రకాశింపజేయు చుండెను.

"అర్జునా ! సంవరణరాజు క్లేశములు సహించి, పన్నెండు రాత్రులు ఏకాగ్రచిత్తముతో ధ్యానము చేసి యుండెను. అప్పుడు వసిష్ఠ మహాముని తోడ్కొని వచ్చిన తపతిని, ఆ పర్వత శిఖరమునందే దేవగంధర్వసేవితుడగుచు శాస్త్రోక్త విధిచేత పాణిగ్రహణము చేసెను. తరువాత వసిష్ఠాజ్ఞచేత, సంవరణు డాపర్వతము నందే కొంతకాలము ఆమెతో విహరించెను. ఆ దినములలో నా రాజు, తన రాష్ట్రమును, నగరమునున్ను రక్షించుచు, జాగ్రత్తతో చూచుటకు మంత్రికి ఆజ్ఞ యిచ్చి పంపి యుండెను. వసిష్ఠ మహాముని గూడ రాజును వీడ్కొని, స్వస్థానమునకు పోయెను.

"అర్జునా ! తరువాత, సంవరణు డాపర్వతము పైన దేవతవలె విహరించుచు, అచటి వనోపవనములందు తపతితో పన్నెండేండ్లు రమించు చుండెను.

"అర్జునా ! ఆ పన్నెండేండ్ల కాలములో సంవరణుని రాజ్యమందు ఇంద్రుడు వర్షములు కురియ లేదు. అయనావృష్టివలన తరచుగా, స్థావర - జంగమ ప్రజలందరు నశింప జొచ్చిరి. ఇటువంటి భయంకర సమయ మందు, ఒక్కచుక్క మంచుగూడ కురియ కుండుట చేత, పైర్లు మొలవలేదు. అప్పుడు ప్రజలందరు వ్యాకులము చెంది, క్షుధాపీడితులై, ఇండ్లు విడిచి, దిక్కులు పట్టి తిరిగిరి."

"అర్జునా ! అప్పు డక్కడి జనులు, తమ కుటుంబ మర్యాదలు (కట్టుబాట్లు) విడిచి భార్యా పుత్రాదులను విడిచి, పరస్పరము, చంపికొనుచు, దోచుకొనుచు నుండిరి. ఆ నగర మందంతటను, ఆకలి బాధచేత, ఉపవాసములు

చేసి శవములవలె నున్న ప్రజలు నిండి యుండిరి. మనుష్య కంకాళము (అస్థి పంజరము)ల చేత నిండిన యానగరము ప్రేతపరివృత మైన యమపురమా యని తోచు చుండెను."

"అర్జునా! అప్పుడు ప్రజలదురవస్థ చూచి వసిష్ఠ మహాముని తన తపో బలము చేత ఆ రాజ్యమునందు వర్షము కురిపించెను. ఆ సమయమందే చాల కాలము ప్రవాసములో నున్న సంవరణుని అతని పత్నితో పాటు, వషిష్ఠుడు నగరమునకు తోడ్కొని వచ్చిన తరువాత, ఇంద్రుడు అక్కడ పూర్వము వలె వానలు కురిసెను. దానిచేత అక్కడ పైర్లు బాగుగా పండెను. అప్పటి నుండి, సంవరణ పాలితులైన ప్రజలు ప్రసన్నులై, నగర మంతయు ఆనందిత మయ్యెను. తరువాత సంవరణుడు తపతితో శచీదేవితో నింద్రునివలె కలిసి యుండి, పన్నెండు వర్షములు దీర్ఘయజ్ఞము చేసెను."

"అర్జునా! ఈ విధముగా సూర్యపుత్రి యైన తపతిని, మీ పూర్వ పురుషుడైన సంవరణుడు పెండ్లి యాడి ఆమె గర్భము నుండి 'కురు' నామకు డగు రాజును కనెను. తపతి పుత్రుడగు కురుని వంశము నందు జన్మించిన మీరు తాపత్యులు అనబడుదురు. కనుక, నిన్ను 'తాపత్యా!' అని పిలిచితిని."

"అర్జునా! కురురాజు మీ వంశమునకు మూల పురుషుడు గనుక, మీరు కౌరవులు-కురువంశీయులు నని అన బడుచున్నారు. ఇట్లే 'పూరువు' నుండి ఉత్పన్నులగుటచేత పౌరవులు అని, 'అజమీఢుని' కులమునందు జన్మించుటచేత 'ఆజమీఢులు' అని, భరతకులమునందు పుట్టినందువలన 'భారతులు' అనియు మీరు పిలువబడు చున్నారు.

"అర్జునా! మీ వంశమునకు జననియైన తపతి యొక్క పురాతన వృత్తాంత మంతయు చెప్పితిని. ఇక నిప్పుడు మీ రొకపురోహితుని ముందిడుకొని భూమండల రాజ్యమును పాలించుచు, సుఖ భోగములను అనుభవింపుడు.

**గంధర్వుడు వసిష్ఠమహిమ చెప్పి, ఒక బ్రాహ్మణుని పురోహితునిగా చేసికొను మని అర్జునునితో చెప్పుట :-**

"జనమేజయా! గంధర్వుడైన అంగారపర్ణుడు చెప్పిన 'తపతీ సంవరణో పాఖ్యానము' విని అర్జునుడు చంద్రునివలె శోభిల్లుచు, గంధర్వునితో మరల నిట్లనెను :-

"మిత్రమా! వసిష్ఠుని తపోబలమునుగూర్చి విని నామనస్సులో మిక్కిలి ఉత్కంఠ కలిగెను. నీవు ఆముని పేరు వసిష్ఠుడు అని చెప్పితివి. ఆయనకు ఆపేరు ఎట్లు వచ్చెను? తెలుపుము.

"ఆమాటకు అంగారపర్ణు డిట్లనెను :

"అర్జునా! వసిష్ఠుడు బ్రహ్మమానస పుత్రుడు. ఆయన పత్ని పేరు అరుంధతి. దేవతలకు గూడ జయింప నలవి కాని కామ క్రోధములనెడు రెండు అంతఃశత్రువులు వసిష్ఠుని తపస్సుచేత ఓడింప బడి ఆయనపాదములొత్తుచు అణగి యుండెను. *ఇంద్రియములను వశమునం దుంచుకొనుటచేత ఆయనకు 'వసిష్ఠుడు' అని పేరు వచ్చెను.

"అర్జునా! విశ్వామిత్రుని యపరాధముచేత వసిష్ఠునకు మనస్సులో క్రోధము ఉన్నప్పటికిన్ని ఆయన ఉదారబుద్ధి గలవా డగుటచేత, కుశిక వంశమును సమూలముగా నశింప జేయలేదు. వసిష్ఠుడు సంతాపముచెంది, తాను ప్రతిక్రియ జేయుటకు శక్తి గలవా డైనను, అసమర్థునివలె అన్నిటిని ఓర్చు కొని, విశ్వామిత్రుని వినాశము కొరకు ఏలాటిదారుణ కర్మముగూడ చేయలేదు

"అర్జునా! మరణించినతనపుత్రులను వసిష్ఠుడు యమలోకమునుండి తిరిగి తే గలుగు చుండెను. కాని, మహాసాగరము తీరము నుల్లంఘించనట్లు యమ రాజుయొక్క మర్యాదను (పరిమితి - ఎల్ల) దాటుటకు ప్రయత్నించ కుండెను. విజితేంద్రియుడు, మహాత్ముడునైన వసిష్ఠమునిని పురోహితునిగా పొంది ఇక్ష్వాకు వంశపురాజులు చాలా కాలము ఈ సమస్త భూమండలమునందు అధికారము వహించిరి.

"కురునందనా! ఆ వసిష్ఠుని పురోహితునిగా బడసిన ఆ రాజులు, సమస్త దేవతలు బృహస్పతి సహాయముతో యజ్ఞములు చేసినట్లు, అనేక యాగములు చేసిరి.

* 'వసు' శబ్దమునకు 'ధన-రత్నాదులు' అనియు నర్థము గలదు. ధనము ఇంద్రియములను ఆకర్షించును. కనుక, ఇంద్రియములు గూడ ఔప చారికముగా 'వసువులు' అనబడును. వానిని నిగ్రహించినవాడు గనుక, ఆమునికి 'వసిష్ఠ' నామము వచ్చెను.

కాబట్టి, ధర్మప్రధానమైన మనస్సు గలిగి, ధర్మశాస్త్ర పారంగతుడు, మనస్సునకు అనుకూలుడు, గుణవంతుడు నైన ఒక బ్రాహ్మణుని మీరుగూడ పురోహితునిగా చేసికొనుటకు నిశ్చయించుకొనుడు.

"పార్థా! భూమండలము జయింపగోరు కులీనుడైన క్షత్రియుడు తన రాజ్యాభివృద్ధికొరకు ఒక శ్రేష్ఠబ్రాహ్మణుని పురోహితునిగా సర్వప్రథమముగా నియోగించ వలెను. అట్టిపురోహితుని ముందిడుకొన వలెనుగనుక అతడు గుణవంతుడు, జితేంద్రియుడు, వేదాభ్యాసము చేసినవాడు, విద్వాంసుడు, ధర్మార్థకామ తత్త్వజ్ఞుడు నైన బ్రాహ్మణుడు మీకు పురోహితుడుగా నుండవలెను.

"ఆ మాటవిని అర్జునుడు గంధర్వునితో నిట్లనెను:-

**వసిష్ఠుని క్షమాబలము ముందు విశ్వామిత్రుని పరాభవము :**

"గంధర్వరాజా! వసిష్ఠ విశ్వామిత్రు లిరువురు తమ - తమ యాశ్రమములలో నివసించు చుండురుగదా! వారికి వైరము ఏ కారణముచేత కలిగెను?".

"ఆ మాటకు గంధర్వు డిట్లనెను".

"పార్థా! వసిష్ఠుని ఈ యుపాఖ్యానము సర్వలోక ప్రసిద్ధమైనది. అది అతి ప్రాచీనము. దానిని చెప్పెద వినుము".

"అర్జునా! కాన్యకుబ్జ దేశమందు 'గాధి' అను పేరు గల మహారాజు ఉండెను. అతడు కుశికునకు ఔరసపుత్రుడు. ఆ గాధి రాజునకు పుత్రుడు 'విశ్వామిత్రుడు'. అతడు మహా బలపరాక్రమ సంపన్నుడై, శత్రుమర్దనుడుగా నుండెను".

"అర్జునా! ఒకనాడు విశ్వామిత్ర మహారాజు మంత్రులతో పాటు వేట కొరకై దుర్గమారణ్యమునకు పోయెను. అతడు అక్కడ మరుభూమిలో సంచరించు వరాహాది క్రూర జంతువులను సంహరించుచు ఒక క్రూర మృగమును పట్టుకొనుటకు దాని వెన్నంటి తరిమెను. అందుచేత ఆ రాజు మిక్కిలి అలసి కష్టము సహించుచు పిపాసాపీడితుడై, వసిష్ఠ మహర్షి యాశ్రమమునకు పోయెను. ఆ మహా ముని విశ్వామిత్రునకు స్వాగతము చెప్పి, సత్కరించుచు ఆతిథ్యగ్రహణమునకు ఆహ్వానించెను.

"అర్జునా! అర్ఘ్య - పాద్య - ఆచమనీయ - స్వాగత భాషణ - వన్య హవిస్సులచేత వసిష్ఠుడు విశ్వామిత్రుని సత్కరించెను. వసిష్ఠ మహాముని యొద్ద కోరిన వస్తువు లన్నియు నిచ్చునట్టి యొక కామధేనువు ఉండెను. ఆ కామధేనువు 'గ్రామీణములైనట్టి' ఆటవికములైనట్టియు ఆహారములు, ఫల - మూలములు, పాలు, షడ్రసోపేత భోజనము, అమృత సమానములైన మధుర రసాయన పానీయములు, భక్ష్య - భోజ్య - చోష్య - లేహ్య - పేయాద్యాహార వస్తువులు, అమృత సమాన రుచిగల లేహ్యములు (పచ్చళ్ళు) ఇక్షురసాదులు, రత్న వస్త్రాదులు' మొదలైన సమస్త మనోవాంఛిత వస్తువులను కామధేనువు ఆ యతిథు లకు ఇచ్చెను.

"అర్జునా! అప్పుడు విశ్వామిత్రుడు ఆ యాతిథ్యముచేత సపరివారముగా సంతుష్టుడాయెను కామధేనువు యొక్క శిరస్సు - మెడ - తొడలు - తోక స్తనములు ఈ యారు అంగములు పెద్దవిగా, విశాలముగాను నుండెను.* ఆ ధేనువు యొక్క పార్శ్వ భాగములు, తొడలున్ను మిక్కిలి సుందరములుగా నుండెను. ఆ ధేనువు ఐదు పెద్దఅంగములతో శోభిల్లు చుండెను.** ఆ ధేనువు యొక్క కన్నులు కప్పలవంటి ఆకారముతో సుందరములుగా, నాలుగు స్తన ములు లావుగాను నుండి అది అతిప్రశంసనీయముగా నుండెను. సుందర పుచ్ఛము

* గోవుల యొక్క శిరస్సు మొదలైన ఆరు అంగములు పెద్దవిగా, విశా లముగాను ఉండుట శుభమని శాస్త్రమునందు ఇట్లు చెప్పబడెను:-
"శిరో గ్రీవా సక్థినీ చ సాస్నా పుచ్ఛమథ స్తనాః,
శుభాన్యేతాని ధేనూనామాయతాని ప్రచక్షతే."

** గోవుల లలాటము, రెండు కన్నులు, రెండు చెవులు ఈ ఐదు అంగములు పృథువులు బలిసి, విశాలమైనవిగా నుండిన యెడల అట్టి గోవులు మంచివని విద్వాంసులు శాస్త్రములో నిట్లు చెప్పిరి:-
"లలాటం శ్రవణౌ చైవ నయనద్వితయంతథా,
పృథూన్యేతాని శస్యంతే ధేనూనాం పంచసూరిభిః."
(నీలకంఠీయ వ్యాఖ్యానము నుండి)

మేకులవలె కొనలుదీరిన చెవులు, అందములైన కొమ్ములు, ఇవి కలిగి యుండుట చేత ఆ కామధేనువు మనోహరముగా నుండెను. ఆ కామధేనువు పేరు 'నందిని' దానిని చూచి విస్మితుడైన విశ్వామిత్రుడు దానిని అభినందించి, వసిష్ఠ మహర్షితో నిట్లనెను :-

"బ్రహ్మన్! నీకు నేను పదికోట్ల ఆవులు గాని, లేక నా సమస్త రాజ్యమును గాని, యిచ్చెదను. ఈ నందినీ ధేనువును నాకు ఇమ్ము. ఇది యిచ్చి నీవు రాజ్యసుఖము అనుభవింపుము."

ఆ మాటకు వసిష్ఠు డిట్లనెను :-

"మహారాజా! 'దేవతా-అతిథి-పితృపూజలు, యజ్ఞహవిష్యము' ఈ మొదలైన వానికొరకు ఈ పాడియావు ఇక్కడ మాకు ఉపయోగపడు చున్నది. నీవు రాజ్య మిచ్చినను దానికి బదులుగా ఇది నీకు ఈయబడ జాలదు."

"ఆ మాటకు విశ్వామిత్రు డిట్లనెను :-

"మహామునీ! నేను క్షత్రియ రాజును. నీవో తపస్సు, స్వాధ్యాయమున్ను చేసెడు బ్రాహ్మణుడవు బ్రాహ్మణులు శాంతులుగా, జితేంద్రియులుగాను నుండెదరు. వారికి బల-పరాక్రమము లెక్కడి నుండి రాగలవు? ఇట్లుండగా నీవు పదికోట్ల ఆవులను తీసికొనిగూడ నేను కోరిన వస్తువు నీయనను చున్నావే ఇది యేమి మాట ?

నేను నా క్షత్రియ ధర్మమును విడువను. ఈ గోవును బలాత్కారముగ తీసికొని పోయెదను. నేను క్షత్రియుడను. కాని, బ్రాహ్మణుడను కాను. నా ధర్మము ప్రకారము బాహుబలము ప్రకటించుటకు నాకు అధికారము కలదు. కనుక, నా బాహుబలము చేతనే, నీవు చూచుచుండగా- ఈ గోవును తీసికొని పోయెదను.

"ఆ మాటకు వసిష్ఠు డిట్లనెను :-

రాజా! నీవు సేనతో నున్నావు. రాజువు. నీ బాహుబలముపైన విశ్వాసము గల క్షత్రియుడవు. నీ యిష్టము వచ్చినట్లే త్వరగా చేయుము. విచారించకుము."

''ఇట్లు చెప్పి గంధర్వుడు అర్జునునితో మరల నిట్లనెను:-

''అర్జునా! వసిష్ఠ డిట్లు చెప్పిన తరువాత, విశ్వామిత్రుడు బలాత్కారము గనే, హంసవలె, చంద్రునివలెను తెల్లగానున్న నందినీ ధేనువును అపహరించెను. దానిని చేర్లకోలల (కొరడా) లతో దండములతోను కొట్టి-కొట్టి యిటు-నటు రాజ భటులు తోలుచుండిరి అప్పుడు ఆ నందిని 'హంబా' యని అరచుచు వసిష్ఠ మహర్షి యెదుటకు వచ్చి, అతనినే చూచుచు, దెబ్బలు తినుచుగూడ, శ్రమము ననుభవించుచు, మరియొక చోటికి పోవకుండెను; అప్పుడు వసిష్ఠుడు నందినీ ధేనువుతో నిట్లనెను:-

''మంగళకరులారా! నీవు మాటి-మాటికి ఆక్రందనము చేయుచున్నావు. నేను నీ యార్తనాదము వినుచున్నాను. కాని, ఏమి చేయుదును? విశ్వామిత్రుడు నిన్ను బలాత్కారముగా కొనిపోవు చున్నాడు. ఇందుకు నేనేమి చేయగలను? నేనొకక్షమాశీలుడనైన బ్రాహ్మణుడను."

''అర్జునా! అప్పుడు నందినీ ధేనువు విశ్వామిత్రుని భయముచేత, ఉద్వేగము చెంది వసిష్ఠుని శరణుజొచ్చి యిట్లనెను:-

''భగవన్! నిర్దయులైన విశ్వామిత్ర సైనికులు నన్ను చేర్లకోలలతో దండములతోను కొట్టు చున్నారు. నేను అనాథవలె ఆక్రందనము చేయుచున్నా నీవు నన్ను ఎందుకు ఉపేక్షించు చున్నావు?''

''అర్జునా! నందినీ ధేనువు ఇట్లు అవమానింపబడి దుఃఖాక్రందనము చేయు చున్నను, దృఢవ్రత నియమపాలకుడైన వసిష్ఠమహాముని ఏమాత్రము క్షోభిల్లక ధైర్యము వీడక నందినితో నిట్లనెను :-

''కల్యాణీ! క్షత్రియులకు తేజస్సే బలము. బ్రహ్మణులకు క్షమయే బలము. నేను క్షమకు వశుడనైనాను. కనుక, నీయిష్టము వచ్చినయెడల పొమ్ము"

''ఆ మాటకు నందిని వసిష్ఠునితో'భగవన్' ఇట్లు ఏల మాట్లాడు చున్నావు? నీవు నన్ను విడిచితివా? నీవు నన్ను విడువనియెడల ఎవడు గూడ బలాత్కరించి నన్ను కొనిపోవ జాలడు'' అని యనగా, వసిష్ఠుడు నందినితో, ''మంగళకరు

రాలా! నేను నిన్ను విడువ జాలను. నీవు ఉండజాలిన యెడల ఇక్కడనే ఉండుము. ఇదిగో! నీ దూడను గట్టిత్రాటితో కట్టి తీసికొని పోవు చున్నారు.' అని యిట్లు వసిష్ఠ దనినమాట గంధర్వుడుచెప్పి,అర్జునునితో మరల నిట్లనెను:-

"అర్జునా! వసిష్ఠుడు నీవిక్కడనే యుండుము" అని చెప్పగా, నందినీ ధేనువు తన శిరస్సు పైకెత్తెను. అది అప్పుడు చూచుటకు అతిభయంకరముగా నుండెను. దాని కన్నులు క్రోధముచేత ఎఱ్ఱబడి యుండెను. దాని 'హంభా' రవము బిగ్గరగా వినబడు చుండెను.ఆ ధేనువు విశ్వామిత్రుని సైన్యమును చెదర గొట్టి నలువైపుల పారద్రోలు చుండెను. చేర్లకోల యగ్రభాగముతో, దండముల తోను కొట్టి ఇటు - నటు తోలబడుటనిత, దానినేత్రములు పూర్వము కన్న నధికముగా క్రోధారుణము లయ్యెను.

"అర్జునా! అప్పుడాయావు మిక్కిలి క్రుద్ధమై యుండుట చేత దాని శరీ రము నుండి అపూర్వ తేజస్సు ప్రకటితమగుచుండెను. అది మధ్యందిన మార్తాం డునివలె భాసించుచు పుచ్ఛముచేత మాటి - మాటికి గొప్ప యగ్ని వర్షము కురి యుచు, పుచ్ఛము నుండి 'పహ్లవు'లను స్తనములనుండి 'ద్రవిడు'లను 'శకు'ల నున్ను పుట్టించి యోనినుండి 'యవను'లను, గోమయము నుండి అనేక 'శబరు' లను జన్మింప జేసెను.

"అర్జునా! ఎందరో శబరులు దాని మూత్రము నుండి పుట్టిరి. దాని పార్శ్వభాగములనుండి 'పౌండ్ర-కిరాత-యవన-సింహళ-ఖర్బర-ఖస'- జాతుల సైనికులు పుట్టిరి. ఇట్లే ఆ గోవు యొక్క నురుగునుండి 'చిబుక-పుళింద-చీన-హూణ-కేర'ళాది బహువిధ మ్లేచ్ఛులు జన్మించిరి.

"అర్జునా! ఆ గోవుచేత పుట్టింపబడిన వివిధ మ్లేచ్ఛ గణము మహా సేనలు అనేకవిధ కవచాదులను ధరించి యుండిరి. అందరున్ను అనేక శస్త్రాస్త్ర ములు ధరించి క్రోధభరితులై యుండిరి. వారు విశ్వామిత్రుని సేనను, అతడు చూచుచుండగనే, చెదరగొట్టి అతని యొక్కొక్క సైనికుని, మ్లేచ్ఛ సేనలో ఐదైదుగురు ఏడేడుగురున్ను చుట్టుముట్టిరి.

"అర్జునా ! అప్పుడు శస్త్రాస్త్రముల మహా వర్షముచేత గాయపడిన విశ్వామిత్రుని సేనా యోధులందరు అతని యెదుటనే, భయముచేత నలుదిక్కులకు పారిపోయిరి. క్రోధభరితులైనను వసిష్ఠ సైనికులు విశ్వామిత్రుని సేనలోని ఏ యోధునిగూడ చంపలేదు.

"అర్జునా! ఈ విధముగా నందినీధేనువు విశ్వామిత్రుని సమస్త సైన్యమును మూడు యోజనముల దూరము వరకు పారద్రోలెను. ఆ సేన భయవ్యాకులమై అరచుచు మొఱపెట్టుచునుండెను. కాని, దానిని రక్షించువాడు ఎవడు గూడ లేకుండెను.

"అర్జునా! తన సేన యొక్క పరిస్థితి చూచి విశ్వామిత్రుడు క్రుద్ధుడై వసిష్ఠ మహామునిని గురిపెట్టి భూమ్యాకాశములందు బాణవర్షములు కురిసెను. కాని, వసిష్ఠ మహాముని విశ్వామిత్రుడు ప్రయోగించిన భయంకరములైన 'నారాచ-క్షుర-భల్ల'ము లనెడు బాణములను కేవలము ఒక వెదురుకొయ్య చేతనే నివారించెను.

"అర్జునా! యుద్ధమునందు వసిష్ఠ మహామునియొక్క కార్య కౌశలము చూచి శత్రుహంతకుడైన విశ్వామిత్రుడు మరల కుపితుడై వసిష్ఠునిపై, ఆగ్నేయ-వారుణ - ఐంద్ర - యామ్య - వాయ వ్యాస్త్రములను ప్రయోగించగా, అవి యన్నియు ప్రళయకాల సూర్యుని ప్రచండ కిరణములవలె అగ్నిజ్వాలలతో నలువైపుల వసిష్ఠ మహర్షిపై పడెను. కాని, మహా తేజశ్శాలి యైన వసిష్ఠుడు మందహాసము చేయుచు, బ్రాహ్మ బలముచేత ప్రేరితమైన బ్రహ్మదండముచేత ఆ యస్త్రముల నన్నింటిని తిరుగ గొట్టెను. తరువాత, ఆ యస్త్రము లన్నియు, భస్మీపటలములై, నేలపై బడెను. ఈ విధముగా ఆ దివ్యాస్త్రములను నివారించి, వసిష్ఠ మహాముని విశ్వామిత్రునితో, నిట్లనెను :-"

"దురాత్మా! గాధినందనా! ఇక నీ విప్పుడు ఓడిపోయితివి. ఇంకను నీ యందు ఉత్తమ పరాక్రమము ఉండిన యెడల నాపై ప్రయోగించి చూపుము. నేను నీ యెదుట స్థిరముగా కాలూని నిలిచినాను,

"అర్జునా! విశ్వామిత్రుని సేన చెదరిపోవగా, వసిష్ఠుడు, అతనిని పై విధముగా తిరస్కరించిన తరువాత, విశ్వామిత్రుడు లజ్జితుడై ఏమియు బదులు చెప్పజాల కుండెను. బ్రహ్మ తేజస్సు యొక్క అత్యాశ్చర్యకరమైన చమత్కారము చూచి విశ్వామిత్రుడు తన క్షత్రియత్వము బ్రాహ్మతేజస్సు ముందు వ్యర్థమని ఖిన్నుడై నిర్వేదముతో—"

"ధిక్ బలం క్షత్రియబలం బ్రహ్మ తేజోబలం బలం" అని యనెను. అనగా "క్షత్రియ బలమునకు ధిక్కారము (నింద) యగుగాక! బ్రహ్మ తేజస్సు యొక్క బలమే బలము" అని యర్థము.

"అర్జునా! ఈ విధముగా విశ్వామిత్రుడు బలాబలముల గూర్చి విచారించి, తపస్సే అన్నిటికన్న శ్రేష్ఠమైన బలము అని నిశ్చయించుకొని సర్వసమృద్ధమైన తన రాజ్యమును, దేదీప్యమానమైన రాజ్యలక్ష్మిని విడిచి, సుఖభోగములను వెనుకకు త్రోసి, తపస్సునందు మనస్సు లగ్నము చేసెను. తపస్సుచేత సిద్ధిని పొంది ఉజ్జ్వల తేజస్సు గల విశ్వామిత్రుడు తన ప్రభావముచేత సమస్త లోకములను స్తంభింపజేసి, చివరకు బ్రాహ్మణత్వమును పొంది యింద్రునితో పాటు, సోమపానము చేయదొడగెను."

**'శక్తి' శాపముచేత 'కల్మాషపాదుడు' రాక్షసుడగుట - విశ్వామిత్రుని ప్రేరణచే రాక్షసుడు వసిష్ఠ పుత్రులను భక్షించుట - వసిష్ఠుని శోకము :-**

"అర్జునా! 'ఇక్ష్వాకు' వంశమునందు 'కల్మాషపాదు' డను రాజుండెను. భూమండలములో నత డొక యసాధారణ తేజశ్శాలిగా నుండెను. ఒకనా డతడు వనములో క్రూర జంతువులను చంపుటకు పోయెను. అక్కడ నతడనేక వరాహాదిజంతువులను చంపుచు నిటు - నటు సంచరించుచు ననేక ఖడ్గ మృగములను గూడ చంపెను. చాలకాలము మృగసంహారము చేయుచు నా రాజు మిక్కిలి అలసి పట్టణమునకు తిరిగి వచ్చుటకు బయలుదేరెను

"అర్జునా! విశ్వామిత్రు డతనిని తనయజమానునిగా జేసికొనదలచుచుండెను. ఆ రాజు యుద్ధమునం దెప్పుడుగూడ పరాజితుడు కాకుండెను. ఆనాడు కల్మాషపాదుడు మిక్కిలి క్షుత్పిపాసాబాధితుడై యుండెను అతడొక్క వ్యక్తి

మాత్రము నడవ గలగినంత యిరుకు త్రోవలో పోవుచుండెను. ఆ మార్గములో తన కెదురుగా వసిష్ఠపుత్రుడు 'శక్తి' వచ్చు చుండుట చూచెను. ఆ'శక్తి'ముని. వసిష్ఠుని నూర్గురు పుత్రులలో జ్యేష్ఠుడు.

'అర్జునా! ఆ శక్తిమునిని చూచి కల్మాషపాదఋ, 'నా త్రోవనుండి తొలగిపొమ్ము' అని యనగా, శక్తిమహాముని మధుర వాక్కుతో, 'మహారాజా!' మార్గము నాకే నీ వీయ వలెను. ఇదియే సనాతనధర్మము. ధర్మము లన్నింటి లోను, రాజు బ్రాహ్మణునకు మార్గ మిచ్చుటయే సముచితధర్మము' అనియనెను.

''అర్జునా! వారిద్దరు 'నీవు తొలగుము - నీవు తొలగుము' అని మార్గము కొరకు వాగ్యుద్ధము చేసికొను చుండిరి. శక్తిమహాముని ధర్మమార్గములో నుండెను గనుక, నతడు తొలగ లేదు. కల్మాషపాదుడుగూడ క్రోధాభిమానములతో, ఆ మునీశ్వరుని త్రోవలో నిటు - నటు తొలగక నిలిచెను. అప్పుడు కల్మాష పాదుడు మోహావేశముచేత రాక్షసునివలె నా మునిని చేర్లకోల (కొరడా) తో కొట్టెను.

''అర్జునా! ఆ దెబ్బలు తిని, శక్తిమహాముని క్రోధముతో, ''రాజాధమా! నీ వొకతపస్వియైన బ్రాహ్మణుని, రాక్షసునివలె కొట్టితివి. కనుక, నేటి నుండి నీవు నరభక్షకుడైన రాక్షసుడవై యిప్పటినుండి మనుష్య మాంసమునందు ఆసక్తి గలిగి భూమండలమునందు తిరుగు చుండెదవు గాక! నృపాధమా! పొమ్మిక్కడినుండి'' అని శాప మిచ్చెను.

"అర్జునా! ఆ దినములలోనే వసిష్ఠ-విశ్వామిత్రులకు యజమానుని కొరకు వైర ముండెను. శక్తిమహాముని, కల్మాషపాదరాజున్ను వాదించుకొను చుండగా, ఉగ్రతపశ్శాలియైన విశ్వామిత్రముని కల్మాషపాదుని కడకు పోయెను.

"అర్జునా! తరువాత, కల్మాషపాదుడు, తనకు శాపమిచ్చినవాడు వసిష్ఠ సమానుడైన వసిష్ఠ పుత్రుడు శక్తి యని గుర్తుపట్టెను విశ్వామిత్రుడు గూడ అదృశ్యుడుగా నుండి, తనకు ప్రియము చేసికొను నిచ్ఛతో, కల్మాషపాదుని, శక్తిని ఇరువురుని మోసగించెను.

"అర్జునా ! అట్లు శపింప బడిన కల్మాషపాదుడప్పుడు శక్తి మునిని స్తుతించుచు, నతని ప్రసన్నుని చేసికొనుటకు నతని శరణు జొచ్చుటకు పోవ దలచెను. అప్పు డారాజు మనోభావమును కనిపెట్టి విశ్వామిత్రుడు, ఒక రాక్షసు నకు 'రాజులోపల ప్రవేశింపు' మని యాజ్ఞ యిచ్చెను. అప్పుడు, శక్తి మహాముని శాపముచేత, విశ్వామిత్రుని యాజ్ఞ చేతను 'కింకర' నామము గల రాక్షసుడు కల్మాషపాదునిలో ప్రవేశించెను. అప్పుడు రాజు రాక్షసావిష్టుడయ్యె నని తెలిసి కొని విశ్వామిత్రుడచటి నుండి వెడలి పోయెను. అప్పుడు కల్మాషపాదుడు, తనలో ప్రవేశించిన రాక్షసుని చేత మిక్కిలి పీడితుడై, యే విషయము గూడ కొంచెమైనను తెలియకుండెను.

"అర్జునా ! ఒకనాడు ఒక బ్రాహ్మణుడు ఆకలిగొని రాక్షసావిష్టుడైన రాజు వనమునకు పోవుచుండగా, చూచి, అతనిని 'మాంసయుక్తమైన భోజనము పెట్టు' మని యడిగెను. అప్పుడు 'మిత్రసహుడు' (కల్మాషపాదుడు) ఆ బ్రాహ్మణునితో, 'బ్రహ్మన్! నీ విక్కడనే రెండు గడియలవరకు వేచి యుండుము. నేను వనము నుండి వచ్చి నీకు ఇష్టమైన భోజనము పెట్టెదను' అని చెప్పి వెడలి పోయెను. ఆ బ్రాహ్మణు డక్కడనే నిలిచి యుండెను.

"పార్థా ! తరువాత మిత్రసహరాజు స్వేచ్ఛగా వనములో తిరిగి వచ్చి తన యంతఃపురమునకు పోయెను. అక్కడ అర్ధరాత్రి సమయమందు, ఆ రాజు నకు తాను బ్రాహ్మణునకు భోజనము పెట్టుటకు చేసిన ప్రతిజ్ఞ జ్ఞప్తికి వచ్చెను అప్పుడు వెంటనే యతడు లేచి వంట వానిని పిలచి యతనితో; 'పొమ్ము, వనము నందుఒక బ్రాహ్మణుడు భోజనము కొరకు నాకై వేచి యున్నాడు. అతనికి నీవు మాంసయుక్త భోజనము పెట్టి తృప్తి కలిగింపుము' అని యాజ్ఞ యిచ్చెను.

"అర్జునా ! మిత్ర సహుడిట్లు చెప్పగనే వంటలవాడు మాంసమునకుగాను వెదకెను. కాని, యతని కెక్కడ గూడ ఆ రాత్రి మాంసము లభించ లేదు. ఆ విషయము రాజునకు తెలిపెను. అప్పుడు ఆ రాజులో రాక్షసుడు ఆవేశించి, యుండెను కాబట్టి, యతడు వంట వానితో 'ఆ బ్రాహ్మణునకు మనుష్య మాంస మును పెట్టుము' అని చెప్పెను అప్పుడు వంట వాడు 'అట్లే' యని యారాజుతో చెప్పి, వధ్య భూమిలో నున్న 'వధ్య ఘాతుకుల'(అపరాధులను ఉరితీయువారు).

యింటికి పోయి, వారినుండి, మనుష్య మాంసమును తెచ్చి, దానిని చక్కగా వండి, అన్నముతో పాటు, ఆకలిగొనిన యా తపస్వి యైన బ్రాహ్మణునకు పెట్టెను. అప్పుడా బ్రాహ్మణోత్తముడు తపో దృష్టితో ఆ యన్నము చూచి, 'ఇది తినుటకు యోగ్యము కాదు' అని తలచి, క్రుద్ధుడై యిట్లనెను":-

"నీచు డైనయారాజు నాకు తినుటకు అయోగ్యమైన యన్నము నిచ్చు చున్నాడు కనుక, ఆ మూర్ఖుడే యిట్టి యన్నము తినుటకు ఉవ్విళ్ళూరు చుండు గాక! శక్తి మహాముని చెప్పినట్లే, ఆరాజు మనుష్య మాంసమునందు ఆసక్తుడై, సమస్త ప్రాణులకు ఉద్వేగ (దుఃఖ) కరుడై, భూమండలమందు చరించు చుండు గాక!"

"అర్జునా! ఆ బ్రాహ్మణుడు రెండుసార్లు ఇట్లు చెప్పుట చేత రాజు యొక్క శాపము ప్రబలమయ్యెను. దానితో పాటే, అతనిలో రాక్షసత్వము సమావిష్టమైనందు చేత ఆ రాజు యొక్క వివేక శక్తి పూర్తిగా లోపించెను. ఆ రాజు యొక్క యింద్రియములను, మనస్సును రాక్షసుడు వశపరచుకొని యుండెను. కనుక, కొలది దినములకే ఆ రాజునకు శక్తి ముని కనపడగా, నతనితో 'నీవు నాకు అసహ్యమైన శాపమిచ్చితివి గాబట్టి, యిప్పుడు నేను నీతోనే మనుష్య భక్షణము నారంభించెదను."

"అని చెప్పి కల్మాషపాదుడు, తక్షణమే శక్తి మహామునిని చంపి, వ్యాఘ్రము తనరుచికి దగినట్లు పశువును నమలి తినునట్లే, శక్తి మునిని తినెను. శక్తి చంపబడుట చూచి విశ్వామిత్రుడు, వసిష్ఠ పుత్రులపైననే మాటిమాటికి ఆక్రమణము చేయు మని రాక్షసుని ప్రోత్సహించెను. తరువాత రాక్షస భావా పన్నుడైన యారాజు, సింహము క్రోధముతో అల్ప మృగములను చంపి తిను నట్లు, వసిష్ఠ పుత్రుల నందరనున్ను-చంపి తినెను.

"అర్జునా! వసిష్ఠుడు తన పుత్రులను విశ్వామిత్రుడు చంపించె నని వినినప్పటికిని సుమేరు పర్వతము భూమిని ఒర్పుతో ధరించినట్లు తనశోక వేగమును తనలోనే ధరించెను. అప్పుడు వసిష్ఠుడు, తనకోదంద్ర దుఃఖముచేత దుఃఖితుడై తాను, శరీరత్యాగము చేయదలచెనే కాని, విశ్వామిత్రుని మూలచ్ఛే ధము చేయ తలంపే యతనికి రాలేదు. అప్పుడు వసిష్ఠభగవానుడు పుత్రశోకము

చేత మేరుపర్వత శిఖరమునుండి, ఆ పర్వత శిలాతలమునందు తనను తాను పడ వేసికొనెను. కాని, యతనికి దూది పైన బడినట్లు తోచెను. ఏ బాధయు కలుగ లేదు.

"అర్జునా! యీ విధముగ పడినప్పటికిన్ని అతడు మరణించనప్పుడు. మహావనమునకు పోయి యక్కడ మండుచున్న దావానలములో దూరెను. అప్పుడా యగ్ని ప్రచండవేగముతో మండు చున్నప్పటికిన్ని, వసిష్ఠమహామునిని దహింప జాలక పోయెను. ఆ మునీంద్రుడు స్పృశించగనే ఆ దవాగ్ని శీతల మయ్యెను. అప్పు డామహాముని శోకావేశముచేత, ఎదుటనున్న సముద్రములో, కంఠము నందు పెద్ద రాయికట్టుకొని, దుమికెను. కాని, సముద్రపుటలల వేగిము ఆ మహా మునిని ఒడ్డునకు తెచ్చి పడ వేసెను.

"అర్జునా! అప్పుడు, కఠోరతపోవ్రతనియమపాలకు డైన వసిష్ఠమహా ముని,తాను ఏ విధముగగూడ మరణించనప్పుడు ఖేదముతో తనయాశ్రమమునకే తిరిగిపోయెను."

### కల్మాషపాదుని శాపవిముక్తి - అతనికి వసిష్ఠానుగ్రహము చేత పుత్రప్రాప్తిః-

"అర్జునా! తరువాత వసిష్ఠమహాముని పుత్రశూన్య మైన తనయాశ్రమ మును చూచి మిక్కిలి దుఃఖపీడితుడై మరల ఆశ్రమము విడిచి పోయెను.అది వర్షా కాలము. అప్పు డొకనది నూతన జలముతో పూర్తిగా నిండి తీరము నందలి వృక్షములను జలములో ప్రవహింప జేయు చుండుట చూచెను. అట్లు పూర్ణ ప్రవాహము గల నదిలో మునిగి మరణించుటకు వసిష్ఠుడు తలచి తనశరీరమును పాశములతో గట్టిగా బంధించి ఆ మహానదిలో పడవేసెను.

"అర్జునా! అప్పు డానది వసిష్ఠుని బంధనములను త్రెంచి, తీరము చేర్చి, ఆ మునిని విపాశుని బంధనరహితుని చేసి, విడిచెను. అప్పుడు పాశవిముక్తుడైన వసిష్ఠుడు జలమునుండి వెడలి వచ్చి ఆనదికి 'విపాశ' (వ్యాస) అని పేరుపెట్టెను. అప్పుడు వసిష్ఠుడు తన కొడంద్ర సంతోషము కొరకు శోకించినట్లుండి, ఒకచోట నిలువక పర్వత - నదీ సరోవరములందు తిరుగుచుండెను. ఆ మహర్షి

ఈ విధముగ తిరుగుచు మరల హిమాలయమునుండి ప్రవహించుచున్న భయంకర మహానదిని చూచెను. దానిలో మహా ప్రచండ గ్రాహములు (మొసళ్ళు) ఉండెను. ఆ ముని మరల దాని ప్రవాహమునందు పడగా, ఆ నది 'అగ్నిసమాన తేజస్సు గలవాడు ఆ మహాముని' యని తెలిసికొని నలువైపుల నూరు పాయలుగా చీలి ప్రవహించెను గనుక, 'శతద్రు' అను పేరు ప్రసిద్ధ మయ్యెను.

"అర్జునా! ఆ నదిలోగూడ తాను నేలపై నుండుట చూచి, వసిష్ఠుడు 'నేను చావజాలను' అని చెప్పి, మరల తన యాశ్రమమునకే వచ్చెను. ఇట్లు వసిష్ఠుడు వివిధ పర్వతములు, అనేక దేశములున్ను తిరిగి వచ్చుచున్నపుడు, 'అదృశ్యంతి' అను పేరుగల ఆయన కోడలు ఆయన వెనువెంటనే అనుసరించి వచ్చుచుండెను. ఆ మునికి వెనుకగా షడంగ సహితము స్పష్టార్థయుక్తమునైన వేద మంత్రముల యధ్యయన ధ్వని వినపడెను. అప్పుడా మహాముని 'నా వెనుక ఎవరు వచ్చుచున్నారు?' అని యనగా, ఆయన నిట్లనెను:-

"మహాత్మా! నేను తపశ్శాలియైన శక్తి మహర్షి యొక్క అనాథపత్ని 'అదృశ్యంతి' అనుదానను.'

ఆ మాటకు వసిష్ఠుడు ఆమెతో నిట్లనెను:-

"పుత్రీ! పూర్వము శక్తి నోటినుండి నేను వినుచుండిన సాంగ వేద ధ్వనివలెనే యిది యున్నది. ఇది యెవరు చదువుచున్నారు?" ఆ మాటకు అదృశ్యంతి వసిష్ఠునితో నిట్లనెను:-

"భగవన్! ఇతడు నీ గర్భమునుండి పుట్టిన నీ పుత్రుడగు శక్తియొక్క కుమారుడు. ఈ బాలకుడు నా గర్భమునందుండియే పన్నెండు సంవత్సరములు వేదాభ్యాసము చేసెను.

"అర్జునా! అప్పుడు వసిష్ఠ మహాముని కోడలితో పాటు తన యాశ్రమము వైపు తిరిగి వచ్చుచుండి, ఆ నిర్జన వనమందు కూర్చొనియున్న కల్మాష పాద రాజును చూచెను. భయంకర రాక్షసావిష్టుడైన కల్మాషపాదుడు వసిష్ఠుని చూడగనే క్రోధముతో అప్పుడే ఆ మునిని సంహరించి, తినదలచెను. అప్పుడు ఆ క్రూర రాక్షసుని చూచి అదృశ్యంతి భయపడి వసిష్ఠునితో నిట్లనెను.

"భగవన్! ఈ రాక్షసుడు పెద్ద కట్టెచేత బుచ్చుకొని, భయంకరదండ ధరుడైన యమరాజువలె ఇక్కడకే వచ్చుచున్నాడు. నీవు మహావేదవేత్తవు. కనుక, ఈ రాక్షసుని వేగము నివారింప గలవాడు ఈ భూతలమందు నీవు దప్ప మఱియొకడు లేడు. భగవన్! చూచుటకు భయంకరుడైన యీ పాపిష్ఠుని నుండి నన్ను రక్షింపుము. ఈ రాక్షసుడు మన యిరువురను తినుటకే యిక్కడకు వచ్చుచున్నాడు".

"ఆ మాట విని వసిష్ఠ డామెతో నిట్లనెను".

"పుత్రీ భయపడకుము. ఈ రాక్షసుని భయము మనకు లేదు. వాస్తవముగా నితడు రాక్షసుడు కాడు. ఇతడు భూమండలములో ప్రఖ్యాత పరాక్రమము గల కల్మాషపాదరాజు. ఇతడు ఈ వనమునందే భయంకర రూపము ధరించి తిరుగుచుండెను".

"అర్జునా! అట్లు వచ్చుచున్న రాక్షసుని చూచి భగవంతుడైన వసిష్ఠ మహాముని ఒక్క హుంకారముచేతనే అతనిని ఆపి, మంత్ర పూత జలమును అతనిపై జిలకరించి, తన తపోయోగ ప్రభావముచేత ఆ రాజునకు శాపవిముక్తి కలిగించెను. గ్రహణ పర్వకాలమందు సూర్యుడు రాహుగ్రస్తుడైనట్లే, కల్మాష పాదరాజు పన్నెండేండ్లవరకు వసిష్ఠ పుత్రుడైన శక్తి మహాముని తేజస్సుచేత శాప ప్రభావముచేతను మ్రింగబడి యుండెను.

"అర్జునా! ఆ మంత్ర పూతజల ప్రభావముచేత రాక్షసుడు రాజును విడిచెను. తరువాత సూర్య భగవానుడు సంధ్యాకాలమునందలి మేఘములను తన యరుణ కిరణములచేత రక్తములుగా చేసినట్లే ఆ రాజు తన సహజ తేజస్సుచేత ఆ వనమును అనురంజితము చేసెను.

"అర్జునా! చైతన్యము పొందిన వెంటనే కల్మాష పాదరాజు వసిష్ఠ మహామునికి ప్రణామము చేసి, చేతులు జోడించుకొని, ఆ మహామునితో, మునీంద్రా! నేను నీకు యజమానుడనైన 'సౌదాసు' నామకుడను. ఇప్పుడు నీ కోరిక తీర్చెదను. చెప్పుము. నీకు ఏమి సేవ చేయుదును?" అని యనెను. ఆ మాటకు వసిష్ఠుడు కల్మాషపాదునితో 'రాజా! నా కోరిక సమయానుసారముగా సిద్ధించెను.

ఇక నీవు పోయి, రాజ్యమేలుకొనుము. ఇకపైన ఎప్పుడు గూడ నీవు బ్రాహ్మణులను అవమానపరచకుము ' అని చెప్పగా, రాజు వసిష్ఠునితో నిట్లనెను :-"

"మహాత్మా! ఇక నేనెప్పుడు గూడ బ్రాహ్మణులకు అవమానము చేయను. నీ యాజ్ఞప్రకారము సర్వదా నేను బ్రాహ్మణులను పూజించు చుండెదను. నేను నీ యనుగ్రహముచేత ఒక పుత్రునిబడయ దలచినాను. అతని ద్వారా నా ఇక్ష్వాకు వంశ పితరుల ఋణము నుండి విముక్తుడ నయ్యెదను. ఇక్ష్వాకు వంశ వృద్ధికొరకు నీవు నాకు ఉత్తమ స్వభావము, సుందర రూపము, శ్రేష్ఠ గుణము లున్న గల యొక పుత్రుని ప్రసాదింపుము."

"అర్జునా! ఆ మాట విని సత్యప్రతిజ్ఞుడైన వసిష్ఠుడు, కల్మాషపాదునితో, 'నేను నీకు అటువంటి పుత్రునే యిచ్చెదను. అని చెప్పి ఆ రాజుతోపాటు వసిష్ఠుడు అతని రాజధానియైన అయోధ్యానగరమునకు పోయెను. తమ రాజు యొక్క ఆగమనము విని, అయోధ్యా నగరవాసు లందరు అతని స్వాగతము కొరకు ఇంద్రుని స్వాగతము కొరకు దేవతలవలె, బయలువెడలి వచ్చిరి."

"అర్జునా! అనేక సంవత్సరముల తరువాత, కల్మాషపాదరాజు, తన పురోహితుడైన వసిష్ఠ మహర్షితో అయోధ్యకు వచ్చినప్పుడు ప్రజలు, ప్రాతః కాలమునందు ఉదయించిన సూర్యునివలె, ఆ రాజును సంతోషముతో దర్శించిరి. శీతకిరణుడైన చంద్రుడు శరదృతువు నందు ఉదయించి, వెన్నెలచేత ఆకాశమును మెరయజేసినట్లు, లక్ష్మీవంతులలో శ్రేష్ఠుడైన కల్మాషపాదరాజు తన శోభచేత అయోధ్యాపురమును ప్రకాశింపజేసెను."

"అర్జునా! అప్పుడు అయోధ్యానగర వీధులు శుభ్రముగా ఊడ్చి నీరు చల్లబడెను. నగరమంతయు ధ్వజములు పతాకము కట్టబడి శోభిల్లు చుండెను. ఈ విధముగా ఆ పట్టణము ప్రేక్షకుల మనస్సును ఆహ్లాదపరచు చుండెను. ఇంద్రుని చేత అమరావతీ పట్టణము శోభిల్లునట్లే, సంతుష్టజన భరితమైన అయోధ్యా నగర మప్పుడు కల్మాషపాద మహారాజుచేత మిక్కిలి శోభిల్లు చుండెను."

"అర్జునా! కల్మాషపాద రాజర్షి మా నగరమునందు ప్రవేశించిన తరువాత రాజాజ్ఞచేత మహారాజ్ఞియైన మదయంతి వసిష్ఠ మహాముని కడకు వచ్చెను.

అప్పుడు వసిష్ఠ మహాముని, ఆ రాజుపత్నికి ఋతుకాలమందు - శాస్త్రముయొక్క అలౌకికవిధి ననుసరించి, రాజపత్నితో నియోగము1 చేసెను. తరువాత రాణి యొక్క కుక్షియందు గర్భము స్థాపింపబడగా, ఆ మహాముని రాజు చేత వందితుడై, రాజును వీడ్కొని తన యాశ్రమమునకు పోయెను.

"అర్జునా! చాలకాలము గడచినను, ఆ గర్భము బయలు వెడలనప్పుడు, ఆ రాణి మదయంతి అశ్మము (రాయి)తో తన గర్భాశయముపైన కొట్టుకొనెను. తరువాత, పన్నెండవ సంవత్సరమునందు ఒక బాలకుడు జన్మించెను. అతడే, రాజర్షియైన 'అశ్మక' నామకుడని ప్రసిద్ధి చెందెను. అతడు 'పౌదన్య' నామము గల నగరమును నిర్మించి వృద్ధిపరచెను."

**శక్తిపుత్రుడు పరాశరుని జన్మము - తండ్రి మృత్యువు విని కుపితుడైన పరాశరుని శాంతపరచుటకు వసిష్ఠుడతనికి 'ఔర్వోపాఖ్యానము చెప్పుట:.**

"అర్జునా! వసిష్ఠాశ్రమమునందుండిన యదృశ్యంతి, రెండవశక్తిమునియా యనునట్లున్న యొక పుత్రుని కనెను. వసిష్ఠ మహాముని తన పౌత్రునకు జాతకర్మాది సంస్కారములు చేసెను. ఆ బాలకుడు గర్భములో ప్రవేశించి 'పరాసు' (మరణించుటకు ఇచ్ఛ గల) వైన వసిష్ఠమునిని మరల జీవించి యుండుటకు ప్రోత్సహించెను గనుక, అతడు లోకమునందు 'పరాశర' నామముతో ప్రసిద్ధుడయ్యెను.

"అర్జునా! ఆ పరాశరుడు వసిష్ఠమహామునినే తన తండ్రిగా భావించి పుట్టుక నుండియే అతని యెడల పితృభావము కలిగియుండెను. ఒకనాడు బ్రహ్మర్షియైన పరాశరుడు తన తల్లి అదృశ్యంతి యెదుటనే వసిష్ఠుని తండ్రీ యని పిలిచెను. పుత్రుని నోటి నుండి ఆ మధురమైన వాక్కు వినిన అదృశ్యంతి నేత్రములు అశ్రుభరితములై ఆమె యిట్లనెను:-

1. 'పతియాజ్ఞచేత ఒక ఉత్తమ బ్రాహ్మణుని-ద్వారా పుత్రుని కనుటనియోగమన బడును.

"పుత్రా! ఈయన నీ తండ్రికిగూడ తండ్రి. కనుక, 'తండ్రీ! తండ్రీ!' యని ఈయనను పిలువకుము. నీ తండ్రిని వనమునందు రాక్షసుడు భక్షించెను. నీవు ఎవరిని తండ్రి యని భావించుచున్నావో ఆయన నీ తండ్రి కాడు. ఆయన నీ తండ్రికిగూడ పూజనీయుడైన తండ్రి."

"అర్జునా! తల్లి యిట్లు చెప్పగా. పరాశరుడు దుఃఖపీడితుడై, తత్క్షణమే సమస్త లోకములను నశింప జేయదలచెను పరాశరుని నిశ్చయము కనుగొని బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడు మహాతపస్వి, మహాత్ముడు, త్యాగబుద్ధిగలవాడు, మిత్రావరుణనందనుడు నైన వసిష్ఠుడు పరాశరుని ఆ కార్యము నుండి ఆపెను. అతనిని ఆపుటకు వసిష్ఠుడు చేసిన సఫల ప్రయత్నము చెప్పెద వినుము. వసిష్ఠుడు పరాశరునితో నిట్లనెను :-

"వత్సా భూమండలమందు'కృతవీర్యు'డనునొక ప్రసిద్ధుడైన రాజు ఉండెను. ఆ రాజు వేదజ్ఞులైన భృగువంశ బ్రాహ్మణులకు,యజమానుడుగా(యజ్ఞముచేయించువాడు) నుండెను. నాయనా ఆకృతవీర్యుడు సోమయాగము చేసి యజ్ఞాంతమునందు భృగువంశ బ్రాహ్మణులకు విపుల ధనధాన్యము లిచ్చి అగ్రపూజ చేసి, వారిని పూర్తిగా తృప్తిపరచెను కృతవీర్యుడు మరణించిన తరువాత అతని వంశీయులకు ద్రవ్యము యొక్క ఆవశ్యకత కలిగెను. భృగువంశీయ బ్రాహ్మణుల యొద్ద ధన మున్నదని కృతవీర్య పుత్రులందరు భార్గవులను యాచించుటకు పోయిరి.

"వత్సా! అప్పుడు కొందరు భార్గవులు క్షత్రియులకు భయపడి తమ ధనమును బ్రాహ్మణులకు ఇచ్చిరి. మరికొందరు, భార్గవులు ఆ రాజకుమారులకే యథేష్టముగా ధనమిచ్చిరి. మరికొందరు, భార్గవులు ఇతర కారణములచేత, గూడ క్షత్రియులకు ధనప్రదానము చేసిరి.

"నాయనా తరువాత, ఒక క్షత్రియుడు భూమిని త్రవ్వుచు ఒక భృగు వంశీయుని యింటిలో పూడ్చిపెట్టబడినధనము అకస్మాత్తుగ బడసెను. అప్పుడు క్షత్రియు లందరు ఒకటిగా చేరి ఆ ధనమును చూచి. భార్గవులయెడల మిక్కిలి క్రుద్ధులై. వారు శరణు జొచ్చినను, వారిని అవమానపరచి, వారి నందరిని తమ తీక్ష్ణబాణములచేత చంపిరి.

"నాయనా! పరాశరా! తరువాత ఆ క్షత్రియులు భృగువంశీయుల గర్భస్థ శిశువుల హత్యకూడ చేయుచు క్రోధాంధులై సమస్త భూమండలమునందు సంచరించిరి. ఈ విధముగ భృగువంశ నాశము జరుగుచుండగా, భృగు వంశీయుల భార్యలు అప్పుడు భయము చేత హిమాలయము నందలి దుర్గమ గుహలకు పోయి దాగి యుండిరి. వారిలో నొక స్త్రీ మహా తేజస్వియైన తన గర్భమును భయము చేత తన తొడ చీరి దానిలో ఉంచెను. ఆ స్త్రీ తన పతి వంశవృద్ధి కొరకు ఆ సాహసము చేసెను. ఆ సమాచారము తెలిసి ఒక బ్రాహ్మణి మిక్కిలి భయపడి ఆమె ఒక్కతియే పోయి క్షత్రియులకు ఆ సమాచారము తెలుపగా, వారు ఆమె ఊరుస్థ గర్భమును గూడ చంపుటకు ఉద్యుక్తులైరి.

"వత్సా! ఆ బ్రాహ్మణ స్త్రీ తేజస్సుచేత మిక్కిలి ప్రకాశించు చుండెను. ఆమె తొడలో నుండిన శిశువు తొడ చీల్చుకొని బయటకు రాగానే అతడు మధ్యందిన మార్తాండునివలె తేజరిల్లుచు, తన తేజస్సు చేత ఆ క్షత్రియుల నేత్ర కాంతిని హరించెను. అప్పుడు వారు అంధులై, ఆ గిరి దుర్గములందు దిక్కు త్రోవ తెలియక తిరుగుచు మోహితులై యుండిరి. తరువాత వారు తమ దృష్టిని మరల పొందుటకు పతివ్రతయైన ఆ బ్రాహ్మణ స్త్రీ శరణునే జొచ్చిరి.

"వత్సా! కన్నుల జ్యోతి నశించిన యా క్షత్రియులు అప్పుడు జ్వాలా శూన్యమైన యగ్నివలె అధిక దుఃఖముతో పీడితులై, అచేతనులై యుండిరి. కనుక, వారు ఆ పతివ్రతాశిరోమణితో నిట్లనిరి :

"దేవీ! నీకు మాపై దయ యుండినయెడల మాకు మరల నేత్రములు ప్రసాదింపుము. కొద్దికాలము విశ్రాంతి తీసికొని పాపిష్ఠులమైన మేమందరము ఇక్కడి నుండి పోయెదము. నీవు నీ పుత్రునితోపాటు మా యెడల ప్రసన్నురాలవై మరల మాకు నూతన దృష్టిని ప్రసాదించి మమ్మందరను రక్షింపుము.

ఇట్లు రాజపుత్రులు చెప్పగా, ఆ బ్రాహ్మణ స్త్రీ వారితో నిట్లనెను :-

**పితృదేతలు ఔర్వుని కోపము శాంతింప జేయుట :**

"నాయనలారా! నేను మీ దృష్టిని పోగొట్ట లేదు. మీపై నాకు క్రోధము లేదు. కాని, నా తొడనుండి పుట్టిన యీ భృగువంశబాలకుడు మీ యెడల నేడు

కోపముతో నున్నాడు. మహాత్ముడైన యీ శిశువు మీ చేత చంపబడిన తమ బంధువులను తలచికొని క్రోధముతో మీ కన్నులు హరించెను మీరు భృగు వంశీయుల గర్భస్థ శిశువులను గూడ చంపుచున్నప్పుడు నేను, నా యీ గర్భమును నూరు సంవత్సరములదాక నా తొడలో దాచి యుంచుకొంటిని, కనుక, ఈ బాలకుడు తన తండ్రి వధచేత కుపితుడై మిమ్ము చంపదలచెను. ఇతని దివ్య తేజస్సుచేత మీ నేత్ర జ్యోతి అపహరింపబడెను. కనుక, మీరు నా యీ పుత్రుడు ఔర్వునే (ఉరువు (తొడ) నుండి పుట్టినవాడు) యాచింపుడు. మీరు తల వంచి అతనికి నమస్కరించిన యెడల అతడు సంతుష్టుడై, మీరు పోగొట్టుకొనిన నేత్ర జ్యోతిని మరల నీయగలడు.

"పరాశరా ! ఆ బ్రాహ్మణ స్త్రీ యిట్లు చెప్పిన తరువాత క్షత్రియులందరు ఔర్వునితో నమస్కార పూర్వకముగ, మహాత్మా! మా యెడల ప్రసన్నుడవు కమ్ము !" అని వినయపూర్వకముగా అనినప్పుడు ఔర్వుడు ప్రసన్నుడై, తన తపః ప్రభావము చేత వారికి నేత్రజ్యోతి ప్రసాదించెను.

"నాయనా ! ఆ మహర్షి తన తల్లియొక్క ఊరువును (తొడను) భేదించి పుట్టెను. కాబట్టి, లోకమునందు అతడు 'ఔర్వ' నామము చేత ప్రసిద్ధుడయ్యెను. పోగొట్టుకున్న కన్నులను మరల సంపాదించుకొనిన ఆ క్షత్రియులు వెడలి పోయిరి.

"భృగు వంశీయుడైన ఔర్వుడు సమస్త లోకములను పరాభవించి, నశింప జేయదలచెను. అతడు క్షత్రియుల చేత చంపబడిన తన పూర్వులను సమ్మానించుటకు లేదా, వారి వధకు ప్రతిక్రియ చేయుటకు సమస్త వినాశార్థమై మహా తపము చేసి తన శక్తిని పెంచుకొనెను. తన పితరులను ఆనందింప జేయుటకు ఉగ్ర తపస్సుచేత దేవాసుర - మనుష్యాది లోకముల నన్నింటిని తపింపజేసెను. తరువాత, అతని పితరులు తమ కులమునకు ఆనందవర్ధనుడైన ఔర్వముని యొక్క సర్వలోక వినాశ నిశ్చయము తెలిసికొని పితృలోకము నుండి వచ్చి, అతనితో నిట్లనిరి :-

"నాయనా ! ఔర్వా ! నీ యుగ్రతపః ప్రభావము మేము చూచితిమి. ఇక నీ క్రోధము నివారింపుము. సమస్త లోకములను అనుగ్రహింపుము. క్షత్రియులు మమ్ము హింసించు నప్పుడు భృగువంశీయ బ్రాహ్మణులమైన మేము అసమర్థులమై మావధను మౌనముతో సహించి యుండలేదని నీవు తెలిసికొనుము. మా యాయుస్సు చాల పెద్దదై యుండి మేము మరణించ లేదు. అట్టి పరిస్థితిలో మేము చాలఖేదము చెంది, కావలెననియే, క్షత్రియులచేత మా వధ చేయించుకొన గోరితిమి.

"నాయనా! అప్పుడు ఒకభృగువంశీయుని యింటిలో ధనము, వారికి మా యెడల వైరము పెంచుటకే పూడ్చబడెను. దానిచేత క్షత్రియులకు మాపై కోపము కలుగ వలెనని తలచితిమి. అట్లు గాకున్న యెడల స్వర్గేచ్ఛ గల భార్గవులమైన మాకు ధనముతో పనియేమి? ఎందుకనగా, సాక్షాత్తు కుబేరుడు అధిక ధనరాశి తెచ్చి మాకుఇచ్చి యుండెను.

"నాయనా!ఔర్వా! మృత్యువు మమ్ము తనయొడిలో తీసికొన జాల నప్పుడు మే మందరము ఏకాభిప్రాయముతో సమ్మతించి, మా మరణోపాయమును అన్వేషించితిమి. ఆత్మహత్య చేసికొనిన వానికి పుణ్యలోకములు లభించవు. కాబట్టి. మేము బాగుగా విచారించి మా చేతులతో మా వధ చేసికొన లేదు.

"వత్సా! నీవు ఇప్పుడు చేయ దలపెట్టిన దంతయు మాకు ప్రియము కాదు. సమస్తలోకములను పరాభవించుట చాల పాపము కనుక, అట్లు చేయ తలపెట్టకుము. నాయనా! క్షత్రియులను చంపకుము, భూలోకాది సప్తలోకములనుగూడ నశింప జేయకుము. నీకు ఉత్పన్నమైన యీ క్రోధము నీ తపో జనిత తేజస్సును దూషితము చేయును. కనుక, నీ క్రోధమునే చంపుము."

ఇట్లు పితృదేవతలు చెప్పగా విని ఔర్వుడు వారితో నిట్లనెను :-

**ఔర్వ: - పితరుల సంభాషణము ఔర్వుడు క్రోధాగ్నిని బడబానల రూపముతో సముద్రము నందు విడచుట :-**

"పూజ్య పితరులారా! నేను క్రోధము చేత అప్పుడు సమస్తలోకములను నశింప జేసెదనని చేసిన ప్రతిజ్ఞ అసత్యము కా గూడదు. క్రోధ - ప్రతిజ్ఞలు

నిష్ఫలములు చేయువాడ నగుటకు నా కిష్టము లేదు. నా క్రోధము సఫలము కాని యెడల, అది అగ్ని, అరణి కొయ్యను (అగ్నిని మధించుకొయ్య) కాల్చి నట్లు నన్ను కాల్చును ఒక కారణముచేత కలిగిన క్రోధమును సహించు మనుష్యుడు ధర్మార్థ కామములను రక్షించుటకు సమర్థుడు కా జాలడు.

"పితృ దేవతలారా! అందరిని జయింపగోరు రాజులు, తగిన సమయములో ప్రయోగించు రోషము దుష్ట శిక్షణ - శిష్ట రక్షణములు చేయగల దగును నేను నా తల్లి తొడలో నున్నప్పుడు, క్షత్రియులు భార్గవులను వధించినప్పుడు తల్లుల దుఃఖా క్రందనము నాకు వినపడు చుండెను. ఈ క్షుద్రక్షత్రియులు గర్భస్థ శిశువుల శిరస్సులను నరికి, ప్రపంచము నందు భృగువంశ బ్రాహ్మణులను సంహరింప మొదలిడి నప్పుడు, నాకు క్రోధావేశము కలిగెను. పూర్ణగర్భవతులైన తల్లులు, పితృగణమున్ను భయము చేత పరుగెత్తి పోయి అన్ని లోకములలో తిరుగు చున్నారు, కాని, వారికి ఎక్కడ గూడ శరణము దొరక లేదు. అప్పుడు ఈ నా తల్లి నన్ను తన తొడలో దాచి యుంచెను."

"పితరులారా! ప్రపంచములో పాపకర్మమును నివారించు వాడు, ఉన్నంత వరకు పాపులు ఉండరు. వారిని ఆపువాడు లేనప్పుడు అనేకులు పాపము చేయు చుండెదరు. శక్తి గల మనుష్యుడై యుండి కూడ తెలిసి - తెలిసి పాపమును నివారించకపోయిన యెడల అతనికి గూడ ఆ పాపము అంటు కొనును."

"పితరులారా! లోకములో అందరికిన్ని వారి జీవితము ప్రియ మని తెలిసికొని అందరిని 'ఏలు రాజులు సమర్థులై యుండి కూడ, నా పితరులను రక్షించ జాలకపోయిరి. కనుక నేను గూడ అన్ని లోకములపై కోపము గల వాడనై యున్నాను. వీరిని దండించు శక్తి నాకు గలదు. కనుక, ఈ విషయములో నేను మీ మాట అంగీకరింప జాలను. నేను శక్తి గలవాడనై యుండి కూడ లోకులు చేయు పాపకర్మలను ఉదాసీనభావముతో నోరు మూసికొని చూచు చుండిన యెడల నాకు గూడ వారి పాపము సంక్రమించును. నా కోపము చేత పుట్టిన ఈ యగ్ని సమస్త లోకములను దహించ గోరు చున్నది. నేను దీని నొకవేళ నివారించిన యెడల ఈ యగ్ని నన్నే దహించి భస్మము

చేయును. మీరు సమస్త ప్రపంచహితమును కోరుచున్నారని నాకు తెలియును. కనుక, ఈ విషయములో లోకములకు నాకున్ను శ్రేయస్సు కలుగు నుపాయము చెప్పుడు"

ఆ మాట విని పితృదేవతలు ఔర్వునితో నిట్లనిరి:-

"ఔర్వా సమస్త లోకములను నశింపజేయు నీ క్రోధాగ్నిని జలమునందు విడువుము. ఎందుకనగా అన్ని లోకములు జలములోనే ప్రతిష్ఠితములై యున్నవి. అన్ని రసములు, ఈ ప్రపంచము అంతయు జలముయొక్క పరిణామములే యగును. కనుక, నీ క్రోధాగ్నిని జలమునందే విడువుము. నీవు కోరిన యెడల ఈ క్రోధాగ్ని జలమును దహించుచు సముద్రమునందే యుండుగాక! ఎందుకనగా, సమస్త లోకములు జల పరిణామములే కదా! నాయనా! యిట్లు చేయుటచేత నీ ప్రతిజ్ఞ నెరవేర్చుటయే కాక, దేవతాసహిత సమస్త లోకములు గూడ నశించవు"

"అర్జునా! ఈ విధముగ ఔర్వోపాఖ్యానము వసిష్ఠ మహాముని పరాశరునికి చెప్పి మరల అతనితో నిట్లనెను:-

"నాయనా! పరాశరా! ఔర్వుడు పితరులమాట విని తన క్రోధాగ్నిని సముద్రములో వేసెను. ఆ యగ్ని ఒక పెద్ద బడబా (అశ్వస్త్రీ) ముఖమువంటి యాకృతి గలదై మహాసాగర జలమును త్రాగు చుండును. వేద విదులు ఆ విషయము బాగుగా ఎరుగుదురు. ఆ బడబ తన ముఖముచేత ఔర్వాగ్నిని క్రక్కుచు మహా సాగర జలమును త్రాగు చుండును.

"నాయనా! పరాశరా! నీకు శుభమగుగాక! నీవు పరలోకములను బాగుగా ఎరుగుదువు. కాబట్టి లోకములను నశింపజేయ గూడదు."

ఇట్లు గంధర్వ రాజైన అంగారపర్ణుడు చెప్పి తరువాతి కథ యీ విధముగా నర్జునునకు చెప్ప దొడగెను:-

**పులస్త్యాది మహర్షుల యుపదేశముచేత పరాశరుని రాక్షసయాగ సమాప్తి:-**

"అర్జునా! వసిష్ఠు డిట్లు చెప్పిన తరువాత పరాశరుడు తన కోపము సర్వలోకములను పరాభవము చేయకుండ ఆపి, రాక్షస సత్రము (యాగము)

చేయుటకు ఆరంభించెను. ఆ యజ్ఞమందు తన తండ్రి శక్తి మహాముని యొక్క వధను గూర్చి పలుసార్లు చింతించుచు పరాశరుడు రాక్షస జాతికి చెందిన ఆ బాల వృద్ధులందరను దహించుటకు ఆరంభించెను.

"పార్థా! అప్పుడు వసిష్ఠుడు 'పరాశరుని రెండవ ప్రతిజ్ఞను నేను భగ్నము చేయ గూడదు' అని చింతించి, అతనిని రాక్షసవధ నుండి నివారించ లేదు. పాపిష్ఠులైన రాక్షసుల సంహారము చేయుటచేత ఆ యజ్ఞము అతినిర్మలము, పరిశుద్ధము నైనదని తలచబడు చుండెను. యజ్ఞవేదియందు త్రేతాగ్ను లైన 'దక్షిణాగ్ని - గార్హపత్య - ఆహవనీయ'ములతోపాటు పరాశరుడు నాల్గవ యగ్ని వలె తేజరిల్లుచుండెను. పరాశరుడు ఆ యగ్నియందు యజ్ఞహవిస్సులను వేల్చుటకు ఆరంభించగనే, ఆయగ్ని తేజస్సుచేత, సమస్తాకాశము, వర్షఋతువు గడచిన తరువాత సూర్యప్రభ వహించినట్లే మిక్కిలి బాసిల్లెను. అప్పుడు వసిష్ఠాది మును లందరకు తేజోభాసితు డైన పరాశరుడు రెండవసూర్యుడా అనునట్లు తోచు చుండెను.

"అర్జునా! తరువాత ఆ భయంకర మైనయజ్ఞమును ఆపుటకు ఇతరు లెవరికిని సాధ్యము కాదని తలచి అత్రిమహాముని స్వయముగా దానిని ఆపుటకు పరాశరుని కడకు వచ్చెను. అట్లేపులస్త్య - పులహ - క్రతు - మహాక్రతు మునీశ్వరులుగూడ రాక్షస రక్షణార్థమై అక్కడకు వచ్చిరి.

"అర్జునా! రాక్షసవినాశము అగు చుండుట చూచి పులస్త్యమహాముని పరాశరునితో నిట్లనెను:-

"వత్సా నీ యజ్ఞమునకు ఏలాటి విఘ్నము కలుగ లేదుకదా! నీ తండ్రి హత్య విషయమై ఏమిగూడ తెలియని యీ నిర్దోషరాక్షసు లందరను వధించు చున్న నీకు ఏమి సంతోషము కలుగుచున్నది? నా సంతతిని నీవు ఈ విధముగ నశింప జేయ గూడదు. ఇట్టిహింస తపస్యులైన బ్రాహ్మణులకు ఎప్పుడు గూడ ధర్మము కాదు. శాంతముగా నుండుటయే బ్రాహ్మణులకు ఉత్తమ ధర్మము. కనుక, దానినే ఆచరింపుము. నీవు శ్రేష్ఠ బ్రాహ్మణుడవై కూడ ఇట్టి పాప కర్మ మెందుకు చేయు చున్నావు? నీ తండ్రి శక్తిమహాముని ధర్మజ్ఞుడై యుండెను.

నీవు ఇట్టి యధర్మకార్యముచేత నీ తండ్రి మర్యాదను (పరిమితిని) ఉల్లఘించ గూడదు. నా సంతానమును నష్టపరచుట యెప్పుడు గూడ నీకు ఉచితము కాదు.

"పరాశరా! శక్తిశాపము చేతనే అప్పుడు అటువంటిదుర్ఘటన సంభవించెను. అతడు తన యపరాధముచేతనే, స్వర్గవాసి యయ్యెను. ఇందులో రాక్షసులదోషము కొంచెము గూడ లేదు. ఏ రాక్షసుడు గూడ ఆ మహామునిని భక్షింపజాలకుండెను. తన శాపము చేతనే రాజును మనుష్య భక్షకుడైన రాక్షసునిగా చేయుటచేత, తాను మరణించెను."

"పరాశరా! విశ్వామిత్ర - కల్మాషపాదులు గూడ మీ తండ్రి వధలో కేవలము నిమిత్తమాత్రులుగా నుండిరి. నీ పూర్వుల మృత్యువునకు ప్రారబ్ధ కర్మమే ముఖ్య కారణము. ఇప్పుడు నీ తండ్రి శక్తిమహాముని స్వర్గమునకు పోయి ఆనంద మనుభవించు చున్నాడు. శక్తి తమ్ములందరు గూడ దేవతలతో సంతోషముగా సుఖ మనుభవించు చున్నారు. నీ పితామహుడు వసిష్ఠ మహామునికి ఈ విషయము లన్నియు తెలియును."

"కనుక, నాయనా! తేజశ్శాలురైన రాక్షసుల వినాశము కొరకు చేయబడు చున్న ఈ యజ్ఞము నందు నీవుగూడ నిమిత్తమాత్రుడవే. వాస్తవముగ ఇది యంతయు వారి పూర్వకర్మ ఫలమే కనుక, ఇప్పుడు ఈ యజ్ఞ కర్మను విడువుము. నీకు శుభమగుగాక! నీవు చేయు ఈ సత్రము పరిసమాప్తి పొందవలెను"

గంధర్వ రాజైన చైత్రరథుడు ఇట్లు చెప్పి తరువాతికథ అర్జునునకు ఇట్లు చెప్ప దొడగెను :-

"అర్జునా! పులస్త్యుడు, వసిష్ఠుడు నిట్లు చెప్పిన తరువాత పరాశరుడు తత్క్షణమే యజ్ఞసమాప్తి జేసెను. రాక్షస వినాశోద్దేశముతో చేయబడు యజ్ఞము కొరకు ఏర్పరచబడిన యగ్నిని పరాశరుడు ఉత్తర దిక్కునందు హిమాలయ సమీప వనములో విడిచెను. ఆ యగ్ని నేడు గూడ అక్కడ ప్రతియొక్క పర్వ కాలమందు రాక్షసులను, వృక్షములను, పాషాణములను కాల్చుచు కనపడు చుండును."

"జనమేజయా! ఆ మాటవిని అర్జునుడు గంధర్వుని ఇట్లు ప్రశ్నించెను."

## కల్మాషపాదునకు ఆంగిరసి యైన బ్రాహ్మణిశాపము :-

"గంధర్వరాజా! ఏ కారణముచేత కల్మాషపాదుడు, తన సమక్షములో తన గురువైన వసిష్ఠునితో తన భార్యకు నియోగము చేయించెను? ధర్మజ్ఞుడైన వసిష్ఠుడు పరస్త్రీ గమనపాప మెట్లు చేసెను? మిత్రమా! వసిష్ఠ మహర్షి ఇటువంటి అధర్మ కార్యము చేయుటకు కారణమేమి? ఈ నా సంశయము తీర్పుము".

"ఆ మాటకు అంగారపర్ణు డిట్లనెను":-

"అర్జునా! ఆ విషయము చెప్పెద వినుము - శక్తి మహాముని కల్మాష పాదునకు శాప మిచ్చిన తరువాత పరవశుడైన ఆ రాజు తన భార్యతో నగరము విడిచి బయటకు పోయినప్పుడు అతనికి మిక్కిలి కోపము వచ్చెను. కల్మాషపాదుడు తన భార్యతో ఆ నిర్జన వనమందు నలువైపుల తిరుగుచుండెను. ఆ వనమందు వివిధ క్రూర జంతువులు నివసించు చుండెను. అక్కడ నానా లతాగుల్మములు' వివిధ వృక్షములు దట్టముగా నిండి యుండెను. అక్కడ భయంకర శబ్దము మారుమ్రోగు చుండెను. శాపగ్రస్తుడైన కల్మాషపాదుడు ఆ వనమునందే పరిభ్ర మించుచుండెను.

"ఒకనాడు కల్మాషపాదుడు ఆకలిచే బాధపడుచు భోజనము అన్వేషించు చుండెను. మిక్కిలి క్లేశపడిన తరువాత, ఆ వనమందు ఒక బ్రాహ్మణుడు, బ్రాహ్మణి మెథునము చేయుచు, కలిసియుండిరి. అప్పుడు వారి మైథునేచ్ఛ తీరుటకు పూర్వమే, రాక్షసావిష్టుడైన కల్మాషపాదుని చూచి, ఆ బ్రాహ్మణ దంపతులు మిక్కిలి భయపడి పారిపోయిరి.

"అట్లు పరుగెత్తుచున్న దంపతులలో బ్రాహ్మణుని కల్మాషపాదుడు పట్టు కొనెను. అప్పు డా బ్రాహ్మణి రాజుతో నిట్లనెను".

"రాజా! నీవు సూర్యవంశములో జన్మించితివి. ప్రపంచమునందంతటను ప్రఖ్యాతుడవు. నీవు ఎల్లప్పుడును ధర్మము నాచరించు వాడవు. గురుజన సేవలో నిమగ్నుడవై యుందువు. ఇప్పుడు నీవు శాపగ్రస్తుడవై యుండినప్పటికిన్ని నీవు పాపకర్మ చేయగూడదు.

"రాజా! నా కిప్పుడు ఋతుకాలము వచ్చినందుచేత నా పతి కడకు వచ్చినాను. అతనికి ఇప్పుడు నీ వలన సంభవించిన కష్టముచేత దుఃఖించు చున్నాను. నేను సంతానేచ్ఛతో నా పతి యొద్దకు వచ్చియుంటిని. ఆయనతో సమాగమము చేసి యింకను నా యిచ్ఛ పూర్ణముగా తీర్చుకొనలేదు. ఇట్టి పరిస్థితిలో నీవు నా యెడల ప్రసన్నుడవై, ఈ నా పతి దేవుని విడువుము.

"అర్జునా! యిట్లు ఆబ్రాహ్మణి దుఃఖించుచు, కల్మాషపాదుని యాచించు చున్నప్పటికిన్ని, వ్యాఘ్రము తన యిష్టము వచ్చిన మృగమును చంపి తినునట్లే, ఆ రాజు నిర్భయుడై ఆ బ్రాహ్మణుని భక్షించెను. అప్పుడు అత్యంత క్రోధ పీడితురాలైన ఆ బ్రాహ్మణి నేత్రముల నుండి నేలపై బడిన అశ్రు బిందువులన్నియు ప్రజ్వలితాగ్ని యయ్యెను. ఆ యగ్ని ఆ చోటిని కాల్చి భస్మము చేసెను.

"అర్జునా! తరువాత పతి వియోగముచేత బాధితురాలై యేడ్చుచున్న ఆ బ్రాహ్మణి క్రోధభరితురాలై కల్మాషపాదున కిట్లు శాప మిచ్చెను :-

"నీచరాజాధమా! నాకు పతిసమాగమేచ్ఛ తీరుటకు ముందే నీవు అతి క్రూరుడవై నేను చూచుచుండగనే, నా ప్రియ పతిని మ్రింగితివి. కనుక, దుర్మతీ! నీవుగూడ నా శాపముచేత పీడితుడవై, ఋతుకాలమందు, నీ భార్యతో సంగమము చేయగనే మరణించెదవు. నీవు ఏ వసిష్ఠ మహర్షి పుత్రులను సంహరించితివో, ఆ వసిష్ఠుని సమాగమము చేతనే, నీ భార్య పుత్రుని కనగలదు. రాజాధమా! ఆ పుత్రుడే నీ వంశము నడపువా డగును.

"అర్జునా! ఈ విధముగా రాజునకు శాపమిచ్చి, ఆంగిరసియైన (అంగిరసుని వంశములో పుట్టినది) ఆ బ్రాహ్మణి, కల్మాషపాదుని సమక్షమునందే ప్రజ్వలితాగ్నిలో ప్రవేశించి శరీరత్యాగము చేసెను.

"అర్జునా! వసిష్ఠమహాముని, తన తపో-జ్ఞాన-యోగముల ప్రభావముచేత ఈ విషయము లన్నియు నెరిగి యుండెను. చాలకాలము తరువాత, రాజర్షియైన కల్మాషపాదుడు శాపవిముక్తు డైనప్పుడు, ఋతుకాలమందు, తన భార్యయొద్దకు పోయెను. కాని అతని రాణి, మదయంతీదేవియే ఆ రాజును (శాపము జ్ఞప్తికి దెచ్చి) ఆపెను.

"అర్జునా! కల్మాషపాదుడు, కామమోహితుడై యుండెను గనుక, నతనికి శాపము స్మరణమునకు రాలేదు. రాణి మదయంతి మాట విని ఆ రాజు మిక్కిలి సంభ్రమము (బెదురు) చెందెను. అతడా శాపమును మాటి-మాటికి జ్ఞప్తికి తెచ్చుకొని సంతాపము చెందుచుండెను.

"అర్జునా! ఈ కారణము చేతనే, శాపదూషితుడైన కల్మాషపాదుడు వసిష్ఠ మహర్షికి తన పత్నితో నియోగము చేయించెను."

ఇట్లు గంధర్వుడు చెప్పగా విని అర్జును డతనితో నిట్లనెను :-

**పాండవులు ధౌమ్యుని తమ పురోహితుని చేసికొనుట :**

"గంధర్వరాజా! మాకు అనుకూలుడైన వేదవేత్త పురోహితు డెవడైన నుండినచో అతని పేరు తెలుపుము." ఆ మాటకు గంధర్వుడు, 'అర్జునా! యీ వనమునందే యున్న 'ఉత్కోచక' తీర్థమునందు 'దేవల' మహర్షికి తమ్ముడైన 'ధౌమ్య' ముని తపస్సు చేయుచున్నాడు. ఆ మహామునినే మీరు పురోహితునిగా వరింపుడు' అని అర్జునునితో చెప్పెను.

"జనమేజయా! అప్పుడు అర్జునుడు ప్రసన్నుడై, అంగారపర్ణునకు (చైత్రరథునకు), విధిపూర్వకముగా ఆగ్నేయాస్త్రమును ఇచ్చి యిట్లనెను:-

"గంధర్వరాజా ! నీవు మా కిచ్చిన గుఱ్ఱముల నిప్పుడు నీ యొద్దనే యుంచుకొనుము. అవసరము వచ్చినప్పుడు తీసికొనెదము" తరువాత, గంధర్వుడు, పాండవులున్ను సంతోషపూర్వకముగా పరస్పర సత్కారములు చేసికొనిరి.

"జనమేజయా ! తరువాత పాండవులు గంగాతీరమునకు పోవుచు ఉత్కోచతీర్థమునందున్న ధౌమ్యుని యాశ్రమమునకు పోయి, ధౌమ్యుని తమ పురోహితునిగా వరించిరి. అప్పుడు సమస్త వేద విద్వాంసులలో శ్రేష్ఠుడైన ధౌమ్యుడు పాండవులను వన్య ఫల పుష్పములతో సత్కరించి, వారికి పురోహితుడుగా నుండుటకు అంగీకరించెను. పాండవులప్పుడు తమకు ద్రౌపది లభించునని కూడ వారికి విశ్వాసము కలిగెను.

"జనమేజయా! గురువు, పురోహితుడునైన ధౌమ్యుడు, తమతో నుండుట చేత పాండవు లప్పుడు, తాము సనాథుల మైతి మని తలచిరి. వేదార్థతత్త్వజ్ఞుడైన ధౌమ్యుడు పాండవులను తన యజమానులుగా భావించెను. 'పాండవులు బుద్ధి - వీర్య - బలోత్సాహ సంపన్నులు, దేవసమానులు. వీరు సంఘటితులై స్వధర్మానుసారముగా తమ రాజ్యమును తప్పక పొంద గలరు' అను విశ్వాసము ధౌమ్యునకు కలిగెను. అప్పు డా మహాముని పాండవులకు స్వస్తివాచనము చేసిన తరువాత పాండవులు ద్రౌపదీస్వయంవరమునకు పోవుటకు నిశ్చయించ కొనిరి."

చైత్రరథపర్వము సమాప్తము

## స్వయంవర పర్వము

**పాండవులు పాంచాలదేశము పోవుచు త్రోవలో బ్రాహ్మణునితో మాట్లాడుట :**

"జనమేయా! తరువాత పాండవులు ద్రౌపదిని, పాంచాల దేశమును అక్కడ జరుగబోవు స్వయంవరోత్సవమునున్ను చూచుటకు బయలుదేరి పోయిరి మార్గములో ననేక బ్రాహ్మణు లొక్కటిగా కలిసి పోవుచు పాండవులను 'మీ రెవరు? ఎక్కడ నుండి వచ్చు చున్నారు?' అని యడుగ యుధిష్ఠిరుడు వారితో 'మేము సోదరులము. మా తల్లితో ఏకచక్రాపురము నుండి వచ్చు చున్నాము అని యనగా ఆ బ్రాహ్మణు లి ట్లనిరి :-

"బ్రాహ్మణోత్తములా ! నేడే పాంచాల దేశమునకు పొండు. అక్కడ ద్రుపదరాజ సభలో స్వయంవర మహోత్సవము జరుగును. మేమందరము అక్కడికే పోవు చున్నాము. యజ్ఞసేన (ద్రుపద) మహారాజునకు, యజ్ఞవేది నుండి పుట్టిన పుత్రిక యున్నది. ఆమె అతి సౌందర్యవతి. ద్రోణాచార్యశత్రువైన ధృష్టద్యుమ్నునకు ఆమె చెల్లెలు. ధృష్టద్యుమ్నుడు కవచ-ఖడ్గ-ధనుర్బాణములతో పుట్టెను అతడు మండుచున్న యగ్నినుండి పుట్టెను గాబట్టి, అగ్నివలె తేజస్విగా నున్నాడు. అతని చెల్లెలు, నిర్దోషావయవములు, సన్నని నడుము నీలకమలము వంటి గంధము ఒక కోసు దూరమునకు వ్యాపించుచున్న శరీరమున్ను గలదై సుందరముగా నున్నది.

"బ్రాహ్మణులారా! ఆ యాజ్ఞసేని (ద్రౌపది) యొక్క స్వయంవరము నిశ్చయింపబడినది. కనుక, మేము ఆ రాజకుమారిని, స్వయంవరోత్సవమునున్ను చూచుటకు పోవుచున్నాము. అక్కడకు అనేక దేశముల నుండి రాజకుమారులు వచ్చి యుందురు. వా రందరు అనేక దక్షిణ లిచ్చి యజ్ఞములు చేసినవారు. స్వాధ్యాయశీలురు, పవిత్రులు, నియమవ్రతపాలకులు, మహాత్ములు, యువకులు, సుందరులునై యుందురు. మహారథికులు, అస్త్రవిద్యానిపుణులునైన భూపాలకులు గూడ నచటకు వచ్చెదరు. ఆ రాజు లందరు తమ విజయము కొరకు బ్రాహ్మణులకు వివిధములైన కానుకలు, ధన-గో-భక్ష్య-భోజ్యాది సర్వ విధ వస్తువులున్ను దానముగా నిచ్చెదరు. వా రిచ్చు దానములన్ని గ్రహించి స్వయంవరోత్సవమును ఆనందముతో చూచి తిరిగి పోవుదము.

"బ్రాహ్మణులారా! అనేక దేశముల నుండి అక్కడకు నట - గాయక-వైతాళిక-నర్తక-సూత-మాగధులు, మల్లయుద్ధ విశారదులున్ను వచ్చెదరు. మీరు గూడ మాతోపాటు ఆనందముతో క్రీడించి, వేడుకలు చూచి అనేక దానములను తీసికొని రావచ్చును.

"విప్రోత్తములారా! మీ రైదుగురు దేవతలవలె అందముగా నున్నారు. మిమ్ము అక్కడ చూచి ద్రౌపది దైవయోగము చేత మీలోనే ఒకరిని వరించవచ్చును. మీ సోదరులలో నితడు (అర్జునుడు)మిక్కిలి సుందరముగానున్నాడు. ఆ జానుబాహుడు. ఇతడు చాల అధిక ధన రాశినిజయించుకొని తెచ్చి మీకు సంతోషము కలిగించగలడు.

అప్పుడు యుధిష్ఠిరుడు ఆ బ్రాహ్మణులతో మేము కూడ ద్రౌపదీ స్వయంవరమహోత్సవమునకు మీతో వచ్చెదము. అని చెప్పెను.

**పాండవులు ద్రుపదపురములో కుమ్మరి యింట నుండుట; స్వయంవర సభావర్ణనము; ధృష్టద్యుమ్నుని ప్రకటన :-**

"జనమేజయా! ఆ బ్రాహ్మణులిట్లు చెప్పిన తరువాత వారితోపాటే పాండవులు ద్రుపదరాజపాలితమైన దక్షిణ పాంచాల దేశమునకు పోయిరి. వారికి మార్గమధ్యమున వ్యాసభగవానుని దర్శన మాయెను. ఆ మహామునిని పూజించిన

తరువాత ఆయనతో కొంతసేపు మాట్లాడి వారు ఆయన యాజ్ఞ తీసికొని మరల ద్రుపదపురము వైపు నడచిరి. త్రోవలో వారు అనేక రమణీయ వనములను సరోవరములను చూచి, అక్కడ ఒసచేయుచు మెల్లమెల్లగా ముందుకు సాగిపోయి పాంచాల దేశము చేరిరి. అక్కడ ద్రుపద పురమును దాని నాలుగు కోట గోడలను చూచి సంతోషించిరి. పాండవు లప్పుడు [1]ఒక కుమ్మరివాని యింటిలో నుండుటకు ఏర్పాటు చేసికొనిరి. అచ్చట వారు బ్రాహ్మణ వృత్తిలో బిచ్చమెత్తు కొనుచు జీవితము గడపుచుండిరి. వారి నెవ్వరు కూడ గుర్తు పట్టజాల కుండిరి.

"జనమేజయా! అర్జునునకే ద్రౌపదినిచ్చి వివాహము చేయవలెనని ద్రుపద దుడు కోరుచుండెను. కాని, ఈ మనోభావము ఎవరికి గూడ ఆయన తెలుప కుండెను. అర్జునుని రప్పింపదలచి, ద్రుపదుడు ఎవరు గూడ ఎక్కుపెట్టజాలని ఒక ధనుస్సును నిర్మింప జేసెను. ఒక కృత్రిమమైన ఆకాశ యంత్రమునుగూడ ఆయన నిర్మింపజేసెను. (ఆ యంత్రము తీవ్రవేగముతో ఆకాశమునందు గిర గిర తిరుగుచుండును.) ఆ యంత్రపు రంధ్రము యొక్క పై భాగమందు ద్రుపదరాజు దానికి సమానముగ ఒక గురిని సిద్ధము చేయించి ఉంచెను. (తరువాత ఆ రాజు ఇట్లు ప్రకటన చేయించెను.)

"ఏ వీరుడు ఈ ధనుస్సుపైన అల్లె త్రాడు ఎక్కుపెట్టి ఇక్కడ ఉంచ బడిన బాణములను ఈ యంత్ర రంధ్రము లోపలినుండి దూర్చి లక్ష్యమును కొట్టగలడో, అతడే నా పుత్రిని పొందగలడు."

"జనమేజయా! ఈ విధముగ ద్రుపదరాజు స్వయంవరము ప్రకటించగా, అది వినిన రాజులందరు స్వయంవర మంటపము చేరిరి. అనేక మహర్షులు స్వయంవరము చూచుటకు వచ్చిరి. దుర్యోధనాది కౌరవులు, కర్ణుడు వివిధ దేశముల నుండి అనేక బ్రాహ్మణులున్ను వచ్చి అక్కడ చేరిరి.

"అప్పుడు ద్రుపదమహారాజు, రాజులకు స్వాగతము చెప్పి పూజించెను. రాజులు వారికొరకు ఏర్పరచబడిన మంచెలపై కూర్చొనిరి. నగరవాసులు గూడ

1. బ్రాహ్మణులు కుమ్మరి యింటిలో, చక్రముకడ వండుకొని తినుచు నుండుట శాస్త్ర సమ్మతము.

వచ్చి తమ స్థానములలో కూర్చొనిరి. వారి కోలాహలము, క్షోభిల్లిన సముద్రపు భయంకర గర్జనమువలె వినబడుచుండెను. ద్రుపదమహారాజు ఆ స్వయంవర మంటపమును శిశు మారము యొక్క మొసలి (నీటికోతి) ఆకారములో నిర్మించి యుండెను. శిశుమార శిరోభాగమందు రాజులు తమ - తమ మంచెలపై కూర్చొని యుండిరి. ఆ నగరము యొక్క యీ శూన్యపు మూలయందు సుందరము, సమతలము నైన భూమిపై స్వయంవర సభామండపము ఏర్పరచబడియుండెను. అది అన్నివైపుల సుందర భవనములచేత చుట్టబడి యుండెను గనుక, మిక్కిలి శోభిల్లు చుండెను."

"ఆ స్వయంవర మంటపమునకు నలువైపుల నాలుగు ప్రాకారపు గోడలు అగత్తయు నిర్మింపబడి యుండెను. దానికి అనేక ద్వారములు, తలుపులు ఏర్పరచబడి యుండెను. ఆ సభాభవనమంతట విచిత్రములైన మేలుకట్లు (చాంది నీలు) కట్టబడియుండెను. అక్కడ నూర్లకొలది వాద్యములు వాయింపబడు చుండెను. అమూల్యములైన అగరువత్తులు ధూపసుగంధము అంతట వ్యాపిం చెను. నేలపై చందన జలము చల్లబడి యుండెను. అన్నివైపుల పుష్పమాలికలు వ్రేలాడ గట్టబడి యుండెను. దానిచేత ఆ సభా మంటపము అత్యధిక శోభతో విరాజిల్లు చుండెను.

"జనమేజయా! ఆ మంటపము నలువైపుల కైలాసశిఖరమువలె ఎత్తైన శ్వేతభవనములు నిర్మింపబడి యుండెను. ఆ మేడలలో సువర్ణపు వలలు గల తెరలు కట్టబడి యుండెను. నేలపై గోడలపైనను మణులు పొదుగబడి యుండెను. దానిపై సులభముగా ఎక్కదగిన మెట్లు కట్టబడి యుండెను. పెద్ద - పెద్ద యాస నములు, మంచి పరుపులున్ను అక్కడ వేయబడి యుండెను. వివిధ పుష్ప మాలలు,ముక్తారత్నాదిహారములున్ను భవనశోభను వృద్ధిపరచు చుండెను. అగరు దూపములు అంతట వ్యాపించి యుండెను. అవి హంసలవలె చంద్రకిరణముల వలెను తెల్లగా కనపడు చుండెను. వాని సుగంధము ఒక యోజనము వరకు వ్యాపించి యుండెను.

"జనమేజయా! ఆ భవనమునందలి ద్వారములలో రాక - పోకలకు అడ్డంకు లేకుండెను. దాని గోడలకు అనేక ధాతువులతో రంగులు వేయబడి

యుండెను. కనుక, ఆ రాజభవనములు హిమాలయము యొక్క యనేక వర్ణముల శిఖరములవలె శోభిల్లు చుండెను. అటువంటి భవనములలో, విమానములలోను రాజులు పరస్పరము స్పర్థలతో ఒకరికంటె నొకరు మించిన శృంగారములు చేసికొని యుండిరి.

"అక్కడ విమానములందు బహుమూల్యములైన మంచెలపై మహాబల - పరాక్రమ సంపన్నులు, పరమసౌభాగ్యశాలురు, సుగంధవాసితులు మహా దయాళులు, బ్రాహ్మణభక్తులు, ప్రజా రక్షకులు, శుభ - పుణ్య కర్మల ప్రభావము చేత సర్వజగత్తుకు ప్రియులునైన యుత్తమనరపతులు, వచ్చి అక్కడ కూర్చొని యుండిరి. వారిని నగర ప్రజలు, దేశప్రజలున్ను చూచి, రాజకుమారియైన ద్రౌపది దర్శన లాభముగూడ పొందుటకు అన్నివైపుల కూర్చుని యుండిరి.

"జనమేజయా! పాండవులు గూడ ద్రుపద రాజు యొక్క వైభవమును, సమృద్ధినిన్ని చూచుచు ఆ బ్రాహ్మణ సమాజములో కూర్చొని యుండిరి.

"జనమేజయా! ఆ నగరములో ననేక దినములనుండి ప్రజలు గుంపులు- గుంపులుగా వచ్చుచుండిరి. రాజులు అనేకధన - రత్న - దానములు చేయు చుండిరి. నట - నర్తకులు తమ - తమ కళలు చూపించు చుండిరి.

"జనమేజయా! పదియారవ దినమందు అక్కడ సమాజ మంతయు చేరి యుండెను. ఆనాడే ద్రౌపది స్నానముచేసి సుందరవస్త్ర - భూషణములు, ధరించి చేతిలో బంగారపు జయహారము తీసికొని స్వయంవర మండపమునకు వచ్చెను. అప్పుడు పవిత్రులు, మంత్రజ్ఞులునైన సోమకవంశ క్షత్రియుల పురోహిత బ్రాహ్మణులు అగ్నివేదిపై నలువైపుల దర్భలు పరచి, వేదోక్త విధి ననుసరించి ప్రజ్వలితాగ్నిలో ఆజ్యాహుతులు వేసిరి. ఇట్లు అగ్ని దేవుని తృప్తి పరచి, బ్రాహ్మణులచేత స్వస్తివాచనము చేయించిన తరువాత అన్ని వైపుల మ్రోగుచున్న యన్ని విధములైన వాద్యములు నివారింపబడెను.

"జనమేజయా! అప్పుడు నిశ్శబ్దమైన తరువాత ధృష్టద్యుమ్నుడు ద్రౌపదిని వెంట నిడుకొని వచ్చి స్వయంవర మంటప మధ్యమున నిలిచి మేఘ దుందుభి గంభీర ధ్వనితో మధురముగా నిట్లనెను" :

"రాజులారా! మీరు, శ్రద్ధగా నా మాట వినుడు. ఇదిగో! ఇది ధనుస్సు. ఇవి యైదు బాణములు. ఇది లక్ష్యము. మీరు ఆకాశమునందు ఈ యైదు తీక్ష్ణ బాణములు విడిచి, ఆ యంత్రములోపలనున్న లక్ష్యమును భేదించి యంత్రరంధ్రము గుండా గొట్టవలెను. ఏ యుత్తమ కుల - సౌందర్య - బలసంపన్నుడైన వీరుడు ఈ మహాకార్యము చేయునో, అట్టి వీరునకే నేడు ఈనా సోదరి, కృష్ణాదేవి ధర్మపత్ని కాగలదు".

"జనమేజయా! యిట్లు చెప్పి ధృష్టద్యుమ్నుడు అక్కడ చేరి యున్న రాజుల నామ - గోత్ర - పరాక్రమాదులను గూర్చి తన సోదరి ద్రౌపదికి ఇట్లు వర్ణించి చెప్పెను".

**ధృష్టద్యుమ్నుడు ద్రౌపదికి రాజులను గూర్చి వర్ణించి చెప్పుట:-**

"సోదరీ! ఇటు చూడుము దుర్యోధన - దుర్విషహ - దుర్ముఖ - దుష్ప్రధర్షణ - వివింశతి - వికర్ణ - సహ - దుశ్శాసన - యుయుత్సు - వాయువేగ - భీమవేగరవ - ఉగ్రాయుధ - బలాకిన్ - కరకాయున్ - విరోచన - కుండక - చిత్రసేన - సువర్చన్ - కనకధ్వజ - నందక - బాహుశాలిన్ - తుహుండ - వికట - నామకులే కాక, యనేకులు ధృతరాష్ట్ర పుత్రులు నిన్ను వరించుటకు కర్ణునితో పాటు ఇక్కడకు వచ్చి యున్నారు."

"సోదరీ! వీరేకాక, యింకను అసంఖ్యాకులైన క్షత్రియ రాజులు వచ్చినారు. చూడుము - గాంధార రాజైన సుబలుని పుత్రులు శకుని - వృషక-బృహద్బలులు కూర్చొని యున్నారు. అశ్వత్థామ, భోజుడు ఈ యిరువురు మహా తేజశ్శాలులు, సమస్త శస్త్రధారులలో శ్రేష్ఠులు. వీరు అనేక వస్త్రాభరణములను అలంకరించుకొని నీ కొరకు ఇక్కడకు వచ్చి యున్నారు."

"సోదరీ! బృహంతరాజు, మణిమంతుడు, దండధార - సహదేవ - జయత్సేన - మేఘసంధి - నామకులు, శంఖుడు, ఉత్తరుడు నను తన యిరువురు కుమారులతో విరాటరాజు, వృద్ధక్షేముని పుత్రుడు సుశర్మ, సేనాబిందుడు, సుకేతుడు, అతని పుత్రులైన సువర్చస్, సునామన్ అనువారు, సుచిత్ర - సుకుమార - వృక-సత్యధృతి - సూర్యధ్వజ - రోచమాన- నీల - చిత్రాయుధ-

అంశుమన్ - చేకితాన - శ్రేణిమన్ నామకులు సముద్రసేనుని పుత్రుడు చంద్రసేనుడు, జలసంధుడు, విదండుడు, అతని పుత్రుడు దండుడు, పౌండ్రకవాసుదేవుడు, భగదత్తుడు, కళింగరాజు, తామ్రలిప్త రాజు, పత్తన (పాటన) రాజు, తన యిరువురు వీరపుత్రులైన రుక్మాంగద - రుక్మరథులతో పాటు వచ్చిరి. శారద్వతుడైన శల్యుడు, కురువంశీయుడైన సోమదత్తుడు అతని పుత్రులు భూరి - భూరిశ్రవస్ - శలనామకులు ముగ్గురు, కాంబోజ దేశీయుడైన సుదక్షిణుడు, పురువంశీయుడైన సుధన్వుడున్ను వచ్చినారు."

"సోదరీ! మహాబలశాలి సుషేణుడు, ఉశీనరదేశీయశిబి, చోరులను, బంది పోటులనున్ను సంహరించు కారూషాధిపతియు వచ్చియున్నారు చూడుము."

"సోదరీ! ఇటువైపు సంకర్షణ (బలరామ) వాసుదేవు (శ్రీకృష్ణుడు) లు, రుక్మిణీ పుత్రుడు ప్రద్యుమ్నుడు, సాంబుడు, చారుదేష్ణుడు, ప్రద్యుమ్నపుత్రుడు అనిరుద్ధుడు, శ్రీకృష్ణునకు అన్నయైన గదుడు, అక్రూరుడు, సాత్యకి, పరమ బుద్ధిశాలియైన ఉద్ధవుడు, హృదికపుత్రుడు కృతవర్మ, 'పృథు-విపృథు-విదూరథ-కంక-శంకు-గవేషణ - ఆశావహ - అనిరుద్ధ - శమీక - సారిమేజయ - వీర-వాతపతి-ఝిల్లీపిండారక-ఉశీనర నామకులైన వృష్ణివంశీయు లందరున్ను వచ్చి యున్నారు.

"సోదరీ! భగీరథవంశీయుడు బృహత్క్షత్రుడు, సింధురాజైన జయద్రథుడు, బృహద్రథ-బాహ్లీకులు, మహారథికుడు శ్రుతాయువు, ఉలూక-కైతవ-చిత్రాంగద-శుభాంగదులు, బుద్ధిమంతుడైన వత్సరాజు, కోసలరాజు, పరాక్రమి యగు శిశుపాలుడు, జరాసంధుడున్ను వచ్చియున్నారు. వీరే కాక యనేక దేశాధిపతులు, భూమండల విఖ్యాతులైన యనేక క్షత్రియవీరులున్ను ఇక్కడకు నీ కొరకు వచ్చియున్నారు."

"సోదరీ! పరాక్రమవంతులైన ఈ రాజులు నిన్ను చేపట్టు నుద్దేశము చేత ఈ యుత్తమలక్ష్యమును ఛేదించగలరు. ఈ గురిని కొట్టినవానినే నీవు నేడు వరించవలెను."

**రాజులు లక్ష్యవేదకు ప్రయత్నించి విఫలు లగుట :-**

"జనమేజయా! స్వయంవర మంటపమునందు వివిధ రత్నాభరణ భూషితులైన నవయువకరాజులు కూర్చొని యుండిరి. అందరకున్ను తమయస్త్ర విద్యపై రూప-సౌందర్య-పరాక్రమ-కులశీల-ధన యౌవనముల పైనను అభి మానము,. గర్వము నుండెను. అందరున్ను, మదగజములవలె ఉన్మత్తులై యుండిరి. ఒండొరులు స్పర్ధపడుచు, కామోన్మాదములో కృష్ణాదేవి నాదియే కానున్నది యని యనుచు, వారు తమ యాసనములనుండి లేచి నిలుచొనిరి. ఉమాదేవీ వివాహ సమయమందు చేరియున్న దేవతలవలె వారు శోభిల్లుచుండిరి. వారి ప్రత్యంగము, కామబాణపీడితమై, వారి మనస్సులు ద్రౌపదియందే లగ్నము లై పరస్పరము ఈర్ష్యతో నుండిరి.

"జనమేజయా! ఆ సమయమందే రుద్ర-ఆదిత్య-వసు-అశ్వినీ-కుమార సాధ్య-మరుద్గణ-యమరాజ-కుబేర-రాజులు తమ తమ విమానములలో నుండిరి. దైత్య-గరుడ-నాగ-దేవర్షి-గుహ్యక-చారణ-విశ్వావసు-నారద-పర్వతాది ప్రధాన గంధర్వులు అప్సరసలతోపాటు, ఋషులున్ను ఆకాశమునందు నిలిచి యుండిరి. ఇతర రాజులు గూడ ద్రౌపదిని పొందుటకు లక్ష్యవేధ చేయుటకున్ను యోచించు చుండిరి.

"జనమేజయా! శ్రీకృష్ణుని సమ్మతి ననుసరించి, నడుచుకొను బలరామాది యాదవులు, వృష్ణి - అంధకాది ప్రముఖ వ్యక్తులున్ను అక్కడ ఊరక తమ స్థానములలో కూర్చొని యుండిరి. యదువంశ నాయకుడైన శ్రీకృష్ణుడు లక్ష్మీ దేవి యెదుట విరాజిల్లుచున్న గజరాజుల వలె, నివురు గప్పిన నిప్పువలె మద గజము వంటి యాకృతి గల పాండవులను గురుతించెను. వారు శరీరమునకు భస్మము పూసికొని బ్రాహ్మణ సమాజములో కూర్చొని యుండిరి.

"జనమేజయా! అప్పుడు శ్రీకృష్ణుడు బలరామునితో మెల్లగా నిట్లను :-

"అన్నా! అటు చూడుము యుధిష్ఠిర - భీమార్జున-నకుల - సహదేవులు కూర్చొనియున్నారు." ఆమాట విని బలరాముడు వారిని చూచి ప్రసన్నుడయ్యెను.

ఇతర రాజవీరులు రాజకుమారులు, రాజపౌత్రులున్ను ద్రౌపదివైపు కను లప్ప గించి ఆమెనే చూచు చుండిరిగనుక, పాండవులవైపు వారిదృష్టి పోవ లేదు. వారు ఉత్సాహముతో పెదవులు కఱచు చుండిరి. రోషముచేత వారికన్నులు ఎఱ్ఱబడి యుండెను.

"జనమేజయా! అప్పుడు పంచపాండవులు ద్రౌపదిని చూచినవెంటనే కామబాణతాడితు లైరి.

"జనమేజయా! అప్పుడు అక్కడియాకాశ మంతయు దేవర్షులచేత, గంధర్వులచేతను నిండి యుండెను. అన్నివైపుల దివ్యసుగంధము వ్యాపించి, పుష్ప వర్షము కురియు చుండెను. వివిధ వాద్యముల మహానాదములచే అంతరిక్షము మార్మోగు చుండెను. ఆకాశమంతట విమానములు పిక్కటిల్లి యుండెను. వీణాది మధురధ్వనులు వినబడు చుండెను.

"జనమేజయా! ఆ రాజులు ద్రౌపదికొరకు తమ పరాక్రమము ప్రకటించు చుండిరి. కర్ణ - దుర్యోధన - సాళ్వ - శల్య - అశ్వత్థామన్ - క్రాథ - సునీథ - వక్ర - కళింగరాజ - వంగభూపతి - పాండ్యరాజ - పౌండ్రదేశాధిపతి - విదేహ రాజ - యవనదేశాధి పతులేకాక, అనేకులు ఇతరరాష్ట్రరాజులు, రాజపుత్ర - రాజ పౌత్రులున్ను అక్కడ చేరి యుండిరి. వారినేత్రములు వికసితకమల పత్రముల వలె శోభిల్లు చుండెను. వారి యంగములు కిరీటహార - కేయూర (భుజకీర్తులు) కంకణాది భూషణభూషితములై యుండెను. వా రందరు ఆజానుబాహువులు, పరాక్రమ - ధైర్యసంపన్నులు. బలగర్వితులు. అందరూగూడ క్రమముగా ఆధనుస్సుపై తమ తమ బలము చూపింప దొడగిరి.

"కాని, జనమేజయా! వారు ఆ దృఢధనుస్సుపై చేతితోనే కాదు మనస్సుతో గూడ అల్లెత్రాడు ఎక్కుపెట్ట దలచ జాలకుండిరి. వారు తమ బలము, అస్త్ర శిక్షణానుభవమున్ను ఆ ధనుస్సుపై ప్రయోగించినప్పుడు వారందరు ఆ ధనుస్సు త్రోపుడువడి దూరముగా నేలపై పడి తన్నుకొనిరి. అప్పుడు వారి యుత్సాహము నశించి, వారి హారకిరీటాదులు క్రిందపడగా దీర్ఘముగా నిట్టూర్చుచు శాంతులై కూర్చొనిరి. ఇక, వారు ద్రౌపది యందు ఆశ విడిచి, హా! హా! అనుచుండిరి."

"జనమేజయా! అప్పుడు ధనుర్ధర శ్రేష్ఠుడైన కర్ణుడు ఆ ధనుస్సు కడకు పోయి పైకెత్తి దానిపై అల్లెత్రాడు ఎక్కించి, ఐదు బాణములు సంధించెను.* సూర్యాగ్ని చంద్రుల కంటెను అధిక తేజస్సుగల కర్ణుడు ద్రౌపది యెడల ఆసక్తి గలిగి యుండుటచేత, లక్ష్యము భేదించుటకు ప్రతిజ్ఞ చేసి వచ్చినప్పుడు, 'ఇక నితడు ఈ లక్ష్యమును భేదించి క్రింద పడగొట్టగలడు' అని అతనిని చూచి పాండవులకు విశ్వాసము కలిగెను. అతనిని చూచి ద్రౌపది 'నేను సూతజాతి వానిని వరించను' అని యనగా, ఆ మాట విని కర్ణుడు కోపముతో నవ్వుచు సూర్యభగవానుని వైపు చూచి, ఆ ధనుస్సును క్రింద పడవైచెను."

"జనమేజయా! ఈ విధముగ రాజపుత్రు లందరు దూరము పోవగా, యముని వంటి బలముగల శిశుపాలుడు ధనుస్సును ఎత్తుటకు పోయెను. కాని, దానిని తాకగనే అతడు మోకాళ్ళపై కూలబడెను. జరాసంధుడు గూడ ధనుస్స మీపమునకుపోయి పర్వతమువలె అచంచలుడై నిలిచెను. కాని,దానిని ఎత్త బోయి, పీడితుడై మోకాళ్ళపై కూలబడెను. అప్పుడు జరాసంధుడు అవమానముతో తన రాజ్యమునకు పోయెను.

"జనమేజయా! తరువాత శల్యుడుగూడ ఆ ధనుస్సు త్రోపుడుచేత నేలపై ఒరగెను. అప్పుడు దుర్యోధనుడు వచ్చెను. అతడు దృఢమైన శస్త్రాస్త్రములు గల యభిమానవంతుడు. ద్రౌపదిని చూచి అతని హృదయము హర్షోత్ఫుల్లమై ధనుస్సును చేత బట్టుకొని చాపధరుడైన యింద్రునివలె అల్లెత్రాడు ఎక్కుపెట్టి చుండగా, అతని వ్రేళ్ళనడుమ గాయము కలిగి చిత్తుగా వెల్లకిల బడెను. లజ్జితుడై యతడు తన స్థానమునకు పోయెను.

* కర్ణుడు అల్లెత్రాడు ఎక్కుపెట్టి బాణములను సంధించిన విషయము దాక్షిణాత్య పాఠములో ఎక్కడను లేదు. భండార్కర్ ముఖ్య ప్రతిలో గూడ ఈ వర్ణనము లేదు. నీలకంఠీయ పాఠము నందు గూడ కర్ణుడు ధనుస్సుపై అల్లెత్రాడు ఎక్కించి బాణమును సంధింపజాల లేదు అ యున్నది. కనుక కర్ణుడు బాణము సంధించ లేదని స్పష్టమగుచున్న

"జనమేజయా! మహాప్రభావశాలురైన రాజు లందరు లక్ష్య వేధము చేయ జాల నప్పుడు, సమస్త రాజ సమూహము బెదిరి లక్ష్యవేధము మాటయే యెత్త కుండిరి."

ఆ సమయమునందే ప్రముఖ వీరుడైన యర్జునుడు ఆ ధనుస్సుపై అల్లె త్రాడు ఎక్కుపెట్టి బాణము సంధించ దలచెను. అది చూచి దేవదానవులు, బలరాముని చేతిని నొక్కుచు శ్రీకృష్ణ భగవానుడున్ను మిక్కిలి ప్రసన్నులై యుండిరి. ఇక నిప్పుడు ద్రౌపది అర్జునుని వశురాలయ్యెను అని ఆతనికి విశ్వాసము కలిగెను. పాండవులు తమ రూపమును దాచుకొని యుండిరి. కనుక, ఎవరుగూడ వారిని గుర్తింప జాలకుండిరి.

**అర్జునుడు లక్ష్యము భేదించి ద్రౌపదిని బడయుట :-**

"జనమేజయా! రాజు లందరు ఆ ధనుస్సును ఎక్కుపెట్ట జాలనప్పుడు అర్జునుడు బ్రాహ్మణ మండలి నుండి లేచి ఇంద్ర ధ్వజమువలె ధనుస్సు వైపు పోవు చుండుట చూచి బ్రాహ్మణులు తమతమ జింక చర్మములను పైకెత్తి ఆడించుచు పెద్దగా కోలాహలము చేయ దొడగిరి. కొందరు బ్రాహ్మణులు ఊర కుండిరి. మరికొందరు, సంతోషముతో ఉబ్బిపోయిరి. చతురులు బుద్ధిజీవులు నైన కొందరు బ్రాహ్మణులు, తమలో నిట్లనుకొన జొచ్చిరి" :-

బ్రాహ్మణులారా! కర్ణశల్యాది ధనుర్వేద పారంగతులు, ప్రసిద్ధ క్షత్రియులు గూడ వంచజాలని యా ధనుస్సు పైన, అస్త్రజ్ఞాన శూన్యుడు, దుర్బల శరీరుడు నైన యీ బ్రాహ్మణ బాలకుడు ఎట్లు ఎక్కుపెట్ట గలడు? ఇతడు బాల్య చాపల్యము చేత ఈ కార్యము నందలి కాఠిన్యమును గూర్చి విచారించ లేదు. ఈ కార్యము నందు ఇతడు సఫలుడు కాకున్న యెడల, రాజు లందరు బ్రాహ్మణులను మిక్కిలి పరిహసించెదరు. ఒకవేళ నితడు అభిమానము చేత, హర్షము చేత, అథవా, బ్రాహ్మణ సులభ మైన చాంచల్యము చేత ధనుస్సుపై నారి ఎక్కించుటకు ముందుకు పోయినయెడల, ఇతనిని మనము ఆపవలెను. ఇతడక్కడకు పోకుండుటయే మంచిది."

మరికొందరు, బ్రాహ్మణులిట్లనిరి :-

"సోదరులారా! మనకు పరిహాసము కాజాలదు. ఎవరియెదుటగూడ మనము అల్పులము కావలసిన యవసర ముండదు. రాజులకు ద్వేషపాత్రులము కాము. కనుక, ఈ విషయమై చింత విడువుడు."

మరికొందరు బ్రాహ్మణులిట్లనిరి :-

"ఈ సుందర యువకుడు ఐరావత గజముయొక్క శుండాదండమువలె బలిసి సంతోషముతో నున్నాడు. ఇతని యొడలు బలిసి, భుజములు పొడువుగా నున్నవి హిమాలయమువంటి ధైర్యము గలవాడుగా తోచుచున్నాడు. సింహాసమాన మత్తగమనము, తరుణ మదగజ పరాక్రమమున్ను గలవాడుగా కనబడు చున్నాడు. ఈ వీరునకు ఈ కార్యము సాధ్యము కావచ్చును. ఇతని యుత్సాహముగూడ చూచి మనకు అట్లే తోచుచున్నది.

సోదరులారా! ఇతనికి గొప్ప యుత్సాహము, శక్తియు గలవు. అసమర్థుడే యైన యెడల, అతడు స్వయముగా ధనుస్సుకడకు పోవుటకు భయమొందును. సమస్త దేవాసురాదులకుగూడ అసాధ్యమైన పని బ్రాహ్మణులు చేయగలరు. జలపానము, వాయుభోజనమున్ను చేసికూడ దృఢ వ్రతపాలనము బ్రాహ్మణులు చేసి శారీరకముగ దుర్బలులైనను, మిక్కిలి బలవంతులుగా నుండెదరు.

"బ్రాహ్మణులు మంచిది, చెడ్డది, సుకార్యము, దుష్కార్యము, చిన్నది, పెద్దది యనక ఏ కార్యమైనను చేయగలరు. కనుక, వారికి అసాధ్యమైన పని యేదియులేదు. బ్రాహ్మణుడు, ఏదైన పనిచేయు చున్నప్పుడు ఆతనిని అవమానించ గూడదు. ధనుర్వేద - వేద - వివిధ శాస్త్ర - యోగములందు బ్రాహ్మణుని కంటె మించిన పురుషుడు భూమండలమునందు కనపడరు. ఉత్తమ బ్రాహ్మణుడు మంత్రయోగ - ఆత్మబలములచేత సమస్త జగత్తును స్తంభింపచేయ గలడు. కనుక బ్రాహ్మణునియెడల తుచ్ఛబుద్ధి గలిగి యుండగూడదు.

బ్రాహ్మణుడైన పరశురాముడు ఏకాకిగానే సమస్త క్షత్రియులను జయించెను. అగస్త్య మహాముని తన బ్రహ్మతేజః ప్రభావముచేత అగాధ

సముద్రపానము చేసెను. కనుక, మీ రందరు ఈ బ్రహ్మచారి ఈ ధనుస్సును ఎక్కుపెట్టి, లక్ష్యమును చేధించుటలో సమర్థుడగు గాక! అని ఆశీర్వాదము చేయుడు! ఇట్లు వారు అనగా, ఆ బ్రాహ్మణు లందరు అర్జునునిపై ఆశీర్వాదముల వర్షము కురిసిరి.

"జనమేజయా! యిట్లు బ్రాహ్మణులు పలురీతుల మాట్లాడు చుండగా, అర్జునుడు ధనుస్సుకడకు పోయి పర్వతమువలె అచంచలుడై నిలిచి చూచి, దానికి నాలుగువైపుల ప్రదక్షిణము చేసి, వరదాయకుడైన శంకర భగవానునకు తల వంచి నమస్కరించి, శ్రీకృష్ణ భగవానుని మనస్సులోనే ధ్యానించి, ఆ ధనుస్సును పైకి లేవనెత్తెను.

"జనమేజయా! రుక్మ - సునీథ - వక్ర - కర్ణ - దుర్యోధన - శల్య - శాల్వాది ధనుర్వేద పారంగతులైన రాజు లందరు మహా ప్రయత్నము చేసి కూడ ఏ ధనుస్సుపై నారి సారించ జాలక పోయిరో, అట్టి ధనుస్సుపై విష్ణు సమాన ప్రభావము గలిగి, పరాక్రమవంతుడైన వీరార్జునుడు రెప్పపాటు కాలములో అల్లెత్రాడు ఎక్కుపెట్టి ఐదు బాణములు గూడ సంధించి ప్రయోగించి, ఒక్క క్షణములోనే ఆ లక్ష్యమును ఛేదించెను. ఆ దెబ్బతో ఆ లక్ష్యము చిన్నా-భిన్నమై యంత్రపు రంధ్రమునుండి జారి క్రింద బడెను. అప్పుడు ఆకాశము నందు బిగ్గరగా హర్షనాదము సభా మండపమునందు దానికంటె మించిన ఆనంద కోలాహలమున్ను కలిగెను. దేవతలు అర్జునుని తలపై పుష్ప వర్షము కురిసిరి".

"జనమేజయా! అప్పుడు వేలకొలది బ్రాహ్మణులు హర్ష భరితులై యంగ వస్త్రములను, అర్జునుని విజయధ్వజములా యనునట్లు ఆడించిరి. లక్ష్యము భేదింప జాలని రాజులు అపజయముతో హాహాకారము చేసిరి. స్వయంవర మండపమందు ఆకాశమునుండి పుష్పవర్షములు పడెను. నూర్లకొలది వాద్యములు వాయింపబడెను. సూత - మాగధులు యశోగానము చేయ దొడగిరి.

"జనమేజయా! అప్పుడు అర్జునుని చూచిన ద్రుపదరాజునకు అనంత సంతోషము కలిగెను. తన సేనతో అతనికి సహాయము చేయుటకు నిశ్చయించెను.

"జనమేజయా! అప్పుడక్కడ మహాకోలాహలము గల్గుట చూచి, యుధిష్టిరుడు నకుల - సహదేవులతో తనబసకు పోయెను.

"జనమేజయా! ఆ లక్ష్యమును[1] భేదించి నేలపై పడగొట్టిన యింద్రసమాన పరాక్రమశాలియైన యర్జునునిపై దృష్టి సారించి సుందర శ్వేతపుష్ప జయ మాలను చేతబట్టుకొని ద్రౌపది చిరునవ్వుతో మెల్ల మెల్లగా అర్జునుని కడకు పోయెను. నిత్యనూతనమైన యతని రూపము ఆమె పలుసార్లు చూచినదైనను, అప్పుడు నూతనముగా కనపడెను. ఆమె నవ్వకున్ననూ నవ్వుచున్నట్లు తోచెను.

"జనమేజయా! అప్పుడు ద్రౌపది అక్కడ చేరియున్న రాజుల నందరును నిర్లక్ష్యముచేసి, వారు చూచుచుండగానే అర్జునుని కడకుపోయి యతని మెడలో జయమాలికనువేసి వినయముతో నక్కడ నిలిచెను.

"జనమేజయా! శచీదేవి యింద్రుని, స్వాహాదేవి అగ్నిదేవుని, లక్ష్మీదేవి విష్ణుభగవానుని, ఉషఃకాంత సూర్యభగవానుని, రతీదేవి మన్మథుని, గిరిజాదేవి మహేశ్వరుని, సీత శ్రీరాముని, దమయంతి నలునిన్ని వరించినట్లే ద్రౌపది పాండు పుత్రుడైన యర్జునుని వరించెను.

"జనమేజయా! అట్లు అద్భుతకర్మ చేసిన అర్జునుడు స్వయంవరసభలో స్త్రీరత్నమైన ద్రౌపదిని జయించుకొని ఆమెను తనతో తోడుకొని స్వయంవర మండపము నుండి బయటకు పోయెను. పత్నియైన ద్రౌపది అతని వెనువెంటనే పోవుచుండెను. అప్పుడక్కడ నిలిచియున్న బ్రాహ్మణులు అతనిని గొప్పగా సత్కరించిరి."

**ద్రుపదుని వధించుటకు పూనుకొనిన రాజులను భీమార్జునులు ఎదుర్కొనుట. వారిని గూర్చి కృష్ణ - బలరాములు మాట్లాడుకొనుట :-**

జనమేజయా! ద్రుపదరాజు బ్రాహ్మణునకు కన్యనీయదలచినాడని తెలిసిన రాజులకు మిక్కిలి కోపము వచ్చి ఒండొరులు ఇట్లు మాట్లాడుకొనిరి :-

1. సంస్కృత భారతములో అంతటను యంత్రము-లక్ష్యము అనియున్నదే కాని 'మత్స్యయంత్రము అని యెక్కడలేదు. గోరఖ్‌పూర్ ప్రతిలోలేదు. ఇతర ప్రతులలో నుండును. నన్నయ మత్స్యయంత్రమని వ్రాసెను.

ఆహా! ద్రుపదరాజు ఇక్కడ మనను తృణప్రాయముగాచూచి, తుచ్ఛుల మని తలచి మనను ఉల్లంఘించి కన్యను ఒక బ్రాహ్మణున కిచ్చి వివాహము చేయగోరు చున్నాడు. ఇతడు చెట్టునాటి పెంచి పూలకాలమందు దానిని ఖండించి పడగొట్టు చున్నాడు. ఇతడు మనను ఏ మాత్రము లెక్క చేయకున్నాడు. గనుక, ఈ దురాత్ముని చంపుదము. ఇతడు మనకంటే అధిక గుణములు కలవాడు కాడు. విశేషించి, రాజులను ద్వేషించువాడు. కనుక, ఈ దురాచారుని పుత్ర సహితముగా చంపుదము."

"మొదట ఇతడు మన నందరిని రాజులను పిలిచి, సత్కరించెను. మంచి భోజనము పెట్టెను. తరువాత, ఇట్టి యవమానము చేయుచున్నాడు. దేవతల వలె నీతిమంతులైన రాజులలో ఎవడు గూడ తన పుత్రికి యోగ్యుడు కనపడ లేదా? స్వయంవరమునందు కన్యకచేత వరింపబడుటకు బ్రాహ్మణులకు అధికారము లేదు. స్వయంవరమనునది క్షత్రియులకే కదా ప్రసిద్ధముగా నేర్పడినది.

రాజులారా! ఈ కన్యక మనలో ఎవనిని గూడ తన పతిగా వరించుటకు ఇష్టపడని యెడల మనము ఈమెను మండుచున్న యగ్నిలో పడవేసి పోవుదము. ఈ బ్రాహ్మణుడు చాపల్యము చేత కాని, లేక రాజ కన్యయందలి లోభము చేత కాని రాజులకు అప్రియము చేసినప్పటికిన్ని ఇతడు బ్రాహ్మణుడు కాబట్టి, ఎట్టి పరిస్థితిలోను ఇతనిని మనము వధింపగూడదు. ఎందుకనగా మన రాజ్యము, జీవితము, రత్నరాసులు, పుత్రపౌత్రులు, ధనవైభవములు - ఇవి యన్నియు బ్రాహ్మణుల కొరకే కదా ఉన్నవి. ఈ వస్తువు లన్నియు బ్రాహ్మణుల కొరకు మనము త్యాగము చేయగలము.

"రాజులారా! మనకు అవమానము కలుగ గూడదని, మన ధర్మము రక్షింపబడవలెనని, ఇతర స్వయంవరములకు గూడ ఇట్టి దుర్గతి పట్టగూడదనియు నిప్పుడు మనము ద్రుపదుని దండింపదలచు చున్నాము.

"జనమేజయా! రాజులిట్లు చెప్పి హర్షోత్సాహములతో అస్త్ర - శస్త్రములు తీసికొని ద్రుపదుని చంపుటకు అతనిపైకి పరుగెత్తి పోయిరి. వారిని చూచి ద్రుపదుడు మిక్కిలి భయపడి బ్రాహ్మణుల శరణు జొచ్చెను.

"జనమేజయా ! మదోన్మత్తగజ రాజులవలె ఆ రాజులు వేగముతో వచ్చుచుండుట చూచి, భీమార్జునులు వారిని ఎదుర్కొనుటకు వచ్చిరి. అప్పుడు శస్త్రధారులైన యా రాజులందరు, ఉడుము తోళ్ళ అంగుళి త్రాణములను చేతి తొడుగులను ధరించి భీమారునులను చంపుటకు కోపముతో వచ్చి వారిపై బడిరి.

జనమేజయా ! అప్పుడు భీమసేనుడు గజరాజువలె ఒక వృక్షమును పెరకి దానియాకులు త్రుంచివేసి దానిని పట్టుకొని దండధరుడైన యమరాజువలె అర్జునుని ప్రక్కన నిలిచెను. అర్జునుడు భీమసేనుని యద్భుత కార్యము చూచి చకితుడై నిర్భయముగా ధనుస్సు ధరించి యుద్ధమునకు నిలిచెను.

అప్పుడు శ్రీకృష్ణభగవానుడు భీమార్జునులయొక్క సాహసకార్యము చూచి తనయన్నయైన బలరామునితో నిట్లనెను:-

"అన్నా! సంకర్షణా! సింహమువలె అవలీలగా నడుచుచు,* తాళప్రమాణమైన ధనుస్సు ఎక్కుపెట్టుచున్నవాడే యర్జునుడు సుమా! సందేహము లేదు. నామాట అసత్యమైన యెడల నేను వాసుదేవుడనే కాను. ఇట్లే వృక్షమును పెరకి దానితో రాజులను ఎదిరించుచున్న వాడే భీమసేనుడు. ఎందుకనగా ఇట్టియద్భుత పరాక్రమము, ప్రదర్శించువాడు భూమండలమునందు భీమసేనుడు దప్ప మఱియొకవీరుడు లేడు.

ఇప్పుడే ఈ స్వయంవరమండపము నుండి వెడలిపోయినవాడే వినయశీలుడైన యుధిష్ఠిరుడు.అతనితో వెడలిన కుమారస్వామివంటివారు యిద్దరు నకుల-సహదేవులు అని నేను ఊహించు చున్నాను. ఏందు కనగా లాక్షాగృహదాహము నుండి పాండవులు, కుంతీ దేవియు తప్పించుకొని పోయినట్లు నేను విన్నాను.

"జనమేజయా! రాజులు యుద్ధభూమిలో అర్జునునిపై చూపించు క్రోధము, వారియరపులున్ను విని అర్జునుని బలమును తెలిసిన శ్రీకృష్ణుడు బలరామునితో నిట్లనెను:-

"ఊర్ధ్వ విస్తృతదోర్ప్మానే తాలమిత్యభిధీయతే" ఈ వచనము ననుసరించి మనుష్యుడు చేతులు పైకెత్తి నిలిచినప్పుడు ఆ చేతులకొననుండి పాదముల వరకు నున్న పొడవు తాలప్రమాణ మనబడును.

అన్నా! నీవు భయపడకుము. అనేకదేవాసురులు ఏకమై వచ్చినను వారందరితో అర్జును డొక్కడే యుద్ధము చేయగలడు. ఇట్లుండగా ఈ మానవజాతి రాజులను జయించుట యతనికి లెక్క ఏమి? ఒకవేళ, ఈ యుద్ధములో నర్జునుడు మనసహాయము కోరినయెడల మనము సహాయము చేయుదము. ఇందులో అర్జునునకు పరాజయము కలుగజాల దని నా విశ్వాసము."

జనమేజయా! నిర్జలమేఘమువలె తెల్లగానున్న బలరాముడు శ్రీకృష్ణుని మాట విశ్వసించి యతనితో. సోదరా! పాండవులతోపాటు మనమేనత్త కుంతీదేవి లాక్షాగృహమునుండి తప్పించుకొని బ్రతికినసంగతి తెలిసి నాకు చాల సంతోషమైనది అని యనెను.

**భీమార్జునులచేత కర్ణశల్యుల పరాజయము - భీమార్జునులు ద్రౌపదితో తమబసకు పోవుట :-**

జనమేజయా! అప్పుడు అక్కడి బ్రాహ్మణు లందరు మృగచర్మములను, కమండలువులన్ను పైకెత్తి ఆడించుచు అర్జునునితో 'నీవు భయపడకుము మేమందరము నీవైపున నుండి శత్రువులతో పోరాడెదము అని యనిరి."

"జనమేజయా! ఆ బ్రాహ్మణుల మాట విని అర్జునుడు వారితో, నవ్వుచు "మీరు ఊరక ప్రక్కన నిలుచొని చూచుచుండుడు. నేను ఏకాకిగానే బాణవర్షము గురిపించి, మాంత్రికులు మంత్రబలముచేత విషసర్పములను అణచినట్లు క్రుద్ధులైన యీ శత్రువుల నందరను నిలువరించెదను."

"జనమేజయా! యిట్లు చెప్పి అర్జునుడు స్వయంవరమునందు లక్ష్యవేధకొరకు తనకు లభించిన ధనుస్సు నెక్కుపెట్టి భీమసేనునితో పర్వతమువలె అచంచలముగా నిలిచెను. తరువాత, యుద్ధోన్మత్తులైన క్షత్రియులు కర్ణాదులున్ను, తమపై వచ్చుట చూచి, భీమార్జునులు నిర్భయులై రెండు మదగజములు శత్రుగజములనువలె వారిని ఎదురించిరి."

"జనమేజయా! అప్పుడు యుద్ధోత్సాహము గల ఆ రాజులు కఠిన స్వరముతో 'యుద్ధము చేయు బ్రాహ్మణులను గూడ యుద్ధరంగమందు వధించుట శాస్త్రసమ్మతమే!' అని చెప్పి బ్రాహ్మణులవైపు పరుగెత్తిరి. అప్పుడు కర్ణుడు

అర్జునునితో పోరాడుటకు ముందుకు సాగెను. తరువాత, ఒక కరిణి కొరకు రెండు మదకరులు పోరాడునట్లు ద్రౌపది కొరకు శల్యభీమసేనులు తలపడిరి."

"జనమేజయా! దుర్యోధనాదిరాజులు ఒకటిగా చేరి యనేక బ్రాహ్మణులతో యుద్ధభూమి యందు ఏలాటి ప్రయాసయు లేకుండ క్రీడించు చున్నట్లుగా మృదువుగా శీతల యుద్ధము చేసిరి. అప్పుడు అర్జునుడు ధనుస్సును గట్టిగా లాగి తీక్ష్ణ బాణముతో కర్ణుని కొట్టెను. ఆ దెబ్బతో కర్ణునకు మూర్ఛ వచ్చినట్లై, అతి కఠినముగా అర్జునుని పైకి పోయెను."

"జనమేజయా! ఆ యిరువురు వీరయోధులు తమ హస్తలాఘవము చూపుటలో అసమానులు. వారిలో ఎవడు అధికుడు, ఎవడు అల్పుడు అని తెలిసికొనుట యసాధ్యముగా నుండెను. వా రిరువురు పరస్పర జయేచ్ఛతో పోరాడు చుండిరి. 'చూడుము నీవు ప్రయోగించిన ఈ యస్త్రమును ఆపుటకు నేను ఈ యస్త్రము ప్రయోగించితిని, నా భుజబలము చూడుము' అని వీరవచనములు ఒండొరులు మాట్లాడుకొను చుండిరి."

"జనమేజయా! తరువాత 'అర్జునునితో సమానమైన బాహుబలము గలవాడు ఈ భూమండలము నందు మరియొకడు లేడు' అని కర్ణుడు మిక్కిలి క్రోధముతో యుద్ధము చేయుచుండెను. అప్పుడు అర్జునుడు ప్రయోగించిన బాణము లన్నిటిని కర్ణుడు ఖండించి బిగ్గరగా సింహనాదము చేసెను. సైనికు లందరు కర్ణుని ప్రశంసించిరి. తరువాత కర్ణుడు ఇట్లనెను :-"

బ్రాహ్మణోత్తమా! నీ బాహుబలము చూచి నేను చాల సంతోషించితిని. నీవు అలసినట్లు గాని, బాధపడినట్లు గాని, కనపడుట లేదు. నీవు సమస్త శస్త్రాస్త్రములను బడసి వశములో నుంచుకొనినావు. నీ సాఫల్యము చూచి నేను చాల ప్రసన్నుడ నైతిని.

"బ్రాహ్మణోత్తమా! నివు మూర్తీభవించిన ధనుర్వేదమా? లేక, పరశురాముడవా? అథవా, యింద్రుడవా? లేదా మహామహిమాన్వితుడైన సాక్షాత్తు విష్ణుభగవానుడవా? నీవు తప్పక వీరిలోనే ఒకడవు. నీ నిజరూపమును కప్పిపుచ్చుటకు ఈ బ్రాహ్మణవేషము ధరించి బాహుబలముతో నాతో యుద్ధము చేయు

చున్నావు. ఎందుకనగా యుద్ధములో నేను కోపించినప్పుడు నన్ను ఎదురించ గలవాడు సాక్షాత్తు ఇంద్రుడు గాని అథవా అర్జునుడు గాని తప్ప మరి యొకడు లేడు."

జనమేజయా! కర్ణు డిట్లు చెప్పిన తరువాత అర్జును డతనితో నిట్లనెను:-

"కర్ణా! నేను ధనుర్వేదము కాను. పరశురాముడను కాను కాని, నేను సమస్త శస్త్ర ధారులలో ఉత్తమ యోధుడైన ఒక శ్రేష్ఠ బ్రాహ్మణుడను. గురూప దేశము చేత బ్రహ్మాస్త్రమునందు, ఇంద్రాస్త్రమునందున్న పారంగతుడనైనాను. నేడు యుద్ధము నందు నిన్ను జయించుటకు నిలిచి యున్నాను. నీవుగూడ స్థిర ముగా నిలువుము.

"జనమేజయా! ఆ సమయమందే మరియొక చోట శల్యాభీమసేనులు పరస్పరము మదగజములవలె యుద్ధము చేయు చుండిరి. ఆ యిరువురు విద్య యందు, యుద్ధ కళల యందున్న సమానులుగా పరిపూర్ణులై యుండిరి. వారు పిడికిళ్ళతో మోకాళ్ళతోను పరస్పరము కొట్టుకొనుచు, ఒండొరులను దూరముగా ఈడ్చుకొనుచు, క్రింద పడగొట్టుచు, తమవైపు లాగుకొనుచు, ప్రక్క-ప్రక్కగా నిలిచి పడగొట్టుటకు ప్రయత్నించుచు నుండిరి.

"జనమేజయా! ఈవిధముగా వారు ప్రకర్షణ[1] - ఆకర్షణ[2] - అభ్యా కర్షణ[3] - వికర్షణ[4]" ముల చేత ఒండొరులు కొట్టుకొను చుండగా ఆ దెబ్బలచేత వారి శరీరములందు చట-చట ధ్వనులు వెడలు చుండెను. వారు రెండు పాషాణ ములు కొట్టుకొను చున్నవా అనునట్లుండిరి ఇట్లు వారు రెండు గడియలు యుద్ధము చేసిరి.

1. వెనుకకు ఈడ్చుట - ముందుకు తోయుట.
2. దగ్గరకు ఈడ్చుట.
3. కరతలముతో శత్రువు యొక్క యెదపై కొట్టుటకు.
4. ముందుకు త్రోయుట-నేలపై ఈడ్చుట. (ఇవి మల్ల యుద్ధములో ఒండొ రులు చేయు క్రియలు.)

''జనమేజయా! తరువాత భీమసేనుడు శల్యుని పైకెత్తి నేలపై పడునట్లు కొట్టెను. అది చూచి బ్రాహ్మణులు నవ్విరి. భీముడు అట్లు శల్యుని క్రింద పడగొట్టినను *వధించలేదు అను విషయ మందరికి ఆశ్చర్యకరముగ నుండెను. అట్లు భీముడు శల్యుని అర్జునుడు కర్ణుని ఓడించిన తరువాత ఇతర రాజులందరు భయపడి భీమసేనుని చుట్టు చేరి నిలిచి ఇట్లనుకొనిరి:-

"ఆహా! ఈ బ్రాహ్మణులు ధన్యులు. వీరి జన్మస్థలమును ఉండుచోటును గూర్చి తెలిసికొనుడు. పరశురాముడు, ద్రోణుడు, అర్జునుడుదప్ప యుద్ధమునందు కర్ణుని ఎదిరించగలవాడు మరియొకడెవ డున్నాడు? శ్రీకృష్ణుడు, కృపాచార్యుడున్ను దప్ప దుర్యోధనునితో పోరాడగలవా డెవడున్నాడు. శల్యునితో, యుద్ధము చేయగలవాడు బలరాము - భీమసేను - దుర్యోధనులు దప్ప మరియొకడెవడున్నాడు? కనుక, బ్రాహ్మణులచేత పరివృతమైన యీ యుద్ధభూమినుండి మనము వెడలిపోవలెను. ఎందుకనగా బ్రాహ్మణుడు అపరాధము చేసినను, ఆతనిని రక్షించవలెను. మొదట వీ రెవరో బాగుగా తెలిసికొని యిష్టముండినచో వీరితో యుద్ధము చేయుదము."

ఇట్లు మాట్లాడుకొనుచున్న రాజులను చూచి భీమార్జునులు సంతోషించిరి.

"జనమేజయా! వారి యుద్ధము చూచిన శ్రీకృష్ణుడు వారు భీమార్జునులే యని తలచి వారితో పోరాడుచున్న రాజులతో, 'వీరు ధర్మపూర్వకముగ ద్రౌపదిని పొందిరి' అని చెప్పి, ఆ రాజులను యుద్ధమునుండి ఆపెను. ఇట్లు శ్రీకృష్ణుడు చెప్పిన తరువాత రాజులు యుద్ధము విడిచి వెడలిపోయిరి. అక్కడి ప్రేక్షకులందరు, ఈ స్వయంవరోత్సవముచేత బ్రాహ్మణులు శ్రేష్ఠులని నిరూపింపబడెను. ద్రౌపదిని బ్రాహ్మణులు పడసిరి' అని చెప్పుచు వెడలిపోయిరి.

"జనమేజయా! ఆ బ్రాహ్మణులచేత చుట్టబడిన భీమార్జునులు వారిని తప్పించుకొని కష్టముతో ముందుకు సాగిపోవు చుండిరి. జనసమ్మర్దము తగ్గిన తరువాత భీమార్జునులు ముందు పోవుచుండగా వారి వెనుక ద్రౌపది నడచుచుండుట శత్రువులు చూచిరి.

*వధించకపోవుటకు కారణము శల్యుడు తమకు మేనమామ యగుటయే.

"జనమేజయా! పున్నమినాడు మేఘ సమూహముల బయలు వెడలిన సూర్యచంద్రులవలె భీమార్జునులు ప్రకాశించు చుండిరి.

"ఇట్లుండగా, భిక్షా సమయము దాటినను పుత్రులింకను రాలేదని తల్లి కుంతీదేవి చింతించుచు వారి కేమైన నష్టము కలిగి యుండునా యని శంకించుచు ఆమె, 'ఒకవేళ ధృతరాష్ట్రి పుత్రులు పాండవులను గుర్తించి వారి హత్య చేయ లేదుకదా? అథవా, వైరము మనస్సులో పెట్టుకొని మాయావులైన రాక్షసులు నా పుత్రులను చంప లేదుకదా! వ్యాసుని అభిప్రాయము గూడ విపరీత మాయెనా యేమి?" అని తలచెను.

"జనమేజయా! ఈ విధముగ పుత్ర స్నేహము చేత కుంతీదేవి చింతించు చున్నప్పుడు ఆకాశమునందు మేఘములు కప్పి దుర్దినమా (మేఘములు కప్పిన దినము) యనునట్లు తోచెను. ప్రజ అందరు అన్ని పనులు విడిచి నిద్ర బోయిన వారివలె తమ-తమ యిండ్లలో నిశ్చేష్టులై కూర్చొని యుండిరి. అప్పుడు పగలు మూడవ జామునందు మేఘములు చుట్టిన సూర్యునివలె బ్రాహ్మణ సమూహము చేత చుట్టబడి యర్జునుడు కుమ్మరి వాని యింటిలో ప్రవేశించెను."

**కుంతీ - అర్జున - యుధిష్ఠిరుల సంభాషణము - పంచ పాండవులకు ద్రౌపదితో జరుగు వివాహమును గూర్చి విచారించుట - కృష్ణబలరాములు పాండవులను కలిసికొనుట :-**

"జనమేజయా ! భీమార్జునులు కుమ్మరి యింటిలో ప్రవేశించి తమకు ద్రౌపది ప్రాప్తించిన సంగతి తల్లికి తెలుపుచు, 'అమ్మా! మేము భిక్ష తెచ్చితిమి' అని సంతోషముతో ననిరి. అప్పుడు కుంతీదేవి కుటీరము లోపట నుండెను. ఆమె పుత్రులను చూడకయే 'భిక్ష తెచ్చి యుండిన' యెడల మీరు సోదరు లందరు కలిసి తీసుకొనుడు!' అని చెప్పెను. తరువాత ద్రౌపదిని చూచి ఆమె చింతించి 'అయ్యో! నానోటి నుండి మిక్కిలి అనుచితమైన మాట వెడలె కదా!' అని చెప్పి ఆమె అధర్మ భయముచేత మనస్సులో మిక్కిలి చింతించెను. కాని, అనుకూల పతి లాభము చేత ద్రౌపది మనస్సులో మిక్కిలి సంతోషము కలిగెను. కుంతీదేవి ద్రౌపది చేయి పట్టుకొని యుధిష్ఠిరుని కడకు పోయి అతనితో నిట్లనెను :-

"పుత్రా! ఈమె ద్రుపదరాజ పుత్రి ద్రౌపది. నీ తమ్ములు భీమార్జునులు ఈమెను 'భిక్ష' అని నాకు చెప్పిరి. నేనుగూడ ఈమెను చూడకయే పొరపాటున భిక్షయే యని తలచి దానికి తగినట్లుగా మీరందరు కలిసి గ్రహింపుడు! అని చెప్పితిని. ఇప్పుడు నా మాట అసత్యము కాకుండుటకు ఏమి చేయవలయును? చెప్పుము. ఈమెకు పాపము అంటకుండ, ఈమె నీచయోనిలో పడకుండ ఉపాయము చెప్పుము."

"జనమేజయా! యుధిష్ఠిరుడు చాల బుద్ధిమంతుడు అతడు తల్లి మాట విని రెండు గడియలు యోచించి కుంతీదేవిని ఆశ్వాసించుచు అర్జునునితో నిట్లనెను".

"అర్జునా! ద్రౌపదిని నీవు జయించుకొంటివి. కనుక నీతోనే ఈ రాజ కుమారి శోభిల్ల గలదు. ఇప్పుడు అగ్ని జ్వాలింపజేసి, అగ్నిసాక్షిగా శాస్త్ర ప్రకారము ఈ రాజకన్య పాణిగ్రహణము చేయుము" ఆ మాటకు అర్జునుడు ఇట్లనెను:

"రాజా! నన్ను అధర్మపరుని చేయకుము. అన్నగారు అవివాహితులై యుండగా తమ్ముని వివాహము జరుగుట ధర్మము కాదు. ఇట్టి వ్యవహారము అనార్యులలో నుండును. తొలుత, నీ వివాహము కావలెను. ఆ తరువాత అన్న భీమసేనుడు, పిదప నేను వివాహము చేసికొనవలెను. మన ముగ్గురి తరువాత నకులుడు, సహదేవుడు వరుసగా పెండ్లి చేసికొనవలెను. రాజా! భీమసేనుడు, నేను, నకుల సహదేవులున్ను ఈ రాజకన్య - అందరము నీ యాజ్ఞకు లోబడి యున్నాము. ఇట్టి పరిస్థితిలో నీవు బాగుగా విచారించి మన ధర్మ - యశస్సులకు అనుకూలముగా, పాంచాల రాజునకు గూడ హితమగునట్లు కార్యము చేయుము. దానికి మాకు ఆజ్ఞ యిమ్ము. మేమందరము నీకు అధీనులము".

"జనమేజయా! అర్జునుడు ఇట్లు భక్తి భావముతో స్నేహపూర్వకముగా చెప్పిన మాట విని పాండవులు ద్రౌపదివైపు చూచిరి. ఆమె గూడ వారి నందరిని చూచెను. తరువాత పాండవులు పరస్పరము చూచుకొని అందరున్ను తమ హృదయములలో ద్రౌపదిని నిలుపుకొనిరి. ద్రౌపది దృష్టి వారిపై పడగనే అందరికిన్ని మన్మథ వికారము కలిగెను.

"జనమేజయా! బ్రహ్మదేవుడు పాంచాలికి సుందర రూపమును రచించి అలంకరించెను. ఆమె రూపము ప్రపంచ స్త్రీ లందరి రూపములకంటె ఎక్కువ ఆకర్షించునదిగా పురుష మనస్సును మోహింప జేయునదిగాను నుండెను. అప్పుడు యుధిష్ఠిరుడు వారి యాకృతులు చూడగానే వారి మనోభావములను గ్రహించెను. పూర్వము వేదవ్యాసుడు చెప్పిన మాటలుగూడ అతని స్మృతికి వచ్చెను. 'ద్రౌపది కారణముగా మాలో మాకు భేదభావము కలుగగూడదు' అను భయముచేత యుధిష్ఠిరుడు సోదరులతో 'కల్యాణకారిణియైన ఈ ద్రౌపది మనయందరకు పత్ని కాగలదు అని చెప్పెను. అప్పుడు జ్యేష్ఠభ్రాత మాటవిని పాండవులు మనస్సులలో ఆ మాటనే చింతించుచు నూరకుండిరి.

"జనమేజయా! శ్రీకృష్ణ బలరాములు పాండవులను గుర్తించి కుమ్మరివాని యింటికి వారితో కలియుటకు పోయిరి. వారు అక్కడ యుధిష్ఠిరునకు నలు వైపుల నాలుగు అగ్నులవలె కూర్చొని యున్న పాండవులను చూచిరి. అప్పుడు శ్రీకృష్ణ బలరాములు యుధిష్ఠిరుని సమీపించి అతని పాదములు స్పృశించి మేము కృష్ణ - బలరాములము అనిరి. పాండవులుగూడ వారిని చూచి సంతోషించిరి. తరువాత కృష్ణ - బలరాములు తమ మేనత్త కుంతీదేవికిగూడ నమస్కరించిరి. తరువాత యుధిష్ఠిరుడు వారి క్షేమసమాచార మడిగి కృష్ణునితో, "వాసుదేవా! మేమిక్కడ ప్రచ్ఛన్నులమై యున్నాముకదా! మీరు మమ్మెట్లు గుర్తించితిరి" అని యనెను.

ఆ మాటవిని శ్రీకృష్ణుడు నవ్వి యుధిష్ఠిరునితో నిట్లనెను :-

"రాజా! అగ్ని యెంతగా దాగియున్నను అది ప్రకటితమే యగును. స్వయంవర మండపమందు అట్టి యద్భుతకార్యము పాండవులుదప్ప మరియే మనుష్యులు చేయగలరు? చాల గొప్ప సౌభాగ్య మేమనగా శత్రువుల నెదురించు శక్తిగల మీరందరు పాండవులు భయంకరమైన లాక్షాగృహాగ్నినుండి తప్పించు కొని బ్రతికితిరి. పాపిష్ఠుడైన దుర్యోధనుడు మీపై కుట్రచేసి సఫలుడు కాజాలక పోయెను. ఇదిగూడ మీ యదృష్టమే. మా మనస్సులో మీయెడలగల సద్భావము ఫలించుగాక! మీరు సర్వదా ప్రజ్వలితాగ్నులవలె అభివృద్ధి పొందుచుందురుగాక! ఇంతవరకు మిమ్ము ఏ రాజుగూడ గుర్తింపలేదు. కనుక, మేముగూడ మా శిబిర మునకే తిరిగి పోయెదము. ఇట్లు చెప్పి కృష్ణ బలరాములు యుధిష్ఠిరుని యాజ్ఞ తీసికొని అక్కడనుండి వెడలిపోయిరి.

**ధృష్టద్యుమ్నుడు పాండవుల సంగతి తెలిసికొని ద్రుపదుని కడకు పోవుట - ద్రౌపది విషయమై ద్రుపదుని ప్రశ్న :-**

"జనమేజయా! భీమార్జునులు కుమ్మరివాని యింటికి పోవునప్పుడు ధృష్టద్యుమ్నుడు ప్రచ్ఛన్నముగా వారివెనుక పోయెను. అతడు నలువైపుల సేవకులను కూర్చొనబెట్టి తానుగూడ అజ్ఞాతముగ కుమ్మరివాని యింటి యొద్దనే దాగి యుండెను.

సాయంకాల మైనప్పుడు భీమార్జున నకుల సహదేవులు భిక్ష తెచ్చి యుధిష్ఠిరున కిచ్చిరి. అప్పుడు కుంతీదేవి ద్రౌపదితో నిట్లనెను:-

"మంగళకరురాలా! నీవు ఈ భోజనములో మొదటిభాగము తీసికొని అది దేవతలకు బలి యిచ్చి బ్రాహ్మణులకు భిక్ష యిమ్ము. తరువాత మనను ఆశ్రయించుకొని మన యొద్ద నున్నవారికిగూడ అన్నము వడ్డింపుము. పిదప మిగిలిన యన్నములో అర్ధభాగము ఒకని కొరకు ఉంచుము. మిగిలిన యర్థభాగము ఆరు సమభాగములు చేసి, నలుగురు సోదరుల కొరకు నాలుగు భాగములు విడి-విడిగా నుంచి, మిగిలిన రెండు భాగములు నీ కొకటి నా కొకటి వడ్డింపుము. తొలుత తీసి యుంచిన అర్ధ భాగము, గజరాజు శరీరమువలె బలిసి యున్న యెఱ్ఱటి యువకుడైన యతనికి పెట్టుము. ఇతని పేరు భీముడు. ఇతడు సర్వదా అధిక భోజనము చేయువాడు."

"జనమేజయా! అత్తగారి యాజ్ఞను పాలించుటలోనే తనకు శ్రేయస్సు గలదని తలచుచున్న సాధ్వి యైన ద్రౌపది మిక్కిలి ప్రసన్నురాలై కుంతీదేవి చెప్పినట్టే చేయగా, నందరు భోజనము చేసిరి.

"జనమేజయా! తరువాత సహదేవుడు భూమిపై దర్భశయ్య పరవగా, పాండవులందరు ఆ దర్భలపై తమ-తమ జింక చర్మములను పరచుకొని నేలపై దక్షిణ దిక్కు శిరస్సులు చేసి నిద్రించిరి. కుంతీదేవి వారి తలవైపు, ద్రౌపది వారి పాదములవైపున్ను, వారి పాదములకు ఉపధానముగా నున్నదా యనునట్లు శయనించెను. అక్కడ అట్టి పరిస్థితిలో నున్నప్పటికిన్ని ద్రౌపది మనస్సులో కొంచెముగూడ దుఃఖము కలుగలేదు. ఆ వీరులకు ఆమె యేమాత్రము తిరస్కారము చేయలేదు.

"జనమేజయా! అట్లు శయనించి యున్న ఆ పాండవులు సేనాపతుల కథలను చెప్పికొనుచు, వివిధ దివ్యాస్త్ర - రథ - గజ- ఖడ్గ-గదా-పరశువులను గూర్చిన చర్చలు చేయుచుండిరి. వారి మాటలన్నియు అక్కడ దాగియున్న ధృష్టద్యుమ్నుడు విని, అక్కడ వారితోపాటు శయనించి యున్న ద్రౌపదినిగూడ చూచెను.

"జనమేజయా! తరువాత ధృష్టద్యుమ్నుడు తాను కనుగొనిన పాండవుల సమాచారము, వారి మాటలున్ను ద్రుపదరాజునకు పూర్తిగా తెలుపుటకుగాను, ఆ రాత్రియే ద్రుపదరాజు కడకు పోయెను. ద్రుపదుడు పాండవుల నిజ స్వరూపము తెలియకుండుట చేత, మిక్కిలి ఖిన్నుడై యుండెను. ధృష్టద్యుమ్నుడు రాగానే అతనిని ద్రుపదుడు ఇట్లు అడిగెను.

"పుత్రా! నా పుత్రి 'కృష్ణ' ఎక్కడకు పోయెను? ఎవడు ఆమెను తీసికొని పోయెను? ఒకవేళ ఎవడైన శూద్రుడు గాని, లేక, నీచజాతి పురుషునివలన ఉత్తమజాతి స్త్రీకి పుట్టిన మనుష్యుడు గాని, లేక పన్నులుకట్టు వైశ్యుడు కాని, నా పుత్రిని పడయలేదు కదా! ఈ విధముగ అతడు నాతలపై తన బురదకాలు పెట్టలేదు కదా! పూలమాలవలె సుకుమారియై, హృదయముపై ధరింప దగిన నా ప్రియపుత్రి శ్మశానమువలె అపవిత్రుడైన ఏ పురుషుని చేతిలోనైన పడలేదు కదా!

"పుత్రా! ద్రౌపదిని పొంద బోవువాడు మన క్షత్రియకులము నందలి శ్రేష్ఠపురుషుడగునా? అథవా, మనకంటు ఉత్తమమైన బ్రాహ్మణకులమునందు పుట్టినవాడా? నా కృష్ణను ఎవడైన నీచకులమువాడు స్పృశించి నేడు నా తలపై తన యెడమ పాదమును ఉంచలేదు కదా?

"పుత్రా! నేను నరోత్తముడైన యర్జునునితో ద్రౌపదికి వివాహము చేసి, మిక్కిలి సంతుష్టుడ నగుదును. ఎప్పుడుగూడ సంతాపము చెందను! అని తలచుచుంటిని. అట్టి సౌభాగ్యము నాకు కలుగునా? నేడు నా పుత్రిని జయించి, తీసికొని పోయిన పురుషుడెవడు సరిగా చెప్పుము.

"పుత్రా! ఇంకను వీరులైన పాండుపుత్రులు జీవించి యున్నారా? నేడు కుంతి కనిష్ఠపుత్రుడైన అర్జునుడే ధనుస్సు నెక్కుపెట్టి లక్ష్యమును కొట్టి పడవేసెనా?"

స్వయంవర పర్వము సమాప్తము

# వైవాహిక పర్వము

**ధృష్టద్యుమ్నుడు ద్రౌపదీ - పాండవుల సమాచారము తెలుపగా ద్రుపదుడు వారికడకు పురోహితుని పంపుట-పురోహిత-యుధిష్ఠిరుల సంభాషణము :-**

"జనమేజయా! ద్రుపదుడు ఇట్లనిన తరువాత, ధృష్టద్యుమ్నుడు మిక్కిలి సంతోషముతో నిట్లు చెప్పదొడగెను.

"మహారాజా! విశాలరక్తనేత్రుడు, కృష్ణమృగ చర్మధరుడు, దేవ సమాన మనోహర రూపుడునైనయే తరుణ వీరుడు ధనుస్సుపై అల్లెత్రాడు ఎక్కించి లక్ష్యమును కొట్టి పడవేసెనో, అతడు ఎవరిని గూడ వెంట బెట్టుకొనక, ఒక్కడే మిక్కిలి వేగముగా వెడలి పోవునప్పుడు అనేక బ్రాహ్మణులు అతనిని చుట్టుముట్టి మిక్కిలి ప్రశంసించిరి. సమస్త దేవతల చేత, ఋషులచేతను సేవింపబడు నింద్రుడు దైత్య సేనల నడుమ నిర్భయముగా సంచరించునట్లే, ఆ నవయువక వీరుడు నిర్భయుడై రాజుల నడుమ నుండి వెడలి పోయెను.

"తండ్రీ! అప్పుడు మన కృష్ణాదేవి మిక్కిలి సంతోషముతో, ఆ తరుణ వీరుని మృగచర్మము పట్టుకొని, గజరాజు వెనుక హస్తినివలె అతని వెనువెంట పోయెను. అది చూచి సహించని రాజులు క్రోధముతో అతనితో యుద్ధము చేయుటకు వచ్చినప్పుడు మఱియొక వీరుడు చాల పెద్ద వృక్షము పెఱికి ఆ రాజ సమూహముపై పడి యమరాజు సమస్త ప్రాణులను సంహరించునట్లు కోపముతో, ఆ రాజులను యముని ముఖములోకి పంపుచుండెను.

"రాజా ! చంద్ర - సూర్యులవలె ప్రకాశించుచున్న ఆ యిరువురు నరోత్తములు, రాజులందరు చూచుచుండగనే, ద్రౌపదిని వెంట నిడుకొని, నగర బహిర్భాగము నందలి కుమ్మరి వాని యింటికి పోయిరి. ఆ యింటిలో అగ్నిశిఖవలె తేజస్వినియైన యొక స్త్రీ కూర్చొని యుండెను. ఆమె ఆ వీరుల తల్లియై యుండునని యనుకొంటిని. ఆమె యొద్దనే అగ్నివలె తేజస్వులైన మరి ముగ్గురు పురుషోత్తములు కూర్చొని యుండిరి.

ఈ యిరువురు వీరులు తల్లి చరణములకు సమస్కారము చేసి ద్రౌపదితో గూడ ఆమెకు ప్రణామము చేయించిరి. అట్లు నమస్కరించి నిలిచియున్న ద్రౌపదిని వారు తల్లికి ఒప్పగించి, తాము బిక్ష తెచ్చుటకు పోయిరి. వారు తిరిగి వచ్చినప్పుడు వారుతెచ్చిన భిక్షాన్నమును ద్రౌపది వారి తల్లియాజ్ఞ ప్రకారము, దేవతా బలి యిచ్చి బ్రాహ్మణులకు పెట్టి, ఆ వృద్ధ స్త్రీకి, ఆ యైదుగురు వీరులకున్ను వేరువేరుగా వడ్డించి, చివరకు తానుగూడ, ఆ మిగిలిన యన్నము భుజించెను.

రాజా! భోజనానంతరము వా రందరు, క్రింద దర్భచాపలు పరచుకొని, వానిపై మృగచర్మములు పరచి శయనించిరి. వారి పాదముల కడ మన కృష్ణ శయనించెను. వారు శయనించినప్పుడు వర్షామేఘ గంభీర ధ్వనితో విచిత్రముగా వారైదుగురు మాట్లాడుచుండిన మాటలను బట్టి వారు వైశ్య - శూద్ర - బ్రాహ్మణులని నాకు తోచలేదు. వారు చేయుచుండిన యుద్ధవర్ణనము వలన వారు క్షత్రియులే యనుటలో కొంచెముగూడ సందేహము లేదు. కుంతీపుత్రులు లక్క యింటియగ్నినుండి తప్పించుకొని బ్రతికినారని విన్నాము కనుక, 'పాండవులతో సంబంధము చేయవలెను' అను మన కోరిక తప్పక సఫలమైన దని తోచుచున్నది.

"రాజా! వారు ధనుస్సు నెక్కుపెట్టి దుర్భేద్యమైన లక్ష్యమును భేదించి పడగొట్టిన విధము ఆ సోదరులు పరస్పరము మాట్లాడు కొనుచుండిన విధమున్ను గమనించగా వారు బ్రాహ్మణవేషములో ప్రచ్ఛన్నముగా తిరుగుచున్న పాండవులే యని నిశ్చయము కలుగు చున్నది."

"జనమేజయా! ఈ సమాచారము విని ద్రుపదునకు మిక్కిలిసంతోషము కలిగెను. తక్షణమే యారాజు ఆ సోదరులకడకు తనపురోహితుని పంపుచు నతనితో 'బ్రహ్మన్! నీవు వారినిగూర్చి అడిగి, వారు పాండవులా' అని తెలిసికొనుమని చెప్పెను. రాజుమాటప్రకారము పురోహితుడు అక్కడకుపోయి వారిని ప్రశంసించి ద్రుపదునిమాటలు వారికి ఇట్లు వినిపించెను:-

"వీరపురుషులారా! ద్రుపదమహారాజు మిమ్ముగూర్చి తెలిసికొన గోరుచున్నాడు. ఈ వీరుడు లక్ష్యము భేదించు చుండగా చూచి ద్రుపదునకు అపారమైన హర్షము కలిగెనది. మీరు మీకులగోత్రాదులను వాస్తముగ తెలిపి, శత్రువుల

తలపై త్రొక్కి, ద్రుపదునకు ఆనందము చేకూర్చెడు. పాండుమహారాజు ద్రుపదునకు ప్రాణమిత్రుడు. కనుక ఆయన 'తనపుత్రి వివాహము పాండుకుమారునితో చేయవలె' నని, 'పాండురాజునకు కోడలుగా తనపుత్రిని సమర్పించవలె' ననియు కోరు చుండెను."

"వీరులారా! ద్రుపదుడు, 'అర్జునుడు తనపుత్రిని పాణిగ్రహణము చేయవలెనని నిరంతరము అభిలషించు చుండెను. 'ఒకవేళ, తనమనోరథము నెరవేరినచో అది తన పుణ్యకర్మలఫల మనుకొనెదను' అని అతడు చెప్పుచున్నాడు.

"జనమేజయా! ఇట్లు పురోహితుడు చెప్పినప్పుడు యుధిష్ఠిరుడు భీమసేనునితో 'ఈ బ్రాహ్మణుడు ద్రుపద మహారాజుయొక్క పూజ్యపురోహితుడు. కనుక, ఇతనిని మనము విశేషముగా ఆదరించి అర్ఘ్యపాద్యాసనములతో సత్కరించ వలెను' అని చెప్పెను."

భీమసేనుడు యుధిష్ఠిరాజ్ఞ మేరకు అర్ఘ్య పాద్యాదులతో శాస్త్రోక్తముగ ఆ పురోహితుని పూజించెను. తరువాత అతనితో యుధిష్ఠిరుడు ఇట్లనెను:-

"బ్రహ్మన్! ద్రుపదమహారాజు ఈ కన్యకను తన యిచ్ఛ ప్రకారము ఈయలేదు. ధర్మానుసారముగ 'లక్ష్యభేదనము' అనునొక నిబంధనము పెట్టి తన కన్యనిచ్చుటకు నిశ్చయించెను. ఆ నిబంధనమును నెరవేర్చిన పురుషుడు ఈ కన్యకను ఒడసెను. మా రాజు అక్కడ జాతి-వర్ణ-శీల-కుల గోత్రాదులనుగూర్చి తన యభిప్రాయమును ప్రకటించ లేదు. "ధనుస్సు నెక్కుపెట్టి లక్ష్యమును భేదించిన వానికే కన్యాదానము చేసెదనని ద్రుపదుడు ప్రకటించెను. ఈ వీరుడు ఆ ప్రకటన ప్రకారమే, రాజసమూహములో రాజకుమారిని గెలుచుకొనెను. ఇట్టి పరిస్థితిలో ద్రుపదుడు సంతాపము చెందగూడదు.

"బ్రాహ్మణోత్తమా! ఈ రాజకన్యను గ్రహించుటకు మేము అన్ని విధముల యోగ్యులము. ఉత్తములము. బలహీను డెవడుగూడ ఈ ధనుస్సును ఎక్కుపెట్టజాలకుండెను. అస్త్రవిద్య పరిపూర్ణముగ అభ్యసించని వానికి, అథవా, నీచకుల సంజాతునకు గూడ ఆ లక్ష్యమును భేదించి పడగొట్టుట యసంభవము. కనుక పాంచాలరాజు ఇప్పుడు తన పుత్రికొరకు పశ్చాత్తాపము చెందుట

యుచితము కాదు. ఈ భూమండలమందు ఈ వీరుడు దప్ప మరియొక డెవడు గూడ ఆ లక్ష్యమును భేదించగలవాడు లేడు."

"జనమేజయా! యుధిష్ఠిరుడు ఇట్లు చెప్పుచుండగనే ద్రుపదుని కడనుండి మరియొక దూత వచ్చి 'రాజ భవనమందు మీకొరకు భోజనము ఏర్పరచ బడినది' అని వారికి తెలిపి మరల వారితో యిట్లనెను:-

**కుంతీ-పాండవులు ద్రుపద భవనమునందు సమ్మానితులగుట- ద్రుపదుడు పాండవుల స్వభావము పరీక్షించుట:-**

"వీరులారా! ద్రుపద మహారాజు వివాహమునకు వచ్చిన బంధువులకు విందు భోజనములు పెట్టుటకు భోజన సామగ్రి సిద్ధపరచెను. కనుక, మీ దిన కృత్యములు తీర్చుకొని భోజనార్థమై రావలెను. రాజకుమారి కృష్ణాదేవిని గూడ అక్కడనే మీరు వివాహము చేసికొనవచ్చును. జాగుచేయక మీరు రావలెను. సువర్ణ కమలములచేత సుశోభితమై రాజు లెక్కుటకు యోగ్యమైన ఈ విచిత్ర రథములు మీ కొరకు నిలిచియున్నవి. వీనిపై మీరందరు ద్రుపద మహారాజు భవనమునకు విచ్చేయుడు."

"జనమేజయా! అప్పుడు పాండవులు పురోహితుని తిరిగి పంపించి, ఆ రథము లెక్కి బయలుదేరి పోయిరి. అప్పుడు కుంతీదేవి కృష్ణాదేవి యిరువురు కలిసి యొక రథములో కూర్చొనిరి.

"జనమేజయా! యుధిష్ఠిరుడు చెప్పినమాటలను పురోహితుని ద్వారా విని ద్రుపదరాజు ఆ వీరుల స్వభావము పరీక్షించుటకు అనేక వస్తువులను అక్కడ చేర్చి యుంచెను. వివిధములైన ఫలములు, సుందర పుష్పమాలికలు, కవచములు, డాలులు, ఆసనములు, గోవులు, పగ్గములు, విత్తనములు, సేద్యమునకు సంబంధించిన ఇతర వస్తువులు, వడ్రంగులు మొదలైన కర్మకరుల వస్తువులు, క్రీడలకు సంబంధించిన వస్తువులు - ఇవి యన్నియు ద్రుపదరాజు సేకరించి పెట్టెను.

"జనమేజయా! మరియొకవైపు కవచములు, మెఱయుచున్న డాలులు, ఖడ్గములు, పెద్ద పెద్ద విచిత్రాశ్వములు, రథములు, ఉత్తమ ధనుస్సులు, విచిత్ర బాణములు, సువర్ణమయ శక్తులు, రెండంచుల కత్తులు ప్రాసములు (ఈటెలు)

భుశుండులు (అగ్ని ఆయుధములు), పరశువులు, మొదలైన వివిధ యుద్ధ సామగ్రులను, ఉత్తమ శయ్యలను, ఆసనములను, వివిధ వస్త్రములను గూడ ద్రుపదుడు అక్కడ చేర్చి యుంచెను.

"జనమేజయా! కుంతీదేవి కృష్ణాదేవిని వెంటనిడుకొని ద్రుపదుని రాణి వాసమునకు పోయెను. రాణులు ఆమెను గౌరవపూర్వకముగా ఆదరించి సత్కరించిరి.

"జనమేజయా! పాండవులనడక, ప్రవర్తనయు వారి సింహ పరాక్రమమును సూచించు చుండెను. ఆబోతు కన్నులవలె వారి కన్నులు విశాలములుగ నుండెను. మృగచర్మములు అంగవస్త్రములుగ కప్పికొని యుండిరి. వారి మూపులు బలిసి యుండెను. భుజములు సర్పరాజ శరీరములవలె లావుగా, పొడవుగా. నుండెను. అట్లున్న పాండవ పురుష సింహులను చూచి ద్రుపదుడు, అతని పుత్రులు, మంత్రులు, బంధు - మిత్రులు, సేవకులు, పరిచారకులు మొదలైనవారందరు మిక్కిలి ప్రసన్నులైరి.

"జనమేజయా! నరోత్తములైన ఆ వీరపాండవులు అక్కడ ఉంచ బడిన బహుమూల్య సింహాసనములను పాదపీఠములపై పాదములుంచి ఏమాత్రము సంకోచము, సందేహము, బెదురు, విస్మయమునులేక ఎక్కి జ్యేష్ఠానుక్రమముగ యుధిష్ఠిరాదులు వరుసగా కూర్చొనిరి.

అప్పుడు స్వచ్ఛసుందర వస్త్రములు ధరించిన దాస-దాసీజనము, వంటల వారున్ను సువర్ణ - రజత పాత్రములలో రాజులు భుజించుటకు యోగ్యములైన వివిధ సామాన్య - విశేష భోజన సామగ్రిని తెచ్చి వడ్డించిరి. పాండవులు, తమ రుచి ననుసరించి ఆ వస్తువులను భుజించి మిక్కిలి సంతోషించిరి.

"జనమేజయా! తరువాత అక్కడ ఉంచబడిన వైభవ-సుఖ సామగ్రుల నన్నింటిని వారు విడిచి, తొలుత, యుద్ధ సామగ్రులున్న చోటికే పోయిరి.

"జనమేజయా! అది యంతయు చూచి ద్రుపదుడు, అతని పుత్రులు, మంత్రులు అందరు కూడ మిక్కిలి ప్రసన్నులైరి. రాజకుమారులైన పాండవులే యని నిశ్చయించుకొనిరి.

**ద్రుపద - యుధిష్ఠిరుల సంభాషణము - వ్యాసమహాముని యాగమనము :-**

జనమేజయా ! తరువాత ద్రుపద మహారాజు యుధిష్ఠిరుని తన యొద్దకు పిలుచుకొని బ్రాహ్మణోచితమైన సత్కారము చేసి, ఆత్మీయ భావముతో అతని నిట్లడిగెను :-

నాయనా ! మీరు ఏ వర్ణమునకు చెందినవారని మా కెట్లు తెలియవలెను? మిమ్ము నేను బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య - శూద్రులలో నెవరని తలచెదను ? అథవా ? కపట బ్రాహ్మణ రూపములతో మీరు అన్ని దిక్కుల తిరుగుచున్న దేవతలని మేము తలచవలెనా ? మీరు మా కృష్ణాదేవిని బడయుటకు ఇక్కడకు ప్రేక్షకులుగా వచ్చిన దేవతలనియే తోచుచున్నది. మీ విషయమై మాకు చాల సందేహము కలుగుచున్నది. కనుక, వాస్తవము తెలుపుడు. మీ రహస్య విషయము విని మా సంశయము నశించి, మనస్సునకు సంతోషము గలిగి మీకు భాగ్యోదయము కలుగునా ? మీరు సత్యము చెప్పుడు. రాజులకు ఇష్టము[1]- పూర్తము ఈ రెంటికంటె సత్యమే అధిక మహిమ కలిగించును. కనుక మీరు అసత్యము చెప్పగూడదు. మీరు దేవతలవలె తేజస్వులుగా నున్నారు. నేను మీ వస్తుస్థితి తెలిసికొని శాస్త్రోక్త విధిచేత వివాహ శుభకార్యము కొరకు ఏర్పాట్లు చేసెదను."

* స్మృతులలో ఇష్టమును, పూర్తమును గూర్చి యిట్లు చెప్పబడినది :-
అగ్నిహోత్రం తపః సత్యం వేదానాం చాను పాలనమ్,
ఆతిథ్యం వైశ్వదేవం చ 'ఇష్ట' మిత్యభిధీయతే.
వాపీకూప తటాకాది దేవతాయతనాని చ,
అన్న ప్రదాన మారామాః 'పూర్త' మిత్యభిధీయతే."
అనగా అగ్నిహోత్రము (హోమము), తపస్సు, సత్యభాషణము, వేదముల యాజ్ఞను సర్వదా పాలించుట, అతిథిసత్కారము, బలివైశ్వదేవాది కర్మములు - ఇవి ఇష్టము లనబడును.
బావులు, నూతులు, చెరువులు మొదలైనవి త్రవ్వించుట, దేవమందిరములు నిర్మించుట, అన్నదానము చేయుట, ఉద్యానాదులు వేయించుట, ఈ మొదలైనవి 'పూర్తము' లన బడును.

ఇట్లు ద్రుపదుడనగా యుధిష్ఠిరుడు అతనికి ఇట్లు చెప్పెను.

"పాంచాలరాజా! నీవు నిరుత్సాహపడకుము. ప్రసన్నుడవై యుండవలెను. నీకోరిక నేడు నెరవేరినది. సందేహము లేదు. మాది క్షత్రియులకులము. పాండురాజు పుత్రులము. నేను కుంతికి జ్యేష్ఠపుత్రుడను. ఈ యిరువురు భీమార్జునులు. ఈ యిరువురే సమస్త రాజసమూహములో నీ పుత్రిని గెలుచుకొనిరి. ఆ యిరువురు నకుల-సహదేవులు. రాజకుమారి కృష్ణ పోయినచోటికే, మాతల్లి కుంతీదేవి లోపలికి పోయెను. ఇప్పుడు నీచింత దూరము కావలెను. నీపుత్రి కృష్ణ ఒక సరోవరము నుండి మరియొక సరోవరమునకు కమలినివలె, నీ వంశమునుండి మా వంశమునకు వచ్చెను. నేను సత్యము చెప్పు చున్నాను. నీవు మాకు పెద్దవు. ఆశ్రయభూతుడవు."

"జనమేజయా! యుధిష్ఠిరుని మాటలు విని ద్రుపదుని కన్నులనుండి హర్షాశ్రువులు రాలెను. ఆనందముచేత డగ్గుత్తుకపడి యుధిష్ఠిరునకు బదులు చెప్పజాలకపోయెను ద్రుపదుడు అతిప్రయత్నముతో హర్షావేశమును ఆపి, యుధిష్ఠిరునకు తగినయుత్తరము చెప్పి, 'మీరు వారణావతపురమునుండి యే విధముగా తప్పించుకొని పోయితిరి', అని యడుగగా, ఆ సమాచార మంతయు క్రమముగా ద్రుపదునకు యుధిష్ఠిరుడు చెప్పెను".

"జనమేజయా! యుధిష్ఠిరుడు చెప్పినసంగతివిని ద్రుపదుడు ధృతరాష్ట్రుని మిక్కిలి నిందించి! యుధిష్ఠిరుని ఆశ్వాసించి యతనితో, నేను మీ రాజ్యమును తిరిగి మీకు ఇప్పించి తీరెదను అని ప్రతిజ్ఞ చేసెను."

"జనమేజయా! తరువాత, పాండవులు కుంతీ - కృష్ణాసహితులై ద్రుపదరాజు ఏర్పరచిన విశాలభవనమునకు పోయి ద్రుపదునిచేత సమ్మానితు అగుచు నచట నుండిరి".

"జనమేజయా! యిట్లు విశ్వాసము కలిగిన తరువాత, ద్రుపదమహారాజు తన పుత్రులతో పోయి యుధిష్ఠిరునితో 'ఈ యర్జునుడు నేడు శుభదినమందు, నాపుత్రితో శాస్త్రోక్తముగా పాణిగ్రహణము చేసి, తనకులోచిత మంగళాచారములను పాలించు చుండుగాక!' యని చెప్పగా, యుధిష్ఠిరుడు ద్రుపదునితో రాజా!

నా వివాహముగూడ చేయవలసి యున్నది అని' యనగా, ద్రుపదు డతనితో, 'వీరవరా! అట్లైనయెడల నీవే విధివత్తుగా నా పుత్రితో వివాహము చేసికొనుము లేదా, నీ తమ్ములలో నెవ డైనను ఈ వివాహము చేసికొనుటకు ఆజ్ఞయిమ్ము."

అని యనగా, యధిష్ఠిరు డిట్లనెను:-

"ద్రుపదరాజా! ద్రౌపది మా యందరిపట్టపురాణి కాగలదు. మా తల్లి యాజ్ఞ యిది. నేను, భీమసేనుడున్ను ఇంతదాక 'అనివిష్టులము'[1] (అవివాహితులము) రత్నస్వరూపురాలైన నీ కన్యను అర్జునుడు గెలుచుకొనెను. రత్నమును మేమందరము పంచుకొని అనుభవించ వలెనని నిబంధనము చేసికొనినాము. అట్టి మా పూర్వ నిబంధనమును విడుచుటకు గాని, భగ్నము చేయుటకు గాని మాకు ఇష్టము లేదు. కనుక, ఈ కృష్ణ, ధర్మానుసారముగా మాయందరి రాణి కాగలదు. ఆ ప్రజ్వలితాగ్ని యెదుట (అగ్నిసాక్షి)గా మాయందరకు, క్రమముగా ఈమెతో పాణిగ్రహణము జరుగ వలెను."

ఆ మాటకు ద్రుపదు డిట్లనెను :-

"యుధిష్ఠిరా! ఒక రాజునకు చాలామంది రాణులు లేక ఒక పురుషునకు అనేక భార్యలు నుండుట లోకవిహితమై యున్నది. కాని, ఒక స్త్రీకి అనేక పురుషులు పతులగుట యెక్కడగూడ వినలేదు.[2] నీవు ధర్మజ్ఞుడవు. పవిత్రుడవు. కనుక, నీవు లోక-వేదవిరుద్ధమైన యధర్మము చేయకూడదు. నీవు కుంతీదేవి పుత్రుడవుగదా! నీ బుద్ధి యిట్లేల యయ్యెను?"

ఆ మాటకు యుధిష్ఠిరుడు ద్రుపదునితో నిట్లనెను :-

"మహారాజా! ధర్మస్వరూపము అతిసూక్ష్మమైనది. మనము దాని గతివిధిని ఎరుగ జాలము. పూర్వము ప్రచేతసుడు మొదలైనవారు నడిచిన మార్గ

1. 'నివిష్ట' శబ్దమునకు నిఘంటువులో 'వివాహితుడు' అని యర్థము గలదు. కనుక 'అనివిష్టు' డనగా అవివాహితుడు.
2. ఈ విషయములో శ్రుతివచన మిట్లున్నది :- "ఏకస్య బహ్వ్యో జాయా భవంతి, నైకస్యా బహవః సహపతయః" అనగా, ఒక పురుషునకు అనేక భార్యలుండెదరు. కాని, ఒక స్త్రీకి అనేక పతులు ఉండరు."అని అర్థము.

మునే మనము క్రమముగా ననుసరించు చున్నాము. నా నాలుక యెప్పుడుగూడ అసత్యము చెప్పదు. నా బుద్ధిగూడ ఎప్పుడున్ను అధర్మమునం దుండదు. మా తల్లి మాకు ఇట్లే చేయుడని ఆజ్ఞ యిచ్చెను. అది సరియే యని నా మనస్సునకు తోచెను. ఈ ధర్మమును తప్పుటకు వీలు కానిది. నీవు ఏమాత్రము విచారించక దీనిని పాలింపుము. దీనిని గూర్చి యే విధమైన సందేహము నీకు ఉండ గూడదు."

ఆ మాటకు ద్రుపదమహారాజు యుధిష్ఠిరునితో నిట్లనెను :-

"కౌంతేయా! నీవు కుంతీదేవి, నా పుత్రుడు ధృష్టద్యుమ్నుడు, వీరందరు కలిసి సంప్రదించుకొని, యీ విషయములో ఏమి చేయవలెనో నిశ్చయించి నాకు తెలుపుడు. మీ నిర్ణయము ప్రకారమే మనము నడుచుకొనెదము"

జనమేజయా! తరువాత, వారందరు కలిసి యీ విషయములో సంప్ర దించుకొను చుండగా, అక్కడకు వ్యాసభగవానుడు హఠాత్తుగా వచ్చెను.

**ద్రౌపదిని ఐదుగురు పెండ్లియాడు విషయములో ద్రుపద-ధృష్టద్యుమ్న-యుధిష్ఠిరులు తమ యభిప్రాయములను వ్యాసునకు చెప్పుట :-**

"జనమేజయా! వ్యాసభగవానుడు రాగానే పాండవులు, ద్రుపదరాజాదు లున్ను లేచి ఆ మహర్షికి ప్రణామము చేసి, పూజించిరి. వారి పూజలను సంతో షముతో స్వీకరించి వ్యాసమహర్షి వారి కుశలప్రశ్నములు చేసి, సువర్ణాసనముపై కూర్చొనెను.

"జనమేజయా! రెండు గడియల తరువాత ద్రుపద మహారాజు వ్యాస మహామునితో ద్రౌపది విషయమై మధుర వాక్కుతో 'భగవాన్! ఒక స్త్రీయే అనేక పురుషులకు ధర్మపత్ని ఎట్లు కాగలదు? వానిచేత సాంకర్యదోషము ఎట్లు కలుగకుండును? అన్నియు మాకు స్పష్టముగా తెలుపుము? అని యనగా వ్యాసుడు 'ద్రుపదరాజా! ఇది అతిగహనమైన విషయము గనుక నిది శాస్త్రీయమైన ఆవరణముచేత కప్పబడి యున్నది. కాబట్టి, లోక-వేదవిరుద్ధమైన యీ ధర్మము విషయమై మీరు మీ-మీ యభిప్రాయములను తెలుపుడు, అని యనగా, అప్పుడు వారు క్రమముగా ఒక్కొక్కరు నిట్లు చెప్పిరి:-

ద్రుపదుడు:- 'మహర్షీ! ఈ ధర్మము లోకమునకు వేదమునకున్ను విరుద్ధమైనది. కనుక, నాయభిప్రాయములో ఇది యధర్మమే యగును. అనేక పురుషునకు ఒకతెయే పత్ని యగుట వ్యవహారములో ఎక్కడగూడ లేదు. ప్రాచీనులైన మహాత్ములు గూడ ఇట్టి ధర్మము ఆచరించ లేదు. విద్వాంసులు ఎట్టి పరిస్థితిలోను అధర్మాచరణము చేయ గూడదు. కనుక, ధర్మవిరుద్ధమైన ఈ యాచరణమును నేను చేయగోరను. ఈ కార్యము ధర్మసంగతమనుటలో నాకు చాల సందేహము కలదు.

ధృష్టద్యుమ్నుడు:- 'మునీంద్రా నీవు బ్రాహ్మణుడవు, తపోధనుడవు కనుక, నీవేచెప్పుము. సత్ప్రవర్తకుడైన జేష్ఠభ్రాత తన తమ్ముని భార్యతో ఎట్లు సంగమము చేయగలడు? ధర్మస్వరూపము అతిసూక్ష్మ మగుటచేత మేము ధర్మగతిని ఎరుగ జాలకున్నాము. కనుక, ఈ కార్యము అధర్మమా? అని నిశ్చయించుట మావంటి వారికి అసాధ్యము. రాజకుమారి కృష్ణ ఐదుగురు పురుషులకు ధర్మపత్ని యగుటకు మేము ఏ విధముగ గూడ సమ్మతింపజాల కున్నాము.'

యుధిష్ఠిరుడు :- 'మహాత్మా! నా నాలుక యెప్పుడుగూడ అసత్యము చెప్పదు. నా బుద్ధిగూడ అధర్మమార్గమందు ప్రవర్తించదు. ఈ వివాహము ధర్మ సమ్మతమే యని నా మనస్సునకు తోచుచున్నది. కనుక, నిది ఏ విధముగ గూడ అధర్మము కాదు. పురాణములలో గూడ గౌతము గోత్ర కన్యకయైన 'జటిల' యను ధర్మాత్మురాలు ఏడుగురు ఋషులతో వివాహము చేసికొనినట్లు చెప్పబడియున్నది. ఇట్లే 'కండు' మహాముని పుత్రియైన వార్క్షి యనునామె తపస్సుచేత పవిత్రాంతఃకరణులైన పదుగురు ప్రచేతసులతో వివాహము చేసి కొనెను. ఆ పదుగురు సోదరులు ఏకనాథేయులు మహాత్మా! గురుజనాజ్ఞ నెర వేర్చుట ధర్మసంగత మనికదా! చెప్పబడెను. సమస్త గురువులలో మాతృదేవి పరమగురువు అని తలచబడెను కదా! మా తల్లిగూడ 'మీ రందరు భిక్షవలె ఈ కన్యకను అనుభవింపుడు యని చెప్పెను. కనుక, మా యైదుగురితో జరుగ బోవు ఈమె వివాహము పరమధర్మమని తలచుచున్నాను.

కుంతీ :- 'మహామునీ! ధర్మాచరణము చేయు యుధిష్ఠిరుడు చెప్పెడి మాటయే సరియైనది: నేను ద్రౌపదితో ఈ యైదుగురు సోదరుల వివాహము

జరుగవలె నని ఆజ్ఞ యిచ్చితిని కనుక, అసత్యమునకు నేను చాల భయపడెదను. ఈ యసత్య పాపమునుండి నేనెట్లు రక్షింప బడుదునో చెప్పుము.

వ్యాసుడు:- మంగళకరురాలా! నీవు అసత్యమునుండి రక్షింప బడ గలవు. ఇది పాండవుల విషయములో సనాతనధర్మము. కుంతీదేవితో నిట్లు చెప్పి వ్యాసుడు ద్రుపదునితో నిట్లనెను:-

'పాంచాలరాజా! ఈ వివాహవిషయమై ఒకరహస్యము కలదు, దానిని నేను అందరి సమక్షములో చెప్పను. నీవు ఒక్కడవే ఏకాంతమునందు నాతో వచ్చి వినుము. ఏ విధముగ, ఏ కారణముచేత ఇది సనాతనధర్మము నకు అనుకూల మని చెప్పబడెనో, యుధిష్ఠిరుడు ఎట్లు ఇది ధర్మానుకూల మని ప్రతిపాదించెనో ఆ విషయమై విచారించగా ఈ వివాహము ధర్మసమ్మత మని సిద్ధమగుచున్నది. ఇందులో సందేహము లేదు.

"జనమేజయా! తరువాత వ్యాసభగవానుడు ద్రుపదునిచేయి పట్టుకొని రాజభవనములోపలికి పోయెను. పాండవులు, కుంతీదేవి, ధృష్టద్యుమ్నుడు వీరందరు వ్యాస-ద్రుపదులకొరకు ఎదురుచూచుచు అక్కడనే కూర్చొని యుండిరి. తరువాత వ్యాసుడు 'ఒకస్త్రీ అనేక పురుషులతో పెండ్లియాడుట ధర్మసమ్మతము' అను విషయములో ద్రుపదునకు ఈ కథ చెప్పెను:-

## పంచేంద్రోపాఖ్యానము*

ద్రుపదమహారాజా! పూర్వము నాలాయని యగు "ఇంద్రసేన" అను పేరు గల పరమ పతివ్రత 'మౌద్గల్యు' డనుమహామునికి భార్యగా నుండెను.

"పూర్వజన్మ కర్మవిశేషమువలన మౌద్గల్యమహాముని కుష్ఠవ్యాధిచేత బాధింప బడుచు చర్మము, అస్థులుమాత్రము మిగిలిన శరీరము కలవాడై

* ఈ కథ గోరఖ్‌పూర్ ప్రతి సంస్కృత మహాభారతములో లేదు. కాని శకము 1828లో ముద్రితమైన నిర్ణయసాగర్‌ప్రతిలో నీ కథ యున్నది. ఇది నన్నయభట్టారకుని తెలుగుభారతము నుండి తీసికొని యిక్కడ వ్రాయబడినది.

యుండెను. ఆ మహాముని వయోవృద్ధుడై, శరీరము ముడుతలు పడి, వెండ్రుకలు నెరసి నోరు దుర్గంధము కలవాడుగా నుండెను. అతిదుఃఖమయ మైన జీవనము గడుపుచున్న యతనికి మిక్కిలి కోపముగూడ నుండెను. నఖములు, చర్మమున్ను శిథిలము లై యుండిన శరీరము గల ఆపతిని ఇంద్రసేన పరమభక్తితో ఆరాధించుచు నుండెను.

"ఒకనాడు పతియెంగిలి ఆమె భుజించు చుండగా అన్నములో పతి వ్రేలు తెగి పడి యుండుట చూచి, దానిని తీసి ప్రక్కకు పెట్టి ఆమె ఏమాత్రము అసహ్యపడక ఆ యుచ్ఛిష్టాన్నము ఇష్టముతో భుజించు చుండెను.

"అప్పుడు పతియైన మౌద్గల్యుడు పరమ పతివ్రతయైన ఆమెను జూచి, ఆమెకు గల పతిభక్తిని చాలమెచ్చుకొని, ఆమెయెడల మిక్కిలి ప్రసన్నుడై నీ యిష్టమైన వరము కోరుకొనుము ఇచ్చెదను అని ఆమెతో ననెను.

"అప్పుడామె అతనితో ఇట్లనెను :-

"మునీంద్రా! నాకు కామోపభోగములందు మిక్కిలి యిచ్ఛ గలదు. కనుక, నీవు నీ తపశక్తిచేత కామరూపము ధరించి, మిక్కిలి అసహ్యకరమైన యీ కుష్ఠరూపమును విడిచి మనోహరమైన ఆకారముతో ఐదువిధములైన విడి విడి శరీరములను ధరించి, నాతో రమించి, కామోపభోగములందు నున్ను తృప్తి పరపుము.

"ఆ మాటలు విని ఆ మహాముని ఆమెను ఇష్టమైనవిధముగా ఐదుదేహములను ధరించి మర్త్యలోకమునందు, దేవలోకమునందున్ను సంచరించుచు బ్రహ్మఋషులచేత, దేవఋషులచేతను, పూజింప బడెను.

అట్లు అతడు ఆ సుందర శరీరములతో సూర్యరథము నెక్కి పోయి ఆకాశగంగా జలములందు స్నానము చేసి చంద్రకిరణములయందు నివసించి, మేరు పర్వతమునందు, కైలాస పర్వతమునందున్ను యథేచ్ఛగా ఆమెతో క్రీడించెను.

ఈ విధముగా మౌద్గల్య మహాముని అనేక సహస్ర సంవత్సరములు ఇంద్రసేనతో ఉపభోగించి తృప్తి చెందెను.

"తరువాత ఆ మహాముని ఆమెను విడిచిపెట్టి ఘోరమైన తపస్సు చేసి, బ్రహ్మమయయుడై, బ్రహ్మలోకమునుకు పోయెను.

"తరువాత ఇంద్రసేన కామోపభోగములందు తృప్తిదీరక అసంతృప్తితోనే కొంత కాలమునకు మరణించి. కాశిరాజు అసురాజర్షికి బిడ్డగా పుట్టెను.

"ద్రుపదరాజా! తండ్రి యింటిలో ఆమె పెరుగుచు కన్యగానే చాలకాలము ఉండి, తన దౌర్భాగ్యామునకు దుఃఖించుచు, పతిని గోరి పరమశివు నుద్దేశించి ఉగ్రముగా తపస్సు చేయు చుండెను.

"అట్లు తపస్సు చేయుచున్న కాశిరాజపుత్రికడకు యమ-వాయు-ఇంద్ర-అశ్వినీదేవతలు ఆమెయెడల ప్రీతితో వేరువేరుగా వచ్చి తమ తమ దేహాంశముల నుండి ఆమె పునర్జన్మ మందు ఆమెను భార్యగా కోరిరి.

"ఆమెగూడ కొంతకాలము జలము, వాయువు మాత్రము ఆహారముగా తీసికొని, కొంతకాలము నిరాహారముగా, కొంతకాలము ఒంటికాలుమీద నిలిచి, మరికొంతకాలము పంచాగ్ని (నాలుగువైపుల అగ్నులు, తలపైన సూర్యుడు) మధ్యమునం దుండియు మిక్కిలి ఘోరమైన తపస్సు చేసెను. తరువాత పరమేశ్వరుడు ప్రసన్నుడై ఆమెకడకు వచ్చి వరము వేడుకొమ్మనెను.

అప్పుడా కన్యక "నాకు పతిదానము చేయుము" అని మిక్కిలి ఆశతో ఐదుమారులు ఆ మాటనే అడుగుచు వేడుకొనెను.

అప్పుడు పరమేశ్వరుడు ఆమె యెడల కరుణించి "పుత్రీ! నీకు తరువాత జన్మమునందు ఐదుగురు పతులు అయ్యెదరు" అని వరము ప్రసాదించి దీవించెను.

అప్పుడు కాశిరాజపుత్రి పరమేశ్వరునితో విట్లనెను: "భగవన్! సతికి ఒక్కడే పతి యుండును. కాని, ప్రపంచమం దెచ్చట నయినను ఒక సతికి అనేకులు పతులు ఉండుట విని యున్నామా? లోకేశ్వరా! లోకవిరుద్ధమైన యిట్టి వరము నాకు ఇష్టము లేదు."

ఆ మాటకు ఆమెతో ఆ భగవాను డిట్లనెను:- "బిడ్డా! నా మాటచేత పునర్జన్మమునందు నీకు అయిదుగురు పతు లుండెదరు. అయినను నీ పాతివ్రత్య ధర్మము చెడదు. కనుక, నీయందు దయతో నీకు ఈ వర మిచ్చితిని."

ద్రుపదరాజా! అట్లు పరమేశ్వరుడు చెప్పిన మాటలు విని, కాశిరాజపుత్రి మరల అతనిని ఈ విధముగా కోరెను:-

"మహానుభావా! ఒకవేళ నాకు నీ వర ప్రభావమువలన ఉత్తరజన్మము నందు అయిదుగురు పతు లుండినయెడల ఆ అయిదుగురితోను సంగమము చేయునపుడు నాకు కౌమారవయస్సు (యౌవనావస్థ) పతిశుశ్రూష, కామభోగేచ్ఛ సౌభాగ్యము ఇవి యన్నియు వేరువేరుగా నాకు అనుగ్రహింప వలెను."

ఆమె కోరిన విధముగా పరమేశ్వరుడు ఆమెకు వరము లిచ్చి ఆమెతో నిట్లనెను:-

"పుత్రీ! నీవు గంగా తీరమునకు పోయి అచటనున్న ఇంద్రుని నా యొద్దకు తోడ్కొనిరమ్ము".

తరువాత ఆమె పరమేశ్వరునకు ప్రదక్షిణ నమస్కారములు చేసి,పరమేశ్వరుని యాజ్ఞప్రకారము గంగాతీరమునకు పోయి అక్కడ ఇంద్రునికొరకు వేచి యుండెను.

**వ్యాసుడు ద్రుపదునకు ద్రౌపదీ పాండవుల పూర్వజన్మకథ చెప్పి వారికి దివ్యదృష్టి యిచ్చి పూర్వజన్మ రూపములను చూపుట :-**

పాంచాలరాజా! పూర్వము నైమిషా (శా) రణ్యమునందు దేవతలు ఒక యజ్ఞము చేయుచుండిరి. అప్పుడు అక్కడ సూర్యపుత్రుడైన యముడు *శామిత్రము(యజ్ఞము) చేయుచుండెను. అప్పుడు యముడు యజ్ఞదీక్షలోనుండెను. కనుక, మానవుల మృత్యుకార్యమును ఆపియుంచెను. మృత్యుసమయము దాటుట చేత ప్రజలు అమరులై దినదినము వృద్ధి చెందుచుండిరి. మెల్లమెల్లగా ప్రజా సంఖ్య పెరుగుచు వచ్చెను.

చంద్ర - ఇంద్ర వరుణ - కుబేర - సాధ్యగణ - రుద్రగణ - వసుగణములు - అశ్వినీకుమారు లిరువురు, ఇతరదేవతలున్ను కలిసి సృష్టికర్తయైన

* పశుహోమము చేయు యజ్ఞము. (శమితుః ఇదం + అణ్ - శామిత్రమ్ పశు హింస - పశు బంధనము - హవిస్సువండు. పాత్రము గూడ శామిత్రము.

బ్రహ్మదేవునికడకు పోయి, ఆ దేవునితో, భగవన్! మనుష్యుల సంఖ్య చాల పెరుగుచున్నది. దీనిచేత మాకు మహాభయము కలుగుచున్నది. అందువలన మేము కలతచెంది, సుఖము పొందగోరి నీ శరణుజొచ్చితిమి అని యనిరి.

"ద్రుపదరాజా! ఆ మాటకు బ్రహ్మదేవుడు" మీరు అందరు అమరులు. మరణధర్మముగల మనుష్యులవలన ఎప్పుడుగూడ మీరు భయపడ గూడదు. కనుక, మీకిప్పుడు భయమెందుకు." అని యనగా, దేవతలు ఆయనతో 'మహాత్మా! మరణధర్ములైన మనుష్యులు ఇప్పుడు అమరులైనారు. వారికి మాకున్న బేధము లేకుండ నైనది.అందుచేతనే, మాకు మిక్కిలి భయము కలుగుచున్నది. మనుష్యులకంటె మాకు విశిష్టత యుండవలెను. కనుక, ఇక్కడకు వచ్చితిమి' అని యనగా బ్రహ్మదేవుడు వారితో నిట్లనెను :-

'దేవతలారా! యమరాజు యజ్ఞ కార్యమునందు నిమగ్నుడై యున్నాడు. కనుక, మనుష్యులు చావకున్నారు. యముడు యజ్ఞ సమాప్తి చేసిన తరువాత మనుష్య మరణకార్యమునకు పూనుకొనగలడు. మీయొక్క బలప్రభావముచేత యమరాజు శరీరము యజ్ఞకార్యమునుండి వేరుపడి తన కార్యమునందు ప్రయోగింపబడినప్పుడు ఆ శరీరమే మనుష్యుల వినాశకాలము వచ్చినప్పుడు వారి మృత్యువునకు కారణమగును. అప్పుడు మనుష్యులకు మృత్యువునుండి తప్పించుకొను నంతటిశక్తి యుండదు."

"ద్రుపద మహారాజా! అట్లు బ్రహ్మదేవుడు చెప్పిన తరువాత దేవతలు మరల తమవారు యజ్ఞము చేయుచున్న చోటికి పోయిరి.

"రాజా! యిట్లుండగా నొకనాడు దేవతలందరు గంగానదిలో స్నానము చేయుటకు పోయి గంగాతీరమునందు కూర్చొని యుండగా వారికి గంగా ప్రవాహములో కొట్టుకొని పోవుచున్న ఒక సువర్ణ కమలము కనబడెను. దానిని చూచి ఆ దేవత లందరు ఆశ్చర్య చకితు లైరి. వారిలో ప్రధానుడు, శూరుడు నైన యింద్రుడు ఆ కమలము పుట్టుకను తెలిసికొనుట కొరకు గంగ పుట్టిన చోటికి పోయెను.

గంగ అవిచ్ఛిన్నముగా ప్రవహించు చున్న ఆ 'గంగోత్తరి' కడకు పోయి ఇంద్రుడు అక్కడ అగ్నివలె తేజరిల్లు చున్న యొక యువతిని చూచెను. ఆమె యక్కడకు జలము కొరకువచ్చి గంగాప్రవాహధారలో ప్రవేశించి ఏడ్చుచు నిలిచి యుండెను. ఆమె కన్నీటి చుక్కలు జలములో పడగనే ఒక్కొక్క అశ్రుబిందువు ఒక్కొక్క సువర్ణ కమలముగా మారు చుండెను.

ఈ యద్భుత దృశ్యమును చూచి యింద్రు డప్పుడు ఆ యువతికడకు పోయి యామెతో నిట్లనెను :-

"మంగళకరురాలా! నీ వెవతెవు? ఎందుకు దుఃఖించు చున్నావు? వాస్తవము తెలియ గోరు చున్నాను. చెప్పుము!"

ఇట్లు అడుగగా ఆ యువతి 'దేవేంద్రా! నే నొక భాగ్యహీనురాలనైన యువతిని. నే నెవతెను? ఎందుకు ఏడ్చుచున్నాను?' అను విషయము లన్నియు నీకు తెలియగలవు. నీవు నా వెనుక రమ్ము. నేను ముందు పోవు చున్నాను. అక్కడకు పోయిన తరువాత 'నేను ఎందుకు ఏడ్చుచున్నాను? అను విషయము నీకే తెలియగలదు' అని చెప్పెను.

"ద్రుపదరాజా! యిట్లు చెప్పి ఆ యువతి ముందుకు పోవు చుండగా, ఆమె వెనుకనే యింద్రుడు పోయెను. హిమాలయ శిఖరము చేరిన తరువాత ఆ సమీపమునందే యున్న ఒక పరమసుందర తరుణపురుషుని ఇంద్రుడు చూచెను, ఆ పురుషుడు •సిద్ధాసనమునందు కూర్చొని యుండెను. ఆయనతో ఒక యువతి గూడ నుండెను. ఆ యువతితో అతడు క్రీడావినోదములు చేయుచుండుట యింద్రుడు చూచెను.

• యోగాభ్యాసమునందొక విశిష్టము. స్థిరమునైన ఆసనముద్ర. యోగి తన యెడమ మడమను శరీరము (పిరుదు) క్రింద పెట్టుకొని కుడి మడమను ఎడమ మడమముందు ఉంచుకొని, తన దృష్టిని కనుబొమ్మల నడుమ నిలిపి, 'ఓమ్' అను ఓంకారమును యోగమునందు ధ్యానించుట 'సిద్ధాసనము' అన బడును.

"ద్రుపదరాజా! ఆ దివ్య పురుషుడు తన సర్వేంద్రియములను క్రీడలో పూర్తిగా నిమగ్నములు చేసియుండెను. గనుక, అతని దృష్టి ఇటు - నటు పారకుండెను. ఆ దివ్య పురుషు డట్లు తనపట్ల అజాగ్రత్తతో నుండుట చూచి యింద్రుడు కుపితుడై, అతనితో, మహానుభావా! ఈ సమస్త జగత్తు నా యధికారములో నా యాజ్ఞకు అధీనమైయున్నది. జగత్తునకు నేనే ఈశ్వరుడను' అని యనెను.

"పాంచాల రాజా! అట్లు ఇంద్రుడు క్రోధభరితుడై యుండుట చూచి ఆ దివ్య పురుషుడు నవ్వుచు మెల్లగా కనులు పైకెత్తి యింద్రుని చూచెను. అతని దృష్టి పడగనే యింద్రుని శరీరము స్తంభించి (బిగుసుకొనిపోయి) స్థాణువువలె నిశ్చేష్టమయ్యెను.

"రాజా! ఆ దివ్య పురుషుని క్రీడ సమాప్తమైనప్పుడు అతడు యేడ్చుచున్న ఆ యువతితో, 'నీవు' ఈ యింద్రుని ఇక్కడనే, నే నున్న చోటకు తోడుకుని రమ్ము. దానిచేత ఇతనిలో దురభిమానము ప్రవేశించకుండును' అని చెప్పెను.

"ద్రుపదరాజా! తరువాత, ఆ స్త్రీ ఇంద్రుని శరీరమును స్పృశించిన వెంటనే అతనియవయవము లన్నియు శిథిలములై యతడు నేలపై కూలబడెను. అప్పుడు ఉగ్రతేజస్సు గల *రుద్రభగవానుడు ఇంద్రునితో నిట్లనెను".

"ఇంద్రా! ఇక నెప్పుడు గూడ నీవు ఇట్లు గర్వపడకుము. నీకు అనంత బలపరాక్రమములు కలవు. కనుక, ఈ గుహాద్వారముపై నున్న యీ మహా పర్వత రాజమును తొలగించి ఈ గుహలోపలికి దూరిపొమ్ము. అక్కడ సూర్య సమాన తేజశ్శాలురైన నీ వంటి యింద్రు లున్నారు.

"ద్రుపదరాజా! ఆ మాట విని యింద్రుడు ఆ పర్వత గుహద్వారమును తెఱచి దానిలో తన తేజస్సుతో సమానమైన తేజస్సు గల మరి నలుగురు ఇంద్రులుండుట చూచి మిక్కిలి దుఃఖితుడై, నేను గూడ వీరివలెనే యీ దుర్దశలో పడుదునా యేమిః" అని చింతింప జొచ్చెను.

* ఈ భగవంతుడే 'దివ్య పురుషుడు' అని చెప్పబడెను.

"రాజా! అప్పుడు పర్వతముపై శయనించుచున్న మహాదేవుడు కన్నులు తెఱచి కుపితుడై ఇంద్రునితో 'ఇంద్రా! నీవు మూర్ఖత్వమువలన తొలుత నా యవమానము చేసితివి, కనుక, ఇప్పు డీ గుహలో ప్రవేశింపుము' అని చెప్పెను.

ఇట్లు రుద్రభగవానుడు చెప్పిన తరువాత తనకు పరాభవము కలుగు నను భయముతో మిక్కిలి దుఃఖితుడై అంగములు శిథిలములు కాగా, గాలికి కదలు చున్న రావియాకు వలె గడ-గడ వడక జొచ్చెను.

ద్రుపదరాజా : శంకర భగవానుడు, గుహ ప్రవేశము చేయుమని ఇంద్రునకు హఠాత్తుగా ఆజ్ఞ ఈయగనే అతడు భయకంపితు డగుచు అంజలి బద్ధుడై ఆ భగవంతునితో, 'జగత్కర్తా! నీవే సర్వ జగత్తును సృజించు ఆది పురుషుడవు' అని యనగా, ఆ భగవంతుడు నవ్వి, 'ఇంద్రా! నీ వంటి స్వభావము కలవారికి ఇక్కడ అనుగ్రహము లభించదు. వీరందరు గూడ నీ వలెనే యుండిరి. కనుక, నీవు గూడ ఈ గుహలో దూరి శయనించి యుండుము. అక్కడ నీవు ఈ విధముగానే, వీరితో నుండి, మీ రందరు భావికాలములో మనుష్య యోనిలో ప్రవేశింప వలసి యుండును.

"ఆ జన్మమునందు మీరు అనేక దుస్సాధ్య కర్మలు చేసి, అనేకులను సంహరించి, మరల మీ శుభకర్మల ద్వారా, పూర్వము మీరు సంపాదించు కొనినది పుణ్యాత్ములకు నివాస యోగ్య మైనదియు నగునయింద్రలోకమునకు పోవ గలరు. ఇప్పుడు నేను చెప్పిన దంతయు నీవు చేయ వలెను. ఇదియే కాక ఇంకను వివిధ ప్రయోజనములు గల యనేక కార్యములు గూడ మీరు చేసె దరు."

"ద్రుపదరాజా! ఆ గుహలో నంతకు పూర్వ మున్న నలుగురింద్రులు ఆ భగవంతునితో నిట్లనిరి" :-

"భగవన్! నీ యాజ్ఞానుసారము మేము దేవ లోకమునుండి మనుష్య లోకమునకు పోయెదము. అక్కడ ఇతరత్ర దుర్లభమైన మోక్ష సాధనము గూడ మాకు సులభము కాగలదు. కాని, మమ్ము భూలోకమందు మా మాతృగర్భములో యమ - వాయు - ఇంద్ర - అశ్వినీ దేవతలు ఈ యైదుగురు దేవతలే స్థాపించ

వలెను. తరువాత మేము దివ్యాస్త్రముల చేత, మనుష్య వీరులతో యుద్ధము చేసి, మరల ఇంద్రలోకమునకు పోవ గలము."

"ద్రుపదా! అక్కడ పూర్వమున్న యింద్రులు చెప్పిన యా మాటలు విని, ఇంద్రుడు మరల మహాదేవునితో నిట్లనెను" :-

"భగవన్! నేను నా వీర్యము చేత నా యంశభూతు డైన పురుషునే, దేవకార్యము కొరకు సమర్పించెదను. అతడు, ఈ ముగ్గురితో నైదవవాడుగా నుండును. అతనిని నేను స్వయముగా కనెదను. ఆ యైదుగురు 'విశ్వభుక్ - భూతధామన్-శిబి-శాంతి-తేజస్విన్' అను నామములు గలవారు.''

"ద్రుపదరాజా! పరమేశ్వరుడు ఆ యైదుగురున్ను కోరినవరము లిచ్చెను. దానిచేత వారు తమ సాధుస్వభావముచేత భగవంతుని సమక్షమునందు ప్రకటితు లైరి. అప్పుడే ఆ సుందర యువతినిగూడ, మనుష్య లోకమునందు ఆ యైదు గురకు పత్నిగా పరమేశ్వరుడు నిశ్చయించెను. ఆమె స్వర్గలోక లక్ష్మి.

"రాజా! తరువాత, పరమేశ్వరుడు వారితోపాటు శ్రీమన్నారాయణ మూర్తి కడకు పోయి, ఆ విషయము లా దేవునికి విన్నవించెను. ఆ భగవంతుడు గూడ, ఆ విషయముల కన్నింటికిని తనయాజ్ఞ యిచ్చెను. తరువాత వా రందరు భూమండలమునందు జన్మించిరి. అప్పుడు భగవంతుడైన శ్రీమన్నారాయణ మూర్తి, తన తలనుండి రెండు వెంట్రుకలను తీసెను. వానిలో నొకటి తెల్లగా, రెండెవది నల్లగాను నుండెను.

''ద్రుపదరాజా! ఆ రెండు కేశములు యదువంశ స్త్రీలైన 'దేవకి - రోహిణి' యను నిరివురిలో ప్రవేశించెను. రోహిణిదేవినుండి, శ్రీమన్నారాయణుని తెల్లవెంట్రుక స్వరూపముతో బలరాముడు తెల్లగా పుట్టెను రెండవదైన నల్ల వెంట్రుక దేవకి గర్భమునందు ప్రవేశించి నల్లని శ్రీకృష్ణభగవానుని రూపములో పుట్టెను.*

* భగవంతుడైన శ్రీమన్నారాయణుడు సచ్చిదానందఘనుడు. ఆయనయొక్క నామ - రూప - లీలా ధామ (స్థానము - తేజస్సు)ము లన్నియు చిన్మ యములు. (జ్ఞానస్వరూపములు) ఆ భగవంతుడు తనశ్వేత-నీలకేశములు ద్వారములు (కారణములు)గా మాత్రమే చేసికొని, తానే సంపూర్ణ రూపములో నిచట కృష్ణబలరాములుగా నవతరించెను.

"ద్రుపదరాజా! ఉత్తరదిశ యందలి హిమగిరి కందరమునందు మొదట ఇంద్రస్వరూపములుగా బంధింప బడియున్న ఆ నలుగురే యిక్కడ పాండవుల రూపములో నున్నారు. ఇంద్రాంశభూత పురుషుడైన పాండుకుమారుడే యీ యర్జును డని తెలిసికొనుము."

"ద్రుపదరాజా! యీ విధముగా పాండవులు అవతరించిరి. వీరు పూర్వము ఇంద్రులుగానే యుండిరి. దివ్యరూపము గల యీ ద్రౌపది, ఆ స్వర్గ లక్ష్మియే. ఈమె పూర్వము నుండియే ఈ యైదుగురకు పత్నిగా నియమింప బడి యున్నది. ఈ కార్యమునందు దేవతలసమూహ యోగము లేకుండినయెడల, నీవు చేసిన యీ యజ్ఞకర్మద్వారా, యజ్ఞవేదినుండి యిటువంటి దివ్యస్త్రీ యెట్లు అవతరించ గలుగు చుండెను? ఈమెరూపము చంద్రసూర్యులవలె ప్రకాశించు చున్నది. ఈ శరీరసుగంధము ఒకకోసు దూరమువరకు ప్రసరించు చుండును గదా!

"రాజా! నేను నీకు సంతోషముతో యద్భుతవరముగా దివ్యదృష్టి యిచ్చె దను. పాండవుల పూర్వజన్మ దివ్యశరీరములను చూడుము" అని చెప్పి వ్యాస మహాముని తన తపఃప్రభావముచేత ద్రుపదునకు దివ్యదృష్టి యిచ్చెను. దానిచేత నతడు పాండవుల పూర్వశరీరములను వాస్తవరూపముగా చూచెను. వారు పూర్వ జన్మమందు దివ్యశరీరములతో సువర్ణకిరీట - హారములతో శోభిల్లు చుండిరి. వారి కాంతి ఇంద్రాగ్ని చంద్ర సూర్యుల కాంతివలె ప్రకాశించు చుండెను. సర్వావయములందు వారు సర్వవిధ దివ్యాలంకారములతో శోభిల్లుచు యువావస్థలో అత్యంతమనోహరులుగా నుండిరి. విశాలవక్షఃస్థలములు, తాళవృక్ష సమానదీర్ఘ శరీరములున్ను గలిగి యుండిరి. పూర్వజన్మలో ఈ రూపములలో నున్న పాండవులను ద్రుపదమహారాజు చూచెను.

వారు దివ్యనిర్మల వస్త్రములు, ఉత్తమసుగంధములు, సుందరమాలిక లున్ను ధరించి మిక్కిలి శోభితులై, సాక్షాత్తు త్రినేత్రుడైనశంకరుడు, వసు గణము, రుద్రగణము, అథవా ఆదిత్యగణములు - వీరి తేజస్సు కంటె నధిక తేజస్సు గలిగి సర్వగుణసంపన్నులుగా కనపడు చుండిరి."

"జనమేజయా! పంచపాండవుల నప్పుడు ద్రుపదుడు ఇంద్రుల రూపములలో చూచి మిక్కిలి సంతోషముతో నాశ్చర్యచకితు డయ్యెను. ఆరాజు అప్పుడు, తన పుత్రినిగూడ సర్వశ్రేష్ఠరూప సౌంధర్యములలో సాక్షాత్తు చంద్రాగ్నులవలె ప్రకాశించు చున్నదివ్య స్త్రీరూపములో చూచెను. వెంటనే యారాజు, 'ద్రౌపది రూప-తేజో-యశస్సులదృష్ట్యా పాండవులకు ధర్మపత్నిగా నగుటకు అన్నివిధములుగ యోగ్యురాలని తలచెను. అతడు మిక్కిలి హర్షము చెందెను. ఈ మహాశ్చర్యమును చూచి ద్రుపదుడప్పుడు వ్యాసభగవానునకు పాదవందనము చేసి ఆయనతో భగవన్! నీలో ఇటువంటియద్భుతశక్తి యుండుట ఆశ్చర్య మేమియు కాదు' అని యనగా, వ్యాసుడు సంతసించి ద్రుపదునితో నిట్లనెను:-

"రాజా! నీపుత్రియొక్క మరియొక జన్మవృత్తాంతము చెప్పెద వినుము:-

ఒకతపోవనమునందు ఒక మహాత్ముడైన మునీశ్వరునకు ఒక పుత్రి యుండెను. ఆమె, పతివ్రతగా రూపవతిగా నున్నప్పటికిన్నీ, ఆమెకు యోగ్యుడైనపతి లభించకుండెను. అప్పు డామె కఠోరతపస్సు చేసి శంకరభగవానుని సంతోషపరచగా నా భగవంతుడు ప్రత్యక్షమై యా కన్యకతో నీవు వరము కోరుకొనుము అని యనగా నామె నాకు సర్వగుణసంపన్నుడైన పతి కావలెను' అని మాటిమాటికి ననెను. అప్పుడాదేవుడు ప్రసన్నుడై యామెతో నీకు ఐదుగురు పతులు కాగలరు. అని వరమిచ్చెను.

"ద్రుపదరాజా! పరమేశ్వరుడు ప్రాసాదించిన వరము విని, ఆ కన్యక ఆ మాహాదేవుని ప్రసన్నుని జేయుచు, మరల ఆయనతో, 'భగవన్! నేను నీ నుండి గుణవంతుడైన ఒకపతినే యిమ్మని వరము కోరుచున్నాను' అని యనగా ఆదేవదేవుడు మిక్కిలి సంతోషించి యామెతో, భద్రే! నీవు 'పతినిమ్ము' అని నన్ను ఐదు పర్యాయములు వేడితివి, కనుక, నేను పూర్వము చెప్పినట్లే నీకు అగును. నీకు మంగళ మగుగాక! కాని, నీకు ఉత్తరజన్మములో ఈ వరము సిద్ధించును' అని చెప్పెను.

"ద్రుపదరాజా! ఆ మునికన్యయే యిప్పుడు నీ పుత్రిగా జన్మించెను. కనుక, పృషతవంశీయురాలైన యీ పతివ్రతాకన్య కృష్ణాదేవి పూర్వము నుండియే యైదుగురు పతులకు పత్నిగా నియమింపబడి యున్నది. ఈ స్వర్గలోక

లక్ష్మి పాండవులకొరకు నీ యజ్ఞమునందు ఉద్భవించెను. ఈమె మిక్కిలి ఘోరతపస్సు చేసి, యీ జన్మమునందు నీ పుత్రియగునట్టి భాగ్యమును పొందెను. దేవసేవితురాలైన యీ సుందర దేవియే తన కర్మచేత నైదుగురు పురుషులకు తానొకతెయే పత్నిగా నియమింపబడెను. బ్రహ్మదేవుడే యీమెను దేవస్వరూపులైన పాండవులకు పత్నియగుటకు నిర్మించెను.

* "ద్రుపదరాజా! మరియొక పూర్వవృత్తాంతము చెప్పెద వినుము :-

"రాజా! పూర్వము 'నితంతుడు అను రాజర్షి కొడుకులు అనంత బల పరాక్రమ సంపన్నులు సాల్వేయ - శూరసేన - శ్రుతసేన - బిందుసార అతి సార' నామములు గలవారు ఐదుగురున్ను పరస్పర స్నేహముతో నుండిరి. ఆ యైదుగురు సోదరులు పెద్దవారైన తరువాత 'ఔశనరు దేశ రాజకన్యకయగు 'అజిత' యను నామెను స్వయంవరమందు పొంది పెండ్లి చేసికొనిరి. ఆ యజిత యందు ఐదుగురు 'నైతంతువులు, (నితంతువుకొడుకులు) ఐదుగురు పుత్రులను వేరు వేరుగా కనిరి.

"రాజా! ఇట్టి పూర్వచరిత్ర లనేకములు గలవు. కనుక, ఈ విషయము లన్నియు వినిన తరువాత నీకు ఏది మంచిదని తోచునో అదియే చేయుము.

జనమేజయా! వ్యాసభగవానుని మాటలు విని ద్రుపదరాజతనితో నిట్లనెను :-

**ద్రౌపదికి పంచపాండవులతో వివాహము :**

"మహర్షీ! పూర్వము నీ మాటలు విననందువలననే కృష్ణకు యోగ్యుడైన ఒక పతితోనే వివాహము చేయుటకు ప్రయత్నించి యుంటిని. కాని, బ్రహ్మదేవుని విధానమును తప్పించుకొనుట యసంభవము కనుక, పూర్వనిశ్చయము ప్రకారమే చేయుట మంచిది. విధిగ్రాత మార్చబడ జాలదుగదా! ఇక్కడ మన ప్రయత్నము ఏమియు కాజాలదు. ఒక వీరుని పొందుటకొరకు చేయబడిన సాధన

* ఈ వృత్తాంతము సంస్కృత భారతము గోరఖ్‌పూర్ ప్రతిలో లేదు. నన్నయభట్టారకుని ఆంధ్రమహాభారతము నుండి గ్రహింపబడినది. (ఇది గూడ నిర్ణయసాగర్ ప్రతియగు సంస్కృతభారతమునందు గలదు)

రూపతపస్సే ఐదుగురు పతుల ప్రాప్తికి కారణ మయ్యెను. కనుక, పూర్వము దైవము నిర్ణయించిన ప్రకారమే చేయుట యుచితము.

"మహాముని! పూర్వజన్మమందు కృష్ణాదేవి శంకరభగవానునితో 'ప్రభూ! నాకు పతినిమ్ము! అని అనేక పర్యాయములు వేడుకొనెను. కాబట్టి అట్టి వరమే ఆ భగవంతుడు ఇచ్చెను. కనుక, ఇందలి రహస్యము భగవంతుడే యెరుగును. సాక్షాత్తు శంకరుడే యట్టి విధానము చేసెను కాబట్టి, ఇది ధర్మమో అధర్మమో ఇందులో నా యపరాధ మేమియు లేదు. పాండవులు శాస్త్రోక్తముగా సంతోషముతో ఈమె పాణిగ్రహణము చేయుదురుగాక! బ్రహ్మదేవుడే ఈ కృష్ణను పాండవుల పత్నిగా చేసెను."

"జనమేజయా! తరువాత వ్యాసభగవానుడు యుధిష్ఠిరునితో, 'పాండు నందనా! నేడే మీకు శుభదినముగా నున్నది. నేడు చంద్రుడు పోషణకారకమైన పుష్యనక్షత్రమునకు పోవుచున్నాడు. కనుక, నేడు మొట్టమొదట నీవే ద్రౌపదీ పాణిగ్రహణము చేయుము! అని చెప్పగా వ్యాసుని యాదేశానుసారము ద్రుపదుడు పుత్రసహితుడై వధూవరులకు కావలసిన సమస్త వస్తుసామగ్రిని తెప్పించి కృష్ణకు స్నానము, సువర్ణ రత్నభూషణాద్యలంకారములు చేయించెను."

"జనమేజయా! తరువాత ఆ వివాహము చూచుటకు ద్రుపదుని మిత్ర - బాంధవులు, మంత్రులు, బ్రాహ్మణులు, పురజనులున్ను మిక్కిలి సంతోషముతో వచ్చి పెద్దవారు ముందుగా చిన్నవారు వెనుకగాను ఆ వివాహమండపమందు కూర్చొనిరి. అప్పుడు ద్రుపదుని భవనము శ్రేష్ఠ పురుషులతో శోభిల్లుచుండెను. ఆ భవనాంగణము అంతటను కమలోత్పలాది పుష్పములచేత అలంకరింపబడి యుండెను. అక్కడ ఒకవైపు సేనలు నిలిచి యుండెను. రెండవవైపు రత్నరాసులు ఉంచబడి యుండెను. దానిచేత ఆ రాజభవనము నిర్మల నక్షత్ర సహితమైన ఆకాశమువలె విచిత్ర శోభతో నొప్పుచుండెను."

"జనమేజయా! యువకులైన పాండవులు వస్త్రాలంకారభూషితులై కుండలాలంకృతులై, అభిషేకము మంగళాచారక్రియలున్ను చేసికొని, బహుమూల్యము

లైన వస్త్రములు [1]అంబరములు (సుగంధ ద్రవ్యములు), చందనములు ఈ మొదలగువానిచేత సుశోభితులై యుండిరి. అప్పుడు అగ్నిసమాన తేజస్సుగల పురోహితులు, ధౌమ్యమునితో విధిపూర్వకముగా పెద్దలు చిన్నల క్రమమున వివాహ మండపమునకు సంతోషముతో పెద్దపెద్ద ఆబోతులు గోశాలలో ప్రవేశించినట్లు పోయిరి."

"జనమేజయా! ఈ క్రమముననే పాండవులలో ఒక్కొక్కడు ఒక్కొక్క దినము ద్రౌపదీ పాణిగ్రహణము వరుసగా చేసికొనెను. ప్రతి పర్యాయముగూడ ద్రౌపది వివాహపు మరునాడు కన్యాత్వము పొందుచుండెను."

"జనమేజయా! వివాహముల కార్యములు నెరవేరిన తరువాత ద్రుపదుడు పాండవులకు కట్నముల రూపములో ననేక ధనములను, వివిధ శ్రేష్ఠ వస్తువులు, సువర్ణ హారములు సువర్ణయుగ (కాడిమాను)ములు, నాలుగు అశ్వములున్ను గల నూరు రథములను ఇచ్చెను. పద్మ (ముఖమునందు చుక్కలు) ములు మొదలైన శుభలక్షణములు గలిగి, పర్వతములవలె ఎత్తుగా నుండి బంగారు దంతములతో ప్రకాశించుచున్న రెండునూర్ల యేనుగులు బహుమూల్యములైన శృంగార సామగ్రులు, వస్త్ర - భూషణ - హారాదులున్ను ధరించిన నూరుగురు నవయువతులైన దాసీజనమును గూడ కానుకగా నిచ్చెను."

"జనమేజయా! ద్రుపదు డీ విధముగా అగ్నిసాక్షిగా ప్రతియొక పాండు కుమారునకు ద్రౌపదితో వివాహము జరిపించి అందరకున్ను వేరు-వేరుగా ననేకములైన కానుకలు ఇచ్చెను. వివాహమైన తరువాత పాండవులు అనేక రత్నరాసులతో లక్ష్మీస్వరూపురాలైన ద్రౌపదితోను పాంచాల నగరమునందే సుఖముగా విహరించుచుండిరి.

"జనమేజయా! పాండవు లందరు ద్రౌపది యొక్క సౌశీల్య ఏకాగ్రత్వ సద్వ్యవహారాదులచేత మిక్కిలి సంతుష్టులైరి. ద్రౌపదని సంతోషముతో నుంచుటకు

1. 'అత్తరు - అంబర్' అని అమ్మబడును అత్తరు వంటిదే అంబరుగూడ. ఇది అరబ్‌పద మనుకుంటిమి. ఇప్పుడు భారతప్రయోగముచేత సంస్కృత మని సిద్ధమైనది.

పాండవులు ప్రయత్నము చేయుచుండిరి. ద్రౌపది గూడ అప్పుడు నియమనిష్ఠ రాలై పాండవులను సేవించుచు, వారి యానందమును పెంపొందించు చుండెను.

**కుంతి ద్రౌపదికి ఉపదేశము, ఆశీర్వాదము చేయుట - శ్రీకృష్ణుడు పాండవులకు కానుకలు పంపుట :-**

"జనమేజయా ! పాండవులతో సంబంధము చేసిన తరువాత ద్రుపదునకు దేవతల భయము గూడ లేకుండె ననగా మనుష్యభయమెట్లు కల్గును? ద్రుపదుని కుటుంబ స్త్రీలు కుంతీదేవి యొద్దకు వచ్చి తమపేళ్లు చెప్పుచు ఆమె పాదములపై మస్తకములుంచి ప్రణామము చేయుచుండిరి. కృష్ణ గూడ పట్టుచీర కట్టుకొని మాంగలిక కార్యములు చేసిన తరువాత అత్తగారి పాదములకు ప్రణామము చేసి అమె యెదుట అంజలిబద్ధురాలై వినయముతో నిలుచుకొనెను. అప్పుడు కుంతీదేవి ద్రౌపదిని ప్రేమ పూర్వకముగా ఆశీర్వదించుచు నిట్లు ఉపదేశించెను :-

"పుత్రీ! శచీదేవి యింద్రుని యందు, స్వాహాదేవి అగ్ని యందు, రోహిణి చంద్రునియందు, దమయంతి నలునియందు, భద్రాదేవి కుబేరునియందు, అరుంధతి వసిష్ఠునియందు, లక్ష్మీదేవి భగవన్నారాయణుని యందున్న భక్తి భావముతో ప్రేమతోను ఉండినట్లే నీవుగూడ నీ పతులయందు అనురక్తురాలవై యుండుము.

"మంగళకరురాలా! నీవు అపార సౌఖ్యములతో తులతూగుచు దీర్ఘాయుష్మంతురాలవుగా, వీరపుత్రులకు జననిగాను నుండుము. నీవు నిరంతర సౌభాగ్యశాలినివై, సుఖభోగ సామగ్రీ సంపన్నురాలవై పతులతో యజ్ఞానుష్ఠానములు చేసి, పతివ్రతవై యుండుము. నీ యింటికి వచ్చిన యతిథి - సాధుజన - వృద్ధబాలక -గురుజనములను వారి వారికి తగినట్లు సత్కారములు చేయుటలోనే నీ జీవితములో ప్రతి సంవత్సరము గడుచుచుండు గాక!

"కల్యాణీ! నీ పతులు కురుజాంగల దేశమందలి రాష్ట్రములకు, నగరములకును రాజు లగుదురు గాక ! వారితో నీవు పట్టపుదేవివై పట్టాభిషేకము చేసికొనెదవు గాక ! ధర్మమునందు నీ హృదయములో స్వాభావికముగానే స్నేహముండుగాక !

"బిడ్డా! నీ పతులు బలపరాక్రమముల చేత జయించిన సమస్త భూమండలమును నీవు అశ్వమేధయాగమునందు బ్రాహ్మణాధీనము చేయుము. పృథివి యందు ఉన్న గుణరత్నము లన్నింటిచేత నీవు సంపన్నురాలవై నూరేండ్లు సుఖముగా నుండెదవుగాక! నేడు వైవాహిక పట్ట (పట్టు) వస్త్రములతో సుశోభితు రాలవైన నిన్ను చూచి నేను అభినందించినట్లే నీవు పుత్రవతివై నప్పుడు గూడ నిన్ను అభినందించెదను.

"జనమేజయా! వివాహానంతరము శ్రీకృష్ణభగవానుడు పాండవులకొరకు వైడూర్యమణులు పొదిగిన యనేక సువర్ణాభరణములు బహుమూల్య వస్త్రములు అనేక దేశముల కోమల కంబలములు,మృగచర్మములు, సుందర రత్నశయ్యాసనాదులు, పెద్ద - పెద్ద వివిధ వాహనములు వైడూర్య - వజ్రఖచితములైన నూర్లకొలది పాత్రములున్ను కానుకలుగా పంపెను. రూపయౌవనచాతుర్యాది గుణసంపన్నురాండ్లు వస్త్రభూషణాలంకృతలు అనేక దేశీయురాండ్రునైన యనేక సుందర సేవికలను గూడ శ్రీకృష్ణుడు పాండవులకు కానుకలుగా పంపెను.

"జనమేజయా! ఇదియేగాక, శ్రీకృష్ణభగవానుడు ఉత్తమ జాతికి చెందిన గజములు, భూషణాలంకృతములైన యుత్తమాశ్వములు అనేక సుందర రథములు, కోట్లకొలది బంగారు నాణెములు, వరుసలుగా ఉంచబడిన సువర్ణ రాసులు గూడ పంపెను.

"జనమేజయా! యుధిష్ఠిరుడు మిక్కిలి ప్రసన్నుడై శ్రీకృష్ణ భగవానుని సంతోషముకొరకు ఆ కానుకలన్నియు స్వీకరించెను"

వైవాహిక పర్వము సమాప్తము.

## విదురాగమన రాజ్యలాభపర్వము

**పాండవుల వివాహముచేత దుర్యోధనాదులకు చింత, ధృతరాష్ట్రుడు పాండవులపై ప్రేమ చూపుట, దుర్యోధనుని కుతంత్రము :-**

జనమేజయా! రాజులందరకు తమ గూఢచారులద్వారా 'ద్రౌపదీవివాహము పాండవులతోనైన' దని తెలిసెను. స్వయంవరమునందు లక్ష్యమును భేదించిన వాడు అర్జునుడనియూ కొందరకు తెలిసెను అత్యంత కుపితుడై శల్యుని ఎత్తి

నేలపై కొట్టినవాడు, చెట్టు పెరకి యుద్ధము చేసి యందరను భయపరచినవాడు, యుద్ధమునందు ఏమాత్రము భయము చెందనివాడును శత్రుసేనా గజములను అశ్వములనున్ను వధించి స్పర్శ మాత్రముచేత భయము కలిగించు మహా బలశాలి భీమసేను'డని కూడ తెలిసెను.

"జనమేజయా! బ్రాహ్మణవేషములో శాంతమూర్తులై కూర్చొనినవారు పాండవులే యని విని అక్కడకు వచ్చిన రాజులకు చాల ఆశ్చర్యము కలిగెను. కుంతీదేవి పుత్రసహితముగా లక్క యింటిలో కాలిపోయెను అని వారందరు విని యుండిరి. ఇప్పుడు వారు జీవితులై యున్నారని విని, ఆ రాజు లందరు, 'ఈ పాండవులు మరల క్రొత్తగా జన్మించినా' రని తలచుచుండిరి. పురోచనుడు చేసిన క్రూర కర్మ స్మృతికి వచ్చుటచేత అప్పుడు రాజులందరు, భీష్మ - ధృత రాష్ట్రులను నిందింపజొచ్చిరి. చూడుము కదా! ధర్మాత్ములు, సత్ప్రవర్తకులు, మాత యొక్క ప్రియహితమును కోరువారునైన పాండవులనుగూడ ధృతరాష్ట్రుడు నశింపజేయదలచుచున్నాడు. ఇంతకన్న నింద్యకార్యము మరియొకటి యేది యుండును అని అందరు రాజులు చెప్పికొన జొచ్చిరి.

"జనమేజయా ! స్వయంవరము ముగిసిన తరువాత కర్ణ శకునుల దుర్మంత్రము చేత చెడిపోయిన ధృతరాష్ట్ర పుత్రులందరు ఈ విధముగా పరస్పరము సంప్రదించుకొనజొచ్చిరి. శకుని యిట్లనెను:-

ప్రపంచమునందు, అన్ని విధముల దుర్బలులజేయ దగిన శత్రువులు కొందరుండెదరు. మరికొందరు, సర్వదా ఏడింట దగినవారుగా నుండెదరు. కాని పాండవులందరున్ను సమస్త క్షత్రియులచేత నశింపజేయ దగినవారు. వీరి విషయమైనా నా యభిప్రాయము యిదియే. ఒకవేళ, మీరందరు ఈ విధముగా పరాజితులై ఈ పాండవుల వినాశమునకు ఉపాయము నిశ్చయింపనియెడల మీరు చేయు ఈ పొరపాటు వలన మీకు ఎల్లప్పటికిన్ని సంతాపము కలుగును.

"రాజులారా! పాండవులను సమూలముగా నశింపజేయుటకు మనకు ఉపయుక్తములైన దేశకాలము లివియేయని తెలిసికొనుడు. ఇట్లు మీరు చేయని యెడల ప్రపంచములో పరిహాసపాత్రులయ్యెదరు. పాండవులిప్పుడాశ్రయించి యున్న ద్రుపదరాజు బలపరాక్రమములలో చాల చిన్నవాడని నాయభిప్రాయము.

'పాండవులు జీవించియున్నా'రని వృష్ణి వంశ వీరులకు, చేదిరాజు శిశుపాలున కున్ను తెలియకుండునంతలోపలనే, పాండవులను సంహరించవలెను. పాండవులు ద్రుపదరాజుతో కలిసి అందరు నొకటైనపుడు వారిని జయించుట మిక్కిలి యసాధ్యమగుననుటలో సందేహము లేదు. రాజులందరు పరాకుగా నుండినప్పుడే మనము పాండవుల వధకు ప్రయత్నించవలెను.

"రాజులారా! విషధరసర్ప ముఖమువలె భయంకరమైన లాక్షాగృహము నుండి పాండవులు తప్పించుకొని పోయిరి. ఒకవేళ మరలా వారిప్పుడు మనను గూడ తప్పించుకొని పోయినయెడల వారి నుండి మనకు మహా భయము కలు గును ఒకవేళ, వృష్ణి - చేది వంశముల వీరులిక్కడకు వచ్చినప్పుడు ఇక్కడి ప్రజలుగూడ శస్త్రాస్త్రములు ధరించి, నిలిచినయెడల ఆయత పుర మధ్య నిలు చుట పరస్పరము పోరాడుచున్న రెండు మేకపోతుల నడుమ నిలిచినట్లు మిక్కిలి కఠినము కాగలదు. బలవంతులైన బలరామ సైనికులు - కౌరవసేన యనెడు పొలములో మిడుతలవలె విరచుకొని పడులోపలనే మనమందరము ఒకటిగా చేరి ద్రుపదనగరమును నశింపజేయుదము. రాజులారా! ఇప్పుడిదియే సర్వోత్తమమైన కార్యమని తలచెదను."

"జనమేజయా! దుర్బుద్ధియైన శకుని మాటలు విని సోమదత్త కుమారు డైన భూరిశ్రవు డిట్లు తన యభిప్రాయము చెప్పెను" :-

"రాజులారా! తమపక్షము నందున్నట్టి శత్రుపక్షము నందున్నట్టియు ఏడు[1] ప్రకృతులను బాగుగా తెలిసికొనిన తరువాతనే, దేశకాల కాలజ్ఞానము కలిసి యుండి, ఆరు[2] విధములైన గుణములను అవసరమును బట్టి ప్రయోగించ

1. 'రాజ్యమునందు స్వామి - అమాత్య - సుహృత్ - కోశ - రాష్ట్ర - దుర్గ - సైన్యములు' ఈ యేడు అంగములు ప్రకృతులన బడును.
2. 'సంధి - విగ్రహ - యాన - ఆసన - ద్వైధీభావ - సమాశ్రయములు' ఈ యారుగుణములు రాజునకు ఉండ వలెను. శత్రువుతో కలిసి యుండుట 'సంధి'; విరోధించుట విగ్రహము; దాడి చేయుట యానము; 'అవకాశము కొరకు వేచి యుండుట ఆసనము; ద్వివిధనీతులు ప్రయోగించుట ద్వైధీ భావము; తనకన్న బలవంతుడైన రాజు శరణు జొచ్చుట సమాశ్రయము నన బడును.

వలెను. 'స్థానము - వృద్ధి - క్షయము - భూమి - మిత్రులు - పరాక్రమము ఈ యన్నిటి యందు దృష్టి యుంచుచు శత్రువు సంకటావస్థలో బాధితుడై యుండిన యెడల అప్పుడే యతని పైన ఆక్రమణము చేయవలెను. ఈ దృష్టితో చూడగా పాండవులు మిత్రులతో, కోశము (ధనాగారము) తోను సుసంపన్నులై యున్నారని నేను తలచెదను. వారు సహజముగా బలపరాక్రమ సంపన్ను లయియే యున్నారు. తమ సత్కార్మల ద్వారా సమస్త ప్రజలకు ప్రియులగు చున్నారు."

"రాజవీరులారా! అర్జునుడు తన శరీరసౌష్ఠవము చేత మనుష్యు లందరి నేత్రములకు, హృదయములకు, మధుర వాక్యములచేత చెవులకున్ను ఆనందము కలిగించు చున్నాడు. కేవలము దురదృష్ట వశముచేత ప్రజల సేవ యతనికి లభింప కున్నది. ప్రజలకు ప్రియమైన కార్యము అర్జునుడు ప్రయత్నించి చేయు చుండును. అర్జునుని వాక్కు ఎప్పుడు గూడ అయుక్తము, అసంబద్ధము అసత్యము, అప్రియమునై యుండదు."

"రాజులారా! పాండవు లందరు రాజలక్షణ సంపన్నులు, పైన చెప్ప బడిన సమస్త సద్గుణములు గలవారుగా నున్నారు. కేవలము తమ బలముచేత మాత్రమే పాండవులను నశింప జేయగల వీరుల నెక్కడగూడ నేను చూడ లేదు. వారికి ప్రభావశక్తి, మంత్రశక్తి, ఉత్సాహ శక్తియు నందరికన్న నధికముగా గలవు."

"వీరులారా! యెప్పుడు, స్వాభావిక మైన స్వశక్తిని ఉపయోగింప వలెను? మరి యెప్పుడు మిత్రబలము, సైన్య బలమున్ను ఉపయోగింప వలెను? అను విషయమును యుధిష్ఠిరుడు బాగుగా నెరుగును. యుధిష్ఠిరుడు సమయాను సారముగా సామ - దాన - భేద - దండోపాయముల చేతనే శత్రువులను జయింప గోరును. కాని, క్రోధము చేత కాదు అని నా విశ్వాసము. అతడు ధన మిచ్చి శత్రుమిత్రులను కొనుక్కొని తన మూలమును దృఢ పరచుకొని శత్రువు లను నశింప జేయును."

"రాజులారా! ఇంద్రాది దేవతలుగూడ పాండవుల కేలాటి నష్టము, బాధయు కలిగింప జాలరు. వారికి సహాయము చేయుటకు శ్రీకృష్ణబలరాములు

సర్వదా కటిబద్ధులై యున్నారు. ఒకవేళ నా మాట హితకారి యని నా యభిప్రాయము ప్రకారమే మీ మతము గూడ నున్నదనియు మీరు తలచిన యెడల మనము పాండవులతో సంధి చేసికొని తిరిగి పోవుదము.

"రాజులారా! ఉత్తమమైన యీ ద్రుపద రాజధాని గోపురము (పుర ద్వారము) లతో ఉన్నతములైన అట్టాలిక (బురుజు) లతో, నూర్లకొలది ఉపతల్ప (కొయ్యబల్ల-ఆసనము) లతోను సురక్షితమై యున్నది. ఈ పట్టణమునకు నలువైపుల జలభరితములైన అగడ్తలు ఉన్నవి. గడ్డి, మేత, ధాన్యము, ఇంధనములు రసద్రవ్యములు, యంత్రములు, ఆయుధములు - మొదలైనవి యీ నగరమందు అనేకము లున్నవి. అనేక కవాటములు, ధనాగారములు, పొట్టు తవుడు మొదలైనవిగూడ ఈ నగరమందు నిండియున్నవి. ఇక్కడ భయంకరములైన పెద్ద-పెద్ద చక్రములు (సైనిక వ్యూహములు), పెద్ద-పెద్ద అట్టాలికల పంక్తులు నగరము చుట్టియున్నవి. ఈ నగరపు నాలుగు కోటగోడలు సుదృఢములుగా నున్నవి. శతఘ్నుల (నాల్గుమూరల పొడవు గల ఇనుపముండ్ల కఱ్ఱ - అథవా, ఇనుప అగ్నిగోళములు చిమ్ము పొడవైన 'తోపులు') సముదాయము ఈ నగరము నలువైపుల నున్నవి. సైనికులతోను నిర్మింపబడిన వప్రములు (కోటలు) ఉన్నవి.

"రాజులారా! ఈ పట్టణమునందు శ్వేత *నరగర్భము(నరులు నిండినది) పూజింపబడుచున్నది. తాళవృక్ష ప్రమాణముగల యనేకశాల (మద్ది) వృక్షముల వరుసలు ఈ నగరము నలువైపుల నున్నవి. ద్రుపద మహారాజు సమస్త ప్రజలందు మంత్రులు మొదలైన ప్రకృతులందున్ను అనురాగముగల వాడై యున్నాడు. బయట లోపలన్ను నున్న సేవకులందరిని దాన-గౌరవములచేత సత్కరించు చున్నాడు.

"రాజులారా! భయంకర పరాక్రమము గల రాజులచేత అన్ని వైపుల పాండవులు ఆక్రమింపబడి యున్నారని తెలిసి సమస్త యదువంశ వీరులు భయంకరాస్త్ర శస్త్రములతో నిక్కడకు వచ్చెదరు. కనుక, మనము దుర్యోధనునకు పాండవులతో సంధి చేయించి మన రాజ్యములకు పోవుదము.

* ఇక్కడ నరగర్భ శబ్దమునకు సాంకేతికార్థము లభింపకున్నది. నాకు తోచిన వ్యుత్పత్త్యర్థము కుండలీకరణములో వ్రాయబడినది.

"రాజులారా! ఒకవేళ మీకు నా మాటలపై విశ్వాసము ఉండి, ఈ నా యభిప్రాయము మంచిదని మీ కందరకు తోచిన యెడల, మీరందరు ఈ నా యభిప్రాయమును అనుసరింపుడు. ఇప్పుడు మనకు అన్నిటికన్న ఉత్తమమైన కర్తవ్యము ఇదియేయని ఇదియే రాజులకు శ్రేయస్కరమనియు తలచెదను.

"జనమేజయా! స్వయంవరము ముగిసిన తరువాత రాజు లందరు తమ తమ దేశములకు తిరిగి పోయిరి.

తరువాత ద్రౌపది అర్జునునకు స్వయంవర జయమాల వేసి వరించుట కనులార చూచిన దుర్యోధనుని మనస్సులో మిక్కిలి దుఃఖము కలిగెను. అతడు శకుని-కర్ణ-కృపాచార్య-అశ్వత్థామలతో తన సోదరులతోను ద్రుపద రాజధాని నుంచి హస్తినాపురమునకు తిరిగిపోయెను. మార్గమునందు దుశ్శాసనుడు సిగ్గుతో దుర్యోధనునితో మెల్లమెల్లగా నిట్లనెను:-

"సోదరా! ఒకవేళ అర్జునుడు బ్రాహ్మణ వేషములో నుండకుండిన యెడల, అతడెప్పటికిన్ని ద్రౌపదిని పొందజాలకుండెను. వాస్తవముగా నతడు అర్జునుడని ఎవరికి గూడ తెలియకుండెను. పౌరుషము వ్యర్థమని, అదృష్టమే ప్రబలమనియు నేను తలచెదను, పాండవులు ఇంతదాక జీవించి యుండుట మన పౌరుషమునకే నిందాకరముగ నున్నది."

"జనమేజయా! యిట్లు వారు పరస్పరము మాట్లాడుకొనుచు పురోచనుని నిందించుచు దుఃఖముతో హస్తినాపురము చేరిరి. పాండవులయొక్క సఫలత్వము చూచి వారి చిత్తము చంచలమై, పరితపింప జొచ్చెను. పరాక్రమవంతులైన పాండవులు లక్కయింటి యగ్నినుండి తప్పించుకొని జీవితులై ద్రుపదరాజునకు సంబంధులగుట కనులారా చూచి, ధృష్టద్యుమ్న శిఖండులు ద్రుపదుని యితర పుత్రులున్ను సమస్త యుద్ధ విద్యలలో సమర్థులని విచారించియు కౌరవులు మిక్కిలి భయపడిరి. వారి యాశ యంతయు నిరాశగా పరిణమించెను.

"జనమేజయా! పాండవులు ద్రౌపదిని బడిసినారని ధృతరాష్ట్ర పుత్రులు వారి దురభిమానము నశించిపోవగా సిగ్గుతో తిరిగి వచ్చినారనియు తెలిసినప్పుడు

విదురుడు మనస్సులోనే చాల సంతోషము చెందెను. అప్పుడతడు ధృతరాష్ట్రుని కడకు పోయి ఆశ్చర్యము సూచించుచూ అతనితో మహారాజా! మన సౌభాగ్యమే మనిచెప్పవలెను: కౌరవవంశము వృద్ధిజెందుచున్నది అని యనగా ధృతరాష్ట్రుడు ప్రసన్నుడై హఠాత్తుగా అహా! ఎంత సౌభాగ్యము! ఎంత మనయదృష్టము అని యనెను.

"జనమేజయా! ఆ యంధరాజు అజ్ఞానముచేత 'ద్రౌపది దుర్యోధనుని వరించెను!' అని తలచెను. కాబట్టి ద్రౌపదికొరకు అనేక భూషణములు తెప్పింపుము. ద్రౌపదీ - దుర్యోధనులను మన నగరమునకు గొప్ప ఉత్సవములలో, మంగళవాద్యములతోను తోడుకొని రమ్ము!' అని విదురునకు ఆజ్ఞ యిచ్చెను.

"జనమేజయా: తరువాత విదురుడు ధృతరాష్ట్రునితో నిట్లనెను :-

"మహారాజా: ద్రౌపది పాండవులను వరించెను. పాండవవీరు లిప్పుడు ద్రుపదునిచేత పూజింప బడుచు నక్కడ క్షేమముగా నున్నారు. ఈ స్వయంవరోత్సవమునందే పాండవుల యితర బంధువు లనేకులు పాండవులతో ప్రేమ పూర్వకముగా కలిసిరి".

"జనమేజయా! విదురుని మాటలు విని ధృతరాష్ట్రుడు వెలవెల బోయెను. మార్పు చెందిన తన యాకృతిని కనపడనీయకుండ విదురునితో నిట్లనెను :-

"విదురా! ఆహా! మనకు నేడు ఎంత మహాభాగ్యము! పాండవులు జీవించి యున్నారనుట మిక్కిలి ఆనందకరమైన విషయముగదా! నీకు శుభమగుగాక! కుంతీదేవి మహా పతివ్రతయే. ద్రుపదునితో కలిగిన సంబంధము మనకు చాలా స్పృహణీయము. ద్రుపద మహారాజు వసువంశములో శ్రేష్ఠుడు. మాననీయకులమందు పుట్టినవాడు. నియమ వ్రతములలో,విద్యలలో,తపస్సులోను ద్రుపదుడు చాల గొప్పవాడు. రాజులలో అగ్రగణ్యుడు. అతని పుత్రపౌత్రు లందరుగూడ ఉత్తమ నియమవ్రతపాలకులు. ద్రుపదుని యితర బంధువు లందరున్నూ మిక్కిలి బలవంతులు.

"విదురా: అట్లే యుధిష్ఠిరాదులు పాండురాజునకువలెనే నాకుగూడ పుత్రులు. ఇంకను అధికులనికూడ చెప్ప వచ్చును. పాండవుల యెడల నాకు అధిక మైన ఆత్మీయభావము ఎందుకు కలదో చెప్పెద వినుము."

"విదురా! వీరపాండవులు క్షేమముగా జీవించి యున్నారు వారికి మిత్రుల సహాయోగము గూడ లభించినది. ఇంతయే కాదు, బలవంతులైన అనేక రాజులు పాండవులకు బంధువు లగు చున్నారు. తమ సంపద నష్టమైన తరువాత గూడ బంధుసహితుడైన ద్రుపదరాజును మిత్రునిగా బడసి జీవింప దలచని రాజు ఎవ డున్నాడు?"

"జనమేజయా! యిట్లు పలుకుచున్న ధృతరాష్ట్రునితో విదురుడు 'మహారాజా! నీ యభివృద్ధి నూరు సంవత్సరముల దాక ఇట్లే యగు చుండుగాక!' యని చెప్పి తన యింటికి పోయెను. తరువాత కర్ణ - దుర్యోధనులు ధృతరాష్ట్రుని కడకు వచ్చి యి ట్లనిరి" :

మహారాజా! విదురుని యెదుట మేము నీకు నీ దోషము చెప్ప జాల కుంటిమి. ఇప్పుడు ఏకాంతములో నున్నావు కనుక చెప్పు చున్నాము. శత్రువుల యున్నతినే నీ యున్నతి యని భావించు చున్నావు. విదురుని యెదుట మా శత్రువులను ప్రశంసించు చున్నావు. మే మొకటి చేయ దలచు చుండగా నీవు తద్విపరీతముగా మరియొకటి చేయు చున్నావు. సర్వదా పాండవుల శక్తిని నశింప జేయు చుండుటయే మనకు సముచితమైన కార్యము.

"రాజా! యిప్పుడు మనకు అవసరము కలిగినది కనుక, మన మేమి చేయవలెను? అని విచారించి నిశ్చయించ వలసి యున్నది. దానిచేత పాండవులు మనను పుత్ర-బంధుసేనా - సహితముగ సర్వనాశము చేయకుండవలెను గదా!"

ఆ మాటకు ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో నిట్లనెను :-

**ధృతరాష్ట్ర - దుర్యోధనుల సంభాషణము - శత్రువులను వశపరచు కొనుటకు ఉపాయములు :**

"పుత్రా! మీరిద్దరు అనుకొనుచున్నట్లే నేనుగూడ చేయ దలచు చున్నాను. కాని, నా మనోభావములను విదురునకు నా యాకారము ద్వారా కూడ తెలుప దలచ లేదు. కనుకనే, విదురుని యెదుట పాండువులను విశేషముగా ప్రశంసిం చితిని. దానిచేత నతనికి నా మనోభావము, నా యాకృతిచేత గూడ తెలియ లేదు.

కర్ణ - దుర్యోధనుఁడా! సమయానుసారముగా చేయవలసిన కార్యమును శీఘ్రముగా తెలుపుడు."

ఆ మాటకు దుర్యోధను డిట్లనెను :-

"తండ్రీ! మనకు పూర్తిగా విశ్వాసముగల చతురులైన బ్రాహ్మణులను నేడు పాండవుల కడకు పంపి వారిద్వారా కుంతీ-మాద్రీ పుత్రులలో భేదభావము కలిగించవలెను లేదా, ద్రుపద రాజునకు- అపార ధనమిచ్చి అతనిని ప్రలోభ పరచి మనవైపు త్రిప్పికొని యతడు పాండవులను తన నగరమునుండి వెడల గొట్టునట్లు చేయవలెను. అథవా, పాండవు లక్కడనే యుండుటకు ఇష్టపడు నట్లుగా, ఈ బ్రాహ్మణులు వారికి ఉపదేశించవలెను. హస్తినాపుర నివాసము పాండవులకు హానికరమని ఈ బ్రాహ్మణులు వారికి వేరువేరుగా చెప్పవలెను. ఈ విధముగా, బ్రాహ్మణులు వారికి బుద్ధిభేదము గలిగించిన యెడల పాండవులు పాంచాల దేశములోనే యుండుటకు నిశ్చయించుకొనవచ్చును.

"తండ్రీ! అథవా మనము కార్యశూరులను ఉపాయచతురులను వారి కడకు పంపి వీరి వాక్చాతుర్యముచేత పాండవులలో భేదభావము కల్పింపవలెను. లేదా కృష్ణ తన పతులను విడుచునట్లు ఆమెకు వారియెడల దురభిప్రాయము కలుగునట్లున్ను ఆమెను ప్రోత్సహించవలెను. అనేక పతులుండుటచేత ఆమెకు ఎవరియందు గూడ దృఢమైన యనురాగము కలుగ జాలదు గనుక ఆమె వారిని విడుచుట సులభ మగును. లేక, మనము పంపినవారు, పాండవులకు కృష్ణాదేవి యెడల విరక్తి కలిగించి, ఆమెను విడుచునట్లు చేయవలెను.

"రాజా! అట్లు కానిచో, ఉపాయకుశలురైన మనుష్యులు అక్కడ ప్రచ్ఛన్నముగా నుండి భీమసేనునే వధించవలెను. అతడే పాండవులలో నధిక బలశాలి కదా! అతని బలముచేతనే యుధిష్ఠిరుడు మనను కొంచెముగూడ లెక్క చేయకున్నాడు. భీముడు తీక్ష్ణస్వభావము గల వీరుడు. అతడే పాండవులకు గొప్ప సహాయకుడుగా నున్నాడు. అతనిని చంపిన తరువాత పాండవుల బలోత్సాహ ములు నశించును. తరువాత వారు రాజ్యము చేకొనుటకు ప్రయత్నము చేయరు. భీమసేనుని పృష్ఠరక్షకునిగా పెట్టుకొనియే అర్జునుడు యుద్ధమునందు అజేయు డగు చున్నాడు. అర్జునునకు భీముడు సహాయకుడుగా లేనిచో నతడు కర్ణునకు

నాలుగవ వంతు బలవంతుడుగా గూడ నుండజాలడు. భీమసేనుడు లేనిచో పాండవులు తమకంటే మనము బలవంతులమని తలచి రాజ్యలాభము కొరకు ప్రయత్నము చేయరు.

"రాజా! అథవా వారు ఇక్కడకు వచ్చి మాకు ఆజ్ఞావశులై యుండిన యెడల మేము నీతిశాస్త్రము ప్రకారము వారిని నశింపచేయుటకు ప్రయత్నించు చుండెదము. లేదా సుందర యువతులచేత ఒక్కొక్క పాండవుని లోభపరచి కృష్ణాదేవిని వారికి విముఖురాలినిగా చేయవచ్చును. లేక పాండవులను ఇక్కడకు పిలుచుకొని వచ్చుటకు కర్ణుని పంపి వారినతడు తోడ్కొని వచ్చిన తరువాత, విశ్వాసము గల కార్యకర్తలచేత వేరు-వేరు ఉపాయముల ద్వారా వారిని చంపించవచ్చును.

"తండ్రీ! నేనిప్పుడు చెప్పిన యుపాయములలో నీకు నిర్దోషమని తోచిన యుపాయమునే ఆచరింపుము. సమయము గడచిపోవు చున్నది. వారి యెడల ద్రుపదునకు పరిపూర్ణ విశ్వాసము కలుగు లోపలనే వారిని చంపవచ్చును. ద్రుపదుని విశ్వాసము వారు సంపాదించిన తరువాత వారిని చంపుట సమంజసము. శత్రువులను వశపరచుకొనుట కొరకు ఈ యుపాయములే నాకు తోచినవి. నా యభిప్రాయము మంచిదో చెడ్డదో నీవే తెలిసికొనుము."

ఇట్లు చెప్పి దుర్యోధనుడు ఈ విషయములో కర్ణుని యభిప్రాయ మడుగగా అతడిట్లు చెప్ప దొడగెను :-

**పాండవులను పరాక్రమముచేత అణచుటకు కర్ణుని సమ్మతి :**

"దుర్యోధనా! నీ యోచన సరికాదు. నీవు చెప్పిన ఏ యుపాయము చేత గూడ పాండవులను వశపరచుకొన జాలము. పూర్వము గూడ నీవు అనేక రహస్యోపాయముల చేత పాండవులను అణచుటకు ప్రయత్నించితివి. కాని, వారిని వశపరచుకొన జాలక పోయితివి. వారు బాల్యావస్థలో ఇక్కడనే నీ యొద్ద నున్నప్పుడు, వారి పక్షమునందు ఎవరుగూడ లేనప్పటికిన్ని వారిని బాధించ జాలక పోయితివి."

"రాజా! యిప్పుడు వారు విదేశములో నున్నారు. అనేకులు వారి పక్షమునం దున్నారు. అన్ని విధముల వారు అభివృద్ధి చెందినారు. కనుక, నిప్పుడు పాండవులు నీవు తెలిపిన యుపాయుల చేత నీ యధీనములోకి రారు. ఇప్పుడు వారిని సంకటములలో పడవేయ లేము. వారిని అదృష్టము శక్తిమంతు లనుగా చేసెను. వారి తండ్రితాతల రాజ్యమును పొందుటకు అభిలషించు చున్నారు."

"రాజా! పాండవులలో పరస్పర భేదభావము కల్పించుట యసంభవము. వారు ఏకాభిప్రాయముతో ఒక పత్నియందే అనురక్తులై యున్నారు. కాబట్టి, వారికి పరస్పర విరోధము కలుగ జాలదు. పాండవులు భిక్షాభోజనము చేయుచు, దైన్యముతో హీనస్థితిలో నున్నప్పుడే కృష్ణాదేవి వారిని వరించెను. ఇప్పుడైతే వారు సంపన్నులై స్వచ్ఛసుందర వేషములలో నున్నారు. కాబట్టి ఆమెకు వారి యందు భేదభావము కలిగించి ఆమెను వేరుపరచుట యసంభవము."

"రాజా! తరచుగా స్త్రీలకు అనేక పురుషులతో సంబంధము పెట్టుకొనుట కిచ్ఛ యుండును. అది స్త్రీలకు సహజముగా ఏర్పడిన గుణము. కనుక, ఆ లాభము, ఆమెకు పాండవులతో నుండుటచేత స్వయముగానే లభించినది గనుక, వారి యెడల ఆమెకు భేదభావము కల్పింపబడ జాలదు."

"రాజా! ద్రుపద మహారాజు ఉత్తమవ్రతనియమ పాలకుడు. ధనలోభి కాడు. నీ సమస్తరాజ్య మిచ్చినను అతడు పాండవులను విడువ డనుట నిశ్చ యము. అతని పుత్రుడు ధృష్టద్యుమ్నుడు గూడ గుణవంతుడు, పాండవుల యందు ప్రేమ గలవాడు కనుక, అతనిని నీవు పూర్వము చెప్పిన యుపాయ ములచేత వశపరచుకొనుట యసాధ్యమని నా యభిప్రాయము.

"రాజా! యిప్పుడు మనకు ఒకటే యుపాయము ఆచరణయోగ్యమై యున్నది. అది యేమనగా పాండవులు వేళ్ళు పాతుకొని స్థిరపడు లోపలనే వారిపై దెబ్బ కొట్ట వలెను. ఒక్క ఆ యుపాయము చేతనే వారు మనకు వశపడెదరు. నీకుగూడ నా యీ యభిప్రాయము నచ్చి యుండును. మనపక్షము పాంచాలుర కంటె మించి యుండి ద్రుపదరాజుబలము మనకంటె తగ్గి యున్నప్పుడే వారిపై

నా క్రమణము చేయవలెను. పాండవులు అనేక వాహన - మిత్ర - బాంధవులను సంపాదించుకొనులోపలనే వారిపై నీపరాక్రమము చూపుము.

"దుర్యోధనా! ద్రుపదుడు తన పుత్రులతో మనపై దాడి సలుపు లోపలే నీ బలపరాక్రమములను ప్రదర్శింపుము. శ్రీకృష్ణుడు పాండవులకు రాజ్యమిప్పించు తలంపుతో ద్రుపదునికడకు యదువంశ సేనలతో రాకపూర్వమే యీప్రయత్నము లన్నియు నీవు చేయవలెను. శ్రీకృష్ణుడు పాండవులకు ఇవ్వ జాలని ధన- రత్న సుఖాదులు, రాజ్యము-ఏవి కూడ లేవు.

"రాజా! భరతుడు పరాక్రమము చేతనే ఈ రాజ్యము పడసెను. ఇంద్రుడు పరాక్రమము చేతనే త్రిలోకముల జయించెను. క్షత్రియునకు పరాక్రమమే ప్రశంసార్హ మగును. అది చూపుటయే వీరులకు స్వధర్మము. మనము, చతురంగ సేనలచేత ద్రుపదుని త్రొక్కి, పాండవులను బంధించి తెచ్చెదముగాక!

"దుర్యోధనా! సామ-దాన - భేదోపాయములచేత పాండవులను వశపరచుకొన జాలము కనుక, దండోపాయరూపమైన పరాక్రమముచేతనే వారిని నశింపజేసి సమస్తభూమండల రాజ్యమును అనుభవింపుము. కార్యసిద్ధికి ఈయుపాయము తప్ప మరియొకటి ఏవియు లేదు."

"జనమేజయా! యిట్లు కర్ణుడు చెప్పగా విని ధృతరాష్ట్రమహారాజు అతనిని మిక్కిలి ప్రశంసించి యిట్లనెను :-

"కర్ణా! నీవు మిక్కిలి బుద్ధిమంతుడవు శస్త్రాస్త్ర కోవిదుడవు సూతకులానంద వర్ధనుడవు ఇట్టి పరాక్రమ వచనములు చెప్పుట నీకే తగియున్నది. కాని, భీష్మ -ద్రోణ-విదురులు మీ యిరువురున్ను కలిసి మరల బాగుగా విచారించి భవిష్యత్కాలములో మనకు సుఖదాయకమైన యుపాయమును నిర్ణయింపుడు."

"జనమేజయా! తరువాత ధృతరాష్ట్రుడు భీష్మ ద్రోణాది సమస్త మంత్రులను పిలిచి వారితో విచారించుట కారంభించెను.అప్పుడు భీష్ముడు ఇట్లనెను :-

**భీష్ముడు దుర్యోధనునితో పాండవులకు అర్ధరాజ్యమిమ్మని చెప్పుట:-**

"రాజా! పాండవులను నిరోధించుట గాని వారితో యుద్ధము చేయుట గాని, నాకు ఏమాత్రము నచ్చదు. నాకు ధృతరాష్ట్రు డెంతయో పాండురాజు గూడ అంతయే. ధార్తరాష్ట్రులు పాండవులున్ను నావారే కనుక పాండవులను మిమ్ము న్ను నేను రక్షించ వలెను. ఇది నాకర్తవ్యము. నీవు నేనున్ను పాండవులను రక్షించుట ఎంత ఆవశ్యకమో దుర్యోధనుడు ఇతర కౌరవలుగూడ పాండవులను రక్షించుట అంత యావశ్యకము.

"ధృతరాష్ట్రా! ఇట్టి పరిస్థితిలో పాండవులతో యుద్ధము చేయుట నాకు నచ్చదు కనుక వారితో సంధి చేసికొని వారికి అర్ధరాజ్య మివ్వవలెను. దుర్యోధను నకువలెనే పాండవులకు గూడ ఈ రాజ్యము, వారి తండ్రి - తాతలది కనుక, వారికి గూడ దీనియందు అధికారము కలదు.

"దుర్యోధనా! నీ వెట్లు ఈ రాజ్యము నీ పైతృకసంపత్తియని తలచెదవో అట్లే పాండవులు గూడ తలచెదరు. పాండవులు ఈ రాజ్యమును పొందజాలని యెడల నీవు గాని ఇతర భారత వంశీయులు గాని దీని నెట్లు పొందజాలెదరు? నీవు అధర్మముగా ఈ రాజ్యమును ఆక్రమించుకొంటివి, నీ కంటే పూర్వమే పాండవులు గూడ ఈ రాజ్యమును పొందియుండిరి. కనుక, ప్రేమ పూర్వకముగా వారికి అర్ధరాజ్యము నిమ్ము. ఇందులోనే అందరకు హితము గలదు.

"దుర్యోధనా! ఈ నా మాటకు విపరీతముగా నీవు చేసిన యెడల, మనకు మేలు కలుగదు. నీకు గూడ అపయశము వచ్చును. కనుక, నీ కీర్తిని రక్షించు కొనుము. అన్నిటికన్న కీర్తియే శ్రేష్ఠమైన బలము. కీర్తి నశించిన వాని జీవి తము నిష్ఫలమగును. కీర్తి నశించనంతవరకే మనుష్యుడు జీవించి యుండును. కీర్తి నశించిన తరువాత అతని జీవితము గూడ నశించి పోవును.

"దుర్యోధనా! కురుకులక్షేమము కొరకు సముచితమైన ఈ యుత్తమ ధర్మమును పాలింపుము. నీ పూర్వులకు తగినట్లుగా నడుచుకొనుము. పాండవులు కుంతీదేవియు మరణించక బ్రతికి యుండుట పాపిష్ఠుడైన పురోచనుడు తన దుష్కార్యమునందు సఫలుడు గాక స్వయముగా నశించుట ఇవి యన్నియు పరమ సౌభాగ్యములు కదా!

"దుర్యోధనా! పాండవులు కుంతియు లక్క యింటిలో దగ్ధులైనా రని నేను వినినప్పటి నుండియు సిగ్గుతో తల వంచుకొని లోకములో ఎవరిని గూడ కను లెత్తి చూడజాలకున్నాను. ఈ కార్యములో లోకులు నిన్ను ఎంతగా దోషియని భావించుచున్నారో, అంత దోషియని పురోచనుని భావించుట లేదు. పాండవులు జీవించి నేడు కనబడుట చేత నీకు కలిగిన కళంకము నశించినదని తెలిసి కొనుము.

"దుర్యోధనా ! పాండవులు బ్రతికి యుండగా వారి పైతృకరాజ్య భాగము సాక్షాత్తు ఇంద్రుడు గూడ తీసికొన జాలడు. వారందరు ధర్మమునందు స్థిరముగా నున్నారు. వారి మనస్సు, తలంపు నొక్కటియే. ఈ రాజ్యముపై నీకు వారికిన్ని సమానముగ స్వత్వము ఉన్నప్పటికిన్ని నీవు మిక్కిలి అధర్మముతో వారిని ఇక్కడి నుండి వెడలగొట్టితివి. నీవు ధర్మానుకూలముగ నడచుచు నీకు ప్రీతిగలిగించి ప్రపంచమునకు శ్రేయస్సు చేకూర్చ దలచినయెడల పాండవులకు అర్ధరాజ్యము నిమ్ము."

"జనమేజయా! భీష్మపితామహు డిట్లు చెప్పిన తరువాత ద్రోణాచార్యు డిట్లనెను":-

**పాండవులకు కానుకలు పంపి పిలిపించుటకు ద్రోణాచార్యుడు సమ్మతించుట-దానిని కర్ణుడు నిరోధింపగా ద్రోణుడు అతనినే అధిక్షేపించుట:-**

"ధృతరాష్ట్రమహారాజా! సంప్రతింపులకు పిలువబడిన హితైషులు ధర్మార్థ యశస్కరము లైన మాటలే చెప్పుట యుచితమని, నేను పరంపరగా వినుచున్నాను. భీష్మునిమాటను నేను పూర్తిగా సమ్మతించుచున్నాను. పాండవుల కర్ధరాజ్య మీయ వలెను. ఇదియే పరంపరాగత ధర్మము."

"రాజా! ద్రుపదునికడకు ఒక మంచి మనుష్యుడు శీఘ్రముగా అనేక రత్నములు కానుకలుగా తీసికొని పోవలెను. కోడలికొరకు వరునిపక్షము వారి నుండి ధనరత్నములు ద్రుపదునికడకు తీసికొనిపోవలెను. ఆ పోయిన వ్యక్తి ద్రుపద-ధృష్టద్యుమ్నులతో 'మీతో సంబంధము కలుగుటచేత ధృతరాష్ట్ర-దుర్యోధనులు తమకు గొప్పయభ్యుదయము కలిగిన దని వారికి ఈ వివాహసంబంధము

చేత మిక్కిలి సంతోషము కలిగిన దనియు చెప్పవలెను.పాండవులనుగూడ అతడు ఓదార్చుచు ఈ సంబంధము ఉచిత మైనదని ప్రియముగా వారితో మాట్లాడ వలెను. ఆ పురుషుడు నీ యాజ్ఞచేత ద్రౌపదికొరకు అనేక సుందరసువర్ణమయ భూషణములు తీసికొని పోయి సమర్పించ వలెను. ద్రుపదునకు అతనిపుత్రు లందరికి పాండవులకు కుంతీదేవికిన్ని సముచితభూషణములు కానుకలుగా ఈయ వలెను.

"రాజా! ఈవిధముగా కానుకలిచ్చిన తరువాత పాండవులతోనూ ద్రుపదుని తోను అతడు శాంతవచనములు మాట్లాడి చివరకు పాండవులను హస్తినాపురము నకు రమ్మని ఆహ్వానించ వలెను. వారు ఇక్కడకు వచ్చుటకు ద్రుపదుడు అనుమతించినయెడల దుశ్శాసన-కర్ణులు సేనలతో అక్కడకు పోయి పాండవులను ఇక్కడకు తోడుకొని రావలెను. వచ్చినతరువాత నీవు వారిని ఆదరించి, సత్క రించి, ప్రజల యిచ్ఛానుసారముగా వారి పైతృక రాజ్యమందు వారిని ప్రతిష్ఠించ వలెను. నీవు, నీ పుత్రులున్ను వారి యెడల నిట్లే వ్యవహరించ వలెను. ఇట్లు చేయుటయే సముచిత మని భీష్మునితో పాటు, నేనుగూడ భావించుచున్నాను."

"జనమేజయా ! ద్రోణాచార్యు డిట్లు చెప్పిన తరువాత కర్ణుడు ధృత రాష్ట్రునితో నిట్లనెను :-

"మహారాజా! భీష్మ - ద్రోణులకు నీవు ఎల్లప్పుడు ధనమిచ్చి సమ్మా నించు చుందవు. వీరు నీకు అంతరంగ మిత్రులని అన్ని కార్యములయందు వీరితో సంప్రదించు చుందువు అట్లైనను, వీరు నీకు శ్రేయస్కరమైన యుప దేశములు చేయుట లేదు. ఇది ఆశ్చర్యకరము కదా!"

"రాజా! మనస్సులోని చెడు తలంపును కప్పిపుచ్చుకొని దుష్టహృదయ ముతో ఉపదేశించు పురుషులు తమను విశ్వసించిన సత్పురుషులకు శ్రేయస్సు ఎట్లు చేయగలుగుదురు? మిత్రులు ఆర్థిక సంకటము కలిగినప్పుడు గాని లేక, కఠినమైన కార్యము చేయవలసి నప్పుడు గాని, మంచి చేయుదురు. చెడును ఎప్పు డున్ను చేయరు. అందరికి సుఖదుఃఖములు వారి - వారి భాగ్యానుసారముగా సంభవించు చుండును."

"రాజా! మనుష్యుడు బుద్ధిమంతుడై కృతజ్ఞుడైనను లేక మూర్ఖుడై అకృతజ్ఞుడైనను, బాలకుడైనను వృద్ధుడైనను, సహాయము గలవాడైనను, అసహాయుడైనను అందరు గూడ దైవయోగముచేత అన్ని సందర్భములలో అన్నియు పొందగలరు."

"రాజా! పూర్వము 'రాజగృహ' నగరమందు 'అంబువీచ' నామముగల ఒక సుప్రసిద్ధరాజు రాజ్యము చేయుచుండెను. అతడు మాగధరాజులలో నొకడు, అతనికి శ్వాసరోగమువలన ఏ యింద్రియము గూడ పనిచేయజాలకుండెను. అతడొకచోట పడియుండి దీర్ఘముగా ఊపిరి పీల్చుచుయుండెను. కనుక, నతడు ప్రతికార్యమందు మంత్రి వశమునందే యుండవలసి వచ్చెను."

""రాజా! అతని మంత్రిపేరు 'మహాకర్ణి'. ఆ దినములలో మంత్రియే అక్కడి రాజై యుండెను. సైనికబలము అతని వశములో నుండెను. కనుక తాను బలవంతుడనని తలచి రాజును తిరస్కరించుచు అవమాన పరచుచు నుండెను. ఆ మూర్ఖమంత్రి రాజు అనుభవించుటకు వచ్చిన స్త్రీలను, రత్నములను, ధనములను, ఐశ్వర్యమును గూడ తానే యనుభవించు చుండెను."

"రాజా! ఇవి యన్నియు పొందినప్పటికిన్ని ఆ మంత్రికి ఉత్తరోత్తర లోభము పెరుగుచుండెను. ఇట్లు అన్ని వస్తువులు తీసికొని ఆ మంత్రి రాజ్యమును గూడ అపహరింపదలచు చుండెను. రాజు సమస్తేంద్రియముల శక్తి లోపించి యుండుటచేత కేవలము, శ్వాస పీల్చుచున్నప్పటికిన్ని ఎంత ప్రయత్నించినను, దుష్టమంత్రి ఆ రాజ్యమును అపహరింప జాలక పోయెను."

"రాజా! రాజుయొక్క రాచరికము అతని యదృష్టము చేతనే సురక్షితమై యుండును. అతని ప్రయత్నముచేత సురక్షితము కాదు కనుక భాగ్యము కంటె మించి ఇతర సహాయము ఏది యుండ గలదు?"

"మహారాజా! నీ యదృష్టములో రాజ్యము ఉండిన యెడల నీకు ఉండియే తీరును. నీ భాగ్యములో అది లేకుండిన యెడల నీవు ఎంత ప్రయత్నించినను దానిని పొంద జాలవు."

"రాజా! నీవు వివేకము గలవాడవు. కనుక, ఈ విధముగానే విచారించి నీ మంత్రులలోని సాధుత్వాసాధుత్వములను గమనించుచు ఎవడు నీకు దుష్ట హృదయముతో నుపదేశించు చున్నాడు ఎవడు మంచి హృదయముతో నని గూడ నీవు తెలిసికొన వలెను."

"జనమేజయా! కర్ణుని మాటలు విని ద్రోణాచార్యుడు కర్ణుని నధిక్షేపించుచు నిట్లనెను" :

"దుష్టుడా! నీ వెందు కిట్లు మాట్లాడు చున్నావో మాకు తెలియును. నీ మనస్సులో గూడుకట్టుకొని యున్న పాండవ ద్వేషము చేత నా మాటలలో ద్వేషము నారోపించు చున్నావు. కర్ణా! నేను వివేకముతో కురుకుల వృద్ధికి అత్యంత హితమైన మాట చెప్పెదను. ఇది తప్పు అని నీవు తలచిన యెడల కౌరవులకు ఏమి చేసిన పరమ హితము కలుగునో చెప్పుము. నేను అత్యంత హితమైన మాట చెప్పుచున్నాను. నేను చెప్పిన దానికి వ్యతిరేకముగా ఏమైన చేసిన యెడల కౌరవులకు శీఘ్రముగా వినాశము కలుగును."

జనమేజయా! యిట్లు ద్రోణాచార్యుడు చెప్పిన తరువాత విదురు డిట్లనెను :

**విదురుని సమ్మతి - భీష్మ ద్రోణుల మాటల సమర్థనము :-**

ధృతరాష్ట్ర మహారాజా! నీకు నిస్సందేహముగా హితకరమైన మాట చెప్పుట నీ హితైషులైన బంధువుల కర్తవ్యము. కాని అది వినుటకు నీవు ఇష్టపడవు. గనుక నీ హృదయమందు వారి హితవచనములు గూడ స్థిరముగా నిలువకున్నవి. భీష్మ - ద్రోణులు నీకు ప్రియములు హితములు నైన మాటలు అనేక విధములుగ చెప్పిరి. కాని, కర్ణుడు వారి మాటలు నీకు హితకరములు కావని తలచు చున్నాడు.

"మహారాజా! నేను ఎంత విచారించినను భీష్మ - ద్రోణులకంటె నీ హితము కోరువాడు మరియొకడు నాకు కనబడకున్నాడు, వీరిరువురు వయస్సులో బుద్ధిలో శాస్త్రజ్ఞానములోను అందరి కంటే మించి యున్నారు. నీ యెడల పాండవుల యెడలను సమానభావము కలవారు. ఈ యిరువురు ధర్మమునందు సత్యమునందున్న శ్రీరాముని కన్నను గయునికన్నను ఏ మాత్రము తీసిపోరు.

నీకు అనిష్టమైన విషయము ఎప్పుడు గూడ వీరు చెప్పలేదు. నీకు వీరు అపకారము చేసినట్లు గూడ నేను చూడలేదు. నీవు గూడ వీరికి అపరాధము చేయలేదు. ఇట్లుండగా, భీష్మద్రోణులు నీకు హితోపదేశము ఎందుకు చేయకుందురు?

"రాజా! భీష్మద్రోణులు ప్రపంచములో మహాబుద్ధిశాలురు. వీరు కుటిల భావముతో ఎప్పుడు గూడ నీ యెడల ప్రవర్తింపరు. ఈ యిరువురు ధర్మజ్ఞులైన మహాపురుషులు గనుక స్వార్థముచేత ఒక పక్షమునకు మాత్రమే లాభము కలిగించు మాట ఎప్పుడు గూడ చెప్పరు.

"రాజా! వీరు సమ్మతించిన విషయమే అత్యంత శ్రేయస్కర మని నేను గూడ తలచెదను. దుర్యోధనాదులవలె పాండవులు గూడ నీకు పుత్రులే యనుమాట తెలియనట్టి కొందరు మంత్రులు నీకు పాండవులను గూర్చి అహితమైన యుప దేశము చేసిన యెడల ఆ మంత్రులు నీ శ్రేయస్సు తెలియకున్నారు. నీకు నీ పుత్రులయందు విశేష పక్షపాతమున్న యెడల అది అందరి యెదుట నీకు తెలుపు వారు నీకు మేలు చేయజాలరు.

"రాజా! అందుచేతనే భీష్మద్రోణులు నీకు స్పష్టముగా చెప్పజాల కున్నారు. వీరు నీకు మంచి యుపదేశము చేసిరి. కాని, నీవు దాని నంగీకరించ కున్నావు. పాండవులు అజేయులని వీరు చెప్పిన మాట పూర్తిగా సరియైనది. రెండు చేతులతో బాణములను ప్రయోగించు సవ్యసాచియైన అర్జునుని ఇంద్రుడు గూడ యుద్ధములో ఎట్లు జయింపగలడు? పదివేల యేనుగుల బలముగల భీమసేనుని దేవతలు గూడ ఎట్లు జయించగలరు? ఇట్లే యుద్ధ నిపుణులై యమరాజ పుత్రులవలె భయంకరులైన నకుల - సహదేవులను, బ్రతుక దలచిన వాడెవడు జయించగలడు? ధైర్యము, దయ, ఓర్పు, సత్యము, పరాక్రమము మొదలైన గుణములు ఎవనియందు నిత్య నివాసము చేయుచున్నవో అట్టి యుధిష్ఠిరు నెవడు జయించ గలడు?

"రాజా! బలరామునకు ప్రేమపాత్రులై శ్రీకృష్ణుని యుపదేశము గలిగి సాత్యకివంటి వీరులు సహాయకారులుగా నున్న పాండవులు యుద్ధమునందు ఎవరిని ఓడింపజాలరు? ఎవరికి ద్రుపదుడు మామయో ద్రుపద పుత్రులైన

ధృష్టద్యుమ్నాది సోదరులు శ్యాలకులో (బావమరదులు - భార్య సోదరులు), అట్టి పాండవులను యుద్ధభూమిలో జయించుట యసంభవము.

"రాజా! ఈ విషయము లన్నియు తెలిసికొని పూర్వము రాజ్యము వారి తండ్రిదే యగుటచేత ధర్మము ప్రకారము ఈ రాజ్యమునకు ఉత్తరాధికారులు పాండవులే యని తలచి నీవు వారితో మంచిగా వ్యవహరింపుము.

"రాజా! పురోచనునిచేత మీరు చేయించిన కార్యమువలన నీ యపకీర్తి దేశమందంతటను వ్యాపించియున్నది. నీవు నేడు పాండవులను అనుగ్రహించి ఆ కళంకమును, ప్రక్షాళితము చేసికొనుము. పాండవుల యెడల నీవు చూపించు ఈ యనుగ్రహము మనకులజు లందరి జీవితమునకు రక్షణమేకాక పరమహిత కరము సమస్త క్షత్రియ జాతికి అభ్యుదయకరమున్ను కాగలదు

"రాజా! ద్రుపదుడు గూడ చాల పెద్దరాజు. పూర్వము మనతో అతనికి వైరము గూడ నుండెను. కనుక, అతనిని మిత్రుడుగా మనలో చేర్చుకొనుట, మన పక్షమునకు అభివృద్ధి కారణము కాగలదు. యదువంశీయులు బహు సంఖ్యాకులుగా నున్నారు. వారు బలవంతులు శ్రీకృష్ణునివైపే వారందరు గూడ నుండగలరు. కనుక అవశ్యముగా శ్రీకృష్ణుని పక్షమునకు విజయము కలుగును.

"మహారాజా! ఏ కార్యము శాంతిపూర్వకముగా సాధించుటకు వీలగునో దానిని ఏ మనుష్యుడు యుద్ధము ద్వారా నెరవేర్చదలచును?

"రాజా! పాండవులు జీవించియున్నారని తెలిసిన నగరవాసులు, దేశములు అందరుగూడ వారిని చూచుటకు మిక్కిలి ఉత్సుకులై యున్నారు. కనుక, వారందరికి ప్రియము చేయుము.

"రాజా! కర్ణ-శకుని-దుర్యోధనులు అధర్మ పరాయణులు, దుర్బుద్ధి గల వారు, వివేకరహితులు. కనుక, వారిమాట అంగీకరింపకుము. నీవు గుణవంతుడవు. దుర్యోధనుని యపరాధముచేత ప్రజలందరు నశించెదరని పూర్వమే నీకు చెప్పియుంటిని."

"జనమేజయా! ఇట్లు విదురుడు చెప్పగా విని ధృతరాష్ట్రుడు విదురునితో నిట్లనెను:-

**ధృతరాష్ట్రుని యాజ్ఞచేత విదురుడు ద్రుపదపురమునకు పోయి పాండవులను హస్తినాపురమునకు పంపుమని కోరుట:-**

"విదురా! భీష్మ-ద్రోణులు ఋషులే యనుట నిశ్చయము. వీరి మాట మిక్కిలి హితకరము. నీవు చెప్పినమాట గూడ సత్యమే. పాండవులు పాండు రాజునకు వలె నాకు గూడ పుత్రులే. నా పుత్రులకువలెనే పాండుపుత్రులకుగూడ ఈ రాజ్యమునందు అధికారము గలదు.

"కాబట్టి, విదురా! ఇప్పుడు నీవే పోయి పాండవులను కుంతీదేవితో, కృష్ణాదేవితోను సగౌరవముగా నిక్కడకు తోడ్కొని రమ్ము. పాండవులు, కుంతీ దేవియు జీవించి యుండుట, వారు ద్రౌపదిని వివాహమాడుటయు పరమ సౌభాగ్య కారణములు. ఇట్టి సౌభాగ్యముచేతనే మనయభివృద్ధి కలుగుచున్నది. పురోచనుడు చచ్చుట వానివలన నాదుఃఖము పోవుటయు మనభాగ్యము వలననే కదా".

"జనమేజయా! ధృతరాష్ట్రుని యాజ్ఞప్రకారము విదురుడు ద్రౌపదీ - పాండవ - ద్రుపదులకొరకు వివిధ ధనరత్నములను కానుకలుగా తీసికొని ద్రుపదపురికి పోయెను. విదురుడు న్యాయము ప్రకారము జ్యేష్ఠ - కనిష్ఠ క్రమము చేత ద్రుపదుని, తదితరులనున్ను కౌగిలించుకొని నమస్కారాదులు చేసెను. ద్రుపదుడు గూడ ధర్మానుసారముగా విదురుని ఆదరించి సత్కరించెను. కుశల ప్రశ్న చేసిన తరువాత విదురుడు అక్కడ పాండవులను, శ్రీకృష్ణుని గూడ చూచి స్నేహపూర్వకముగ వారిని కౌగిలించుకొనగా వారుగూడ విదురుని సత్కరించిరి. విదురుడు పాండవుల కుశల మడిగెను. తరువాత విదురుడు అందరికిన్ని వివిధ ధన-రత్నాదులు ఇచ్చి పాండవులు, శ్రీకృష్ణుడున్ను అక్కడ ఉండగా, వారితో వినయపూర్వకముగ నిట్లనెను :-

"ద్రుపద మహారాజా! నీవు నీ మంత్రులతోను, పుత్రులతోను నామాట వినుము. ధృతరాష్ట్రుడు మీ కుశల ప్రశ్న చేసెను. మీతో జరిగిన బాంధవ్యము నకు చాల సంతోషించినాడు. భీష్ముడు, తదితర కౌరవులున్ను మీ యందరిక్షేమ

మడుగు మనిరి. నీమిత్రుడు ద్రోణాచార్యుడుగూడ ఆలింగన పూర్వకముగ నీ కుశల మడిగెను. ధృతరాష్ట్రుడు కౌరవులున్ను నీ సంబంధముచేత కృతార్థుల మైతి మని తలచుచున్నారు. వారికింత సంతోషము రాజ్యప్రాప్తివలన గూడ గలుగదు.

"కనుక, రాజా! ఇది తెలిసికొని నీవు పాండవులను హస్తినాపురమునకు పంపుము. అక్కడ కౌరవులు, ప్రజలు అందరుగూడ పాండవులను చూచి వారితో కలిసికొనుటకు మిక్కిలి ఉత్సుకులై యున్నారు. వీరు చాలకాలమునుండి పరదేశములో నున్నారు. కనుక, స్వదేశము చూచుటకు వీరికిగూడ ఉత్సాహము ఉండవచ్చును. కృష్ణాదేవిని చూచుటకు అక్కడి స్త్రీలు, నగరములు, దేశవాసులున్ను వేచి యున్నారు.

"కనుక, రాజా! నీవు పాండవులను వారి పత్నితో గూడ హస్తినాపురము పోవుటకు ఆజ్ఞ యిమ్ము. నీ యాజ్ఞ వినగానే, నేను ధృతరాష్ట్రునకు దూతద్వారా కుంతీదేవితో, కృష్ణాదేవితోనూ పాండవులు హస్తినాపురమునకు రాగలరని సందేశము పంపెదను."

"జనమేజయా! ఇట్లు విదురుడు చెప్పగా విని ద్రుపదు డతనితో నిట్లనెను:-

**పాండవులు హస్తినాపురికి వచ్చి అర్ధరాజ్యము బడసి ఇంద్రప్రస్థ నిర్మాణము చేయుట - శ్రీకృష్ణబలరాములు ద్వారకకు పోవుట :-**

"విదురా! నీవు చెప్పినమాట లన్నియు చాల బాగుగా నున్నవి. కౌరవుల సంబంధముతో నేను గూడ చాల సంతోషించు చున్నాను. పాండవులు తమ పట్టణమునకు పోవుటగూడ చాల సముచితముగా నున్నది. కాని, వీరిని పొమ్మని చెప్పుట నాకు మంచిది కాదు. పాండవులు స్వయముగా అక్కడకు పోవ దలచి, శ్రీకృష్ణ-బలరాముల యంగీకారమున్నయెడల వీరు అవశ్యముగా పోవచ్చును. ఎందుకనగా, శ్రీకృష్ణ - బలరాములు సర్వదా పాండవులకు ప్రియ - హితములు చేయు చుండెదరు గదా!"

అప్పుడు యుధిష్ఠిరుడు ద్రుపదునితో, 'రాజా! మేము సపరివారముగా నీ యధీనములో నున్నాము. కనుక, నీవు చెప్పినట్లే చేసెదము' అని యనెను.

"జనమేజయా! అప్పుడు శ్రీకృష్ణుడు, పాండవు లక్కడకు పోవుటయే మంచిదని తలచెదను. లేదా, సర్వధర్మజ్ఞుడైన ద్రుపదునకు ఏది ఉచిత మని తోచునో, అట్లే చేయవచ్చును.' అని యనగా, ద్రుపదు డిట్లనెను :-

"శ్రీకృష్ణా! యిప్పుడు నీవు ఏది సముచిత మని తలచెదవో, అదియే నాకుగూడ సమ్మత మగును. పాండవులు నాకెంత ప్రియులో నీకుగూడ అంతయే. వారికి ఏది హితమో, శ్రేయస్కరమో, అది నీకు తెలిసినంతగా యుధిష్ఠిరునకు తెలియదు."

"జనమేజయా! అప్పుడు విదురుడు కుంతీదేవికడకు పోయి, ఆమెకు పాద వందనము చేయగా నతనిని చూచి కుంతి మిక్కిలి దుఃఖించుచు నిట్లనెను !

"మహాత్మా విదురా! నా పుత్రులైన పాండవులు నీ కృపానుగ్రహముల చేతనే జీవించి యున్నారు. నీదయచేతనే వీరు లక్కయింటినుండి బ్రతికి నీ కడకు వచ్చినారు. తాబేలు తనసంతాన మెక్కడ నున్నను, ఎల్లప్పుడు తన పుత్రులనే తలచుచు వారిని పాలించుచు పోషించు చుండుటవలనే, ఆ తాబేలు పుత్రులు జీవించు చున్నట్లు, నా పుత్రులైన పాండవులు నీ శుభాకాంక్షల చేతనే జీవించి యున్నారు. నీవే వీరికి రక్షకుడవు. కోకిలపిల్లలను, కాకి రక్షించునట్లె నేను వారిని రక్షించినాను. నేను అనేక ప్రాణాంతకము లైన కష్టము లనుభ వించితిని. ఇకపైన, నాకర్తవ్య మేమో, నాకు తెలియదు. అది యంతయు నీవే యెరుగుదువు."

"జనమేజయా! యిట్లు చెప్పి కుంతీదేవి మిక్కిలి దుఃఖించు చుండెను. అప్పుడు, 'నీవు దుఃఖింపకుము' అని విదురుడు ఆమెతో చెప్పి, 'అమ్మా బల వంతులైన నీ పుత్రులు ఇతరులు బాధపెట్టుటచేత నశించరు. ఇప్పుడు వారు కొలది దినములలోనే, సమస్త బంధువులతో పాటు తమ రాజ్యమును పొంది అధికారము వహించగలరు. నీవు దుఃఖింపకుము" అని యనెను.

"జనమేజయా! తరువాత విదురుడు ద్రుపదాజ్ఞచేత, శ్రీకృష్ణునితో, కృష్ణా దేవితో, కుంతీదేవితో, పాండవులతోను, సంతోషపూర్వకముగా హస్తినాపురము నకు పోయెను.

"జనమేజయా! అప్పుడు ద్రుపదుడు పాండవులకు, బంగారు అంబారీలతో సువర్ణకంఠాభరణములతో, సువర్ణాంకుశములతో అనేక సువర్ణాభరణములతోను అలంకరింపబడిన ఒక వేయి యేనుగులను ఇచ్చెను. వాని గండస్థలముల నుండి మదధారలు స్రవించు చుండెను. అవి సమస్త శస్త్రాస్త్ర సహితులు, సమర్థులు నైన మావటివారితో గూడి యుండెను."

"జనమేజయా! ద్రుపదరాజు పాండవులకు సువర్ణమణిభూషితములై, నాలుగు గుఱ్ఱము లొక్కొక్కదానికి కట్టబడిన ఒక వేయిరథములిచ్చెను. ఇవి గాక, ఏబదివేల యుత్తమజాతి గుఱ్ఱము లిచ్చెను. అవి సువర్ణాలంకారభూషిత ములై, చామరములతో నొప్పు చుండెను. ఇవిగాక, సర్వాలంకార భూషితలైన పదివేల దాసీజనములను, ధనుర్ధారులైన ఒక వేయిమంది దాసజనులను గూడ పాండవుల కిచ్చెను."

"జనమేజయా! అనేక శయ్యలు, ఆసనములు, పాత్రలున్ను సువర్ణ మయములైనవి యిచ్చెను. ఇంకను, నితర వస్తువులనేకములు - గోవులు నొక్కొక్క కోటిసంఖ్యలో ద్రుపదరాజు మిక్కిలి హర్షముతో నిచ్చెను. నూరు పల్లకీలు, వానిని మోయుటకు ఐదునూర్లమంది బోయిలను, అనేక ధనములను పాండవులకు ద్రుపదుడు కట్నములుగా నిచ్చెను. ధృష్టద్యుమ్నుడు స్వయముగా చెల్లెలిచేయి పట్టుకొని రథమెక్కించెను. అప్పుడనేకవాద్యములు మ్రోగుచుండెను."

"జనమేజయా! ధృతరాష్ట్రుడు, పాండవులు వచ్చుచుండుట తెలిసి, వారికి స్వాగతము చెప్పుటకు కౌరవులను పంపెను. వికర్ణ - చిత్రసేనాదులు, ద్రోణా చార్య - కృపాచార్యులున్ను పాండవుల కెదరుగా బోయిరి. వారందరితో కలిసి పాండవులు హస్తినాపురములో ప్రవేశించిరి. నగరవాసులు పట్టణము నలంకరించి యుండిరి. త్రోవలలో పువ్వులు పరవబడి యుండెను. నగరమంతట నీరు చల్ల బడి యుండి, దివ్యధూప సుగంధవ్యాప్తమై, వివిధాలంకారభూషితమై యుండెను. పతాకలు, ధ్వజములు, పుష్పమాలికలున్ను ఉన్నత భవనములపై శోభిల్లు చుండెను. శంఖ - భేరీమృదంగాది వాద్యములు మ్రోగుచుండగా నగరమంతట నీరు చల్లబడి యుండి, దివ్యధూప సుగంధవ్యాప్తమై, వివిధాలంకార భూషితమై యుండెను. పతాకలు, ధ్వజములు, పుష్పమాలికలున్ను ఉన్నత భవనములపై

శోభిల్లు చుండెను శంఖ - భేరీ మృదంగాది వాద్యములు మ్రోగు చుండగా నగరమంతట కౌతూహలముతో దేదీప్యమానముగా నుండెను పాండవులు అందరి దుఃఖము నివారించువారుగా నుండిరి గనుక, ఆ నగరమందు వారి ప్రీతికొరకు ప్రజలు అనేక ప్రీతి వాక్యములు ఇట్లు పలుకుచుండిరి."

"ధర్మాత్ము డైన యుధిష్ఠిరుడు ఇతడే కదా! ఇతడు మన నగరమునకు మరల వచ్చు చున్నాడు. ధర్మముతో పుత్రులవలె ఇతడు మనను రక్షించు చుండెను. అత డిక్కడికి వచ్చుటచేత సాక్షాత్తు పాండురాజే వనమునుండి మనకు ప్రియము చేయుటకు వచ్చు చున్నాడా యనిపించు చున్నది. పాండవు లిక్కడికి వచ్చుటచేత మన కార్యము లన్నియు నెరవేరెను. మన దాన - హోమ - తపస్సుల ఫలము ఏ మాత్రము మిగిలి యుండినను దానిబలము చేత పాండవు లిక్కడ నూరేండ్ల వరకు నివసించ గలరు."

"జనమేజయా! ఇంతలోనే పాండవులు వచ్చి, భీష్మ - ద్రోణ - ధృతరాష్ట్రాది మాననీయులకు పాదవందనము చేసిరి. తరువాత, నగర వాసులతో, కుశల ప్రశ్నలు చేసి ధృతరాష్ట్రుని యజ్ఞచేత రాజభవనమునకు పోయిరి."

"జనమేజయా! కాశిరాజుపుత్రి యైన దుర్యోధనుని భార్య అప్పుడు తోడి కోడంద్రతో వచ్చి, రెండవ లక్ష్మీదేవియా యనునట్లున్న ద్రౌపదికి స్వాగతము చెప్పి ఆదరించెను. సాక్షాత్తు శచీదేవియే ఇంటిలో కాలిడినట్లుగా అందరున్ను సంతోషించిరి. దుర్యోధనుని భార్య ఆమెను మిక్కిలి సత్కరించెను. కుంతీదేవి ద్రౌపదితో పాటు పోయి గాంధారికి ప్రణామము చేసెను. ఆమె ఆశీర్వదించి ద్రౌపదిని కౌగిలించుకొని 'ఈ ద్రౌపది నా పుత్రులకు మృత్యువు వంటిదే' యని తలచి యుక్తితో విదురుని పిలిచి యిట్లనెను" :-

"విదురా! నీకిష్ట మైనచో, కుంతీదేవిని ఆమె కోడలితోపాటు త్వరగా పాండురాజు భవనమునకు తోడుకొని పోయి వీరి వస్తువు లన్నియు అక్కడ చేర్చుము. కుంతీదేవి, పుత్రులతోపాటు సుఖముగా నుండుటకుగాను మంచి నక్షత్రము, కరణమున్ను గల శుభదనము నందు ఆ యింటిలో వీరిని చేర్చుము.

"జనమేజయా! విదురుడు 'సరియే' యని చెప్పి అట్లే వారికి ఏర్పాట్లు చేసెను. బంధువు లందరు పాండవులను ఆదరించి సత్కరించిరి. ప్రముఖులైన నగరప్రజలు, వర్తకశ్రేష్ఠులు గూడ వచ్చి పాండవులను పూజించిరి. భీష్మ - ద్రోణ - కర్ణులు, పుత్రసహితుడైన బాహ్లికుడున్ను ధృతరాష్ట్రుని యాజ్ఞచేత పాండవులకు ఆతిథ్యసత్కారము చేసిరి. ఇట్లు హస్తినా పురమందు విహరించు చున్నపాండవులకు అన్ని కార్యములందున్ను విదురుడు, నాయకుడుగానుండెను. పాండవులకు అన్ని సౌకార్యములు సమకూర్చుటకుగాను ధృతరాష్ట్రుడు విదురునకు ఆజ్ఞ యిచ్చి యుండెను. ఇట్లు కొంతకాలము విశ్రాంతి తీసుకొనిన తరువాత పాండవులను భీష్మ ధృతరాష్ట్రులు పిలిపించిరి అప్పుడు ధృతరాష్ట్రుడు యుధిష్ఠిరునితో నిట్లనెను :-

"యుధిష్ఠిరా! నేను చెప్ప బోవుమాట నీవు సోదరసహితుడవై గమనించి వినుము. నాయాజ్ఞచేత పాండురాజు ఈ రాజ్యమును అభివృద్ధి పరచి పాలించెను. ఆతడు చాల బలవంతుడుగా నుండెను. నీవుగూడ నాయాజ్ఞ పాలించవలెను. జాగు చేయగూడదు. దురాత్ములైన నాపుత్రులు దర్పాహంకారముల చేత నాయజ్ఞను పాలించ కున్నారు. తమస్వార్థమును సాధించుటయందే తత్పరులై యున్న ఆ దురాత్ములతో మీకు మరల ఏలాంటిజగడము కలుగకుండ వలెను. గనుక, మీరు 'ఖాండవ ప్రస్థ' నగరమందు నివసింపుడు. ఇంద్రుడు దేవతలను రక్షించునట్లు అర్జునుడు మిమ్ము బాగుగా రక్షించు చుండును, గనుక, అక్కడ మీకు ఏలాంటి బాధయు కలుగదు. మీరు అర్ధరాజ్యము తీసికొని ఖాండవ ప్రస్థములో నుండుడు."

"జనమేజయా! ఇట్లు ధృతరాష్ట్రుడు పాండవులకు చెప్పి విదురునితో నిట్లనెను :-

"విదురా! నీవు త్వరగా రాజ్యాభిషేకసామగ్రి సమకూర్చుము. నేను నేడే యుధిష్ఠిరునకు రాజ్య పట్టాభిషేకము చేసెదను. వేదవేత్తలైన బ్రాహ్మణులను నగరమునందలి ప్రముఖ వ్యాపారు లందరను, ప్రజలను, బంధువులనున్ను పిలిపింపుము, పుణ్యాహవచనము చేయించి గ్రామములను దానముగా నిప్పింపుము.

"విదురా! రెండు భుజకీర్తులను, ఒక కిరీటమును, హస్తాభరణములను, పుష్పమాలికలను, ముక్తారత్నహారములను, పతకమును, కుండలములను, ధనములను, కటిసూత్రములనున్ను తెప్పింపుము. నూటయెనిమిది యేనుగులపై బ్రాహ్మణులను కూర్చొనబెట్టి పురోహితులతో పాటు అగజములు పోయిగంగా జలము తేవలెను.

"విదురా! యుధిష్ఠిరుడు అభిషేకజలముచేత తడిసియుండగా, భూషణాలంకృతుడై యుండగా, పట్టపుగజముపై కూర్చొని యుండగా, దానిపై చామరములు వీవ బడుచుండగా, అతనితలపై సువర్ణమణిమయ విచిత్రశ్వేతచ్ఛత్రము శోభిల్లు చుండగా, బ్రాహ్మణుల జయ-జయధ్వానములతో పాటు అనేకరాజులు అతనిని స్తుతించు చుండగా, నగరవాసులు చూచి మిక్కిలి సంతోషముతో యుధిష్ఠిరుని ప్రశంసించు చుందురుగాక! పాండురాజు తనరాజ్యమును నాకే యిచ్చెను గనుక, అట్టి ఉపకారమునకు. నేను చేయుప్రత్యుపకారము పాండు పుత్రుడైన యుధిష్ఠిరునకు రాజ్యాభిషేకము చేయుటయే".

"జనమేజయా! ధృతరాష్ట్రునిమాట విని భీష్మ-ద్రోణ-కృప-విదురులు 'చాల బాగున్నది' యని ప్రశంసించిరి. అప్పుడు 'శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రునితో- 'మహారాజా! నీతలంపు చాలశ్రేష్ఠముగా నున్నది. అది కౌరవులకీర్తిని పెంపొందించగలదు. నీ వనినట్లే నేడే పట్టాభిషేకకార్యము నెరవేర్చుము"

"జనమేజయా! శ్రీకృష్ణభగవాను డిట్లుచెప్పిన తరువాత విదురుడు ధృతరాష్ట్రుడు చెప్పినట్లు అన్నికార్యములు పూర్తిగా నెరవేర్చెను. ఆసమయమందే అక్కడకు వ్యాసమహాముని రాగా, ఆయనకు కౌరవు లందరు పూజచేసిరి.

"జనమేజయా! అప్పుడు వేదవేత్తలైన బ్రాహ్మణులతో, రాజులతోను, కలిసి, శ్రీకృష్ణభగవానుని సమ్మతి ప్రకారము వ్యాసభగవానుడు శాస్త్రోక్తముగ యుధిష్ఠిరునకు రాజ్యపట్టాభిషేకము చేయ దొడగెను. అప్పుడు భీష్మ-ద్రోణ-కృప-ధౌమ్య-వ్యాస-శ్రీకృష్ణ-బాహ్లీక-సోమదత్తాదులు చతుర్వేదవిదులైన బ్రాహ్మణోత్తములను ముందిడుకొని, సింహాసనము నందు కూర్చొని యున్న యుధిష్ఠిరునకు పట్టాభిషేకము చేసి, యతనితో 'రాజా!' నీవుసమస్త భూమండలమును జయించి రాజు లందరను వశమునం దుంచుకొని బహుళ దక్షిణలతో రాజసూ

యాదియాగములను అనుష్ఠించి అవభృథస్నానము చేసి బంధువులతో సుఖముగా నుండుము అని యాశీర్వదించిరి.

"జనమేజయా! ఇట్లు వారియాశీర్వాదమును పొంది పట్టాభిషిక్తు డైన యుధిష్ఠిరుడు అక్షయముగా దానములు చేసెను. అప్పు డందరు జయ - జయ ధ్వనులతో అతనిని స్తుతించిరి. రాజు లందరు అతనిని పూజించిరి.

"జనమేజయా! తరువాత యుధిష్ఠిరుడు గజరాజుపై కూర్చొని శ్వేతచ్ఛత్రశోభితు డై అతనివెనువెంట అనేకులు నడచు చుండగా దేవతలచే చుట్టబడిన యింద్రునివలె మిక్కిలి శోభిల్లుచు హస్తినాపురమంతట ఊరేగింపుతో ప్రదక్షిణము చేసి రాజభవనము నందు మరల ప్రవేశించెను. అప్పుడు నగర ప్రజలు అతనిని మిక్కిలి ఆదరించిరి. బంధువులు పట్టాభిషిక్తుడైన యుధిష్ఠిరుని అభినందించిరి. ఈ వైభవ మంతయు చూచి దుర్యోధనాదులు మిక్కిలి దుఃఖించుట తెలిసికొని ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుని సమక్షములో కౌరవులు విను చుండగా యుధిష్ఠిరునితో ని ట్లనెను.

"పుత్ర యుధిష్ఠిరా! సామాన్యపురుషులకు దుర్లభమైన పట్టాభిషేకము నీకు జరిగెను. నీవు కృతార్థుడ వైతివి కనుక, నిక నేడే 'ఖాండవప్రస్థ' మునకు పొమ్ము. మనపూర్వులైన పురూరవస్ - ఆయున్ - నహుష- యయాత్యాది-రాజేంద్రులు ఖాండవప్రస్థమునందే నివసించు చుండిరి. మనపురువంశరాజు లందరకు అదియే రాజధానిగా నుండెను. ఆతరువాతమునులు, బుధపుత్రుని (పురూరవసుని) వలనిభయముచేత ఖాండవప్రస్థమును నష్టపరచిరి. కనుక, నీ వానగరమును మరల నిర్మించుకొని రాష్ట్రాభివృద్ధి చేసికొనుము. నాలుగుజాతులప్రజలు మీతో గూడ అక్కడకు పోవుటకు నిశ్చయించుకొనినారు. నీయందలిభక్తిచేత ఇతరులు గూడ అనగరమునందు నివసించెదరు. నాయనా! ఆపట్టణము, ఆరాజ్యమున్ను నమస్త-ధన-ధాన్యసమృద్ధి మై యున్నది. కనుక, నీవు సోదరులతో నక్కడకు పొమ్ము.

"జనమేజయా! ధృతరాష్ట్రునియాజ్ఞను అంగీకరించి పాండవు లతనికి ప్రణామము చేసి, అర్ధరాజ్యము బడసి, భయంకరవనముగా నున్నఖాండవప్రస్థమునకు పోయిరి. తరువాత, వారు శ్రీకృష్ణునితోపాటు ప్రయత్నించి ఆ నగ

రమును ఉత్తమస్వర్గలోకమువలె శోభాయమానముగా నిర్మించిరి. అప్పుడు శ్రీకృష్ణుడు ఇంద్రుని తలచినంతనే ఇంద్రుడు శ్రీకృష్ణునిభావము తెలిసికొని విశ్వకర్మను పిలిచి అతనితో 'నీవు త్వరగా పోయి ఖాండవ ప్రస్థనగరమును నిర్మింపుము. నేటినుండి ఆ సుందర నగరము 'ఇంద్రప్రస్థము' అనుపేరుతో ప్రసిద్ధము కాగలదు' అని చెప్పెను.

"జనమేజయా! దేవేంద్రునియాజ్ఞచేత విశ్వకర్మ ఖాండవ ప్రస్థమునకు పోయి శ్రీకృష్ణభగవానునకు ప్రణామము చేసి, అతనితో 'నాకు ఏమి యాజ్ఞ'? అని యనగా శ్రీకృష్ణ డతనితో నిట్లనెను.

"విశ్వకర్మా! నీవు యుధిష్ఠిర మహారాజుకొరకు, మహేంద్రపురసమానమైన మహానగరమును నిర్మింపుము. ఇంద్రుని యభిప్రాయము ప్రకారమే ఆ నగరము ఇంద్రప్రస్థ మనుపేరుతో ప్రసిద్ధము కాగలదు."

"జనమేజయా! తరువాత, పాండవులు వేదవ్యాసమహామునిని ముందిడుకొని నగరనిర్మాణము కొరకు భూమిని కొలిపించి అక్కడ శుభ - శాంతికర్మలు చేయించిరి. ఆనగరము నలువైపుల సముద్రములవలె విశాలములు అగాధ, జల భరితములు నైన అగడ్తలు త్రవ్వింప బడెను. నిర్జల మేఘములవలె, చంద్రుని వలెను ప్రకాశించుచున్న నాలుగుకోటగోడలు ఆకాశమెత్తుగా నిర్మింపబడెను. సర్ప రాజులచేత భోగవతీనగరమువలె, ఆ కోటగోడలతో అగడ్తలతోను గూడిన యీ నగరము శోభిల్లు చుండెను. ఆ నగరపు పెద్ద-పెద్ద వాకిండ్లు, రెక్కలు విచ్చుకొనిన గరుడునివలె ననేకములుండెను. పెద్ద-పెద్దవాకిండ్లు బురుజులు ఆ నగర శోభను పెంచుచుండెను. మేఘములసమూహమువలె శోభిల్లుచు, మందరాచలము వలె నున్నతములైన గోపురము (పురద్వారము) లచేత ఆ నగరము అన్ని వైపుల సురక్షితమై యుండెను.

"జనమేజయా! అనగరమందు అన్నివైపుల అభేద్యములైన యనేక శస్త్రాగారములందు వివిధశస్త్రము లుంచబడి యుండెను. అక్కడ అంతట ఉక్కుతో చేయబడి, చేతితో నడుపబడు శక్తులు రెండు నాలుకల సర్పములవలె ఉండెను. ఈయన్నింటిచేత, నగరరక్షణము జరుగుచుండెను. ఆ శస్త్రాగారము నందు శస్త్రాభ్యాసము గూడ చేయబడు చుండెను ఎన్నియో బురుజుల చేత, అనేక యోధులచేతను సురక్షితమై తీక్ష్ణములైన యంకుశములు - శతఘ్నులు -

అనేక యుద్ధ యంత్రములు వీనిచేత ఆ నగరము శోభిల్లు చుండెను. అక్కడ ఇనుపచక్రములు సర్వత్ర ఉండెను. అతివిశాలము లైన మార్గము లుండెను. అక్కడ దైవికములైన పీడ లేవియు లేకుండెను. శుభ్రములు, శ్రేష్ఠములు నైన భవనముల చేత శోభిల్లు చున్న యా నగరము స్వర్గ లోకమువలె నుండెను.

"జనమేజయా! ఆ నగరమునందు, ఒక మంచి ప్రదేశమునందు యుధిష్ఠిరుని సుందర రాజభవనము, ఆకాశమునందు విద్యుత్ప్రభచేత వ్యాపించిన మేఘ మండలము వలె దేదీప్యమానముగా నుండెను. అపారధనరాసులు నిండి యుండుటచేత ఆ రాజభవనము కుబేరుని భవనమువలె నుండెను. వేదవేత్తలైన అనేక బ్రాహ్మణులు అనేక భాషలు తెలిసిన వారు అక్కడ నివసించుటకు ఇష్టముతో వచ్చిరి. అనేక దేశములనుండి వణిజులుగూడ ధనోపార్జనకై అక్కడకు వచ్చిరి.

"జనమేజయా! వివిధ శిల్ప కళాకోవిదులు ఆ దినములలో నింద్రప్రస్థ నగరమందు నివసించుటకు వచ్చిరి. నగరమంతట రమణీయోద్యానము లుండెను. ఆ తోటలలో మామిడి - కడిమి - అశోక - సంపంగి - పున్నాగ - నాగపుష్ప- లకుచ (నారింజ) - పనస - సాల (మద్ది) - తాళ (తాటి) - తమాల (కానుగు) పొగడ - ఆమ్రాత (అంబాళ) కాది ఫల - పుష్ప వృక్షము లుండెను.

అక్కడ, రాచఉసిరిక - లొద్దుగ - వికసించిన అంకోల - నేరేడు - పాటల - కుబ్జక - అతిముక్తకలతా - కరవీర - పారిజాతాది వివిధ ఫల - పుష్ప - వృక్షములు గూడ నుండెను. వానిపై ననేకవిధము లైన వేలకొలది పక్షులు అవ్యక్త మధురధ్వనులు చేయుచు ఉద్యాన శోభను పెంపొందించు చుండెను.

"జనమేజయా! అక్కడ మత్త మయూరములు కేకారవములు, ఉన్మత్త కోకిలములు కాకలీధ్వనులున్ను చేయుచుండెను. ఆయుద్యానమునందు అద్దమువలె మెరయుచున్న క్రీడా మందిరములు, అనేక విధలతా మండపములు నుండెను. మనోహర చిత్రశాలలు, రాజుల విహారయాత్రల కొరకు నిర్మింపబడిన కృత్రిమ క్రీడాపర్వతములున్ను ఆయుద్యానమును శోభిల్ల జేయుచుండెను. స్వచ్ఛజల భరితములైన బావులు కమలోత్పల సుగంధితములై, హంస - కారండవ -

చక్రవాకాది పక్షి సేవితములైన యనేక రమణీయ సరోవరములు, ఆయుద్యాన శోభను వృద్ధిపరచు చుండెను. అక్కడ రమణీయ పుష్కరణులు, అనేక రమ్య విశాలతటాకములున్ను సుందరముగా నుండెను.

"జనమేజయా! యుధిష్ఠిరుడు వేద పండితులైన బ్రాహ్మణులచేత మంగళాచరణ కార్యములు చేయించి, వ్యాస మహామునిని ముందిడుకొని, ధౌమ్యముని యభిప్రాయానుసారము, తమ్ములతో, శ్రీకృష్ణ భగవానునితోనున్న ముప్పది రెండు వాకిండ్లు గల తోరణము (బహిర్ద్వారము) ముందరకు వచ్చి 'వర్ధమాన' నామకమైన నగర ద్వారమందు ప్రవేశించెను. అప్పుడు శంఖ - దుందుభి - మృదంగాది వాద్యములు మ్రోగెను. వేలకొలది బ్రాహ్మణుల జయ - జయ ధ్వానములు వెడలెను. మునులు, సూతమాగధులు రాజును స్తుతించు చుండిరి.

"జనమేజయా! యుధిష్ఠిర మహారాజు గజముపై రాజ మార్గము గుండా పోయి మాంగళి కాలంకారములు చేయబడిన భవనములో ప్రవేశించెను. ఇట్లు సమ్మానపూర్వకముగ అక్కడికి పోయిన యుధిష్ఠిరుడు శ్రీకృష్ణునితోపాటు బ్రాహ్మణుల పూజ చేసెను. తరువాత, ఆ నగరము అసంఖ్యాక స్త్రీ పురుషులతో, గోవులతోను, కళకళలాడుచు, నక్కడ పైర్లు - పంటలున్ను వృద్ధి జెందు చుండెను.

"జనమేజయా! ఆ రాష్ట్రమునందు ప్రవేశించిన తరువాత పాండవుల సంతోషము పెంపొందుచుండెను. భీష్మద్రోణులు, యుధిష్ఠిరునకు అర్ధ రాజ్య మిచ్చి యతనిని హస్తినాపురమునుండి వీడ్కొల్పిన తరువాత, పాండవులు ఖాండవ ప్రస్థనివాసులైరి. ఇంద్ర సమాన శక్తి శాలురైన పంచ పాండవులచేత ఇంద్ర ప్రస్థనగరము సర్పరాజులు గల భోగవతీనగరమువలె శోభిల్లుచుండెను. తరువాత యుధిష్ఠిరుడు విశ్వకర్మను సత్కరించి పంపెను. పిదప వ్యాస భగవానుని సమ్మానపూర్వకముగా వీడ్కొల్పి యుధిష్ఠిర మహారాజు అప్పుడు పోవుటకు ఉద్యుక్తుడైన శ్రీకృష్ణ భగవానునితో నిట్లనెను:-

"మహానుభావా! నీ కృపచేతనే నేను రాజ్యము బడసితిని. నీ యను గ్రహముచేతనే అతిదుర్గమమైన యీ నిర్జనప్రదేశము నేడు ధన-ధాన్య సమృద్ధ

మైన రాష్ట్రముగా నేర్పడెను. నీ దయచేతనే మేము రాజ్యసింహాసనముపైన కూర్చొన గలిగితిమి. మాధవా! అంత్యకాలమునందు గూడ నీవే మా పాండవు లకు శరణ్యము. నీవే మా తల్లివి, తండ్రివి ఇష్టదైవమవుగా నున్నావు. మేము పాండురాజును ఎరుగము. నీవే మాకు దిక్కు. నీవు స్వయముగా యోచించి మేము చేయదగిన కార్యము మాతో చేయించుము."

ఆ మాటకు శ్రీకృష్ణుడు యుధిష్ఠిరునితో నిట్లనెను:-

"మహాభాగా! నీ ప్రభావముచేతనే నీ ధర్మఫలముగానే నీకు రాజ్యము లభించెను. నీ తండ్రి తాతల రాజ్యము నీకెట్లు లభించదు? ధృతరాష్ట్రపుత్రులు దుష్టప్రవర్తన గలవారు. ఐనను వారు పాండవులకు ఏమి బాధ చేయగలరు? నీ యిచ్ఛానుసారముగా రాజ్యము పాలించుచు ధర్మమును దాటకుండ రాజ్య భారము వహింపుము. బ్రాహ్మణులను సేవింపుడు. మీకు సంక్షేపముగ నేను ఉపదేశించు ధర్మ మిదియే. నేడే నీ కడకు నారదమహాముని రాగలడు. ఆయ నను ఆదరపూర్వకముగా సత్కరించి, ఆయన యుపదేశము విని ఆయన యాజ్ఞను పాలింపుడు."

జనమేజయా! శ్రీకృష్ణపరమాత్మ డిట్లు చెప్పి కుంతీదేవి కడకు పోయి ఆమెకు ప్రణమిల్లి మధురముగా నామెతో 'అత్తా! నమస్కారము. ఇప్పుడు నేను వెడలెదను. ఆజ్ఞ యిమ్ము' అని యనగా కుంతి శ్రీకృష్ణునితో నిట్లనెను:-

"కేశవా! నేను లక్కయింటికి పోయి అనుభవించిన కష్టములు నాతండ్రి కుంతిభోజునకు గూడ తెలియవు. నీవు తెలుపుము. నీ సహాయముచేతనే ఈ మహా దుఃఖసముద్రమును నేను దాటితిని. నీవు అనాథులకు విశేషించి దీనులకు దుఃఖి తులకున్న నాథుడవు (రక్షకుడవు). నీ దర్శనముచేత మా సర్వదుఃఖములు తొలగిపోయెను. పాండవులను సర్వదా జ్ఞప్తియం దుంచుకొనుము. నీ శుభచింత నముచేతనే వారు జీవించి యున్నారు."

"జనమేజయా! తరువాత, శ్రీ కృష్ణభగవానుడు కుంతీదేవితో, ఆమె యాజ్ఞను పాలించెదనని చెప్పి ఆమెకు నమస్కారము చేసి శీఘ్రముగా సపరివార ముగా అక్కడనుండి వెడలి పోవ దలచెను.

"జనమేజయా! ఈవిధముగా శ్రీకృష్ణభగవానుడు ఇంద్రప్రస్థనగరమును నిర్మించి బలరామునితో పాటు పాండవులయనుమతి తీసికొని ద్వారకాపురికి వెడలి పోయెను.

ఇట్లు వైశంపాయనుడు చెప్పగా, జనమేజయుడు అముని నిట్లడిగెను :-

**పాండవుల కడకు నారదుడు వచ్చి, వారితో భేదము కలుగకుండుటకు నియమములు చెప్పి సుందోపసుందులకథ చెప్పుట :-**

"మహామునీ! పాండవులు ఇంద్రప్రస్థ రాజ్యము పొందిన తరువాత ఏమి చేసిరి? మనోబలసంపన్నులైన నా ప్రపితామహులైదుగురను ద్రౌపది ఎట్లు అనుసరించెను? అందరు ద్రౌపదియందు అనురక్తులై యుండగా వారిలో పరస్పర భేదభావము ఎందుకు కలుగ లేదు? వారు పరస్పరము ఎట్లు వ్యవహరించుచుండిరి? విస్తారముగా చెప్పుము."

అప్పుడు వైశంపాయనుడు ఇట్లనెను :-

"జనమేజయా! పాండవులు ఖాండవ ప్రస్థమునందు ద్రౌపదితో విహరించుచుండిరి. నగరవాసులకు వారు అన్ని సౌకర్యములు కలిగించుచు నుండిరి.

ఇట్లుండగా నొకనాడు నారదుడు అకస్మాత్తుగా వారికడకు ఆకాశమార్గముగుండా వచ్చెను. ఆకాశ మార్గము నక్షత్రసహితమై, చంద్రసూర్యులచేత ప్రకాశమానమై గరుడ సంచార యోగ్యమై యుండును. కాబట్టి, ఆనభోమండలమందలి మార్గములో తపస్వులు కానివారు పోవుట అసాధ్యము.

"జనమేజయా! సమస్తప్రాణులచేత పూజింపబడువాడు, తపస్వి, మహాతేజస్వియునైన దేవర్షి నారదుడు అనేక నగరములను రాష్ట్రములను దర్శించుచు అక్కడకు వచ్చెను. ఆ మహర్షి సర్వవేదాంతశాస్త్రజ్ఞుడు - సమస్తవిద్యా సారంగతుడు, బ్రహ్మతేజస్సంపన్నుడు, ఆమహాముని న్యాయోచితముగ వ్యవహరించుచు నిరంతరము నీతితత్పరుడై యుండును.

"జనమేజయా! ఆ మహాముని తన ధర్మబలముచేత పరాత్పరుడైన పరమాత్మయొక్క జ్ఞానము సంపాదించెను. పరిశుద్ధాత్ముడైన నారదమహర్షి రజోగుణరహితుడు, శాంతుడు, మృదు-సరళస్వభావము గలవాడు. ఆ మహాముని

ధర్మాత్ములైన దేవ-దానవ - మనుష్యులకు సులభప్రాప్యుడు. ఆయనధర్మము, సత్ప్రవర్తనమున్ను సర్వదా అఖండితములై యుండును. ఆమునికి సంసార భయము ఏ మాత్రము లేదు. అయన అన్ని విధములైన వైదిక ధర్మములను మర్యాద (హద్దు) దప్పకుండునట్లుగా స్థాపించెను. అతని యాకారము ఉన్నత ముగా, తెల్లగాను నుండును. అతడు చాలకాలము యాత్రలలోనే గడపు చుండుము.

"ఆ మహాముని యింద్రు డిచ్చిన బహుమూల్యములైన రెండుశుభ వస్త్ర ములను ధరించును. అనన్యదుర్లభమైన బ్రహ్మతేజస్సుచేత విరాజమానుడై బృహస్పతిసమానబుద్ధిశాలియైన నారదమహాముని యుధిష్ఠిరరాజభవనమునందు ఆకాశమునుండి దిగెను.

"జనమేజయా! నారదమహాముని సంహితాశాస్త్రమునందు గల మానవ ధర్మమునందు, ప్రపంచములో క్రమప్రాప్తమైన ధర్మమందున్ను విద్వాంసుడు. ఆయన మధురసామగాన పండితుడు. మోక్షేచ్ఛగలవారందరి హితముకొరకు నారదుడు ప్రయత్నించు చుండెను."

"జనమేజయా! ఎవరికి ఎప్పుడు ఏ కార్యమునందు సహాయము చేయ వలెనో ఆమునికి బాగుగా తెలియును. అందరియెడల సమానభావము గలవాడై, వేదవిషయకములైన సందేహము లన్నిటిని నివారించు చుండెను. అర్థశాస్త్ర వివ రణము చేయునప్పుడు సంశయములను పోగొట్టును.

"జనమేజయా! వర్ణలోప-వర్ణాగమ-వృత్తి- (సమాసము) సంక్రమణ ములవలన శబ్దములకు ప్రయోగ కాలమునందు వచ్చుననేకార్థములను, వేరు వేరుగా వినబడు ననేక శబ్దములయొక్క ఏకార్థమును, శబ్దములయొక్క భిన్న-భిన్నార్థములనుగూడ నారద మహర్షి సమగ్రముగా నెరుగును.

"జనమేజయా! అన్ని అధికరణములలో, అన్ని అక్షరముల వికారముల లోను సరియైన నిర్ణయము చెప్పుటకు అందరికిన్ని నారదమహాముని ప్రమాణ భూతుడు. అనేక విధములైన అచ్చులు - హల్లులు - ఛందస్సులు - ఏకస్థానో త్పన్నములైన అక్షరములు - సమామ్నాయములు (వేదములు) ధాతువులు ఈ

యన్నిటి ఉద్దేశమును నారదుడు బాగుగా వ్యాఖ్యానించగలడు. ఆఖ్యాత - ప్రకరణమును (ధాతురూపతిజంతాదులు) ప్రతిపాదించగలడు. అన్ని శబ్ద సంధుల రహస్యములను ఆయన ఎరుగును. కాలధర్మముచేత నిర్దిష్టమైన యథార్థ తత్త్వమును విచారించి, లోకుల మనోభావములను గ్రహించి వారిని 'ఏమి చేయవలెను' అనికూడ ఆయనకు బాగుగా తెలియును.

"జనమేజయా! నారదముని 'విభాషిత (వైకల్పిక) - భాషిత (నిశ్చయ పూర్వకముగా చెప్పబడిన) ములు మనస్సులో గ్రహింపబడిన సమయము, వీని యొక్క యథార్థ స్వరూపము నెరుగును. ఆయన, తనకొరకు, ఇతరుల కొరకున్ను స్వర సంస్కారము, యోగసాధనమున్ను చేయుటకు తత్పరుడై యుండును. ప్రత్యక్షముగా నుండు స్వరములను, వచన స్వరములనున్ను నతడెరుగును. మాట మర్మము, ఆ మాటలోని యేకత్వానేకత్వములనున్ను ఆయన యెరుగును. ఆయనకు పరమార్థముయొక్క యథార్థ జ్ఞానము గలదు. ఆయన వివిధ వ్యతిక్రమము (అపరాధము) లను తెలియును. భేదాభేద దృష్టితో నా మహాముని, తత్త్వ విచారమునుగూడ పలుసార్లు చేయుచుండును.

"జనమేజయా! నారద మహాముని, శాస్త్రీయ వాక్యములయొక్క పెక్కు విధములైన యాదేశములను సమీక్షించగలవాడు. నానా విధార్థ జ్ఞానమునందు కుశలుడు. తద్ధిత ప్రత్యయముల జ్ఞాన మామునికి పూర్తిగా గలదు. ఆయన, స్వర - వర్ణ - అర్థములు; మూడింటిచేతనే వాక్కును అలంకరించును. ఆయన ప్రతి ధాతువు యొక్క ప్రత్యయములను నియమపూర్వకముగా ప్రతిపాదించగలడు. ఐదు విధములైన యక్షర సమూహములను *స్వరములను (అచ్చులను) గూడ నాముని యథార్థముగా తెలియును.

* కంఠ - తాలు (దవడలు) - మూర్ధ - దంత - ఓష్ఠ (పెదవి) ములు అనబడు నీ యైదు స్థానములు, అథవా, అభ్యంతర ప్రయత్నములు, వీని భేదము చేత, ఐదు విధము లని అక్షర సమూహములు చెప్ప బడెను. 'అ-ఇ-ఉ-ఋ-ఌ' ఈ యైదే మూల స్వరములు (అచ్చులు) ఇతర స్వరము లన్నియు, నీ యైదు స్వరముల దీర్ఘాది భేదములు. లేదా సంధుల వలన నేర్పడునవి యని తెలియ వలెను.

"జనమేజయా! అట్టి సర్వతోముఖ పాండిత్య విభూషితుడైన నారదమహాముని రాగా, యుధిష్ఠిరు డతనికి స్వాగతము చెప్పి - ప్రణామము చేసి యాసనమునందు కూర్చొన బెట్టినతరువాత, శాస్త్రోక్తముగా నర్ఘ్యపాద్యాదులతో ఆమునిని పూజించి, తన సమస్త రాజ్యము నర్పించెను. అప్పుడు ఆముని చాల ప్రసన్నుడై యుధిష్ఠిరుని ఆశీర్వదించి, శుభాకాంక్షలు తెలుపుచు 'కూర్చొనుము' అని చెప్పగా యుధిష్ఠిరుడు కూర్చొని 'నారదాగమనము' కృష్ణాదేవికి తెలిపెను.

"జనమేజయా! అప్పుడు కృష్ణాదేవి, పరిశుద్ధురాలై, యేకాగ్రచిత్తముతో పాండవులు - నారదముని యున్నచోటికి పోయి యా దేవర్షికి ప్రణామము చేసి, వినయముతో అంజలి బంధించి నిలిచెను. అప్పు డామెను నారదముని యాశీర్వదించి, 'ఇక నీవు అంతఃపురమునకు పొమ్ము' అని ఆమెను పంపి, ఏకాంతమునందు పాండవులతో, ద్రౌపది మీయందరకు నొకతెయే ధర్మపత్నిగా నున్నది. కనుక, మీలో పరస్పరభేదభావము కలుగ కుండునట్టి నీతిని అనుసరింపుడు' అని చెప్పి, వారికి సుందోపసుందుల కథ యిట్లు చెప్ప దొడగెను :-

"పాండవులారా! పూర్వము సుందుడు - ఉపసందుడు నని యిద్దరు రాక్షససోదరు లుండిరి. వారు సర్వదా ఒకటిగానే కలిసి యుండిరి. ఇతరులకు అవధ్యులై, (కేవలము వారు ఒండొరులు పోరాడి చావఁ గలుగుచు) మూడు లోకములలోను సుప్రసిద్ధులుగా నుండిరి."

"వీరులారా! వారికి ఒకటే రాజ్యము - ఒకటే యిల్లు ఉండెను. ఒక శయ్యపైననే శయనించుచు, ఒకే ఆసనముపై కూర్చొనుచు, ఒకటిగానే యిద్దరున్ను భుజించుచు నుండిరి. ఇట్లు వారు విడిపోవని ప్రేమగల వారైనను 'తిలోత్తమ' యను నప్సరస కొరకు, ఒండొరులను చంపికొనిరి.

కనుక యుధిష్ఠిరా! మీరు పరస్పర ప్రేమను వృద్ధి పొందించు సుహృద్భావమును రక్షించు కొనుటకు, మీలో విరోధము కలుగ కుండుటకున్ను, ఏదైన నొక నియమము చేసికొనుడు."

"జనమేజయా! యిట్లు నారదుడు చెప్పగా నామునితో యుధిష్ఠిరు డిట్లనెను:-

"మహామునీ! సుందోపసుందు లెవరి పుత్రులు? వారిలో విరోధ మెట్లు కలిగెను? వారెట్లు ఒండొరులు కొట్టుకొని చచ్చిరి? తిలోత్తమ యనునప్సరస యెవరి యధికారములో నుండెను? ఆమె యందు కోరిక చేతనే కదా సుందోప సుందులు పరస్పరము చంపి కొనిరి మహామునీ! నీ సంగతి యంతయు నెట్లు జరిగెను? విస్తారముగా చెప్పుము. బ్రహ్మన్ ఆకథ వినుటకు నాకు చాల ఉత్కంఠ కలదు."

ఆ మాటకు నారదు డి ట్లనెను :

**సుందోపసుందుల తపస్సు - వారికి బ్రహ్మ వర మిచ్చుట -రాక్షసులకు ఆనందోత్సాహములు :-**

"యుధిష్ఠిరమహారాజా! ఈ ప్రాచీనేతిహాసమును చెప్పెదను. తమ్ములతో వినుము :-

"పూర్వము హిరణ్యకశిపుని వంశమందు 'నికుంభ' నామము గల రాక్షసరాజు ఉండెను. అతడు మిక్కిలి తేజస్వి, బలవంతుడు, సుప్రసిద్ధుడు. అతనికి సుందుడు, ఉపసుందుడు అనుమహాబలసంపన్నులైన ఇద్దరు భయంకర పుత్రులు ఉండిరి. ఆ సోదరులు మిక్కిలి క్రూరులు. ఆ యిరువురకు ఒకే అభిప్రాయము. ఒకే నిర్ణయము, ఒకే కార్యము నుండెను. వారి సుఖ - దుఃఖములు గూడ ఏకాకారములై యుండెను. ఇద్దరు కలిసి తిరుగు చుండిరి. ఒకడిని విడచి ఒకడు ఆహార-పానీయములు తీసికొనక, ఇతరులతో విడిగా మాట్లాడక ఉండిరి. పరస్పరము వారు ప్రియముగాను మధురముగాను మాట్లాడుకొనుచు నుండిరి. వారు ఒకటే జీవాత్మ రెండు శరీరములలో విభక్తమై యున్నట్లుగా వారి స్వభావము, ఆచరణమున్ను ఒకటిగానే యుండెను. పరాక్రమవంతులైన ఆ రాక్షసు లిద్దరు సమానముగా వృద్ధి జెందు చుండిరి. ప్రతికార్యమందున్ను ఒక విధముగానే నిశ్చయము చేయుచుండిరి.

"యుధిష్ఠిరా! ఒకసారి సుందోపసుందులు సర్వలోక విజయము సాధించు నిచ్ఛతో గురువు నుండి దీక్ష బడసి వింధ్య పర్వతమునకు పోయి కఠోర తపస్సు చేయు చుండిరి. ఆకలి దప్పులను, కష్టములను సహించుచు,

జటావల్కలధారులై చాలకాలము ఘోరతపస్సు చేసిరి. వారి శరీరమునందంతట దుమ్ము గ్రమ్మి యుండెను. వాయుభక్షణము చేయుచు వారు తమశరీరమాంసము కోసి, ఖండములుగా అగ్నికి ఆహుతి యిచ్చు చుండిరి. కొంతకాలము పాదాంగుష్ఠాగ్రభాగములపై నిలిచి, భుజములు పైకెత్తి ఏకాగ్రదృష్టితో నాయిరువురు తపస్సు చేయుచుండిరి. వారి తపోవహ్నిచేత చాలకాలము తపించి యుండినందు వలన వింధ్య పర్వతము పొగలు గ్రక్కు చుండెను.

"యుధిష్ఠిరా! వారి యుగ్రతపస్సు చూచి దేవతలు మిక్కిలి భయపడి వారితపో భంగమునకు విఘ్నములు కల్పించు చుండిరి. దేవతలు వారికి పలుసార్లు రత్నరాసులను, సుందరస్త్రీలను పంపి వారిని ప్రలోభములో పడవేయుటకు ప్రయత్నించిరి. కాని, వారికి తపోభంగము కాలేదు.

"యుధిష్ఠిరా! తరువాత దేవతలు ఆత్మబలసంపన్నులైన యారాక్షసులపై మాయను ప్రయోగించిరి. ఆ మాయచేత నిర్మింపబడిన యారాక్షసుల సోదరీమణులు, తల్లులు, భార్యలు ఇతరబంధువులును వారికడకు పరుగెత్తుకొని వచ్చు చుండగా, వారి మాయానిర్మితుడైన యొక రాక్షసుడు శూలముతో పొడిచి క్రింద పడగొట్టు చుండెను. ఆబంధుజనుల భూషణములు క్రింద బడుచుండెను, వస్త్రములు, వెంట్రుకలును ఊడిపోవు చుండెను. వారెల్లరు సుందోపసుందులను పిలిచి మొర బెట్టుచు 'పుత్రులారా! మమ్ము రక్షింపుడు; సోదరులారా! మమ్ము రక్షింపుడు అని పలికిన మాటలు వినినప్పటికిన్ని ఆయిరువురు తపస్వులు తమతపోవ్రతము నుండి కొంచెము గూడ చలించక యుండిరి.

"యుధిష్ఠిరా! ఆయిరువురిలో నొక్కడు గూడ ఈ సంఘటనములచేత క్షోభ జెందక, కష్టపడక యుండుటచూచి, అమాయావినులైన స్త్రీలు, రాక్షసులును అదృశ్యులై పోయిరి. అప్పుడు సమస్తలోకములకు హితకారియైన బ్రహ్మదేవుడు సుందోపసుందులకడకు వచ్చి వరము కోరుకొను డనెను. అప్పుడు వారు అంజలిబద్ధులై బ్రహ్మదేవునితో 'భగవన్! మా తపస్సునకు నీవు ప్రసన్నుడవైన యెడల, మేమిరువురము సమస్త మాయాజ్ఞానము కలవారలము, అస్త్రశస్త్ర విద్యాపండితులము, బలవంతులము, స్వేచ్ఛారూపము ధరించ గలవారలము అమరులము నగునట్లును వరము ప్రసాదింపుము' అని ప్రార్థింపగా బ్రహ్మదేవుడు వారితో నిట్లనెను :-

"భక్తులారా! ఒకయమరత్వము దప్ప మీరు కోరినవరము లన్నియు మీకు లభించును. మీరుదేవతలతో సమానులుగా నుండుటకు మరియొకవిధ్య యేదైన కోరుకొనుడు."

"మేము మూడులోకములకు ఈశ్వరులము కావలె"నని సంకల్పించి ఈ ఘోరతపస్సు చేయుటకు మీరు ఆరంభించితిరి. మీ యుద్దేశ్యము అమరత్వ సిద్ధి కొరకు కాదు. కనుక, మిమ్ము నేను అమరులను చేయను."

ఆ మాటలు విని సుందోపసుందులు బ్రహ్మదేవునితో నిట్లనిరి:-

"పితామహా! అట్లైనయెడల మాయిరువురిలో ఒకరి నొకరుతప్ప మూడు లోకములలోని చరాచరభూతము లేవిగూడ మమ్ము చంప జాలకుండ, వానినుండి మాకుమృత్యుభయము లేకుండ వరమిమ్ము!"

ఇట్లు వారు ప్రార్థింపగా, 'మీరు కోరినవరము మీకు తప్పక యిచ్చెదను. మీ మృత్యువు మీరు కోరినట్లే యగుగాక'! యనియనెను.

"యుధిష్ఠిరా! అట్లు బ్రహ్మదేవుడు సుందోపసుందులకు వరమిచ్చి తపస్సు నుండి వారిని నివారించి బ్రహ్మలోకమునకు పోయెను. తరువాత సుందోప సుందులు ఆ వరముచేత సర్వలోకములయందున్న అవధ్యులై తమయింటికి తిరిగి పోయిరి. అట్లు వచ్చినవారిని చూచి బంధువులు సంతోషించిరి. వారు తలపై జటలు తీసి కిరీటము ధరించి అమూల్యములైన యనేకవస్త్రాభరణములు ధరించి, అకాలములో వెన్నెలవలె ప్రకాశించుచు, రాత్రింబవళ్ళు ఏకానందముతో నుండిరి. ప్రతియింటిలోను 'తినుము', సుఖ మనభవింపుము; దొంగిలించుము; రమింపుము; పాడుము; త్రాగుము; అనుశబ్దములు మ్రోగు చుండెను. అక్కడక్కడ బిగ్గరగా కరతాళధ్వనులు రాక్షసులు చేయగా, ఆనగర మంతయు, ఆనందోత్సాహములలో మునిగి యుండెను. స్వేచ్ఛారూపధారులైన సుందోపసుందులు అనేక సంవత్స రముల వరకు వివిధక్రీడలు ఆడుచు, ఎగురుచు, దుముకుచు సంతోషముతో నుండిరి.

ఇట్లు చెప్పి నారదుడు తరువాతి వృత్తాంతము యుధిష్ఠిరునితో ఈ విధముగా చెప్ప దొడగెను:-

**సుందోపసుందులు క్రూర కర్మలతో త్రిలోకములపై విజయము సాధించుట:-**

"యుధిష్ఠిర మహారాజా! ఆ వేడుకలు ముగిసిన తరువాత సుందోపసుందులు మూడు లోకములను తమ యధికారములో తచ్చుకొను కోరికతో దేశముపై దాడి వెడలుటకు సేనకు ఆజ్ఞాపించిరి. బంధు - మిత్ర - మంత్రుల యనుమతితో వారు రాత్రియందు మఘానక్షత్రమునందు బయలుదేరి యుద్ధ యాత్రకు వెడలిరి. గదా - పట్టిశ - శూల - ముద్గర - కవచాదులతో సంసిద్ధులైన దైత్యులసైన్యసమూహముతో వారు ప్రయాణము చేయుచుండిరి. చారణులు విజయ సూచకముగా మంగళ స్తుతి పాఠములలో ఆ యిరువురి గుణగానము చేయుచుండగా వారి యుద్ధ యాత్ర సాగుచుండెను.

"యుధిష్ఠిరా! యుద్ధోన్మత్తులైన యాదైత్యు లిద్దరు ఇచ్ఛానుసారముగా అన్ని యెడల పోవగల వారగుటచేత ఆకాశమున కెగిరి తొలుత దేవతా గృహములపై దాడిచేసిరి. వారి రాక విని, బ్రహ్మదేవుని నుండి వారికి లభించిన వరదానమును గూర్చి విచారించి దేవతలు స్వర్గము విడిచి బ్రాహ్మలోకమునకు పోయిరి. ఇట్లు ఆ రాక్షసులు ఇంద్రలోకమును జయించుకొని యక్షరాక్షసులను, ఆకాశచారులైన యితర భూతములనున్ను పీడించుచు చంపుచుండిరి.

"యుధిష్ఠిరా! సుందోపసుందులు భూమిలో దూరి పాతాళమునందలి నాగ కులములను జయించి సముద్ర తీరమునందున్న మ్లేచ్ఛ జాతులనన్నింటిని ఓడించిరి. వారు సమస్త భూమండలమును జయించుటకు పూనుకొని, సైనికులను పిలిచి వారితో అతి తీక్ష్ణముగా నిట్లనిరి.

"సైనికులారా! భూమండలమందు అనేక మహా యజ్ఞములుచేసి, హవ్య (దేవతల కిచ్చు హవిస్సు) - కవ్య (పితృ దేవతల కిచ్చు హవిస్సు)ములచేత దేవతల బల - పరాక్రమములను, సంపదనున్ను వృద్ధి పొందించుచున్న యనేక రాజర్షులు బ్రాహ్మణులు నున్నారు. యజ్ఞాది కర్మలు చేయుచున్న వారందరు రాక్షస ద్రోహులు, కనుక, మన మందర మేకమై వారిని వధించవలెను."

"యుధిష్ఠిరా! సముద్రపు తూర్పు - తీరమునందున్న తమ సైనికులకు క్రూరులైన సుందోపసుందులు ఇట్లు ఆజ్ఞ యిచ్చి, భూమండల మంతయు ఆక్రోమింప దొడగిరి. యజ్ఞము 'చేయుచున్న వారిని చేయించు చున్న బ్రాహ్మణులను అందరినికూడా ఆదైత్యులు వధించి ముందుకు సాగిపోవు చుండిరి వారి సైనికులు మున్యాశ్రమములకు పోయి మునుల యగ్ని హోత్ర సామగ్రులను తీసికొని నిర్భయముగా నీటిలో పారవేయు చుండిరి. కొందరు తపోధనులు క్రుద్ధులై ఆ రాక్షసులకు శాపమిచ్చినప్పటికిన్ని వారికి బ్రహ్మదేవుడిచ్చిన వరములచేత మునుల శాపములు ప్రతిహతములై ఆ రాక్షసుల నేమియు చేయ జాల కుండెను. రాతిపై కొట్ట బడిన బాణములవలె మునుల శాపములు రాక్షసులను పీడింపజాలనప్పుడు వారు తమ - తమ తపస్సులను విడిచి అక్కడి నుండి పారిపోయిరి.

"యుధిష్ఠిరా! గరుడునిభయముచేత సర్పములు పారిపోయినట్లే, భూమండలమునందలి జితేంద్రియులు, శాంతులు, తపస్సిద్ధులు, మహాత్ములునైన వారు గూడ సుందోలసుందులకు భయపడి పారిపోవ జొచ్చిరి. ఆశ్రమము లన్నియు ఆ రాక్షసులు మథించి, నశింప జేసిరి. యజ్ఞకలశములు స్రుక్-స్రువములు పగుల గొట్టి పారవేసిరి. అప్పుడు సమస్త ప్రపంచము ప్రళయకాలమందు నష్టమైనట్లు శూన్యముగా నుండెను.

"యుధిష్ఠిరా! గుహలలో దాగియున్న మునీశ్వరులు కనపడనప్పుడు, ఆ సోదరులిరువురు ఆ ఋషులనుగూడ వధించుటకు, తమ స్వరూపములను అనేక జీవజంతువుల రూపములలో మార్చుకొని, అతి నిగూఢ స్థలములలో దాగియున్న మునులను గూడ మదగజరూపములు ధరించి సంహరించు చుండిరి. వారు ఒకసారి సింహములుగా, మరియొకసారి వ్యాఘ్రములుగా మారి ఓక్కొకసారి అదృశ్యులగుచు నుండిరి. ఈ విధముగా ఆ క్రూరదైత్యులు వేరు-వేరు ఉపాయములతో ఋషులను వెదకి చంపుచుండిరి. అప్పుడు భూమండలమందు యజ్ఞకర్మలు, వేదాధ్యయనములు నిలిచి పోయెను. రాజర్షులు, బ్రహ్మర్షులున్ను నశించిరి. యాత్రలు, వివాహోద్యుత్సవములు, యజ్ఞములున్ను పూర్తిగా నిలిచి పోయెను.

"యుధిష్ఠిరా! దేశమంతట హాహాకారము రేగి, ఆర్తనాదములు వినబడు చుండెను. విపణి వీథులలో క్రయ-విక్రయములు జరుగకుండెను. దేవకార్యములు

ఆగి పోయెను. పుణ్య కార్యములు వివాహాది శుభకార్యములున్ను విచ్ఛిన్నము లయ్యెను. కృషి - గోరక్షణాదులు పేరుకు గూడ లేకుండెను. నగరములు, ఆశ్రమములున్ను ధ్వస్తములై పోయెను. అన్నివైపుల ఎముకలు, అస్థిపంజరములున్ను నిండియుండెను. భూమి చూచుటకే భయంకరముగా నుండెను. శ్రాద్ధ కర్మలు లోపించెను. యజ్ఞములందు వషట్కార ధ్వనులు ఇతర మంగళ ధ్వనులున్ను నామమాత్రము గూడ లేకపోయెను. సమస్త ప్రపంచము భయంకరముగా తోచుచుండెను.

"యుధిష్ఠిరా! ఈ విధముగా సుందోపసుందులు క్రూరకర్మలచేత సమస్త దిక్కులను జయించుకొని, శత్రువులు లేకుండ జేసికొని కురుక్షేత్రమునందు నివసించు చుండిరి."

"జనమేజయా! యిట్లు నారదమహాముని యుధిష్ఠిరునకు చెప్పి తిలోత్తమ జన్మ వృత్తాంత మిట్లు చెప్పదొడగెను.

**తిలోత్తమ జననము - ఆమె సుందోప సుందులను మోహింప జేయుటకు పోవుట :-**

"యుధిష్ఠిరా! తరువాత దేవర్షులు,సిద్ధులు, మహర్షులున్ను ఈ హత్యాకాండ చూచి మనస్సు, ఇంద్రియములు, క్రోధమున్ను నిగ్రహించుకొని యున్నను, సమస్త ప్రపంచముపై దయ దలచి బ్రహ్మదేవుని కడకు పోయి ఆయనచుట్టు చేరిరి. ఆయన యొద్దకు పరమేశ్వరుడు, వాయుదేవుడు, అగ్నిదేవుడు,చంద్రుడు, సూర్యుడు, ఇంద్రుడు, బ్రహ్మపుత్రులైన మహర్షులు, వైఖానసులు (వనవాసులు) వాలఖిల్యులు, వానప్రస్థులు, మరీచిపులు (కిరణము పానముచేసి తపస్సు చేయువారు), జన్మరహితులు, అవిమూఢులు (జ్ఞానులు, తేజోగర్భులు, ఈ మొదలైన యనేకమునులు వచ్చియుండిరి. వారు బ్రహ్మదేవునకు సుందోపసుందుల క్రూర కర్మలను గూర్చి నివేదించిరి. ఆ రాక్షసులు ఏవిధముగ తమను దాచుకొనినది, కొట్టినది, ప్రజలను హత్య చేసినది, అంతయు బ్రహ్మకు తెలిపిరి. బ్రహ్మదేవుడు వారి మాటలు విని ముహూర్తకాలము (2 గడియలు) చింతించి, సుందోప సుందుల వధకొరకు కర్తవ్యమును నిశ్చయించి విశ్వకర్మను పిలిచెను.

"యుధిష్ఠిరా! అప్పుడు బ్రహ్మదేవుడు విశ్వకర్మతో'నీవు అందరిని లోభ పరచునట్టి యొక తరుణ స్త్రీ శరీరము రచియింపుము' అని చెప్పెను. బ్రహ్మ దేవుని యాజ్ఞ శిరసా వహించి విశ్వకర్మ ఆ దేవునకు ప్రణమిల్లి, బాగుగా విచా రించి, ఒక దివ్య యువతిని నిర్మించెను. మూడు లోకములందు సుందరములైన చరాచర వస్తువుల సారాంశమును గ్రహించి సర్వజ్ఞుడైన విశ్వకర్మ ఆ యంశ ములను ఆ సుందరి శరీరములో చేర్చెను. అతడు ఆ యువతి యంగములందు కోట్లకొలది రత్నములు చేర్చి, రత్నరాశిమయ మైన శరీరము గల దేవ స్వరూ పిణి యైన రమణిని నిర్మించెను."

"యుధిష్ఠిరా! విశ్వకర్మచేత మిక్కిలి ప్రయత్నముచేత నిర్మింపబడిన యా యువతి, తన రూప - సౌందర్యముల చేత త్రిలోకములందు అసమాన సుందరిగా నుండెను. ఆమె శరీరమందు ఎక్కడ గూడ తిల మాత్ర మైనను చూపరుల దృష్టిని ఆకర్షింప జాలని భాగము లేకుండెను. ఆమె కామరూపిణి యైన లక్ష్మి, మూర్తిమతి యైనదా యనునట్లు సమస్త ప్రాణుల నేత్రములకు, మనస్సులకును హరించు చుండెను. ప్రపంచమునందలి యుత్తమ రత్నములలో తిలమాత్ర మంతంత భాగములు తీసికొని ఆమె యంగములు నిర్మింప బడి, యుండెను గనుక, బ్రహ్మదేవుడు ఆ సుందరికి 'తిలోత్తమ' యని పేరు పెట్టెను.

"అప్పుడా తిలోత్తమ బ్రహ్మదేవునకు నమస్కరించి చేతులు జోడించు కొని 'భగవన్! నాపైన ఏ కార్యభార ముంచితివి? దేనికొరకు నేడు నాశరీరము నిర్మింప బడెను?' అని యడుగగా, ఆ దేవుడు ఆమెతో 'తిలోత్తమా!' నీవు సుందోపసుంద రాక్షసుల కడకు పోయి, నీ కమనీయ రూపముతో వారిని ప్రలోభ పరపుము. నిన్ను చూడగనే నీ రూప సంపదకొరకు వారిరువురకు విరోధము కలుగునట్లు చేయుము" అని చెప్పెను.

"యుధిష్ఠిరా! బ్రహ్మ యాజ్ఞ నెరవేర్చుటకు తిలోత్తమ ప్రతిజ్ఞ చేసి ఆ దేవునకు నమస్కరించి అక్కడి దేవ మండలికి ప్రదక్షిణము చేయ దొడగెను. బ్రహ్మదేవునకు దక్షిణభాగమందు భగవంతుడైన మహేశ్వరుడు పూర్వాభి ముఖుడై కూర్చొని యుండెను ఉత్తర భాగమందు దేవతలు, నలువైపుల ఋషులున్ను కూర్చొని యుండిరి."

"యుధిష్ఠిరా! తిలోత్తమ దేవమండలికి ప్రదక్షిణము చేయ నారంభించి నప్పుడు ఇంద్రుడు, శంకర భగవానుడున్ను ధైర్యముతో తమ-తమ స్థానము లందే కూర్చొని యుండిరి. ఆ సుందరి ప్రదక్షిణముగా దక్షిణపు వైపు పోయి నప్పుడు ఆమెను చూచు నిచ్చచేత శంకరునకు దక్షిణ భాగమందు ఒక ముఖము కమల సదృశ నేత్రములతో ప్రకటిత మయ్యెను. ఆమె వెనుకవైపు పోయి నప్పుడు ఆయనకు పశ్చిమ ముఖము ప్రకటిత మయ్యెను. ఇట్లే ఆమె ఉత్తరపు వైపు పోయినప్పుడు కూడ ఆ దేవునకు ఉత్తర ముఖము ప్రకటితమయ్యెను. ఈ విధముగనే, ఇంద్రునకు గూడ వెనుక, ముందు, ప్రక్కలను అన్ని వైపులలో గూడ ఎఱ్ఱని కొనలు గల విశాల నేత్రములు ఒక వేయి ప్రకటితము లయ్యెను."

"యుధిష్ఠిరా! ఈ విధముగా పూర్వకాలమందు నాశరహితుడు, భగవంతుడు నైన మహాదేవునకు నాలుగు ముఖములు, బలారియైన ఇంద్రునకు సహస్ర నేత్రములున్ను కలిగెను. ఇతర దేవతలు మహర్షులు గూడ తిలోత్తమ పోయిన వైపుల నెల్ల తమ ముఖములను త్రిప్పు చుండిరి. అప్పుడు దేవాదిదేవు డైన బ్రహ్మదేవు డొక్కడు తప్ప తక్కిన మహానుభావు లందరి చూపులున్ను తిలోత్తమ శరీరముపై మాటిమాటికి పడు చుండెను. ఆమె అక్కడి నుండి పోవు చున్నప్పుడు గూడ ఆమెను చూచిన సిద్ధించెను" అని విశ్వాసము కలిగెను.

"యుధిష్ఠిరా! ఈ తిలోత్తమ వెడలి పోయిన తరువాత సృష్టికర్త యైన బ్రహ్మదేవుడు సమస్త దేవతలను మహర్షులను వీడ్కొల్పెను."

"జనమేజయా! ఇట్లు నారదుడు తిలోత్తమ జన్మవృత్తాంతము యుధిష్ఠిరు నకు చెప్పి తరువాత కథ యిట్లు చెప్ప దొడగెను :-

**తిలోత్తమపై మోహితులై సుందోపసుందులు పరస్పరము పోరాడి చచ్చుట - తిలోత్తమకు బ్రహ్మదేవుడు వర మిచ్చుట - ద్రౌపది విషయములో పాండవుల నియమ నిర్ధారణము :-**

"యుధిష్ఠిరా! సుందోపసుందులు, భూమండలము జయించి, శత్రురహితు లై, ఏ బాధలు లేక, మూడు లోకములను వశపరచుకొని, కృతకృత్యులైరి. దేవ-గంధర్వ-యక్ష-నాగ-మనుష్య - రాక్షసుల యొక్క సమస్త రత్నములను

(ఉత్తమ వస్తువులను) గుంజుకొనిరి. వారి నెదిరించ గలవా రెవరు గూడ లేనప్పుడు, వారు దేవతలవలె అకర్మణ్యులై (పనిలేక) భోగ-విలాసములతో నిమగ్నులై యుండిరి.

"యుధిష్ఠిరా! వారు సుందరస్త్రీలను, పుష్పమాలికలను, వివిధసుగంధములను, పరిపూర్ణభోజనసామగ్రులను, మనస్సునకు ప్రియములైన వివిధపానీయముల నున్ను సేవించుచు, మహానందముతో కాలము గడుపు చుండిరి. అంతఃపురోద్యానములలో, పర్వతములపై, వనములందు, ఇతరాభీష్టప్రదేశము లందునున్న వారు దేవతలవలె విహరించు చుండిరి.

"యుధిష్ఠిరా! ఇట్లుండగా నొకనాడు శిలామయమైన సమతలము, ఉన్నత సాలవృక్షములు పుష్పములున్ను గల వింధ్యపర్వత శిఖరముపైకి సుందోపసుందులు పోయిరి. అక్కడ వారికి సమస్తదివ్యభోగములు ఏర్పరుపబడి యుండెను. అక్కడ సుందరస్త్రీలతో ఆనందించు చుండిరి. అనేకస్త్రీలు ప్రేమతో వారికడకు వచ్చి నృత్య-గీత-వాద్యములతో వారికి వినోదము, ఆహారమున్ను కలిగించుచుండిరి.

"యుధిష్ఠిరా! అట్టి సమయమందే, తిలోత్తమ ఆ వనమందు పుష్పాపచయము చేయుచు వచ్చెను. ఆమె ఎఱ్ఱనిసూక్ష్మమైన ఒకేవస్త్రము కట్టుకొని యుండెను. ఆమెనుచూచినవెంటనే ఏపురుషునైనను, ఉన్మత్తుని జేయగల వస్త్రము ఆమె ధరించి యుండెను. ఆ నదీతీరమునందలి గన్నేరుపూవులను ఏరుకొనుచు నామె మెల్లమెల్లగా ఆ యిరువురుదైత్యు లున్నచోటికి పోయెను.

"యుధిష్ఠిరా! అప్పుడా యిరువురు మద్యపానమత్తులై యుండిరి. వారికను లెఱ్ఱబడి యుండెను. ఆ సుందరిని చూడగనే ఆ యిరువురు నొకసారి కామబాధితులై లేచి ఆమెకడకు పోయిరి. కామోన్మత్తులై యుండిరి. కాబట్టి, ఆ యిరువురు ఆమెను స్వీకరించుటకు యాచింపదొడగిరి. సుందుడు ఆమెకుడిచేయి పట్టుకొనగా, ఉపసుందుడు ఎడమచేతిని పట్టుకొనెను, వారు దుర్లభవరప్రాప్తిచేత మదోన్మత్తులై యుండుటయేకాక, వారికి గల స్వాభావికబలముచేతగూడ అధికమదమత్తులై యుండిరి. ఇంతయేకాక, ధనమద-రత్నమద-సురాపానమదముల చేత గూడ వారు ఉన్మత్తతములై యుండిరి.

"యుధిష్ఠిరా! యీయన్ని మదములచేత నున్మత్తు లగుటచేత వారు, ఒండొరులు పోట్లాడుకొన జొచ్చిరి. తిలోత్తమ కటాక్షము వారిని ఆమెవైపు ఆకర్షించు చుండెను. ఆమెయొక్క దివ్యసుగంధ - భూషణ - రూపముల సంపదచేత ఆయిరువురు రాక్షసులు మోహితులైరి. వారిలో మదము, కామమున్ను ఆవేశించెను గనుక, ఒండొరులు ఇట్లనుకొన జొచ్చిరి :-

'అరే,! ఈమె నా పత్ని. నీకు తల్లివంటిది అని సుందు డనగా, ఉపసుందుడు కాదు ఈమె నాభార్య. నీకు కోడలువంటిది' అని యనెను. 'ఈమె నీదికాదు నాది' అని చెప్పుచు తిలోత్తమా రూపమత్తులైన యారాక్షసు లిరువురు స్నేహ సౌభ్రాత్ర శూన్యులైరి. ఆసుందరిని పొందుటకు ఆసోదరు లిరువురున్ను, అప్పుడు గదాధారులై 'మొదట నేను ఈమెను పొందెదను' అని యొక డనగా, మరి యొకడు కాదు, మొదలు నేనే! యని చెప్పుచు ఒండొరులు కొట్టుకొన జొచ్చిరి. ఈ విధముగా గదాప్రహారములు చేసికొని, అయిరువురు నేలపై కూలి పడిరి.

"యుధిష్ఠిరా! ఇద్దరి యంగములు రక్తములో మునిగి యుండెను. వారు నేలపై పడినప్పుడు ఆకాశము నుండి 'ఇద్దరు సూర్యులు భూపతితులైనారా' యనునట్లు తోచెను. వారిరువురు మరణించిన తరువాత అక్కడిస్త్రీ లందరు పరుగెత్తి పోయిరి. రాక్షస సముదాయము భయ - దుఃఖములచేత కంపితులై పాతాళమునకు పోయిరి.

"యుధిష్ఠిరా! అప్పుడు బ్రహ్మదేవుడు, దేవతలు, మహర్షులున్ను తిలోత్తమను ప్రశంసించుచు అక్కడకు వచ్చిరి. బ్రహ్మదేవుడు తిలోత్తమతో, భామినీ! సూర్యసంచారము గలదేశము లన్నింటిలోను నీవు ఇచ్ఛానుసారముగా సంచరించ గలవు. నిన్ను ఎవరుగూడ కనులు తెరచి పూర్తిగా చూడజాలరు; అని ఆమెకు వరమిచ్చి త్రిలోక రక్షణ భారము - ఇంద్రునకు ఒప్పగించి బ్రహ్మలోకమునకు పోయెను.

"యుధిష్ఠిరా! ఇట్లు పరస్పరము ఏకాభిప్రాయముతో సుందోపసుందులు సంమదితులై యుండినను, తిలోత్తమకొరకు, పరస్పరము వధించు కొనిరి.

"జనమేజయా! ఇట్లు నారద మహాముని యుధిష్ఠిరునకు, అతని తమ్ములకున్ను సుందోపసుందులకథ చెప్పి, పాండవులతో మరల నిట్లనెను :-

"భారతవంశ శిరోమణులారా! ద్రౌపదికొరకు మీలో మీకు భేదము కలుగకుండునట్లుగా, నేదో యొక నియమము మీరు చేసికొనుడు. మీకు శుభ మగుగాక!"

"జనమేజయా! దేవర్షియైన నారదుడిట్లు చెప్పగా, పాండవులు ఆ మహర్షి సమక్షమునందు 'మాలో ప్రతియొకని యింట ద్రౌపది యొక్కొక్క సంవత్సరము నివసించవలెను. ద్రౌపదితో ఏకాంతమునందు మాలో నొక్క సోదరుడు ఉండగా, ఇతర సోదరుడు చూచినయెడల అతడు పన్నెండు సంవత్సములు* బ్రహ్మచర్యముతో వనవాసము చేయవలెను అని యొడంబడిక చేసికొనిరి. తరువాత నారద మహాముని వెడలిపోయెను.

"జనమేజయా! నారదుని ప్రోత్సాహముచేత పాండవులు ఈ నియమము చేసికొనిరి గనుక, వారిలో పరస్పరము ఏలాటి విరోధము కలుగలేదు. నీకు అన్ని సంగతులు విస్తారముగా చెప్పితిని."

ఇట్లు వైశంపాయన మహాముని జనమేజయునకు చెప్పి తరువాతికథ యిట్లు చెప్పదొడగెను.

**విదురాగమన రాజ్యలాభ పర్వము సమాప్తము.**

## అర్జున వనవాస పర్వము

అర్జునుడు బ్రాహ్మణుని గోరక్షణమునకై నియమభంగముచేసి వనమునకు పోవుట :-

"జనమేజయా! పాండవులిట్లు నియమముచేసికొని తమ ప్రతాపముచేతనితర రాజులను జయించి వశపరచుకొను చుండిరి కృష్ణాదేవి వారిని సేవించుచుండెను. పాండవులు ద్రౌపదితో, ద్రౌపది పాండవులతోను, సర్పములచేత భోగవతి పురమువలె పరస్పరము సంతోషముతో శోభిల్లుచుండిరి. ధర్మానుసారముగా

* నన్నయ భారతములో అర్జునుడు పన్నెండు నెలలు తీర్థయాత్ర చేసినట్లున్నది. గోరఖ్‌పూర్ వ్యాసభారతమునందు అర్జునుడు పన్నెండేండ్లు బ్రహ్మచారిగా వనవాసము చేసినట్లున్నది.

పాండవులు ప్రవర్తిల్లుటచేత కురువంశీయులు నిర్దోషులై సుఖముగా నిరంతరము అభివృద్ధి జెందుచుండిరి.

"జనమేజయా! చాల కాలమిట్లుండగా నొకనాడు, కొందరు, దొంగలు బ్రాహ్మణుని గోవులను అపహరించుకొని పోవగా, బ్రాహ్మణుడు క్రుద్ధుడై, ఖాండవ ప్రస్థమునకు వచ్చి పాండవులను బిగ్గరగా పిలిచి ఇట్లనెను".

"పాండవులారా! మా గ్రామమునుండి క్రూరులు కొందరు బలాత్కారముగా నా గోవులను దొంగిలించుకొనిపోవుచున్నారు. వానిని రక్షించుటకు పరుగెత్తుడు. నేడు శాంతి స్వభావుడైన ఒక బ్రాహ్మణుని హవిస్సును కాకులు దోచుకొని తినుచున్నది. నీచమైన నక్క శూన్యముగా నున్న సింహపు గుహను త్రొక్కుచున్నది. ఏ రాజు, ప్రజల సంపాదనలో ఆరవ భాగము పన్నుగా గ్రహించి, ప్రజా రక్షణము కొరకు ఏలాటి వ్యవస్థ చేయడో, అట్టి రాజు సమస్త లోకములందు పాపిష్ఠుడని చెప్పబడెను. బ్రాహ్మణుడనైన నా గోధనమును చోరులు కొనిపోవుచున్నారు. గోవులు లేకున్న యెడల, దుగ్ధము మొదలైన హవిర్ద్రవ్యము లయభావముచేత నా ధర్మార్థములు లోపించుటవలన నేను ఇక్కడకు వచ్చి దుఃఖించుచున్నాను. చోరులను దండించుటకు అస్త్రధారణము చేయుడు"

"జనమేజయా! అప్పుడు అర్జునుడు ఆ బ్రాహ్మణుని మొర విని యతనితో, భయపడకుము! అనెను. పాండవుల శస్త్రాస్త్రములు ఉంచబడిన గృహములోనే యుధిష్ఠిరుడు కృష్ణాదేవితో ఏకాంతమునందుండెను. కనుక, అర్జునుడు ఆ యింటిలో ప్రవేశించుటకు, వట్టి చేతులతో చోరులను వెన్నంటుటకున్ను సమర్థుడు కాకుండెను. బ్రాహ్మణుని యార్తనాదము శస్త్రములు తెచ్చుటకు అర్జునుని మాటిమాటకు ప్రోత్సహించుచుండెను. ఆ బ్రాహ్మణుడు ఏడ్చుచుండగా అర్జునుడు దుఃఖితుడై యిట్లు యోచించెను.

"తపశ్శాలియైన బ్రాహ్మణుని గోధనము అపహరింపబడుచుండెను. కనుక నిట్టి సమయమందు ఇతని కన్నీరు తుడుచుట నా కర్తవ్యము. రాజద్వారమందు నేడ్చుచున్న బ్రాహ్మణుని రక్షణము నేడు నేను చేయకుండిన యెడల, ఇట్టి యపేక్షవలన కలిగిన యధర్మము యుధిష్ఠిర మహారాజునకు అంటుకొనును.

ఇంతయేకాక మేము ఆర్తరక్షణ ధర్మమును పాలించుటకు శ్రద్ధ వహింప కున్నాము' అను అపకీర్తి కూడ లోకములో వ్యాపించును. రాజును నిర్లక్ష్యము చేసి నేను ఆ యింటిలో ప్రవేశించిన యెడల మహారాజునకు నేను చేసిన ప్రతిజ్ఞ మిథ్య యగును. యుధిష్ఠిరుని సమక్షములో ఆ యింటిలో ప్రవేశించిన యెడల నాకు వనవాసము చేయ వలసి యుండును. ఇందులో మహారాజును తిరస్కరించుటతప్ప తక్కిన వన్నియు తుచ్ఛములే కనుక, అవి యుపేక్షించ దగినవి. రాజతిరస్కారము చేత నాకు నియమభంగ దోషము కలిగినను వనమునందు నాకు మృత్యువు కలిగినను నేను నా శరీరనాశము గూడ లెక్క చేయక గో - బ్రాహ్మణ రక్షణ రూపధర్మము రక్షించుటయే పరమశ్రేష్ఠ మైనది."

"జనమేజయా! యిట్లు నిశ్చయించి అర్జునుడు మహారాజును[1] అడిగి ఆ యింటిలో ప్రవేశించి, ధనుస్సు తీసికొని వచ్చి బ్రాహ్మణునితో, 'బ్రాహ్మణోత్తమా! త్వరగా రమ్ము! ఆ చోరులు దూరముగా పోవులోపల వారిని మనము కలిసికొన వలెను. ఇప్పుడే నేను గోవులను చోరులనుండి విడిపించి నీకు ఇచ్చెదను.' అని చెప్పి అర్జునుడు కవచ ధనుర్ధారియై, రథముపై కూర్చొని చోరులను వెన్నంటిపోయి, వారిని వధించి, గోధనమును జయించుకొని తెచ్చి, బ్రాహ్మణున కిచ్చి యతనిని సంతోషపరచి, తన నగరమునకు తిరిగి వచ్చి, గురుజనులకు నమస్కరింపగా వా రతనిని అభినందించిరి. తరువాత, అర్జునుడు యుధిష్ఠిరునితో నిట్లనెను."

"మహారాజా! నీవు ద్రౌపదితో నుండగా నేను చూచితిని. మన నియమమునకు భంగము చేసితిని. కనుక నాకు ప్రాయశ్చిత్తము చేసికొనుటకు ఆజ్ఞ యిమ్ము. వనవాసము చేయుటకు నియమ ముండెను. కనుక, అట్లే చేసెదను."

"ఆమాట విని యుధిష్ఠిరు డర్జునునితో నిట్లనెను" :-

"నాయనా! నీ విట్లేల చేసెదవు? నీవు ఒకవేళ నామాట ప్రమాణముగా తలచిన యెడల వినుము. నీవు ఇంటిలోపల ప్రవేశించి, నాకు ప్రియమైన

1. నన్నయ భారతములో అర్జునుడు యుధిష్ఠిరు నడిగి అతని యింటిలోకి పోయినట్లు లేదు.

కార్యమే చేసితివి. కనుక, నీకు ఆజ్ఞ యిచ్చు చున్నాను. జ్యేష్ఠభ్రాత తన భార్యతో నింటిలో నున్నప్పుడు కనిష్ఠ భ్రాత ఆ యింటిలో పోవుట తప్పు కాదు కాని, తమ్ముడు భార్యతో నున్నప్పుడు అన్న పోవుటవలన ధర్మనాశమగును కనుక, నామాట యంగీకరింపుము. వనవాసమునకు పోవకుము. నీకు ధర్మ నాశము కాలేదు. నీవు నా తిరస్కారము చేయ లేదు."

ఇట్లు చెప్పగా విని అర్జునుడు ధర్మరాజుతో నిట్లనెను :-

"మహారాజా! ధర్మాచరణమునందు ఎప్పుడు గూడ ఏవో సాకులు చెప్పి తప్పించు కొనుటకు ప్రయత్నించగూడదని నీవే చెప్పి యుంటివి. కనుక, నేను సత్యము పైన ఒట్టు పెట్టుకొని, శస్త్రస్పర్శచేసి ప్రమాణ పూర్వకముగా చెప్పు చున్నాను. నేనెప్పుడుగూడ సత్యము తప్పను. నాకు వనవాసమునకు ఆజ్ఞ యిమ్ము నీ యాజ్ఞ లేక, ఏ కార్యముగూడ నేను చేయను."

"జనమేజయా! రాజాజ్ఞ తీసికొని అర్జునుడు వనవాసదీక్ష గైకొని వనము నందు పన్నెండేండ్లు నివసించుటకు వెడలిపోయెను."

**అర్జునుడు గంగాద్వారము (హరిద్వారము) నందు 'ఉలూచి' తో కలియుట :-**

"జనమేజయా! అర్జునుడు వనవాసమునకు పోవునప్పుడు, వేదవిదులైన బ్రాహ్మణులు, శాస్త్రపండితులు, అధ్యాత్మధ్యానపరులు, భిక్షాజీవులైన బ్రహ్మ చారులు, భగవద్భక్తులు పురాణజ్ఞులు, కథకులు, సన్యాసులు, వానప్రస్థులున్ను మధురముగా దివ్యకథలగానము చేయువారున్ను - అర్జునునితో పోవుటకు బయలు దేరిరి. ఇంద్రుడు దేవతలతోవలె, అర్జునుడు వారందరితో మధురముగా మాట్లాడు సహాయకులతోను ప్రయాణము చేసెను. అతడు మార్గమునందు, అనేక రమణీయ విచిత్ర వనములు, సరోవరములు, నదులు, సముద్రములు, దేశములు, పుణ్య తీర్థములున్ను, చూచెను. మెల్లమెల్లగా పోయి గంగా ద్వారము (హరిద్వారము) చేరి, అర్జును డక్కడ బస చేసెను.

"జనమేజయా! గంగా ద్వారమునందు అర్జును డొక యద్భుతకార్యము చేసెను. అక్కడ అనేక బ్రాహ్మణులు అగ్నిహోత్రానుష్ఠానము కొరకు అనేక

స్థానములందు అగ్నిస్థాపనముచేసిరి. గంగాతీరమునందు అగ్నులు ప్రజ్వలితములై, సన్మార్గస్థితులు - ఇంద్రియములను, మనస్సును వశమునందుంచుకొనినవారు - విద్వాంసులునైన బ్రాహ్మణులున్ను స్నానాదులుచేసి, పుష్పములతో పూజించి, అగ్నులలో అహుతు లిచ్చినప్పుడు ఆ మహాత్ములచేత గంగా ద్వారము మిక్కిలి శోభిల్లెను.

"జనమేజయా! తరువాత, అర్జునుడు గంగలో స్నానము చేసి, స్నానానంతరము, పితృతర్పణాదులుచేసి, అగ్నిహోత్రముచేయుటకు గంగాజలమునుండి యీవలకు బయలుదేరు చుండగా, నాగరాజపుత్రియైన 'ఉలూచి' అతనియెడల అనురక్తురాలై, జలములోపలనే యతనిని ఈడ్చుకొని, నాగరాజైన కౌరవ్యుని సందరభవనమునకు పోవగా నప్పు డర్జును డేకాగ్రచిత్తముతో చూడగా నచట అగ్ని ప్రజ్వలించుచుండెను. అప్పుడు ఆ యగ్ని యందే, తన యగ్నిహోత్ర కార్యము చేసెను. దానిచేత అగ్నిదేవుడు మిక్కిలి సంతుష్టుడయ్యెను. తరువాత నతడు నవ్వుచు నాగరాజకన్యతో, 'సుందరీ! నీ వీ సాహస చర్య యెందుకు చేసితివి? ఇది ఏ దేశము? నీ వెవతెవు? ఎవరి పుత్రికవు? అని యడుగగా నామె యిట్లనెను :-

"రాజా! ఐరావత నాగకులమందలి కౌరవ్యు డను నాగరాజునకు నేను పుత్రికను. నాపేరు ఉలూచి. నీవు స్నానార్థమై గంగలో దిగినపుడే నిన్నుచూచి నేను కామ మోహితురాల నైతిని. కామాగ్ని తాపముచేత దహింపబడు చున్నాను. నీకు దప్ప నితరునకు నా హృదయము నర్పింప లేదు. కనుక, నిన్ను నాకు సమర్పించి నన్ను ఆనందింప జేయుము."

"ఆ మాట విని అర్జును డామెతో నిట్లనెను" :-

"మంగళకరు రాలా! నేను పన్నెండేండ్లు బ్రహ్మచర్య వ్రతపాలనము చేయు కాల మిది. ఈ వ్రత పాలనకు యుధిష్ఠిర మహారాజు నాకు ఆజ్ఞ యిచ్చెను. కనుక, నేను స్వతంత్రుడను కాను. నేను నీకుగూడ ప్రియము చేయ దలచు చున్నాను. నే నెప్పుడుగూడ అసత్య మాడలేదు. నాకు అసత్య దోషము అంట కుండ, నీ ప్రియముగూడ నెరవేరి, నాకు ధర్మహానియు కలుగక యుండు నుపాయ మేదియైన నీవు చేయుము."

"ఆ మాటకు ఉలూచి యిట్లనెను" :-

"పాండునందనా! నీవు ఏ యుద్దేశముతో భూమండలమందు సంచరించు చున్నావో, ఏవిధముగ నీకు మీ యన్న బ్రహ్మచర్య పాలనమును ఆదేశించెనో, అది యంతయు నే నెరుగుదును. మీ రైదుగురు ద్రౌపదికొరకు చేసికొనిన నియమము నాకు తెలియును. మీ యన్నగారు ధర్మరక్షణము కొరకు కేవలము ద్రౌపదిని నిమిత్తముగా పరస్పరము వనవాసము చేయవలెనను నియమము చేసెను. ఇక్కడ నీ ధర్మము దూషితము కాదు. నీవు పీడిత ప్రాణుల రక్షణము చేయవలెను. నన్ను రక్షించుటచేత నీకు ధర్మలోపము కలుగదు.

"పాండునందనా! దీనివలన నీకు ఏ కొంచెము ధర్మవ్యతిక్రమము జరిగినను నాకు ప్రాణదానము చేయుటచేత, నీకు మహాధర్మము కలుగును. నీవు నాకు స్వామివి. నేను నీకు భక్తురాలను గనుక, నన్ను స్వీకరింపుము. ఆర్త రక్షణము సత్పురుషులకర్తవ్యము. నీవు నాప్రార్థనను అంగీకరింపనియెడల, నేను మరణించెదను, కనుక, నాకు ప్రాణదానము చేసి, ఉత్తమధర్మానుష్ఠానము చేసినవాడ వగుము. పురుషోత్తమా! నేడు నేను నీ శరణు జొచ్చితిని. నీవు ప్రతి దినమెందరనో దీనులను అనాథులను, రక్షించుచుందువు. కనుక, నేను గూడ ఈ యాశతోనే నీ శరణు జొచ్చితిని, మాటమాటికి దుఃఖించుచు మొరపెట్టు కొను చున్నాను. నేను నీయందు అనురక్తనై, నీ సమాగమమును యాచించు చున్నాను. కనుక, నాకు ప్రియమైన కోరికను నెరవేర్చుము. నాకు నిన్ను సమర్పించుకొని, నా కోరికను సఫలము చేయుము."

"జనమేజయా! నాగకన్య ఉలూచి ఇట్లనగా, అర్జునుడు ధర్మము నే ముందిడుకొని, ఆమె కోరికను నెరవేర్చెను. అతడారాత్రి నాగరాజగృహమందే గడపి మరునాడు సూర్యోదయమందు కౌరవ్యుని యింటినుండి ఉలూచితో పైకి వచ్చి గంగాద్వారము చేరెను. ఉలూచి యతని నక్కడ విడిచి, తిరిగి తనయింటికి పోయెను."

"జనమేజయా! ఉలూచి తిరిగి పోవునపుడర్జునునకు, నీవు జలములో అజేయుడవై యుండెదవు. జలచరము లన్నియు నీ వశములో నుండును అని వర మిచ్చెను. అక్కడ అర్జునునకు ఉలూచి గర్భమునుండి, అత్యంతమనో

హారుడు, బల-పరాక్రమసంపన్నుడు, మహాభాగ్యశాలియునైన 'ఇరావంతుడు'అను పేరుగల పుత్రుడు జన్మించెను."

**అర్జునుడు తూర్పునందలి తీర్థములకు పోవుచు మణిపురమునకు పోయి చిత్రాంగదపాణి గ్రహణముచేసి పుత్రునిగనుట:-**

"జనమేజయా! రాత్రిజరిగినసంఘటన మంతయు నర్జునుడు బ్రాహ్మణులకు చెప్పి, యక్కడి నుండి హిమాలయముకడకు పోయెను. అక్కడ, అగస్త్యవటము, వసిష్ఠపర్వతము, భృగుతుంగమున్ను దర్శించి శౌచస్నానాదులు చేసి, బ్రాహ్మణులకు అనేకసహస్రగోదానములు చేసి, అక్కడి బ్రాహ్మణులకు గృహములు, ఆశ్రమములున్ను కట్టించి యిచ్చెను. 'హిరణ్యబిందు' తీర్థమందు స్నానముచేసి, యత డనేక పవిత్రస్థానముల దర్శనము చేసెను.

"జనమేజయా! తరువాత అర్జునుడు హిమాలయము దిగి తూర్పుదిక్కుగా పోయెను. ఆ యాత్రలో అనేక తీర్థములను దర్శించుచు, నైమిషా(శా)రణ్య పుణ్యక్షేత్రమందు ప్రవహించు రమణీయములైన 'ఉత్పలసీనందా-అపరనందా-కౌశికీ (రోసి) - మహానదీ - గయాతీర్థ - గంగా' నదుల దర్శనము చేసెను. ఈ విధముగా నర్జునుడు క్రమముగా నన్నితీర్థములను, ఆశ్రమములనున్ను చూచుచు స్నానాదులచేత పవిత్రుడై, బ్రాహ్మణులకు అనేక గోదానములు చేసెను.

"జనమేజయా! తరువాత నర్జునుడు అంగ - వంగ కళింగ దేశముల లోని పవిత్ర తీర్థములను, మందిరములనున్ను సేవించి, ధనదానము చేసెను. కళింగ రాష్ట్రద్వారము చేరిన తరువాత, అతని వెంట వచ్చిన బ్రాహ్మణులతని యనుమతి తీసికొని తిరిగి పోయిరి. కాని అర్జునుడు, అనేక దేశములను మందిరములను, అందమైన బురుజులనున్ను చూచుచు ముందుకు సాగిపోయి, యనేక మునీంద్రశోభితమైన మహేంద్ర పర్వతమును దర్శించి, సముద్రతీరమునందే ప్రయాణము చేయుచు మెల్ల మెల్లగా పోయి మణిపూరపురము చేరెను.

"జనమేజయా! మణిపూరపురప్రభువు చిత్రవాహనుడను పేరు గలవాడుండెను. అతడు ధర్మజ్ఞుడు అతనికి 'చిత్రాంగద' యను పేరుగల పరమ సుందరియైన కూతురు ఉండెను. ఆనగరమందు తిరుగుచున్న యా కన్యకను

చూచి అర్జునునకు ఆమెను పొందవలె ననునభిలాష గలిగెను. అప్పుడా రాజును కలిసికొని యర్జును డతనితో, 'రాజా! క్షత్రియుడనైన నాకు నీ పుత్రిక నిమ్ము' అని యడుగగా నారాజు 'నీ వెవరి పుత్రుడవు? నీ పేరేమి?' యని యర్జును నడుగగా, నేను కుంతీ-పాండవుల పుత్రుడను, అర్జును డనుపేర గలవాడను' అని యనగా, చిత్రవాహను డర్జునునితో నిట్లనెను :-

"రాజపుత్రా! ఈకులమందు పూర్వము ప్రభంజను డనుపేర గలసుప్రసిద్ధుడైన రాజుండెను. అతనికి పుత్రులు లేకుండిరి. కనుక, నతడు పుత్రేచ్ఛతో తపస్సు చేసి, దేవాధిదేవు డైన పరమేశ్వరుని సంతుష్టు జేయగా నాదేవు డతనికి వరమిచ్చుచు 'నీకులమందు ఒక్కొక్క సంతానమే కలుగుచుండు' నని చెప్పెను. ఆ కారణముచేత మాకులమం దెల్లప్పటికిన్ని ఒక్కొక్క సంతానమే కలుగుచున్నది. నాపూర్వు లందరకు పుత్రులు కలుగుచుండిరి. కాని, నాకు ఒక కన్య పుట్టెను. ఈ కన్యకయే యీకుల పరంపర నడుపునదిగా నున్నది. కనుక, 'ఈమె నాకు పుత్రు' డనియే భావించుచున్నాను.

"అర్జునా! ఈమె పుత్రియైనను, హేతువిధిచేత (అనగా 'ఈమెకు పుట్టబోవు మొదటి కొడుకు, నా పుత్రు డనియే భావింపబడును అను హేతువు చేత) నేను ఈమెకు పుత్రునిపేరు పెట్టితిని. నీచేత ఈమె గర్భము నుండి పుట్టబోవు పుత్రుడిక్కడనే యుండి, యీకుల పరంపరకు ప్రవర్తకుడు కావలెను, ఈకన్యక వివాహమున కిదిశుల్కము నీవు ఈయవలెను. ఈ నియమమునకు కట్టుబడి నీవు ఈమెను గ్రహింపుము."

"జనమేజయా! ఆ మాటకు అర్జునుడు 'తథాస్తు-అట్లే యగుగాక' యని ప్రతిజ్ఞచేసి, ఆ కన్యా పాణిగ్రహణము చేసి యతడు ఆమెతో మూడు సంవత్సరము లానగరమందు నివసించెను. ఆమె గర్భము నుండి పుత్రుడు పుట్టిన తరువాత, అర్జును డా చిత్రాంగదను కౌగిలించుకొని వీడ్కొని, చిత్రవాహన రాజుతో చెప్పి, మణిపురనగరము నుండి బయలుదేరి, తీర్థయాత్రల కొరకు వెడలి పోయెను."

**అర్జునుడు 'వర్గా' నామము గల యప్సరసను మొసలి గర్భము నుండి యుద్ధరించుట - వర్గ ఆత్మకథ చెప్పుట :-**

"జనమేజయా! తరువాత అర్జునుడు దక్షిణసముద్రతీరమందు మునిజన శోభితము లైన పుణ్యతీర్థములకు పోయెను. అక్కడ ఆ దినములలో మునులు,

పూర్వము అనేక మునులు, మహాత్ములున్ను, సేవించుచుండిన యైదు తీర్థములను విసర్జించి యుండిరి. ఆ తీర్థముల పేర్లు - "అగస్త్యతీర్థ - సౌభద్రతీర్థ - పౌలోమతీర్థ - కారంధమ తీర్థ - భారధ్వాజతీర్థ'ములు అని కలవు. అర్జునుడు ఆ యైదు తీర్థములను చూచి, అవి ఏకాంతమునం దున్నను వానిని మహామునులు విడిచి యుండుట చూచి, అంజలిబద్ధుడై, ఆ మునులతో, మునిగణము ఈ తీర్థములను ఎందువలన పరిత్యజించు చున్నారు అని యడుగగా, ఆ మునులు అర్జునితో 'కురునందనా! ఈ యైదు తీర్థములందు మొసళ్ళు ఉండును. అవి అక్కడ స్నానము చేయు తపోధనులను నీటిలో నీడ్చుకొని, పోవును గనుక, ఇవి మునులచేత విడువబడెను. అని చెప్పిరి."

"జనమేజయా! ఆ మునుల మాటలు విని అర్జునుడు, వారు నిషేధించు చున్నను, ఆ తీర్థములకడకు పోయి సుభద్ర మహామునియొక్క సౌభద్ర తీర్థములో దిగి స్నానము చేయుచుండగా, జలములో సంచరించు నొక మహా మకరము అర్జునుని ఒక పాదము పట్టుకొనెను. కాని, బలవంతుడైన యర్జునుడు ఎగురుచు, దుముకుచు ఆ జలచరముతోపాటు నీటి బయటకు వచ్చెను.

"జనమేజయా! అట్లు బయటకు వచ్చిన యాగ్రాహము సర్వాభరణ భూషితమైన యొక సుందర స్త్రీ రూపములో పరిణమించెను. ఆ దివ్య రూపిణి యైన రమణి అద్భుతకాంతితో ప్రకాశించుచుండగా, అట్టి మహాశ్చర్యకర విషయము చూచి అర్జునుడు ఆ కాంతతో, 'కల్యాణీ! నీ వెవతవు? ఈ జలచర యోనిలో నెట్లు పడితివి? పూర్వము నీవు ఇట్టి మహాపాపమెందుకు చేసి ఈ దుర్గతి పాలైతివి?, అని యడుగగా, నామె యర్జునునితో నిట్లనెను :-

"మహాబాహూ! నేను నందన వనమంధు విహరించు నొక యప్సరసను. నాపేరు 'వర్గ'. నేను కుబేరునకు సర్వదా ప్రేయసిగా నుంటిని. నాకు నలుగురు సఖురాండ్రు కలరు. వారందరు స్వేచ్ఛాగమనముగల సుందర స్త్రీలు. వారితోనే నొక నాడు కుబేరుని యింటికి పోవుచుంటిని. మార్గమునందు మేమందరము ఉత్తమ వ్రతనిష్ఠాపరుడైన యొక బ్రాహ్మణుని చూచితిమి.

"వీరవరా! అతడు అత్యంత రూప సౌందర్యములు కలవాడు. ఏకాంతము నందుండి యతడు వేదాధ్యయనము చేయుచుండెను. అతని తపః ప్రకాశముచేత ఆ వనమంతయు తేజోమయమై యుండెను. సూర్యునివలె నతడు ఆ ప్రదేశ మంతయు ప్రకాశింప జేయుచుండెను.

"రాజా! ఆ బ్రాహ్మణునియొక్క తపస్సు, అద్భుతమైన రూపసంపదయు చూచి మేమైదుగురము అతని తపస్సునకు విఘ్నము చేయు కోరికతో నతడున్న చోటికి పోయితిమి, నేను, సౌరభేయి, సమీచి, బుద్బుద, లత, అను నైదుగురము ఆయనను ప్రలోభింప చేయుటకు నవ్వుచు, ఆడుచు, పాడుచు నుంటిమి.

"వీరోత్తమా! అట్లయినను నతడు ఏ విధముగ గూడ నతని మనస్సును మావైపు పోవనీయకుండ తన నిర్మల తపస్సు నందే నిమగ్నుడై కొంచెము గూడ సంచలనము చెంద కుండెను. తరువాత నతడు మా యొక్క ఉద్దండ కర్మల చేత క్రుద్ధుడై 'మీరు నూరేండ్ల వరకు నీటిలో మొసళ్ళుగా నుండ గలరు!' అని మమ్ము శపించెను."

**వర్గ ప్రార్థన చేత అర్జునుడు తక్కిన నలుగురు అప్సరసలకు గూడ శాపవిముక్తి చేసి మణిపూరనగరమునకు పోయి చిత్రాంగదతో కలిసి, 'గోకర్ణ' తీర్థమునకు పోవుట :-**

"మహాపురుషా! బ్రాహ్మణ శాపము విని మిక్కిలి దుఃఖించి మే మందరము అతని శరణు జొచ్చి యి ట్లంటిమి" :-

"బ్రహ్మన్! మేము రూప - యౌవనకామోన్మాదములచేత మత్తిల్లి యుంటిమి. కనుక, ఈ యనుచితకార్యము చేసితిమి. దయతో మమ్ము క్షమింపుము. నీ వంటి పరిశుద్ధాత్ముడైన మునీశ్వరుని ప్రలోభింప జేయుటకు వచ్చుట చేతనే మేము మరణించినవార మైతిమి. ధర్మాతులైన పురుషులు 'స్త్రీలు అవధ్యలు' అని తలచెదరు. కనుక, నీవు నీ ధర్మాచరణము ద్వారా నిరంతరము ఉన్నతి పొందుము. అబలల మైన మా హత్యను నీవు చేయగూడదు. బ్రాహ్మణులు సమస్త ప్రాణుల యెడల మైత్రీభావముతో ధర్మజ్ఞు లై యుండెదరు. మనీషులు చెప్పు ఈ విషయము సత్యము చేయుము. ఉత్తమ మహాత్ములు శరణాగత

రక్షణము చేసెదరు. మేము గూడ నీ శరణు జొచ్చితిమి గనుక, మా యపరాధ మును క్షమింపుము."

"జనమేజయా! ఇట్లు ఆ యప్సరసలు చెప్పగా సూర్య - చంద్రుల వంటి తేజస్సు గలిగి, శుభ కర్మలు చేయుచున్న ధర్మాత్ముడైన యా బ్రాహ్మణుడు ఆ యప్సరసలపై దయతో నిట్లనెను":-

"భామినులారా! 'శత-శత సహస్ర' శబ్దము లన్నియు 'అనంత సంఖ్య' యను నర్థము తెలుపును. కనుక, ఇప్పుడు నేను 'శత సంవత్సరములు మీరు గ్రాహములై యుండుడు' అని శాప మిచ్చితిని. దానిలో శత శబ్దమునకు నూరు వర్షముల పరిమాణము' అని యర్థము ఆ శబ్దము అనంత కాలము తెలుపునది కాదు."

"కాంతలారా! మీరు జలమునందు మొసళ్ళుగా నుండి, లోకులను పట్టుకొనుచుండగా నెవడైన శ్రేష్ఠ పురుషుడు వచ్చి మిమ్ము జలమునుండి స్థలముపైకి ఈడ్చివేసినప్పుడు మీ కందరకు మరల దివ్యరూపము కలుగ గలదు. నేను ఎప్పుడు గూడ నవ్వులాటకైనను అసత్యము చెప్పలేదు.

"మీ రందరు ఉద్ధరింపబడిన తరువాత ఆ తీర్థములన్నియు 'నారీ తీర్థములు' అను పేరుతో ప్రసిద్ధములై మహా మనుష్యులను గూడ పవిత్రులను చేయు పుణ్య తీర్థములు కాగలవు".

"వీరవరా! ఆ మాట విని మేము ఆ బ్రాహ్మణునకు ప్రదక్షిణ - నమస్కారములు చేసి మిక్కిలి దుఃఖించి మేమందరము అక్కడినుండి వేరు చోటికి వచ్చి మేము ఎక్కడికి పోయి యుండిన యెడల, కొలది కాలము లోనే మమ్ము ఉద్ధరించి పూర్వ రూపము ఇప్పింపగల మనుష్యుడు దొరకును?" అని చింతింప దొడగితిమి.

"వీరోత్తమా! మేమిట్లు రెండు గడియలు విచారించుచుండగానే నారద మహర్షి మాకు దర్శనమిచ్చెను. ఆ మునీంద్రునకు మేము హర్షముతో నమస్క రించి సిగ్గుతో తలవంచుకొని యుండగా, ఆయన మా దుఃఖ కారణమడిగెను. మేము సమాచార మంతయు ఆయనకు చెప్పగా, విని, యా ముని మాతో నిట్లనెను:-

"అప్సరసలారా! దక్షిణ సముద్ర తీర సమీపమందు అత్యంత పుణ్య జనకములు, పరమ రమణీయములునైన యైదు తీర్థములున్నవి. అక్కడకు అర్జునుడు త్వరగానే వచ్చి మీకు ఈ దుఃఖమునుండి విముక్తి కలిగించును. సందేహము లేదు".

"వీరవరా! నారదుని మాట విని మేమైదుగురము ఇక్కడకు వచ్చితిమి. నేడు వాస్తవముగానే నీవు మాకు శాపవిముక్తి కలిగించితివి. మా నలుగురు సఖురాండ్రు ఇంకను జలములోనే పడియున్నారు. వారిని గూడ శాపము నుండి విడిపించి పుణ్యము గట్టుకొనుము".

"జనమేజయా! ఆమాట విని ఉదార హృదయుడు, పరాక్రమవంతుడు నైన యర్జునుడు ఆ యప్సరస లందరకు శాపవిముక్తి కలిగింపగా, వారు జలము నుండి బయటకు వచ్చి పూర్వ స్వరూపము పొందిరి."

"జనమేజయా! యిట్లు అర్జునుడు ఆ తీర్థములకు పరిశుద్ధి చేసి అప్స రసలను వీడ్కొల్పి చిత్రాంగదతో కలియుటకు మరల మణిపూర నగరమునకు పోయెను. అక్కడ చిత్రాంగద గర్భమునుండి యతడు కనిన పుత్రునకు 'బభ్రువాహనుడు' అను పేరు పెట్టబడెను. తరువాత అర్జునుడు చిత్రవాహన రాజుతో నిట్లనెను" :-

"మహారాజా! ఈ బభ్రువాహనుని నీవు చిత్రాంగదకు శుల్కముగా తీసికొనుము. దానిచేత నీనుండి నేను ఋణ విముక్తుడ నయ్యెదను."

"జనమేజయా! అర్జును డిట్లు చిత్రవాహన రాజునకు చెప్పి, చిత్రాంగదతో నిట్లనెను." :-

"ప్రియే! నీకు శుభ మగుగాక! నీ విక్కడనే యుండి బభ్రువాహనుని పాలించి పోషించు చుండుము. తరువాత, కొంతకాలమునకు మా యింద్రప్రస్థ నగరమునకు వచ్చి మిక్కిలి సుఖముగ నుండెదవు. అక్కడ మా తల్లి కుంతీ దేవిని, నా సోదరులు యుధిష్ఠిర - భీమసేన - నకుల సహదేవు లందరను చూచి నీవు మిక్కిలి సంతోషించెదవు. సర్వదా ధర్మపరుడై, సత్యవాదిగా నున్న యుధిష్ఠిర మహారాజు సమస్త భూమండలము జయించి రాజసూయ యజ్ఞమును చేయును."

"ప్రాణ ప్రియే! అప్పుడు ఆ యాగమునకు సమస్త రాజులు రాగలరు. మీతండ్రి చిత్రవాహనుడు అనేక రత్నముల కానుకలు తీసికొని అక్కడకు రాగలడు. మీ తండ్రిని సేవించుటకొరకు ఆయనతోపాటు రాజసూయ యజ్ఞమునకు నీవుగూడ రావలెను. నేను అక్కడనే నిన్ను కలిసికొనెదను. ఇప్పుడు మన పుత్రుని పాలించు చుండుము. శోకము విడువుము. బభ్రువాహనుని రూపములో నా ప్రాణములే యిక్కడ నున్నవి గనుక, నీవు ఈ మన పుత్రుని భరించి పోషించు చుండుము. ఇతడు ఈ వంశమును అభివృద్ధి పరచగల పురుష రత్నము.

"ప్రియులారా! ఈ బభ్రువాహనుడు ధర్మానుసారముగ చిత్రవాహనుని పుత్రుడు. కాని, శరీరముతో నితడు పూరువంశమును ఆనందింప జేయువాడు కనుక, పాండవుల యొక్క ఈ ప్రియపుత్రుని నీవు సర్వదా పాలింపుము. నా వియోగముచేత పరితపింపకుము.

"జనమేజయా! అర్జును డిట్లు చిత్రాంగదతో చెప్పి గోకర్ణ తీర్థమువైపునకు బయలుదేరి పోయెను. ఆ తీర్థము భగవంతుడైన శంకరునకు ఆదిమస్థానము అది దర్శనమాత్రముచేత భక్తులకు మోక్షమిచ్చును. పాపిష్ఠులైన మనుష్యులుగూడ అక్కడకు పోయి నిర్భయపదమును (మోక్షస్థానము) పొంద గలరు."

**అర్జునుడు 'ప్రభాస' తీర్థమునందు శ్రీకృష్ణునితో కలిసి అతనితోనే రైవతక పర్వతమునకు, ద్వారకాపురమునకున్ను పోవుట:-**

"జనమేజయా! తరువాత అర్జునుడు క్రమముగా, అపరాంత (పశ్చిమ సముద్ర తీరమునందలి) దేశమునందున్న సమస్త తీర్థములను సేవించుచు ప్రభాసక్షేత్రమునకు పోయెను.

"జనమేజయా! అర్జునుడు ప్రభాసక్షేత్రమునకు వచ్చిన సంగతి శ్రీకృష్ణుడు గూఢచారుల ద్వారా విని అర్జునునితో కలియుట కక్కడకు పోయెను. అప్పుడు కృష్ణార్జునులొండొరులు చూచుకొని సంతోషించి, ఆలింగనము చేసికొని, కుశల ప్రశ్న లడిగిన తరువాత ఆ ప్రియ మిత్రు లిరువురున్ను సాక్షాత్తు నర - నారాయణమునులు వనమందు ఒకచోట కూర్చొనిరి. అప్పుడు శ్రీకృష్ణుడు

అర్జునుని జీవిత చర్యను గూర్చి, 'అర్జునా! నీవు ఎందులకు తీర్థయాత్రలు చేయు చున్నావు?' అని యడుగగా, అర్జునుడు సమస్త వృత్తాంతము శ్రీకృష్ణునకు చెప్పెను.

"జనమేజయా! తరువాత కృష్ణార్జునులు ప్రభాస క్షేత్రమందు స్వేచ్ఛగా తిరిగి రైవతక పర్వతమునకు పోయి ఆరాత్రి యక్కడ గడిపిరి. శ్రీకృష్ణ భగవానునియాజ్ఞచేత నతని సేవకులు అంతకు పూర్వమే రైవతకగిరిని అలంకరించి భోజన సామగ్రులుగూడ సిద్ధపరచి యుండిరి. అక్కడ కృష్ణార్జునులు రుచ్యమైన భోజనముచేసి నట-నర్తకుల నృత్యము చూచి, వారికి బహుమానము లిచ్చి వీడ్కొలిపిరి. అర్జునుడు అక్కడనే మహార్ఘశయ్యపై శయనించెను. శ్రీకృష్ణునితో అనేక తీర్థములను, కుండములను, పర్వతములను, నదులను, వనములను గూర్చి తన యనుభవములను విచిత్రముగా చెప్పెను.

"జనమేజయా! యిట్లు మాట్లాడుచునే అర్జునుడు నిద్రపోయెను. ప్రాతఃకాలమందు అతడు వీణామృదంగాది మధుర గీతముల ధ్వనిచేత, స్తుతి మంగళపాఠ ధ్వనులచేతను మేల్కొల్పబడి, ప్రాతఃకాల కృత్యములు తీర్చుకొని శ్రీకృష్ణునితో నతని సువర్ణ రథమందు కూర్చొని ద్వారకాపురమునకు పోయెను.

"జనమేజయా! అప్పుడు అర్జునుని స్వాగత - సత్కారముల కొరకు ఆ నగర మంతయు, అక్కడి యిండ్లు, తోటలతోపాటు అలంకరింపబడి యుండెను. అర్జునుని చూచుటకు ద్వారకా వాసులు లక్షల సంఖ్యలో ముఖ్య రాజ మార్గములందు నిలిచిరి. అర్జునుడు కనపడుమార్గములలో వేలకొలది స్త్రీలు రెప్ప వాల్చక నిలిచి యుండిరి. భోజ - వృష్ణి - అంధక వంశీయులు గుంపులు గుంపులుగా అర్జునుని చూచుటకు వచ్చిరి.

"జనమేజయా! వృష్ణి - భోజాంధకులచేతను పౌరులచేతను ఈవిధముగ నాదరింపబడి అర్జునుడు వందనీయులకు నమస్కరింపగా, వారతనికి స్వాగతము చెప్పిరి. యదుకులమునందలి సమస్త యువకులు గూడ అర్జునునకు మిక్కిలి సత్కారము చేసిరి. అర్జునుడు తన సమాన వయస్కులను కౌగిలించుకొని యాదరించెను."

"జనమేజయా! తరువాత, వివిధ రత్నములచేత అనేక విధభోజ్యపదార్థముల చేతను నిండియున్న శ్రీకృష్ణుని రమణీయ భవనమందు అర్జునుడు శ్రీకృష్ణునితోనే అనేక రాత్రులు ఆవసించి యుండెను.

"ఇట్లు వైశంపాయనుడు జనమేజయునకు చెప్పి తరువాతి వృత్తాంతము నిట్లు చెప్ప దొడగెను :-

**అర్జున వనవాస పర్వము సమాప్తము.**

# సుభద్రాహరణ పర్వము

**రైవతక పర్వతోత్సవ మందు అర్జునుడు సుభద్రపై ఆసక్తుడగుట - అతడు శ్రీకృష్ణ - యుధిష్ఠిరుల యనుమతి చేత సుభద్రను అపహరించుకొని పోవుటకు నిశ్చయించుట :-**

"జనమేజయమహారాజా! కృష్ణునిభవనమునందు కొన్నిదినములు అర్జునుడు నివసించినతరువాత 'రైవతక' పర్వతమునందు అంధక-వృష్ణికుల ప్రజలు గొప్పయుత్సవము జరిపిరి. భోజ-వృష్ణి-అంధక వంశీయులు, వేలకొలది బ్రాహ్మణులకు ఆయుత్సవమునందు దానములు చేసిరి."

"రాజా! ఆ పర్వతమునలువైపుల రత్నఖచితములైన చిత్రవిచిత్ర రాజభవనములు, కల్పవృక్షములు నుండెను. వానిచేత ఆ పర్వతప్రదేశము మిక్కిలి శోభిల్లు చుండెను. అక్కడ గీత-వాద్య నృత్యములు మహానందముతో జరుగుచుండెను.

వృష్ణివంశబాలకులు చిత్ర-విచిత్రవస్త్ర భూషణములు అలకంరించుకొని సువర్ణభూషితములైన వాహనములపై కూర్చొని దేదీప్యమానులై ఆ పర్వతము నలువైపుల వినోదముగ తిరుగు చుండిరి. ద్వారకావాసులు స్త్రీ-బాల-వృద్ధులందఱున్ను, కొందఱు కాలినడకలో, కొందఱు చిన్న-పెద్దవాహనములలోనువచ్చి ఆరైవతకోత్సవమునందు పాల్గొనిరి.

"జనమేజయా! బలరాముడు సంతోషముతో ఓలలాడుచు తనభార్య రేవతీదేవితో ఆ పర్వతమునందు తిరుగుచుండెను. అతనివెనుక గంధర్వులు (గాయ

కులు) పోవుచుండిరి. వృష్ణివంశభూషణుడైన ఉగ్రసేన మహారాజుగూడ రైవత కాద్రియందు వినోదించుచు సంతోషముతో నుండెను. అతనిచుట్టు అనేక గంధర్వులు గానము చేయుచుండిరి. వేలకొలదిగ స్త్రీలు ఉగ్రసేనుని సేవించుచుండిరి."

"అచ్చట ప్రద్యుమ్నుడు, సాంబుడున్ను దివ్యహారములను, వస్త్రాభరణములనున్ను ధరించి ఆనందముతో విహరించుచుండిరి. అక్రూర-సారణ, గద-బభ్రు-విదూరథ నిశఠ - చారుదేష్ణ - పృథు - విపృథు - సత్యక - సాత్యకి - భంగకార - మహారవ - హార్దిక్య (హృదికపుత్రుడైన కృతవర్మ) - ఉద్ధవులేకాక, యిక్కడ పేరు చెప్పబడని యనేకయదువంశీయులు వేర్వేరుగా వచ్చి, స్త్రీలు, గంధర్వులున్ను గల ఆరైవతకోత్సవశోభను పెంపొంద జేయుచుండిరి."

"అత్యద్భుతమైన ఆ యుత్సవమునందు శ్రీకృష్ణభగవానుడు, అర్జునుడు మాత్రము ఒకటిగచేరి తిరుగుచుండిరి. ఆసమయమునందే వసుదేవపుత్రియైన సుభద్ర అనేకవస్త్రాభరణములతో శృంగారముగ నలంకరించుకొని సఖీజనముతో నక్కడకు వచ్చెను. అట్లు వచ్చిన సుభద్రను అక్కడ తిరుగాడుచున్న కృష్ణార్జునులు చూచిరి.

"జనమేజయా! ఆమెను చూచినతోడనే అర్జునుని హృదయమునందు కామాగ్ని ప్రజ్వలించెను. అతని మనస్సు ఆమెచింతనమునందే ఏకాగ్రమాయెను. అర్జునుని యీ మనోవికారము శ్రీకృష్ణుడు కనిపెట్టి, అతనితో, "భారతభూషణా ఇది యేమి? అరణ్యవాసము చేయువాని మనస్సుగూడ ఈ విధముగ మన్మథవికారము చెందు చున్నదే. ఈమె నాకు సారణునకున్ను సొంత చెల్లెలు. ఈమె పేరు సుభద్ర. ఈమె నాతండ్రికి అత్యంత ప్రియపుత్రిక నీకు ఈమెతో వివాహము చేసికొనవలెనని కోరిక యున్నచో, నాతండ్రికి చెప్పెదను."

శ్రీకృష్ణుని మాటలు విని అర్జును డిట్లనెను :-

"శ్రీకృష్ణా! ఈమె వసుదేవునిబిడ్డ. సాక్షాత్తు వాసుదేవుని సోదరి. అసమాన రూప - సౌందర్య సంపన్నురాలు. కనుక, ఈమె ఎవని మనస్సు మోహింప జేయదు? మిత్రమా! ఈమె నాకు రాణి అయినయెడల నామనోరథము

అన్నియు పరిపూర్ణములు కాగలవు. ఈమెను బడయుటకు ఏ యుపాయములు చేయవలసి వచ్చును? మనుష్యునకు సాధ్యమైన ప్రయత్నములేవైన నున్నచో చెప్పుము. అవి యన్నియు నేను తప్పక చేసెదను."

"అర్జునుని మాటకు వాసుదేవు డిట్లనెను :-

"పార్థా! క్షత్రియుల వివాహములలో స్వయంవరము, అను వివాహ మొకటియున్నది. కాని, దాని ఫలితము సందేహాస్పదము కాగలదు. ఎందు కనగా, స్త్రీలస్వభావము అనిశ్చితముగా నుండును. స్వయంవరమునందు వారు 'ఎవరిని వరించెదరు?' అనువిషయము తెలియదు.

"క్షత్రియ వీరులు బలాత్కారముగ కన్యకను హరించి కొనిపోయి వివాహము చేసికొనుటగూడ క్షత్రియులకు ఉత్తమ వివాహమనియే చెప్పబడినది. ఇట్టి వివాహము ధర్మజ్ఞులందరు అంగీకరించినారు. కనుక, అర్జునా! నాచెల్లెలిని నీవు బలాత్కారముగ అపహరించి తీసికొని పొమ్ము. కనుక ఇట్లు చేయుటయే నీకు మంచిదని నా యభిప్రాయము.

"జనమేజయా! అప్పుడు కృష్ణార్జును లిద్దరు ఆ విషయములో తమ కర్తవ్యమును నిశ్చయించుకొని కొందరిని శీఘ్రగాములను ఇంద్రప్రస్థ నగరమునందున్న ధర్మరాజుకడకు పంపిరి."

"వారు అక్కడకు పోయి ఈ వివాహమునకు ఆయన సమ్మతి తీసికొనుటకు ఆయనకు తెలిపిరి. ఆ దూతల మాట వినగానే యుధిష్ఠిరుడు ఆ పెండ్లికి తన యాజ్ఞ యిచ్చెను. భీమసేనుడు ఈ సమాచారము విని, తనను కృతకృత్యునిగ భావించి, తన మిత్రబాంధవులకు గూడ ఆ సంగతి తెలిపి వారిని సంతోషపరచెను."

**యాదవులు యుద్ధసన్నద్ధులగుట - బలరాముని క్రోధ వచనములు;-**

"జనమేజయా! సుభద్రా వివాహమునకు యుధిష్ఠిరుని యాజ్ఞ లభించిన తరువాత అర్జునుడు శ్రీకృష్ణునితో సంప్రదించగా, శ్రీకృష్ణుడు ముందు చేయవలసిన కార్యమును గూర్చి యర్జునునకు తెలిపి, అనుమతించగా అర్జునుడు విశ్రాంతి కొరకు తన బసకు వెడలిపోయెను."

*"తరువాత శ్రీకృష్ణపరమాత్మని యాజ్ఞచేత అతని సారథి దారుకుడు శ్రీకృష్ణుని సువర్ణరథమును అలంకరించి సిద్ధపరచెను. ఆ రథమునందు గజ్జెలు, తెరలు అమర్చబడి యుండెను. శైబ్య, సుగ్రీవ, మేఘపుష్ప, వలాహకములు అను గుఱ్ఱములు రథమునకు కట్టబడి యుండెను. దానియందు వివిధ శస్త్రాస్త్రములు ఉంచబడి యుండెను. ఆ రథ ధ్వని మేఘగర్జనమువలె వినిపించుచుండెను. అది జ్వలించుచున్న అగ్నివలె తేజస్విగ నుండెను. చూడగనే శత్రువుల సంతోష మంతయు నశింపజేయునదిగ అది యుండెను.

"అర్జునుడు కవచము, ఖడ్గమున్ను ధరించి చేతులకు అంగుళిత్రాణము లను తొడుగుకొని ఆ రథమునందు కూర్చొని వేటాడుటకు పోవునెపముతో రైవతకాద్రిపైకి పోయెను.

## సుభద్రాపహరణము

"అంతకు పూర్వమే సుభద్ర రైవతక పర్వతమును అచ్చోట దేవతలను పూజించుటకు పోయి యుండెను. ఆమె పూజాదులు ముగించుకొని, బ్రాహ్మణుల శుభాశీర్వాదములు తీసికొని ఆ పర్వతమునకు ప్రదక్షిణము చేసి ద్వారకా నగరమునకు తిరిగి వచ్చుచుండెను. అప్పుడు మన్మథబాణ పీడితుడైన యర్జునుడు పరుగెత్తిపోయి బలాత్కారముగ ఆమెను ఎత్తి ఆసువర్ణ రథమునందు కూర్చొన బెట్టుకొని ఆమెతో తన నగరము (ఇంద్రప్రస్థము) వైపు వెడలిపోయెను.

"సుభద్రను అర్జునుడు అపహరించుకొని పోవుచుండుటను సైనికులు చూచి, బిగ్గరగా అరచుచు ద్వారకానగరమువైపు పరుగెత్తి "సుధర్మ" అను సభకు పోయి అక్కడి సభా పాలకునకు అర్జునుడు చేసిన సాహస కార్యమును తెలిపిరి.

* యతివేషమునం దున్నయర్జునుని సుభద్ర సేవించినట్లు కథ నన్నయ భారతములో నున్నది. ఆవృత్తాంతాము గోరఖ్‌పూర్ ప్రతి సంస్కృత భారతములో లేదు.

"వారి మాటలు విని సభాపాలకుడు, అందరు యుద్ధమునకు సంసిద్ధులు అగుటకు యాచించుటకై సువర్ణభేరీని (నగారా) వాయించెను. ఆ పెద్ద భేరీధ్వని విని భోజ - వృష్ణి - అంధక వీరులు మిక్కిలి క్షోభచెంది అన్న పానీయము లను విడిచి, నలువైపులనుండి పరుగెత్తుచు సుధర్మ సభకు వచ్చిరి.

"ఆ సభలో నూర్లకొలది సువర్ణ సింహాసనములు ఉంచబడి యుండెను. అవి నవరత్న ఖచితములై యుండుటచేత ప్రజ్వలితాగ్నివలె ప్రకాశించు చుండెను. భోజ - వృష్ణి - అంధకులు ఆ సింహాసనములందు కూర్చొని యుండగా, వారు యజ్ఞవేదియందున్న అగ్నులవలె ప్రకాశించుచుండిరి. దేవతా సమూహమువలె అక్కడ కూర్చొనియున్న ఆ యాదవ సముదాయమునకు, సభాపాలకుడు అర్జునుడు చేసిన దుష్కృత్యమునుగూర్చి తెలిపెను.

"అది వినగానే యాదవులందరు యుద్ధోన్మాదముచేత ఎఱ్ఱబడిన కన్నులతో అర్జునునియందు మిక్కిలి కోపము కలవారై, త్వరగా తమ తమ రథములను, ఆయుధములను, కవచములను తెమ్మని గర్వముతో సారథులకు చెప్పదొడగిరి. కొందరు స్వయముగానే సువర్ణాభరణ భూషితములైన యశ్వములను రథము లకు కట్టదొడగిరి. ఆ రథాదులన్నియు వచ్చుచుండగా వాని కోలాహల ధ్వని అక్కడ అధికముగ వినపడెను.

"తరువాత, కైలాస శిఖరమువలె తెల్లని శరీరవర్ణము కలిగి, నల్లని వస్త్రమును, వనమాలను ధరించునట్టి బలరాముడు యాదవులతో నిట్లనెను.

"మూర్ఖులారా! శ్రీకృష్ణుడు మౌనముతో కూర్చొనియున్నాడు. మీరిక్కడ నేమి చేయుచున్నారు? శ్రీకృష్ణుని యభిప్రాయము తెలిసికొనకయే మీరు ఇంతగా కోపించు చున్నారు. మీకోలాహల మంతయు వ్యర్థము. మొదట శ్రీకృష్ణుడు తన యభిప్రాయము తెలుపవలెను. తరువాతనే అతనికి ఉచితమని తోచినపని మీరు చేయుడు."

"జనమేజయా! బలరాముడు చెప్పినమాట విని యాదవు లందరు ఊర కుండిరి. పిమ్మట బలరాముడు శ్రీకృష్ణ భగవానునితో నిట్లనెను":-

"జనార్దనా! ఇది యంతయు చూచుచుండి కూడ నీవు ఎందుకు మౌనము వహించి యున్నావు? నిన్ను సంతోషపరచుటకే కదా మే మంత రము అర్జునుని సత్కారించితిమి. కాని, దుర్బుద్ధి గలవాడు, కులమునకు కళంకము తెచ్చువాడు నయిన అర్జునుడు మన సత్కారమునకు ఎప్పుడు గూడ అర్హుడు కాడు. సత్కులీను డెవ్వడు గూడ ఇట్టి చెడుపని చేయడు. ఎవడైనను తాను తినిన భోజన పాత్రమునే పగులకొట్టునా?"

("తిన్నయింట వాసాలు లెక్కపెట్టుట" అని ఇప్పుడు ప్రచారములోనున్న సామెతకు ఇది సమానముగ నున్నది.)

"కృష్ణా! మనతో సంబంధము చేయదలచినవా డెవడైనను మనము పూర్వము చేసిన యుపకారమును దలచుచు ఇటువంటి దుస్సాహస కార్యములు చేయునా?

"యాదవవీరులారా! అర్జునుడు మనకు అవమానము కృష్ణునకు అనాదరము చేసి, నేడు బలాత్కారముగ సుభద్రను అపహరించెను. ఈకార్యము అతనికి మృత్యువుతో సమానమైనది సుమా!

"గోవిందా! పాము తనను త్రొక్కుట సహించనట్లే, యిప్పుడు అర్జునుడు నా తలపైతన్నిన దెబ్బను ఎట్లు ఓర్వ గలను? అర్జునుడుచేసిన ఈ యన్యాయమును నేను సహించను. నేడు నేను ఏకాకిగనే యుద్ధము చేసి ప్రపంచమునందు కురు వంశీయులు లేకుండ చేసెదను.

"జనమేజయా! మేఘ - దుందుభి ధ్వనివలె అతి గంభీరముగా బలరాముడు పలుకు చున్నమాటలు విని ఆ సభలోని వృష్ణ్యంధక భోజవీరు లందరున్ను బలరాముని ప్రశంసించి, అతనినే యనుసరించిరి.

సుభద్రాహరణ పర్వము సమాప్తము

## హరణా హరణ పర్వము

**ద్వారకలో సుభద్రార్జునుల వివాహము - అర్జునుడు ఇంద్ర ప్రస్థము చేరిన తరువాత శ్రీకృష్ణాదులు కానుకలతో నచటికి పోవుట - అభిమన్యుని జననము ద్రౌపదీ పుత్రుల జననము - వారికి జాతకర్మాది సంస్కారములు, విద్యాభ్యాసము :-**

"జనమేజయా! అప్పుడు యాదవ వీరులు, తమ - తమ పరాక్రమము ననుసరించి, అర్జునునకు ప్రతీకారము చేయ బూనిరి. అప్పుడు శ్రీకృష్ణ భగవానుడు వారితో ధర్మార్థ యుక్తము లైన మాటల నిట్లు చెప్పెను" :-

"యాదవులారా! అర్జునుడు యాదవ కులమునకు అవమానకర మైనపని యేమియు చేయ లేదు. కాని, ఈ కార్యము చేసి యతడు ఈ కుల గౌరవమును, అభివృద్ధి పరచెను. యాదవ వంశము వారికి ధనము నందు లోభము లేదు. కాబట్టి, ధనము లిచ్చి కన్యకను తీసికొనవలసిన యవసరము లేదు అని అర్జును నకు తెలియును. స్వయంవరము నందు కన్యక లభించునని పూర్తిగ నిశ్చయ ముండదు గనుక, అది గూడ గ్రాహ్యము కా దని అర్జునునకు తెలియును."

"ప్రపంచము నందు వీర పురుషుడు ప్రరాక్రమశూన్యుడై పశువువలె కన్యాదానము కొఱకు వేచి కూర్చొని యుండును? ధనము తీసికొని సంతానమును విక్రయించునట్టి యధమ పురుషుడు ప్రపంచము నందు ఎవ డుండును? అర్జునుడు ఈ దోషములు కనిపెట్టియే క్షత్రియ ధర్మము ననుసరించి బలాత్కారముగ కన్యక నపహరించెను." అని నా విశ్వాసము. ఈ బాంధవ్యము సముచిత మని నేను తలచెదను. సుభద్ర యశస్విని, అర్జునుడు గూడ యశస్వియే. కాబట్టి, అతడు సుభద్రను బలాత్కారముగ అపహరించెను.

"యాదవ వీరులారా! అర్జునుడు ప్రఖ్యాతమైన శాంతను కులము నందు జన్మించెను. అతడు కుంతి భోజకుమారియైన కుంతీదేవికి పుత్రుడు. ఇటువంటి వీర పురుషుడైన యర్జునుని సంబంధము ఎవడు కోరకుండును?

"యాదవ వీరులారా! స్వర్గ - కైలాస లోకములందు భగదేవత నేత్ర ములను నశింపజేయగల భయంకర నేత్రములు గల భగవంతుడైన రుద్రుడు దప్ప అర్జునుని యుద్ధమునందు జయింపగల సమర్థుడు ప్రపంచమునం దెక్కడ గూడ మరియొకడు నాకు కనబడలేదు.

"ఇప్పుడు అర్జునుని కడ అద్భుతములైన నా యశ్వములు కూర్చబడిన నా రథము ఉన్నది. అందులో లాఘవముతో శస్త్రాస్త్రములను ప్రయోగించ గల యోధుడైన అర్జునుడున్నాడు. ఇట్టి పరిస్థితిలో అర్జునుని ఎవడు ఎదుర్కొని

పోరాడగలడు. కాబట్టి, యాదవులారా! మీరు సంతోషపూర్వకముగా పరుగెత్తుచు పోయి, అర్జునుని సమాధానపరచి, మరలించి, యిచటకు తోడ్కొని రండు. ఇదియే నాకు మిక్కిలి సమ్మతమైన విషయము.

"యాదవ వీరులారా! అర్జును డొకవేళ తన బల - పరాక్రమములతో మిమ్మందరను జయించి తన పట్టణమునకు వెడలిపోయిన యెడల, మీ కీర్తి యంతయు నష్టమై మీరు అవమానము పాలయ్యెదరు. కనుక, ఇప్పుడే త్వరగా మీరు అతని కడకు పోయి అతనిని అనునయించి, గౌరవ పూర్వకముగా ఇక్కడకు తోడుకొని వచ్చినచో మీకు అపజయము కలుగదు".

"జనమేజయా! శ్రీకృష్ణుడు చెప్పిన ప్రకారమే యాదవులు చేసిరి. వారి ప్రార్థనపై అర్జునుడు ద్వారకకు తిరిగి వచ్చెను. ద్వారకానగరమునందు యాదవు లందఱు సుభద్రతో అర్జునునకు వివాహముచేసిరి. తరువాత, ఆ నవ దంపతులు ద్వారకయందే ఒక సంవత్సరము కంటే అధిక కాలము ఉండిరి.

"జనమేజయా! ఈ విధముగా అర్జునుడు ద్వారకయందు స్వేచ్ఛగా సుభద్రతో విహరించి యాదవులచేత పూజితుడై ద్వారకనుండి 'పుష్కర' తీర్థమునకు పోయి అక్కడ అతడు తన వనవాసములో మిగిలిన సమయము గడపెను.

"జనమేజయా! ఇట్లు అర్జునుడు తన పన్నెండు సంవత్సరముల యరణ్యావాసవ్రతము పూర్తి చేసిన తరువాత ఖాండవప్రస్థ నగరమునకు పోయి అక్కడ ధౌమ్యాచార్యులకు, కుంతీదేవికి యుధిష్ఠిరునకు, భీమునకున్ను నమస్కారము చేసెను. అతనికి నకుల - సహదేవులు నమస్కారములు చేసిరి. ఆ యిద్దరిని ఆలింగనము చేసికొనెను. తరువాత, బ్రాహ్మణులను పూజించి, ద్రౌపది కడకు పోయెను అపుడు ద్రౌపదీదేవి ప్రణయకోపముతో అర్జునునితో నిట్లనెను:-

"కుంతీనందనా! నీ విక్కడకు ఎందుకు వచ్చితివి? సుభద్ర యున్న చోటికే పొమ్ము. మోపునకు మెలుదలుకట్టు ఎంత గట్టిగా బిగించి వేసినను రెండవసారి కట్టు వేసినపుడు మొదటి బంధము సడలి పోవును. ఇట్టిదియే నాయెడల నీకు గల ప్రేమబంధము గూడ నని తలచెదను."

"జనమేజయా! ఇట్లు ద్రౌపది మాట్లాడి మిక్కిలి దుఃఖించెను. అప్పుడు అర్జునుడు ద్రౌపదిని అనేకవిధములుగ నూరడించి తన యపరాధమును క్షమించుమని మాటి - మాటికి ప్రార్థించెను."

"తరువాత అర్జునుడు, ఎఱ్ఱని పట్టుచీర ధరించి సర్వాభరణ భూషితురాలై వచ్చిన సుభద్రకు త్వరగా గొల్లపడుచు వేషము వేయించి రాజభవనము నందు ప్రవేశింప జేసెను."

"వీరపత్ని, వీరాంగన, యశస్వినియు నైన సుభద్ర ఆ గొల్లవేషము నందు గూడ మిక్కిలి శోభిల్లు చుండెను. ఆమె నేత్రములు విశాలముగా, కొంచెము రక్తవర్ణము గలవిగను నుండెను. ఆమె కుంతీదేవి చరణములకు ప్రణామములు చేసెను. కుంతీదేవి కోడలు, సుభద్రను కౌగిలించుకొని, శిరస్సును ఆఘ్రాణించి, యాశీర్వదించెను. పిదప, సుభద్ర మహారాజ్ఞియైన ద్రౌపది కడకు పోయి ఆమెకు నమస్కరించి, "దేవీ! 'నేను నీకు దాసిని' అని చెప్పెను. అప్పుడు ద్రౌపది మిక్కిలి సంతోషించి సోదరి సుభద్రను కౌగిలించుకొని "సోదరీ! నీ పతి శత్రురహితుడగుగాక!" అని ఆశీర్వదించగా సుభద్ర మిక్కిలి ఆనందపడెను.

"జనమేజయా! తరువాత, పాండవులు, కుంతీదేవియు చాల సంతోషపడిరి. అర్జునుడు ఇంద్రప్రస్థనగరమునకు చేరిన తరువాత కృష్ణ - బలరాములు అంధక - వృష్ణి - యాదవముఖ్యులతో, పుత్రులతో, యోధులతోను ఇంద్రప్రస్థ నగరమునకు వచ్చిరి. వృష్ణివంశీయుల సేనాపతి "దానపతియు" నైన ఆ క్రూరుడు అచటికే వచ్చెను. అలాగే 'అనాధృష్టి', 'బృహస్పతి శిష్యుడు,' పరమ బుద్ధిశాలి, మహామనీషియు నైన ఉద్ధవుడుగూడ వచ్చి యుండిరి. 'సత్యక - సాత్యకి - సాత్వతవంశీయ కృతవర్మన్ - ప్రద్యుమ్న - సాంబ నిశఠ - శంకు - చారుదేష్ణ - ఝిల్లీ - విపృథు - మహాబాహు - సారణాదులు, పండితోత్తముడైన గదుడు, యదు - వృష్ణి - భోజ - అంధక వంశీయులున్న పలు విధములైన కట్నములతో కానుకలతోపాటు ఖాండవ ప్రస్థమునకు వచ్చిరి".

"తరువాత యుధిష్ఠిర మహారాజు శ్రీకృష్ణభగవానునకు ఎదురుగ పోయి సాదరముగా తోడ్కొని వచ్చుటకు నకుల - సహదేవులను పంపెను. ఆ యిరు

వురు, వృష్ణివంశీయులైన బంధువులకు స్వాగతము చెప్పగా వారు ఇంద్రప్రస్థ నగరములో ప్రవేశించిరి

"ధ్వజ - పతాకాద్య లంకారములతో ఆ నగరము మిక్కిలి శోభిల్లు చుండెను. నగరవీథులు శుభ్రము చేయబడి నీరు చల్లబడి యుండెను. అక్కడ క్కడ పూవుల మాలికలు అలంకరింపబడి యుండెను. ఆ పట్టణమునందు ఎక్కడ చూచినను శీతల చందన రసాదులయొక్క, అగరువత్తుల యొక్కయు సుంగధము గుబాళించు చుండెను.

దేశప్రజ లందరు, ఆ వివాహ మహోత్సవమునకు అక్కడకు వచ్చుట చేత ఇంద్రప్రస్థము మిక్కిలి జనసందష్టముగ నుండెను.

"జనమేజయా! శ్రీకృష్ణ - బలరాములు భోజాంధక వృష్ణివంశవీరులతో, నింద్రభవనమును తిరస్కరించునట్టి రాజ ప్రాసాదమునందు బ్రాహ్మణాశీర్వాద ములు గొనుచు ప్రవేశించిరి. యుధిష్ఠిరుడు బలరామునితో కలిసి, కృష్ణుని కౌగి లించుకొని మస్తకము మూర్కొనెను. శ్రీకృష్ణుడు ప్రసన్నుడై వినయముతో యుధిష్ఠిర భీమసేనులను సన్మానించెను. యుధిష్ఠిరుడు అంధక - వృష్ణి వంశీ యోగ్యతానుసారముగ సత్కరించెను. కొందర నతడు గురువులనువలె పూజిం చెను. అనేక సమవయస్కులను మిత్రలనువలె కౌగిలించుకొనెను. కొందరను ప్రేమతో పలుకరించెను. కొందరు యుధిష్ఠిరునకు నమస్కారము చేసిరి.

"శ్రీకృష్ణుడు [1]జన్యములుగా తెచ్చిన కానుకలను ధనమున్ను వరుల బంధువులకు భృత్యులకు నిచ్చెను. వివాహసమయమందు వారికి కట్నములు కాను కలు నీయబడ లేదు.

"జనమేజయా! గజ్జలు, వలలున్ను కట్టబడిన ఒకవేయి సువర్ణరథ ములను అర్జునునకు ఉపహారముగ (కట్నము) నిచ్చెను. ప్రతియొకరథమునకు నాలుగు ఉత్తమాశ్వములు కట్టబడి సుశిక్షితులైన సారథులు నుండిరి. మధురా మండలమునకు చెందిన మంచి పదివేల పాడియావులను శ్రీకృష్ణు డిచ్చెను.

1. వివాహమందు వధూవరుల జ్ఞాతులకు, భృత్యులకున్ను ఈయబడుకట్న ములు కానుకలు 'జన్యము' లన బడును.

చంద్రునివలె తెల్లనివై ఉత్తమ జాతికి చెందిన సువర్ణభూషితములైన ఒకవేయి ఆడుగుఱ్ఱములను, తెల్లనిజూలు గల తెల్లని కంచరగాడిదలను ఐదు నూర్లను ఇచ్చెను.

"జనమేజయా! స్నానపానోత్సవాదులకు ఉపయోగింప బడునట్టి వారు, యువావస్థలో నున్నట్టివారు, సుందరవేషము మనోహరకాంతియు కలిగినవారు, నూరు - నూరు రత్నములు పొదుగ బడిన సువర్ణకంఠ హారములు ధరించినట్టి వారు, శరీరమునందు రోమావళి (నూగారు) మొలవనట్టివారు, వస్త్రాభరణభూషిత లైనట్టివారు, సేవాకార్యములలో దక్షత గలయట్టివారు నగు గౌరవర్ణ కన్యకలను ఒకవేయి మందిని శ్రీకృష్ణుడు అర్జునునకు కానుకలుగా నిచ్చెను.

"జనమేజయా! శ్రీకృష్ణుడు భారవహన సమర్థములైన ఒక లక్ష బాహ్లీక దేశీయాశ్వములను కానుక యిచ్చెను. ఇవియేగాక ఏడుగురు మనుష్యులు మోయగలిగిన కృత్రిమ (నాణెముల) - అకృత్రిమ (శుద్ధము) సువర్ణములను గూడా యిచ్చెను.

"జనమేజయా! సాహసకార్యములందు ప్రీతి గలవాడు, హలధరుడునైన రాముడు ప్రసన్నుడై ఈ సంబంధమును ఆదరించుచు అర్జునునకు పెండ్లికానుకగ ఒక వేయి మదగజములను ఇచ్చెను. ఆ గజములు యుద్ధమునం దెప్పుడు గూడ వెనుకాడక పర్వతశిఖరములవలె కనపడుచు కుంభస్థలములందు అలంకరించబడి పార్శ్వభాగములందు గంటలు వ్రేలాడు చుండగా కంఠమునందు సువర్ణ హారములు కలవియై, మదధారలు గురియుచుండెను. ఆ సుందరగజము లన్నింటి పైన మావటివారు ఉండిరి.

"జనమేజయ! నదుల జలప్రవాహములు సముద్రములో కలిసినట్లే, ఆ కానుకల ధనరత్నముల ప్రవాహములు పాండవులనెడి మహాసాగరములో కలిసెను. ఆ ధనప్రవాహములో వస్త్రకంబళములు నురుగులవలె తోచుచుండెను. మదజములు మొసళ్ళవలె, ధ్వజ - పతాకలు శైవాలముల (నాచుతీగెలు) వలె, నుండెను. పాండవ సముద్రము పూర్వమునుండియే పరిపూర్ణముగనుండినప్పటి

కిన్ని దానిలో ఈ కానుకల మహాధన ప్రవాహము చేరి దానిని అత్యంతపూర్ణ తరము చేసెను. ఈ కారణమువలననే పాండవ మహాసముద్రము శత్రువులకు దుఃఖకరముగా తోచుచుండెను.

"జనమేజయా! కౌరవ వృష్ణి - వంశవీరులు వీణాధ్వనులచేత, గానముల చేత, వాద్యములచేతను, తమ - తమ యిష్టానుసారముగ అవకాశము దొరికి నప్పుడెల్ల వినోదించుచుండిరి. చాలా దినములవరకు యాదవులు ఇటులనే విహ రించుచు, కౌరవులచేత సమ్మానితులై యింద్రప్రస్థమునుండి ద్వారకకు తిరిగి పోయిరి. అంధక వృష్ణి మహారథికులు బలరాముని ముందిడుకొని పాండవు లిచ్చిన కానుకలతో వెడలిపోయిరి. భగవంతుడైన వాసుదేవుడు మాత్రము అర్జునునితో ఇంద్రప్రస్థమునందే నిలిచెను. కృష్ణార్జునులు వేటాడుచు వరాహాదివన్య మృగ ములను వధించుచు యమునాతీరమందు సంచరించుచు విహరించు చుండిరి.

కొంతకాలము తరువాత సుభద్ర శచీదేవి జయంతుని కనినట్లు కీర్తిమంతు డైన అభిమన్యుని కనెను. ఆ యభిమన్యుడు దీర్ఘబాహువులు - విశాల వక్షము - ఆబోతు కన్నులవంటి కన్నులు ఈ మొదలైన మహాపురుషుల లక్షణము లన్నిం టితో శోభిల్లుచు శత్రుదమనుడై యుండెను.

"అభి" అనగా నిర్భయుడై "మన్యు" అనగా కోపము గలవాడై యుండువాడని యర్థము కనుక, ఆ బాలకుడు "అభిమన్యు"డని అనబడు చుండెను. జమ్మిచెట్టు గర్భమునందు అశ్వత్థవృక్ష కాష్ఠముచేత మథించగా పుట్టిన అగ్నివలె అర్జునునివలన సుభద్రా గర్భమునందు ఆ వీరబాలకుడు జన్మించెను.

"పుత్రోత్పత్తి సంతోషముచేత యుధిష్ఠిరుడు బ్రాహ్మణులకు పదివేల గోవులను, బంగారు నాణెములనేకములనున్ను దానము చేసెను.

"ప్రజలకు చంద్రుడు ఆహ్లాదకరుడైనట్లే శైశవమునుండియే. అభి మన్యుడు తండ్రులకువలె శ్రీకృష్ణభగవానునకు అత్యంత ప్రియుడాయెను. ఆ బాలకుని జననమునుండియే శ్రీకృష్ణుడు పలువిధములుగా లాలించి, పాలిం చుట చేత అభిమన్యు కుమారుడు శుక్లపక్షచంద్రునివలె దిన-దినము వృద్ధి పొందు చుండెను.

జనమేజయా! అభిమన్యుడు బాల్యమునందు వేదాధ్యయనము చేసిన తరువాత తనతండ్రి యైన యర్జునుని కడ "[1]నాలుగుపాదములు, [2]పది లింగములు [3]దివ్యమానుషాస్త్రములు" ఈ యన్నిటితో గూడిన ధనుర్వేదమును సమగ్రముగ అభ్యసించెను.

1. ధనుర్వేదములో నాలుగు పాదములు.
ధనుర్వేదములో నాలుగు పాదము లేవనగా,

శ్లో॥ మంత్రముక్తం, పాణిముక్తం, ముక్తాముక్తం తథైవ చ
అముక్తం చ ధనుర్వేదే చతుష్పాచ్ఛస్త్రమీరితమ్ ॥

(1) మంత్రముక్తమనగా, మంత్రముచేత ప్రయోగింపబడు అస్త్రము; అది తిరిగి ఉపసంహరించుకొనబడదు.

(2) పాణిముక్త మనగా, చేతితో తీసికొని ధనుస్సుపైన సంధించి విడువబడు బాణము మొదలైన యాయుధము. అది గూడ తిరిగి ఉపసంహరించుకొనబడదు.

(3) ముక్తాముక్త మనగా, ప్రయోగోపసంహారములు రెండును చేయబడు అస్త్రములు.

(4) అముక్త మనగా, విడువబడక దర్శనమాత్రముననే శత్రువులు పరుగెత్తిపోవు ధ్వజము మొదలైనవి. ఇవి మంత్రములచేత సాధింపబడియుండును.

అథవా, "సూత్రములు, శిక్షా - ప్రయోగములు, రహస్యములు" ఈ నాలుగు గూడ ధనుర్వేదమునకు నాలుగు పాదము లనబడును.

2. ధనుర్వేదాంగములు :

"ఆదానమథ సంధానం మోక్షణం వినివర్తనమ్
స్థానం ముష్టిః ప్రయోగశ్చ ప్రాయశ్చిత్తాని మండలమ్
రహస్యం చేతి దశధా ధనుర్వేదాంగ మిష్యతే"

(1) అంబులపొది నుండి బాణమును తీయుట 'ఆదానము'.

(2) బాణమును ధనస్సుయొక్క అల్లెత్రాటియందు ఉంచుట 'సంధానము' అనబడును.

అస్త్ర విజ్ఞానమునందు, ప్రయోగ పాటవమునందు, యుద్ధ క్రియ లన్నింటి యందును నిష్ణాతుడైన యర్జునుడు అభిమన్యునకు ఈ యన్నింటిని పరిపూర్ణముగ నేర్పి తన సమానునిగా చేసి సంతోషించెను.

"జనమేజయా ! అభిమన్యుడు అన్ని విద్యలయందు పరిపూర్ణుడై ఉత్తమ లక్షణ శోభితుడై సమస్త - సద్గుణ - సంపన్నుడై దుర్ధర్షుడై ప్రకాశించు

:

(3) లక్ష్యముపైన బాణమును విడుచుట 'మోక్షము' అనబడును.

(4) బాణము విడిచిన తరువాత శత్రువు దుర్బలుడనిగాని, నిరాయుధుడనికాని తెలిసినపుడు వీరపురుషుడు తన మంత్రశక్తి చేత ఆ బాణమును ఉపసంహరించుకొనుట 'వినివర్తనము' అనబడును.

(5) ధనుస్సుగాని, అల్లెత్రాడుగాని "స్థాన" మన బడును. అథవా శరసంధానకాలమునందు ధనుస్సు యొక్క గాని, అల్లెత్రాటియొక్క గాని మధ్య ప్రదేశము "స్థాన" మన బడును.

(6) మూడు లేక నాలుగు వ్రేళ్ళు ఒకటిగ చేర్చి ముడుచుకొన్నప్పుడు "ముష్టి" అనబడును.

(7) చూపుడు వ్రేలు, నడిమి వ్రేలు ఈ రెంటి మధ్యము నుండి కాని లేక నడిమి వ్రేలు, బొటనవ్రేలు ఈ రెంటి మధ్యము నుండి కాని, బాణము సంధించుట 'ప్రయోగ' మనబడును.

(8) తననుండి కాని, ఇతరుని నుండి కాని కలిగిన యల్లెత్రాటి ఒరపిడి దెబ్బను, బాణపు దెబ్బనున్ను నివారించుటకు చేతులకు తొడగుకొను 'అంగుళి త్రాణము' మొదలైన తొడుగుతోలు 'ప్రాయశ్చిత్త' మన బడును.

(9) చక్రాకారముగ పరిభ్రమించుచు రథము వెనువెంట తిరుగుచున్న లక్ష్యమును కొట్టుట 'మండల' మనబడును.

(10) శబ్దమును విని దాని యాధారము పైన లక్ష్యమును ఛేదించుట గాని, ఒకసారి అనేక లక్ష్యములను ఛేదించుటగాని, 'రహస్య' మన బడును.

8. దివ్య - మానుషాస్త్రములు :

బ్రహ్మాస్త్రము మొదలైనవి "దివ్యము" లని, ఖడ్గము మొదలైనవి "మానుషాస్త్రము" లని చెప్ప బడినవి.

చుండెను. అతని మూపులు వృషభముల మూపులవలె బలిసియుండి, నోరు తెరచుకొనిన సర్పమువలె నతడు భయంకరుడై యుండెను.

అతనికి సింహసమాన గర్వము, మదగజ సమాన పరాక్రమము నుండెను. అతని కంఠధ్వని గూడ మేఘ - దుంధుభులధ్వనులవలె గంభీరముగ నుండెను. అతని ముఖము పూర్ణచంద్రునివలె అందరి మనస్సులకు ఆహ్లాదకర ముగ నుండెను.

అభిమన్యుడు ఆకార - శౌర్య - పరాక్రమ రూపములందు శ్రీకృష్ణునితో సమానుడుగ తోచుచుండెను. అర్జునుడు తనతండ్రి ఇంద్రుడు తనను చూచినట్లే తాను అభిమన్యుని చూచి సంతోషించుచు చుండెను.

జనమేజయా ! ద్రౌపదీదేవి తన అయిదుగురు పతుల నుండి యుత్తమ పుత్రుల నైదుగురను ఐదు పర్వతములనువలె కనెను. వారందఱు, వీరులు, ధీరులునై యుండిరి.

(1) యుధిష్ఠిరుని కొడుకు "ప్రతివింధ్యుడు" (2) భీమసేనుని కొడుకు "సుతసోముడు", (3) అర్జునుని కొడుకు "శ్రుతకర్మ", (4) నకులుని కొడుకు "శతానీకుడు", (5) సహదేవుని కొడుకు "శ్రుతసేనుడు" అని ద్రౌపదీ పుత్రుల పేర్లు. ద్రౌపదీదేవి ఈ యైదుగురు కొడుకులను అదితిదేవి ద్వాదశాదిత్యులను వలె కనెను.

"జనమేజయా ! ఈ యైదుగురి పేర్లు సార్థకములుగ నున్నవి-

ఆయుధముల దెబ్బల నొప్పిని లెక్క చేయకుండుటతో వింధ్య పర్వతము వలె ధైర్యముతో నిలిచియుండువాడు గాబట్టి, యుధిష్ఠిర పుత్రునకు ప్రతివింధ్యుడు అని పేరు పెట్టిరి. శత్రువుల దెబ్బలవలన అతనికి బాధ కలుగ కుండుగాక". అని బ్రాహ్మణులు ఆశీర్వదించిరి.

"భీమసేనుడు సహస్ర సోమయాగములు చేసిన తరువాత, ద్రౌపది అతని నుండి చంద్ర - సూర్య సమాన తేజస్సుగల పుత్రుని కనినందువలన అతనికి "సుతసోముడు" అని నామకరణము చేయబడెను.

"అర్జునుడు శ్రుత (ప్రఖ్యాత)ములైన మహాకర్మములన్ను చేసి వచ్చిన తరువాత ద్రౌపది నుండి పుత్రుని కనినందువలన ఆ పుత్రునకు "శ్రుతకర్మ" అని పేరు పెట్టబడెను.

"కౌరవ కులమునందు మిక్కిలి ప్రఖ్యాతుడైన రాజర్షి "శతానీకుడు" అని యుండెను. అతని స్మరణార్థము నకులుని పుత్రునకు "శతానీకుడు" అని పేరు పెట్టబడెను.

"ద్రౌపది అగ్ని దేవతా సంబంధమైన కృత్తికా నక్షత్రము నందు సహదేవుని నుండి పుత్రుని కనినందుచేత అతనికి "శ్రుతసేనుడు" అనుపేరు పెట్టబడెను. శ్రుతసేను, డనగా, అగ్నిదేవుని మరియొక పేరు.

"జనమేజయా! ఈయైదుగురు పుత్రులు పంచపాండవులకు ఒక్కొక్క సంవత్సరము అంతరములో వరుసగ పుట్టిరి.

పురోహితుడైన ధౌమ్యాచార్యుడు ఆ కుమారులకు క్రమముగ జాతకర్మ చూడాకర్మ - ఉపనయనాది సంస్కారములను శాస్త్రోక్తముగ చేసెను.

"తరువాత ధౌమ్యాచార్యుడు బ్రహ్మచర్య వ్రతపాలన చేయు నా బాలకులకు వేదాధ్యయనము చేయించిన తరువాత వారికి అర్జునుడు దివ్య - మానుష - రూపధనుర్వేదము పూర్తిగ నేర్పెను.

"జనమేజయా! దేవతాపుత్రులవలె విశాలవక్షములు గలిగి-మహారథికులు నైన పుత్రులతో పాండవులు మిక్కిలి ఆనందించుచు నుండిరి.

**హరణాహరణ పర్వము - సమాప్తము**

## యుధిష్ఠిరుని రాజ్యవ్యవస్థ

**కృష్ణార్జునుల ఖాండవవన గమనము - వారికడకు అగ్నిదేవుడు బ్రాహ్మణ వేషముతో వచ్చుట :**

"జనమేజయా! పాండవులు ఇంద్రప్రస్థమునందు రాజ్యము ప్రజాహితముగ నేలుచుండిరి. భీష్మ ధృతరాష్ట్రుల యాజ్ఞలో మెలగుచుండిరి. తమ

శత్రువులను సంహరించి, రాజ్యవిస్తారము చేసిరి. యుధిష్ఠిరుని యాశ్రయము నందు, ప్రజలు, జీవాత్మ తన పుణ్యకర్మ ఫలము చేత ఉత్తమ జన్మముపొంది సుఖము ననుభవించునట్లు, సుఖముగ నుండిరి.

"జనమేజయా ! ధర్మాత్ముడైన యధిష్ఠిరుడు ధర్మార్థకామములను, తన యాత్మబంధువులనుగా తలచుచు, న్యాయముతో ఆ మూడింటిని సమానముగా సేవించుచు నీతిజ్ఞుడై యుండెను. యుధిష్ఠిరుడు సమానరూపములో ననుసరించు చున్న ధర్మార్థకామములు, ప్రపంచమునందు మూర్తిమంతము లై యుండెను. యుధిష్ఠిరుడు చతుర్థ పురుషార్థ మైన మోక్షమువలె శోభిల్లుచుండెను. ఎల్లప్పుడు పరమాత్మచింతన చేయుచు, అనేక యజ్ఞములను చేయుచు వేదమార్గమునందు సంచరించుచు, ప్రజారక్షణమునందు తత్పరు డై యుండెను. అటువంటి రాజు పాలనమునందు సుఖముగ ప్రజలు ఉండి ఆనందము ననుభవించుచుండిరి.

"జనమేజయా! యుధిష్ఠిరుని ధర్మము కారణముగా నితరరాజుల లక్ష్మి గూడ చాంచల్యము వీడి స్థిరముగనుండెను. ధర్మము అతని రాజ్యమునందు నాలుగు పాదములతో దిన - దినము వృద్ధి చెందుచుండెను. అవసరమునుబట్టి ఉపయోగింపబడు నాలుగువేదములచేత ఆరంభింపబడు మహాయజ్ఞములు శోభిల్లు నట్లే, యుధిష్ఠిరుడు తన యాజ్ఞలో నడచుకొనుచున్న నలుగురు తమ్ములతో మిక్కిలి శోభిల్లుచుండెను. బృహస్పతి వంటి ముఖ్యదేవతలు ప్రజాపతిని సేవించి నట్లే, ధౌమ్యుడు మొదలైన బ్రాహ్మణులు యుధిష్ఠిరుని చుట్టు కూర్చొనుచుండిరి.

"జనమేజయా! నిష్కళంక పరిపూర్ణ చంద్రునివలె ఆనందప్రదుడైన యుధిష్ఠిరునియెడల మిక్కిలి ప్రీతిగల ప్రజలు అతనిని చూచి, నేత్రానందమును హృదయానందమును అనుభవించుచుండిరి. యుధిష్ఠిరుడు తమ పాలకుడని మాత్రమే కాక ప్రజలు, అతనియందు శ్రద్ధాభక్తులు గల వారగుటచేత గూడ అతనిని చూడగనే సంతోషించుచుండిరి.

ప్రజలకు ప్రియమైన కార్యమునే అతడు చేయుచుండెను. కనుక, వారికి మనోరంజకుడుగ నుండెను. ఎల్లప్పుడు మధురముగా మాట్లాడు యుధిష్ఠిరుని నోటినుండి యెప్పుడుగూడ ఏలాటి యనుచితము-అసత్యము-అప్రియము-అస

వ్యాముసైన మాట వెడలకుండెను. యుధిష్ఠిరమహారాజు, తమకు, ప్రజకు, నెల్లప్పుడున్ను హితమునే చేయుచు, మిక్కిలి సంతోషముతో కాలము గడప చుండెను.

"జనమేజయా! ఈ విధముగా పాండవులు తమ పరాక్రమముచేత, ఇతర రాజులను తపింపజేయుచు, నిశ్చింతులై ఆనందముతో ఇంద్రప్రస్థమునందు నివ సించుచుండిరి. ఇట్లుండగా, కొన్ని దినముల తరువాత అర్జునుడు శ్రీకృష్ణునితో నిట్లనెను :-

కృష్ణా! చాల వేడిగానున్నది. యమునలో స్నానము చేయుదము రమ్ము. మధుసూధనా! మిత్రులతో నక్కడ జలక్రీడ చేసి సాయంకాలము వరకు తిరిగి వత్తము."

ఆ మాటకు వాసుదేవుడు, తనకు గూడ జలక్రీడేచ్ఛ గలదని చెప్పెను.

"జనమేజయా! తరువాత కృష్ణార్జునులు యుధిష్ఠిరుని యాజ్ఞ తీసికొని మిత్రులతో జలక్రీడకై యమునానదికి పోయిరి.

"జనమేజయా! కృష్ణార్జునులు యమునా తీరమునందలి విహారస్థలమునకు వివిధ వస్త్రమణిసువర్ణాలంకార భూషితలైన తమ రాణులతో పోయిరి. అక్కడ సుందర రత్నభవనమునందు వారు బసచేసిరి. అక్కడ వివిధ వృక్షములు అందముగా నుండెను. అక్కడ నిర్మించబడి యుండిన చిన్న - పెద్ద భవ నములతో అది ఇంద్రుని పురమువలె నుండెను. అక్కడ అంతఃపుర స్త్రీలతో పాటు అనేక వివిధభక్ష్య-భోజ్య-పేయ పదార్థములు, అనేక పుష్పహారములు ఉండెను. అక్కడకు పోయి అందరు తమ-తమ యిష్టము ప్రకారము జల విహారము చేసిరి.

"జనమేజయా! విశాల నితంబములు, మనోహర పీనపయోధరములు సుందర వదనములున్ను గల వనితలు యౌవన మదముచేత, చిలిపి చేష్టలు చేయుచు స్వేచ్ఛగా జలవిహార క్రీడలు చేయుచుండిరి. ఆ స్త్రీలు కృష్ణార్జునుల యిష్టానుసారముగా కొందరు వనములో, కొందరు జలములో, మరికొందరు భవనములలోను యథోచితముగా వారితో క్రీడించుచుండిరి.

"జనమేజయా! అప్పుడు ద్రౌపదీ-సుభద్రలు అనేక వస్త్రాభరణములు అక్కడివారికి పంచిరి. అక్కడ కొందరు స్త్రీలు సంతోషోల్లాసములతో నృత్యములు చేసిరి. నవ్వుచుండిరి. కొందరు ఒండొరులను పట్టుకొని పరిహాస పూర్వకముగా మెల్లగా కొట్టుకొనుచుండిరి. కొందరు స్త్రీలు ఒంటరిగా కూర్చొని రహస్య భాషణములు చేయుచుండిరి. అక్కడి రాజభవనము వనమున్ను వీణా - వేణు మృదంగాది వాద్యముల ధ్వనులతో ప్రతిధ్వనించుచుండెను.

"జనమేజయా! ఈ విధముగా నక్కడ క్రీడావిహారములు ఆనందోత్సాహములున్ను జరుగుచుండగా,-కృష్ణార్జునులు, అక్కడకు సమీపములోనున్న సుందర ప్రదేశమునకు పోయి, అక్కడ వారు ఒక్కమూల సింహాసనములందు కూర్చొని తమ పూర్వ పరాక్రమ వృత్తాంతములు ముచ్చటించుకొనుచుండిరి.

"జనమేజయా! స్వర్గములో అశ్వినీ దేవతలవలె కృష్ణార్జును లక్కడ, కూర్చొనియుండగా వారికడకు ఒక బ్రాహ్మణుడు వచ్చెను. అతడు మద్దిచెట్టువలె ఉన్నతముగా నుండెను. అతని శరీరకాంతి కాచిన బంగారు వర్ణముతో మిలమిల లాడుచుండెను. పసుపు నలుపు కలిపిన వర్ణముతో నతడు ప్రకాశించుచుండెను. అతని శరీరము ఎత్తుకుదగిన లావుగా గూడ నుండెను.

"జనమేజయా! ఆ బ్రాహ్మణుడు ప్రాతఃకాల సూర్యునివలె తేజస్విగా నుండెను. అతడు నారచీరలు కట్టుకొని జటలు ధరించియుండెను. అతని ముఖము కమలదళమువలె శోభిల్లుచుండెను. అతని శరీరమంతయు పసుపు వర్ణముతో నిండి తన తేజస్సుతో జ్వలించుచున్నదా యనునట్లు ఉండెను. ఆ బ్రాహ్మణుడు సమీపమునకు రాగానే కృష్ణార్జునులు గౌరవ పూర్వకముగా లేచి నిలబడిరి. వారితో నా బ్రాహ్మణు డిట్లనెను:-

"మహాత్ములారా! నేను అధిక భోజనము చేయు బ్రాహ్మణుడను, నేను మిమ్ము భిక్షము వేడుచున్నాను. ఒకసారి నాకు కడుపునిండుగా భోజనము పెట్టి నన్ను తృప్తిపరచుడు".

"జనమేజయా! ఆ బ్రాహ్మణు డట్లు వేడగా కృష్ణార్జునులు అతనితో నిట్లనిరి.

"బ్రహ్మన్! నీకు ఎటువంటి యన్నముచేత తృప్తి కలుగును? చెప్పుము. మేము అటువంటి యాహారము నీకు సంపాదించి యిచ్చుటకు ప్రయత్నించెదము. ఈ మాటనే మాటిమాటికి అడుగుచున్న కృష్ణార్జునులతో నా బ్రాహ్మణు డిట్లనెను.

"వీరోత్తములారా! నాకు అన్నపుటాకలి లేదు. నేను అగ్నినని తెలిసికొనుడు. నాకు తగిన యన్నమునే మీరిద్దరు పెట్టవలెను. ఇంద్రుడు ఈ ఖాండవ వనమును సర్వదా రక్షించుచుండును. అందుచేత దానిని నేను దహించలేకున్నాను. ఈ వనమునందు ఇంద్రుని మిత్రుడు సర్పరాజు తక్షకుడు పరివార సహితముగా నివసించి యున్నాడు. అందుచేతనే దీనిని ఇంద్రుడు రక్షించుచుండును. తక్షకునితోపాటు ఇక్కడ నివసించుచున్న యితర జంతువులు గూడ సురక్షితముగ నున్నవి. ఇంద్రుని ప్రభావముచేత నేను దీనిని దహింప జాలకున్నాను. కాని దీనిని కాల్చుటకు నేను ఎల్లప్పుడున్ను ఇష్టపడుచుందును. నేను ఈ వనమును కాల్చుటకు ఆరంభించగానే యింద్రుడు మేఘములద్వారా నిరంతరముగా వర్షముకురిసి నన్ను చల్లార్చుచుండును. కనుక, ఈ ఖాండవ వనదహనము నేను చేయజాలకున్నాను.

"మహావీరులారా! ఈ కారణము చేతనే నేను మీ కడకు వచ్చినాను. మీ యిద్దరి సహాయముతో నేనీ ఖాండవ వనము దహింపదలచినాను. నాకు ఈ వనమే కావలెను. దీనికొరకే మిమ్ము భిక్షము వేడినాను. మీకు అనేక దివ్యాస్త్రజ్ఞానము గలదు, కనుక నేనీవనమును కాల్చుచున్నప్పుడు పైనుండి కురియుచున్న వర్షధారలను ఆపి, ఈ వనము నుండి పారిపోవు ప్రాణులను గూడ ఆపి ఉంచవలెను."

ఆమాటకు జనమేజయుడు వైశంపాయన మునిని ఇట్లు ప్రశ్నించెను :-

"బ్రహ్మన్! ఇంద్రునిచేత సురక్షితమైయున్న ఖాండవ వనమును అగ్నిదేవుడు ఎందుకు దహింపగోరుచుండెను? దీనికికారణము సాధారణమై యుండదు. కాబట్టి మహాత్మా! పూర్వము జరిగిన ఖాండవ వనదహన వృత్తాంత మంతయు సవివరముగా చెప్పుము."

ఆ మాటకు వైశంపాయనుడు జనమేజయునితో నిట్లనెను :-

"జనమేజయా ! ఖాండవ వనదహనమునకు సంబంధించిన ప్రాచీనకథ ఉన్నది. అది మహర్షులు చెప్పగ వినినాను. ఆ వృత్తాంతమంతయు చెప్పెద వినుము."

"జనమేజయా ! పూర్వము ఇంద్రసమానబల పరాక్రమములు గల శ్వేతకియను మహారాజు ఉండెను. ఆ కాలమునందు ఆయనవలె యజ్ఞములు - దానములు చేయువాడు మరియొకడు లేకుండెను. ఆయన పరిపూర్ణ దక్షిణ లిచ్చి, అనేక మహా యజ్ఞములు చేసెను. యజ్ఞ - దానకర్మలు దప్ప అతడు ఇతర కార్యములు చేయకుండెను. ఈ విధముగా నిరంతరము యాగ ములు చేయుచుండుట చేత అతని యాగములలో సర్వదా పొగ పారి ఋత్వి క్కుల కన్నులు చెడిపోయెను. చాల కాలము హోమములు చేయుచు ఆ ఋత్వి క్కులు మిక్కిలి ఖేదము చెందిరి. అందుచేత వారు ఆ రాజును విడిచి పోయిరి.

"జనమేజయా ! అప్పుడా రాజు మరల వారిని యజ్ఞము చేయించుటకు పిలిచెను. కాని వారు కన్నులు చెడినందుచేత రామనిరి. అప్పుడారాజు వారి యనుమతిపై ఇతర బ్రాహ్మణులచేత యజ్ఞములు నిరంతరాయముగ ముగించెను. ఈ విధముగా యజ్ఞానుష్ఠానములందు ఆసక్తి గల శ్వేతకి మహారాజునకు, నూరు సంవత్సరములు చేయవలసిన సత్రయాగము చేయ సంకల్పము కలిగెను. కాని ఆ శతవార్షిక యాగము చేయించుటకు తగిన ఋత్విక్కులు ఆ రాజునకు లభించలేదు. అతడు ఋత్విక్కుల కొరకు తన మిత్రులతో అనేక ప్రయత్న ములు చేసెను. అనేక ఋత్విక్కుల కాళ్ళపై బడి, వారు కోరిన దక్షిణలిచ్చెద నని చెప్పినను వారు సత్రయాగము చేయించుటకు అంగీకరించలేదు. అప్పుడా రాజునకు కోపము వచ్చి ఆ బ్రాహ్మణులతో నిట్లనెను :-

"బ్రాహ్మణులారా ! ఒకవేళ నేను పతితుడనై యుండిన యెడల, మీసేవ చేయకుండిన యెడలను, నేను నిందితుడ నగుటచేత నన్ను మీరు విడువవచ్చును. లేకుండినచో నన్ను మీరు విడువగూడదు. అట్టి పని నే నేదియు చేయలేదు. కనుక నేను చేయు సత్రయాగమునకు మీరు బాధ కలిగించకూడదు. విప్రులారా! ఏ యపరాధముగూడ చేయని నన్ను మీ రిట్లు విడుచుట ఉచితము గాదు. నేను మీ శరణు జొచ్చితిని. నన్ను సంతోష పరపుడు, నేను కార్యార్థి నై మీ యిచ్ఛా

పూర్తిగా దానమిచ్చుటకు మాట యిచ్చి మిమ్మ వేడుకొనుచున్నాను. నా క్రతు శ్రద్ధను చంపకుడు. ద్విజోత్తములారా! మీరు నాపై ద్వేషముచేత నా సత్ర యాగము చేయించుటకు మీకు ఇష్టము లేనియెడల నేను ఇతర ఋత్విజుల యొద్దకుపోయి, వేడుకొనెదను."

"జనమేజయా! యిట్లు చెప్పి 'శ్వేతకి' ఊరకుండెను. అప్పుడు ఆ బ్రాహ్మణులా రాజును కోపించి యిట్లనిరి.

"రాజా! నీ యజ్ఞ కార్యము నిరంతరము జరుగుచునే యుండును కనుక, సర్వదా యజ్ఞకర్మలు నీకు చేయించుచు మేము అలసి పోయినాము. పూర్వము కంటె యిప్పుడు మమ్మ నీవు విడిచిపెట్టుము. ఇప్పుడు నీవు రుద్రభగవానుని యొద్దకు పోయి ఆయనను వేడుకొనుము. ఆయన నీ సత్రయోగము చేయించ వచ్చును." జనమేజయా! ఆ విధముగా, తనను అధిక్షేపించుచు చెప్పిన బ్రాహ్మణుల మాటలు విని శ్వేతకిరాజు వారి యెడల కోపించి, వారు సూచించిన మేరకు భగవంతుడైన రుద్రుని కడకుపోయి కైలాసపర్వతమునందు ఆ భగవంతుని గూర్చి తీవ్రముగా తపస్సు చేయుటకు ఆరంభించెను.

"ఆ రాజు చాల దినములు నిరాహారుడై ఘోరముగా తపస్సు చేయుచు నిలబడి యుండెను. ఆయన ఒకసారి పన్నెండు దినములకు, ఒకప్పుడు పది యారు నాళ్ళకున్ను పండ్లు - వేళ్లు ఆహారముగా తీసికొనుచుండెను. అట్లు శ్వేతకి ఆరుమాసములవరకు ఊర్ధ్వ బాహువై స్థాణువువలె నిలబడి తపస్సు చేసెను.

"జనమేజయా! ఇట్లు ఘోరతపస్సు చేయుచున్న శ్వేతకి యందు దయ గలవాడై, పరమేశ్వరుడు అతని యెదుట ప్రత్యక్షమై 'రాజా! నీ తపస్సుచేత నేను చాల ప్రసన్నుడనైతిని. నీకు శుభ మగుగాక! నీకోరిక తెలుపుము' అని యనగా శ్వేతకి, పరమేశ్వరుడు చెప్పినమాట విని, చాల సంతోషించి ఆ భగ వంతుని పాదములపై వాలి ప్రణామము చేసి, 'మహాదేవా! నీవు నా యెడల ప్రసన్నుడవైనచో, నీవు స్వయముగా వచ్చి నా సత్రయాగము చేయించుము' అని ప్రార్థించెను.

"జనమేజయా! ఆ మాట విని పరమశివుడు ప్రసన్నుడై చిరునవ్వుతో "రాజా యజ్ఞము చేయించుట నా పని కాదు. కాని, నీవు ఈ వరమేకోరుటకు మహాతపస్సు చేసితివి. కనుక, నే నొక యొడంబడికపై నీ యజ్ఞము చేయించెదను. అది యేమనగా.

"రాజా! నీవు ఏకాగ్రచిత్తుడవై బ్రహ్మచర్య పాలనము చేయుచు పన్నెండు సంవత్సరములు నిరంతరము ఘృతధారలచేత హోమము చేసి అగ్నిదేవుని తృప్తి పరచినయెడల నీ యీ కోరిక నెరవేరగలదు."

"జనమేజయా! భగవంతుడీవిధముగా చెప్పిన తరువాత శ్వేతకిరాజు శివాజ్ఞను అనుసరించి ఘృతహోమము ఎడతెగక పన్నెండేండ్లు చేసెను. అప్పుడు పరమశివుడు ప్రసన్నుడై శ్వేతకికడకు వచ్చి యిట్లనెను.

"రాజా! నీవు ఈ వేద విహితకర్మచేత నన్ను చాల ప్రసన్నుని చేసితివి. కాని, శాస్త్రీయ విధానముమేరకు యజ్ఞము చేయించు నధికారము బ్రాహ్మణులకే యున్నది. కనుక, నేను స్వయముగా నీ యజ్ఞముచేయించను. భూమండలమందు నా అంశముతోనే అవతరించిన 'దుర్వాసుడు' అను బ్రాహ్మణోత్తముడు కలడు. అతడు నా యాజ్ఞచేత నీ యజ్ఞము చేయించగలడు. యజ్ఞమునకు అవసరమైన వస్తుసామగ్రిని సంపాదించి సిద్ధముగా నుంచుకొనుము."

"జనమేజయా! భగవంతుడిట్లు చెప్పగనే శ్వేతకి తన పట్టణమునకు పోయి యజ్ఞ సామగ్రిని సంపాదించి సిద్ధముగానుంచి మరల రుద్రభగవానుని కడకు పోయి దేవా! యజ్ఞసామగ్రిని స్థిరపరచితిని. రేపు నేను యజ్ఞదీక్షితుడను కాదలచినాను! అని యనగా, భగవంతుడు దుర్వాసుని పిలిచి "బ్రాహ్మణోత్తమా! నీవు నా యాజ్ఞచేత ఈ శ్వేతకి మహారాజు యజ్ఞము చేయించుము" అని యనెను.

"జనమేజయా! భగవంతుని యాజ్ఞప్రకారము దుర్వాసుడు శ్వేతకి యజ్ఞము చేయించుటకు పూనుకొనెను. శాస్త్రోక్తవిధానముచేత నతడు యజ్ఞము చేయించెను. ఆ రాజు యజ్ఞాంతమునందు విశేషముగా దక్షిణ లిచ్చెను. తరువాత ఆ యజ్ఞ ఋత్విజులు దుర్వాసుని యాజ్ఞచేత తమ - తమ స్థానములకు పోయిరి. నిర్విఘ్నముగా యాగము ముగించినందుకు శ్వేతకిరాజును అందరు ప్రశంసించిరి.

"జనమేజయా! అనేక యజ్ఞములు చేసినందుకు ఫలముగా ఆరాజు స్వర్గమునకు పోయి సుఖించెను. శ్వేతకి రాజు పన్నెండు సంవత్సరములు నిరంతర ఘృతధారలతో యజ్ఞము చేసినందుచేత, ఆ నేయి త్రాగిన అగ్నిదేవునకు మిక్కిలి తృప్తి కలిగెను. ఇప్పుడింక నితర హవిస్సు లేవిగూడ గ్రహించుటకు ఇష్టపడకున్నాడు.

"జనమేజయా! అగ్నిదేవుడు నెయి త్రాగినందుచేత గలిగిన అజీర్ణరోగము చేత బాధపడెను. అతని శరీరవర్ణము తెల్లగా పాలిపోయెను. అతడు పూర్వము వలె ప్రకాశమానుడుగా లేకుండెను. కడుపులో వికారము కలిగి తేజోహీనుడై గ్లాని చెంది, అగ్నిదేవుడు బ్రహ్మదేవునికడకు పోయి, 'భగవన్', శ్వేతకిరాజు మహాయజ్ఞముచేసి, నన్ను సంతృప్తిపరచెను. కాని, నాకు మిక్కిలి అరుచి, అజీర్ణ రోగము కలిగెను. ఆ జబ్బును నేను ఏవిధముగా గూడ పోగొట్టుకొనలేకుండ నున్నాను. నా తేజస్సు, బలమున్ను తగ్గిపోవుచున్నవి. కనుక, నీ దయ చేత నాకు ఆరోగ్యము చేకూరి, స్వాభావికస్థితికి రావలెనని కోరుచున్నాను' అని యనెను.

"జనమేజయా! అగ్నిదేవుడు చెప్పిన మాటలు విని ప్రపంచ సృష్టికర్తయైన బ్రహ్మదేవుడు నవ్వుచు అగ్నిదేవునితో విట్లనెను.

"మహాభాగా! పన్నెండేండ్లు శ్వేతకి చేసిన ఘృతవసుధార (ఎడతెగనిధార) చేత నీకు అజీర్ణబాధ కలిగినది. నీవు బాధపడకుము; నీకు మరల ఆరోగ్యము కలిగించెదను; దానికి కాలము రావలెను. నీవు పూర్వము దేవతల యాజ్ఞచేత, రాక్షసులకు నివాసస్థానమైన ఖాండవ వనమును కాల్చి యుంటివి. ఇప్పుడా ఖాండవ వనమునందు అన్ని విధములైన జంతువులు నివసించుచున్నవి. కనుక, నీవు ఆ వనమును దహించి. ఆ జంతువులను కాల్చి వాటి క్రొవ్వుచేత తృప్తి చెంది ఆరోగ్యవంతుడ వయ్యెదవు. ఆ వనమును కాల్చుటకు త్వరగా పొమ్ము. నీకు ఆరోగ్యము కలుగును."

"జనమేజయా! బ్రహ్మదేవుని మాటలు విని అగ్నిదేవుడు అతిత్వరగా పరుగెత్తుచు పోయి ఖాండవవనము చేరి, మహాబలుడైన వాయువు సహాయముతో తనబలము రెట్టింపగా జ్వలింప మొదలిడెను.

ఆ వనము కాలుచుండుట చూచి, అక్కడి జంతువులు ఆ యగ్నిని ఆర్పుటకు మిక్కిలి ప్రయత్నము చేసెను. వేలకొలది యేనుగులు తమ తొండము లతో నీరు తెచ్చి అగ్నిపై గుమ్మరించెను. అనేక ఫణములు గల సర్పరాజులు క్రోధముచేత తమ తలలపైన నీరు తెచ్చి అగ్నిపై పోసెను. రాజా! యీ విధము గానే అక్కడి యితర ప్రాణులుగూడ తమ-తమ శక్తికొలది అగ్నిని కొట్టుచు, దుమ్ము చల్లుచు, నీరు చిలకరించుచు చల్లార్చెను. ఈ విధముగనే అగ్ని ఖాండవ దహనము చేయుచు, ప్రాణులచేత ఏడుసార్లు చల్లార్చబడెను.

**అర్జునుడు అగ్నిదేవుని కోరిక నంగీకరించి, అతనిని దివ్యధనుస్సు, రథా దులు కోరుట :-**

"జనమేజయా! యీ విధముగా ఏడు పర్యాయములు అగ్నిదేవుడు ప్రయత్నించినను ఖాండవ వనమును దహించజాలక మిక్కిలి నిరాశ చెంది, బాధపడి కోపముతో మరల బ్రహ్మదేవుని కడకు పోయి, జరిగిన సమాచార మంతయు నాదేవునకు నివేదించెను. అప్పుడా భగవానుడు కొంచెము యోచించి అగ్నితో నిట్లనెను :-

"అనఘా! నీవు ఖాండవవనమును గాల్చునుపాయ మిప్పుడు నాకు తోచి నది. కాని దానికొరకు నీవు కొంత కాలము వేచియుండవలెను. తరువాత నీవు ఖాండవవనమును దహించ జాలెదవు.

"హవ్యవాహనా! అప్పుడు నీకు నర - నారాయణులు సహాయము చేసెదరు. ఆ యిరువురితోగూడ నుండి నీవా వనమును దహింపజాలుదువు.

"జనమేజయా! ఆ మాట విని అగ్నిదేవుడు బ్రహ్మదేవునితో "దేవా! అట్లే కానిమ్ము' అని చెప్పి, నర-నారాయణుల యవతారమునకై వేచియుండెను. తరువాత చాల కాలమునకు నర-నారాయణ మునీశ్వరులు భూమండలమునందు అవతరించిరి. అప్పుడు అగ్నికి బ్రహ్మదేవుని మాట జ్ఞప్తికి వచ్చి వెంటనే అగ్ని బ్రహ్మకడకు పోయి అడుగగా, నా దేవుడతనితో, "అనలదేవా! ఇప్పుడు నీవు, ఇంద్రుడు చూచుచుండగనే ఖాండవవనమును దహించుటకు ఉపాయము చెప్పెద వినుము." అని యిట్లనెను :-

"జనమేజయా! ఆదిదేవులైన నర-నారాయణ మునీశ్వరులు ఇప్పుడు దేవతల కార్యసిద్ధికై మానవలోకమునందు అవతరించినారు. మనుష్యులు ఆ యిరువురను 'అర్జునుడు - వాసుదేవుడు' అను పేర్లతో పిలుచుచున్నారు. ఇప్పుడా యిరువురు ఖాండవవన సమీపమునందే కలిసి కూర్చొనియున్నారు. వారియొద్దకు నీవు పోయి యాచించుము. నీవు ఆ యిరువురి సహాయముతో, ఖాండవవనమును, ఇంద్రాదులచేత అది రక్షింపబడుచున్నప్పటికిన్ని, దహింప జాలుదువు. ఆ యిరువురు వీరులు ఒకచోట చేరి ఆ వనమునందలి ప్రాణులు పారిపోవకుండ వానిని నివారించగలరు. ఇంద్రుని గూడ ఎదిరించగలరు.

"జనమేజయా! బ్రహ్మదేవుడు చెప్పిన మాటలు విని అగ్నిదేవుడు, వెంటనే కృష్ణార్జునుల కడకు పోయి చెప్పిన తీరు నీకు పూర్వమే చెప్పితిని. అగ్ని దేవుని మాటలు విని అర్జునుడు అగ్నితో నిట్లనెను:-

"భగవన్! నాయొద్ద ఉత్తమములైన దివ్యాస్త్రములున్నవి. వాని సహాయముతో ఒకడేమి? అనేక దేవరాజులతో యుద్ధము చేయగలను. కాని నాయొద్ద నా భుజబలమునకు తగిన ధనుస్సు లేదు. యుద్ధభూమియందు నా వేగమును ఓర్చుకొన గలిగిన ధనుస్సు నాకు అవశ్యమై యున్నది. ఇంతయేకాక నేను శీఘ్రముగా ప్రయోగించుటకు తగినన్ని బాణములు నాకడ లేవు. కాబట్టి, అధిక సంఖ్యలో నాకు బాణములుగూడ కావలసియుండును. అవి యెప్పుడుగూడ ముగిసిపోవక అక్షయముగా నుండవలెను. అట్లేనా యిష్టము మేరకు బాణములను భరించగల రథముగూడ నాయొద్ద లేదు. అదిగూడ కావలెను. "దేవా! వాయు వేగము గలిగి, శ్వేతవర్ణము గల దివ్యాశ్వములు కట్టబడి, మేఘసమాన గంభీర ధ్వనిగలిగి, సూర్యునివలె, తేజస్వియైన రథము నాకు కావలెను.

"అగ్నిదేవా! యీ విధముగానే, యీ శ్రీకృష్ణ భగవానుని బలపరాక్రమములకు అనురూపమైన ఆయుధము ఏదియు నితనికడగూడ లేదు. అట్టి మంచి ఆయుధముతో నీతడు యుద్ధమునందు నాగులను పిశాచులను చంపగలడు.

"భగవన్! ఈ మహావనమును నీవు కాల్చుచున్నప్పుడు సంతత ధారలతో కురియుచున్న యింద్రుని నేను నివారింపగల యుపాయమేదైన ఉన్న యెడల

చెప్పుము. అట్లయినచో నేను నీ కార్యమును సిద్ధింప చేసెదను. "అగ్నిదేవా! పురుష ప్రయత్నముచేత సాధింప గల కార్యము చేయుటకు మేము సిద్ధముగా నున్నాము. కాని ఆ కార్యసాధనకు దృఢములైన యుద్ధసాధనములను నీవు దయతో ఈయవలెను."

**అగ్నిదేవుడు కృష్ణార్జునులు కోరిన ఆయుధాలిచ్చుట - వారి సహాయముతో ఖాండవము దహించుట:-**

"జనమేజయా! అర్జునుడు ఇట్లు చెప్పిన తరువాత అగ్నిదేవుడు, వరుణ దేవుని దర్శింప దలచి ఆ దేవుని స్మరించెను. ఆదితిపుత్రుడు, జలస్వామియు నైన వరుణదేవుడు హుతాశుని కడకు వచ్చెను. అట్లు వచ్చిన వరుణునకు అగ్ని స్వాగత సత్కారములు చేసి అతనితో నిట్లనెను :-

"వరుణదేవా! సోముడు నీకు ఇచ్చిన దివ్యధనస్సును, అక్షయ తూణీరము లనున్ను త్వరగా నాకిమ్ము. వానితో పాటే కపిధ్వజముతో శోభిల్లు రథము గూడ నిమ్ము; నేడు అర్జునుడు గాండీవ ధనుస్సుచేత, శ్రీకృష్ణ భగవానుడు చక్రము చేతను నా కొఱకు ఒక గొప్పకార్యము చేయగలరు. కాబట్టి, ఈ యుద్ధ సాధనము లన్నియు నీవు నా కిమ్ము."

"జనమేజయా! అపుడు వరుణుడు "ఇపుడే యిచ్చెద నని ధనుశ్శ్రేష్ఠమైన గాండీవమును, బాణములతో నిండిన రెండు అక్షయ తూణీరములనున్ను నిచ్చెను. ఆధనుస్సు అత్యద్భుతశక్తి గలిగి అది ధరించిన వాని కీర్తిని[1] [2]యశస్సునున్ను పెంపొందించును. అది శత్రువులు ప్రయోగించిన యేలాటి యస్త్రశస్త్రముల చేత గూడా విరుగక శత్రువుల యస్త్రశస్త్రములను ఆయుధములను విరుచును. ఆయు ధములకంటే అది ఆకారములో పెద్దది శత్రుసేనలను చీల్చునట్టి విచిత్ర ధనుస్సు. ఆ యుత్తమ ధనుస్సును దేవ - రాక్షస గంధర్వులు అనేక సంవత్స

1. యుద్ధాదుల జయమువలన గలిగిన ఖ్యాతి-కీర్తి యనబడును.
2. విద్యా విజ్ఞానాదులవలన ఖ్యాతి యశస్సు అనబడును. ఖడ్గాది ప్రభవా కీర్తిః విద్యాది ప్రభవం యశః అని ప్రమాణము,

రములు పూజించిరి. పలురంగులతో అది శోభిల్లుచుండును. అది నున్నగా, ఛిద్రములు లేకుండ నుండెను.

"జనమేజయా! ఇంతయే కాక. వరుణుడు దివ్యాశ్వములు కట్టబడిన యొక రథము గూడ అర్జునునకిచ్చెను. ఆ రథధ్వజముపైన కపిరాజు విరాజమానుడై యుండెను. అది గంధర్వ దేశమునందు పుట్టిన అశ్వములచే పూన్చబడి యుండెను. వాని యెదలలో సువర్ణహారములు శోభిల్లు చుండెను. అశ్వముల కాంతి తెల్లని మేఘముల వర్ణమువలె నుండెను. అవి వాయువేగ మనోవేగములు గలవి. ఆ రథమునందు యుద్ధమునకు కావలసిన వస్తువు లన్నియు నుండెను. అది దేవ - రాక్షసులకు గూడ అజేయముగ నుండెను.

"ఆ రథమునుండి తేజః కిరణములు బయలు వెడలుచుండెను. అది పోవు నప్పుడు గొప్పధ్వని కలుగుచుండెను. అది వివిధ రత్నములతో పొదుగబడి మనోహరముగ నుండెను. సమస్త ప్రపంచ ప్రజాపతియైన విశ్వకర్మ గొప్ప తపస్సు చేసి ఆ రథము నిర్మించి యుండెను. సూర్యసమాన తేజస్సుగల యా రథమును 'ఇదమిత్థమ్' అని వర్ణించుటకు సాధ్యము గాక యుండెను. పూర్వము సోముడు (చంద్రుడు) ఆరథము నెక్కియే దానవులను జయించి యుండెను.

"జనమేజయా! నూతన మేఘమువలె శోభిల్లుచున్న యారథముకడకు ఇంద్రధనుస్సుతో సమానులైన కృష్ణార్జునులు పోయిరి. ఆ రథ ధ్వజము అతి సుందరముగా, సువర్ణమయమైనదిగాను నుండెను. దానిపైన సింహ - వ్యాఘ్రముల వలె భయంకరాకారముతో, కూర్చొని యున్న దివ్యవానరము, శత్రువులను భస్మము చేయదలచుచున్నదా యనునట్లు ఉండెను. ఆ ధ్వజమునందు ఇంకను అనేక విధములైన భయంకర ప్రాణులు ఉండెను. వాని ధ్వని వినిన శత్రువుల ప్రాణములు లేచి పోవుచుండెను. ఆ రథము వివిధ పతాకలతో శోభిల్లుచుండెను.

"జనమేజయా! ఆ దివ్యరథమును చూచి అర్జునుడు మిక్కిలి సంతసించి నడుము బిగించి, కవచము-ఖడ్గమున్ను ధరించి, అంగుళి త్రాణములు చేతులకు తొడుగుకొని, రథమునకు ప్రదక్షిణము చేసి, దేవతలకు ప్రణామము చేసి,

ఒక పుణ్యాత్ముడు విమానముపై నెక్కినట్లు, రథముపై నెక్కి కూర్చొనెను. పూర్వము బ్రహ్మదేవుడు నిర్మించిన దివ్య గాండీవ ధనుస్సును చేత ధరించి అర్జునుడు మిక్కిలి ప్రసన్నుడయ్యెను. అతడు తరువాత అగ్నిదేవుని ముందిడుకొని, ఆ ధనుస్సుపైన అల్లెతాటిని ఎక్కుపెట్టునప్పుడు కలిగిన టంకార ధ్వని వినిన వారి హృదయములు వ్యథ చెందెను.

"జనమేజయా! ఆరథము - ధనుస్సు - అక్షయ తూణీరములు పొంది అర్జునుడు సంతుష్టుడై అగ్నిదేవునకు సహాయము చేయుటకు సమర్థుడయ్యెను. తరువాత, అగ్నిదేవుడు శ్రీకృష్ణునకు చక్రాయుధము నిచ్చెను. వాని మధ్య భాగము వజ్రసమానముగ నుండెను. ఆ చక్రము సహాయముతో శ్రీకృష్ణభగవానుడుగూడ అగ్నికి సహాయము చేయుటకు సమర్థుడుగా నుండెను. అప్పుడు శ్రీకృష్ణునితో నగ్నిదేవు డి ట్లనెను :—

"మధుసూదనా ! ఈ చక్రముచేత నీవు యుద్ధమునందు మానవేతర ప్రాణులనుగూడ జయించ గలననుటలో సంశయములేదు. దీనిని చేత ధరించుట చేత నీవు యుద్ధమునందు మనుష్య - దేవ - రాక్షస - పిశాచ - దైత్య - నాగములకంటె గూడ అధికశక్తి సంపన్నుడవు కాగలవు. వారందరను హరించుటకుగూడ నీవు నిస్సందేహముగ సమర్థుడ వయ్యెదవు.

"మాధవా ! యుద్ధమునందు నీ వాచక్రమును శత్రువులపైన గించినప్పుడెల్ల నిది శత్రువులను సంహరించి, యితరాయుధములచేత తిరిగి నీచేతికి వచ్చి చేర గలదు."

"జనమేజయా ! తరువాత వరుణదేవుడు
వినాశకర మైన 'కౌమోదకి' యను భయంక
తరువాత కృష్ణార్జునులు ప్రసన్నులై అగ్నిదేవునిత

"భగవన్ ! మే మిద్దర మిప్పుడు రథ ధ్వజములతో
యున్నాము. ఇప్పుడు మేము యుద్ధమునందు సమస్త దేవ - రాక్షసులతో గూడ పోరాడుటకు సమర్థులమై యున్నాము. ఇట్లుండగా తక్షక రక్షణార్థమై యుద్ధము చేయ గోరుచున్న యింద్రు డొక్కనితో పోరాడుట యెంతపని ?"

"జనమేజయా! అప్పుడు అర్జునుడు అగ్నిదేవునితో నిట్లనెను :

"భగవన్! అందరి యింద్రియములకు ప్రేరణ నిచ్చువాడు మహాబల పరాక్రమశాలియు నైన జనార్దనుడు చక్రము ధరించి యుద్ధరంగమునందు సంచరించుచు తన చక్ర ప్రహారముచేత భస్మము చేయజాలని వస్తువు మూడు లోకములందు నేదియు లేదు. పావకా! నేనుకూడ ఈ గాండీవముతో అక్షయ తూణీరములతోను అన్ని లోకములను జయించుటకు, ఉత్సాహము గలవాడ నై యున్నాను. అగ్నిదేవా! నీవు ఇప్పుడీ ఖాండవవనమును నలువైపుల చుట్టి నేడే స్వేచ్ఛగా దహించుము. నీకు సహాయము చేయుటకు మేము సిద్ధముగ నున్నాము."

**ఖాండవదహనము :**

"జనమేజయా! శ్రీకృష్ణార్జును లిట్లు చెప్పగనే అగ్నిభగవానుడు తేజోమయ రూపమును ధరించి ఖాండవవనమును అన్నివైపులనుండి కాల్చుటకు ఆరంభించెను. తన యేడు జ్వాలారూపములైన నాలుకలతో ఆ వనమును అన్ని వైపుల కాల్చుచు మహాప్రళయాగ్ని దృశ్యమును సృష్టించెను. జ్వలించుచున్న ఆ వనస్వరూపమప్పుడు సూర్యకిరణములు వ్యాపించిన మేరుపర్వతము దీపించు చున్నదా యనునట్లుండెను.*

**ఖాండవ దహనమందు ప్రాణులు :**

"జనమేజయా! కృష్ణార్జునులిరువురు రెండు రథములయందు కూర్చొని ఖాండవవనమునకు రెండు వైపుల నిలిచి తిరుగుచు - తిరుగుచు నచటి ప్రాణుల నన్నింటిని సంహరించుచుండిరి. ఎక్కడనైనను సందు దొరకినచో పారిపోవుటకు ఆ జంతువులు ప్రయత్నించుచుండెను. కాని, అవి యెట్లుపోయిన నటు ఇరువురిలో నొకరు అడ్డుపడుచుండిరి. అంతటను అలాతచక్రమువలె ఆ యిరువురు తిరుగుచుండిరి.

* అగ్ని ఆ వనము నలువైపుల తన జ్వాలలతో చుట్టి వన మధ్యభాగ మందుగూడ వ్యాపించి, మేఘగర్జనమువలె గంభీర ఘోషణము చేయుచు సమస్త ప్రాణులను కంపింపజేసెను.

"జనమేజయా! ఖాండవమంతటను అగ్ని రగుల్కొనెను. లక్షలకొలది ప్రాణులు అప్పుడు భయపడుచు నలువైపుల ఎగురుచుండెను. అనేక ప్రాణుల శరీరములో నొక భాగము కాలిపోయెను. చాల ప్రాణులు పూర్తిగా కాలి మాడి పోయెను. ఎన్నిటి కన్నులో పగిలి చిలిపోయెను. శరీరములు పగిలి శీర్ణము లయ్యెను. ఇట్టి పరిస్థితిలోగూడ అన్ని ప్రాణులు పరుగెత్తి పోవుచుండెను.

"జనమేజయా! కొన్ని తమ సంతానమును ఎదకు హత్తుకొనుచుండెను. కొన్ని తమ తండ్రులను, సోదరులను కరచుకొనెను. అవి ప్రేమచేత ఒండొరులను విడువజాల కుండెను. అక్కడనే చచ్చుచుండెను. కొన్ని పండ్లు కరచుకొని పైకెగిరి తిరుగుచు అగ్నిలో పడుచుండెరు. కొన్ని పక్షులు రెక్కలు, కన్నులు, కాళ్ళును దహించుకొనిపోయి నేలపైపడి తన్నుకులాడుచు, అక్కడి కక్కడనే చచ్చుచుండెను. అక్కడి జలాశయములు కాలి నీరు, కుతకుత మర్లు చుండెను. వానియందలి మత్స్య కూర్మాది జంతువులు ఉడుకుచుండెను.

"జనమేజయా! అనేక ప్రాణులు కాలుచు పైకెగిరి మూర్తిభవించిన యగ్నులవలె కనపడుచుండెను. కొన్ని పక్షులు పైకెగురుచుండగా అర్జునుని బాణపు దెబ్బలచేత అంగములు తెగి అగ్నిలో పడుచుండెను. అర్జున బాణముల చేత గాయపడిన జంతువులు చేయు హాహాకారములు, సముద్ర మథన కాలము నందు సముద్ర జంతువులు చేయు ధ్వనులవలె నుండెను. పైకి లేచుచున్న యగ్ని జ్వాలలు ఆకాశమునందలి దేవతలకు భయము గొలుపుచుండెను. దేవ లోకమునందలి వారందరు భయముచేత ఇంద్రుని కడకు పోయి,

"అమరేంద్రా! అగ్నిదేవు డీవిధముగా ప్రాణుల నన్నింటిని దహించు చున్నాడు. ప్రపంచమునకు ప్రళయము రాలేదు కదా!" అని యడిగిరి.

"జనమేజయా! దేవేంద్రుడు వారి మాటలు విని అగ్నినుండి ఖాండవ వనమును రక్షించుటకు స్వయముగా అక్కడకు పోయెను. అతడు అనేక రథములతో ఆకాశమునందు నిలిచి నిరంతర వర్షధారలు కురియ జొచ్చెను. ఇంద్రుని యాజ్ఞచేత మేఘములు కాడిమ్రానువంటి లావుధారలతో వాన కురియ జొచ్చెను. కాని ఆ జలధారలు, అగ్ని జ్వాలలచేత పైననే ఆరిపోయి యింకు

చుండెను. అగ్నివరకు అవి చేరకుండెను. అప్పు డింద్రుడు అగ్నిపైన మిక్కిలి క్రోధముచేత చాల లావు జలధారలు కురియింప జొచ్చెను. అగ్నిజ్వాలలు జలముతో కలిసికొని ఆకాశమంతట పొగరేగెను. అన్నివైపుల మెరపులు మెరయ జొచ్చెను. అన్ని యెడల మేఘ గర్జనములు వెడలెను. ఈ విధముగా ఖాండవ వనము యొక్క దురవస్థ వర్ణనాతీతమై మిక్కిలి భయంకరముగా నుండెను.

**దేవతాదులతో శ్రీకృష్ణార్జునుల యుద్ధము :-**

''జనమేజయా! ఎడతెగక యింద్రుడు వర్షించుచున్న జలధారలను అర్జునుడు తన బాణములచేత ఆకాశమునందు పందిరి కప్పి ఆపివేసెను. మంచు చంద్రుని కప్పినట్లు అర్జునుని బాణములు ఖాండవమును కప్పి జలము పడకుండ జేసెను. అర్జునుని బాణములచేత ఆకాశమంతయు కప్పబడి యుండుటచేత ఖాండవమునందలి యే ప్రాణిగూడ తప్పించుకొని పోజాలకుండెను.

"జనమేజయా! ఖాండవవనము దహింప బడుచుండినప్పుడు తక్షకుడు కురుక్షేత్రమునకు పోయి యుండెను. కాని అతని కొడుకు అశ్వసేనుడు అక్కడనే యుండెను. అత డా యగ్నినుండి తప్పించుకొని పోవుటకు మహా ప్రయత్నము చేయుచుండెను. కాని అర్జునుని బాణములచేత ఆపబడి అక్కడనే చిక్కుబడి బయటకు పోజాలకుండెను. అతని తల్లియైన నాగకాంత అతనిని మ్రింగి బ్రతికించెను. తొలుత పుత్రుని తలను, పిదప మెల్లమెల్లగా అతని తోకవరకు శరీరమంతయు మ్రింగెను. ఇట్లు మ్రింగుచునే ఆ నాగస్త్రీ పుత్రిని కాపాడుకొనుటకు ఆకాశమునందు ఎగిరి తప్పించుకొని పారిపోవుటకు ప్రయత్నించెను. కాని అర్జునుడు పదునైన బాణముచేత ఆ నాగస్త్రీ తల నరకెను. ఇంద్రుడు దాని యవస్థ చూచి నిశ్చేష్టుడై నిలిచెను, తక్షకపుత్రుని విడిపించుటకు ఇంద్రుడు పెద్ద వాయుగుండము (గాలివాన) రేపి అర్జునుని మోహింపజేసెను. ఇంతలో తక్షక పుత్రుడు తప్పించుకొనిపోయెను."

"జనమేజయా! అప్పుడు అర్జునుడు ఆ భయంకరమాయను చూచి అశ్వసేననాగునిచేత మోసగింపబడి నిశిత బాణములతో ఆకాశమునందు ఎగురు నాగులను రెండు మూడు ముక్కలుగా ఖండించెను. అర్జును డా నాగమునకు 'అరే! నీవు నిరాశ్రయుడవయ్యెదవు' అని శాప మిచ్చెను. ఆ శాపమును

శ్రీకృష్ణుడు-అగ్నిదేవుడు అనుమోదించిరి. తరువాత తనకు జరిగిన వంచనకు మాటి మాటికి తలచుచు క్రోధముతో అర్జునుడు బాణములచేత ఆకాశమును అచ్ఛాదించి యింద్రునితో యుద్ధము చేయుటకు ఆరంభించెను. ఇంద్రుడు గూడ ఆకాశమును బాణములతో అచ్ఛాదించి తన యజేయమైన ఇంద్రాస్త్రమును ప్రయోగించెను.

"జనమేజయా! దానితో ఆకాశమునందు ప్రచండ వాయువు లేచెను. అది సముద్రము లన్నింటిని క్షోభింపజేసెను. ఆ వాయుగుండము ఆకాశము నందు నిలిచి రోకండ్లంత లావైన నీటిధారలు కురియు మేఘములను పుట్టించెను. అప్పుడు మెరపులతో పిడుగులు ధ్వనించుచు భూమిపైన బడజొచ్చెను. ఆ యస్త్ర ప్రతీకారము తెలిసిన యర్జునుడు అమోఘమైన వాయవ్యాస్త్రమును ప్రయోగించి ఇంద్రాస్త్రమునుండి వెడలిన పిడుగులను మేఘముల తేజస్సును బలమును నశింప జేసెను. దానితో వర్ష జలధారలన్నియు నెండిపోయెను. మెరపులుగూడ నశించెను. క్షణకాలములో ఆకాశమునందు దుమ్ము-అంధకారము అణగి పోయెను. సుఖమైన వాయువు వీయజొచ్చెను. సూర్యమండలము పూర్వమువలె ప్రకాశించెను. అగ్నిదేవుడు తనను ఆర్పువారెవ్వరు లేకపోవుటచేత ప్రసన్ను డాయెను. అతడు అనేక ప్రాణుల వసారసముచేత నేతిచేత జ్వలించినట్లు, విశేష ముగా మండుచుండెను. పెద్ద ధ్వనిచేత అగ్ని సమస్త ప్రపంచమును వ్యాపించెను.

"జనమేజయా! శ్రీకృష్ణార్జునులు ఖాండవ వనవ
అహంకారముగల గరుడపక్షులు (ఇవి విమవాహనగ
ఆకాశమునందు ఎగురజొచ్చెను.
ముక్కు- చేతులతో కొట్టుటకు కృ
నాగముఖ్యులు గూడ విషము గ్ర
అర్జునుడు రోషముతో ఆ జంతువులను ...
పడి భస్మమయ్యెను. తరువాత, రాక్షస, గంధర్వ యక్ష నాగ...యులు ...
చేయుటకు పరుగెత్తివచ్చిరి. కొందరు తుపాకీలు, కొందరు చక్రములు, కొంద...
పాషాణములు, కొందరు ఇతర మారణాయుధములు ధరించివచ్చిరి. ఆ యందరు క్రోధోత్సాహములతో కృష్ణార్జునులను చంప దలచుచుండిరి.

జనమేజయా ! వారందరు మిక్కిలి డంబములు పలుకుచు శస్త్రాస్త్రములను ప్రయోగింప జొచ్చిరి. వారిని అర్జునుడు తన నిశిత బాణములచేత సంహరించెను. శ్రీకృష్ణుడు గూడ చక్రాయుధము చేత రాక్షసులను అనేకులను చంపెను. అనేకులు ఆ యిరువురు వీరుల యాయుధ ప్రహార ములచేత గాయపడి యెక్కడివారక్కడనే సముద్రపుటలలు ఎల్లల వద్దకువచ్చి నిలిచిపోయినట్లు, ఆగిపోయిరి. తరువాత దేవేంద్రుడు ఐరావత గజముపైన కృష్ణార్జునులవైపు పరుగెత్తి వజ్రాయుధము వారిపైన అతివేగముగ విసరివేసెను. "ఈ దెబ్బతో ఆ యిరువురు చచ్చిరి" అని దేవతలతో చెప్పెను. దేవేంద్రుడు వజ్రాయుధమును ఎత్తినప్పుడు, దేవతలందరు తమ - తమ ఆయుధములను తీసికొనిరి.

"జనమేజయా ! అప్పుడు యముడు కాలదండమును కుబేరుడు గదా దండమును. వరుణుడు పాశములను, విచిత్రమైన వజ్రాయుధమును తీసికొని వచ్చిరి. దేవసేనాపతియైన కుమారస్వామి శక్తి యాయుధమును ధరించి మేరు పర్వతము వలె స్థిరముగా నిలిచెను. అశ్వినీ దేవత లిరువురు మెరయుచున్న ఓషధులను తీసికొని వచ్చిరి. ధాత ధనుస్సును, జయుడు ముసలాయుధము (రోకలి)ను, త్వష్ట పర్వతమును, అంశుడు శక్తిని, మృత్యుదేవుడు గండ్రగొడ్డలిని, అర్యముడు పరిఘాయుధము (గడియ్రమాను వంటిది)ను, మిత్రదేవుడు, అంచులయందు చురకత్తులు గల చక్రాయుధమును, పూషుడు, భోగుడు, సవిత ధనుస్సులను ఖడ్గములను, రుద్ర - వసుమరుద్గణ - విశ్వేదేవ - సాధ్య గణములు. తదితర దేవతలున్ను వివిధ శస్త్రాస్త్రములను ధరించి క్రోధముతో కృష్ణార్జునులను, సంహరించుటకు వారివైపు పరుగెత్తిరి.

"జనమేజయా ! ఆ మహా సంగ్రామమునందు, ప్రళయ కాలమువంటి రూపము గలిగి ప్రాణుల నన్నిటిని మోహపరచు అపశకునములు అద్భుతముగా తోచెను. అతిరోషముతో యుద్ధమునకు వచ్చిన యింద్రుని చూచి కృష్ణార్జునులు తమ ఆయుధములు ధరించి స్థిరముగా నిలిచిరి. తరువాత కృష్ణార్జునులు వజ్ర సమానములైన తమ బాణములతో దేవతలను గాయపరచిరి. దేవతలు ఎంత ప్రయత్నించినను వారితో పోరాడ జాల కుండిరి. అప్పుడు వారు భయముతో యుద్ధము విడిచి పారిపోయి యింద్రుని శరణు జొచ్చిరి.

"జనమేజయా! కృష్ణార్జునుల ధాటికి తాళజాలక కుంఠితులైన దేవతలను జూచి, ఆకాశమునందు నిలిచియున్న మహర్షులు మిక్కిలి ఆశ్చర్యచకితులైరి.

ఇంద్రుడు గూడ కృష్ణార్జునుల పరాక్రమమునకు మిక్కిలి ప్రసన్నుడాయెను. కాని, మరల వారితో పోరాడ జొచ్చెను. తరువాత ఇంద్రుడు అర్జునుని పరాక్రమమును పరీక్షింపదలచి మరల అతనిపై పాషాణవర్షము గురిపించెను. అర్జునుడు మిక్కిలి గోపముతో తన బాణ వర్షముచేత దానిని నష్టము చేసెను. అది విఫలమగుట చూచి యింద్రుడు మరల పాషాణముల మహావర్షము అధికముగా కురియించెను. అదిచూచి అర్జునుడు తన తండ్రి సంతోషమును పెంపొందించుచు బాణములచేత మరల దానిని గూడ నష్టపరచెను.

"జనమేజయా! తరువాత ఇంద్రుడు అర్జునుని సంహరించుటకుగాను ఒక పర్వతశిఖరమును, దానిపైనున్న వృక్షములతో పాటు పెరకి అర్జునునిపై వేసెను. అర్జునుడు నిశితాగ్రములు గల బాణములచేత ఆ పర్వత శిఖరమును వేలకొలది ముక్కలుగా ఖండించి పడగొట్టెను. భిన్న - భిన్నమై పడుచున్న ఆ పర్వత శిఖరము, సూర్యచంద్రాది గ్రహములు పడుచున్నవా యనునట్లు చూచు వారికి తోచెను. క్రింద పడిన ఆ పర్వత శిఖరముచేత, ఖాండవ వనమందలి అనేక ప్రాణులు మరణించెను.

**ఖాండవ వనదహన పర్వము సమాప్తము**

# మయదర్శన పర్వము

## దేవతల పరాజయము - ఖాండవవన వినాశము మయాసుర రక్షణము

"జనమేజయా! పర్వతశిఖరము క్రింద పడుటచేత ఖాండవమునందలి రాక్షస - నాగములు, చిరుతపులులు, ఎలుగుబంట్లు మొదలైన వనజంతువులన్ని భీతిల్లెను. మదగజములు - సింహ - శార్దూల - మృగ - మహిషాది మృగములు నూర్లకొలది పక్షులు ఇతర ప్రాణులన్ని గూడ ఉద్వేగముతో నిటునటు పరుగెత్తి పోవుచుండెను. అట్లు కాలుచున్న వనమును, శస్త్రధారులై తమను సంహరించు చున్న కృష్ణార్జునులనున్ను చూచి ఆ జంతువుల యార్తనాదము చేత, అగ్నిదేవుని గర్జనము చేతను సమస్తాకాశము ప్రళయకాల మేఘ గర్జనము చేత నిండినదా యనునట్లుండెను.

"జనమేజయా ! అప్పుడు శ్రీకృష్ణుని చక్రము చేత చీలిన దైత్యుల శరీరములందు వసారక్తము కలిసి సంధ్యాకాల మేఘములవలె అవి కనపడెను. శ్రీకృష్ణుడక్కడ దానవ - నాగాది ప్రాణులను సంహరించుచు యముని వలె తిరుగుచుండెను. శ్రీకృష్ణుడు మాటిమాటికి ప్రయోగించుచున్న చక్రము అనేక ప్రాణులను సంహరించి తిరిగి అతని చేతికి చేరుచుండెను. అప్పుడు సర్వభూతాంతరాత్ముడైన శ్రీ కృష్ణుని స్వరూపము మిక్కిలి భయంకరముగ నుండెను. అక్కడ చేరిన దానవులలో నొక్కడు గూడ కృష్ణార్జునులను జయింప గలవాడు లేకుండెను.

"జనమేజయా ! దేవతలందరు చేరి కూడ ఖాండవ వనమును కాపాడుటకు గాని, అగ్నిని ఆర్పుటకు గాని సమర్థులు కాకపోయి, వెన్నుచూపి పారిపోయిరి. దేవతల యపజయము చూచి యింద్రుడు కృష్ణార్జునుల పరాక్రమమును ప్రశంసించుచు ప్రసన్నుడాయెను.

**ఇంద్రునకు ఆకాశవాణి యుపదేశము:-**

జనమేజయా! దేవతలు తిరిగి పోయిన తరువాత ఆకాశవాణి యింద్రుని సంబోధించుచు నిట్లనెను:-

వాసవా! నీ మిత్రుడు నాగరాజైన తక్షకు డిప్పుడిక్కడ లేడు. అతడు ఖాండవదహన కాలమునందు కురుక్షేత్రమునకు పోయెను. భగవంతుడైన వాసుదేవుని, అర్జునునిన్ని నీవు ఏవిధముగ గూడ జయించజాలవు. వీరిరువురు పూర్వపు నర-నారాయణ మునీశ్వరులు సుమా! నామాట నమ్ముము. దేవలోకమునందు గూడ వీరి ప్రఖ్యాతి వ్యాపించియున్నది. వీరి బలపరాక్రమము లెటువంటివో నీకు గూడ తెలియును. వీరిరువురు జయింప నలవికానివారు ఎవరుగూడ వీరిని చెనకజాలరు. వీరు దేవాసుర యక్ష రాక్షస గంధర్వ మనుష్య కిన్నర నాగాది సమస్త ప్రపంచ ప్రాణులకు పూజనీయులు. కాబట్టి, యింద్రా! నీవు దేవతలతో పాటు ఇక్కడి నుండి తిరిగి పోవుటయే ఉచితము. ఈ ఖాండవవన నాశము ప్రారబ్ధకర్మ యని తలచుము."

"జనమేజయా! ఆకాశవాణి యుపదేశము విని యింద్రుడు క్రోధము విడిచి, స్వర్గమునకు తిరిగిపోయెను. అతనివెంట దేవతలుగూడ పోయిరి. అట్లు

తిరిగి పోవుచున్న యింద్రాది దేవతలను చూచి కృష్ణార్జునులు సింహనాదము చేసిరి. దేవతలు పోయిన తరువాత కృష్ణార్జునులు ఖాండవవనమును అగ్నిచేత నిశ్శంకముగా దహింపజేసిరి. అర్జునుడు తన శస్త్రాస్త్రములు ప్రయోగించి దేవతలను సుడిగాలి మేఘములనువలె తరుమగొట్టిన తరువాత ఖాండవమునందలి ప్రాణులను సంహరించుటకు ఆరంభించెను.

“జనమేజయా! అర్జునుని బాణ ప్రయోగముచేత ఖండింపబడిన ప్రాణులేవి గూడ ఆ వనమునుండి తప్పించుకొని పోజాలకుండెను. అట్లు విజృంభించిన యర్జునుని పెద్ద-పెద్ద ప్రాణులుగూడ చూడజాలకుండెననగా, ఇక అవి అతనితో పోరాడు ప్రసక్తి యెక్కడిది? అర్జునుడు ఒకప్పుడు ఒక్కబాణము చేత నూర్ల కొలది జంతువులను, ఒకప్పుడు నూర్లకొలది బాణములతో ఒక్క జంతువును చంపు చుండెను. ఈ విధముగ అవి చచ్చుచు, యమునిచేత చంప బడినవా యనునట్లు అగ్నిలో పడి కాలుచుండెను. అవి వనమధ్యము నందున్నను, వనము కొనకున్నను వానికి శాంతి లేకుండెను. జనమేజయా! పితృ లోకము నందు, దేవలోకమునందున్న ఖాండవాగ్ని జ్వాలలు వ్యాపించి వేడి కలిగించు చుండెను. ఎన్నియో ప్రాణులు భీతావహములై బిగ్గరగా అరచు చుండెను. ఆ ప్రాణుల యార్తనాదముచేత గంగలో, సముద్రములోనున్న మత్స్యములుగూడ భయపడి వణకు చుండెను. ఖాండవవనమందున్న విద్యాధరుల యవస్థగూడ నిట్లే యుండెను.

“జనమేజయా! అప్పుడు కృష్ణార్జునుల వైపు ఎవ్వరున్ను కన్నెత్తియైన చూడ జాలకుండిరనగా, యుద్ధ ప్రసక్తి యెక్కడిది? రాక్షసులు నాగులు దానవులున్ను గుమిగూడి తప్పించుకొని పోవుచుండగా, వారిని చక్రప్రయోగము చేత శ్రీకృష్ణుడు చంపు చుండెను. వారు ఇతర ప్రాణులున్ను అగ్నిలో పడు చుండిరి. వనమునందు చచ్చిన జంతువుల మాంస - రక్త - వసారసములచేత తృప్తి చెందిన అగ్నిదేవుడు తన జ్వాలలు ఆకాశమునకు పరపుచు పొగ లేక జ్వలించుచుండెను. అతని కన్నులు మెరసెను; నాలుకలు ప్రకాశించెను. అతని విశాల ముఖముగూడ మిక్కిలి తేజస్సుతో ప్రకాశించుచుండెను. అతనిమెరయు చున్న వెంట్రుకలు పైకి లేచియుండెను. కన్నులు పచ్చగా నుండెను. అతడు ప్రాణుల మేదోరసము త్రాగుచుండెను. ఈ విధముగ కృష్ణార్జునులు కడుపు నిండుగా పెట్టిన భోజనముచేత అగ్నిదేవుడు మిక్కిలి సంతృప్తి చెంది శాంతిల్లెను.

"జనమేజయా ! అప్పుడు తక్షకుని నివాస స్థానమునుండి బయలువెడలి పోవుచున్న మయుడు అను రాక్షసుని శ్రీకృష్ణుడు చూచెను, అప్పుడు అగ్నిదేవుడు మూర్తిమంతుడై తలపై జడలు ధరించిన మేఘమువలె గర్జించుచు, మయాసురుని దహింపగోరెను. మయుడు దానవ శిల్పులలో శ్రేష్ఠుడు. శ్రీకృష్ణుడతనిని చంపుటకు చక్రము పైకెత్తెను. అప్పుడు మయునకు ముందు శ్రీకృష్ణ సుదర్శనము, వెనుక అగ్నిదేవుడు, ముందుగోయి, వెనుకనూయి ఈ మధ్య చిక్కుకొన్నట్లు మయుడు తాను చావక తప్పదని "అర్జునా! పరుగెత్తి రమ్ము. నన్ను కాపాడుము" అని అరచుచు అర్జునుని శరణు జొచ్చెను.

"జనమేజయా! అట్లు భయముతో అరచుచు తనను శరణు వేడిన మయునకు అర్జునుడు అభయమిచ్చుచు 'భయపడకుము' అని చెప్పెను."

"అర్జునుడు మయునకు అభయ ప్రదానము చేసిన తరువాత శ్రీకృష్ణుడు, అగ్నిదేవుడు ఇరువురు గూడ నముచి సోదరుడైన మయాసురుని చంపక విడిచిరి."

"జనమేజయా! కృష్ణార్జునులచేత రక్షింపబడిన అగ్నిదేవుడు ఖాండవ వనమును పదునైదు దినముల వరకు దహించుచుండెను. అగ్నిదేవుడు తక్షక పుత్రుడైన అశ్వసేనుని, మయాసురుని, 'శార్ఙ్గకములు' అను నాలుగు పక్షులను-ఈ యారుగురను దహించలేదు."

వైశంపాయనుడిట్లు చెప్పగా విని, జనమేజయుడిట్లు ప్రశ్నించెను.

**శార్ఙ్గకోపాఖ్యానము - మందపాలముని, జరితా శార్ఙ్గిక నుండి పుత్రులను కనుట - వారి రక్షణమునకు మందపాలముని అగ్నిదేవుని స్తుతించుట.**

"బ్రహ్మన్! ఈ విధముగా అగ్నిదేవుడు ఖాండవవనమునందలి ప్రాణుల నన్నిటిని దహించి, నాలుగు శార్ఙ్గక పక్షులను మాత్రము ఎందుకు దహించకుండ విడిచెను? నీవు తక్షక పుత్రుడైన అశ్వసేనుని, మయాసురుని అగ్ని దహించక విడిచినందుకు కారణము చెప్పితివి. కాని, శార్ఙ్గకములను విడిచిన కారణము

చెప్పలేదు. శార్ఙ్గకములు క్షేమముగా నుండుట అద్భుతముగా నున్నది. భయంకర మైన అగ్ని సమ్మర్దమునందు శార్ఙ్గకములు మాత్రము కుశలముగా బ్రతికి యుండుటకు కారణము దయచేసి చెప్పుము.

ఆ జనమేజయుని ప్రశ్నమునకు వైశంపాయనుడు 'జనమేజయా! శార్ఙ్గక పక్షులు ఎందుకు బ్రతికి బయటపడినవో చెప్పెద వినుము' అని అవృత్తాంతమిట్లు చెప్పదొడగెను.

"మందపాలుడు' అనునొక మహర్షి ఉండెను. అతడు మహావిద్వాంసుడు, ధర్మజ్ఞుడు, కఠోర తపోవ్రత పాలనము చేయుమునిగా అతడు జితేంద్రియుడై సర్వదా తపస్సు చేయుచుండెను. కొన్నాళ్లకా మునీశ్వరుడు దేహత్యాగము చేసి పితృలోకమునకు పోయెను. కాని, అక్కడ అతనికి తన సత్కర్మలకు, తపస్సునకున్ను తగిన ఫలము లభించలేదు. 'తాను తపస్సుద్వారా సంపాదించిన పుణ్యలోకములుగూడ నిష్ఫలము లాయెనే' యనుకొని, యమధర్మరాజుకడ కూర్చొనియున్న దేవతల నిట్లడిగెను.

దేవతలారా! నా తపస్సునకు ఫలముగా ప్రాప్తించిన యీ లోకమెందుకు నాకు అనుభవయోగ్యము కాకున్నది! నేను భూలోకమునందు అన్ని సత్కర్మలు చేసితిని. నాకెందుకీలోకము ఉపభోగయోగ్యము కాకున్నది? నేనెక్కడకు పోయి ఏ కర్మలు చేసినచో నాకీలోకములు ప్రాప్తించునో చెప్పుడు. అక్కడకే పోయెదను.

మందపాలుని ప్రశ్నలకు దేవతలిట్లు బదులుచెప్పిరి;

"బ్రహ్మన్! మనుష్యుడు ఏ ఋణములతో జన్మించునో ఆ ఋణములను వినుము "యజ్ఞకర్మము బ్రహ్మచర్య పాలనము - సంతానోత్పత్తి" ఈ మూడిం టిని మనుష్యుడు తీర్చవలెను. 'యజ్ఞము తపస్సు వేదాధ్యయనము' ఈ మూడు చేయుటచేత అన్ని ఋణములు తీరిపోవును. నీవు, తపస్సు అధ్యయనము యజ్ఞములను చేసితివి. కాని నీకు పుత్రులు కలుగలేదు. అందుచేతనే నీకు ఈ లోకమునందు ప్రవేశించుటకు వీలు కాలేదు. కనుక సంతానోత్పత్తి చేసివచ్చినచో ఈ పుణ్యకరములైన పితృలోకములలో ప్రవేశము పొందగలవు.

"వేదములలో! 'పుత్' అను నరకమునుండి తండ్రిని ఉద్ధరించును కాబట్టి. కొడుకునకు, 'పుత్రుడు' అను పేరుకలదు అనియున్నది. కనుక నీ వంశ పరంపర నీతో విచ్ఛిన్నము కాకుండు ప్రయత్నము చేయుము.

"జనమేజయా! దేవతల మాటవిని మందపాలుడు ఎక్కడ నాకు త్వరగా సంతానము కలుగును అని చాల యోచించి, త్వరగా అధిక సంతానము కను పక్షుల యొద్దకు పోయెను. తాను *శార్ఙ్గికపక్షియై శార్ఙ్గికా పక్షితో సంపర్కము చేసెను. ఆ పక్షిణి పేరు జరిత. జరితా గర్భము నుండి బ్రహ్మజ్ఞులైన నలుగురు పుత్రులను మందపాలుడు కనెను. అండముల రూపములలో నున్న యీ నలుగురు పుత్రులను తల్లితో పాటు అక్కడనే విడిచి మందపాలుడు తన పూర్వ భార్యయైన 'లపిత' కడకు పోయెను.

జనమేజయా! మందపాలుడు లపితయొద్దకు పోయిన తరువాత సంతానము నందు ప్రేమగల జరిత, వారిని కాపాడుటకు మిక్కిలి చింతిల్లెను. అండముల రూపములలో నున్న యా మునికుమారులను నలుగురను మందపాల ముని విడిచిపోయెను. కాని ఆ శిశువులను తాను విడువగూడదని తలచి జరిత పుత్రప్రేమచేత ఖాండవ వనమునందు పుత్రులను విడిచిపోవక ఆ నవజాత శిశువులను మాతృప్రేమ చేత వన్యాహారము లిచ్చుచు పోషించుచుండెను.

జనమేజయా! మందపాలముని వనమునందు తన పూర్వ భార్యయైన లపితతో విహరించుచుండగా, ఖాండవవనము దహించుటకు వచ్చుచున్న అగ్ని దేవుని చూచి యతని సంకల్పము తెలిసికొని, బాల్యావస్థలో నున్న తన పుత్రులను తలచి, భయపడుచు, 'ఖాండవ వనమునందున్న తన పుత్రులను రక్షింపు'మని అగ్నిదేవు నిట్లు స్తుతించెను:-

అనగా, "అగ్నిదేవా! నీవు అన్నిలోకములకు ముఖమువంటివాడవు. నీవే దేవతలకు హవిస్సులను తీసుకొనిపోయి యిచ్చువాడవు. నీవు అన్ని ప్రాణుల శరీరములలో గూఢముగా సంచరించుచుందువు. విద్వాంసులు నీవు అద్వితీయ బ్రహ్మవని చెప్పెదరు. నీవు 'దివ్య-భౌమ-జఠరానల' అను మూడు రూపములలో నున్నావని విద్వాంసులు ప్రతిపాదించెదరు."

* ఇది యొక విధమైన పక్షి. దీనికి తెలుగులో పేరు ఎక్కడను దొరకలేదు.

"జ్ఞానులు నిన్నే 'పృథివి - జల - అగ్ని - వాయు - ఆకాశ - సూర్య-చంద్ర – యజమాన, నామములు గల ఎనిమిది మూర్తులలో విభజించి, యజ్ఞ వాహుని చేసిరి. ఈ సమస్త ప్రపంచ సృష్టికర్తవు నీవే యని మహర్షులు చెప్పెదరు.

"హుతాశనా ! నీవు లేనిచో, ఈ సమస్త జగత్తు తత్క్షణమే నశించును. అగ్నిదేవా ! బ్రాహ్మణులు నీకు నమస్కారము చేసి, వారి కర్మాను సారముగా భార్యా పుత్రులతో సనాతన పుణ్యగతిని పొందెదరు.

"ప్రళయకాలమునందు నీజ్వాలలు భయంకరముగా పైకి ఎగసి ప్రాణుల నన్నిటిని భస్మము చేయును. జాతవేదా! ప్రపంచ మంతయు నీ నుండియే ఉత్పన్నమైనది. నీద్వారాయే కర్మముల విధానము నెరవేరుచున్నది. పూర్వము నీనుండియే జలము పుట్టినది. నీయందే జగమంతయు నిలిచియున్నది. అగ్ని దేవా! ఆకాశమునందు విద్యుత్తుతోపాటు తిరగుచున్న మేఘసమూహముగూడ నీ స్వరూపమే.

"హవ్యవాహనా! నీయందే హవ్యములు (యజ్ఞాదులయందు హోమము చేయబడు ద్రవ్యములు) కవ్యములు (శ్రాద్ధాదిపితృకర్మలయందు హోమము చేయబడు ద్రవ్యములు) నీయందే ప్రతిష్ఠింపబడియున్నవి. నీవే అన్నిటిని దగ్ధము చేయు అగ్నివి. ప్రపంచ ప్రాణులను భరించుచు పోషించుచు ధాతవుగా నున్న వాడవు గూడ నీవే. బుద్ధికి ప్రభువైన బృహస్పతి నీ స్వరూపమే. నీవే అశ్వినీ కుమారుల స్వరూపుడవు. అగ్నిదేవాః సూర్యచంద్ర-వాయు స్వరూపుడవు గూడ నీవే."

* అగ్నిదేవుని స్తోత్రము ప్రతిదినము పఠింపదలచు వారికొరకు, ఇక్కడ ఆ శ్లోకములు వ్రాయబడినవి.

త్వమగ్నే! సర్వలోకానాం ముఖం త్వమసి హవ్యవాట్
త్వమన్తః సర్వభూతానాం గూఢశ్చరసి పావక
త్వామేకమాహుః కవయస్త్వామాహుస్త్రివిధం పునః
త్వామష్టధా కల్పయిత్వా యజ్ఞవాహమకల్పయన్

"జనమేజయా! మందపాల మహాముని యిట్లు అగ్నిదేవుని స్తుతించగా, ఆ దేవుడు, మందపాలుని యెడల మిక్కిలి ప్రసన్నుడై మహామునీ! నీకు ఏమి కావలెను. నేనేమి చేయుదును?" అని యనగా, మందపాలుడు చేతులు జోడించి అగ్నితో "దేవా! ఖాండవవనము దహించునపుడు నా పుత్రులను కాపాడుము." అని ప్రార్థించగా, అగ్నిదేవుడు, "సరియే. అట్లే చేసెదను" అని మందపాలునకు ప్రతిజ్ఞ చేసి, జ్వలించుచు ఖాండవ వనదాహమునకు పూనుకొనెను.

**జరిత తన పుత్రుల రక్షణకు చింతతో విలపించుట :**

"జనమేజయా ! ఖాండవవనమునందు అగ్ని జ్వలించినపుడు శార్ఙ్గక పుత్రులు ప్రాణభయము చేత మిక్కిలి దుఃఖించిరి. వారిని రక్షించువారు అప్పుడు ఎవ్వరు గూడ లేకుండిరి. వారి తల్లి జరిత వారిని వాపాడుటకు దిక్కుతోచక మిక్కిలి దుఃఖించుచు. నిట్లనెను :-

భయంకరమైన యీ అగ్ని యీ వనమును కాల్చుచు ఇటువైపే వచ్చుచున్నది. ఇది జగత్తు నంతటిని కాల్చునట్లు తోచుచున్నది. దాని వలన నాకు ఎక్కువ దుఃఖము కలుగుచున్నది, ప్రపంచమే తెలియక పసిగ్రుడ్డులుగా నున్న నా శిశువులను ఇప్పుడెట్లు రక్షించెదను? మా పితృదేవతలకు వీరే

త్వయా విశ్వమిదం సృష్టం వదంతి పరమర్షయః
త్వదృతే హి జగత్కృత్స్నం సద్యో నశ్యేద్ధుతాశన
తుభ్యం కృత్వా నమో విప్రాః స్వకర్మవిజితాం గతిమ్
గచ్ఛన్తి సహపత్నీభిః సుతైరపి చ శాశ్వతీమ్
త్వామగ్నే! జలదానాహుః ఖే విషక్తాన్ సవిద్యుతః
దహన్తి సర్వభూతాని త్వత్తో నిష్క్రమ్య హేతయః
జాతవేదస్త్వయైవేదం విశ్వం సృష్టం మహాద్యుతే
తవైవ కర్మ విహితం భూతం సర్వం చరాచరమ్
త్వయాఽఽపో విహితాః పూర్వం త్వయి సర్వమిదం జగత్.
త్వయి హవ్యం చ కవ్యం చ యథావత్ సంప్రతిష్ఠితమ్ ।
త్వమేవ దహనో దేవ! త్వం ధాతా త్వం బృహస్పతిః
త్వమశ్వినౌ యమౌ మిత్రః సోమస్త్వమపి చానలః ॥

అధారముగదా ! అగ్ని వనముకాల్చుచు ఇటువైపే ప్రసరించుచున్నది. అహా ! నా పిల్లలకు రెక్కలు గూడ మొలవ లేదు. నాతోపాటు ఎగుర జాలరుగదా ! నేను గూడ వీరిని తీసికొని యీ అగ్నిని దాటిపోవజాలకున్నాను. వీరి నిక్కడనే విడిచి అగ్నికి ఆహూతి చేసి పోవజాలకున్నాను ఏమి చేయుదును?

నేను వీరిలో నెవరిని విడిచి యెవరిని తీసికొని పోవుదును ? నాకు వీరందరు సమానులే.

నాయనలారా ! ఈ విషయములో మీ యభిప్రాయ మేమి ? మిమ్ము విడిపించుటకు ఉపాయము యోచించు చున్నాను. ఏ యుపాయము గూడ నాకు తోచకున్నది. ఏమి చేయుదును. నా అవయవములతో మిమ్ము కప్పి యుంచు కొని, మీతో పాటే నేను గూడ ఈ యగ్నిలో మరణించెదను. పుత్రులారా! నిర్ద యుడైన మీ తండ్రి మిమ్మిక్కడనే విడిచి నాతోనిట్లు చెప్పి వెడలిపోయెను.

'ప్రియే ! ఈ నలుగురిలో 'జరితారి' అను వాడు మన జ్యేష్ఠపుత్రుడు కనుక, ఈ కులము రక్షించు భారమి తనిపైననే ఉండగలదు. రెండవ కొడుకు 'సారిసృక్కనామకుడు' ఇతడు తన పితరుల కులమును వృద్ధి పొందించగలడు. మూడవ కొడుకు 'స్తంబమిత్ర' నామము గలవాడు తపస్సు చేయును. నాల్గవ పుత్రుడైన 'ద్రోణ' నామకుడు బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడు కాగలడు."

"జనమేజయా ! యిట్లు పతిమాటలు తలచుకొని 'అహా ! యిప్పుడు నే నెవరిని విడిచి పోవుదును ? ఈ నలుగురు పుత్రులు వంశోద్ధారకులే. వీరిలో ఒక్కడు గూడ అప్రయోజకుడు కాడు. నా పైన పెద్ద ఆపద వచ్చి పడినది. ఏమి చేసి దీనిని తప్పించుకొన గలను ?' అని చింతించుచు జరిత మిక్కిలి పరి తపించెను. కాని, తన పుత్రులను రక్షించు నుపాయమప్పుడామెకు తోచలేదు. అప్పుడు అశార్ఙ్గిక బాలకులు తల్లితో నిట్లనిరి :-

"తల్లీ ! నీవు మా యందలి ప్రేమ విడిచి అగ్నిలేనిచోటికి ఎగిరి పొమ్ము. ఈ యగ్నితో మేము నశించినను నీకు మరల పుత్రులు పుట్టవచ్చును.కాని, నీవు చని పోయిన యెడల, మన యీ వంశపరంపరయే లోపించి పోవును. ఈ రెండు విష

యములను నీవు బాగుగా విచారించి మన కులమునకు శుభము గలుగు పనియే యిప్పుడు నీవు చేయుట మంచిది. మా మీద నీవు స్నేహము విడువుము. దీని వలన మన మందరము చనిపోయెదము. ఉత్తమ లోకములను సంపాదించుటకు ఇచ్ఛగల మా తండ్రి చేసిన పని వ్యర్థము కాగూడదు గదా!"

"జనమేజయా! వారి మాటలు విని జరిత వారితోనిట్లనెను :

"నాయనలారా! యీ వృక్షసమీప భూమి యందు ఎలుకల బొరియ యున్నది. మీరు అతిత్వరగా ఈ బిలములో దూరి పొండు. దీని లోపల మీరు అగ్నిభయము ఉండదు. మీరీ బిలములో దూరిన తరువాత నేను ధూళితో దీని ముఖము కప్పెదను. ఇట్లు చేయుటచేత మీరు అగ్గినుండి రక్షింపబడెదరని నాకు విశ్వాసము కలదు. ఈ నిప్పు ఆరిపోయిన తరువాత నేను ఈ బిలమునకు కప్పిన దుమ్ము తీయుటకు ఇక్కడకు వచ్చెదను. ఈ యగ్నినుండి రక్షింపబడుటకు నేను చెప్పిన యీయుపాయము మీకుగూడ నచ్చవలెను",

"జనమేజయా! తల్లిమాటలు విని శార్ఙ్గకులు ఆమెతో నిట్లనెరి.

"అమ్మా! మే మింకను రెక్కలు రాని కూనలము. మా శరీరములు మాంస పిండములుగానే యున్నవి. ఎలుకలు మాంసము తిను జంతువులు. కనుక, అవి మమ్ము తప్పక భక్షించగలవు. ఈ భయముచేతనే మే మీ ఎలుకల బొరియలో పోవము.

"తల్లీ ఎలుకలు మమ్ము చంపకుండుటకు, మాతండ్రి చేసిన, సంతానోత్పత్తి ప్రయత్నము విఫలము కాకుండుటకు, మా తల్లి జీవించి యుండుటకు మేము అగ్నికి ఆహుతి కాకుండుటకున్ను తగిన యుపాయము ఏమి చేసిన బాగు" అని మేము యోచించుచున్నాము. "అమ్మా బిలమునందు ఎలుకల వలన, ఆకాశమునందు అగ్నివలన మేము నశించెదము. ఈ రెంటి పరిణామము విచారించగా,

మేము ఎలుకలకు భోజన మగుటకన్న, అగ్నిలోపడి కాలుటయే శ్రేష్ఠమని మాకు తోచుచున్నది. ఒకవేళ మమ్ము బిలములో ఎలుకలు తినిన యెడల, అప్పుడు మా మరణము అతినింద్యమగును. అగ్నిలో జ్వలించి పోయినచో

యనుమతి తీసికొని యింటికి తిరిగి వచ్చితిని. కాబట్టి పుత్రులారా! మీరు విశ్వాసముతో ఈ బిలమునందు దూరి యుండగలరు. మీకక్కడ భయము లేదు. పెద్ద డేగ నేను చూచుచుండగనే యెలుకను హరించికొని పోయెను.

**శార్ఙ్గకులు:-** అమ్మా డేగ ఎలుకను ఎత్తుకొనిపోయిన సంగతి మాకు తెలియదు. కనుక అది తెలియకుండ మేము ఈ బిలమునందు ప్రవేశించి యెట్టి పరిస్థితిలోగూడ నుండము.

**జరిత:-** నాయనలారా! డేగ యెలుకను తీసికొని పోయిన సంగతి నాకు తెలియును. నామాట విశ్వసింపుడు. ఈ బిలమునందు మీకు ఏలాటి భయము గూడ లేదు.

**శార్ఙ్గకులు:-** అమ్మా! నీవు అసత్యపు సాకులతో మా భయము పోగొట్టుటకు ప్రయత్నము చేయవద్దు. సంశయాస్పదమైన పనిచేయుట బుద్ధిమంతుల లక్షణము కాదు.

'అమ్మా! నీకు మేము ఏలాటి ముపకారము చేయలేదు. ఇంతకు పూర్వము మేమెవరమో కూడ నీకు తెలియదు. ఇట్లుండగా, నీవు ఇంత శ్రమపడి మమ్ము రక్షించుటకు ఎందుకు ప్రయత్నము చేయగోరుచున్నావు! మేము నీకెవరము? నీవు మాకెవరవు?

తల్లీ! యింకను నీకు యౌవనము ఉన్నది. నీవు సౌందర్యముతో గూడనున్నావు. పతిని అన్వేషించుకొను సామర్థ్యముగూడ నీకు ఉన్నది. కాబట్టి, నీవు పతినే అనుసరింపుము. నీకు మరల సుందరులైన పుత్రులు పుట్టగలరు.

"అమ్మా! మేము అగ్నిలో కాలి ఉత్తమపుణ్యలోకములకు పోయెదము. ఒకవేళ అగ్నిమమ్ము కాల్చనియెడల, నీవు మరల మాయొద్దకు రమ్ము".

"జనమేజయా! కొడుకులు ఆ విధముగా చెప్పిన తరువాత శార్ఙ్గిపక్షి, వారిని ఖాండవనమునందు విడిచి, అగ్నిభయము లేనిచోటికి పోయెను. తరువాత ఘోరజ్వాలలతో మండుచు అగ్నిదేవుడు త్వరగా శార్ఙ్గకులు ఉన్నచోటిక ప్రసరించుచు వచ్చెను. ఆయగ్నినిచూచి ఆ పక్షులు తమలో నిట్లు మాట్లాడుకొనెను.

మంచిదే యగును. అగ్నిలో శరీర త్యాగముచేయుట మంచిదని శిష్టులైన పురుషులు చెప్పినారు.

**జరితకు - ఆమె పుత్రులకు సంవాదము :**

జనమేజయా ! పుత్రుల మాటలువినిన జరితకు, శార్ఙ్గకులకు ఇట్లు సంవాదము జరిగెను.

**జరిత :** నాయనలారా ! ఈ బొరియలో ఎలుక యిప్పుడు లేదు. ఆ చిన్న యెలుకను డేగ తీసికొని పోవుట, చూచితిని. కాబట్టి యీ బిలమునందు ఇంక మీకు భయము లేదు.

**శార్ఙ్గకులు:-** అమ్మా! డేగ యెలుకను యెత్తుకొనిపోయిన సంగతి మాకు తెలియదు. ఈ బిలమునందు ఇంకను ఎలుకలు ఉండవచ్చును. వానివలన గూడ మాకు భయమేకదా.

అగ్ని! యింతదాక వచ్చును. సందేహము లేదు. ఎందుకనగా, వాయువు చేత అగ్ని ఒకవైపు నుండి మరియొక వైపుగూడ మరలిపోవుట చూచినాము. కాని, బిలమునందైతేనో, యితర జంతువుల వలన గూడ మాకు మరణము ప్రాప్తించవచ్చును. ఇందులో సందేహము లేదు.

అమ్మా! సంశయము లేని మృత్యువుకన్న సంశయాస్పదమైన మృత్యువే మంచిది. ఎందుకనగా, దానినుండి తప్పించుకొను నాశయున్నది. కాబట్టి, నీవు ఆకాశమునకు ఎగిరిపొమ్ము. నీకు మరల, ధర్మము ప్రకారము సుందరులైన పుత్రులు కలుగవచ్చును.

**జరిత:-** పుత్రులారా! పక్షిరాజైన డేగ, బిలమునుండి యెలుకను తీసికొని పోవుచుండగా దానివెంట నేనుగూడ వేగముగా పోయితిని. బిలమునుండి ఎలుకను తీసికొని పోవుచున్నందుకు నేను సంతోషించి 'శ్యేనరాజా! నీవు మా శత్రువును తీసికొనిపోవుచున్నావు. కాబట్టి, స్వర్గమునకు పోయిన తరువాత నీ శరీరము సువర్ణమయ మగుగాక! నీ కెవరుగూడ శత్రువులు లేకుందురు గాక!' అని ఆశీర్వదించితిని. ఆ శ్యేనపక్షి ఎలుకను తినిన తరువాత నేను, దాని

**జరితారి ;-** బుద్ధిమంతుడు, తనకు కష్టము రాకముందే జాగ్రత్తపడును. అతడు సంకటకాలము వచ్చినప్పుడు బాధపడడు. సంభవించబోవు సంకటావస్థను తెలిసికొనజాలని యతడు సంకటము కలిగినప్పుడు బాధపడును. కాబట్టి, శ్రేయస్సును పొందజాలడు.

**సారిసృక్కుడు :-** సోదరా! నీవు ధీరుడవు. బుద్ధిమంతుడవు. మన కిది ప్రాణాపాయము కాబట్టి యీసంకటమునుండి నీవేమమ్ము రక్షించగలవు. ఎందుకనగా అనేకులలో నొకడే బుద్ధిమంతుడు, శూరుడు ఉండును, సందేహములేదు,

**స్తంబమిత్రుడు :-** జ్యేష్ఠభ్రాత తండ్రితో సమానుడు. అతడే సంకటమును తెలిసికొని మమ్ములను రక్షించని యెడల తమ్ము లేమిచేయగలరు ?

**ద్రోణుడు :-** జాజ్వల్యమానమైన ఈయగ్ని మనచెట్టువైపే వచ్చుచున్నది. అతి వేగముతో వచ్చుచున్న యీ యగ్నికి ఏడునాలుకలు ఉన్నవి. ఏడు నాలుకలతో అగ్ని క్రూరముగా అన్ని వృక్షములను నాకుచు అన్నివైపుల వ్యాపించుచున్నది.

"జనమేజయా! యీ విధముగా మందపాలపు మంత్రులు పరస్పరము మాట్లాడుకొనుచు, ఏకాగ్రచిత్తులై యిట్లుఅగ్నిని స్తుతింప దొడగిరి:-

**శార్ఙ్గకులు అగ్నిని స్తుతించుట :-**

**జరితారి :-** అగ్నిదేవా! నీవు వాయుదేవునకు తృణలతాదులైన వనస్పతులకు శరీరమవై యున్నావు, తృణలతాదులకు యోనియైనపృథివి జలమున్ను నీవీర్యము - జలమునకు జన్మస్థానముగూడ నీవే. మహాతేజోమూర్తీ! నీజ్వాలలు సూర్యకిరణములవలె మీద-క్రిందవెనుక - ముందు - పార్శ్వములందు - అన్నివైపుల వ్యాపించుచున్నవి.

**సారిసృక్కుడు :** ధూమ ధ్వజముతో శోభిల్లు అగ్నిదేవా ! మా తల్లి వెడలిపోయెను. మా తండ్రీ ఎక్కడ నున్నది గూడ మాకు తెలియదు. మాకు ఇంకను రెక్కలు మొలవలేదు. నీవు దప్ప నితరు డెవడుగూడ మాకు రక్షకుడులేడు. కాబట్టి బాలకులమైన మమ్ము నీవే రక్షించవలెను. అగ్నిదేవా ! నీ రూపము మంగళకరమైనది. నీశరణు జొచ్చినమమ్ము నీయేడు జ్వాలలచేత

రక్షింపుము జాతవేదా ; నీవొక్కడవే అంతట తపించు చుందువు, దేవా! సూర్య కిరణములలో తపించువాడు గూడ నీకంటె వేరుకాదు. హవ్యవాహా ! మేము బాలకులము. ఋషులము. మమ్ము రక్షింపుము. మమ్ము విడిచి దూరముగా పొమ్ము.

స్తంబ మిత్రుడు : అగ్నిదేవా ! ఈ జగ మంతయు నీవే. ఈ జగత్తు నీయందే ప్రతిష్ఠితమై యున్నది. నీవే ప్రాణులను పాలించుచు జగత్తును ధరించు చుందువు. నీవే అగ్నివి. నీవే హవ్య ద్రవ్యములను వహించెదవు. నీవే హవిష్యము (హోమము) చేయబడునేయి మొదలైనవి. విద్వాంసులు నిన్నే అనేక రూపునిగా ఏకరూపునిగాను తెలిసికొనెదరు. హవ్యవాహనా నీవు మూడు లోకముల సృష్టిచేసి ప్రళయకాలమునందు ప్రజ్వలించి, మరల ఈ లోకములను సంహరించెదవు. కాబట్టి అగ్నిదేవా ! నీవు ఈ సర్వ ప్రపంచమునకు ఉత్పత్తి స్థానము - లయ స్థానముగగూడ నున్నావు.

ద్రోణుడు : జగత్పతీ ! నీవేకదా ప్రాణుల శరీరముల లోపల ఉండి, వారు తినిన యాహారమును నీ దీప్తిచేత జీర్ణము చేయుచుండెదవు. జగమంతయు నీ యందే నిలిచి యున్నది. శుక్ల వర్ణముగల అగ్నిదేవా ! సర్వజ్ఞుడవైననీవే సూర్యుడవై నీ కిరణములచేత భూమినుండి జలమును, ఇతర పార్థివరసముల నన్నింటిని గ్రహించి, అవసరము కలిగినప్పుడు మరల వర్షముద్వారా ఈపృథివి యందు జలరూపములో ఆ రసములన్నియు విడిచెదవు. ఉజ్జ్వల వర్ణముగల అగ్నిదేవా! మరల నీనుండియే, పచ్చని ఆకులతో వనస్పతులు ఉత్పన్నములగు చుండును. నీచేతనే వర్షాకాలము నందు మరల పుష్కరిణులు సముద్రములు జల పూర్ణములగును. ప్రచండ కిరణములుగల అగ్నిదేవా ! ఈ శరీరరూపమైన మా యిల్లు జిహ్వేంద్రియ రూపుడైన వరుణ దేవునకు ఆలంబనమై యున్నది. నేడు నీవు చల్లబడి, నీమరోరూపముతో మమ్ము రక్షింపుము. మమ్ము నశింప జేయకుము. పసుపుపచ్చని నేత్రములు, ఎఱ్ఱని మెడయుగల హుతాశనా ! నీవు [1]కృష్ణవర్త్ముడవు. సముద్ర తీరమునందలి యిండ్లవలె మమ్ము గూడ నీవు విడిచి పెట్టుము. దూరము నుండియే వెడలిపొమ్ము !

1. నల్లని మార్గము గలవాడవు అని యర్థము. పొగ నల్లగా నుండును గనుక అది యే అగ్నికి మార్గము గనుక, అగ్నికి కృష్ణవర్త్మ యని పేరు.

"జనమేజయా! బ్రహ్మవాదియైన ద్రోణుని చేత ఈ విధముగా ప్రార్థింప బడి అగ్నిదేవుడు ప్రసన్నుడై పూర్వము మందపాల మునికి తాను చేసిన ప్రతిజ్ఞ స్మరణమునకు రాగా, ద్రోణునితో నిట్లనెను :-

**అగ్నిదేవుడు :-** నీవు ద్రోణఋషి వనుకొనెదను. ఎందుకనగా, నీవు పరబ్రహ్మమునే ప్రతిపాదించితివి. నేను నీ కోరికను సిద్ధింప జేసెదను. నీకు ఏలాటి భయమక్కరలేదు. మందపాల మహాముని, పూర్వమే నాకు మీ విషయమై తెలిపి, నన్ను అగ్నిదేవా! నీవు ఖాండవవనమును దహించునపుడు నా పుత్రులను రక్షింపుము" అని వేడియుండెను. ద్రోణముని! మీ తండ్రి నన్ను కోరినమాట నీ విప్పుడు చెప్పిన మాట యీ రెండు గూడ నాకు గౌరవ ప్రదములైనవి. అడుగుము. నీకు ఇంకను ఏమి కోరికలు తీర్చ మనెదనో? బ్రహ్మన్! స్తోతృ శిరోమణీ! నీకు మంగళమగు గాక! నీవు చేసిన స్తోత్రముచేత నేను చాల ప్రసన్నుడనైతిని.

**ద్రోణుడు :-** శుక్ల స్వరూపా! అగ్నిదేవా! యీ మార్జాలములు (పిల్లులు) ప్రతిదినము మమ్ము దుఃఖపెట్టుచున్నవి. హుతాశనా! నీవు ఈ పిల్లులను బంధు సహితముగా భస్మము చేయుము."

"జనమేజయా! శార్ఙ్గకుల ప్రార్థన ననుసరించి అగ్నిదేవుడు వారిని రక్షించి, యితర ఖాండవవన మంతయు దహించెను."

**మందపాలుడు తన పుత్రులతో కలియుట :-**

"జనమేజయా! మందపాలుడు గూడ తన పుత్రులను గూర్చి చింతించు చుండెను. వారిని రక్షింపుమని అగ్నిదేవుని అతడు ప్రార్థించి యుండినప్పటి కిన్ని, అతనికి శాంతి లేకుండెను. పుత్రుల కొరకు తపించుచు మందపాలుడు అతని పూర్వభార్యయైన లపితతో నిట్లనెను :-

"లపితా! నా పుత్రులు తమగూటిలో నెట్లా బ్రతుక గలరు?

వాయుప్రేరణచేత అగ్ని వృద్ధిచెందినప్పుడు నా పుత్రులు అగ్నిమంట తమను తమను రక్షించుకొనుటకు అసమర్థు లయ్యెదరు.

"ప్రియే! పాపము దీనురాలైనవారితల్లి స్వయముగా అసమర్థురాలు. ఆమె వారినెట్లు రక్షింప గలదు? తన పిల్లలను కాపాడుటకు ఏయుపాయమున్ను లేక ఆమె శోకముచేత బాధపడగలదు. నాపిల్లలకు రెక్కలు రాలేదు. పైకి ఎగుర జాలరు. ఇట్టిపరిస్థితిలో నున్నకొడుకులను చూచి జరిత అరచుచు నిటునటు ఏ దిక్కు దోచక పరుగెత్తు చుండునుగదా! నాకొడుకు 'జరితారి' ఎట్లున్నాడో, కదా? అతనితమ్ములు 'సారిసృక్క - స్తంబమిత్ర - ద్రోణుల' యవస్థ యేమై యుండునోకదా! వారితల్లియవస్థ యేమో"

"జనమేజయా! మందపాలమునీశ్వరుడు, వనమునందు తన భార్యా పుత్రులకొరకు ఈ విధముగా విలపించుచుండగా, లపిత ఈర్ష్యచేత పతితో నిట్లనెను :-

"మునీంద్రా ! నాకు పుత్రులను చూచు చింతలేదు. నీపుత్రులు ఋషీశ్వరులు - వారికి అగ్నిభయము ఏమాత్రమున్ను ఉండదు. వారు మంచి తేజస్వులు - శక్తిమంతులు. నాసమక్షముననే నీవు నీ పుత్రులరక్షణమును అగ్నిదేవునకు ఒప్పగించితివిగదా? అగ్నిదేవుడుగూడ వారిని రక్షించుటకు ప్రతిజ్ఞ చేసి యుండెను గదా! ఇక నీకు చింత యెందుకు? అగ్నిదేవుడు లోకపాలకుడు. కనుక, ఒకసారి మాట యిచ్చి తప్పడు. అసత్యము చెప్పడు. కనుక నీ మనస్సు ఇప్పుడు పుత్రరక్షణరూపమైనబంధుజనోచితకర్తవ్యపాలనమునకు ఉత్సుకముగా లేదు. మహాముని! ఇప్పుడు నీవు నాశత్రువు నాసవతియైన జరితను గూర్చిన చింతతో తపించుచున్నావు. నీకు పూర్వము జరిత యందు గలప్రేమ నాయందు లేదు. నా వంటి సహాయసంపన్నురాలు, శక్తిమంతురాలు, మైత్రిగలదియునైన వ్యక్తియందు స్నేహము ఉంచక, నావంటి ఆత్మీయులు బాధపడు చుండగా-చూచుచు ఉపేక్షించుట నీకు ఏమాత్రము ఉచితము గాదు. నీవు ఎవరికొరకై పరితపించు చున్నావో ఆ జరితకడకే పొమ్ము. దుష్టపురుషుని ఆశ్రయించిన స్త్రీవలె నేను ఒంటరిగా తిరుగు చుండెదను."

"జనమేజయా ! లపిత పలికిన నిష్ఠుర భాషణములు విని మందపాలు డిట్లనెను. "ఓసీ ! నీవు అనుకొనుచున్నట్లు నేను ప్రపంచములో చరించుట లేదు. నేనంచరించుట యంతయు కేవలము సంతానము కొరకే. నా పుత్రులిప్పుడు సంకటములో పడియున్నారు. పుట్టిన సంతతిని విడిచి, పుట్టబోవు పుత్రులయందు

విశ్వాసము ఉంచినవాడు మూర్ఖుడగును. అట్టివానిని ఎవరు గూడ ఆదరించరు. నీ యిష్టము వచ్చినట్లు చేయుము. ఈ ప్రజ్వలితాగ్ని ఈ వనము - నందలి వృక్షములనన్నిటిని దహించుచు నా దుఃఖిత హృదయమునందు అమంగళము సూచించుచున్నాడు. నాకు చాల సంతాపము కలుగుచున్నది !"

"జనమేజయా ! అగ్నిదేవుడు ఆ చోటు విడిచి పోయిన తరువాత జరిత మరల పుత్రుల యొద్దకు వచ్చెను. వారు క్షేమముగా నుండిరి. అప్పుడు ఏడ్చుచుండిన పుత్రులను చూచెను. 'జరిత మాటి - మాటికి పుత్రులను చూచి బాష్పములు విడుచుచు వారి నొకరొకరిని పేరు పెట్టి పిలుచుచు వారితో కలిసికొనెను,

"జనమేజయా ! ఇంతలోనే మందపాలముని గూడ హఠాత్తుగా నక్కడకు వచ్చి చేరెను. కాని, అతని పుత్రులతో నొక్కడు గూడ అతనిని అభినందించ లేదు. ఆ ముని ఒక్కొక్క కొడుకును పేరు పెట్టి పిలుచుచు, జరితను గూడ పిలుచుచు మాట్లాడించెను.

కాని వారు ఆ మునితో ఏమియు మాట్లాడలేదు. అప్పుడు మందపాలుడు జరితతో నిట్లనెను :-

"ప్రియే ! వీరిలో నీ జ్యేష్ఠ పుత్రుడెవడు ? రెండవ - మూడవ - నాలుగవ వారెవరు ? దుఃఖముతో నిన్నడుగుచున్నాను. నాకు బదులెందుకు చెప్పకున్నావు ? నిన్ను విడిచి ఇక్కడ నుండి నేను పోయిన తరువాత నాకు శాంతి లభించలేదు."

"జనమేజయా ! ఆ మాటకు జరిత యిట్లనెను :-

మహామునీ ! నీకు ఈ నలుగురు పుత్రులతో పని యేమి ? నీవు నన్ను అందరి కన్న హీనురాలనుగా తలచి విడిచి పెట్టి యెవతె వద్దకు పోయి యుంటివో చిరునవ్వులు గురియుచున్న యామనో హరతరుణి లపిత కడకే పొమ్ము."

ఆ మాటకు మందపాలు డిట్లనెను :-

"ప్రియే ! స్త్రీలకు పరపురుష సంబంధము, సపత్ని ద్వేషము, ఈ రెండు దప్ప పరలోకమునందు పరమార్థమును నశింప జేయు దోషము మరియొకటి లేదు. సపత్ని ద్వేషము శత్రుత్వాగ్నిని పెంచుచు అత్యంత దుఃఖము గలిగించును.

"ప్రియే! సమస్త ప్రాణులలో విఖ్యాతురాలు, ఉత్తమ వ్రతపాలన చేయునది, మంగళకరురాలు అరుంధతీదేవి గూడ ఒకప్పుడు మహాత్ముడైన తన పతి వసిష్ఠ మహామునిని శంకించియుండెను. ఆ మహాముని హృదయము విక్కలి

పరిశుద్ధమై యుండెను. ఆయన సర్వదా ఆమెకు ప్రియము, హితమున్ను చేయుట యందే తత్పరుడై యుండెను. ఆయన సప్తర్షి మండలమునందు విరాజమానుడై యుండెను. అటువంటి మునీశ్వరుని గూడ అరుంధతి సపత్నీ ద్వేషముచేత తిరస్కరించి యుండెను. ఆయశుభము కారణముగా ఆమె శరీరకాంతి, పొగ, ఎరుపున్ను గలిగిన వర్ణమువలె శోభ దరిగియుండెను. ఆమె ఒకప్పుడు కన పడుచు మరియొకప్పుడు కనపడక ప్రచ్ఛన్న వేషముతో నుండెను.

"ప్రియే! నేను నా పుత్రులతో కలిసికొనుటకు వచ్చినాను. ఐనను, నీవు నన్ను తిరస్కరించుచున్నావు. నీ యభీష్ట వస్తువు లభించిన తరువాత గూడ, నీ వెట్లయితే నన్ను సందేహించుచున్నావో, అట్లే లపితగూడ నన్ను సంశయించు చున్నది. "ఈమె నా భార్య" అని పురుషుడు, స్త్రీయందు ఏ విధముగ గూడ విశ్వాసము ఉంచగూడదు. ఎందుకనగా, స్త్రీ పుత్రవతియైన తరువాత, పతిసేవ మొదలగు కర్తవ్యములయందు దృష్టి ఉంచదు.

"జనమేజయా! తరువాత, ఆ పుత్రులందరు, తమ తండ్రియొద్దకు వచ్చి కూర్చొనిరి. మందపాల మహాముని తన పుత్రులను అనునయించుచు ఆదరించి యిట్లనెను:-

"పుత్రులారా! నేను అగ్నిదేవుని 'మిమ్ము కాపాడుము' అని ప్రార్థించి యుంటిని. 'అట్లే కాపాడెదను' అని ఆ దేవుడు నాతో ప్రతిజ్ఞచేసి యుండెను. ఆయన నాకిచ్చిన మాట స్మరించుచు, మీతల్లి ధర్మశీలత్వము తెలిసి నేను, తొలుత ఇక్కడకు రాలేదు. నాయనలారా! మీరు నన్ను గూర్చి అన్యధా భావించి పరితపింపగూడదు. మీరు ఋషులు అని అగ్నిదేవునకు గూడ తెలియును. ఎందు కనగా, మీకు పరబ్రహ్మ తత్త్వజ్ఞానము లభించినది."

జనమేజయా! ఈ విధముగా మందపాల మునీంద్రుడు భార్యా పుత్రులను ఊరడించి, అక్కడినుండి యితర దేశమునకు వారితో పోయెను.

**ఇంద్రుడు కృష్ణార్జునులకు వరమిచ్చుట-కృష్ణార్జున మయాసురులు అగ్నిని వీడ్కొని యమునా తీరమందు కలిసి కూర్చొనుట:-**

"జనమేజయా! అక్కడ జ్వలించు చండజ్వాలలు గల అగ్నిదేవుడుగూడ ప్రపంచమునకు హితము చేయు నుద్దేశముతో శ్రీకృష్ణార్జునుల సహాయముతో ఖాండవ వనమును దహించెను. వసారసము - క్రొవ్వుల కాలువలు ఎన్నియో అక్కడ పారజొచ్చెను. ఆ యన్నింటిని త్రాగి అగ్నిదేవుడు కృష్ణార్జునుల కడకు వచ్చెను.

"జనమేజయా! ఆ సమయమునందే యింద్రుడు గూడ దేవతాగణముతో పాటు ఆకాశమునుండి దిగి శ్రీకృష్ణార్జునులతో నిట్లనెను.

"వీరశ్రేష్ఠులారా! మీరిరువురు దేవతలకుగూడ అసాధ్యమైన దుష్కర కార్యము చేసితిరి. నాకు చాల సంతోష మైనది. ఈలోకమునందు మనుష్యులకు దుర్లభ మైనదైనను మీ రిద్దరు కోరుకొనుడు; ఇచ్చెదను."

"జనమేజయా! అప్పుడు అర్జునుడు, అన్నివిధము లైన దివ్యాస్త్రములను ఇమ్మని కోరెను. ఇంద్రు డాయస్త్రముల నిచ్చుటకొక నిశ్చితసమయము నిర్ణయించి యతనితో నిట్లనెను."

"పాండునందనా! భగవంతు డైన మహాదేవుడు నీయెడల ప్రసన్ను డైనప్పుడు, నేను నీకు అన్నివిధము లైన దివ్యశస్త్రాస్త్రము లిచ్చెదను. కురునందనా! ఆసమయ మెప్పుడు వచ్చునదిగూడ నాకు తెలియును. నీవు చేయబోవు మహాతపస్సుచేత నేను ప్రసన్నుడ నై, నీకు 'ఆగ్నేయ - వాయవ్యాది' మహాస్త్రము లన్నియు నిచ్చెదను. ధనంజయా! ఆసమయమునందే, నీవు నాయస్త్రము లన్నియు గ్రహించెదవు.

"జనమేజయా! తరువాత శ్రీకృష్ణభగవానుడుగూడ తనకు అర్జునుని యందు ప్రేమ నిరంతరము వృద్ధి పొందుగాక, యను వరమును ఇంద్రుని కోరెను. ఇంద్రుడు పరమాత్ము డైన శ్రీకృష్ణభగవానునకు ఆ వర మిచ్చెను.

"జనమేజయా! యీవిధముగా ఇంద్రుడు శ్రీకృష్ణార్జునులకు వరము లిచ్చి అగ్నిదేవునియాజ్ఞ గొని, దేవతా సహితుడై స్వర్గలోకమునకు పోయెను. అగ్నిదేవుడుగూడ, పశు పక్షి మృగాది సహితమైన ఖాండవవనము నంతయు పూర్తిగా దహించి, సంతృప్తి చెంది, ఆరుదినముల వరకు విశ్రాంతి తీసుకొనుచుండెను. అనేక పశుపక్షిమృగాదుల మాంసము, క్రొవ్వు రక్తము మొదలగునవి మున్ను ఆరగించి అగ్నిదేవుడు ప్రసన్నుడై శ్రీకృష్ణార్జునులతో నిట్లనెను.

"వీరోత్తములారా! మీ ఇద్దరు నన్ను ఆనందముగా తృప్తిపరచితిరి. ఇప్పుడు మీకు అనుమతి నిచ్చుచున్నాను. మీయిచ్చవచ్చిన చోటికి పొండు."

జనమేజయా! యీ విధముగా అగ్నిదేవుడు అజ్ఞ యిచ్చిన తరువాత శ్రీకృష్ణార్జునులు మయాసురుడున్ను అగ్నిదేవునకు ప్రదక్షిణ-నమస్కారములు చేసి, ఆ ముగ్గురు యమునానదీ తీరమునకు పోయి, అక్కడ నొక రమణీయ ప్రదేశమునందు, ఒకటిగా చేరి కూర్చొనిరి.

(మయదర్శన పర్వము సమాప్తము.)

మహాభారత పఠన - శ్రవణముల మహిమ

"ద్వైపాయనోష్ఠ పుట నిస్సృత మప్రమేయమ్
పుణ్యం పవిత్రమథ పాపహరం శివం చ
యో భారతం సమధిగచ్ఛతి వాచ్యమానం
కిం తస్య పుష్కరజలై రభిషేచనేన?
యో గోశతం కనక శృంగమయం దదాతి
విప్రాయ వేదవిదుషే సుబహుశ్రుతాయ
పుణ్యాం చ భారతకథాం సతతం శృణోతి
తుల్యం ఫలం భవతి తస్య చ తస్య చైవ"

—మహాభారత స్వర్గారోహణ పర్వమునుండి

అనగా, "భగవంతుడైన శ్రీకృష్ణద్వైపాయన మహాముని ముఖారవిందమునుండి వెడలిన ఈ మహాభారతము అత్యంత పుణ్యజనకము, పవిత్రము పాపహరము, మంగళ స్వరూపమునై యున్నది. దీని మహిమ అపారము. ఎవరు ఈ మహాభారత కథను విని, హృదయంగమము చేసికొనునో, అతనికి తీర్థరాజమైన పుష్కరమునందు స్నానము చేయవలసిన ఆవశ్యకత ఏమి యుండును? పుష్కర స్నానమువలన ఏ ఫలము చెప్పబడినదో, అట్టి ఫలము అతనికి, ఈ మహాభారతకథాశ్రవణము వలననే లభించును. వేదజ్ఞుడు, అనేక శాస్త్రవిజ్ఞానసంపన్నుడు నైన బ్రాహ్మణునకు బంగారుకొమ్ములు తొడుగబడిన నూరు గోవులను దానముగా నిచ్చు మనుష్యునకు, నిరంతరము పుణ్యప్రదమైన మహాభారత కథాశ్రవణము చేయు మనుష్యునకును సమాన ఫలమే లభించును" అని భావము.

ఇది శ్రీమద్వేంకటేశ్వర కరుణాసమాసాదిత విద్యాగంధము గల శ్రీకౌశిక గోత్రోత్పన్న "కప్పగంతుల" వంశీయ "లక్ష్మణశాస్త్రి"చేత అనువదింపబడిన శ్రీ వేదవ్యాస మహాభారతాంధ్ర గద్యప్రబంధంబునందు ఆదిపర్వము సమాప్తము.

"ఈ భారతాదిపర్వము
శ్రీభవ్యము 'శ్రీనివాసు' శ్రీపాదములన్
నే భక్తి సమర్పించితి
నా భవములు తొలఁగ 'లక్ష్మణ' కవీంద్రుడన్
శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

